# సారస్వత వ్యాసములు



కవి సమ్రాట్

శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారి వ్యాసములు




ప్రచురణ:

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు
హైదరాబాదు 4

SARASWATA VYASAMULU - Vol. V.

A collection of Seventy literary essays by

Kavi Samrat NORI NARSIMHA SASTRY.



ప్రథమ ముద్రణ 1979

ప్రతులు 1,000

వెల: రూ. 22-00

ముద్రణ.

ప్రథమ విభాగం

దక్షిణభారత హిందీ ప్రెస్,

ఖైరతాబాదు, హైదరాబాదు-4.

ద్వితీయ విభాగం

శ్రీ మాధవి ఆర్ట్ ప్రింటర్స్,

కుత్బిగుడ, హైదరాబాదు-27.

# తొలి పలుకు

సాహిత్యాభిమానులకు పఠనీయంగా ఉండే వ్యాసాలను సేకరించి, వాటికి పుస్తకరూపం కల్పించి అందించాలనే ఉద్దేశ్యంతో ఇంతవరకు ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ నాలుగు సంపుటాలను ప్రచురించింది. వాటి ప్రతులన్నింటిని పాఠకులు ఆదరించి సొంతం చేసుకున్నారు. ఈ ఐదవ సంపుటం కీ. శే. శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి వ్యాసాల సంపుటం.

బహుముఖమయిన ప్రతిభామూర్తులు శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు. తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు, కన్నడ భాషలలో అతివేలమయిన అభినివేశాన్ని సంపాదించుకొన్న మనీషులు. సాహిత్య శాస్త్రావలోకనంలో, ప్రాచీనాంధ్ర కవితా పరిశీలనంలో, అధునాతన సాహిత్య నిర్మాణంలో, సాంస్కృతిక అధ్యయనంలో, నవ్య సాహిత్య సమీక్షలో శ్రీ శాస్త్రిగారు గంభీరమయిన పరిశ్రమ చేసినవారు. ప్రసిద్ధకవులు. సాహిత్యోద్యమంలో అగ్రేసరులు. శాస్త్రిగారు పత్రికల్లో, సంచికల్లో, పుస్తకాలకు పీఠికలుగాను వ్రాసిన వ్యాసాలనూ, ఇంతవరకు అముద్రితంగా ఉండి, పాఠకలోకానికి అందకుండా ఉండిపోయిన వ్యాసాలను సేకరించి, 'సారస్వత వ్యాసములు' ఐదవ సంపుటంగా ప్రచురిస్తున్నాము. ఈ వ్యాసాలు సాహితీ ప్రియులకు, పరిశోధకులకు, భాషాభిమానులకు ఉపయోగకరంగా ఉంటాయనే ఉద్దేశ్యంతో, అకాడమీ ఈ సంకలన ప్రచురణకు పూనుకొన్నది.

ఈ వ్యాస సంకలనాన్ని ప్రచురించడంలో మాతో సహకరించిన శాస్త్రిగారి కుమారులు శ్రీ నోరి హనుమచ్ఛాస్త్రిగారికి మా కృతజ్ఞతలు. ఈ వ్యాసా

లను ఈ రూపంలో వెలువరించడానికి మాకు అన్నివిధాల తోడ్పడిన మిత్రులు డా॥ భీమ్‌సేన్ 'నిర్మల్'గారు. అముద్రిత వ్యాసాలను సేకరించడంలోను, ముద్రించిన వ్యాసాలను ఒక క్రమపద్ధతిలో విభాగించడంలోను శ్రీ నిర్మల్‌గారు చూపిన ఆసక్తి, తీసుకొన్న శ్రద్ధ మరువరానివి. డా॥ నిర్మల్‌గారికి అకాడమీ పక్షాన ధన్యవాదాలు.

దేవులపల్లి రామానుజరావు -
కార్యదర్శి.

తేది. 25-1-1979

# ఆకాంక్ష

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి ఈ వ్యాసకోశాన్ని పఠితృలోకానికి అందించ గలుగుతున్నందుకు ఎంతగానో హర్షిస్తున్నాను. శ్రీ శాస్త్రిగారు మా పితృపాదులు. జీవితమంతా సాహితీ వ్యాసంగంలో గడిపిన రసమూర్తులు. సాహిత్యానికి సంబంధించిన అన్ని రంగాల్లోను వారు చేసిన కృషి ప్రామాణిక మయినదేగాక సహృదయ రంజకంగా ఉంటూ వచ్చింది. అర్షసంస్కృతి పట్ల వారికున్న అభిమానం, నవ్యసాహితీ రీతులపట్ల ఆయనకున్న అభినివేశం, నిన్నటి-నేటి తరాలను జాగరితం చేయగలిగిందని చెప్పడంలో అత్యుక్తిలేదు.

మా నాయనగారు తమ జీవితానికీ, సుప్రసిద్ధ ఆంగ్ల నవలారచయిత సర్‌వాల్టర్‌స్కాట్ జీవితానికి కొన్ని పోలికలున్నాయని అప్పుడప్పుడు అంటూ ఉండేవారు. స్కాట్ పద్యరచనతో తన సాహితీ జీవితం ప్రారంభించాడు. మా నాయనగారూ అంతే. ఇద్దరూ న్యాయవాదులే. కాని ఆ వృత్తిలో వాళ్లంతగా లాభపడినట్లు కనబడలేదు. దైనందిన జీవితం దుర్భరమయి. కవిత్వం, న్యాయ వాదవృత్తి తమ కుటుంబాలను ఆదుకోలేని దుస్థితి ఏర్పడి, చేసేదిలేక వివశు లయి నవలారచనకు పూనుకొన్నారు. ఈ ప్రక్రియను చేపట్టడంతో, సౌఖ్యం వాళ్ళను చేపట్టింది. కాని ద్రవ్యానికి దాసోహమని, చౌకబారు నవలలను వ్రాసి ఎరుగరు వారు. అలనాడు స్కాట్, ఈనాడు శ్రీ నోరి సమున్నత సాహిత్య ప్రమాణాలందుకొన్నారు. నవలా రచయితలుగా, ఆంగ్ల, ఆంధ్ర సారస్వతా కాశంలో ఉజ్జ్వల నక్షత్రాలుగా వెలుగొందుతున్నారు.

ఈ సంపుటిలో ఉన్న వ్యాసాలలో కొన్ని పత్రికలలో, ప్రచురితమయి నవి, మరికొన్ని ఎక్కడా ప్రచురితం కానివి.

శ్రీ శాస్త్రిగారు రచించిన కవితలన్నీ పుస్తకరూపం దాల్చినవి. ఆయనవి కొన్ని ఇంగ్లీషు రచనలు కూడా ఉన్నవి. శాస్త్రిగారి రచనలన్నింటిని ప్రచురించ వలసిందిగా నేను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారిని అభ్యర్థించినాను.

తెలుగువ్యాసాలను మాత్రం అకాడమీ పక్షాన ప్రచురిస్తామని నన్ను ప్రోత్సాహిస్తే నేను ఈ సంకలనాన్ని మా నాయనగారి అనుమతితో అకాడమీవారికి అంద జేశాను.

ప్రతిభా-వ్యుత్పత్తి-అభ్యాసాలనే కావ్యహేతువులు రూపుదాల్చిన శ్రీ శాస్త్రిగారు ఎన్నో సాహిత్యాంశాలయి తమ మౌలికమయిన అభిప్రాయాలనూ, రసార్ద్రమయిన అనుభూతులను ప్రకటించారు.

శ్రీ శాస్త్రిగారి వ్యాసాలను సర్వాంగ సుందరంగా అచ్చొత్తించి, తెలుగు పాఠక లోకానికి అందించిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారి ఔదార్యా నికి, శాస్త్రిగారిపట్ల వారికున్న అభిమానానికి నా అభినందనలు. అకాడమీకి సారథ్యం వహిస్తున్న డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారికి, కార్యదర్శులు శ్రీ దేవుల పల్లి రామానుజరావుగారికి, ఇతర కార్యవర్గ సభ్యులకు నా ధన్యవాదపరంపరలు.

కొన్ని వ్యాసాలకు శుద్ధప్రతులు తయారు చేయడంలో నాకు తోడ్పడిన చిరంజీవులు కుమారి సరోజిని, కుమారి కల్యాణి, కుమారి రాధలకు, గ్రంథాల యాలను సందర్శించి కొన్ని వ్యాసాలకు ప్రతులు సిద్ధం చేసిన చి. విజయ కుమార్‌కు నా ఆశీస్సులు. రెండు విభాగాలుగా ఉన్న ఈ సంపుటిని తీర్చిదిద్ద డంలోనూ, పాఠకుల సౌలభ్యంకోసం కొన్ని ప్రధాన శీర్షికల క్రింద విభజించ డంలోనూమిత్రులు డా॥ భీమ్‌సేన్ నిర్మల్‌గారు మొదటినుండీ నాకు చేదోడు వాదోడుగా ఉన్నారు. వారికి నా నమస్సులు.

ఈ వ్యాసకోశాన్ని పఠితృలోకం సాదరంగా స్వీకరిస్తుందనీ, శ్రీ శాస్త్రి గారి మిగిలిన రచనలను ప్రచురించడానికి నాకు అండదండలను, ప్రోత్సాహాన్ని ప్రసాదిస్తుందని ఆశిస్తున్నాను.

తేది. 15—1—1979

నోరి హనుమచ్ఛాస్త్రి



# నోరి నరసింహశాస్త్రి

( 1900 – 1978 )

జననం: 6–2–1900 నిర్యాణం: 3–1–1978

# శ్రీ నోరి నరసింహశాస్త్రి

# జీవిత విశేషాలు

జననం : 6-2-1900

నిర్యాణం : 1978

జననీ జనకులు : మహాలక్ష్మి, హనుమచ్ఛాస్త్రి గారలు

దీక్షా గురువులు : జగద్గురు శ్రీ కళ్యానంద భారతీస్వామి పాదులు

విద్య : బి. ఏ 1919 } మద్రాసు విశ్వవిద్యాలయ కళాశాల
బి. ఎల్. 1925

సంస్కృతాంధ్ర కర్ణాటక భాషలలో అభినివేశం

బిరుదం : 1947లో కవిసమ్రాట్

## రచనలు

1921 : గీతమాలిక (19 ఏండ్లలోపు వ్రాసిన కావ్యాల సంపుటి)

1924 : సోమనాథ విజయము (వచన నాటిక)

1933 : భాగవతావతరణము (పద్య నాటిక)

1949 : నారాయణభట్టు (నవల)

1950 : శ్రీ దేవి భాగవతము (1, 2, 3 స్కంధాలు)

1950 : తేనెతెట్టె (నాలుగు నాటికల సంపుటి)

1951 : రుద్రమదేవి (నవల)

1954 : కర్పూర ద్వీపయాత్ర (పిల్లలకు నవల)

1955 : వాఘిరా (నవల)

1958 : మల్లారెడ్డి (నవల)

1960 : సర్పసత్రము (నాటిక)

1960 : ఖేమాభిఖ్ఖుని (నాటిక)

1960 : శబ్దవేధి

1932 : కవిసార్వభౌముడు (నవల)
1968 : కవిద్వయము (నవల)
1971 : ధూర్జటి (నవల)

ఇవికాక పెక్కు ఖండకావ్యాలు,
వధూసర, మరువిషయము, పరీక్షా ఫలితములు, గానభంగము
మొదలగు కథానికలు

పూజావనము, దాగుడు మూతలు, కన్యాకుమారి, సుహృత్సాదామము మొదలగు రూపకాలు

రత్నోపహారము. గురుత్రయము, పేదరాశి పెద్దమ్మ మొదలగు శ్రవ్య నాటికలు

పెక్కు వ్యాసాలు, సమీక్షలు

సాహిత్యోద్యమం :

సాహితీ సమితి సభ్యుడూ, కార్యదర్శి,
నవ్యసాహిత్య పరిషత్తు కార్యవర్గ సభ్యుడూ, ఉపాధ్యక్షుడు,
రేపల్లె విజ్ఞానసమితి సంచాలకుడు,
'ప్రతిభ' సంపాదకవర్గ సభ్యుడు,
ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమిలో సాధారణ సభ్యుడూ,
కార్యవర్గ సభ్యుడూ, విశిష్ట సభ్యుడూ, ఉపాధ్యక్షుడు.

# ప్రథమ విభాగము

## విషయసూచిక

### సాహితీ విమర్శ



### గీర్వాణ సాహితి



### కవిత్రయ సాహితి



### ప్రబంధ సాహితి



### నవ్య సాహితి

## నాటక సాహితి



## హాస్య సాహితి



## చరిత్ర సంస్కృతి



## సాహితీ మూర్తులు



## పీఠికలు - సమీక్షలు



## భక్తి సాహితి

# ద్వితీయ విభాగము

## విషయసూచిక

### సాహితీ విమర్శ



### గీర్వాణ సాహితి



### కవిత్రయ సాహితి



### సాహిత్యోద్యమము

## నవ్య సాహితి



## నాటక సాహితి



## నవలా సాహితి



## కథా సాహితి



## హాస్య సాహితి



## చరిత్ర సంస్కృతి



## సాహితీ మూర్తులు



## పీఠికలు – సమీక్షలు



## హిత సాహితి



## భక్తి సాహితి

# ఆంధ్ర కవిత్వము - శ్రేయస్సు
## (రజతోత్సవము-ప్రథమ సమావేశము నివేదిక)
## (Report of Silver Jublee etc. of Sahiti Samiti)

1

శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహంత్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవామ్
తే వేదత్రయమూర్తయః త్రిపురుషాః సంపూజితా వః సురైః
భూయాసుః పురుషోత్తమాంబుజభవ శ్రీకంధరాః శ్రేయసే.

ఈ లోకములో రెండుశక్తుల సంఘర్షణ కనిపిస్తున్నది. అందులో ఒకటి సంధానశక్తి. దానివల్లనే విశ్వమంతా బద్ధమై చెదిరిపోకుండా కట్టుబాటులో ఉన్నది. దానివల్లనే ఈ లోకంలో సృష్టి ఏ రూపంగా ఉన్నా కొంత కాలమైనా నిలుస్తున్నది.

ఇక రెండవది సంభేదనశక్తి. లోకములో ఉన్న నానాత్వము ఆధారము చేసుకొని దానినే మరింత పెంపొందించి ముక్కలు ముక్కలుగా కోసి, పరమాణువులుగా పగలగొట్టి, కట్టినతాళ్లు తెంచి, లోకము కంటికి కనపడకుండా మటుమాయము చేయవలెనని ఇది ప్రయత్నిస్తున్నది. ఇది వినాశశక్తి. దీనివల్లనే లోకములో క్షయమూ మృత్యువూ సంభవిస్తున్నవి.

ఈ రెండుశక్తుల విజృంభణా ఘర్షణా మానవజాతిలోను దేశదేశములలోను మనదేశములోను గోచరిస్తున్నవి. ఇవి అనాదులే! ఒకటి శ్రేయస్సు, ఒకటి ప్రేయస్సు అని శ్రుతిలో వినబడుతున్నవి.

శ్రేయస్సు సమస్త మానవజాతికీ, ఒక్క ఈ లోకానికే కాక సమస్త లోకాలకూ, ఒక్క ఈ జన్మకే కాక బహుజన్మలకూ, ఒక్క

కాలానికే కాక అనంతమైన కాలానికి శుభమిచ్చేది. కాబట్టి శ్రేయస్సును గూర్చే కర్మకలాపంలో కట్టుబాట్లుంటవి, నిగ్రహముంటుంది. అప్పటికి సుఖముగా ఉండకపోవచ్చును, పథ్యమువలె.

ప్రేయస్సు అట్టిది గాదు. అది ప్రీతి ప్రధానమైనది. దానికి ముందుచూపులేదు. అప్పటికేది ప్రియముగా కనబడితే అది సాధించడమే దాని ప్రయత్నము. చెవిని కాని కంటిని కాని మరి ఏ ఇంద్రియమును గాని ఆకర్షించిన వస్తువును పొంది, అనుభవించడమే దాని పరమావధి. ఈ ప్రేయస్కాముకత సర్వజన సామాన్యము. కాని విద్యావిహీనులు దాని ఆకర్షణను అరికట్టుట కష్టతరము!

ఈ ప్రేయస్కాముకత ఫలమే, పాతిక సంవత్సరాలలో రెండు మహా యుద్ధాల సంభవము. దానిఫలమే పరమాణుభేదనము. దానిఫలమే భరతఖండమును ముక్కలుచేసే ప్రయత్నము. దాని ఫలమే మత కలహములు. దానిఫలమే సమ్మెలు. అవి విద్యార్థులకు కూడా వ్యాపించి నందువల్ల ఇప్పటి విద్యా విధానమున కూడా ప్రేయస్కాముకత ప్రాముఖ్యము వహించి ఉన్నదని అనుమేయించ వచ్చును.

శ్రేయస్సు, ప్రేయస్సు–ఈ రెండూ విపరీతములట. విషూచులట, భిన్నఫలాలు ఇచ్చేవట. ధీరుడైనవాడు శ్రేయస్సు సాధించి శుభము పొందుతాడట. మందుడైనవాడు ప్రేయస్సునే వరించి అశుభము పొందు తాడట. అవిద్యతో కొట్టుకొంటూ పండితంమన్యులై అంధుని సహాయముతో నడిచే అంధులవలె మూఢులైకూడా, మేమే ధీరులమని గర్వించి నాశనము పొందుతారట–ఆ ప్రేయస్కాములు! ఈ విధముగా శ్రుతి ఘోషిస్తున్నది!

ఆంధ్రకవిత్వము తన ఆదర్శము శ్రేయస్సుగా పెట్టుకొని జన్మ ఎత్తింది, వృద్ధి పొందింది; శ్రేయఃపథము వదలి ప్రేయఃపథము పట్టి నప్పుడల్లా క్షీణించింది!

2

శ్రేయస్సుకు బీజప్రాయమైన అక్షరమున్నది. దానితోనే మన కవులు వారి కావ్యాలన్నీ ప్రారంభించేవారు. శ్రీకారము కావ్యాదిలో

ఉంచడము తెలుగు కవుల విశిష్టత. కావ్యాలు మంగళాదిగా మంగళ మధ్యంగా మంగళాంతంగా ఉండవలెననే ఆశయము తెలుగు కవులే ఆచరణలో పెట్టినారు. ప్రపంచ సాహిత్యానికి ఆంధ్రకవిత్వము ప్రసాదించిన కానుక ఏమంటే శ్రేయస్సు అభ్యుదయము కుశలము మంగళము కల్యాణము సంపాదించవలెననే కృషి అని నిష్కంపంగా చెప్పవచ్చును.

శ్రీకారము కావ్యాదిలో నిలిపినంత మాత్రము చేతనే దోషాలన్నీ పోయి శుభము కలుగుతుందని పెద్దలు చెప్పినారు. అది అర్థవాదంవంటిది. శ్రీకారము ఆదిలో ఉంచమనడము ఒక సంకేతము. ఈకాలపు పరిభాషలో చెప్పితే, అది స్లోగాను (slogan). తెలుగుకవుల స్లోగాను శ్రీ! ఇది జనసామాన్యమును సులభముగా ఆకర్షించగలవనే రహస్యము తెలిసినవారు కనుకనే, కొందరు అభ్యుదయ పదము వాడుతున్నారు. తెలుగుకవులు శ్రేయస్సాధన చేయడానికి తగిన సంపత్తి- ఇతరులకు లేనిది తెలుగువారికి లభ్యమైనది. తెలుగుమట్టికూడా శ్రీతో నిండి ఉన్న దనడము ఆశ్చర్యము కాదు. తెలుగుదేశను గాలి అంతటా శ్రీగంధము వ్యాపించిన దనడము అతిశయోక్తి కాదు. తెలుగుదేశానికి నడిబొడ్డుగా ఉన్న మహాపర్వతము శ్రీశైలము. నేటికికూడా నిత్యమూ మనము ఏ సత్కర్మచేసినా ముందుగా సంకల్పములో శ్రీశైలానికి ఏ దిక్కుగా ఉన్నామో స్మరణతోకాని ఆకర్మ ప్రారంభించము. శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే, ఆగ్నేయప్రదేశే ఇత్యాది.

కర్నూలు మండలములో ప్రస్తుతము కనపడే శ్రీశైలమువలె తెలుగువారికి పవిత్రమైన మరియొక శైలము తిరుమల. అందులోని దైవము తిరుపతి. ఆపేర్లు భద్రాద్రి, మంగళగిరి, శోభనాద్రి తమిళముగా ప్రస్తుతము మారినా అవి కూడా శ్రీశైలమూ, శ్రీపతీ అని గుర్తించవచ్చును. శ్రీశైలమూ, తిరుమలా శేషాద్రికి శిరస్సూ, పుచ్ఛమూ అనే ఐతిహ్యము తెలుగువారిలో ఉన్నది.

సంప్రదాయ సిద్ధముగా విద్య అభ్యసించేవారు నిత్యమూ విద్యారంభములో 'శ్రీ గురుభ్యో నమః, హరిః ఓమ్' అని ప్రారంభించడము ఇప్పటికీ ఉన్నది.

మొన్న మొన్నటివరకూ చెడిపోకుండా ఉన్న వీధిబళ్ళలో రోజూ మొదట వచ్చినవానిని శ్రీసంజ్ఞతో ఆదరించడమూ, రెండవవానికి చుక్క, తర్వాత వారికి వరుసగా దెబ్బలూ అర్పించడము ఆచారముగా ఉండేది.

తెలుగుదేశములో మనకు పూజ్యులు బ్రహ్మశ్రీలు, మాననీయులు మహా రాజరాజశ్రీలు, ఇతరులు చిరంజీవులు. వారికికూడా శ్రీరస్తు, చిరంజీవులైన ఫలానావారికి అని ఉత్తరాలలో, ప్రత్యుత్తరాలలో వ్యవహారము ఇప్పటికీ పోలేదు.

తల్లి పిల్లలకు అభ్యంగనము చేయించి 'శ్రీరామ రక్ష' చేస్తుంది. వ్రాసేవాళ్ళు ముందు శ్రీరామ అని వ్రాస్తారు. ఏమీ వ్రాయలేదనడానికి ఇంకా శ్రీరామ కూడా పెట్టలేదనే వాడుక ఉన్నది. రామకోటి వ్రాసే భక్తులు కేవల రామనామము వ్రాయక శ్రీకారముతో ప్రారంభిస్తారు.

మనము తెలుసుకోదగిన విద్య శ్రీవిద్య; ఉపాస్యమైన దేవతలు శ్రీదేవి, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు; మనన చేయదగినది శ్రీమంత్రము, తిరుమంత్రము; పూజ్యమైన యంత్రము శ్రీచక్రరాజము !

ఇటువంటి సంప్రదాయములో పెరిగినవారు కనుకనే నాటినుంచీ నేటిదాకా మన కవులు తమ కావ్యాలకు శ్రీమహాభారతము, శ్రీమద్రామాయణము, శ్రీమదాంధ్ర మహాభాగవతము, శ్రీదేవీభాగవతము - అని ఈ రీతిగా శ్రీకారాదిగా నామకరణము చేస్తున్నారు.

శ్రీకారముమీద ఇంత అభిమానము మనము సంస్కృత కవుల దగ్గరనుంచి ఎరువు తెచ్చుకొన్నది కాదు. సంస్కృతకవులలో పెద్దలందరూ శ్రేయస్సు ఉద్దేశించి తమరచనలు సాగించినవారే. కాని తెలుగుకవులు శ్రేయస్సును కావ్యవస్తువులోకే కాక కావ్యముల స్థూలదేహంలోకి కూడా ప్రవేశపెట్టినారు. దానికి కారణమేదో ఉంటుంది, ఉన్నది. వాల్మీకి, వ్యాసుడు వ్రాసిననాడే కాక, కాళిదాసాది మహాకవుల కాలంలోకూడా మనము కామించదగినది శ్రేయస్సు కాని ప్రేయస్సు కాదనే స్థిరబుద్ధి జనంలో వ్యాపించి ఉన్నది. కాని తెలుగులో ఉత్తమ సాహిత్యం అవతరించేనాటికి ఈకాలంలోవలెనే-జనసామాన్యంలో—అంటే, చదువుకుని

విద్యావంతుల మనుకునే పండితంమన్యమానులలో – విపరీతంగా ఈ ప్రేయస్కాముకత్వము వ్యాపించి ఉన్నది. అందువల్లనే ఋషిప్రాయులైన ఆంధ్రకవులు శ్రేయస్సుమీద దృష్టి సర్వవిధములా కేంద్రీకరింప జేసినారు. అందులో ఆంధ్ర కవిత్వానికి ఆద్యర్షి తెలుగువారిని శ్రీవాణీ గిరిజాశ్చిరాయ....అనే వాక్కులలో ఆశీర్వదించినాడు. ఆ మహానుభావుడు ఎంత లోకసంగ్రహ దీక్షతో శ్రీమదాంధ్ర మహాభారతము ప్రారంభించినాడో ఈ ఆద్యశ్లోకము మనన చేసినకొద్దీ మనకు ద్యోతకమవుతుంది.

'ఆంధ్ర శబ్ద చింతామణి' కూడా ఆ విధముగానే 'విశ్వశ్రేయః కావ్యమ్' అని ప్రారంభమైనది.

3

శ్రేయస్సు ప్రేయస్సు అని రెండుమాటలు మాటిమాటికీ చెప్పడము మాటలగారడీ కాదు. లోకాల కన్నిటికీ మూలమైన రెండు మహాశక్తులు తెలుసుకొని, వాటిస్వభావము మననచేయడము. ఒకటి సృష్టిస్థితుల కాధారశక్తి; రెండవది క్షయప్రళయాలు కలిగించేశక్తి! ఒకటి సర్గము రెండవది ప్రతి సర్గము! ఒకటి ప్లవము, రెండవది విప్లవము! ఒకటి దాటించేది, రెండవది ముంచేది! ఒకటి పడవ; రెండవది తుపాను!

చిత్రమేమోగాని ఒకటి భారతజాతీయమైనది, రెండవది విజాతీయమైనది! ఒకటి ఆసేతుహిమాచల పర్యంతమైన భరతఖండాన్ని ఏకముఖము చేసి కలవడానికి ప్రయత్నించేది, రెండవది చీలికలు చేసేది! ముక్కలు చేసే విప్లవశక్తులెప్పుడూ విజాతీయులలో పుట్టి వారితోపాటు మనదేశంలో ప్రవేశించి వారు వ్యాపించినచోట్లలోనే వృద్ధిపొందుతూ వచ్చినట్లు దేశచరిత్రవల్ల తెలుసుకో వచ్చును. ఈనాడు విజాతీయప్రభుత్వము అంతిమదశలో ఉన్నందున ఈ విప్లవ కృత్య దేశమంతటా తాండవ మాడుతూ ఉన్నది.

ఆంధ్రదేశానికి కృష్ణాగోదావరీ నదులు జీవనాడులవంటివి. ఈ నదీ తీరాలలోనే మననాగరికత వృద్ధిపొందింది. ఈ నదులమీదగానే విప్లవాలు మనదేశంలో ప్రవేశించి కాలక్రమేణా అణిగిపోయినవి.

## 4

వేదంలో ఆంధ్రశబ్దంతో పాటు పుళింద శబ్దముకూడా వినబడు తున్నది. రామాయణంలో దండకారణ్యంలో ఎందరో మునీశ్వరులు ఎన్నో ఆశ్రమాలు నిర్మించుకొని ఉన్నట్లూ, వారికి అక్కడనే జనస్థానంలోని రాక్షసులు బాధ కలిగిస్తున్నట్లుకూడా చదివినాము. దీనినిబట్టి మనదేశంలో ఆంధ్రులూ, పుళిందులూ, మునులూ, రాక్షసులూ ఒకరిపక్క ఒకరు నివాసము చేస్తున్నట్లు ఊహించవచ్చును. శ్రీరామునివంటి ధర్మసంస్థాపకులు కూడా రాక్షసప్రాబల్యము అణచినారు; కాని వారిని నిర్మూలము చేయ లేదు.

మళ్ళీ ఇప్పటికి రెండువేలేళ్ళ కిందట ముఖ్యముగా కృష్ణానది తీరములో బౌద్ధ సంఘారామాలూ, జైనుల వసతులూ అవతరించినవి. బౌద్ధ మతము విశ్వమానవ జాతికి అన్వయించే ఉత్తమ మతమని ఈ కాలములో భావము ప్రబలి ఉన్నది. శాతవాహనాది చక్రవర్తులు దానిని రూపుమాప ప్రయత్నించలేదు. కాని కొంతకాలమది పాపము పండినట్లు పెరిగి దేశములో అంతఃకలహాలు రేపడానికి ప్రయత్నించి దానిలో దానికే చీలికలు పుట్టి అణగిపోయినది. అవినీతికీ, అరాజకానికీ సంఘారామాలు మూలకందాలు ఐనవి. చివర కవి అన్వర్థంగా 'లంజదిబ్బలు' అయి మాయమైనవి. తెలుగుదేశంలో 'ల ం జ ది బ్బ' లన్నీ ఒకప్పుడు బౌద్ధ స్తూపాలు. స్తూపమంటేనే గోరీ, శ్మశానము. ఆ మతము శ్మశానమతము: అందుకనే పవిత్రమైన కృష్ణా, గోదావరీ మధ్యప్రదేశంలో శాశ్వతంగా ఆమతం నిలవలేక పోయినది. వారి గ్రంథాలు కొన్ని భాషాంతరీకరణాలలో తిబ్బతీదేశములో ఇప్పటికీ ఉన్నవి. రక్తయామరీసాధన – ప్రతిశరసాధన – బలికర్మ – చండఖడ్గయామరీసాధన – నాగసాధన – ఉచ్ఛిష్ట జంబాల సాధన – కర్మకాయస్తంభనాభిచార – వాక్‌స్తంభనాభిచార – చిత్తస్తంభనాభిచార – బుద్ధకపాలమహాతంత్ర – అభిచారకర్మ – యక్షనట నటీసాధన – రతిరాగసాధన – పిశాచపిలుపాలసాధన – పిశాచీకర్ణగృహ్యాసాధన — ఇత్యాది గ్రంథనామాలే బౌద్ధులు ఆ సంఘారామాలలో ఎటువంటి సాధనలు చేసినారో కొంత సూచించి అభిమానభ్రాంతి నివర్తింప జేయవచ్చును.

శ్రీమదాంధ్ర మహాభారతావతరణమే తెలుగుదేశములో జైన బౌద్ధ మతాల పునర్నివాసానికి అవకాశము లేకుండా చేసిన దనవచ్చును. సింహళబౌద్ధుల సహవాసమువల్ల పాండ్యదేశములో బౌద్ధకావ్యాలు అరవములో పుట్టినవి. కన్నడములో జైనకవులవల్ల ఆదికావ్యాలు వెలిసినవి. ఒక్క తెలుగులోనే ఆ సేతుహిమాచల మధ్యస్థధర్మానికి పట్టుగొమ్మ ఐన పంచమ వేదము అవతరించింది.

అప్పటికి కొద్దికాలము కిందటనే భారతభూమిలో పశ్చిమోత్తర భూములలోకి గజినీ దండయాత్రలు నిరాఘాటంగా సాగినవి. దక్షిణదేశములో చోళ చక్రవర్తులు వేంగి పాలకుల సహాయముతో దక్షిణదేశమే కాకుండా భరతఖండ మంతా ఏకచ్ఛత్రాధిపత్యముగా ఏలవలెనని ప్రయత్నించిన కాలమది. అటువంటి గంగైకొండ రాజేంద్రచోళుని సింహాసనమే శ్రీమదాంధ్రమహాభారత కృతిభర్తఐన రాజ రాజనరేంద్రుని కుమారుడు కులోత్తుంగచోళుడనే బిరుదనామముతో అధిష్ఠించినాడు. విదేశదండయాత్రలు అరికట్టవలెననే యత్నమూ, భారతధర్మము అశేషజనమూ తెలుసుకొనేట్లు భారతాంధ్రీకరణ ప్రయత్నమూ, ఒకే మూలశక్తి ప్రేరేపణవల్ల ఒకే కాలములో పుట్టినవి.

మరి రెండువందల సంవత్సరాలు గడచినవి. అల్లా ఉద్దీను కర్ణాటక భూముల మీదుగా ఆంధ్రదేశంలోకి సేనలు పంపినాడు. మళ్ళీ దేశ శ్రేయస్సు కోరి తిక్కన సోమయాజి విరాటపర్వము ప్రారంభించినాడు. ఆ భారతము వ్రాయసాగినది నిర్వచనోత్తర రామాయణము వ్రాసిన శిల్పకవి తిక్కన కాదు; మనుమసిద్ధిచేత మామ అనిపించుకున్న అమాత్య తిక్కన కాదు; పురోడాశభక్షణచేత పవిత్రుడై పితృదేవతారాధకుడు, మోక్షార్థి ఐన సోమయాజి తిక్కన.

మళ్ళీ ఏబది సంవత్సరాలు గడిచినవి. దక్షిణదేశంలో ముసల్మాన్ రాజ్యాలు విజృంభించినవి. వాటిని అరికట్టడానికి రెడ్డిరాజులు తీవ్రప్రయత్నము చేసినరోజులలో ఎఱ్ఱయ భారతము పూరించి భారత శేషమైన హరివంశము వ్రాసినాడు. ఈ ఎఱ్ఱయకు ప్రెగ్గడ (ప్రబంధ పరమేశ్వర శబ్దములు) సమ్మతములుగాతోచవు. ఇతడు శ్రీ శంకరస్వామి

సంయమీశ్వర చరణసరోరుహ ధ్యానానందధుర్యుడూ, శంభుదాస లక్షణాభిధేయ యెఱ్ఱయ నామధేయుడూ! ఈ విధముగా భారతధర్మరక్షణకు, భారతజాతి రక్షణకు కవిత్రయము శ్రీమదాంధ్ర మహాభారతము వ్రాసినారు.

అప్పుడే ధర్మరక్షణతోపాటు ధర్మమందు ఉత్సాహము వ్యాప్తి కావలెనని భక్త్యావేశముతో బమ్మెర పోతన శ్రీమద్భాగవతము ఆంధ్రీకరించినాడు. అందులో మూలము ఆధారప్రాయిమే. పోతన ఉపజ్ఞవల్ల అది శుద్ధవైదిక ప్రామాణ్యము కల గ్రంథముగా అవతరించినది.

ఓరుగల్లు రాజ్యము క్షీణించగా కర్ణాటక ప్రాబల్యమున్న దేశములో శ్రీవిద్యారణ్యుడనే బిరుదనామము గల శ్రీవిద్యా శంకరుడనే ద్రావిడ సన్న్యాసి శ్రీ శృంగేరీపీఠాధిపతి, శ్రీ విరూపాక్షములో నివాసము చేసి ఆంధ్రరాజ్య సామంతుని ఒకనిని పట్టాభిషిక్తుని చేసి శ్రీవిద్యానగర రాజ్యము స్థాపించినాడు. అక్కడ మళ్ళీ నెమ్మదిగా తెలుగుపండితులు, కవులు, దండనాథులు, మంత్రులు పలుకుబడి సంపాదించుకున్నారు. కాని కర్ణాటకులు కల్పించిన ఛిద్రకార్యమువల్ల కొన్నాళ్ళ కా సామ్రాజ్యము విచ్ఛేదమైనది. ఆంధ్రరాజులు తమకవులతో పాటు చంద్రగిరి వెళ్ళినారు; తంజావూరు వెళ్ళినారు, మధుర వెళ్ళినారు. ఎక్కడ ఆర్యధర్మము శేషించి ఉంటే అక్కడికి ఆంధ్రులూ ద్రావిడలూ వెళ్ళినారు. నేటిదాకా ఆంధ్రచోళ మండలాలలోనే ఆర్యధర్మము శేషించి ఉన్నది. గోదావరి కృష్ణ, కావేరి ఈనదులూ, నదీతీరాలూ ఆర్యశ్రేయస్సును ఎప్పటికైనా ఉద్ధరించగలవు!

ఇప్పుడు విజాతీయపరిపాలనతో పాటు విజాతీయసంస్కారాలు వ్యాపించినవి. మూలమూలలా వ్యాప్తమైన ఈ ప్రేయస్కాముకత మాత్రము త్వరలో జీర్ణించదు. ఇట్టి కాలములో కృష్ణాగోదావరీ తీరాలలో కవులు ఆర్యధర్మమూ, దైవభక్తి, ఉత్తమమైన ఉపాసనా మార్గము చూపుతూ మేళవించే మహాశక్తి కల శ్రీదేవీభాగవతము మళ్ళీమళ్ళీ రచిస్తున్నారంటే తెలుగు కవులు ఎంతశ్రేయస్కాములై కావ్యరచన సాగిస్తున్నారో కొంత ఊహించవచ్చును.

5

ఈవిధంగా ప్రదర్శించినప్పుడు తెలుగుకవుల శ్రీమార్గము పూల పుంతగా కనిపించివచ్చును. కాని వారి మార్గము నిజముగా అంత సులభముగా లేదు. ఆర్యధర్మ విరుద్ధమైన అనేకమార్గాలు, మనదేశంలోకి గాలిదుమారాలవలె, తుపానులవలె, వరదలవలె వచ్చినవి, పోయినవి, వస్తూ ఉన్నవి. పోగలవు!

ముందు అటువంటివి బౌద్ధులు జైనులు ప్రచారము చేసినారు. పక్కనున్న ద్రావిడ కర్ణాటక దేశాలలో అవి నేటిదాకా గౌరవస్థానంలో ఉన్నా తెలుగు దేశములో లేవు. జైనుల లక్షణ గ్రంథాలు ఒకటి రెండు తప్ప మిగిలినవి నామమాత్రావశేషంగానే ఉన్నవి. అథర్వణుని భారతమని ఒకటి అక్కడక్కడ ఉన్నట్లు తెలియ వస్తున్నది. అది పంపభారతము వలెనే జైన కావ్యమని తోస్తుంది.

ఆపిమ్మట కర్ణాటకాంధ్ర మధ్యభూములలో జైనబౌద్ధాక్రాంతమైన భాగాలలో, వీరశైవమత మొకటి పుట్టి, మన దేశంలోకి కూడా పాకింది. అది అటు జైనమతముతోనూ, ఇటు ఆర్యమతంతోను కక్ష కట్టిన వేద విరుద్ధమతము. ఆ మతావేశముతో కొందరు శైవకవులు మనదేశంలో వెలిసినారు. అందులో ముఖ్యుడు పాల్కురికి సోమనాథుడు. ఆ కవికి నన్నయ, తిక్కన, ఎఱ్ఱయ, పోతన వంటి ఋషుల ముఖము చూడసనీ, వారితో మాట్లాడననీ, వారి పొత్తున నిలువననీ వీర దీక్ష ఉన్నది. కాని భారత భాగవతాలనే వింధ్యహిమాలయాలను ఎదుర్కొన్న సెలయేళ్ళవలె సోమనాథుని సంప్రదాయములు చెదిరిపోయినవి. ఈ 'శివకవు'లనే వారిని పేరు పెట్టి తలచిన మహాకవులు లేరు. ఈ కాలములో అవి అచ్చుపడేదాకా ఆ సంప్రదాయ మొకటి కొంత కాలమున్నదని తెలిసిన పండితులు కూడ స్వల్ప సంఖ్యాకులు. పురాతత్వ పరిశోధకులు ఎవరైనా ఆ కావ్యాలు జాగ్రత్తగా చదివితే, అవి శివమెత్తిన వారి కేకలుగా ఉంటవి. 'శివమెత్తిన' దనే వ్యావహారిక పరిభాష ఈ శివకవుల కావ్యాలవల్లనే తెలుగు దేశంలో వ్యాపించింది.

మళ్ళీ ఈ కాలములో విదేశములలో కూడా వెర్రితలలుగా సరసులు భావిస్తున్న కొన్ని నూతన మార్గాలు సరిగా జీర్ణము కూడా చేసుకోకుండా మన యువకవులు కొందరు అవలంబించి తెలుగులోకి ప్రవేశపెట్టుతున్నారు. ఆ విధముగా సులభంగా నవనాగరకులమని ఖ్యాతి సంపాదించవలెనని ప్రయత్నించినంత మాత్రాన కార్యసాఫల్యము కాదు. సాహిత్యములో సహృదయ లోకమే గీటురాయి కాని సామాన్యలోకము కాదు.

భారత భూమిలోకి ఎన్నో విదేశ దండయాత్రలు వచ్చినవి. వాటితోపాటు ఎన్నిరకాల మనుష్యులో, ఎన్నివిధాల భావాలో వచ్చినవి. ముందు వాటితో ప్రతిఘటించినాము. తప్పనిసరిగా ప్రవేశించిన తర్వాత వాళ్ళకొకస్థాన మిచ్చి గూళ్ళు కట్టినాము. కొత్తదండయాత్ర వచ్చినప్పుడల్లా మళ్ళీ ఆ గూళ్ళు బద్దలై జ్వరము కలిగిస్తూ ఉంటవి. ఆ ఉపద్రవము కాలక్రమేణా జీర్ణము చేసుకుంటాము. మన దేహంలో సూక్ష్మజీవులు ఏమి చేస్తున్నవని వైద్యశాస్త్రవేత్తలు చెప్పుతున్నారో, ఆ పనినే భారతదేశ దేహముకూడా అనాదిగా చేస్తున్నది. ఆసేతు హిమాచల మధ్యస్తమైన భూమి పవిత్రకర్మ భూమి అని పూజించే ఆర్యధర్మానుయాయులే ఈ భారత దేశదేహాన్ని రక్షించేవారు! అట్టివారి శ్రేయస్సు అభిలషించినప్పుడు భారత భూమికీ విశ్వానికీ శ్రేయస్సు కలుగుతుంది. అట్టి ప్రయత్నమే తెలుగు కవులు మనకిచ్చిన ఆస్తి!

6

ఆంధ్రకవుల నామములు సింహావలోకనము చేస్తే ఒక విశేషము కనిపిస్తుంది. ఆదికవి నన్నయ సంహితాభ్యాసుడే కాక అవిరళజపహోమ తత్పరుడు, నిత్య సత్యవచనుడు. తిక్కన సాక్షాత్తు సోమయాజి. ఎఱ్ఱయ శంకరస్వామి శిష్యుడు. పోతన శ్రీరామసాక్షాత్కార భాగ్యముపొంది అద్వైత భావన కల మహాభక్తుడు. శ్రీనాథుడు, పెద్దన, తెనాలి రామకృష్ణుడు, ముక్కు తిమ్మన, అయ్యలరాజు రామచంద్రుడు, ధూర్జటి, పిల్లలమఱ్ఱి పినవీరన, పింగళి సూరన, అప్పకవి, పిండిప్రోలు లక్ష్మణకవి, శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి, కొక్కొండ వెంకటరత్నం, వేదము వెంకట

రాయ శాస్త్రి, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి, తిరుపతి వెంకటేశ్వరులు, రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ—గౌరవ స్థానము కల అనేక ఇతర కవులూ అందరూ ఆర్యధర్మపరాయణులే! అందరూ విశ్వ శ్రేయస్సు అభిలషించేవారే! అందరూ ప్రేయస్కాముకతను ప్రతి ఘటించి ఎదుర్కొన్నవారే! ఈ మహాభాగ్యము సంస్కృతానికే లేదు. ఇక ఇతరదేశ భాషల సంగతి వేరుగా ఉటంకించవలసిన అవసర మేముంది?

అసలు సాహిత్యమే శ్రేయఃప్రధానమైనది. ఆ శబ్దములోనే "కలిసి ఉండడ"మనే భావము వినబడుతున్నది. అది రసవంతముగా ఉంటుంది. అంటే వేరువేరు భావాలకు సామరస్యము ఉంటుంది. సాహిత్యమే శ్రేయస్సాధన, ఉపాసన. వరివస్య!

అందులో తెలుగుకవులు ఈ శ్రీధ్వజము ప్రతిష్ఠించినారు, శ్రేయో దీపము వెలిగించినారు. అభ్యుదయపు దివిటీ ఎత్తి పట్టినారు. మంగళా రార్తికము ఈ లోకానికే కాకుండా సమస్తలోకాలలో పరిభ్రమింప జేసినారు!

——

# ఆంధ్ర సంస్కృతి

ఆంధ్రరాష్ట్ర మవతరింపవలెనను అందోళనము ఎక్కువగుచున్న కొలదియు తరచుగా 'ఆంధ్రసంస్కృతి' యను పదము వినబడుచున్నది. ఆంధ్రులకు ప్రత్యేకముగా నొక సంస్కృతి కలదా? ఉన్నచో నది ఏమి? దాని స్వరూపమెట్టిది?—నిష్పక్షపాతముగా విచారింప యత్నింతము.

ఒక ప్రత్యేక సంస్కృతి యన్నప్పుడది వారి శిల్పమునను, చిత్ర కళలోను,వాఙ్మయమందు,సంగీతమున, గృహవాస్తువు,గ్రామనిర్మాణము, పుర నిర్మాణము, నౌకా నిర్మాణము, మతము, తత్త్వవిచారము, వేషము ఆచారములు, సాంఘిక వ్యవస్థలు, ప్రకృతి సిద్ధ సంస్థానము, చరిత్ర— ఇత్యాది సమస్త విషయములందును ప్రతిబింబించును. అట్టి ప్రత్యేకత ఏమైనను ఆంధ్రులకున్నదా?

ఆంధ్రశిల్పము, ఆంధ్రుల చిత్రకళయని పలుమారులు పత్రికలలో చదువుచుందుము, ఉపన్యాస వేదికలనుండి వినుచుందుము. ఆంధ్ర శిల్పమన్న వెంటనే అమరావతి, నాగార్జునకొండ ఉదహరింతురు. చిత్రకళ యనగానే అజంతా యందుము. పుర నిర్మాణమన్నంతనే హంపీ విద్యా నగరము పేరెత్తుదుము. ఇందులో నేవి నిజముగా ఆంధ్రుల కాణాచులు? వాని ప్రత్యేకత ఏమి?

మనమెంత కాదన ప్రయత్నించినను, అజంతా గుహలు తెలుగు దేశము మధ్యములో లేవు. అవి మహారాష్ట్రము కన్నడము తెలుగు మిశ్ర మైన భాగములో నున్నవి. అందును తెలుగక్కడ చాల తక్కువ. అజంతా గుహలు తొలుచుటలోనను, అక్కడి గండారములు మలచుట లోనను, అందలి చిత్రములు వ్రాయుటలోనను ఆంధ్రదేశములోని పనివారు గూడ తప్పక పాల్గొనియే యుందురు. కాని అజంతా ప్రత్యేక మాంధ్రులదనుట బుద్ధిమంతులంగీకరించు మాట కాదు.

అదే విధముగా విద్యానగరము! విద్యానగర సామ్రాజ్యమును తరుచుగా కర్ణాటక రాజ్యమనువారు శ్రీకృష్ణదేవరాయలు మృతిచెందిన పిమ్మట కలిగిన యంతఃకలహములను పురస్కరించుకొని గజపతి విద్యానగర రాజ్యములోనికి దండెత్తిరాగా, అల్లసాని పెద్దన కోపించి ఒక సీసపద్యము వ్రాసి గజపతికి పంపినట్లు చెప్పెదరు. అందులో 'కన్నడం బెట్లు చొచ్చెదు గజపతీంద్ర!' అని ఉన్నది. శృంగేరీ విరూపాక్ష పీఠాధిపతుల బిరుద గద్యములలోగూడ వారికి కర్ణాటక సింహాసనాధీశ్వరులను నామమే కలదు. అంతమాత్రమున విద్యానగరము కేవలముగా కర్ణాటుల దనజెల్లదు. మొట్టమొదట నెట్లున్నను దాని యంత్యదశలో తెలుగు నాయకులు, మంత్రులు, కవులు ఆ సామ్రాజ్యములో ఎక్కువ పలుకుబడి సంపాదించుకొనిరి. ఏది ఎట్లున్నను మొత్తము మీద కన్నడులు ఆంధ్రులు తమిళులు కొంచెముగా కేరళులుకూడ యథాశక్తిగా దాని స్థాపనకును, అభివృద్ధికిని తుదకు విచ్ఛిత్తికినిగూడ తోడ్పడిన మహారాజ్యమది! అందుచే హంపిలో ఆంధ్రుల ప్రత్యేక సంస్కృతి కొరకన్వేషించుట వృథాశ్రమ.

ఇక మిగిలినవి అమరావతి, నాగార్జునకొండ — కాకున్న భట్టిప్రోలు, ఘంటసాల, గుడివాడ, జగ్గయ్యపేట ఇత్యాదులను చేర్చవచ్చును. ఇవియన్నియు నిస్సందేహముగా ఆంధ్రభూమి మధ్య భాగమున నవతరించినవే. మరియైనచో వాని శిల్పములో నొకప్రత్యేకత యున్నదా? వానిని గూర్చి విచారణచేయు సందర్భములో నవి యన్నియును చైత్యములన్నమాట మరువక జ్ఞప్తియందుంచుకొనవలెను. స్తూపమను మాట సరియైనది కాదు. అది సింహళమునుండి ఎరువుతెచ్చుకొన్న క్రొత్త పదము. చైత్యమనగా చితి సంబంధమైనది. గౌతమ బుద్ధుని యొక్కయో, అర్హతుల యొక్కయో దేహములనుదహనము చేసి శేషించిన బూదియో, ధాతు ఖండమో—దంతమో, శల్యమో — భద్రపరచి యా స్థానమును పూజించి ప్రదక్షిణము చేయునిమిత్తము ప్రధానముగా నవి యవతరించినవి. ఆ ప్రదేశములును చైత్య నిర్మాణమునకు పూర్వమో పరమందుననో భారతదేశమున నానా భాగములనుండియేగాక విదేశముల నుండి కూడా భక్తులను శిల్పులను ఆకర్షించి యుండినవి. మహాత్ముల

దేహశేషములపై అద్భుతమైన కట్టడిములు కట్టి పూజా ప్రదక్షిణము నొన రించుట అంధ్రుల ప్రత్యేక సంస్కృతి లక్షణ మందుమా? అట్లైనచో నట్టి సంస్కారము మనలో బహు శతాబ్దములుగా లోపించి పోయినది. అటు కాకున్నను అమరావతి, నాగార్జునకొండ ఇత్యాదుల చైత్య నిర్మాణమున కును విగ్రహ లక్షణములకును, ఇతరాంధ్ర శిల్పములకును సాజాత్యమే మైన నున్నదా? ఉన్నచో నేమి? సాంచీ చైత్య నిర్మాణమునకు వీనికి భేదమేమి? ఉన్న స్వల్ప భేదములును ఆంధ్రుల ప్రత్యేకతను ప్రదర్శిం చునా? అట్టిది నిరూపించిన వారిప్పటికి లేరు. ఏది యెట్లున్నను తెలుగు దేశములో ఈ చైత్య నిర్మాణమాగిపోయి ఎన్నో శతాబ్దములైనవి. దాని శాఖలిప్పుడేవియు గనపడవు. అందుచే వానిలో నాంధ్రత్వమున్నదని పొంగిపోవుట నిష్ప్రయోజనము.

ఇక నేటి కాలపు చిత్రకారులున్నారు. వారిలో కొందరు శ్రీ ప్రమోద కుమార ఛటర్జీ శిష్యులు. పెక్కురు శ్రీ దేవీ ప్రసాదరాయ శిష్యులు. కొలది మంది శాంతి నికేతనము వెళ్ళి యభ్యసించిన వారున్నారు. అంతకంటెను కొద్దిమంది బొంబాయిలో స్కూలు ఆఫ్ ఆర్ట్సులో ఆంగ్లేయ చిత్రకారుని యొద్ద నేర్చినవారు. చివరి తరగతిలో కథామాత్ర శేషుడైన దామెర్ల రామారావు ముఖ్యుడు. అందరును బుద్ధిమంతులే. చక్కని చిత్రములు వ్రాయుచున్న వారే! కాని వీరిలో ప్రత్యేకాంధ్రత్వమున్నదా? ఆంధ్ర శైలి యనదగినది వీరు నిర్మించినారా? వారు చూపుచున్న యాంధ్ర త్వము పూర్వము నుండి అనుస్యూతముగా వచ్చుచున్నదా? తద్వేదు లైనవారు అట్టిదున్నచో దానిని స్థూలముగానైన నిరూపింపగలరా?

ఇక సంగీతమున్నది. త్యాగరాయల వారి పేరు చెప్పుకొని మనము మురిసిపోవుచుందుము. కాని వారితోసహా మన సంగీత విద్వాంసులకు అభిమానమైనది 'కర్ణాటక సంగీతము' కదా! త్యాగరాయలు స్వచ్ఛముగా తమిళదేశ మధ్యమున పుట్టి పెరిగినవాడు. ఆయన సంప్రదాయమును పోషించుచున్న వారిలో తమిళులే అగ్రగణ్యులు; కర్ణాటకులును ఆంధ్రు లును వారి తర్వాతనే గణింప దగినవారు త్యాగరాయలున్న ప్రాంత ములో ఆ కాలమున తెలుగు రాజభాషగా నున్నందుననో మరియే కారణ

మునినో ఆయన తెలుగులో కృతులు చెప్పుట తటస్థించినది. ఇక తరంగ కాలక్షేపమనునది మహారాష్ట్రుల అభంగములను మన వారనుకరించుటచే వాడుకలోనికి వచ్చినట్లు తోచును. మరి మిగిలినది తాళ్ళపాకవారి పదములు, అధ్యాత్మ సంకీర్తనములు, క్షేత్రయ్య పదములు ఇట్టివి. వీనిలోనైన విలక్షణమైన ఆంధ్ర సంగీత మున్నదనగలమా? సంగీతశాస్త్ర విమర్శకులింకను అట్టిది విశదపరుప వలసి యున్నది.

మరి పురనిర్మాణము, గ్రామ నిర్మాణము, గృహ నిర్మాణము— వీనిలో నాంధ్రుల ప్రత్యేకత యున్నదా? పూరిళ్ళు దక్షిణ దేశమంతటను ఒకటేతీరు. వాస్తుశాస్త్ర మనుసరించి కట్టబడుచుండిన మండువా ఇళ్లును అంతట నొకటే పద్ధతి. నేటికాలములో పాశ్చాత్యానుకరణముతో నెలయుచున్న మందిరములు పదేళ్ళకొకసారి మారిపోవుచున్న క్రొత్త క్రొత్త తీరులతో నవతరించుచున్నవి. ఇందులోనే సంస్కృతి కనిపించుటలేదు. గ్రామ నిర్మాణము పుర నిర్మాణమందును నంతే! ఆంధ్రుల ప్రత్యేకత ఏమియు వానిలో కనబడదు.

ఆంధ్ర నౌకలు ఒకానొకప్పుడు తూర్పు సముద్రముననే కాక పశ్చిమ సముద్రమునను, దక్షిణ సముద్రమునను, పసిఫికు అట్లాంటికు మహాసముద్రములందును నిరంతర సంచారములు చేసి యుండెను, నేడు చూడగా తూర్పు సముద్రతీరమందంతటను నౌకలలోను, నావికులలోను సాజాత్యమున్నది. కళింగులకును తెలుగువారికిని తమిళులకును భేదమగపడదు. ఇప్పటికిని బర్మాలో తెలుగు వారిని గూడ క్లింగులనియే వ్యవహరింతురు. ఆంధ్రనౌకలలోను నావికులలోనను విశిష్టతయున్నచో విదేశీయులైన నది గమనించి యుండరా? పూర్వము మోటుపల్లి నుండి ఆంధ్రనావలు ప్రపంచ సంచారముచేసి 'సప్తద్వీప సద్వస్తు సందోహంబుం దనకిచ్చు నెచ్చెలి సముద్రుం ప్రీతిగావించి'న దినములలో నేమైన ఆ నావలకు విశిష్టతయుండెనేమో! అదియును మనమింకను త్రవ్వి బయలు పెట్టవలసి యున్నది.

ఆంధ్రులకు ప్రత్యేకమత మొకటిలేదు. ప్రత్యేకముగా నాంధ్రాచారములును లేవు. ఒక్కొక్క కులమునకు ప్రత్యేకమైన యాచారము

లున్నవి, వస్త్రాదిధారణ విధానములున్నవి. కాని కట్టులోగాని జుట్టులో గాని ఇది యాంధ్రమైనదని వేరుగా నేమియు లేదు.

తత్త్వ విచారణలో గూడ ఆంధ్రులకు ప్రత్యేకత లేదు. భరత ఖండములో వ్యాపించిన సమస్త తత్త్వ విచారణలకును ఆంధ్ర విజ్ఞాన వేత్తలును యథాశక్తిగా సహాయపడినారు.

ఎంతదూరమట్లు విచారించుకొని పోయినను సర్వతోముఖమైన ఆంధ్ర సంస్కృతి ప్రత్యేకముగా నొకటి ఉన్నట్లగపడదు. ఆంధ్రులకు ప్రత్యేకముగా నున్నది భాషయొక్కటే! అందులో నెన్ని యవాంతర భేదములున్నను ఇది యాంధ్రభాష యని చెప్పదగినది నిర్దుష్టముగా నొకటున్నది. అందుచే నాంధ్రుల ప్రత్యేకసంస్కృతి యేమైన నున్నచో అది ఈ భాషా పరిశ్రమయందే ఉండవలెను. ఏమిటది?

ఆంధ్ర వాఙ్మయ కర్తలలో పూజ్యులగువారు మొదటినుండి ఇప్పటివరకు ఆసేతు హిమాచల భూమిని ఏకముగా సంధానము చేయుచున్న సంస్కృతభాషా ప్రభావము కలవారు. సంస్కృత భాషా పాండిత్యము లేని యాంధ్రకవి శశ విషాణమువంటి వాడే. నన్నయనుండి శ్రీ విశ్వనాథ వరకు నంతే! సంస్కృతభాష నుండియే ఆంధ్రము పుట్టిన దనువారి వాదము సత్యము కాకపోయిన నేమి? ఆంధ్రకవుల చేతులలో ఆంధ్రభాష సంస్కృతభాషా సంప్రదాయములలో నడచినది. ఆంధ్ర కవులలో కేవలావేశపరులు లేరు. శివమెత్తి మైమరచి ప్రలాపించు తామసులకు వారిలో పూజ్యస్థానము లేదు. వారందరు నొక పరిపూర్ణత కలవారు, ఆత్మనిగ్రహము కలవారు. వారు వాఙ్మయోపాసకులు, అక్షర రమ్యతావేదులు. అనంతమైన విశాల విశ్వమును అందున్న ఊహాతీత మగు వైలక్షణ్యము లక్షించుచునే తమ యాత్మలోనికి, కూర్మమువలె తమ యింద్రియములను సంకోచము చేసికొనగల యోగీశ్వరులు వారి యభిమానమునకు పాత్రమైనది భరతఖండమే. అయినను అది భరత వర్షములో నొక భాగమనియు, అది మరల జంబూద్వీపములో నొక భాగమనియు, నిత్యము ముప్పూటల స్మరించు నాచారము కలవారు. వారే కాలములో నున్నవారైనను కాల మనంత మని, దాని ప్రభావ

మెరిగినవారు. ఒక కాలములో ఒక దేశములో ఒక ఉపాధి చేకొని ఈనాడు జన్మించియున్నను, కాలాంతరమున, దేశాంతరమున ఉపాధ్యం తరము చేకొని జన్మించియుంటిమనియు, ముందు జన్మింపగలమనియు వారెరుగుదురు. శ్రేయోమార్గము వారి కెరుక. అభ్యుదయము వారి కభిమానము. తెలుగుకవులు ప్రత్యేకముగా నుపాసించినది శ్రీకారము. శ్రీకారము ఆంధ్రకవుల సంస్కృతి చిహ్నము. పూర్వమాంధ్ర నౌకలు ద్వీపాంతరములకు శ్రీకారము చిత్రింపబడిన ధ్వజములు స్తంభముల పై నాట్యము చేయుచుండ, సప్తసముద్రములలో ప్రయాణములు చేయు చుండెడివని చరిత్రకారులు చెప్పుచున్నారు. ఆంధ్రకవులు ఆద్యులైన ఋషుల సంతతిలోని వారు. ప్రత్యేకముగా నాంధ్ర సంస్కృతి యేమైన నున్నచో నది యాంధ్రకవులు వాఙ్మయరంగములో ప్రదర్శించిన ఆర్షదృష్టియే!

ఆంధ్ర సంస్కృతి ఇతర రంగములలో లేకపోవుటకు ముఖ్య కారణములు రెండు. ఒకటి ప్రకృతి సిద్ధమగు సంస్థానము. రెండవది చరిత్ర.

ఆంధ్రదేశము ప్రకృతి సిద్ధమగు స్వరూపము గమనించినచో వైవిధ్యమెక్కువ కనిపించును. కొంత పర్వతమయమైన భూమి, మరి కొంత తీరభూమి, కొంత మైదానము, కొంత తృణ జల సంపూర్ణము, కొంత నిర్జలము. ఇంతే కాదు. దీనికి స్వభావసిద్ధమైన ఎల్లలు లేవు. తూర్పున మాత్రము సముద్రమున్నది. ఉత్తరమునగాని దక్షిణమున గాని పశ్చిమమునగాని దానికి నైజమగు హద్దులు లేవు. సరిహద్దులు నిర్ణయించుట యందుచేతనే మనకు కష్టతర మగుచున్నది. ఆంధ్ర వాఙ్మయ సంస్కృతి దాని స్వీయపటుత్వము వల్లనే దక్షిణమున కావేరీ తీరమును గూడ దాటి విజృంభించినది. తంజాపురమే కాక మధురకూడ దాని నిర్మాణయంత్రశాల యైనది. పశ్చిమమున కల్యాణకటకమే కాక పూనా బొంబాయీలు కూడ దాని క్రీడాస్థానములైనవి. ఆంధ్ర వార పత్రికయు, సంవత్సరాదిసంచికలును ప్రథమములో బొంబాయీనుండియే వెలువడి యాంధ్రదేశము మారుమూలలకు ప్రసరించినవని మనము

నిరంతరము స్మృతిలో నుంచుకొనవలెను. ఉత్తరమున అది మహానదినే సమీపించి నాగపురము కటకము కూడ ప్రవేశించినది. ఇప్పటికిని ఓఢ్ర కవులు తెలుగు కవిత్వము కూడ చెప్పగల్గుట తమ ప్రతిభకు నికషముగా భావింతురు. ఆ పైకి మగధములోనికి గూడ మధ్యమధ్య నది శాఖలు చాపినది. ప్రకృతి సిద్ధమైన ఎల్లలు లేకుండుటయే నిరాఘాటముగా నది దూర ప్రయాణములు మధ్యమధ్య చేయగల్గుటకు కారణము.

మరి యాంధ్రుల చరిత్ర విచారించినచో నట్టిదే ఇంకొకటి తేటపడును. ప్రస్తుతము తెలుగుభాష ప్రధానముగా జనులు మాట్లాడుచున్న భాగమంతయు ఎన్నడును ఒక్క ప్రభుత్వముక్రింద లేదు. కాకతీయులలో గణపతి దేవుడు, రుద్రమ, ప్రతాపరుద్ర దేవుడు — ఈ ముగ్గురి కాలములో మాత్రము చాలవరకు ఒకే ప్రభుత్వముక్రింద నుండుట తటస్థించినది. అప్పుడే 'ఆంధ్రోర్వీశు'లను పేరు వారికి లభించినది. కాని యదియంతయు నొక శతాబ్దముకంటె నించుక తక్కువగు స్వల్పకాలమే. అది జరిగి ఏడు శతాబ్దములు దాటినది. అంతకు పూర్వముగాని ఆ పిమ్మట కాని ఆంధ్రులకు ఒక దేశముగాని ఒక ప్రభువుగాని ఒక రాష్ట్రముగాని ప్రత్యేకముగా నుండలేదు.

భరత ఖండము స్వభావసిద్ధముగా వింధ్యపర్వత శ్రేణిచే రెండు ప్రధాన ఖండములుగా విభజింపబడుచున్నది. ఈ రెండు ఖండములును ఎప్పటికైనను వేరయిపోవు నవకాశములున్నవి. అట్టిదానికి సూచనలిప్పుడే కనబడుచున్నవి. హిందీని రాష్ట్రభాషగా చేయ నిశ్చయించి నప్పటినుండియు ఇది పరిపరి విధములుగా తల చూపుచునే ఉన్నది. అదిగాక ఈ రెండుఖండముల సంస్కృతిలో కూడ నిప్పుడు విశేష భేదమున్నది. విదేశీయుల తాకిడులు ఎక్కువగా ఉత్తర ఖండమును తగిలినవి. అందుచే నక్కడ ప్రాచీన భారతీయ సంస్కృతి విచ్ఛిన్నమగుచున్నది. దక్షిణ ఖండమో? అది యంత యలజడి పొందలేదు. అందుచే పురాణ సంస్కృతి ఇంకను కొంత యక్కడనే శేషించి యున్నది. ఉత్తరఖండములో తొందరపాటెక్కువ. దక్షిణ ఖండములో

జాప్య మెక్కువ. ఈ రెండు ఖండములును ఎప్పటికి చీలిపోకుండుట భరత ఖండమునకు శ్రేయస్కరము. కాని తప్పని సరియైన చీలిపోయినను, ఒకరి గొంతు ఒకరు కోసినను శత్రు ఖండములుగా గాక తండ్రియాస్తి మైత్రితో పంచుకొను నిద్దరు సోదరుల విభాగముగానైన పరిణమింపవలసి యున్నది. ఈ భారము ఎవరిపై నున్నది?

దక్షిణ ఖండములోని సంస్కృతియంతయు కల్గి, ఉత్తరఖండమునకు మిక్కిలి సమీపముగా నున్నది మనము, తెలుగు దేశంలోని వారము. ఈ భాగ్యము మనతోపాటు మహారాష్ట్రులకును గలదు. ఆంధ్రులకును మహారాష్ట్రులకును అనాదిగా సన్నిహిత సంబంధమున్నది. ఈ రెండు భూభాగములే భరత భూమికి మధ్యభాగములో నున్నవి. అది కీలకస్థానము శాంత సుభిక్షములైన ఆంధ్ర మహారాష్ట్రములు శాంత సుభిక్షమైన భరత ఖండమునకే పునాదులు. కృష్ణా గోదావరీ నర్మదా నదులనే గంగాసింధు నదుల పవిత్రవారిని (జలమును) కావేరీ తామ్రపర్ణి పుణ్యతోయములతో నేకము చేసి వింధ్య పర్వత గర్వమును నిర్మూలింప సమర్థమైనవి. అఖిల భారత సామరస్యము సాధించు భారము ఆంధ్రుల పైనను, మహారాష్ట్రులపైనను ప్రధానముగా కలదు.

ఇది వేయేండ్ల క్రిందట తెలిసికొనిన వాడాంధ్ర కవి నన్నయ భట్టారకుడు! ఆంధ్రరాష్ట్ర మవతరించినచో ఆంధ్ర కవులు వాఙ్మయ రంగములో ప్రదర్శించిన విశాలదృష్టినే సమస్త రంగములలో విజృంభింప జేతురుగాక!

(భారతి, ఏప్రెల్ 1952)

# ఆంధ్రుల చరిత్ర

ఆంధ్రరాష్ట్ర మవతరించుచున్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయములో రాష్ట్రములోని భాగములన్నియు విలీనము కానున్నవి. త్వరలో విశాలాంధ్ర మేర్పడనున్నది. ఈ సందర్భములో బుద్ధిమంతులగు నాంధ్రులు ముఖ్యముగా తెలిసికొనవలసిన దేమి?

త్రిలింగములనుండియు, త్రినగముల నుండియు తెలుగు, తెనుగు అను శబ్దములు ఏర్పడినవో లేదో సందేహాస్పదము కావచ్చును. కాని నేటి రాజకీయవాదుల ధోరణివలన ఆంధ్రము త్రిఖండములుగా పరిగణింప బడుచున్నది. తీరాంధ్రము, రాయలసీమ, తెలంగాణము అని నేడు ప్రచారములోనికి వచ్చిన ఈ భేదము కృత్రిమము. ఈ భేదము సత్యమైనది కాదనియు, దానిని వెంటనే మరువనిచో ఆంధ్రరాష్ట్రమునకు శ్రేయస్సు కలుగదనియు ఆంధ్రులు ఎంత శీఘ్రముగా గమనించిన నంత శుభము. ఈ సత్యము తెలిసికొనుటకు ఆంధ్రులచరిత్రను గూర్చిన విజ్ఞానము ఆంధ్రులలో విస్తరింపజేయుట అత్యావశ్యకము.

మరియు జాతీయవాదులకు పలువురకు ఆంధ్ర రాష్ట్రావతరణము భయము కలిగించుచున్నది. బహుకాలమునకు భరత ఖండములో స్థాపింపబడిన ఏకైక ప్రభుత్వము విచ్ఛిత్తి నందుటకు ఇదియొక అంకురారోపణమా అని వారికి భయము కలుగుచున్నది. ఆ భయము నిరాధారమైనదియుగాదు. ఇప్పుడీ సరిహద్దుల విషయములో, 'తమిళులతో, కర్ణాటులతో, ఓఢ్రులతో' ఆంధ్రుల కేర్పడుచున్న తీవ్ర వివాదములు వారి భయమును హెచ్చించుచున్నవి. విశాలాంధ్ర మేర్పడు నప్పుడు మహారాష్ట్రులతో కూడ నిట్టి వివాదములే రేకెత్తగలవు. ఈ వివాదములే స్థిరమగుచో, భారత జాతీయతా విచ్ఛిత్తికి రాష్ట్రావతరణము నాందియే కాగలదు. అట్టి అపాయము నివారించుటకు గూడ ఆంధ్ర చరిత్ర పఠనము అత్యావశ్యకము.

ఎన్నఁడో ఆంధ్రరాజులు మహారాష్ట్రము, మగధనుగూడ జయించి పాలించినది బహు ప్రాచీన విషయము. ఆంధ్రభాషలో ఉత్తమమగు ప్రథమకావ్య మవతరించునాటికి కొలదికాలము క్రిందటివరకును ఆంధ్ర మునకు కర్ణాటకముతో, దేశముతోను భాషతోను అవినాభావ సంబంధ ముండెను. అప్పటినుండి కొంతకాలము జ్ఞాతి సంబధమేర్పడినది. అంతలో ఆంధ్ర చాళుక్యులకు, చోళరాజులతోడను, వారి రాజ్యముతోడను సంబంధ బాంధవ్యము లేర్పడెను. రాజరాజ నరేంద్రుని కుమారుడు కులోత్తుంగచోళుడను పేరుతో చోళచక్రవర్తి యయ్యెను. అటు చోళులు నిటు కర్ణాట చాళుక్యులు క్షీణించుచున్న సమయములో హనుమకొండలో కాకతీయ రాజ్యమేర్పడ సాగెను. తుద కది గణపతిదేవ చక్రవర్తి కాలములో, కొంచెము హెచ్చు తగ్గుగా, తెలుగుమాటాడు దేశమంతటికి వ్యాపించెను. ఆ పిమ్మట నాతని కుమార్తె రుద్రమదేవి కాలమునను యామె దౌహిత్రుడు ప్రతాపరుద్రదేవుని కాలమునను నది స్థిరపడెను, 'త్రిలింగక్షితిపాలురు' 'ఆంధ్రోర్వీశులు' అను పేరులు కాకతీయులకు పూర్వమున్న రాజులకెవ్వరికి రూఢిగ చెల్లలేదు.

అంతలో ఆంధ్రరాజ్యమునకు ప్రళయము వచ్చెను. మరల కొలది కాలమునకు విజయనగర సామ్రాజ్యములో ఆంధ్రులు, కర్ణాటకులు, తమిళులు కలసి 'హిందూరాజ్యరమ'ను ఉద్ధరించిరి. అది ఒక్కరి సొంత సొమ్ము కాదు. అంతలో వారిలో వారు కలహింప నారంభింపగా ఆ సామ్రాజ్యము విచ్ఛిత్తినొందెను. ఆ తర్వాతి ఆంధ్రచరిత్ర ఒక దారి తెన్నులేక నడచినది. ఇప్పుడు అసంపూర్ణముగా ఆంధ్రరాష్ట్ర మవతరించు చున్నది. ముఖ్యముగా మనమిప్పుడు ఆంధ్రులచరిత్ర సమగ్రముగా తెలిసికొనుట అవసరము. అది ప్రధానముగా రెండే నీతిపాఠములు మనకు నేర్పగలదు.

ఆంధ్రులందరికి ఏకైకబంధము వారిభాష. అది అఖండ భారతాభి మానమును రేకెత్తింప పాటుపడిన కవిత్రయమువారి పవిత్ర వాక్కులతో స్థిరపడినది. ఆంధ్రరాష్ట్రములో ఈ భాగమని, ఆ భాగమని వేరుచేసి పలుకువారు ఆంధ్రరాష్ట్రమునకు మేలు చేకూర్చువారు కాదు. ఆంధ్రుల

సంస్కృతి ఓఢ్ర తమిళ కర్ణాట మహారాష్ట్ర సంస్కృతులకంటె భిన్నమైనదని తలచువారు భారత సంస్కృతికి శత్రువులు !

రాష్ట్రావతరణ వేళలో ఆంధ్రులీ సత్యములు గ్రహింతురు గాక !

(ఆంధ్ర రాష్ట్రావతరణ సంచిక-1-10-1953)

# నేటి సాహిత్య విమర్శ

ఆధునిక విజ్ఞానము సమకూర్చిన సౌకర్యాలవల్ల ప్రపంచమంతా నేడు సన్నిహితమైనది. ఇందువల్ల మానవులలో సహజంగా ఉన్న మానవత్వమూ, సాధనవల్ల సాధ్యమయ్యే దివ్యత్వమూ వ్యాపించి ఈ లోకమే స్వర్గతుల్య మవుతుందని బుద్ధిమంతులు భావించడము సహజము. కాని ఫలితము అందుకు విపరీతముగా కనిపిస్తున్నది. మానవులలో నిహితమై ఉన్న పశు ప్రవృత్తీ, సులభ సాధ్యమైన అసురభావమూ ఎక్కువగా వ్యాపిస్తున్నట్లు కనిపిస్తున్నది. శాంతి సామరస్యాల కంటె కల్లోల ద్వేషాలే విజృంభిస్తున్నవి. పూర్వ కాలంలో ఒకచోట పుట్టిన కల్లోలము ఆ ప్రాంతాన్నే బాధించేది. కాని ఈ కాలంలో ఏ మారుమూలనో పుట్టిన ఏ చిన్న కల్లోలమో ప్రపంచమంతా వ్యాపించి కలుషితంచేసి సర్వ నాశనానికి దారితీసే అవకాశాలు కనబడుతున్నవి. ఈ ప్రమాదాన్ని అరికట్టగలిగినది సాహిత్యమొక్కటే!

ఐతే బాహ్య ప్రపంచంలో వ్యాప్తమైన ఈ కల్లోలము సాహిత్య కళా ప్రపంచంలో కూడా ప్రతిబింబిస్తూనే ఉన్నది. అట్లా ప్రతిబింబించిన కల్లోలాన్ని శత సహస్ర గుణంగా వృద్ధిచేసి లోకమంతటా వెదజల్లు తున్నది. సాహిత్యానికి ఉన్న ఈ మహత్తరశక్తిని ముందు బాగా గ్రహించినవారు రాజకీయ నాయకులు! ప్రతి రాజకీయపార్టీ తన ఆశయాలకు అనుకూలమైన కల్లోలాన్ని సృష్టించే రచయితలను కూడదీసి ఆకాశానికి ఎత్తి వారినే మహాకవులుగా గొప్ప రచయితలుగా ప్రచారము చేస్తున్నది. కవులూ, రచయితలూ వారి పొగడ్తలకూ, వారు సమకూర్చే ఆర్థికాది లాభాలకూ వశులై ఆయా రాజకీయ పార్టీలకు క్రీతదాసులై తమ దాస్యమే ప్రభుత్వమూ, స్వాతంత్రమూ అనే భ్రాంతిలో పడిపోతున్నారు. ఈ పరిస్థితి సాహిత్యానికీ కాక లోకశ్రేయస్సుకే చాలా ప్రమాదకరమైనది!

పూర్వము కవులు శారీరకంగా ఇతరుల ప్రభుత్వాలకు బద్ధులై నప్పుడు కూడా తమ హృదయాలను స్వతంత్రంగా ఉంచుకొని, తమ క్రూరప్రభువులను కూడా మానవులనుగా మార్చి సన్మార్గములో నడిపించే వారు. నేడు కవుల హృదయాలనే రాజకీయాలకు బానిసత్వము ఆవేశించి నది. కవులూ కావ్యకర్తలూ కానివారు మహాకవులుగా మహా రచయిత లుగా చలామణీ అవుతున్నారు. ఈ కాలంలో ఎందరో మంచి కవులూ రచయితలూ తమకు తెలియకుండానే దాస్య శృంఖలాలకు బద్ధులై ఆ సంకెళ్లు బంగారువని పొంగిపోతున్నారు. ఆ సంకెళ్ళు కూడా బంగారువి కాదు. బంగారుపూతవి మాత్రమే. సాహిత్యాన్ని రాజకీయాల దాస్యములో నుంచి ఉద్ధరించి దానికి స్వాతంత్ర్యము చేకూర్చవలసిన అవసరమిప్పు డెంతో ఉన్నది. లేకపోతే సాహిత్యము తన స్వరూపమే కోలుపోయి ప్రమాదకర సాధనంగా పరిణమించే స్థితి వస్తున్నది.

సాహిత్యానికి దాస్యము తొలగించి స్వాతంత్ర్యము చేకూర్చగల శక్తి సాహిత్యవిమర్శకు ఒక్కదానికే ఉన్నది. ఈ గురుతర బాధ్యత తమమీద ఉన్నదని సాహిత్య విమర్శకులు గుర్తించినప్పుడే, వారు తమ విధి నిర్వహించినవారవుతారు. అప్పుడే ఉత్తమ సాహిత్యము రూపొంది -పెంపొంది లోకులకుగ్రాహ్యమై, లోకంలో మానవత్వాన్ని, దివ్యత్వాన్ని ప్రతిష్ఠించి విశ్వశ్రేయస్సు సాధించగలుగుతుంది.

లోకమంతటా వ్యాపించిన కల్లోలము సాహిత్య విమర్శలోకి కూడా ప్రసరించకపోలేదు. పైగా రాజకీయవాదుల పంచమాంగదళాలు సాహిత్య విమర్శకులలోకి కూడా చొచ్చుకొని వచ్చిఉన్నవి. ఐనా సాహిత్య విమర్శ కులు, విమర్శకులు గనుక ఎక్కువ బుద్ధిమంతులు! నిశితంగా ఆత్మ విమర్శ, పరవిమర్శ చేసుకొని ఋజుమార్గంలోకి శీఘ్రంగా రాగలవారు; రాగద్వేషాలు మధ్యవచ్చినా వాటిని నిగ్రహించుకొని సన్మార్గము దర్శించి ఇతరులకు ప్రదర్శింపగలవారు.

నేడు పాఠకలోకము విపరీతంగా వృద్ధి ఐనది. అందులో గొప్ప ప్రమాదముతో పాటు సముద్ధరణ బీజంకూడా ఇమిడిఉన్నది. సాహిత్య

విమర్శకులు వారిని ప్రమాదంలో నుంచి తప్పించి సముద్ధరించే బాధ్యత కూడా తాము వహించవలె.

లోకమంతటా ఎంత కల్లోలమున్నా ఉత్తమ సాహిత్యసృష్టికి నేడున్నంత విస్తారమైన అవకాశము పూర్వమెప్పుడూ ఎక్కడా లేదు. ప్రపంచం అంతటా మారుమూలలతో సహా, ఎక్కడెక్కడ ఉత్తమ సాహిత్యం ఏ కాలంలో ఉన్నదైనా మనము గ్రహించి రసానుభూతి పొందే అవకాశము ఇప్పుడెంతైనా ఉన్నది. ఉత్తమ సాహిత్యము నాగరిక జాతులలోనే కాక అనాగరిక జాతులలో కూడా ఉన్నది. ఒక విధంగా యోచిస్తే నాగరికుల మనుకునే వారికంటే, అనాగరికులుగా పరిగణింపబడే వారిలోనే ఉత్తమ సాహిత్యసృష్టికి ఎక్కువ అవకాశాలు కన్పిస్తున్నవి. ఉత్తమ సాహిత్యము ఎక్కడఉన్నా, సాహిత్య విమర్శకులు దానిని వెలికి తీసి లోకమంతటా దాని సౌరభాలూ వ్యాపింపజేయవలసి ఉన్నది.

సామాన్య మానవుని సాధారణ ప్రవృత్తి ఆలోచిద్దాము. ఒకనికి ఇంకొకనిమీద ద్వేషము కలిగితే అవతలవాణ్ణి హింసించినపుడే గాని తృప్తి కలుగదు. ఇతరుల వస్తువు కావలెనని లోభము కలిగినపుడు, దొంగతనంగానో, దొరతనంగానో దాన్ని పొందినప్పుడే తృప్తి పడతాడు. ఒక పురుషునికి స్త్రీయందో, స్త్రీకి పురుషునియందో తీవ్రకామము ఆవేశించినప్పుడు యుక్తాయుక్త విచక్షణ లేకుండా తీర్చుకొన్నప్పుడే తృప్తి కలుగుతుంది. ఇటువంటి తృప్తులే ఇంకా చాలా లోకంలో ఉన్నవి. ఆ విధంగా కలిగే తృప్తి పశువులకు కలిగే తృప్తిగాని ఉత్తమ సాహిత్యము కలిగించగల ఆనందముకాదు. నేడు పెరిగిన పాఠక లోకానికి నేడు పెరిగిన రచయితలు అందిస్తున్నది ఎక్కువభాగము వారి పశువృత్తికి పరోక్షంగా కలిస్తున్న ఈదృశ్యమైన తృప్తే కాని కావ్యానందము కాదు.

ఉత్తమ కవికూడా క్రోధాన్నీ, ద్వేషాన్నీ, కామాన్నీ తన కావ్యవస్తువులుగా తీసుకోకపోడు. కాని అవి విశృంఖలంగా విహరించినప్పుడు పశువుల మవుతామనీ, ధర్మ మార్గములో ప్రవర్తించునప్పుడే మానవులమూ, దివ్యులమూ అవుతామనీ సూచిస్తాడు. ఈ విధంగా పాఠకలోకా

నికి నిగ్రహములో ఉన్న సున్నితమైన మాధుర్యమూ, ఆనందమూ అందిస్తాడు. దీనివిలువను పాఠకులలో ప్రచారముచేసి రసానందాన్ని అనుభవించగల శక్తి కలిగించడము సాహిత్య విమర్శకుల విధి. కాబట్టి సాహిత్య విమర్శకులు ఇటు రచయితలనూ, అటు పాఠకులనూ సన్మార్గములో నడిపించుటకు పాటుపడవలసి ఉన్నది.

నేడు రచయితల స్వాతంత్ర్యాన్ని హరించి వారిని తమ క్రీత దాసులనుగా చేసుకొనడానికి కాచుకొని - కూర్చున్న రాజకీయ వాదులయు, వివిధ 'ఇజము'లయు పెద్దపాముల నోళ్లలో వారిని పడకుండ రక్షించవలసిన గురుతర బాధ్యత సాహిత్య విమర్శకుల మీద ఉన్నది.

కవులు ప్రధానంగా ఋషులు! అందుచేత వారు ధర్మప్రవర్తకులు కాగలుగుతారు. అప్పుడే వారు ఆనంద సంధాతలవుతారు. ఈ విధంగా శాంతి దూతలుగా పరిణమిస్తారు. సాహిత్య శబ్దములలోనే సర్వలోక హితము ఇమిడి ఉన్నది. ఈ విషయమును సాహిత్య రచయితల కందరికీ, సద్గురువు శిష్యునికి ఆత్మస్వరూపము ఉపదేశించినట్లే, సాహిత్య విమర్శకుడు ప్రదర్శింపవలసి ఉన్నది. అప్పుడే రచయిత స్వతంత్రుడు కాగలుగుతాడు. అది లేనినాడు సాహిత్య విమర్శకుడు తాను గోతిలోకి దిగుతూ, తనతోపాటు రచయితలనూ, వారితోపాటు పాఠకలోకాన్నీ ఆ చీకటి గోతిలోనికి లాగగలడు. అట్లుకాక సాహిత్య విమర్శకులు రచయితలనూ పాఠకులనూ, చల్లని వెన్నెల వెలుగులోకి వెళ్ళేదారి చూపి, నడిపించి ఆనందధామము చేరుస్తారు గాక!

(Souvenir,
4th All-India Telugu writers Conference -1969)

# విమర్శ ప్రమాణము

సృష్ట్యాది నుండి ఇప్పటివరకూ కవులెంత మంది పుట్టినారో చెప్ప లేము. కాని వారిలో మన మిప్పటికీ స్మరించే వారు కొద్దిమందే ఉన్నారు. అయితే మనము మరిచిపోయినంత మాత్రముచేత మన జ్ఞప్తిలో లేని వారు కవులు కాకపోరు. మనకు జ్ఞాపకమున్నంత మాత్రముచేతనే వారంతా మంచి కవులు అవడానికీ వీలులేదు. ఇక మనము మరచి పోయిన విమర్శకులు ఎంతమంది ఉండేవారో చెప్పనేలేము గదా.

## అందరూ విమర్శకులే

ఇప్పుడున్న కవుల సంఖ్య స్థూలంగా చూస్తే సృష్ట్యాది నుంచీ ఇప్పటిదాకా ఉన్న కవుల సంఖ్యకు సరిపోతుందా అనిపిస్తుంది. ఇక ఇప్పుడు విమర్శకుడు కానివాడే లేడు. డెమాక్రెసీ రోజులు గనుక కవిత్వమూ, దాని విమర్శా సర్వసాధారణము కావడము న్యాయమే. నాకెందుకు, నేను పది పన్నెండేళ్ళు వచ్చినప్పటినుంచీ కవిత్వమూ, కవితా విమర్శా మొదలు పెట్టినాను. ఎప్పటికప్పుడు నేను చెప్పే కవిత్వము వలెనే నా విమర్శ కూడా నాకుమాత్రము బాగుండేది. అయితే ఎప్పటి కప్పుడే. కాని ఆ తృప్తి, వెనకటి కాలంలో బాగున్న కవిత్వము కాని, విమర్శ కాని ఇప్పుడు నాకే నచ్చడము లేదు.

## ఒకే ఒక ప్రశ్న

అందువల్ల ఈ మధ్య కొంత కాలము నుంచీ నన్ను ఒక ప్రశ్న పట్టి బాధిస్తున్నది. బంగారము మంచిదో, చెడ్డదో విచారణ చేయవలె నంటే స్థూలంగా గీటురాయి వల్ల చెప్పవచ్చును. ఇంకా సూక్ష్మమైన సాధనాలవల్ల కొలతవేసి ఇంత బంగారము, ఇంత రాగి, ఇంత మట్టి

అని చెప్పే వీలున్నది. అట్లాగే ఇతర విషయాలు కూడా మంచి చెడ్డల విచారణ చేయడానికి ఏవో ఆధారాలు - ప్రమాణాలు ఉన్నవి.

## ఏది కొలబద్ద?

కవిత్వానికీ, విమర్శకూ అటువంటి కొలబద్దలు ఏమైనా ఉన్నవా? ఉంటే అవి ఎంత వరకు నమ్మదగినవి? కావ్యము మంచిదేదో, చెడ్డ దేదో తెలుసుకునేందుకు ప్రమాణము దొరికితే, కవిత్వానికీ, విమర్శకూ ప్రమాణము దొరికినట్లే, కాబట్టి రెండింటికి కలిపి పర్యాలోచన చేద్దాము. అందులో పాశ్చాత్యులమీద అభిమానముచేత ఆధునికులు అమలులోకి తెచ్చిన కొన్ని ప్రమాణాలు ముందు విచారిద్దాము. అయితే అవి మనకూ కొత్తవి కావు.

## కాలమా?

అటువంటి ప్రమాణకోటిలో ప్రప్రథమముగా పరిగణించేది కాలము. ఏ కావ్యము శాశ్వతముగా జనాదరణ పాత్రముగా ఉంటుందో అదే గొప్ప కావ్యమని ఉద్దేశము. ఎన్నో గ్రంథాలు తాత్కాలికముగా జనుల మనస్సులు ఆకర్షిస్తవి. కొద్దిరోజులకు మళ్ళీ వాటి సంగతి తలచేవాళ్ళు కూడా ఉండరు. హోమరు, డాంటీ, షేక్స్పియరు - ఇత్యాది మహా కవుల గ్రంథాలు కొన్ని శతాబ్దాలుగా జనము చదివి ఆనందిస్తున్నారు. అవే ఉత్తమ కావ్యాలు. వాటి గుణము శాశ్వతత్వము. కాబట్టి కావ్యా నికి కాలమే ప్రమాణము అనిపిస్తున్నది.

## అందులో విప్రతిపత్తి లేదు.

ఐతే ఇవ్వాళ వ్రాసే కావ్యము మంచిదో, చెడ్డదో విమర్శించ డానికి ప్రస్తుతము వీలు లేదన్న మాట. కాలము విమర్శించి నిలిపేదాకా మనము ఆగవలసి వస్తుంది. ఇక కాలమంటే ఎంత కాలము!

అదిగాక ఒక్కొక్క కావ్యము ఉండడానికి దాని గుణమేకాక మరెన్నో కారణాలు ఉండవచ్చును. ఒక మహాకవి వ్రాసిన సామాన్య కావ్యాలు కూడా జనము అతని మీద గౌరవముచేత స్మరిస్తూ మరవ

కుండా ఉంటారు. ఒక్కొక్కప్పుడు మత సంబంధమైన స్పర్శ కలుగుతే ఆ మతస్థులకు అది పూజ్యమై శాశ్వతమవుతుంది. చివరకు ధైర్యముచేసి పచ్చిబూతుగా ఎవరైనా పుస్తకము వ్రాస్తే అన్నిటికంటే అది శాశ్వత మవుతుందని నా విశ్వాసము. విశ్వాసము లేనివారు కాళిదాస ప్రహసన మనే ప్రసిద్ధి ఉన్న ప్రహసనము వ్రాసిన వాణ్ణీ, మన కవి చౌడప్పనూ అడగండి! ఈ విధంగానే ఉత్తమత్వమే కాక మరెన్నో కారణాలు ఉండ వచ్చును, చిరంజీవులుగా ఉండడానికి.

అంతేకాక ఉత్తమమైనవి ఎన్నో కావ్యాలు కాలగర్భంలో పడి పోయినవి. కవి తాను ప్రచారము కోసము ప్రయత్నించకపోతే లోకా నికి ఎట్లా తెలుస్తుంది! ఒక్కొక్కప్పుడు ఉపద్రవాలవల్ల కావ్యాలు పోతవి. కొన్ని గ్రంథ భాగాలే కనిపిస్తవి. ఎన్నో కాలగర్భంలో పడి పోయినవి చిత్రముగా కొన్నాళ్ళకు పైకి వచ్చి జనాదరణ పాత్ర మవు తున్నవి. ఇటువంటిదానికి గొప్ప ఉదాహరణము ఇప్పుడుమనము సామా న్యముగా భాసనాటకాలని వ్యవహరిస్తున్న ప్రతిమాది నాటకాలు. ఇందులో రెండు విశేషాలు. అవి ఎవరు వ్రాసినా చక్కని నాటకాలే. అవి ఎన్నాళ్ళు కాలగర్భంలో పడిపోయినవో తెలియదుగదా! ఇప్పుడా నాట కాలు నమ్మకమైన ఆధారము లేకపోయినా, భాసుడి పేరుతో ముడివేయ డము వల్ల వాటికి మరింత జనాదరణము వచ్చినదనడము నిస్సందేహ విషయము!

కాబట్టి కాల మనే ప్రమాణము మనకు విశ్వాస పాత్రమైనది కాదు.

## విశ్వజనీనతా :

కాలముకాదు. కావ్యము బహు జనాదరపాత్రము కావలె అంటే ఒక రకమైన మనుష్యులకేకాక బహువిధాలవారికి కావ్యమునచ్చవలె. అప్పుడే అది మంచి కావ్య మవుతుంది. అంటే మంచి కావ్యాలు బాలురవద్దనుంచీ పరిణతబుద్ధులవరకూ అందరికీ బాగుండవలె. పిల్లలు కథా చమత్కృతికి వ్యగ్రులవుతారు. శాబ్దికులు శబ్ద సౌష్ఠవం వల్ల ముగ్ధులవుతారు. ధర్మ ప్రబోధముతో ధార్మికులు సంతుష్టులవుతారు. మహాభారత ప్రస్తావనలో పూజ్యపాదుడైన నన్నయభట్టారకుడు కూడాఈ గుణమే ఉద్ఘాటించినాడు.

"ధర్మ తత్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియు
పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని......"

ఇంకో విధముగా కూడా మన పెద్దలు ఈ గుణాన్నే వర్ణించినారు:

"ఒక్కొక్కని కావ్యము కవి గృహములోనే నిలిచిపోతుంది. మరొకరిది ఆ కవి స్నేహితుల ఇళ్ళదాకా వెళ్లుతుంది. ఇక మరి ఒకరి కావ్యము అవిదగ్ధుల వదనములందు పాదములుంచి విశ్వకుతూహలివలె శాశ్వతముగా సంచరిస్తుంది.

ఈ గుణాన్నే 'విశ్వజనీత' (Universality) అని పాశ్చాత్య విమర్శకులంటారు.

అదీ నిలవదు.

అయితే ఈ కొలబద్ద వేస్తే ఎన్నో మంచి కావ్యాలుపోతవి, కొన్ని కావ్యాలు పరిణత బుద్ధులకేకాని ఆనందము కలిగించవు.

" ......లేజవరాలు చెక్కుగీ
టిన వసవల్చు బాలకుడు
టెందముననన్ గరగంగ నేర్చునే? "

అన్నాడు కాదా మన తెలుగుకవి! మరి అంత గొప్పగా నన్నయభట్టారకుడు మహా భారతమును ప్రశంసించినాడా? దాన్ని కూడా కొందరు నవనాగరికులు, ద్విజులు తమకు ద్విజేతరులచేత శాశ్వితముగా దాస్యము చేయించుకోడానికి వ్రాయించిన ప్రచార ప్రధానమైన గ్రంథమని తోసి వేస్తున్నారు. అంతమాత్రముచేత మహాభారతము కూడా పోవలసిందేనా? కాబట్టి ఈ విశ్వజనీనత కూడా నమ్మకమైన కొలబద్ద కాదు. సూక్ష్మముగా

ఆలోచిస్తే ఇది కూడా ముందు విచారించిన కాలమనే ప్రమాణానికి అపర రూపమే! కాబట్టి కాలమూ కాదు, విశ్వజనీతా కాదు!

## ఉదాత్తతా? అంటే...

ఇక కొందరు ఉత్తమ కావ్య లక్షణము ఉదాత్తత (Sublimity) అంటారు. మిల్టను వ్రాసిన 'పారడైజు లాస్టు' చూడండి! అందులో మనుష్యజాతికే సంబంధించిన ఉదాత్త విషయాలు చిత్రించినాడు. డాంటే వ్రాసిన 'డివైను కామెడీ' కూడా అంతే! అట్లాగే గెటే వ్రాసిన 'ఫాస్టు' ఆలోచించండి. రవీంద్రుని 'కింగు ఆఫ్ ది డార్కు చేంబరు'; మీటరు లింకు వ్రాసిన 'బ్లూబర్డు,' 'ది సైటులెస్'; హాప్ట్‌మనుది 'ది బెల్'! హోమరు చిత్రించిన యుద్ధముకూడా సామాన్య మానవులది కాదు. దేవతాసములైన వీరులది. పెద్దలు పురాణము పంచలక్షణమని చెప్పినారు- సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము! ఇట్టి ఉదాత్త విషయ వర్ణన చేసేదే ఉత్తమ కావ్యము!

## అందులో బాధకాలు

ఈ గుణము కొలబద్ధగా తీసుకుంటే ఉత్తమ కావ్యకోటిలో అందరూ సామాన్యముగా పరిగణించే కావ్యాలు చాలా భాగము వస్తవి. నాకేందుకు, నాకు గాఢాభిమాన పాత్రమైన కావ్యాలన్నీ వస్తవి. మహాభారతానికి మకుటాయమానమైన స్వర్గారోహణపర్వము ఒక్కసారి జ్ఞాపకము తెచ్చుకోండి! మానవులలో ఉత్తముడు ధర్మరాజు. అందరిలో మానవ శరీరముతో స్వర్గములో అడుగు పెట్టదగినవాడు అతడొక్కడే! అతనికి బంధుజనులను చూడబుద్ధి పుట్టగా ముందు ఉన్నతాసనము మీద దుర్యోధనుణ్ణి చూపుతారు. తన సోదరులు నరకములో ఉంటారు. దేవనీతిమీద కొంతసేపటికి అసహ్యము కలుగుతుంది ధర్మరాజుకు! చివరకు మానవనీతికీ, దేవనీతికీ భేదము విశదీకరించి ఆకాశగంగలో స్నానము చేస్తేనేగాని ధర్మరాజుకు కూడా 'మానుష భావవికారముల శోక బంధము' లడగవనీ, అప్పుడేకాని స్వర్గ సౌఖ్యము అనుభవింపరాదనీ విశదీకరిస్తారు. ఈ విధముగా ఈ లోకనీతితో కట్టుబడే మనకు ఇంతకంటె ఉదాత్తమైన

నీతి బోధించినాడు వ్యాస భగవానుడు! ఈ విధంగానే ఉదాత్త విషయములు చిత్రించ గలిగినవారే మహాకవికోటిలోకి వస్తున్నారు. అయితే ఈ ఉదాత్త ధర్మమే ఉత్తమ కావ్యలక్షణమంటే బాగున్నట్లే ఉన్నదికాని దీనికి కూడా ఎన్నో బాధకాలు ఉన్నవి.

## అసలుకే మోసము

ముందు అసలిది సంసార పక్షమైన కొలతకాదు. ఈ కొలతబద్దవేసి కొలిస్తే నిలవగలిగే కావ్యాలు బహుస్వల్పము. ఇక మహాభారతాదులే కావ్యాలు-ఇతరము కాదంటే కవులు చాలా భాగము వ్రాయకుండా పూరుకోవలసి వస్తుంది. షేక్స్పియరు నాటకాలు చాలా భాగము పోతవి. భవభూతి మాలతీ మాధవము నిలవదు. కాళిదాసు మేఘదూతము, మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము కూడా గణనలోకి రాకపోవచ్చును. అమరుకము ఏమి కావలె, గాథా సప్తశతి?

## అవ్యాప్తి

కవులూ, విమర్శకులూ ఎందరో రామణీయకవాదులు. కావ్యానికి ఉదాత్తత దానికి ఉత్కృష్టత ఆపాదించే ఒక గుణ విశేషమేకాని నిత్య ధర్మముకాదు. ఎన్నోకావ్యాలు రమ్యంగామాత్రమే ఉంటవి. వాటివిషయముల ఈ ఉదాత్తతా ప్రమాణము అవ్యాప్తమై పోతుంది. కాబట్టి నాబోటి వారికి ఈ ఉదాత్తత ఎంత అభిమానమైనా ప్రమాణభూతముకాదని ఒప్పుకోక తప్పనిస్థితి ఏర్పడుతుంది.

## పోనీ రామణీయకమో?

ఇక ఉదాత్తతను బాధించిన రమత్య పోనీ, విశ్వసనీయమైన ప్రమాణమవుతుందా? కావ్యము మనోజ్ఞముగా ఉండవలె! "A thing of beauty is a joy for ever" అని కీట్సు ప్రారంభించినాడు. కొందరు కళకు గమ్యస్థానము కళయే అన్నారు. కవులు చిత్రకారులవలెనే సౌందర్యోపాసకులు. అలంకారికులలో అధునాతనుడైన జగన్నాథపండితరాయలు "రమణీయార్థ ప్రతిపాదక శబ్దమే కావ్య" మన్నాడు. శ్రీ రాయప్రోలు సుబ్బరావు కూడా అన్నాడు!

"నిర్వికల్పన విజ్ఞాన నిరతు లయిన
బ్రహ్మవాదులకును, హ్లాదరామణీయ
వాదులైన కవులకును భేద మెంతు;
తారతమ్య మీమాంసకు తగను నేను."

*బాగానే వుంటుంది.*

మమ్మట భట్టారకుడు 'కవి భారతి హ్లాదైకమయి' మనీ, 'నవ రస రుచిర' మనీ అన్నాడు. కావ్య విమర్శకు ప్రమాణముగా ఈ రమ్యత, మనోజ్ఞత అని అంగీకరించేందుకు చాలా అవకాశము కనపడుతున్నది. ఎంత చిన్న కావ్యమైనా మనోజ్ఞమైతే మనకది గ్రాహ్యమే!

*కాని, దానికి వ్యావస్థలేదు.*

ఐతే దీనికి కూడా బాధ లేకపోలేదు. కావ్యానికి మనోజ్ఞతే ప్రధాన లక్ష్యమైతే ఇప్పటికి లోకములో ఉత్తమోత్తమ కావ్యాలుగా పూజింపబడే కావ్యాలే వెనకపడిపోతవి. ఉదాత్త కావ్యకోటిలో ఉదాహృతమైన కావ్యాలన్నీ మనోజ్ఞతలో చాలా చిన్న కావ్యాలకు తీసిపోవచ్చును. అంతేకాదు. ఈ మనోజ్ఞతకు సరియైన వ్యవస్థచేసే వీలులేదు. ఈ మనోజ్ఞత మనిషిని బట్టి మారుతుంటుంది. కాముకునికి శృంగార ప్రశంస ఒక్కటే మనోజ్ఞము. భక్తునికి భక్తి ప్రశంసేకాని శృంగార ప్రశంస అసహ్యము కలిగిస్తుంది. పాకృత జనానికి పచ్చిబూతు రుచిగా ఉంటుంది. పాపము! వరూధిని మనోజ్ఞత ప్రవరాఖ్యునికి పనికి రాలేదు. ఆ శ్రోత్రియబ్రాహ్మణునికి అరణులు, దర్భలు, అగ్నులు ప్రియములైనట్లు అన్యములీ కావు.

కాబట్టి ఈ రమ్యత కూడా అవ్యవస్థితమై పోతుంది.

*భావనాబలమూ కాదు.*

పోనీ, కొందరు కవికి భావనాబలము (Imaginatiou) ఉండవలెనంటారు. కదా అంటే ఇదమిత్థమని మనము స్పష్టముగా తెలుసుకునే వస్తువు కా దిది!

## కావ్యాలాపాలు.

మరికొందరు మనిషిని కావ్యాలు కదిలిస్తవి, ఉద్రేకము కలిగిస్తవి అంటారు. మద్యాదుల సేవవల్ల కలిగే ఉత్సాహమూ, ఆవేశమూ వంటిదే కావ్యపఠనమువల్ల కలిగే ఫలితమని వీరి ఉద్దేశము. తన పాఠకులచేత వీరాంగము వేయించడమే కవి విధి అంటే పెద్ద మనుష్యులైనవారు కవిత్వము జోలికిపోరు. అటువంటి కావ్యాలను ఉద్దేశించే పెద్దలు 'కావ్యాలాపములు వర్జించవలె' నని పలికి ఉంటారు.

## ఉపజ్ఞలో ఓగు.

అదికాదు. కవికి ఉండవలసినది ఉపజ్ఞ (Originality) అంటారు కొందరు. అయితే కాళిదాసంతటివాడు తనకు ఉపజ్ఞలేదని

"మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తిమే గతిః"

అని ఉద్ఘాటించినాడు. ఉపజ్ఞ విమర్శకు ప్రమాణమైతే రఘువంశము మంచి కావ్యము కాదని తోసివేసే అవస్థ పడుతుంది. అటువంటి కావ్య విమర్శకు దూరము నుంచే నమస్కారము చేయవలసి వస్తుంది.

## వైచిత్రిలోని విపరీతాలు.

మరికొందరు కవికి కావలసినది 'వైచిత్రి' అంటున్నారు. నిజముగా ఆలోచిస్తే ఉపజ్ఞ లేనివాళ్లు అది ఉన్నవాళ్లను అనుకరించబోయి చూపే ఉపజ్ఞాభాస ఈ వైచిత్రి అని స్పష్టమవుతుంది. కావ్య రచన ధన సంపాదనకూ, కీర్తి సంపాదనకూ ఉపకరించే వ్యాపారముగా మారినతర్వాత లోకవంచనకు చిల్లరకవులు చేసే గారడీ ఈ వైచిత్రి. 'నీ పేరేమి' ని తల్లకిందులుచేసి చపుకగా వైచిత్రిగలకావ్యముగా చేయవచ్చును. అప్పుడు అది 'మీరేపేనీ' అవుతుంది.

'వైచిత్రి' కావ్యానికి కొలబద్దగా తీసుకుంటే ఏమవుతుందో అది 'వికటకవి'కే వదలవలసి ఉంటుంది

## దేని కదే.

ఇక కొందరు "ఏ కావ్యానికి ఆ కావ్యమేగాని కావ్యాలకన్నింటికీ సామాన్య ధర్మములేదు. ఏ కావ్యానికి అదే ప్రమాణము; అంటే కావ్యము

చదివి అది ఏ ప్రమాణములతో బద్ధమైనదో తెలుసుకొని విచారించవలెను" అంటారు. ఇది విమర్శకులు ముఖ్యముగా గమనించదగిన విషయము. అయితే ఈ పద్ధతి విషయగ్రహణానికి మాత్రమే పనికి వస్తుంది. కాని అది మంచిదా, చెడ్డదా, గొప్పదా, తక్కువదా—ఈ విధముగా విలువ కట్ట డానికి ఉపయోగించదు. అర్థము చేసుకోకుండా విమర్శ ప్రారంభించే వారికి ఈ పద్ధతి అడ్డు తగులుతుంది.

## అభ్యుదయ రచయితలకు పోటీ.

"ఇకముందు లోకంలో రాబోతున్నది కమ్యూనిజము. దానికి అను కూలించేవే మంచి కావ్యాలు. ఇతరమంతా తుచ్ఛమైనవి" అంటారు ప్రోగ్రెసివు రైటర్సు అనే పేరు పెట్టుకొని కొందరు. వారు చెప్పేదంతా కావ్య వస్తువుకు సంబంధించినదే కాని కావ్య స్వరూపానికి సంబంధమే మాత్రమూ లేనిది. ముందు ఎట్లా ఉన్న అది అంగీకరిస్తే ఇంతవరకూ లోకములో గొప్ప కావ్యాలనుకునేవి తోసివేయవలసి వస్తుంది. వాటి రుచి ఎరిగినవారు ఎన్నటికీ అందుకు ఒప్పుకోరు. వీరితో పోటీగా చాలా రకాల ప్రచారకులు తమకు ఇష్టమైన ప్రచారానికి ఉపయోగించేదే కావ్యమని పోటీకి వస్తారు.

## నున్నకునున్న హళ్ళికి హళ్ళి.

ఇంతవరకూ పాశ్చాత్య వాసనవల్ల మనవాళ్ళు వాడుకలోనికి తెచ్చిన విమర్శాదర్శములు పరీక్షించి చూచినాము. అవి అన్నీకూడా కేవలము పాశ్చాత్యులవే కావని కూడా సూచించినాము. అయితే పై వాటిని పరీ క్షించగా ఒకటీ తృప్తిగా నిలవలేదు.

## పూర్వాచార్యు లేమంటారు?

మనపూర్వులు ఎందులో సమర్థులు కాకపోయినా తత్త్వ వివేచ నములో మాత్రము నిపుణులు కాబట్టి వారు దీనికి ప్రమాణమేమైనా నిర్వ చించినారేమో విచారిద్దాము!

"ధర్మ తత్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు
నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియు
పరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చయంబని......"

ఇంకో విధముగా కూడా మన పెద్దలు ఈ గుణాన్నే వర్ణించినారు:

"ఒక్కొక్కని కావ్యము కవి గృహములోనే నిలిచిపోతుంది. మరొకరిది ఆ కవి స్నేహితుల ఇళ్ళదాకా వెళ్లుతుంది. ఇక మరి ఒకరి కావ్యము అవిదగ్ధుల వదనములందు పాదములుంచి విశ్వకుతూహలివలె శాశ్వతముగా సంచరిస్తుంది.

ఈ గుణాన్నే 'విశ్వజనీత' (Universality) అని పాశ్చాత్య విమర్శకులంటారు.

అదీ నిలవదు.

అయితే ఈ కొలబద్ద వేస్తే ఎన్నో మంచి కావ్యాలుపోతవి, కొన్ని కావ్యాలు పరిణత బుద్ధులకేకాని ఆనందము కలిగించవు.

"......లేజవరాలు చెక్కుగీ
టిన వసవల్చు బాలకుఁడు
డెందమునన్ గరగంగ నేర్చునే?"

అన్నాడు కాదూ మన తెలుగుకవి! మరి అంత గొప్పగా నన్నయ భట్టారకుడు మహా భారతమును ప్రశంసించినాడా? దాన్ని కూడా కొందరు నవనాగరికులు, ద్విజులు తమకు ద్విజేతరులచేత శాశ్వతముగా దాస్యము చేయించుకోడానికి వ్రాయించిన ప్రచార ప్రధానమైన గ్రంథమని తోసి వేస్తున్నారు. అంతమాత్రముచేత మహాభారతము కూడా పోవలసిందేనా? కాబట్టి ఈ విశ్వజనీనత కూడా నమ్మకమైన కొలబద్ద కాదు. సూక్ష్మముగా

ఆలోచిస్తే ఇది కూడా ముందు విచారించిన కాలమనే ప్రమాణానికి అపర రూపమే! కాబట్టి కాలమూ కాదు, విశ్వజనీతా కాదు!

## ఉదాత్తతా అంటే...

ఇక కొందరు ఉత్తమ కావ్య లక్షణము ఉదాత్తత (Sublimity) అంటారు. మిల్టను వ్రాసిన 'పారడైజు లాస్టు' చూడండి! అందులో మనుష్యజాతికే సంబంధించిన ఉదాత్త విషయాలు చిత్రించినాడు. డాంటి వ్రాసిన 'డివైను కామెడీ' కూడా అంతే! అట్లాగే గెటీ వ్రాసిన 'ఫాస్టు' ఆలోచించండి. రవీంద్రుని 'కింగు ఆఫ్ ది డార్కు చేంబరు'; మీటరు లింకు వ్రాసిన 'బ్లూబర్డు,' 'ది సైటులెస్'; హాప్ట్‌మనుది 'ది బెల్'! హోమరు చిత్రించిన యుద్ధముకూడా సామాన్య మానవులది కాదు. దేవతాసములైన వీరులది. పెద్దలు పురాణము పంచలక్షణమని చెప్పినారు- సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరములు, వంశానుచరితము! ఇట్టి ఉదాత్త విషయ వర్ణన చేసేదే ఉత్తమ కావ్యము!

## అందులో బాధకాలు

ఈ గుణము కొలబద్ధగా తీసుకుంటే ఉత్తమ కావ్యకోటిలో అందరూ సామాన్యముగా పరిగణించే కావ్యాలు చాలా భాగము వస్తవి. నాకేందుకు, నాకు గాఢాభిమాన పాత్రమైన కావ్యాలన్నీ వస్తవి. మహాభారతానికి మకుటాయమానమైన స్వర్గారోహణపర్వము ఒక్కసారి జ్ఞాపకము తెచ్చుకోండి! మానవులలో ఉత్తముడు ధర్మరాజు. అందరిలో మానవ శరీరముతో స్వర్గములో అడుగు పెట్టదగినవాడు అతడొక్కడే! అతనికి బంధుజనులను చూడబుద్ధి పుట్టగా ముందు ఉన్నతాసనము మీద దుర్యోధనుణ్ణి చూపుతారు. తన సోదరులు నరకములో ఉంటారు. దేవనీతిమీద కొంతసేపటికి అసహ్యము కలుగుతుంది ధర్మరాజుకు! చివరకు మానవనీతికీ, దేవనీతికీ భేదము విశదీకరించి ఆకాశగంగలో స్నానము చేస్తేనేగాని ధర్మరాజుకు కూడా 'మానుష భావవికారముల శోక బంధము' లడగవనీ, అప్పుడేకాని స్వర్గ సౌఖ్యము అనుభవింపరాదనీ విశదీకరిస్తారు. ఈ విధముగా ఈ లోకనీతితో కట్టుబడే మనకు ఇంతకంటె ఉదాత్తమైన

నీతి బోధించినాడు వ్యాస భగవానుడు! ఈ విధంగానే ఉదాత్త విషయములు చిత్రించ గలిగినవారే మహాకవికోటిలోకి వస్తున్నారు. అయితే ఈ ఉదాత్త ధర్మమే ఉత్తమ కావ్యలక్షణమంటే బాగున్నట్లే ఉన్నదికాని దీనికి కూడా ఎన్నో బాధకాలు ఉన్నవి.

## అసలుకే మోసము

ముందు అసలిది సంసార పక్షమైన కొలతకాదు. ఈ కొలతబద్దవేసి కొలిస్తే నిలవగలిగే కావ్యాలు బహుస్వల్పము. ఇక మహాభారతాదులే కావ్యాలు-ఇతరము కాదంటే కవులు చాలా భాగము వ్రాయకుండా పూరుకోవలసి వస్తుంది. షేక్స్పియరు నాటకాలు చాలా భాగము పోతవి. భవభూతి మాలతీ మాధవము నిలవదు. కాళిదాసు మేఘదూతము, మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము కూడా గణనలోకి రాకపోవచ్చును. అమరుకము ఏమి కావలె? గాథా సప్తశతి?

## అవ్యాప్తి

కవులూ, విమర్శకులూ ఎందరో రామణీయకవాదులు. కావ్యానికి ఉదాత్తత దానికి ఉత్కృష్టత ఆపాదించే ఒక గుణ విశేషమేకాని నిత్య ధర్మముకాదు. ఎన్నోకావ్యాలు రమ్యంగామాత్రమే ఉంటవి. వాటివిషయముల ఈ ఉదాత్తతా ప్రమాణము అవ్యాప్తమై పోతుంది. కాబట్టి నాబోటి వారికి ఈ ఉదాత్తత ఎంత అభిమానమైనా ప్రమాణ భూతముకాదని ఒప్పుకోక తప్పనిస్థితి ఏర్పడుతుంది.

## పోనీ రామణీయకమో?

ఇక ఉదాత్తతను బాధించిన రమత్య పోనీ, విశ్వసనీయమైన ప్రమాణమవుతుందా? కావ్యము మనోజ్ఞముగా ఉండవలె! "A thing of beauty is a joy for ever" అని కీట్సు ప్రారంభించినాడు. కొందరు కళకు గమ్యస్థానము కళయే అన్నారు. కవులు చిత్రకారులవలెనే సౌందర్యోపాసకులు. అలంకారికులలో అధునాతనుడైన జగన్నాథపండిత రాయలు "రమణీయార్థ ప్రతిపాదక శబ్దమే కావ్య" మన్నాడు. శ్రీ రాయప్రోలు సుబ్బారావు కూడా అన్నాడు!

"నిర్వికల్పన విజ్ఞాన నిరతు లయిన
బ్రహ్మవాదులకును, హ్లాదరామణీయ
వాదులైన కవులకును భేద మెంతు;
తారతమ్య మీమాంసకు తగను నేను."

*బాగానే వుంటుంది.*

మమ్మట భట్టారకుడు 'కవి భారతి హ్లాదైకమయు' మనీ, 'నవ రస రుచిర' మనీ అన్నాడు. కావ్య విమర్శకు ప్రమాణముగా ఈ రమ్యత, మనోజ్ఞత అని అంగీకరించేందుకు చాలా అవకాశము కనపడుతున్నది. ఎంత చిన్న కావ్యమైనా మనోజ్ఞమైతే మనకది గ్రాహ్యమే!

*కాని, దానికి వ్యావస్థలేదు.*

ఐతే దీనికి కూడా బాధ లేకపోలేదు. కావ్యానికి మనోజ్ఞతే ప్రధాన లక్ష్యమైతే ఇప్పటికి లోకములో ఉత్తమోత్తమ కావ్యాలుగా పూజింపబడే కావ్యాలే వెనకపడిపోతవి. ఉదాత్త కావ్యకోటిలో ఉదాహృతమైన కావ్యాలన్నీ మనోజ్ఞతలో చాలా చిన్న కావ్యాలకు తీసిపోవచ్చును. అంతేకాదు. ఈ మనోజ్ఞతకు సరియైన వ్యవస్థచేసే వీలులేదు. ఈ మనోజ్ఞత మనిషిని బట్టి మారుతుంటుంది. కాముకునికి శృంగార ప్రశంస ఒక్కటే మనోజ్ఞము. భక్తునికి భక్తి ప్రశంసేకాని శృంగార ప్రశంస అసహ్యము కలిగిస్తుంది. పాకృత జనానికి పచ్చిబూతు రుచిగా ఉంటుంది. పాపము! వరూధిని మనోజ్ఞత ప్రవరాఖ్యునికి పనికి రాలేదు. ఆ శ్రోత్రియబ్రాహ్మణునికి అరణులు, దర్భలు, అగ్నులు ప్రియములైనట్లు అన్యములు కావు.

కాబట్టి ఈ రమ్యత కూడా అవ్యవస్థితమై పోతుంది.

*భావనాబలమూ కాదు.*

పోనీ, కొందరు కవికి భావనాబలము (Imaginatiou) ఉండవలె నంటారు. కదా అంటే ఇదమిత్థమని మనము స్పష్టముగా తెలుసుకునే వస్తువు కా దిది!

## కావ్యాలాపాలు.

మరికొందరు మనిషిని కావ్యాలు కదిలిస్తవి, ఉద్రేకము కలిగిస్తవి అంటారు. మద్యాదుల సేవవల్ల కలిగే ఉత్సాహమూ, ఆవేశమూ వంటిదే కావ్యపఠనమువల్ల కలిగే ఫలితమని వీరి ఉద్దేశము. తన పాఠకులచేత వీరాంగము వేయించడమే కవి విధి అంటే పెద్ద మనుష్యులైనవారు కవిత్వము జోలికిపోరు. అటువంటి కావ్యాలను ఉద్దేశించే పెద్దలు 'కావ్యాలాపములు వర్జించవలె' నని పలికి ఉంటారు.

## ఉపజ్ఞలో ఓగు.

అదికాదు. కవికి ఉండవలసినది ఉపజ్ఞ (Originality) అంటారు కొందరు. అయితే కాళిదాసంతటివాడు తనకు ఉపజ్ఞలేదని

"మణౌ వజ్రసముత్కీర్ణే సూత్రస్యేవాస్తి మే గతిః"

అని ఉద్ఘాటించినాడు. ఉపజ్ఞ విమర్శకు ప్రమాణమైతే రఘువంశము మంచి కావ్యము కాదని తోసివేసే అవస్థ పడుతుంది. అటువంటి కావ్య విమర్శకు దూరము నుంచే నమస్కారము చేయవలసి వస్తుంది.

## వైచిత్రిలోని విపరీతాలు.

మరికొందరు కవికి కావలసినది 'వైచిత్రి' అంటున్నారు. నిజముగా ఆలోచిస్తే ఉపజ్ఞ లేనివాళ్లు అది ఉన్నవాళ్లను అనుకరించబోయి చూపే ఉపజ్ఞాభాస ఈ వైచిత్రి అని స్పష్టమవుతుంది. కావ్య రచన ధన సంపాదనకూ, కీర్తి సంపాదనకూ ఉపకరించే వ్యాపారముగా మారినతర్వాత లోకవంచనకు చిల్లరకవులు చేసే గారడీ ఈ వైచిత్రి. 'నీ పేరేమి' ని తల్లకిందులుచేసి చవుకగా వైచిత్రిగలకావ్యముగా చేయవచ్చును. అప్పుడు అది 'మిరేపేనీ' అవుతుంది.

'వైచిత్రి' కావ్యానికి కొలబద్దగా తీసుకుంటే ఏమవుతుందో అది 'వికటకవి'కే వదల లసి ఉంటుంది

## దేని కదే.

ఇక కొందరు "ఏ కావ్యానికి ఆ కావ్యమేగాని కావ్యాలకన్నింటికీ సామాన్య ధర్మములేదు. ఏ కావ్యానికి అదే ప్రమాణము; అంటే కావ్యము

చదివి అది ఏ ప్రమాణములతో బద్ధమైనదో తెలుసుకొని విచారించవలెను" అంటారు. ఇది విమర్శకులు ముఖ్యముగా గమనించదగిన విషయము. అయితే ఈ పద్ధతి విషయగ్రహణానికి మాత్రమే పనికి వస్తుంది. కాని అది మంచిదా, చెడ్డదా, గొప్పదా, తక్కువదా—ఈ విధముగా విలువ కట్ట డానికి ఉపయోగించదు. అర్థము చేసుకోకుండా విమర్శ ప్రారంభించే వారికి ఈ పద్ధతి అడ్డు తగులుతుంది.

### అభ్యుదయ రచయితలకు పోటీ.

"ఇకముందు లోకంలో రాబోతున్నది కమ్యూనిజము. దానికి అను కూలించేవే మంచి కావ్యాలు. ఇతరమంతా తుచ్ఛమైనవి" అంటారు ప్రోగ్రెసివు రైటర్సు అనే పేరు పెట్టుకొని కొందరు. వారు చెప్పేదంతా కావ్య వస్తువుకు సంబంధించినదే కాని కావ్య స్వరూపానికి సంబంధమే మాత్రమూ లేనిది. ముందు ఎట్లా ఉన్న అది అంగీకరిస్తే ఇంతవరకూ లోకములో గొప్ప కావ్యాలనుకునేవి తోసివేయవలసి వస్తుంది. వాటి రుచి ఎరిగినవారు ఎన్నటికీ అందుకు ఒప్పుకోరు. వీరితో పోటీగా చాలా రకాల ప్రచారకులు తమకు ఇష్టమైన ప్రచారానికి ఉపయోగించేదే కావ్యమని పోటీకి వస్తారు.

### నున్నకునున్న హళ్లికి హళ్లి.

ఇంతవరకూ పాశ్చాత్య వాసనవల్ల మనవాళ్లు వాడుకలోనికి తెచ్చిన విమర్శాదర్శములు పరీక్షించి చూచినాము. అవి అన్నికూడా కేవలము పాశ్చాత్యులవే కావని కూడా సూచించినాము. అయితే పై వాటిని పరీ క్షించగా ఒకటీ తృప్తిగా నిలవలేదు.

### పూర్వాచార్యు లేమంటారు?

మనపూర్వులు ఎందులో సమర్థులు కాకపోయినా తత్త్వ వివేచ నములో మాత్రము నిపుణులు కాబట్టి వారు దీనికి ప్రమాణమేమైనా నిర్వ చించినారేమో విచారిద్దాము!

## రసమతము.

భరతమునివద్దనుంచీ బహుపండితాదరము పొందిన మతము రస మతము. పెద్దలు ఏమన్నారు:

"కావ్యస్య శబ్దార్థౌశరీరమ్; రసాదిశ్చాత్మా; గుణాః శౌర్యాదివత్; దోషాః కాణత్వా దివత్; రీతయోవయవ సంస్థాన విశేషవత్; అలంకారాః కటక కుండలాదివత్."

ఈ సమష్టి వాక్యములో ఆలంకారిక మతాలు చాలా భాగము సమన్వయమైనవి. ఔచిత్యవాద మొక్కటీ, ధ్వనిమత మొక్కటీ మిగిలి పోయినవి. సూక్ష్మముగా విచారిస్తే ధ్వనిమతానికీ, రసమతానికీ ఎక్కువ భేదములేదు. ఔచిత్యము కూడా నిజముగా గుణవాదములోనిదే.

## కావ్యాత్మ స్వరూపము.

ఇక రసవాదములోగాని, ధ్వనివాదములోగాని కావ్యాత్మ స్వరూప మేమి? కొందరన్నారట:

"ధ్వనేస్తత్త్వం గిరా మగోచరం సహృదయ సంవేద్యమేవ."

మరికొందరు దాన్ని అన్నారుట:

"ప్రతీయమానం పున రస్య దేవ వస్త్వస్తి వాణీషు మహాకవీనామ్,
యత్తత్ప్రసిద్ధావయవాతిరిక్తం విభాతి లావణ్య మివాంగనాసు."

అట్లాగే రసము కూడా—

లోకోత్తర చమత్కారః ప్రాణఃకైశ్చి త్ప్రమాతృభిః,
స్వాకారవ దభిన్నత్వే నాయ మాస్వాద్యతే రసః"

ఆలాగే —

"పుణ్యవంతః ప్రమిణ్వంతి యోగివ ద్రససంతతిమ్"

ఈ విధముగా మన పూర్వులు కూడా వివరణాలలో ఎట్లా ఉన్నా రసస్వరూపము చెప్పేటప్పుడు సహృదయైక వేద్యమే ననీ అనిర్వాచ్య మనీ, బ్రహ్మానంద సహోదరమైన అనుభవము కలిగిస్తుందనీ ఇత్యాదిక ముగా చెప్పవలసి వచ్చినది.

## ఎవడు సహృదయుడు?

అయితే ఎవడు సహృదయుడు?

శ్రీ మమ్మట భట్టారకుడు కావ్యానికి హేతువుగా మూడు సామగ్రులు ఉదహరించినాడు:

"శక్తిర్నిపుణతా లోక శాస్త్రకావ్యాద్యవేక్షణాత్,
కావ్యజ్ఞశిక్షయా భ్యాస ఇతి హేతుస్తదుద్భవే."

అందులో 'శక్తి'ని వివరిస్తూ—

"శక్తిః కవిత్వ బీజరూపః సంస్కార విశేషః, యాం న వినా కావ్యం ప్రసరేత్, ప్రసృతం వా ఉపహసనీయం స్యాత్" అన్నాడు.

నిపుణతను వివరిస్తూ లోకజ్ఞానమూ, ఛందో వ్యాకరణాది శాస్త్రములూ, గజతురగ ఖడ్గాది లక్షణ గ్రంథములూ, మహాకవుల కావ్యములూ, ఇతిహాసాదులూ— వీటి విమర్శవల్ల వచ్చే వ్యుత్పత్తిగా నిరూపించినాడు.

అభ్యాసము వివరిస్తూ—

"కావ్యం కర్తుం విచారయితుంచ యే జానంతి. తదుపదేశేకరణే యోజనేచ పౌనఃపున్యేన ప్రవృత్తిః" అన్నాడు.

ఆపైన "ఈమూడూ వేరేవేరే కారణాలు కావు. కారణమే. అంటే అన్నీ ఉన్నప్పుడే సాధ్యము"ని ఉపదేశించినాడు.

కావ్య విమర్శకుడికికూడా తప్పనిసరిగా ఇవన్నీ కావలసిన గుణాలుగా కనబడుతున్నవి. అటువంటి సామగ్రి ఉన్నవాడే సహృదయుడు. వజ్ర పరీక్ష ఎంత కష్ట సాధ్యమైనదో అంతకంటె సహస్ర గుణము కావ్య పరీక్ష కష్ట సాధ్యమైనది. వజ్రపరీక్షకు ఒక వజ్ర ప్రపంచము బాగా తెలుస్తే చాలును. కాని కావ్య విమర్శకు కావలసిన సామగ్రి అపరిమితమైనది.

## మనవి

విమర్శప్రమాణము సర్వవ్యాధినివారిణులని చెప్పే చిట్కా మందులవలె సులభసాధ్యమైనది కాదు. విమర్శ చేసేందుకు సమగ్రమైన సామగ్రి మన విమర్శకులకు ఎందరికి ఉన్నదా ప్రశ్నించుకోవలసినదని మనవి చేస్తున్నాను.

(ఆంధ్రపత్రిక 1944 తారణ సంవత్సరాది సంచిక నుండి)
(ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచికలో పునర్ముద్రితము - 1965)

# తెలుగు కవిత్వములో ఫాషనులు

ఫాషను అనేది కవిత్వములోకూడా ఉన్నదా అని కొందరు సందేహ పడవచ్చు. మానవుడికి సంబంధించిన ప్రతిదానిలోనూ ఫాషను ఉన్నది.

పూర్వాంధ్ర కవులలో 'ఫాషను' అన్నప్పుడు ఏ శ్రీనాధునితోనో "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కులకేల కల్గె నీయతులిత మాధురీ మహిమ?" అని మహాసభలో కూడా ప్రస్తావన వచ్చేటంత ప్రసిద్ధముగా విలాస పురుషుడైన ధూర్జటితోనో, అనేక కధలు చెప్పుకొనే పిన వీరభద్రునితోనో ప్రారంభిస్తానని మీరు ఊహించవచ్చు. వాళ్ళుకూడా ఫాషనులు కనపరచిన వారే కాని తెలుగు కవులలో కల్లా మొదటి ఫాషను తెచ్చిన నవనాగరికుడు నన్నయ్య భట్టు.

ఏమిటి! "అరవిళ జప హోమ తత్పరుడు, సంహితాభ్యాసుడు, నానా పురాణ విజ్ఞాన నిరతుడు" అయిన ఈ నన్నయ్యభట్టు శుద్ధ ఛాంద సుడు కాడా? బ్రాహ్మణాతిశయము సంగతీ, వర్ణాశ్రమ ధర్మరక్షణము సంగతీ అనుమానమేమీలేకుండా సర్వసామాన్య విషయంగా ఎక్కడపడితే అక్కడ వర్ణిస్తూ వచ్చినాడు. రాజరాజ నరేంద్రుణ్ణి వర్ణిస్తూ ఆరో పద్యము లోనే "సమస్త వర్ణాశ్రమ ధర్మరక్షణ మహామహిమ" నొప్పుచు అనీ, తర్వాత పద్యములోనే "విప్రకులమునెల్ల బ్రోచుచు" అనీ, "అగ్రజన్మ లకు ననుగ్రహమున చారుతర మహాగ్రహారంబులిచ్చుచు" అనీ అన్నాడు. ఆయనకు ఇష్టమైన నాలుగైదు వస్తువులలో, "భూదేవ కులాభితర్పణ మహీయః ప్రీతి" ఒకటి అన్నాడు. భారత శ్రవణాభిరతివల్ల "అమల సువర్ణ శృంగ ఖురమై కపిలంబగు గోశతంబు నుత్తమ బహువేదవిప్రు లకు దానముచేసిన తత్ఫలంబు తథ్యమ సమకూరు" అన్నాడు. ఊరికే సభాపర్వంలో పుటలు తెరవగానే ఈవాక్యము కనబడ్డది. "దిగ్విజయో పార్జితంబులయిన ధనంబుల బ్రాహ్మణ సంతర్పణంబును ధర్మమార్గం బులం జాతుర్వర్ణ్యరక్షణంబునుంజేసి సామ్రాజ్యంబునం బ్రకాశింపుము"

అని ధర్మరాజుతో నారదుడన్నట్లున్నది. ఇంతగా బ్రాహ్మణాతిశయము తిక్కనకూడా చెప్పలేదు. ఇక నన్నయభట్టు చెప్పినదా పురాణము. ఇటువంటి అచ్ఛ సనాతనుడైన నన్నయభట్టే తెలుగు కవిత్వములో మొదటిఫాషను తెచ్చినాడా! అని సందేహము ఎవరికయినా కలగడము ఆశ్చర్యముకాదు.

అయితే ఈ నన్నయ్యభట్టే రాజసభలోని సభ్యులను—సభికులంటే తగాదా వస్తుందేమో—వర్ణిస్తూ సభలో "మృదు మధుర రస భావభాసుర నవార్థ వచనరచనా విశారదులయిన మహాకవులును" ఉన్నారని వర్ణించి నాడు. మహాకవుల రచనలు వర్ణిస్తూ "భావ భాసురమైన" వనీ, "నవార్థ వచ నము" లనీ చెప్పినాడు. ఆయన ఇప్పుడే గనక ఉంటే తప్పక 'భావ కవి త్వమూ', 'నవ్యకవిత్వమూ' ఆదరించేవాడనుకోవడములో అనుమానము ఉండదు. ఒక్క సమాసములోనే రెండూ ఉదాహరించినాడు.

ఇంతకూ ఆయన భావకవిత్వమందు అభిమానము చూపినా అటు వంటిది వ్రాయలేదు కాబట్టి ఆయన తెచ్చిన 'ఫాషను' ఏమిటి? ఈ ప్రశ్నకు జవాబు చెప్పే ముందు మీరు అసలు తెలుగు భాషలో భార తము వంటి గ్రంథము పని పెట్టుకొని చెప్పడమనేదే అప్పటి పూర్వాచార పరాయణులకు ఎంత హాస్యాస్పదముగా ఉండేదో కాస్త ఊహించుకోవలె. ఇప్పటికి ఇంచుమించు వెయ్యి సంవత్సరాలబట్టీ విద్వాంసులు కవిత్వము చెప్పి పండిత పామరులను మెప్పించినారు గదా! కాని ఇప్పటికి కూడా కేవల సంస్కృత పండితులకు తెలుగు కవిత్వమంటే ఎంత నిరసన భావ ముంటుందో తెలుసునా? అటువంటివారిలో, తెలుగు వారితో తెలుగు కవి త్వము సంగతి ప్రస్తావిస్తే వాళ్ళేమంటారో తెలుసునా? "మాకు తెలుగు:లలో అంత ప్రవేశము లేదండీ" అంటారు, ఇంగ్లీషు చదువుకొన్న కొందరు "మేము తెలుగులో వ్రాయలే" మని అంటున్నట్లు, ఆ సంస్కృత పండి తుల దృష్టిలో తెనుగు కవిత్వయోగ్యమైన భాషకాదు. చివరకు అది 'తెనుగు' కూడా కాదు. "తెలుగులు!" నిత్య బహువచనము—మినుములు, పెసలు వలెనే అదిన్నీ.

కాళిదాసాదులు కూడా ఆదరించక తప్పక పోయిన ప్రాకృతాన్నే పూర్వ పండితులు 'అపభ్రంశము' అన్నారు - గ్రామ్యమన్నట్లు. ఒక ప్రాకృతాన్ని 'పైశాచి' అన్నారు. ఇక తెలుగో! ఆ అపభ్రంశానికి అపభ్రంశము కొంత, పైశాచికి వికృతికొంతా, సంస్కారహీనమయిన - అంటే సంస్కృతముకాని - అచ్చ తెలుగు కొంతా ఈ భాషలో కలిసింది. ఈ పనికి మాలిన తెలుగు భాషలో మహాభారతమువంటి ఉద్గ్రంథము రసవంతముగా వ్రాయడానికి ఉపక్రమించి నాడంటే నన్నయ దెంత సాహసము! అప్పటి కాలములోని అచ్చసనాతనులు నన్నయ భట్టును భ్రష్ట బ్రాహ్మణుణ్ణిగానో, చదువురాని నవనాగరికపు కవిగానో భావించి ఉంటారు. ఇంత ఎందుకు? ఆయన రాజాశ్రయము సంపాదించి తెలుగులో కూడా పుస్తకము వ్రాస్తున్నాడంటే - ఇప్పటి కాలపు కవిత్వము చదవకుండానే, కవులు ఎవరో తెలియకుండానే, హేళనచేసే పూర్వ పండితులూ పండితమ్మన్యులూ లేరూ? - అట్లాగే ఆ కాలపు పెద్దలు నన్నయ భట్టును ఏమని హేళన చేశారో? వ్యాస మహర్షి చెప్పిన మహాభారతము తెలుగులో రసవంతంగా వ్రాస్తాడట ఈ బ్రాహ్మడు!

ఏమయితే ఏమి? ఆ బ్రాహ్మడు పురాణాలు తెలిగించే భాషనే నిరాఘాటంగా కొంతకాలముపాటు సాగిపోయింది. రైళ్ళూ విమానాలూ వంటి రయ సాధనాలు లేని ఆ పూర్వపు రోజులలో భాషన్ను కూడా ఇప్పుడంత తొందర తొందరగా మారేవి కావనుకొంటాను. ఇట్లా ఉండగా శ్రీనాధుడు పురాణాలతో పాటు నైషధీయ చరితము కూడా తెలుగు చేశాడు. దానితో కవుల దృష్టి సంస్కృత కావ్యాలమీదికి మళ్ళింది. అట్లాగే శిశుపాలవధ, కిరాతార్జునీయము, మేఘదూతము, కుమారసంభవము మొదలైనవన్ని అప్పటి కాలపు కవులు తర్జుమా చేసి ఉంటారు.

ఇంతలోకే ఈ తర్జుమా లెందుకు? ఇతివృత్తము కాస్త పూర్వపుది పెట్టుకుని మనమే స్వతంత్రంగా సంస్కృత కవులవలె కావ్యాలు వ్రాసేద్దామని ఎవరికో ఒకరికి బుద్ధిపుట్టింది. ఎవరికి ఆ బుద్ధి ముందు పుట్టిందో చెప్పలేము కాని తెలుగు దేశములో ఈ రకము కావ్యాలు ఫాషను చేసినది పెద్దన్న; వీటికి ప్రబంధాలని పేరు రావడము కూడా ఒక ఫేషనే.

ఈ ప్రబంధాల్లో శ్లేషపద్యాలు చేర్చి ప్రతి పద్యాన్నీ సానలు దీరిన జాతిరత్నంగా చేస్తూ రామరాజభూషణుడు వసుచరిత్ర చెప్పి శ్లేష కవిత్వము ఫాషనులోనికి తెచ్చినాడు. అందుమీద పిల్ల వసుచరిత్రలు పుట్టుకు వచ్చినవి!

భట్టుమూర్తి వ్రాసిన పుస్తకాన్ని మించ వలెనని పింగళి సూరన రాఘవ పాండవీయము వ్రాసి ఒక్క కావ్యములో రెండు కథలు రెండెడ్ల బండీవలె నడిపించే కొత్త ఫాషను - కాదు, అది రెండు బళ్ళకు ఒంటెద్దు కట్టి నడిపించే ఫాషను - తెచ్చినాడు. అక్కడనుంచీ నలయాదవ రాఘవ పాండవీయాలు వగైరాలు ఒంటెద్దుకు నాలుగు బళ్ళూ, ఐదు బళ్ళూ కట్టి తోలడము సాగించారు.

ఇది ఇట్లా ఉండగా, ఒక పనిలేని కవికి అచ్చ తెనుగు కావ్యము వ్రాయవలెనని బుద్ధి పుట్టి వ్రాస్తే ఇంకొకడు నిరోష్ఠ్య కావ్యము వ్రాశాడు. ఇట్లా ఎవరి ఊహకొద్దీ వాళ్ళు కొత్తకొత్త ఫాషన్లు తెలుగు కవిత్వములో వెదజల్ల సాగినారు. ఇదంతా "భవికవుల" సంగతి!

ఈ రకంగా "భవికవు" లంతా కవిత్వ సంసార సాగరములో పడి తన్నుకులాడుతూ ఉంటే "శివకవులు" వారి దోవను వారు కొత్త ఫాషన్లు కవిత్వములోకి తీసుకురా మొదలు పెట్టినారు. సోమనాథుడు బసవ పురాణము ద్విపద కావ్యముగా జాను తెనుగులో వ్రాసినది మొదలుకొని శివ కవులకు తెలుగులో ద్విపద, సంస్కృత పురాణాలలో అనుష్టుభుకు పర్యాయమై పోయింది. వీళ్ళు ఇంకా ఎన్నెన్ని రకాలవో పదాలు, పాటలు ఫాషను చేసినారు. అవి చాలా భాగము కాలగర్భములో అంతరించినవి.

తిక్కన సోమయాజికి ఆయన పితృదేవతను ముందు పెట్టుకొని హరిహరనాథుడు ప్రత్యక్షమై భారతము పూర్తి చేయమన్నాడు. భక్తాగ్రేసరుడైన పోతన్న గోదావరిలో గ్రహణస్నానము చేసి ఉంటే దివాస్వప్నములో శ్రీరామచంద్ర మూర్తి ప్రత్యక్షమై భాగవతము తెలుగులో వ్రాయమన్నాడు. తరువాత కొద్దికాలానికే కళింగ యాత్రకు పోతున్న కృష్ణ దేవరాయలకు శ్రీకాకుళనాథుడు స్వప్నములో సాక్షాత్కరించి శ్రీ వేంకటేశ్వరుని పేర ఆముక్తమాల్యద వ్రాయమన్నాడు. అప్పకవికి

కృష్ణాష్టమినాటి రాత్రి కామేపల్లి చక్రపాణి కలలో కనబడి చెప్పి మర్నా టికి మతంగనివాసిఅయిన బ్రాహ్మణుని ద్వారా అయిదు వందల సంవత్సరాల నాడు పోయిన పుస్తకము పంపించినాడు! అప్పకవికి కలలో కృష్ణుడు చెప్పినమాటలు అసందర్భంగా ఉన్నవని మన 'నవ్యవిమర్శకులు' అంటున్నారు కాని అప్రస్తుతము. ఇక కంకంటి పాపరాజుకు భగవంతుడు ప్రత్యక్షమై ఉత్తర రామాయణము వ్రాయమన్నాడు. "నావిష్ణుః పృథివీపతిః" అన్నట్లు 'నాభక్తః కవిశేఖరాత్' అని వాడుకలోనికి వచ్చిఉంటుంది. ఇక ఆ పైని తాము వ్రాసిన కావ్యము కృతి పొందడానికి సిద్ధపడ్డ ప్రభువులూ, మంత్రులూ దండనాథులూ దొరకని ప్రతికవికీ భగవంతుడు కలలో ప్రత్యక్షమై తనపేర పుస్తకాలు వ్రాయించుకొన్నాడు. దీన్నిబట్టి భగవంతుడికి తెనుగుభాషమీద ఎంత అభిమానమో ఋజువు అవుతుంది! ఇక చివరకు నా పద్నాలుగో ఏటనో పదిహేనో ఏటనో నేను వ్రాయప్రారంభించిన ప్రబంధము కూడా విష్ణుమూర్తి కోరికవల్ల ఆయనకే అంకితము చేసినట్లు జ్ఞాపకము. "ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్" నాకెందుకు అనుకున్నాను. ఆ ప్రబంధము అంకితము పుచ్చుకోడానికి అంతకంటె తెలివిమాలినవాడు నా కప్పట్లో దొరకలేదు! ఆ ప్రబంధము ఏది అని ఎవరయినా అడుగుతారేమో! శ్రీ శివశంకరశాస్త్రి నాచేత ఒక చిన్న ఏకాహము చేయించారు. అందులో ఆయనే స్వయంగా హోతగా ఉండి ఆ ప్రబంధము అగ్నిహోత్రుడికి అహుతి చేయించి, హవ్యవాహుడిద్వారా శ్రీ మహా విష్ణువు తిరుహస్తాలకు అందేట్లు చేసినారు. ఆ ప్రబంధము పేరూ, ఇతివృత్తమూ మరచిపోయినాను.

ఆధునికులలో కొక్కొండ వెంకటరత్నం పంతులు, వేదము వెంకటరాయశాస్త్రి, వాసుదాసు, వసురాయకవి, తిరుపతి శాస్త్రి ప్రభృతులు ఎన్నో ఫాషన్లు తెచ్చినారు. ఆయితే వారిలో తిరుపతి వెంకటేశ్వరులు పూర్వాంధ్రకవిశిఖామణులలో చివరివారనీ, నవ్యాంధ్రకవులలో మొదటివారనీ నా ఉద్దేశము. వారు అవధానాలు ఫాషను చేసిన సంగతి జగద్విదితముగదా! ఇంక జంటకవిత్వ మొకటి వారు తెచ్చిన ఫాషనే. రామకృష్ణకవులు, వెంకట పార్వతీశ్వర కవులు, కొప్పరపుకవులు, శంకర దీక్షి

తులు (అంటేచింతా భీమవంకరము, చింతా దీక్షితులు) సత్యాంజనేయులు (అంటే విశ్వనాధసత్యనారాయణ, కొండాలిఆంజనేయులు) శేషాద్రిరమణ కవులు, పింగళి లక్ష్మికాంతం, కాటూరి వెంకటేశ్వరరావులు ఇంకా ఎంత మందో లెక్కలేదు. వెంకట శాస్త్రిగారు తెలుగు పద్యాలు చక్కగా చదివే కొత్త పద్ధతికూడా ఒకటి ఫాషనులోకి తెచ్చినారు. ఇది ఇప్పటికీ తెలుగు దేశమంతా వ్యాపించే ఉన్నది.

ఈ సందర్భములో కొప్పరపు సోదర కవులు తెచ్చిన ఫాషను చెప్పడం మరవరాదు. వారు ఆశుధార చెప్పుతూ దేశములో సంచారము చేసిన మొదటి రోజులలో వారెంత పండితాదరము గడించారో చిన్న వాళ్ళకు చాలామందికి తెలియక పోవచ్చును. వారు మొదటిసారి గుంటూరు వచ్చినప్పుడు నాకు పది పదకొండేళ్ళు ఉంటవి అనుకొంటాను. నేను సభకు వెళ్ళలేదు. అయితే సంస్కృతాంధ్ర పండితులైన మానాన్న గారు ఆ సభకు వెళ్ళివచ్చి ఇంట్లో వారిని మెచ్చుకొంటూ అన్నమాటలు నా కిప్పటికీ జ్ఞాపకమున్నవి. చాలాసేపు పరిపరి విధాల మెచ్చుకొని చివరకు సాక్షాత్తు రామకృష్ణులే అవతరించి వచ్చినారని అన్నారు! వారు ఫాషనులోకి తెచ్చిన ఆశుకవిత్వముతో పూర్వాంధ్ర కవిత్వము అంతరించినది.

### ఇక నవ్యాంధ్ర కవిత్వములో ఫాషన్లు :

నవ్యాంధ్రకవిత్వము రాయప్రోలు సుబ్బారావు గారు 1913 వ సంవత్సరములో 'తృణకంకణము' ప్రకటించడముతో ప్రారంభమైనదని అస్మదాదుల మతము. దాని ప్రకాశకులు తమ పీఠికలో ఇట్లన్నారు;

"మన భాషయందలి కావ్యప్రపంచమును శాసించిన లాక్షణికులు కవిత్వమునకు పాత్రములగు విషయములకు సైతము నను ల్లంఘ్యమగు ప్రహరి నిర్మించి విడిచినందున పాశ్చాత్యాదర్శముల ప్రోద్బలము దొరకునంతవరకు మన కవులు పాడిన పాటలనే పాడవలసినవారైరి..."

"కాలప్రభావమున నట్టివి భూగర్భమునుండి వెలికిదీయబడి గత కాలపుం జరిత్రసరణిందెలుప నుపయుక్తంబు లగుటకయి వస్తుప్రదర్శ నాగారముల నిలుపబడు విగ్రహముల గతిం జెందుస్థితి నుండుట యొక కొన్ని కారణంబులచే విషాదకరంబె..."

"లాక్షణికులు మాత్రము సర్వాధికార ధూర్వహులుకారు; సాధారణముగ భాషా సాంప్రదాయముల లక్ష్యమున నుంచుకొని కవులు తమ రచనల సర్వస్వతంత్రులయి మెలగిరి.... ..".

నవీన మార్గరచనలలో ముఖ్యమయినది 'లిరిక్' అను ఆంగ్లేయ రచనకు సరివచ్చు 'భావగీతము'. కవి తనకు సురచిరమగు నొక భావమును గొని అందు తన హృదయము నిమిడ్చి రచించు. ఇందు కథయు వర్ణనలు నుపాంగములు. పెరవైపులకు జింతఁ౦బరపి యల్లుట యనవసరంబగుట నీవిధ రచనల కవిహృదయ మొక్కవిషయంబున కేంద్రీకృతమయి మిక్కిలి యాహ్లాదకరంబగును.

"దైవనియతిం బ్రసక్తమైన 'నిర్గత ప్రణయము' విశుద్ధప్రేమముగా ప్రతిఫలించు 'ప్రకృతిరహస్యమే' ఇందు వర్ణింపబడినది." ఈ మాటలు ఇంత విరివిగా ఉదాహరించడమునకు కారణమున్నది.

తృణకంకణము, కష్టకమల, స్నేహలతాదేవి, తెనుగుతోట, స్వప్నకుమారము 1913-1914 సంవత్సరాలలో ప్రకటించినారు. అందులో 'తృణకంకణము' అభినవ కవితామండలి ప్రకటించినట్లు లేకపోయినా 'కష్టకమల' సూచికలో ఆ మండలివారు తృణకంకణము కూడా తమదే అని, అది ద్వితీయ ప్రచురణమనుటలో సూచించినారు. అంతకునుపటి 'లలిత'ను ఉదాహరించలేదు.

నా కప్పుడు 12, 13 ఏళ్ళు కాబట్టి, నేనప్పుడు ప్రబంధయుగములో ఉన్నందువల్లా ఆ ప్రచురణలు నాదృష్టిలోకి రాలేదు. అయితే శ్రీ శివశంకరశాస్త్రితో స్నేహమయిన తరువాత 1917 లో వాటికోసము ప్రత్యేకము బెజవాడవెళ్ళి రామమోహన గ్రంథాలయములో చదివినాను. నాకా పుస్తకాలు దొరకడము పేదకు పెన్నిధి దొరికినట్లయింది. ఇంతటి కవి తెలుగుదేశములో పుట్టినాడా అనిపించింది. ముఖ్యంగా అందులో తెలుగు తోట ఎన్నిసార్లు చదివినానో చెప్పలేను. ఆధునిక కవులలో రాయప్రోలు వారి గ్రంథాలతో ముగ్ధులు కానివాళ్లు ఎవరూ లేరనడము అతిశయోక్తి కాదు.

అంతకుమునుపే నవ్యకవిత్వము ఉన్నా అది ప్రచారములోకి తెచ్చి ఘోషనులోకి తెచ్చినది మొదట రాయప్రోలువారే. తృణకంకణ పీఠిక ప్రకాశకులు వ్రాసినట్లున్నా సుబ్బారావుగారేనో, వారి మిత్రులలో ఎవరో ఒకరు వారి ఊహలకు అనుగుణముగానో వ్రాసినారని నా నమ్మకము. కాబట్టి దాని బాధ్యత వారిదే.

అందులో నుంచి పైని ఉదహరించిన వాక్యాలవల్ల నవ్యకవుల లక్షణాలు స్పష్టపడతవి.

అందులో మొదటిది లాక్షణికులమీద దండయాత్ర. పాశ్చాత్య కవిత్వ పద్ధతుల మీద ఆదరము. పూర్వకవిత్వము మీద నిరసన లేక పోయినా నిరసనమువలె స్థూలదృష్టికి కనపడే మాటలు వాడడము, ఆధునికుల మీద అభిమానము. కవుల నిరంకుశత్వము ఉద్ఘాటించడము ఇంతేకాదు. నవ్యకవిత్వ మిత్రులు కొందరూ, శత్రువు లందరునూ నేటి కవిత్వాన్ని 'భావ కవిత్వము' అంటున్నారు. ఆ మాట వాడకపోయినా ఆ పీఠికలో 'Lyric' అనే పదాన్ని 'భావగీతము' అని అనువదించి 'భావ కవిత్వము' అనే పదానికి మార్గదర్శకులైనారు. మళ్ళీ 'కష్ట కమల' సూచికలో 'మే మీ నవ్యకవితా ప్రచారమునకు ముందడుగు మోపినప్పటి నుండియు వలయు ప్రోత్సాహ గౌరవము లబ్ధినందుల కెంతయు సంతసించుచున్నాము' అని ప్రకాశకులు వ్రాసినారు. కాబట్టి వారే 'నవ్యకవిత' అనే నామము వాడినారు. అందులోనే 'భావపరిచయము' అనే శబ్దమువాడి 'భావము' మీద ప్రత్యేకాభిమానము చూపినారు. తెనుగుతోటలో 'పాడుమమ్మ గీతాసఖీ భావపదము' అనే పాదము 9సార్లు ఉచ్చరించి గీతా సఖ్యము చేసినారు.

నవ్య కవులకు ప్రణయము, ప్రకృతి, వాటి రహస్యాలూ చాలా ఇష్టమైనవని మీకు తెలుసును. పైని ఉదహరించిన వాటిలో చివర మాటలు మళ్ళీ ఎత్తి వ్రాస్తున్నాను. 'దైవనియతిం బ్రసక్తమైన నిర్గత వ్రణయము ....' ఇందు వర్ణింపబడినది.

నేటి కవిత్వము అర్థముకాదు; అందుకే అది అభావ కవిత్వమని ప్రతిపక్షు లంటున్నారు. అందులో కూడా కొంత సత్యము లేకపోలేదు.

పై వాక్యానికి ఎవరైనా అర్థము చెప్పండి! తృణ కంకణము చదివిన తరవాత ఆ కథను బట్టి ఆ వాక్యము అర్థము ఊహించ వలసినదే కాని ఊరికే ఆ వాక్యము అర్థము కాదు.

నవ్య కవులలో ఇంకో ఘోషను ఉన్నది. ద్వివచనములో గాని బహువచనములో గాని సభ్యులు లేకుండానే కవితా మండలి స్థాపించడ మునకు కూడా వారే ప్రథములను కొంటాను.

నవ్య కవులకు ప్రత్యేకమైన కవితా సామగ్రి ఉన్నదని అందరికీ తెలుసును ఈ మధ్య అతి నవ్యకవులు (Ultra-moderns) తెస్తున్న సామాగ్రి మాత్రము ఆయనకు తెలియదు కాని, మిగతా నవ్యకవుల కవితా సామగ్రి అంతా రాయప్రోలు వారే మొదట ఘోషనులోకి తెచ్చి నారు ఈ కవితాసామగ్రిలో మొదటిది భావాలు. తర్వాతది ప్రణయము. మూడోది ప్రకృతి. దాని వెంబడి ఇంకా ఎన్నో ఉన్నవి. కోయిల ఒకటి. కోయిలమీద పద్యాలు వ్రాయని నవ్య కవి లేడు. ఇక నీరదకుమారులు కుమార హరిణులు, కవికుమారులు, మాధుకర కుమారులు, బ్రాహ్మణ కుమారి, లేగొల్ల కొమిరె - ఇన్ని ఎందుకు! కుమార శబ్దము ఎన్నిచోట్ల వాడవచ్చునో అన్ని చోట్లా వారు వాడివేసినారు. ఇంత కవితా సామగ్రి లోని పూదోటలు, మావి ఇగుళ్ళు, శిరీషపుష్పాలు, మధువు, లతలు, కన్నెలు, రాధ, కృష్ణుడు – ఇవన్నీ రాయప్రోలు వారు తెచ్చిన ఘోష నులే. నవ్యకవులకు 'షెల్లీ' మీద అభిమానము. ఘోషను చేసినది కూడా వారే. చివరకు మాటలన్నీ అర్థమైనా భావము గోచరించకుండా చెప్పే కవిత్వముకు కూడా వారే అక్కడక్కడ దారి చూపించినారు. వారి తెనుగు తోట అనే కావ్యము నాకు అభిమానమైనది. అందులో పూర్తిగా తేట గీతి వాడినారు. తేటగీతిలో ఉన్న సొగసు అంతా వారందులో చూపించి నారు. 'ఆధునిక కవిత్వమంటే తేట గీతాలు వ్రాయడమా?' అని మా నాన్న గారు అడిగేవారు. ఆ ప్రశ్న తోచినది మా నాన్న గారికి ఒక్కరికే కాదనుకుంటాను. నవల అంటే ముందు బాటసారిని వర్ణించడమని అయి పోయినట్టు నవ్య కవిత్వమంటే కొంతకాలము తేటగీతి వ్రాయడమయి పోయింది.

తేటగీతి అనేటప్పటికి వెంకట పార్వతీశ్వర కవులు వెంటనే జ్ఞప్తికి వస్తారు. వారి గీతాలు కూడా చాలామధురంగా ఉంటవి. అయితే వారు తేటగీతి రచనలో క్రొత్త ఫాషను తెచ్చినారు.

ఎంత ఆనంద మున్నదో ఎవరికెరుక
ఎంత సంతోష మున్నదో ఎవరికెరుక
ఎంత ఆహ్లాద మున్నదో ఎవరికెరుక
ఎంత ఆమోద మున్నదో ఎవరికెరుక
ఎంత హర్షంబదున్నదో ఎవరికెరుక.

ఈ విధంగా ఒక్కమాట మార్పుతో హాయిగా పంక్తులకు పంక్తులు, పేజీలకు పేజీలు పెరిగి పోయేటట్లు గీతాలల్లడము లోకానికి నేర్పినారు. ఇంకో పద్ధతి కూడా పద్యాల అల్లికలో తెచ్చినారు.

మధుర చంద్రికలలో మధురామృతంబు
మధురామృతంబులో మధురరసంబు
మధుర రసంబులో మధుర భావంబు
మధుర భావంబులో మధురరూపంబు
మధుర రూపంబులో మధురతేజంబు ......

ఈ విధంగా అన్యోన్యాశ్రయమైన పదాలూ, ముక్త పదగ్రస్తాలూ ఫాషను చేసినారు.

వారు తమ 'ఏకాంత సేవలో' అవ్యక్త మాధుర్యము లోకములో వెదచల్లినారు. అర్థము మాత్రము నిలవదీసి అడగకూడదు. ఇంతలో 1920 లో సాహితిపత్రిక వచ్చింది. సాహితీ సమితిలో సభ్యులు ఒక్క శివ శంకర శాస్త్రి మాత్రమే కాదు. సమితి కవుల వల్లనే నవ్యకవిత్వానికి ఒక స్థైర్యము సమకూరింది అనడము అతిశయోక్తి కాదు. సమితి సభ్యులలో ఒకణ్ణి కాబట్టి సాహితీ సమితిని గూర్చి ఎక్కువ చెబితే రసవంత వంతముగా ఉండదేమో అని టూకీగా పోనిస్తాను. పూర్వాచారపరాయణు లైన మాడొమాండూరి కృష్ణమాచార్యులుగారు 'తాలింఖానా' కవిత్వము వాడుకలోక్కి తెచ్చినారు. ఆయన వలెనే ఆయన పద్యాలుకూడా మాంస

లంగా ఉంటవి. ఆయన ఆధునిక కవులందరివలె సన్నగాలికి ఎగిరి పోయేటట్లు ఉండరు. నాబోటి వాళ్ళు నలుగురు ఆయన చాటున దాక్కొని ఎంత ప్రభంజన ధాటి నుంచి అయినా తల దాచుకోవచ్చును. 'విరహోత్కంఠిత'లో —

"జరతాదిత్య మరీచికోజ్జ్వలములై
శైలాగ్రముల్ రంజిలెన్
సరసీజోదరబద్ధషట్పద లస
ఝ్ఝంకార గీతామృత
స్ఫురణన్ దుర్భరకర్ణతాప మొదవెన్
ఫుల్లాబ్జ పత్రేక్షణుం
డరుదేర దడవాయె మన్మథ ధను
ర్జ్యాఘోష మెట్లోర్చెదన్."

"విలసత్కోమల నీలమేఘ రుచితో
పీతాంబరాచ్ఛాదితో
జ్జ్వలదివ్యాంగముతో విశాలదృఢ వ
క్షః పీఠభాగంబుతో
బలభిద్వారణతుండదండ నిభమౌ
బాహుద్వయస్ఫూర్తితో
లలనా మన్మథు డేగుదెంచునని యే
లా వ్యర్థసంభావనల్."

ఇటువంటి పద్యాలు ఆధునిక కవులు వ్రాశారంటే త్వరగా నమ్మరు. ఆయన 'కుసుమాంజలి', 'హర్షచరిత్రము' అంతా ఇట్లాగే ఉంటవి. ఆయన నాయికలో! గాఢనితంబ భారలు, కుచకుంభ విజృంభణలు, పుంభావ క్రియాదక్షలు. అయితే ఏమి? ఆరోగ్యహీనులు ఎక్కువమంది ప్రబలు తున్న ఈ రోజులలో ఆయన తెచ్చిన ఫాషనులు నిలవడంలేదు.

ఇంతలో దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు మాలో చేరి కవిత్వములో 'ఏడుపు' ఒకటి ఫాషనులోకి తెచ్చారు. ఆయన సరిగ్గా కృష్ణమాచార్యుల

వారికి కవుంటర్పార్టు (Counter part). ఆయన 'కృష్ణపక్షము' ఎరగని వారెవరూ ఉండరు. అయితే దానికంటె ముందు 'కన్నీరు' అనే పుస్తకము వ్రాశారు. అందులో పాటలు సర్వసామాన్యంగా తెలుగుదేశంలో బ్రహ్మసమాజ మతస్థులు అంతా పాడుతూ ఉంటారు. అక్కడనుంచీ కవులంతా ప్రణయంతోపాటు ఏడుపుకూడా సాగించినారు. ఇప్పుడు కృష్ణశాస్త్రి చాలించినా ఇప్పటికి పత్రికలలో ఏడుపు వినబడుతూనే ఉంటుంది. పెద్దన్న ఏడ్చాడు, తిమ్మన్న ఏడ్చాడు, భట్టుమూర్తి ఏడ్చాడు, శ్రీనాథుడు ఏడ్చాడు. దేవులపల్లివారితోపాటు ఏడవని నవ్యకవి లేడు. కాని కృష్ణశాస్త్రిగారు అందులో స్పెషలిస్టు.

"మీరు మనసారగా నేడ్వనీరు నన్ను
నన్ను విడువుడు——
వెక్కి వెక్కి రోదింతును——
ఏడ్చెవైతు నెలుంగెత్తి ఏడ్చెవైతు" అన్నాడు.

విశ్వనాథ సత్యనారాయణగారు తెచ్చిన ఒకటి రెండు ఫాషన్లు చెప్పవలె. పద్యాలలో ఆముక్తమాల్యదలోవలె ఎక్కడివో మారుమూల పదాలు వాడడమే కాకుండా పద్యాల నడకలలో క్రొత్తపోకడలకు విశ్వనాథవారు పెట్టింది పేరు. సంస్కృతములో కంటె ఆంధ్రభాషలో ఉన్న ప్రత్యేకతే ఇది అని ఆయన మతము. ఆ సిద్ధాంతము సరియైన దనడానికి ఆయన్ని అనేక నవ్యకవులు అనుకరించడమే సాక్ష్యము.

ఇట్లా వీరంతా భావాలు ఎట్లాఉన్నా భాష మాత్రము గ్రాంథికభాష అనండి, కృతకభాష అనండి, ఆ భాషలో వ్రాస్తున్నారు. పూర్వాంధ్ర కవిత్వములో భవికవులతోపాటు శివకవులు ఉన్నట్టుగానే, ఇంకొకరకము కవిత్వముకూడా సుబ్బారావుగారి కవిత్వముతోబాటు బయలుదేరింది.

గురజాడ అప్పారావుగారు వ్యావహారికభాషలోకూడా సరసమైన కవిత్వము చెప్పవచ్చునని తమ పద్యాలవల్ల ఋజువు చేశారు. అందుకు వృత్తాలకంటె దేశీయమైన ఛందస్సులు అనుకూలమైనవని అవి వాడుకలోకి మొదట తెచ్చినారు. మన ఇళ్ళలో ప్రతి ముసలమ్మకూ వచ్చిన

'గుమ్మడేడే గోపిదేవీ' అనేపాట ఉన్నదే - అది ౧౪ మాత్రలుగల మాత్రాచ్ఛందస్సు-దానికి ముత్యాలసరమని పేరుపెట్టి తేటగీతికి కొత్త పోటీ తెచ్చినారు. వారు ఇంకా ఇతర మాత్రాచ్ఛందస్సులుకూడా వాడుక చేశారు.

అమ్మల గన్నా అమ్మల్లారా
విన్నారమ్మా ఈ కథనూ,
పూజారింటను పుట్టెను చిన్నది
పుత్తడిబొమ్మా పూర్ణమ్మా
కొండకి నడుమా కోనొకటున్నది
కోనకి నడుమా కొలనొకటున్నది
కొలనిమధ్యనూ కోవెలలోపల
వెలసెను బంగరు దుర్గమ్మా
ఆయావేళల పూసే పూవులు
ఆయావేళల అందిచ్చి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మా.

ఈ ధోరణిలోనే బసవరాజు అప్పారావుగారుకూడా పాటలు వ్రాయడం మొదలుపెట్టినాడు. చివరకు నండూరి సుబ్బారావుగారు వచ్చి శిష్ట వ్యవహారభాషలోనే కాక పనిపాటులు చేసుకొనే జనము మాట్లాడే భాషలో కూడా ఉత్తమ కవిత్వము చెప్పడము సాధ్యమవుతుందని 'యెంకిపాటల' వల్ల నిరూపించినారు. దానిమీద ఎన్ని గాలిదుమారాలు రేగినా, ఎవరెన్ని తిట్టినా అది నవ్యకవిత్వములో నిశ్చలంగా నిలిచిపోయింది. ఈ కొత్త ఫాషనులో ఎంతమందో 'కనికి' అనీ 'సీతీ' అనీ ఇంకా ఏమేమో పేర్లతో ముగ్ధనాయికలను సంబోధిస్తూ పాటలు అల్లడం సాగించినారు.

అప్పటినుంచీ శివకవిత్వమూ భవికవిత్వమూ ఏకమైనవి. ఈ నవ్య సాహిత్య పరిషత్తు వచ్చింది. అన్ని ఫాషనులలోకీ సరికొత్త ఫాషను శ్రీ. శ్రీ. తెచ్చినాడు. పాపము! రాయప్రోలు సుబ్బారావు గారు కష్టపడి చదివి ప్రబంధాల్లోనుంచి ఏరితెచ్చిన కవితా సామగ్రి అంతా దూరంగా

ఒక్కసారి గిరాటు పెట్టినాడు. క్రొత్తసామగ్రి అంతా Ultra modern కవిత్వములోనుంచి కొట్టుకు వస్తున్నాడు, అతని 'మహాప్రస్థానము'లో కుళ్ళిన ఎముకలు ఉష్ణరక్త కాసారము చూపి, 'శివరాత్రిప్రభ'లో పును కల గలగలలూ, అజకపాలం, డొక్కుడు బుడుబుక్, అశ్మరభలతో విని పించాడు. శ్రీ శ్రీ తెచ్చిన కవితాసామగ్రి ఆయన కావ్యాలలోంచి వెతికి చెప్పవలసిన అవసరం లేకుండా నవకవనానికి ఏయే సామగ్రికావాలో ఒక్కచోట కూర్చిపెట్టినాడు. 'నవకవిత' అనే కావ్యంలో—

'సిందూరం, రక్తచందనం
బంధూకం, సంధ్యారాగం
పులిచంపిన లేడినెత్తురూ
ఎగరేసిన ఎర్రజెండా
రుద్రాలిక నయన జ్వాలిక
కలకత్తా కాళిక నాలుక
కావాలోయ్ నవకవనానికి.

ఘాటెక్కిన గంధక ధూమం
పోటెత్తిన సప్తసముద్రాల్
రగులుకొనే రాక్షసిబొగ్గూ
బుగులుకొనే బుక్కాగుండా
వికసించిన విద్యుత్తేజం
చెలరేగిన జనసమ్మర్దం
కావాలోయ్ నవకవనానికి.

రాంబందుల రెక్కల చప్పుడు
పొగగొట్టపు భూంకారధ్వని
అరణ్యమున హరీంద్రగర్జన
పయోధర ప్రచండ ఘోషం
ఖడ్గమృగోదగ్రవిరావం
ఝంఝూనిలషడ్జధ్వానం
కావాలోయ్ నవకవనానికి.

గణపతిశాస్త్రి నవ్వుతూ ఇది 'శ్మశాన కవిత్వం' అన్నాడు. శ్రీశ్రీని మించుతూ శ్రీరంగం నారాయణబాబు 'రుధిరజ్యోతి' అనే కావ్యమాల వ్రాస్తున్నట్టున్నాడు. వారి 'దేశమాత'లో—

'ఎండాకాలం
పగళ్ళు నెగళ్ళు
మండే రోడ్డు
కాలం కాలిన గుడ్డపేలికై
ధూళి రేగినది.
...........
వీథికాలువను బురదనీటిలో
విశ్రమించిన శ్వనాధు డొక్కడు.......'

'సంక్రాంతి పండుగనాడు' అనే కావ్యములో

'కాలిన ప్రేయసి దేహం
చమురుకంపు ఈ లోకం'

అన్నాడు.

'కపాలమోక్షం' అనే కావ్యంలో

'భూతపిశాచాల్ బొబ్బరిల్లినవి
.................................
తురకల గోరిలందూ
క్రైస్తవుల సమాధులలోనూ
హిందూ శ్మశానవాటుల
కపాలమ్ములు వికవిక నవ్వినవి
పుఱికలు పులకరించినవి
కంకాళమ్ములు ఘల్లున మ్రోగినవి
.................................
కపాలమోక్షం! కపాలమోక్షం!!'

ఇంతలో దేశిరాజు కృష్ణశర్మ 'దయ్యాలపెళ్ళి' చేస్తూ—

'అర్ధరాత్తిరి అడివిమార్గం
అవులించిన అంధలోకం' అని
'దయ్యాలు భూతాలు ప్రేతపిశాచాలు
శాకినులు ఢాకినులు కామినులు భైరవులు
బ్రహ్మరాక్షసి తండ్రి భ్రూణహత్యలతల్లి'

వీళ్ల చేత

'హెహేభాయి హాహాభాయి అహోహం, ఒహోహం,'
అనిపించాడు.

'భవిష్యత్తు'లో—

"చింతల్ల తోపులో జీర్ణించె తొలిపొద్దు
ముండ్లలో పొదలలో రొదతోడి సొదలలో
గుబురుకొన్నది కోర్కె కుమిలిపోయెను తెలివి
వల్లకాడునపుర్రె పాటపాడింది." అన్నాడు.

ఎంత పూర్వాచార పరాయణులు కూడా ఇది కవిత్వమనక తప్పదు. ఈ బీభత్సమంతా ఏమిటని అంటారు. అయితే ఆలంకారికు లందరూ రసాలు ఎనిమిదన్నా, తొమ్మిదన్నా, పదన్నా అందులో బీభత్సరసము కూడా ఒకటి అని అంగీకరించారుగా! ఇంతమందినీ చెప్పి రుక్మిణీనాథ శాస్త్రి తెస్తున్న ఫాషను చెప్పకపోతే అతనికి కోపంవస్తుంది. అతనూ ఈ బీభత్స కవిత్వం కొంత వ్రాశాడు. దానితోపాటు అతను ఆధునిక కవుల Parody లు వ్రాశాడు. అనగా అచ్చతెలుగులో చెప్పవలసివస్తే కోతి కొక్కిరాయకవిత్వ మన్నమాట. ఇతరుల కవిత్వాన్ని వెక్కిరిస్తూ అను కరణ పద్యాలు వ్రాసేదీ, వాళ్ళెవరైనా పది అంటే మళ్ళీ నలభై పెట్టేది. అందులో అతను బాకీ ఏ మాత్రమూ ఉంచుకోడు.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు ఈ మధ్య సామ్యవాదులను టోపీవేయ డానికి కొత్తఫాషను తెస్తున్నారు. అది 'ఆకలి.' వారు 'ఊర్వశి'ని విడిచి 'ప్రవాసము' చేసి ఇప్పుడు 'ఆకలి' చేపట్టినారు.

అయితే ఇంతమంది ఇన్నిఫాషనులు తెస్తే సాహితీసమితి సభ్యుడ వైన నీవేమి ఫేషను తెచ్చినావని నన్నడుగుతారేమో! నేనిప్పటికి ఏ ఫాషనూ తీసుకురాలేదు. కాని ఒక్కటిమాత్రము ఫాషను చేయాలని ప్రయ

త్నిస్తున్నాను. నేను వేదాలంటే, శాస్త్రాలంటే చెప్పుకోలేదు. కాబట్టి నాకు వాటిమీద ప్రమాణబుద్ధి ఎక్కువ. ఈ ప్రమాణబుద్ధి, అంటే సనాతనత్వము ఫాషను చేయవలెనని ప్రయత్నిస్తున్నాను. ఎదురీతగా ఉన్నది. ఈ నవనాగరపుఫాషను లన్నీ పోగా పోగా కొన్నాళ్ళకు ఈ ప్రమాణబుద్ధి మాత్రం ఫాషనుకాదా అని నాఆశ. నవనాగరికులకు మొదట వెలమవారి మీసాలు, తరువాత తిరుపతి వెంకటేశ్వరుల కత్తెరమీసాలుగా మార్చి వాటిని కత్తిరించి కత్తిరించి, కోసి కోసి, చివరకు ఇప్పుడుమొత్తముమీద శుద్ధ శ్రోత్రియమైన Clear Shave ఫాషనులోకి రాలేదా? అట్లాగే ప్రమాణ బుద్ధి మాత్రము ఏ కాలానికో ఫాషను కాక పోతుందా?

కవిత్వమంటే కొత్తకొత్త ఫాషనులు తీసుకురావడమేనా! ఎన్ని ఫాషనులు మారినా నిశ్చలంగా ఉండేధర్మము ఏదైనా ఒకటి కవిత్వా నికి ఉన్నదా! అటువంటి ధర్మం ఉన్నదంటే యెవరి కవిత్వములో యెంత ఉన్నది?

పాశ్చాత్య దేశాలలో ఏదోఒక కొత్తఫాషను తెస్తేనేకాని పుస్తకం బాగా అమ్మకముకాదు. పుస్తకం అమ్మకము కాకపోతే కవికి జీవనోపాధి ఉండదు. కాబట్టి ప్రతికవీ ఏదో ఒకటి కొత్తది సమకూర్చాలి. రసవం తంగా చెప్పినాడా లేదా అని కాదు వారు వేసేప్రశ్న. ఏమి కొత్తది అమర్చినాడు? అని ప్రశ్నిస్తారు. అందువల్ల నవనాగరికులు పాదాలతో నడవడం చాలించి పాదరక్షలతో నడుస్తూఉంటే అతి నవనాగరికులు తల క్రిందా కాళ్ళు పైనాపెట్టి శీర్షాసనంతో నడవవలసి వస్తున్నది. వాళ్ళేదో పుస్తకాల అమ్మకము కోసము, ఏదోవిధంగా కొత్తకోసము దేవులాడుకో వలె. అయితే మన అదృష్టంచేత మనకా కర్మంలేదుగా! మనము వ్రాసే పుస్తకాలు విరివిగా కొనేవాళ్ళు మనదేశములో లేరు. కొత్తగావ్రాసినా పాతగావ్రాసినా, మెచ్చుకొన్నా తిట్టినా, మనకవులు వ్రాసే పుస్తకాలు ఖర్చు కావు. వేరే జీవనోపాధి లేకపోతే పస్తు పడుకోవలసిందే. ఇంత మంది నవ్యకవులు తమ పుస్తకాలు అచ్చువేసినారు గదా! ఒక్కరైనా అచ్చుఖరీదు పుస్తకాల అమ్మకమువల్ల వసూలు చేశారూ ?

ఎట్లావ్రాసినా తొననిదానికి ఈ అవస్థ లెందుకు? అవసరములేక పోయినా నూతనత్వముకోసము దేవులాడడ మెందుకు? కవిత్వములో జీవమనండి, రసమనండి, అది ఉంటే చాలదా?

(ప్రతిభ జనవరి - ఏప్రియల్ 1939)

# దేశానికి ఆంధ్రుల కానుక
# తెలుగు మహాభారతము

నారాయణం నమస్కృత్య
నరంచైవ నరోత్తమమ్
దేవీం సరస్వతీం వాచం
తతో జయ ముదీరయేత్॥

ఇప్పటికి రమారమి రెండువేల సంవత్సరముల నుండి మహాభారతము ఆసేతు హిమాచల మధ్యస్థమైన యావద్భారత ధర్మమును సంపూర్ణముగా ప్రతిబింబించు నిరుపమాన గ్రంథముగా విరాజిల్లుచున్నది. వేద వేదాంతములలో సంశయగ్రస్తమైన భాగములను విశదీకరించు ప్రమాణభూతమగు గ్రంథమిది యొక్కటే. వేదధర్మమునకు సూటిగా అందని బహుకాలముల, బహుదేశముల ఆచారవ్యవహారములను అది వేద ధర్మానుకూలముగా సమన్వయము చేయుచున్నది. అది ధర్మశాస్త్రము, వేదాంతము, నీతిశాస్త్రము, సర్వలక్ష్యసంగ్రహము, ఇతిహాసము, బహుపురాణసముచ్చయము— అంతేకాదు మహాకావ్యము. అది విజ్ఞానసర్వస్వము. అందువలననే పెద్దలు మహాభారతములో లేనిది మరి యెక్కడను లేదని నుడువు చున్నారు. పూర్వమేకాక నేడుకూడా కార్యాకార్య విషయములో సందేహము కలిగినపుడు మహాభారతవిజ్ఞానము మనకు సరియగు మార్గము నిర్దేశింపగలుగుచున్నది. ముందును చేయగలదు.

మహాభారతమునకు 'జయ' మనునది ప్రథమ నామము. కౌరవ పాండవులకు కురుక్షేత్రములో జరిగిన మహాసంగ్రామములో శ్రీకృష్ణభగవానుడు ధర్మిష్ఠమైన పాండవ పక్షము వహించి ధర్మజునికి సాధించిన ధర్మజయమును వర్ణించునదీ మహాగ్రంథము. ఈ రూపముగా అంతశ్శత్రువులను జయించు మార్గముకూడ ఇందులో ప్రవచింపబడియుండుట

చేత జయనామము సర్వవిధముల సార్థకమైనది. ఈ సంగ్రామము సంప్రదాయగణన ప్రకారం 5099 సం॥ల క్రిందట జరిగినది. నేటి పరిశోధకులు 1, 2 వేల సంవత్సరములు తగ్గించి గణించుచున్నారు.

ఈ మహాగ్రంథమునకు ఉత్తర దేశపాఠము, దక్షిణ దేశపాఠము అని రెండు ప్రధాన పాఠభేదములు కలవు ఉత్తర పాఠమునకు శారదా, నేపాళ, మైథిలీ, వంగ, దేవనాగరి లిపులలోని ప్రతులును; దక్షిణ పాఠమునకు ఆంధ్ర, గ్రంథ, మళయాళ లిపులలోని ప్రతులును మూలభూతములు. అవికూడ ఒకదానితో ఒకటి పూర్తిగా కలియుటలేదు. వీనికితోడు జావాద్వీప పాఠమొకటియు బహు ప్రాచీనమైనది లభ్యమైనది.

ముద్రిత ప్రతులలో ఆంధ్ర దేశములో ప్రభాకర ముద్రాక్షరశాల వారు ప్రకటించిన పాత ప్రతియు, వావిళ్ళవారు దాని ననుసరించి వేసినదియు రెండు తెలుగు లిపిలో ప్రచారములో నున్నవి. దేవనాగరిలిపిలో వావిళ్ళవారి దొకటి. కుంభకోణము పండితులు పరిష్కరించిన దొకటి. పూనాలో ప్రచురించిన దొకటి. కలకత్తావారు వేసిన దొకటి కలవు. ఈ మధ్యనే గోరఖ్‌పూర్, గీతా ప్రెస్సువారు అందరికి అందుబాటులో నుండునట్లు ఇంకొక మంచి ప్రతి ప్రచురించినారు. ఇవన్నియు గాక భండార్కరు ఇన్‌స్టిట్యూటువారు పండితులను సమకూర్చి అన్ని పాఠములు సేకరించి సరియైన పాఠము నిర్ధారణ చేయుచు ఇతర పాఠములన్నియు కూడ చూపుచు మహాగ్రంథమొకటి ప్రచురించుచున్నారు. ముద్రిత ప్రతులేవియు కేవలము ఉత్తర దక్షిణ పాఠములలో ఒకదానినే అనుసరించినవి కావు.

మహాభారత పర్వాంత గద్యలలో 'శతసహస్ర్యాం సంహితాయాం' అని కనబడు చున్నది. కాని ఏ పాఠము లోను లక్ష శ్లోకములు లేవు. ముప్పదిరెండు అక్షరములు ఒక గ్రంథముగా పరిగణించి లెక్క వేసినచో అది లక్షగ్రంథము కావచ్చును.

ఈ జయకావ్యమును వ్యాసభగవానుడు సరస్వతీ నదీతీరములో నున్న బదరికాశ్రమములో మూడు సంవత్సరములపాటు ధ్యాననిష్ఠుడై

యుండి తన విజ్ఞాన దర్పణముతో దర్శించిన రీతిగా నిర్మించెనట. సర్ప సత్ర సందర్భములో జనమేజయునకు వైశంపాయను డీ గ్రంథము నుప దేశించెను. ఆ విశేషము లన్నిటితో రోమహర్షణ పుత్రుడైన ఉగ్రశ్రవసు డను పౌరాణికుడు శౌనకాది మహామును లున్న సత్రసభలో దీనిని ప్రచు రించెను. అందువలన వ్యాసభగవానుడు మొదట జయనామముతో 24,000 గ్రంథముగా రచింపగా, వైశంపాయనుని చేతిలో విస్తృతినొంది భారతమై, సూతుని ప్రచారమున మరింత విస్తరించి మహాభారత గ్రంథ మైనదని కొందరు పరిశోధకు లూహించు చున్నారు. తర్వాత బహుకాలము వరకు చర్చలు జరుగుచునే ఉండెను.

అనేక కవులు రచించిన గాథలు ఒకకవి చేతనో, పలువురచేతనో మహాభారత కోశముగా గ్రథనము చేయబడినదని నేటి పరిశోధకుల సిద్ధాంతము. ఏది యెట్లున్నను దానిలో ఒకానొక విచిత్రమైన ఏకత్వ మున్నది. నేడు ఆచరణలో నున్న హిందూమతమున కది వేదమువంటిది. కనుక పంచమవేద మను గౌరవనామము వహించినది. అది సార్వవర్ణి కము, సార్వకాలికము. భరతఖండము నంతటినే కాక నేటి పాకిస్థాన్ ఆఫ్ ఘనిస్థాన్, మధ్యాసియా, బర్మా, మలయా, సయామ్, అసామ్, సిలాన్, జావా, బోర్నియో, బలి-ఇత్యాదికమైన ఎంతో భూభాగమును ద్వీపములను ఒకే ధర్మమత గ్రథనముచేయు మహాగ్రంథము. అది విశ్వజనీన మైనది.

సాహిత్యవేత్తలు దీనిని మహాకావ్యముగా గౌరవించుచున్నారు. ఇందులో రసములన్నియు బహువిధములుగా పాఠకులను ఉద్వేగపరచు చుండును. ఐనను అందులో ప్రధానరసము శాంతరసమగుట గమ నార్హము. తక్కిన రసము లన్నియు దానికి అంగభూతములే.

ఇందులోవచ్చునన్ని పాత్రలు లోకములో మరి యేగ్రంథములోను రావు. ఆ పాత్రలుకూడ అన్నియు విశిష్టములే. భగవ దవతారముగా వర్ణింపబడిన శ్రీకృష్ణుడు, ధర్మపుత్రుడైన ధర్మరాజు, సర్వవిధముల అంధుడైన ధృతరాష్ట్రుడు, దురభిమానియైన దుర్యోధనుడు, భీముడు, అర్జునుడు, కర్ణుడు, శకుని సకల ధర్మార్థవిదుడైన భీష్ముడు, ధనురా

చార్యుడైన ద్రోణుడు, అశ్వత్థామ, నీతిజ్ఞానియైన విదురుడు, ద్రుపదుడు, ధృష్టద్యుమ్నుడు, సాత్యకి, కుంతి, గాంధారి, ద్రౌపది-ఇట్టి మహాపాత్రలే కాక ప్రజ్ఞలు పలికిన ఉత్తరుడు, విరటుడు, సైంధవుడు, అభిమన్యుడు, ఘటోత్కచుడు, కీచకుడు, స్త్రీపూర్వుడైన శిఖండి, కర్ణునికి సారథ్యమువహించిన శల్యుడు, సుదేష్ణ, దుస్సల, హిడింబ, ఏకచక్రపురమున బ్రాహ్మణకుటుంబములోని వ్యక్తులు- ఎందరెందరో స్త్రీ పురుషులు ప్రత్యేక వ్యక్తిత్వముతో కన్నుల కట్టుదురు. వారందరు భారతీయులకు చిరపరిచితులవలె దర్శనమిత్తురు. జ్ఞానులు అజ్ఞానములో పడిపోవుటయు, ధర్మనిష్ఠులు ధర్మవ్యత్యయము చేయుటయు, మహావీరు లొకానొకచో భీరుత్వమును, భీరువులు వీరత్వమును ప్రదర్శించుటయు, దుష్టకార్యములు చేయువారే ఉదాత్తతచూపుటయు, ఉత్తములే ఒకానొకచో అల్పత్వమున కొడిగట్టుటయు ఇందులో అడుగడుగున కనబడుచుండుటచే మహాభారతము మనుష్యతత్వమును ప్రతిబింబించుటలో అద్వితీయమై, సామాన్య మానవులకుకూడ ఆత్మీయతను సంపాదించుకొన్నది.

ధృతరాష్ట్రుడు పుట్టు గ్రుడ్డి అతనికి జ్ఞాన సంపాదనకు కలిగినన్ని అవకాశములు లోకములో మరెవ్వరికిని సాధ్యపడి వుండవు. అయినను అతడు ప్రేమించిన పుత్రశతము సబాంధవముగా వినాశమొందిన తర్వాత బహుకాలమునకుగాని అతనికి జ్ఞానోదయము కాలేదు. మమకారముచేత ఆకృష్టమై అకార్యకరణమును ప్రతిఘటించని సర్వమానవకోటి హృదయాంధతకు ధృతరాష్ట్రుడు ప్రతినిధి.

దుర్యోధనుడు చేసిన దుర్మార్గములకు అవధిలేదు. అతనిని తుదకు భీమసేనుడు అధర్మ యుద్ధముచేసి, ఊరుభంగమొనర్చి, పడియున్న వానిని తలదన్నినది చదివినప్పుడు ఆతనియెడ పక్షపాతమువంటి దావేశించును.

భారతవీరులందరిలో ధర్మబలాధిక్యముకల ధర్మజు డొక్కడే సశరీరముగా స్వర్గను చేరికొనగలిగెను. అట్టివానికిగూడ అక్కడనైనను సోదరులయందు రాగము, దుర్యోధనాదులయందు ద్వేషము, వదల

లేదు. అతడు స్వర్గలోక ధర్మమునే గర్హించెను. ఆకాశ గంగాస్నానము చేసి మానవ దేహము విసర్జించి దివ్యదేహమును ధరించునంతవరకు అతనికి స్వర్గలోకసుఖము అనుభవమునకు రాలేదు. మానవలోక ధర్మమునకు, దేవలోక ధర్మమునకు గల వైపరీత్యమును వర్ణించు ఈ అద్భుతాఖ్యానముతో మహాభారత మూలకథ సమాప్తినొందుచున్నది. దానితో ఈలోకమునకు పరలోకమునకు ముడిపెట్టబడినది.

ఈ మూల కథను వదలి అందలి ఉపాఖ్యానములనే ఎన్నుచుపోయినచో అవి ఒక్కొక్కటి ఒక రత్నము. అందులో కొన్ని మహారత్నములు. మానవునకు లోకయాత్రకుగాని, ధర్మనిష్ఠకుగాని, జ్ఞానసంపాదనమునకు గాని అవసరమైన సామగ్రి అంతయు నందులో కలదు. భారతభూమిలో సమస్త భాషా కవులు రెండువేల సంవత్సరములనుండి తమ తమ కావ్యనాటకములు నిర్మించు కొనుటకు మహాభారతమును తరుగులేని మహాఖనిగా వాడుకొనుచున్నారు.

ప్రస్థానత్రయములో ఒకటిగా భావింపబడుచున్న భగవద్గీత అందులోనిదే. దానినే అనువాదము చేయు అనుగీతయు అందులోనిదే. అట్లే ఆధ్యాత్మవిద్య నుపదేశించు సనత్సుజాతీయమును దానిలోనిదే. ఇంతే కాదు. శివకేశవుల పూజలలో నిత్యము అనుసంధింప బడుచున్న శ్రీ శివ సహస్ర నామములును, శ్రీ విష్ణుసహస్ర నామములును అందులోనివే. తీర్థయాత్రా సందర్భములో ఆసేతు హిమాచలమధ్యస్థ ప్రదేశమంతయు ప్రతి అంగుళము విశేష మహాత్మ్యముగల పవిత్రభూమిగా నిర్వర్ణింప బడినది.

మహాభారతము బహుకాలము క్రిందటనే దేశభాషలన్నిటిలోనికిని అనూదిత మైనది. కాని వానిలోనెల్ల సర్వవిధముల ప్రథమ తాంబూలము ఆంధ్ర మహాభారతమునకే దక్కినది. అన్నిటిలో ప్రాచీనమైనదియు, ఆర్ష మార్గమున నడచినదియు అదే.

నన్నయకంటె పూర్వమే కన్నడములో పంపకవి విక్రమార్జున విజయమను పేర భారత కథ వ్రాసెను. కాని అది స్వతంత్ర గ్రంథము

కాని, వ్యాస మహాభారతమును అనుసరించునది కాదు. భాషావాదము లన్నింటిలో నన్నయదే ప్రాచీనతమ మగుటచే భండార్కరు ఇన్స్టిట్యూటు వారు తమ పాఠ నిర్ణయమునకు నన్నయ అనువాదమునకు ప్రత్యేక గౌరవ మొసంగి యున్నారు.

మహారాష్ట్రభాషలో మోరోపంత్ పింగళే మహాభారతము వ్రాసెను. వంగ భాషలో కాశీ రామదాస్ వ్రాసెను. ఇతర భాషలలోను వ్రాసిరి. ఇతర భాషా వాఙ్మయములలో ముఖ్యముగా రామాయణమునకు విశిష్ట గౌరవము వచ్చినది. ఆంధ్రభాషలో మహాభారతమునకు విశిష్ట గౌరవము వచ్చినది.

ఆంధ్ర మహాభారతమునకు అట్టి గౌరవము ప్రాప్తించుటకు ప్రధాన కారణము దాని నారంభించిన నన్నయభట్టారకుని ఆర్షదృష్టి. పశ్చిమోత్తరభారతాంచలములలో గజనీమహమ్మదు దండయాత్రలు ఆరంభించిన పదునొకండవ శతాబ్దమే సరిగా నన్నయ కాలము. భారతీయ ధర్మమునకు మహావిప్లవము సాగినది. ఇది బయటినుండి ఆరంభమైనది. అంతకు పూర్వము ఆంతరంగికముగా సంభవించిన అనేక విప్లవములను భరత ఖండము జీర్ణించుకొన్నది. కొత్తవిప్లవములను ప్రతిఘటించుటకును, జీర్ణించు కొనుటకును భరత భూమి సంపాదించుకొన్న సమన్వయశక్తి వ్యాస మహాభారతములో నిక్షిప్తమై ఉన్నది. ఈ విషయము దివ్య దృష్టితో గ్రహించినారు నన్నయభట్టు, అతని మిత్రుడు నారాయణభట్టు, వారిద్దరు నర నారాయణుల వంటివారని మహాభారతావతారికలోనే సూచనగా ఉన్నది. నన్నయ సంహితా భ్యాసుడు, అవిరళ జపహోమ తత్పరుడు; లోకజ్ఞుడు. అట్టి ఆప్తమిత్రుల ఊహల కనుగుణముగా భారత శ్రవణాశక్తి కల చాళుక్య ప్రభువగు రాజరాజనరేంద్రుని ప్రార్థనమును, ప్రోత్సాహమును లభించినవి ఆవల చోళ భూమిలో రాజరాజనరేంద్రుని మామగారు గంగైకొండ రాజేంద్రచోళుడు గంగాతీరము వరకు దండయాత్ర చేసి భారతభూమి నంతటిని ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందికి తెచ్చుటకు ఉవ్విళ్ళూరుచుండెను. చోళులది రాజకీయ ప్రయత్నము ఇక ఆంధ్ర దేశములో వేంగిమండలములలో రాజరాజనరేంద్రుని ఆస్థాన విద్వత్కవులు భరతభూమి నంతటిని ధార్మికముగా ఏకముఖము చేయుటకు ప్రయత్నించిరి. కృష్ణద్వైపాయన ముని వృషభుడు చెప్పిన మహాభారత

బద్ధ నిరూపితార్థ మేర్పడునట్లుగా నన్నయభట్టారకుడు తెనుగున రచియించుట కారంభించినాడు.

ఆ తర్వాత రెండువందల సంవత్సరములకు నన్నయ చూపిన మార్గమునే అనుసరించుచు తిక్కన సోమయాజి ఎక్కువభాగము రచించెను. అతడును పూర్వము నిర్వహించిన మహామాత్య పదవి త్యజించి భారతధర్మ నిష్ఠచే సోమయాజియై అవభృథస్నాన పవిత్రతరుడై మహాభారత రచన కుపక్రమించెను.

ఆ పిమ్మట ఏబది సంవత్సరములకు ఎర్రయ తనకు నన్నయ తిక్కనలయందు కలిగిన భక్తిచే వారిద్దరు చూపిన పావన మార్గముననే వ్యాసభారతమునందు గల భక్తి శ్రద్ధలతో అరణ్యపర్వశేషము పూరించి భారతపరాంశమైన హరివంశము కూడా ఆంధ్రీకరించినాడు. ఎర్రయ ఆధ్యాత్మనిష్ఠకల మహాయోగి.

మహర్షులంటివారగు నన్నయ, తిక్కన, ఎర్రయ చేతులలో ఆంధ్ర మహాభారతము అవతరించుటచేత దానికి మరి యే భాషా భారతమునకు లేని విశిష్టత వచ్చినది. అందులో మూలగ్రంథమునకే కొంచెము తరుగులు పెరుగులు లేకపోలేదు. కాని మూలగ్రంథము ప్రధానాశయముల కెక్కడను ఏమాత్రము భంగము వాటిల్లలేదు. వారు ముగ్గురును మహాభారత ధర్మమే మూర్తీభవించిన పుణ్యపురుషులు. వారు మార్గదర్శకులుగా ఉన్నందుననే నేటివరకు ఇతర ప్రాంతములలోకంటె ఆంధ్రభూమిలో అఖిల భారతజాతీయ ధర్మమగు ఆర్షధర్మము ఎక్కువ సజీవమై వర్ధిల్లుచున్నదనుట అతిశయోక్తికాదు.

ఆంధ్రులను ఇతర రాష్ట్రములవారు గాని, ఇతర దేశములవారు గాని 'మీ ఆంధ్రులు లోకమునకు ప్రసాదించిన విశేషమేమి' యని ప్రశ్నించినచో మనము ఆంధ్ర మహాభారతమును సగర్వముగా చూపుచున్నట్లు నిబ్బరముగా ఉత్తర మొసగవచ్చును.

"ఇదుగో! మా ఆంధ్రమహాభారతము! ఇది నిత్యమై, నిర్మలమైన మహాభారత ధర్మమును ప్రతిబింబించు చున్నది ధర్మార్థశ్చ కామశ్చ!"

(జాగృతి_13-5-1960)

# మల్లారెడ్డి

(క్రీ. శ. 14వ శతాబ్దములో బర్మా మొదలగు
దేశములలో ఆంధ్రదేశ స్నేహము)

నేటి జావా, సుమిత్రా, బోర్నియో, బలి, మొదలగు ద్వీపములే కాక, బర్మా, మలయా, సయాం, కాంబోడియా మొదలగు దేశములు కూడ పూర్వము ద్వీపములు అను పేరుతోడనే వ్యవహరింపబడుచుండెను. సముద్రయానముచేసి చేరుచుండు ప్రదేశములకన్నిటికి ద్వీపము అను నామమే పూర్వులు పెట్టినట్లు తోచును. భూమితో సప్త ద్వీపములు సప్తసముద్రములు కలవని పురాణములు చెప్పుచున్నందున, సముద్రము మీద చేరదగిన ప్రదేశములన్నియు అనుటకు 'సప్తద్వీపములు, సకల ద్వీపములు' అనుట వాడుకలోనికి వచ్చెను.

క్రీస్తు శకమునకు పూర్వమునుండియే ఆంధ్రదేశమునకు సప్త ద్వీపములనబడు బర్మా మొదలగు తూర్పు దేశములతోను, యవ ద్వీపము (జావా), సువర్ణద్వీపము (బోర్నియో), సుమిత్ర, బలి మొదలగు ద్వీపములతోను మిక్కిలి సన్నిహితమగు సంబంధముండెను. ఆ సంబంధము యూరపు ఖండవాసులు అమెరికాను కనుగొన్నప్పుడు, ఆ రెండు ఖండములవారికి కలిగిన శత్రుత్వ సంబంధమువంటిది ఎంత మాత్రమును కాదు. అక్కడివారిని దోచుకొనుటగాని, జయించుటకు, బాధించుటకు గాని కలిగిన సంబంధము కాదు. ఆంధ్రదేశమునకును ఈ ఈ ప్రాచ్య సముద్ర దేశములగు సప్తద్వీపములకును ఉండెడి సంబంధము, ఆప్తులైన ఇద్దరు మిత్రులమధ్య నుండెడి సంబంధము. ఒక ప్రదేశములో ఆపద వచ్చినప్పుడు, మరియొక ప్రదేశము మనస్ఫూర్తిగా సహాయము చేయుచుండెను. మిత్రదేశములైననేగాని అట్టిది సాధ్యపడదుగదా!

క్రీ. శ. 14వ శతాబ్దములో మొదటిభాగమున, ఆంధ్ర దేశమునకు గొప్ప ఆపదరాగా, ఈ 'సప్త ద్వీపముల'నుండి ప్రాప్తించిన సహాయము చేత ఆంధ్రదేశ మా ఆపదనుండి గట్టెక్క గలిగినది. అది రెడ్డి రాజ్య స్థాపకుడగు ప్రోలయ వేమారెడ్డి కాలముతో సంబంధించినది. ఆ సహాయ సంపద సంపాదించి పెట్టినవాడు, వేమారెడ్డి కడగొట్టు తమ్ముడగు మల్లా రెడ్డి. ఈ మల్లారెడ్డి కవిత్రయములో మకుటాయమానుడును, ప్రబంధ పరమేశ్వర బిరుద విఖ్యాతుడును అగు ఎఱ్ఱయకు (ఎఱ్ఱాప్రెగడ) పరమమిత్రము. ఈ సప్తద్వీపములనుండి మల్లారెడ్డి తెప్పించిన సహా యము ఎఱ్ఱయ హరివంశ పీఠికతోను, అశ్వాసాంత పద్యములతోను, సందర్భవశాత్తుగానైనను, విస్పష్టముగా తెలియవచ్చు చున్నది. వేమా రెడ్డికి 'అత్యుత్తమ ఖ్యాతి' తెప్పించిన ఎఱ్ఱయ రామాయణము మనకు దొరికినచో, ఈ సంబంధము ఇతోధికముగా స్పష్టపడగలదు.

హరి వంశావతారికతో మల్లారెడ్డి చేసిన ఘనకార్యమొకటి ఎఱ్ఱయ ఈ విధముగా వర్ణించినాడు.

'బాహాదర్పమునన్ బ్రతీప ధరణీపాలావలిందీవి యు
త్సాహోదగ్రుడు మోటుపల్లి గాని సప్తద్వీప సద్వస్తు సం
దోహంబుం దనకిచ్చు నెచ్చెలి సముద్రుం బ్రీతిగావించుచున్
మహాత్మ్యంబు వహించె మల్లరథి నీ నాథుండు గాఢోద్ధతిన్.'

పై పద్యములో మల్లారెడ్డి మోటుపల్లి రేవును పట్టుకొన్నదియు, అందువల్ల కలిగిన ప్రయోజనమును వర్ణింపబడినవి. ఆ ప్రయోజనము స్వరూపము మనము శ్రద్ధగా గమనించిన యెడల, ఆ కాలమున ఆంధ్ర దేశమునకు బర్మా మొదలగు దేశములతో ఎంత సన్నిహిత బాంధవ్య ముండెనో అవగతమగును.

అప్పుడు ఆంధ్రదేశము మహాపదలో నుండెను. 1323లో ప్రతాప రుద్రచక్రవర్తి ఢిల్లీసుల్తాను సేనలకు బందీగా చిక్కినంతనే, సుల్తాను సేనలు ఆంధ్రదేశమును మహాక్షోభముపాలు గావించెను-అన్ని కులముల వారిని, అన్ని తరగతులవారికిని, అన్ని వృత్తులవారికిని ధనదారాది వస్తువులన్నిటిలో దేనియందును స్వాయత్తతా మతి లేకుండునట్లుగా ఆ సేనలు అలజడి చేసినవి. అట్టి యాపదలో నుండిన ఆంధ్రభూమిని మహా వీరులు ఉద్ధరించిన సమయములో, వారితో మల్లారెడ్డి చేసిన ఘన

కార్యము పై పద్యములో వర్ణింపబడినది. ఈ విషయము జ్ఞాపకముంచు కొన్ననే గాని దానిలోని విశేషము మన హృదయములలో హత్తుకొన జాలదు. ఆ మహాపదలో సప్తద్వీపములనుంచి సద్వస్తు సందోహమును తనకిచ్చునట్టి నెచ్చెలినిగా సముద్రుని చేసికొని సముద్రునికి ప్రీతి గావించినాడు, మల్లారెడ్డి! సముద్రుని నెచ్చెలినిగా వర్ణించుటవల్లనే. అప్పుడు బర్మా మొదలగు దేశములతో ఆంధ్రభూమికి ఎట్టి సంబంధ ముండెనో స్పష్టమగుచున్నది. మరి యా దేశములనుండి వచ్చిన సద్వస్తు సందోహమేమిటి?

కొన్ని ఆశ్వాసాంత పద్యముల వలన ఆ వస్తువుల స్వరూప భావ ములు కొంతవరకూహింపవచ్చును. ఒక పద్యములోని 'రత్నాకర నాయక' అను సంబోధనము వలన రత్నలాభము సూచింపబడినది- మరియొక యాశ్వాసాంత పద్యమిట్లున్నది-

'సకల ద్వీపాంత ర
త్నకలాప నిరంత రార్చనా కలనారం
భక కురుమలూరి పురనా
యక మల్లచమూవరేణ్య హారినిషేవ్యా!'

పై పద్యము హరివంశకృతిపతి యగు వేమారెడ్డిని సంబోధించు చున్నను, అతని తమ్ముడు మల్లారెడ్డిచేసిన సేవనే వర్ణించుచున్నది-దీనిని బట్టి మల్లారెడ్డి తన యన్నకు సకల ద్వీపాంతరములనుండి రత్న సమూహములు నిరంతరాయముగా తెచ్చిపెట్టి అర్పించినాడని తేలు చున్నది. ఆ రత్నములు అలంకారమాత్రములైన కేవలము రాళ్ళ రత్నములే కావని మరియొక యాశ్వాసాంత పద్యమువలన తెలియు చున్నది. ఈ పద్యము గూడ కృతిపతి యగు వేమారెడ్డిని సంబోధించు నదైనను, ఇందులో గూడ ఎఱ్ఱయ తన పరమమిత్రమగు మల్లారెడ్డి మహాత్మ్యమే శ్లాఘించినాడు.

'బహు జలధి ద్వీపాంతర
మహేశ్వర ప్రహిత కనకమణి మౌక్తిక హ
స్తి హయాద్యర్పణ సేవా
బహు మత మల్లరథి నీశ భక్తిప్రీతా!'

బహు జలధి ద్వీపాంతరములలోని మహేశ్వరులు సేవా భావముతో నిచ్చిన కనకము, మణులు, మౌక్తికములు, హస్తులు, హయములు, మొదలగునవి తెచ్చి, ఆంధ్రదేశ స్వాతంత్ర్య సమరమునకు, ఉద్ధరణమునకు అన్నకు భక్తితో మల్లారెడ్డి సమర్పించినాడు. దారిద్ర్యముతో అల్లాడుచున్న ఆంధ్రదేశమునకు అప్పుడీ ద్వీపాంతరములు ఎంత కనకాదులు ప్రీతిపూర్వకముగా ఇచ్చినవో మన మూహచేయవలసినదే. అట్లే సర్వాయుధ సంపన్నములైన సుల్తాను సేనలను ఎదిరించుటకు ఎట్టి రణసాధనములు లేక వట్టిపోయిన ఆంధ్ర దేశమునకు, ద్వీపాంతరముల నుండి పంపబడిన గజ అశ్వములు, ఇతర రణసాధనములు ఆనాటి స్వాతంత్ర్య యుద్ధములో ఆంధ్రుల కెంత తోడ్పడియుండెనో మన మూహింపవలె!

అసహాయస్థితిలోనున్న ఆంధ్రదేశమునకు అప్పుడు బర్మా, మలయా మొదలగు ద్వీపాంతరముల నుండి అంతటి సాహాయ్యము లభించియుండినచో, అంతకు పూర్వము బహుకాలముగా ఉభయ భాగములకు అద్వితీయమగు స్నేహభావముండి యుండవలె కదా! అప్పుడు రాకపోకలకు గొప్ప నౌకలెన్నో ఉండెడివి. అవి ఎన్ని యున్నను, ఎంత పెద్దవైనను, నేటి పొగయోడలంత పెద్దవికానీ, ఇంత శీఘ్రయానము చేయగలవికానీ కాదుగదా! అప్పుడే రాకపోకలచే ఉభయతీరములకు పరస్పర సద్భావ సహకారము లేర్పడిన వన్నచో, యానసౌకర్యము ఎన్నోరెట్లు వృద్ధి నొందిన ఈ కాలములో, ఆంధ్రదేశమేకాక భరతఖండ మంతయు బర్మా మలయా ఇత్యాది దేశములతో సంబంధబాంధవ్యములు వృద్ధిచేసికొని ఉభయతారకమగునట్లు కావించుట సులభతరము కదా!

ఆ దేశములతో సఖ్య సంబంధములు పెంచుకొనుటకు క్రీస్తు శకారంభమునకు పూర్వమే, ఆంధ్రులగు శాతవాహన ప్రభువులు ముందు దారిచూపిరి. అందుచే అట్టి సఖ్యము పెంపుకావించుటకు కృషిచేయవలసిన భారము, నేడు ముఖ్యముగా ఆంధ్రుల మీదనే ఉన్నదని మన మందరము గుర్తింతుముగాక!

(తెలుగు బిడ్డ - జన్మదిన సంచిక 1-10-1956)

# ప్రోలయ వేమారెడ్డి

ఆంధ్రదేశమును పరిపాలించిన రాజులలో ప్రసిద్ధులైనవారు పలువురున్నారు.

వారిలో మనకు ప్రథమమున భాసించువాడు శ్రీ రాజరాజ నరేంద్రుడు. అతడు నన్నయ భట్టారకునిచేత ఆంధ్రములో మొదటి ఉద్గ్రంథము వ్రాయించినాడు. అతడు పార్వతీపతి పదధ్యానతత్పరుడు; కలి కాలజదోష తుషార సంహతిని తన యుదయ ప్రభావముచే దవ్వుగ జోపిన వాడని భట్టారకుడు వర్ణించెను. ఈతని రాజ్యము నేటి గోదావరి, కృష్ణ, గుంటూరు మండలములకు మాత్రము వ్యాపించి యున్నట్లు తోచును.

అంత ప్రసిద్ధి ఆంధ్రదేశములో పొందకపోయినను అతనికంటె ఎన్నో రెట్లు విస్తారముగల సామ్రాజ్యము నేలినవాడు అతని కుమారుడగు కులోత్తుంగ చోళ చక్రవర్తి. కాని అతనికి చోళదేశముపైన ఉన్న అభిమానము తన సామ్రాజ్యములో ఒక మండలమే అయిన వేంగీ భూమి మీద ఉన్నట్లు తోచదు. ఆతనిని ఆంధ్రులు మరచినను నిజమునకు మరువదగనివాడు.

పై ఇద్దరి తరువాత చెప్పదగినవారు వరుసగా త్రిలింగ ప్రభువులైన ముప్పురు– గణపతిదేవుడు, రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు. నిజముగా వీరు ముప్పురే నేడు ఆంధ్ర భాష మాటాడుచున్న భూమినంతటిని ఏకచ్ఛత్రముగా ఏలిన ప్రభువులు. వీరికే త్రిలింగ క్షితిపాలురని మన దేశములోనను, దేశాంతరములందును ప్రసిద్ధి కలిగినది.

ఆ పిమ్మట చెప్పవలసిన ప్రభువు జగద్విఖ్యాతిగన్న శ్రీ కృష్ణదేవ రాయలు. ఇతడు కర్ణాటకము, చేర, పాండ్య, చోళ దేశములను సంపూ

ర్ణముగను, ఆంధ్ర దేశములో అర్ధభాగమును ఏలిన మహాచక్రవర్తి. ఇత నికి ఆంధ్రభోజుడన్న ప్రసిద్ధి వచ్చినది.

పైన పేర్కొన్న ఆరుపురేకాక మరికొందరు ప్రభువులుకూడా కొంద రికి స్ఫురింపవచ్చును. కాని ఏ కొద్దిమందికో కాని రెడ్డిరాజ్యస్థాపకుడైన ప్రోలయ వేమారెడ్డి పేరు స్ఫురింపదు. దానికి కారణము ఆంధ్రుల చరిత్ర క్రమముగా తెలియరాకుండుటే కాని వేరుకాదు.

ప్రోలయ వేమారెడ్డికి అనవేమారెడ్డి, కోమటి వేమారెడ్డి అను నామాంతరములు కూడా కలవు. అయినను ఈతని రెండవ కుమారునికి అనవేమారెడ్డి యను పేరును, శ్రీనాథుని కాలమునాటి కొండవీటి ప్రభు వుకు పెద కోమటి వేమారెడ్డి అను పేరును ప్రసిద్ధములుగా నుండుటచేత వారినుండి ప్రత్యేకించుటకు ప్రోలయ కుమారుడైన వేమన అని అర్థము వచ్చు ప్రోలయ వేమారెడ్డి అను నామముతోడనే వ్యవహరించుట మంచిది.

ప్రోలయ వేమారెడ్డి నేటి గుంటూరు, కర్నూలు, నెల్లూరు మండ లములను కడప, కృష్ణా మండలములలో కొద్ది భాగములను మాత్రమే పాలించెను. అయిన నేమి? గుణవిశేషము చేత ఆతనికి ఉన్న ఉదాత్తత పైన ఉదాహరించిన ఆరుగురికే కాక ఆంధ్రదేశమును వేయి, పదునైదు వందల సంవత్సరముల మధ్యకాలములో పాలించిన ఏ ప్రభువునకును లేదనుట అతిశయోక్తి కాదు. పురాణములలో రాజర్షులని వర్ణింపబడిన దశరథాదులకు తప్ప ఆతని గుణాతిశయము కనిపింపదు.

రాజరాజ నరేంద్రుడు తన మాతామహులును, శ్వశురులును, వియ్యంకులును అయిన చోళ ప్రభువుల ప్రాపుతో తన తండ్రి వలన సం క్రమించిన రాజ్యమును ముమ్మారు పోగొట్టికొనినవాడు; సవతి సోదరునితో కలహములతో సతమతమైనవాడు.

ఆతని కుమారుడు కులోత్తుంగ చోళుడు మిక్కిలి సమర్థుడే! ఆతడు తనతండ్రి అవసానకాలములో పోగొట్టుకొన్న వేంగి మండలమునే కాక చోళ సామ్రాజ్యమును కూడా తన ప్రతిభచే సంపాదించుకొన్న మహా యోద్ధ. ఈతని సేనలు సింహళ ద్వీపములో కూడా ప్రచలించినవి. ఈతడు

పన్నులెన్నో తీసివేసినందున సామాన్య ప్రజలకు ప్రీతిపాత్రుడయ్యెను. విక్రమాంకదేవుని వంటి మహావీరునితో నిరంతరాయముగా యుద్ధములు సలిపిన మహా వీరుడు. అయినను ఈతనికి శ్రీమద్రామానుజులను తన రాజ్యములో ప్రవేశింపకుండ చేసిన కళంకము ఆవహించినది. అదిగాక ఈతని ఆంధ్రప్రభువనుట మర్యాదా మాత్రమునకే.

ఇక కాకతీయ ప్రభువులు ముప్వురును గొప్పవారే. వారిలో గణపతి దేవుడు తన తండ్రి పోగొట్టుకొన్న చిన్న రా జ్య ము ను మరల సంపాదించుకొనుటే కాక దానిని సామ్రాజ్యముగా విస్తరింపచేసిన మహావీరుడు. అంతేకాని ఇతర గుణగుణములు ప్రత్యేకముగా ఎన్నదగినవి కనబడవు. ఆయన కుమార్తె రుద్రమ్మ తండ్రి యిచ్చిన రాజ్యమును ఎట్లో రక్షించుకొనజాలినది. అందులో ఆమెకు తన భర్త తోడనే వైరము సంభవించి, మనోవ్యథ పాలైనట్లు తోచును. ఆమె తరువాత పాలించిన ప్రతాప రుద్రుడు సమర్థుడైనట్లే కవుల వర్ణనలలో తోచుచున్నది. కాని వానిని సూక్ష్మముగా పరిశీలించినచో అతనికి విద్యాభిమానముతో పాటు భోగ లాలసత ఉన్నట్లు తెలియగలదు. అతని వారాంగన 'మాచల్దేవి' సౌధము ఔన్నత్యము, ఆమెకు కవిలోకములో ఉన్న ప్రశస్తి, క్రీడాభిరామము లోని "ద్వీపాంతమ్మున నుండి వచ్చితివె భూదేవా........" ఇత్యాది పద్యము వల్లనే స్పష్టపడుచున్నది. దానికి తగినట్లే మహా ప్రవాహము వలె ఢిల్లీ సులతాను సేనలు అతనిని, అతని రాజ్యమును ముంచివేసినవి.

ఇక శ్రీకృష్ణదేవరాయలు! ఈతడు తన అన్న కుమారునికి రావల సిన రాజ్యమును తానే అనుభవించెను. ఈతడు ఎన్నో యుద్ధములుచేసి, ఎంతో రాజ్యమును సంపాదించిన వీరుడని ఖ్యాతి కలదు. కాని ఎక్కడి కక్కడ ఇతడు తొందరపడి ప్రమాదము తెచ్చుకొనుటయు, ఇతని మహా మంత్రియైన తిమ్మరుసు తన అద్వితీయ ప్రతిభచే దానిని త ప్పిం చి, విజయము చేకూర్చుటయు తెలియవచ్చు చున్నది. అట్టి తిమ్మరుసునే అవసానకాలములో రాయలు శంకించి, కన్నులు తీయించి, చెఱలోపెట్టి బాధించినది తలచుకొన్నచో అతడెంత తొందరపాటువాడో స్పష్టపడును. అంతేకాక ఔరంగజేబు విజయకాంక్ష మొగలు సామ్రాజ్య నాశనమునకు

దారితీసినట్లే, శ్రీకృష్ణదేవరాయల అపరిమిత విజయ కాంక్షయు, విజయ నగర సామ్రాజ్యము విధ్వంసమగుటకు దారితీసె ననుటకు సందేహము లేదు. మరియు నీతడు కర్ణాటుడే కాని ఆంధ్రుడు కాదనువాదము పూర్తిగా త్రోసివేయతగినదికాదు.

## 2

ఈ వేమారెడ్డి ప్రోలయ కుమారుడు. వేమారెడ్డి మనుమడు. తండ్రి కాని, తాతకాని, ప్రభుత్వము చేసిన వారుకారు. కొందరు శాసన కవులును వేమభూపాల చరిత కావ్యకర్త వామనభట్ట బాణుడును, వారికి రాచరికము కూడా ఆపాదించినను, అవి అతిశయోక్తులే కాని సత్యోక్తులుగా తోచవు. వారు కాకతీయ సేనలలో చిన్న నాయకులుగా ఉండిన ఉండి ఉండ వచ్చును. వేమారెడ్డి కూడ ప్రతాపరుద్రుని సేనానాయకులలో ఒకడై ఉండునని కొందరు చరిత్రకారులు ఊహించిన దానికిని విశ్వాసార్హమైన ఆధారము కనబడదు. అతడు చిన్న పదవాలో లేక వాహినీపతియో అయి యుండును. అతని మాతామహుడైన దొడ్డయ ఒక్కడే అతని బంధు కోటిలో కొంతవరకు సేనాపతిత్వము నిర్వహించినవాడు.

అందువలన వేమారెడ్డి జన్మతః ఒక సామాన్య కుటుంబములో జన్మించిన సామాన్యవ్యక్తి. ఆతనితండ్రి ప్రోలయ కూడా సామాన్య వ్యక్తిగనేతోచును, అతనితల్లి అన్నమ్మ మాత్రము అసామాన్యవ్యక్తిగా భాసించును. ఆమె ఏమి చేసినదో మనకు స్పష్టముగా తెలియదు. అయినను ఆమె మహత్వము విచిత్ర విధముగా మనకు తెలియవచ్చు చున్నది.

అది స్త్రీలకు ప్రాముఖ్య మిచ్చిన కాలము గాదు. వేమారెడ్డి భార్య యెవ్వరో కూడ మనకెక్కడను తెలియరాదు. కాని ఎఱ్ఱయ తన హరి వంశము మొదటి పద్యములోనే "అన్నమ వేమభూవిభున కిచ్చున్ సుస్థి రైశ్వర్యముల్" అని మంగళాచరణము కావించుచు, ఈతని అన్నమ కుమారుడని నిర్దేశించినాడు. ఈ వేమారెడ్డియే 'మంచాళ' అగ్రహారము దానము చేసిన సందర్భములో ఆ శాసనకవి ప్రోలయను వర్ణించుచు

ఆతనిని 'అన్నమాంబాపతి' అని నిర్దేశించినాడు. మరియు అమరావతి లోని మరియొక శాసనములో వేమారెడ్డిని గూర్చి శాసనకవి, "అన్నమాంబాతనూజేన కృతినా వేమ భూభుజా" అని ప్రస్తావించినాడు. తల్లి అన్నమ్మ గతించిన పిమ్మట ఆమెకు పుణ్యలోకప్రాప్తి కొరకు పెరవలి గ్రామము అగ్రహారముగాచేసి దానముచేయుట విశేషము గాదు. అన్నమ్మ వేమారెడ్డికి, జీజీబాయి శివాజికివలెనే ధర్మోద్ధరణమునందు దీక్షకలుగునట్లు ప్రేరేపించి ఆతనిని ధీరోదాత్తునిగా మలచినది.

ఆ కాలములో వేమారెడ్డి సాధించిన మహత్కార్యము ఆనాటి ఆంధ్రదేశ స్థితిగతులు తెలిసిననేకాని బోధపడదు.

క్రీ.శ. 1323లో ఢిల్లీ రాజపుత్రుడు 'జూనాఖాన్' ప్రతాపరుద్రుని బంధించి ఓరుగల్లుపట్టుకొని అతని నాయకులనందరికి వధించెను. మరి రెండు సంవత్సరములకే అతడు తనతండ్రి మరణమునకు కారకుడై 'మహమ్మద్ బిన్ తుగ్లక్' అను పేరుతో ఢిల్లీ సుల్తానయ్యెను. ఆతడు తన రాజ్యమును దక్షిణమున రామేశ్వరమువరకు విస్తరింపచేయుటేకాక, ఒకవంక పారసీకమునకును ఇంకొకవంక చీనాకును విజయకాంక్షతో సేనలను పంపెను. అతని సేనాబలము, యుద్ధకౌశలము, ఆర్థికసంపద ఎంత అపరిమితమైనదో ఊహింపవలసినదేకాని వర్ణింప సాధ్యమగునది కాదు. అతనిసేనలు మహామారివలె భరతఖండము నంతటిని ఆక్రమించుకొన్నవి. ఆతడే స్వయముగా ఎన్నియోమారులు దక్షిణ దేశమునకు వచ్చి యుద్ధయాత్రలు నడిపెను. ఇన్ని యుద్ధములకు ఆతనికెంత ధనమున్నను విపరీతమైన ధనము కావలసి వచ్చినది. అందువలన అతడు తన ఉద్యోగులను ధనముకై ఒత్తిడి చేయసాగెను. వారు ప్రజలను ఎప్పుడు ఎన్నడు ఎరుగని కొత్త కొత్త పన్నులువేసి పీడింపసాగిరి. ధనమెక్కడనున్నను, అగ్రహారములలోగాని, దేవాయతనములలోగాని, వర్తకుల ఇండ్లలోగాని త్రవ్వి తీసికొనిపోవుచు, దాచినారని ఆ కుటుంబీనులను అవమానించి హింసించి నరికివేయుచుండిరి. ప్రజలను వారపుడు పెట్టిన హింసలు విలస కలువచేరు శాసనములలో కనులకు కట్టినట్లు చిత్రింపబడినవి. కృషీవలులకు కర్షణ లాభమును, వర్తకులకు వాణిజ్య

లాభమును లేకుండపోయినవి. మనుష్యులకు తమ ధనమునందేకాక స్వభార్యలయందుకూడ స్వత్వబుద్ధి పోయినది. దావవహ్నిజుష్టమైన వనమువలె రక్షించునాథుడు లేక ఆంధ్రభూమి సంతాపించినదట.

అట్టి సమయములో నేటి గుంటూరు మండలములో ఒకమూల అద్దంకిలోననో, శ్రీశైలారణ్య సమీపమున వినుకొండలోనో, వేమారెడ్డి ఢిల్లీసుల్తాను సైన్యములకు ఎదురు తిరుగుటకు ఉపక్రమించెను. ఆతనికి సహాయముగా నిలిచినవానిలో అగ్రగణ్యమైనది ఆతని ధర్మనిష్ఠ. రెండవది ఆతనికిగల ఉత్తమ బంధుసమృద్ధి. మూడవది సుల్తానుసేనలు చేసిన కిరాత కృత్యములచే జనసామాన్యములో నిరాశవలన కలిగిన మొండిసాహసము. నాల్గవది గురుకటాక్షము.

అతనికి సేనలులేవు. కర్రతిప్పుటకూడ చేతకానివారు కత్తులు పట్టుటకు పూనుకొనిరి. రాత్రింబవళ్ళు కమ్మరుల కొలుములు మండుచు కత్తులు కటారులు బల్లెములు గండ్రగొడ్డళ్ళు సిద్ధము చేయజొచ్చినవి. దొరికిన వెదురుబద్దలన్నియు విండ్లుగా మారినవి. ఎక్కడ కనబడిన సుల్తానుభటులను అక్కడనే తెల్లవారుసరికి ప్రజలే మట్టుపెట్టసాగిరి. ఒక్క మోటుపల్లి ముట్టడితప్ప పెద్దయుద్ధమేమియు సులతాను భటులతో జరిగినట్లు తెలియరాదు. వేముని కడగొట్టు తమ్ముడైన మల్లారెడ్డి సాహసించి మోటుపల్లి స్థలజల దుర్గముపై దాడిచేసి శత్రువులను పారద్రోలి దుర్గము సాధించెను. దానితో వేమునికి మరియొక గొప్ప చెలికాడు ప్రాప్తించినాడు. అతడు సముద్రుడు! దీనినే ఎఱ్ఱయ మనోహరముగా; 'సప్తద్వీప సద్వస్తు సందోహంబున్ దనకిచ్చు నెచ్చెలి సముద్రున్ బ్రీతుఁగావించె' నన్నాడు. అప్పుడే యక్షవిభుడైన అవచి దేవయ ప్రాపు వేమారెడ్డికి లభించినది. మరియు అతని తండ్రి ప్రోలయ ఎట్లు సంపాదించెనోకాని అమితమైన సువర్ణరాశి తెచ్చి ఆతని కందించినాడు. దానినే మంచాళ శాసనము ప్రోలయ 'స్వర్ణకర ప్రసిద్ధి' కలవాడని వర్ణించినది.

ఆంధ్రదేశమునందును ఆవల కర్ణాట ప్రాంతమందును సుల్తాను సేనలకు ఎదురు తిరిగినవారున్నారు. కృష్ణా గోదావరీ మండలము

లలో ముసునూరివారు, తెలంగాణములో రేచర్లవారు, ఆనెగొందెలో హరిహర సోదరులు. కాని వారందరికిని మార్గదర్శి వేమారెడ్డియే. వేమారెడ్డి సాహస ప్రయత్నము సఫలమైన పిమ్మటనే తక్కినవారును ఒక్కొక్కరే రంగములో ప్రవేశించిరి. ఇట్లు తన తర్వాత తన ప్రయత్నము వంటి ప్రయత్నములే తమతమ భూములలో చేసినవారి కందరికి ప్రోలయ తన చేతనైన సహాయమే చేసెనుగాని అసూయచేత వారిని ప్రతిఘటించలేదు. ఆతనికి కావలసినది ధర్మోద్ధరణమే కాని ఆత్మాతిశయముకాదు.

ప్రోలయవేముడు సమర్థుడైన ప్రభువు. ఆతడు ఎనుబది నాలుగు దుర్గములను నిర్మించుట, వానిని బలపరచుట చేసెను. తన రాజ్యములో తనకు సాయపడిన బంధువులందరికి తనతో సమానమగు సంపద ఉండునట్లు చేసి చుట్టపు మేరువను పేరు సంపాదించెను. ఆతని చుట్టములలో నతనికి విశేషసహాయము చేసినవారు ముఖ్యముగా ముగ్గురు-నిత్య జయశీలి, నీతిశాలి యైన అతని మాతుల ప్రియపుత్రుడు చిట్టియ నూకారెడ్డి ఒకడు. శ్రీ మహావిష్ణువుకు రెండు బాహువులవలె ఉన్న యాతని తమ్ములు అన్నారెడ్డి, మల్లారెడ్డి. వారిలోగూడ మల్లారెడ్డిని గూర్చి,

"రామునకు లక్ష్మణుడు సు
త్రామసుతుఁడు ధర్మజునకుఁదగు సౌభ్రాత్రం
బేమెయి నెఱపుదు రామెయి
వేమప్రభుఁ గొల్చె మల్లవిభుఁడును భక్తిన్."

అని ఎఱ్ఱయ వర్ణించినాడు. ఈ మల్లారెడ్డి 'బహుజలధి ద్వీపాంతర మహేశ్వర ప్రహిత కనక మణి మౌక్తిక హస్తిహయార్పణ సేవ' కూడ ఆతనికి కావించెను. అదే ఇంకొకచోట,

"రత్నాకరనాయక గుణ
రత్నోజ్జ్వల రెడ్డి మల్లరాజిత శశ్వ
ద్యత్నార్థ ద్వీపాంతర
రత్నాలంకృత సమస్తరాజ్య రమాంగా!"

ఎఱ్ఱయ సంబోధనలో కనుపించును. ఆంధ్రకవులలో నెల్ల ఎఱ్ఱయ ఒక్కడే ప్రభువులకు లేని గుణములు ఆరోపించకుండువా డనుమాట గుర్తుంచుకొనవలెను ద్వీపాంతరప్రభువులతో సఖ్యము అవసరమని వేమారెడ్డి గుర్తించెను.

వేమారెడ్డి సేనలు నడపుటలో నేర్పు సంపాదించెను. స్వయముగా నాతడు గొప్ప ధానుష్కుఁడు. ఆతనికి కాళిదాసవర్ణితుడైన దిలీప చక్రవర్తి ధర్మదీక్ష మనస్సు కెక్కినట్లున్నది. అందువలననే ఎఱ్ఱయ యాతని 'జగదవనహేల' అనియు 'రాజనిగమదిలీపా' యనియు సంబోధించెను. పరాక్రమముచే తాను సంపాదించిన సంపదకు ఫలము పాత్ర దానమే యని గుర్తించినాడు. అందువలన "ఇష్టాపూర్త రూపంబగు క్రియాకలాపంబు నిజకర్తవ్యానురూపంబుగాఁ దొడంగి

"అగ్రహారములు విద్యాతపోవృద్ధ వి
 ప్రుల కిచ్చి యజ్ఞకర్తలుగ నునిచెఁ
గొమరారఁ జెఱువులు గుళ్లు ప్రతిష్ఠించి
 లోకసంభావ్యంబులుగ నొనర్చె
నిధులు నల్లిండ్లును నిలిపెఁ దోటలు సత్ర
 ములు చలిపందిళ్ళు వెలయఁ బెట్టె
హేమాద్రి పరికీర్తితామితవ్రతదాన
 నివహంబు లన్నియు నిర్వహించెఁ

జేసెఁ జేయుచున్నాఁడు సేయనున్న
వాఁడు పునరుక్తకృతి శుభావలుల నెల్ల
ననఁగ శ్రీ వేమవిభున కయ్యలరు పేర్మి
వశమె వర్ణింపఁ దద్భాగ్య వైభవంబు!"

పై పద్యములో ముందు వచ్చినవి అగ్రహారములు. ఆ కాలములో అగ్రహారములు విద్యానిలయములు. అవి నేటి ఉన్నతకళాశాలలు, విశ్వవిద్యాలయముల వంటివి. ఎఱ్ఱయ పద్యములోని వాక్యములు సత్యములనుటకు సాక్ష్యముగా వేముని అగ్రహారదానశాసనము లున్నవి.

అందులో ప్రతిగ్రహీతలపేర్లు, వారు ఏయేశాస్త్రములలో విద్వాంసులో తెలియవచ్చును. అటువంటివే గుళ్ళ ప్రతిష్ఠలు.

తక్కినవి సామాన్యప్రజల సుఖజీవనమున కుద్దేశించినవి. చెరువులు స్నానపానాదులకును, వ్యవసాయమునకును ఉద్దేశింపబడినవి. బాటసారులకు తోటలు సత్రములు చలివందిళ్ళు చాలా అవసరము. అన్ని వర్ణములకు చెందిన యాత్రికులు తోపులలో విడిసి తమ ప్రయాణములు సాగించుచుండుట ఇప్పటికి పాతికేళ్ళ క్రిందటివరకు విరివిగా ఉండెడిది. ఇప్పుడా తోపులు మారుమూలలోగాని కనిపించుట లేదు. హేమాద్రి చెప్పిన వ్రతములు దానములుకూడ ఎక్కువభాగము జనసామాన్యమునకు ఉపకరించెడివే.

ఆ కాలములో ప్రజల జీవితములో మత మెక్కువ ప్రాముఖ్యము వహించెను. వేమారెడ్డి ఘోడెయరాయ గంగయగురుదేవుల శిష్యుడు. ఈ గంగయగురుదేవు లెవరో స్పష్టముగా తెలియరాదు. ఆయన శైవుడనియు, పాశుపతశైవ సంప్రదాయమువాడనియు చరిత్రకారులూహించినారు. గంగయగురుదేవుడేమో కాని వేమారెడ్డి మాత్రము శైవుడుకాడు, వైష్ణవుడు కాడు. అతడు స్మార్తుడు.

మంచాళ శాసనము 'వరాహవదనో హరిః' అనియు, ముట్లూరు శాసనము 'పాయా ద్వరాహవపుషః పరమస్య పుంసః-' అనియు, వేమపుర శాసనము 'శ్రీమత్కోమల నీల నీరజరుచిః లీలావరాహః-' అనియు వరాహస్వామి స్తోత్రముతో ప్రారంభించుచున్నవి. అతడు కృతిపొందిన కృతులు హరివంశము, రామాయణము, హరివంశములో మొదటిపద్యము శ్రీనాథుని ప్రార్థనము.

శ్రీనాథుని స్తవము వెంటనే పై యన్నింటిలో పార్వతీపతి స్తవమును కానవచ్చును. వేముని రాజముద్ర బసవశంకర ముద్ర, అతడు శ్రీశైలములో పాతాళ గంగకును, అహోబలములో నరసింహస్వామికి మెట్లు కట్టించెను. ఎర్రయ అతనిని హరివంశములో నొకచోట,

"శ్రీకంఠ చరణ సేవక
వైకుంఠ గుణావధాన వర్ణననిపుణా!"

అనియు ఇంకొక చోట,

"శ్రీనాథ కథా శ్రుతి ని
త్యానంద స్యంద మందిరాంతఃకరణా!"

అనియు ఆశ్వాసాదిపద్యములలో సంబోధించెను. అందుచే వేమారెడ్డి శైవుడని కాని, వైష్ణవుడని కాని చెప్పుట సరికాదు. అతడు స్మార్తుడు. అతడిచ్చిన యగ్రహారములన్నియు యజ్ఞ యాగాది కర్మలు విస్తారముగా చేసిన స్మార్తులకే. అతని ప్రభుత్వములో మత విద్వేషములకు స్థానము లేదు.

అతడు ఎర్రయచే రామాయణము చెప్పించి అత్యుత్తమ ఖ్యాతింబొందితినని భావించిన వినయాలంకారుడు. మరల హరివంశము కృతినంద నుద్దేశించి కవిని 'సవినయంబుగా పూజించి సమగ్ర సంప్రార్థనంబు' చేసిన మహాభాగ్యుడు. ఆతడు చేసిన దానములు వ్రతములు నిరుపమానములు. అవి యన్నియు నాతడు తన ధన్యత కొరకే కావించెను. అతడు ప్రజాపరిపాలనము కావించినది ధర్మవృషభమును నాలుగు కాళ్ళమీద నడిపించుటకే. అతడు శాసనముద్రగా బసవశంకర ముద్రను స్వీకరించెను. అది రెండు ముంగాళ్లు పైకెత్తి చెంగనాలు వేయుచున్న ధర్మవృషభమూర్తి! ఎర్రయ చెప్పినట్లు వేమారెడ్డి భూవినుత గుణాభిరాముడు, పావన చరిత్రుడు, సాధిత సర్వధర్ముడు, అవసాదిత దుర్జనకర్ముడు, సత్యనిత్య ప్రవర్తుడు, యశోగాంగజితైకపావనుడు.

ఎర్రయ తన హరివంశము వేమారెడ్డికి శ్రీవిభుడు శుభము కూర్చుగాక యను ప్రథమ ప్రార్థనా పద్యములో వేమవిభునకు గూడ ధ్వని రూపముగా నన్వయించి లక్షణలతోడనే శ్రీవిభుని వర్ణించినాడు.

"శ్రీకిం బ్రేమపదంబు, భూమికి
నతిస్నిగ్ధుండు, దుగ్ధాబ్ధి శ
య్యాకేళీరతుఁ, డాదివేధకు
గృహంబై యొప్పు నాభిస్థనా
శీకంబుం గల వేల్పు, లోకములఁ
బాలింపం బ్రభుం, డుత్తమ
శ్లోకుం, డన్నమ వేమ భూవిభున
కిచ్చున్ సుస్థిరైశ్వర్యముల్ !"

(Andhra Association, Delhi వారి
Silver jubilee Souvenir (1935-1960) లో ముద్రితము.)

# కవి ధూర్జటి

ఆంధ్ర కవులలో కవిత్రయము వారు ఋషితుల్యులు. శ్రీనాథుడు బ్రాహ్మీమూర్తి. అన్నివిధాలా పెద్దరికము వహించినవాడు పెద్దన. బహుముఖ ప్రజ్ఞాశాలి తెనాలి రామలింగకృష్ణుడు.— ఇట్లే ఎందరో పూజ్యులున్నారు. కాని, వారిలో ఎక్కువమందిని గూర్చి మనకు తెలిసినది బహు తక్కువ. కవిత్రయమును గూర్చి ఏమీ తెలియదనే చెప్పవచ్చును. పోతనను గూర్చి వినేది మాబోటి వారికి కూడా నమ్మడానికి మించిన కట్టుకథలతోను, తెలిసినదానికి విరుద్ధమైనదిగాను ఉన్నది. అతడు ప్రత్యేకముగా రామభక్తుడు కాదనీ, దారిద్ర్యముతో ఎంత మాత్రమూ బాధపడినవాడు కాదనీ, నిశ్చయింప వచ్చునంటే చాలామందికి ఆశ్చర్యం కలుగుతుంది. తెనాలి రాముని గూర్చిన కథలు దక్షిణదేశమంతా విశేష వ్యాప్తినొందినా, అవి ఎంత సత్యపూర్వకములో తెలిసికోలేనంతగా వ్యాపించినవి. చాటువులను బట్టి, శ్రీనాధుని గూర్చి కొంత తెలియవస్తున్నది కాని ఆయన సొంత చాటువులేవో, ఆయనకు తమ అల్పత్వమును ప్రదర్శిస్తూ ఇతరులు అంటగట్టినవేవో, వేరుచేసేందుకు వీలులేనట్లుగా ఉన్నవి.

కాని, కవి ధూర్జటి విషయమట్లాకాదు. ధూర్జటిని మహాకవి అనటానికి నాకు మనసొప్పదు. పైన పేర్కొన్న కవుల స్థాయిలో చేర్చదగిన కవికూడా అనినేనను. కాని అతడు నిస్సందేహముగా కవి! అదేమీ తక్కువ గౌరవము కాదు. కవి ధూర్జటిని గూర్చి మనకు తెలిసినది చాల ఉన్నది.

ఏమిటది? అతడు పుట్టిన తేది, గిట్టిన తేది, ఏ ఉద్యోగము చేసెను, —ఇవేవీ మనకు తెలియదు. అతని రూపమెట్టిది, ముక్కు పెద్దదా? రంగెట్టిది? — ఇవి తెలియవు. కాని, అతనిని గూర్చి ముఖ్యముగా తెలియవలసినదంతా మనకు తెలియును.

ఏమిటది? ఆతడు మనకు ఆత్మీయుడు, మనవలెనే ఎన్నో తప్పులు చేసినవాడు, రాగ ద్వేషములతో నిండి ఉన్నవాడు. రాజ సమ్మానము పొంది అందలములలో ఊరేగి అశ్వములపై స్వారీ చేసినవాడు; తన చుట్టూ స్తోత్రపాఠకులు చేరిపొగడగా, పొంగి ఒళ్ళు మరచినవాడు. కామోద్రేకము కలిగినప్పుడు వేశ్యాజనముతో లోలుపభావముతో సంచరించిన వాడు. భార్యా పిల్లలు, వియ్యమందుట, ఇచ్చి పుచ్చుకొనుట, మొదలైన బాంధవ్యములలో సతమతమైనవాడు. తనకు జ్ఞాతులు ద్రోహముచేయగా బాధపడి పట్టలేని ద్వేషముతో తబ్బిబ్బైనవాడు. చదువు కొన్నవాడు. శిష్యులకు పాదతీర్థము లిచ్చిన అయ్యవారు.

ఈ విధంగా మనవంటి అతి సామాన్య మానవ మాత్రుడై ఉండి కూడా, మరి ఒక వంక శ్రీ కాళహస్తీశ్వరుణ్ణి భక్తితో సేవించిన వాడు. భక్తులను ఈసడించే ఈకాలం వాళ్ళు అతని భక్తి దొంగభక్తి అనవచ్చు! అంటారు కూడాను కాని ఆతని ఆర్తి వినండి!

"కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు, వక్షోజముల్
రాయ న్రాపడె రొమ్ము, మన్మథ విహారక్లేశ విభ్రాంతిచే
ప్రాయం బాయెను, బట్టకట్టె తల చెప్పన్ రోత, సంసారమే
చేయం జాల, విరక్తు జేయగదవే శ్రీ కాళహస్తీశ్వరా!"

దొంగభక్తుడు ఈ విధంగా అనగలడా? వయస్సు వచ్చినా కామ శక్తి పోలేదు. అవశుడై కామానికి లొంగి పోతున్నాడు. "అయ్యో నన్ను విరక్తుణ్ణి చేయవయ్యా తండ్రీ!" అని భగవంతునికి మొరపెట్టు కొంటు న్నాడు! విరక్తుడనైనా నని చెప్పుకోకూడదా, దొంగభక్తుడైతే!

అతనికి జ్ఞాతులు ద్రోహము చేశారు. ప్రతిక్రియ చేయగలడు కాని దోషమని మానుకొన్నాడు. పోనీ, అంతా వదులుకొని సన్యసించి పోదామా అంటే, మనస్సులో ఉన్న క్రోధము పోవడము లేదు. ఎట్లా తండ్రీ? అని కాళహస్తీశ్వరునికి ఇంకో పద్యంలో నివేదించుకొన్నాడు.

రాజసేవలో ఒకరిని చంపి పదస్థులై బ్రతకడానికి ఒక్కొక్కరు ఊహి స్తారు. అయ్యో, వీళ్లు మాత్రము చావరా, శాశ్వతంగా బ్రతుకుతారా అని వాపోవుతున్నాడు. తిమ్మరుసు మహాప్రధానిని గద్దె దింపించిన

మహానుభావుణ్ణి గూర్చి చెప్పిన పద్యమని నాకు ఊహ కలుగుతున్నది. అది కొండమరసు అయి ఉండవచ్చు. తిమ్మరసు కుమారుని ఉద్యోగాదులు కొండమరసు కుమారునికి వెంటనే వచ్చినవి. సంవత్సరంలోగానే కొండమరసు చనిపోయినాడు. ఈ మాటలు మనస్సులో ఉంచుకుని చెప్పిన ఆ పద్యం వినండి.

ఒకరిం జంపి పదస్థులై బ్రతక దా
మొక్కొక్క రూహింతురే
లోకో, తామెన్నఁడు జావరో, తమకు బో
వో సంపదల్ పుత్ర మి
త్ర కళత్రాదుల తోడ నిత్య సుఖమం
దం గందురో, ఉన్నవా
రికి లేదో మృతి యెన్నఁడుం, గటకటా!
శ్రీ కాళహస్తీశ్వరా!

ధూర్జటి అన్యాయం జరుగుతుంటే చూస్తూ మన కెందుకని ఊరుకొనే బాపతు వాడు కాదు. ప్రజాస్వామికమున్న ఈ రోజులలోనే చాలా మంది అన్యాయం కళ్ళారా చూస్తూ ఊరుకుంటారు. నిరంకుశాధికారం గల రాజు గారి ఎదుట తన అభిప్రాయం చెప్పడానికి ఎంత గట్టి గుండె ఉండవలెనో ఆలోచించండి! ధూర్జటి ఏదో కల్పించుకొని చెప్పజూచినాడు. ముక్కచీవాట్లు తిన్నాడు. వినండి!

నిచ్చల్ నిన్ను భజించి చిన్మయ మహా
నిర్వాణ పీఠంబుపై
రచ్చల్ సేయక యార్జవంబు కుజన
వ్రాతంబుచే గ్రాగి, భూ
భృచ్చండాలురఁ గొల్చి, వారు తను గో
పింపన్ బుధుండార్తుడై
చిచ్చారం చమురెల్ల జల్లుకొనునో
శ్రీ కాళహస్తీశ్వరా!

తనకు జరిగిన పరాభవానికి నోరు మూసికొని ఏడ్చుకొనే భక్తుడు కాడతడు మనస్సు ఉడికి పోయింది. తానేమీ చేయలేడు! తనకు సర్వ సహాయకుడైన భగవంతుణ్ణి తిడుతున్నాడు.

"నిను నిందించిన దక్షుపై దెగవో, వాణీనాధు శాసింపవో,
చనునా నీ పదపద్మ సేవకుల దుచ్ఛంబాడు దుర్మార్గులం
బెనుపన్, నీకును నీదు భక్త తతికిన్ భేదంబు గానంగ వ
చ్చెనొ, లేకుండిన నూరకుండగలవా శ్రీ కాళహస్తీశ్వరా!"

అంతేకాదు!

కరిదైత్యున్ బొరిగొన్న శూలము కరగ్రస్తంబుగాదో, రతీ
శ్వరునిం గాల్చిన ఫాలలోచన శిఖావర్గంబు చల్లారెనో,
పరనిందాపరులన్ వధింపవు! —

కొంత కాలానికి మొదట వచ్చిన కోపపు పొంగు చల్లారినది. ఎందుకీ పొరపాటు జరిగినదని విచారణ చేస్తున్నాడు.

రాజన్నంతనె పోవునా కృపయు ధర్మం బాభిజాత్యంబు వి
ద్యాజాతక్షమ సత్యభాషణము విద్వన్మిత్ర సంరక్షయున్
సౌజన్యంబు కృతం బెరుంగుటయు విశ్వాసంబు, కాకున్నదు
ర్బీజ శ్రేష్ఠులుగా గతంబు గలదే శ్రీ కాళహస్తీశ్వరా!

ధూర్జటి తమ్ముని మనుమడైన కుమార ధూర్జటి శ్రీకృష్ణదేవరాయల యాస్థానంలో పొందిన గౌరవ మిట్లా వర్ణించినాడు.

"స్తుత మతియైన యాంధ్ర కవి ధూర్జటి పల్కుల కేల గల్గెనో
అతులిత మాధురీ మహిమ నా మును మా పెదతాత చాల స
న్నుతి గనె కృష్ణరాయల మనోజ్ఞసభన్"

కాని ధూర్జటి ఆ గౌరవాలను గూర్చి తుదకు ఇట్లా అన్నాడు:

రాజుల్మత్తులు, వారిసేవ నరక ప్రాయంబు వారిచ్చు నం
భోజాక్షీ చతురంత యాన తురగీ భూషాదు లాత్మవ్యథా
బీజంబుల్, తదపేక్ష చాలు, పరితృప్తిం బొందితిన్, జ్ఞానల
క్ష్మీజాగ్రత్పరిణామ మిమ్ము దయతో, శ్రీ కాలహస్తీశ్వరా!

స్వామితో ఒక బేరానికి దిగి ఒడబాటు చేసికొన్నాడు, "నీ సేవ వేడ్కతో ఎల్లప్పుడూ చేస్తాను. నాకు కానీ జీతము వద్దు! నాకు నీవు ఒక్కటే ఉపకారం చేయవలె! నన్ను అరిషడ్వర్గం చేతులకుఅప్పగింపకు!- అదే చాలునయ్యా!"-

ప్రభువుల సేవ చేసిచేసి అసహ్యపడి చివరకు దీక్ష పట్టినాడు.

> "నీకుం గాని కవిత్వ మెవ్వరికి నే నీనంచు మీదెత్తితిన్,
> చేకొంటిన్ బిరుదంబు, కంకణము ముందే గట్టితిన్, పట్టితిన్
> లోకుల్ మెచ్చ వ్రతంబు"

నాతో నీకేమీ పనిలేదు గదా, నామీద ఈ పద్యాలన్నీ ఎందుకు చెప్పుతున్నావయ్యా అని ఒకనాడు కాళహస్తీశ్వరుడు ధూర్జటిని అడిగి నాడు. వెంటనే ధూర్జటి జవాబిచ్చినాడు.

> "నాదు జి
> హ్వకు నైసర్గిక కృత్య మింతతు సుమా ప్రార్థించుటే కాదు కో
> రికలన్ నిన్నును గాన నాకు వశమా!"

అని జవాబిచ్చినాడు.

ఈ పద్యంలో అతడు నైసర్గికంగా కవి అని తేలుతున్నది. మహా భక్తుడు కూడా ఐనాడు. కవులము, ఇంత బాగా చెప్పినాము. అని తమ కృతులను చదువుకొని మురిసి పొంగిపోయే వాళ్ళు ఏ కాలంలో కూడా వుంటారు. అట్టి వాళ్ళను ఉద్దేశించి ఇట్లా అంటున్నాడు:

> "ఏ లీలన్ నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షా ధ్వని వ్యంగ్య శ
> బ్ధాలంకార విశేష భాషల కలభ్యంబైన నీ రూపమున్
> చాలుం జాలు కవిత్వమున్ నిలుచునే వత్యంబు వర్ణించుచో,
> ఛీ, లజ్జింపరు గాక మాదృశకవుల్ శ్రీ కాళహస్తీశ్వరా!"

ఈ విధంగా ధూర్జటి శ్రీ కాళహస్తీశ్వర శతకము భావనా బలంతో ఆ కాలపు చరిత్రతో జోడించి చూస్తే, ఎన్నెన్నో ఆత్మీయ విషయాలు

ప్రత్యక్ష మౌతాయి. దానితో శ్రీ కాళహస్తి మహాత్మ్యము జోడించి చూస్తే ఇంకా ఎన్నెన్నో విషయాలు బయట పడతవి. నత్కీరుని కథలో ధూర్జటి తన్నే చిత్రించుకొన్నట్లు తోస్తుంది. శ్రీకృష్ణదేవరాయల భువన విజయములో గోష్ఠి తీరుతెన్నులు కూడా ధూర్జటి కావ్యాలలో గోచరిస్తాయి.

ఎన్ని చూచినా ఒకటే. కవి ధూర్జటి కూడా మనవంటి వాడే! ఎన్నో తప్పులు చేసిన వాడే! కామక్రోధాదులతో సతమతమైన వాడే! ఐతే, మనకూ అతనకీ రెండే భేదాలు. మనవలె కాక, అతడు లోపాలన్నీ నిర్భయంగా చాటుకున్నాడు. మనవలె కాక అతడు ఆర్తితో ఈశ్వరుణ్ణి ఉద్ధరించమని శరణాగతుడైనాడు!

విజయవాణి (మకర సంక్రాంతి) 14-1-1966

# వచనకవిత -

# అభిమానుల అత్యుక్తులు

"పరమ వివేక సౌరభ విభాసిత
సద్గుణపుంజ వారిజో
త్కర రుచిరంబులై సకల
గమ్యసుతీర్థములై మహామనో
హర సుచరిత్ర పావనపయః
పరిపూర్ణములైవ సత్సభాం
తర సరసీవనంబుల ముదం
బొనరం గొనియాడి వేడుకన్"

ఈ విధంగా నన్నయ కొనియాడిన సభలు 'సకల గమ్యసుతీర్థములు' కాని విద్యాంసులూ, ప్రభువులూ మాత్రము సమావిష్టులైన పరిమిత సభలుకావు. ఆ సభలలో సత్కవులు కావ్యాలు వినిపించి సభ్యుల మెప్పు పొందినప్పుడే కృతార్థత పొందేవారు.

నేడు మహాపట్టణాలలో కూడుతున్న సభలు కూడా సకల గమ్యములే. కాని నేటి సభలను రంజింప జేస్తున్నది చిత్రకవిత్వ సదృశమై, కేవల చమత్కార మాత్రములైన కావ్యాలే కాని ఉత్తమశ్రేణి కావ్యాలు కాకపోవడము శోచింపదగినది. ఈ సభలను రంజింప జేయడానికి కావ్యగత చిత్రత లేకపోతే, శ్రావ్యమైన కంఠమో, పఠన వైచిత్రియో అవసరమవుతున్నవి.

సభల సంగతి ఇట్లా ఉండగా, ఇక అక్షరరూపము ధరించిన వాఙ్మయము సంగతి ఆలోచిస్తే, పత్రికలు ప్రాధాన్యము వహిస్తున్నవి. అవి జనుల అభిప్రాయాలను ప్రతిబింబించవలె. ఇది ప్రచార యుగము గనుక రాజకీయాది కారణాలవల్ల దేనికి ఎక్కువ ప్రచారము ఉంటే, అదే

ఉత్తమ కావ్యంగా చలామణీ అవుతున్నది. ప్రచారాధిక్యమువల్ల కొందరి కావ్యాల గుణదోషాలు శాంతంగా విచారణ చేయడమే పాపంగా పరిగణింపబడుతున్నది. ఐనా కొందరైనా దానికి పూనుకోకపోతే కిల్బిష మంటుకొంటుంది అనే భయంతో ఇట్టి విచారణకు పూనుకొనవలసి వచ్చినది.

నేడు ముఖ్యముగా యువతీ యువకులను, విస్తార ప్రచార ఫలితంగా, ఎక్కువ ఆకర్షిస్తున్నది వచన కవితాప్రక్రియ. కొందరు దీనినే వచనగేయమనీ, ఫ్రీవర్సులనీ, స్వచ్ఛంద కవిత్వము, అనిబద్ధ కవిత్వము, ముక్తచ్ఛంద కవిత, వెర్సులిబ్రే-ఇత్యాది నామాలతో, ఎవరి అభిమానము కొద్దీ వారు పిలుస్తున్నారు. ఏ పేరు పెట్టినా, అది పద్య ఛందస్సునుగాని గేయచ్ఛందస్సుగాని ఆదరించక, వాటికికట్టుపడక స్వతంత్రంగా వచనమే పద్యంగా రూపొందే ప్రక్రియ.

## 2

ఈ వచనకవితా ప్రక్రియా స్వరూపము పలువురు పలువిధాలుగా నిర్వచనము చేస్తున్నారుకాని వారిలో సంయమముతో ఆలోచించి వ్రాయగలవారి మాటలలో కొంత ఏకవాక్యత ఏర్పడుతున్నది. అన్నిటిలో ప్రధానమైన లక్షణము ఒక క్రొత్త లయ.

ఈ లయను ఎక్కువమంది 'భావలయ' అని వ్యవహరిస్తున్నారు. ఛందస్సులలో ఎక్కువ కృషిచేసిన శ్రీ సంపత్కుమార వంటి వారు ఇందులో 'భావగుణాలు' ఉంటవంటున్నారు.

భావలయతోపాటు 'తూగు' అనే గుణం కూడా ఒకటి ఉన్నదంటున్నారు. ఈ తూగు లయకు పర్యాయపదమో, భావలయలోని ఒకానొక అవాంతరగుణమో వారి మాటలలో స్పష్టపడడములేదు. తూగు వంటివే వారు చెప్పే 'ఊపూ', 'విసురూ' అనే లక్షణాలుకూడాను.

వారు చెప్పే మరో గుణం 'గమనవైవిధ్యం'. సమవృత్తాలలోకంటె ఇంద్రగణ సూర్యగణాలుండే వానిలో అసమానపాదాలు ఉండడమూ, అంతకంటే కూడా కందమూ ఆటవెలదివంటివానిలో పాదాలలో అసమా

నత్వము ఎక్కువగా ఉండుట ముందడుగు అనీ, అంతకంటె ఎక్కువగా పాదాలలో అసమానత్వము వచనకవిత్వము సాధిస్తున్నందున అది మరి కొంత ముందడుగు అనీ, శ్రీ సంపత్కుమార సిద్ధాంతం చేసినారు. ధనికుడూ పేదా, పెద్దాచిన్నా భేదాలు రూపుమాపి వర్గరహితమైన సమాజము నిర్మింపవలెనని కలలుకంటున్న ఈ కాలంలో వచనపద్యాలలో పాదాలలో అసమానత్వం ఎట్లా గ్రాహ్యమవుతుందో, అది ఎట్లా నేటికాల లక్షణాన్ని ప్రతిబింబించగలుగుతుందో ఆలోచించినవాళ్లుగాని నిర్వచించిన వాళ్లుగాని మా దృష్టికి తగులలేదు. సమాజంలో ఉండగూడని అసమానత్వము కవిత్వరూపంలో ఉండవలెనేమో?

ప్రాచీన ఛందస్సులలో ప్రాచీన సంగీతం గోచరించినట్లే వచన కవిత్వంలో నవీనమైన సంగీతము, పారిశ్రామిక యుగధర్మంగా గోచరిస్తుందని కొందరు ప్రతిపాదించినారు. ఈ మాటలు పెద్దఫాక్టరీ పనిచేసేప్పుడు దగ్గరఉండిచూచి వినక, దూరాన సుఖంగా కూచుని, చెప్పేవారికి ఆకర్షకంగా ఉండవచ్చునుగాని, ఫాక్టరిలో పనిచేసే శ్రామికులకుమాత్రము ఆ ధ్వని పిచ్చిఎత్తించకపోదు. పైగా ఆ ధ్వని అసమానంగా కాక అతి సమానంగాఉండే కర్ణకఠోరమైనధ్వని అని మనము గుర్తించుకోవలె.

ఒక్కరు మాత్రము వచనకవితలో లయ మాత్రమేకాదు, 'నాద' మనేదికూడా ఉన్నదన్నారు. ఆ నాదస్వరూపము వారు నిర్ణయించలేదు. అది ప్రణవనాదమో, వీణానాదమో, సింహనాదమో, దర్దురనాదమో–మరి ఏనాదమో తెలియరాదు.

వచనకవిత్వ సిద్ధాంతవాదులంతా అందులో వచనత్వం విరగవలెనంటున్నారు. ఆ వచనత్వం విరగపోతే కేవలవచనమై కవిత కాకుండా పోతుందట. కాబట్టి వచనత్వం విరిచే రచనావిధానం ఎవరికి వారు ఏర్పరచుకోవలెనట. వారిలో ఒకరు విరామచిహ్నాలు బహిష్కరించడము ద్వారా వచనగీతంలో శీఘ్రగమనాన్ని సాధించగా, ఒకరికి అంత్యప్రాస అక్కరకు వచ్చినదట. మరిఒకరు సంస్కృత శబ్దాలను దొంతర్లుగట్టి నిలపడము, మధ్య పద్యపాదాలను నల్లపూసలమధ్య బంగారుపూసలవలె, ఇరికించడమూ, యమకము వాడుకోవడమూ మొదలైన బహుపద్ధతులవల్ల

వచనగుణం విరిచినారుట. ఇంకొకరికి సంస్కృత శబ్ద బంధురత, కావ్య భాషావాసనా, అందుకు సాధనాలైనవట. మరియొకరు భావచిత్రాల వైచిత్రివల్ల జయము సాధించినారట. ఎవరేమి సాధించినా, వచనత్వము విరిచేపద్ధతి వైయక్తిక వ్యవహారమే అనేది సారాంశమట.

సామాన్యులకు పద్య రచనా, గేయ రచనా, కష్టమే అని అంగీక రిద్దాము. పోని, ఈ వచన కవిత తేలికా అంటే, కానే కాదని వారంతా ఏక గ్రీవంగా అంటున్నారు. పైగా పద్య కవిత్వంకంటే చాలా కష్టమట!

'వచన గీతం రాయడంవరకైతే, ఎవరైనా రాస్తారు, ఎందరైనా లాశారు, గాని రాసి మెప్పించినవారు కొద్దిమంది అని ఎక్కువమంది అం గీకరిస్తారు.' అంటూ శ్రీ రమణారెడ్డి దానికి ఛందస్సహాయంగాని, సంగీత సహాయంగాని లేకపోవడం కష్టానికి కారణమంటున్నారు.

వచన పద్య రచన అసిధారావ్రతం అని ఒకరూ, కత్తి అంచుమీద నడకవంటిదని మరొకరూ అన్నారు. వారికందరికీ పట్టుకొన్న భయం ఒకటే. ఒకవైపు జారితే పద్యం కావచ్చు. రెండోవైపైతే వచనం. కేవలం వచనమైతే పేలవం కావచ్చుగాని పద్యమై పోతే కొంపమునిగేదేమిటో మాత్రం అర్థం కావడంలేదు. ఈ ప్రక్రియ వచనానికీ పద్యానికీ దూరంగా ఉండేది కనుకనే కాబోలు వచనకవిత అనే శబ్దము వాడక, కొందరు దీన్ని స్వచ్ఛందకవిత అనీ, ముక్తచ్ఛందో కవిత అని వ్యవహరిస్తున్నారు!

'నిర్మితి విషయమై పద్యకవికంటె కొన్ని రెట్లు ఎక్కువగా వచన కవి శ్రద్ధచూపవలసి ఉంటుంది' అంటూ శ్రీ రమణారెడ్డి ఇంకా ఇట్లా అంటున్నారు. 'ఎవ్వరేమన్నా వచన గీతాలు కుప్ప తెప్పలుగా వస్తు న్నాయి. పరమ వచనంకూడా కవిత్వమై పోతున్నది. వచనంగా చెడి పోయిన సరుకుకూడా కవిత్వమై పోతున్నది. అంత్యప్రాసలు నిలిపితే ఓడలు బండ్లౌతున్నాయి.

## 3

మరి, చక్కని రాజమార్గాలైన ఛందోగేయ రచన లవలంబించక వాటిని వదిలి, ఒక నిర్దిష్టమైన విధానము లేక, అగమ్యమైన అరణ్యము

వంటిదో, దారిలేని ఎడారివంటిదో ఐన ఈ వచన కవితాప్రక్రియ ఎందుకు వీరు అవలంబిస్తున్నట్లు? ఇంత సూక్ష్మంగా వారెవరూ ప్రశ్నించుకోలేదు కాని మొత్తముమీద దానికి రకరకాలుగా సమాధానాలియ్యడానికి యత్నించారు.

శ్రీ వేగుంట మోహనప్రసాద్ సమాధానసారమిది. 'అన్నింటిలోనూ, అందరిలోనూ ఎల్లెడలా వచ్చిన మార్పు--విప్లవం, ఒకానొకపరి మానసిక వైక్లబ్యం—ఇవన్నీ కారణాలు వచన కవితావిర్భావానికి....అశాంతి, ఆవేదన, కలుక్కుమనే జ్ఞాపకాలు, అసంతృప్తి, ఆక్రోశం, ఉక్రోశం, కసి, నిర్వచనం, సందేశం, ఆశయం, ఆచరణ, విమర్శ—యివీ దీని కవితా వస్తువులు........ సాంప్రదాయమైన దుఃఖాన్నుండి విదుల్చుకొన్న కవి ఆత్మనించి జారిపడిన ఒకానొక విశేషం వచన కవిత.'

శ్రీ కందుర్తి ఇట్లా అంటున్నారు. 'అశేష ప్రజానీకానికి ప్రయోజనాత్మకమైన ఆనంద కల్పనయే ప్రధానమనే వాదానికి, కనీసం ఈ నవీన యుగంలో బలం ఎక్కువ. ఏ రంగంలోనైనా పాతకూ కొత్తకూ సంఘర్షణ తప్పదు. పాత ఓటమీ తప్పదు.... ఈ పద్యమే, వృత్తమే తుది స్వరూపమని మాత్రం అంగీకరించం. దీనికంటే మేలైన రూపం ఏదైనా మనస్సుకు తగుల్తుందేమోననే ప్రయత్నం, కొత్త ప్రయోగం నిరంతరం జరుగవల్సిందే.'

మళ్ళీ 'మరి గేయానికి, పద్యంలోనే గేయ గుణానికి అతిశయ ప్రాముఖ్యమిచ్చిన భావకవిత్వం అంత్యక్షణాలలో, దానికి 'రియాక్షను'గా ముక్తఛందోరీతులు వెలువడ్డాయి' అంటారు శ్రీ రమణారెడ్డి.

'యథార్థాన్ని గుర్తించము-కలలు మాకు యథార్థాలు. ఈ జగత్తుతో మాకు పనిలేదు. మాది స్వప్నజగత్తు. సంపన్నులు, భాషా సంపన్నులు మాకు విరోధులు. కావ్యలక్షణాలే ఆ అవలక్షణాలు....వ్యక్తాన్ని వదలిపెడతాము. వ్యక్తావ్యక్తంలో ఈత కొడతాము' ఇత్యాదిగా అపలాపించినాడు శ్రీరంగం నారాయణబాబు. ఛందోరీతులనుగూర్చి గాఢపరిశ్రమ చేసినవారిలో శ్రీ సంపత్కుమార అగ్రశ్రేణిలోనివారు కాబట్టి వారి

మాటలకు ఎక్కువ విలువ యియ్యడము న్యాయము. వారి భావముల సారాంశమిది:

'పూర్వకాలం పద్యనియమాలు సడలించడానికి చేసిన ప్రయత్నాల వలెనే, ఆధునిక కాలంలోగూడా మరికొంత విస్తృతమైన అన్వేషణ జరిగింది. భావకవులు పద్యాలు వ్రాసినా సంగీత స్పర్శవల్ల ఆకర్షణీయమైన గేయస్వరూపాన్ని అధికంగా స్వీకరించినారు. ఆ గేయంకంటెకూడా అధికమయిన సడలింపులుగల మరొక కొత్త ఛందోరీతికోసం ప్రయత్నించడం సహజ పరిణామానికి చిహ్నమే. అలాంటి పరిణామంలోనే గేయాన్నికూడా వదలవలెననే ఊహ ఒక సహజక్రమంలోనే వచ్చింది. అనేక కారణాల వల్ల, అనేక సౌలభ్యాలవల్ల వచన రచనా ప్రక్రియ విపరీతంగా పెరిగిపోయింది. వివిధ శాఖలుగా విస్తరించినది. మిగిలిన అనేక ప్రక్రియలకు వలెనే పాశ్చాత్య సాహిత్య సంపర్కం ద్వారా అధికమైన ప్రేరణా ప్రోత్సాహము వ్యాప్తి జరిగింది.'

కొందరు నేటి పారిశ్రామిక యుగధర్మంగా వచన కవిత ఆవిర్భవించిన దన్నారు.

స్వాంతత్ర్యోన్ముఖముగా నేడు సాగుతున్న స్వతంత్ర సమరంలో సర్వబంధాలనుంచీ విడివడ్డదే స్వచ్ఛంద కవిత అని కొందరి మతము.

'పద్యం రైలు బండి నడకవంటిది—
గద్యం విమాన విహారం వంటిది'

అన్నారు శ్రీ శ్రీ. ఆయనే మరొక మాటకూడా అన్నారు.

'గణబద్ధ ఛందస్సులు ఫ్యూడలిజము, మాత్రాచ్ఛందస్సులు ప్రజాస్వామ్యం పేరిటి కేపిటలిజము, స్వేచ్ఛావచన కవిత్వ రూపాలు సోషలిజము.'

కాని పై నుదాహరించిన శ్రీ శ్రీ మాటలను 'సమాజ పురోగతిలోని ఒక్కొక్క ఆర్థిక వ్యవస్థకు అనుగుణంగా కవిత్వ బహిస్స్వరూపం ఒక్కొక్క విధంగా ఉంటుందని చెప్పడం చరిత్రను చాలా సులువుగా

తేల్చిపారవెయ్యడ' మంటూ 'ఇది శ్రీ శ్రీ అంతటి కవికి కూడా సాహసమే ననాలి' అనీ శ్రీ రమణారెడ్డి వ్రాసివేసినారు.

వచన కవిత ఒక ఉద్యమమని అభిమానిస్తున్న శ్రీ కుందుర్తి 'వచనగేయం వర్ధిల్లాలంటే నేటి కవులు కొన్ని నియమాలను పాటించాలి. సమకాలీనమైన జీవితచిత్రణం, తెనుగుదనం, ప్రగతిశీలమైన దృక్పథం, వ్యవహార భాషాప్రద ప్రయోగపరత్వం, ఛందో గ్రాంథికబంధ విచ్ఛేదనం. అస్పష్టతాదోష బహిష్కారం అవలంబించవలె'నని ప్రతిపాదించగా శ్రీరమణారెడ్డి కొంత అంగీకరించినట్లే ప్రారంభించి, ఈ లక్షణాలను ఒక దాని తర్వాత ఒకటి కత్తిరించి వేసినారు. ఏమైనప్పటికీ పైన శ్రీ కుందుర్తి కాంక్షించిన నియమాలలో ఏవో ఒకటో రెండో ప్రభావితం చేయడమువల్లనే వచన కవిత ఒక్కొక్కరిలో ప్రాదుర్భవించి విస్తరిస్తున్నదనడము సత్యదూరము కాదు.

## 4

కవితారూపంలో కొత్తప్రక్రియకొరకు జరుపుతున్న అన్వేషణే వచన కవితా రచన అంటే—అది పూర్తిగా సత్యము కాకపోయినా— అంత బాధలేదు. శ్రీ కుందుర్తి వచన కవిత ఎక్కువగా వ్రాయడమేకాక, దానినిగూర్చికూడా ఎంతో వ్రాసినవారు. ఆయనకు కవి ఋషి కావలెననే ఆకాంక్ష ఉన్నది. రచన నాలుగు కాలలపాటు నిలవవలెనంటే వచనకవులు "కొంటె కోణాల' వంటివి విసర్జించవలెననీ, ఆధునిక కవికి ఉండవలసిన ముఖ్యలక్షణాలలో చిత్రకవిత్వంకూడా ఒకటా అని అనుమానం వచ్చేటంతగా అవి పెరిగిపోతున్నవనీ, వాటిని ప్రజలు సహించరనీ బాధవ్యక్తము చేసిన వారు. ఈ నూతన సృష్టి ప్రజల దృష్టికి రావాలంటే, కేవల పండితులను మూర్ఖపండితులని నిరసించక, వారినికూడా ఈ ప్రక్రియను అంగీకరించేటట్లు చేయవలెననే తహతహ కలవారు. అదిగాక తన కవితా సంకలనంచేత సోవియటులాండు బహుమతిని గత సంవత్సరమూ, ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడెమీవారి బహుమతిని ఈ సంవత్సరమూ గ్రహించినవారు. అట్టి శ్రీ కుందుర్తి 'స్వాతంత్ర్యోత్తరకాలాన తెలుగు కవిత'అనే జనధర్మ 1969 డిసెంబరు ప్రత్యేకసంచికలో 'స్వాతంత్ర్యానంతర

కవిత' అనే వ్యాసంలో ఈ క్రిందివిధంగా వ్రాశారు. ముఖ్యంగా ఆ వాక్యాలే వచనకవితా తత్వ విచారణ చేయడానికి ఈ వ్యాసకర్తను పురికొల్పినవి.

'స్వాతంత్ర్యానంతర కవిత్వమంటే స్థూలంగా శ్రీశ్రీయుగంలోని కవితావికాసమని చెప్పుకోవచ్చును. ఎందుకంటే పాతపద్ధతికి సంబంధించిన పద్యకావ్యాలు ఎప్పుడూ వస్తూనేవుంటాయి. వాటికి బానిసత్వంతోగానీ, స్వాతంత్ర్యంతోగానీ అంతగా సంబంధంలేదు. కొయ్యఅచ్చుపెట్టి వినాయకుడిబొమ్మలు వరుసగా తీసినట్లు ఒకేభాష, ఒకే భావనతో వెలువడుతుంటాయి. జీవితంలోవచ్చే మార్పులను అవి ప్రతిఫలించవు........సాహిత్యంలో తిరిగి ప్రయోజనవాదాన్ని ప్రవేశపెట్టిన ఘనత శ్రీ వీరేశలింగంగారిది. దీనిఫలితమే శ్రీశ్రీయుగం. ఆనాటినుండి నేటివరకు కవిత్వంలో ప్రయోజనవాదమూ, కళావాదమూ—రెండూ ఒకదానివరసనే ఒకటి సమానాంతరరేఖల్లా నడుస్తున్నవి........ప్రయోజనవాదము నెగ్గింది కనుకనే భాషలో వ్యావహారికవాదము నెగ్గింది. భావములో అభ్యుదయవాదము నెగ్గింది. రూపములో వచనగేయ వాదము నెగ్గింది. అందువల్ల స్వాతంత్ర్యానంతర కవిత్వమంటే వచనగేయ కవితావికాసమన్నమాట.'

పై వానిలో ప్రయోజనవాదమూ, అభ్యుదయవాదమూ, వచనగేయవాదమూ నెగ్గినవనేది ముందు విచారణచేసి ఆ తర్వాత పాతపద్ధతి కావ్యాలు వినాయకుని అచ్చుబొమ్మలు అనేమాట విచారిద్దాము.

కవితలో శ్రీ వీరేశలింగము ప్రయోజనవాదానికి ప్రవర్తకుడుగదా! ఆయన గతించి ఇప్పటికి 52 సం.లు మాత్రము. ఆయన ఆంధ్రకవుల చరిత్రనుగూర్చి చేసిన కృషి నేటికీ గౌరవింప బడుతున్నది, కాని అతిబాల్యవివాహాలూ, వితంతు పునర్వివాహాలూ, బ్రాహ్మమతబోధ, సంఘసంస్కరణముకోసము వారు రచించిన కావ్యాత్మక రచనలు ఇప్పటికి ముప్పై ఏళ్ళకు పూర్వమే విస్మృతప్రాయాలైనవంటే అతిశయోక్తికాదు. అవి పునర్ముద్రణ అవుతున్నవంటే, అందుకు కారణం వాటి సాహిత్యపు విలువకాక ఆ రచయిత, వ్యక్తి గొప్పదనముమీది గౌరవము. వారు ఉద్దేశించిన సంస్కరణలు వచ్చిన తర్వాత వారి రచన ప్రయోజనము తీరిపోయి అవి విస్మరింపబడినవి.

శ్రీ శ్రీ యుగము అభ్యుదయ మనే పేరుతో కమ్యూనిజము ప్రచారము ధ్యేయంగాపెట్టుకొన్నది. శ్రీ వీరేశలింగముగారికి ఉన్నంత ప్రతిభకాని, పాండిత్యముగాని, లోకానుభవముగాని, వైవిధ్యముగాని శ్రీశ్రీకిగాని ఆ యుగములోని మరి యే ఒకరికిగాని లేవనడము అతిశయోక్తి కాదు. వీరేశలింగంగారు కడపిన నిర్భయ జీవితముకూడా వీరి కందరికీ అచుంబిత విషయమని మనము గుర్తుంచుకోవలెను. వారికి వ్యక్తిగతముగా లభించిన గౌరవమువల్ల వారి రచనలను పునర్ముద్రణమైనా చేస్తున్నారు.

మరి ఈ అభ్యుదయకవులు కోరిన అభ్యుదయమే ప్రాప్తిస్తే, శ్రీ శ్రీయుగరచనలగతి ఏమికాను! వారిలో ఎవ్వరికి శ్రీ వీరేశలింగముగారికి వ్యక్తిగతముగా ఉన్న ఔన్నత్యములేదే! శ్రీశ్రీ మొదటభావకవిగా 'ప్రభవ' ప్రచురించినాడు. తర్వాత కొన్నాళ్ళు అభ్యుదయకవిగా ప్రచారము పొందినాడు. మధ్యకొన్నాళ్ళు అధివాస్తవికత ఇత్యాదులైన 'ఇజము' లలో తల దూర్చినాడు. ఇప్పుడు అభ్యుదయ కవులను కాదని విప్లవకవుల సంఘానికి అధ్యక్షుడైనాడు. ఇప్పుడాయన అభ్యుదయ కవిత్వానికి స్వస్తి చెప్పినట్లు భావిస్తే, ఆయన వదలిన అభ్యుదయ కవిత్వము మరి ఎవరికి కావలసిఉంటుంది? కేవల ప్రయోజనాపేక్షగల కవిత్వము శ్రీ కుందుర్తి కాంక్షించేటట్లుగా నాలుగు కాలాలపాటు నిలవలేదు. ఏ కావ్యమైనా దాని కళాలక్షణాన్నిబట్టి చిరకాలము నిలుస్తుంది. ప్రయోజనము ఆనుషంగికముమాత్రమే.

అభ్యుదయవాదము నెగ్గినదని శ్రీ కుందుర్తి 1969 సం. చివరలో కూడా పట్టుకుని వదలక పైవిధంగా వ్రాసినారు. అంతకుముసుపు 1967 లోనే శ్రీ కుందుర్తి సంపాదకత్వముతో వెలువడిన 'వచన కవిత' అని ఫ్రీవర్సు ఫ్రంటు వారి స్నేహాంజలి ప్రచురణలోనే శ్రీ వరవరరావు 'స్వచ్ఛంద కవిత్వంలో వస్తువు' అనే వ్యాసంలో శ్రీ శ్రీతో ఆరంభమయిన అభ్యుదయ కవితా ఉద్యమం కవితా వస్తువుకూ, సమాజ చైతన్యానికీ ప్రాధాన్యమిస్తే, అందులోని పాయగానే ఆరంభమైన ఫ్రీవర్సు ఉద్యమం రానురాను ఆధునికుల హృదయాల్లో ఒక స్వతంత్ర ప్రవా

హమై తన గమనాన్నే కాదు, గమ్యాన్నే మార్చుకున్నది.' అంటూ ఈనాడు మళ్ళీ కవిసమిష్టిలోంచి వ్యక్తిలోకి పోతున్నాడు. సామ్యవాదంనుంచి వైయక్తిక వాదంలోకి పోతున్నాడు. కొన్ని కొన్ని చోట్ల అరాచక వాదం లోకి పోతున్నాడు అని నిరూపించినారు.

ఇక వచనకవితావాదము నెగ్గినదనేమాట ఉన్నది. ఇప్పుడు పత్రికలలో ముఖ్యంగా యువకులు వ్రాసే కవిత బహుళంగా వచనకవితగా ఉన్నదంటే ఎక్కువ తప్పు పట్టనక్కరలేదుకాని నేటికాలంలో మంచిపద్య గేయకవితలు వ్రాసేవాళ్ళు లేరని కాని-విజ్ఞానశాస్త్రంలో కొత్తసిద్ధాంతము వచ్చినతర్వాత పాతసిద్ధాంతము పరాస్తమయ్యేటట్లుగా-ఈ వచనకవిత్వం ఆవిర్భవించినతర్వాత సృష్ట్యాదినుంచీ ఇప్పటికి 30 సం.ల క్రిందటివరకూ పుట్టిన పద్యకవిత గేయకవితా చదివి ఆనందించేవాళ్ళులేక విస్మృతము లయినవిగాని, అవుతవనిగాని శ్రీ కుందుర్తి అభిప్రాయమైతే, వారికవితా గుణశక్తిని ఏమనాలో తెలియదు. నిజానికి ఆ మాటలకు అదే అర్థమున్నది. వారి ఉద్దేశముకూడా అదే ఐ ఉంటుందనడానికి పాతపద్ధతి పద్యకావ్యాలను వినాయకుని అచ్చుబొమ్మలతో పోల్చడములోనే అభివ్యక్త మవుతున్నది. మా అన్వయమే శ్రీ కుందుర్తి అభిమానమైతే వారికిగల వచనకవితాభిమానము, వారిని అహంభావము తుది అంచులకు తీసుకొనిపోయినదనక తప్పదు.

వారి సంపాదకత్వమున వెలువడిన స్నేహాంజలి ప్రచురణలోనే పై శ్రీ కుందుర్తి అభిప్రాయాన్నే అంతకంటె తీవ్రమైనభాషలో శ్రీ సోమసుందర్ అన్నారు. ఆ మాట లివి:

'త్రిదశత్వం అందుకున్న యీ తరుణంలో ముక్తచ్ఛందకవిత ప్రధాన అధునిక కవితావాహికగా స్థిరపడినట్లు కనిపిస్తోంది....అయినా పూర్వయుగ అవశేషాలయిన లాక్షణిక ఛందోబద్ధకవితలూ (మార్గ), మాత్రాచ్ఛంద కవితలూ (దేశి) వెలువడుతూనే ఉన్నాయి.'

పైన ఉదహరించిన శ్రీ సోమసుందర్ మాటలు శ్రీ కుందుర్తి వాక్యాలకు పైన మేము చేసిన అన్వయమే సరియైనదని బలపరుస్తున్నవి.

# 5

వచన కవితాభిమానులు మాదొక నూతన ప్రయోగమంటే, సహృదయులు కొంత సానుభూతితో దాన్ని పరిశీలించగలరు. కాని ఇది వచ్చిన తర్వాత వెనకటిపద్యకవిత్వానికి, గేయకవిత్వానికి ప్రాచీనయుగావశేషాలు గానేతప్ప స్వయంగా కవిత్వంగా విలువ లేదంటేమాత్రము బుద్ధిమంతులెవరూ సమ్మతించేది కాదు. నాకేదో మెరిసేవస్తువు దొరకగానే - అది గాజుపూసో, రత్నమో నిర్ధారణకాకముందే - కూడబెట్టిన రత్నరాశినంతా సముద్రంలోకి విసరిపారవేస్తాను అని వ్యవహరించేవానిని ఏమంటామో వీరినీ ఆ పేరుతోనే పిలవవలసి ఉంటుంది.

కవిత అనేది మహాసముద్రము. దానిలో మధ్య మధ్య బుడగలూ, నురుగుతరకలూ తేరుకొని మెరిపించి మాయమవుతూఉంటవి. అట్లాగే కవిత్వంలో మధ్యమధ్య తలచూపే షాషనుకూడాను. 'పైపై వ న్నెల్ పచరింప దాని దిలకింపంబోరు ధీరోత్తముల్.' వచనకవిత్వము ఇప్పటికి సాధించినది చాలా స్వల్పము. విశేషమేదైనా భావిలో సాధించవలెనంటే ఇటువంటి అహంభావధోరణులు వదలిపెట్టి కార్యదీక్షలో మగ్నులు కావలె.

మాబోంట్లకు వచనమంటే నిరసనములేదు. వేదములో ఎంతో వచనభాగమున్నది. ఉపనిషత్తులు చాలా భాగము వచనమయములే. అందులో తక్కిన విశేషాలు అట్లాఉంచి కేవల కవిత్వంగా చూచిన మానవమాత్రు లందుకోలేని మధురోదాత్తభాగాలున్నవి. ఈ వచనకవితావాదులు తమ కవితలో ఉన్నవనే లక్షణాలన్నీ ఆ భాగాలకు అన్వయిస్తవి. కాస్త ఓపికతో వేదవాఙ్మయము తరిస్తే కొత్తదారులు కూడా వారికి దొరకుతవి.

మరి మనకు సన్నిహితులైన కన్నడ వీరశైవ భక్తుల వచనాలున్నవి. చూడండి, ఈ బసవన వచనము:

'ఎత్తెత్త నోడిద రత్తత్త నీనే దేవ
సకలవిస్తారద రూహు నీనే దేవ
విశ్వతో చక్షు నీనే దేవ

విశ్వతోముఖ నీనే దేవ
విశ్వతోబహు నీనే దేవ
విశ్వతోపాద నీనే దేవ కూడలసంగమదేవ.'

అక్కమహాదేవి ఈ వచనము చూడండి !

'నెలద మరెయ నిధానదంతె
పలద మరెయ రుచి యంతె
శిలెయ యరెయ హేమ దంతె
తిలద మరెయ తైల దంతె
మరద మరెయ తేజ దంతె,
భావద మరెయ బ్రహ్మవాగిప్ప
చెన్నమల్లికార్జునన నిలవనారూ అరియ బారదు.

ఆంధ్రవచనాలుకాక కన్నడవచనాలు ఉదాహరించడానికి కారణ మున్నది. ఆంధ్రములోని వచనాలకూ, విన్నపాలకూ తూగుఉన్నదికాని పాదవిభజన లేదని శ్రీ సంపత్కుమార లోపముగా చూపినారు. పై వచనాలకు ఆ తూగూ, లయతోపాటు పాదవిభజన కూడా ఉన్నదని చూపుటకే. వేదభాషా, పై భక్తుల కన్నడమూ రెండూ వ్యావహారికభాషలని కూడా గమనింపవలె.

వేదర్షులుగాని, వీరశైవభక్తులుకాని వారిభావావేశము ఏరూపములో ఆవిర్భవిస్తే ఆ రూపంలో రానిచ్చారేకాని వచనమే కావలెననిగాని, పద్యమే కావలెననికాని పట్టుదలవల్ల చెప్పలేదు. నేటి వచన కవితాభిమానులకు వారి కవితావిర్భావము వచనంలోనే వస్తూఉంటే దాన్నే వాళ్లు అవలంబించవచ్చు. దాని కెవరూ అభ్యంతరపెట్టరు. కాని ఛందోబద్ధమైన కవిత ప్రాచీనయుగావశేషమనిగాని అది ఓడిపోయినదనిగాని అనే సాహసానికి ఒడిగట్టవద్దు ! పద్యకవితను అరికట్టవద్దు !

నిజానికి వచనకవితను అభిమానిస్తున్నవారు ఎక్కువ భాగము పద్యకవితచెప్పేశక్తిలేకసులభసాధ్యమనిఈప్రక్రియ అవలంబిస్తున్నవారే. వారిలో పద్యకవిత కొంత చెప్పగలవారుకూడా ఉత్తమస్థాయి పద్యకవిత చెప్పినవాళ్ళు కారంటే అత్యుక్తికాదు.

కొంతమంది కొత్త ఒక వింత అని సరదాకు దీన్ని అవలంబిస్తున్నారు.

వచనకవితాభిమానులకు చాలామందికి కావ్యభాష డొక్కశుద్ధిగా రాదు. శ్రీశ్రీ వంటి ఏకొద్ది మందికో మాత్రమే ఆంధ్రకావ్యభాషమీద అధికారం ఉన్నది. అందువల్లనే అట్టివారు భాషతో ఏమి చేసినా, హర్షించి బ్రహ్మరథము పట్టుతున్నారు తక్కినవాళ్లు.

లోకంలో కవితా పరిణామము తెలిసినవారు ఈ విధంగా చెబుతారు. మానవుడు ముందు మాట్లాడినది వచనము. అతనికి కవితావేశము కలిగినప్పుడు అప్రయత్నముగా గేయము ఆవిర్భవిస్తుంది. ఆవేశము సంయమముతో పరిణతి పొందినప్పుడు పద్యరూపము ధరిస్తుంది. పద్యరూపము కవితా స్వరూపానికి పరమావధి. వాల్మీకికి అప్రయత్నంగా వాక్కున వెలువడినది గేయాత్మకమైన ఛందస్సు. పాదబద్ధో౽ క్షరసమః తంత్రీలయ సమన్వితః. అది పాఠ్యే గేయేచ మధురంకూడాను. ఛందస్సు అప్రయత్నంగా వాక్కున ఆవిర్భవించినప్పుడు ఉత్తమ కవికికలిగే ఆనందము శ్రీ మద్రామాయణారంభములో వర్ణింపబడినది. శ్రీ సుప్రసన్న 'వచనకవిత–కథాకావ్యం' అన్న వ్యాసంలో ఆధునికకాలంలో బృహత్కావ్యాలు ఎన్నో భాషల్లో వస్తున్నవంటూ, శ్రీ అరవిందుల 'సావిత్రి' మన దేశంలో ఈ కాలంలో వచ్చిన బృహత్కావ్య మని సగౌరవంగా ప్రస్తావించారు. 'సావిత్రి' కావ్యం చివర దానినిగూర్చి అరవిందులు మిత్రులతో జరిపిన ఉత్తరప్రత్యుత్తరాలు ప్రచురించారు. అందులో వారు పద్యరచనలో సందర్భవశాత్తుగా రావలసిన శ్రావ్యతకు ఓజస్సుకు మాటలు, వాటి వరస, వాటి బరువు ఎంత మెలకువతో వాడుకొనవలెనో ఎంతో విస్తారంగా ప్రదర్శించినట్లు దర్శింపగలము. పద్యమూ, గేయమూ వచన కవితా ప్రక్రియతో ఓడిపోయినవనేవారికీ, అవి ప్రాచీన యుగావశేషాలనే వారికీ ఛందస్సు స్వరూపము అణుమాత్రమైన తెలియదనక తప్పదు.

పద్యము కూర్చినంతమాత్రముచేత అది కవిత్వ మయిపోతుందనే భ్రాంతిమాత్రము ఏ సహృదయునికీ ఉండదు. సత్కవిత్వము ఉచితచ్ఛందోబద్ధమైనప్పుడు రాణించినట్లుగా అది లేనప్పుడంత రాణించదు.

వచన కవితాభిమానులలో అధమ పక్షము ఇద్దరు తాము ప్రయోగిస్తున్నది శిష్ట వ్యావహారికము అనడము మా కంటబడ్డది. అది కొంత ఆశ్చర్యమే కలిగించినది. ప్రజాసామాన్యానికి సమీపంగా తమ కవితను తేదలచిన వారికి భాషలో మళ్లీ ప్రాచీన యుగావశేషమైన శిష్టత్వము కూడా ఎందుకా అనిపించింది. తమ, వాదన హేతుబద్ధముగా ఎక్కడికి నడిపిస్తే అక్కడికి పోవడానికి వెనుకాడే భీరువు లన్నమాట వారు!

ప్రజాసామాన్యానికి సన్నిహితము కావడానికి వ్యావహారిక భాష గ్రహించినామంటున్నారు వీరు. ఈ వ్యావహారిక భాషకు పద్యకవిత్వము నప్పడము లేదనీ, గేయము అంతకంటె కొంచెము నయమనీ, వచనము పూర్తిగా అనుకూలిస్తుంది గనుక వచనకవిత స్వీకరించామనీ కొందరంటున్నారు. కావచ్చు కాని పద్యరూపము కవితా రూపానికి పరమావధి అని పైన ప్రతిపాదించిన దాన్నిబట్టిచూస్తే, వారికి రెండు లోపాలలో ఏదో ఒకటి ఆపాదిస్తుంది. ఆంధ్ర వ్యావహారిక భాష పద్యకవిత్వానికి అనుకూలించదంటే, భాష సంపన్నము కాదనవలసివస్తుంది. తాము వ్యావహారికాంధ్రములో పద్యాలు వ్రాయలేకున్నామంటే కవుల అశక్తత ఒప్పుకోవలసివస్తుంది. రెండూ ఏమంత గౌరవప్రదమైనవి కావు. ఈ రెండింటిలో ఏది వాస్తవమైనా వ్యావహారిక భాషనూ వచన కవితనూ వదిలివేయవలసివస్తుంది.

'ఛందస్సుకీ, వ్యాకరణానికీ, అలంకారాలకీ అన్నింటికీ అవతల స్వచ్ఛమూ, స్వచ్ఛందమూ, నీరవమూ, నీరూపమూ అయిన కవిత్వ పదార్థం ఒకటి ఉంది. ప్రతికవీ దాన్ని అందుకోడానికే ప్రయత్నిస్తాడు' అని శ్రీశ్రీ ఆంధ్రశిల్పిలో వ్రాసినట్లు శ్రీ కె. వి. రమణారెడ్డి 'వచనకవిత' అనే వ్యాసంలో అనుమోదన పూర్వకంగా ఉదహరించినారు.

నిజమే. కవిత్వము కేవల ఛ్ఛందస్సుకూ వ్యాకరణానికీ అలంకారాలకీ అవతలఉండే అవ్యక్తపదార్థ మున్నంతవరకు సత్యమేకాని అది నీరవమూ, నీరూపమూ మాత్రముకాదు. నీరవమైనది వినబడదు. నీరూపమైనది కనబడదు. కవిత్వము శబ్దస్వరూపంలో ఆవిర్భవించినప్పుడే కవిత్వశబ్దవాచ్యమవుతుంది. అప్పుడది వ్యాకరణ బద్ధంగానూ ఉంటుంది.

ఛందోబద్ధంగానూ ఉండితీరుతుంది. వచన కవితాభిమానులుకూడా అసమ చ్ఛందస్సును వదలడము లేదుగదా! అలంకారాలన్నారూ, సత్కవిత్వము ఎప్పుడైనా నిరలంకృతిగాకూడా ఉండవచ్చుగాని,తరుచుగాఅలంకారంతో కూడే ఉంటుంది. ఉత్తమకవితలో ఆ అలంకారాలలోకూడా నేటి వచన కవితలో ప్రచురంగా ఉంటున్న శబ్దాలంకారాలుగాక ఎక్కువగా అర్థాలంకారాలుంటవి.

# 6

ఇతర భాషలలోవలెనే ఆంధ్రభాషలో కూడా కాలాంతరాలలో బాహ్య రూపంలో కొత్తకొత్త రూపాలు అవతరింపజేయడానికి ప్రయత్నాలు జరుగకపోలేదు. తిక్కనసోమయాజుల అంతవాడు ఉత్తరరామాయణము నిర్వచనముగా వ్రాసినాడు. కాని ఆ విషయంలో ఎక్కువమంది అనుస రించలేదు. ఆయనే మహాభారత రచననాటికి నన్నయ ప్రారంభించిన చంపూపద్ధతికి తిరిగి వచ్చినాడు.

ఆ తర్వాతనో కొంచెముముందో, పాల్కురికి సోమనాథుడు అనేక రూపాలలో నూతన ప్రక్రియలు అవలంబించాడు. వాటిలో పంచప్రకార గద్య ఒకటి. నిజానికి అది గద్యకాదు, రగడాభేదము. ఆయనకు పూర్వం విస్తారంగా దేశీయవాఙ్మయంలో ఉన్న ద్విపదను సంస్కరించి దీర్ఘకావ్యాలకు వాహకంగా అనుసరించినాడు.

'తేట తెనుంగున ద్విపద రచింతు........'
'దేశిగా నిలిపి....ద్విపదులు రచియింతు'
'ఒప్పదు ద్విపదకావ్యోక్తి నా వలన........'
....దారూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృతభూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబుగామి
జానుతెనుగు విశేషము ప్రసన్నతకు....'

అని మొదలుగా నేటి వచనకవులు నేడు చెబుతున్న భావాలే కొన్ని ప్రదర్శించినాడు. కొంతకాలము ఆంధ్రకవులకు అభిమానపాత్రమైన ద్విపద

రచన ఒక మోజుగా సాగింది. అందులో నడకలలో ఎంత వైవిధ్యము ప్రవేశపెట్టినా, దీర్ఘకావ్యాలలో విసుగు పుట్టడము తప్పనిసరికావడంతో, ఆ ద్విపద మోజు వెనకబడ్డది.

మళ్ళీ 16 వ శతాబ్దము ఉత్తరార్థంలో కొత్తదనముకోసము అన్వేషణ మొదలైనది. పింగళి సూరన మూడు కావ్యాలలో మూడు మార్గాలవలంబించినాడు. రామరాజభూషణుడు కొత్తదారులు అవలంబించినాడు. ఐనా వాటి అన్నిటిలో వసుచరిత్రకు వచ్చిన జనమోదము మరి దేనికీ రాలేదు.

ఆ ప్రాంతాలలోనే పొన్నెగంటి తెలగన్న అచ్చ తెనుగు కావ్యరచన ఆరంభించాడు. ఆ కాలంలోనే నిరోష్ఠ్యరచన లారంభించినవి. ఇంకా చిత్రచిత్ర రచన లారంభించినవి. ఐనా అవి అన్నీ బుద్ధికే చమత్కారలేశము కలిగించినవికాని హృదయస్పర్శిగా ఉండలేకపోయినవి.

తాత్కాలికంగా ఆంధ్రకవిత పట్టిన ఆ పెడదారులకు విరుద్ధంగా ఈ శతాబ్ది ఆరంభంలో నేడు భావకవిత్వ మనబడేది వెలసినది. అందులో రూపములో పెద్దమార్పులేదు. ప్రాచీనులు వాడిన గణమాత్రాఛందస్సులే వాడినారు. ఎవరి ప్రతిభకొద్దీ, పెద్దవీ, చిన్నవీ కావ్యాలు వారు వ్రాసినారు. వారెప్పుడూ కవితా ప్రకృతిని నిరసించలేదు. అందువల్లనే ఈ శతబ్దారంభం నుంచీ పుట్టిన ఉత్తమకవిత భావకవు లనబడేవారిలోనే ఆవిర్భవించిందికాని ఇతరత్ర కాదు.

ఆ తర్వాత ప్యూచరిజము ప్రభావమువల్ల శ్రీశిష్టా ఉమామహేశ్వరరావు ఎన్నో పిల్లిగంతులు వేసి చూపినాడు. ఎన్ని అపమార్గాలనుసరించినా అతడు కవితాత్మకలవాడు కనుక ఆతని రచనలు మధ్య మధ్య హృదయానికి ఆహ్లాదము కలిగిస్తవి.

ఆ తర్వాత ఎన్నో ఇజములు ఆంధ్రదేశములో వ్యాప్తిలోకి వచ్చినవి. అందులో ముఖ్యమైనది కమ్యూనిజము. ఏ ఇజమునకు ఐనా కవిత్వస్పర్శ కలదేమో గాని, కమ్యూనిజము మాత్రము కేవల రాజకీయసంబంధి. అభ్యుదయ కవులనేపేరుతో కమ్యూనిజము భక్తులు దాని ప్రచార

సాహిత్యము వెదజల్లినారు. ఆ రచనలు ఏమైనా కావచ్చు, గాని సహృదయుల కానందము కలిగించే కవిత్వకోటిలో ఎన్నదగినవి కాదు.

నేడు వచన కవిత సరికొత్త మోజు! అది తత్త్వమూ కాదు, ఉద్యమమూ కాదు. అది ఎక్కువభాగము ఆదిప్రాసల, అంత్యప్రాసల, మాటల విరుపుల, అసమాన పాదాల, మాటల పోటీల గారడీగానే ప్రధానంగా సాగుతున్నది. అది ప్రయోగ దశను ఇంకా అధిగమించలేదు.

అచ్చులో తీసిన వినాయకుని బొమ్మలవంటివని శ్రీ కుందుర్తి, ప్రాచీనయుగ అవశేషాలని శ్రీ సోమసుందర్ ఈసడించిన లాక్షణిక ఛందోబద్ధ కవితలూ, మాత్రాచ్ఛంద కవితలూ పూర్వము వచ్చినవి, ఇప్పుడూ వస్తున్నవి, ముందూ వస్తవి. నాలుగుకాలాలపాటు నిలిచే రచనలు కూడా ఎక్కువభాగము వాటిలో నుండే వస్తవనీ కవులూ, సహృదయులు మరవరాదు. కవి వృషభులు అనాదిగా లోకమంతటా అన్ని భాషలలో అన్ని కాలాలలో అవలంబించి సంపుష్టము చేసినది ఛందోమార్గము. డా. పాటిబండ మాధవశర్మ 'ఛందశ్శిల్పము' అని ప్రచురించిన సిద్ధాంత గ్రంథము తిరగవేయడానికైనా వీరు ప్రయత్నిస్తే బాగుంటుంది. అందులోని ప్రారంభ ప్రార్థనతో దీన్ని పరిపూర్ణము జేతాము.

'శిల్పం ఛందోమయం యస్య<br>
నానావృత్త మిదం జగత్<br>
శాంతః చంద్రకళాకాంతః<br>
పాతు మాం స ఋతధ్వజః.'

*

(భారతి, ఏప్రిల్ 1971)

# నాటకములు - ప్రదర్శనార్హత

నాటకములు ప్రధానముగా ప్రదర్శనార్హములుకావలెనను భావము నేటి కాలమున సర్వసాధారణముగా సాహిత్య విమర్శకులందును జన సామాన్యమందును వ్యాపించి ఉన్నది. మన ప్రాచీనాలంకారికులు కూడా కావ్యములను దృశ్యములనీ, శ్రవ్యములనీ విభజించినందున వారికిగూడ అట్టి భావమే ఉండెనని తలంచుటకు అవకాశమున్నది. సంస్కృత నాటక ప్రస్తావనలలో ఆ నాటకము ఏదో ఒక ఉత్సవ సందర్భములో ప్రదర్శింపబడుచున్నట్లు ప్రత్యక్ష వాక్యములు కూడా భావిస్తున్నవి.

పాశ్చాత్య దేశాలలో నాటక నిర్మాణానికి ఆద్యులు గ్రీకులు. వారి ట్రాజెడీలు గాని, కామెడీలుగాని దేవతోత్సవాలలో ప్రదర్శించడానికి ఉద్దిష్టమైనవే. తర్వాత రోములో లాటిను భాషలోనూ, ఫ్రాన్సు, ఇంగ్లండు, స్పెయిను, ఇటలీ, జర్మనీ మొదలైన దేశాలలో, వారి వారి భాషలలోను గ్రీకు నాటకాల ఒరవడిలో కొన్నీ, స్వతంత్రముగా కొన్నీ నాటకాలు పుట్టినవి. ట్రాజెడీలు కామెడీలే కాక, మిస్టరీలు, మొరాలిటీలు, మాస్కులు, ఒపేరాలు, బాలేలు, కాబిసెటుప్లేలు మొదలైన ఎన్నోరూపక ప్రక్రియలు అవతరించినవి.

మన దేశంలో కూడా సంస్కృత లాక్షణికులు రూపకాలను ప్రధానంగా దశ విధాలుగా విభజించినా ఉపరూపకాలు ఎన్నెన్నో పుట్టినవి. సంస్కృత లక్షణకర్తలు చెప్పనివి ఆంధ్రదేశంలో యక్షగానాలు, వీధి నాటకాలు, కలాపాలు ఇత్యాదులవలెనే ఇతరరాష్ట్రాలలోనూ రకరకాలరూపకాలు వెలసినవి.

శాస్త్రీయంగా నాటక శబ్దము దశ రూపకాలలో ఒకానొక శాఖకే వర్తించేదైనా, నేటి వ్యవహారాన్నిబట్టి అన్ని దృశ్యకావ్యాలకూ అన్వయించే విపులార్థంలో ఈ సమాలోచన ఉపక్రమింపబడుచున్నది.

అలంకారికులు శ్రవ్యములనీ, దృశ్యములనీ కావ్యాలను విభజన చేసినప్పటికీ, గ్రంథాలు అచ్చు వేయడము తెలియదనడము స్పష్టమే కాని, అసలు వ్రాత అనేదైనా పుట్టినదో లేదో కూడా సందేహాస్పదమే. మన దేశంలో వేద వేదాంగాలే కాక, ఇతిహాస పురాణాలు కూడా ప్రథమ దశలో లిఖితములైనట్లు తోచదు. వాల్మీకి రామాయణము రచించి కుశ లవుల చేత అధ్యయనము చేయించినవాడు. అది పాఠ్యే గేయేచ మధురం అన్నదానిలో 'పాఠ్యే' అంటే పఠించినప్పుడు అనే అర్థమేకాని చదివి నప్పుడు అనికాదు. సంగీతయుక్తంగా పాడడమూ, సంగీతము లేకుండా వినిపించడమూ మాత్రమే 'గేయపాఠ్యే' అనడంలో అభిప్రాయమన డానికి సందేహము లేదు. 'శ్రవ్యకావ్యము' అనడములోనే కావ్యము విని పింపబడుతున్నదని స్పష్టపడుతున్నది.

మహా భారతము వ్యాసుడు వడివడిగా చెపుతూవుంటే గణపతి వ్రాస్తూ ఉండేవాడని నేటి భారతావతారికలో కనబడుతున్నది. సంస్కృత భారతము మొదట భాషాంతరీకరణము చేసినది నన్నయ. ఆయన ఈ విషయము చెప్పలేదు. కనుక ఆ భాగము నన్నయకంటె అర్వాచీన కాలంలో ప్రక్షిప్తము చేయబడినదని అనుమానించ వచ్చును.

మా చిన్నతనములోనే కాక, ఇప్పటికి పదిపదిహేనేళ్ళ క్రిందటి వరకూ బ్రాహ్మణ సువాసినులు, పూర్వసువాసినులూ రామాయణ భారత కథలూ, ఇతర కథలూ గేయ రూపమైనవి చెప్పుకొనడమూ, చెప్పడమూ శ్రుతమైనది. వాళ్ళు ఎక్కువభాగము చదవడమూ, వ్రాయడమూ రాని వారు. ఇప్పటికీ ఆంధ్రదేశములో ఈ అభ్యాసము అన్ని కులాలలో మారు మూల పల్లెలలోనయినా నిలిచిఉన్నదనే నా విశ్వాసము. వీరగాథలు చాలాభాగము చెప్పుకొని వల్లించి ప్రచారమవుతున్న వే.

అచ్చువల్లపుస్తక ప్రచురణము విస్తారముగా వ్యాప్తి చెందిన తర్వాత శ్రవ్య కావ్య రస గ్రహణంలో చెప్పలేనంత మార్పు వచ్చినది. మన కవులు నేటికి కావ్య పఠనాలూ, కావ్యగానాలూ చేస్తున్నారు. విద్యాధి కులము అనుకొనేవారు వందలూ, వేలుగా సభలకు వచ్చి వింటున్నారు, ఆనందిస్తున్నామనుకుంటున్నారు. చాలాఅనుభవంవల్లవిశ్లేషణంచేసిచూస్తే

సభాముఖంలో ఆకర్షిస్తున్న కావ్యాలు సర్వసాధారణంగా అధమకోటికి కాకపోయినా అతిసామాన్య శ్రేణికి చెందినకావ్యాలే కాని ఉత్తమకావ్యాలు కావు. ఎప్పుడైనా ఉత్తమ కావ్యాలు కూడా సభాకర్షణం చేయగలుగు తున్నవంటే దానికి కారణము, ఆ చదివేవాని కంఠ మాధుర్యమో, విచిత్ర మైన పఠనము తీరోగాని దాని ఉత్తమ కావ్యగుణముకాదు.

మా మిత్రులు స్వర్గీయ బోడెపూడి వెంకటరావుగారితో నాకు పరి చయమైన కొత్తరోజులలో తమ అనుభవ మొకటి చెప్పినది, జ్ఞప్తికి వస్తు న్నది. ఒకానొక ప్రసిద్ధకవి పఠనమునకు సంబంధించిన అనుభవమిది. "బాపట్లలో వారి కావ్య పఠనము విని అద్భుతమనిపించి గ్రంథముకొని ఇంటివద్ద శాంతముగా చదువుకొన్నాను. చూడగా అందులో రుచేకనిపించ లేదు-మరి ఇది మోసముకాదుటండీ?" వారెంతో బాధతో ఆ ప్రశ్న వేశారు నన్ను.

నేటి పరిస్థితులలో మన చెవులు శ్రవ్య కావ్యాల సూక్ష్మాలు గ్రహించే శక్తి చాలా భాగము కోల్పోయినవి. శాంతంగా ఏకాంతంగా మనము మనస్సులోనో, బిగ్గరగానో చదువుచున్నప్పుడేకాని ఉత్తమ కావ్యాను భవము పొందలేక పోతున్నాము. ఇది శ్రీ వెంకట్రావుగారి అనుభవమే కాదు, ఎందరో సహృదయుల అనుభవముకూడా అదే! అంత మాత్రము చేత పూర్వులు శ్రవ్య కావ్యాలన్నవాటిని పరిభాష మార్చి చదువుకొనే కావ్యాలు అని వ్యవహరింపవలసిన అవసరము ఉన్నదనుకోము. మా బోంట్లు ఒకవేళ మార్చుమని సూచించినా లోక వ్యవహారము ఇంకా అవల బించే స్థితికి రాలేదు.

## 2

ఇప్పుడిక నాటకాలు- దృశ్య కావ్యాల విషయము చూతాము. దృశ్య కావ్యమంటే దృశమైన- చూడబడే కావ్యము. కావ్యము విశేష్యము, దృశ్యము విశేషణము. విశేషణ విశేష్యాలలో దేనికి ప్రాధాన్య మివ్వవలె ననే పెద్దతార్కిక చర్చ వదలి విశేష్యానికే ప్రాధాన్యమున్నదని అంగీక రిద్దాము. అసలు కావ్యమైతేకదా దానికి దృశ్యత్వమున్నదీ లేనిదీ

విచారణ చేసేది! ముందుమనిషి ఐతేకదా, వాడు మంచివాడో, చెడ్డవాడో నల్లటివాడో, తెల్లటివాడో- అందగాడో, విరూపుడో- విచారణ చేసేది!

ఇక దృశ్యత్వమంటే ఏమిటి? మనము ఈ కాలములో నాటకీయత, అనే పద మొకటి సాహిత్య విమర్శలలో వాడుతున్నాము. ఈ రెండూకాక ముఖ్యంగా నాటకాల విషయంలో ప్రదర్శన యోగ్యత అనేమాట ఇంకొకటి తరుచుగా వినవస్తున్నది. ఈ మూడు- దృశ్యత్వమూ, నాటకీయత, ప్రదర్శన యోగ్యతా- సమానార్థకాలా? స్థూలంగా మూడూ ఒకటే అనే భ్రాంతి కలుగుతుంది కాని మూడిటికీ కొంత పోలిక ఉన్నా సమానార్థకాలు కావనడానికి పెద్ద విచారణ అవసరం లేదు. ప్రస్తుతము ప్రదర్శన యోగ్యతను గూర్చి కొంత లోతుగా ఆలోచిద్దాము.

కవి నాటకము వ్రాసినాడు. దానిని ప్రదర్శించడానికి ప్రదర్శకుడు గ్రహించినాడు. నాటక భాగాలు నోటితో చెప్పి భావ ప్రదర్శనచేసే నటులను అతడు ఎన్నుకుంటాడు. నాటకము ప్రదర్శించడానికి తగిన రంగస్థలము, రంగులూ- దుస్తులూ మొదలైన ఆహార్యాదులు సమకూర్చుకుంటాడు. ఇంతవరకూ కవితో సహకరించ వలసినది ప్రదర్శకుడు, నటులు రంగభూమి. అవన్నీ యోగ్యంగా సమకూర్చుకున్నా, చివరకు నాటకము రక్తికట్టినదీ, లేనిదీ నిర్ణయించేది ప్రేక్షకులు; సామాజికులు. దృశ్య కావ్యానికి కర్త కవి ఒక్కడేఐనా, దాని ప్రదర్శనము విజయవంతము కావడానికి రక్తికట్టడానికి, ప్రదర్శకుడు, పాత్రధారులు, రంగస్థలము (ఆహార్యము) ప్రేక్షకులు- ఇందరి సహకారమూ కావలె. ఈ నాలుగింటిలో ఏది లోపము చేసినా నాటకము రక్తికట్టదు. ప్రదర్శకుడు అనుభవమున్నవాడే కదా! అతడు ప్రదర్శనార్థమని ఎనుకున్న నాటకమే ప్రదర్శనములో విఫలము కావడము కద్దు. శ్రీ విశ్వనాథ వేనరాజ నాటకము చెన్నపట్టణములో పెద్దపెట్టున ప్రదర్శనములో విఫలమైనది. అంతమాత్రముచేత అది ప్రదర్శన యోగ్యతలేనిదనవలసినదేనా?

మరి ఒకే ప్రదర్శకుడు అదే నటబృందముతో ఆహార్యాదులతో ఒక పట్టణములో ప్రదర్శించి విఫలముకావడమూ. మరియొక పట్టణములో విజయవంతము కావడమూ ఉన్నది. ఒక్కచోటనే ఒకకాలములో విఫలమై

మరియొక కాలములో విజవంతముకావడమూ ఉన్నది. వేనరాజు నాటక ప్రదర్శనము మదరాసులో విఫలము కావడానికి ముఖ్యంగా రెండు కారణాలు చెబుతారు. అందులో ఒకటి వైదిక ధర్మ శత్రువైన వేనరాజు పరాజయము నాటక వస్తువు కావడమూ, మదరాసు ప్రేక్షకులకు అది రుచించక పోవడమూ. రెండవది వేనరాజుపాత్రధారి ఆకాలపు ఆచారానికి విరుద్ధంగా అంగీలు లేకుండా రంగ ప్రవేశము చేయుడమట, ఆ పాత్ర వేషము చూడగానే నాటకప్రదర్శనము ఆపి వేయవలసివ ఆవస్థవచ్చినదట! ఈ రెండు కారణాలే నిజమయితే 'వేనరాజు' ప్రదర్శన యోగ్యము కాదన వలసినదేనా?

శ్రీ మాధవపెద్ది వెంకటరామయ్యా అంగీలు లేకుండా దుర్యోధన పాత్ర, దేవేంద్ర పాత్ర ఇత్యాదులు ధరించి అనేక రంగాలలో అభిన యించి మెప్పించడము ఎరుగుదుము. ఆ వేనరాజు పాత్రధారణలో ఆ నటుడు శ్రీ మాధవపెద్దివలె హుందాగా గాక ఏదో వికారముగా తోచి ఉండవలె.

ఇక వస్తువునందు సామాజికులకున్న అయిష్టము సంగతి. సరిగ్గా నాట్యవేదములలో భరతుడు ప్రదర్శించిన ప్రథమ నాటక ప్రయోగానికే ఈ గతిపట్టినట్లు వర్ణింపబడ్డది.

ఇంద్రధ్వజ మహిమ సందర్భములో దేవ దానవుల సమక్షములో మహేంద్ర విజయము భరతుడు ప్రదర్శించెను, అది చూచి విరూపాక్షాది దానవులు తమ్మది పరిభవించు చున్నదని ఆగ్రహించి విఘ్నము కావించి నాట్య ప్రయోగము సాగనీయకుండ చేసి సభనుండి వెడలి పోయిరి. ఇంద్రుడు విఘ్న పరిహారమునకు జర్జరము ప్రయోగించెను. ఇంతలో బ్రహ్మ సామవచనములతో విరూపాక్షాది దైత్యులను ఇట్లనునయించెను.

"మీకు కోప విషాదములు వలదు. మీరు భ్రాంతిపడినారు. నాట్య వేదము శుభమశుభము వికల్పించునెగాని దేశ కాల పాత్రల నుపలక్షిం పదు. మీ యనుభావనముకాని దేవుల యనుభావనముకాని నాట్యమున నుండదు." "త్రైలోక్య భావాను కీర్తనం నాట్యం" అందరి యవస్థాను కరణమేనాట్యము, దేవాసుర భావములకిది యతీతము,నాట్యముననియత

లోకానుకార ముండదు. ద్రష్ట సాక్షిక దృష్టికలవాడయినచో రసాస్వాదనము కలుగనే కలుగదు"[1]

మదరాసులో వేనరాజు నాటక ప్రదర్శనము చూచి లేచిపోయిన వారు సరిగా భరతుని ప్రథమ నాటక ప్రదర్శనము చూచిన విరూపాక్షాదులు చేసినపనే చేసినట్లు తోస్తుంది. భేదమేమంటే జర్జర ప్రయోగము చేసే మహేంద్రుడుకాని, అందరికి నచ్చజెప్పగల బ్రహ్మగాని ప్రేక్షకులలో లేకపోయినారు. భరతుడు ప్రదర్శించిన ప్రథమ నాటకమే ప్రదర్శన యోగ్యము కాదనలేముకదా!

ఈ శతాబ్దములోనే జరిగిన మరొకటి ప్రస్తావిస్తాను. మారిసు మీటర్లింక్ అనే జగత్ప్రసిద్ధ నాటకకర్త బెల్జియను, ఫ్రెంచి భాషలో అనేక నాటకాలు వ్రాసినాడు. వాటిలో 'బ్లూబర్డు' అనే నాటక మొకటి. అందులోని పాత్రలు పిల్లవాడు, పిల్ల, దీపము, పుస్తకము, రొట్టె! వాళ్లు బ్లూబర్డు కోసము అన్వేషిస్తూ పోవడము నాటక వస్తువు. బ్లూబర్డు పాశ్చాత్య పరిభాషలో జీవుని నిత్య స్వరూపానికి ప్రతీక అనవచ్చు. మన పరిభాషలో ఆత్మ పదార్థమనవచ్చు! అది ప్రదర్శనయోగ్యమా అనే మీమాంస వచ్చింది. సహృదయుల హృదయాలను నాటకము నిశ్చయంగా గాఢంగా ఆకట్టినది. యూరపులో ప్రదర్శకులంతా ప్రయోగ సాధ్యముకాదని వదలివేశారు. తుదకు ఒక ప్రదర్శకుడు సాహసించి, కొన్ని మిలియన్లు ఫ్రాంకులు ఖర్చుపెట్టి ప్రదర్శించినాడు.[2] అద్భుతంగా విజయవంతమైనది. ఈ ఒక్క ఉదాహరణము చాలును ఏ నాటకమైనా ప్రయోగ యోగ్యమో కాదో నిర్ణయించడము అసాధ్యమని భావించడానికి.

ఐనా మర్కొక ఉదాహరణము కూడా ప్రస్తావిస్తాను. రవీంద్రుని నాటకాలు ఉన్నవి. ఆయన ఎంత గొప్పకవియో అంత గొప్ప కథకుడూ, నాటకకర్త కూడాను. ఆయన నాటకాలు ఆయన దర్శకత్వాననే స్వయముగా తానే పాత్రధారణ చేసికూడా, శాంతనికేతనములోను, ఇతర

---

(1) శ్రీ జమ్మలమడక మాధవ రామశర్మ "నాట్యవేదము" నుండి.

(2) ఈ నాటకము ఆంగ్లానువాదము బహు పర్యాయాలు చదవి ఆనందించినానుగాని ప్రయోక్త పేరు మరపు తగిలినది.

చోట్లను పరిమిత ప్రేక్షకుల సమక్షములో ప్రదర్శించి రక్తి కట్టించినాడు. ఆయనయందు గల భక్తి ప్రపత్తులచేత అప్పుడప్పుడు వ్యాపార రంగ స్థలాలమీదకూడా ప్రదర్శిస్తూవచ్చారు. 'చిరకుమార సభ', 'శేషరక్ష'లాంటి కొన్ని నాటకాలు తాత్కాలికంగా మాత్రమే ప్రేక్షకుల ఆదరానికి పాత్ర మయినాయి. అయినా వ్యాపార రంగస్థలాల నాటక ప్రయోగ పద్ధతికీ, రవీంద్ర నాటకాలకూ యెన్నడూ పొత్తు కలియలేదనే చెప్పాలి. ఎందు కని? బహుశా ప్రేక్షకులు అలవాటు పడలేదేమో!" అన్నారు శ్రీ ప్రమథ నాథ బిశి తమ 'రవీంద్ర నాటకాల సంక్షిప్త సమీక్ష'లో.

ఇదే మరొక కోణంనుంచి కూడా విచారణ చేదాము.

గ్రీకుదేశంలో ఏథెన్సు నగరంలో ట్రాజెడి ప్రదర్శనల పోటీలు బి. సి. 534 లో ప్రారంభమైనవి. అవి ఆరుబైట పది పదిహేనువేల మంది ప్రేక్షకుల ఎదుట దేవతోత్సవాలలో ప్రదర్శింపబడేవి. నాగరికులేగాక, ఇతరులూ, బానిసలూ కూడా ఖర్చు లేకుండా వచ్చి చూడవచ్చును. నాట కాలలో ముగ్గురు వ్రాసిన నాటకాలలో కొన్నిమాత్రమే మనకిప్పుడు ఉప లభ్యమవుతున్నవి. వాటిలో ఎక్కువ భాగము పోటీలలో నెగ్గిననే. వారిలో మొదటివాడు ఆస్కైలను (బి. సి. 525-456) రెండవవాడు సొఫోక్లిసు (బి. సి. 496-409). మూడవవాడు యూరియస్ (బి. సి. 480-406) లను ఆరిస్టొఫెన్సు అనే కామెడీకర్త (బి. సి. 450-385) తన నాటకాలలో విపరీతముగా హేళనచేసినాడు. అటువంటి అరిస్టొఫేన్సుకూడా సొఫోక్లిసు మీద కొంత గౌరవమూ, ఆస్కైలసుమీద భక్తి తాత్పర్యాలూ ప్రదర్శించి నాడు.

ఆ ముగ్గురు ట్రాజెడీకర్తలలో మొదటివాడు నాకు కూడా ఎక్కువ అభిమానపాత్రుడు. పాత్రల సంఖ్య పెంచడములోను, ఇతివృత్త గ్రహ ణములోనూ రెండవవారు మూడవవారూ నాటకాన్ని నేటి కాలానికి ఎక్కువ సన్నిహితము చేసినారనడము నిస్సందేహమే కాని వారిద్దరూ ఆస్కైలను కవితాస్థాయిని అందుకోలేదని తోస్తుంది. వారిద్దరేకాదు పాశ్చాత్యనాటక కర్తలలో నేటివరకూ చాలామంది అందుకోలేదనడము

అతిశయోక్తికాదు. బ్లాకీ అనే ఆంగ్లానువాదకుడు వానిని లిరికల్ డ్రామాస్ (Lyrical Dramas) అని పేర్కొన్నారు.

అటువంటి అస్కైలసు నాటకాలు, ఏథెన్సు జనసామాన్యము- పది పదిహేను వేలమంది- ఇప్పటికి 2, 500ల సంవత్సరాల క్రిందట ప్రదర్శన చూచి ఆనందించిన మహా నాటకాలు, నేటికీ జగద్విమర్శకాగ్రణులచేత ఉత్తమశ్రేణి నాటకాలుగా ప్రశంస పొందుతున్న దృశ్యకావ్యాలు. నేటి కాలము మన దేశములోనేకాదు, పాశ్చాత్య దేశాలలో ఏ దేశంలోనైనా సరే ప్రదర్శిస్తే, జన సామాన్యము పదినిమిషాలు కూడా ఓపికగా భరించ లేవు. నేడు మనము విద్యావంతులనుకొనే సంస్కారులు కూడా భరించలేర నేది కేవల సత్యము! అంతమాత్రం చేత ఆ నాటకాల విలువ తగ్గుతుందా?

బి. సీ. కి పోనక్కరలేదు. షేక్స్పియరు నాటకాలు పుట్టి 400 సంవత్సరాలింకా నిండలేదు. ఆయన అద్వితీయ నాటకకర్త అని పాశ్చాత్య విమర్శకుల నిర్ణయము. ఆయన నాటకాలమీదనే, ఇంకా పూర్తిగా నాలుగు శతాబ్దులు దాటకముందే సామాజికులకు అభిమానాలు వస్తూ ఉన్నవి, పోతూవున్నవి, మళ్ళీ వస్తూవున్నవి. ఎన్నడూ అవి గ్రీకునాటక కర్తల నాటకాలవలె టిక్కెట్లుకొనని పదిహేనువేల జనసమూహాన్ని ఆకట్టలేదు.

అంతదూరము పోనక్కరలేదు. ఇప్పటికి 50 సం. ల క్రిందటి వరకూ వీధులలో ఆరు బయట ప్రదర్శింపబడుతూ జనాదరము పొందుతూ వచ్చిన కూచిపూడివారి వీధి నాటకాలు, గొల్ల భాగవతులవి, ఇంకా ఇతర భాగవతులవీ నాటకాలు ఉన్నవి. కూచిపూడివారు పద్ధతులు కాలానుగుణంగా కొంత మార్పు చేసుకొని పట్టణవాసులను ఆకర్షించ గలుగుతున్నారు ఇప్పటికీ కొంతవరకు. కాని తక్కినవారు నేడు మారు మూలపల్లెలలోనే తప్ప నగరవాసులను ఆకర్షింపలేకున్నారు. వాటి కన్నిటికి ప్రదర్శనార్హత ఉన్నదనవలెనా, లేదనవలెనా ?

కాళిదాసు నాటకత్రయమున్నది. వాటిలో శాకుంతలముమాత్రము (ఆంధ్రానువాదము) ఇప్పటికి 40 ఏళ్ళ క్రిందటివరకూ ప్రదర్శింప

బడుతూ ఉండేది. శ్రీ యడవల్లివంటి ప్రసిద్ధ నటుల ప్రతిభవల్ల రక్తి కట్టేది. తక్కిన రెండు నాటకాలూ ప్రదర్శింపబడ్డట్లు తెలియవచ్చుట లేదు. ఈ మధ్య శాకుంతలం కూడా ప్రదర్శన భాగ్యానికి నోచుకున్నట్లు లేదు. కాళిదాసుతో సమానుడో, అంతకంటె అధికుడో అని భావింపబడే భవభూతి మహాకవి ఉన్నాడు. ఆయన నాటకానువాదాలు ఆంధ్రదేశంలో ప్రదర్శింపబడ్డట్లులేదు. ఎక్కడైనా ప్రదర్శింపబడినా జనాన్ని ఆకర్షించిన జాడ లేదు.

భాసునిపేర నేడు చలామణి అవుతున్న నాటకాలు ప్రధానంగా ప్రదర్శనంకోసము నటులు సిద్ధంచేసుకున్న నాటకావతారాలుగా కనబడుతున్నవి. వాటికి ఎన్నో ఆంధ్రానువాదాలు వచ్చినవికాని విరివిగా వాటి ప్రదర్శనలు జరిగినట్లులేదు. దీనికంతటికీ కారణమేమిటి ?

ఒకానొకప్పుడు నటులు తమ అద్భుతమైన గాత్రాలతో, సంగీత ప్రస్తారంతో ఆంధ్ర ప్రేక్షకులను ఉర్రూతలూగించిన పద్య ప్రధాన నాటకాలు నేడు వెనుకబట్టినవి. అప్పట్లో ప్రేక్షకులు అభిమానంతో ఎన్నో ఒన్సుమోరులు వర్షించేవారు. అది నాటకరక్తికి న్యాయంగా భంగకరమైనా, పూర్వము ఎన్ని ఒన్సుమోరులువస్తే నాటకమంతగొప్పగా రక్తి కట్టినదనుకొనే వారుగదా !

ఆ రోజుల్లో కేవల వచన నాటకాలు రంగ స్థలానికి పనికిరావనుకొనేవారు. కాని నేడు పద్య ప్రధాన నాటకాలు అస్వాభావికములని ఈసడిస్తూ, వచన నాటకాలనే మహా నగరాలలోని ప్రేక్షకులు అభిమానిస్తున్నారు.

ఈ విధంగా చూస్తే దేశకాల పాత్రలనుబట్టి ప్రదర్శనవిషయంలో ఇట్టి ఒడుదుడుకులు ఎన్నయినా సంభవిస్తున్నవి. సంభవించక తప్పదు కూడాను. కాబట్టి ఏదైనా ఒక నాటకము విలువకట్టేప్పుడు దాని ప్రదర్శనార్హతను గూర్చి దీర్ఘ విచారణ చేయుడము కావ్యకర్తకు అన్యాయము చేయడం కాదా ?

# 3

ఆంధ్రదేశంలో ఒకానొకప్పుడు విస్తారంగా ప్రదర్శించబడిన కొన్ని నాటకాలను గూర్చి విచారిద్దాము.

శ్రీ చిలకమర్తి 'గయోపాఖ్యాన నాటకము' ఒకానొకప్పుదు పొందిన ప్రసిద్ధి ఇంతంత కాదు. అందులో కృష్ణార్జునులు ఒకరినొకరు అధిక్షేపించుకున్న పద్యాలు

"అల్లుడా రమ్మని యాదరంబున బిల్వ
బంపు మామనుబట్టి చంపగలమె!"

ఇత్యాదులు జగత్ప్రసిద్ధమైనవి. శ్రీ జయంతి రామయ్యపంతులుగారి వంటి సహృదయ విద్వాంసులు ఆ నాటక సమీక్ష చేస్తూ ఆ ప్రసిద్ధ పద్యాలనే ఉదాహరించి ఎంతో అనౌచిత్యముకలవని నిరూపించారు. ఉదాత్త పురుషులైన కృష్ణార్జునులకు సందర్భవశాత్తుగా పోరుకలిగినా నీచ పురుషులవలె కలహించినట్లు అందులో కనబడుతున్నదని ఎవరైనా ఒప్పుకోక తప్పదు. అనౌచిత్యముకంటె రసభంగము కలిగించేది మరొకటి ఉండదు గదా!

పాండవోద్యోగ విజయాలున్నవి. అవి పూర్వము గొప్పపాటకులైన నటులు ప్రదర్శించినప్పుడు గొప్పగా రక్తి కట్టేవి. ఆ పాటల ఫణితులనే నేడు కూడా సమర్థవంతంగానో, అసమర్థంగానో అనుకరించి కొంత రక్తి కట్టించగలుగుతున్నారు. కాని ఆ కాస్త సంగీతము కూడా మినహాయిస్తే ఇప్పుడవి రక్తికట్టగలవా, ఏ నాటక రంగస్థలం మీదనైనా!

1973 జనవరి నాట్యకళ సంచికలో కురుక్షేత్ర సంగ్రామ ప్రదర్శనను గూర్చి శ్రీ కె. ఆర్. కె. మోహన్ వ్రాసిన వ్యాసంచూస్తే ఆయనకు ఎంత అసంతృప్తి కలిగిందో వెల్లడి అవుతుంది.

"చింతామణి" నాటక ప్రదర్శనములను గురించి కూడా ఆ వ్యాసంలోనే తీవ్రమైన అసంతృప్తి వెల్లడించారు.

నాటక ప్రదర్శనము విజయవంతము కావడానికి ఎన్నో నాటకేతరములైన సహకారము లభించవలె. దీనికి తగిన ప్రదర్శకుడు, నటులు,

రంగస్థలాహార్యములు, ప్రేక్షకులు సందర్శించినప్పుడేకాని దాని ప్రదర్శన యోగ్యత నిర్ణయించలేము. కాబట్టి నేటి సాహిత్య విమర్శకులు, సమీక్షకులు నాటకాలు శ్రద్ధగానో, అశ్రద్ధగానో చదివి తేలికగా వాటిని ప్రయోగార్హాలుకావని తేల్చివేసి నీళ్ళు నమిలివేయడము న్యాయమేనా? తొందరపాటుకాదా? నాటకకర్తలు మౌనము వహిస్తా రెందువల్ల!

# 4

ఇప్పుడిక నాటకీయత, దృశ్యత్వము అనేమాట లేమిటో విచారిద్దాము!

శ్రవ్య కావ్యాలు చదువుతున్నప్పుడు కూడా కొన్ని భాగాలు మనకు కళ్ళకు కట్టినట్లు ఉంటాయి. అట్టిది చదువరుల కందరికీ అనుభవంలో ఉన్నదే. అటువంటి లక్షణాన్ని దృశ్యత్వమనగూడదా?

మరికొన్ని భాగాలు నాటకీయముగా ఉన్నవంటున్నాము. ఒక కథా భాగంలో అనేక పాత్రలు రకరకాలుగా పాత్రోచితంగా సంభాషించడము వర్ణిస్తే అక్కడ నాటకీయత ఉన్నదంటాము. అట్టి రచన చేయడములో ఆంధ్ర కవులలో తిక్కన సోమయాజులకు అగ్రస్థానమిస్తున్నాము.

ఇంకొక విధమైన నాటకీయత కూడా సంఘటనలలో కానవస్తున్నది. సంస్కృత మహా భారతంలో సర్పసత్రము చివరి ఘట్టము అద్భుతమైన నాటకీయతతో ఉన్నది. మహానాగు లెందరో సత్రాగ్నికి ఆహుతి అయినారు. కాని ప్రధానాహుతి కావలసిన తక్షకుడు రాలేదు. పిలిచినా రావడం లేదు. అతడు ఇంద్ర శరణుడై ఉన్నాడని తెలిసింది. అతన్ని ఆకర్షించేందుకు ఋత్విక్కులు బ్రహ్మదండాన్ని ఉద్దీపింప జేస్తున్నారు. కాని అప్పటికే ఆ సత్రము ఆపు చేయించడానికి ఆస్తీకుడు వచ్చి జనమేజయుణ్ణి అక్కడ ఋత్విక్కులను, సభాసదులను ముగ్ధులనుగా చేసి ఉన్నాడు. ఇంద్ర శరణుడై ఉంటే తక్షకుణ్ణి ఇంద్రుడితోసహా బ్రహ్మదండంతో లాగమని జనమేజయుడు ఋత్విక్కులను ఆదేశించాడు. బ్రహ్మదండానికి భయపడి ఇంద్రుడు తక్షకుణ్ణి వదిలి పారిపోయినాడు. తక్షకుడు భయంతో అవశుడై యజ్ఞశాల చుట్టూ గిరగిర తిరుగుతున్నాడు.

అప్పుడు పురోహితుడు ఆనందంతో వచ్చి "తక్షకుడు వస్తున్నాడు. అతడు త్వరగా వచ్చేందుకై ఎదుటవున్న వర్చస్వి ఐన ఆ స్త్రీకునికి దానమేదైనా చేయి" అని సలహా యిచ్చాడు. జనమేజయుడు ఆనందముతో వరము కోరుకొమ్మన్నాడు ఆ స్త్రీకుణ్ణి. "ఈవ్రతము ఆపివేయవలసినది. ఇక ఒక్క సర్పముకూడా అగ్నిలో పడరాదు" అని కోరాడు. మరో వరము కోరుకో మని రాజు బ్రతిమాలినాడు. ఈసంభాషణ జరుగుతుండగా అగ్నిలో పడ బోతున్న తక్షకుణ్ణి ఆ స్త్రీకుడు చేయెత్తి ఆపినాడు. ఏపని సాధించడానికి వరమీయదలచినాడో ఆ వరమే ఆ పనికి భంగకారి ఐనది. ఇటువంటి ఘట్టాలు శ్రవ్య కావ్యాలలోగూడా నాటకీయుంగా–Dramatic గా ఉన్న వంటాము కదా!

ఇటువంటి నాటకీయతలకు దృశ్యకావ్యాలేకాక, శ్రవ్య కావ్యాలు కూడా పనికివస్తవికదా! శాకుంతలంలో శకుంతల తుమ్మెదలవల్ల బాధ పడుతుంటే చెలికత్తె దుష్యంతుణ్ణి పిలవమంటుంది చమత్కారంగా. సరిగ్గా దుష్యంతుడే వస్తాడు. అటువంటివి నాటకీయత గల సన్నివేశాలు।

# 5

ఐతే మరి దృశ్య కావ్యాలకూ శ్రవ్య కావ్యాలకూ భేదమే లేదా? కావ్యత్వములో ఎంత మాత్రం భేదం లేదు. భేదమున్నది రూపంలోనే. దృశ్య కావ్యాలలో కవి కథను స్వయంగా చెప్పక పాత్రలచేత మాట్లా డించి చెప్పిస్తాడు. అందువల్ల కొన్ని నియమాలకు బద్ధుడై ఉంటాడు. ఆ చెప్పే పద్ధతి దేశ కాలాలనుబట్టి మారవచ్చు. మన వీధి నాటకాలలో సత్యభామ ప్రవేశిస్తూనే, "భామనే సత్యభామనే" అని ఇత్యాదిగా పాడుతూ అద్భుతంగా నృత్యం చేస్తుంది. అట్టిది నేటి నవనాగరిక నాటకాలలో వికృతంగా ఉండవచ్చు. చెలికత్తె అనవలసిన మాటలు సూత్రధారుడే అంటూ ఉంటాడు. ఇది కూడా ఇప్పుడు వికృతంగానూ, అస్వాభావికంగానూ, కనబడవచ్చు. కాని ఇంకోవిధంగా చూస్తే ఆ పద్ధతి లోనే ఎక్కువ స్వాభావికత ఉన్నదేమో అనిపిస్తుంది. ప్రేక్షకుల కందరికీ, ఆ వేషం వేసుకొని వచ్చి పాడేదీ ఆడేది సత్యభామకాదనీ, సత్యభామ వేషధారి నటుడని, స్పష్టంగా తెలుసు. మరి చెలికత్తె

కోసమని ఇంకొకరికి రంగు పూసి వేషం వేసి, ప్రవేశపెట్టడం మాని అందుకు బదులు సద్యఃస్ఫురణకుగల సూత్రధారుడే చెలికత్తెమాటలు అందిస్తూ ఉంటే వచ్చేనష్టమేమిటి ? ఈ పద్ధతివల్ల పైగా సత్యభామ, నటన మీద, నృత్యం మీద, అభినయం మీద ప్రేక్షకుల దృష్టి ద్విగుణీకృతంగా కేంద్రీకరిస్తుంది గదా ! అసలది భామాకలాపము ! ఒక విధమైన దృశ్యకావ్యము.

షేక్స్పియరు కాలంలోకూడా తెరలు ఉండేవి కాదుట. వీథిలో జరిగిన దృశ్యం ప్రదర్శించేప్పుడు పైన 'వీథి' అని బల్లమీద వ్రాసి కట్టే వారట. ఈ కాలపు ప్రేక్షకులకంటే ఆ కాలపు వారికి భావనాబలము ఎక్కువ ఉండేదేమో కూడాను.

కాబట్టి దృశ్య కావ్యాలు బహురూపాలు ధరించి ప్రదర్శనపొంద వచ్చు. అలవాటు, సంప్రదాయము, నిర్మాణ చాతుర్యము, రుచి— ఎన్నో కారణాలు ఏకమై రూపకాలను—దృశ్య కావ్యాలను పుట్టిస్తవి. వాటి దృశ్యత్వానికి, మనము అనుకొన్న ఒకానొక ప్రదర్శనశాలా, ప్రేక్షకులూ మాత్రమే గీటురాళ్ళు కావు !

## 6

ఎన్నడో ఆంగ్లకవి లార్డు బైరను ఈ క్రింది వాక్యాలు తన మారినో ఫలీరో డోజు ఆఫ్ వెనిస్ (Marino Falireo Doge of Venice) అనే నాటకము పీఠికలో వ్రాసినాడు.

"I have had no view to the stage; In its present stage it is, perhaps, n.t a very exalted object of ambition; besides, I have been too much behind the scenes to have th.ught it so at any time. And I cannot conceive any man of irritable feeling putting himself to the mercies of an audience. The sneering reader, and the loud critic, and the tart review, are scattered and distant calamities; but the trampling of an intelligent or of an ingnorant

audience on a production which, be it good or bad, has been a mental labour to the writer, is a palpable and immediate grievance, heightened by a man's doubt of their competency to judge, and his cerainty of his own imprudence in electing them as judges. Were I capable of writing a play which could be deemed stage-worthy, success would give me no pleasure, and failure great pain. It is for this reason that, even during the time of being on one of the committees of one of the theatres, I have never made the attempt, and never will. "

Preface to 'Marino Falireo Doge of Venice.'

బైరను కవి తొందరపాటూ, అవేశమూ కలవాడు. పైగా తన నాటక ప్రదర్శన మొకటి విఫలమైనందున విసిగి వ్రాసినాడని కూడా అనవచ్చు. కాని జగత్ప్రసిద్ధమైన Faust వంటి ఉత్తమ నాటకాలూ, ఇంకా ఎన్నో ఇతరరచనలూ చేసిన గెటీ గత శతాబ్దిలో పాశ్చాత్యప్రపంచ మంతటిచేత మన్నన లందిన గొప్ప మనిషిగదా! పైగా ఆయన డ్యూకాఫ్ వీమరు స్థాపించిన కోర్టు నాటకశాలకు బహుకాలము డైరెక్టరుగా పనిచేసిన వాడగుటచే ఎంతో నాటక ప్రదర్శనానుభవమున్న వాడు. ఆయన ఏమన్నాడో చూదాము!

' One can show the public no gteater respect than in forbearing to treat it as a mob. The mob hurry unprepared to the theatre. demand that which may be immediate'y enjoyed, desire to stare, be amazed, laugh, weep, and therefore compel the managers, who are dependent on them to descend more or less to their level. "

[From notes to Bayard Taylor's translation of 'Faust Part 1' at page 160-pub. Ward Lock & Co, London 1911.)

వాళ్ళిద్దరూ పాత కాలపు వాళ్ళు, కవులు. ఈ కాలపు వంగదేశములో మంచి విమర్శకులు ఐన ప్రమథనాథ బిశి రవీంద్ర నాటకాల సమీక్ష నుండి మరికొన్ని వాక్యాలు చూదాము.

"అదికాక వ్యాపార రంగ స్థలాల మీద ప్రసిద్ధి కెక్కిననాటకాలన్నీ, వృత్తిగా నటించే నటీనటుల్ని ఆశ్రయించి వుండడం వల్ల ప్రసిద్ధి కెక్కినవే. వాటిల్లోది ఒక విధమైన సామూహిక శిల్పం. రవీంద్రుడి నాటకాలు ఏకాంతలో ఆవిర్భవించాయి. కాదా, అంటే వారి కుటుంబం వాతావరణంలో. యివి ఆయన తన ఒక్కడి ప్రయత్నంవల్ల సృష్టించి ప్రయోగించినవి అంచేత వీటిలో వున్న సహజ సంపద ప్రధానంగా కావ్య సౌందర్యం.

"నాటకంలో వున్న సాహిత్య సౌందర్యాన్ని అప్రధానంగాభావించే విమర్శకులెందరో వున్నారు. వాళ్ళ అభిప్రాయంలో కేవలం ప్రేక్షకుల్ని రంజింప జేయడమే నాటకాల ఏకైక ప్రయోజనం. ఈ అభిప్రాయాన్ని ఆమోదించడానికి వీల్లేదు. నాటకం ముఖ్యంగా సాహిత్యం, దాన్ని ఆ దృష్టితో సమీక్షించడమే వుచితం.

"ఆ దృష్టితో గనక చూస్తే రవీంద్రుడినాటకాలు అమూల్యమైన రత్నాలు![1]

# 7

శ్రవ్య కావ్యాలకు శ్రవ్యత్వముకాక కావ్యత్వము ప్రధానమైనట్లే, దృశ్య కావ్యాలకు కూడా దృశ్యత్వముకాక, కావ్యత్వమే ప్రధానమని బుద్ధిమంతులు అంగీకరించక తప్పదు. ఆకాశవాణితో శ్రవ్యనాటికలు అవతరించడము గమనింప దగిన మరొక ఆధునిక కాల విశేషము కూడాను!

కొందరు ప్రదర్శకులను దృష్టిలో పెట్టుకొని నాటకాలు నేటి కవులు పలువురు వ్రాస్తున్నారు, తరచుగా! అందువల్లనే వాటిలో ప్రదర్శనార్హత

1. రవీంద్రుని నాటకాలు, ద్వితీయ సంపుటము. అనువాదము శ్రీ అబ్బూరి రామకృష్ణరావు. ప్రచురణ సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ.

ఎట్లా ఉన్నా కావ్యత్వము పూర్తిగా లోపిస్తున్నది. కావ్యత్వము మంచి స్థాయిలో లేని నాటకాలే ప్రదర్శనలో విజయవంతము అవుతుండడము విషాదకరము. కావ్యాలుగా ఎక్కువ విలువలేని నాటక ప్రదర్శనలకు నేటి జనం ఎగబడుతున్నారంటే, ఇప్పటి పరిస్థితి అటు కవులకుగాని, ఇటు ప్రదర్శకులకు, నటులకు, ప్రేక్షకులకుగాని ఏమంత సంతోషింపదగ్గ విషయం కాదు. గౌరవాస్పదమైనది అంతకంటే కాదు!

ముందు మంచి కావ్యతమున్న నాటకాలు కవులు రచించవలె. అట్టి వాటినే ప్రదర్శకులు గ్రహించవలె. నటులు ప్రదర్శించవలె. సామాజికులు చూచి ఆనందించడము నేర్చుకోవలె.

ఏథెన్సులో ఆరు బయల కవిత్రయము ప్రదర్శించిన రూపకాలు 2,500 సంవత్సరముల క్రిందట చూచి, ఆలకించి, ఆనందించి, మెప్పు ప్రకటించిన అశేష జనానీకాన్ని నేడు రంగస్థలం మీద, విశేషాదరం పొందుతున్న నాటకాలు చూచి, ఆనందిస్తున్న సామాన్య ప్రజలతో పోల్చిచూస్తే ఈ 2,500ల సంవత్సరాలలో ప్రజానీకానికి కావ్యాస్వాదన శక్తి ఎంత దిగజారిపోయినదా అనిపిస్తుంది. ఇది సహృదయులంతా విచార పడవలసిన విషయము. నాగరికత పెరిగినదా, మరేమైనది, అని బుద్ధిమంతులు ఆత్మ విచారణ చేసుకొనదగిన దిది!

ప్రాచీన గ్రీకు నాటకకర్తల నాటక ప్రదర్శనా లిప్పుడు లేక పోయినా, అవి నేటికీ ఉత్తమ కావ్యాలుగా నిలిచి ఉన్నవి. ముందూ ఉంటవి. భాసుని పేర ప్రసిద్ధికి వచ్చిన నాటకాలు, కాళిదాస భవభూతులవి, శూద్రకుని మృచ్ఛకటికము, హర్ష నాటకాలు, ముద్రారాక్షసము, వేణీ సంహారము వంటివేకాక, మురారి అనర్ఘ రాఘవము, కృష్ణమిశ్రుని ప్రబోధ చంద్రోదయమూ కూడా, ఎన్నటికీ ఉత్తమ నాటకాలుగా సాహిత్యంలో నిలిచి ఉంటవి. నాటకానికి శాశ్వతత్వము ఇచ్చేదిదాని కావ్యగుణముకాని ప్రదర్శనీయత్వము కాదు.

నాటక కర్తయే, నాటక కవియే, ప్రజాపతి. అతడు దర్శకులను, నటులను, సామాజికులను శాసించే స్థితిలో ఉండవలె గానీ, దర్శకులు

నటులు, సామాజికులూ, శాసించినట్లు, వారికందరికీ, దాసానుదాసుడై కవి తన రచన సాగిస్తే ఉత్తమ నాటకాలు పుట్టవు.

ఆంధ్ర దేశములోనే కాదు. ఇతర రాష్ట్రాలలోను ఉత్తమ నాటకాలు రాక పోలేదు. వచ్చినవి. వాటి మొహం చూచే నాథుడే లేడు. ప్రదర్శన యోగ్యత అనే ఒక అవ్యవస్థితమైన మాట ఆధారంగా చేసుకుని కవులను దిగజార దీస్తున్నారు.

ముందు ఉత్తమ నాటకకావ్యాలు వెదకి, వాటిని ఎట్లా ప్రదర్శించవలెనో, ఆలోచించవలసిన విధి, ప్రదర్శకులది. అవి చూచి ఆనందించడము ప్రేక్షకులు నెమ్మదిగా నేర్చుకోవలసిన విషయము.

రంగస్థలం యువకుల రంగులూ, పాత్రధారుల తళుకులూ, వాళ్ళ కంఠాల చణుకులూ, వాళ్ళ అంగ విన్యాసాల బెళుకులూ ఇవి అన్నీ తాత్కాలికమైనవే. అవి అన్నీ చెరిగిపోయి విస్మృతమైన తర్వాత కూడా శాశ్వతంగా నిలిచేది నాటకంలోని శబ్దమే. దాని కావ్యత్వమే! అది దృశ్యత్వానికే కాక, శ్రవ్యత్వానికి గూడా అతీతమైన మహాగుణము. ఆ గుణమే ప్రపంచంలో ఏ సాహిత్యంలోనైనా పుట్టిన ఉత్తమ నాటకాలను నేటికీ సహృదయ రంగాలలో నిత్యనూతనంగా నాట్యము చేయిస్తున్నది. ముందు చేయిస్తుంది!

"జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తియేషాం యశః కాయే జరామరణజం భయమ్"

(ఆంధ్రపత్రిక ప్రమాది 1973-74 సంవత్సరాది సంచిక)

# శ్రీ కృష్ణ లీలా తరంగిణి

శ్రీగోపాలఘనా దపారకరుణా పీయూష ధారాసృతా
యా నారాయణ తీర్థ భూధర పరిక్షిప్తా సమస్తా తదా
సంభూయాచ్యుత భక్తభూమిషు వహంత్యా నందయంతీ జగత్
పాతిత్యం విధునోతు కృష్ణవిలసల్లీలా తరంగిణ్యసౌ.

పై విధముగా తాము రచించిన శ్రీ కృష్ణ లీలా తరంగిణిని శ్రీనారాయణ తీర్థులవారు వర్ణించిరి. అందులో వా రన్నట్లు అది నిజముగా గోపాలు డనే మేఘము నుండి స్రవించిన అమృత ధారయే. లోక మంతటను ప్రవహించి ఆనందము కలిగించుచు పాపములను పోగొట్టు పుణ్య యమునా నదియే.

శ్రీమద్రామాయణము పాఠ్యమునను, గేయమునను మధురమైన పద్యాత్మక కావ్యము. గీత గోవింద కావ్యము పద్యములతో కీర్తనలు కూడా కలసిన అభినయ యోగ్యమైన మధుర కావ్యము. ఈ తరంగిణి గద్యములు, పద్యములు, కీర్తనలు ముప్పిరిగా కలసి రంగభూమిపై ప్రదర్శించుటకు యోగ్యమైన అపూర్వాద్భుత మధుర కావ్యము.

ఆంధ్రభాషలో యక్షగాన ప్రబంధము లెన్నో కలవు. అవి కొన్ని పామరులు, కొన్ని ప్రభువులు, కొన్ని పండితులు, కొన్ని తరిగొండ వెంకమాంబవంటి భక్తురాండ్రు, కొన్ని కంకంటి పాపరాజువంటి కవీశ్వరులు రచించినవి. ఎవరు రచించినపైనను వానిలో హాస్యము కొంత మోటుగాను, శృంగారము కొంత పచ్చిగాను, రచన కొంత పలుచగాను ఉండుట సర్వసాధారణము. అటులకాక ఇది గ్రంథారంభము నుండి గ్రంథాంతము వరకు సర్వవిధముల నిర్దుష్టమై బ్రహ్మానందమును రంగభూమిపై ప్రదర్శించి సహృదయులను రసానంద తన్మయులను చేయగల ఉత్తమోత్తమ కావ్యము. వాఙ్మయజగత్తులో "నభూతో నభవిష్యతి"

అనుట అతిశయోక్తి కాదు. రామాయణాదులైన ఆర్ష కావ్యములు దివ్య లోకములతో గూడ ప్రచారము కలవి యని పురాణ ప్రసిద్ధి కలదు. ఈ తరంగిణి కూడ త్రిపథగామిని యైన గంగా తరంగిణి వలెనే ముల్లోకములను ఆనందింప జేయున దనుటలో సందేహము లేదు.

ఈ గ్రంథకర్త షట్శాస్త్రముల పార మెరిగిన విద్వద్వరేణ్యుడు; అయినను గ్రంథము పండిత పామరుల కందరికి అనుభవించుటకు అందుబాటులో నున్నది. ఆయన తత్త్వమస్యాది మహావాక్యములను అనుభవములోనికి తెచ్చుకొన్న పరమహంస సన్యాసి; అయినను గ్రంథము ఆ బ్రహ్మానందమునే బహువిధముల ఆబాలగోపాలమునకు పంచిపెట్టుచున్నది. అది సంస్కృత భాషలో నున్నను భారతీయ భాషలలో ఏ ఒక్క భాష కొంచె మభ్యసించిన వారైనను తాత్పర్యము గ్రహింపగల సర్వ సామాన్య సరళ సంస్కృత భాషలో కలదు. కాశీ పండితులు వీరి సమర్థతను గూర్చి చెప్పుచు "ఏక వాక్యములో సగుణ నిర్గుణములను వర్ణింపగల నేర్పు ఆదిశంకరుల తరువాత శ్రీ తీర్థుల వారికే కల"దని శ్లాఘించిరి.

## 2

మహాభాగవత దశమస్కంధములో దేవకీ వసుదేవుల వివాహమాదిగా రుక్మిణీ కళ్యాణాంతమైనకథ ఇందులోవర్ణింపబడినది. భాగవతము స్కంధములను పండ్రెండు భాగములుగా విభజింపబడి యున్నట్లే, యిదియు తరంగములను పండ్రెండు భాగములుగా విభజింప బడినది. ఒక్కొక్క తరంగములో ఎన్నో గద్యములు, పద్యములు, కీర్తనలు నుండును. ఆ మూడును ప్రౌఢిలోగాని, మాధుర్యములోగాని ఒకదాని కొకటి తీసిపోనివేయైనను అన్నిటిలో కీర్తనలకే ఎక్కువ ప్రచారముండుట చేత ఆ కీర్తనలనే తెలిసిగాని, తెలియకగాని తరంగములని పండిత పామరులు వ్యవహరించుచున్నారు. నిస్సందేహముగా ఇందులోని కీర్తనలు సంగీతములోగాని, సాహిత్యములోగాని, నృత్య నాట్యముల కనుకూలించుటలోగాని, రాగ తాళములయు, నడకలయు వైవిధ్యములోగాని భావ శబలతలోగాని నిరుపమానమైనవి. అట్లైనను కేవలము కీర్తనల కాలక్షేపముతో ఈ గ్రంథరచన సంపూర్ణ ప్రయోజనము సిద్ధింపదు.

ప్రతి తరంగమునకు ప్రారంభమున సంక్షేపముగా కథాసంగ్రహ ముండును. అందులో తరచుగా 'అథ అభినీయతే' అని చెప్పబడినది. పంచమ తరంగాదిలోని పలుకులు ప్రత్యేకముగా గమనింప దగినవి.

గోపీ వస్త్రాపహారాఖ్యం చరిత్ర మభినీయతే
గోవర్ధనాద్రే రుద్ధార శ్చరితం హరిణా కృతమ్
పాత్రప్రవేశస్తు పునర్నందో గోప్యస్తతః పరమ్

ఈ విధముగా అభినయమేకాక పాత్రప్రవేశముకూడ స్పష్టముగా వర్ణింప బడినది. ప్రతిపాత్రయు దరువుతో ప్రవేశపెట్టబడుచున్నది.

ఉదా: ఆయాతి చతురాస్యో బ్రహ్మవదసి
గాయం గాయం ధ్యాయం ధ్యాయం విష్ణుం చేతసి
దండకమండలధారీ దానవ వైరీ
అండ బ్రహ్మాండ విధాతా అఖిల జనయితా

ఈ విధముగానే తక్కిన పాత్ర లన్నియు ప్రావేశిక దరువులతో ప్రవేశపెట్టబడినవి. గద్యలు, పద్యములు. కీర్తనలు విస్తారముగా కలవు. ఇందు గద్యములు 27. పద్యములు 319. కీర్తనలు 153. కీర్తనలు 34 వివిధ రాగములలో ఉన్నవి.

జగత్ప్రసిద్ధమైన గీత గోవిందములో 24 కీర్తనలు, 95 పద్య ములు మాత్రమే కలవు. అందులోని కథ రాధాకృష్ణుల ప్రేమ, విరహము, పునస్సమాగమము. అదియును రాధాకృష్ణుల పేర్లు తీసివేసినచో కేవల లౌకిక కామినీ కాముకుల శృంగార కథగా కను[illegible]
దానితో పోల్చినచో తరంగిణి విస్తృతిలో నేమి, వైవిధ్యమ[illegible]
కథా సంపదలో నేమి, భావావేశ చిత్రణ[illegible]
భక్తి పారవశ్యములో నేమి, పవిత్రతలో నేమి. [illegible]
ఎన్నోరెట్లు ఉత్తమమైనదిగా ప్రత్యక్షమగ[illegible]
వరుసగా సంపూర్ణముగా రంగస్థలము పైని [illegible]
పరిపూర్ణ వైభవము అనుభవమునకు రాదు. దురదృష్టవశాత్తుగా ఇందులో కొలది కీర్తనలు మాత్రమే ప్రచారములో నున్నవి. కాని గంథ

రచనా వైభవము తెలిసినవారే ఆంధ్ర దేశములో గూడ అరుదుగా ఉన్నారు.

# 3

బాలగోపాల తరంగమని ప్రసిద్ధి కల కీర్తన అందులో మకుటాయమానమైనది. తీర్థుల వారికిగూడ అదియెంతో అభిమానపాత్ర మైనది. ఆయన అందులో జతులు ఎన్నో విధములుగా కూర్చుట వలనను, 'తద్ధిత్వమేవాహం' వంటి వేదాంత వాక్యములను మేళవించుట వలనను ఇది విశద మగును. పరమ పవిత్రురాండ్రయిన యజ్ఞ పత్నులు కీర్తించిన కీర్తనయది! దానియంత ప్రసిద్ధి పొందకపోయినను రాసక్రీడ చూచి యానంద నాట్యమొనర్చి పుష్పవృష్టి కురిపించిన సురనారీమణుల కీర్తనలును, వారలను సంబోధించుచు చేసిన గోపికల కీర్తనలును సప్తమ తరంగములోనివి అట్టివే. బ్రహ్మ దేవుడు చేసిన రెండు కీర్తనలును, (1) జయ జయ గోకులబాల (2) దేవ దేవ ప్రసీదమే.... ఎంతో అద్భుతమైనవి. కీర్తనల ప్రశంస చేసినచో 153 కీర్తనలును ప్రస్తావింపవలసి యుండును.

ఆ కీర్తనల వైభవములో తీర్థులవారి గద్య పద్యముల మాధుర్యము మాటుపడినది. బృందావనములో శ్రీకృష్ణునికై గోపికలు వెదకినఘట్టము నిట్లు ఉపక్రమించినాడు.

సర్వాంతః కరణాంతస్థం ప్రాణవల్లభమ్
మృగయంతీ ర్వనే పుష్పైః హసంతఇవ పాదపాః.

వనములోని పుష్పములను వృక్షముల నవ్వుగా ఉత్ప్రేక్షించినాడు కవి. తమ హృదయాంతరములలోనే ఉన్న మాధవుని కొరకు ఈ వెర్రి గోపికలు వనమంతా వెదకుచున్నారేమని నవ్వుచున్నట్లున్నవట ఆ చెట్లు. ఎంత చిన్న పద్యములో ఎంత మధుర గంభీరార్థము ఇమిడ్చినాడు! శ్రీకృష్ణుని మరల దర్శించిన తర్వాత గోపిక లందరును ఆయనను చుట్టుముట్టి ఇచ్చ వచ్చినట్లు ఆలింగనము చేసికొనిరట ఎట్లు? 'శ్రుతయ ఇవ పరబ్రహ్మ!' పరబ్రహ్మను వేదములు పరివేష్టించి గానముచేయు

నట్లే యట। ఇటువంటి ఉపమానము మహోదాత్తకవులకే కాని స్ఫురింపదు. అక్రూరుడు నదీజలములో స్నానము చేయుచు దర్శించిన శ్రీకృష్ణుని విశ్వరూపమును చిన్న పద్యములో కన్నులకు కట్టినట్లు వర్ణించినాడు.

ముహుర్ముహుః స్యందనస్థం సలిలస్థం హృదిస్థితమ్
దృష్ట్వా సర్వాత్మకం కృష్ణం ప్రాహ చే దం స తత్త్వవిత్

కుబ్జ కథలో భగవద్భక్తి, భగవదనుగ్రహము, మన శరీరములలోని వంకరలనే కాక మనస్సులలోని వంకరలను గూడ ఎట్లు పోగొట్టునో సూచితమౌను. ఆ ఘట్టమును వర్ణించుటలో తీర్థుల వారికి ఎంత ఉత్సాహము.

హసంతం వదంతం సమీపే వసంతమ్
ముహు స్సంస్మరంతం తపః ప్రాక్తనం తత్
పరప్రేమ భక్త్యా ప్రభుం ప్రార్థయంతీ
స్వయం ప్రాహ చే దం వచ స్సాధు కుబ్జా

గోపికలు గానము చేసినది ఆత్మానుభూతి యట.

ఆత్మారామాః పరానంద నిత్యప్తాః షనః పునః
ఆత్మానుభూతిం గాయంత్యః కష్టైక రసతాం గతాః

గోపాలకులతో శ్రీకృష్ణుడు చేసిన విహారమును ఎంత చిత్రముగ వర్ణించినాడో కవి చూడదగును.

గాయన్ గాయన్ వనభువి శనై ర్గోపబాలై స్సమేతో
దేయం దేయంకరతల మితి ప్రీతితస్తా డయం స్తత్
పాయం పాయం సరస వచనాహ్లాద పీయూష ధారామ్
సోయం మాయా విహరతి ముహుర్నాదయన్ వేణుమీశః

తీర్థులవారి గద్యమాధుర్యమునకు ఒకటి ఉదాహరింతును. వెదకి వేసారిన గోపికలకు శ్రీకృష్ణుడు దర్శన మిచ్చిన ఘట్టములోనిదిది.

అథఖలు వల్లవయువత్యో నిజ వల్లభవిరహ సంతాప జనిత దురంత చింతా సంతాప మందీకృతబాహ్య విషయవివేకవృత్తి మచ్చిత్త

వత్యో ముహుర్ముహు స్తదియ లీలా వినోద నవరసావిష్కరణ ప్రవీణాః గోపాంగ ప్రత్యంగ గుణగణ సమవిషమ బలాబల సమబల విలాస విలసిత గ్రీవా శిరః కంప త్రిభంగి లలిత దివ్యగాత్ర భ్రూనేత్ర హస్త విశేషాద్యా విష్కృత నవరసాలంకారాలంకృత వివిధలాస్య విశేషం స్ఫురదధరమణి పరిమిళిత మురళీ కలవర సుధావధీరిత సుర సుధా ఖండ మండలం స్మారం స్మారం స్వస్వాంతః కరణానపాయేన సర్వాంతరంగం మదన శతకోటి సుందరాంగం ధ్యాయంత్యో మనసా ప్రణమంత్య శ్శిరసా వచసా చ పురఃస్థిత మివసంబోధ్య ప్రత్యేకం గోపాల మగాయంత.

# 4

ఇట్టి యపూర్వ మహా కావ్యమును రచించిన శ్రీ నారాయణతీర్థుల వారి జన్మస్థానము గుంటూరు మండలములో మంగళగిరికి సమీపమున నున్న కాజ గ్రామము. ఇంటిపేరు తల్లావజ్ఝల వారు. పూర్వాశ్రమ నామము గోవిందశాస్త్రి. తండ్రి పేరు నీలకంఠశాస్త్రి. తల్లి పార్వతమ్మ. సోదరుడు నరసింహశాస్త్రి. నరసింహశాస్త్రి వంశ పరంపర నేటికిని వర్ధిల్లుచున్నది. వారిలో పలువురు సన్యాసాశ్రమము స్వీకరించిన వారే. సాహితీ సమితి సభాపతులును, ప్రస్తుతము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి ఉపాధ్యక్షులును, విద్వత్కవులును అగు శ్రీ శివశంకర స్వామివారు ఆ వంశము లోనివారే. గోవిందశాస్త్రి శాస్త్రాధ్యయనము చేసినది కృష్ణాతీరమందలి విద్వాంసుల వద్దను, సన్యాసాశ్రమము స్వీకరించినది కంచిలో శ్రీ శివ రామానంద తీర్థులవారి కడను, శాస్త్రాధ్యయనము చేసి బహుశాస్త్ర గ్రంథములను రచించినది కాశిలో. శ్రీకృష్ణ లీలా తరంగిణి గానము చేసినది ఆసేతు హిమాచల మధ్యస్థమైన పుణ్యతీర్థములలో. చివరి రెండు-మూడు సంవత్సరములు గడిపినది కావేరి తీరస్థమైన వరహూరులో. సిద్ధి పొందినది దానికి సమీపముననే ఉన్న తిరుపురుందుర్తి అను గ్రామములో ఆమ్ర వృక్షము క్రిందను. ఇప్పటికిని వారి సమాధి వద్ద ఆయన తమిళ భక్తులు శ్రీకృష్ణ లీలా తరంగిణీ కాలక్షేపాదులతో వైభవముగా ఆరాధనోత్సవము ప్రతి సంవత్సరమును సిద్ధిపొందిన ఫాల్గుణ శుద్ధ అష్టమినాడు జరుపుచున్నారు. అందుకొఱకై 19 యకరముల మాన్యము దానము

చేయబడినది. ఆయన జీవించినది క్రైస్తవ శకము 17 వ శతాబ్దము చివరి భాగము నుండి 18 వ శతాబ్దము మధ్యభాగము వరకు. ఆయన చిత్ర పటము వరహూరులో శ్రీ బాలకృష్ణాలయములో కలదు. ఆయన రూప ములోని పోలికలు నేటికిని తల్లావజ్ఝలవారిలో ఛాయగాపొడకట్టు చున్నవి. వారు తరంగిణిలో ముందు కీర్తించినది సర్వజగన్నాథుడైన జగన్నాథ స్వామిని. జన్మతః ఆయన ఆంధ్రుడు. కాని సంస్కారము చేత సర్వ జగత్పూజ్యుడు.

వారు రచించిన శాస్త్ర గ్రంథములెన్నో ముద్రింపవలసి యున్నవి. అవి యన్నియు నెట్లున్నను వారి శ్రీకృష్ణ లీలా తరంగిణి సర్వసంపన్న ముగా ప్రచురించి ప్రపంచదృష్టి నాకర్షించునట్లు చేయుట ప్రతి ఆంధ్ర సహృదయుని కర్తవ్యము. ఆ గ్రంథమును పరిపూర్ణ స్వభావముతో రంగ స్థలముపై ప్రదర్శింప జేసి, అథమ పక్షము భరతదేశ మంతటినైనను బ్రహ్మానందముతో నాట్యము చేయించుట ముఖ్యముగా ఆంధ్రప్రదేశ సంగీత నాటక అకాడెమీ వారి విధియై యున్నదని మనవి చేయుచు ఉద్ఘోషించుచున్నాను.

(నాట్యకళ, జనవరి–1967)

# శ్రీ కృష్ణలీలాతరంగిణిలో భక్తి తత్త్వము

శ్రీ నారాయణతీర్థుల వారు రచించిన శ్రీకృష్ణ లీలా తరంగిణి యక్ష గాన శాఖకు చెందిన దృశ్య ప్రబంధము. గద్యములు, శ్లోకములు, కీర్తనలు సమానప్రౌఢి మాధుర్యములతో ఒప్పు చున్నవి. ఇందులో సాహిత్యము, సంగీతము, నృత్యము, అభినయము ఏకమైన సంపూర్ణత నొందినవి. ఔపనిషదులు భావించు బ్రహ్మానందమే ఇందులో నాట్య స్వరూపముగా ప్రదర్శింప బడుటచే, భక్తి సాహిత్యములోనే కాక విశ్వ సాహిత్యములోనే సాటిలేని ఉద్గ్రంథ మిది!

దీనిని రచించిన శ్రీ నారాయణానంద తీర్థుల వారు తీర్థ సంప్రదాయమునకు చెందిన పరమ హంస యతీశ్వరులు. వారు తురీయాశ్రమము స్వీకరించినది కంచిలో శ్రీ శివరామనంద తీర్థుల వారియొద్ద. వీరి పూర్వాశ్రమ నామము 'గోవింద శాస్త్రి'. గుంటూరు మండలములో మంగళగిరి సమీప మందలి కాజగ్రామములో వీరు జన్మించిరి. ఇంటి పేరు తల్లావజ్ఝలవారు. వీరి సోదరుడైన నరసింహశాస్త్రి సంతతి నేటికిని ఆ ప్రాంతములో శాఖోప శాఖలై వర్థిల్లు చున్నది. ఆవంశములో పలువురు భక్తులును, విద్వాంసులును మాత్రమే కాక సన్న్యాసాశ్రమము స్వీకరించిన వారును కలరు.

ఈనాట్య ప్రబంధము రచించిన నారాయణ తీర్థుల వారు షట్శాస్త్రముల పార మెఱిగిన విద్వదగ్రేసరులు. బహు కాలము వీరు కాశిలో నుండి 'భాట్ట భాషాప్రకాశ' మను పూర్వ మీమాంసా గ్రంథమును రచించిరి. శాండిల్య భక్తిసూత్ర వ్యాఖ్య మొదలగు ఇతర గ్రంథములను గూడ రచించిరి. వీరు బ్రహ్మ విద్యోపదేశము చేసిన శిష్యులలో కాశ్మీర సదానంద తీర్థుల వారు మిక్కిలి ప్రసిద్ధులు. తీర్థుల వారు బ్రహ్మ విద్యను తురీయాశ్రమములకు విరివిగా పంచి పెట్టుటతో తృప్తి చెందక, అశేష సామాన్య జనములకు కూడ బ్రహ్మానందరుచి ప్రదర్శించు నుద్దేశముతో,

ఈ గ్రంథము రచించిరి. వీరు తమ పాదవిన్యాసముచే భరత భూమి నంతటిని పవిత్ర మొనర్చినను, ఎక్కువగా సంచరించినది ఆంధ్ర భూమి యందని తోచును. శ్రీకాకుళము నుండి నెల్లూరు వఱకును వంశ పారం పర్యంగా వారికీర్తనలను 'తరంగము'లను పేర గానము చేయుచున్న వారు పరశ్శతముగా కలరు. తల్లావఝ్ఝల వారి వంశములో ప్రతివారును అధమ పక్షము మూడు తరంగములైనను చెప్పుకొన వలెనను నియమ మున్నది. అద్దంకి ప్రాంతమందే అఱువది పేర్వేఱు కుటుంబముల వారు పరంపరగా తరంగ గానము చేయు చున్నారు.

వీరు చరమ దశలో కావేరి తీరమందలి వరహూరు చేరి ఆసమీపము ననే కల పురుందుర్తిలో సిద్ధి పొందిరి. వీరి తరంగములకు తమిళ దేశమందంతటను గూడ విశేష ప్రచారము కలదు. నేటికిని వారు సిద్ధి పొందిన ఫాల్గుణ శుద్ధ అష్టమినాడు పురుందుర్తిలో ఆరాధనోత్సవము జరుపు చున్నారు.

తరంగిణిలో తరంగములను పంద్రెండు భాగము లున్నవి. ఇందు లోని కథ భాగవత దశమస్కంధములోని రుక్మిణీ కల్యాణాంతమైన శ్రీ కృష్ణలీలలు. ఐనను జయదేవుని గీతగోవిందమును స్మరించు నుద్దేశముతో కావచ్చును శ్రీకృష్ణ తత్త్వజ్ఞనుగా రాధను ప్రవేశ పెట్టి ఆమెచే గోపిక లకు శ్రీకృష్ణ తత్త్వమును ఉపదేశము చేయించినారు. ఇందలి ద్వాదశ తరంగములును వాసుదేవ ద్వాదశాక్షరిని, భాగవతములోని ద్వాద శస్కంధ విభాగమును స్మరణకు తెచ్చు చున్నవి. భక్తాగ్రేసరుడగు జయ దేవుడు వర్ణించిన రాధా కృష్ణ శృంగారము ప్రాకృతులకు కాముక శృం గారముగా భాసించు ప్రమాదమున్నది. కాని తీర్థులవారి శ్రీ కృష్ణలీలలో ఆభాస మాత్రముగా కూడ కాముక శృంగారము కనబడక పోవుట గొప్ప విశేషము.

గ్రంథములో వర్ణించిన ప్రధాన కథ శ్రీ కృష్ణలీలా వర్ణనమే కాని అతడు కేవలము అష్టమావతార శ్రీకృష్ణుడే కాదు. ప్రథమ తరంగములో సనకాదుల చేత,

"రామకృష్ణ గోవిందేతి
నామ సంప్రయోగే
కామమిహ స్నాతవ్యం
సర్వోత్తమ ప్రయోగే"

అనిపించినారు. అతడు మరియు "నృణాం బంధహతిం కుర్వన్ నృసింహోసి దయాఘన" అనిపించుకొన నర్హుడైన వాడు. ఆతని నే గ్రంథారంభములో "నీలాచల వర నిలయం నిఖల జగన్నాథ మాకలయే" అని కవి భావన చేసెను. తాను నిత్యము భావించు నారాయణునకు శివునకు భేదము లేదని సూచించుటకు తఱచుగా కీర్తనల ముద్రలో తన నామముతో పాటు గురు నామముకూడ జోడించి 'శివ నారాయణ తీర్థ" అని పలుతావుల జెప్పికొనిరి. పూతనా సంహారమైన పిమ్మట గోప గోపికల చేత.

"మంగళాని తనోతు
మధుసూదన స్సదా
గంగాధరోఽపి
తవ సాపిగంగా" అనియు,
"దక్షిణామూర్తి రపి దాక్షిణ్య మాహవతు" అనియు,
"దుర్గాణి వారయతు దుర్గా సరస్వతీ తే
భర్గోఽపిభర్గయతు పాప వర్గమ్"

అని ఇత్యాదిగా స్వస్తి పలికించెను. ఈకవి దృష్టిలో శరత్కాల మెట్టిది?

"శారదేవ శరదాగతా స్వయమ్
తారకోదయ విశేష భాసురా
వారిజేషు సలిలేషు ధీమతామ్
సార్మితార్థ మవ భాసయం త్యసౌ" మరియు,
"శంకే శంకరం శారద సమయం
పంకేరుహవరాగ విభూతి ధవళమ్"

అన్నారు.

ఈ కవి దృష్టిలో విఘ్నేశ్వరుడు 'మహత్తమమైన ఆద్య తేజస్సు', అమృత కలశ హస్తుడైన వైనతేయుడు 'ఆమ్నాయ కాయుడు', అర్చావ తారుడైన వరాహపుర వేంకటేశ్వరుడు కూడ "నిగమ గోచర నిత్య నిర్మలానందఘనుడు!"

# 3

గ్రంథమంతటను సందర్భము కల్పించి కవి అద్వైతముబోధించు చుండును. కాళీయమర్దన సందర్భములో బంధితుడైనట్లు లీల ప్రదర్శిం చిన "సర్వాత్మకు" డైన కృష్ణుని 'సకలాత్మదర్శి' యైన బలరాముడు.

"బంధనాన్మోచయ-కాళీయకృత-బంధనాన్మోచ యాత్మానమ్...."

ఇత్యాదిగా ప్రబోధింప జేసినాడు.

యజ్ఞపత్నులు చేసిన స్తవము బాల గోపాల తరంగ మని ప్రసిద్ధి వడసినది. అందులో మరల మరల, "తద్దిత్వమే వాసి, తద్దిత్వమే వాసి, తత్సర్వ మేతత్త్వమే వాసి నూనమ్- నృత్యంత మత్యంత మానందమీడే- హితం త్వా మహం త్వా మహం త్వా మహమ్" అని నృత్యము చేయించినాడు.

గోపాలురతోడ నాడుచు పాడుచున్న శ్రీకృష్ణుని గూర్చి కవి 'సోఽయం మాయా విహరతి ముహు ర్నాదయన్ వేణుమీశః' అని వర్ణించినాడు. అందువల్లనే కాశీపండితులు "సగుణ నిర్గుణములను ఏక వాక్యములో చెప్పగల సమర్థత శ్రీ శంకర భగవత్పాదుల తర్వాత నారాయణతీర్థులవారి కొక్కరికే కల" దని పలికినారు.

శ్రీకృష్ణలీలల స్వరూప మవగాహన చేసికొనలేని ఆధునికులకు గోపికా వస్త్రాపహరణము ఏహ్యమనిపించును. కాని తీర్థులవారి కీర్తన విన్నప్పుడది పటాపంచలై పోగలదు. గోపికా వస్త్రాపహరణము చేసి 'పుణ్యపుంజఫలోదయు'డైన గోవిందుడు గోపికలకు 'పరమ బాంధవు'డై

వారితో 'శర్మదములైన ధర్మవాక్యములు' పలికినాడట. గోపికలు తమకు అవరణ మిమ్మని వేడగా శ్రీకృష్ణుడిట్లు వారికి జ్ఞానముపదేశించెను:

"ఆవరణం మమ నహి తే దాతుమ్....
"నీతం నైవ మయా పరకీయం
నైవ మమావరణం నిజ దృష్ట్యా...
"యుక్తి సహం నహి భవదావరణం
యోగిభి రితి మీ మాంసిత మబలాః"

సప్తమాష్టమతరంగములలో రాసక్రీడ, శ్రీ కృష్ణాన్వేషణము, గోపీ కాగీతములు వర్ణింపబడినవి. ఆ రెండుతరంగములును భక్తులైన వారికి అమృతాయమాన మైనవి. అది ఇట్లారంభింపబడినది.

"భక్తి సంకల్పసిద్ధి మాత్రాన్వో గోపరమణీనయనోత్పలారాధిత మదన గోపాలమూర్తి ర్వాసుదేవో గోపీభి స్సహ రాసక్రీడా మహోత్సవా రంభసంభ్రమచేతాః గోపీభి స్సార్థ మాత్మతత్త్వ ముపదిశ న్నిద మాహ."

ఆశౌరి వాక్సుధ బ్రహ్మానుభూతిరసికమైనదట, గోపిక లద్దానిని త్రాపుచు కృష్ణబ్రహ్మ నిష్ఠులై రట. వారంతట నతనితో కలిసి రాసమండ లమున గానముతోడి నృత్యముచేయుచు అత డుపదేశించిన అద్వైతము నిట్లు అనుకరించిరట.

"అద్వయ మఖండిత మశేష జగదాదిం
యత్ర చ జగత్త్రితయ మాస్థిత మనంతే
యత్ర విలయం పునరుపైతిమృదికుంభో
యద్వదవధారయత సత్యమితిమా మోమ్"

సంసారరోగ సంతప్తులైన యా గోపికలు కృష్ణబ్రహ్మ రసాయనము గ్రోలి ముక్తలై అభయమును పొందిరి. వారి యానందావస్థ ఈ విధ ముగా వర్ణింపబడినది:

"ఆత్మారామాః పరానంద
నిత్యతృప్తాః పునః పునః

ఆత్మానుభూతిం గాయంత్యః
కృష్ణైక రసతాం గతాః
"రమంతే పరమానందే
కృష్ణ బ్రహ్మణి తా భృశమ్
త్యక్త దేహ ద్వయం మానా
నిర్విశేష సుఖే స్థితాః"

"విస్మరంత్యః స్వకం దేహ
మాత్మ మాత్రావశేషితమ్
బాలోన్మత్తాదయో యద్వ
దాత్మ న్యేవ సమాహితాః"

అప్పుడు వారిని కృతకృత్యలనుగా నెఱింగి శ్రీ కృష్ణపరమాత్మ వారికి దర్శనమియాగా వారాతనిని శ్రుతులు పరబ్రహ్మను యథేష్టముగా చుట్టుముట్టి ఆలింగనమొనర్చుకొని అనురాగముతో గానము చేయునట్లు గానము చేసిరి.

శ్రీకృష్ణలీలాతరంగిణిలో తీర్థులవారు బ్రహ్మానందతరంగిణినే మనకు ప్రసాదించినారు. వారు గ్రంథాదిలో పరమభాగవతులను స్మరించిన శ్లోకము జగత్ప్రసిద్ధము.

"ప్రహ్లాద నారద పరాశర పుండరీక
వ్యాసాంబరీషశుక శౌనక భీష్మదాల్భ్యాన్
రుక్మాంగ దార్జున వసిష్ఠ విభీషణాదిన్
పుణ్యానిమాన్ పరమ భాగవతాన్ స్మరామి."

తీర్థుల వారు ఆభక్తులకోవలోనివారే; బ్రహ్మ లోకమునుండి లోకో ద్ధరణార్థ మవతరించు నాధికారిక పుణ్యపురుషులలో ఒకరు. వారు ప్రసా దించిన ప్రయాగలో భక్తులందఱు తాన మాడి ముక్తులై బ్రహ్మానంద మనుభవింతురు గాత !

*

# నవ్యకవిత్వము

అయితే నవకవిత్వ మేమిటి? కవిత్వ మేమిటో దాని స్వరూప మేమిటో నిర్ణయించలేక పెద్దలే బాధపడుతూ ఉంటే, అందుకు తోడు ఈ 'నవ' విశేషణము కూడా ఎందుకు ? ఈ కవిత్వములో కొత్త ఏమిటి ? భాష కొత్తా? భావము కొత్తా? ఛందస్సు కొత్తా? రీతిలోనా, అలంకారము లోనా, రసములోనా, ఎందులో ఈ నవ్యత? లేక వ్యాకరణమర్యాదలు ఉల్లంఘించడములో కొత్తా? అర్థము లేకుండా వ్రాయడములోనా? కాక పెద్దలను ధిక్కరించడములోనా? ఎందులో ఉన్నది నవ్యత నవ కవు లలో? -ఈ విధముగా పెద్దలే అడుగుతున్నారు. అన్నిటిలో-అని ప్రత్యు త్తర మీయవచ్చును. అప్పుడు ఈ ప్రశ్నలు వేసే పెద్దలు నవకవులకు చివరకు వ్యాకరణోల్లంఘనములోకూడా కొత్తదన మున్నదని ఒప్పుకోరు. అపాణినీయాలే కాక అనింద్య గ్రామ్యాలు కూడా నన్నయాదులే ప్రయో గించి దారి చూపినారు; అందులో మాత్రము వీరి కొత్త ఏమిటి ? అని పెద్దలు నవకవులకు నవ్యత లేదని నిరూపించగలరు. అట్టివారిది భౌతిక శాస్త్ర పరీక్ష వంటిది. లోకములో ఉన్న వస్తువులన్నీ పంచభూతముల సంయోగమువల్ల కలిగే వివిధవికారాలే కాబట్టి, అన్నీ ఒకటే అని ఋజువు చేసే దివ్యజ్ఞానమూర్తులీ పెద్దలు.

తెలుగు వాఙ్మయమంతా వివరించి చూస్తే అక్షరాల తరగతిలో చదువుకున్న 56 అక్షరాల కలయికవల్ల చేసే గారడీయే కాని మరేమీ కానట్లు తోస్తుంది అట్టివారికి. అటువంటి బ్రహ్మజ్ఞానులను ఉద్దేశించి చెప్పేది కాదీనవకవిత్వము అనేమాట. ఉపాధిభేదాలు అంగీకరించే సామా న్యులైన ప్రాకృత మానవులకు చెప్పే మాట ఇది!

ప్రకృతి అంతటిలోనూ జననమూ, వృద్ధీ, జీర్ణావస్థా, ఒకదాని తర్వాత ఒకటి వచ్చి, జీర్ణస్థితిలోనుంచే పునర్జననము కనపడుతుంది. కాలపురుషుడు ప్రతిసంవత్సరమూ శిశిరములో జీర్ణించి, వసంతములో పున

ర్జన్మ పొందుతున్నాడు. చెట్లు చిగిర్చి నెమ్మదిగా వృద్ధిపొంది, చివరకు శిశిరములో ఆకులు రాలిపోయి, మళ్ళా ఆ మ్రోళ్ళనే వసంతములో చిగిరిస్తున్నవి. మహానదులు వర్షముతో వృద్ధియై, గ్రీష్మముతో క్షీణించి, మరల వర్షముతో పునఃపుష్టి పొందుతున్నవి. కవిత్వము మహా ప్రవాహమైతే, దానికీ వర్షమూ, గ్రీష్మమూ, మరల వర్ష ఋతువూ ఉన్నవి; కవిత ఒక రసాలశాఖ అంటే, దానికి వసంతమూ, శిశిరమూ, మళ్ళీ వసంతమూ ఉన్నవి. ప్రవాహములకు వర్షాగమముతో కొత్తనీరు వస్తుంది. తరుగుల్మాదులు వసంతాగమముతో నవనవలాడుతూ ఉంటవి; అవిధముగానే ఇది నవకవిత్వము. ఇందులో పూర్వకవిత్వ ప్రవృత్తి మారి పోయినదని కాదు. మునుపు లేనిది ఇప్పుడు కొత్తగా పుట్టినదని కాదు. స్త్రీలలో లావణ్యమువలె, పసిపాపల పాల మిసిమివలె, యువకులలో ఉత్సాహమువలె, యోగులలో శాంతివలె, కావ్యములలో రసమువలె, ఇతమిత్థ నవకవిత్వము రీతి యని స్పష్టముగా వర్ణించడానికి సాధ్యముకాక, ఇటువంటిదని కొంత సూచించడానికి సాధ్యమై, అనుభవైకవేద్యమైన ఒకానొక విశిష్టధర్మమున్నది నవకవిత్వములో.

నవకవిత్వమును విశేషముగా స్తుతి చేసేవారూ లోకములో ఉన్నారు. దానిని చూచి అపహసించి నిరసించి విశేషముగా నిందించేవారూ ఉన్నారు- యువతిని చూచి వృద్ధనారి అసహ్యించుకొన్నట్లు. కాని నవకవిత్వమును భూషించినా, దూషించినా, ఉభయపక్షాలవారూ దాని నవ్యత అంగీకరించినవారే అవుతున్నారు. ఒకరికి అ నవ్యత సమ్మతము, ఇంకొకరి కది అసమ్మతము. దానినిబట్టి అది అనుభవైకవేద్యమని అన్న మాట సత్యమని ఋజు వవుతుంది.

## 2

అయితే, నవకవిత్వమంటే మునుపెన్నడూ లేని కొత్తదే ఈ కవిత్వము అని వాదించేవారు మనదేశములోనూ, ఇతర దేశములలోనూ కూడా ఇప్పుడు లేక పోలేదు. ఆటవిక మానవుడు మారిపోయి నాగరిక మానవుడు పూర్వము ఎట్లా వచ్చినాడో, ఆ విధముగానే ఇప్పుడు పూర్వ నాగరిక మానవుడు పూర్తిగా మారిపోయి ఆధునిక మానవుడైనాడని

వారి ఊహ. ఈ విధముగా మానవప్రకృతే మార్పుచెందినది కాబట్టి, దానితోపాటు మానవ కవిత్వము కూడా పూర్తిగా మారవలెననీ, మారి తీరుతుందనీ వారి మతము. పూర్వమానవు లెరుగని మారణ సాధనాలు కనిపెట్టగలిగిన ఆధునిక మానవుని అహంభావము వల్ల జనించిన దీ వాదము. మొదటి ఐరోపా మహాసంగ్రామానికి కొద్దిగాముందు ఈవాదము ప్రారంభించి యుద్ధానంతరము లోకమంతటా వ్యాపించినది. అది మృత్యుముఖముగా మహామాయ ప్రేరణవల్ల పరుగెత్తుతున్నవారి వాదము. అగ్నిశిఖ మింగబోతున్న శలభముల అహంభావమది. వారి వాదము అంగీకరిస్తే, ఇప్పుడు మనము మహాకవులు అనుకునే కాళిదాసాదులు కవులు కారు; వారి కవిత్వము కలిగించిన ఆనందము మూఢమాత్రయోగ్యమైనది. ఇంత ఎందుకు? ఇంతవరకూ లోకములో పుట్టిన కవిత్వము కవిత్వము కాదు. నవ్యకవిత్వము పుట్టుతున్నది; పుట్టబోతున్నది; పుట్టుతూంది — అని వారి వాదము.

ఈ అహంభావపూరితులు ఉద్దేశించే అర్థముతో నవ్యకవిత్వమనే పదము ఇందులో వ్యవహరించలేదు. అహంభావ కవులవాదన ఏమైనా ఇంతవరకూ వారు చేసిన రచనలనుబట్టి పరీక్షించగా అది పూర్వము ఎన్నడూ ఎవరూ ఎరగని కొత్తది కాకపోవడమేకాక, మన సాహిత్యవేత్తలు అధమవిధమైన కవిత్వ మని నిరసించిన చిత్రకవిత్వముగా గణించదగినదిగా కనబడుతున్నది. వారి వాదానికి అనుగుణమైన రచనలు చేసి చూపే వరకూ, వారి ప్రయత్నము ఆకాశసౌధ నిర్మాణముగా తలంచక తప్పదు.

## 3

కొంత కాలమునుంచీ భరతఖండము అంతటా ఒక నవశక్తి ఆవేశించి తాండవ మాడుతున్నది. బహుకాలము పారతంత్ర్యము అనుభవించి దాస్యవిమోచనకై అమృతాహరణమునకు సిద్ధపడిన గరుడుని రెక్కల కదలిక ఆస్ఫాలనమే కానవచ్చునది! కాక ఆధునికుల ప్రచార సాధనాలవల్ల దేశదేశాల స్వరూపమంతా ఒక్కసారిగా మనము తెలుసు కోగలిగినందువల్ల సూర్యోదయముతో వికసించే పద్మమువలె మనబుద్ధికి

కలిగిన వికాసమే దీనికి కారణమేమో! వాయువు విశేషము మందగించిన చోటనే మరుక్షణములో తుపాను రేగుతుంది. ఆ విధముగానే మన దేశములో కొంతకాలమునుంచి ఒకానొక నూతనోజ్జీవము కలిగింది. తెలుగు కవిత్వములో ఈ నూతన చిహ్నాలు అంతకుమునుపే కనబడుతూ ఉన్నప్పటికీ, అవి స్పష్టముగా కార్యరూపము పొందినది 1913 సం॥లో. శ్రీ రాయప్రోలు సుబ్బారావు తృణకంకణము (గడ్డికడియము) ప్రచురణములో ప్రమాదీచ సంవత్సర శ్రావణ పౌర్ణిమ స్థిరవాసరమైనట్లు ప్రకాశకులు అందులో ఉల్లేఖించినారు. కవి అన్నాడు.

"శాశ్వత నవ్యస్ఫురణల
నశ్వర లావణ్యమై యెనయు గావ్యకళా
విశ్వమునన్ రసమయమధు
రైశ్వర్యము లేలు కవిత కంజలి నిత్తున్"

"శశి వికసించిన శ్రావణ
నిశీథమున, కానబడిన నీరదసుతకున్
బ్రశమితమతినై యీ వ
ద్యశుభాంజలి నొసగితి బ్రణయార్పణ మనుచున్"

ప్రకాశకులు పీఠికలో "ఇప్పటి యాంధ్ర వాఙ్మయమున బురాతన ఫక్కి రచనతగ్గి నూతన వికాసాంకురములు పొడగట్టుచుండుట కెంతయు సంతస" మందినారు. నవీన భావములు నూతనాదర్శములు జీవకళలు లోకపరిణామ హేతువులని సాటినారు. లక్షణశాస్త్రములు వ్రాసినవారు సర్వాధికార ధూర్వహత్వమును నిరసించి కవుల స్వాతంత్ర్యము రక్షించినారు. 1తృణకంకణము 2 కష్టకమల 3 స్నేహలతాదేవి 4 తెనుగుతోట 5, స్వప్నకుమారము—వరసగా ఐదు కావ్యములు 1913, 1914 సంవత్సరములలో అభినవకవితామండలి తరఫున ప్రచురించినారు. అందులో 'తెనుగు తోట'లో ఆ రోజులలో తెనుగుకవిత్వములో విజృంభిస్తూ ఉన్న నవజీవనము రమణీయముగా ప్రతిబింబించి కానవస్తున్నది. 'లేఖినీ శుభాఖ్యాహన'లో కవి.—

"లలిత సారస్వత నికుంజ వలయ మెల్ల
నవనవానంద భావ సుందర లతాంత
ములను నవనవలాడు నో ముద్దు కలమ!"

అని సంబోధించినారు. నవకవుల రచనల సంపుటి ఏదైనా శ్రీ రాయప్రోలు సుబ్బారావు రచనతో ప్రారంభించడము సమంజసము. అందువల్ల 'నవనీతము' శ్రీ రాయప్రోలు సుబ్బారావు రచనలతో ప్రారంభము చేసినాము.

# 4

శ్రీ రాయప్రోలు సుబ్బారావు తెలుగు దేశములో ఉదయిస్తున్న ఈ నూతన కాంతిబింబమును ముందుగా చూడ గలిగిన ద్రష్ట. కథా కథనము ప్రాచీనమార్గముతో సాగిస్తే, పాడినపాట అవుతుందని తెలుసుకున్నాడు. కథావస్తువులు కూడా సామాన్య జీవితములోనుండి తీసుకొని, అందులోనే ఉదాత్తతా, మాధుర్యమూ చూపగలిగినాడు. తన కావ్యములలో వివిధములైన ప్రణయభావములు చిత్రించినాడు. కాని తెనుగు దేశములో కలుగుతున్న ఉత్తేజమునూ, నూతనశక్తినీ అనుభవించి ఆంధ్రాభిమానముతో ఉడికిపోయిన ప్రథమకవి ఇతడు! అవి ఆంధ్రరాష్ట్రము కోసము ఆందోళన ప్రారంభమైన రోజులు. 'ఆంధ్రావళిలో' ఆంధ్రులలో ప్రముఖుల మీద కావ్యము అల్లి మెప్పింప చేసినవాడు. సభారంగములలో శ్రీ రాయప్రోలు సుబ్బారావు పద్యాలే ఇప్పటికీ ఆంధ్రాభిమానము కలవారు ముందుగా చదువుతున్నారు. తెలుగు దేశములోవిరుస్తున్న ఈ నవవసంతము ఆయన తెలుగుతోటలో ద్యోతితమవుతున్నట్లు మరి యే కావ్యములోనూ ద్యోతితము కాదు. ఆ కావ్యము ప్రతి పద మధురము. శ్రీ సుబ్బారావు తెనుగువాడే కాదు. తెనుగునాటి వాడు కూడాను. ఆయన కవిత్వములో ఈ తెనుగునాటి తీయదనము మూర్తీభవించి ఉన్నది.

తెలుగుతోటను 'లేఖినీ శుభావాహన'తో ప్రారంభించి, 'గీతా సఖ్యము' చేసుకొని, పొద్దుపొడుపు నోములుపట్టిన తెనుగు

నాటి చిన్నదానిచేత 'మంగళాచరణము' చేయించి, కోకిలపాట విని పించినాడు.

> "ఆలకింపుము బాలరసాల శాఖ
> నుయ్యేలల నూగుచు మరందలియ్యఫణితి
> బాడుచున్నది కోయిల పాటకత్తె
> పావనంబైన మాతృసేవా వ్రతంబొ"

కోయిల 23 పాటలతో తెలుగుకన్యకు మేలుకొలుపు పాడుతుంది. వాటిలో ఆరు పాటలు ఇందులో ప్రత్యేకించి వేసినాము.

# 5

నవకవిత్వము శ్రీరాయప్రోలు సుబ్బారావుతో ప్రారంభమై సాహితీ సమితి కవులతో తెలుగు దేశములో పాదుకొనిపోయినది. సాహితీసమితి అభినవకవితామండలివలె ఒక్క కవిత ప్రధానముగా కూడుకున్నది కాదు. సమితిలో అనేక మార్గములు తొక్కిన అనేక కవులున్నారు. సమితికవులకు కీలకమువంటి వాడు సాహితీసమితి సభాపతి తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి.

శ్రీ శివశంకరశాస్త్రికి ఆంధ్రాభిమానము తక్కువ. లోకములో ఎక్కడ ఎటువంటి కవిత్వము, ఎటువంటి శిల్పము, చిత్రకళ రూపము పొందినా, అవి అన్నీ అవగతము చేసుకోవలెనని ఆయనకోరిక. ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానములూ, పురాతనాధునాతన వాఙ్మయములూ చవిచూచిన వాడు. సంస్కృతాంధ్ర పండితుడు, అనేక భాషాకోవిదుడు, బహుగ్రంథ ద్రష్ట, స్నేహపాత్రుడు, సరసుడు, ధీరుడు, ప్రతిభాశాలి. ద్వితీయ యౌవనములో పవిత్రప్రణయము అణువణువునా విజృంభించగా ఉద్రూత లూగి మహాప్రవాహమువలె కావ్యము చెప్పిన ప్రేమశీలి. ఎంతటి భావో ద్రేకమున్నా, శిల్పము మరచిపోని ఉత్తమకవి. ప్రేమకూ భక్తికీ భేదము చేయని వైష్ణవుడూ, శైవుడూ. తన ప్రియురాలి నేత్రముల అందము చూచి ముగ్ధుడై తన్మయుడై ఉండే ధనుర్దాసు, శ్రీరామానుజుల అనుగ్ర హముచేత శ్రీరంగశాయి దివ్యలోచనములు చూచి మహాభక్తుడుగా మారి పోయిన కథ ఈ 'దివ్యలోచనములు'.

# 6

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి నవకవిత్వమున కొక నూతన శోభ తెచ్చినవాడు. తెలుగు దేశములో నవ్యకవితను మూలమూలలా ప్రచారము చేసినవాడు. పూర్వమార్గావలంబకులు ఆయననూ ఆయన కవిత్వమునూ వృథాగా దూషించినంతగా ఆధునికుల నిక ఎవ్వరినీ దూషించి ఉండరు. అయితే మనస్సులో బాధపడ్డా, విరసుల దూషణలను ఒక్క చిరునవ్వు నవ్వుతూ, ఒక్క కవిత్వపు చూపుతో నిర్విషము చేయగల మాంత్రికుడు ఆయన!

ఆయన ఏది వర్ణించినా, ఏది చెప్పినా మంత్రముగ్ధులను చేయగలడు. మాటలలో, వాటి అల్లికలో, వాటిధ్వనిలో, మాధుర్యమూ, సౌందర్యమూ ఉట్టిపడేట్లు చేయగల సమ్మోహనాస్త్ర వేత్త. జిలుగు నగిషీ పనులలో ఆరితేరిన శిల్పి. శ్రీ దేవులపల్లి 'కన్నీరు'. 'కృష్ణపక్షము', 'ఊర్వశి ప్రవాసము' అనే కావ్యసంపుటాలు ప్రచురించినారు. అందులో కృష్ణపక్షములోనుండి 'అన్వేషణము' అనే కావ్యము ఇందులో వేసినాము. అవి వంగదేశములో వైష్ణవకవుల ప్రభావము తెలుగు కవిత్వముమీద చలాయించిన రోజులు. కవులు తమ ప్రణయములు, ఆదర్శములు గోపికలకూ శ్రీ కృష్ణునికీ ఆరోపించి మధుర కావ్యములు చెప్పిన రోజు లవి. గోపిక కృష్ణునికోసము అన్వేషిస్తున్నది ఇందులో!

# 7

శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రికి శ్రీ దేవులపల్లి కి కొంత సామ్యమున్నది. అయితే ఒకరిని ఒకరు అనుకరించిన వారు కారు. శ్రీ వేదుల కన్నీటిలో నిజమైన వేదన ఉన్నది. ఆయన ఆదర్శములలో ఉదాత్తతా, ప్రణయములో నైశిత్యమూ ఉన్నవి. పద్యబంధము ప్రౌఢమధురమైనది.

సంస్కృతాంధ్రజ్ఞానముల సంస్కారముతో ఆయన కవిత్వము ఆరంభించినాడు. శతావధానాలు చేసినాడు. ఇంగ్లీషు భాషా జ్ఞానము ఎక్కువ లేదు. అయినా కవితాత్మకలవాడు కనుక నవ్యమార్గాలలోకి

ఆయన కవిత్వము ప్రవేశించింది. ఇందులోని 'నిరీక్షణము' అనే కావ్యములో అలంకారికులు 'వాసవ సజ్జిక' అని పేర్కొనే నాయికను నూతన పద్ధతిలో రమ్యముగా వర్ణించినాడు.

# 8

సజీవులై ఇంకా కవిత్వము చెప్పుతూ ఉన్నవారి కావ్యాలే ఇందులో చేర్చవలెనని మా ప్రథమోద్దేశము. కాని తెలుగు దేశము ఎటు వంటి మణులను స్వల్పకాలములోనే పోగొట్టుకొన్నదో కూడా చూపవలె ననే ఉద్దేశము కలిగి చామర్తి రాజశేఖరరావు, కొడాలి సుబ్బారావు, కొడవటిగంటి వెంకటసుబ్బయ్యల కావ్యాలు కూడా చేర్చవలె నని నిశ్చయించినాము. ఈ మూడు మణులలో నాయకమణి చామర్తి రాజశేఖర రావు!

రాజశేఖరరావు బాల్య మాదిగా కవి. ముందు ప్రబంధ రచనతో ప్రారంభించినాడు. తర్వాత ప్రబంధఫక్కి కొంచెము మార్చి కావ్యరచన చేసినాడు. ఆ తర్వాత నాటకములు, ఒక నవలా కూడా వ్రాసినాడు. కవి అనే ఆదరభావముతో అతనికి చాలమంది మిత్రులైనారు. అతనికి, కొత్త రచన చేసిన తర్వాత, పాతరచన మీద అభిమానము పోయేది. ఎవరో ఒకమిత్రునివద్ద పాతరచన మిగిలిపోయేది. ఫలితాంశ మేమంటే అతను 'సాహితి'లో ప్రచురించిన కావ్యాలు తప్ప మిగిలినవి ఎంత ప్రయత్నించినా కనబడడం లేదు. అతనితోపాటు అతని రచనలు భద్రపరచిన మిత్రులు కూడా అదృశ్యమైనారు. అతను బి.ఏ. చదువుతూ ఉండగా Carlyle వ్రాసిన Heroes and Hero-worship అనే గ్రంథము బాగా అతని మనస్సులో నాటింది. ప్రథమ మహాసంగ్రామానంతరము రాజకీయాందోళనముతో దేశముఅట్టుడికిపోతున్న రోజులు. అతను దేశోద్ధరణ కోసము సరియైన నాయకుణ్ణి తన ఊహతో అన్వేషించ సాగించినాడు. ఆప్రయత్నఫలమే 'బృందావనము' అనేకావ్యము! యమునాతీరము బృందావనము; గోపిక గోపకులు కృష్ణుని కోసము వెదుకుతూ ఉంటారు. కవి ఇందులో ఎన్నిభాగాలు వ్రాసినాడో తెలియదు. అతను అకస్మాత్తుగా బెజవాడలో కలరాతో ఇరవై ఒకటవయేట చనిపోయినాడు. సానలుదీరిన

జాతిరత్నము ఒకటి దేశానికి పోయింది. చనిపోకముందు వ్రాస్తున్న కావ్యము బృందావనము. దీనిలో భాగవతము కృష్ణకర్ణామృతము చదివిన వారిమనస్సులలో కలిగే మధురభావముతోపాటు నేడు భరతమాత తన్ను ఉద్ధరించ గల నాయకుని కోసము పడే వేదనకూడా ద్యోతితమవుతుంది.

# 9

చామర్తి సానలుదీరిన జాతిరత్నము అయితే కొడాలి సుబ్బా రావు సానరాతికి ఎదురుతిరిగే పుట్టురత్నము. అతనికి పట్టరాని ఆందో ళనా ఆవేశమూ ఉన్నవి. కొంతకాలము 'తిరుగుబోతు' అనే పేరుతో తన వాక్యాలు ప్రచురించుకున్నాడు అతని 'హంపీక్షేత్రము' ప్రవేశ ములో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ చెప్పినట్లు అతనికి ప్రతిభా వ్యుత్పత్తి రెండూ ఉన్నవి. అయితే ఆయన ప్రతిభ వ్యుత్పత్తికి వశం వదమై ఉండదు. ఆయనను చూచినవారికి ముందు మోటుగా కనబడే వాడు, వాక్కు కూడా కొంత కటువుగా తోచేది. కాని పరిచయమైనకొద్దీ ఆయన హృదయము నవనీత మని తెలిసేది. తెలుగువారి ప్రస్తుత దుస్థితికి చెప్పరాని బాధపడ్డవాడు. ఇది తెలుగు అత్యుచ్చస్థితి అనుభ వించిన విజయనగర సామ్రాజ్యపునాటి శిథిలములు చూచినప్పుడు ఆగ కుండా 'హంపీక్షేత్రము' గా బయటపడ్డది.

'హంపీక్షేత్రము'లో ప్రతిభాగము ఒక అద్భుతమైన క్రొత్తరుచి చూపుతుంది. అందులో 'కనకాభిషేకము'లో శ్రీనాధుడు ప్రౌఢరాయల సభలో డిండిమభట్టును ఓడించి. కంచుఢక్క పగులగొట్టించి, కనకాభి షేకము పొందిన కథ ఆ కాలములో ఉండి ప్రత్యక్షముగా చూచినవాడు వర్ణించినట్టుగా వర్ణించినాడు. ఆధునికుల ఇష్టప్రకారము శ్రీనాధునికి శిఖాతిలకాలు తీసివేసినాడు. శ్రీనాధునిపాత్ర కళ్ళకు కట్టినట్లు చిత్రించి నాడు. విజయముపొందిన శ్రీనాధునీ, పరాజితుడైన డిండిమభట్టునూ, ఉభయులునూ ఉదాత్త నాయకులనుగా వర్ణించడములో కవి చూపిన మేధావిశేషము ప్రత్యేకించి గమనించదగి ఉన్నది.

# 10

చామర్తి, కొడాలివలె కాక కొడవటిగంటి వెంకట సుబ్బయ్య ఇప్పుడు జీవించి ఉన్నాడో లేడో కూడా ఎవరికి తెలియదు. అతనికి సంసారము మీద విరక్తి పుట్టలేదు. ఎవరిమీదా కోపము రాలేదు. ఎదుర్కోలేని కష్టాలు రాలేదు. కారణం లేకుండా ఎవరికి చెప్పకుండా వెళ్ళిపోయినాడు. బైరాగివలె దేశాటనము చేస్తూ జీవితము గడపవలెనని అతనికి ఒక సరదా ఉండేది. పాతికేళ్ళు నిండకముందే దేశము వదలినాడు ఇప్పటికి ఇరవై ఏళ్ళు దాటినా అతని జాడలేదు.

అప్పటి రోజులలో సాహితీసమితి కవులలో అతడు అగ్రగణ్యుడు. కావ్యములే కాక కథలూ నాటికలూ వ్రాసినవాడు. స్వయముగా వేషధారణలో నేర్పు కలవాడు. రామవిలాస సభను ఉద్ధరించుటకు ముఖ్యకారకులలో ఒకడు. ఆంధ్ర ప్రబంధములు అప్పటికి అచ్చయిన వన్నీ క్షుణ్ణముగా చదివినవాడు. ఇంగ్లీషులో అనేక సాహిత్య గ్రంథాలు మథించినాడు. అతడు చదివిన నవలలకూ కథలకూ అంతులేదు. కవితాత్మ కలవాడు. దానిని సాధనవల్ల స్వాధీనము చేసుకున్నవాడు. దేశము విడిచి వెళ్ళేముందు తాను వ్రాసిన కావ్యాలలో ప్రచురించ దగినవి ఏరి వాటిని సంపుటిగా 'సంధ్యారాగము' అనే పేరుతో ప్రచురించినాడు. అతని అనంతర చర్యవల్లగాని ఆ కావ్య సంపుటికి అతడు పెట్టిన పేరు సార్థకమైనవని తోచలేదు. దానిలోనుంచి 'భిక్షువు' అనే కావ్యము ఇందులో ప్రచురించినాము. దేశము విడిచి పోవడానికి రెండు మూడు సంవత్సరాల ముందు వ్రాసిన కావ్యమది. అప్పటికే 'భిక్షువు'ల జీవనము అతన్ని ఆకర్షించేదని ఈ కావ్యములవల్ల కనబడుతుంది. శ్రీరాయప్రోలు సుబ్బారావు తెనుగుతోటలో తేటగీతిలోని మాధుర్యము చూపిన తర్వాత కొంతకాలము తెలుగు కవులు వృత్తాదుల మీద వ్యామోహము తగ్గి తేటగీతిని అభిమానించ సాగినారు. శ్రీ రాయప్రోలు చూపక విడిచిన మరికొంత తీపి తేటగీతిలో వెంకట సుబ్బయ్య చూపించినాడు.

# 11

ఇద్దరు కవులు కలిసి ఒక్క కావ్యము సరసముగా రచించడము సాధ్యమా అనే విషయము సంశయాస్పదము. పూర్వము లోకములో అట్టివి అరుదుగా కనబడుతున్నవి. 'జంట కవనము ఒక్క తిరుపతి వెంకటేశ్వరులకే చెల్లినది. తక్కిన వారికి శోభలేదు' అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణ అన్నాడు. ఈ జంటకవనము శోభించనిమాట కథాకథనము కల కావ్యాలకుకూడా వర్తిస్తుంది; అది ఆత్మనిష్ఠమైన 'విప్రలబ్ధ విపంచి' వంటి కావ్యాలకు మరింత దృఢముగా వర్తిస్తుంది అనడములో సంశయానికి అవకాశము లేదు.

శ్రీ తిరుపతి వెంకటేశ్వరులు పూర్వ కవులలో చివరవారు. వారు ఎన్నో విషయములలో నవ్యకవులకు దారులు చూపించినారు. శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల శిష్యులలో శ్రీ పింగళి లక్ష్మీకాంతం, శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగార్లు కలిసి కవిత్వము చెప్పుతూ కవులని ప్రసిద్ధిపొందిన వారు. వారి ఉభయుల పేర్లతో ప్రచురించే కావ్యాలు ప్రతిదీ యెవరో ఒకరే వ్రాసిందై ఉంటుంది; అందువల్ల ద్వైకర్తృకత్వము వల్ల వచ్చే దోషాలు వాటిలో ఉండవు. 'విప్రలబ్ధవిపంచి' శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు రచన అని ఊహించదగి ఉన్నది.

దారువును భావరసానురూపముగా పలికించుకునే నిమిత్తము వీణగా మార్చి విడిచిన తన ప్రభువును సంబోధించి వీణ పలికే మాటలు కావ్యము. భగవంతుడే కవిచేత కావ్యములు పలికిస్తాడు. కొంతకాలము పలికిన తర్వాత మధ్య కొంతవాక్కు మౌనము వహించినప్పుడు కవి పడే వేదన ఈ కావ్యములో కవి మనోహరముగా సృష్టించినాడు.

# 12

ఈనవనీతమును శ్రీ విశ్వనాథ సత్యనారాయణ 'నవనీతము'తో పరిసమాప్తి చేసినాము. ఇతరులు తనను 'నవకవి' అనడము ఆయనకు ఇష్టము లేదు. ఆయన నవకవులలో నవకవి. పూర్వ కవులలో పూర్వకవి.

ఇటు కిన్నెరసాని పాటలు వ్రాస్తాడు. అటు ఆంధ్రరామాయణము ప్రారంభిస్తాడు. ఆయన నిస్సందేహముగా కవి!

ప్రథమములో ఆయన తన కావ్యాలు 'గిరికుమార' అనే పేరుతో ప్రచురించేవాడు. అది చిన్నతనములో పెట్టుకొన్న పేరు; కాని అది సార్థకమైనది. అతను నిజముగా గిరికుమారుడే. తర్వాత కొన్నాళ్లకు ఆయన తన కవిత్వము కిన్నెరసాని వాగు అని చెప్పుకున్నాడు.

భద్రాచలము రైలులో వెళ్ళినవారికి కూడా ఈ కిన్నెరసాని వాగు తగులుతుంది. అది మహారణ్యములో దారి చేసుకొని నాగుబామువలె వంకర వంకరలుగా నడచి నడచి స్వచ్ఛమైన తన నీటితో పరిసరారణ్య భూముల నవనవలాడించి, అఖండ గోదావరిలో కలుస్తుంది. అది చిన్న సెలయేరు కాదు. మహా పర్వత నిస్సృత కుహానిర్ఝరము. రాయప్రోలు సుబ్బారావు తన తెనుగుతోటలో,

"పొడుపుటేళ్ళు ప్రసళ్ళింత లాడెడు విధాన
పాడు మమ్మ గీతాసఖి భావపదము"

అన్నాడు. ఆ కోరిక శ్రీ విశ్వనాథ సత్యనారాయణగా మూర్తీభవించి ఫలించినది. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ కావ్యములు అనేకములు. పోకడలు అనంతములు. ఆబ్రహ్మస్తంబ పర్యంతము సృష్టిలో గల వస్తువులన్నీ ఆయన కావ్యవస్తువులే: ఒక మేకపిల్ల చావు, ఒక కుక్కపిల్ల చావు వర్ణించి సామాన్య మానవుల నిర్ఘృణత్వము సూచిస్తాడు. 'గొంగళి పురుగు' పద్యాలతో చమత్కరిస్తాడు, 'కిన్నెరసానిపాటలు' వ్రాస్తాడు. 'కోకిలమ్మపెండ్లి' వర్ణిస్తాడు. 'ప్రేమగీతాలు' పాడతాడు. గతించిన ప్రియురాలికి శశివల్లి దౌత్యము నెరపించుకుంటాడు. 'శృంగార వీధి'లో మనలను విహారము చేయిస్తాడు రామాయణ కావ్యము తన స్వంతపోకడలతో వ్రాస్తాడు. కావ్యాలే కాదు. నాటకాలు, నవలలు, కథలు, విమర్శలు, ఉపన్యాసాలు—ఒకటి ఉన్నదని ఒకటి లేదనీ అనకుండా వాఙ్మయ మార్గాలు అన్నీ తొక్కుతాడు. ఎందులోనైనా తన వ్యక్తిత్వము అచ్చు గుద్దినట్లు నిలబెట్టుకుంటాడు.

తన శృంగార వీథిలోనుంచి 'ప్రాత స్తవము'లో కొంత భాగము తీసి 'నవనీతము' అనే పేరుతో ఈ సంపుటిలోకి ఇచ్చినాడు. యశోద తెల్లవారుజామున కృష్ణుని మేలుకొలుపుతుంది. యశోదకు కృష్ణుడు కొంతసేపు కన్నకొడుకు. మరి కొంతసేపు సాక్షాత్తు భగవంతుడు. మహాభక్తుల అనిర్వచనీయ మార్గములు ఇందులో ప్రతిబింబితమైనవి.

నవకవులు తొమ్మిదిమందివల్ల తీసుకున్న తొమ్మిది కావ్యముల సంపుటి ఇది. నవ కవులు ఈ తొమ్మిది మందే అనికాదు; ఈ తొమ్మిది మంది రచనలలోకూడా ఇంతకంటె రసవత్తర రచనలు లేవనికాదు. ఖండ కావ్యములలో కాస్త పెద్దవిగా ఉండేవి. ఒక్కొక్కరిది ఒక్కొక్కటి చొప్పునతీసి కలిపి ఏకముగా ప్రచురింప వలెననే సంకల్పముతో చేసిన దీ ప్రయత్నము. ఈ శీర్షికలో ఈ సంపుటము మొదటిభాగము.

ఈ విధముగా ఇప్పుడు ప్రత్యేకించిన నవకవులు తొమ్మిదిమంది రచనలో ఒకరికంటె ఒకరిలో విశిష్టత ఉన్నది. ఒకప్పుడు చూడగా పరస్పర భేదములే కనపడినా, వీరందరిలో సామాన్య ధర్మమే ప్రధానమైనది. ఒక్క వెలుగులోనుంచి వచ్చిన అనేక కిరణములు ఎట్లాగో, ఒక్క కిరణములోనుంచి వేరుచేస్తే వచ్చే రకరకముల రంగులెట్లాగో వీరూ అంతే; ఈ కావ్య సంపుటము చదివిన వారికి ఈ విషయము అనుభవము లోకి రాగలదు.

('నవనీతము' పరిచయము–1951)

# ఉత్తమ వాగ్గేయకారుడు సుబ్రహ్మణ్య కవి

ముసల్మానుల దండయాత్రలు రాకపూర్వము భరత ఖండములో అంతటా సంగీతము ఒకే మార్గంలో ఉండేది. ఆ తర్వాత పారశీకాదుల సంగీత పద్ధతులు ఉత్తర దేశములో ఎక్కువగా కలసిపోయినందున అది హిందూస్తానీ సంగీతమని, అది అంతగా కలవని దక్షిణ దేశ సంగీతం కర్ణాటక సంగీతమనే రెండుగా చీలిపోయినది. ఈచీలిక ఏర్పడకముందే శార్ఙ్గదేవుడు సంగీత రత్నాకరము రచించినాడు. అందువల్ల ఆయనకు భారత భూమిలో అంతటా సమాన ప్రామాణ్యము ఉన్నది. అప్పటికి భారత భూమిలో స్వతంత్రంగా పరిణతి పొందిన సంగీతానికి పరిపూర్ణమైన లక్షణము చెప్పినవాడు కనుక ఆయన గ్రంథము శిరోధార్యమైనది. వాగ్గేయకారుని లక్షణము ఆయన ఇట్లు చెప్పినాడు.

'వాఙ్మాతు రుచ్యతే, గేయం ధాతురి త్యభిధీయతే
వాచం గేయంచ కురుతే యః సవాగ్గేయ కారకః"

వాక్కూ గేయమూ-మాతువూ ధాతువూ-ఎవరు చేయునో అతడు వాగ్గేయకారుడు. వాగ్గేయకార వరుని లక్షణాలు ఈ విధంగా ప్రారంభించాడు.

"శబ్దానుశాసన జ్ఞానం అభిధాన ప్రవీణతా
ఛన్దః ప్రభేద వేదిత్వం అలంకారేషు కౌశలమ్
రసభావ పరిజ్ఞానం దేశస్థితిషు చాతురీ
అశేష భాషా విజ్ఞానం కలా శాస్త్రేషు కౌశలమ్
తూర్యత్రితయ చాతుర్యం హృద్య శారీర శాలితా
లయ తాలకలాజ్ఞానం వివేకో నేక కాకుషు"

ఈ విధంగా ఆరంభించి చెప్పి చెప్పి,

"త్రిస్థాన గమక ప్రౌఢిః వివిధాల ప్తి నైపుణమ్
అవధానం గుణై రేభిః వరో వాగ్గేయకారకః"

అని ముగించినాడు. దీనిని బట్టి ఆయన ఆదర్శము ఎంత ఉన్నతమైనదో ఊహించవచ్చును.

వాగ్గేయకారులు మాతుధాతువుల నుభయమునూ రచిస్తారు కనుక ఉభయకారులు అనబడుదురు. ఆ ఉభయకార శబ్దమే అప్రభంశమై బయకార శబ్దముగా మారినదని బహుకాలము తర్వాత గోవింద దీక్షితుడు నిర్వచించాడు. ఆయన నిర్వచనము ఎట్లా ఉన్నా, వాగ్గేయకారులకే పర్యాయ పదముగా బయకార పదము బహుకాలము నుండి వాడుకలోకి వచ్చినది.

ఇతర లక్షణ కర్తలు బయకారుల దోషాలు ఉటంకిస్తూ "గ్రామ్యోక్తి" అప శబ్దము, గమకమందూ పదమందూ జాడ్యమూ, రసానురూప రాగములు తెలియకుండుట, లక్షణ జ్ఞానము లేకుండా ధాతు మాతువులు రచించడము" మొదలైనవి పేర్కొన్నారు.

శార్ఙ్గదేవుడు రెండు వేరు వేరు ప్రమాణాలు ఆధారంగా తీసుకొని, వాగ్గేయకారులను ఉత్తములు, మధ్యములు, అధములు అని మూడు రకాలుగా విభజించినాడు. ఒక ప్రమాణము మాతుధాతువుల నిష్పత్తిని బట్టీ, రెండవది గేయకావ్య వస్తువు ప్రమాణంగానూ ఆయన ఈ నిర్ణయము చేసినాడు.

మొదటిదాని ప్రకారం మాతువులోనూ ధాతువులోనూ సమానంగా ప్రాగల్భ్యం కలవాడు ఉత్తమ వాగ్గేయకారుడు. ధాతువుతో పుష్టికలిగి మాతువులో మందుడైనవాడు మధ్యముడు. మాతువులో విదగ్ధుడై ధాతు పుష్టి మందగించిన వాడు అధముడు. ఒక విధంగా ఈ విభాగము కవులలో శబ్దము అర్థము–భాషా భావము–హెచ్చు తగ్గుగా ఉండడము వంటిది.

రెండవ ప్రమాణమును బట్టి వస్తుకవి ఉత్తముడు. వర్ణనమాత్రకవి మధ్యముడు. ఇతరుల సంగీతానికి మాతువు కూర్చేవాడు అధముడు. బహుశః చివరి విభాగము నేడు వెండి తెరమీద ప్రదర్శించే చిత్రాలలో సంగీతపు డైరెక్టరు చెప్పిన వరుసకు మాటలు మాత్రము కూరుస్తున్న నేటి సినీమా కవులకు బాగా అన్వయిస్తుందేమో! ఇందులో వస్తు కవి

అంటే దీర్ఘకథా కథనము చేసే మహా కావ్యకర్త. వర్ణన మాత్రకవి అంటే లఘుకృతులు మాత్రమే-వానినే క్షుద్ర కావ్యాలు అన్నారు-చేయగలవాడన్నమాట. ఇక అధముడుగా పరిగణింపబడినవాడు సంగీత రచన-ధాతు రచన-చేసే శక్తి లేక, ఇతరులు చేసిన ధాతువుకు మాటలు మాత్రం పొదిగేవాడు. శార్ఙ్గదేవుడు 13 వ శతాబ్దమువాడు కాబట్టి ఆ కాలానికి కూడా సంగీత రచన చేతనై మాటలు కూర్చలేని వాళ్ళూ, మాటలు వచ్చి సంగీత రచన చేయలేని వాళ్ళూ, ఒకరినొకరు ఆశ్రయించి పరస్పరం సహాయం చేసుకొనేవారని ఊహించ వచ్చును. ఇతరులు వ్రాసిన పాటలకు సంగీతము కూర్చేవారు ఏ జాతికి వస్తారో, శార్ఙ్గదేవుడు ఆలోచించినట్లుగా లేదు.

ఉత్తమ మధ్య మాధమ భేద నిర్ణయములో శార్ఙ్గదేవుడు గ్రహించిన మొదటి ప్రమాణము సర్వధా శిరోధార్యమైనది. సాహిత్యము ఆధారముగా లేని సంగీతము ఎంత శ్రావ్యముగా ఉన్నా, రస నిష్పత్తి చేయలేదుగదా! గేయ కావ్యము, పెద్దదైనా, చిన్నదైన వాక్యూ గేయమూ సమపాళ్ళలో ఉన్నప్పుడు, ఉత్తమస్థాయిని అందుకుంటుంది కదా! సాహిత్యకారులు కూడా అమరుకుని శ్లోక మొక్కొక్కటే ప్రబంధ శతముతో సమానమన్నారు. అయినా నవరస బంధురములై శ్రీ మద్రామాయణము, రఘువంశ, కుమార సంభవాలు వంటి మహా కావ్యాలతో సమానమైనవిగా, ఎంత రమ్యమైన వైనా, చిన్నగాధలను పరిగణించడము న్యాయము కాదు గదా!

శార్ఙ్గదేవుడు నిర్వచించిన రెండు ప్రమాణాలలో, దేనిని బట్టి చూచినా, అధ్యాత్మ రామాయణము రచించిన సుబ్రహ్మణ్య కవి ఉత్తమ వాగ్గేయకారుడుగా వరిగణింపబడవలసి వున్నాడు. ఆయన చేసినది కథా కథనముచేసే వస్తుకృతి కనుక ఆయన వస్తుకవి. అందులో ధాతుమాతువులలో సమాన ప్రాగల్భ్యము ప్రదర్శించినాడు. కాబట్టి ఆయన నిస్సందేహంగా ఉత్తమ వాగ్గేయకారుడు. ఇటువంటి ఉత్తమ స్థితి మరి ఎందరు వాగ్గేయకారులకు లభిస్తుందో మనము నిర్భయముగా ఆలోచించవలసి ఉంటుంది.

అయితే నేడు మనము సంగీత విద్వాంసులతోసహా, ఆ గౌరవము ఆయనకు ఇస్తున్నామా ? ఇయ్యడము లేదని ఒప్పుకొనక తప్పదు. మరి శార్ఙ్గ దేవుని లక్షణము తప్పా ? లేక మనము నేడు విని ఆనందించగల సంగీత స్థాయి దిగజారి పోయినదా ?

# 2

ఈ సందర్భంలో శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు రచించిన "ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర" నుండి కొన్ని భాగాలు ఉదాహరిస్తాను. వారు సంగీతములో శాస్త్రజ్ఞానమూ, అనుభవమూ ఉన్నవారు. గ్రంథము శ్రమపడి వ్రాసినారు. అది విద్వాంసుల మన్నన లందినది. బహుమతు లందినది. అది నేటి సంగీత విద్వాంసుల అభిప్రాయాలను ఉన్నదున్న ట్లుగా ప్రతిబింబిస్తుందనే భావమే అందులోనుండి వాక్యాలు ఉదాహరించ డానికి కారణం.

వారందులో 'ప్రబంధ లక్షణ పరిణామము' అనే ప్రకరణములో, ఆ పరిణామాన్ని స్థూలంగా పది యుగాలుగా విభజించినారు. వాటిలో ఎనిమిదవది అయిన "ధాతుకల్పనా పరిణామ యుగము"లో ఇట్లు వ్రాసి నారు.

"....ఇంతకు ముందు యుగాల కీర్తనల్లో మాతురచన ప్రధాన ముగా ఉండి ధాతురచన– మాతువుకు కవచ మాత్రమైన ఉపాంగంగా వుండేది. అంటే అన్నమాచార్యాదుల కీర్తనలలో మాటలుప్రధానములు. వానికి సంగీతం ఒక ఉపాంగం. ఆ సంగీతపు వరుసకూడ అల్లిక జిగిబిగు వులు లేని సరళ పద్ధతిలోనే సాగిపోయేది. సంకీర్తన లన్నీ అంతే. రామదాసు కీర్తనలుకూడా అంతే. క్షేత్రయ్య పదాలలో మాటలూ, సం గీత వరుసా కూడా సమప్రాధాన్యం కలిగి మనో ధర్మానుగుణమైన భావ ప్రకర్ష కలిగించే పద్ధతిలో రెండింటి రచనా సాగింది. ధాతు కల్పనకు మాతువుతో సమ ప్రాధాన్యం యిచ్చి క్షేత్రయ్య వేసిన ప్రాతిపదిక త్యాగరాజాదులనాడు పరిపక్వత చెందింది."

శ్రీ రజని చేసిన నిష్కర్ష సత్యమయితే శార్ఙ్గదేవుని మొదటిప్రమాణము ప్రకారము అన్నమాచార్యాదులను మనము అధమశ్రేణి వాగ్గేయకారులనుగా పరిగణించవలసి ఉంటుంది. రెండవ ప్రమాణము ప్రకారము అన్నమాచార్యాదులుగాని క్షేత్రయ్యగాని వస్తుకవులు - కథాకథనము చేసినవారు - కాదు కనుక మధ్యమశ్రేణికి చెందిన వాగ్గేయకారులనుగానే క్షేత్రయ్యతో సహా పరిగణించవలసి వుంటుంది. ఇది మనకు సమ్మతమవుతుందా ?

ఇక శ్రీ రజని యుగవిభజనలో తొమ్మిదవది ఐన 'సభాసంప్రదాయ యుగం' క్రింద యిట్లు వ్రాశారు.

"క్షేత్రయ్య నాటినుండే రాజన్య రసిక పరివేష్టితమైన సంగీత సభల సంప్రదాయానికి కూడా ప్రాతిపదిక ఏర్పడినప్పటికీ, త్యాగయ్య నాడే స్పష్టరూపం దాల్చింది. కనుక త్యాగయ్య కాలం సభాసంప్రదాయ యుగం అనికూడా అనవచ్చు. ఈ సంప్రదాయ స్వరూపం త్యాగరాజాదుల కాలంలో కీర్తనల్లో ధాతు కల్పనకు ప్రాధాన్యం క్రమంగా హెచ్చింది. అంటే పాటలోని సంగతుల కల్పన ద్వారా సంగీతపు వరుస ఎక్కువ ప్రధానమై మాటలు మట్టుకు ఉపాంగంగా మారినవన్నమాట."

పై మాటలు నిజమైతే, శార్ఙ్గదేవుని ప్రథమ ప్రమాణము ప్రకారము త్యాగరాయల వారి కృతులు కూడా మధ్యమ శ్రేణికి దిగజారుతవి. వాటితోపాటు ధాతుకల్పన ప్రధానమైన పల్లవి పాడడము ఘనముగా పరిగణించి నేటి ఉద్దండ సంగీత విద్వాంసులు చేస్తున్న కచేరీలన్నీ మనకు మధ్యమ స్థాయి సంగీతాన్నే అందిస్తున్నవి అనవలసి వస్తుంది.

అయితే పై వచనాలు త్యాగరాజస్వామి కృతుల ధాతుమాతువుల నిష్పత్తినిగూర్చి సత్యముగా ప్రదర్శించడము లేదని సూచిస్తూ, పూజ్యులైన శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ ఆ గ్రంథానికి వ్రాసిన పరిచయ వాక్యాలలో ఇట్లు వ్రాసినారు.....'అనుపల్లవికి క్షేత్రయ్యయే మార్గదర్శి' అన్న శ్రీ రజనీ భావముతో ఏకీభవించమన్న సందర్భంలో ప్రసక్తమైన ఇవి వారన్న మాటలు.

'పదాలను రాగ ప్రధానంగా తెగ యీడ్చి వాగర్థాల భావమే అవగతం కాకుండా పాడే పద్ధతి యీవల వీణ ధనమ్మాళ్ ప్రచారంలోకి తెచ్చిందని నా ఊహ. ఆమె త్యాగరాజాదుల కీర్తనలు కూడ ఆ శైలిలో పాడేది. అందలి రాగ మాధుర్యానికి లొంగి ఎందరో గాయకులు - వాగర్థాల దృష్టి లేనివారు - దక్షిణ దేశంలో ఆ శైలినే అక్షరశః అభ్యాసంచేసి పాడుచున్నారనేది వేరుమాట.'

ఈ విధంగా వివరించి శాస్త్ర ప్రయోగములు రెంటిలో నిశిత ప్రజ్ఞగల శ్రీ శర్మగారు శార్ఙ్గదేవుని మొదటి ప్రమాణము ప్రకారము శ్రీ త్యాగరాయల వారి కృతులను మధ్యమశ్రేణికి దిగజారకుండా ఉత్తమ శ్రేణిలో నిలవబెట్టి సమర్థించినారు. వారి వాక్యాల సారాంశము చూస్తే, మొత్తముమీద నేడు ప్రచారంలో వున్న సంగీత కచేరీల సంగీతము ఉత్తమ స్థాయిది కాక మధ్యమ శ్రేణికి చెందినదనే వారి అభిప్రాయంగా స్ఫురిస్తున్నది. వాచ్యముగా మాత్రము వారనలేదు.

మరి ఇక శార్ఙ్గదేవుని రెండవ ప్రమాణము ప్రకారము పరీక్ష చేస్తే, కర్ణాటక సంగీతానికి త్రిమూర్తులుగా పరిగణింపబడుతున్న ముగ్గురి కృతులూ, మధ్యమశ్రేణి సంగీత రచనలుగా పరిగణించ వలసి ఉంటుంది. శ్రీ త్యాగరాయలవారి మూడు నాటకాలు మాత్రము ఆ చిక్కు నుంచి తప్పించుకోగలవు.

ఈ రెండవ ప్రమాణము ఎన్నో చిక్కులతో కూడి ఉన్నది. నేటి అభిమానాలకు విరుద్ధంగా వున్నది. ఐనా, సాహిత్యంలో మహా కావ్యాలు పాఠకులకు కలిగించే ఆనందాన్ని అనుభవించే శక్తిలేక, నేటి పాఠకులు లఘుకృతులను మాత్రమే చదివి, విని, ఆనందించగలుగుతున్నట్లుగానే, సంగీతములో కూడా, నేటి సామాజికులు దీర్ఘమైన వస్తుగేయ కావ్యాలను విని, ఆనందించలేని స్థితికి దిగజారి పోయినారా, అని కూడా బుద్ధిమంతులు ధైర్యముగా ఆత్మవిమర్శ చేసుకోవలసి ఉన్నది.

## 3

సుబ్రహ్మణ్య కవి అధ్యాత్మ రామాయణమును గురించి వ్రాసిన వారిలో ముందు పేర్కొనదగినవారు శ్రీ రజని. వారు తమ 'వాగ్గేయ

కార చరిత్రము'లో ఈ కవిని గూర్చి ప్రత్యేకముగా ఒక ప్రకరణము వ్రాయుటయే గాక, గ్రంథములో పలుచోట్ల వారి ప్రస్తావన చేసిరి. రాజమండ్రి ఆంధ్ర గాన కళాపరిషత్తువారు స్వర పరచి ప్రచురించిన 61 అధ్యాత్మ రామాయణ కీర్తనలకు 'పరిచయం'కూడ వారే వ్రాసినారు.

ఆ తర్వాత, ఈ మధ్య ఆంధ్ర పత్రిక కీలక సంవత్సరాది సంచిక (1968-69)లో, 'రామాయణ కథా గానము - అధ్యాత్మ రామాయణ విశిష్టత' అనే విపులమైన వ్యాసములో అనేకమైన అపూర్వ విషయాలు పాఠకుల దృష్టికి తెచ్చి, కుమారి - ఎం. ఎస్. రాణి ప్రమీలాదేవి ఆంధ్ర గాయక లోకము సుబ్రహ్మణ్య కవిని మరువలేదని నిరూపించినారు. ఆమెయే అఖిలాంధ్ర రచయితల నాల్గవ సమావేశము సందర్భంలో ప్రచురించిన సావనీర్ సంచికలో "ఉత్తమాంధ్ర వాగ్గేయకారక ద్వయము" అనే వ్యాసములో ఈ కవిని గూర్చి మరికొన్ని కొత్త విషయాలు తెలిపినారు.

శ్రీ అరిపిరాల సత్యనారాయణ మూర్తి ఈ కవిని గూర్చి తమ సంగీత శబ్దార్థ చంద్రికలో, 'అధ్యాత్మ రామాయణ' ప్రశస్తమైన కీర్తనల గ్రంథమును రచించిన సుప్రసిద్ధ ప్రాచీన విద్వాంసుడు, ఆంధ్ర బ్రాహ్మణుడు, అని రెండు వాక్యములు మాత్రము వ్రాసినారు.

మన కిప్పుడు ఈ కవి గ్రంథము పూర్తిగా లభ్యమవుతున్నది శ్రీ వావిళ్ళవారు ప్రచురించిన మూలము మాత్రమే. అది జల్లేపల్లి హనుమంతరావు గారిచే పరిష్కృతమైనది. శ్రీ వావిళ్ళవారి ప్రచురణములలో సామాన్యంగా వ్యక్తమయ్యే జాగరూకత, ఏ కారణము వల్లనో, దీనిలో లోపించుట చేత చాలా అచ్చుతప్పులు దొరిలినవి.

వెనుక ఎప్పుడో 'అధ్యాత్మ రామాయణ కీర్తనలు' అనేపేర గుజిలీ అచ్చులో ప్రకటింపబడిన పుస్తకము మా ఇంటిలో కూడా చూచిన జ్ఞాపకము. కాని అది ఇప్పుడు మాయమైనది. దానికిగాని శ్రీ వావిళ్ళ వారి ప్రచురణకుగాని పీఠికలు లేవు.

ఆంధ్ర గాన కళా పరిషత్తువారు 61కీర్తనలు శ్రీ కుప్పా వీరరాఘవ శాస్త్రి గారిచే పాడించి, శ్రీ త్రిపురారి భట్ల శ్రీ రామమూర్తిగారిచే స్వర పరిపించి, శ్రీ రజనీ పరిచయ వాక్యాలతో ప్రచురించినారు. అది చాలా అమూల్యమైన గ్రంథము.

ఇవి అన్నీ కాక "దామెర వారి మీది పదములు" అను పేరుతో శ్రీ తిమ్మావజ్ఝల కోదండ రామయ్యగారు భారతి, 1951 సెప్టెంబరు సంచికలో(సంపుటి 28 సంచిక 9)ప్రచురించిన వ్యాసము శ్రీ సుబ్రహ్మణ్యకవిని గూర్చి ఎన్నో విశేషాలను వెలికి తీసినది. ఆ వ్యాసమే ఈ కవికాలము నివాస స్థలము, ఇంటిపేరు, తండ్రిపేరు, వ్యక్తిత్వము మొదలైన ఎన్నిటికో ఆధారములను ఇచ్చినది.

సుబ్రహ్మణ్య కవియందు అభిమానము కలవారు ముఖ్యముగా పైన పేర్కొన్న రచయితలకు ప్రచురణములకు కృతజ్ఞత చూపించవలసి ఉన్నది.

## 4

శ్రీ తిమ్మావజ్ఝలవారు తమ వ్యాసములో శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు శ్రీ కాలహస్తి ప్రభువుల సంస్థానమునుండి సేకరించిన గ్రంథాలలో ఒక తాళపత్ర గ్రంథములోని ఒక పత్రము మీద ఈ విధముగా వ్రాసి ఉన్నదని తెలిపినారు.

"మునిపల్లె రామలింగార్య పుత్రులైన సుబ్రహ్మణ్య కవితా చాతుర్యంగా రచించిన రామాయణ కీర్తనలో తమ ప్రియశిష్యులైన రాజశ్రీ దామెర కృష్ణస్వామి వారికి కృపచేసి యిచ్చిన పుస్తకం.

"మునిపల్లె రామలింగార్య పుత్రులైన సుబ్రహ్మణ్య కవితా చాతుర్యంబుగా రచించిన అధ్యాత్మ రామాయణ పద్యకావ్యం తమ ప్రియ శిష్యులైన రాజశ్రీ దామెర కృష్ణస్వామి వారికి కృపచేసి యిచ్చిన పుస్తకం."

ఇందులో రెండవ వాక్యము గీతలుగీసి కొట్టివేయబడి ఉన్నదట. దానికి కారణము ఈ కవి రచించినది కీర్తనలు కాని పద్య కావ్యముకాదు

కనుక అని తోస్తుంది. ఆ కొట్టివేసిన దానిలో మొదటిది దానిలో లేని అధ్యాత్మ శబ్దముండడము ఒక విశేషము. ఈ కావ్యాలు స్పష్టంగా మన అధ్యాత్మ రామాయణ కర్త ఐన సుబ్రహ్మణ్య కవికి అన్వయిస్తవన డంలో సందేహము లేదు.

ఈ తాళపత్ర గ్రంథము సంరక్షకమైన కొయ్య పలకమీద 'రాజశ్రీ దామెర కృష్ణస్వామి పొస్తుకం - ద్వయతాద్వయుతం' అని ఉన్నదట. గ్రంథములో మొదట అగస్త్యనాథ మకుటముతో అప్రౌఢమైన పద్యాలు కొన్ని ఉన్నవట. తొలి పత్రముమీద 'శ్రీ శివసహాయం శ్రీ సుబ్రహ్మణ్య గురవే నమః' అని ఉన్నదట. ఆ పద్యాల తర్వాత పైన ఉదాహరించిన వాక్యాలున్న పత్రము. దాని తర్వాత కృష్ణసంబుద్ధితో కొన్ని పిచ్చి పద్యాలూ, వాని తర్వాత దామెరవారిమీద పదములు తొమ్మిది ఉన్న వట.

ఇంతకూ సుబ్రహ్మణ్య కవి కృపచేసి యిచ్చిన రామాయణ కీర్త నలు మాత్రము అందులో ఎక్కడా లేవు. కాబట్టి అధ్యాత్మ రామాయణ కీర్తనలున్న పుస్తకము పోగా మిగిలి ఉన్నదాని ముఖపత్రమే తీసి ఈ కవిత కట్టలో ఎవరో కూర్చి ఉందురు.

కృష్ణ సంబుద్ధితో ఉన్న పిచ్చి పద్యాల తర్వాత ఉన్న తొమ్మిది దామెర వారి పదములలో, దామెర తిమ్మభూపాలుని కుమారుడైన కుమార వెంకట సార్వభౌముని మీద 4, దామెర వెంకటేంద్రుని కుమారు డైన కృష్ణ భూపాలునిమీద 2, శ్రీ కాలహస్తీశ్వరుని మీద 1, అగస్త్యే నాథేశ్వరుని మీద1, పార్వతి శివుని ఉపాలంభనము చేసేది1,- మొత్తము 9 పదములు ఉన్నవి. వాటి నన్నిటిని భారతిలో పూర్తిగా ప్రచురించి నారు.

శ్రీ తిమ్మావఝ్ఝలవారు ఆ పదములన్నీ సుబ్రహ్మణ్య కవి కృత ములనే ఊహించినారు. కాని పరిశీలింపగా అవి ఏవీ ఏమాత్రమూ సుబ్ర హ్మణ్య కవి కృతములు కావని నిశ్చయ బుద్ధి కలిగినది. మొదటి కార ణము, సుబ్రహ్మణ్య కవి ముద్ర వాటిలో ఎందులోనూ లేదు. రెండవది, వాటిలోని భాష అధ్యాత్మ రామాయణములోని భాషవలె లక్షణ యుక్త

ముగా గాక, లక్షణ విరుద్ధమైన ప్రయోగాలతో నిండి యున్నది. మూడవది, అవి అన్నీ భగవదంకితమైన వాటితో సహా 'పచ్చి' శృంగారముతో నిండి రాజగురువులు రచింపదగినవిగా లేవు. చివరి కారణము చెప్పడానికి నా పూర్వాచారమో చాదస్తమో అని పాఠకు లనుకోకుండా ఉండేందుకు, ఆ పదాలలో రెండవదాని పల్లవీ, 4వ చరణమూ ఉదాహరిస్తున్నాను.

"మనసు నచ్చితే రమ్మనవే-దా
మరల కుమార వేంకటేంద్రుని ॥పల్లవి॥"

4 వ చరణము : "పక్కజేరి గుబ్బ-పాలిండ్ల గమ్మదు
పణతి, వాని యెదను
చెక్కిలి నొక్కుదు-చిఱు చెమట నా పయట
చెఱమాన నొత్తుదును
అక్కఱతో వాని-నలయ నియ్యక నేనె
అమ్మరు కేళిలోను
తక్కు ధిక్కు తద్ధి- తక్కు ధిక్కు మని లయ
తప్పక క్రీడింతును-నా సామి ॥మనసు॥"

ఇటువంటి పదాలు రసవంతమైనవే కావచ్చును. కాని పూజ్యుడైన రాజగురువు, అధ్యాత్మరామాయణము వ్రాసి భవబంధంబులు తెగినవని ఆనందించిన సుబ్రహ్మణ్య కవి, పవిత్రహస్తముతో, వేశ్యా మోహాన్ని గొప్పగా వర్ణించే ఇటువంటి పదాలు వ్రాసి ఉంటాడా అనేదే నా సందేహము! అయనే వ్రాసినట్లు ఆధారముంటే నమ్మక తప్పదు. కాని అది వారి ఊహ మాత్రమే. నిరాధారమైన ఊహే ఐనప్పుడు ఆ పదకర్త పూజ్యుడైన సుబ్రహ్మణ్యకవి కాదను కొంటేనే మంచిదికదా!

ఏమైనా, కొందరు పరిశోధకులవలె తమ నిర్ణయానికి అనుకూలమైనంతవరకే ఆధారాలు ప్రదర్శించక, ఉత్తమ పరిశోధకుల సరణి అనుసరించి, ఆధారమును ఉన్నదున్నట్లు మనకు అందిచ్చినందుకు శ్రీ తిమ్మావజ్ఝల కోదండ రామయ్య గారికి మనము కృతజ్ఞత చూపవలసి ఉన్నది.

పై వివాద విషయము వదలివేస్తే, నిర్వివాదమైన కొన్ని కొత్త విషయాలు ఈ కవిని గూర్చి వారి వ్యాసమువల్ల మనకు తెలుస్తున్నవి.

ఒకటి, ఆయన ఇంటిపేరు మునిపల్లె వారని, రెండవది, వారి తండ్రి పేరు రామలింగార్యుడని, మూడవది, ఆయన శ్రీ కాలహస్తి ప్రభువైన దామెర కృష్ణప్రభువులకు కేవలాస్థానగాయకుడే కాక రాజగురువై పూజింపబడిన వాడని.

ఈ ఆధారముతో అధ్యాత్మ రామాయణము పరిశీలిస్తే, అది సామాన్యముగా శేషగిరీశునికి అంకితమై ఆ ముద్రతో ఉన్నా, కవి శ్రీ కాలహస్తీశ్వరుని మీద అనన్యభక్తి కలవాడనేందుకు ఆధారాలున్నవి. 'నమశ్శివాయతే నమోభవాయ' అనే పల్లవితో ఆరంభించిన గ్రంథాది కీర్తన 4 వ చరణములో చివర 'శ్రీ కాలహస్తీశ్వరాయ' అని ఉన్నది, గ్రంథాంత కీర్తన చివరిచరణములో 'శ్రీకాలహస్తీ నగరీశంభు మిత్రునికి' అని ఉన్నది. దానిముందు కీర్తన పల్లవిలో 'శ్రీ జ్ఞానప్రసూన వినవే' అని ఉన్నది. ఈ మూడూ కవికి జ్ఞాన ప్రసూనాంబ మీదను, శ్రీ కాలహస్తీశ్వరుని యందుగల భక్తి విశదము చేస్తున్నవి.

ఈయనకు కృష్ణప్రభువుతో కల సంబంధము సూచించే ఒక విశేషము కూడా కుమారి ప్రమీలాదేవి తన వ్యాసములో నిరూపించినది. చివరి నుండి 4 వ కీర్తన చివరి చరణములో శ్రీరామ పట్టాభిషేకోత్సవము వర్ణిస్తూ కవి,

"ఆడి పాడి మెప్పించి స, ర్వామరుల్ మందార
వృష్టితోడ దుందుభులు గూడ జోఁడాడ
సీతాలక్ష్మణాంజనేయులతోఁ గ్రీడించి
శేషగిరి, కృష్ణాను మతిని బొంది" అన్నాడు.

నేను మళ్ళీ పరిశీలించగా అటువంటిదే మరియొక ఆధారము కూడా దొరికినది. మంగళము చెప్పే చివరి కీర్తనకు ముందు, అనగా గ్రంథాంత కీర్తన చివరి చరణములో కూడా, "శ్రీ శేషాచల....! కోశాతీత నిరీశ సత్యజ్ఞాన గురుఁడీ విష్ణునిపేరను కృష్ణుని పేరను, ఈ శుభాధ్యాత్మ రామా

యణము తెనుఁగు కీర్తనలుగ నేర్పిరించెన్...." అని చేర్చి మరియొకచో కృష్ణముద్ర వేసినాడు.

అందుచేత కవి ఈ గ్రంథమును కృష్ణప్రభువు అనుమతితో, కృష్ణ ప్రభువుపేర అంకితము చేసి ప్రియ శిష్యుని 'కృపచేసి' నాడని నిశ్చయింప వచ్చును. గ్రంథాంతమందలి మంగళ కీర్తన చివరి చరణము 'వివేక కార్య శేషగిరి వేంకట సుబ్రహ్మణ్యానికి । మంగళం॥' అని ముగుస్తున్నది. కుమారీ ప్రమీలాదేవి వ్యాసంలో గ్రంథములోని 104 కీర్తనలలో నలభైయింటిలో 'శేషగిరి' నామము కలదని నిరూపించి, ఈ కవి పూర్తిపేరు శేషగిరి వేంకట సుబ్రహ్మణ్యకవి ఏమో అని సూచించినది. ఆ ఊహ సంభావ్యమే. శేషగిరి మొదటిఇంటిపేరు కూడా కావచ్చును. ఆ కుటుంబము మునిపల్లె గ్రామమునుండి వచ్చుటచేత వారు శ్రీ కాలహస్తిర మునిపల్లెవారుగా మారి ఉండుట సంభావ్యమే. ఈ ఊహాలు మరికొంత పరిశీలించి గ్రహింపదగినవి.

సుబ్రహ్మణ్యకవి కాలము కృష్ణప్రభువు కాలము కనుక్కుంటే తేలిపోతుంది. శ్రీ తిమ్మావజ్ఝలవారు దామెరవారి పదాలు ఈ కవి రచించినవే అని నిశ్చయించి కాలనిర్ణయానికి పూనుకొన్నారు కనుక ఎన్నో చిక్కులు ఎదురైనవి. ఆ పదాలనుబట్టి కృష్ణప్రభువు తండ్రి కుమార వేంకటేంద్రుడు, ఆయన తండ్రి తిమ్మప్రభువు అని కనబడుతుంది.

ఇది ఆధారముగా చేసుకొని దామెరవారి వంశావళితో శ్రీ కాలహస్తి సంస్థానమును కుంఫిణీ వారికి దఖలు పరచిన తిమ్మానాయనిం వారి కుమారుడైన కుమార వెంకటప్ప నాయనిం వారే, మన కృష్ణప్రభువు తండ్రి అని ఊహచేసి, ఆ కుమార వెంకటప్ప నాయనిం వారిని గూర్చి ఆ వంశావళిలో ఉన్న భాగమంతా, ఆ వ్యాసములో ఉదహరించినారు. అందులో హైదరాలీతో యుద్ధాల వర్ణన ఉన్నందున హైదరు కాలమైన 1780 ప్రాంతమే కుమార వెంకటప్ప నాయని కాలమూ, సుబ్రహ్మణ్యకవి కాలమూ అని వారు నిర్ణయము చేసినారు. అది నిజమైతే సుబ్రహ్మణ్య కవి కూడా కర్ణాటక సంగీతానికి త్రిమూర్తు లనబడే త్యాగరాయాదులకు సమకాలికుడవుతాడు. త్రిమూర్తులు తమిళ దేశంలో జన్మించిన పవిత్ర

మూర్తులైతే, సుబ్రహ్మణ్యకవి స్వచ్ఛముగా ఆంధ్రదేశములో సువర్ణ ముఖరీ తీరాన నివసించి శ్రీ శేషగిరి శ్రీ కాలహస్తీశులను సేవించి ధన్యుడైన పుణ్యైకమూర్తి అవుతాడు. బాగానే ఉంటుంది. కాని- ఐతే ఈ నిర్ణయానికి చాలా చిక్కులున్నవి. (1) వారాధార పడిన దామెరవారి వంశావళి విశ్వాసపాత్రమైన పత్రమైతే, ఈ కుమార వెంకటప్పయ్య నాయుడు బహులాశ్వ చరిత్ర గ్రంథకర్తయైన దామెర వెంగభూపాలునికి 25 వ తరమువాడు. బహులాశ్వచరిత్ర గ్రంథకర్త 1550-1600 మధ్యకాలపు వాడు. తరానికి 10 సం॥లు లెక్క వేసినా, వెంకటప్పయ్య నాయని కాలము 1800-1850 అవుతుంది. అంటే వరసగా 25 తరాలలో ప్రతి ప్రభువు 10 ఏళ్ళకే కుమారుణ్ణి కని ఉండవలె. అది అసంబద్ధము. తరానికి 25 లేక 30 ఏళ్ళు వేయడము చారిత్రకుల పరిపాటి. 25 ఏళ్ళుగా లెక్క వేస్తే, కృష్ణ ప్రభువు తండ్రి కాలము 2, 175-2, 225 అవుతుంది. ఈ గణితమే దామెర వారి వంశావళి విశ్వాస పాత్రము కాదని ఋజువు చేస్తుంది.

వారే బహులాశ్వచరిత్ర కృతికర్తకు సవతి సోదరుడు కృష్ణభూపాలుడు ఒక డున్నాడనీ, అతని పినతండ్రి తిమ్మభూపాలుడు కలడనీ వ్యాసములో తెలిపినారు. బహులాశ్వ చరిత్రలోని వంశవృక్షము విశ్వాస యోగ్యమైనది. అందులో ప్రసక్తుడైన కృష్ణభూపాలుడే మన కవి సమకాలికుడనుకుంటే సరిపోతుంది. అప్పుడాయన 1550-1600 మధ్యకాలపు వాడవుతాడు.

దీనికి శ్రీ తిమ్మావజ్ఝలవారు చూపిన మరియొక చిక్కు. ఆ పదముల రచన అంత పూర్వ రచనగా తోచుట లేదనునది కావచ్చు. ఆ పదములు రచించినది సుబ్రహ్మణ్యకవి కాదని మనము నిశ్చయించినప్పుడు అది ఒక చిక్కే కాదు. అధ్యాత్మ రామాయణములోని భాష అంతపూర్వపుది కాదని వారనలేదు. నా దృష్టిలో కూడా ఆ భాష అంతపూర్వపుదే కాక, అంతకంటె పూర్వపుది కూడా కావచ్చు ననిపిస్తుంది.

ఇక సంగీతములో అనుభవమున్నవారు అధ్యాత్మ రామాయణములోని సంగీతపు కాలాన్ని గూర్చి తెలిపిన భావాలు విచారిద్దాము. అవికూడా నా అభిప్రాయాన్నే బలపరుస్తున్నవి.

"రామాయణ కీర్తనలు నూట నాలుగింటికి దాదాపు 58 రాగాలు వాడబడ్డాయి. లభించిన క్షేత్రయ్య పదాలలో మున్నూటికి 36 రాగాలే వాడబడ్డాయి. [1]క్షేత్రయ్య నాటి మోహన ఈకీర్తన రాగాలలో కనబడదు. అన్నమాచార్యుల నాటి కర్ణాట సారంగ, మంగళకైశిక, లలిత పంచమం, గౌరి, కన్నడగౌళ వంటి ప్రాచీన రాగాలతో కీర్తనలున్నాయి. ఇందువల్ల సుబ్రహ్మణ్యకవి క్షేత్రయ్యకు ఇంకా దగ్గర వాడు మాత్రమే కాక కించి త్పూర్వుడు కాగలడా అని కూడ అనిపిస్తుంది. ఏమంటే ఈ రాగాలలో గౌరిని తప్ప మిగిలిన వాటిని వేటినీ క్షేత్రయ్య వాడలేదు. క్షేత్రయ్య నాడే బహుశా ప్రచారము లోకివచ్చి ఉంటాయని ఇంతవరకూ విద్వాంసు లనుకొంటూ వున్న ఊసేనీ, కాపీ, ఆనంద భైరవీ సుబ్రహ్మణ్య కవి కూడా వాడాడు...."

కుమారి ప్రమీలాదేవి వ్యాసములో కూడా శ్రీ తిమ్మావజ్ఝలవారి కాల నిర్ణయముతో ఏకీభవింపక, క్షేత్రయ్యకు పూర్వుడును అన్నమా చార్యులకు దగ్గరవాడు కాగలడేమో అనిపిస్తుంది అన్న శ్రీ రజని మాటలు ఉటంకించి ఇంకా ఇట్లా ఒకచోట పలికినది.

"అది కాక భద్రాచల రామదాసు 17వ శతాబ్దమువాడు. వీరికి తరువాత కాలము వాడైన శ్రీ త్యాగరాజస్వామివారు తమ ప్రహ్లాద భక్తి విజయ మను సంగీత నాటక ప్రారంభమున భద్రాచల రామదాసును సన్నుతించారు. రామ కథను వ్రాస్తూ, రామదాసు కాలమునుండి ఆంధ్ర దేశమంతా విస్తార ప్రశస్తికి వచ్చిన భద్రాచల నామమును సుబ్రహ్మణ్య కవి స్మరింపకుండుట ఒక విశేషము. కాబట్టి ఆయన రామదాసుకు పూర్వు డనియే భావించుట సమంజసము".

ఆమెయే మరియొక సందర్భములో ఈకవి ప్రయోగించిన రాగా లను నిరూపించి, "—దీనిని బట్టియు, ఈయన వాడిన ప్రాచీన రాగము లను బట్టియు, ఈ కవి క్షేత్రయ్యకు పూర్వుడై ఉండుననుటకు ఎక్కువ అవకాశము కలదు" అనిరి.

1. వావిళ్లవారి ప్రతితో 334 పదాలు, 39 రాగాలూ ఉన్నవి.

కొద్ది కాలము క్రిందటివరకు ఈ కీర్తనలకు ఆంధ్ర దేశమంతటా విస్తార ప్రచారముండేది. అయినా వారి స్మృతులు చెప్పుకునే శిష్య పరంపర వినరాక పోవడము వల్ల కూడా ఆయన చాలా ప్రాచీనుడను ఊహనే బలపరుస్తున్నది.

పై అన్ని కారణాల వల్లను సుబ్రహ్మణ్యకవి క్షేత్రయ్య (1600-1680) కు పూర్వుడనీ, అన్నమాచార్యులకు (1408-1507) దగ్గర వాడనీ ప్రస్తుతానికి నిర్ణయించడము సమంజసము. అంటే బహులాశ్వ చరిత్ర కర్త కాలమైన 1550-1600 మధ్యకాలమే ఈ కవి కాలమనడమే ఎక్కువ యుక్తము.

# 5

సుబ్రహ్మణ్యకవి సంస్కృతాంధ్ర భాషలలో విద్వత్తు కలవాడన్న దానికి ఆయన రచించిన గ్రంథమే సాక్షి. ఇందులో ఉన్న 104 కీర్తనలలో 6 కీర్తనలూ, ఒక చూర్ణిక సంస్కృతములోను, తక్కినవి ఆంధ్ర భాషలోను ఉన్నవి. సంస్కృతము నిర్దుష్టమై ఉండుట సర్వసాధారణమే. కాని ఆంధ్ర భాషను ఇంత లాక్షణికముగా ప్రయోగించిన ప్రసిద్ధ వాగ్గేయ కారులు కనపడరు. అంత లాక్షణికమైన భాష ప్రయోగించినా, సజీవముగా ఉన్నది. గానానికి అలంకారము కూర్చే ప్రాసలు, అనుప్రాసలు, యతి మైత్రి అలవోకగా కీర్తనలలో కూర్చినాడు. ఇన్ని నియమాలు పాటించినా వీల్లు పదాలు సకృత్తుగా కాని కనబడవు. ఈ పలుకులు ఆయన సంస్కృతానికి కూడా అన్వయిస్తవి. ఆయన ప్రయోగించిన సలక్షణ సంస్కృతాంధ్ర భాషలు ఈ కవికి వాగ్గేయ కారులలో విశిష్ట స్థానమును చేకూర్చుచున్నవి.

భాషా పాండిత్యమే కాక ఈ కవికి, ముఖ్యంగా వేదాంత శాస్త్రములో, పాండిత్య మున్నట్లు విశదమవుతూంది. అద్వైత వేదాంతాన్ని ప్రదర్శించే అధ్యాత్మ రామాయణము ఆంధ్రీకరించడానికి పూనుకొనడమే దానికి నిదర్శనము. ఆయనకు వేదాంత శాస్త్ర జ్ఞానమే కాక అనుభవము కూడా కల పుణ్య పురుషుడుగా కనపడుతున్నాడు. అతడు 'వివేక కార్య

శేషగిరి' 'అఖండ చిదనుభవి' 'రుచిరవి' 'సారబ్రహ్మ సుబ్రహ్మణ్యము' 'సంతత లేదని బేర్కొని జను లజ్ఞాన కర్మ బంధంబులూడి ముక్తిగాంతు రట్టి శేష గిరీశుడగు రాఘవదాసున కితర బంధము లెంత!' అని ధైర్యము వహించిన వాడు। రామ భక్తిని అద్వైతానుభవముతో మేళవించి చెప్పు టలో ఈ కవికి సాటి యైనవాడు, కృష్ణ భక్తితో అద్వైతానుభవము మేళ వించి శ్రీ నారాయణ తీర్థుల వారే!

ఇక ఆయన ధాతు కల్పనా సమర్థతను గూర్చి సంగీత విశేషము లను లోతుగా తరచి సూచించిన శ్రీ రజనీ యొక్కయు,కుమారి ప్రమీలా దేవి యొక్కయు వాక్యాలు ఈ శీర్షిక చివరి భాగములో ఉదహరించ బోతున్నాను. వారిద్దరూ సంగీత శాస్త్రములోను గాన ప్రయోగములోను అనుభవమున్నవారు గనుక వారి అభిప్రాయములు ప్రమాణంగా గ్రహించి ఈ కవికి మాతువుతోపాటు ధాతువులో కూడ సమాన ప్రజ్ఞ కలదని నిర్ణ యింపవచ్చును.

వారివలె లోతులకు పోకుండా స్థూల విచారణము వల్ల, ఈ కవికి గల సంత ప్రాగల్భ్యము అనుమేయించవచ్చును. ఈయన 104 కీర్తన లలో 58 రాగములు ప్రయోగించినాడు. బాలకాండములో 17 కీర్తనలు 17 రాగములలో చెప్పినాడు. వావిళ్ళవారు ప్రచురించిన క్షేత్రయ్య పదములు 334 టిలో 39 రాగములు మాత్రమే ఉన్నవి. తీర్థులవారి 153 కీర్తనలలో 37 రాగములే ఉన్నవి. ఈ ఇద్దరు సమర్థులతో పోలిక వల్ల, ఈ కవి ప్రదర్శించిన రాగ వైవిధ్యము ఎంత మహత్తరమైనదో అనుమేయించవచ్చును.

ఈ కవికి ధాతువులలో సమాన ప్రాగల్భ్యమున్నట్లు నిరూపిత మయినందున,శార్ఙ్గదేవుని మొదటి ప్రమాణము ప్రకారము, సుబ్రహ్మణ్య కవి ఉత్తమ వాగ్గేయకారకోటిని అలంకరిస్తున్నాడు.

ఆ లక్షణ కర్త చెప్పిన రెండవ ప్రమాణముతో విచారిస్తే, ఇతడు వస్తుకవి, రామాయణ మహా కావ్యాన్ని, సమర్థతతో కథా కథనము చేసి నిర్వహించినాడు కనుక, ఉత్తమ వాగ్గేయకారుడు. ఈ కావ్యము శాంత

రస ప్రధానమై నవరసభరితమైనది. అది దంపతుల సంవాదరూపముగా ఉండి, పవిత్ర శృంగార సంబోధనలతో భక్తిని జోడించి, సహృదయ హృదయాహ్లాదకముగా ఉన్నది. ఏ విధముగా చూచినా, అధ్యాత్మ రామాయణము ఆంధ్ర భాషలో నిరుపమాన మైన కావ్యము.

ఈ కవి గేయదక్షతను గూర్చి శ్రీ రజని ఇట్లా అన్నారు :

"ఈ కీర్తనలు ఆఖ్యానాత్మక శైలికి అనుగుణంగా ఆది, అట, జంపె, త్రిపుట, రూపక తాళాలలో, ఆ కీర్తనలకు ఆయా రసాలకు ఉచిత మైన ధాతుకల్పన చేసాడు, సుబ్రహ్మణ్యకవి. కొందరు నేటి విద్వాంసులు ఇతని ధాతుకల్పన అంత విద్వత్పరిపుష్టము కాదనీ, ఇతడు కేవలము భజన గోష్ఠులకు పనికివచ్చు సంకీర్తనములను సులభ శైలిలో చేసిన వాగ్గేయ కారుడన్నట్లుగా భావిస్తారు. త్యాగ్యరాజును గురించి అతని కాలపు విద్వాంసులిటువంటి అభిప్రాయమునే వెలిబుచ్చినారు.... రామాయణ కీర్తనలను వివరంగా చదివిన వారికైనా, పాడిగా వినిన వారికైనా, ఆ కీర్తనలలో చాలమట్టుకు - చరణ నిర్మాణము చిట్టస్వర సాహిత్యము లాగే చౌక మధ్యమ కాలగతులలో సాగి సాహిత్యముతోనే చివర ముక్తా యింపులు వేసుకుని, తిరిగి పల్లవికి బోయే ప్రౌఢ రచన గోచరిస్తుంది.... చరణము అనుప్రాసలతో అంత్య ప్రాసలతో ఖండాలుగా తెగి, ఖండ ఖండానికీ ఓకే మాదిరి ధాతువు తిరిగి తిరిగి వచ్చి, పై కాలంలో చివరి ఒకటి రెండు ఖండాలు రాగంలో పై స్థాయినంతటినీ చుట్టుకొని వచ్చి, ముక్తాయింపుతో చరణం ముగిసి, పల్లవి అందుకుంటుంది....

"ఇతని కీర్తనలలోని ధాతుకల్పన, పల్లవి యెత్తుగడలోనే రాగ స్వరూపాన్ని స్పష్టంగా నిర్దేశిస్తూ, ఒక్కొక్క చరణము లోను, అందలి భావాన్ని అనుసరించి, ముందు చెప్పుకున్న ప్రకారం, అనుప్రాసాన్వితమై తెగుతూ వినిపించే ధాతు ఆవర్తాలలో తిరిగి తిరిగి వినిపిస్తూ, చివరి ఖండాలతో రాగ స్వరూపం పూర్తిగా నిర్దేశింపబడుతుంది...."

ఇక కుమారి ప్రమీలాదేవి వ్యాసములో ఈ కవి సంగీత దక్షతను ఇట్లా వర్ణించినది.

"కృతి రచన యేర్పడుటకు పల్లవి, అనుపల్లవి, చరణములు చాలును గాని సుబ్రహ్మణ్యకవి చరణాంతములందు మధ్యకాల సాహిత్యములను రచించి, వాటి శ్రావ్యతను ఇనుమడింప జేసినాడు. మధ్యమకాల సాహిత్యములకు సృష్టికర్త అని ప్రసిద్ధి పొంది కర్ణాటక సంగీత త్రిమూర్తులలోనొకరైన శ్రీ ముత్తుస్వామి దీక్షితుల మధ్యమకాల సాహిత్యముల కేమాత్రము తీసిపోవు. శ్రీ ముత్తుస్వామి దీక్షితులకు సుబ్రహ్మణ్య కవి పూర్వుడగుటచే వారి కందులో మార్గదర్శి యనుట యతిశయోక్తి కాదు."

"సీతారామ కల్యాణ సమయమున అప్సరసలు ఆడిరని తెలుపు సమయముల కూర్చిన జతులును వీరి స్వరలయాది పాండిత్యమును ప్రదర్శించు చున్నవి...."

"ఈ వాగ్గేయకారుడు లక్ష్య లక్షణములందు సామర్థ్యము కల వాడు...."

"రాగ రసమును కావ్యమందలి సందర్భము ఎరిగి రాగములను ప్రయోగించినపుడే ఆశించిన ఫలము చేకూరగలదు. సుబ్రహ్మణ్యకవి కావ్యము నందంతటను ఇట్టి విజ్ఞతయే చూపినాడు."

"ఈ కవి రచనలలో కొన్ని విశేషమైన అలంకారములు కూడ కానవచ్చుచున్నవి...."

"సుందర కాండములో వానరులు మధువనము భంగము చేసిన కథను గానము చేయు సందర్భములో రచించిన కృతి పల్లవిలో సుబ్రహ్మణ్యకవి మధువనము తేనె లానిన ఆనందముతో పొంగిపోవు చున్న వానివలెనే 'సరిగారీ సచ్చరిత్రము విను వారి కరయ నెవ్వారిలను గౌరి' అని స్వరాక్షరములను అర్థవంతముగా కూర్చి తన నేర్పును ప్రకటించినాడు."

"కొన్ని పల్లవులలో చిత్రమైన విశేషములు కూడ కానవచ్చినవి...."

"వీరి కృతులన్నిటిలో పల్లవులు మిక్కిలి సమర్థతతో రచింపబడినవి. వానిలో ప్రారంభములోనే రాగసంచారము ప్రారంభమై, అను

పల్లవిలోను చరణములోను సంపూర్ణత చెందును. వాటి విశేషములు గానము చేసి వినిపించి ప్రదర్శించినపుడే కాని, కేవలము మాటలతో వర్ణించుట సాధ్యము కాదు."

"తాళ విషయములో కూడ ఈ కవికి మార్గ విధానమందే అభిమానము కనబడుచున్నది...."

# 6

ఇది సంస్కృతములో ఉన్న ఆధ్యాత్మ రామాయణమునకు ఆంధ్రానువాదము. మూలము విశ్వామిత్ర రచనమని పెద్దలవల్ల వినికిడి. 1884వ సంవత్సరములో పిడుగు సుబ్బరామయ్యగారి చేతస్వకీయ శారదా నిలయ ముద్రాక్షరశాల యందు ముద్రించిన తెలుగు లిపి ప్రతి నావద్ద ఉన్నది. దాని ముఖ పత్రము మీద కూడ విశ్వామిత్ర ప్రోక్తమని ఉన్నది. దానిలో హిమ్మతివర్మ పుత్రుడైన శ్రీరామవర్మ రచించిన 'సేతువు' అనే వ్యాఖ్య కూడా ఉన్నది ఇది. విశ్వామిత్ర కృతమనే ప్రతీతి వున్నా, వ్యాఖ్యాత మాత్రము వ్యాస ప్రోక్తమైనట్లు భావించినాడు.

దీని పారాయణ మహాత్మ్యము గొప్పగా బ్రహ్మాండ పురాణములో ఉన్నది. స్మార్తుల ఇళ్ళలో పెద్దలు దీనిని పారాయణము చేసే వారని తోస్తుంది. మా నాన్నగారే నాలుగు సార్లకు తక్కువ లేకుండా పూర్తిగా పారాయణము చేసినారు.

మూలములో ఉత్తర కాండముతో సహా ఏడు కాండలూ, 4245 శ్లోకాలు ఉన్నవి. అవి ఎక్కువ భాగము అనుష్టుప్పులు. సుబ్రహ్మణ్య కవి 3 627 శ్లోకాలున్న యుద్ధ కాండాంత కావ్యమే అనువాదము చేసినాడు. అది క్రౌను సైజులో 183 పేజీలలో అచ్చయినది. పేజీకి 10 శ్లోకాలు చొప్పున లెక్క వేస్తే, మూలము 362 పేజీలు అవుతుంది. కాబట్టి స్థూలముగా లెక్కవేస్తే దానిని సగము పరిమాణానికి అనువాదము చేసినాడన్న మాట. ఈ విధంగా కొంత సంక్షేపముగా వున్నా. మూల కథలోని ప్రధానాంశాలు కాని వర్ణనలు కాని, స్తోత్ర విశేషాలు కాని, ఏమాత్రము పోకుండా

అనువాదములోకి తెచ్చినాడు. మూలములోని శబ్దాలు కూడా తరుచుగా కీర్తనలలో కూర్చినాడు. అనువాద విధానము వివరించడము ఇంకొక వ్యాసములో చేయదగిన దని ప్రస్తుతము దాని స్వరూపము స్థూల మార్గంగా ప్రస్తావించాను.

సుబ్రహ్మణ్య కవి అధ్యాత్మ రామాయణము ఇతోధికముగా భక్తులు కీర్తించుకొని, గానకళా కుశలురు గానము చేసి తరింపదగిన ఉత్తమ గేయ కావ్యము. శ్రీ రజని వాక్యాలతో ఏకీభవిస్తూ ఈ ప్రబోధము చేస్తున్నాను.

"ఆంధ్ర దేశములో పుట్టి, పెరిగి పాదుకొని ఆంధ్రులను ఆబాలగోపాలమును పాడించిన ప్రసిద్ధ వాగ్గేయకారుల కోవలో ఇంచు మించు చివరివాడు సుబ్రహ్మణ్య కవి. ఆతని కీర్తనల సంగీతాన్ని ఉద్ధరించుకొనడము, వరదలో మునిగిపోనున్న నాగార్జున శిల్ప కళా ఖండాలను ఉద్ధరించు కొనడం వంటిదే ఎక్కడో దక్షిణాది వారి బాణీనో, ఉత్తరాది వారి బాణీనో అనుకరించడం తప్ప, ఆంధ్రులకు సొంత సంగీతం లేదనుకొనే వారందరికీ- అన్నామాచార్యులతో ప్రారంభించి సుబ్రహ్మణ్య కవి వరకూ జరిగిన అధ్యాయాలలో మనము స్మరించిన వాగ్గేయకారు లందరి జీవితములూ సరియైన ప్రత్యుత్తర మీయగలవు."

"పురారిగిరి సంభూతా శ్రీ రామార్ణవ సంగతా అధ్యాత్మ రామ గంగేయం పునాతి భువన త్రయమ్."

నాట్యకళ (1957-68) ప్రత్యేక సంచిక డిసెంబరు-1969

# శిలా శిల్పకళ విశిష్టత

శిల్పము, చిత్రకళ, సంగీతము, నృత్యము, కావ్య రచన— ఇవి అన్నీ లలిత కళలుగా భావింపబడుతున్నా దేని విశిష్టత దానికున్నది. ఐనా తక్కిన లలిత కళలకు వేనికీలేని విశిష్టత శిలా శిల్పానికి ఉన్నది. ఈ శిల్పము ఎక్కడ ఏ విధంగా రూపొందుతుందో చక్కగా భావించి నప్పుడే కాని దాని స్వరూపము అవగతము కాదు.

కవి కావ్యస్వరూపము హృదయగతము చేసుకొని శబ్ద స్వరూపము లోకి దించుతాడు. తాను భావించిన భావనకూ, చెప్పే వాక్కుకూ అవినాభావ సంబంధ ముండేట్లు చేస్తాడు. వాక్కుమీద అధికార మున్న వానికే అది సాధ్యపడుతుంది.

అట్లే చిత్ర కళాకారుడు తన భావనను రేఖలతో వర్ణములతో రూపొం దిస్తాడు. రేఖలు వ్రాయడంలో రంగులు వేయడములో అతనికున్న అను భవము జోడిస్తాడు. చిత్రము చిత్రించేది కాగితము మీద కావచ్చును, చర్మము మీద కావచ్చును, పటముమీద కావచ్చును, కుడ్యముమీద కావచ్చును, రత్నాదుల మీద కావచ్చును, కుండమీద కావచ్చును, ఆయా వస్తువుల గుణములకు అనుగుణముగా తన పద్ధతి మార్పు చేస్తాడు.

అట్లే వాగ్గేయకారుడు తన హృదయములో ఆవిర్భవించిన సంగీత మును- ధాతువును- మాటలలో- ధాతువులో కూరుస్తాడు.

నర్తకుడు కూడా తాను ప్రదర్శింప దలచిన భావాలను తన అంగ విన్యాసాదులతో ఆకాశములో రేఖలు గీసి ప్రదర్శిస్తాడు.

ఈ విధంగా ఈ లలిత కాళాకారులు తమ హృదయములో ఆవిర్భం చిన భావము తాము ఎన్నుకొన్న సాధనములోనికి, ద్రవ్యములోకి యోగింప జేస్తారు.

మరి శిలా శిల్పి? అతడు ఉపయోగించే ద్రవ్యము శిల. అతడు చేసేది తాను భావించిన రూపమును, శిలలో శాణటంకములతో మూర్తి భవింప జేయడమేనా? సాధారణముగా అంతే అనే భావము సర్వే సర్వత్ర వ్యాపించి ఉన్నది. ఈ శిల్పమును గూర్చి వ్రాసిన వ్యాస కర్తలు కాని, కథకులు కవులుగాని, ఎక్కువగా అదే భావము ప్రకటించినారు. సాధారణ శిలా శిల్పులుచేసే పని కూడా అదే కావచ్చును. కంచు మొదలైన లోహాలతో విగ్రహాలు పోతపోసే శిల్పులు కూడా చేసేది అదే కావచ్చును. కాని శిలలలో మూర్తులు శిల్పించే మహా శిల్పులు మాత్రము చేసేది కానేకాదు. అదే వారి విశిష్టత! ఏమిటది?

## 2

కవి తన భావనకు వాక్కును అనుకూలముగా మలచుకోగలడు. చిత్రకారుడు భావనానుకూలముగా పెన్సిలును, తూలికలను, రంగులను, వస్తువును మలచుకో గలుగుతాడు. అట్లే వాగ్గేయకారుడు వాక్కును, నటుడు తన అంగములను స్వాధీనము చేసు కుంటారు. కాని శిలా శిల్పికి అట్టిది సాధ్యము కాదు. తక్కిన కళా కారుల సాధనములు వారి స్వాధీనములో ఉంటవి. కాని శిల అట్లాకాక స్వతంత్రమైనది. తక్కిన కళాకారులవలె శిలాశిల్పి కూడా శిలలోకి తన భావరూపము చెక్కడానికి పూనుకుంటే, అతనికది సాధ్యముకాదు. ఆ రాయి చంద్రకాంతపు రాయి (Marble) కాని, నల్లశాణపు రాయికాని, ఎర్ర రాయికాని, సున్నపు రాయికాని, దేని రూపము దాని కుంటుంది. శిల వట్టి సుద్ద ముద్ద వంటిది కాదు. దారువులకువలెనే రాతికిని ఎన్నో పొరటు, గీరలు, పొరుపులు ఉంటవి. వానికి అడ్డురాకుండా తన భావనను శిలాశిల్పి రూపొందించు కోవలె. తన భావనకు అనుకూలముగా ఉన్న శిలను వెదకు కొనడానికి పూనుకొంటే, ఏళ్ళు పూళ్ళు వెదకినా, దొరకక పోవచ్చును. శిల్పాలకు ఉపయోగపడే శిలలు సులభ సాధ్యమైనవి కావు. కాబట్టే శిలాశిల్పి తనకు ప్రాప్తించిన శిలలోనే మూర్తి భావన చేయవలె. ఈ విధంగా చూస్తే

శిల ప్రభువు, శిలాశిల్పి దాని సేవకుడూ అనిపిస్తుంది. కాని అదీ న్యాయముగా తోచదు. అప్పుడు శిల్పి అస్వతంత్రుడౌతాడు, శిల్పి గౌరవానికి అది భంగకరము మరి?

# 3

శిలా ఫలకము లభ్యమైనది. దానిని ఎన్నో విధాల స్థూల పరీక్ష చేసి శిల్పయోగ్యమో కాదో ముందు నిర్ణయిస్తాడు. శిల్పయోగ్యమని నిర్ణయమైన తర్వాత దానిని బహుముఖాలుగా పరిశీలన చేస్తాడు. సూర్యకాంతిలో, చంద్రకాంతిలో, సంధ్యాకాంతిలో, చీకటిలో దాన్ని కన్ని వైపులా తిరిగి సూక్ష్మంగా పరిశోధన చేస్తాడు. దాని స్వరూపము బాగా అధ్యయనము చేసిన తర్వాత అందులో ఏ శిల్పమూర్తి నిక్షిప్తమై ఉన్నదో, దాగి ఉన్నదో, బంధింపబడి ఉన్నదో ధ్యానిస్తాడు. శిలా శిల్పికి నిజమైన హృదయము ఆ శిలలో ఉంటుంది, తన దేహంలోకాదు. ఆ మూర్తిని శిల్పి దర్శించిన తర్వాత కాని శిల్పక్రియకు ఉపక్రమిం చడు. ఆ శిలలో ఏ భాగంలో ఏ రూపంలో మూర్తి ఉన్నదో దర్శించి దాన్ని బయటికితీసి ప్రదర్శించడమే శిల్పి కార్యక్రమము. శిలాబం ధంలో చిక్కుకొన్న మూర్తులకో, మూర్తికో శిలలో నుండి విముక్తి కాలిగించే పుణ్యశాలి శిలాశిల్పి. అది ఆదరముతో, భక్తితో, ప్రేమతో కాఠిన్యముతో వాత్సల్యముతో కాని సాధ్యముకాదు. ఇంకొక పరిభాషలో చెబితే మాయాబంధములోనున్న జీవునికి స్వస్వరూపము ప్రదర్శించే సద్గురువు వంటివాడు మహాశిలాశిల్పి!

# 4

ఈ శిలా శిల్పము మన దేశములో వర్ధిల్లిన వైదిక జైన బౌద్ధ మతాలు మూడిటికీ సర్వసాధారణమే ఐనా, ఆ మూడిటిలో అది బౌద్ధము వల్ల విస్తారంగా వ్యాప్తి చెందినది; బౌద్ధములోకూడా మొదట మొదట బుద్ధపాదాలు, బోధికి, ధర్మచక్ర ప్రవర్తనకూ, మహాపరినిర్వాణమునకూ

ప్రతీకలైన బోధివృక్షము, చక్రము, బుద్బుదాకారమైన సూ్తప్తము మాత్రమే పూజా స్థానాలుగా ఉండేవి. ప్రాచీన తర బౌద్ధ మనదగిన హీనయానము శాఖోపశాఖలై మహాయాన శాఖలుగా పరిణమించుటతో పాటు బోధిసత్వ భావన విస్తరించినట్లే శిలాశిల్పమును బహుముఖము లుగా విస్తరిల్లినది.

బౌద్ధ పూర్వాచార్యులు మొదట మొదట ఈ విగ్రహ పూజను అస మ్మత సృష్టితో ఉపేక్షించి ఉండవలె. శిలా శిల్పాచార్యులు నెమ్మది నెమ్మదిగా తమ శిలా శిల్పా రహస్యమును వారికి విశదీకరించి వారి సమ్మతిని పొందియుండవలె. ఎందరో శిలా శిల్పులు బౌద్ధబిక్షువులు కూడా అయి ఉండవచ్చును.

శాక్యగౌతముడై జన్మింపక పూర్వము ఆయన 4 అసంఖ్యేయ కల్పముల కాలము క్రిందట బ్రహ్మచారియై దీపంకర బుద్ధునివల్ల దీక్ష పొంది అప్పటి నుండి అనేక జన్మము లెత్తి దశపార మితములు—దాన, శీల, నైష్కర్మ్య, ప్రజ్ఞా, వీర్య, సత్య, క్షాంతి, అధిష్టాన, మైత్రి, ఉపేక్షలు—అనుష్టించి సిద్ధిపొంది యుండెను. ఆయన ఎత్తిన జన్మలు మనుష్య జన్మలే కాదు, పశు పక్షి వృక్షాది జన్మలు కూడా ఎత్తెను. ఏ జన్మమెత్తినను తన దీక్షమరవక దశపార మితములు అనుష్టించెను. ఆ జన్మలలో జీవించిన దశలకే బోధిసత్త్వ సంజ్ఞ కలదు.

గౌతమ బుద్ధుడు బుద్ధత్వము పొందిన వెంటనే మారుడు వచ్చి ఆయనను బహువిధముల ధర్షింప యత్నించెను. అందులో ఒకటి, "గౌతమా, నీవు బుద్ధుడవైతివి. వెంటనే నిర్వాణమున ప్రవేశించి నిర్వాణ సుఖమనుభవింపుము' అని సమ్మోహింప యత్నించుట. కాని బుద్ధుడు ఈ చతుర్దశ భువనములు కర్మబంధములో చిక్కి దుఃముతో బాధ పడుచుండగా వారిని అందరినీ ఉద్ధరించే ఉపాయము బోధించక నేను నిర్వాణసుఖ మర్థింపను' అని భీష్మించెనట!

పై విషయములు సర్వసామాన్యముగా బౌద్ధ శాఖలన్నియు విశ్వసించున వైనందున శిలాశిల్పులు ప్రతిపాదించిన శిలాశిల్ప

రహస్యము బౌద్ధాచార్యులను అందరిని నెమ్మది నెమ్మదిగా ఆకర్షించి ఒప్పించి ఉండవలెను.

'బోధిసత్త్వమూర్తులు ఈ శిలా బంధములలో చిక్కుకొని మూర్తిభవించి భక్తులకు దర్శనమిచ్చి ఉద్ధరించుటకు ఆరాటపడుచున్నవి. భగవానుడు చతుర్దశ భువనములలో జీవకోటికి కర్మబంధము నుండి విముక్తి కల్పించవలెనని ఆరాటపడలేదా? మేమును శిలాబంధములలో చిక్కుకొని మాకు దర్శన మిస్తున్న బోధిసత్త్వావతార మూర్తులకు శిలాబంధము తొలగించి సువ్యక్తము చేయదలచినాము'.

స్థూలముగా పైన వివరించిన విధముగా శిలా శిల్పాచార్యులు బౌద్ధస్థవిరులకు నివేదించి వారి అనుజ్ఞ పొంది ఉండవలె! శిలా శిల్పాచార్యులు మొదట వెలువరించిన బోధిసత్త్వమూర్తులను చూచి స్థవిరభిక్షువులుకూడ సమ్ముగ్ధులై ఉండవలె. ఇట్లు మొదట పొందిన అనుజ్ఞ, తర్వాత తర్వాత శాసనముగా మారి శిలా శిల్పముబహుముఖములుగా విస్తరించి వైభవ స్థితిని సంపాదించి ఉండవలె!

## 5

పోయిన సంవత్సరము నేను నా 'విజయపురి' నవలా రచనకు ఆధారములు గ్రహించుటకు నాగార్జున సాగరము వెళ్ళి యుంటిని. అక్కడ నాకు పెద్దలెందరో విజయపురి పూర్వ వైభవమును లీలగానైనా తెలుసు కొనడానికి ఎంతో వాత్సల్యముతో సహకరించిరి. అట్టి వారిలో యువకుడు ఉత్సాహశాలి ఐన శ్రీ కొండిపర్తి శేషగిరిరావు ఒకరు. ఆయన మహాశిల్పుల వంశములో జన్మించిన వారు. శిలను శిల్పముగా రూపొందించుటకు శిల్పులు అనుష్ఠించు కార్యక్రమము వివిధ దశలను వారు వర్ణించుటేకాక, తొమ్మిది దశలను స్కెచ్‌ని రూపముగా వ్రాసి ఇచ్చి, అభిమానముచూపి నేను చదువ దగిన గ్రంథాలుకూడా సూచించినారు. అదంతా ఒక ఎత్తు! అందులో వారు 'పరస్థలాలు తీసివేయడము' అని శిలాశిల్పులు ఉపయోగించే పరిభాషను చెప్పడము ఒక ఎత్తు! ఆ మాటలను వారు వివరించలేదు.

'పరస్థలాలు తీసివేయడము' అని శిల్ప పరిభాషను గూర్చి మననము చేయగా చేయగా ఆ మాటలు ఎంతో అద్భుత మనిపింప సాగినవి. వారు ఏదో సందర్భ వశముగా అన్నమాటే ఐనా నాకు హృదయానికి హత్తుకొన్నది. పరస్థలాలు అంటే ఏమిటి ? శిలలో మూర్తి కాకుండా ఉన్న స్థలాలు అన్నమాట ; స్వస్థలము అందులో దాగిఉన్న మూర్తి. తక్కిన శిలా భాగమంతా దానిని బిగించిపట్టి మాటుపరచిన పరస్థలాలు !

ఈ మధ్య ఫ్లారెంటైను, శిలా శిల్పులలో మహాశిల్పి అని ప్రఖ్యాతి పొందిన మైకేలు ఆంజిలో జీవిత చరిత్ర చిత్రించిన నవల చదవడము తటస్థించినది. అతడు గొప్ప చిత్రకారుడూ, కవీ, మందిర నిర్మాణ మహాస్థపతీ ఐనా, ఆయనకు అభిమానమైనది శిలాశిల్పము. అతడు రూపొందించిన శిలామూర్తి నొకదానిని చూచి సంపన్నుడొకడు ముగ్ధుడై 'ఈ అద్భుత శిల్పమును ఎట్లా చేయగలిగినావు ?' అని ప్రశ్నింపగా ఆ మహాశిల్పి ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెనట !

"I had a block of Marble in which was concealed the statue which you see there. The only effort involved is to take away the tiny pieces which surround it and prevent it from being seen. For anyone who knows how to do this, nothing could be easier."

('ఇక్కడ కనబడే మూర్తి దాగి ఉన్న శిల నాకు లభించినది. ఆ మూర్తిని చుట్టుకొని, దానిని కనబడకుండా చేస్తున్న చిన్న చిన్న ముక్కలను తీసివేయుట ఒక్కటే చేయవలసి ఉన్న పని. అ పని చేయడము ఎరిగిన వారెవరైనా అది సులభంగా చేయగలరు !')

సరిగ్గా మన శిలా శిల్పులు 'పర స్థలాలు తీసివేయడ'మని సర్వ సాధారణంగా ప్రయోగించే పరిభాషే మరో భాషలో, మరో దేశంలో ! ఇర్వింగు స్టోను వ్రాసిన మైకెలాంజిలో జీవిత చారిత్రక నవల మరల చదివి, శ్రీ శేషగిరిరావు చెప్పిన 'పరస్థలాల తీసివేయడము' అనే శిల్ప

పరిభాషను జోడించి, కొంత స్వీయమైన తాత్త్విక దృష్టితో మననము చేయగా ఇందులో ప్రతిపాదించిన శిలా శిల్ప విశిష్టత స్ఫురించినది.

శిలా శిల్పి చేసేది రాతిని చెక్కడము కాదు. తన హృదయము లోని భావనకు అనుగుణంగా శిలను మూర్తిగా మలచడము కాదు. చంద్రకాంత శిలలో స్వయంభువుగా నిక్షిప్తమై ఉన్న శిలామూర్తిని దర్శించి, దాని చుట్టూ నిలిచి బంధించి మరుగుపరుస్తున్న పరస్థలాలను–శిలాబంధాన్ని—తొలగించి, దాని స్వరూపము ఆవిష్కరింప జేయడము. మాతృ గర్భములో ఉన్న శిశువును వేరుచేసే మంత్రసాని పని వంటిది కూడా కాదు. మాయాబద్ధుడైన జీవునికి మాయాబంధ విచ్ఛేదముచేసి స్వస్వరూపమైన ఆత్మజ్ఞానము కలిగించే, 'గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః గురుస్సాక్షాత్పర బ్రహ్మ—' అని నిత్యము ఉపాసకులచే కీర్తింప బడే సద్గురు స్వామి వంటివాడు!

ఇట్టి విశిష్టత ఇతర లలిత కళాకారుల కెవ్వరికీ లేదు, ఒక్క శిలా శిల్పికే తప్ప!

(భారతి మార్చి–1973)

# విశ్వేశ్వర కవిచంద్రుని
# చమత్కార చన్ద్రికా

బహుకాలమునుండి ప్రసిద్ధముగా పేరుమాత్రము వినవచ్చుచున్న ఈ ఉత్తమసాహిత్య శాస్త్రగ్రంథము నేటికి డా. శ్రీరామమూర్తి సంపాద కత్వమున ఆంధ్ర విశ్వకలా పరిషత్తువారు చక్కగా ముద్రించి ప్రకటిం చుట ఎంతయు ప్రమోదావహము. కీ. శే.శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు తమ రెడ్డి రాజ్యముల చరిత్రములో ఈ గ్రంథమును ప్రస్తావించి, ఇందులోని కావ్యస్వరూపమునే ప్రాతిపదికగా గ్రహించి జగన్నాథ పండిత రాయలు రస గంగాధరములో విస్తరించెనని ప్రకటించిన దాదిగా ఈ గ్రంథము పఠింపవలెనని సాహిత్యాభిమానులకు కలిగిన తహతహ తీరెడి యవకాశము నేటికి లభించినది.

ఇందులో మూలగ్రంథము దేవ నాగర లిపిలో ముచ్చటగా 200 పేజీలలో ముద్రితమైనది. మూల గ్రంథ భాగములను ఉదాహృతగ్రంథ శ్లోకాదికములను వేరువేరు టైపులలో ముద్రించుట వలన పాఠకులకు సౌకర్యము చేకూరినది.

సంపాదకులు శ్రద్ధగా 5 లిఖిత గ్రంథములను పరిశీలించి మూలము నిర్ధారించిరి. (1) అడయారు లైబ్రరీలో నున్న తెలుగులిపి తాళపత్ర గ్రంథము (2) లండను ఇండియా ఆఫీసు లైబ్రరీలో మెకెంజీ కలెక్ష న్సులో ఉన్న కాగితములమీద తెలుగు లిపిలో వ్రాసిన గ్రంథము. (3) పిఠాపురము సూర్యారాయ విద్యానన్ద లైబ్రరీలో తెలుగు లిపిలో నున్న తాళపత్ర గ్రంథము. (4) మదరాసు గవర్నమెంటు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములో దేవనాగర లిపిలో వ్రాసియున్న కాగిత పుస్త కము. (5) అడయారు లైబ్రరీ పండిత రామచంద్ర శర్మగారు కాగిత ములపై దేవనాగరాక్షరములలో వ్రాసిన గ్రంథము.

ఈ యైదింటిలో ఉత్తమ పాఠములుగా తోచిన వానిని సంపాద కులు గ్రహించి తక్కిన వానిని అధస్సూచికలతోచూపిరి. అపపాఠముగా

తోచిన తావులలో సరియైన పాఠము నూహించి సవరించి మూల పాఠమును బ్రాకెట్లలో నిచ్చిరి. గ్రంథపాతమున్న స్థలములలో ప్రాచీనగ్రంథములనుండి పూరించుటకు వీలైనచోట్ల పూరించి బ్రాకెట్లలో చూసి తక్కినచోట్ల అట్లే వదిలివేసిరి.

ఈ విధముగా ఉత్తమ పరిశోధక మార్గమున మూలగ్రంథ పాఠము ప్రామాణికముగా పండితులు గ్రహించుటకు అనువుగా సంపాదకులు శ్రద్ధగా పరిశోధించి పాఠకుల కందజేసినందులకు సంపాదకులు ప్రశంసనీయులు.

గ్రంథాంతమందు 4 సూచిక లిచ్చినారు. 1. లక్షణ శ్లోకముల సూచి. 2. ఉదాహృత శ్లోకముల సూచి. 3 ఉదాహృత గ్రంథములసూచి. 4. సముద్దిష్ట గ్రంథకారుల సూచి. ఈ సూచికలు మిక్కిలి ఉపయోగకరములు అవి నిర్దుష్టముగానే సంతరింపబడి యుండును. 3వ సూచికలో సిజ్గ భూపాలీయము ఉదాహరింప బడిన వానిలో V. 20 (పే. 86) లోపించినదని మా దృష్టికి తగిలినది. అట్టివే చిన్న యితర లోపములును ప్రమాద వశమున దొరలి యుండవచ్చును.

ఈ గ్రంథమునకు సంపాదకులు సంస్కృతములో సంక్షేపముగా కృతి పరిచయమును, ఆంగ్లములో 44 పేజీలలో విస్తృతమైన ఉపోద్ఘాతమును చేర్చినారు.

వీనిలో ఆంగ్లోపోద్ఘాతము సర్వవిధముల సంపన్నముగా ఉన్నది. అందులో ముందు ఆంధ్రదేశములో సంస్కృతములో పుట్టిన రమారమి 50 అలంకార శాస్త్రగ్రంథముల స్వరూప మీయబడినది. ఆ భాగము ఉచితమైన ఆంధ్రాభిమానమును సూచించుటయేగాక, ప్రస్తుత గ్రంథము ఎట్టి సాహిత్య వాతావరణములో పుట్టినదియు ప్రదర్శించుచున్నది. సాహిత్యశాస్త్రమునకు దక్షిణ భారతములో ఆంధ్రభూమి అపర కాశ్మీరమనదగి యున్నదనుట నిదర్శనముగా ఆంధ్రదేశములో నేటివరకు పరంపరగా ఎంత సాహిత్య విచారణ జరిగినదో సగర్వముగా నిందు నిరూపితమైనది.

ఆ పిమ్మట ఈ గ్రంథములో నున్న 8 విలాసములలోను ఉన్న విషయములను సంక్షేపముగానే ఐనను స్పష్టముగా నుల్లేఖించినారు. అంతేకాక ఆయా సందర్భములలో పూర్వలాక్షణికులను ఎంతవరకు అనుసరించినదియు, ఎక్కడ భేదించినదియు, క్రొత్త విషయముల నెక్కడెక్కడ ప్రతిపాదించినదియు సూక్ష్మముగా ప్రదర్శించినారు.

కావ్యములలో విద్వాంసులకు ఆనంద మావహింప జేయునది చమత్కారమే ! గుణము, రీతి, రసము, వృత్తి, పాకము, శయ్య, అలంకృతి - ఈ ఏడును చమత్కార కారణములుగానే బుధులు వచింతురని విశ్వేశ్వరుని మతము. ఈ విషయము తెల్పిన సందర్భములో ఈ చమత్కార శబ్దము మొదట అభినవ గుప్తుని అభినవ భారతిలో వాడబడినదనియు, అది రసమునకు పర్యాయ పదముగా నున్నదనియు, ఆ తర్వాత క్షేమేంద్రుని ఔచిత్య విచార చర్చలోను, కవి కంఠాభరణమునందును అది వివరింపబడినదనియు, విశ్వనాథుడు తన సాహిత్య దర్పణములోను, ఆయన ప్రమాణీకరించిన నారాయణ ధర్మదత్తులును దాని నంగీకరించినట్లును ఉదాహరించినారు. ఈ సందర్భములో విశ్వేశ్వరుని చమత్కార లక్షణమును కొంత వివరించిరి.

"చమత్కారస్తు విదుషా మానంద పరివాహకృత్"

"శబ్దార్థౌ సచమత్కారౌ కావ్యమ్"

వీనిని చక్కగా నిట్లనువదించిరి. "Camatkara is whate producds a continual experiene of extraordinary pleasure in the mind of the learned. He difines poetry as a linguisztic expression possessing such a quality."

ఇక్కడ విశ్వేశ్వరుని చమత్కార లక్షణమునకు జగన్నాథ పండిత రాయల కావ్యలక్షణము ఒక విధముగా వివరణము వంటిదని సూచించిరి. జగన్నాథుడు కావ్యస్వరూపమును వర్ణించి తుదకు

"స్వవిశిష్ట జనకావచ్ఛేదక ప్రతిపాదకతా సంసర్గేణ చమత్కారవత్త్వమ్ కావ్యత్వమ్" అని కావ్యత్వ లక్షణము చెప్పెను.

ఆ తర్వాత విశ్వేశ్వరు డిచ్చిన కావ్యలక్షణము సమస్త కావ్యము లకు - ధ్వనినుండి శబ్దచిత్రము వరకు- అవ్యాప్తి లేకుండ నన్వయించు ననియు, జగన్నాథుని లక్షణము కేవల శబ్దచిత్రమును కావ్యకోటిలో గణింప దనియు నిరూపితమైనది.

గ్రంథస్థ విషయములను ప్రదర్శించుచు ఈ క్రింది విషయములలో విశ్వేశ్వరుడు ప్రథముడును, స్వతంత్రుడును అని తెలిపిరి.

1. ఆలంకారికులలో 'రసోవై సః' అను శ్రుతిని ఉదాహరించిన వారిలో విశ్వేశ్వర కవి ప్రథముడు.

5. గ్రంథాదియందు నిలుపదగినట్టియు, నిషిద్ధములైనట్టియు వర్ణములును, గణములును నిర్దేశించుట ఈయన ప్రత్యేకత.

3. రీతులను నిర్వహించుటలో విశ్వేశ్వరకవి పూర్తిగా నూతన పంథా త్రొక్కినాడు.

4. కావ్యములను (1) చమత్కారి (2) చమత్కారితర (3) చమత్కారితమ అని మూడు రకములుగా విభజించినాడు.

పూర్వ లాక్షణికులలో ముఖ్యముగా ఎక్కువగా భోజమతమును అనుసరించినట్లు తెలుపుచు పూర్వలాక్షణికులను ఎక్కడను గ్రుడ్డిగా అను సరించక ఎన్నియో సందర్భములలో విశ్వేశ్వరకవి స్వతంత్రభావములు ప్రకటించెనని సంపాదకులు చక్కగా విశదీకరించిరి.

ఆ పిమ్మట కవి యొక్కయు, గ్రంథము యొక్కయు కాల నిర్ణ యము చేసిరి. ఈ గ్రంథము రసార్ణవసుధాకరమును ఉదాహరించుటచే దానికంటె తర్వాతది. ఈ రెండు గ్రంథములును విద్యాధరుని ఏకావలి మతమును ఖండించుటచే దానికి తర్వాతివి. సాయనుని అలంకార సుధా నిధియందు చమత్కార చంద్రిక ఉదాహరింపబడుటచే దానికంటే ప్రాచీ నము. అలంకార సుధానిధి రచనా కాలము క్రీ. శ. 1358-1378 మధ్య జరిగియుండునని మల్లంపల్లి వారి నిర్ణయమును ప్రమాణీకరించిరి. ఈ య్యాధారముల మీద చమత్కార చన్ద్రిక 1370 A. D. ప్రాంతమునను,

రసార్ణవసుధాకరము 1368 ప్రాంతమునను రచింపబడెనని నిర్ధారించిరి. (P. LIV.)

సంపాదకులు సంస్కృతములో వ్రాసిన కృతిపరిచయములో "ఏవం చ చమత్కారచన్ద్రికాయా రచనాకాలః ప్రాయేణ క్రీ. 1360 A.D. భవితు మర్హతి' (P. XV) అని దీనికి విరుద్ధముగా వ్రాయుట ఇట్టి ప్రామాణిక గ్రంథములలో నెంతమాత్రం సమర్థనీయము కాదు.

ఈ రెండిటిలో నేదియు గూడ సమర్థనీయముగా తోపదు. సింగ భూపాలుని రాజ్యకాలము 1386-1412 A. D. అని (P. XXVI) సంపా దకులు స్పష్టపరచినారు. చమత్కారచన్ద్రికయు, రసార్ణవసుధాకరమును, అంతకు పూర్వపు రచనయైన కువలయావళి నాటికయు స్పష్టముగా సందే హమున కవకాశము లేకుండ రాజ్యము చేయుచున్న రాజునుగానే సింగ భూపాలుని వర్ణించుచున్నవి. కాని, రాజకుమారునిగాగాని యువరాజుగా గాని వర్ణించుట లేదు. తాతగారు జీవించి యుండగానే సింగభూపా లుడు కవిగా ఐనవోలుశాసనములో కుమారసింగడుగా వర్ణింపబడి యుండుట సంపాదకుల కాల నిర్ణయమునకు మరింత బాధకము. కాబట్టి కువలయావళి, రసావర్ణవ సుధాకరము, చమత్కారచన్ద్రికల రచనా కాలము 1386 తర్వాతకు పోవలెను. సింగభూపాలుని రాజ్యారంభకాలము 1386 కంటే పూర్వమనుటకు అవకాశము కనబడదు. ఇక అలంకారసుధా నిధి కాలమును గూర్చి శ్రీ మల్లంపల్లివారు చేసిన నిర్ణయమును పునర్వి చారణ చేయవలసి యుండును.

సంపాదకు లాపిమ్మట రసార్ణవ సుధాకర కర్త విశ్వేశ్వరకవి యవునా యను చిక్కు ప్రశ్నను ప్రస్తావించి విచారణ చేసిరి. ఆ విచా రణ అవును కాదను రెండు వాదములకు గల ఉపపత్తులను కొంతవరకు నిష్పక్షపాతముగానే పేర్కొనిరి.

విశ్వేశ్వరకవియే రసార్ణవసుధాకరమును గూడ రచించి యుండు ననుటకు చూపిన ఉపపత్తులు.

(1) రసార్ణవ సుధాకరము ప్రధానముగా నాటక లక్షణములను ప్రపంచించుచుండగా చమత్కారచన్ద్రిక నాటకలక్షణములను రసార్ణవ

సుధాకరములో చూడదగునని చెప్పి తక్కిన కావ్యలక్షణాదికములను మాత్రమే వివరించెను. ఈ విధముగా నీ రెండును పరస్పరపూరకములు. 'The two works are complementary in nature.'

(2) రసార్ణవసుధాకరములో మొదట నున్న వంశావలిలోను, ఉదాహరణములలోను సింగభూపాలుని అతిశయమును స్తుతించుటయే గాక అందున్న మూడు విలాసముల అంత్య భాగమున గ్రంథముతో సంబంధము లేకుండ సింగభూపాలుని మహిమను స్తుతించు శ్లోకములు రెండు రెండు కలవు. సింగభూపాలుడే రచించినచో స్వాతిశయము నట్లు ఉద్ఘాటించు ననౌచిత్యమునకు పాల్పడునా?.

(3) 'కందర్ప సంభవము' అను గ్రంథమును రెండును ఉదాహరించుచు అది నాదే—'మమైవ'—అని చెప్పియుండుట.

(4) రెండు గ్రంథములును విలాసములుగా విభజింపబడి యుండుట.

(5) రెండును విషయ వివరణములో సులభశైలిలో నుండుట.

(7) రెండును లక్షణ పరిష్కారములో పూర్తిగా స్వతంత్రమార్గ మవలంబింపక పూర్వలాక్షణికులను, అందును ముఖ్యముగా భరతుని, భోజుని ననుసరించుట.

(7) రెండును కళింగాస్థానకవి యగు విద్యాధరుడు రచించిన, ఏకావలిని తీవ్రముగా ఖండించుట.

పై కారణములు ఏకకర్తృకత్వమును నిరూపించుటకు చాలవనుచు భిన్న కర్తృకము లనుటకు ఈ క్రింది హేతువులు చూపిరి.

1. పరస్పరపూరకత్వము ఏకకర్తృకత్వమును నిరూపింపజాలదు.

2. రసార్ణవసుధాకరములో వలెనే కొండవీటి రెడ్డిరాజు పెదకోమటి వేమన రచించిన సాహిత్య చింతామణిలో గూడ స్వాతిశయ వర్ణనచేయు శ్లోకములున్నవి.

3. కందర్పసంభవము ఉపలభ్యము కాలేదు కనుక దానిని రచించిన కవి ఎవరో నిర్ధారణ చేయలేము.

4. పై వానిలో 4—7 కారణములు గణింపదగినవి కావు.

5. రీతులనుచెప్పిన తీరులో రెండుగ్రంథములును భిన్నమార్గము లవలంబించినవి. రసార్ణవసుధాకరములో పదవిన్యాస భంగినిబట్టి కోమలా కఠినా, మిశ్రా అని రీతులను మూడుగా విభజించి వానికే వైదర్భీ, గౌడీ పాంచాలీ అని నామాంతరము లిచ్చినాడు. చమత్కార చన్ద్రికలో పద ఘటనను ఆధారము చేసికొని రీతి (1) అసమాసా (2) మధ్య మసమాసా (3) అతి దీర్ఘసమాసా (4) మిశ్రా—అని నాలుగుగా విభజింపబడినది. ఈ రీతి భేదము రెండు గ్రంథములకు కర్తలు వేరనుటకు బలవత్తర మైనది.

6. రసార్ణవసుధాకరము భోజమతమును పలుతావుల ఖండింపగా చమత్కారచంద్రిక తరచుగా భోజుని ననుసరించినది.

7. చమత్కారచంద్రికలో విశ్వేశ్వరకవియే రసార్ణవసుధాకరకర్త సింగభూపాలుడే యని పేర్కొనినాడు.

8. మల్లినాథసూరి మొదలగు ప్రసిద్ధ వ్యాఖ్యాతలు సింగభూపాల విరచితముగానే రసార్ణవ సుధాకరమును ఉదాహరించినారు.

9. సింగభూపాలుడు రత్నపాంచాలికా నాటికనే కాక సంగీతసుధా కరమను పేర శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమునకు వ్యాఖ్యరచించిన విద్వాంసుడు.

10 సింగభూపాలుడు సర్వజ్ఞ బిరుదముతో విశ్వేశ్వరకవిచేతనే కాక శ్రీనాథాదికవులచేతను స్తుతింపబడిన విద్వదగ్రేసరుడు.

పై కారణములను తెలిపి సంపాదకులు చివరకు ఈ విధముగా సిద్ధాంతీకరించిరి.

"Such being the attainments and talents of Singabhupala borne out by great authorities, the baseless doubt of his authorship of Rasarnava Sudhakara is to be deplored. Probably it is founded on the popular misconception that an active ruler cannot be a thorough scholar and an author."

స్థూలదృష్టికి సంపాదకుల నిర్ణయము యుక్తిసహముగానే కన్పిం చును గాని లోతుగా తరచి చూచినచో నది నిలువజాలదు. స్వాతిశయ మును వర్ణించుట పెదకోమటి వేమన రచించిన సాహిత్య చింతామణిలో గూడ గలదని సమర్థించుట యుక్తముకాదు; సాహిత్య చింతామణి రచ యిత కూడ పెదకోమటి వేమన కాక ఆయన యాస్థానకవియే యనుటకు ఆధారములున్నవి. సింగభూపాలుని పాండిత్యమునకు ఆధారముగా సంగీ తసుధాకరము కూడ రచించెనని సంపాదకులు తెలిపినది పూర్ణసత్యము కాదు. ఆ గ్రంథము వ్రాతప్రతులు కొన్నిటిలో దానిని నర్మదాతీరవాసి యగు గోపనాథుడు వ్రాసినట్లు గలదని శ్రీ మానవల్లి రామకృష్ణ కవి గారు భరత కోశములో వ్రాసినట్లు సంపాదకులే (పే. XXVIII) లో తెలిపినారు. ఆ విషయము సింగభూపాలుని పేర నున్న అన్ని రచనల కును కర్తృత్వ సందేహమును బలపరచునది గదా! ఈ సింగభూపాలు నికి సర్వజ్ఞ బిరుదమున్నట్లు విశ్వేశ్వరకవిని గాని ఇతరులుగాని చెప్పిర నుటకు ఆధారము కనపడలేదు. చమత్కారచంద్రికలోగాని రసార్ణవసుధా కరములోగాని, కువలయావలిలోగాని ఆ బిరుదమెక్కడను మాకు కనపడ లేదు. ఎంతసేపటికిని శ్రీ సింగధరణీపాల ఇత్యాది రాజ పర్యాయపద ములే కలవు. కువలయావలి ప్రస్తావనలో సింగభూపాలునికి 'లలిత కవితా విలాస చతురాననేన....విద్వజ్జన సభాజనపరాయణేన ఖడ్గనారా యణేన' అను బిరుదములు కలవు. కాని సర్వజ్ఞ బిరుదమున్నట్లు చెప్ప బడలేదు. ఈ సింగభూపుడు పండితుడు గనుక సర్వజ్ఞ బిరుదము ఈయనకే అన్వయించునని భ్రాంతి కల్గినట్లున్నది. భోగినీ దండకములో స్పష్టముగా 'రావు సింగక్ష్మానాథు పౌత్రుఁన్...సర్వజ్ఞ సింగోర్వరాధ్యక్షు నీక్షించి...." అని సర్వజ్ఞ బిరుదమీయన మనుమనికి ఉన్నట్లు కలదు. ఆ సర్వజ్ఞుడు భోగినీదండక రచన నాటికి యువకుడు కనుక 1412లో చని పోయిన ఈ సింగభూపునికి అన్వయించదు. శ్రీనాథుని చాటువు 'సర్వజ్ఞ నామధేయము....' సందేహాస్పదమైనది. ఒకవేళ నది గ్రాహ్యమైనను శ్రీనాథుడు రాజుకొండకు 1420 ప్రాంతములోగాని వెళ్ళియుండుట కవకాశము లేదు. సర్వజ్ఞ బిరుదమునుబట్టి కర్తృత్వమును నిర్ణయించుట కిందుచే నవకాశము లేదు.

విశ్వేశ్వరుడే రసార్ణవసుధాకరమును సింగభూపుడు రచించినట్లు చెప్పినమాట వాస్తవమే కాని తాను ఆయన పేరు పెట్టినప్పుడు మరి యెట్లు చెప్పును? కందర్ప సంభవ కర్తృత్వము వచ్చినప్పుడు మాత్రము పరాకుపడియో ఉద్దేశపూర్వకముగనో 'మమైవ' అని చెప్పుకొనెను. ఇంతేకాక ఇతర గ్రంథములను పేర్కొనుటలో 'తథా మహిమ్న స్తవే, ధ్వని లోచనాదిషు, యథా భావప్రకాశికాయామ్' అని ఉదాహరించెను గాని రసార్ణవసుధాకరమును ఉదాహరించిన స్థలము లన్నింటి యందును 'సింగభూపాల రచితే రసార్ణవ సుధాకరే–నాయక స్యైవ వంశావల్యాం–ఇతి సింగభూపాలీయే–సిఙ్గభూపాలీయే నిదర్శితంహి'– ఈ విధముగా సిఙ్గభూపాల విరచితమని ప్రత్యేకముగా ఒత్తి చెప్పుటలోననే కర్తృత్వము సందేహాస్పద మవుచున్నది.

భోజుని మతమును చమత్కార చన్ద్రిక తరుచుగా అనుసరించు టయు, రసార్ణవ సుధాకరము తరుచుగా భేదించుటయు పెద్ద కారణము కాదు. ఒకటి కావ్య లక్షణాదికమును చెప్పు గ్రంథము, రెండవది నాటక లక్షణములను చెప్పునది. అందుచే కొన్ని విషయములలో అనుసరించు టయు, కొన్ని విషయములలో భేదించుటయు ఒకే గ్రంథకర్తకును సాధ్యమే.

ఇక మిగిలినది రీతులలో రెండు గ్రంథములును అవలంబించిన భిన్న విధానము. సంపాదకులు దీనినే తమ సిద్ధాంతమునకు బలవత్కా రణముగా ప్రతిపాదించినారు. స్థూలముగా చూచువారి కట్లే కనిపించును. కాని లోతుగా పరిశీలించినచో దానిలోగూడ బలమేమియు లేదని తేల గలదు. సమాస పదములు లేకుండుట, కొంచె ముండుట, ఎక్కువ యుం డుట, మిశ్రముగా నుండుట ఆధారముగా చేసికొని చమత్కారచన్ద్రిక రీతులను విభజింపగా, రసార్ణవ సుధాకరము కోమల, కఠిన, మిశ్ర అని విభజించినది నిజమే కాని వానిని వివరించుపట్టున రసార్ణవ సుధాకరము లోని ఈ క్రింది శ్లోక భాగములు గమనింప దగినవి.

"తత్ర కోమలా.... సమాసరహితా స్వల్పై
స్సమాసైర్వా విభూషితా.... సా వైదర్భీతి కథ్యతే

"అథ కఠినా: అతి దీర్ఘసమాసయుతా....
కఠినా సా గౌడీయేత్యుక్తా."
"అథ మిశ్రాః యత్రోభయగుణగ్రామ సన్ని
వేశస్తులాధృతః సా మిశ్రా సైవ పాంచాలీ."

ఆ పిమ్మట మిశ్రకు ఉదాహరణ మిచ్చి "అత్రాల్పసమాస, దీర్ఘ సమాసత్వరూపయోః ... ఉభయరీతి ధర్మయోః తులాధృతవతీ సన్నివేశా న్మిశ్రేయంరీతిః" అని సమన్వయము చేసెను.

పై నుదాహరించిన దానినిబట్టి చమత్కారచన్ద్రికలోని మొదటి రెండు రీతులు నిందులో మొదటిదిగాను, మూడు నాలుగు నిందులో రెండు మూడుగాను చెప్పబడినవని తేలుచున్నది. రీతుల విషయములో చమత్కారచన్ద్రిక సంక్షేపముగా చెప్పినదే రసార్ణవసుధాకరములో విస్తరింపబడినది. రెండిటిలోను మూల సూత్రము ఒక్కటియే.

ఆంధ్రదేశములో కొంతకాలమునుండి ప్రభువులు రచించినట్లున్నను వారి యాస్థానకవులో, పండితులో, రచించిరను ప్రథ యున్న గ్రంథముల కర్తృత్వమును నిర్ణయించుటలో విమర్శకులు కొంత దురభిమానముతో ప్రభు కర్తృత్వ పక్షమును బలపరచు చుండుట సర్వ సామాన్యముగా ప్రబలుచున్నది. ప్రభువులు పండితులు కాగూడదనికాని, వారు గ్రంథరచన చేయలేరనిగాని కాదు. ప్రభువులకంటే వారి యాస్థాన విద్వాంసులు ఎక్కువ విద్వత్తుకలవారును, ఎక్కువగా మననముచేసి గ్రంథరచన చేయుటకు ఓపిక, తీరుబాటు కలవారును అనుటకు సందేహములేదు గదా! మహాశిల్పులయు, చిత్రకారులయు పేరులు మనకెన్ని తెలియ వచ్చుచున్నవి? వ్యాస రచితములుగా చలామణి యగుచున్న గ్రంథజాతములో నెన్ని వందలమంది రచనలున్నవి? శంకరుల రచనలని ఎందరు గ్రంథకర్తలు తమ రచనలకు శంకరుల పేరు తగిలించినారు? మన గ్రంథకర్తలకు తమ పేరుకై ప్రాకులాడుట పూర్వము లేదు. ఆస్థాన విద్వాంసులు, కవులు తమ ప్రభువులయెడ నున్న భక్తివలననో, కృతజ్ఞతవలననో, వాత్సల్యము వలననో తమ రచనలకు ప్రభువుల పేర్లు పెట్టి తృప్తి పొందినారు. మన స్ఫూర్తిగా తమ సొత్తును ఇతరుల కిచ్చుట దోషము కానేరదని వారి విశ్వాసము.

రాజుకొండ ప్రభువులకును, కొండవీటి ప్రభువులకును రాజకీయము గానే కాక విద్వత్ప్రతిలో గూడ స్పర్థ స్పష్టముగా కలదు. సింగభూపాలుని పేర రసార్ణవసుధాకరము పుట్టగా, పెదకోమటి వేమారెడ్డి పేర సాహిత్యచింతామణి పుట్టినది.

కాబట్టి సంపాదకులు ఎంత గట్టిగా కాదనినను రసార్ణవసుధాకరము గూడ విశ్వేశ్వర కవిచంద్రుడే రచించెనేమోయను సందేహము తీరునది కాదు. కాబట్టి సంపాదకులు చేసిన సిద్ధాంతము కంటె ఉపక్రమములో చెప్పిన వాక్యములే యుక్తి పహముగను, నిష్పక్ష పాతముగను ఉన్నట్లు సూక్ష్మబుద్ధులకు తోపకమానదు. ఆ వాక్యము లివి:

"Moreover, there is a work called Kandarpasambhava which is referred to in both the works with the remarks మమైవ కన్దర్ప సమ్భవే, the authorshid being claimed by both of them. All this goes to prove that the authorship of the Rasarnava Sudhakara is doubtful and that probably Visvaswara himself wrote the work and gave his patron's name to it." ( P.LVI )

సంపాదకులు ఉపోద్ఘాతాంతమున సాహిత్యశాస్త్రములో చమత్కారచన్ద్రికకు గల స్థానమును యథోచితముగా నిర్ణయించినారు.

గ్రంథ రచనా కాల విషయమున రసార్ణవసుధాకర కర్తృత్వ విషయమునను మా కభిప్రాయ భేద మున్నను,సంపాదకుల ఆంగ్లోపోద్ఘాతము సర్వవిధముల శ్లాఘ్యముగను సంపన్నముగను ఉన్నది.

అపూర్వమైన విలువగల చమత్కారచన్ద్రిక నేటికి మనము పఠించి ఆనందించు భాగ్యము కలిగినది. కాని యిది మన యాంధ్ర లాక్షణికులకు తెలియనిది కాదు. కస్తూరి రంగయకవికృతమైన ఆనందరంగరాట్ఛందము ద్వితీయాశ్వాసములో తొమ్మిది సందర్భములలో చమత్కారచన్ద్రిక ప్రథమ విలాసము నుండి ప్రమాణముగా శ్లోక భాగము లీయబడినవి. అవి గ్రంథాదియందు మగణము, యగణము, రగణము, తగణము, జగ

ణము, నగణము, కావ్యముఖమందుంచు వర్ణములు శుభాశుభములను కలిగించునని, రేఫము నుంచుటకు సంబంధించినవి. ఉదాహృత భాగములు చాల భాగము మన చమత్కారచన్ద్రికలోని పాఠములే. వీనిలో జగణమును గూర్చి యిచ్చిన రెండు భాగములలో మొదటిది మన చ. చం పాఠములో నున్నది. కాని 'పర్ణోపి జగణశ్చైవ బ్రహ్మనామాక్షరేశివః' అను రెండవదిలేదు. నగణమును గూర్చి పాఠమించుక భేదించుచున్నది. "లక్ష్మీ ప్రదోహుతాశనః" అని రేఫమును గూర్చి చెప్పిన భాగము మన చ. చం. లో లేదు. కుంఫిణి ప్రభుత్వ కాలములో ఆ. రం. ఛందము పుట్టినది. అప్పటికి లక్షణవేత్తలకు చమత్కార చంద్రిక ప్రతులు లభించుచుండెడివన్న మాట!

ఆ ఛందోగ్రంథములోనే తరుచుగా 'విశ్వేశ్వర చ్ఛందమునుండి' యని యాంధ్రపద్యములు ఉదాహరింపబడినవి. ఆ విశ్వేశ్వరుడు మన విశ్వేశ్వరుడైనచో నతడు ఆంధ్రములో గూడ లక్షణ గ్రంథము వ్రాసినాడనవలసి వచ్చును. కాక నామసామ్య మాత్రమే యేమో! శ్రీ కా. నా. పంతులుగారు ప్రచురించిన ఆంధ్రవాఙ్మయ సూచికలో విశ్వేశ్వర చ్ఛందము కనపడలేదు.

ముద్రణములో కొలది స్ఖాలిత్యము లున్నను మొత్తముమీద గ్రన్థము నిర్దుష్టముగను అందముగను ముద్రితమై గ్రథితమైనది. ఇట్టి ఉత్తమ గ్రంథముఁ బ్రామాణికముగా సంపాదించి ప్రచురించినందులకు సంపాదకులకుఁ, ఆంధ్రవిశ్వకలాపరిషత్తు వారికిని సాహిత్యాభిమానులందరు ధన్యవాదములర్పింప దగియున్నది.

---

[గ్రంథకర్త: విశ్వేశ్వరకవిచన్ద్రః; సంపాదకులు— డా. పి. శ్రీరామమూర్తి M. A. Ph. D. ప్రకాశకులు: ఆంధ్రాయూనివర్సిటీ, వాల్తేరు. డెమ్మి 1/8 పేజీలు 200 + 60 హాఫ్ కాలికో బైండు. వెల. రు. 15/—లు.]

(భారతి, మే-1970)

రాగాల
రే ఇత

# హరిప్రసాదరాయ స్మృతులు

స్థూలముగా లెక్క వేసినచో గతశతాబ్దములో చివరి ఇరవై సంవత్సరాలూ, ఈ శతాబ్దములో మొదటి ఇరవై సంవత్సరాలూ, కలసిన కాలానికి ఒకానొక విశిష్టస్థాన మున్నది. ఆ కాలములో భారతదేశముతో పాటు ఆంధ్ర దేశము కూడా అంచె లంచెలుగా నవీన యుగములో అడుగు పెట్టసాగినది. అందువల్ల దానిని సంధియుగ మనవచ్చును.

ఆ కాలములో పాండిత్యము పాండిత్యము కొరకే, కవిత్త్వము కవిత్త్వము కొరకే. కళ కళ కొరకే. ఎవరి శాఖలో వారు నిష్ణాతులుగా ఉండడమే వారి ధ్యేయము పండితులలో పండితులకు, కవులలో కవులకు స్పర్థలు, వివాదములు ఉండేవి. ఆ వివాదాలలో వారిలో వారికే గాని ఇతరులకు ప్రత్యక్ష ప్రవేశ ముండేది కాదు. అపండితులు ప్రేక్షకులు, శ్రోతలు మాత్రమే.

పండితులకు, కవులకు, కళాకారులకు వారి వారి శాఖలలో ఉన్న నైపుణ్యాతిశయమును బట్టియేగాని, వారికి లౌకికముగా ఉద్యోగాదులలో గాని, ధనాదులలో గాని ఉన్న అతిశయమును బట్టి గౌరవస్థానము మారేదికాదు. వారిలో తమ విద్యలవల్ల ఎక్కువ ధన సంపాదనము చేసిన వారును అరుదు. వారందరు యదృచ్ఛా లాభసంతుష్టులు. వారి విద్యవల్ల ప్రాప్తించే ధనము మీదకంటె, లభించే యశస్సు మీదనే ఎక్కువగా వారి దృష్టి ప్రసరించేది. అందువల్ల దోషాలకు అతీతులుగా ఉండేవారు.

## 2

అటువంటి కాలములో హరిప్రసాదరావు గుంటూరులో నాటక రంగములో ప్రముఖ పాత్రవహించినారు. ఆయన ప్రధానముగా గుంటూరులో ఫస్టు కంపెనీ హాలులోనే అభినయించేవారు. నా మైనారిటీ తీరకముందు

వారి అభినయము చూచే భాగ్యము కలిగినది. ఆ స్మృతులనుబట్టి నా 70 వ ఏట ఇది వ్రాస్తున్నాను. అప్పటికి ప్రసాదరాయలకు యాభై అరవై యేళ్ళు ఉండవచ్చును.

ఆయన సారంగధర, శాకుంతలము, సునందనీ పరిణయము నాటకములలో నాయక పాత్ర ధరించి ప్రదర్శించినది చూచినది ఇప్పటికీ స్పష్టముగా నా స్మృతిలో నిలిచి ఉన్నది.

వారి మేనల్లుడు భాగవతుల వారి ఇంటివాడూ, నా సహాధ్యాయుడు. అతనికి బులాకి ముక్కుకుట్టి ఉండేది. వారి ఉద్యోగము జిల్లాకోర్టులో కాపీయిస్టు పని. అప్పట్లో కాపీయిస్టులకు ప్రతిఫలము నెల జీతముగా కాక వ్రాసిన కాపీలనుబట్టి ఉండేది. రైలుపేటలో నా మిత్రులను చూడ బోయినప్పుడు ఆ పేటలో వారి చిన్న యింటిముందు అతిసామాన్యుడుగా కూర్చుండి యుండుట పలుమారు చూచినాను.

అయితేనేమి? ఆయన రంగభూమిలో నిలిచినప్పుడు సాటిలేని రాజు. ఆయన పాత్రను అభినయమును చూచి రాజులనెన్నడు చూచి యుండని మాబోంట్లము రాజులంటే అట్లాగే ఉంటారనీ, ఉండేవారనీ ఊహ చేసేవారము. ఆయన వేషములో, కదలికలో, మాటలలో రాజఠీవి ఉట్టిపడుతూ ఉండేది. శృంగారము, కరుణ, వీరము ప్రదర్శించుటలో ఆయన కాయనయే సాటి!

అన్ని నాటకములలో ఆయనదే నాయక పాత్ర. నాయికా పాత్ర కోపల్లె హనుమంతరావుది. బలిజేపల్లి లక్ష్మీకాంత కవిది సాధారణముగా మంత్రి స్థానమైన పాత్ర. ఆయనకు ఆహార్యము మీద ఎక్కువ శ్రద్ధ ఉండేదికాదు. రంగస్థలము మీద చూచిన లక్ష్మీకాంత కవికి బయట సాధారణముగా చూచే లక్ష్మీకాంత కవికి వేషములో ఎక్కువ భేదము కనిపించేదికాదు. దానికి తోడు ఆయన కంఠము నిండైనదికాదు. అందువల్ల నాయికా నాయకులే రంగస్థలములో నిండి ఉండేవారు.

ఆనాటి ప్రధాన నటీనటులకు తాము పలుకవలసిన వచనభాగాలు, పద్యాలు కరతలామలకములుగా ఉండేవి. మరపువల్ల గాని-మరే ఇతర

కారణాలవల్ల గాని-తడబాటు ఉండేదికాదు. హరిప్రసాదరావుకు ప్రతి పదము స్పష్టముగా వాచోవిధేయముగా ఉండేది.

ఆయనది బాగా స్థూలమైన కాయము. నశ్యము బాగాపేల్చే దురభ్యాసము ఒక్కటి మాత్రమే ఉండేది. దానివల్ల ఆయన వాచికము--వచనముగాని పద్యముగాని - అనునాసిక స్పర్శతో ఉండేది. సంగీత శాస్త్ర లాక్షణికులు గాత్రములో అనునాసిక స్పర్శ విధించి యున్నారు గనుక అది లోపమనుట ఒప్పదు. వినువారికి లోపముగా భాసించేది కాదు.

వాచికములో విస్పష్టత, నిర్దుష్టత, ఉచ్చారణ సౌలభ్యము, ఔచిత్యము, అప్రమాదము ఆయనలో మూర్తీభవించినవి. అప్పటికే నాటకరంగములో సంగీతము స్థాన మేర్పరచుకొన్నది. హరిప్రసాద రాయల పద్యపఠనము సుఖముగా, రాగయుక్తముగా చక్కగా ఉండేది. కాని సంగీతము సాహిత్యాన్ని ఏమాత్రము మ్రింగేది కాదు. మధ్యలో గాని చివరిలోగాని రాగాన్ని సాగదీయడ ముండేది కాదు. సంగీత సాహిత్యాలు రెండు సమపాళ్ళలో ఉండి పరస్పరము శోభాకరములుగా ఉండేవి.

రంగస్థలము బయట అక్కడక్కడ కొందరు ఇతర నటులను విమర్శిస్తూ, "ఈ యీడులో హరిప్రసాదరావు సారంగధర పాత్ర వేయ కుండా ఉంటే బాగుంటుంది" అన్న విమర్శలు నా చెవిని పడకపోలేదు. అయినా రంగస్థలము మీద ఆయన సారంగధర పాత్ర నటిస్తూ ఉండగా ప్రేక్షకులంతా ఆయన అభిప్రాయాన్ని మెచ్చుకొనడమే చూచినాను గాని ఈషణ్మాత్రమైనా, రేఖామాత్రంగానైనా, అసంతృప్తి పడడ మెన్నడూ చూడలేదు. ఆయన సమర్థత అట్టిది. ప్రేక్షకులు కూడా ఆనాడు సహృదయులు!

## 3

వారి చరమదశలో సొంతముగానో, కొందరితో కలసియో, నాటక సమాజ మొకటి స్థాపించినారు. దాని ప్రదర్శనము గుంటూరు సెకండు కంపెనీ హాలులో ఒకటి చూచిన జ్ఞాపక మున్నది. కొత్తగా మెరిసే

రంగులతో హనుమంతుని చిత్రమున్న తెరతయారు చేయించినారు. ఆ తెర మొదటిసారి ప్రదర్శించి నప్పుడు ప్రేక్షకులు ఒక్క పెట్టున ఆనంద తన్మయులై చప్పట్లు కొట్టిన ధ్వని ఇప్పటికి నా చెవులలో ప్రతిధ్వనిస్తు న్నది. గదాపాణియైన ఆ హనుమానుని చిత్రము కూడా కన్నుల కట్టినట్లు ఉన్నది. అప్పుడు ప్రసాదరాయల ప్రక్కన నాయికా పాత్రను కోవల్లె హనుమంతరావు కాక ఆరణి సత్యనారాయణ అనే యువకుడు వేయసాగి నాడు. నా కంటె ఒకటి రెండేళ్ళు పెద్దయైన నా కవి మిత్రుడు కీ. శే. చామర్తి రాజశేఖరరావు ఆ సమాజములో చేరి ఉత్సాహాతిశయముతో చిన్న పాత్రలు ధరించుచుండెను. హరి ప్రసాదరావుగారు యువకుడైన సత్యనారాయణ సమర్థతను గూర్చి నిష్కల్మషముగా ప్రశంస చేయుట విని నా మిత్రుడు చెప్పినది గుర్తున్నది. అది ఆయన సౌజన్యమును ప్రకటించును.

ఆ నాటకసమాజము గుంటూరులోనే కాక సత్తెనపల్లి మొదలైన ఇతర ప్రదేశాలలో కూడా ప్రదర్శన లిచ్చింది. కాని ధనరూపముగా ఆ సమాజము లాభములు గడించినట్లు తోచదు. దానిని త్వరలో ఎత్తివేసినారు.

పెద్ద ఎత్తున పెట్టుబడులతో. ఆకర్షకమైన ఆహార్యనిర్వహణాదు లతో, ప్రచారముతో, అశేష జనాన్ని విపరీతముగా ఆకర్షింప సాగిన నాటక సంస్థలు ప్రారంభమైనవి. అట్టి వానిలో చేరుటకు ఆయన ఉబ లాట పడలేదు. అప్పటికి ఆయన బాగా వృద్ధుడైనందున వానిలో ఆయ నకు ప్రముఖపాత్ర ఉండదని కూడా గుర్తించి ఉండవలె!

రంగ ప్రదర్శనమువల్ల యశస్సే కాని ధనాది కేతర లాభాలు ఆశింపక హరి ప్రసాదరావు తుదివరకు తన జీవితమును ఉత్తమనటనకే అంకితము చేసికొని యశఃకాయుడైనాడు. ఆంధ్రదేశములో నాట్యకళా రాధనమే ధ్యేయముగా పెట్టుకొని జీవితము వెళ్ళనిచ్చిన ధన్యజీవులలో నిస్సందేహముగా హరి ప్రసాదరావు అగ్యగణ్యుడు.

(నాట్యకళ, అక్టోబరు–1969)

# ఆముక్తమాల్యద-కర్తృత్వనిర్ణయము

ఆముక్తమాల్యదను రచించినది శ్రీ కృష్ణదేవరాయలా, పెద్దనయా, మరియొకరా అను వివాదముతో ఆంధ్ర విమర్శకలోకము బహుకాలము నుండి తర్జనభర్జనలు చేయుచున్నది. మరల దానినే పునరుక్తము చేయుటకు దీని నుపక్రమించుటలేదు. వెనుకటి వివాదము లన్నియు నప్పటికున్న ఆధారములమీద నిటు నటు నడచినవి. కాని అందులో జాంబవతీ పరిణయము ప్రస్తావనకు రాలేదు. తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయములో దాని వ్రాతప్రతి కలదని చెప్పినవారేకాని దాని వివరము లీ వివాదములోనికి తెచ్చినవారు లేరు. అదృష్టవశమున నిటీవల శ్రీ కృష్ణదేవరాయ విరచితమగు జాంబవతీపరిణయమును ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు డా. బి. రామరాజుగారి సంపాదకత్వమున ప్రచురించినారు గనుక దాని నిప్పుడు సాహిత్యాభిమానులు పరిశీలించు నవకాశము లభించినది. రాయలు రచించినా రను సంస్కృత గ్రంథములలో ఇది తప్ప మరేదియు ఎక్కడను ఉన్న జాడ మన కింతవరకూ లభింపలేదు. ఇప్పుడీ సంస్కృత నాటకము నాధారము చేసికొని సత్యనిరతులగు విమర్శకులు మరియొకమారు ఆముక్తమాల్యదా కర్తృత్వమును గూర్చి విచారణ చేయుట యవసరమగుచున్నది.

## 2

భరత ఖండములో స్థపతులు, శిల్పులు, చిత్రకారులు అద్భుతములైన భవనములు నిర్మించి, విగ్రహములు భాస్కరించి, చిత్ర రచనలు చేసినారు. వారి పేరులు మాత్రమెవరివో నూటికి కోటి కొకటి తప్ప మన కిప్పుడు తెలియరాకున్నది. వారి ప్రధానాదర్శము ఉత్తమ కళాసృష్టి చేయుటే కాని వానితో పాటు తమ నామము నిలుచుటకాదు. ప్రాచీన కాలము నుండి లలిత కళలు మహోజ్జ్వలముగా విలసిల్లిన చీనా, జపానువంటి ప్రాచ్య

దేశములలో నట్లు కాక శిల్పులయు, చిత్రకారులయు నామములు ప్రసిద్ధముగా తెలియవచ్చుచున్నవి. పాశ్చాత్య దేశముల సంగతి చెప్పనే అక్కర లేదు.

శిల్పాదులందేకాక మన దేశములో కావ్యనిర్మాణ మందు గూడ కావ్యకర్తలకు తమ రచనలు నిలువవలెననే ఉద్దేశమేకాని వానితో తమ పేరులు శాశ్వతములు కావలెనను కోరిక విశేష మున్నట్లు తోపదు. వేదర్షులు మంత్రద్రష్టలుగా భావింపబడుచున్నారుగాని మంత్రకర్తలుగా కాదు. ఇప్పుడు వాల్మీకములో షుమారు 24000 శ్లోకము లున్నవి కాని వాల్మీకి రచించినవి 8,000 మాత్రమే యని పరిశోధకుల యభిప్రాయము, అది సత్యమైనచో, అందులో, 16000 శ్లోకములు రచించిన కవులు తమ పేరు కొరకు శ్రద్ధ వహింపలేదని స్పష్టపడుచున్నది.

ఇక మహాభారత మున్నది. దాని కర్త వ్యాసుడని ప్రసిద్ధి. వ్యాస శబ్దమునకే కూర్పరి, సంపాదకుడు అను పర్థమున్నది. మూలగ్రంథము 24000 కాగా నది నేడు 1,25,000 గ్రంథముగా విస్తరించినది. ఇట్లు ప్రక్షిప్తములైన భాగము లెన్నో అద్భుతమైన కావ్య భాగములు. ఆ మహాకవులందరు వ్యాస నామములో నంతర్హితులైనారు. ఇక మహా పురాణములును, ఉపపురాణములును శతాబ్దములపాటు పెరిగిపోయినవి. అవి రచించిన వారిలో మహాకవులే కాక కుకవులును ఉన్నారు. వారందరు వ్యాస నామములో అంతర్హితులైనారు.

ఉపనిషత్తులకు గూడా విట్టి యవస్థయే సంభవించినది. నేడు మనకు ఉపలభ్యమగుచున్న ఉపనిషత్తులన్నియు అనాదిగా ఉన్నవికావు. వానిలో పది పండ్రెంటిని మాత్రమే త్రిమతాచార్యులు ప్రమాణముగా గ్రహించిరి, తక్కిన వానిని ఎవరి యభిమానము కొలది వారు కొన్నిటిని ప్రమాణీకరించుచున్నారు. ఆ ఉపనిషత్తులలో పెక్కింటిలో ఉత్తమమైన ఉపాసనలు, భావనలు, కలవనుటకు సందేహము లేదు. ఆఉపనిషత్కర్త లందరు వేదర్షి నామములలో లీనమైనారు అక్బరు పాదుషా కాలములో అల్లోపనిషత్తు పుట్టినది. దానికి ఋషినామము కనపడలేదు.

భాస కాళిదాసుల కాలముల నాటికే కావ్యము కవికి యశస్సు కలిగించునను భావము వ్యాపించినది. ఐనను నేడు భాస నాటక చక్రమను పేర ప్రచారములోనున్న రూపకముల కర్త ఎవరో సందేహాస్పదముగానే ఉన్నది. మహాకవి కాళిదాసుది సొంత పేరా, బిరుదమా అనునది సందేహ విషయమే. శ్రీ శంకర భగవత్పాదుల పేర ఎందరెందరు కవులు గ్రంథ కర్తలు తమ రచనలు చెలామణి చేసినారో ఆ భగవంతునికే ఎరుక ! 14 వ శతాబ్దమువారైన శ్రీ విద్యారణ్యుల పేర ఇప్పటికి రెండు శతాబ్దముల క్రిందటివరకు గ్రంథ జాతము పుట్టుచుండినట్లు తెలియుచున్నది.

పూర్వ లాక్షణికులు కావ్య ప్రయోజనములలో ధనము కూడ చేర్చి అందుకు ఉదాహరణముగా 'శ్రీ హర్షాదులవలన ధావకాదులు ధనము పొందినట్లుగా' అని చెప్పియున్నారు. కాని అట్టి ధనాపేక్ష కూడ లేకుండా తమ రచనలను ఇతరుల పేర్లతో ప్రచారము చేసిన గ్రంథకర్తలు మన దేశములో శతములుగను, సహస్రములుకను, ఉన్నారని మనము గుర్తించుకొనవలెను. కవులు తమ గ్రంథములను ఇతరుల పేర పెట్టిరా యను విషయము విచారించునప్పుడు మన దేశములో అనూదానముగా వేద మంత్రద్రష్టలవద్ద నుండి నేటివరకు వచ్చుచున్న సంప్రదాయమును గూడ మనస్సులో నుంచుకొనుట యవసరము !

## 3

ఆంధ్రులు రచించిన సంస్కృత గ్రంథముల కర్తృత్వమును గూర్చిన వివాదములను వదలి ఆంధ్ర గ్రంథములను గూర్చిన వివాదములనే గ్రహించినచో వానిలో ముఖ్యమైనవి ఇవి :

1. నన్నయ భారతమును రచించెనా ? రాజరాజ నరేంద్రుడే రచించెనా? రాజరాజనరేంద్రుడే రచించెనని డా॥ చిలుకూరి నారాయణ రావుగారి వాదము.

2. ఆరణ్య పర్వ శేషములో ఎఱ్ఱయ శిథిల భాగములు పూరించెనా, రచనచేసెనా?

3. రంగనాథ రామాయణమును రచించినది గోన బుద్ధారెడ్డియా, రంగనాథుడా?

4. భాస్కర రామాయణము రచించినది మంత్రి భాస్కరుడా, హుళక్కి భాస్కరాదులా?

5. క్రీడాభిరామము రచించినది వల్లభరాయడా, శ్రీ నాథుడా?

6. భాగవత భాగములు ఎంతవరకు స్వతంత్రములు, ఎంతవరకు శిథిల పూరణములు?

7. ఆముక్తమాల్యద రచించినది శ్రీకృష్ణదేవరాయలా, పెద్దనయా, మరియొకరా?

8. ఉత్తర రామాయణము రచించినది కంకంటి పాపరాజా, అతని మిత్రుడు పుష్పగిరి తిమ్మనయా?

9. బిల్హణీయము రచించిన దెవరు?

పై తొమ్మిదింటిలో నన్నయ భారతము రాజరాజ నరేంద్రుడే వ్రాసినాడన్న వాదమును విమర్శకులు పట్టించుకొనక చిరునవ్వుతో వదలివేసినారు. బిల్హణీయములోని చక్రబంధమువలన అసలు గ్రంథకర్త నామమును ఉద్ధరించినారు. తక్కిన ఏడు గ్రంథముల విషయము వివాదములును ఏడు రావణ కాష్ఠములుగానే కొనసాగుచున్నవి.

కాని ఆ వివాదములు సాగుచున్న తీరులో ఎంతో భేదమున్నది. రంగనాథ రామాయణ ఆముక్తమాల్యదల కర్తృత్వ విషయములో ప్రభు కర్తృత్వ పక్షమువారు పరపక్షమువారిని కొంతవరకు అసభ్యముగా కూడ అనదగినట్లు నిందించుచుండుట విశేషము. తక్కిన వాదములలో ఎంత తీవ్రత ఉన్నను, జుగుప్సాకరమైన నిందలకు దిగలేదు. పూర్వ ప్రభువులను వా రాదరించిన కవులను చిన్నచూపుతో చూచే ఈ కాలములో, మరి యా యిద్దరు ప్రభువుల మీదను కొందరు చూపే దురభిమానమునకు మూలకారణమేమో బుద్ధిమంతులకు ఊహింప సాధ్యము కాకున్నది. సత్యాసత్య విచారణకు అతీతమైన కారణమేదో ఉండదగును. ఆ ప్రభువుల పక్షము వాదించు వారి నిప్పుడా ప్రభువులు ధనాదిక సమ్మానము చేయలేరుగదా!

ప్రస్తుతము రంగనాథ రామాయణ కర్తృత్వ వివాదమును వదలి ఆముక్తమాల్యదా కర్తృత్వ వివాదములనే పరిశీలింతము.

# 4

పై మాటలకు ఉదాహరణముగా ఆముక్తమాల్యదను రాయలే వ్రాసిరని సమర్థించిన వారిలో నిద్దరి మాటలే ఉదాహరింతుము. అందులో ఒకరు యువకులుగా నున్నప్పుడు వ్రాసిన మాటలు. రెండవ వారు పెద్దలు, లబ్ధప్రతిష్ఠులు, నేడు కీర్తిమాత్ర శేషులు.

మొదటివారు శ్రీ వెల్లండ ప్రభాకరామాత్యులు. వారు ఆముక్తమాల్యద అను గ్రంథము 1945 లోను మరల 1958 లోను ప్రచురించినారు. రెండవ ముద్రణమునుండి కొన్ని భాగములు ఉదాహరించు చున్నాము.

"ఈ గ్రంథమున కొక గ్రహచారము పట్టినది. కృష్ణరాయలీ గ్రంథమును రచించినను వ్రాయలేదని.... ఇట్టి యసందర్భ ప్రలాపములను లేవదీయుటకు కారకులైన ప్రాజ్ఞుల యాదర్శ మేమిటో తెలియ రాకున్నది. ఇవి వారి యభూత కల్పనలై యుండును. ఇట్టి యభాండములు వేయుట ప్రాజ్ఞుల లక్షణము కాదు. ఇట్టి యభాండములు, నసంబద్ధ ప్రలాపములు నాధునికి సాహిత్య యుగమున విమర్శనలు బయలుదేరిన పిదప పెక్కు బయల్వెడలినవి. బాణుడుల్లేఖించిన విధమున ప్రతి గృహము నపరిణత విజ్ఞానము, ప్రతిభావ్యుత్పన్నతలు గల కవులు విమర్శకులు "శ్వాన ఇవ సంతి గృహే గృహే" యున్నప్పుడిట్టివి రాకతప్పదు. (పేజీలు 20_21)

వారి మాటల సారాంశము అచ్చ తెలుగులో అనువాదము చేసినచో, రాయల కర్తృత్వమును కాదనువారు కుక్కలవంటి వారన్నమాట. శ్రీ వెల్లండను గూర్చి వారి గురువులు శ్రీ కురుగంటి సీతారామయ్యగారు "పిన్నవాడగుటచేతను, అనుభవము తక్కువ యగుటచే ననేక శబ్దార్థ దోషములు దొరలినవి. బాల్య చాపల్యమును, గ్రంథకర్త కావలెనను ఔత్సుక్యమును గ్రంథముద్రణమునకు పురికొల్పినవి. సహృదయులు

దోసగులను పాటింపక గుణలేశములనే పాటించి చిరంజీవి నాశీర్వదింప వలెనని వేడుచున్నాను" అని వ్రాసిన దానిని గౌరవించి రాయల కర్తృత్వము కాదన్నవారు వట్టి కుక్కలుకారు, కాలభైరవునివలె జగన్మాన్యులని అన్వయింతము. మరి డా. చిలుకూరి నారాయణరావు స్థవిరులుగదా! "ఆముక్త మాల్యద కర్త కృష్ణరాయడే" అని వారు వ్రాసిన వ్యాసములో ఏమనిరో విందాము. అది 1941లో భారతి సంపుటి. 18 సంచిక. 5లో మొదట వెలుపడినది. ఈమధ్య డా. జి. వి. సుబ్రహ్మణ్యంగారి సంపాదకత్వమున సారస్వత వ్యాసములు (ప్ర. సం.) అను పేర ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీ వారు ప్రచురించిన మంచివ్యాసముల సంపుటిలో పునర్ముద్రితమైనది. దానివల్ల దాని విలువ యినుమడించినది. ఆ సంపుటిలోనుండి ఉదాహరిస్తున్నాము.

"ఆముక్త మాల్యదా కర్తృత్వమును గురించి సందేహము లెందుకు కలుగుతవో నాకు బోధపడకుండా ఉన్నది. "నేను వ్రాసినానయ్యా!" అని కృష్ణరాయలు నోరు విడిచి చెప్పుకుంటూ ఉండగా, "ఛా! ఊరుకో! నీవు ఎక్కడ, ఎప్పుడు, ఎందుకు, ఏ సందర్భములో వ్రాసినావు? నీవు యుద్ధాలేచేస్తావా ? రాజ్యాలే ఏలుతావా?....కావ్యాలు వ్రాయడానికి నీకు తీరిక ఎక్కడఉంది? అసలు నీవేమి చదువుకొన్నావు?" అని అతనిని నిలబెట్టి సాగదీసి అడగడమేమి బాగుంటుంది? అతని పరోక్షములో, అతని సమకాలికుల పరోక్షములో ఇటువంటి ప్రశ్నలు వేస్తున్నారు గనక సరిపోతున్నదిగాని?—" [పే. 206]

చివరి ప్రశ్నకు తర్వాత నున్న డాషుకు అర్థము బహుశః అప్పాజీకి అంత్యకాలములో జరిపిన శాస్తియే అధమ పక్షము అట్టి వారికి జరిగి ఉండెడిదని భావము కావచ్చును. నన్నెచోడుని కుమార సంభవములోని

"మును మార్గ కవిత లోకం
బున వెలయఁగ దేశి కవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయం
బునఁ జనఁ జాళుక్యరాజు మొదలుగఁ బలువుర్"

అను పద్య మొక్కటి ఆధారము చేసికొని ఆంధ్ర భారతము వ్రాసినది నన్నయకాదు, రాజరాజ నరేంద్రుడే యని ఈ శ్రీ నారాయణరావుగారే నిశ్చయించి తమ రాజభక్తి ప్రకటించిరని మనము ఈ సందర్భములో గుర్తుంచుకొనవలెను. ఆ వ్యాసములో మరికొన్ని భాగాలు చూతము.

"కవి ననుకొని అప్పకవినని పేరు పెట్టుకొన్న అప్పన్న వ్రాసిన తప్పుడు వ్రాత నాధారముగా చేసుకొని ఇటీవలివారు ఆముక్తమాల్యదను పెద్దన్నకు తగిలిస్తే నిలుస్తుందా? ఆముక్తమాల్యద వంటి ప్రబంధమును వ్రాయడానికి మెరుగుల మేనత్త పని చేసిన పెద్దన్నవంటి వాడెన్నాళ్ళు తపస్సు చేయవలెను? పెద్దన్న కవిత్వాని కా కటుత్వమూలేదు, ఆ పటుత్వమూ లేదు. అతని కా పాండిత్యమూలేదు.... ఆ లోకానుభవమూ లేదు.... ఆ వినయ సంపదా లేదు. అల్లసానివా డల్లా ఇల్లా అల్లుకుపోయి నాడు........" [పే. 206,207]

మూడు వందల సంవత్సరాల పైకాలము నుండి ఆంధ్ర భాషలో పండితులకు, కవులకు భిక్షపెట్టిన ఆ ఛాందస బ్రాహ్మణుడైన అప్పకవిని నేటి విమర్శకులు దూషించుట పరిపాటి యయినది. అయనేకాక రాయల చేత ఆంధ్ర కవితా పితామహుడని సంబోధింపబడుచు, నిండు పేరోలగములో ఆయన చేతనే కవి గండ పేండేరమునకు తగుదువని పాదమున తొడిగించుకొన్న పెద్దన కూడ శ్రీ నారాయణరావుగారి చీవాట్లు తినవలసి వచ్చినది. వారేకాదు ఈ కాలపు పండితులుకూడ వారిచేత మాట పడవలసి వచ్చినది.

"పులిమీద పుట్ర అన్నట్టు ఇప్పుడు జగద్గురువు లొకరు బయలుదేరినారు. ఆముక్తను కృష్ణరాయుడూ వ్రాయలేదట, పెద్దన్నా వ్రాయలేదట! ఎవడో అనామధేయ సాత్తాని వైష్ణవుడు వ్రాసినాడట! ఏమి విడ్డూరము! ఆ పేరులేని సాత్తాని వైష్ణవునికి విశిష్టా ద్వైత సంప్రదాయమంత సమగ్రముగా ఎక్కడ పట్టుపడివదో! ....సంస్కృతాంధ్రముల యందంతటి కూలంకష పాండిత్య మెట్లబ్బినదో!....పిచ్చి మాటలు!....

"........కృష్ణుని సార్వభౌమునిగా దిద్ది తీర్పనెంచి కృతకృత్యుడైన అప్పాజీ అతడు కవి సార్వభౌము డౌతేనేకాని అతని సార్వభౌమత్వానికి వన్నెరాదని ఊహించుకుంటాడా?" [పే. 207]

పిచ్చి మాట లెవరివి? గత శతాబ్దములో సంస్కృతాంధ్ర పండితులలో అగ్రస్థానము వహించి సూరి బిరుదము పొందిన చిన్నయసూరి సాత్తాని (చాత్తాద) వైష్ణవుడని వ్యాసకర్త మరచినారా? చాత్తాద వైష్ణవులది కూడ విశిష్టాద్వైత సంప్రదాయమే. ఈ విషయము జగద్గురువులకే తెలియదగునుగాని శ్రీ నారాయణరావుగారికి కాదు. చాత్తాద వైష్ణవశాఖలో నేటికిని శిష్టాచార మలంబించువారు పలువురున్నారు.

ఆ జగద్గురువుల వారెవరో ఏమనిరో అనుమాన ప్రమాణముచేత తప్ప మనకు ప్రత్యక్షముగా నిప్పుడు తెలియదు. వారెట్టి వ్యాసమును రచించిపట్లు లేదు. వారు బహుశః వైఖానస వైష్ణవుడు ఆముక్తమాల్యద రచించి యుండునని చెప్పి యుందురు. వైఖానసులే శ్రీకాకుళములో ఆంధ్ర విష్ణువు ఆలయములో అర్చకులు. వైఖానసులకును ఊర్ధ్వపుండ్ర ముండునేకాని శ్రీవైష్ణవుల పుండ్రమువంటిది కాదు. వారికి తప్తచక్రాంకణము నిషిద్ధము. వారి పూజా విధానములు, వారి యాచార వ్యవహారములు భిన్నములు. వారికి ద్రావిడ వేదమందుగాని ప్రామాణ్యములేదు. వారు స్మార్తులకే ఎక్కువ సన్నిహితులు. ఆముక్తములోని శ్రీ వైష్ణవ సంప్రదాయమును గూర్చి ముందు కొంత విపులములుగా విచారింతుము. ప్రస్తుతమునకు అందులోని గోదా విరహ వర్ణనములో "నాచ్చియార్ తిరుమొళి" యని ప్రసిద్ధమైన స్తుతి, స్వయముగా గోదాదేవి అరవములో చేసిన స్తుతిలోని వాక్యములయు, విరహవేదనయు స్పర్శకూడా ఆముక్తమాల్యదతో లేకుండుట విజ్ఞులకు వింతగా తోవక మానదు. ఆముక్తకర్తకు దాని స్వరూపమైన తెలియునా యను సందేహము కూడా కలుగును.

సార్వభౌమత్వానికి 'కవి సార్వభౌముడౌ తేనే' కాని వన్నెరాదా? షట్చక్రవర్తులుగా పురాణ ప్రసిద్ధులైన వారెవరూ కవులుగాని కవిసార్వభౌములుకాని కాదు గదా! మరి రాయలకే అది యవసరమైనదా? ఏమి మాటలవి?

## 5

ఏ విషయమైనను విచారణ చేయునపుడు వాద బలము చూచుకొనవలెను. పరవాదము ఖండింపక దూషణమునకు దిగుచో మన వాదమే

దుర్బలమని బుద్ధిమంతులకు తోచును. కాబట్టి ఆముక్తమాల్యద కర్తృత్వము రాయలదే యని సమర్థించు వారికిని, కాదనువారికిని గల ముఖ్యాధారములను శాంతముగా విచారింతము. ఉభయ పక్షముల వారికిని రాయలయందు హిందూరాజ్యరమాధురంధరుడుగా, మహా వీరుడుగా, కవి పండిత కళా పోషకుడుగా విశేష గౌరవము కలదనియే గ్రహింపవలెను. అట్టి వాడు తప్పక పండితుడై యుండును. కవియు గావచ్చును. "కవిత్వపు పిచ్చి" యున్నవారు ఎంత కార్యాంతరవ్యగ్రులైనను కావ్యరచన చేయకుండ నుండరనుట అనుభవైకవేద్యము. ఇప్పుడు ఉభయ వాదములను ప్రదర్శింతుము.

రాయలే ఆముక్త కర్త యనువారి యుక్తులివి :

1. అన్ని వ్రాత ప్రతులలోను ఆముక్తమాల్యద కృష్ణరాయ ప్రణీతముగానే ఉన్నది.

2. గ్రంథములోనున్న ఏడాశ్వాసములలో (కొందరి మతమున ఆరాశ్వాసములే) చివర "క ష్ణ రా య మ హి భృ న్నా మా స్మ దా ము క్త మా ల్య ద" అని యిత్యాదిగా రాయలు తానే గ్రంథ రచన చేసితినని కంఠోక్తిగా చెప్పికొనెను.

3. అవతారికాభాగములో రాయలు తాను కళింగ విజిగీషా మనీషన్ దండెత్తిపోయి శ్రీకాకుళ నికేతనుండగు నాంధ్రమధుమథను సేవింపం బోయి హరివాసోపవాసంబు గావింపగా ఆరాత్రి చతుర్థయామమున కలలో స్వామి ప్రత్యక్షమై 'నీ వెన్నో సంస్కృత గ్రంథములు రచించితివి. ఆంధ్రములో ప్రియావరిభుక్త భాక్కథను ఇష్ట దైవమైన వేంకటపతి కంకితముగా చెప్పు' మనుటయు, మరునాడు విద్వజ్జనులా వృత్తాంతము విని శుభ పరంపర కలుగునని యగ్గించి కావ్య రచనకు ప్రోత్సహింపగా 'ప్రహృష్టాంతరంగుడై వేంకటాచలపతికి నా విన్నవిపంబూను నాముక్తమాల్యదా మహా ప్రబంధమునకు కథా క్రమం బెట్టిదనిన' ఇత్యాదిగా తెలిపి యుపక్రమించి నట్లున్నది.

4. ఇందలి చతుర్థాశ్వాసములో యామునాచార్యుడు కుమారున కుపదేశించిన రాజనీతి రాయ రాజ్యములో పాలింపబడుచున్న రాజనీతియే.

5. ఆముక్తలో విపులముగా వర్ణితమైన చేపవేపుడువంటి వర్ణన పెద్దనవంటి బ్రాహ్మణుడు చేయునా ?

6. రాయలు వైష్ణవుడు, వైష్ణవాచారములు వైష్ణవ మత రహస్యములు నెరిగినవాడు. అది ఆముక్తమాల్యదలో నిక్షేపించినాడు.

7. పెద్దన మనుచరిత్రములోని శైలికి, ఆముక్తమాల్యద శైలికి ఎంతో తారతమ్యమున్నది

పైని చెప్పిన కారణములలో 1, 3 కారణములు శ్రీకృష్ణదేవరాయలే రచించెననుటకు బలవత్తర కారణము లనుట కెట్టి సందేహమును లేదు. 4, 5, 6 కారణము లంత పాటింపదగినవి కావు. 7 వది శైలికి సంబంధించిన దగుటచే కొంత విచారింప దగినది. ఏడు ఆశ్వాసాంత పద్యములును లభించినవి. వ్రాతప్రతులలో వాని వరుస భేదించుచున్నదని డా. నేలటూరి వెంకటరమణయ్యగారు భారతి వికృతి జ్యేష్ఠ సంచికలో 'రాయలకళింగ జైత్రయాత్ర' అను వ్యాసమున కనుబంధములో వివరముగా నా భేదము లెట్లున్నవో 13 వ్రాత ప్రతులనుండి విశేషము లిచ్చినారు. ఆంధ్రకవుల యాచారము గద్యములో గ్రంథకర్త పేరుండుట. దానిని వదలి పద్యములో గ్రంథ కర్తృత్వము చెప్పుట క్రొత్త. ఇందులో శ్రీహర్షుని నైషదీయ చరితము పద్ధతి నవలంబించి యుండవచ్చును. శ్రీహర్షుడు నైషధ సర్గాంత శ్లోకములలో మొదటి రెండు పాదములు నొకేవిధముగా నుంచి చివరి రెండు పాదములలో చిన్న మార్పులు చేసినాడు. కాని ఆముక్తలో రాయల దిగ్విజయములు కొంతవరకు నొక వరుసలో వేరువేరుగా ఉదాహరింపబడినవి. 7 పద్యములలో ఐదింటి యందు 'కృష్ణరాయ మహిభృన్నామాస్మదాముక్త మాల్యదన్, కృష్ణరాయ నృప సంజ్ఞాస్మత్కృతాముక్త మాల్యదన్, కృష్ణరాయనృప సంజ్ఞాన్మ త్కృతాముక్త మాల్యదన్, కృష్ణ

మహిభృత్సంజ్ఞాస్మ దాముక్తమాల్యదన్, కృష్ణరాయ మహిభృత్సం జ్ఞాస్మదాముక్తమాల్యదన్' — అని 2 - 6 అశ్వాసాంతములందును, ప్రథమాశ్వాసాంతమందు 'కృష్ణరాయ వసుధాధ్యక్షోదితాముక్తమాల్యదన్' అనియు, సప్తమాశ్వాసాంతమందు 'కృష్ణరాయ మహిజాన్యత్వాదితాముక్తమాల్యదన్' అనియు, ఒత్తి ఒత్తి నాది నాది యని ఐదు మార్లు చెప్పుటయే ఆయన కర్తృత్వమునకు సందేహ మాపాదించునదిగా నున్నది. సందేహించు వారికి 'సంజ్ఞా' శబ్దము మూడు మారులు వచ్చుట సంకేతార్థమునే సూచించునేమో యని సందేహమును బలపరచునదిగా నున్నది.

ఏమైనను రాయలు రచింపలేదనువారు 1, 3 కారణములను కాదనుటకు బలవత్తర కారణములు చూపవలసియున్నది. లేనిచో ప్రతి కవి కావ్యకర్తృత్వమును గూర్చియు సంశయింపవలసిన అవ్యవస్థ ఏర్పడును.

## 6

ఇప్పుడు ఆముక్తమాల్యద రచించినది పెద్దనయేగాని రాయలు కాదనువారు ప్రదర్శించు కారణములు విచారింతము. అవి యివి :

1. రాయల యష్ట దిగ్గజ కవులలో నొకడగు తెనాలి రామకృష్ణకవి చెప్పినట్లు రెండు చాటు పద్యములు ప్రచారములో నున్నవి. ఆ రెండును పెద్దనయే ఆముక్తమాల్యద రచించినట్లు స్పష్టపరచుచున్నవి. ఒక దానిలో,

"దాని తల్లిగ నల్లసాని పెద్దన తెల్పె
ముది మది దప్పి యాముక్తమాల్య(న్)" అని యున్నది.

2. కొద్ది కాలము తర్వాతివాడైన అప్పకవి ఈ గ్రంథమునుండి యుదాహరించుచు 'ఆంధ్ర కవితా పితామహుని విష్ణుచిత్తీయమునుండి' యని వ్రాసెను.

3 అహోబల పండితుడు గూడ తన కవి శిరోభూషణమున "అల్లసాని పెద్దన కవినా ఆముక్తమాల్యదాయామ్" అని 'అద్దా వాగ్విబుధమ్' ఇత్యాది పద్యము నుదాహరించెను.

4. ఆముక్తమాల్యదకు పూర్వకాలమున వ్యాఖ్యానములు రచించిన శ్రీనివాసకవియు, మడిపాటి వేంకట కవియు వరుసగా "విష్ణు చిత్త తనయోద్వహనంబును.... పెద్దనార్యు డుద్దర ఫణితిన్ రచించె" ననియు, "పేర్మి నల్లసాని పెద్దన యాముక్తమాల్యదాఖ్య కృతి సమంచితముగ జేసె" ననియు వ్రాసిరి.

5. శ్రీ సి. పి. బ్రౌను తన నిఘంటువు మొదట ఉదాహృత గ్రంథముల పేర్లిచ్చుచు నిట్లు వ్రాసెను.

"A. The Amukta Malyada ఆముక్తమాల్యద or Vishnu Chittiyam విష్ణుచిత్తీయం written by అల్లసాని పెద్దన్న Allasani Peddanna. It is in six cantos containiug about 950 stanzas or 3,800 lines."

6. వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు ప్రకటించిన ఆముక్తమాల్యద ప్రథమ ముద్రణ పీఠిక యందును పెద్దన విరచితమని పేర్కొనబడినదని తెలియువచ్చుచున్నది.

7. రాయల వంశమును చంద్రుని నుండి ప్రారంభించి వర్ణించిన అవతారికాభాగములోనే గాక దశావతార వర్ణనాదికములలో గూడ మనుచరిత్రలోని పద్యములే చిన్న మార్పులతో ఆముక్తలో నున్నవి.

8. మనుచరిత్రలోని పద్యముల కెన్నిటికో అనుకరణములు ఆముక్తలో కలవు.

9. ఆముక్తమాల్యద అవతారికను బట్టి రాయలంతకు ముందే సంస్కృతములో మదాలస చరిత్ర, సత్యావధూప్రీణనము, సకల కథా సార సంగ్రహము, జ్ఞానచింతామణి,రసమంజరి అను కావ్యములు రచించి నట్లున్నది. వాని తర్వాత ఆముక్తమాల్యద రచన జరిగి యుండవలె. ఇవి గాక జాంబవతీ పరిణయమును రచించినట్లు రెండు వ్రాతప్రతులు

దొరికినవి. అది ఇప్పుడు ప్రకటితమైనది. ఉషా పరిణయమనే నాటకము కూడా రాయలు రచించినట్లు సంస్కృత సాహిత్య చరిత్రలో శ్రీ కృష్ణమాచార్యులు వ్రాసినారు. ఇన్ని గ్రంథములు రచించియున్నప్పుడు రాయ వాచకములోగాని శ్రీ కృష్ణరాయ విజయములోగాని, రాయల సమకాలీన విదేశీయుల వర్ణనలలోగాని దాని ప్రస్తావనమేల లేదు? మనుచరిత్రము, పారిజాతపహరణము అవతారికలలోగాని ఆశ్వాసాద్యంతపద్యములలోగాని— 'కవితా ప్రావీణ్యఫణీశ' అను సందిగ్ధార్థకమైన సంబోధనలో తప్ప - రాయల కావ్య రచనయేల ప్రస్తావింపబడలేదు?

10. ప్రపంచ దర్పణమను సంకలన గ్రంథములో రసమంజరి సత్యావధువుల నుండి రెండు శ్లోకము లుదహరింపబడినవి. కాని యవి కూడా పెద్దన రచనలుగానే పేర్కొనబడి యుండుట విచిత్రము.

11. భానుదత్తుడను సంస్కృత కవి మైథిలీయుడు నానారాజ సందర్శనము చేసి రాయల యాస్థానమునకు గూడ వచ్చి కొంతకాల ముండెను. అతని కృతులలో 'రసమంజరి' యనున దొకటి. దానికిని రాయల రసమంజరికిని ఏమైన సంబంధ మున్నదా?

12. జాంబవతీ పరిణయ ప్రస్తావనలో గూడ రాయల ఇతర గ్రంథములేవియు పేర్కొనబడలేదు. కాని 'శ్రీ కృష్ణరాయః కవిః' ఇత్యాదిగానున్న శ్లోకమునకు ముందు 'ఇతఃపరం మహాన్ గ్రన్థపాతః' అని సంపాదకులు అథస్సూచికలో తెల్పిరని గమనింపవలెను.

ఈ పై పండ్రెండు కారణములలో నేవియు రాయల గ్రన్థకర్తృత్వమును సమర్థించు వానిలో 1, 3 కారణములుగా పేర్కొనబడిన వాని వలె బలవత్తరమైనవి కావు. కాని బహుముఖముల నుండి వచ్చిన పై పన్నెండు కారణములును కలిపి చూచినపుడు బుద్ధిమంతులకు సంశయము కలుగక మానదు. కవి తన కావ్యమును మరొకరి పేర ప్రచురించుచున్నప్పుడు ఆయన పేరు పెట్టక తన పేరు పెట్టడు గదా! దాని వలన ఆ 1, 3 కారణములుకూడ కర్తృత్వ వాదమునకు బలవత్తరములు కావనవచ్చును.

# 7

ఇప్పుడు శ్రీ నీలకంఠశాస్త్రి భారతిలో వ్రాసిన విషయమును ప్రస్తావింతుము. ఆ వ్యాసమే డా. చిలుకూరి నారాయణరావుగారికి ఆగ్రహావేశము కలిగించినది. వారే అథస్సూచికలో "ఏమో ఆ వ్యాసమును చదువగానే మనస్సునకు చురుక్కుమన్నది" అని వ్రాసినారు. ఎవరికెంత చురుక్కుమన్నను ఆ వ్యాసములో శ్రీ నీలకంఠశాస్త్రి ప్రదర్శించిన మార్గము అపూర్వమైనదనియు, కర్తృత్వ విషయమున వివాదము వచ్చినప్పుడు అవలంబింపవలసిన ప్రధాన మార్గమును అనుటకు సందేహము లేదు. దానినే సద్విమర్శకులు అంతస్సాక్ష్యము (Internal evi-dence) అని పేర్కొందురు. అందువలన వారి వాదమును ప్రత్యేకముగా విచారణ చేయుచున్నాము. సూత్రప్రాయముగా అనువాదము చేసినచో వారి వాద సారాంశ మిది.

"ఆముక్తమాల్యదను రచించినదెవరో వీర వైష్ణవుడు. శ్రీకృష్ణ దేవరాయల జీవిత విశేషములు ఎన్నో తెలియ వచ్చుచున్నవి. వానిని బట్టి రాయలట్టి వీర వైష్ణవుడు కాదని నిరూపితమగుచున్నది."

శ్రీ నీలకంఠశాస్త్రి ప్రతిపాదన యుక్తి సహమైనచో పెద్దన కర్తృత్వ వాద మెట్లున్నను ఆముక్తమాల్యదను రాయలు రచించలేదను వాదము ధ్రువపడును గదా! పై మాటలలో వీర శబ్దము శ్రీ నారాయణరావుగారి ఆగ్రహమునకు కారణమైనది.

"ఆముక్తమాల్యదలో ప్రతిపాదింపబడినది వీర వైష్ణము కాదు. విశిష్టాద్వైత సిద్ధాంతము. అది శ్రుతి నిబద్ధము" అని ఖండించినారు.

"ఆముక్తలో విష్ణుభక్తి మహిమ వివరింప బడినదేకాని శివనింద యెచ్చటనైనను నున్నదా?" అని కూడ నడిగినారు.

శ్రీ నీలకంఠశాస్త్రి స్మార్తుడు గనుక విశిష్టాద్వైత సిద్ధాంతమునే శ్రుతి నిబద్ధమని యంగీకరింపరు. వారేకాదు. శ్రీ నారాయణరావుగారి గురువులైన మాధ్వ పీఠాధిపతులను ఒప్పుకొనరు. రాయలు రచించినను సంకలకథాసార సంగ్రహములో నుండి శ్రీ వేటూరు వారుద్ధరించిన

శ్లోకములలో ఒకదానిలో 'ఉత్సాహం మమ వీక్ష్యమద్గురు రథ శ్రీ వ్యాస తీర్థోమునిః" అని ఉండుటచేత శ్రీ వ్యాస తీర్థులు రాయల గురువులని తెలియ వచ్చుచున్నది. వారుకూడ విశిష్టాద్వైతమును శ్రుతి సమ్మతమని అంగీకరింపరు. అందువలన ఈ మత భేదములను వాదములను తల పెట్టక శ్రీ శాస్త్రిగారు వీర వైష్ణవ శబ్దము ప్రగాఢ వైష్ణవాభిమాని యను సామాన్యార్థములో ప్రయోగించిరని సందర్భమును బట్టి గ్రహించుట ఉచితము. ఆముక్తమాల్యదాకర్త అట్టివాడనుట కెట్టి సందేహము లేదు.

అందులో శివ దూషణము లేదను శ్రీ నారాయణరావుగారి మాటయు నిరాధారమైనది. ఆముక్తమాల్యదలో శివదూషణమేకాక విష్ణ్వి తర సర్వ దేవతాదూషణమును స్పష్టముగా కలదు. దానిని వివరించుటకు ముందు శ్రీకృష్ణదేవరాయలు ఎంత వరకు వైష్ణవుడో కొంత విచారణ చేయవలసి యున్నది. గతానుగతికముగా, ఆయన తాతాచార్యుల శిష్యు డనియు, అంతకలతకు 'మధ్య వైష్ణవమునకు నామాలు మెండ'న్నట్లు వైష్ణవాభిమానము పెరిగినదనియు వ్రాయుట యాచారమైనందున నాయన మత స్వరూప మెట్టిదో చారిత్ర కాధారములను బట్టి కొంత స్థూలముగా విచారింతము.

పది పదకొండవ శతాబ్ద ప్రాంతముల నుండి మన దేశములో గొప్ప రాజులు తమ రాజ్యమును ఇష్ట దైవమునకు అర్పించి ఆయన పాద పద్మారాధకులుగా రాజ్య పరిపాలనము చేయుటయు, నాణెములు కూడా స్వామి పేరనే ముద్రించుటయు నాచారమైనది. దీనివలన రాజులు రాజకోశమును తమ భోగాదులకు ఉపయోగించుకొనక దేవ ద్రవ్యమును భయభక్తులతో ప్రజాపరిపాలనకు ఉపయోగించుట సాధ్యమైనది. తిరు వాన్కూరు పాలకులు అనంతపద్మనాభస్వామి పాద పద్మారాధకులు. కొప్పెరుం జింగడు కనకసభాపతి పాదపద్మారాధకుడు. శ్రీ విద్యానగర ప్రభువులు శ్రీ విరూపాక్షస్వామి పాద పద్మారాధకులు. హరిహర బుక్క రాయాదులు ముసల్మాన్ ప్రభువుల నెదిరించి రాజ్య స్థాపన చేయుటకు వారికి శ్రీ విరూపాక్షస్వామి గుప్త ధనమంతయు శ్రీ విద్యారణ్యస్వామి వారు అర్పించి, రాజ్యమును స్వామికి అంకితము చేయించిరి. శ్రీకృష్ణ

దేవరాయల వారి వరకు అట్లే జరిగినది. ఆయన తరువాతి కాలములో శ్రీ విరూపాక్షస్వామి పాదపద్మారాధనము చక్రవర్తులు వదలిన తరువాతనే శ్రీ విజయనగరరాజ్యము క్షీణించినదని శ్రీ మల్లంపల్లివారు వ్రాసియున్నారు.

శ్రీ విద్యారణ్యుల నాటినుండి శ్రీ శృంగేరి విరూపాక్ష పీఠస్వాములు విరూపాక్షములోనే ఉండి చక్రవర్తులకు తమ శ్రీ హస్తములతోడనే పట్టాభిషేకము చేయుచుండిరి. అట్లు పట్టాభిషిక్తుడైనవాడే శ్రీ కృష్ణదేవరాయలు. పట్టాభిషిక్తుడైన వెంటనే ఆయన కావించిన బృహత్కార్యము శ్రీ విరూపాక్షస్వామి ఆలయమునకు మహా గోపురము నిర్మించుట. అది నేటికిని రాయల శివ భక్తి చిహ్నముగా నిలిచియున్నది. ఒక్క విరూపాక్షములోనేకాదు. ఆయన కంచిలో, శ్రీకాళహస్తిలో, శ్రీశైలములో, మరియు నెన్నియో శివ క్షేత్రములలో మహాగోపురములు తన కీర్తిధ్వజములుగా నిర్మించినవి నేటికిని నిలిచియున్నవి.

జాంబవతీ పరిణయ నాటకము ప్రస్తావనలో ఇట్లున్నది:

"అద్యఖలు భగవతః చరాచర గురోః అపార కరుణాపారావారస్య నమ దమర శిరో మందార కుసుమ వాసిత పాదారవిందస్య విజయనగర నివాస వాసనావధీరిత ధనద నగర విహార దోహలస్య హేమకూట గిరికటక వాస్తవ్య కుటుంబినః కర్ణాట రాజ్యరక్షామణేః శ్రీ విరూపాక్ష దేవస్య చైత్రోత్సవావలోకనాయ సంగతాం పరిషత్; యైషా

"నాట్యామ్నాయ మహా రహస్య పదవీ పాణింధమ ప్రక్రమా
నానా నాటక భేదశాలి కవితా నాసీర సారస్వతా
నిత్యం శాస్త్ర విచార చారుధిషణా వైశద్య విద్యోతితా
సారస్యాంబుధి కౌముదీ లహరికా భవ్యా పురోవర్తతే"

ఇట్టి పరిషత్తును రంజింపజేయుటకు ఏ నాటకము ప్రదర్శింపవలెనని, నటియు సూత్రధారుడును ఆలోచించి, శ్రీ కృష్ణరాయ కవి, విరచితమైన జాంబవతీ పరిణయ నాటకమే యోగ్యమైనదని నిర్ధారించిరి.

ఆముక్తమాల్యదలో ప్రస్తావించిన కృతులలో నీ నాటకము లేనందున ఇది అనంతర రచన యనుట సాధారణ న్యాయము. వైష్ణవము ముదిరిన వాని ప్రస్తావన కాదుగదా ఇది!

శ్రీ కృష్ణదేవరాయలు వేంకటేశ్వరస్వామి భక్తుడని, అందుకు సాక్ష్యముగా ఆయన యొక్కయు, ఇద్దరు దేవేరులయు విగ్రహములు కూడ నక్కడ నిప్పటికిని కానవచ్చుచున్నవనియు చెప్పెడు మాట సత్యమే. ఆయన ఏడెనిమిది మారులైనను తిరుపతికి వెళ్ళి స్వామిని సేవించి కానుక లిచ్చినట్లు శాసనాధారములున్నవి. ఐనను ఆయన ఎప్పుడు వేంకటేశ్వరస్వామిని సేవించినను, ఆ వెంటనే శ్రీ కాలహస్తీశ్వరస్వామిని దర్శించి కానుక లర్పించినట్లును శాసనాధారము లున్నవి. శ్రీ కాలహస్తీశ్వరాలయమును ఈ శతాబ్దములో నిర్మించిన నాటుకోటిచెట్టియారులు అక్కడి శాసన సంపదను తారుమారుచేసి పూర్వాలయస్వరూపమును గుర్తింపలేకుండజేసినను ఇప్పటికిని ఎన్నో శాసనము లున్నవి.

శ్రీ కృష్ణదేవరాయలే కాదు; ఆయన యవసాన కాలములో చంద్రగిరి చెరసాలనుండి విద్యానగర సింహాసనమునకు రావింపబడిన అచ్యుతదేవరాయలు గూడ చంద్రగిరిలో బయలుదేరి వెంకటేశ్వర సన్నిధానమున నభిషిక్తుడై, పిమ్మట శ్రీ కాలహస్తీశ్వరస్వామి సన్నిధానమున నభిషిక్తుడై, ముచ్చటగా మూడవమారు హంపీ విరూపాక్షస్వామి సన్నిధానమున నభిషిక్తుడైనాడు. శ్రీ వెంకటేశ్వరస్వామి వైష్ణవులకుకంటె స్మార్తులకే ఎక్కువ ఇష్టదైవము. అక్కడి ప్రధానార్చకులు వైఖానసులు. స్వామిపేరే ఈశ్వర శబ్దాంతముగా నుండుట విశేషము. వెంకటేశ్వరాలయ మెక్కడ నున్నను మహారాష్ట్రులును, ఔత్తరాహులును 'బాలాజీ' నామముతోడ నేటికిని వ్యవహరించుచున్నారు. నేటికి కూడ ఆంధ్ర స్మార్త బ్రాహ్మణుల ఇళ్లలో వివాహాది శుభ కార్యము లేవి తలపెట్టినను ముందు శ్రీ వెంకటేశ్వరునకు దీపారాధనముచేసి అర్చించికాని ప్రారంభింపరు. వెంకటేశ్వరస్వామిని వైష్ణవులు గుత్తకు కొనలేదు.

తాతాచార్యులకో మరియొక శ్రీవైష్ణవాచార్యులకో రాయలు శిష్యుడనికదా అందరు విశ్వసించుచున్నది. మరి ఆముక్తమాల్యదలో

నెక్కడనైనను ఆయన గురునామమైన ప్రస్తావింపలేదేమి? మధ్య వైష్ణవుడని చెప్పబడుచున్న పెద్దన మనుచరిత్రములో గురువైన శఠకోప యతిని స్మరించెను—

ఐనను పెద్దన కూడ శివభక్తి మరచిన శ్రీవైష్ణవుడు కాడు మనుచరిత్ర అవతారికయే దానికి సాక్ష్యము. అంతేకాక ఆయన రాయలు తన కగ్రహారముగా నిచ్చిన కోకట గ్రామములో కొంత భూమిని అక్కడి శివాలయమున కిచ్చినట్లు (1518) శిలా శాసనమున్నది. అసలు పెద్దనకు కోకట గ్రామమును అగ్రహారముగా నిచ్చినది రాయలు కళింగ యాత్ర నుండి రాజధానికి పోవుచు దారిలో బెజవాడలోని మల్లేశ్వరస్వామిని అర్చించిన సమయములో. ఆ పిమ్మట నమరావతిలో అమరేశ్వరు నర్చించి తులా పురుష దానము చేసెను.

రాయల యాస్థాన కవులలో పెద్దనతో దాదాపు సమాన గౌరవ మందిన నంది తిమ్మనార్యుడు అఘోర శివాచార్యుల శిష్యుడును, శ్రీమదుమామహేశ్వరవరప్రసాదలబ్ధ సారస్వతుడును, వారిద్దరితోపాటు రాయవాచకములో ప్రస్తావింపబడిన మాదయగారి మల్లయ కూడ శ్రీ మదఘోర శివాచార్య గురుకరుణా విశేషలబ్ధ సారస్వతుడు. అష్ట దిగ్గజ కవులలో స్తుతమతియనియు, పలుకులలో అతులితమాధురీ మహిమ కలవాడని రాయల మెప్పుపొందిన కవి ధూర్జటి 'నీకుంగాని కవిత్వ మెవ్వరికి నేనీనంచు మీదెత్తితిన్, జేకొంటిన్ బిదుదంబ, కంకణము ముంజేగట్టితిన్' అని శ్రీ కాలహస్తీశ్వరస్వామి సన్నిధిని ఉద్ఘోషించిన శివభక్తాగ్రేసరుడు. ఆయన ముమ్మనుమడు తన పెదకాళహస్తి మహాత్మ్యములో నాతనిని 'కృష్ణరాయ కిరీట కీలిత మణి గణార్చిత పదాబ్జ శ్రీవహించిన'వాడని వర్ణించినాడు. పైగా అతడు శ్రీకృష్ణరాయ విజయ మను ప్రబంధము వ్రాసిన కుమార ధూర్జటి పుత్రుడే. పేరు లింగరాజు. వైష్ణవ మవలంబించినాడను తెనాలిరామలింగడు కూడ స్వచ్ఛమైన స్మార్త కుటుంబములో జన్మించిన వాడే. ఉద్భటారాధ్య చరిత్ర రచన నాటికే కాక పాండురంగ మాహాత్మ్య రచన నాటికిగూడ నతనికి వంశ క్రమానుగతమైన శివభక్తి పోలేదు. ఆ గ్రంథము నాతడు విశ్వేశ్వర

జ్యోతిర్లింగ షుద్ధఖనియైన కాశీపురమును వర్ణించుట తోడనే ప్రారంభించినాడు.

రాయల యాస్థానములోని సంస్కృత విద్వాంసులు కూడ ఎక్కువ మంది స్మార్తులే. తొమ్మిదితరములుగా మహాపండితు లుదయించిన వంశస్థుడైన లొల్ల లక్ష్మీధర పండితుడు, దివాకరపండితుడు, రామాయణ టీక రచించిన ఈశ్వరదీక్షితులును, సంగీతసూర్యోదయకర్త లక్ష్మీ నారా యణ కవియు స్మార్తులే. రాయల రాజ పురోహితుడు రంగనాథదీక్షితుడు, ఆయన కుమారుడు స్మార్తులే.

తమిళ కవులలో హరిహరదాసు "యిరుసమయ విళక్కమ్" అను గ్రంథములో శివ విష్ణువులయందు సమానభక్తి చూపవలెనని వ్రాసి రాయలచే బహుకరింపబడెను. తిమ్మణ్ణ కన్నడములో వ్యాస భారతము పూర్తి చేసి కృష్ణభారతమని రాయలపేరు పెట్టెను.

మాధ్వ గురువులగు వ్యాస రాయలు మాధ్వమత స్థాపనలో, శ్రీ మధ్వాచార్యుల తర్వాత పేర్కొనదగిన మధ్వమత స్థాపకుడైన ఉద్దండ పండితుడు. ఆయనను రాయలు తన గురువుగా పేర్కొనట్లు సకల కథాసార సంగ్రహ శ్లోకములనుబట్టి కానవచ్చుచున్నది. రాయలకు జాతకరీత్యా గండము సూచించు కాలములో ఆయనయే రాయల సింహా సనమధిష్ఠించి పాలించెనని వ్యాసరాయచరిత్రములో గలదు.

ఆంధ్రులలో వెలనాటిశాఖకుచెంది విష్ణుభక్తి ప్రధానమైన శాఖను గుజరాతు ప్రాంతములో స్థాపించిన వల్లభాచార్యులు రాయల యాస్థాన మునకు వచ్చి ప్రతిపక్షుల నోడించి స్వర్ణాభిషేకము పొందినట్లు వారి గ్రంథములలో గలదు.

జైన గురువగు అభినవవాది విద్యానందుడు రాయల యాస్థాన మున నితర మతస్థులతో వాదించి జయించెనని జైన గ్రంథము తెలుపు చున్నది.

ఇట్లు స్మార్తులు, శైవులు, విశిష్టాద్వైతులు, ద్వైతులునేగాక జైనులు గూఢ రాయలను తమవాడుగానే ప్రచురించుకొనిరి. రాయలవారి కథ

మతసహన ముండెను. ఆయనకున్న మత సహనమును గూర్చి బార్బొసా ఇట్లు వ్రాయు చున్నాడు.

"తన రాజ్యమునకు వచ్చిన వారిని గూర్చి చికాకుపడక వచ్చిన వారు క్రైస్తవులా, యూదులా, మహమ్మదీయులా యని వితర్కించకయే వారి వారి మతస్వాతంత్ర్యముతో నిచ్చవచ్చినట్లు వ్యవహరించుటకును, వచ్చినవారు వారి కిచ్చ వచ్చినప్పుడు స్వదేశమునకు వెళ్ళుటకును స్వాతంత్ర్య మిచ్చుచుండిరి."

పై వ్రాసిన దానినిబట్టి శ్రీ కృష్ణదేవరాయలు జగద్విదితుడైన విజేతయేకాక ప్రజారంజకుడైన పాలకుడని నిశ్చయ మగుచున్నది. ఇందరు కవులకు ప్రీతిపాత్రుడైన శ్రీ కృష్ణదేవరాయలు బహు విస్తృత సంస్కారముగల విద్వాంసుడై యుండవలెను. అట్టివాడు కొన్ని సంస్కృత గ్రంథములను ఆముక్తమాల్యదను వ్రాసినా డన్నంత మాత్ర మున ఆయన గౌరవ మతిశయించదు. వ్రాయలేదన్నంత మాత్రమున ఆయనను న్యూనపరచు చున్నామని భావింప నక్కర లేదు. ఆయన ఆస్థాన పండితులు, కవులును, "మేమే యిత్తుము మే మె యిచ్చెదము, మేమే యిత్తుమంచున్" తిరుపతి వేంకటేశ్వరులకు శబ్దములు వచ్చినట్లే, తమ గ్రంథములను వారియందున్న భక్తిచేతను, ప్రేమచేతను, వాత్స ల్యముచేతను, తమకున్న ధనాదిక కాంక్షలచేతను బహు విధములుగా నిచ్చుటకు వంతులు పడియుండుట యసహజము కాదు.

ఓఢ్రదేశములో నొక యాచార మున్నదని వినికిడి. అక్కడ గ్రంథ మొకరికి అంకితము చేయుటన్నా గ్రంథకర్తగా గ్రంథభర్త పేరుంచు టయే! ఆంధ్రదేశమునకు పొరుగుననున్న ఓఢ్రాచారము ఆంధ్రము నకును కొంత ప్రాకుట యసంభవముకాదు గదా! కలింగ విజయముతో విద్యానగరమునకు ఓఢ్రుల రాక యతిశయించినది.

# 8

ఇక కోపతాపములు దూరముగా నుంచి ఇంత సర్వమత సహనము గల శ్రీ కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదను రచించియుండునాయని శాంతముగా విచారించుకొందము.

శ్రీ కాకుళాంధ్ర విష్ణువు రాయలకు స్వప్నములో ప్రత్యక్షమై చెప్పిన మాట లివి :

"........ఏ మును దాల్చిన మాల్య మిచ్చు న
ప్పిన్నది రంగమం దయిన పెండిలిసెప్పుము మున్నుగొంటి నే
వ న్నన దండ యొక్క మగవాడిడ........
అక్కొదువ గప్పు ప్రియాపరి భుక్తభాక్కథన్"

గ్రంథనామము కూడ దాని కనుగుణముగానే ఉన్నది. కాని యీ ప్రబంధములో నా కథ చాల కొద్ది భాగములో చెప్పబడినది.

అవతారిక ఆశ్వాసాద్యంత పద్యములు పోగా కథా భాగములో 794 గద్యపద్యము లున్నవి. అందులో 202 పద్యములలో మాత్రమే గోదాదేవి కథ. 43 పద్యములున్న వసంతర్తు వర్ణనమున్న భాగము కూడ 202 లో కలిపితిమి. వసంతర్తు వర్ణనతో కలిపినచో కొంచెము తక్కువగా నాల్గవవంతును, తీసివేసినచో ఐదవవంతుకును గోదాకథా గ్రంథము తేలుచున్నది. తక్కిన గ్రంథ భాగములో 1. విష్ణుచిత్తుడు పాండ్యరాజ సభకుపోయి విరక్తుడైన రాజు సభలో పరసమయముల వాదములు ఖండించి రాజును వైష్ణవునిగా నొనరించిన కథ. 2. యామునాచార్య చరిత్రము 3. చండాల బ్రహ్మరక్ష స్సంవాదము 4. ఖాండిక్య కేశిధ్వజుల కథ— ఉన్నవి.

వీనిలో మొదటి రెండును వైష్ణవేతరమతములను దూషించుటకే పుట్టినవి. మూడవకథలో గూడ పరోక్షముగా పరమతనింద చొప్పింపబడినది. ఖాండిక్యకేశిధ్వజుల కథలో విష్ణుపురాణము అనువదింపబడినది. అందులో కొంత వైష్ణవ పక్షపాతచ్ఛాయ చేరినను స్మార్తులకును అంత బాధకము కాకున్నది.

మూల కథయైన గోదాదేవీకల్యాణములో గూడ పరోక్షముగా ఇతర దేవతానింద యున్నది. మగవా డిచ్చిన ననను ఏవతో గ్రహించిన విషయమే కవి మరచినట్లున్నది కాక, వ్యాఖ్యాతలు చెప్పుచున్నట్లు కాక విష్ణుచిత్తుడు నిత్యము కైంకర్యము చేయుచుండిన మాలలకే అన్వయించుకొనవలెనేమో !

1. పాండ్యరాజు కథలో నీ క్రింది భాగములు గమనింపవలెను. అక్కడి కోవిదులు, మోక్ష మిచ్చువాడు.

"హరు నొకండన, నుమ నొకండన,
హరి నొకండన, శిఖి నొకండన, నర్కు నొకండనన్.
గరిముఖు నొకండన, రజనీ
శ్వరు నొకండన, నజు నొకండన వాద్మైన తరిన్"
"....దివాణము న్నెరయ నించిన బ్రేలెడు దుర్మదాంధులన్
బోడిమి మాన్చి, మన్మహిమముం బ్రకటించి హరింపు శుల్కమున్
వాడును రోసినాం డిహము, వైష్ణవుగా నొనరింపు సత్కృపన్"

ఆ వాదించిన విష్ణుచిత్తుడు 'ఇతఃపురా పఠిత శాస్త్ర గ్రంథ జాత్యంధుడు'. సభకు బోయి వాదించి,

"మముక్షువున కప్పుండరీకాక్షుఁదక్క నే వ్యక్తినైన నుపాసింప వచ్చునే.... ముముక్షున కుపాశ్రయణీయుం డధోక్షజుండు.... అతనికి మూలమంత్ర పూర్వకంబుగా ద్వయము ప్రసాదించి భాగవత ప్రదానుం గావించిన" ముడుపు తెగిబడినది.

"వేద వేద్య మైన విష్ణుతత్త్వం బిటు
వాది గెలిచి తెలిసి వసుమతీశు
భక్తినోల లార్చి భగవత్ప్రపన్నుగా
జేసి లోకహితము చేయుటయును",
అప్పుడు

'ఇద్దొద్ధత్య మగాల్లయం హి కుధియామితం వదత్కిన్నరమ్' ఇత్యాది వర్ణనమును దర్వాత "సెలవులు నాకుచు" ఇత్యాదిక సీసపద్యము గమనింపదగినది.

2. యామునాచార్యుల కథ ఉపక్రమము నుండి యామునుని జయము వరకు గల 37 గద్య పద్యము లన్నియు చాల వరకు పాలు

రికి సోమనాథుని పండితారాధ్య చరిత్రములోని వాదప్రకరణమునకు ప్రతిగా నున్నవి. కొంత బసవపురాణములోని బసవదండనాథుని చర్యలను దలపించుచున్నవి. ఈ క్రింద నుదాహరించిన భాగములు ముఖ్యముగా గమనింప దగినవి.

"వెట్టిశైవంబు ముదిరి మద్వినుతి వినఁడు
"హరుఁడే పరతత్త్వ మను...."
"అశ్రాంత జంగమార్చాసక్తి వర్తిలు"
"భౌమ వారపు వీరభద్రపళ్ళెర మిడు....
"షణ్ణవతిశ్రాద్ధచయ మారఁబెట్టి సం
కర దాసమయ్య భక్తిప్రతతికి"
"జందె ముత్తర శైవంబు జెంది త్రెంచు
బతితు లారాధ్య దేవళ్ళ ప్రాప్యులనుచు....
వెండియే జంగమెత్తిన వెరఁగుపడును"
"శివలింగము దాల్చిన జన
నివహం బేమైన జేయ నిది పాపము దా
నవుగా దనఁడు...."
"అప్పు డిచ్ఛకు లగుచు బ్రాహ్మణులు కొంద
ఱాత్మజనిభూమి విడువలే కలికభూతి
గడ్డముల నాన రుదురాక లిడ్డ సంది
సూతసంహిత లిరికించి చొరఁ దొడగిరి.."
"ఓడితేనియు బట్టి మ్రొక్కరో యనంగ
లింగమును గట్ట కుడుగము...."
"అస్మన్మతస్థుఁ డొడిన
భస్మము రుద్రాక్షములును బూసి యితనిచే
విస్మయముగఁ దప్తపు ముర
ఘస్మర చక్రాంకితుండ గాఁగల వాఁడన్."

"ఉవిద, యీ నీదు విద్వాంసుఁ డోడెనేని
నీకు నితనికి నన్న పూనికయు....
ఇట్లు జయించి విష్ణుదేవుండె పరతత్త్వం
బనియు విశిష్టాద్వైతంబె మతంబనియు"
"నారాయణుడె పరంబు కొల్వు మతని...."
"అప్పలుకులు విని జిన్నంబై యుక్కాడిన
పాషండషండంబు దలవంచుకొని పోయిన--
"భుజగశయన చరణ కుశేశయ భక్తి
ఒడమి కృతార్థతం బొంది...."

ఈ పై భాగములలో వీరమాహేశ్వరులే కాకవిభూతి రుద్రాక్షధారులై సూతసంహితలుచేతబట్టిన స్మార్త బ్రాహ్మణులు కూడా తీసికొనిరాబడి నారని వెంటనే స్ఫురింపదేమో యని మేము జ్ఞాపకము చేయు చున్నాము.

3. చండాల బ్రహ్మరక్షస్సంవాదములో గాన మహిమ చెప్పబడిన దనవచ్చును. కాని ఎన్ని శపథములు చేసినను చండాలుని వదలని బ్రహ్మరక్షస్సు ఈ శపథముతో తుదకు వదలెను.

"ఎవ్వని చూడ్కి జేసి జనియించు జగంబు, వసించు నిజ్జగం
బెవ్వనియందు, డిందు మరి యెవ్వని యందిది యట్టి విష్ణుతో
నివఁల నొక్క వేల్పు గణియించిన పాతకి నౌదు నేఁడ నే
నెవ్విధినైన నిన్నదియనేని యన న్విని బంధ మూడ్చినన్"

ఇది యొక్కటి చాలు, విష్ణువుకంటె నితరులైన దేవతల నందరిని పరోక్షముగా నిందించెననుటకు. పైగా బ్రహ్మరాక్షసుడు గూడ దాని కొప్పుకొనుటచే నది యెప్పుకొనని వారందరు బ్రహ్మరాక్షసునికంటె గూడ నికృష్టు లన్నమాటగదా?

4. గోదాదేవి చరిత్రములో గోదాదేవిని రంగవిభుడు హరించిన సమయములో విష్ణుచిత్తుడన్న మాటలలో నివి గమనింపదగినవి:

"శివుడు విరించి వాసవుఁడుఁ జెప్ప నశక్తులు కొల్చు నట్టివా
రవుట, నిరంకుశుండఁ నని యక్కట పాడిఁదొఱంగఁ జెల్లునే?
భువనము లెల్ల నీవయినఁ బొంత దయానిధి యమ్మ లేదె? భా
గవతులు లేరె? నా కొఱకుఁగా వహియించు కొనంగఁ గేశవా!"

ఇందులో శివుడును, విరించియు, వాసవుడును భాగవతుల కంటె తక్కువస్థాయి లోనికి దింపివేయబడిరని గుర్తుంచుకొనవలెను.

పై నాలుగు కథలలోని యుదాహరణముల వలన ఆముక్తమాల్యదలో శివనిందయే కాక సమస్త పరదేవతా మతముల నిందయు కలదని విస్పష్టము కాగలదు. అట్టిది విశిష్టాద్వైతులు చేయవచ్చునా, చేయ గూడదా యని కాదు. ప్రస్తుత విచారణ. సరిగానిది పాల్కురికి సోమనాథునివంటి స్వమత ప్రచారకులు చేయదగినదే గాని సర్వమతస్థులను వారి దేవతలను సమానాదరముతో చూచి ప్రజారంజకముగా పరిపాలించిన శ్రీ కృష్ణదేవరాయలు అట్టిదిచేయునాయని!

రాయవాచకములోనుండి శ్రీ కృష్ణదేవరాయల పూర్వులవియు శ్రీ కృష్ణరాయలవియు ప్రవర్తనములు ఉదహరించుచున్నాము:

"వీరనరసింహ్మ రాయలవారు బ్రాంహ్మి ముహూర్తాన లేచి ఆరాధ్యుల నామావళులున్ను, అధ్యాత్మ సంకీర్తనలున్ను....శ్రవణమున్ను జేసిన పిమ్మట దంతధావన ముఖమజ్జన నామతీర్థమై విభూతి ధరియించి పేరోలగంబై కూర్చుండగాను నూట యెనిమిది తిరుపతుల నుంచిన్ని, తీర్థప్రసాదములున్ను, డబ్భై రెండు దేవస్థలాల నుంచి విభూతిగంధ ప్రసాదములున్ను రాగా యెదురుకొని ప్రత్యుత్థానము జేశి అంజలిచే నందుకొని శిరసావహించి స్థలాంతరాల నుంచిన్ని వచ్చిన అయ్యంగార్లనున్ను ఆరాధ్య పీఠం వారల నున్ను వుచితాసనముల యందు కూర్చుండ నియమించి.."

(పే 2—3)

ఇంతవరకు వీరనరసింహరాయలది. రాయ వాచకమునుండియే ఉత్కళ విజయము తర్వాత శ్రీ కృష్ణరాయల చర్యలు ఉదాహరిస్తున్నాము:

"కలుబరగ కోట లగ్గబెట్టించ్చి...పట్టుకొని ఆ కోటకు తాణ్యం గుజ్జరి కల్యాణరావును వుంచ్చి తిరుపతికి వచ్చి అలమేలు మంగాసమేతులైన కల్యాణ వెంకటేశ్వరుల దర్శనంబు శేశి రొఖ్కరూపాయలు కానుకవేశి సకల భూషణములున్ను స్వామికి సమర్పించ్చి, ఆ స్థలాన షోడశ మహాదానాలున్ను శేసి సన్నిధిని నిత్య శేవగా అంజలిపుటులై పూర్వద్వారమందలి వుభయ పార్శ్వములా తిరుమలదేవీ చిన్నాదేవీ సహితంగా వుండేటట్టుగా తాంబ్రాన ప్రతి బింబమున శేయించ్చి స్వామిని యెదురుగా నిలిపి అంద్దుండ్డి కాళహస్తికి వచ్చి స్వామిని దర్శించి కానుకలున్ను నవరత్నాభరణములున్ను సమర్పించి శ్రీముఖ సంవత్సరం ఆశ్వీజ శుద్ధ ౧౨ దినములు రాదిగా గల వస్త్రములున్ను గ్రామాదులున్న సమర్పించి స్వామి సన్నిధిని షోడశ మహాదానములున్ను శేశి అవ్వారిగా సత్రములున్ను గలుగ శేశి అంద్దుండ్డి త్రిపురుల చేత పూజలు గొన్న మూడు స్థలాలకుంన్ను పోయిన స్వామి దర్శనం శేశి నంద్దీశ్వర దర్శనం శేశి....మధురకు వచ్చి మీనాక్షిదేవినిన్ని చొక్కనాథస్వామినింన్ని త్రిసంధ్యల యంద్దున్ను సేవించ్చి కానుకలు వేశి అనేక భూషణములు సమర్పించి అమ్మవార్కి వజ్రాల కంమ్మలున్ను వైడూర్యపు పతకములున్ను పచ్చల కంమ్మలున్ను ముత్యపు ముఃక్కరా నున్ను సమర్పించి త్రిరాత్రుళ్ళు వాసము జేసి....శంకర నారాయణ దేవళానకు వచ్చి నాగతీర్థము స్థానం శేశి గోమతీ సమేతముగా శంకర నారాయణ స్వామిని దర్శించ్చి దక్షిణ కాశికిపోయి త్రికూటాచలమంద్దు ఆకాశగంగ యంద్దలి స్నానం శేశి చిత్రసభ శేవించ్చుక అగస్త్య పర్వతానకు వచ్చి కల్యాణతీర్థమంద్దలి స్నానం శేశి అగస్తేశ్వరుని గోపురం గట్టించి...కన్యాకుమారికి జని అమ్మ వారికి సేవించ్చుక శ్రీ కంద్దూరికి వచ్చి వల్లి దేవయాన సమేతముగా సుబ్రంహ్మణ్యస్వామిని శేవించ్చి....ఆది సేతువుకు పోయి రఘునాయకుల సేవించ్చి కాళములమీద సముద్రతరణమై ధనుష్కోటిలో ఖడ్గం కడిగి సేతుస్నానం తులాపురుషదానం మొదలైన దానాలాచరించ్చి కాశి విశ్వేశ్వరులనుంన్ను రామలింగ్గ స్వామినిన్ని పర్వతవర్థన అమ్మవారినిని సేవించ్చుకొని చతుర్వింశతి తీర్థముల యంద్దు స్నానం శేశి కోటి గోదానం కోటి బ్రాహ్మణులకు అన్నదానము

శేశి స్వామి సన్నిధిని మూడు తులలు తూగి అంమ్మవార్కి సకలాభరణము లున్న నవరత్న పొడిగా యిచ్చి త్రిరాత్రి వసిఇంచి కోట తీర్థస్నానం శేశి స్వామి చేత అంప్పించుకొని మరలినవారై గోకర్ణ స్థలమునకు వచ్చి.... సుముహూర్తమంద్దలి విద్యానగర ప్రవేశమై విఠల విరూపాక్షుల సేవించ్చి కానుకలున్ను అనర్ఘ్యమై నటువంట్టి భూషణాదులున్న సమర్పించ్చి నగరు ప్రవేశమై పెద్దలకు మ్రొక్కి సుముహర్తమున హజారమునకు విజయం శేశి అప్పాజి మొదలైన సకల సామాజికులనన్ను...." (పే. 111—114) చుక్కలు మధ్య వదలిన భాగములు.)

ఇంతవరకు చాలును, శ్రీ కృష్ణదేవరాయలు "విష్ణువుతో నివ్వల నొక్క వేల్పు గణియించిన పాతకి" యౌటకు జంకలేదనుటకు. విష్ణునితో సమానముగా శివుని, సుబ్రహ్మణ్యేశ్వరుని, కన్యాకుమారిని సేవించిన మహా ప్రభువు రాయలు!

కాబట్టి ఆముక్తమాల్యదను రాయలు రచించెనాయని నిర్ధారించుటకు శ్రీ నీలకంఠశాస్త్రి చూపించిన మార్గము నిస్సందేహముగా గ్రాహ్యమైనదే! రాయలు కవిత్వము చెప్పలేడనికాని, పండితుడుకాడని కాని, ఉపపాదించుటకు చేయుచున్న ప్రశ్న కాదిది। రాయలాముక్తమాల్యద వ్రాయలేదనుటకే ఎక్కువ యవకాశము కలదని బుద్ధిమంతులకు తోపక మానదు. బహుముఖములనుండి చరిత్రకు తెలియవచ్చుచున్న రాయలకును ఆముక్తమాల్యదాకర్తకును భేదము కొట్టవచ్చినట్లు కనిపించుచున్నది.

## 9

మరి రాయలు వ్రాయకున్నచో ఎవరు వ్రాసిరి? ఎవరు వ్రాసినను అతడు సంస్కృతాంధ్ర భాషలలో విశేషాధికారమున్న కవీశ్వరుడు లోకానుభవ మున్నవాడు. కాని విశిష్టాద్వైత సంప్రదాయములనుగాని, శ్రీ మద్రామానుజుల శ్రీభాష్యమునుగాని, వారి శిష్యుల రచనల సంగతి నిశితముగా తెలిసినవాడు మాత్రముకాదు. ద్రావిడవేదముగాని అథమ

పక్షము గోదాదేవి అరవములో చెప్పిన "ఆండాళ్ తిరుమొళి" చక్కెర పొంగలి రుచి తెలిసినవాడైనను కాడు!

1. విష్ణు పురాణమునకు గోదాదేవి తండ్రి విష్ణుచిత్తుడు వ్యాఖ్యానము వ్రాయుచున్నట్లు ఆముక్తలో నున్నది. అది పెద్ద తప్పు. విష్ణుపురాణమునకు వ్యాఖ్యానము వ్రాసినది శ్రీ మద్రామానుజుల శిష్యుడగు మరియొక విష్ణుచిత్తుడు.

2. విష్ణుచిత్తుడు రాజసభలో ఇతర మత ఖండనము చేయుటలో అద్వైత వాదమునకు సంబంధించిన సీస పాద మిట్లున్నది.

"శౌరి 'నీశుఁడేన" నా భోగమాత్రేత్యాద్యు
దాహృతి స్ఫూర్తి మాయావివాది'

ఇక్కడ 'భోగమాత్ర సామ్య లింగాచ్చ' అను సూత్రము సూచింపబడినది. ఆ సూత్ర వ్యాఖ్యానములో 'ఈశుడేను' అను వాదము ఖండింపబడలేదు. ఆ సూత్రము భాష్యములో ముక్తునికి బ్రహ్మయాథాత్మ్యానుభవరూపభోగ మందె బ్రహ్మసామ్యముగాని జగత్స్రష్ట్వాదిక వ్యాపారములయందు సంబంధములేదని తెలియజేయుననియే ప్రతిపాదింపబడినది. జీవుడు బ్రహ్మము వేరు అని 'ఆనందమయోఽభ్యాసాత్' ఇత్యాది సూత్రములను వ్యాఖ్యానించు సందర్భములో చూపబడినది. ఆముక్తలో సూచించినది 4 వ అధ్యాయములో నాల్గవ పాదములోని 21 వ సూత్రము. అది దూరాన్వయముగా తప్ప అద్వైత ఖండనమునకు ఉపయోగపడదు. శ్రీభాష్యములో అద్వైత ఖండనము చేసిన సూత్రములు ప్రథమాధ్యాయములోని ప్రథమ ద్వితీయ పాదములలోనివి.*

3. ఇక గోదాదేవి పరిణయ కథ వ్రాయదలపెట్టి ఆమె విరహమును వర్ణించిన కవి, ఆమె మహా కవయిత్రియై యుండి విరహగీతములు పాడినవి ఎరిగి యున్నచో వానిని తన కావ్యములోనికి తీసికొని రాకుండునా? ఆముక్తదా కర్త యా పని చేసియున్నచో నేడు శ్రీమాన్

* శ్రీమాన్ మేడేపల్లి వేంకట రమణాచార్యులుగారు తమ ఆముక్తమాల్యదోపోద్ఘాతములో వివరించినారు.

మాడభూషి గోపాలాచార్యుల వంటివారికి 'చక్కెర పొంగలి' రుచి మనకు చూపెడు నవస్థ తొలగియుండెడిది.

4. శ్రీ వైష్ణవాచారములును పైపైగానే కాని ఆముక్త కవికి లోతుగా తెలియవు.

5. ఆముక్త కవి యామునాచార్య చరిత్రమునకు మూలగ్రంథ మైన గురు పరంపరా ప్రభావములో లేని మార్పులు కొన్ని చేసెను. అవి బ్రాహ్మణ శ్రీవైష్ణవులకు సమ్మతము లనుకొనము. యామునుడు శైవు డగు పాండ్యరాజును వైష్ణవుని జేయుట, పాండ్యరాజ సోదరిని వివాహ మాడుట, క్షత్రధర్మ మవలంబించుట—శిష్ట సమ్మతములుకావు.

కాబట్టి ఆముక్తమాల్యదా రచయిత సుష్టుగా విశిష్టాద్వైత ప్రవిష్టుడుకాదు.

పెద్దనయేయని బహుకాలాగతమైన వాడుక యున్నది కావున ఆయనయే కావచ్చును. శైలిభేదము పెద్ద అడ్డు కాదు. పెద్దన మను చరిత్ర శైలి కొన్ని భాగములలో ఆముక్తలో లేకపోలేదు. తిక్కన శైలి విరాటపర్వములో నున్నదానికి శాంతిపంచకములో నున్నదానికి నెంత భేదమున్నది ?

పెద్దన్న కాకున్న ఏ చాత్తాద వైష్ణవ పండిత కవియో వైఖానస పండితకవియో వ్రాసి యుండవచ్చును. ఏదైనను ఊహ మాత్రమే.

రాయలు జాంబవతీ పరిణయమును రచించి యుండు ననుటకు ఎట్టి విప్రతిపత్తియు లేదు. కాని దాని ప్రస్తావనబట్టి దానిని రచించిన కవి ఆముక్తమాల్యద రచింపలేదని దృఢముగా చెప్పవచ్చును. అందలి కల్పనాదులు కూడ ఆముక్తలోని కల్పనలతో సామ్యము కలవిగా కనపడలేదు.

రాయల కాలములో ఆంధ్రకవులేకాక కన్నడ కవులు అరవ కవులు ఎందరో తమ కావ్యములలో రాయల వివాహాదులను వర్ణించినట్లును తమ కావ్యము లాయన కంకిత మిచ్చినట్లును తెలియుచున్నది. కన్నడము నందును అరవమునందును విద్వాంసులయిన యాంధ్రవిమర్శకులు ఆ గ్రంథములను పఠించి క్రొత్తవెలుగు ప్రసాదించువరకు రాయల ఆముక్త మాల్యదా కర్తృత్వమునందు సందేహము సత్యాన్వేషణ పరుకులకు తీరునట్టిదికాదు.

(భారతి, జులై-1970)

# నాగేశ్వరరావు పంతులుగారు :
# తత్త్వవేత్త, గ్రంథకర్త.

(మొన్నటి వినాయక చవితి ఆంధ్ర పత్రిక స్వర్ణోత్సవం. ఆ సందర్భంలో ఆంధ్ర పత్రిక స్వర్ణోత్సవానుబంధం ప్రచురించింది. విశ్వావసు సంవత్సరాది. సంచిక స్వర్ణోత్సవ సంచికగా వెలువడింది. ఈ విశేషావకాశం పురస్కరించుకొని, ఆంధ్ర పత్రిక స్థాపకులు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిని గురించి ఈ ప్రత్యేక వ్యాసం ఇక్కడ ప్రచురిస్తున్నాము. సం॥)

"ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబున కగుఁదా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మ పథముల కెల్లన్."

నేటికి మన మనుభవింప నారంభించుచున్న సర్వతోముఖమగు నాంధ్రాభ్యుదయము నాగేశ్వరరావుగారి జీవితముతో ఎంతో పెనవేసికొని యున్నదో, వారి నిరంతర కృషిమీద నెంత యాధారపడి యున్నదో, సామాన్యులకు విప్పరాని చిక్కు. ఆయన ప్రతిభా వ్యుత్పత్తులెంత విస్తార గంభీరములో, వాని పరిపూర్ణత్వ మెట్టిదో పూర్తిగా తెలిసివారు అరుదు.

ఆయన దేశోద్ధారకుడు. బిరుదములు పలువుర కలంకార ప్రాయములు. సార్థకమైన బిరుదములు కల కొలదిమందిలో పంతులుగారు అగ్రశ్రేణి వారు. ఆంధ్ర ప్రభుత్వాధినేతలు ఇప్పుడిప్పుడే వారి దేశోద్ధారకత్వ స్వరూపము గుర్తింప నారంభించు చున్నారు. సామాన్య జనులు గుర్తించినట్లు లేదు.

విశ్వదాతగా ఆయనను కీర్తించు వారు వారి వితరణ మాత్రమే ఎరుగుదురు. ఆ దాతృత్వమునకు మూలమైన వారి పరమకారుణిక

హృదయ మెరుగరు. ఎంత చిన్న సత్కార్యమును తలపెట్టిన వారికైనను వారిచ్చు చుండెడి చేయూతకు కారణమైన వారి విశ్వ ప్రేమను భావింప గలవా రరుదు. వారి దాతృత్వమునకు అవకాశ మిచ్చిన వారి సంపదకు అంతరాంతరములలో నొక్కింత యసూయ కూడ కలవారే పలువురు!

ఆంధ్ర విశ్వ విద్యాలయము వారికి 'కళాప్రపూర్ణ' పట్ట మొసగి నది. అప్పుడు ఎందరో మహా పండితులుండగా, పండితులుగా కనబడని వీరి కిచ్చుటకు వీరి కున్న పలుకుబడియే కారణమని పలువు రభిప్రాయ పడి యుందురు. కాని ఏ ఒక్క పండితునికి లేని బహు ముఖమగు కళా ప్రపూర్ణత్వము వారికే కలదనుట యతిశయోక్తి కాదు. ఆ పట్టము పొందిన వారిలోనెల్ల వారే యుత్తములు. పాండిత్య ప్రకర్ష ప్రకటించుకొను నితరులవలె గాక, వారి పాండిత్యములోతు గంభీరమైనది; మహా సము ద్రము లోతువలె పైకి కనుపించునది కాదు.

విరోధికృత్సంవత్సరాది సంచిక పీఠికలో ఒకా నొక ప్రసిద్ధాంధ్రుని గూర్చి నాగేశ్వరరావుగారు వ్రాసిన ఈ క్రింది మాటలు వారికే అక్షరశః అన్వయించును. ఎట్టియాదర్శములు వారిని నిరంతర మావేశించి యుం డెడివో కూడ నీ వాక్యములు సూచించును.

"స్వయం సహాయమునకును, సత్య ప్రియత్వమునకును, నిరం తర వ్యవసాయ పరత్వమునకును ప్రమాణముగా నెన్నదగిన ఈ పూజ్యుని సచ్చారిత్రము పఠనార్హము!"

ఆంధ్రదేశ ప్రజలలో ఒక విచిత్ర ప్రకృతి ద్యోతమవు చున్నది. చేతులార తెచ్చుకొన్న దారిద్ర్యముతో బాధపడు వారిని, సత్పథభ్రష్టులైన వారిని, అల్పాయుష్కులను, యాచన మభ్యాసముగా కలవారిని అతిశ యముగా శ్లాఘించి పూజించునట్లుగా, స్వశక్తి వలన నార్జించిన సంప దతో తృప్తిపడుచు ఇతరులను యాచింపని వారిని, ఎట్టి సందర్భములం దుకు సత్పథము విసర్జింపని పుణ్యపురుషులను, దీర్ఘాయుష్మంతులై నిరం తర ధర్మ దీక్షా పరతంత్రులైన పూజ్యులను, వారిని తగినట్లు మనవారు గౌరవింపరు. సాంస్కృతిక రంగము లన్నిటిలో నిది ప్రతి ఫలించుచుం డుట శోచనీయము! పంతులుగారు ఆంధ్ర హృదయములలో పొంద

దగిన ఉత్తమోత్తమ స్థానము పొందకుండుటకు ప్రధాన కారణ మిదియే కావచ్చును.

## 2

నాగేశ్వరరావుగారి సంస్కార స్వరూపము అవగాహన చేసికొనుటకు వారి యౌవన దశలోను, పరిణత యౌవనములోను ఎట్టి భావములు ప్రపంచ మందును, భారత దేశమునందును ప్రచలితమై యుండెడివో తెలిసి కొనుట యవసరము.

ఆ కాలమున విజ్ఞాన శాస్త్రజ్ఞుల కందరికి కనువిప్పు కలిగించినది డార్విను పరిణామ వాదము. అది జీవశాస్త్రమునకు సంబంధించి ఉద్భవించినదైనను దాని ప్రభావము విజ్ఞాన శాస్త్రము లన్నిటియందే కాక, మత సాంఘిక, వేదాంత, కళా, సాహిత్యాది సమస్త రంగము లందును చూప సాగినది. ఈ కాలములో ఐన్‌స్టీన్ సాపేక్ష వాదమున కెంత ప్రాబల్యమున్నదో అంత కంటె ఎక్కువ ప్రాబల్యమె ఆనాడు పరిణామ వాదమున కుండెడిది. నేటి సాపేక్ష వాదము ప్రపంచవిఖ్యాతి పొందక పూర్వమే దానిని పంతులుగారు గ్రహించిరి. వారి ఉత్తర కాలీన రచనలలో నది ప్రతిఫలించుటయేకాక స్పష్టముగా పేర్కొన బడినది. అయినను వారి సంస్కృతిని విశేషముగా ప్రభావితము చేసినది పరిణామ వాదమే. వారి యుపన్యాసములందు వలెనే రచనల యందును పరిణామ శబ్దము తరుచుగా దొరలు చుండును.

ఇక రెండవది. ఆ కాలమున భారతీయ విద్యావంతులందు రామకృష్ణ పరమహంస జీవితము బోధలు, ముఖ్యముగా వివేకానందుల ద్వారా విశేష వ్యాప్తి కాంచినవి. వారిద్దరును ఔత్తరాహులును వంగీయులును నైనను, వారి ప్రభావము ఆప్రాంతములందు కంటె దక్షిణ భారతముననే దృఢతరముగా వ్యాపించినది. వివేకానందులు శంకరాద్వైతమునే అభిమానించి యుపదేశములలో నది వేదోక్త కర్మాచరణమునకు శిరోభూషణముగా గాక కుల మతాతీతమై విశ్వ సాధారణ తత్త్వముగా రూపొందినది

పరమహంస బోధలు పురాణముల నుండియు గ్రహించినవే యైనను, ఆయన ప్రదర్శించిన జీవితము వలన నూతనోజ్జీవితములై ప్రాణ ప్రతిష్ఠ వడిసినవి. మత కలహములతోను, విజృంభించు చున్న క్రైస్తవ మత ప్రచారముతోను సతమతమవుచున్న భారత భూమిలోని సంస్కారవంతులను పరమహంస ఉపదేశించిన సర్వ మత సమరసభావము విశేషముగా నాకర్షించినది. ఈ సామరస్యము, విశ్వ విస్తృత భావన పంతులుగారు కావించిన ప్రతి రచన యందును ద్యోతమగు చుండును.

వారు విద్యాభ్యాసము చేయుచుండిన కాలములో జర్మను తత్వవేత్తయైన 'కాంటు' గ్రంథములకు ఎక్కువ ప్రాబల్యముండెడిది. ప్రాచ్య తత్త్వవేత్తలలో శంకరులవలెనే, పాశ్చాత్య తత్వవేత్తలలో కాంటు అద్వితీయుడను ప్రతిష్ట విద్యార్థి లోకములో నుండెడిది. నీతిశాస్త్రమునకు మూలసూత్రముగా ఒక సిద్ధాంతమును ఆయన ప్రతిపాదించెను. అది యిప్పటికిని ఎథిక్సులో పరమ ప్రధానమైన సూత్రములలో నొకటియే. అది పంతులుగారి హృదయములో నాటుకొని యుండవలె. దాని స్వరూపమునే వివరించు భారత పద్యమే నేటివరకును ఆంధ్రపత్రిక సంపాదకీయముల కన్నిటికి శిరోధార్యమై మకుటాయమానముగా శోభిల్లుచున్నది. "ఒరులేయవి యొనరించిన" ఇత్యాది పద్యము పంతులుగారి ధర్మదీక్షకు ప్రత్యక్ష చిహ్నము! అది కాంటు సూత్రమునకును భారత ధర్మమునకును సామరస్యము.

వారు బందరు, గుంటూరు, మదరాసులలో ఉన్నత విద్యాభ్యాసము చేసినను, విద్య పూర్తి ఐన కొలది కాలమునకే సాహసముతో బొంబాయి కేగిరి. ఆనాడు మహారాష్ట్రమున కంతటికి పూనా పట్టణము సాంస్కృతిక కేంద్రముగా నుండెడిది. గోఖలే, తిలకు, రానడేవంటి మహానుభావు లెందరో మహారాష్ట్రమునే కాక భారత జాతినంతటిని వీర్యవంతము చేయుచున్న రోజులవి. బ్రిటిషు ప్రభుత్వము మనదేశమున నెలకొనకుండ ప్రతిఘటించినవారిలో చివరివారు మహారాష్ట్రులు. అంతవరకు భారతదేశములో చాలా భాగము మహారాష్ట్రుల పాలనము ననే యుండెడిది. అట్లు పాలించిన యోధాగ్రేసరుల వంశములలోని

మహనీయులతోపాటు పూర్వ వీరుల స్మృతి యప్పటి కింకను మాయక యక్కడ సజీవమైయుండెను. గణేశ నవరాత్రముల పేరుతో జాతీయత యానా డక్కడ విజృంభించి భరతభూమిని దీపించుచుండెను. కేవల రాజకీయ రంగమునందేకాక, సర్వతోముఖముగ ప్రాచీన హైందవ సంస్కృతియందు చైతన్యముతో గూడిన అభిమానము విజృంభించి ఉత్తమ కృషి జరిగినది. భండార్కరువంటి విద్వాంసులు సంస్కృత భాషకు చేసిన సేవ అపారమైనది. భారతదేశ మందంతటను లభ్యమైన సంస్కృత గ్రంథ ప్రతులను తెప్పించి పండితులచే పరిష్కరింపజేసి నిర్ణయ సాగరువారు నిర్దుష్టముగా అచ్చు వేయించి తక్కువ ధరకు దేశమంతట వెదజల్లిరి. ఆనాడు వా రచ్చువేసిన వేదభాష్యములు, అష్టాదశ పురాణ గ్రంథములు నేటికిని తదభిమానులకు ఆధారముగా నున్నవి.

అట్టి చైతన్యము పొంగులువారుచున్న మహారాష్ట్రములో వర్తక సంస్థలో చేరి జీవిత మారంభించిన నాగేశ్వరరాయలు ఉన్నతాదర్శపూరితులై, ఆ మహా చైతన్య ప్రవంతిని ఆంధ్ర దేశమునందు వెల్లివిరియునట్లు చేయుటకు దీక్ష పూనిరి. వారి కంటె వయస్సులో పిన్నలయ్యును, సంస్కృతిలోగాని, ఉన్నతాదర్శములలోగాని వారి కేమాత్రము తీసిపోని కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారు వారికి సహచరులైరి. లక్ష్మణరావుగారు మహారాష్ట్ర భాషలో గూడ సుద్గ్రంథములు వ్రాసిన విద్వాంసులు. ఆంధ్రపత్రిక బొంబాయినుండి మదరాసుకు రాకముందే లక్ష్మణరావు చెన్నపట్టణమునకు వచ్చి విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి స్థాపించి అద్వితీయ గ్రంథములను ప్రచురించుటకు పూనుకొనిరి. సత్యాన్వేషణతత్పరత్వములోను, విద్యా సంస్కృతులు ఆంధ్రదేశమంతట వ్యాప్తి చేయవలెనను దీక్షలోను, తలపెట్టినది సాధించుటకు చేయు కృషిలోను, ఆ యిద్దరును ఒకరి కొకరు తీసిపోని .మహావ్యక్తులు. వ్యాపార సంస్థలతోడి సంబంధముతో ప్రారంభించిన నాగేశ్వరుల లోకానుభవము, వారుతలపెట్టిన ప్రతి ఉద్యమమును సంపూర్ణముగా కార్యరూపమున సాధించు శక్తిని మాత్రము వారిద్దరిలో నాగేశ్వరుల కొక్కరికే యిచ్చినది. లక్ష్మణరావుగారు ప్రీతితో పెనగులాడి ఆంధ్ర విజ్ఞాన సర్వస్వమునందు అకారము కూడ పూర్తి చేయలేక దివంగతులైరి. ఆపిమ్మట

వారి స్మృతి చిహ్నముగా పంతులుగారు లచ్మిణరావుగారు వ్రాసికొనిన నోట్సు ఉన్నంతవరకైనను పూర్తి చేయించ ప్రకటింపగలిగిరి. అంతకు పూర్వము సంచికలుగా వచ్చుచుండిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము రెండు సంపుటములును, పంతులుగారి చేతిలో ఆంధ్రభాష ఇంతవరకు నోచుకొనని ఉజ్జ్వల రూపముతో సాక్షాత్కరించినది. డెమ్మి 1/4 సైజు ఒక్కొక్కటి 600 పేజీలుగల సంపుటము లవి. విషయ గౌరముననేకాక కాగితము, అచ్చు, సాధారణ చిత్రములు, త్రివర్ణచిత్రములు, పటములు, బైండింగు, తక్కువ వెల—వాటికి సాటియైన సంపుటములు తెలుగులో నిప్పటికి చూచి ఎరుగము. పంతులు గారి ప్రకటనలో ధనము వెదజల్లియుండ వలెను. వారెన్నో దానములు చేసి విశ్వదాత యని ప్రసిద్ధికెక్కినను, వారి వితరణమునకు ప్రత్యక్ష చిహ్నము, నభూతో న భవిష్యతిగా ప్రకటింపబడిన ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము!

బొంబాయికి జీవయాత్రకై వెళ్ళిన నాగేశ్వరరాయలు అక్కడి నుండియే ఆంధ్ర వారపత్రిక ప్రారంభించినారు. అది కీలక సంవత్సర భాద్రపద శుద్ధ చతుర్దశి బుధవారమున (9—9—1908) ప్రారంభింపబడినది. ఆనాడు వెలువడుటకు మహారాష్ట్రములో నానాడు మహోత్సాహముతో జరుగుచుండిన గణపతినవరాత్రోత్సవములే కారణము. ఉత్సవము ముగిసిన వెంటనే పత్రిక ప్రారంభించిరి. స్మార్త సంప్రదాయమునను, శైవసంప్రదాయమునను గూడ ప్రథమ పూజ్యుడు శ్రీ మహాగణాధిపతి. నాగేశ్వరరాయల కార్యదీక్షకు, వారికి శ్రీ మహాగణాధిపతియందలి భక్తి తోడై, వారు తలపెట్టిన కార్యములు నిర్విఘ్నముగా నెరవేర్ప గలిగెను.

ఆంధ్రపత్రిక బొంబాయిలో నారేండ్లు వారపత్రికగానుండి చెన్నపట్టణము వచ్చి, వారపత్రికగనే కాక దిన పత్రికగా గూడా వెలువడ సాగినది. పత్రిక వెలువడసాగిన మూడవ సంవత్సరమునుండియే (సాధారణ సంవత్సరాది నుండి) సంవత్సరాది సంచిక లారంభమైనవి. అవి వందల కొలది చిత్రపటములతో, ఉత్తమ వ్యాసములతో ఆంధ్రభూమి నలంకరించెడివి. మొదటి సంచికను బాల్యమునందే చూచు భాగ్యముగల ఈ వ్యాసకర్త దానెన్ని పర్యాయములు ముగ్ధుడై తిరుగవేసెనో లెక్కింప

శక్యముకాదు. సర్వ రంగములలో ప్రసిద్ధులైన వారి ఛాయా పటములు చూచుచున్నప్పుడెంత ఉన్నతాదర్శములు రేకెత్తుచుండెనో ఊహింప వలసినదే!

పంతులుగారు చెన్నపట్టణములో విద్యాభ్యాసము చేయుచుండిన రోజులలో నక్కడ రెంటాల వెంకట సుబ్బారావుగారను గొప్ప మేధావి, హైకోర్టు వకీలుగా నుండెడివారు.

# 3

నాగేశ్వరరాయలు గ్రంథశతములు రచించినను, అవి గ్రంథ రూపముగా కనుపింపవు. వారి భగవద్గీత కూడ వారి నిర్యాణానంతరమున వారు వ్రాసిన అసంపూర్ణమైన ఉపోద్ఘాతముతో ప్రచురింపబడినదే. వారి ఆంధ్ర వాఙ్మయ చరిత్ర, వారు ఆంధ్ర వాఙ్మయ సూచికకు పీఠికగా వ్రాసినదే, వారి యనంతరమున గ్రంథరూపము ధరించినది. వారు వ్రాసిన పీఠికలు, ప్రత్యేక వ్యాసములు కొన్ని కలిపియు, కొన్ని ప్రత్యేకముగను గ్రంథములుగా గ్రహింపగినవే. విజ్ఞాన సర్వస్వములో అజంతా విహారముపై వ్రాసిన వ్యాసము ప్రత్యేక గ్రంథముగా రాదగిన వానిలో నగ్రగణ్యము! అజంతా విహారములను గూర్చి బహుగ్రంథములు చదివిన వారికి గూడ గలుగని వాని స్వరూపమును గూర్చిన విస్పష్ట భావన ఆ వ్యాసమువలన కలుగగలదు. అందులోనిదే 'అనాహతము' అను వ్యాసము కూడ కొంత వర కట్టిదే. బసవ పురాణ ప్రస్తావన, మాలపల్లి తొలిపలుకు, స్నానఘట్టము పీఠిక, శతకమంజరి సంపాదకీయము, శతకముల పీఠికలు, సమగ్రతకు, వారి నిష్పక్షపాత దృష్టికి, విశాల వృత్తికి ప్రత్యేకముగా నెన్నదగినవి. ఇక వారి సంవత్సరాది సంచికల పీఠికలు, ప్రస్తావనలు నిరూపమానములు. ఆ యా సంవత్సరముల ఆంధ్ర సాంస్కృతిక చరిత్రకు ప్రధానముగను, భారతభూమి సంస్కృతికిని, ప్రపంచ సంస్కృతికిని కొంతవరకును, భవిష్యచ్చరిత్రకారులకు ప్రధానాధారములుగా నుండదగిన ఉదాత్త సమీక్షలు. పంతులుగా రిట్లు

బహు గ్రంథకర్తలు. అయినను భారత దేశములో పూర్వముండిన మహా శిల్పులు, చిత్రకారులు, గ్రంథకర్తలు, తమ నామమునకు కంటె తమ సృష్టికే ఎక్కువ ప్రాధాన్య మిచ్చినట్లే, పంతులుగారును ఎందరో గ్రంథ కర్తలను ప్రచారమునకు తెచ్చినను తాము గ్రంథకర్తగా యశస్సు తెచ్చుకొనుటకు ఎంతమాత్రము ప్రయత్నింపలేదు. వారు 'సంపా దకులుగా' నుండుటకే అభిమానించిరి. వ్యాస శబ్దార్థము కూడ దానికి తుల్యమైనదని విజ్ఞులకు ప్రత్యేకముగా వివరింప నక్కరలేదు.

పంతులుగారు ఇంత విస్తారముగా చేసిన రచనలకును, ఇతరుల రచనలు వ్యాప్తికి తెచ్చుటకును మూలసూత్రము లేవి ? ఏ తత్త్వము వారి నావేశించి కార్యాచరణ నిమగ్నుల గావించినది? వారి తాత్త్విక దృష్టి ఎట్టిది? వారి ప్రధానాదర్శ మేది? ఈ రెండు ప్రశ్నలకు క్లుప్తముగా సమాధానము చెప్పినచో వారిది సమన్వయ తత్త్వమని, వారి యాద ర్శము విశ్వశ్రేయస్సు అని వెంటనే చెప్పవచ్చును. వారి హృదయములో సమన్వయము, విశ్వశ్రేయస్సు ఎంతగా స్థిర ప్రతిష్ఠ చేసికొన్ననో తెలియుటకు వారి రచనలకు ఆ రెండు శబ్దములు తరచుగా ప్రతి శబ్దించు చుండుటయే ప్రత్యక్ష నిదర్శనము!

# 4

వారి సమన్వయ తత్త్వ స్వరూప మేమి ?

ప్రపంచము నే డనేక విరోధ భావములలో సతమతమవుచున్నది. అనేకమతములు, మతములలో శాఖాంతరములు కలవు. విజ్ఞాన శాస్త్రము మత విశ్వాసముల నన్నింటిని కూకటి వ్రేళ్ళతో పెల్లగించి వేయు చున్నది. పాశ్చాత్య సంస్కృతికి ప్రాచ్య సంస్కృతికి ఘర్షణము, ప్రజా స్వామ్యసంగ్రామములు, పారిశ్రామిక సంగ్రామములు కలవు. ప్రాచీన భావములకు, నవీన భావములకు విరోధము చెలరేగుచున్నది ఆంధ్ర భాషా విషయములో గ్రామ్య గ్రాంథిక వివాదములును గలవు. ఈ విషయము లన్నిటిలో భేదము బాహ్యమైనదనియు అంతర్యమున

నన్నిటి లక్ష్య మొకటే యనియు వారి సమన్వయము. అదియే వారి తాత్త్విక దృష్టి।

వారొకచో 'నాద మంతర్లింగ రూపమున విశ్వమంతటను విల సిల్లుచున్నది. మానవ దేహమున సహస్రారమునందు దేదీప్యమానముగా విరాజిల్లుచున్నది. బుద్ధ క్రీస్తు కృష్ణావతారములం దీ దివ్యతేజమును భక్తులు సందర్శించి చిత్రించిరి' అని వ్రాసిరి. వ్రాయుటే కాదు. విరోధికృత్సంవత్సరాది సంచికలో క్రైస్తవ మతమును గూర్చిన రెండు వ్యాసములును, మహమ్మదు జీవితమును గూర్చి యొకటియు, బుద్ధ జయంతి వ్యాస మొకటియు ప్రచురించిరి. క్రైస్తవ మత సంబంధము లైన రెండు వ్యాసములలో నొకటి క్రైస్తవ మతమన్న భయపడనవ సరములేదని చెప్పుచుండగా, రెండవది భవిష్యత్కాలమున 'ఇండియా' యను కిరీటము క్రీస్తుకు తప్పక దొరుకును, అని క్రైస్తవ మతమయ మగునని ఉద్ఘాటించినది. ఆ సంచికలోనే ఒకే పేజీలో ప్రక్క ప్రక్క పార్వతీ పరమేశ్వరులయు, ఏసుక్రీస్తు, గౌతమబుద్ధుడు, సుజాత, జొరాస్టరుల చిత్రములను ప్రచురించిరి.

అపరోక్షానుభూతియందు 'శంకరాచార్యులు సాపేక్షములైన కర్మ యోగమును సన్యాసయోగమును బుద్ధియోగమును, నిరపేక్షమైన ఆత్మ యోగమునందు వేదాంత రూపమునను సమన్వయము చేసి సనాతన వైదిక మతము నుద్ధరించి ఆచార్యపదము నధిష్ఠించెను' అని పేర్కొనిరి.

వీరశైవులు జైన బౌద్ధ మతములను ఖండించి ఆ మతస్థులను హింసించినను, బౌద్ధమతములోని త్రిశరణములే వీరశైవములో గురు లింగ జంగమ శరణ రూపముల దాల్చినవని సమన్వయించిరి. యోగ విషయములో గూడ పరిభాషలో భేదమే కాని స్వరూపములో భేదము లేదనుటకు యోగమునకును వీరశైవాగమములకును సమన్వయము చేయుచు, ఒక పట్టిక రూపములో ఒకదాని కొకటి యెదురుగా షల్లింగ ములు, షట్ స్థలములు, షడక్షరి, షట్చక్రములు, షడ్వ్యాహృతులు చూపి సిద్ధాంత మొనర్చిరి. 'వీరశైవాగమములందు వేదాంత మంత్ర శాస్త్ర రహస్యములు భిన్నరూపముల సమన్వయమును బొంది భక్తి

యోగ ప్రభావమును నిత్య జీవనమందు విస్తరింపజేసిన' వనిరి. 'ఆదియుగమునందు కర్మపరమైన వైదిక మతము తదనంతరము జ్ఞాన పరమును భక్తిపరమునునై పరివర్తనము పొందినది. వైదిక మంత్రోప స్థిత రుద్రుడు వేదాంతమున శివ స్వరూప పరిణామమును బొందుచు, సర్వ వ్యాపకుడై 'శివోహం' తత్వమును వ్యక్తము చేయుచున్నాడు. శివడు యజ్ఞపురుషుడు, సగుణ నిర్గుణ పరబ్రహ్మము' అని వక్కాణించిరి.

ఈ సమన్వయ తత్త్వము వారికి భగవద్గీతను నిష్ఠతో అధ్యయ నము చేయుటవలననే అబ్బినది. భగవద్గీతకంటె వేద వేదాంగ వేదాంత ములను, సాంఖ్యయోగ భక్తులను, శాస్త్రానుభవములను, సమన్వయము చేయు సద్గ్రంథము మరియొకటి లేదు. అందువల్లనే అర్జునునిచే వ్యామిశ్రములైన వాక్యములతో నా బుద్ధిని మోహింపజేయుచున్నట్లు న్నావు అనిపించింది. ప్రత్యేకముగా గ్రంథ రూపముగా పంతులుగారు రచించిన గ్రంథము భగవద్గీతావివరణ మొక్కటేయని కూడ మనము గుర్తించుకొనవలెను.

ఈ సమన్వయ తత్త్వము మత విషయములతో నాగలేదు. అప్పటి నుండి నేటివరకు వాద ప్రతివాద కారణమైన గ్రాంథిక గ్రామ్య భాషా వాదమును ప్రస్తావించుచు, 'గ్రామ్య భాష గ్రాంథిక భాషగాను, గ్రాంథిక భాష గ్రామ్య భాషగాను మారుచుండుట ప్రకృతి సిద్ధము........ సహజ ధర్మము మారకుండ భాషాభివృద్ధిని జేయుట భాషాభిమానుల విధి'యని యుద్బోధించిరి. విజ్ఞాన శాస్త్ర గ్రంథములలో పారిభాషిక పదములు సంస్కృతమునుండి సృష్టింపవలెనా, పరభాషా పదములనే గ్రహింప వలెనా అను విషయమున 'సంస్కృతభాషలో లేని నూతన పరిభాషకు గాను అన్య దేశ పదములను వాడుట లోకాచార సిద్ధము. ఉన్న పద ములకు బదు లన్యదేశ పదములను వాడుట నిరర్థకము' అని నిర్ధారించి, హిందూ దేశ భాషలు సంస్కృత సంపర్కములేక బలహీనములై కళా విహీనములగుచున్నవని నిర్దేశించిరి. ఈ సందర్భములోనే హిందూదేశ భాషలకు సన్నిహిత సంబంధము కల్పించుటకు సంస్కృతము సాధనము అని సిద్ధాంతము చేసిరి.

పై విషయములు ఇప్పటికి 55 సంవత్సరములకు పూర్వమే పంతులుగారు చెప్పినవి. వారు అభిమానములకు మొగ్గుచూపక, సత్యపథాన్వేషణముచేయు నాదర్శముతో యోగదృష్టితో దర్శింపగలవారు కనుకనే, వివాద విషయములలో సుతిసూత్రముగా మధ్యేమార్గమన్వేషింప గలిగిరి. వారి వచనలలో తరుచుగా నొక యాదర్శము ప్రదర్శితమగు చుండును. మనము మన జీవనయాత్రను దేహ యాత్రార్థము కాక లోక కల్యాణార్థముగా మలచినచో, జీవయాత్రయే దేవయాత్రయై క్రమముగా కైవల్య యాత్రయు, శివయాత్రయు, మోక్షయాత్రయు కాగలదు. వారి జీవితాదర్శ మదియే!

పంతులుగారు పూర్వాచార పరాయణులనుట ప్రసిద్ధమే. కాని వారిది అభ్యుదయ మార్గమున సాగిపోవు నిత్య యౌవన దృష్టి. బొంబాయి నగరమున యౌవనవతులు పాఠశాలలకు పోవుటచూచి యానందించి, ఆ యీడున తెలుగు యువతులు నలుగురు పిల్లల తల్లులై ఉత్సాహమును గోల్పోవుచున్నారని వాపోవుచు, ఆంధ్రదేశమున కీ మహద్దశ ఎప్పుడు వట్టునో తెలియదని చింతపడిరి. అట్లే వాణిజ్య పరిశ్రమల యందును నాంధ్రులు వెనుకపడియున్నారని యాభైయేళ్ళకు పూర్వమే వారు విచారము ప్రదర్శించిరి. ఆంధ్రములో గత సంవత్సరములలో ప్రచురింపబడిన గ్రంథసంఖ్య లిచ్చుచు, అందులో ముప్పాతిక గ్రంథములు పద్యరూపములని తెలిపి, విద్యావ్యాప్తి గల పాశ్చాత్య దేశములందు వచన గ్రంథము లధికముగా నుండు ననుచు తెలుగు గ్రంథకర్తలు వచన రచనల కెక్కువగా పూనుకొన్నచో జ్ఞానము వ్యాపించి భాషాభ్యుదయమును, దేశాభ్యుదయమును కాగలదని ఉద్బోధించిరి.

సంచిక ముఖ చిత్రపటమును గూర్చి 'ఇది యీ యుత్సాహభరితావస్థకు నిదర్శనము. సుందరోద్యానము వసంతకాలము. పుష్ప శోభితము. రూపవతి. సురుచిర వస్త్రాలంకృత, ఎలజవ్వని. కుసుమాపచయము. పరమోత్సాహము' అని వర్ణించిరి. పంతులుగారిని నిత్య యౌవన వసంత మూర్తి ఎంతగా ఆవేశించి యుండెడిదో మరి!

# 5

మరి నాగేశ్వరరాయల రచనలలో ప్రధాన లక్షణము లేవి ? విశ్వ శ్రేయః కావ్యమ్ అని సూత్రించి, శ్రేయసే భూయాసుః అని మంగళా చారణము చేసిన నన్నయ భట్టారకుని ఆదర్శమునే వారును తమ సమస్త రచనలలో కార్యరూపమున బ్రదర్శించిరి. జీవయాత్రను కైవల్య యాత్ర నుగా జేయు నాశయమే వారి రచనలలో విశ్వ శ్రేయస్సు రూపము ధరించినది.

దానికి సాధనముగా పంతులుగారు పరిగ్రహించిన సమన్వయ తత్వమే విశాల దృష్టిగా రూపొందినది. సత్పథమునే తమ గమ్యముగా నెన్నుదురు. తమకు తోచినదే కాక ఇతర మార్గములు దుష్పథములుగా భాసించును. నదీనాం సాగరో గతిః—సర్వ దేవ నమస్కారః కేశవం ప్రతి గచ్ఛతి-మమ వర్త్మాను వర్తంతే మనుష్యాః పార్థ సర్వశః-ఇత్యాది వాక్యముల స్ఫూర్తి కలవారికి ఈ విశాలదృష్టి యలవడును. పూజ్యులైన యాచార్యులు ఉద్దండులైన పండితులు అనేక వ్యాఖ్యలు రచించిన భగవద్గీతవంటి ఉద్గ్రంథమునకు వారు వ్రాసిన టీకా తాత్పర్య వివరణ ములో కొన్ని ఎంతో ముచ్చట గొల్పు స్వతంత్ర వివరణములు కలవు. 'శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్' అను వాక్యమును వివరించుచు, ఆత్మయోగ ధర్మము స్వధర్మమనియు, దేహేంద్రియ ధర్మము పరధర్మమనియు వివరించుట యట్టివానిలో నొకటి. ఆ క్రింది శ్లోకములోనే భగవానుడు ఇంద్రియ విషయములందు రాగ ద్వేషములకు వశము కాగూడదని ఉపదేశించినది గుర్తుకు తెచ్చుకొన్నచో పంతులుగారి స్వతంత్ర వివరణ మెంతయు సమంజసమని రూఢమగును.

గీతా గ్రంథము వ్యాఖ్యానించుటలో వారు ప్రధానముగా తిలకు గీతా రహస్యము నవలంబించినట్లు తోచును. కొంత మహాత్ముని గ్రంథమును అవలంబించిరి. కాని పూర్వాచార్యుల నెక్కువ గౌరవముతో భజించిరి, చేతనైనంతవరకు సమన్వయము చేయుచు అది సాధ్యము కానిచోట్ల, ఎవరిని ఖండించుటకు పూనుకొనక వారి వారి భావము లిట్లున్నవని సంక్షేపముగా ప్రదర్శించి ఔచిత్యము పాటించిరి

వారి రచనలలో నితరులను స్పష్టముగా ఖండింపవలసిన యవసరము వచ్చిన చోట్లను గూడ నిగ్రహము, సౌజన్యము చూపుదురే కాని విషయ ప్రదర్శనములో వెనుకాడరు. ఆంధ్ర వాఙ్మయ చరిత్రలో నేటి ద్రావిడ పరిశోధకుల విపరీత తమిళ వాఙ్మయ ప్రాచీనతా సిద్ధాంతములను విమర్శించుచు 'దామోదరం పిళ్లెగారి మాతృభాషాభిమాన మవ్యక్త సిద్ధాంతములకు గారణమైన' దనిరి ఒక సంవత్సరాది సంచికలో గత సంవత్సరమునం దాంధ్రలోకమునందు కవుల కలహములు ముదిరినవని ప్రస్తావించి యివి జాతి ద్వేషాభిమానములుగా బరిణమించు దురవస్థ నుండి భాషను గాపాడుట తమ విధి యని భాషాభిమానుల నుద్బోధించిరి.

పంతులుగారి రచనలు చూచిన వారికి వారి సర్వతోముఖ వ్యాసంగమును, గ్రహించిన ప్రతి విషయమందును సమగ్రపఠన పరిశోధనములు నద్భుతము లనిపించును. ఆంధ్ర వాఙ్మయ సూచికకు పీఠికాప్రాయముగా రచించిన ఆంధ్ర వాఙ్మయ చరిత్ర మిందులకు నిదర్శనము. ఆంధ్ర కవులను వాఙ్మయమును గురించియేకాక తమిళాదిభాషా వాఙ్మయములను గూర్చి కూడ నప్పటికి వచ్చిన గ్రంథ జాతమును, వ్యాసశతములను మూల కావ్యములతోపాటు ఎంత క్షుణ్ణముగా నెట్టి పరిశీలనా దృష్టితో పఠించిరో, ఆ గ్రంథమే ప్రత్యక్ష సాక్ష్యమిచ్చును. అజంతా విహారములు అను సుదీర్ఘ వ్యాసములో గూడ నీ లక్షణము స్పష్టముగా చూడనగును.

పంతులుగారివలె బహుముఖ వ్యాసంగములు గల వారికి బహు గ్రంథ పఠనము అస్పష్టతకు కారణమగుట సామాన్య ధర్మము. కాని యది ఎంతమాత్రమును వారి రచనల కన్వయించదు. ఎంత విపుల విషయమైనను స్పష్టముగా సులభముగా చెప్పుటలో వా రద్వితీయులు. కావలసినచోట్ల వారు పట్టికలు సిద్ధము చేయుదురు. ఆంధ్ర వాఙ్మయ చరిత్రలోని పట్టికలు విషయావగాహనమున కెంతయు నుపకరించును. ఇక అజంతా విహారముల వ్యాసము చదివినవారికి కలుగు నాశ్చర్యమునకు మేర యుండదు. ఆ ప్రదేశము చేరు మార్గములతో ప్రారంభమైన

వ్యాసము ఆ విహారము లెట్టి రమణీయ ప్రదేశములో నిర్మింపబడినవో వర్ణించి ఏ గుహ ఏ యాకారమున నున్నదియు, దేనిలో నేతావున ఏ చిత్రము వ్రాయబడినదో స్పష్టముగా కన్నుల కట్టినట్లు ప్రదర్శించును. ఆ చిత్రములో రెండవ గుహాలయములోని పద్మపాణి బోధిసత్త్వుని చిత్రము ఉత్తమోత్తమమైనదిగా చిత్ర కళావిదులు భావింతురు. పంతులుగారు దానినే విస్తరించి 'మౌన వ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వ' మిత్యాది దక్షిణామూర్తి భావనతో సమన్వయించి, ఆ మహా చిత్రములోని తక్కిన వివిధ భాగములను ఉత్సాహముతో వర్ణించినది చదివినవారికి చిత్రకళ యందు పంతులుగారి యభిరుచి ఎంత సున్నితమైనదో విస్మయము కలిగించును. అజంతా విహారముల స్వరూపము ఆ వ్యాసము చదివినప్పుడు కలిగినంత స్పష్టముగా కలుగుటకు బహు కాలము, బహు శ్రద్ధగా, బహు కష్టముతోగాని లభ్యముకాని బహు గ్రంథములను పఠించినవేకాని కలుగదనుట యతిశయోక్తి కాదు.

ఇతర గ్రంథములకు వారు వ్రాసిన ప్రస్తావనలు తొలిపలుకు లందు ముఖ్యముగా వారి గుణగ్రహణ పారీణత గోచరించును. ఈ లక్షణమునకు బసవ పురాణ ప్రస్తావము, మాలపల్లికి, స్నానఘట్టమునకు వ్రాసిన తొలిపలుకులు దృష్టాంతములు. బసవ పురాణ ప్రస్తావము వారి మత తత్త్వ సమన్వయమునకు నికషోపలము. నేటి కాలపు గ్రంథమైన. మాలపల్లిని వారెన్ని విధముల శ్లాఘించిరో చూడదగును. శైలిని గూర్చి వ్రాయుచు, "తెనుగు మాటలు, తెనుగు దేశము, తెనుగు సాహిత్యము, తెనుగు హృదయము, తెనుగు సంకల్పము మాలపల్లి కనిర్వచనీయమైన ప్రతిభను సమకూర్చినవి . వాడుక భాషయందు నవరస భరితమైన కావ్యమును రచించిన లక్ష్మీనారాయణగారు ధన్యులు....భారతీయ వేదాంతవిజ్ఞాన సారమైన విశేష ధర్మోపదేశముతో....కథ నుపసంహారము చేయుట సర్వోత్తమముగా నున్నది" అని ఉగ్గడించిరి.

పంతులుగారి కెంత సౌజన్యమున్నను, సత్యపథము నుండి తొలగుట కంగీకరింపరు. ఆ తొలిపలుకులలోనే "సందర్భానుసారముగా చేసిన వర్ణనలు, వ్యాఖ్యానములు జ్ఞానదాయకములైనను కావ్యరసాను

సంధానమునకు ప్రతిబంధకములై కావ్యము పురాణ పరిణామమును బొందినది.'' అని వ్రాసిన దానితో ఎట్టినిశితవిమర్శన మున్నదో బోధపడ గలదు. ఇది ముఖ్యముగా నేటినవలాకారులును, విమర్శకులును గమనింప దగిన సూక్ష్మధర్మము !

అట్లే బసవ పురాణ ప్రస్తావములో "వీరశైవము తలపెట్టిన కులావరణ నిర్మూలనము దుస్తరమైనది. లింగాయతులు, జంగములు, సాలెలు జాంద్రలు ప్రత్యేక కులమువారై మరికొన్ని కులము లేర్పడి నవి....భక్తిప్రధానమైన వీరశైవము నిర్జీవమైన యాచార సంప్రదాయ బద్ధమై సాంఘిక ప్రయోజనములకును, మానవ కల్యాణమునకును నిరుపయోగమైనది" అని వ్రాయుటకును వారెంతమాత్రము వెనుకాడ లేదు.

వారి యుదాత్త గంభీర శైలి ముఖ్యముగా నెన్నదగినది. వారి కాయమువలెనే వారి యాశయములును ఉన్నతములు. వారి చాయా పటము చూచు వారికి నిండుదనము, సౌమ్యతతోపాటు, ఒకానొక విచిత్రమైన దూరభావము కూడా కానవచ్చును. అది యల్పబుద్ధులకు భయము కూడ కల్పించును. ఇక్కడ కుబుద్ధులకు అల్పులకు కుటిలులకు స్థానము లేదని యట్టి వారిని దరిచేరనీయని ఉదాత్త భావమే !

పంతులుగారి రచన లన్నిటిలో వారికి అభిమానపాత్రమైనవి సంవత్సరాది సంచికలు, వానికి వారు వ్రాసిన పీఠికలు, ప్రస్తావములు నని మా విశ్వాసము. వానిలో పంతులుగారు తమ సర్వ శక్తులు సంపూర్ణముగా వినియోగించెడివారు ! అవి సామాన్యముగా వసంత శోభను వర్ణించుటతో నారంభమగును. సూర్య సిద్ధాంతము ననుసరించి గత సంవత్సరముతో సృష్ట్యాది నుండి 195 కోట్ల యాభై ఎనిమిది లక్షల, ఎనభై ఐదువేల, ఎనిమిది వందల పై చిలుకు సంవత్సరములు గతించినవని లెక్కవేసి ,ఈ యనంత కాలములో సంవత్సరకాల మెంత స్వల్పమో సంభావింతురు. ఆ పైన నీ గత సంవత్సర కాలములో ప్రపంచమునందలి ప్రధాన పరిణామముల సమీక్ష చేసి ప్రత్యేకముగా భరతభూమిలోను, ఆంధ్రభూమిలోను జరిగిన విశేషములు సమగ్రముగా

ప్రదర్శింతురు. తుద కా సంచికలోని వ్యాసములను చిత్రములను స్థూలముగా వివరింతురు.

ఇది సామాన్య ధర్మమైనను, వారికి ప్రతి సంవత్సరాది సంచికలోను ఏదో ఒక విశేష విషయమునకు ప్రాధాన్యమీయవలెనని గొప్ప యాలోచన ముండెడిదను విషయము 1916 నల సంవత్సరాది సంచిక ప్రస్తావన చదివినప్పుడే కాని స్ఫురింపలేదు. ప్రతిసంవత్సరము చేయు నాలోచనలే కాక ఎన్నో సంవత్సరములు ముందుగానే ఒక ప్రణాళికాబద్ధముగా వారి సంచికలు ప్రచురింపసాగిరను విషయము బోధపడినది. ఆ ప్రస్తావములో పూర్వము ప్రచురించిన ఆరు సంచికల విషయములు ప్రస్తావించి ఏ సంచికలో నేది ప్రముఖమో వివరించిరి. సాధారణ సంచికలో విద్య, జీవిత చరిత్రములును, విరోధికృత్తులో సాంఘిక మత విషయములును, పరీధావిలో పంచమ జార్జి రాజ్యాభిషేకముతో ఢిల్లీ నగర చరిత్రము స్వదేశ సంస్థానముల చరిత్రలును, ప్రమాదీచలో వాఙ్మయ సంబంధములును, ఆనందసంచికలో మహాపురుషుల చరిత్రములును, రాక్షసలో ఐరోపా మహా సంగ్రామ చరిత్రయు ప్రముఖస్థానమలంకరించెనని తెలిపి, నల సంచికలో వ్యవసాయాభివృద్ధి, నాట్యరంగము, చిత్ర లేఖనము, రూపకల్పన, దేవాలయములు, ప్రాధాన్యము వహించినవని వివేచన మొనర్చిరి. ఈ దృష్టితో చూచినచో ప్రస్తావనలు వారి రచనలలో మకుటాయమానము లనిపించును.

సర్వకార్యములందువలె తమ రచనలం దంతట విశ్వశ్రేయస్సు ప్రతిఫలింపజేయుచు తమ జీవయాత్రను శివయాత్రనుగా జేసికొన్న నాగేశ్వరరాయలకు నమోవాకములు :

ఒరులేయవి యొనరించిన
నరవర యప్రియము తన మనంబునకగు, దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమ ధర్మ పథముల కెల్లన్.

 (మహాభారతము)

(భారతి సెప్టెంబరు-1965)

# పూర్ణపురుషుడు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

## మహాపురుషులు—పూర్ణపురుషులు

"ఓం పూర్ణ మదః పూర్ణ మిదం
పూర్ణా త్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణ మే వావశిష్యతే."

మహాపురుషు లనదగినవారు చాలా అరుదుగా ఉంటారు. విశేష మహత్త్వము ఏ ఒక్క అంశలో చూపినా, అట్టివారిని మహాపురుషులన వచ్చును. ఆ అంశలో వారు లోకానికి మార్గదర్శకులుగా ఉంటారు. మహాకవులు, మహాస్థపతులు, శిల్పులు, చిత్రకారులు, ఉత్తమ వాగ్గేయకారులు ఈ కోవలోని వారే. ఏ శాస్త్రములోనైనా విశిష్టమైన మార్గము చూపిన వారందరూ మహాపురుష శబ్దవాచ్యులే. క్షణక్షణమూ నూతన వికాసము పొందుతున్న ఆధునిక విజ్ఞానశాస్త్రములో కొత్తకొత్త మెట్లువేసిన గెలీలియో, న్యూటను, మెండలీసు, డార్విను, మార్కోనీ, ఐన్‌స్టీన్, పాశ్చర్ ఇత్యాదు లెందరో మహాపురుషు లనదగినవారున్నారు. చార్వాక దర్శన మంటూ ఒకటి గ్రంథరూపంగా ఇప్పుడు మనకు లభ్యము కాకపోయినా, చార్వాకుడు కేవల పురాణపురుషుడు కాడు. అతడు "శరీరము పృథివ్యాపస్తేజోవాయువు లనే నాలుగు భూతములనుండి, సురాబీజముల నుండి మదశక్తి పుట్టినట్లే, ఉద్భవించిన చైతన్యమే; దేహముకంటె వేరుగా ఆత్మ అనేది లేదు; వేదములు, అగ్నిహోత్రాది కర్మలు పౌరుషమూ, బుద్ధి లేనివారి కోసము పుట్టిన బ్రదుకు తెరువులు; బ్రదికినన్నాళ్ళు అప్పుచేసి ఐనా సుఖంగా బ్రదుకవలె, ఈ శరీరము బూడిద ఐన తర్వాత

మళ్ళీ ఎట్లా వస్తుంది?" అని నిర్భయముగా చాటిన నాస్తిక దర్శనకర్త; అటువంటి చార్వాకుడు నిస్సందేహముగా మహాపురుషుడే! ఎంతో జన నాశనానికి కారకులైనారని నేడు లోకము నిందించుట పరిపాటియైన హిట్లరు, ముసొలోనీలవంటి నియంతలు కూడా మహాపురుషులు కాదన డము మన అల్పత్వాన్ని, అజ్ఞానాన్నే ప్రదర్శిస్తుంది. మిక్కిలి ఊర్జ స్వంతమైన సత్యము ఎవరిలో ఉన్నా వారిని మహాపురుష లనడమే ధర్మము. రావణకుంభకర్ణులు హిరణ్యాక్ష హిరణ్య కశిపులవంటి పురాణ పురుషులుకూడా మహాపురుషశబ్ద వాచ్యులే!

మహాపురుషులలో వెలిగిన మహత్త్వము మంటగా మండి లోకాన్ని దహించినప్పుడు వారిని గర్హిస్తాము; అట్లుకాక అది దివ్యజ్యోతియై లోకాన్ని చల్లబరచి కళ్యాణకరమైన మార్గములో నడిపించినప్పుడు, అట్టివారిని పూజిస్తాము. అంతేకాని రెండురకాల మహాపురుషులను ప్రస్తావింపక ఊరు కోలేము. వారంత గొప్పవారు కనుకనే, కావ్యములు కాంత సమ్మితముగా ఉపదేశిస్తవి అని కావ్యమర్మజ్ఞు లంటూ, అని 'రామాదివత్ వర్తితవ్యం, నతు రావణాదివత్' అని శ్రీరాముని నామము స్మరించిన వెంటనే రావణుని పేరు స్మరించక తప్పలేదు.

మహాపురుషులకు వారికి అభిమానపాత్రమైన విషయములో ఎంత అతిశయమున్నా, తక్కిన విషయాలలో వారు అతిసామాన్యులుగా ఉండ వచ్చు. ఆధునిక విజ్ఞానానికి మూలపురుషుడని పాశ్చాత్యులు ఉద్ఘోషించే ఆర్కిమిడీసు "బాతు"లో స్నానంచేస్తూ ఉండగా, నీటిలోవేసిన వస్తువుల భారాన్నిగూర్చిన సిద్ధాంతము స్ఫురించగానే, ఆనందపరవశుడై ఉన్న వాడున్నట్లుగా దిగంబరుడై వీధివెంట పరుగెత్తి వెళ్ళినాడంటారు. నెపోలి యనువంటి మహావీరునికి రాత్రులు పిల్లులంటే భయమట. ఒకరాత్రి తన గదిలో అల్లరిచేసిన పిల్లికి భయపడి దానిని పిస్తోలుతో కాల్చగా గురితప్పిన దట. ఇంగ్లండును రక్షించిన నెల్సనుపేర లండనులో ట్రఫాల్గరుస్క్వేరు నిర్మించి గౌరవించారు; కాని ఆయన వ్యక్తిగతమైన అవినీతి జీవితము కూడా జగద్విదితమే. అలెగ్జాండరు మద్యపానమత్తుడై ఉన్న సమయ ములో, అతని విజయాలకు నిజముగా కారకులైనవారు అతని సేనాధ్య

క్షులే అని ఉద్ఘాటించి నందుకు, క్లిటసు అనే తన పెంపుడు సోదరుణ్ణి, పైగా తనకు పలుమారులు ప్రాణరక్షణచేసిన ప్రాణదాతను శూలముతో పొడిచి చంపివేసినది చరిత్ర ప్రసిద్ధము.

మహాపురుషులు, మహాత్ములు తమ మార్గములో ఎంత మహత్త్వము కలవారైనా, ఇతర విషయాలలో పసివారివలె ఉండడము కూడా కద్దు. సినిమారంగములో చార్లిచాప్లిను యుగపురుషుడు. గాంధీమహాత్ముడు ఇంగ్లండు వెళ్ళినప్పుడు వారిని దర్శించడానికి చార్లీచాప్లిను అనుమతి కోరగా, మహాత్ముడు "ఎవ రాయన?" అని అడిగినట్లు పత్రికలలో చదివి నాము. పైగా అవి చార్లీచాప్లిను ప్రతిష్ఠ శిఖరాగ్రము అధిష్ఠించిన రోజులు! షా వలె పెంకెతనముగా మాట్లాడేవాడు కాడుగదా మహాత్ముడు, అది చదివినప్పుడు మాబోంట్లకు "ఈ అజ్ఞానమునకు" మహాత్మునియందు గౌరవము శతగుణముగా అతిశయించినది. అట్టిది మహాత్ములలో రాణి స్తుంది.

మహాత్ముడు విద్యార్థిగా ఉండగా తాను పాఠ్యగ్రంథాలే కాని ఇతర ఇంగ్లీషు పుస్తకాలు చదవలేదని ఆత్మకథలో వ్రాసుకొనినారు. ఐనా ఆయన ఇంగ్లీషు శైలిలో పటుత్వము, తేటదనమూ అనితరసాధ్యమైనవి కదా! రాజకీయ నాయకుడైన తర్వాతనైనా ఆయన చేసిన ఆర్థిక రాజ కీయ గ్రంథపఠనము కూడా చాలా తక్కువే. ఐనా కార్యరంగములోకి దిగి నప్పుడు, ఆయన బుద్ధి కర్తవ్యమును సులువుగా గ్రహించి, లక్ష్యము వంకకు సూటిగా రామబాణమువలెనే ప్రసరించి భేదించేది. ఆయన ఉప్పు సత్యాగ్రహము ప్రారంభించినప్పుడు ప్రపంచములోని ప్రసిద్ధ రాజ కీయార్థికవేత్తలు అది ఒక వెర్రిఊహగా వర్ణించి నవ్వినారు. కాని దాని మహత్తర పరిణామము చూచిన తర్వాత, ఆ గ్రాంథిక పండితులు తామే వెర్రివాళ్ళమని గ్రహించి, తమ సిద్ధాంతసూత్రాలు మార్చుకొన్నారు మహాపురుషుల చర్యలే ఆ విధంగా ఉంటవి. అట్లా కొత్తదారులు తొక్కిన వారు కనుకనే వారు మహాపురుషులు!

కాని పూర్ణ పురుషులు అటువంటివారు కారు. వారికి ఏదో ప్రత్యేకాంశ ములో అపరిమితమైన శక్తి మహాపురుషులకువలెనే ఉండడము అసంభ

వము కాదు కాని అసాధారణము. అందువల్ల పూర్ణపురుషులు ఉత్తమ విషయాలన్నిటిలో మహాపురుషులు పెట్టిన ఒరవడిలో వారి అడుగుజాడలలో నడుస్తారు. దేదీప్యమానమై మిరమిట్లు కొలుపుతూ ఏకముఖంగా ప్రసరించే వెలుగువలె వారు వెలుగకపోవచ్చును. వారి ఆత్మలోని వెలుగు సర్వతోముఖమై ఎల్లప్పుడూ ప్రజ్వలిస్తుంది. ఆ వెలుగు ఎప్పుడూ చల్లదనమే కలిగిస్తుంది, తపింపచేయదు; కల్మషాన్ని హరిస్తుంది కాని దాన్నికూడా బాధపెట్టకుంటా తొలిగిస్తుంది. వారి ప్రతిభ సమస్త విషయాలను స్పృశిస్తుంది, స్పృశించిన దానినల్లా ఉజ్జీవింపజేస్తుంది. లోకకల్యాణకరమైన మార్గములో ప్రవేశపెడుతుంది. అట్టివారే పూర్ణపురుషు లనదగినవారు!

పూర్ణపురుషుల ప్రజ్ఞ విశ్వవిస్తారముగా వ్యాపించడానికి సర్వసామాన్యముగా సాహిత్యము పునాదిగా ఉంటుంది. సాహిత్య స్వభావమే ఎన్నిటినో కూర్చుకుని ఏర్పడడము. సాహిత్య శబ్దములోనే కూడిఉండడము, హితముగా మనిఉండడము ద్యోతిత మవుతుంది. కవికి సాహిత్యవేత్తకు చతుష్షష్టి కళలలో జ్ఞాన ముండవలెనని మమ్మటభట్టాది సాహిత్యతత్వజ్ఞులు నిర్ధారణచేసినారు. సాహిత్యమునుండి వారల దృష్టి సంగీతము మీదికి, నాట్యము, చిత్రకళ, శిల్పము, స్థాపత్యము మొదలగు లలితకళలు అన్నిటిమీదికి మళ్ళుతుంది.

ఈ విధంగా లలితకళ లన్నిటిమీదను నిష్ఠమైనవారి బుద్ధి, లలితకళల ఆవిర్భావానికి మూలమూ, వాని ప్రవర్తగత్వానికి ధ్యేయమూ ఐన మానవసంఘముమీదికి తిరుగుతుంది. వారు కష్టమూ బాధా ఎక్కడ కనపడినా చూచి భరించలేరు. చూచి జాలిపడి కన్నులు ఆవలికి త్రిప్పుకుని ఊరుకోలేరు. సర్వవిధాలా ఆర్తులఆర్తి తొలగించడానికి పూనుకుంటారు. అన్యాయము ఎక్కడ ఉన్నా, సరిచేయడానికి యత్నిస్తారు. అజ్ఞానము బహురూపాలుగా లోకాన్ని ఆవరించి వారికి కనిపిస్తుంది. అజ్ఞానాంధకారంలోకి తమ ఆత్మలోనుంచి కాంతిరేఖలు ప్రసరింపజేసి వెలిగిస్తారు. ఉన్నతాదర్శాలు కలవాళ్ళు వారికి తటస్థపడితే, వారిని దేవాలయంలో దేవుణ్ణి పూజించినట్లు పత్రం పుష్పం ఫలం తోయం సమర్పించి కృత

కృత్యులమయినా మనుకోరు. అట్టివారి ఆదర్శసిద్ధికి యథాశక్తిగా తోడ్పడి, వారికి అనుయాయులైనట్లే అనుసరిస్తూ, తమతోపాటు ఇతరులను అనుసరింపజేస్తారు.

సాంఘికసేవ వారిని తరచుగా రాజకీయాలలోకి లాగుతుంది. కాని వారి రాజకీయాలు అధికార పదవులకు ప్రాకులాడేవి, తమ వారికి మాత్రమే మేలుకూర్చేవి కావు. అని విశ్వమానవ కల్యాణానికి దోహదముచేసే రాజకీయాలు!

మహాపురుషుల బుద్ధి పరిమితవ్యాప్తి కలది కావచ్చును; వారు కఠినులూ, నీతిబాహ్యులూ కూడా కావచ్చును. పూర్ణపురుషుల బుద్ధి కాని, ప్రవృత్తి కాని అట్టిదోషముల కెన్నడును పాల్పడదు. దానికి ముఖ్యమైన కారణము అనేక జన్మలలో చేసిన పుణ్యఫలమంతా వారికీ జన్మలో ప్రారబ్ధకర్మగా మూర్తీభవించడమే. నీచములు అవినీతికరములు లోకద్విష్టములు ఐన కార్యములవంకకు వారి ప్రవృత్తి ప్రసరింవదు. అట్టివాటి వ్యామోహమునుండి ప్రయత్నపూర్వకముగా తమ బుద్ధిని మళ్ళించుకొనవలసిన అవస్థ వారికీ జన్మలో అవసరము లేదు. ఆ భ్రాంతులూ వాటిని నిగ్రహించడమూ, పూర్వజన్మలోనే సాధనచేసి ఈ జన్మ ఎత్తిన వారు! ఆత్మలోని అవినీతిని నిగ్రహించుకొనడానికి ఈ జన్మలో వారు శక్తి వ్యయముచేయ నవసరములేని పుణ్యపుంజము మూర్తీభవించిన వారు పూర్ణపురుషులు! గీతలో ఆత్మసంయమ యోగమనే అరవ యధ్యాయములో, అర్జునుడు "యోగసాధన చేసియు మనశ్చాంచల్యముచే సిద్ధి పొందలేనివాని గతియేమి?" అని ప్రశ్నింపగా, శ్రీ కృష్ణభగవానుడు, "కల్యాణకృత్తు ఎన్నడును దుర్గతిని పొందడు నాయనా! పుణ్యలోకములలో కొంతకాలము గడిపి సదాచారులైన సంపన్నుల యింట పుట్టును. లేక ధీమంతులైన యోగుల కులమునందే జన్మించును. అట్టి జన్మ దుర్లభతరము. ఆపైన నతడు పూర్వజన్మ జ్ఞానమును పెంపొందించుకొనుచు, తిరిగి యోగసిద్ధికొరకే యత్నించును.

"పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః,
జిజ్ఞాసు రపి యోగస్య శబ్దబ్రహ్మా తివర్తతే.

ప్రయత్నా ద్యతమానస్తు యోగీ సంశుద్ధ కిల్బిషః
అనేక జన్మ సంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్ ।"

అని అభయ మిచ్చినాడు. ఇందులో 'శబ్ద బ్రహ్మాతివర్తతే' అనే పద బంధానికి పూర్వాచార్యుల వివరణ లిచ్చి నాగేశ్వరరాయలు క్లుప్తముగా "కర్మయోగి ఆత్మయోగి" అని వివరించినారని గమనింపదగినది.

పూర్ణపురుషు లైనవారి బుద్ధి సాహిత్యమూలముగా ఆరంభమై, కర్మయోగములో ప్రవృత్తమై, ఆత్మయోగముగా పరిణమిస్తుంది. అప్పుడే వారికి పూర్ణపురుషత్వము సిద్ధిస్తుంది. అందువల్లనే వారి సర్వ ప్రయత్నములు సర్వతోముఖముగా ప్రసరిస్తవి. ఆత్మవిద్య సాధన చేసేవారికి ప్రాప్తమయ్యే ఉత్తమసిద్ధి సర్వాత్మ భావము. శ్రీ శంకర భగవత్పాదులు తమ శ్రీ దక్షిణామూర్తి స్తోత్రములో ముఖ్యముగా ప్రతి పాదించినది సర్వాత్మభావమే. దాని ఫలశ్రుతి యిట్లున్నది:

"సర్వాత్మత్వ మితి స్ఫుటీకృత మిదం యస్మా దముష్మిన్ స్తవే
తేనాస్య శ్రవణా త్తదర్థమననాత్ ధ్యానాచ్చ సంకీర్తనాత్,
సర్వాత్మత్వ మహావిభూతి సహితం స్యా దీశ్వరత్వం స్వతః
సిద్ధ్యే త్తత్పున రష్టధాపరిణతం చైశ్వర్య మవ్యాహతమ్."

సర్వాత్మ భావము సిద్ధించిన పురుషుడు ఆ బ్రహ్మస్తంబపర్యంతమైన సమస్త సృష్టిలో ఆత్మనే దర్శిస్తాడు. ఆత్మనే అంతటా చూచేవారికి మోహశోకా లుండవు. "తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః" అని ఈశావాస్య మనుచున్నది. అట్టివారికి "ఆత్మవత్ సర్వభూతాని" భాసిస్తవి దీనినే జర్మను తత్త్వవేత్త కాంటు నీతిశాస్త్రము (Ethics) మూలసూత్రముగా మలచినాడు. అదియే మహాభారతములో ధర్మపథ ముల కన్నిటికి పరాయణముగా వక్కాణింప బడినది. ఆ పద్యమే శ్రీనాగేశ్వరరాయలు ఆంధ్రపత్రికకు ఒరవడిగా గ్రహించిసంపాదకీయము శిరోభాగమున అలంకరించేట్లు చెసినారు

"ఒరు లేయవి యొనరించిన
నరవర, యప్రియము తన మనంబున కగు, దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథముల కెల్లన్."

సర్వాత్మ భావము కార్యరూపము ధరించినప్పుడు ఏ విధంగా ఉండునో ఈ పద్యము వర్ణిస్తున్నది.

సర్వభూతములందు ఆత్మభావము ప్రకాశించిన వారికి ప్రకృతి సిద్ధముగా సర్వభూతములయందు ప్రేమ, దయ, నిండియుండును. ఎవ్వరియందును శత్రుభావ ముండక అంతటా మైత్రియే ప్రసరించును. ఇతరుల కోపములు వారు సులభముగా గ్రహింపగలరు; కాని వాటిని కఠినముగా నిందింప బూనుకొనక, మృదువుగా సరిచేయుదురు. హింస వారి స్వభావమునకే విరుద్ధము కనుక అహింస అభ్యాసము చేయకయే వారికి సిద్ధించును. సత్యమే వారికి భాసించుచుండుటచే, వారు సత్పథము నుండి ఎన్నడు తొలగరు. వారలు హిమాచలమువలె ధీరోన్నతులు, మహోదధివలె శాంతగంభీరులు. వారు లోకమంతటిని తమ కరుణాపాంగ ముతో విలోకింపగలరు, సమస్త లోకాంచలములను చల్లగా స్పృశింప గలరు!

అన్ని శాస్త్రములలో మాకు ప్రవేశ మున్నది. అన్ని విద్యలలో మాకు నైపుణ్యమున్నది. అని ప్రదర్శించుకొనుటకు వివిధ మార్గములలో కొంచమైనను సాధన చేయువారున్నారు! అట్టి వారిని ఆంగ్లములో "Jack of all Trades" [జాక్ ఆఫాల్ ట్రేడ్సు] అని అంటారు. అట్టి వారిని శ్రీ కాశీ కృష్ణాచార్యులవారు "చిల్లర దుకాణము" లని చమత్క రించేవారు. అట్టి వారికిని పూర్ణపురుషులకును ఏమాత్రము పోలిక లేదు. ఛాందోగ్యములో ఉద్దాలకుడు "త మాదేశ మప్రాక్ష్యో యే నాశ్రుతగ్ం శ్రుతంభవత్యమతంమతంఅవిజ్ఞాతం విజ్ఞాతమ్" అని శ్వేతకేతువునుప్రశ్నిం చెను. ఏది తెలిసికొన్నచో సర్వము తెలియునో, ఇక తెలిసికొనవలసినది ఉండదో, ఆ వస్తువు తెలిసికొన్నావా, అని ఆ ప్రశ్న తాత్పర్యము. ఆ వస్తువు దర్శనభాగ్యమే కొంతయినా ఉన్నవాడే పూర్ణపురుషులు.

కాబట్టి మహాపురుషులకంటె కూడా పూర్ణపురుషులు అరుదు! పూర్ణ పురుషులై యుండికూడాఏదోఒక విషయములో నైనామహాపురుషత్వము కూడా సాధించినవారు ఎన్నడోకాని జన్మించరు. శ్రీ కాశీనాథుని

నాగేశ్వరరాయులు మహాపురుషత్త్వము కూడా సాధించిన అసాధారణ పూర్ణ పురుషుల కోవలోనివారు !

బిరుదములు ప్రతాపనామములు. అని సార్థకములైనప్పుడు ఆ వ్యక్తుల స్వరూపమును సూత్రప్రాయముగా ప్రదర్శించును. ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు వారి కిచ్చిన కళాప్రపూర్ణ పట్టము వారి పూర్ణ పురుషత్వమును లాంఛనప్రాయముగా సూచించునది. 1924 లో జరిగిన ఆంధ్ర మహాసభలో వారికి ఏకగ్రీవముగా నిచ్చిన దేశోద్ధారక బిరుదము వారి పూర్ణపురుషత్త్వమునే నిర్ధారించును. ఇక వారికి మహాత్ముడిచ్చిన విశ్వదాత బిరుదమో, దాతృత్వములో వారికున్న మహాపురుషత్వమును కూడా ఉద్ఘాటించును. నాగేశ్వరరాయులు చేసిన మహత్కార్యము లెన్నో ఉన్నవి. ఐనా వారి పేరెత్తగానే అందరికీ ముందుగా స్ఫురించేది వారి దాతృత్వము. వారు కర్ణుడు, శిబివంటి మహాదాతల కోవలోనివారు. లక్షలు దానముచేసిన శ్రీ నాగేశ్వరరాయులు శివైక్యము పొందేనాటికి, వారికి లక్షల ఋణ మున్నదంటే వారి దాతృత్వ మహత్త్వమునే గోచరింప జేస్తుంది.

ఈ విధమైన మహాపురుషత్త్వ సిద్ధికల అసాధారణ పూర్ణపురుషత్వము అనేక జన్మలలో చేసిన సాధనవలననేకాని సిద్ధింపదు. భగవద్గీతను ఆచార్య పురుషులు బహువిధముల వ్యాఖ్యానించి యున్నారు. నాగేశ్వర రాయులు భగవద్గీతను పీఠికలో ఏమన్నారు ?

> "భగవద్గీతలు ప్రత్యేకమతస్థుల కేర్పడిన
> మత గ్రంథము గాకను మానవాభ్యుదయమున
> కనుకూలమైన పూర్ణ యోగశాస్త్రము."

భగవద్గీతను వారి గ్రంథమందంతటను మరల మరల పూర్ణ యోగ పరముగానే వ్యాఖ్యానించుట మనసు ప్రత్యేకము గమనింపదగినది. వారు గ్రంథరూపముగా వ్రాసినది ఒక్క భగవద్గీతా వ్యాఖ్యానమే. పూర్ణ పురుషులు కనుకనే సర్వమత సమన్వయ రూపమైన భగవద్గీతా గ్రంథమునే వ్యాఖ్యానించుటకు వారు పూనుకొనినారు. వారందులో దర్శించినదియు పూర్ణయోగమే !

# 2

## బాల్య యౌవనములు

శ్రీ నాగేశ్వరరాయలు ప్రభవ చైత్ర బహుళ బుధవారము ఆంధ్ర పత్రిక (1-5-1867) కృష్ణాజిల్లా ఎలకుర్రు గ్రామములో జన్మించిరి. వీరిది పండిత త్రయములో శ్రీపతి పండితుల వంశమని ప్రసిద్ధికల ఆరాధ్య బ్రాహ్మణ కుటుంబము. ఈ శ్రీపతి పండితులు శివుని పరమేశ్వరత్త్వమూ, శివభక్తుల అతిశయమూ స్థాపించుటకై పట్టుపచ్చడములో చంద్రనిప్పులను కట్టి బెజవాడలో ప్రదర్శించెనని బహుకాలమునుండి ప్రసిద్ధి కలదు.

నేడు ఆరాధ్య బ్రాహ్మణులలో యజ్ఞోపవీతముతోపాటు ఇష్టలింగ ధారణముచేసే ఆచారము నియతముగా ఉన్నది. వారికి శైవదీక్ష ఉన్నట్లే ఉపనయనాది వైదిక సంస్కారాలు కూడా ఉన్నవి. ఈ విధమైన సామరస్యము సాధించిన శైవులు, ఆంధ్రదేశములోని ఆరాధ్యశాఖవారే కాని ఇతరులు ఎక్కడను లేరనియు, ప్రస్తుతము మైసూరులో అక్కడక్కడ అట్టి వారున్నను, వారు ఆంధ్రదేశమునుండి పూర్వమెన్నడో వలసపోయిన ఆరాధ్యబ్రాహ్మణులేయనియు తద్విదులు చెప్పుచున్నారు. ఆరాధ్యబ్రాహ్మణులలో ఇష్టలింగ ధారణము పండితత్రయ కాలములో లేదనియు, తర్వాత నెప్పుడో అవలంబించిరనియు, శ్రీ కె. వి. లక్ష్మణరావుగారి వంటివారు సూచించిరి. కాని నాగేశ్వరరాయలకు ఈయాచారము పండితత్రయ కాలములోకూడా నుండెనన్నట్లు విశ్వాసము కలదని వారి బసవపురాణపీఠికలో కొన్ని వాక్యములవలన స్ఫురించుచున్నది.

ఏది ఎట్లున్నను, ఆరాధ్యబ్రాహ్మణశాఖలో పూర్వాచారముల యందు శ్రద్ధ, తపస్సునందు తీవ్రమైన నిష్ఠ ఉన్నంత విస్తారముగా ఏ ఇతర బ్రాహ్మణశాఖలోను లేదనుట అతిశయోక్తి కాదు. ఆ నిష్ఠవలన వారిలో నెందరికో అద్భుత ప్రజ్ఞలు సిద్ధించెడివి. పూర్వాచారనిష్ఠ ఇతర శాఖలలోవలెనే, నేటికాలములో, వారిలోగూడ క్షీణోన్ముఖ మవుచున్నను, నాగేశ్వరరాయలు జన్మించునాటికిని, వర్ధిల్లిన నాటికిని ఏమాత్రమును క్షీణించి యుండలేదు.

వారి తండ్రిగారు బుచ్చయ్య అయ్యవార్లంగారు షట్కాల శివ పూజాపరాయణులు. తల్లి శ్యామలాంబగారు గణార్చనాపరులైన ఇవటూరి సోమనాథశాస్త్రిగారి కుమార్తె. ఆమె బహుకాలము సంతానము లేకుండి, తండ్రిగారితో శ్రీశైలము వెళ్ళి, అక్కడ దీక్షగా మండలకాలము పాటు శ్రీశైల మల్లేశ్వరునకు ప్రదక్షిణ నమస్కారాలు చేసిన పిమ్మటనే, ఆమెకు సంతానము కలిగినది. అందులో ప్రథమ సంతానము శ్రీ నాగేశ్వరులు. కాబట్టి వారు శ్రీశైలమల్లేశ్వరప్రసాద జనితులు!

నాగేశ్వరరాయులు జీవించియుండగా శ్రీశైల జీర్ణోద్ధారమునకు ఎంతో శ్రమపడిరి. వారి యనంతరమున కూడా ఆంధ్రపత్రికాధిపతులు శ్రీశైలాలయవృద్ధికి లక్షలనిధి వసూలుచేసి స్వామి కర్పించిరి. ఇందుకు కారణము ఆస్తికులైన దాక్షిణాత్యులందరు నిత్యము శ్రీశైల క్షేత్రమును కాశితో తుల్యమైన మహత్త్వము గలదిగా భక్తితో స్మరించుచుండుట మాత్రమేకాదు, దానికితోడు వారలకు నాగేశ్వరరాయులు మల్లేశ్వర ప్రసాద జనితులనే అభిమానము ప్రత్యేకముగా నుండుటే.

అట్లే వారికి బెజవాడమీద అభిమాన ముండుటకు అక్కడ దుర్గా భవనము, దుర్గకళామందిరము నిర్మించుట, మరెన్నియో సంస్థలకు సహాయము చేయుట, నేడు ఆంధ్రపత్రికకు అక్కడ ప్రత్యేక కేంద్రము స్థాపించుట—వీనికి అన్నిటికి కారణము బెజవాడ బహువిధముల కేంద్రమగుటయే కాదు. శ్రీ నాగేశ్వరరాయులకు మూలపురుషులైన శ్రీపతి పండితులు బెజవాడ వాస్తవ్యులనే విశ్వాసముండుట కూడ తోడైనది. ఒకానొక సందర్భములో, వారు తమ వంశమువారు తర్వాత ఇతర ప్రదేశములకు తాత్కాలికనివాసార్థము వెళ్ళినను, మూలస్థానము, నిజనివాసము బెజవాడయే అని స్పష్టముగా సెలవిచ్చిరి.

నాగేశ్వరరాయులు జన్మించిన వెంటనే జన్మకాలాదికము విని, వారి బంధువులలో బహుతపస్సంపన్నులై సిద్ధవాక్కులని ప్రసిద్ధికల కాళహస్తి లింగంగారనే పూజ్యపురుషుడు 'ఈ బాలుడు మహాపురుషుడు, మహాదాత అవుతాడని' ఆశీర్వదించిరి.

నాగేశ్వరులు తమ శైశవమాదిగా తమ వంశములోని పూర్వపురుషుల మహత్త్వములు, తాను మల్లేశ్వర వరప్రసాదమను భావము, తాను మహాపురుషుడు, మహాదాత కాగలడని అమోఘవాక్కులు చేసిన యాశీర్వచనము వింటూ ఉన్నందుకు నాగేశ్వరరాయలకు ఉన్నతాదర్శములు ఉద్భవించి స్థిరమైన క్రమముగా పరిణతినొంది యుండుననుటలో ఎట్టి సందేహమునులేదు. ఉత్తమబీజము సుక్షేత్రములోపడినప్పుడు మహా వృక్షముగా విపృద్ధమై పుష్పఫలాదులతో మనోజ్ఞమై తన్నాశ్రయించిన పాంథులకు చల్లని నీడను ప్రసాదించును గదా!

నియమనిష్ఠలు లేనివారు ఏదీ సాధనచేయలేరు. కాని అవి కొంత కాలానికి కేవలము ఆచారాలుగా పరిణమించే ప్రమాద మున్నది. అప్పుడు వాటిని ఉల్లంఘించడమే ధర్మమవుతుంది అట్టి ఉల్లంఘనలు మన ధర్మశాస్త్రాలు అంగీకరించే ఉన్నవి. అవి వ్యాకరణశాస్త్రములో అపవాద సూత్రాలవంటివి. ధర్మ మనుష్టించడానికి కేవలాచారాలను ఎప్పుడు ఉల్లంఘించవలెనో ధర్మనిష్ఠులకే కాని తెలియదు. ఈ ధర్మ సూక్ష్మము కేవల వ్యామోహబద్ధులకుగాని కేవలాచార నిష్ఠులకుగాని తెలియదు.

పూర్వజన్మకృత పుణ్యవిశేషముచేతనే నియమనిష్ఠలు కల వంశములో జన్మ సంభవిస్తుంది. సందేహములేదు. కాని ధర్మాన్ని ఉజ్జీవింప జేయడానికై జన్మమెత్తిన వారికి తమ యింటిలోని పెద్దల ఆచారాలే కొన్నివేళలలో ప్రతిబంధకాలవుతవి. తల్లి దండ్రుల కోరికలకు విరుద్ధముగా ప్రవర్తింపవలసిన సంకటమేర్పడుతుంది. కొందరిది కఠిన ప్రవృత్తితో సాధిస్తారు. తనకు ఉపనయము చేయదలచిన తండ్రి నుల్లంఘించి లేచిపోయిన బసవేశ్వరుని చర్య యట్టివానిలోనిది. మరికొందరు ఇది పెద్దలకు చేతనయినంతవరకు తక్కువ బాధ కలిగించే విధముగా సాధిస్తారు. ఈ రెండవ పద్ధతినే నాగేశ్వరు లవలంబించారు.

పూర్వాచారపరాయణులైన తండ్రిగారికి అప్పటిలో నూతనమైన ఆంగ్ల విద్యాభ్యాసము సమ్మతము కాదు. కాని ఈ విషయములో తల్లిగారి అండవలన వారు ఆంగ్ల విద్యాభ్యాసము చేయగలిగినారు.

ఆ కాలములో అంగ్ల విద్యాధికులను శ్రీ కందుకూరి వీరేశలింగము సంఘసంస్కరణోద్యమము, బ్రాహ్మమత ప్రచారము, వారి వివేకవర్ధనీ పత్రిక ఎక్కువగా ఆకర్షింప సాగినవి. ఆ నూతన భావాలు శ్రీ నాగేశ్వరులు హృదయములోనే అప్పటికి భరించి ఉన్నందున, సంఘర్షణ రూపము పొందలేదు. కాని వారి నాటకాల పాత్రధారణ చేయవలెననే అభినివేశము మాత్రము తండ్రిగారికి ఎక్కువ బాధయే కలిగించి యుండవలె! నాటకరంగములో ప్రవేశించినవారు తరుచుగా నీతిబాహ్యులై ప్రవర్తించుచుండుటే, నటులను పెద్దలు విటులతో కలిపి పలుకుచుండుటకు ప్రధాన కారణము. దానికితోడు సాయంవేళలను, రాత్రులందును గడ్డము చేయించుకొనుట మొదలైన అనాచార క్రియలు ఆ కాలములో ఆచార నిష్ఠ కలవారి కెంత బాధ కలిగించెడివో మన మూహింపవలసినదే!

ధార్వాడ కంపెనీవారు ఆంధ్రప్రదేశములో నాటక ప్రదర్శనములు చేసి వెళ్ళినతర్వాత నాటక ప్రదర్శనాభిరుచిని, ముఖ్యముగా అంగ్ల విద్యాభ్యాసము చేసివారిలో, వెల్లిగొన్నది. నాగేశ్వరరాయలు అప్పుడు బందరులో విద్యాభ్యాసము చేస్తూఉండిరి. వారిని బందరు హిందూ థియేటరు ఆకర్షించినది. వారు హరిశ్చంద్రలో చంద్రమతి పాత్ర, శ్రీ కృష్ణ తులాభారములో రుక్మిణిపాత్ర ధరించి జనాకర్షణము చేసేవారట. నాగేశ్వరరాయలు పెద్దలైన తర్వాత వారి ధీరోదాత్త విగ్రహమును ప్రదర్శించే వారి ఛాయాచిత్రాలు చూచి, వారి రూపకల్పనము చేసికొనే నేటికాలపు మనబోంట్లకు, వారు అట్టి సుకుమార పవిత్ర స్త్రీ పాత్రలు ధరించి నిర్వహించే వారంటే ఆశ్చర్యంగా ఉండవచ్చును. కాని చక్కగా భావన చేయగలవారికి వారి ప్రకృతిలో ఎంత లాలిత్యము, సౌమ్యత, సౌశీల్యము, మూర్తీభవించి ఉండెడివో ఊహించడము సాధ్యమవుతుంది. తర్వాత సంవత్సరాది సంచికలోనేమి, భారతిలోనేమి నాట్యకళకు వారిచ్చిన ప్రచారము మనకు అవగత మవుతుంది.

ఏమైననేమి, ఈ నాటక వేషధారణము నిష్ఠాపరులగు తండ్రిగారికి ఎంతో బాధ కలిగించి ఉండవలె. పైగా వారు నాటక కంపెనీతో దేశాటనముకూడా చేసేవారు. 1885లో జగ్గయ్యపేటకు నాటక ప్రదర్శనాలకు

నాగేశ్వరులు వెళ్ళిన సమయములో తండ్రిగారికి బాగా జబ్బుచేసినది. ఆ వార్త అందినా, ప్రకటనలు ముందుగానే కంపెనీవారు చేసియున్నందున వారు వెంటనే తండ్రిగారి సన్నిధికి రాలేకపోయిరి. కానీ అదృష్టవశము చేత అవసానవేళకు కొంచెము ముందుగానైనను రాగలిగినారు. తండ్రి ఆరాధనాదికము మహావైభవముగా జరిపి వారు తృప్తిపడవలసి వచ్చినది.

అదేవిధముగా వారు ముఖ్యముగా రెండు విషయాలలో తల్లిగారి కోరికలకుగూడ వ్యతిరేకముగా వ్యవహరింపవలసి వచ్చినట్టు తోస్తుంది. ఇందుకు ప్రధాన కారణము నాగేశ్వరులు యౌవనములో ఆదర్శసిద్ధికై పూనిన దీక్షావేశమే కాని మరి యొండుకాదు. నలుగురివలె ఏదో ఉద్యోగములో ప్రవేశించి, చాలీ చాలని వేతనముతో ఇంటివట్టున కడుపులో చల్ల కదలకుండా ఉండి సుఖజీవనము చేయుచున్నామనే తృప్తిపడడము వారి కెంతమాత్రము సమ్మతము కాకపోయినది. వారి జన్మవేళలో వారి పెద్దలు సెలవిచ్చినట్లు 'మహాపురుషుడు- మహాదాత' కావలెననే ఆవేదనమే వారి నందులకు ప్రేరేపించి యుండవలె!

నాగేశ్వరులు ఉన్నత విద్యకు చెన్నపట్టణము వచ్చిరి. శ్రీరెంటాల వెంకట సుబ్బారావుగారు అప్పుడు చెన్నపట్టణములోని ఆంధ్రులలో ప్రముఖుడు. హైకోర్టు న్యాయవాది. అనేక గ్రంథాలు రచించిన మేధావి. విక్టోరియా డిపో అనే పేరుతో మందుల వ్యాపారమేకాక మరెన్నో వ్యాపారములుకూడా చేయుచుండిన సంపన్నుడు. వారు నియోగి బ్రాహ్మణులు, లింగధారణములేనివారు. వారిని స్ఫురద్రూపి బుద్ధిమంతుడు ఐన నాగేశ్వరరాయలు ఆకర్షించినారు. వారు తమ మేనగోడలు రామాయమ్మ గారిని వివాహమాడుమని నాగేశ్వరులను కోరినారు. శ్రీ కొండా వెంకటప్పయ్య ఇత్యాది మిత్రుల సలహ తీసుకొని వివాహానికి నాగేశ్వరులంగీకరించినారు. తమ ఆరాధ్యబంధువులిందుల కిష్టపడరని వారికి తెలుసును. వివాహమునకు బంధువులే కాదు తల్లిగారుకూడా రాలేదు. మిత్రులే పెళ్ళి పెద్దలుగా వారి వివాహము 1890లో చెన్నపట్టణములో జరిగిపోయినది. ఆనాడది సంఘములో ఎంత సాహసకార్యమో నేటి వారి కవగతము కాకపోవచ్చును. 'ధారణము' లేనివారిని అప్పటి ఆరాధ్యకుటుంబములలో

భోజనాదులలో మడికి పనికిరాని వారినిగా దూరముగా ఉంచేవారనుటలో సందేహములేదు. ఈ సందర్భములో మరొక్క విషయముకూడా గుర్తుంచుకున్నచో. నాగేశ్వరులకుసౌజన్యము, పరమతసహనము ఎంతగా ఉన్నవో స్పష్టముగా తెలియవచ్చును. ఇతర కుటుంబముల పిల్లలను వివాహమాడినప్పుడు, ఆరాధ్యులు వారికి శైవదీక్ష ఇచ్చి ధారణము చేయించిగాని శివపూజకు, ఆరాధనాదులకు, భోజనభాజనాదులకు యోగ్యమైన వారినిగా భావింపరు- శ్రీ వైష్ణవులలో సమాశ్రయణము వలెనే। నాగేశ్వరరాయుల ధర్మపత్ని అజన్మాంతము ధారణచేయకున్నను వా రామెను నిర్బంధింపలేదు.

తల్లి గారికి కుమారుడు స్వజనమధ్యములో ఉండి, ఏదో ఉద్యోగములో ప్రవేశించి, జీవనము సాగించగా చూడవలెనని కోరిక. కాని నాగేశ్వరులకు అది రుచింపలేదు. స్వతంత్రజీవనము చేయుచు విశేష ధనమార్జించి మానవకల్యాణమునకు దానిని వినియోగింపవలెనని వారి యాశయము. అందుకు వ్యాపారమే సాధనమని వారి నిశ్చయము. ఆ ఉద్దేశముతో 1892లో ముందు బొంబాయి వెళ్ళినారు. తర్వాత 1894లో కలకత్తాకు నివాసము మార్చినారు. తిరిగి 1896లో మదరాసు వచ్చినారు. మరల రెండవసారి బొంబాయికి 1898లో ప్రయాణమైనారు. అక్కడనే 1899లో అమృతాంజనము వ్యాపార మారంభించినారు. నెమ్మదిగా అదియే వృద్ధిపొంది, వారి యాశయసిద్ధికి సహకరించినది. అప్పుడు వారు ఎన్ని యవస్థలు పడియుందురో మన మూహింపవలసినదే. తల్లి గారికి ఈయవస్థ లిష్టములేదు. కుమారుడు ఏదో చిన్న ఉద్యోగములో చేరి సుఖపడవలెననియే ఆమె కోరిక. అందులో వారు ఆమె కోరిక తీర్చలేకపోయినారు. ఆమెను తమతో బొంబాయి తీసికొని వెళ్ళినారు. కాని పూర్వాచార పరాయణురాలగు నామెకు ఆ మహానగర జీవనము సరిపడక స్వగ్రామము వచ్చినది. ఆమెకు జబ్బుచేసినదని తెలియగానే నాగేశ్వరులు పత్నితో కలసి స్వగ్రామము వచ్చి ఎన్నోవైద్యములు చేయించినారు. లాభము లేక పోయినది. 1902లో ఆమె దివంగతురాలైనది. నాగేశ్వరరాయులు తల్లిగారి అంత్యక్రియలు మహావైభవముగా చేసి, ఆ సందర్భములో

డెబ్బదిమంది మహేశ్వరుల నర్చించిరట. ఆవిధముగావారు మాతౄణము తీర్చుకొనగలిగిరి.

ఆ కాలములో శ్రీ నాగేశ్వరుల బొంబాయి జీవితము చూచాయగా కొంతవరకు వారిబావగారికి వ్రాసిన ఉత్తరమునుబట్టి తెలిసికొనవచ్చును. నెలకు 30 రూపాయలు జీతముమీద ఒక జమీందారుగారిపద్ద ట్యూటరు ఉద్యోగము కుదిర్చి స్వస్థలమునకు రమ్మని వ్రాసిన లేఖకు జవాబుగా నాగేశ్వరులు వ్రాసిన లేఖ అది. దాని నీ విధంగా శ్రీ గొర్రెపాటి వేంకట సుబ్బయ్యగారు భాషాంతరీకరణము చేసినారు:

"ప్రియమైన బావగారికి!

"పదిమంది చుట్టపక్కాల నడుమను ఉండడం మంచిదేకాని తొమ్మిది సంవత్సరాలనుంచి నా స్వభావానికీ, ఆశయానికీ తగిన కృషిలో బాధపడుతున్నాను. ఇంకా గమ్యస్థానం చేరుకోలేదు. భగవంతుడు ఏనాడు చేరుస్తాడో తెలియదు. కాని, అంతవరకూ ఎన్ని కష్టాలైనా పడదలచుకున్నాను. నా ప్రయత్నంలో గెలుస్తానా, అదృష్టవంతుణ్ణే. ఓడిపోతానా, చావలేక బ్రతుకుతూవున్న వేలకొలది దురదృష్టవంతుల్లో ఒకణ్ణవుతాను. నా కిష్టంలేకపోయినా తప్పనిసరినిబట్టి ఒక కార్యాలయంలో పనిచేస్తున్నాను. ఎప్పు డవకాశం దొరికితే అప్పుడేదాన్ని తన్నేస్తాను. ఈ ఉద్యోగం నా మనఃప్రవృత్తికి అనుకూలంగా లేకపోయినా పూర్వ స్నేహమూ, లావాదేవీలనుబట్టి కొంతకాలం చెయ్యక తప్పడం లేదు.

"ప్రస్తుతం నెల 1కి రు. 100-0-0లు ఇస్తున్నారు. దేవుడు మేలు చేస్తే, వచ్చే సంవత్సరం మొదటినుంచీ రు. 150-0-0 లు ఇవ్వవచ్చును. నామకః నా కొక యజమాని ఉన్నాడన్నమాటేగాని నేను సంపూర్ణంగా స్వతంత్రుణ్ణే. అయినా నా కిదేమీ తృప్తికరంగా లేదు. దీనికితోడు నా మందులు, పుస్తకాలవల్ల నెల 1కి మరో రు. 50-0-0 లు వస్తున్నవి. ఆ వ్యాపారాన్నే వృద్ధి చెయ్యాలని నే నెంతో అభిలాషపడుతున్నాను. కాని, డబ్బు లేనందువల్ల ఎప్పటికప్పుడే వాయిదా వేయవలసి వస్తున్నది.

"మీ రిప్పిస్తామన్న ట్యూటర్ షిప్పును రు 30-0-0ల వేతనంమీద నేనంగీకరించలేను. నాకు పైకి రావలెనని అంతులేని అపారమైన ఆశ

ఆకాంక్ష ఉన్నవి. ఏదో ఒకనాడు నా కోరిక ఫలించి తీరుతుందని నా నమ్మకం. ప్రస్తుత పరిస్థితుల్లో బొంబాయికంటే మరేచోటూ నా కను కూలంగా ఉండదు. వారిచ్చే రు. 30-0-0 లతో శనివారపు పేటలోగానీ, మరెక్కడగాని ఉన్నా నా సుఖ స్వప్నాలన్నిటికీ నేను స్వస్తిచెప్పవల సిందే. నా జీవిత భీమాకే నేను నెల 1కి రు. 23 లు కట్టాలి. మిగిలిన ఏడు రూపాయలతో, మిగతా అప్పు సప్పు లెలాఉన్నా, జీవితం ఎలా గడు స్తుంది? అందువల్ల నా కది ఇష్టంలేదు. పైగా వ్యక్తిసేవ యెప్పుడూ చాలా కష్టం. రాజా మంచివాడు కావచ్చును. అయనను నేను తృప్తి పరచలేకపోవచ్చును. అక్షరజ్ఞానంలేని, సంకుచితబుద్ధులైన జనులమధ్య అభివృద్ధి చెందడం ఇంతకంటే నాకు కష్టంగా ఉంటుంది. అందువల్ల మీ సహాయాన్ని నేను కృతజ్ఞతాపూర్వకంగా తిరస్కరిస్తున్నాను.

మీ విశ్వాసి,

(సంతకం) కె. నాగేశ్వరరావు"

పై ఉత్తరమునుబట్టి అప్పటి నాగేశ్వరుల ఆర్థిక పరిస్థితి యవగత మగును. సందర్భవశాత్తుగా ఆ కాలములో బొంబాయి నివాసము నేటి కంటె ఎంత తక్కువ వ్యయముతో సాధ్యపడేదో, బి. ఎ. చదివినివారికి ఆంధ్రప్రాంతంలో ఏమి జీతాలు ముట్టేవో కూడా తెలియవస్తవి. కాని మన కవియన్నీ అప్రస్తుతాలు. అందులో వారు తమ ఆశయసిద్ధికి ఎంత కఠినదీక్షతో పరిశ్రమించినారో మనము ముఖ్యముగా గమనింప దగినది. తమ ఆశయము సిద్ధింపని పక్షములో ఎంత నిర్లిప్త భావము వ్యక్తము చేసినారో కూడా గమనింపవలె. వానికి తోడు వినయముతో చెప్పినా, వారికున్న దూరదృష్టి కూడా వ్యక్తమవుతుంది. అన్నిటికంటె తమయందు ప్రేమతో ఇష్టములేని విషయము వ్రాసిన తమ బావగారి యందు, అందులో వారు ప్రదర్శించిన సౌజన్యము, నిగ్రహము కూడ కానవచ్చును. వారు ప్రసిద్ధులై బహుముఖముగా కార్యనిర్వహణమునకు పూనుకొనినప్పుడు వారిలో ప్రత్యేకముగా వ్యక్తమవుతూ వచ్చిన వారి సౌజన్య సౌహార్దములు ఈలేఖ ఉద్ఘాటిస్తుంది.

వారింత శ్రమపడి ఆర్జించిన ధనము, వారివల్ల విరాళముగా, ఏమాత్రము కష్టపడకుండా, రావలనని కాంక్షించుచు, వారిని మధ్య మధ్య చికాకుపెట్టిన యాచకలోకము ముఖ్యముగా చదివి మననము చేసికోదగినది।

నాగేశ్వరరాయులు తల్లిగారియు, బంధువులయు మాట యీవిషయములో వినకున్నందుననే, లక్ష లార్జించి దానముచేసి దేశోద్ధారకుడు, విశ్వదాత కాగలిగినారు. "నాకు అపారమైన ఆశ-ఆకాంక్ష ఉన్నవి" అని వారందులో వ్రాసింది గుర్తుంచుకోవలె।

# 3

## త్రివిధ యాత్రలు

వేదములు, ఇతర మతములఉద్గ్రంథములు, ఉత్తమ కావ్యములు తరుచుగా కొన్ని పదాలనూ, వాక్య సముదాయాలనూ మరల మరల ఉద్ఘాటిస్తూ ఉంటవి. ఆ విధంగానే మహాపురుషులు, పూర్ణపురుషులు మరల మరల కొన్నివిషయాలను ఉద్ఘాటిస్తూ ఉంటారు. మహాత్ముడు ఎప్పుడూ సత్యాహింసలను గూర్చి ప్రస్తావించేవారు. వారి ఆగ్రహముకూడాసత్యాగ్రహమే. వారట్లు చేయుటకు కారణము భాషలో వైవిధ్యము ప్రదర్శింపలేక కాదు, అవివారిప్రవృత్తికిమూలభూతమైనసూత్రములుగనుక। అట్టివానిలో వారిని నడిపించిన ఆశయములు మనకు గోచరించును. శ్రీ నాగేశ్వరుల రచనలలో ఈ క్రింది వాక్యములు ఒకే రూపములోగాని, రూపాంతరములతోగాని పునః పునరావృత్తములగుచుండుట గమనింపగిదనది।

"జీవయాత్రను దేవయాత్రను జేయుట, జీవయాత్రను విషయయాత్రను చేయక శివయాత్రను చేయుట-జీవయాత్రను దేహయాత్రార్థము కాక ఆత్మయాత్రార్థము చేయుట-జీవయాత్రను మోక్షయాత్రను చేయుట జీవయాత్రను కైవల్య యాత్రను చేయుట-జీవయాత్రను స్వర్గయాత్రను జేయగలనీతిధర్మములను"నీతివిధి" విశదము చేయుచున్నది. స్వధర్మ నిర్వహణమునకు సకల ధర్మములందును ఆత్మధర్మము ప్రధానము-జీవయాత్రయందు మానవధర్మమును సార్థకము చేయుటకు నిత్య

మైన యాత్రధర్మమువలె అనిత్యములైన దేహేంద్రియమనోధర్మములు ప్రయోజనకరములు కావు-నరుడు చతుర్విధపురుషార్థముల నారాధించుచు నారాయణపదము నధిష్టించుచున్నాడు."

బుద్ధిమంతులైనవారు మననము చేసినచో, ఈ పై కొద్ది మాటలతో మానవుల కుండవలసిన ఉత్తమాదర్శములును, ఉండకూడని అధమాశయములును, నిరూపింపబడినవని గ్రహింపజాలుదురు. అవి మంత్రము వలె ఎల్లప్పుడును మననము చేయదగినవి. నాగేశ్వరులు తమ రచనల చేతనేమి, తమ ఆచరణచేతనేమి, తమ జీవితమువల్లనేమి, లోకమున కనుగ్రహించిన ఉపదేశము, సందేశము, ఈ మాటలతోనే ఇమిడి యున్నది. ఇందులో కూడా కొంత పదభేదము కనబడుచున్నను, అన్నిటిని సమన్వయము చేసినచో, జీవయాత్రను ముఖ్యముగా మూడు ధ్యేయములతో సాగింపవచ్చునని సూత్రీకరింపబడినదని తెలిసికొనదగును వానిలో మొదటిది పశుప్రాయుల కుద్దేశించినది. సర్వసాధారణ సహజమైన దగుటచే, పనికిమాలినది. రెండవది మధ్యమాధికారులను ఉద్దేశించినది. మూడవది ఉత్తమాధికారుల కుద్దిష్టమై వారలను ఉత్తీర్ణుల గావించునట్టిది.

మొదటిది జీవయాత్రను, దేహయాత్రకు, విషయయాత్రకు అంకితముచేయుట. సూక్ష్మముగా నిందులో రెండు భేదములు కలపవచ్చును. అందులో మొదటిది జీవయాత్రను ఎట్లెట్లో దేహము నిలుపుకొనజాలుటతో తృప్తిపొందుట. రెండవది విషయ వాంఛలు పెంపొందించుకొని, శారీరకభోగమే ధ్యేయముగా పెట్టుకుని, దాని సాధనములకై పరిశ్రమించి ఇహలోకభోగములనుభవించి, తాపన్మాత్రముచే తృప్తినొందుట. ఈ రెండు విధముల యాత్రలలో ఏది నికృష్టతరమో నిర్ధారించుట కష్టసాధ్యము. ఒకటి పశుప్రాయులది. రెండవది నరకయాత్రను పాథేయము కూడబెట్టునది. ఈ రెండు విధముల యాత్రకు మూలము పశుత్వమును ఉపాసించుటే. నేడు లోకములో సర్వత్ర ప్రచలితమై బహురూపములుగా ప్రత్యక్ష మగుచున్నదిదియే! ఈ ప్రవృత్తియే ఎంతో అకర్షకముగా ఉండి లోకవినాశ హేతువైనది. ఈ పాశవప్రవృత్తిని అధిగమించుటకే లోకములో అవతరించిన మహాత్ములందరును పాటుపడినారు.

ఇక రెండవది జీవయాత్రను దేవయాత్రను చేయుట. దీనియందు ప్రవర్తించువారు కేవల విషయోపభోగములతో తృప్తినొందరు. జీవ యాత్రను లలిత లలిత మొనర్చుకొందురు. లలితకళ లందించు అనం దము, సంగీత మనుభవింపచేసే ఆనందము, కావ్యరసాస్వాదనచేస్తే కలిగే ఆనందము, సత్కార్యాచరణము చేతను, పరోపకారముచేతను, భూతదయచేతను, నీతియుత ప్రవర్తనముచేతను, సత్యవాక్యము చేతను కలిగే ఆనందము అనుభవించుట ఈ కోవలోనివారి ధ్యేయము. ఇట్టి జీవయాత్ర నడిపేవారికి, ఈ లోకమే స్వర్గముగా భాసిస్తుంది. మరొక లోకమున్నదని విశ్వాసమున్నవారు, ఇందువల్ల దేవలోకప్రాప్తి కలుగుతుందని భావిస్తారు. వీరుచేసిన పుణ్యము క్షీణింపగా మరల మానవ జన్మ లెత్తుతారని శాస్త్రాలు చెప్పుచున్నవి. కనుక ఇది మధ్యమాధి కారులనుద్దేశించి చెప్పింది.

ఈ రెండింటికి పైది జీవయాత్రను శివయాత్రను, నారాయణ పదవీయాత్రను, కైవల్యయాత్రను, ఆత్మయాత్రను, మోక్షయాత్రనుగా చేయుట, ఔపనిషదులు వీనిలోగూడ సూక్ష్మ తారతమ్యాలు ఎన్న వచ్చునుగాని, నాగేశ్వరుల దృష్టిలో అట్టి భేదమున్నట్లు కనుపింపదు. సర్వాత్మభావముతో వ్యవహరించే జీవన్ముక్తులను, సర్వకర్మఫలమును పరిత్యజించి భగవత్ప్రీకరముగా కర్మాచరణముచేసే యోగీశ్వరులను, ఉద్దేశించి చెప్పినదీ యాత్ర! ఈ యాత్ర పునరావృత్తి రహితమైనది. సచ్చిదానంద స్వరూపమైనది. దాని యతిశయమూ, స్వరూపమూ అను భవైక వేద్యమే కాని వాక్కులకూ, మనస్సుకూ కూడా ప్రాప్తింప సాధ్య మైనదికాదు. ఈమూడవ యాత్ర జీవయాత్రను దేవయాత్రగా చేసికొనే పుణ్యపురుషులలో ఏకొందరుధన్యాత్ములకో అందుతుంది. దేవయాత్ర ఆరం భించని వారికి ఈ మూడవయాత్ర కనుచూపు మేరలో కూడా ఉండదన టానికి ఎట్టి సందేహమూ లేదు.

ఈ మూడు విధములైన యాత్రను నాగేశ్వరులు స్వానుభవము నుండి వర్ణించిననే యనవచ్చును. కాని వారు తమ జీవయాత్రను కేవల దేవయాత్రగా సాగించిన రోజులు మనకు తెలియరావు. వారు బాల్య

ములో యౌవనములో ధనాభావముచేత ఎటువంటి బాధలు పడ్డారో, విశ్వ దాతగానే వారిని ఎరిగిన మనకు ఊహింప సాధ్యముకాదు. వారు ఆప్తు లతో ప్రసంగములో బాల్యదశలో ఒకనాటి తమ యనుభవము ప్రస్తావించి ఈ విధంగా అనేవారట. "ఆనాటి ఉదయమే నాచేతికి ఒక్కకాని లభించి ఉంటే, ఇప్పుడు పదివేలు లభించినా కలుగని సంతోషముపొంది ఉండేవా డను!" విశ్వదాత ఆస్థితిలోఒక్కనాడైనా ఉన్నారనిమనముగుర్తుంచుకోవ డము అవసరము. అటువంటి అనుభవాలు సామాన్య మానవులను లోభు గాను,వక్రబుద్ధితో లోకమును నిందించేవారినిగాను మార్చివే స్తవి. కాని నాగేశ్వరులవంటి ధీరులను అమృత స్వరూపులనుగా పరిణమింపజేస్తవి. ఎవరైనా కష్టములోఉండి, సహాయము కావలెనని అపేక్షిస్తే, వారి కానాటి ఉదయము తాముపడ్డ నరకబాధ స్మృతిలోకి వస్తూ ఉండవలె, తాము పడ్డ బాధ ఇతరులకు రాగూడదనే దీక్ష కలుగుతూ ఉండవలె! అందువల్ల తమకు పుట్టినంతవరకు అప్పుచేసి ఐనా అట్టి ఆర్తుల ఆర్తి నివారింపవలె ననే తీవ్రవేదన ఆవేశిస్తూ ఉండవలె. దేహయాత్ర సాగించుటకు వారనుభ వించిన కష్టముల స్మృతివల్లనే, నాగేశ్వరులు విశ్వదాత ఐనారు. ఎంతటి పూర్వజన్మ పుణ్యవిశేషము ఈ జన్మములో ఒక్కసారిగా ఉద్బుద్ధి యైన వారికోకాని, అట్టి పరిపూర్ణ పరిణతి సాధ్యపడదు.

నాగేశ్వరుల జీవయాత్ర, దేహయాత్ర, సాగించుటే దుస్తరముగా ఉన్న కాలమున్నదని చూచాయగానైనా తెలియవస్తున్నది కాని విషయ యాత్రగా సాగిన కాలము ఎంత వెదకినను కానవచ్చుట లేదు. పుణ్య జన్ములైనవారిని విషయయాత్ర ప్రలోభపెట్టలేదు. అట్టి ప్రలోభములకు గురియైనవారు వానితో పోరాడి జయించి మహాపురుషులు కావచ్చునేమో కాని పూర్ణపురుషులయ్యే అవకాశములేదు. అందువల్ల నాగేశ్వరులు తమ జీవయాత్రను విషయయాత్రకు అంకితము చేసికొన్న చిహ్నము లెక్కడ కనిపింపవు.

అయితే వారి జీవయాత్ర స్పష్టముగా దేవపథమందు, కైవల్య పథమందు తిరుగులేకుండా ఎప్పుడు నిలిచినదో ఆలోచింపదగినదే.

# 4

## అమృతాంజన ప్రభావము

ఈ ప్రశ్నకు సరియైన సమాధానముకొరకు విచారణ చేసేందుకు మరొక్కమారు నాగేశ్వరరాయలు బొంబాయినుండి వారి బావగారికి వ్రాసిన లేఖలోని భాగాలు స్మృతికి తెచ్చుకుందాము!

"తొమ్మిది సంవత్సరాలనుండి నా ప్రకృతికీ, ధ్యేయానికీ అనుగుణ మైన కృషిచేస్తూ శ్రమపడుతున్నాను. ఇంకా గమ్యస్థానం చేరుకోలేదు ఏనాటి కెక్కణికి భగవంతుడు నన్ను చేరుస్తాడో తెలియరాదు. కాని అంత వరకూ ఎన్నికష్టాలైనా పడడానికి నిశ్చయించుకున్నాను."

ఏమిటీ మాటలతీరు! తక్కిన ఉత్తరములో తన సంపాదనల, ఖర్చు సంగతి వివరంగా ఉన్నందువల్ల పైమాటలుకూడా ధనార్జనపరంగానే సాధారణ బుద్ధులకు అన్వయింపవచ్చును. కాని ఏమాత్రము సూక్ష్మ పరి శీలన చేసినా, అందులో వారి ధ్యేయమూ గమ్యస్థానమూ, దానికి భగ వంతుడు చేర్చడమూ, అనే మాటలు కనువిప్పు కలిగిస్తవి. ఇంకొకఅడుగు వేసి చూడగల వారికి భగవంతుడు డెన్నటికైనా తన్నా ధ్యేయానికి చేరుస్తాడనే విశ్వాసము ప్రత్యక్షమవుతుంది. అవును, ధీరులైనవారికి శ్రీ కృష్ణపరమాత్మ ప్రతిజ్ఞ హృదయస్థంగా ఉంటుంది: "న మే భక్తః ప్రణశ్యతి!"

నాగేశ్వరులు అప్పటికి తమ నివాస స్థానములో ఎన్నో మార్పులు చేసినారు. మొదట తంబుచెట్టి భవనములో మిత్రుల మధ్యనుండి రెంటాల వారి యింటికి, అక్కడినుండి బొంబాయికి, తర్వాత కలకత్తాకు, తిరిగి మదరాసుకు, మళ్ళీ రెండవసారి బొంబాయికి ఔషధముల వ్యాపారమే కాక జ్యోతిషశాస్త్రగ్రంథ ప్రకటనము కూడా వారు ప్రయత్నించి చూచారు. అప్పటికి ఏమీ తృప్తిగా సఫలమైనట్లు తోచదు. తిరిగి 1898లో రెండవసారి బొంబాయి వెళ్ళిన తర్వాత ఏమి తంటాలు పడినారో మన కెరుకలేదు.

చివరకు అక్కడనే 1899 లో, అమృతాంజనము వ్యాపారము ప్రారంభించినారు. అదే నిశ్చయంగా నాగేశ్వరులను తమ జీవయాత్రను దేవయాత్రా మార్గములోనూ, కైవల్య యాత్రామార్గములోనూ స్థిరంగా తిరుగుముఖము లేకుండా, ముందుకు సాగింపజేసింది. మొదట మొదట వారికే అది స్పష్టముగా భాసించి ఉండకపోవచ్చును. ఈ మాటలు స్థూల దృష్టితో చూచేవారికి స్తుతిపాఠముగా కనబడవచ్చును. కాని తత్త్వపరి శీలన ఏమాత్రమైనా చేయగలవారికి నాగేశ్వరులను దేవయాత్రా పరులను శివయాత్రావరులను చేయించినది అమృతాంజనమే అని వ్యక్తమవు తుంది.

ఏమిటీది ? ధనసంపాదనకు అనుకూలించిన మందు ఆయనను శివ యాత్రోన్ముఖులను చేసినదా ? అవును అమృతాంజనమే వారి సాధనా, వారి ధ్యేయమూ అన్నా పొరపాటు కాదు. ఇతి అతిశయోక్తి కాదు. అత్యంతమైన స్వభావోక్తి!

నాగేశ్వరులు అంతకుముందు చాలా చాలా మందులు తయారుచేసి ప్రకటనలుచేసి చూచారు. ఎక్కువ లాభించలేదు. ఏదో ఒక శుభముహూర్త ములో, ఏదో ఒక్క మందుమీద దృష్టి కేంద్రీకరిస్తే, మంచిదని వారికి స్ఫురించినది. సరిగ్గా అది 'అమృతాంజన'మై ప్రత్యక్షమైనది. ఏక్షణంలో వారా నిశ్చయం చేశారో, సరిగ్గా ఆ క్షణంలోనే, ఎన్నెన్నో జన్మాంతరా లలో వారుచేసి కూడబెట్టిన పుణ్యమంతా పుంజీభవించి, ప్రారబ్ధ కర్మ స్వరూపములో వారిలో ఉద్బుద్ధమైనది!

ఏమిది ?—అవును. లోకములో ఎన్ని మందులు లేవు ? మందులకు ఎన్ని పేరులు లేవు ? ఆయుర్వేదౌషధాల పేరులు ఎంతో శ్రావ్యమనోహర మైనవి ఉన్నవి. అమృత శబ్దముతో కూడిన నామమే వారికెందుకు స్ఫురింపవలె! పూర్వజన్మ కృతపుణ్యమే అమృత స్వరూపంగా వారి వాక్కులో ఆదేశించినది. పేరులో ఏమున్నదనేవారు అవివేకులు. నామము వస్తువులకు ఏదో సంకేతము మాత్రంగానే ఉండే భాషలలో పేరులో ఏమీ లేకపోవచ్చును. కాని సంస్కృత భాషలోనినామాలకు అది అన్వయించదు. అందులో ప్రతినామమూ అర్థవంతమైనది!

అమృతము అంటే కేవలము పునరావృత్తికల స్వర్గలోకవాసులు భుజించే పురాణ ప్రసిద్ధికల భోజనము మాత్రమే కాదు, వేదవేదాంతములు ముక్తస్థితిని అమృత శబ్దముతోనే నిర్దేశిస్తూ ఉంటవి. కాబట్టి సముద్రమథనమువల్ల పుట్టగా, జగన్మోహిని దేవతలకు మాత్రమే పంచి పెట్టిన దివ్యాన్నమైన అమృతమే కాదు అది కేవలబ్రహ్మము కూడాను! అమృతాంజన భావనే నాగేశ్వరులను దేవయాత్రకును కైవల్యయాత్రకును ఉన్ముఖులను చేసిన దమటకు ఎట్టి సందేహమునూ లేదు.

కేవల వ్యాపారబుద్ధి మాత్రమే కల వర్తకులకైతే, ఆ నామము వినిమయదారులను, ఖాతాదారులను ఆకర్షించేందుకే వినియోగపడి ఉండవచ్చును. కాని నాగేశ్వరరాయల వంశములోని పూర్వపురుషులు నిష్ఠతో చేసిన శివరాధనము, వారు స్వయముగా జన్మజన్మాంతరములో చేసియుండిన పుణ్యమూ, తపస్సూ ఆ నామముగా రూపొందినవి మంత్రాలు జపించడమెందుకు? దేవతలను పూజించడమెందుకు? ఆ మంత్రదేవతా భావమూ, ఆకారమూ మనముకూడా పొందడానికే కదా! నాగేశ్వరులు అమృతాంజన నామము జపముచేయగా, మననము చేయగా, కీర్తింపగా విశ్వవ్యాప్తము చేయగా, వారికి అమృత మార్గము దొరికినది, అమరయాత్ర, శివయాత్ర, ప్రారంభించినారు.

'అంజనం అంటే కాటుక, తలనొప్పి మందుకు కాటుక పేరు పెట్టడమేమిటి?' అని పెద్దలొకరు ఆక్షేపించిరని చెప్పుచు, "పేరులో తప్పున్నా మందులో లేదు" అని శ్రీ గొర్రెపాటి వేంకటసుబ్బయ్య సరసంగా సమర్థించారు. కాని పేరులో కూడా తప్పులేదు అంజన శబ్దము సర్వసామాన్యముగా కాటుకకే వాడుకలో ఉన్నది కనుక ఆ చేసిన ఆక్షేపణ న్యాయమే అనే భ్రాంతి కలుగుతుంది ముందు. కాని అంజనశబ్దానికి . కాటుక అనే కాక, ఇంకా ఇతరార్థాలుకూడా ఉన్నవి. 'వైద్యా' నిఘంటువులో అంజన శబ్దానికి 'Ointment' అనే అర్థము కూడా ఉన్నది. 'ఆప్టే' నిఘంటువులో 'A Cosmetic ointment; Fire' అనే అర్థాలుకూడా ఉన్నవి. 'అంజ్' అనే ధాతువుకు మ్రక్షణ-మర్దనముచేయుట అనే అర్థముకూడా ఒకటి ఉన్నది. అమృతాంజన శబ్దములో కూడా దోష మేమాత్రమూ లేదు; అది సాధువు, అర్థవంతమైనది.

చెన్నపట్టణములో ఆంధ్రమహాసభలో నాగేశ్వరుల చిత్రపటము ఆవిష్కరించిన సందర్భములో మహాత్ముని ఉపన్యాసములో ఈ క్రింది వాక్యాలు మనము స్మరింపదగును.

" 'అమృతాంజనము పేర మీరు ప్రజలను మోసగిస్తున్నారు గదా!' అని నే నొకసారి ఛలోక్తిగా అన్నాను. దానికి నాగేశ్వరు లిచ్చిన జవాబిది. 'అవును మీ మాటను కాదనను. మోసమే ఐనా, అపాయము చేయనిది. అది నయముచేసినా చేయక పోయినా, కీడు చేయనిది. అమృతాంజనము కొనే వాళ్ళంతా దాని బాధా నివారణశక్తిమీద విశ్వాసముతోనే కొంటున్నారు. ఆ విశ్వాసమే వారికి గుణమిస్తున్నది. అదే నా వ్యాపారానికి మూలము. అమృతాంజనంవల్ల వస్తున్నలాభంలో ఎక్కువ భాగము ప్రజోపయోగానికే వినియోగిస్తున్నాను. ఈ వ్యాపారానికి పరమప్రయోజనము అదే!' ఈ మాటలు వినగానే నాకు నచ్చినమనిషి ఇతడు అనుకొంటిని. వారి జవాబులో సంపూర్ణమైన త్రికరణశుద్ధియు వినమ్రతయు ప్రకాశించినవి.

అమృతాంజనం వ్యాపారము అన్నికష్టాలు అధిగమించి దేశ దేశాంతరాలలో కూడా ఖ్యాతిగడించి పుష్కలంగా రాబడి కూర్చినకొలదీ, నాగేశ్వరరాయుల జీవయాత్ర అమృతపథములో నిరంతర ప్రవృద్ధమైన వైభవంతో ముందుకు సాగినది.

కాబట్టి 1899 సంవత్సరము నాగేశ్వరుల జీవితములో పెద్దమలుపుగా మనము గుర్తింపవలె. ప్రసిద్ధులైన లోకోద్ధారకులెందరో వారి లోకోద్ధరణ యాత్ర ప్రారంభించినది ముప్పది మూడేళ్ళ ఈడు వచ్చినప్పుడే! నాగేశ్వరుల కప్పుడు ముప్పది రెండేళ్ళు!

## 5

## ఆంధ్రపత్రికావతరణము

నాగేశ్వరరాయుల అప్పటి నివాసస్థలము బొంబాయి నగరము. అప్పుడు భారతదేశమునకు రాజధాని కలకత్తా. కలకత్తాకు రాజకీయ

ప్రాధాన్య మెక్కువ. బొంబాయి వర్తకమునకు కేంద్రము. భరతఖండము పాలించుటకు వచ్చే ఆంగ్లాధికారులంతా, ముందు బొంబాయి రేవులో దిగేవారు. అందుచేత అది అప్పుడు ఇండియా ద్వారము (Gateway of India) ఐనది. సైన్యాలు భూప్రయాణాలు చేసేరోజులలో భారత భూమికి దేహళియైన దేహళి (డెల్హీ) ప్రాముఖ్యము వహించేది. దేహళి అనగా గడప, ద్వారము. నౌకాయానము ప్రాముఖ్యము వహించిన తర్వాత, బొంబాయి దేహళి స్థానముగా మారిపోవుటచేత దానికి రాజకీయముగా కూడా ప్రాముఖ్యము కలిగినది. ఆంగ్ల ప్రభుత్వమునుండి. స్వేచ్ఛ పొంద వలెననే సంచలనాల కన్నిటికీ, కలకత్తా, బొంబాయి నగరాలు, అప్పట్లో కేంద్రాలుగా ఉండేవి. ఐతే ఆ రెండు నగరాల ఆదర్శ స్వరూపములో ఎంతో భేద ముండేది.

కలకత్తా రాజధాని ఐనందున విదేశీయ సంస్కారాలు వంగదేశములో ముందు పాదుకున్నవి. అందువల్లనే అక్కడి నుండియే బ్రాహ్మ మతమూ, ఇతర సంఘసంస్కరణ సిద్ధాంతాలూ, దేశమంతటా వ్యాపించినవి. ఆ కాలంలో భారతభూమిలో అంతటా పెద్ద పెద్ద ఉద్యోగాలలో ఉన్న భారతీయులంతా వంగీయులే, వంగదేశీయుల జనసంఖ్య కూడా చాలా ఎక్కువ, ఐదుకోట్లు. వంగదేశ ప్రాబల్యము అణచడానికే అప్పుడు ఆ ప్రాంతాన్ని రెండుగా విభజించారు. వంగదేశ నాయకులు తమ రాష్ట్రైక్యమాన్ని స్వదేశీ ఉద్యమంగా మార్చి, భరతభూమి నంతటినీ ఉద్బోధించారు. ఆ ఉద్యమాల కన్నిటికీ మూలము అక్కడ ఆంగ్లసంపర్కము వల్ల కలిగిన ఉజ్జీవనమే. మనదేశములో అధికారభాషగా ఉండవలసినది పారసీయా, సంస్కృతమా, ఇంగ్లీషా అనే సమస్య వచ్చినప్పుడు, ఇంగ్లీషును సమర్థించినవారిలో ప్రముఖులు సంఘసంస్కర్తలైన రామమోహన రాయలవంటివారని మరచిపోరాదు. ఆతర్వాత బ్రిటిషు రాజనీతి తంత్రము వంగరాష్ట్రమును ఏకముచేసి రాజధానిని ఢిల్లీకి మార్చినది. దానితో వంగప్రాముఖ్యము తగ్గినది. స్వాతంత్ర్యము వచ్చేనాటికి మరొకవిధంగా వంగదేశము రెండుగా విడదీయబడ్డది. వంగీయుల నాయకత్వము పూర్తిగా వెనుకబడ్డది.

ఇక మహారాష్ట్రములో ఉద్బుద్ధమైన స్వాతంత్రేచ్ఛ, ప్రాశ్చాత్య సంపర్కమువల్ల జనించినది కాదు. అది స్వభావసిద్ధముగా భారతీయ సంస్కృతియందు అభిమానముతో పుట్టిన స్వాతంత్రేచ్ఛ. బొంబాయి రాష్ట్రానికీ రాజకీయ రాజధాని బొంబాయినగరమే ఐనా, సాంస్కృతిక రాజధాని పూనానగరము. భరతఖండములో అతివిస్తార భాగమును పాలించిన భారతీయులలో చివరివారు మహారాష్ట్రులు. శివాజీతో ఆరంభమైన జాతీయోద్యమము పీష్వాల ప్రభుత్వముతో ఢిల్లీ సింధునదుల వరకు గల భూభాగమునంతటినీ పాలింపగలుగు నంతటి విస్తృతి వహించినది. దానికి మొదటి పెద్దదెబ్బ తగిలినది 1761లో మూడవ పానిపట్టు యుద్ధములో సంభవించిన అపజయముతో. ఆ తర్వాత కూడా వింధ్యకు దక్షిణభూమిలో మహారాష్ట్రుల ప్రాబల్యము తగ్గలేదు. ఆంగ్లేయులను చివరకు ప్రతిఘటించిన ప్రబల భారతీయులు మహారాష్ట్రులే. మహారాష్ట్రులతో నాలుగు సంగ్రామములుచేసి తుదకు 1818కి ఆంగ్లేయులు వారిని అణచివేయగలిగిరి. మళ్ళీ 1857 లో జరిగిన స్వాతంత్ర్య సంగ్రామములో దాక్షిణాత్యులలో ఎక్కువపాలు వహించినది మహారాష్ట్రులే.

మహారాష్ట్రులంటే, ఇప్పుడు చాలామంది భ్రాంతిపడుతున్నట్లు ఆ దేశములో అనాదిగా నివసిస్తున్న వారేకాదు. మహారాష్ట్రము రాజకీయ కేంద్రమైనప్పుడు, భరతఖండములో ఎక్కడెక్కడి మేధావులూ అక్కడికి చేరుకొన్నారు. వారిలో 'తెలంగ్' అని వ్యవహరించేవారంతా స్పష్టంగా తెలుగుదేశము నుండి వెళ్ళి మహారాష్ట్రులైనవారే. అట్లాగే ఇతర ప్రాంతాల వారుకూడా వెళ్ళి మహారాష్ట్రులలో కలసిపోయినారు. మహారాష్ట్రులంటే భారత జాతీయతకు చివరివారసులు, చివరి ప్రభువులు.

రాజకీయముగా మహారాష్ట్రుల ప్రాభవము తగ్గినా, సాంస్కృతికంగా భారతభూమిని వారే పాలించారు. విద్యానగర రాజ్యము ఉజ్జ్వల ప్రభతో వెలుగుతున్న రోజులలో 'అక్కడ సర్వభారత సంస్కృతి కేంద్రీకృతమైనట్లే' చివరకు మహారాష్ట్రములో, అందులో ముఖ్యంగా పూనానగరంలో, భారతీయ సంస్కృతి ప్రజ్వలించింది. నిర్ణయసాగర్‌వారు అన్ని సంస్కృత గ్రంథాలు అంత నిర్దుష్టంగా అంత చౌకధరకు ప్రచురింప గలిగినారంటే, అక్కడ ఎంతమంది విద్వాంసులు నాలుగుమూలల

నుండి చేరినవారుండేవారో ఊహించవలసినదే. దేవనాగరలిపిలో వారు ముద్రించిన గ్రంథాలకు మూలమైన వ్రాతప్రతులు ఎక్కువ భాగము ఆంధ్రలిపిలోనివని గుర్తించుకుంటే విద్యానగర సంస్కృతికి ఆనాటి మహారాష్ట్రము వారసత్వము వహించినదని అవగతమవుతుంది.

మహారాష్ట్రములో ముఖ్యముగా శివాజీ స్మరణముతోనూ, గణపతి నవరాత్రోత్సవాల సందర్భంగానూ, జాతీయోద్యమాలు వికసించినవి. గోఖలేవంటి విద్యావేత్త, తిలకువంటి మహావిద్వాంసుడు, అక్కడి ఉద్యమాలు నడిపినవారిలో ప్రధానులు. 'కేసరి' పత్రిక స్వాతంత్ర్యసమరానికి దారితీసినది. మహారాష్ట్రదేశ నివాసము శ్రీ కె.వి. లక్ష్మణరావుగారిని విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి స్థాపనకు, విజ్ఞాన సర్వస్వ ప్రచురణకు పురికొల్పినట్లే, శ్రీ నాగేశ్వరులను బహుముఖ రంగములలో దారిచూపి నడిపించుటకు కారణమైనది.

కేవలము విజాతీయమై వంగ దేశోద్భవమైన ఉద్బోధానికి అంకితుడైనవాడు శ్రీ వీరేశలింగంపంతులుగారు. ఆయన ఎట్టి మహదాశయాలతో ప్రభావితుడైనా, ఆయునకు ప్రతిపక్షులయందు అసహనమేకాక, ద్వేషముకూడా ఉండేది. ఆయన స్వదేశీయులతోనే ఎన్నో వివాదాలలోకి, కోర్టులలో దావాలలోకి కూడా దిగవలసి వచ్చినది.

నాగేశ్వరులది మహారాష్ట్రమధ్యములో ఉద్బుద్ధమైన స్వజాతీయ సంస్కారము. అది కేవలము మార్పులేకుండా, విజాతీయ విజ్ఞానజ్యోతిని చూడనని కళ్ళుమూసుకొని ఉండే అంధవిశ్వాసమూఢపద్ధతి కాదు. అది విశ్వవ్యాప్తమైన విజ్ఞానాన్ని, సంస్కారాన్ని, ప్రబోధాన్ని జీర్ణముచేసికొని, స్వాయత్తము చేసుకొని, జాతీయ సంస్కారానుగుణ్యంగా మలచుకునే సజాతీయ ప్రాణశక్తి! ఆ ప్రాణజ్యోతిని నాగేశ్వరులు మహారాష్ట్రములో దర్శించి, ఆంధ్రులకు, ఆంధ్రసంస్కృతికి అనుగుణంగా దానిని వెలిగించి, మనకు ప్రత్యక్షము చేసినారు. అందువల్ల నాగేశ్వరుల ఉద్యమాలన్ని ఆంధ్రులు స్వాగతపూర్వకంగా గ్రహించారు. వారి ఉద్యమానికి ఎక్కడా ప్రతిఘటన ఉండేది కాదు. వారి భావాలతో ఏకీభవించని వారియందు కూడా, వారికి ద్వేషముండేది కాదు. అందుకు ముఖ్యమైన కారణము వారిలో దినదిన ప్రవర్ధమాన మవుతున్న సర్వాత్మ భావమే!

నాగేశ్వరులు మహారాష్ట్ర దేశమధ్యములో నుండి ఆంధ్రదేశానికి ప్రదర్శించిన మొదటి దీపము 'ఆంధ్రపత్రిక'. అది 1908 జనవరి సం.లో కీలక సం. భాద్రపద శుద్ధ చతుర్దశి బుధవారమునాడు ప్రారంభమైనది. అప్పుడది వారపత్రిక. సరిగ్గా గణపతి నవరాత్రులు పూర్తిచేసుకొని శ్రీమహాగణపతిని ప్రసన్నులనుగాచేసుకొని, ఆంధ్రపత్రికనుఆరంభించారు.

సర్వవిఘ్న నివారకుడు గణాధిపతిని అధమపక్షము స్మరణమైనా చేయనిది, శైవులుగాని, స్మార్తులుగాని, భారతీయులు ఏపనికి ఉపక్రమించరు. అప్పటికి పుట్టిన పత్రికలుకాని, తర్వాత పుట్టినవి కాని, ఆంధ్ర దేశములోని పత్రికలు చాలాభాగము త్వరగానో ఆలస్యంగానో అంత రిస్తున్నవే. గణాధిపతి ప్రసాదమున్న ఆంధ్రపత్రిక, త్వరలోనే దినపత్రి కయై, మరెన్నో శాఖోపశాఖలై, అచంచలంగా ఉండి, త్వరలో షష్ఠి పూర్తి ఉత్సవము చేసుకోబోతున్నది. ఇప్పటికీ ఆగణపతి ఆంధ్రపత్రిక ఆఫీసులో పూజలు పొందుతూ ప్రసన్న వదనుడై నిలిచియే ఉన్నాడు. భారతీయ సంప్రదాయము విడనాడని నూతనారంభమంటే అట్లాగే ఉంటుంది. ప్రారంభ శుభసమయ నిర్ణయములో అప్పుడు విశేష వైభ వంతో మహారాష్ట్రములో జరుగుతూ ఉండిన గణపతి నవరాత్రముల ఛాయకూడ ఉన్నది.

నాగేశ్వరులు తమ అభిమానౌషధానికి అమృతాంజనమని పేరుపెట్టి కృతార్థులైనట్లే, పత్రికకుకూడా పరమోచితమైన 'ఆంధ్రపత్రిక' అని పేరు పెట్టడము వారి అద్భుతమైన దూరదృష్టికి నిదర్శనము. అప్పటికి ఆంధ్ర రాష్ట్రము కావలెననే ఆలోచనకూడా ఎవరికీ తట్టియుండలేదు. తర్వాత కొద్దికాలానికే ఆంధ్రోద్యమ మారంభమైనది. అందులో ఆంధ్రపత్రిక వహించిన పాత్ర ఎంత వర్ణించినా తీరదు. ఆంధ్రోద్యమము ఆరంభించిన మొదటి రోజులలో ఆంధ్రదేశములో నాయకులెందరో ఆ ఉద్యమాన్ని ప్రతిఘటించినారని యువతరము వారికి గుర్తుచేయవలసి ఉన్నది.

ఒక్క ఆంధ్రపత్రిక పేరే కాదు. అప్పుడు ఆంధ్రదేశములో చాలా గ్రామాలకు వారానికి రెండుసార్లని పేరున్నా, నిజంగా ఒక్కసారే టపా వెళ్లేది. సరిగా టపా వెళ్ళే రోజుకు అందేట్లుగా ఆంధ్రపత్రిక వచ్చేది.

గ్రామస్థులకు అది ఒక పండుగ. మళ్ళీ వారానికి ఆంధ్రపత్రిక వచ్చే దాకా, గ్రామీణులు ఆపత్రిక మరల మరల చదివేవారు, చదవలేనివారు వినేవారు. ఆ చదవడ మెట్లా? "ఆంధ్రపత్రిక దగ్గరనుంచి అమృతాంజనం దాకా!" ఈ మాటకు ఆమూలాగ్రమూ అనే అర్థము. ఆ అర్థానికి మూల కారణము ఇప్పటి వాళ్ళకు తెలియదు. పత్రిక మొదట 'ఆంధ్రపత్రిక' అని ఉన్నట్టే, చివరిపేజీ చివరలో, చాలాకాలమువరకూ, తప్పనిసరిగా, అమృతాంజన ప్రకటన ఉండేది!

విద్యాప్రదాతలైన దేవతలు ప్రధానంగా ఇద్దరు. హయగ్రీవు డొకరు. ఆయన హేషాఘోషతో వేదనాదము దిక్కులు ప్రతిధ్వనింప జేస్తాడు. రెండవ వారు దక్షిణామూర్తి. ఆయన మౌన వ్యాఖ్యతో జ్ఞానోప దేశము చేస్తాడు. తద్విదులైనవారు ఆలోచిస్తే, ఆయన శ్రీ మహాగణాధి పతి స్వరూపుడుగానే భాసిస్తాడు. నాగేశ్వరరావు తమ రచనలు, ప్రస్తా వనలు తరుచుగా ఈ విధముగా దక్షిణామూర్తికి నమస్కరించి ఉపక్ర మిస్తారు.

"ఓం నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైక మూర్తయే,
నిర్మలాయ ప్రసన్నాయ దక్షిణామూర్తయే నమః"

ఇందులో ఒక వైచిత్రి ఉన్నది. ఇందులో నిర్మల జ్ఞాన శబ్దములు హయగ్రీవ ధ్యానశ్లోకములోకూడా ఉన్నవే!

ఆంధ్రపత్రికయే తర్వాత పుట్టిన అన్ని పత్రికలకూ ఒరవడి ఐన దంటే అతిశయోక్తి కాదు. పత్రికాప్రచురణల కష్టసుఖాలు, పుట్టుపూర్వోత్త రాలూ బాగా ఎరిగిన శ్రీ నార్ల వెంకటేశ్వరరావు 'ఆంధ్రప్రభ' సంపాద కులుగా ఉన్నప్పుడు వ్రాసిన మాటలు చదివితే, ఆంధ్రపత్రిక స్థాపనలో నాగేశ్వరుల మహత్త్వము కొంత బోధపడుతుంది. వారి వాక్యాలే కొంత సంక్షేపించి ఉదాహరిస్తున్నాను.

"తెలుగు పత్రికా రచయితలకు కులపతి శ్రీనాగేశ్వరరావు పంతులు గారు. ఈనాడు తెలుగు జర్నలిజమ్ యింత అభివృద్ధి చెందిందంటే, ముఖ్యంగా తెలుగు దినపత్రికలు అభివృద్ధి లోనికి వచ్చాయంటే, అదంతా

ఆయన చలవే 1914లో ఆయన మొదట తెలుగు దినపత్రిక స్థాపించి నప్పుడు ఆయన వద్ద కల సాధన సంపత్తి బహు స్వల్పం. పత్రికలలో పనిచేయడానికి అనుభవజ్ఞులైన ప్రతిభావంతులు లేరు. ప్రజలైనా చేయూత ఇచ్చి తోడ్పడేట్లు ఉన్నారా అంటే, అది లేదు. అయితే ఈ చిక్కు లేవీ ఆయనను అడ్డలేకపోయినవి. అచంచలమైన ఆత్మవిశ్వాసము ఆయనది. విజ్ఞానధనాన్ని పంచిపెట్టాలనే ఉత్సాహము, సరస్వతీపరి మళాన్ని గుబాళింపచేయాలనే ఉత్సాహం, ఆయనలో ప్రేకేళ్ళురికింది.... పత్రికాప్రకటనలో కూడా ఆయన ఎక్కువగా తెలుగు వార్తలకే ప్రాము ఖ్యం ఇచ్చేవారు. తెలుగు ప్రజల దైనందిన జీవితము ప్రతిఫలించడానికి పత్రిక దర్పణం కావాలని ఆరాటపడేవారు.... నాగేశ్వరరావుగారు పత్రిక నెలకొల్పడంతోపాటు పత్రికాపఠనంకూడా ప్రజలకు అలవాటు చేయవలసి వచ్చింది. ఈ నిమిత్తం ఆంధ్రదేశంలోని ప్రతిగ్రంథాలయానికి ప్రతిపఠన మందిరానికి రెండు దశాబ్దాలపాటు ఆయన ఉచితంగా పత్రికను పంప వలసి వచ్చింది... తన ఆదర్శం ప్రకారం పత్రికానిర్వహణ చేయటానికి అవసరమైన ప్రతిభావంతులకోసము అన్వేషించవలసి వచ్చింది. పత్రిక లకు వ్యాసాలు వ్రాసేవారికి పారితోషికం ఇచ్చే ఆచారాన్ని మొదలు పెట్టింది వారే. ఇందువల్ల తెలుగు పత్రికా రచన దేశసేవ మాత్రమే కాక గౌరవనీయమైన వృత్తిగా పరిణమిల్లింది. పత్రిక సర్వాంగసుందరంగా ఉండాలంటే వివిధ చిత్రాలతో ముద్రించాలి. అప్పుడే పెద్దలతోపాటు పిన్నలను, విద్యాధికులతోపాటు నిరక్షరాస్యులనుఆకర్షిస్తాయి. ఈదృష్టితో ఎన్నో వ్యయప్రయాసలకు ఓర్చి చక్కని బ్లాకులు తెప్పించేవారు."

పై వాక్యాలు దినపత్రిక జనతర్వాత ఆంధ్రపత్రిక ఆశయాన్ని దృష్టిలో పెట్టుకొని వ్రాసినవైనా అవి ఆంధ్రపత్రిక వారపత్రికగా ఉన్న ప్పటి దశకుకూడా అన్వయిస్తాయి.

"ఆంధ్రపత్రిక కేవల వార్తాపత్రిక కాదు. జాతీయ సంస్థ. ఆంధ్ర ప్రజావాహినికి ప్రతిబింబము.ఆంధ్రజాతికి గౌరవము కూరుస్తున్న ఉత్తమ పత్రిక. అది ఎంతటి ఉద్రేక పరిస్థితులలోనైనా తొణకదు. ఉద్రేకపర చదు. ఆలోచనా పూర్వకమైన భావాలు ప్రేరేపించి విజ్ఞానాత్మకము

స్వాతికము సుస్థిరము అయిన వి౯నము అవలంబిస్తుంది. క్రమమైన పరిణామము కలిగి స్థిరమైన నీతిగల పత్రిక. అది ఆంధ్రుల నిత్యజీవితంతో పెనవేసుకుపోయినది." ఈ మాటలు ఒకరన్నవి కావు. చాలా మంది చాలాసార్లు అన్నవి. జనమంతా ఏకగ్రీవంగా అనేమాటలు. నాగేశ్వరరాయులు ఆంధ్రపత్రిక నడిపినది ముప్పది ఏళ్ళ. వారు పరమపదించిన తర్వాత ఇప్పటికి మరొక ముప్పది ఏళ్ళు దాదాపుగా గడచినవి. ఐనా దానిస్థాయి అట్లాగే ఉన్నదంటే దానికి కారణము నాగేశ్వరులు స్థిరముగా నెలకొల్పిన సత్సంప్రదాయమే. ఇది ఒక్క సంపాదకీయాల లోనే కాదు. వార్తా ప్రకటనలలో కూడా ద్యోతిత మవుతుంది-ముఖ్యంగా యుద్ధసమయంలో జనాకర్షకమైన వార్తలు అందుతుంటవి. అవి విశ్వాస యోగ్యమైనవని భావించనిదే ఆంధ్రపత్రిక ప్రచురించదు. తక్కిన పత్రికలు వచ్చిన అద్భుతవార్తను వచ్చినట్లుగా ప్రకటించి మరునాడే దాన్ని సరిదిద్దుకుంటవి.

ఆంధ్రపత్రికకు మొదట శ్రీ అవటపల్లి నారాయణరావుగారు, తర్వాత శ్రీ హరిసర్వోత్తరావుగారు సహాయ సంపాదకత్వము వహించారు. తర్వాత బహుకాలము శ్రీ చల్లా శేషగిరిరావుగారు ఆ స్థానంలో ఉన్నారు. శ్రీ శేషగిరిరావుగారిమూర్తి కూడా నాగేశ్వరుల మూర్తివలెనే ధీరోదాత్తముగా ఉండేది. వారి ఆధ్వర్యములో ఆంధ్రపత్రిక పరిణతయౌవనము కూర్చుకొన్నది. అంతకుముందు ఆంధ్రపత్రికలో ఇంగ్లీషులోనే టెలిగ్రాములు ఇత్యాదులు ప్రచురించేవారు. శ్రీ శేషగిరిరావు చేసినసూచననే హర్షించి నాగేశ్వరులు ఆపద్ధతి చాలించారు. "తెలుగుదేశములో పరిస్థితులు తెలిసి కొనవలెనంటే, ఇంగ్లీషువారు ఆంధ్రపత్రికచదువుకొనవలసివస్తుంది" అనినాగేశ్వరులు సగర్వంగా అప్పుడు అనగలిగినారు.

నాగేశ్వరులు పరమపదించే నాటికి ఆంధ్రపత్రిక ఎనిమిదివందల మందికి ఉచితంగా పంపుతూ ఉండేవారట. దానివల్లనే పత్రికకు నష్టమని శ్రీ పట్టాభి లెక్కకట్టినారట!

# 6
# ఆంధ్రోద్యమము

శ్రీ నాగేశ్వరులు పూర్ణపురుషుడు కావచ్చును, ఎంత మహానుభావుడో కావచ్చును, కాని వారివల్ల మనకు లభించినదేమి అనికూడా ప్రశ్నించుకోవడము న్యాయసమ్మతమే. ముఖ్యముగా ఆంధ్రభూమికి వారుతమ పురుషత్వము సార్థకముగా సర్వతో ముఖమైన నిస్వార్థసేవ చేసినారు. ఆంధ్ర వారపత్రిక, సంవత్సరాది సంచికలు, ఆంధ్ర దినపత్రిక, భారతి, ఆంధ్రగ్రంథమాల—వీనివల్ల వారు కావించిన ప్రబోధము, అనేక గ్రంథాలకు వారు వ్రాసిన పీఠికలు, ఆంధ్రప్రదేశ కాంగ్రెసుకు, మదరాసులో ఆంధ్ర సభకు, ఆంధ్రదేశమంతటా గ్రంథాలయాలకు వారు కావించిన కృషి, హరిజనోద్యమానికి, స్వాతంత్ర్య సమరానికీ, ఆంధ్రభాషా సంస్కృతుల సర్వతోముఖాభివృద్ధికి వారు ఇచ్చిన చేయూత, వారు కావించిన విస్తారదానాలు— ఏ ఒక్కటి ఐనా చాలు, ఎవరినైనా మహోత్కృష్టస్థితిలో శాశ్వతముగా లోకారాధ్యులను చేయడానికి! మరి వారు ఇన్నిటిలో అనితరసాధ్యమైన ప్రజాసేవ చేయగలిగి ఉండడము తలుచుకుంటే అద్భుత మనిపించక తప్పదు. ఇంతసేవ చేసినా వారి వినయము ఎటువంటిదంటే, వారిని స్వీయచరిత్ర వ్రాయుమని పలువు రడిగినా వారందు కంగీకరించలేదు.

"మీరు పాత్రులకు అపాత్రులకుకూడా దానాలు చేస్తారు. మీ దానాలు చాలాభాగము వ్యర్థమవుతున్నవి" అని ఒకరడుగగా, నాగేశ్వరు లిచ్చిన జవాబు శాశ్వతముగా ప్రపంచచరిత్రలో నిలువదగినది: "మనము చేసే స్వల్పసహాయానికే పాత్రుడెవరో అపాత్రుడెవరో విచారణ చేసి తేల్చుకునే లోపల పాత్రభూతుడైన ఆ పుణ్యాత్ముడు నిస్సహాయుడై ప్రాణాలు వదులుతాడు!"— మన ధర్మశాస్త్రము అపాత్రుల కిచ్చేదానము దాతకు పాపముకూడా కలిగిస్తుందని చెబుతుందని వారికి తెలియక కాదు. నూరుమంది అపాత్రులకు ఇచ్చినదానము వల్ల వచ్చే పాపముకంటే, ఒక్క పాత్రభూతునికి ఇచ్చిన దానము శతాధిక పుణ్యఫలప్రదమనీ, అర్హుడైన వానిని పాత్రాపాత్రవిచారణ చేయనవసరము లేకుండా ఆర్తిలోనుంచి

ఉద్ధరించవలెననీకూడా ఆ ధర్మశాస్త్రమే ఘోషిస్తున్నదనీ, పాత్రాపాత్ర విచారణచేయువలెననేవారికి ఏమి ఎరుక! ఈ ధర్మశాస్త్ర నిర్ణయాలన్నిటి కంటె కూడా నాగేశ్వరు లిచ్చిన జవాబు ఎంతో హృదయంగమంగా ఉండి సత్యస్ఫూర్తి కలిగి ఉన్నది. ఇది క్రౌంచము చేసిన దీనారావము చేత, కేవలకరుణాపేదిత్వము వల్ల అధర్మమని నిశ్చయించి మహర్షిత్వమూ, ఆదికవిపదభాజనత్వమూ ప్రాప్తించిన వాల్మీకిని జ్ఞప్తికి తెస్తున్నది!

వేలూరు జెయిలులో ఉండగా ఒకమారు వారితో శ్రీశివశంకరులు "పంతులుగారూ, మీ రింత దేశసేవ చేసినారు. మీ పేర ఏదైనా ఒక శాశ్వత చిహ్నమైనది నెలకొల్పితే బాగుంటుంది" అని సూచించినారట. ఆ మాటలకు నాగేశ్వరులు జవాబు చెప్పకుండా, ఊరికే నోరు చప్పరించి వేసినారట! "అప్పుడు వారెంత నిస్సంగులో నాకు అవగతమైన" దని శివ శంకరులు తమ అనుభవాన్ని తరుచుగా స్మరిస్తూ ఉంటారు.

ఇంకా ఎందరో "మీ రింతమందికి ఇన్నిదానాలు చేయకుండా అదంతా ఏదో ఒక సంస్థమీద కేంద్రీకరిస్తే మీపేరు శాశ్వతంగా ఉంటుం" దని ఎన్నోమారులు సూచించారట. వారికీ వారిచ్చిన జవాబు తత్తుల్యమైనదే. వారికి యశస్సుమీదకూడ కామము లేదు.

అల్పసత్త్వులైనవాళ్ళు ఏదో ఒకదానిమీద దృష్టి పెట్టుకొని దానికై సర్వవిధాల పరిశ్రమిస్తారు. వారంతవరకు ప్రశంసాపాత్రులే. కాని అనల్ప సత్త్వులూ, అపరిమిత పుణ్యమూర్తులూ ఐన పూర్ణపురుషులైన వారిని ఒకదారిలో పరిమితము చేసికొని నడవమని చెప్పడము, ఆ సలహా చెప్పే వారి సంకుచిత భావాన్నే వెల్లడిస్తుంది.

నాగేశ్వరులు కాంక్షించకపోయినా, వారి కాంస్యవిగ్రహాలు ఆంధ్ర రాజధానిలోను, ఇతర నగరాలలోనూ వెలయబోతున్నవి. వారి పేరుతో ఎన్నో సంస్థలుకూడా ఇప్పటికే ఉన్నవి. కాని నిజంగా, సంపూర్ణంగా, శాశ్వతంగా, వారిపేరుతో కాకపోయినా, వారు చేసిన నామకరణంతో వారు నిలిచిఉండేవి ఆంధ్రరాష్ట్రములోనూ, ఉద్బుద్ధమైన ఆంధ్ర సంస్కృతిలోనూ.

ఏకశిలానగరము 1323లో పరరాజవశమైన తర్వాత, మళ్ళా నేడు గాని ఆంధ్రభాష ఆంధ్ర సంస్కృతి ప్రత్యేక వ్యక్తిత్వముతో వెలయ లేదు. విజయనగర రాజ్యము హిందూధర్మాన్ని నిలవపెట్టినప్పుడు,దానికి ఆంధ్రు లెన్నోవిధాల దోహదం చేశారు. కాని అది కర్ణాట రాజ్యనామం తోనే ఉండిపోయింది. ఆ రాజ్యము క్షీణించి దక్షిణాదిన మధుర తంజా వూరు ఇత్యాది నగరాలలో ఆంధ్రప్రభువులు పరిపాలనలు సాగించినా, వారు అక్కడి ద్రావిడులలో కలసిపోయినారు. మళ్ళా మహారాష్ట్ర రాజ విజృంభణంలో ఆంధ్రులు తమ ప్రతిభ ధారపోసి తెలుగు (తైలంగ్) అనే పేరుతో మహారాష్ట్రులలో కలసిపోయినారు. తర్వాత ఆంగ్లేయుల పాల నంలో రెండుగా చీలి కొంత చెన్నరాష్ట్రంలోనూ, కొంత నిజాము రాజ్యము లోనూ ఉండిపోయినారు. చెన్నపట్టణము ప్రథమములో ఆంధ్రులవల్ల వృద్ధిఐన పట్టణమే ఐనా,ముందు దక్షిణదేశానికి రైలుమార్గము పడినందు వల్ల, అక్కడికి తమిళులు విపరీతంగా ఎక్కివచ్చి తమిళనగరంగా మార్చివేసుకున్నారు. ఆ స్థితిగతులలో ఆంధ్రులకు తమ ఆంధ్రత్వాన్ని ముందు స్మరణకు తెచ్చినది నాగేశ్వరరాయలు. బొంబాయినుండి ప్రచు రించిన ఆంధ్రపత్రిక దానికి అనుబంధంగా అనతికాలములోనే ప్రారంభ మైన సంవత్సరాది సంచికలు ఆంధ్రప్రజానీకానికి ఆంధ్రదేశాన్ని, ఆంధ్ర ప్రముఖులను పరిచయము చేయసాగినవి. ఆంధ్రవాఙ్మయము, ఆంధ్ర శిల్పము, ఆంధ్ర చిత్రకళ, ఆంధ్ర సంస్కృతి ఆంధ్రుల చరిత్ర, ఆంధ్ర ప్రజలకు తెలిపి నేత్రోన్మీలనము చేసిన శ్రీ గురువులు నాగేశ్వరులు.

ఆంధ్రోద్యమానికి శ్రీ కందుకూరి వీరేశలింగము తండ్రివంటివారని నాగేశ్వరుడు చెప్పిరి కాని అది వినయశీలతవల్ల చెప్పినది. వారి మాట లను తీసివేయలేక శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు నాగేశ్వరులను ఆంధ్రోద్యమానికి తల్లివంటివారన్నారు. కాని సత్యము చెప్పవలసినచో, ఆంధ్రోద్యమానికి తల్లి, తండ్రి,గురువు వంటివారు నాగేశ్వరులు అనడము అతిశయోక్తి కాదు. కాకతీయ రాజ్యపతనమైన తర్వాత ఆంధ్రత్వము స్వయంగా దర్శించి ఆంధ్రప్రజలకు దాని స్వరూపము ప్రత్యక్షముచేసి ప్రదర్శించిన ఋషిస్వరూపుడు నాగేశ్వరులు!

నాగేశ్వరులకు ఎంత దూరదృష్టి ఉండేదో, వారు కార్యసాధనకు ఎంత నెమ్మదిగా నిశ్చలముగా ఉపక్రమించి సాగించేవారో, విచారిస్తే అద్భుతమనిపిస్తుంది. మొదటి ఆంధ్రమహాసభ 1913లో బాపట్లలో సమావేశమయినది. అప్పటిలో ఆంధ్ర రాష్ట్రానికి ఆంధ్రులలో నాయకులే పలువురు ప్రతికూలురైనందున, తీర్మానము చేయకుండా వాయిదా వేయబడినది. ఆ వెంటనే రాయలసీమ నుండి ప్రతిఘటన వచ్చినది. ఆతర్వాత 1914వ సంవత్సరములో జరిగిన రెండవ ఆంధ్రమహాసభలోగాని ఆంధ్ర రాష్ట్రము కావలెననే తీర్మానము అంగీకరింపబడలేదు. అంతకు పూర్వము నుండియే ఆంధ్రపత్రికలోను, కృష్ణాపత్రికలోను, దేశాభిమాని పత్రికలోను ఆంధ్రరాష్ట్రము కావలెనని ఎన్నో వ్యాసములు ప్రచురింపబడ్డవి. ఈస్థితిగతులు బుద్ధిస్థముచేసికొన్ననే కాని నాగేశ్వరు లవలంభించిన సౌమ్య ధోరణిలోని దూరదృష్టి అనుభవానికి రాదు.

ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక శ్రీ నాగేశ్వరుల అపూర్వసృష్టి. ఆంధ్రపత్రిక స్థాపించిన తర్వాత వారు ప్రారంభించిన కార్యములలోనెల్ల గణనీయమైనది ఈ సంచికలు ప్రారంభించుటే. మొదటి సంవత్సరాది ప్రారంభమైనది. అందులో శ్రీ నాగేశ్వరులు వ్రాసిన ఈ క్రింది వాక్యములు శ్రద్ధగా గమనింపదగినవి:

"అశోకవర్ధనుని కాలములో ఆంధ్రరాజులు 30 దుర్గములను 1,00,000 పదాతులను, 2,000 అశ్వికులను, 1000 గజములను గలిగి యుండిరి. కృష్ణానదీతీర మందున్న శ్రీకాకుళము వీరికి రాజధానిగా నుండెను. ఆంధ్రులు రమారమి 550 ఏండ్లు క్రీ.పూ. 300 నుండి కీ. త. 236 వరకు నాంధ్రదేశమును బాలించిరి.... ఓరుగంటి సంస్థానాధీశులైన గణపతిరాజులు పంన్రెండు, పదమూడు శతాబ్దములం దాంధ్రదేశమును మహావైభవముతో బాలించిరి. ఈ వంశజులలోని రుద్రమదేవియును బ్రతాపరుద్రుడును బ్రసిద్ధులు.... ఆంధ్రుల గత వైభవము దేశాభిమానమును బురికొల్ప నోపదా?.... నా జన్మభూమి, నా మాతృభాష, నా స్వదేశము అని యొకసారియైనను దలపోయని తేజోవిహీనుడైన కుక్షింభరుడుండునా?.... దేశారాధనమునకు దౌర్జన్య మీకాలమున నెంతమాత్ర

మును బనికిరాదు... దౌర్జన్య మిహపరసుఖములను బాడుచేయును. ధర్మారంభమువలన నంతరాయములు నశించి విజయము సమకూరును."

"ప్రస్తుతము తెలుగుబాసను మాటలాడు జనులు రెండు కోట్లకు పైగా గలరు. వీర లన్ని రాష్ట్రములందును వ్యాపించియున్నారు. 1,50,00,000 తెలుగువారు బ్రిటిషు ఇండియాలోను, 50,00,000 నైజాము రాజ్యమునందును గలరు. బ్రిటిషు ఇండియాలోనివారు విశేషముగ తెలుగు మండలములలో నున్నారు. కాని రామేశ్వరమునకును, గాశికాపురము నకును, రంగూనునకును, క్వెట్టాకును నడుమనున్న పట్టణములందెల్ల దెలుగువారుగలరు. వీరల నందర నేకీభావులుగ జేయుట కాంధ్రభాషకు శక్తిసామర్థ్యములు గలవు. భిన్నదేశములందుండు తెలుగువారి నేక దేశీయులనుగ జేయుటకు మాతృభాషయే తగిన బంధన సాధనము."

"ద్రావిడులును, మహారాష్ట్రులును, ఘూర్జరులును నాంధ్రులకన్న సంఖ్యాబాహుళ్యమున దక్కువగనున్నను, శక్తిసామర్థ్యములం దాంధ్రు లను మించియున్నారు.... దేశభాషాభ్యుదయము మన సకలారంభము లకును బునాది. ఐకమత్యమునకు మూలబీజము. పారిశ్రామికాభివృద్ధికి ప్రధాన సాధనము, వాణిజ్యాభివృద్ధికి జతురోపాయము, జ్ఞానాభివృద్ధికి సరళమార్గము, పురుషార్థ సాధనమునకు జక్కని త్రోవ.. ...."

"ఆంధ్రదేశ బాంధవులారా! మన పూర్వపు ఉన్నతస్థితిని దల పోయుడు.... దయామయుడైన సర్వేశ్వరుని నమ్మి దేశభాషా హితా ర్థమై పనిచేయుడు. సఫలీకృత మనోరథు లచిరకాలమున గాగలరు."

వారి సౌజన్యము, వ్యవహార దక్షత గమనింపదగినవి. భాష సంగ తియే చెప్పిచెప్పి తుదకు 'ఆంధ్రదేశ బాంధవులారా' అని సంబోధించిరి. సర్వతోముఖమైన ఆంధ్రాభివృద్ధికి వారెట్టి కలలు కనుచుండిరో ఇందులో కాననగును. అప్పటికి మహాత్ముడు రాజకీయములలో ప్రవేశింపలేదు. అప్పటికే నాగేశ్వరులు రాజకీయ సాధనముగా దౌర్జన్యము విడనాడవలె ననియు,ధర్మ మిహపరసాధన మనియు,దయామయుడైన సర్వేశ్వరుని నమ్మిన మనోరథములు సిద్ధించుననియు ప్రబోధించుటచే, అహింసా ధర్మములు రాజకీయ సాధనములుగా ఆంధ్రదేశమునకు ముందు చాటిన 'ప్రవక్త' కూడా నాగేశ్వరులే యనిపించును.

ఆంధ్రోద్యమము దేశమంతట పేరూనిన తర్వాత నాగేశ్వరుల భాష మారిపోయినది. ఈ డొంకతిరుగుడులు లేకుండ ఆంధ్రరాష్ట్ర సాధనకే వారు ప్రబోధింపసాగిరి. తర్వాత రాయలసీమనుండి ప్రతిఘటన రాగా నాయకుల నందరిని తమ స్వభవనమైన 'శ్రీబాగ్' లో సమావేశపరచి, 'శ్రీబాగ్ ఒడంబడిక' కుదిర్చి సామరస్యము చేకూర్చిరి.

నాగేశ్వరులు ఆంధ్ర దినపత్రిక మూలస్థానమును 1914లో చెన్న పట్టణమునకు మార్చిరి. అట్లు మార్చుటకు ముందు 9-4 1913న వెలువడిన ప్రమాదీచ సంవత్సరాది సంచికలో "ఆంధ్ర మహాజనులకొక విజ్ఞాపనము- ఆంధ్రపత్రికా కార్యస్థానమును చెన్నపురి రాష్ట్రమునకు మార్చుట- దిన పత్రికగా జేయు సంకల్పము" అను శీర్షికతో విన్నప మొకటి ప్రకటించిరి. దానిలో "ఆంధ్రదేశమునం దిపుడు నలుదిక్కుల నూతన జీవము వ్యాపించుచున్నది.... ఆంధ్రపత్రికకు గారణాంతరముల వలన నారంభ దశయందు బొంబాయి ముద్రణస్థానముగా నుండుట పత్రికాభివృద్ధికి తోడ్పడినను, ఇప్పుడది ప్రతిబంధకముగా నున్నది.... ఈ లోటుపాటులు లేకుండుటకును, దాని యుపయోగమును వృద్ధిపరచుటకును, చెన్నపురి రాష్ట్రమునందు ముద్రించుటయును, దినపత్రికగా మార్చుటయును, ముఖ్యమని పత్రికా నిర్వాహకులు నిశ్చయించిరి...." అనుచు ఆంధ్రదేశ బాంధవులకు ఈ ప్రశ్నావళి ప్రచురించిరి. ఆ ప్రశ్నలివి :

"(1) ఆంధ్రభాషయందు దినపత్రికను బ్రచురించుట కవకాశము కలదా? (2) దానిని ప్రచురించుటకు దగిన స్థలమెద్ది? (3) చందా ధన మెంతయుండిన బాగుండును ? (4) దినప త్రికను విజయవంతముగా జేయుటకు దగిన యుపాయము లెవ్వి? (5) ఈ మహత్కార్య నిర్వహణమునకు మీకున్న విశేషాభిప్రాయము లెవ్వి ?"

తాము నిర్వహింపబోవుచున్న నూతనోద్యమమునకు ఆంధ్రమహాశయుల సలహాను అర్థించుటలో, నాగేశ్వరుల ఔదార్యమేకాక, వారి నిర్వహణ దక్షతయు ప్రత్యక్షము కాగలదు. మహారాష్ట్రములోని స్వదేశ సంస్కృతులయందుండు అభిమానముతోపాటు, వర్తక కేంద్రమైన బొంబాయివారి వ్యాపార కౌశలముకూడ ఇందులో నున్నది. ఆంధ్రుల

మేలుకొరకు, ఆంధ్రదేశబాంధవుల ఉపదేశము ననుసరించి దినపత్రికగా చెన్నపట్టణమునుండి ప్రచురించే ఆంధ్రపత్రికను ఆంధ్రులు అభిమానింప కుండా ఎట్లా ఉండగలరు?

ఈ ఆరేళ్ళు వారపత్రికగా బొంబాయినుండి నిర్వహించిన తర్వాత నాగేశ్వరులలో ఎంతో పరిణతికూడా కలిగినదని గమనింపదగును. వారి ప్రస్తావనలలోను, సమస్త రచనలలోను, ఉపన్యాసములలోను ధీరగంభీర మైన ఉదాత్తశైలి ఆంధ్రభాషకు తీర్చిదిద్దినారు. అదియు నిర్దుష్టమైన ఆంధ్రములో నుండును. కాని అది వారికి ఒక్కసారిగా రాలేదు. "నాకు కొంచెము సంస్కృతమే వచ్చునుగాని ఆంధ్రము రాద"ని వారు ఒకప్పుడు అన్నారని ఒకరు వ్రాసిరి. సూక్ష్మముగా వారి మొదటి రచనలు చదివి నప్పుడు, వారి కప్పుడు నిర్దుష్టమైన గ్రాంథిక రచన రాలేదనిపించును. కాని ఈ ఐదేళ్ళను వారు ఆంధ్ర వాఙ్మయమును ఎంతమథించిరో, వారి శైలిలోను భాషలోను వ్యక్తమయ్యే పరిణతి సూక్ష్మబుద్ధులకు విశదీక రించును. ఆ తర్వాత ఇంకా చదివి చదివి అద్భుతమైన ఆంధ్రవాఙ్మయ చరిత్ర మనదగిన పీఠిక ఆంధ్రవాఙ్మయ సూచికకు వ్రాయగల పూర్ణ పాండిత్యము సంపాదించిరి. ఆంధ్రపత్రిక చెన్నపట్టణమునకు మారే నాటికే వారికి ఆంధ్రభాషారచనలో కూడా ఆత్మవిశ్వాసము ఏర్పడినదని మనము గమనింపవలెను.

నాగేశ్వరుల చెన్నపట్టణ యాత్ర ఆంధ్రదేశ చరిత్రలోనే నూత నాధ్యాయానికి నాందీస్వరూపము వహించినది. 1914లో ఏప్రిలు 1వ తేదీన ఆంధ్రపత్రిక దినపత్రికగాకూడా ప్రకటింపబడుట శ్రీ నాగేశ్వరుల జీవితములోనే కాక ఆంధ్రుల చరిత్రలో కూడా ప్రధాన ఘట్టము. అప్పటి నుండి నాగేశ్వరుల జీవితము పరిపూర్ణ ప్రవాహమై ప్రవహించి ఆంధ్ర భూమిని బహువిధ పుష్పఫల భరితము గావించి సంపన్నమై సంపన్న మొనర్చినది. ముందు వారు నివాసముగా స్వీకరించిన చెన్నపురిలో, అప్పటికి ఆంధ్రులకు లేకున్న వ్యక్తిత్వము తెచ్చిరి. చెన్నపురిలో ఏకార్య క్రమము కొత్తగా తలపెట్టినా, తప్పనిసరిగా ఆంధ్రులుకూడా గణనీయులు కాసాగినారు. అప్పుడు సభలకు ప్రధాన కేంద్రమైన గోఖలేహాలులో ఏసభ

జరిగినా, వేదికమీద ఆసీనులై యుండే ప్రముఖులలో శ్రీ నాగేశ్వరులు తప్పక ప్రత్యక్షమయ్యేవారు. ఆ హాలుకు వచ్చే మద్రాసు ప్రముఖుల మోటారుకారు లన్నిటిలో, ఒకవంక అనిబెసెంటమ్మదీ, ఇంకొకవంక శ్రీ నాగేశ్వరులదీ, రాచరికము ఉట్టిపడుతూ ఉండేవి!

కొంతకాలము ఆంధ్ర రచయితల రచనలు ఆంధ్రపత్రిక సారస్వతానుబంధములో ప్రచురింపబడుతూ ఉండేవి. 'సాక్షి'ని మొదట ఆంధ్ర లోకానికి ఎరుకచేసినది ఆంధ్రపత్రికే.

ఆ తర్వాత శ్రీ నాగేశ్వరుల సాహిత్యసేవలో ప్రధాన ఘట్టాలు, 1924లో వారారంభించిన భారతి మాసపత్రిక, 1926లో ఆరంభించిన ఆంధ్ర గ్రంథమాల! భారతి ఆంధ్ర వాఙ్మయమున ఆంధ్ర సంస్కృతికి చేసిన సేవాపోషణలు అద్వితీయమైనవి. అందులో ప్రచురించే విషయాలే కాదు, అచ్చుచేసే కాగితము, చిత్రపటములు అన్నికూడా వైభవోపేతముగా ఉండేవి. శ్రీ నాగేశ్వరుల పెంపుడు ముద్దుబిడ్డ భారతి!

ఈ విధంగా నాగేశ్వరులు సర్వతోముఖంగా ఆంధ్రోద్యమానికి కృషిచేసినా ఆంధ్ర రాష్ట్రావతరణము వారు చూడలేకపోవుట ఒక లోటుగా కనిపించవచ్చునుగాని, అది వారికేమియు కొరతగాదు. నిష్కామకర్మపరులకు సాధనలో ఉన్న ఆనందము ఫలప్రాప్తిలో ఉండదు. ఆంగ్ల పరిపాలనలో అవలీలగా సింధురాష్ట్రము, ఉత్కళరాష్ట్రము సంపాదించుకొన్నారు. భారత స్వాతంత్ర్యముతోపాటు తప్పక ఆంధ్రరాష్ట్రము సిద్ధించుననే విశ్వాసముతో, తృప్తితో, నాగేశ్వరులు కన్నుమూశారు. స్వాతంత్ర్య సిద్ధి తర్వాత ఆంధ్ర రాష్ట్రావతరణకు కలిగిన ఆటంకాలూ, ఆలస్యాలూ, వచ్చిన తర్వాత పుట్టిన బహువిధ కలహాలు చూచి బాధపడే అవస్థ వారికి కలుగపోవుటే విశేషము, ఆంధ్ర విశ్వవిద్యాలయము మాత్రము వారు ఆనందముతో చూడగలిగినారు.

వారి దృష్టిలో ఆంధ్రరాష్ట్ర మెందుకు కావలె?

"ఆంధ్రోద్యమ స్వరూపమైన ఆంధ్ర ప్రబోధము సర్వతోముఖముగ వ్యాప్తమై ఆంధ్రాభ్యుదయమునకును, భారత వర్షాభ్యుదయముకును ప్రపంచాభ్యుదయమునను వినియోగపడవలసియున్నది."

పూర్ణపురుషులగు నాగేశ్వరుల ఆశయ మది.

# 7

## సమన్వయము-దీనజన సేవారంభము

పూర్ణపురుషులైనవారు ముఖ్యంగా అప్పటికి లోక వ్యాప్తంగా ఉన్న విజ్ఞానాన్ని సమన్వయపరచి, ఏకముఖము చేసి లోకసంగ్రహము చేస్తారు. ఇంతవరకు ఈ లోకంలో అవతరించిన పూర్ణపురుషోత్తములతో అసమానమైన పుణ్యపురుషుడు నిస్సందేహంగా వ్యాసభగవానుడు. వ్యాస శబ్దములో విభజించుట, సంగ్రథనము చేయుటకూడా కలసి ఉన్నవి. వ్యాసులు చేసేది గ్రంథరచన కాదు, గ్రథనము-అంటే ఉత్తమ గ్రంథ మాలలకు పత్రికలకు సంపాదకులైనవారు నిర్వహింపవలసిన విధి. ఆయన వేదాలు సృష్టింపలేదు, విభజనచేసి ప్రయోగయోగ్యము చేసి నాడు. వేదాంతాలు (ఉపనిషత్తులు) పూర్ణదృష్టిలేని సామాన్యులకు పరస్పర విరోధాలతో ఉన్నట్లు భ్రాంతి కలిగిస్తూ ఉంటే, బ్రహ్మసూత్రా లతో వాటిని గ్రథనముచేసి ఏకార్థ బోధకములుగా చూపినాడు. పురాణ కథలు కవీశ్వరు లెందరో రచించినవి లోకంలో బహుముఖంగా వ్యాపించి ఉంటే, వాటిని ఏదో ఒక విధంగా ప్రధానమైన 18 కోశాలుగా సంగ్ర హించి, వ్యాసము చేసినాడు. వ్యాసులు స్వయంగా రచించిన గ్రంథము ఒక్కటే అని తోస్తుంది. అది నేడు లోకంలో మహాభారతమనే పేరుతో సంహితావైవిధ్యంతో ప్రచారములో ఉన్న గ్రంథానికి మూలభూతమైన గ్రంథము. దానికి ఆయనకు సమ్మతమైన నామము 'జయము!' మహా భారత పఠనానికి ముందు సంప్రదాయ విదులు ఈ శ్లోకము విధిగా పఠిస్తారు.

> "నారాయణం నమస్కృత్య
> నరం చైవ నరోత్తమమ్
> దేవీం సరస్వతీం వాచం (వ్యాసం)
> తతో జయ ముదీరయేత్."

నారాయణుని నరోత్తముని వాగ్దేవతను నమస్కరించి 'జయము' ప్రవర్తింపజేయవలె. ఇందులో విజ్ఞానముచేత నరనారాయణులు సాధిం

చిన జయము కీర్తింపబడుచున్నది. అది ధర్మరాజు విజయమే కాదు, ధర్మవిజయము, అదేదో పుక్కిటి పురాణాలలో కల్పించి వ్రాసిన కాల క్షేపపు కథ కాదు. ఈ కాలములో వలెనే ఆకాలములో కూడా, ఎంత ధర్మ సంక్షోభము చూచి, వ్యాసభగవానుడు ఎంత ఆవేదనపడ్డాడో, ఆ గంథాంత మందు ఆయన కూర్చిన ఒక్క శ్లోకము జ్ఞప్తికి తెచ్చుకుంటే మనకుకొంత తెలుస్తుంది :

"ఊర్ధ్వ బాహు ర్విరామ్యేష
న చ కశ్చిచ్ఛృణోతిమే,
ధర్మా దర్థశ్చ కామశ్చ
స కిమర్థం న సేవ్యతే."

ధర్మమువల్లనే అర్థమూ కామమూ పొందవలె. అట్లా ఎందుకు చేయరు మీరు! అయ్యో, నా రెండుచేతులూ ఎత్తి మొత్తుకొంటున్నాను. ఒక్కరూ నన్ను ఆలకింపరేమి!- ఈమాటలు ఒకరు కల్పనచేయగల వియా? అది ప్రపంచములో మన మెరిగినంతవరకు అవతరించిన పూర్ణ పురుషులలో ఉత్తమోత్తముడైన వ్యాసభగవానుల సంక్షోభమే! ఆయన సంక్షోభమే ! ఏ అణుమాత్రమైనా ఆత్మలో ఆవేశించినవారే పూర్ణపురుష కోటిలోకి రాగలుగుతారు.

తర్వాత ఆస్తికులైనవారిలో వేదకర్మలయందు నిష్ఠ, అధ్యాత్మ విద్యయందు నిరసనము ఉదయించినది. అట్టి సమయములో శంకర భగవత్పాదులు అవతరించి ఉపనిషత్తులకు బ్రహ్మ సూత్రాలకు భాష్యాలు వ్రాసి జ్ఞానకర్మమార్గములకు యథోచిత స్థానాన్ని వివరించే భగవద్గీతకు కూడా భాష్యము రచించి ప్రస్థానత్రయ మార్గము నిర్దేశించి, ఒకవంక యతీశ్వరులను, ఒకవంక ఇతరులను ధర్మమార్గంలో శాసించే నిమిత్తము భరతఖండానికి నాలుగు మూలలలో నాలుగు గురుపీఠాలు స్థాపించారు. మళ్ళా తురుష్కుల దండయాత్రలతో ఛిన్నాభిన్నమైన భారతధర్మాన్ని ప్రజోపయోగకరంగా సమన్వయంచేసి భద్రపరచిన పూర్ణపురుషుడు శ్రీ విద్యారణ్యులు! పూర్ణపురుషులలో తారతమ్య విచారణ చేయుట తర్క విచారణకు నిలవకపోవచ్చును కాని వ్యావహారిక దృష్ట్యా ఎంతో తార

తమ్యముండి తీరుతుంది. ఏమైనా పూర్ణపురుషుల కందరికీ మార్గదర్శకుడు వ్యాసభగవానులే! తక్కినవారంతా ఆయన అంశ ఏ లేశమాత్రమైనా ఆవేశించినవారే. పూర్ణపురుషులలో ఒకరైన నాగేశ్వరులు స్వయంగా గ్రంథ రచనకు పూనుకొనక సంపాదకత్వానికీ, ఇతరుల గ్రంథాలకు ప్రస్తావనలు, పీఠికలు వ్రాయడానికే ఎక్కువ పరిశ్రమించడానికి ప్రధాన కారణము వారిలో వ్యాసభగవానుల అంశ కొంత ఉద్బుద్ధము కావడమే. వారెంత సేపటికీ సమన్వయము వైపుకే మొగ్గు చూపుతారు.

చిత్రమేమంటే, నాగేశ్వరులు జన్మించిన ఆరాధ్య బ్రాహ్మణశాఖయే ఒక అపూర్వ సమన్వయముతో ఏర్పడిన శాఖ! 12వ శతాబ్దములో బసవ దండనాథు డవతరించిన కాలమునకు పూర్వము, శైవమతము ఉన్న దున్నట్లు సమగ్రముగా నిర్దుష్టముగా ప్రదర్శింపగల సాధనసామగ్రి ఇంకను లభ్యముకాలేదు; కాని స్థూలముగా అది రెండు విధములుగా నుండెనని చెప్పుట సత్యదూరము కాదు. ఒకటి వేదధర్మము సర్వవిధాలా ఆచరిస్తూ అచంచలమైన శివభక్తి ఉన్నవారి శైవశాఖ. అది ద్విజేతరుల యందుకంటె ద్విజులలో ఎక్కువ స్పష్టముగా ప్రచలితమగు చుండెను. రెండవ శైవము ద్విజేతరులయందు మాత్రమే నిష్ఠమై మహా భక్తులచే అనుష్ఠింపబడినది. వారిలో నాలుగు కులాలులేవు. రెండే కులాలు, రెండే భేదాలు. శివభక్తులైనవారు, శివభక్తులు కానివారు. బసవేశ్వరుని తండ్రి మొదటి పద్ధతిలోని వాడు. కుమారునికి ఉపనయనము చేయుట కాతడు తలపెట్టగా, శివభక్తునికి వేదోక్త ద్విజత్వము పనికిరాదని బస వన్న రెండవ మతములో కలసి, దండనాథపదవి సంపాదించి దానికి ప్రాబల్యము తెచ్చెను. అప్పటి శైవావేశములో ఎందరో మొదటి శాఖ లోని శైవులే కాక, శివభక్తులు కానివారు, జైనులు, వైష్ణవులు, మరియు నెందరెందరో శివదీక్ష గ్రహించి ఇష్టలింగధారణముచేసి వీరశైవులైనారు. అట్టివారికి ఉపనయనాదిక వైదికకర్మలేవీ పనికిరావు. యజ్ఞోపవీతధార ణము చేసినవారు వారిదృష్టిలో 'త్రాటిమాలలు!' వారు దేహాంతమందు శివత్వమే ప్రాపింతురుగాన వారికి దహనసంస్కారము, ప్రేతకర్మ చేయ రాదు; స్మార్త సన్యాసులకువలె అందరికీ ఆరాధన చేయవలె।

ఆంధ్రదేశములోని ఆరాధ్య బ్రాహ్మణులు ఈ రెండు శైవమత శాఖల ఆచారములను సమన్వయముచేసి అనుష్ఠిస్తున్నారు. వారు వేదోక్త కర్మలను కులాచారాలను వదలలేదు. కనుక యజ్ఞోపవీత ధారణముచేసి, ఉపనయనాది పంచదశకర్మలూ అనుష్ఠిస్తారు. కాని వారికి రెండవ శైవ శాఖవారికివలెనే శివుని పరమేశ్వరత్వమంటే నిష్ఠకలదు కనుక, ఇష్టలింగ ధారణముకూడా యజ్ఞోపవీత ధారణముతోపాటు చేస్తారు. దానికే 'ధారణ' మనే సంజ్ఞ వచ్చినది. వారు శైవులు కనుక శివత్త్వమే జన్మాంత మందు పొందుతారు కనుక ఖననముచేసి ఆరాధనమే చేస్తారు గాని, దహనము, ప్రేతకర్మ శ్రాద్ధాదికములూ చేయరు. ఈ అంత్యేష్టి వారు వర్జించడము తక్కిన బ్రాహ్మణులకు సమ్మతము కాదు. వారు యజ్ఞోపవీతము ధరించి ఉపనయనాదిక పంచదశ కర్మలు చేయడము మాహేశ్వరులైన శైవులు అంతకంటె సహించరు. ఆరాధ్య బ్రాహ్మణశాఖ ఈ రెండు విధముల శైవాన్ని సమన్వయముచేసిన దెప్పుడో! ఆరాధ్యులు 16వ శతాబ్దము ప్రాంతములో ఇష్టలింగధారణవ్రతము పూనినారని శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిలవారు బసవపురాణపీఠికలో సూచించినారు. పండితత్రయముల కాలములనుండియే ధారణమున్నదని నేటి ఆరాధ్యబ్రాహ్మణుల విశ్వాస ము. పండితారాధ్యులు బసవదండనాథునికి సమకాలికుడు. "బసవేశ్వరుడు మహాశివభక్తుడని యాయనయెడల నద్భుతగౌరవమును, వైదికకర్మలను గుర్తించి వర్ణాశ్రమాచారములను రూపుమాపుచున్నాడని యసంతృప్తియు గాంచిన వాడై బసవేశ్వరుని దర్శించి వాదించుటకై పోవుచుండ ద్రోవలో దన్మృతివార్త వినవలసెననియు, 'భక్తిమీది వలపు బ్రాహ్మ్యంబుతో బొత్తు బాయలేను నేను బసవలింగ' యని యాతడు చెప్పె ననియు బ్రతీతి కలదు"![1]

ఈ బ్రాహ్మ్యశైవముల సమన్వయము ఏకాలములో జరిగినదై నను, అది యిప్పుడు అనుష్ఠించుచున్న ఆరాధ్య బ్రాహ్మణశాఖలో శ్రీ నాగేశ్వరులు జన్మించి యుండుట గమనార్హము. అంతేకాదు, వారి వంశమునకు మూలపురుషుడైన శ్రీపతి పండితులు బ్రాహ్మణేతరుడైన

1. శ్రీ వేటూరివారి బసవపురాణ పీఠిక,

శివభక్తుని నియమము రక్షించుటకై, అతని యింట భోజనముచేయుగా, బ్రాహ్మణులాయనను వెలివేసిరట. అందుపై నాయన కోపించి బ్రాహ్మణుల ఇండ్లలోని అగ్నిని ఆకర్షించి పచ్చడములోపెట్టి జమ్మికి వ్రేలాడగట్టి, వారు క్షమాపణ మర్థించినమీదట మరల ననుగ్రహించెనట. వారి పూర్వపురుషులలో మరియొకరగు గోకర్ణుడు పంచముని ద్విజునిగా జేసెనట! ఈ విధముగా శ్రీ నాగేశ్వరులు జన్మించిన శాఖయేమి, వంశమేమి, విరుద్ధమైన యాచారాలకు సమన్వయము చేసియుండెను. ఆ ప్రతీతుల నిరంతర భావనవలన నాగేశ్వరులు సర్వతోముఖమైన సమన్వయములు చేయుగలిగిరి. నాగేశ్వరులు తాము జన్మించిన వంశములో మహత్త్వముగల పుణ్యపురుషులు ధైర్యసాహసములతో చేసిన సమన్వయమునే భావించి, దానినే అనేక రంగములకు విస్తరింపజేసినారు.

ఈ సందర్భములో మహాత్ముని హరిజనోద్యమము ప్రారంభించుటకు ఎంతో ముందుగానే, వారు హరిజనులయందు కారుణ్యముతో వారలకుకల్పించియుండిన వసతులు మనల కాశ్చర్యము కలిగింపవలెను. అది వారు స్వగ్రామమైన ఎలకుర్రులో ప్రారంభించారు. 1911 సం.లో నాగేశ్వరులు అక్కడ వారి తల్లిగారి పేర శ్యామలాంబా ధర్మ విద్యాలయ స్థాపనము చేయుట, వారు తర్వాత అన్ని రంగములలో చేసిన అనేక ధర్మకార్యాల కన్నిటికీ ప్రారంభము. అందువల్ల 1950 భారతిలో వారి ఛాయాచిత్రానికి ఎదురుగా 'ఆంధ్రజాతి పొలిటి మరువరాని మహాపురుషుడు, నాగేశ్వరరావు పంతులుగారి సంగ్రహ జీవితము' అనే శీర్షికక్రింద వారి జీవితంలో 17 ప్రధానఘట్టాలూ సంవత్సరాలూ ఇస్తూ 1911లో ఎలకుర్రులో ధర్మ విద్యాలయ స్థాపనము ఒకటిగా పేర్కొన్నారు. ఆ విద్యాలయములోనే హరిజన విద్యార్థులకు ముందు ప్రవేశము కలిగింది. ఆ గ్రామములోనే హరిజనులు సరియైన ఇళ్లు లేక బాధపడుతుంటే సహించలేక, నాగేశ్వరులు రెండు ఎకరాలభూమి కొని, అందులో నాలుగు దూలాలవి నలభై యిళ్లు వేయించి వాళ్లకు నివాస సౌఖ్యము కలిగించారు. ఇంకా ఎన్నోవిధాలుగా హరిజన విద్యార్థులకు అపారసహాయము చేసినారు. 1932 లో స్థాపింపబడిన ఆంధ్రరాష్ట్ర

హరిజన సేవాసంఘానికి అధ్యక్షులై ఎంతో సేవచేశారు. నాగేశ్వరులను ఈ హరిజనుల సేవకు ముందు పురికొల్పినది, పూర్వపురుషుడు గోకర్ణుడు పంచముని ద్విజునిగా చేసినా డనుస్మృతి ఐ ఉండవలె. తర్వాత దానిని ఉజ్వలముగా చేసినది మహాత్ముని హరిజనోద్యమము. రెండింటికి మూలమైనది నాగేశ్వరుల హృదయములో ప్రకృతి. సిద్ధముగా ఆర్తులయందూ, దీనులయందూ, పొంగులువారు చుండిన కృపారసము!

# 8

## సమన్వయము – సాంఘిక రాజకీయములు

శ్రీ నాగేశ్వరులు భరతభూమికి, అందులో ప్రత్యేకముగా ఆంధ్ర దేశానికిచేసినసేవ సర్వతోముఖమైనది. వారు సారస్వతానికీ, లలితకళలకూ చేసిన సేవనూ, వారి ప్రవృత్తికి మూలభూతమై వారి నావేశించిన తత్త్వ చింతనను, ముందు ప్రత్యేకముగా వివరింతును. ఇప్పుడు వారు ఇతర రంగాలలో చేసిన అమూల్యమైన కృషిని సూచనప్రాయంగా పేర్కొన దలచినాను. ఒక్కొక్క రంగములో వారు చేసిన కృషి సమస్తమూ వివరింపవలెనంటే, ఒక్కొక్క గ్రంథమే ఔతుందని మనము గుర్తుంచుకుంటేనే గాని, దాని మహత్త్వము మనకు కొంతయినా అవగాహనముకాదు.

ముందు వారు దేశోద్ధరణము ప్రారంభించినది పత్రికా ప్రకటనతో వారపత్రిక, దినపత్రిక, సారస్వతానుబంధము, మాసపత్రిక వారి సారస్వత సేవలో భాగాలే ఐనా కేవల పత్రికా ప్రకటనలో కూడా వాటికి ఉత్తమస్థాన మున్నది. వారు ఆరంభించకముందు పత్రికలు లేకపోలేదు, ఆంధ్రదేశములో. కాని వారు దారి సూపిన తర్వాతనే పత్రికా ప్రకటనకు స్థాయి చిక్కినది. వారు సూపిన దారిన నడిచినందువల్లనే, నేడు కొన్ని దినపత్రికలూ, వారపత్రికలూ నిలకడ చిక్కించుకొన్నవి. ఇతర సాహిత్య మాసపత్రికలకు, ఆంధ్రదేశ ప్రభుత్వమువారు ఈమధ్య ప్రభుత్వ ధనంతో ప్రచురిస్తున్న 'ఆంధ్రప్రదేశ్' పత్రికకు ఇప్పటికికూడా గట్టిమనుగడ దక్క లేదు. వారి కృషిచేత 1908 లో ప్రారంభమైన వారపత్రిక, 1914 లో

ప్రారంభమైన దినపత్రిక, 1924 లో ప్రారంభమైన మాసపత్రిక భారతి— ఈ మూడింటిని పత్రికా రచనస్థాయిలో గౌరవములో మించిన పత్రికలు నేటికికూడా ఆంధ్రదేశములో లేవనడము అతిశయోక్తికాదు. అందుకు కారణము వాని స్థాపకులైన నాగేశ్వరులు ప్రవర్తింపజేసిన ఆదర్శప్రాయమైన సంప్రదాయమే!

వారి రాజకీయ జీవితము మహోజ్జ్వలమైనది. మొదట అది గ్రంథాలయోద్యమంగా ప్రారంభించినది. జాతీయోద్యమాలన్నింటిలో ముందు ఎక్కువవ్యాప్తి చెందినది గ్రంథాలయోద్యమమే. దానికి ఆంధ్ర భూమిలో నాగేశ్వరుల అండ దొరికిన తర్వాత ఇతర రాష్ట్రాలన్నిటిలో కంటె ఆంధ్రలో ముమ్మరంగా సాగినది. మారుమూలలలో ఉన్న గ్రామాలలోకూడా గ్రంథాలయాలు స్థాపించబడ్డవి. వాటివల్లనే రాజకీయ చైతన్యము గ్రామసీమలకుకూడా విస్తరించినది. నాగేశ్వరులు తమ పత్రికలను ప్రచురణలను ఎన్నో గ్రంథాలయాలకు ఉచితంగానో, తక్కువ వెలకో పంపేవారు. ఎన్ని గ్రంథాలయ సభలకో, అన్ని స్థాయిలలోను, వారు అధ్యక్షులుగా ఉండియో, ఉపన్యాసకులుగా ఉండియో, ఆహ్వాన సంఘములో ప్రముఖులుగా ఉండియో కావించిన కృషి అపారమైనది. ఎన్ని గ్రంథాలయాలకు ఎంత ధనము దానము చేశారో లెక్కపెట్ట నలవి కాదు. దేశమంతటా వారిపేర ఎన్నో దేశోద్ధారక గ్రంథమాలలు వెలసినవి. ఈ వ్యాసకర్త బి. ఏ. విద్యార్థిగా ఉన్నప్పుడు చెన్నపట్టణములో గోఖలే హాలులో జరిగిన అఖిలభారత గ్రంథాలయాలసభ, 1919 లో ఎంత వైభవంగా జరిగినదో స్వయంగా దర్శించే భాగ్యము పొందినాడు. ఆ సందర్భంలోనే బాలభట సమ్మేళనము, ఆంధ్రసారస్వత సభలు జరిగినవి. అవి అంత వైభవంగా జరగడానికి మూలభూతమైనవారు శ్రీ నాగేశ్వరులే.

ఈ శతాబ్దములో దేశవ్యాప్తముగ జరిగిన స్వాతంత్ర్యోద్యమ సమరంలో, స్వదేశ ఉద్యమము తర్వాత పేర్కొదగినది హోమురూలు ఉద్యమము. దాని కప్పుడు అనీబెసెంటమ్మ నేత్రిగా ఉండేది. చెన్నపట్టణంలో హోమురూలు లీగుకు శాఖ స్థాపించడానికి ప్రయత్నించగా దానికి అధ్యక్షులుగా ఉండడానికి అందరూ జంకినారు. "సాధక బాధకాలు

సహించే ధైర్యశాలి కావలెనని మీవద్దకు వచ్చినాము" అనగానే అందుకు నాగేశ్వరులు అంగీకరించి దానికైన ఖర్చంతా వారే భరింప సాగినారు.

గాంధీజీ 1921 లో సత్యాగ్రహోద్యమము ప్రారంభించక ముందు హిందీ ప్రచారోద్యమము, ఖద్దరు ఉద్యమము ప్రారంభమైనవి. భారత జాతీయతకు హిందీ ప్రాముఖ్యాన్ని గుర్తించిన ఆంధ్రముఖ్యులలో అగ్రగణ్యులు నాగేశ్వరులు. వారు హిందీ ప్రచారానికి చేసిన సహాయము విస్తారమైనది. ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘంవారు నాగేశ్వరులు దివగంతులైన పిమ్మట, వారిపేర స్మారకనిధి సేకరించి, బెజవాడలో "శ్రీ నాగేశ్వరరాయ హిందీ భవనము" నిర్మించారు.

స్వాతంత్రోద్యమము తీవ్రంగా సాగుతున్న రోజులలో ఆసేతు హిమాచలము ఆదరించిన హిందీప్రచారము, స్వాతంత్ర్యము వచ్చిన యీ ఇరవై యేళ్ళలోను అంతకంతకు అనేక వివాదాలకు, కోపతాపాలకు రంగస్థలము కావడము ఎంతో శోచనీయము. అందుకు మూలకారణము హిందీ ప్రాంతమువారూ, హిందీ రచయితలూ, దినదినాభివృద్ధితో ప్రదర్శిస్తూ వస్తున్న అహంభావధోరణే అవడానికి సందేహములేదు. అతివాదులు దాన్ని వారి మూర్ఖత్వంగా కూడా వర్ణిస్తున్నారు. భారతరాజధాని తమ ప్రాంతంలో ఉన్న అవకాశము చూచుకొని, హిందీ ప్రాంతాలవారు అన్ని రంగాలలోను తమ హిందీ భాషాజ్ఞానము తమ స్వార్థప్రయోజనాలకు ఉపయోగించుకోవడానికి చూస్తున్నారు. హిందీ రచయితలు ఏ సాహిత్యశాఖలోను వంగభాష, ఆంధ్రభాష, మహారాష్ట్రము ఇత్యాది ప్రాంతీయ భాషలు సాధించిన కళాస్థాయిని ఇంతవరకూ అందుకోలేదు. వారి సారస్వత సభలలో మహోజ్జ్వల గ్రంథాలుగా ఎక్కువ భాగం ఆవేశమూ, ప్రచారమూ ప్రదర్శించేవే కాని రసస్థాయిని అందుకొన్నవి అతిస్వల్పమైనవి. దేశమంతా హిందీ భాషాభిజ్ఞులు ఉండడంవల్ల అట్టివారు వాటిని మూలంలో చదివి తమ భాషలో వచ్చిన గ్రంథాలతో పోల్చుకొని చప్పరిస్తునారు. వారు సంస్కృత భాష అంతా తమ సొంత కాణాచి ఐనట్లు వ్యవహరిస్తున్నారు. కాని ఇతరభాష ప్రాంతాలలోవలెనే హిందీప్రాంతంలో కూడా సంస్కృత శబ్దాలెన్నో ప్రాంతీయార్థాలు సంతరించుకున్నవి.

వాటిని ప్రమాణంగా తీసుకుంటే సంస్కృతభాష వికృతస్వరూపము పొందుతుందని, ఇతర భాషాప్రాంతాలలో ఉన్న ఉద్దండ పండితులు చెప్పినా వినిపించుకోరు. ఎన్నడో శూద్రకమహాకవి సంస్కృత భాషలో, శకారసకారలను వ్యత్యస్తం చేసే పాత్రను భావించి, శకారుడనే పాత్రను కల్పించి ఇప్పటివరకూ సామాజికులను నవ్విస్తున్నాడు. కాని హిందీ ప్రాంతీయులు నేడు శకరాన్ని షకారంగా ఉచ్చరిస్తేనేగాని అంగీకరించరు. శ్రీ ని ష్రీ అనవలె. శర్మను షర్మ అనవలె. శాస్త్రిని షాస్త్రి అనవలె! సంస్కృతంలో శ ష స లభేదము నేటికికూడా చక్కగా పాటించే దాక్షిణాత్యులు ఇట్టివారలను ఆధునిక 'షకారులను'గా గేలిచేస్తారంటే వారికర్థమే కాదు. సమస్త విషయాలలో హిందీ ప్రాంతీయులు తమభావాలే వేదశాసనంగా భావించవలెనని ప్రదర్శించే నిరంకుశ ధోరణే నేటి హిందీ వ్యతిరేకతకు ప్రధాన కారణము. ఈ సందర్భంలో పూర్ణపురుషుడు నాగేశ్వరులు 1923 సం.లో కాకినాడ కాంగ్రెసు సందర్భంలో జరిగిన హిందీ సాహిత్య సమ్మేళన సభకు ఆహ్వాన సంఘాధ్యక్షులుగా ఉండి, చేసిన ప్రసంగము, నేటికే కాకుండా ముందు ముందు కూడా స్మరింప దగినది. వారు నిశితమైన సూక్ష్మపరిశీలనమేకాక, ఎంతో దూరదృష్టికూడా కలవారని ఆ ఉపన్యాసము వ్యక్తముచేస్తుంది. గందరగోళాల మధ్య యోగిహృదయంతో సత్యస్వరూప దర్శనం చేయగలవారికే, అది సాధ్యమవుతుంది. అందులో వారన్న ఈ క్రింది వాక్యాలు నేటి హిందీ పక్షీయులు, వ్యతిరేకులుకూడా శాంతంగా మననము చేయదగినవి.

"హిందుస్థానీ భారతభూమికి సహజమైన సామాన్యభాష.... ఆంధ్ర దేశమందు హిందీ ప్రచారము వ్యవహారార్థ మవసర మగుచున్నది, గాని సాహిత్యవ్యాపనార్థ మవసరమగుట లేదు. సాహిత్యము, మాతృ భాషయైన ఆంధ్రభాషాముఖముననే జరుగవలసియున్నది. ఈ లక్షణమును దిగద్రోయుట వలన కలిగిన అనర్థక పరంపరలను ఆంగ్ల భాషాపరిచయము విశదము చేసినది. ప్రజలలో సహజరీతిని విజ్ఞాన వ్యాపనము దుర్లభమైనది. ఆ అనర్థాలు ముందు తిరిగి చిక్కు పరచకుండుటకై ఆంధ్ర దేశములో హిందీ ప్రచార కార్యాలయము శ్రద్ధ వహింపవలసి యున్నది!"

1923 లో శ్రీ నాగేశ్వరులు ప్రదర్శించిన దివ్యదృష్టిని వ్యక్తము చేసే పైవాక్యాలు సువర్ణఫలకాలమీద ముద్రించి ప్రచారం చేయవలసి ఉన్నది. హిందీ ప్రచారసంస్థలూ, పత్రికలూ పైవాక్యాలు తమ మోటోగా (Motto), ఆదర్శంగా, నిబంధనగా, పెట్టుకొని వ్యవహరిస్తే తగాదాలు అన్ని సమసిపోతవి. బహుభాషల సంపర్కంవల్ల ఆంగ్లభాషా, సాహిత్యమూ అసమానమైనశక్తి సంపాదించుకున్నవి. అట్టి ఆంగ్ల సాహిత్యమే, తన ప్రభావము భారత జాతిమీద రుద్దడానికి ప్రయత్నించడము వల్లనే, దానియందు మనకు ప్రాతికూల్యము ఏర్పడినది. మరిబాల్యదశ కూడా ఇంకా వీడని హిందీ సాహిత్యము, పరిణతయౌవనంలో ఉన్న ఇతర భాషాసాహిత్యాలమీద అధికారము చలాయించబోతే,అవిసహిస్తవా? ఇంతమంది భారతీయులు దేశాభిమానంతో హిందీ అభ్యసిస్తున్నారు కాని హిందీ ప్రాంతీయులు అందులో శతాంశమైనా ఇతర భాషలు అభ్యసించడానికి ప్రయత్నమైనా చేస్తున్నారా? శ్రీ నాగేశ్వరులవంటి పూర్ణపురుషులు హిందీ ప్రాంతంలోకూడా జన్మిస్తేనే గాని ఈ చిక్కులు విడిపోవు. గార్డియను నాటు (చిక్కుముడి) విడదీసినవాడు జగజ్జేత అవుతాడని తెలిసి అలగ్జాండరు సులుసూత్రంగా దాన్ని కత్తితో నరికి సాధించి జగజ్జేత ఐనాడనే కథ ప్రచారములో ఉన్నది. అతడు చేసినది విడదీయడమూ కాదు. అతడు జగజ్జేతా కాలేదు. అప్పటికి అనువు కాకుండా విస్తరించి విచ్ఛిపోయేస్థితిలో ఉన్న పర్షియారాజ్యాన్ని అతడు జయించగలిగినాడు. భరత ఖండము వాయువ్య భాగంలో ఉన్ననగరరాజ్యాలను మహార్భాటంతో జయించాడు. ఆ తర్వాత అప్పటి నందరాజ్య ప్రాభవము విని బెదిరిపోయిన తన సైనికులను కూడ గట్టుకోలేక వెనుదిరిగిపోయినాడు. చిక్కుముడి ఛేదించేవాళ్లగతి ఎప్పుడూ ఇంతే! బలహీనులమీద నల్లేరుపై బండినడక సాధించి మహావీరులమని భ్రాంతి పడతారు. పూర్ణపురుషులు అనేక జన్మ సంసిద్ధమైన సుకృత ప్రభావము వల్ల యోగదృష్టి అలవరచుకుంటారు. అందువల్ల చిక్కుముడి వచ్చినప్పుడు వారి ఆత్మజ్యోతి దానిమీద 'ఎక్స్‌రే' వలె అంతరాంతరాలలోకి ప్రసరించి తేలికగా చిక్కు విడదీస్తుంది. దాని ప్రభావమువల్ల మెలికలూ వంకరలూ ముడులూ అన్నీ సరళత్వము పొంది సమరస భావము సమ

కూర్చుకుంటవి. హిందీభాషకు ఉచిత స్థానము నాగేశ్వరులు ఎప్పుడో చెప్పినారు.

ఈ విధంగానే నాగేశ్వరులు ప్రవేశించిన అన్నిరంగాలలోను సామరస్యము సాధించినవారు. ఖాదీ ఉద్యమములో ఉత్సాహంగా పని చేశారు. బహుకాలము ఆంధ్రరాష్ట్ర ఖద్దరు బోర్డుకు వారే అధ్యక్షులు. అప్పుడు ఆంధ్ర ఖద్దరు దేశవ్యాప్తంగా ప్రఖ్యాతి పొందినది.

మహాత్ముడు రాజకీయరంగంలో ప్రవేశించిన తర్వాత నాగేశ్వరులుకూడా సత్యాగ్రహ సమరంలో ప్రవేశించారు. అప్పుడు కాంగ్రెసుకు ప్రజలలో ఆదరమే ఉండేది, కాని ఇప్పటివలె ధనముకాని, ధనవంతుల మీదనూ, అధికార బలముగలవారిమీదనూ, కాని ప్రాబల్యము ఉండేవి కాదు. డబ్బులేని ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘానికి కోశాధిపతిగా వారు నిర్వహించినపని ఆ సంఘము ఖర్చులకు కావలసిన ధనమునకు తమ సొంతధనమువేసి పనిపూర్తి చేయడమేకాని మనమునేడు బహురంగాలలో చూస్తున్నట్లు పబ్లికుకోశంలోని ధనము సొంతకోశాలకు మళ్ళించడము కాదు. వారికి అధికారవాంఛ ఎప్పుడూ లేకపోయినా, తప్పనిసరియై నాలుగుసంవత్సరాలు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీకి అధ్యక్షులైనారు. 1936 సం. లో కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డు కృష్ణా, గోదావరి మండలాలకు అభ్యర్థిగా శ్రీ నాగేశ్వరులను నిర్ణయించగానే, కాంగ్రెసు పార్టీకి ప్రత్యర్థులైన జస్టిసు పార్టీవారుకూడా పోటీకి ఎవరినీ నిలపలేదు. అందుచేత వారికా పార్లమెంటు సభ్యత్వం తేలికగా లభించినది.

1930 సం. లో చెన్నపట్టణంలో ఉప్పు సత్యాగ్రహము ముందు తల పెట్టినవారే లేకపోయినారు. ఆంధ్రకేసరి ప్రకాశం గారికే అధైర్యము కలిగినది. అప్పుడు రెండు వారాలపాటు శ్రీ నాగేశ్వరులు చెన్నపట్టణంలో కాలినడకను తిరిగి ప్రచారం చేశారు. దానితో చెన్ననగరంలో ఉత్సాహము రేకెత్తినది. ఉప్పు సత్యాగ్రహము చేసి నాగేశ్వరులు మొదటిసారి 1930 లో కృష్ణజన్మస్థానం చేరారు. అప్పటికి వారు 63 ఏళ్ళు నిండిన వృద్ధులని గుర్తుంచుకొనవలెను. మళ్ళా 1932 వ సం. లో ప్రభుత్వాన్ని ధిక్కరించి కృష్ణ జన్మస్థానం ప్రవేశించారు. అప్పటికి వారికి 65 సం. లు.

వారికి సేవచెసిన జరీమానా క్రింద ప్రభుత్వము ఎన్నో వేల విలువగల వారి కారు కొన్ని వందలకు వేలమువేస్తే, వారి డ్రైవరు విచారపడుతుంటే అతనిని వారే ఓదార్చారట! శ్రీ నాగేశ్వరులు జీవించి ఉండగా, ఆంధ్ర కాంగ్రెసులో నాయకులమధ్య వైషమ్యాలు, పదవీ వ్యామోహాలు, కక్షలు, లేకపోలేదు కాని అవి ఎప్పుడూ రచ్చకెక్కేవి కావు. దాని కంతటికి ప్రధానకారణము శ్రీ నాగేశ్వరుల వ్యక్తిలో ఉన్న అమృత ప్రభావమే! అందరి మధ్యను సామరస్యము కలిగించి ఏకముఖం చేసేవారు.

శ్రీ నాగేశ్వరులు నిశ్చలమైన కాంగ్రెసువాది ఐనా, ఇతర పార్టీల నాయకుల మీద వారి కెంత మాత్రమూ వైరభావముండేదికాదు. బ్రాహ్మణేతరోద్యమ నాయకులైన శ్రీ పిట్టి త్యాగరాయచెట్టి దివంగతులైనప్పుడు నాగేశ్వరులు భారతిలో వ్రాసిన వాక్యములు స్మరింపదగినవి.

"స్వలాభాడంబరములు లేకను డెబ్బది మూడేండ్లు జీవయాత్రను గడపి ప్రజాగౌరవమునకు బాత్రులైన త్యాగరాయసెట్టిగారు ధన్యులు. త్యాగరాయసెట్టిగారి స్వాతంత్ర్యము, సేవాపరాయణత్వము, స్వసంఘాభిమానము, కార్యదీక్ష శ్లాఘ్యములుగా గనుపడినను, బ్రాహ్మణేతరోద్యమ నాయకత్వము దురభిప్రాయములకు గారణమగుట సంతాపకరముగ నున్నది....గాంధిమహాత్ముడు త్యాగసాధనమున సాధింపబూనిన ప్రయోజనమును త్యాగరాయసెట్టిగారు సామాన్య ప్రజాదరణమునకు బాత్రమైన లాభసాధనమునను సాధించుటకు బూనుకొనిరి. త్యాగరాయసెట్టిగారి ప్రయత్నములు నిందలకును, దురభిప్రాయములకును, దురభిమానమునకును గారణంబైనను, బ్రాహ్మణేతర సంఘమందు పురోభివృద్ధికి సాధనములై ఆత్మ గౌరవ విశ్వాసములు కలుగజేసి దేశాభ్యుదయమునకు దోడ్పడినవి." (భారతి, 1925)

మరియొకచో వారిట్లు వ్రాసిరి:- "అమృతత్వమునకు త్యాగమే పరమసాధనముగ నున్నది....త్యాగమునకు లక్ష్యము ఆత్మార్పణము గాని స్వప్రయోజనముగాదు."

సమ్యగ్దృష్టి కలవారు కనుకనే "ఆంధ్రోద్యమ స్వరూపమైన ఆంధ్ర

ప్రబోధము సర్వతోముఖముగ వ్యాప్తమై ఆంధ్రాభ్యుదయమునకును వినియోగింపపడవలసి యున్నది" అని వారు వ్రాయగలిగిరి.

(భారతి, 1935)

# 9

## సమన్వయము - ఆంధ్ర వాఙ్మయ సూచిక

"ఆంధ్రవాఙ్మయమునం దారంభదశయందున్న నవలా రచన మహోపద్రవముతో గూడియున్నది. ప్రపంచమంతయును బరివర్తనమయమైయున్నది.... ప్రపంచ లక్ష్యము జీవయాత్రనుండి దేహయాత్రకు మరలుచున్నది. విశ్వప్రవృత్తికిని, విశ్వకల్యాణమునకును మూలమైన స్త్రీపుంసయోగమునందు ప్రపంచలక్ష్యము లగ్నమగుచున్నది. కామప్రయోజనమున కభ్యస్తమైన స్త్రీపుంసయోగమును ధర్మపరముచేయుటకు విశ్వము పరితపించుచున్నది. ధర్మ లక్ష్యము నిత్యమైన యాధ్యాత్మిక ధర్మమునందు లగ్నము గాకను, అనిత్యమైన ఆధిభౌతిక ధర్మమునందు లగ్నమగుచున్నది....దినపత్రికలు, వారపత్రికలు, మాసపత్రికలు, నవలలు, నాటకములు, కామకళావిన్యాసమయములై విషయవాసనల కాలవాల మగుచున్నవి. విషయవాసన లపారముగ అభివృద్ధిని జెందుచు నాత్మ సంస్మరణము, సందర్శనము దుర్భర మగుచున్నవి. ఆంధ్ర హృదయమునకు సహజమైన ప్రేమ భక్తి రసముల పరిస్ఫుట మగుటకును, మానవ ధర్మాభ్యుదయము సాధ్యమగుటకును నవలా రూపములైన గద్యకావ్యములను కృతికర్తలుత్తమ మార్గమునను రచించి ఆంధ్రవాఙ్మయ ప్రయోజనమును సార్థకము చేయుదురుగాక!"

ఆంధ్ర వాఙ్మయ సూచికకు శ్రీ నాగేశ్వరులు రచించిన పీఠికలో చివరి భాగంలోని వీ మాటలు! ఇది ప్రత్యేకము నవలా కారులను ఉద్దేశించినదే ఐనా, ఈ ప్రబోధము వారన్ని శాఖల వాఙ్మయ కారులను ఉద్దేశించి చేసినదే! సరిగా మహాభారతాంతమందు వ్యాస భగవానుని ఆ ఘోషణమునే స్మరణకు తెచ్చుచున్నది. "ఊర్ధ్వబాహుర్విరోమ్యేష.... ధర్మా దర్థశ్చ కామశ్చ...."

ఏమిటి? ఆంధ్రవాఙ్మయ సూచిక, ముద్రితాముద్రిత గ్రంథముల పట్టికకు పీఠికలో ఇట్టి వాక్యము లేమి! ఈ వాక్యములే కాదు. ఆ పీఠికయే నాగేశ్వరుల యనంతరమున ఆంధ్ర వాఙ్మయ చరిత్రమను పేరుతో ప్రత్యేక గ్రంథముగా ప్రచురింప బడినది. కేత్కరుగారు ప్రచురించిన మహారాష్ట్రీయ వాఙ్మయసూచిని జూచినపుడు ఆంధ్ర వాఙ్మయసూచిని ప్రచురింపవలె నని తమకు సంకల్పము కలుగుటయు, కొమర్రాజువారు తమతో నేకీభవించుటతో పీఠిక ప్రారంభించి, తా మెదుర్కొన్న చిక్కులు వివరించి, అందుచే నది అసమగ్రముగను, దోషభూయిష్ఠముగను నున్నదని మనవిచేసి, భగవంతునికి, సహచరులకు, సహకారులకు కృతజ్ఞతతెలిపి, 'ఆంధ్రవాఙ్మయము' అను శీర్షికతోనారంభించి ఆంధ్ర వాఙ్మయ సమగ్ర చరిత్రనే వారు వ్రాసిరి. తుదకు ఈ సూచికలో 13,923 గ్రంథములు, రమారమి 6000 గ్రంథకర్తలు కలరని వివరములిచ్చిరి. ఆ తర్వాత తమయాశయాదిక మిట్లు తెలిపిరి :

"ఆంధ్ర వాఙ్మయ స్వరూప స్వభావములను ప్రత్యక్షము చేసి వాఙ్మయ వికాసమున కవసరమైన విధానమును సారస్వతోపాసకులు నిర్ణయించుట కాంధ్రవాఙ్మయసూచి ప్రచురించబడినది.... ఆది యుగము నందు బండితారాధ్యమైన వాఙ్మయము వర్తమాన యుగమునందు ప్రజారాధ్య మగుచున్నది; సంస్కృత ప్రాయమైన వాఙ్మయము తెలుగు రూపమును దాల్చుచున్నది; వైదిక కర్మ పరమైన వాఙ్మయము భక్తిపరమైనది; పద్యాత్మకమైన వాఙ్మయము గద్యస్వరూపమును బొందుచున్నది. వాఙ్మయమునకు విజ్ఞాన వ్యాపనము, రసానందము పరమార్థములుగఁ బరిగణింపబడుచున్నవి. పద్యకావ్యములకుగల గౌరవ ప్రతిష్ఠలు గద్యకావ్యములకును వర్తమాన కాలములందుఁ గలుగు చున్నవి.... విశ్వకల్యాణమునకు నివృత్తి ప్రవృత్తి మార్గములు, జ్ఞాన భక్తిమార్గములు, సాంఖ్యకర్మయోగములు, త్యాగభోగ యోగములు, కరుణ వీరరసములు, శాంతశృంగార కలాపములు, శాస్త్రములు, కళలు సుఖదుఃఖములు, సాధనభూతములుగా నున్నవి.... విశ్వమునందు జీవ యాత్రకు దుఃఖనివృత్తియు, నిరతిశయసుఖప్రాప్తియును బరమార్థ

ములు ఆ పరమార్థము నాంధ్రవాఙ్మయము సమకూర్చిన విధము పీఠిక యందు వివరింపబడినది.

"ఈ పీఠికయందు క్రొత్త విషయములు లేవు. ఇంతవఱకును నితర పరిశోధకులు, వ్యాఖ్యాతలు తెలిసిన భావములే మరల తెలుపఁబడినవి."

ఇట్లు ముగించుచు ఈ సూచిక ప్రకటించుటకు పరిశ్రమించిన ఐదారేళ్లలో సహాయ మొనర్చినవారికి కృతజ్ఞత తెలిపి, తుదకు, "ఆంధ్ర మహాజను లిందలి గుణములను గ్రహించి ఆంధ్ర వాఙ్మయాభ్యుద యమున కీ ప్రచురణమును సాదరభావముతో నాదరించి యుపయోగిం చెదరు గాత !" అని ఆశీఃప్రార్థన మొనర్చిరి.

'ఈ పీఠికలో క్రొత్తవిషయము లేవని వారు విన్నవించు కొన్నది వారి వినయాతిశయమునే ప్రకటించును. వారు చేసిన ఆంధ్ర వాఙ్మయ సమీక్షకు ఆధారభూతములైన కేవల విషయమాత్ర వివరణలు పూర్వులిచ్చినవే కానవచ్చును. కాని వాటినన్నిటిని సమకూర్చుటలోను, సమన్వయించుటలోను నాగేశ్వరుల కెవ్వరును మార్గదర్శకులుగా లేరు. వారు చేసిన వ్యాఖ్యానములు, భాష్యములు, ఆంధ్రవాఙ్మయమునకు ఒక్కక్రొత్త వెలుగు ప్రదర్శించునట్టివి. అవి యన్నియు పూర్ణపురుషులైన నాగేశ్వరుల పుణ్యమూర్తిలో నుండి స్వతంత్రముగా ఉప్పతిల్లినవే; వారికి విశ్వసాహిత్యములో కల ఉత్తమ గ్రంథములతో గల విస్తారవిజ్ఞా నములోనుండి సముద్గతమైనవే! పూర్వాచార్యు లెవ్వరును తాము క్రొత్త విషయము చెప్పుచున్నామని ప్రకటించుకొనలేదు. ఆ సంప్రదాయమే నాగేశ్వరులను అవలంభించిరి.

ఈ పీఠిక ఆంధ్రవాఙ్మయ చరిత్రమేకాదు, సమీక్షకూడను. అంతే కాక భవిష్యత్కాలమున నెట్లు పరిణామ మొందినదో విశ్వశ్రేయము కూర్చునోకూడ ఇందులో మంచి సూచనలున్నవి. అన్నిటిలోను వాస్తవ దృష్టి గోచరించును. వారి శాంత నిర్మలమైన యోగదృష్టి ఏ విషయము నందైనను తొణకక ప్రచురించుటచే, మనకు సమ్మతముకానిపట్ల కూడ, మనము పునరాలోచన చేయవలెననిపించినట్లుండును. సత్యమని తోచినది చెప్పుటకు వెనుకాడరు, కాని నిగ్రహముతో ప్రతిపక్షులను గూడ నొప్పిం

పని విధముగా చెప్పుదురు. సంకుచితమైన ఏ యభిమానమునకును వారిలో చోటు లేదు.

ఆంధ్రకావ్యములను విమర్శించుటకు ఆంగ్ల వాఙ్మయ ప్రమాణముల ననుసరించుట యుక్తముకాదనుచు "సంస్కృత వాఙ్మయమును సంస్కృత లక్ష్యలక్షణ ప్రమాణముల ననుసరించి పరిశీలించుట ప్రయోజనకరము... ఆరూఢమైన భారతీయ సంస్కారముగల పండితులు భారతీయ సాహిత్యములను విమర్శించుట కర్హులుగనున్నారు. అట్టి యధికారులుగాని స్వదేశ విదేశపండితుల విమర్శనలు భారతీయ సాహిత్య హృదయమును గ్రహించుటకు సాధనములు కాజాలవు" అని యుద్ఘాటించి యీ లక్ష్యముతో నీ పీఠికయందు సింహావలోకనము చేయుచున్నామనిరి.

"తెలుగు, తెనుగు, ఆంధ్ర శబ్దములు సమానార్థకములుగా నిపుడు వాడుకయందున్నవి, ఈ పదములం దాంధ్రమే ప్రాచీనము - సమానార్థమును దెలిపెడి పదప్రయోగములందు విపరీతాభిమానము వహించుట ధీమంతుల కుచితముకాదు" అని ముందే ఉద్బోధించిరి. ఇప్పటికిని ఈ ఔచిత్యమును ఆంధ్రప్రభుత్వనేతలే గ్రహించినట్లు లేదు. మనది 'ఆంధ్ర దేశ'ము కాని ప్రభుత్వభాషగా, ప్రాంతీయభాషా శాసనములో 'తెలుగు' శబ్దమునే గ్రహించుట, ఆ శబ్దమునందు ప్రబలుచున్న ప్రత్యేకాభిమానమనుటకు సందేహము లేదు. ఆంధ్రులు, ఆంధ్రభాష, ఆంధ్రప్రదేశము అని ఏకరీతిగా వ్యవహరించుట మనకేకాక ఇతర ప్రాంతములవారికిని, విదేశములకును, ఎంత సౌకర్యము కలిగించునో కూడ వారు గ్రహించుట లేదు.

వేదకాలనిర్ణయము విషయములో, పాశ్చాత్య పండితులకు బైబిలు కాలప్రణాళికయందును, గ్రీకు వాఙ్మయాధిక్యము నందును విశ్వాసముండుట సంకుచిత నిర్ణయములను చేసినట్లే, నేటి భారతీయ విద్వాంసులు అతిప్రాచీనము లని నిర్ణయింపబూనుట కూడ భావ్యము కాదనుచు, "వేదకాలము 10 000 ఏండ్లయినను, 4,000 ఏండ్లయినను వైదిక విజ్ఞానము మానవధర్మ వికాసము నందు నిరుపమానముగా నున్నది. వైదిక విజ్ఞానము, వేదాంతమును, బౌద్ధమతమును, శైవవైష్ణవభక్తిని లోకమునకుం

ప్రసాదించినది', అనుచు ఉత్తమ వాస్తవికదృష్టి ప్రదర్శించిరి. అట్లే తమిళులు తమిళ వాఙ్మయారంభమును 12,000 ఏండ్లకుఁ బూర్వమని నిర్ణయింప బ్రయత్నించుటను ప్రస్తావించి, 'దామోదరం పిళ్ళ గారి మాతృభాషాభిమాన మవ్యక్త సిద్ధాంతములకుఁ గారణంబైనది' అనిరి. దక్షిణదేశభాషలలో తమిళ కర్ణాటకముకంటె ఆంధ్ర వాఙ్మయ మాలస్యముగా రూపొందుటకు చక్కని కారణము తెలిపిరి.

"ఉత్తరదేశాగతులైన శత్రువుల నెదిరింపవలసిన భారము నంతయు నాంధ్రరాజులు వహించుచుండిరి. దేశీయ వాఙ్మయాభివృద్ధికి సంగ్రామ పరంపరలును బ్రతికూలమై యుండియుండును.

తెలుగుభాష ద్రావిడశాఖలలో నొకటియను మతమే వారికి సమ్మతము. సంస్కృత భాషాజన్యమనువారి నుద్దేశించి, "తెలుగునకు సంస్కృత ప్రాకృతభాషల బాంధవ్యమును బ్రతిపాదించుట వలన దాని గౌరవము హెచ్చదు. ఆంధ్రభాషా వాఙ్మయముల యౌన్నత్యమునకు స్వకీయ ప్రతిభ సాధనముగాని పరకీయ సంబంధము కారణము కాజాలదు" అని ఉద్ఘోషించి, "ఆంధ్ర వాఙ్మయమునందు సంస్కృత వాఙ్మయప్రాబల్య మధికముగ నున్నను ఆంధ్ర వాఙ్మయము తన వ్యక్తిత్వమును గలిగియే యున్నది." అని స్వభాషా గౌరవమును చాటించిరి. మరియు "ఆంధ్రు లార్యవిజ్ఞానమున కొసంగిన స్వాగతము ద్రావిడ విజ్ఞానమున కొసంగియుండలేదు" అని నిరూపించిరి.

నాగేశ్వరుల నొక్కటే బాధ వేధించుచుండెను. ఆంధ్రులు మహారాష్ట్రులకంటెను తమిళులకంటెను సంఖ్యలో నధికమైనను విద్యావ్యాపనమందు వెనుకబడియున్నారని, ఆ కొదవ తీర్చుటకే వారు బహుముఖములుగా పరిశ్రమించిరి. "వాఙ్మయాభివృద్ధికి, ప్రజాభివృద్ధి, విద్యావృద్ధి నిదర్శనములుగ నుండగలవు" అని వారి యాశయము.

వర్ణ సమామ్నాయమును ప్రస్తావించి "సంస్కృతభాషా సంయోగ మాంధ్రభాష కిట్టి యమూల్యమైన ప్రయోజనమును నమకూర్చినది" అని వివరించి, "సంస్కృతపదజాల మాంధ్రభాషకు బలవీర్యముల నొసంగినది....భారతజాతీయ సంయోగమున కిట్టి సంస్కృత సంస్కారము సకల

విధములను వినియోగపడు చున్నది” అని “ఆంధ్రభాషకు పరిపాటియైన తత్సమ తద్భవ పదములకు సమానాదరణమును జూపుట భావ్యముగాని ప్రత్యేక భాషాపదములకు మాత్రము పక్షపాతమునుబూనుట ప్రయోజన కరము గాదు” అని ఉపదేశించిరి. ఆంగ్ల భాషాపదములను గూడ అజంత ములుగా మార్చి తెలుగు సంస్కారమొసగి స్వీకరించి ఆంధ్రభాషను సంపన్న మొనర్చుటయే వారి కిష్టము. వారికి ఆంధ్రభాషయందెంత అభిమానమో చూడవలె.

“ప్రాకృత భాషల సాహచర్య మాంధ్రభాష కనిర్వచనీయమైన మాధుర్యమును గలుగ జేసినది...ఆంధ్ర భాషయందు తమిళభాషా ధ్వనులకుఁ గల పారుష్యమును, సంస్కృత భాషాధ్వనులకుఁ గల కాఠిన్య మును బోయి సరళధ్వను లేర్పడినవి.”

నాగేశ్వరులు కావ్యలక్షణమును ప్రధానముగా దాని ప్రయోజన మునుబట్టియే నిర్ధారించిరి. అందువలన ‘విశ్వశ్రేయః కావ్యమ్’ విశ్వము నకు శ్రేయస్సు నొడగూర్చెడి గ్రంథములు మాత్రము కావ్యనామమున కర్హములై చిరంజీవితమునకుఁ దగియున్నవని లాక్షణికుల మతము. ‘వాక్యం రసాత్మకం కావ్యం’ అనుభావ మిపుడు వ్యాపనమును బొందు చున్నది. సకల వాఙ్మయములందును చిరంజీవితముగల గ్రంథములు స్వల్పముగ నున్నవి. విశ్వము యొక్క శ్రేయస్సునకు సాధనంబులైన గ్రంథములు దేశకాల పాత్రానవచ్ఛిన్నములై లోకమునందంతటను పూజ్యతను బడయుచున్నవి”అనుచు ప్రయోజనమునందే మొగ్గుచూపిరి.

వాఙ్మయ వికాస పరిణామములను గనుగొనుటకు (1) కాలము 2) భావము (3) రూపము (4) విషయము సాధనము లని చెప్పుచు, వానిలో కాలవిభాగము ఎక్కువ ప్రయోజనకరమని తక్కినవి స్థూలముగా ప్రస్తావించి, యుగవిభాగముతోడనే సాగించిరి.

క్రీస్తుశకము 9, 10 శతాబ్దములలో భరతవర్ష మందంతట నవ యుగ మారంభమైన దనుచు నాటిస్థితి నిట్లు చక్కగా నిరూపించిరి: “సంకుచితమైన వైదిక కర్మమార్గము పండిత పామరులకు జీవయాత్ర యందు విముఖత్వమును గలుగజేసినది. దుర్గమమైన జైనబౌద్ధ ధర్మ

మార్గము పండితపామరులకు జీవయాత్రయందు విరక్తిని గలుగఁజేసినది. ప్రజలకు జీవయాత్రయందుఁ గలిగిన విముఖత్వమును బోగొట్టి, యనురక్తిని గలుగఁజేసి పురుషార్థసిద్ధిని బడయుటకు భక్తిమార్గము ప్రముఖమైనది."

నన్నయకు పూర్వముండిన వాఙ్మయము నశించుటకు కారణములుగా బ్రాహ్మణాభిమానమును, మతకలహములును అని శ్రీవంగూరి సుబ్బారావు నిర్ణయించినది నాగేశ్వరు లొప్పుకొనలేదు. జైన బౌద్ధపండితులు తమ తమ బోధలు తెలుగు భాషలో శిష్యులకు బోధరూపముననె చేసియుందురుగాని గొప్ప గ్రంథములను వ్రాయలేదనుటె నమ్మదగినదని చక్కగా సూచించిరి. కులమత ద్వేషములను రెచ్చగొట్టు ఊహాసిద్ధాంతములు పుణ్యమూర్తులైన నాగేశ్వరులకు ఎట్లు సమ్మతములు కాగలవు?

ఆంధ్రమహా భారతావతరణమును గూర్చి ప్రస్తావించుచు, మహాభారతము సాంఖ్యయోగ, కర్మయోగ, జ్ఞానయోగ, భక్తియోగములను సమన్వయము చేసినందున నన్నయ, 'భక్తియుక్తులైన భాగవతులకు శ్రీ వల్లభుండు భక్తవత్సలుండు భవభయంబులెల్ల బాపి యిష్టార్థసంసిద్ధి కరుణతోడ జేయునట్లు' భారతమును పాఠకులకు ఇష్టార్థము లొడగూర్చునను భక్తిభావముతో, 'జగద్ధితంబుగన్' విశాలమైన విశ్వశ్రేయస్సు లక్ష్యముగా పెట్టుకొని భారతాంధ్రీకరణమున కుపక్రమించెనని నాగేశ్వరులు నిర్ధారించిరి. భక్తులైన నాగేశ్వరులకే ఇది సాధ్యము!

ఆ సందర్భములో పంచమవేదమైన భారతమునకు వైదికమత పరిణామమును ప్రతిపాదించుటకు గల శక్తి రామాయణమునకును లేదనిరి. నన్నయకాలమున పునరుద్ధరితమైన వైదికమార్గ నిష్ఠయు, పల్లవించిన భేదములేని భక్తిమార్గమును తిక్కనయందు పరిపక్వమైనది. "తిక్కన భారత రచనకు ప్రయోజనము తెనుగు బాస, తెనుగుజనులు, తెనుగు దేశము, దుఃఖనివృత్తి, మోక్షము, పరమేశ్వరసాక్షాత్కారము" అని నిర్దేశించిరి. ఆ సందర్భముననే కావ్యప్రయోజనమును గూర్చి సర్వకాలములందును బుద్ధిమంతులు మననము చేయవలసిన భావములు వారు ప్రదర్శించిరి.

"కావ్యప్రయోజనము విశ్వకల్యాణము. కావ్యము రసాత్మకము. విశ్వకల్యాణము రసోదయమువలననే కలుగుచున్నది. విశ్వమంతయును రసాత్మకమై వెలయుచున్నది...దివ్యవిభూతుల రసహృదయము విజ్ఞాన సంపన్నులకు మాత్రము ప్రత్యక్షమగుచున్నది....కర్మేంద్రియములు కార్యరూపమునను జ్ఞానేంద్రియములు భావరూపమునను రసానంద మును గలుగజేయుచున్నవి.. విషయోపలాలితంబైన రసానందమును కావ్యమునకు క్షుద్ర ప్రయోజనముగాని యుత్తమప్రయోజనము గాదు. కావ్యమునకు బరమప్రయోజనము విషయాతీతమైన రసానందము... విశ్వకల్యాణ లక్ష్యము భక్తిరసమునందు ప్రత్యక్షమగుచున్నది. అనన్యమైన భక్తిరసమునందు సకలరసములును నిమిడియున్నవి... మహాదీక్షాపరాయణులు గానివారు మహాకావ్య నిర్మాణాధి కారులు గాజాలరు!"

ఆదియుగము ఆంధ్రభారతరచనతో నంతమొందుచున్నదనుచు, ఆకాలపు ప్రధాన కవీశ్వరులు సాధించినట్లు సంక్షేప రూపముగా సమన్వయ మొనర్చిరి.

"నన్నయ్య సంస్కృతసాహిత్యమున కాంధ్రసంస్కారముచేసి ఆంధ్రసాహిత్యనిర్మాణమున కుపక్రమించెను. తిక్కన దేశీయసాహిత్య మునకు సంస్కృత సంస్కారముచేసి ఆంధ్రసాహిత్య స్వరూపమును బరి స్ఫుటముచేసెను. పోతన భాగవతము సంస్కృతాంధ్ర సాహిత్యములను మేళవించి ఆంధ్రసాహిత్య స్వరూపస్వభావములను పండిత పామర హృదయములకు సుగ్రహము చేసినది....భారతము ప్రతిపాదించిన కర్మ మార్గము భాగవతమునందు భక్తిస్వరూపమును దాల్చినది...జీవ యాత్రను, విశ్వశ్రేయస్సుకు సార్థకము చేయుటను సాధనములైన నిర్గుణసగుణోపాసనలు భాగవతమునందు సమన్వయమును బొందినవి... సహజములైన శృంగార వైరాగ్యములు, సుఖ దుఃఖములు....సమన్వ యమును బొందగల విధమును పోతనామాత్యుడు భాగవతఘట్టములందు దివ్యతమముగ వినిర్మించి కైవల్య మార్గము ననుగ్రహించెను."

పూర్ణపురుషులైన నాగేశ్వరులు స్వయముగా సమన్వయ సిద్ధాంతా చరణప్రవర్తకులని మనము గుర్తించుకొనవలెను.

పుణ్యపురుషులగు నాగేశ్వరులను, పురాణయుగసాహిత్యము ఆకర్షించినంతగా, మధ్యయుగసాహిత్య మాకర్షింపలేదు. మధ్యయుగకవుల ప్రతిభాతిశయము ఉగ్గడించిరి. కాని వారి కొకటేబాధ. "సాత్త్వికశృంగార రసము అస్తంగతమై రాజసతామస శృంగారరసములు ప్రబలినవి" అనీ, "మహమ్మదీయ ప్రభువుల భోగపరాయణత్వము హిందూప్రభువులను భోగపరాయణులను జేసినది, కామారాధనము హిందూప్రభువుల నావరించినది" అనీ!

అకాలమందు పుట్టిన ఉత్తమకావ్యమైన మనుచరిత్రము ఆకాలమందు వైరాగ్యమునకు, భోగమునకు కలిగిన సంఘర్షణము ప్రదర్శించుచున్నదనుచు దానిలో "ప్రవరాఖ్యుడు ప్రకటించిన ప్రధానమైన శాంతరసమునకు గావ్యమునం దప్రధాన స్థానమును, వరూథిని వరించిన కామాయత్తమైన శృంగారరసమునకు ప్రధానస్థానమును గలిగినవి" అని విచారపడిరి.

ఈ మధ్యయుగమందు వెలువడిన కావ్యములలో 'కళాపూర్ణోదయము కథాకల్పనయందును, భావనాశక్తియందును, భాషాసౌష్ఠవమునందును, రసపోషణము నందును నిరుపమానముగానున్నది' అని ప్రశంసించి, 'పూర్వకథయందలి రూపానుభూతికిని ఉత్తరకథయందలి భావానుభూతికిని సంయోగము కలిగినపుడు మాయారహితమైన శృంగార రసానందము కలుగుచున్నది' అని విస్తరించిరి. ఈ సందర్భములో శ్రీవిద్యోపాసనమును శ్రీచక్రరాజార్చనమును ప్రస్తావించి, అందలి నవావరణములలో, ప్రథమావరణముతో నారంభమై, నవరసములతో ప్రసరించి, నవమావరణము శాంతరసముతో పరిసమాప్తమగుట వర్ణించి, ఈ సాధనములనే సూరనార్యుడు అందులో నిక్షేపించెనని ప్రదర్శించి, 'వాగర్థములవలెనే హిరణ్యగర్భుల శృంగార కళాలీలలు సంసార ప్రవృత్తియందు సర్వవ్యాపకమును గలిగియున్న విధమును కళాపూర్ణోదయము విశదము చేయుచున్న'దని యగ్గించిరి. ఐనను కావ్యప్రవృత్తియందు కాలానుగుణమై కాముక శృంగారమునకు కవి దాసుడై ప్రయోజనమును సంకుచితము చేసినందుకు తమ విచారముకూడ వ్యక్తముచేసిరి.

'ఈ కాలపు కవుల ప్రతిభ మృదుమధుర రచనలందు గోచరం బైనట్లు భావనా శుద్ధియందు గోచరము కాకయున్న' దనిరి. విజయనగర రాజ్యము క్షీణించిన పిమ్మట కావ్యములను గూర్చి వారు, 'ప్రతిభ లేని సాహిత్యమును వెలసినది' అని సూత్రప్రాయముగా స్వరూపము వర్ణించిరి. ఈ పీఠికలో నాగేశ్వరులకు విశ్వసాహిత్యములోని ఉత్తమ కావ్య కోటిని ఆంధ్రకావ్యము లందుకొనవలెనను తీవ్రావేదనము ఎంతగా కలదో చూడనగును.

ఆ పిమ్మట శతకముల ప్రసంగము తెచ్చి అవి 'లక్షణ గ్రంథము లందు ప్రవేశమును గాంచక పోయినను ప్రజా హృదయమునందు స్థిర ప్రవేశముగాంచిన' వనుచు, 'భక్తి శతకములు, నీతి శతకములు, శృంగార శతకములు ప్రజా జీవితమును రసవంతము చేయగల విధమును శతకముల యాదరణము చాటుచున్న' దని చాటించారు.

గేయ వాఙ్మయమును ప్రస్తావించుచు గానము 'కర్మేంద్రియ ములు, జ్ఞానేంద్రియములు, అంతఃకరణ చతుష్టయము ఏకస్థాయియం దాత్మానుసంధానమును బొంది బ్రహ్మానందానుభవమునకు సులభసాధన' మనుచు, త్యాగరాజ గాయక బ్రహ్మయని వర్ణించి 'శృంగార కామ కీర్తనల పరమై యథోగతిపాలైన సంగీతము త్యాగరాజు కృతులయందు భగవచ్ఛక్తి పరమై యున్నతస్థాన మధిష్ఠించినది. వేశ్యాంగనలపాలైన గానము భాగవతోత్తముల వశమైనది' అని వర్ణించి యానందించిరి.

ఈ విధముగా సర్వతోముఖమైన ఆంధ్రవాఙ్మయమును ఈ పీఠికలో ప్రస్తావించి ప్రతిదానికిని యథోచితస్థానము నిచ్చి 'విశ్వమునందు సుశ్రుతినిరతిశ యానందమునకును, అపశ్రుతి దుఃఖమునకును మూలములగుచున్న' వని తమ యోగానుభవమును ప్రదర్శించిరి. వారి భక్తి భావము, యోగానుభవము, రసగ్రహణ దక్షత, సత్యదీక్ష, సర్వతోముఖ ప్రజ్ఞ దీనిలో ప్రత్యక్షమగుచున్నవి. నాగేశ్వరులు శివపూజా ధురంధరుల వంశమున జన్మించినను, శ్రీరామమూర్తి ఆంధ్ర హృదయేశ్వరుడన గలిగిరి. నవ్యకావ్య నిర్మాతలకు వారిచ్చిన సందేశ మిది !

"రసాపేక్ష పరాయణమైన యువజన హృదయము ప్రజాశక్తిని సకల రంగములందును వికసింపజేసి ఆంధ్ర సాహిత్య మహోదయమును జేయుటకు శ్రీ శారదాదేవి యనుగ్రహించుఁ గాత !"

# 10

## విజ్ఞాన సర్వస్వము - భారతి

నాగేశ్వరులకు ఎక్కువ ప్రీతిపాత్రమైనవి సాహిత్యమూ విజ్ఞానము. ఆ రెండింటికంటె విశ్వతోముఖ వ్యాప్తి కల విషయములు కానరావు. ఆ రెండింటిని ఆంధ్ర ప్రదేశములో విస్తరింపజేయుటకే నాగేశ్వరులు సమస్త కార్యములందును ప్రవృత్తులైరి. ఐనను వారి 'భారతి' మాసపత్రిక, ఆంధ్ర గ్రంథమాల, విజ్ఞాన సర్వస్వము రెండు సంపుటముల పునర్ముద్రణము, సంవత్సరాది సంచికలు ముఖ్యముగా వారి సాహిత్య విజ్ఞాన దీక్షకు ప్రత్యక్ష చిహ్నములుగా వెలసినవి. అవియే వారి ముద్దుబిడ్డలు. నాగేశ్వరులు అనేక దానములు అనేకులకుఅనేక సంస్థలకుచేసి విశ్వదాతలైనారు. కాని యీ నాలుగింటిలో వారుచేసిన దానము నిరుపమానమైనది. వానిలోవారు పెట్టిన విజ్ఞానభిక్షసంగతి చెప్పనవసరమేలేదు. దానితోపాటు వారు తెలియనీయకుండగ చేసిన మరొక దానమును కలదు. నిజమైన గుప్తదాన మదియే. వాటికి మూల్యము నిర్ధారించిరి. కాని ఆమూల్యము వాటికి వారు వెచ్చించిన ద్రవ్యముతో దశాంశమైనా ఉండదు. మూల్యము నామ మాత్రము. సాహిత్య మందు విజ్ఞానమందు ఏ మాత్రమూ ఆస్థ లేనివారి చేతులలో పడి వ్యర్థము కాకుండుటకు ఉద్దేశించిన మూల్యము మాత్రమే.

విజ్ఞానసర్వస్వము డెమీ ¼ సైజులో మంచి కాగితముల మీద చక్కని అచ్చుతో రెండు సంపుటములలో వెలువడినది. మొదటి సంపుటి 600 పుటలు, రెండవదానిలో 602 పుటలు ఉన్నవి. ఏ విషయము అవగాహనము చేసికొనుటకైనను కావలసిన చిత్రపటములు, మాపులు, గ్లేజు కాగితములమీద కొన్ని, ఆర్టు పేపరు మీద కొన్ని అందముగా ముద్రింపబడినవి. వాటి నన్నిటిని లెక్కించి వివరించుట ఒక మహా గ్రంథమగును. విషయావగాహనమునకు కొన్నిమాత్ర ముదాహరింతును.

అమరావతిస్తూపము అను విషయము 19 పేజీ లున్నది. దానిని ప్రత్యక్షము చేయుటకై 24 పేజీలమీద ఆర్టు కాగితముపై చిత్రములు ముద్రింపబడినవి. వాటిలో మొత్తము 119 చిత్రము లున్నవి. ఒకటి వర్ణ చిత్రము.

అజంతా విహారములు అనే వ్యాసము నాగేశ్వరులే రచించిరి. అది 18 పేజీలు. వానిని ప్రదర్శించుటకు 14 ప్రత్యేక పుటల ఆర్టు కాగితముమీద చిత్రము లున్నవి. ఇవికాక వ్యాస భాగములోనే మరి ఎన్నో బ్లాకులతో ముద్రించిన చిత్రము లున్నవి. అన్నిటిసంఖ్య మొత్తము 32. వానిలో త్రివర్ణ చిత్రములు తొమ్మిది.

అభినయము అను వ్యాసములో ఆర్టు పేపరుమీద 57 హస్త చిత్రములు ముద్రింపబడినవి.

దేశములవి, జిల్లాలవి పటము లసంఖ్యాకములు. వానిలో చాలా భాగము త్రివర్ణయుతములు.

బైండింగు గట్టిది. అంతా పూర్తిగా లెదరుతో, గిల్టు అక్షరములతో, గిల్టు ఉపరిభాగములో ఈ రెండు సంపుటములు అలంకరింపబడినవి. ఇట్టి వైభవము ఆంధ్రదేశములో అచ్చులోను, బైండింగులోను అజ్ఞాత పూర్వము. ఆ రెండు సంపుటముల వెల 20 రూ. లు మాత్రమే. ఈవిధముగా దానకర్ణుడు తప్ప ప్రచురింపగలడా ? ఇందులో ధనము సమకూర్చు వాణిజ్య ప్రకటనలు లేవు.

విజ్ఞానసర్వస్వము మోటో "నహి జ్ఞానేన సదృశం పవిత్ర మిహ దృశ్యతే"

"విశ్వవిజ్ఞానమూర్తికిని, ఆంధ్ర విజ్ఞాన ప్రపంచమునకును సమర్పితము" అది !

మన మే దానమైనను బ్రహ్మార్పణముగా చేయవలెను గావున నాగేశ్వరు లీదాన మట్లే చేసిరి.

దానికి నాగేశ్వరులు వ్రాసిన ప్రస్తావనములోని చివరివాక్యము లివి:

"విశ్వవిజ్ఞానమూర్తియును, ఆంధ్ర విజ్ఞాన ప్రపంచమును, ఈ సంకల్పస్వభావమును, కార్యభారమును గ్రహించి 'విజ్ఞానమయమైన ఆత్మోపలబ్ధి'కై సకలవిధముల 'నీ సదుద్యమము సఫల మగుట కను గ్రహించుగాత !"

నిజ మాలోచించినచో విజ్ఞాన సర్వస్వము నాగేశ్వరుల పెంపుడు బిడ్డ ; వారి సహాయము సలహా సహకారము దానికి మొదటినుండి ఉన్నను, దానిని మొదట రూపొందించినది వారి మిత్రులు శ్రీ కె. వి. లక్ష్మణరావుగారు. నాగేశ్వరులు గారు దాని పునర్ముద్రణమును, చెప్పు కున్నను మిత్రస్మృతిగా కూడ భావించినదే. పెంపుడుబిడ్డనే వారంత వైభవముగా నలంకరించిరి.

ఆంధ్రపత్రికలు, సంవత్సరాది సంచికలు నాగేశ్వరుల సొంత ముద్దు బిడ్డలు. ఇక భారతి వారి ముదుబిడ్డయో, ఉపాస్య దైవమో నిర్ధారింప సాధ్యముకాదు. భారతి ప్రారంభించినది 1924 సం జనవరిలో. అంతకుముందే వారు 1923 లో పుణ్యతీర్థయాత్ర కావించినారు. కాశీ రామేశ్వరాలతో పాటు శ్రీశైల యాత్రకూడా చేసినారు. వీరు తీర్థయాత్ర శ్రీశైలతోయాత్రనేఆరంభించియుందురు. ఆ కాలములో శ్రీ శృంగేరి శ్రీ విరూపాక్షపీఠాధిపతులైనశ్రీ బోధానందభారతీస్వాములవారు మంత్రశాస్త్ర ములో అనన్యమాన్యమైన విద్వదనుభవములు గలసిద్ధపురుషులు. వారు పూర్వాశ్రమంలో మహాగ్నిచయనాంతమైనక్రతువులాచరించిరాణిమహాగ్ని చయమలను పేర ప్రసిదులైన కర్మిష్ఠులు. వారు జోతిశ్శాస్త్రము సంపూ ర్ణముగా మహారాష్ట్రములో పండిత గురువుల వద్ద శ్రీ బాలగంగాధర తిలకుతో సహపాఠులై అధ్యయనముచేసినవారు. వేదాంతాది శాస్త్రా లలో కూడ విద్వత్తుకలవారు. వారివద్ద నాగేశ్వరులు శ్రీశైల యాత్రానంద ర్భములో శ్రీవిద్యలో పూర్ణదీక్ష గ్రహించినవారు.

ఆరాధ్యబ్రాహ్మశాఖలో జన్మించిన నాగేశ్వరులు శ్రీవిద్యా దీక్ష గ్రహించుట సామాన్యదృష్టికి విడ్డూరముగా ఉండుట సహజమే. అందులో స్మార్తపీఠాధిపతులవద్ద! కాని నిజమాలోచించినచో, శ్రీవిద్యా దీక్ష శైవదీక్షకు విరుద్ధమైనది కాదు. శ్రీవిద్యామంత్రరాజముగాగ్రహించు

షోడశాక్షరమంత్రముకూడా శివమంత్రరాజమే. శివశక్తికి శివాశక్తికి భేదముచేయని మంత్రరాజము. శ్రీచక్రరాజముకూడ త్రికోణాగ్రకోణము అభిముఖముగా ఉన్నచో శక్తిచక్రమగుననీ, తక్కిన రెండు కోణములు అభిముఖముగా జేసికొన్నచో అదియే శివచక్రమగుననీ ప్రసిద్ధమైన విషయమే. నాగేశ్వరులు శ్రీవిద్యాదీక్ష గ్రహించుటలో శైవ మెంత మాత్రము పరిత్యజింపలేదు. వారు పూర్ణపురుషులు గనుకనే పూర్ణదీక్షాపరులైనారు. నాగేశ్వరులకు శ్రీవిద్యయందుగల అనుభవము, పాండిత్యము వారి గ్రంథములందంతట ప్రత్యక్షమగును. వారిఆంధ్రవాఙ్మయసూచికపీఠికలో శ్రీచక్రరాజప్రస్తావమున్నది. ఒకచో వామాచారగర్హణము, దక్షిణాచార ప్రశస్తి ప్రదర్శించిరి. విజ్ఞానసర్వస్వములో 'అనాహతము' మీద వారు వ్రాసిన వ్యాసములో వారికి శ్రీవిద్యావిషయ పరిజ్ఞానమెంత విస్తారముగా కలదో అభివ్యక్తమగును. శ్రీవిద్యాదీక్ష గ్రహించుటలో నాగేశ్వరుల విశాల దృక్పథము వ్యక్తమగుచున్నది.

నిత్యము శ్రీవిద్యామంత్రజపము సంకల్పించిన వెంటనే గురుత్రయమంత్రము స్మరించుట యాచారము. నాగేశ్వరుల శ్రీవిద్యాగురువులు శ్రీబోధానందభారతి, పరమగురువులు శ్రీ సచ్చిదానందభారతి, పరమేష్ఠి గురువు శ్రీ బోధానందభారతి. జపములో గురుమంత్ర దేవతాత్మలకు ఐక్యము భావనచేయుట విహితము. నాగేశ్వరులు గురుత్రయ స్వరూపముగా భారతిని భావన చేసిచేసి ఆంధ్రులకు 'భారతి' స్వరూపముగా అనుగ్రహించినారు. ఆంధ్రకవిత్రయములో విజ్ఞానయోగీశ్వరుడై 'విజ్ఞానాత్మక వాఙ్మయ' నిర్మాతయైన ఎఱ్ఱయ భారతిని సన్యాసిరూపమున ధ్యానింపగలిగినాడు. ఎఱ్ఱయ శ్రీగురువులు శంకరస్వామి, యామము లెన్మిదింటను నిత్యశివరాత్రివ్రతంబుగా సదాశివునర్చించు త్రిజగదారాధ్యుడు. శ్రీనాగేశ్వరులు షట్కాల శివపూజాధురంధరులగు, ఆరాధ్యవంశములో జన్మించినవారు.

> "కరకమలం బొసంగ బట్టికంబు కమండలువంటి కాంతి భా
> సురమగు మౌక్తికంపు జప సూత్రము దాల్చుట బ్రహ్మవాదమై
> పరగిన హంసముం బిలిచి బాలమృణాళము జూపు చందమై
> సిరి తిలకింప నొప్పు బుధ సేవితమూర్తి దలంతు భారతిన్."

నాగేశ్వరులుకూడ విజ్ఞానోపాసకుడు, భారతీ భక్తుడు ఐ 'భారతి'ని ప్రారంభించినారు. ఈ శబ్దము భరత భూమికి అధిష్ఠాత్రియైన దేవతకే కాక విజ్ఞానమూర్తియైన దేవతకు కూడా ప్రతీక. 'భారతి' ఆదర్శములను నాగేశ్వరులు ఈ విధముగా తెలిపినారు:

"భారతి నుద్ధరించి, శుభస్థితి కల్పింపవలెనను సంకల్పము భారత హృదయమందు గల్గినది. భారతి దేశభాషా రీతుల ననుసరించి బహు రూపముల నెల్లెడల వెలయుచున్నది. ఆంధ్రభారతియును, వంగ భారతియును, కర్ణాటక భారతియును భారతీయ స్వరూపములు....ఆంధ్ర హృదయమందు స్వకీయమైన స్వరూప భావమును నిర్ణయించి స్వధర్మము నారాధింపవలెనను సంకల్పము గల్గినది ...ఆంధ్రభారతియును ఆంధ్రప్రవృత్తిని వ్యక్తముచేయుట కవతరించినది....

"విషయావగాహనమునకు సాధనములైన ప్రాచీనమందిరములు, బౌద్ధస్తూపములు, తామ్రశిలా శాసనములు, తాళపత్రగ్రంథములు; కళావిచిత్రములువాఙ్మయస్వరూపములు, నిగూఢములై ప్రకాశము నపేక్షించుచున్నవి.ఆంధ్రవ్యక్తిత్వద్యోతకములైనఅమరావతి,సాంచిమొదలగువస్తురూపముల వైభవము అజ్ఞాతముగానున్నవి. శాసన పరిశోధనాలయములందు వందల కొలది శాసనములు త్రుప్పుపట్టిపోవుచున్నవి. ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమునందును, తంజావూరుపుస్తక భాండాగారమునందును వ్రాతపత్రలు శిథిలములగుచున్నవి. అజంతాయందలి చిత్తరువులు ప్రకాశమును గోరుచున్నవి. రసవంతమైన వాఙ్మయము పరిశీలనము కోరుచున్నది."

ఈ విధముగా నాగేశ్వరులు భారతి పత్రిక ఆశయములు తెలిపిరి. తమ యాశయములను వెంటనే ఆచరణలో పెట్టుటకు పూనుకొనిరి. భారతి సంపుటములు విజ్ఞాన సర్వస్వములుగా, రసవద్రచనల సంపుటములుగా వెలసినవి. శ్రీ నాగేశ్వరుల చేతులలో 'భారతి' ఎంత యుజ్జ్వలముగా నుండెడిదో స్థాలీపులాకన్యాయముగా ఒక సంచిక తీసి ఉదహరిస్తున్నాను. భారతి రెండవ సంపుటము 7 వ సంచిక చేతికి వచ్చినది

భారతి సంపు 2, నుంచి. 7. — ఇందులో 168 పేజీలున్నవి. త్రివర్ణ చిత్రములు మూడు (1) పార్వతి తపస్సు (2) శ్రీ కందుకూరి వీరేశలింగము (3) శ్రీ చిత్తరంజనదాసు. 16-5-25 గాలివానలో ధ్వంస మయినవానిని ప్రదర్శించే సాధారణ చిత్రాలు 10. కళ్లేపల్లి, శివగంగ, శ్రీకాకుళము దేవాలయాదుల చిత్రాలు మరి 6. ఈ 16 చిత్రాలు ఆర్టు పేపరు మీద ముద్రించినవి. గ్రంథవిమర్శనము, సాభిప్రాయ విశేష ములుకాక 47 వ్యాసాదులు. వ్యాసములలో ఉదయనోదయమనే ఆంధ్ర కావ్యాన్నిగురించి మానవల్లివారిది, కృష్ణరాయులయాస్థానములోనికన్నడ కవులు. ఆ. రంగస్వామి సరస్వతిగారిది. వేంగి చాళుక్యులు మల్లంపల్లి వారిది, ప్రాచీనాంధ్రులెవరు చిలుకూరి వీరభద్రరావు గారిది. చీనాయందు భారత నాగరికత శ్రీ శరణువారిది. నారాయణ తీర్థులు శ్రీ పేటూరివారిది. కీ. శే. చిత్తరంజనదాసు జీవిత సంగ్రహము, జైనసిద్ధ చక్రము శ్రీ గన్నవరపువారిది. జైనులమతకథలు శ్రీపంచాగ్నులవారిది. ఒకరోమనుని దేశభక్తి శ్రీ చిల్లరి వారిది. ఆంధ్రారణ్య పర్వతేష ప్రశంస శ్రీ కాశీభట్ట వారిది ప్రాచీనాంధ్ర కవిత్వ లక్షణము శ్రీ తేకుమల్లవారిది ఇంకాఎన్నో వ్యాసాలు, కావ్యాలు, కథలు ఉన్నవి సాభిప్రాయ విశేషములు నాగేశ్వ రులవే. చిత్తరంజనదాసు ఆ ముందే పరమదించినందున అంతా ఆయ నను గురించే. అందులో నాగేశ్వరులు తమవలెనే దాతృత్వములో దేశ సేవలో ఉత్తములైన దేశబంధుని నిర్యాణానంతరము వెంటనే వ్రాసిన మాటలు కొన్ని ముఖ్యముగా అద్భుతము కలిగించినవి.

"స్వధర్మ నిర్వహణమునకు ప్రజలకు దాసు జీవిత మాదర్శమైనది. ప్రజాహృదయమునందు నిండియున్న దాసు జీవితము విషాదమువలె నానందమును సయితము గలుగజేసినది. జీవిత పరమార్థమైన యమ రత్వము సకలజనులకును నానందప్రదము గదా!"

ఇది మృత్యుభయము లేనివారేకాని అనలేనిమాట. అమరత్వము తమకును ప్రాప్యమను నిశ్చయ మున్నవారి మాట.

ఇటువంటి భారతి సంచికవెల అర్ధ రూపాయి మాత్రమే!

నాగేశ్వరులు ఆంధ్రులకు కానుకగా ఇచ్చినవానిలో 'భారతి' ప్రధానమైనది!

భారతి సంచికలలో నాగేశ్వరులు సర్వతోముఖముగా ఆంధ్రుల వాఙ్మయ వికాసమునకు దోహద మొనర్చిరి భారతి సంచికలు పాతవి కొత్తవి అనే భేదము లేకుండా ఎప్పుడే సంచిక తీసుకుని చదవసాగినను, బుద్ధిమంతులకు ఆలోచనలు ప్రేరేపించును, సాహిత్యపిపాసువులకు రసానందము చూరలిచ్చును. భారతిలో ప్రచురణము పొందడమే వ్యాసకర్తలకు, కవులకు గీటురాయిగా విలసిల్లినది భారతి పుట్టిన 1924 సం. జనవరి నుంచి ఆంధ్రుల సర్వతోముఖ వికాసమునకు అది ప్రధాన ప్రతీకగా వెలసినది. కవులు, కథకులు, నాటికాకర్తలు, విమర్శకులు, వివిధ సంస్కృతి రంగాలలో వ్యాసంగముచేసే వ్యాస కర్తలు అందరికి భారతి రంగస్థలమైనది. ప్రసిద్ధులైనవారికి మాత్రమేకాదు భారతి రంగస్థలము, ఆంధ్రకవులు, కథకులు, నాటికాకర్తలు, వివిధ విజ్ఞానరంగాలలో కృషి చేసే వ్యాస కర్తలు, తర్వాత ఎంత ప్రసిద్ధికి వచ్చినవారైనా, ముందు సారస్వతరంగములలో భారతిద్వారా పరిచితులైనవారే ఎక్కువ భాగము!

శ్రీ నండూరి సుబ్బారావు 'ఎంకిపాటలు' ఇప్పుడెంతో ప్రసిద్ధికి వచ్చినవి గదా! వాటిలో 'ఎనకజన్మములోన ఎవరమో నంటి' అని ప్రారంభించే గేయము మొదట భారతి ప్రకటించగానే, గాలి దుమారము రేగినది. ఉభయపక్షాల వాదాలకు బహుకాలము భారతి రంగస్థలమైనది. చివరకు శ్రీ బసవరాజు అప్పారావు,- వారప్పుడు భారతికి సహాయసంపాదకులు - వ్రాసిన 'ఎంకిపాటల గాలి దుమారము' అనే వ్యాసంతో వాదోపవాదాలు సంక్షేపించారు. దాని ఫలితమేమంటే ఎంకిపాటలకు నేడు సర్వతోముఖవ్యాప్తి వచ్చినది.

శ్రీ నాగేశ్వరులు స్వీయరచనలలో ఎప్పుడూ గ్రాంథిక భాషనే గ్రహించేవారు. కాని వారెప్పుడూ వ్యావహారిక భాషలో రచించిన మంచి రచనలకు భారతిలోనేమి, సంవత్సరాది సంచికలలోనేమి, పత్రికలోనేమి స్థానమిచ్చేవారే. వ్యావహారిక మంటే శ్రీ గిడుగు రామమూర్తిగారి శిష్టవ్యావహారికమనే నిర్వచించేవారు, అది గ్రామ్యముకాదని వారి వాదన.

మరి ఎంకిపాటలో గ్రామ్య వ్యావహారికము! దానికి కూడా శ్రీ నాగేశ్వరులు భారతిలో అప్పట్లోనే స్థానమిచ్చి గాలిదుమారం చెలరేగనిచ్చారు. వారి కెంత ముందు చూపు ఉండేదో!

శ్రీ గిడుగు రామమూర్తిగారు చెన్నపట్టణము ఎప్పుడు వచ్చినా, నగరంలోని పెద్దలను ఆహ్వానించి ఆంధ్రపత్రిక ఆఫీసులో వారి చేత ఉపన్యాసం చేయించేవారు. అటువంటి సభ కొకదానికి నేను బి. ఏ, విద్యార్థిగా ఉండగా, వెళ్ళిన భాగ్యం పొందినాను; 1919లో దానికి శ్రీ వేపా రామేశము అధ్యక్షులు; శ్రీ వేమవరపు రామదాసు, శ్రీ అక్కిరాజు ఉమాకాంతం ఇత్యాదులు సభాసదులు.

ఆ ప్రాంతాలలోనే సాహితీ సమితివారి 'సాహితి' మొదటి సంచిక వచ్చినది. దానిని ఆంధ్రపత్రికలో రెవ్యూ చేయించ డానికి శ్రీ నాగేశ్వరులను దర్శించాను. అందులో రచనలు ఎక్కువ భాగము వ్యావహారిక భాషలో ఉన్నవి. నాతో మా మిత్రులు శ్రీ వీరరాఘవస్వామి కూడా ఉన్నారు. వారెంతో ఆదరముతో మాతో మా పత్రిక కష్టసుఖాలు ప్రస్తావించారు. అట్టమీద ప్రకటన రేట్లు తక్కువగా ఉన్నవనీ, లోపలి రేట్లు ఎక్కువ అనీ సూచించి మేమడగక పోయినా, అమృతాంజనము ప్రకటన సాహితి అట్ట మీదికి ఇచ్చి. శ్రీ పండిత గోపాలాచార్యులు కూడా ప్రకటన ఇచ్చెదరని సూచించారు. ముందు చూడగా దూరోన్నతంగా నాగేశ్వరులు యువకులను అంత ఆప్యాయతతో ఆదరించడము మమ్ముల‌ను ముగ్ధులను చేసినది. నవ్యాంధ్ర సాహిత్యరంగంలో 'సాహితి' అవతరణ ప్రధాన ఘట్టమని గుర్తుంచుకోవలె.

1935వ సం. లో నవ్యసాహిత్య పరిషత్తు 4వ వార్షిక సమావేశము కాకినాడలో శ్రీ పంచాగ్నులవారి అధ్యక్షతను జరిగినది. ఆ సమావేశమునకు శ్రీ నాగేశ్వరులు ప్రారంభకులు. మొదటి నాటికి వారు రాలేక చివరి నాటికి వచ్చి రెండు గంటలు మహోపన్యాసము చేశారు. ఆ ఉపన్యాసము పూర్తికాగానే శ్రీ శివశంకరులు ముగ్ధులై, మిత్రులతో నాగేశ్వరుల ప్రతిభను ఎంతో పొగిడినారు. నాకెందుకు నేను నా జీవితములో సాహిత్యోపన్యాసము అంతా ఉదాత్తమైనదీ సంపూర్ణమైనదీ విని ఉండలేదు.

ఆ సభకు కాకినాడలో పెద్దలే కాక నవ్యసాహిత్యరంగాలలో కృషిచేస్తున్న పెద్దలూ పిన్నలూ ఎందరో వచ్చారు. శ్రీ శ్రీ వాణి విశాఖపట్టణం దాటి బయట వినిపించసాగినది అప్పుడే. ఆ ఉపన్యాసంలో నాగేశ్వరుడులు సాహిత్యము మహోన్నతాదర్శాలు వివరిస్తూ సమగ్రంగా సాహిత్యరంగాలన్నిటిని సామరస్య సమన్వయ ధోరణిలో ప్రస్తావించారు.

శ్రీ నాగేశ్వరుల సంపూర్ణ సాహిత్యదృష్టికి 'భారతి' ప్రతీక. అందులో సాభిప్రాయవిశేషాలు శ్రీ నాగేశ్వరుల రచనలు. అందులో సాహిత్యేతర విషయాలుకూడా, ఆ మాసంలో జరిగినవి నిర్భయంగా సరసంగా సమీక్ష చేసేవారు. భారతి 2 వ సంపు. 9 వ సంచిక సాభిప్రాయ విశేషాలనుంచి ఉదాహరిస్తున్నాను. అంతకు ముందే శ్రీ సర్ సురేంద్రనాథబెనర్జీ దివంగతులైరి. ఆంధ్ర విశ్వవిద్యాలయ శాసనము శాసనసభలో ప్రవేశపెట్టబడినది.

"భారతదేశ సమస్యలు విచిత్రములు; ప్రపంచాతీతములు. రాజద్రోహము రాజ సన్మానముగ బరిణమించును. దేశాభిమానము ప్రభుత్వ నిరసనమునకు పాలగును. ప్రజాసేవ గౌరవలాభములకు సాధనంబగును. ప్రజాసేవ దండనంబునకు గారణంబగును.... నేటి దేశభక్తులు రేపు స్వామిభక్తులై ప్రజాకంటకు లగుచుందురు. ఈ విపరీతస్థితి పరాధీన దేశములకు సహజమైనను భరతవర్షమునందు విపరీతాకారమును దాల్చి భారత సత్వమును నిర్మూలముచేయుచున్నది....వంగదేశసింహమని ఖ్యాతిని బడసిన సర్ సురేంద్రనాథ బెనర్జీగారి జీవితవృత్త మీ విషమ సమస్యలకు వ్యాఖ్యానముగ నున్నది....బెనర్జీగారు జీవితారంభమునందే నిరంకుశ వర్గాగ్రహమునకు బాత్రులై దండనమున ననుభవించిరి....మంత్రి పదవి బెనర్జీగారికిని వంగరాష్ట్రమునకు స్వల్ప ప్రయోజనముల నొడగూర్చినను భారతభూమికి ప్రయోజనము గలుగజేయలేదు. అధికారస్వర్ణ శృంఖలబద్ధులైన బెనర్జీగారి కధికారపదవి వాగ్బంధనమును జేసినది. అధికారపాశబద్ధులైన బెనర్జీగారికి ప్రజాసేవ దురారాధ్యమైనది. అధికార ప్రాపకముతో ప్రజాగౌరవము సన్నగిలినది. సర్ బిరుదముతో నధికార పాశబలము హెచ్చినది.

"విద్యామంత్రి సర్ పరశురామ పాత్రో చిరకాలాపేక్షితమైన ఆంధ్ర విశ్వవిద్యాలయ శాసనము సభయందు ప్రవేశ పెట్టి స్వధర్మ నిర్వహణ మును జేసిరి...సర్ కూర్మా రెడ్డి నాయుడు ఆంధ్ర పదమునకే భయ పడుట విచిత్రముగా నున్నది. ఆంధ్ర లోకమునకు చిరకాలాభ్యస్తమైన ఆంధ్ర పదమునందుగల బ్రాహ్మణ వాసనయే యని భయము గలుగు చున్నది. ఆంధ్రపదము సంస్కృత పదమైనను బ్రాహ్మణ భయమున కవకాశము లేదని నాయుడుగారు గ్రహించవలసి యుందురు,"

ఈ విధముగా వ్రాసే సమర్ధత మాడరన్ రెవ్యూ పత్రికాధిపతులైన శ్రీ రామానంద చటర్జీకే ఉండేది, శ్రీ నాగేశ్వరులకే ఉండేది. అదిఆంగ్ల భాషలో ఉన్నందున కవుల స్వతంత్ర రచనలకు రంగముగా ఉండలేక పోయినది. 'భారతి' మాత్రము ఆంధ్ర వాఙ్మయానికి సర్వతోముఖంగా రంగస్థలంగా ఉండగలిగినది. పూర్ణ పురుషోత్తముడైన వ్యాస భగవాను లను తిక్కన సోమయాజి భీష్మ పర్వములో సంజయునిచేత ఈవిధంగా స్తోత్రము చేయించినాడు.

"ప్రాంశు బయోదనీల తనుభాసితు సుజ్జ్వల దండధారుబిం
గాంశుజటాభచ్ఛటారణు నాగమపుంజ పదార్థతత్త్వని
స్సంశయకారు గృష్ణమృగ చర్మ క్రతాంబర కృత్యు భారతీ
వంశనివర్ణమం ద్రిదశ వందితు సాత్యవతేయు గొల్చెదన్"

ఇది సోమయాజుల సొంత స్తుతి. మూలములో సంజయుడు తనకు దివ్యదృష్టి ప్రసాదించిన పారాశర్యుని స్తుతించినట్లే ఉన్నది కాని వ్యాసవర్ణనము లేదు. ఆయన ప్రాంశుననీ, ఆగమ పుంజపదార్థతత్త్వ నిస్సంశయకారుడనీ, భారతీ వంశవివర్ధనుడనీ వర్ణించినది గమనింప దగును. వ్యాసభగవానుని కళావేశ మావేశించి పూర్ణపురుషత్వ మందిన శ్రీ నాగేశ్వరులును 'భారతీ వంశవివర్ధను' లైనారు. వారును ప్రాంశు మూర్తులే.

# 11

## సంవత్సరాది సంచికలు

నాగేశ్వరుల పూర్ణత్వము పూర్ణముగా ప్రతి ఫలించినది సంవత్స రాది సంచికలకు వారు వ్రాసిన ప్రస్తావనలలో మొదటి రెండు సంచిక లలో ప్రస్తావన శబ్దము వారు వాడలేదు. 3 వ సంచికలో ప్రస్తావన శబ్దము ఆరంభమైంది. ఆ తర్వాత నాగేశ్వరులు తమకు అభిమానపాత్ర మైన గ్రంథాదులకు పీఠికలు వ్రాసినా 'ప్రస్తావన' అనే వ్యవహరించే వారు. 'ప్రస్తావన' అంటే నాగేశ్వరులు తమ అభిమాన ముద్ర వేసినట్లు గుర్తు. ఆంధ్రవిజ్ఞాన సర్వస్వానికి, బసవపురాణానికి కూడా వారు వ్రాసి నవి ప్రస్తావనలే. వారు సమగ్రప్రశంస చేసినప్పుడే ప్రస్తావనశబ్దము ప్రయోగించేవారని తోస్తుంది,

ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలు ప్రారంభమైనది 1910 లో సాధారణ సంవత్సరాదిన. అందులో నాగేశ్వరుల 'విన్నపము' లో ఇట్లున్నది:

"ఆంధ్రదేశమునందు భాషాభిమానులు, విద్యావంతులు, గ్రంథ కర్తలు, సంఘసంస్కరణపరాయణులు మొదలగు పూజారులనేకులు గలరు. ఈ మహనీయుల సౌశీల్య సద్భావన లాంధ్ర లోకాభివృద్ధికి దోడ్పడుచున్నవి. ఈ సత్పురుషుల కృతపరిచయమును దృఢపరచుటయే ఈ సంచిక ప్రధానోద్దేశ్యము.... ఈ సంచికను ప్రచురించుటకుగల సామర్థ్య మాంధ్రమహాజనుల సాహాయ్యమువలన గలిగినది.... ఈ బాల పత్రికం దమ పుత్రికారత్నంబును వలె బెంచి పోషించుట కాంధ్రలోకాలం కారులైన నరనారీమణులు ప్రార్థితులు."

ఆ సంచికలో వ్యాసాదికములు 248 డెమీ $\frac{1}{4}$ పేజీలు, 125 ఆర్టు కాగితముల మీద చిత్రములు ఉన్నవి. ఆంధ్రపత్రిక చందాదారుల కది ఉచితము. ఆంధ్రపత్రిక చందా సం. 1 కి రు 2-2-0 లు. పత్రిక చందా దారులు కానివారికి సంచిక వెల రు 0-8-0 అర్ధ రూపాయి మాత్రము. వ్యాసరచయితలు ఆయా రంగాలలో ప్రసిద్ధులైనవారే,

ఈ విషయములో నాగేశ్వరులు ప్రదర్శించిన దాతృత్వ స్వరూపము విప్పిచెప్పిననేకాని తెలియనిది. సంవత్సరాది సంచిక ఖరీదు తర్వాత రు 1/ కి మార్చబడినది. ఏమైనా అన్నీ వారి సర్వతోముఖ దాతృత్వానికి చిహ్నాలే. గుప్తదాన మెన్నిరూపాలుగా ఉండవచ్చునో వారికి తెలిసినట్లు ఇంకొకరికి తెలియదు.

పరీధావి సంవత్సరాది సంచికలో (1912) 'ప్రస్తావన' అనే శబ్దము వాడినారు. కాని తర్వాత ప్రత్యక్షమైన సృష్ట్యాది కాలమానము అందులో లేదు. సంవత్సరానికి ఆదిమ దివసమని, మొదటి ఋతువనీ అది ఆరంభమైనది. కాని అందులోనే ఆ సంవత్సరములో ప్రపంచ చరిత్ర సమీక్ష ఉన్నది.

నల సంవత్సరాది సంచికలో (1966) సృష్ట్యాది నుండి అప్పటికి కాలగణనము కలదు. అందులో తమ సంవత్సరాది సంచికల వైవిధ్యము, ప్రత్యేకత ప్రస్తావింపబడినది. మొదటి సాధారణ సంవత్సరాది సంచికలో (1910) వాఙ్మయ మత సాంఘిక వ్యాసములు ప్రధానములు. రెండవదగు విరోధికృత్సంచికలో (1911) సాంఘిక మత విషయములు ప్రధానములు. పరీధావి (1912) సంచికలో పంచమజార్జి ఢిల్లీ పట్టాభిషేకము ప్రధానము. ప్రమాదీచ (1913)లో 36 వ్యాసములలో రాజ్యాంగ సంబంధమైనవి పది, 200 చిత్రపటములు. ఆనంద సంచికలో (1914) 40 వ్యాసములలో భాషా విషయికమైనవి 10, మహాపురుషుల చరిత్రములు 10, రాక్షస సంచిక ఆరవది (1915). అది ప్రధానముగా ప్రథమ ప్రపంచ యుద్ధమునకు సంబంధించినది. అప్పటి యుద్ధతంత్రాన్ని కన్నులకు కట్టినట్లు వర్ణించినది. ఆంధ్రోద్యమానికి సంబంధించిన వ్యాసాలు కూడా చాలా ఉన్నవి. యుద్ధ చిత్రాలు, ఇతర చిత్రాలు మొత్తము 360. నల సంచిక ఏడవది (1916) దానిని గూర్చి ప్రస్తావిస్తూ, నాగేశ్వరుల మాటలివి:

"లోకవ్యాప్తమైన నూతనోత్సాహ మాంధ్ర ప్రపంచమును సయితమావరించినది. విద్యావంతులు, సామాన్యులు నూతనోత్సాహ సమంచితులు. ఆంధ్ర దేశాభిమానము, ఆంధ్రభాషాభిమానము, ప్రజాభిమానము

ఆంధ్రప్రపంచము నావరించినవి... ఆంధ్ర దేశాభ్యుదయ సూచకంబులైన బీజాంకురంబులు గోచరంబులు."

ఇది ముఖ్యముగా ఆంధ్రవ్యక్తిత్వమును ప్రదర్శించే సంచిక, ఐనాయుద్ధ విషయాలు కూడాచాలా ఉన్నవి. మొత్తము 300 పటములు. అందులో రంగుల దేశపటములు 20. ఆరాధ్యులు శివభక్తులు ఐన నాగేశ్వరులు ఈ సంచికను శ్రీ సీతారాముల చిత్రము ముఖచిత్రముగా ప్రకటించుట గమనార్హము. దానిని గూర్చి ప్రస్తావనలో వారు వ్రాసిన ఈ క్రింది వాక్యములు ఆధ్యాత్మచింతన కలవారందరూ గుర్తుంచుకొన దగినవి.

"ముఖపటము

"శ్లో. ఆపదా మపహర్తారం
దాతారం సర్వసంపదామ్,
లోకాభిరామం శ్రీరామం
భూయో భూయో నమామ్యహమ్.

"శ్రీ సీతారాములు పురాణదంపతులు, లోక కల్యాణకారులు, దివ్య మంగళమూర్తులు అవతారమూర్తులు ఆరాధన యోగ్యులు....శ్రీరాముడు మహాపురుషుడు, ధీరోత్తముడు, ధర్మప్రవర్తకుడు, నిగ్రహానుగ్రహ సమర్థుడు, దుష్టసంహారకుడు, శిష్టసంరక్షకుడు .... సీతారాముల పూత చరిత్రము ధర్మారాధనమునకు పరమ ప్రమాణము. ధర్మజ్ఞాన మతి దుర్లభము. ధర్మారాధనము దురారాధ్యము. ధర్మ మతి సూక్ష్మము, విశాలము....మహావ్యక్తుల జీవితంబులందు "తత్త్వమసి" మహావాక్యార్థ మనుభవజ్ఞాతము...శ్రీరాముని దివ్యచరిత్రమునందు సర్వావస్థలయందును త్యాగము పరిస్ఫుటము .... సేవాపరాయణులై కులధర్మమును, జాతిధర్మమును, గుణధర్మమును ఉద్ధరించుటకై ప్రయత్నించెడి స్త్రీ పురుషులకు సీతారాముల దివ్యరూపదర్శనము ధర్మద్యోతకము కాగలదు. జాతీయజీవనమునందు ధర్మప్రాబల్యము నుపపాదించుటకై మంగళకారులైన శ్రీ సీతారాముల చిత్రపటము ముఖపటముగ ముద్రింప బడినది."

ఈ వచనాలు 1916 లో నాగేశ్వరులు వ్రాసినవి. అప్పటికి మహాత్ముడు భారత రాజకీయరంగములో ప్రవేశింప లేదు. ఈ మాటలు పత్రికా సంపాదకునివా, తత్త్వవేత్తయైన మతప్రవర్తకునివా? ఆ సంవత్సర చరిత్రను సమీక్ష చేయుటలో సర్వసంపన్నత ఉన్నది. శ్రీ నాగేశ్వరులు సంవత్సరాది సంచికలకు 1910 – 1937 వరకు వ్రాసిన ప్రస్తావనలు చదివినచో 28 సంవత్సరముల ప్రపంచ చరిత్ర, ప్రత్యేకముగా భారతజాతి చరిత్ర, అందును ఆంధ్రదేశ చరిత్ర సమగ్రముగా అవగాహనమవుతుంది.

29 వ సంచిక (బహుధాన్య, 193:) లోని ప్రస్తావన నాగేశ్వరుల మామూలు ప్రస్తావన కాదు అది వారు అవతారసమాప్తి చేస్తూ, ఆంధ్రుల కిచ్చిన సందేశము అనికాని- ఆంధ్రులవద్ద సెలవు తీసికొనుట అని గాని వర్ణించుట యుక్తము. అందులోని కొన్ని వాక్యము లివి.:

"ప్రపంచమంతయును శాంతిసంకల్పమును జేయుచు మహాసంగ్రామ ప్రయత్నములు చేయుచున్నది...

"గాంధీమహాత్ముడు శాంతి సంరంభమునందు ప్రదర్శించిన అపూర్వమైన సత్యాగ్రహసాధనమును ప్రజలు మాటలందుగాక సంకల్పమందును, క్రియ యందును చూపుటకు తపస్సును చేయుట ధర్మము....

"గతించిన సంవత్సరమునందు కాంగ్రెసునకు అఖండము, అపూర్వముఐన విజయము కలిగినది. ఇది సత్యాగ్రహ ప్రభావము. నిరంకుశ ప్రభుత్వము నిర్ఘాంతపోయినది....

"1910 కీలక సంవత్సరమున మా మొదటి సంచిక ప్రచురింపబడినది. బహుధాన్య సంవత్సరమునందు 29వ సంచిక వెలువడుచున్నది. గతించిన 30 ఏండ్ల నుండియు ప్రజాహృదయమునందు గల్గిన మహాప్రబోధమును సంవత్సరాది సంచికలు దిఙ్మాత్రముగ సూచించుచున్నవి. ఆంధ్రులు సాహిత్య, కళా, మత, సాంఘిక రంగములందు చిరకాలాగతములైన పూర్వాచారములను, నిర్బంధ నిర్మాణములను విసర్జించి నవీన మార్గములను అవలంభించిన విధమును కావ్యములు, గీతములు, విమ

త్ననములు, పరిశోధనలు, చరిత్రాంశములు విశదము చేయుచున్నవి. సాహిత్యమునందు కల్గిన అపారమైన వికాసమును ప్రచురితములైన కావ్యములు, గీతములు విశదము చేయుచున్నవి. నవీన రచనలు ప్రజా దరణమును బడయుచున్నవి....

"ఆంధ్రాభ్యుదయమునకు పాటుపడిన సకల మహా జనులకును కృతజ్ఞతా వందనములు....నా స్వల్పమైన సేవకు ప్రజలుచూపిన ప్రేమా దరణ సత్కారములకు కృతజ్ఞుడను. సచ్చిదానంద పరమాత్మ సకల లోకములకును, సకలజనులకును శాంతి సౌఖ్యములను ప్రసాదించుగాక!"

ఆ చివరివి నాగేశ్వరుల తుదిరచనలోని తుది మాటలు. ఆమరణాం తము ఎట్టి పుణ్యచింతలు నాగేశ్వరుల నావహించివుండినవో అవి దివ్య వాక్కులవలె ఉద్ఘోషించుచున్నవి. ఆ వాక్యాలలో తాము సాధించిన కార్య ములకు అంతర్గర్భితముగా తృప్తి కూడా ఉన్నది.

నాగేశ్వరులే ఆంధ్రోద్యమమని నేడు నాయకులు జోహారులర్పిస్తు న్నారు. అంతేకాదు. వారు ఆంధ్రోద్యమమే కాదు, పుణ్యోద్యమము పూర్ణోద్యమము! వారి పూర్ణపురుషత్వమునుండి ఉత్పత్తిల్లిన సమన్వయ సూచనలెన్నో ఇప్పటికిని ఆంధ్రులే కాదు, భారతీయులే గ్రహించ వలసినవి: (1) హిందీభాషస్థాన మేది? (2) సాంకేతిక శబ్దములను ఏ విధముగా సమాకూర్చుకొనవలెను? (3) రాష్ట్రములకు, కేంద్రము నకు ఉండవలసిన సంబంధ మేమి?- వీనితో పాటు ఆంధ్రులు గ్రాంథిక గ్రామ్య భాషా వివాదము ఎట్లు పరిష్కరింపవలెనో వారు చేసిన సూచ నలు ముఖ్యముగా గ్రహింపదగినవి. వారు ఏ సూచనలు చేసినా, దాని వెనుక సమగ్రమైన విజ్ఞానమూ, సమస్యను విడదీయుటకు సమర్థమైన యోగదృష్టి, సమన్వయించి ఉత్తమ మార్గము ప్రదర్శించుటకు శక్తిగల బహుజన్మకృత సుకృతమూ, నాగేశ్వరులలో మూర్తీభవించి ఉండేవి!

# 12

## గ్రంథ పీఠికలు

శ్రీ నాగేశ్వరులు జీవితములో సాధన చేసినది పూర్ణ యోగము,

సర్వాత్మ భావము ; లోకానికి ప్రసాదించినది సమన్వయ తత్త్వము. వారు సంప్రదాయమువదలని నవ్యతావాదులు, సత్యనిష్ఠ వీడని ప్రియం వదులు, విశ్వవిజ్ఞానము అవగాహన చేసికొన్న కావ్య శిల్పవినోదులు. వారి ధ్యేయము విశ్వశ్రేయస్సు !

వారెన్నో గ్రంథాలకు పీఠికలు వ్రాసినారు; కొన్ని పెద్దవి, కొన్ని చిన్నవి. ఏవైనా కృతియందున్న సద్గుణాలు ప్రశంస చేసి, లోపాలు సౌమ్యంగా సూచిస్తారు. దాని స్వరూపము తూచినట్లు విలువ కట్టగలరు

ఆంధ్ర గ్రంథమాల 17వ కుసుమము శ్రీ కురుగంటి సీతారామయ్య గారి తంజాపురాంధ్ర నాయక చరిత్రము. దాని తొలి పలుకులో నాగేశ్వ రుల పలుకులు :

"చరిత్రమునకు నామరూప విలసితములైన దేశకాల పాత్రముల కాధారభూతమైన ధర్మము హృదయముగా నున్నది. జీవరహితమైన దేహమువలెను, ధర్మరహితమైన చరిత్రాంశములు విశ్వశ్రేయస్సునకు నిరర్థకములు... తంజాపురాంధ్రనాయకచరిత్ర రచనయందు గ్రంథకర్త లక్ష్యము సంప్రదాయ సిద్ధమైన మార్గమవలంభించుచున్నది."- ఇక్కడ సంప్రదాయ సిద్ధమైన మార్గమంటే, కాలనిర్ణయమున కెక్కువగా శ్రమ పడుట.

ఆంధ్ర గ్రంథమాల 6 వ కుసుమమైన నీతినిధి శ్రీ వేటూరి వారి అనువాదమునకు సంపాదకీయములో శ్రీ నాగేశ్వరులు "జీవయాత్రకు నీతి సాధనము... వివిధ మతములకును మోక్ష విషయమునందు భేదాభి ప్రాయములు లేవు." ఇత్యాదిగా వ్రాసి నీతినిధి జీవయాత్రకే కాని ఆత్మ యాత్రకు, నారాయణ పదము నధిష్ఠించుటకు సాక్షాత్సాధనము కానేరదని సూచించారు.

నాగేశ్వరులకు బహుకాల మిత్రులు, సంఘ సంస్కర్తలు, విద్యాధి కులు, స్వాతంత్ర్యసమర యోధులు ఐన ఉన్నవవారు 'మాలపల్లి' ప్రచు రింపగానే, దానిని ఆంగ్ల ప్రభుత్వము నిషేధించినది. మాలపల్లికి తొలి పలుకులు వ్రాయుచు నాగేశ్వరులు దానిని బహువిధముల శ్లాఘించిరి.

"భక్తి ప్రేమలు ఇంద్రియాతీతమైన ఆత్మార్థపరాయణమైనపుడు నిరతిశయాత్మానందాను భవమును ప్రతిపాదించిన భాగవతార్థమును మాలపల్లి సందర్భానుసారముగను ప్రతిపాదించుచున్నది... (గ్రంథమందంతటను బహువిధములైన ఆఖ్యానోపాఖ్యానములతో పండిత పామర జనాదరణ యోగ్యముగ నున్నది. ... వాడుక భాషయందు నవరస భరితమైన కావ్యమును రచించిన లక్ష్మీనారాయణగారు ధన్యులు'... అర్థకామములు పరమార్థమునకువలెను పరమానర్థములకును వినియోగపడగల విధము మాలపల్లి చిత్రవిచిత్ర విధములను సువ్యక్తము చేయుచున్నది." ఇత్యాదికముగా ప్రస్తుతించి తుదకు, "సందర్భానుసారముగ చేసిన వర్ణనలు, బోధలు, వ్యాఖ్యానములు జ్ఞానదాయకములైనను కావ్యరసాను సంధానమునకు ప్రతిబంధకములై కావ్యము పురాణ పరిణామమునుబొందినది" అని నిర్వచించుట నాగేశ్వరుల నిర్భయ సత్యనిష్ఠకు నిదర్శనము. కావ్యస్వరూపములను భ్రమప్రమాదాలకు లోబడకుండా అట్టె పట్టివేయగల అపూర్వ శక్తి వారికున్నది.

శ్రీ మంగిపూడి వెంకటశర్మగారు రచించిన 'నిరుద్ధ భారతము' అని అస్పృశ్యతను ఖండించే కావ్యానికి నాగేశ్వరులు వ్రాసిన పీఠిక ఉదాత్తమైనది, అందులో వారు "ప్రవృత్తి వలన గలిగిన భేదములనతిక్రమించి యాత్మోన్నతి బడయుటకు సకలమానవులును సమానాధికారులు, సమానాధికారులైన తోడిమానవులను ధర్మబాహ్యులను జేయుట కేవలము దైవధర్మ బహిష్కరణము" అని ఉద్ఘాటించిరి.

శ్రీ దుగ్గిరాల రాఘవచంద్రయ్యగారు రచించిన 'అష్టాదశ మహాపాపి యగు బ్రాహ్మణునితో సహాయ నిరాకరణ మొనర్పుము అను గ్రంథమునకు పీఠిక వ్రాయుచు నాగేశ్వరులు, "రాఘవ చంద్రయ్యగారు హిందూ మత విషయమై వారి గ్రంథమున చేసిన విమర్శలు పూర్వము కపిల, గౌతమబుద్ధాదులు చేసియుండిరి.. సనాతనవర్ణాశ్రమ ధర్మపరాయణులకు ప్రజాహృదయమునందు గలిగిన ధర్మప్రబోధమును గ్రహించుట కీ గ్రంథము వినియోగపడగలదు" అని ఎంత సరసముగా వ్రాసిరో చూచినచో అద్భుత మనిపించును.

నాగేశ్వరులు తమఆంధ్రగ్రంథమాలలో ప్రథమపుష్పముగా 'శతక మంజరి భక్తి సంపుటము' ప్రచురించుటలో వారికి శతకములందును, వానిలో భక్తిశతకములందునుగల అభిమానము విశదమవుతుంది. గ్రంథానికిముందు శతకవాఙ్మయాన్ని సమీక్షచేస్తూఒక పీఠికేకాక, ప్రతిశతకానికి ప్రత్యేకపీఠికకూడా వ్రాశారు. ఎంతోశ్రద్ధగా పద్యాలకు అనేకపాఠాంతరాలు సేకరించి అధస్సూచికలలో ప్రదర్శించినారు శతక వాఙ్మయాన్ని సలక్షణంగా శాస్త్రీయ దృక్పథంతో ప్రకటించడానికి చేసిన ప్రథమ ప్రయత్నము వారిదే. అందులో 'వ్యాసులు జ్ఞానసాగరమైన' భారత రచనానంతరము మోక్షప్రాప్తికి భక్తిప్రభావమును దెలుపుచున్నది' అని నాగేశ్వరులు వ్రాసిన మాటలవల్ల, వారిని వ్యాసభగవానుల జ్ఞానతృష్ణ, భక్తిభావము ఎంతగా ప్రభావితులను జేసినవో వ్యక్తమగును.

బసవ పురాణమునకు వారు వ్రాసిన 'ప్రస్తావము' రాయలు $\frac{1}{4}$ సైజులో 24 పేజీలు. అది ఒక చిన్న గ్రంథమే అనదగును. అందులో భరత భూమిలో వేదములనుండి బసవేశ్వరుని వరకే కాక కొంత తర్వాత కాలము వరకుకూడ వివిధమతముల పరిణామము సూత్రప్రాయంగా సమీక్షించినారు. వేద మతము, ఉపనిషన్మతము, జైనము, బౌద్ధము, శాంకర రామానుజ మాధ్వమతములు, బసవేశ్వర వీరశైవము–ఒకదాని తర్వాత ఒకటి పుట్టి ఏ ఏ విధముగా ప్రయోజనములు సాధించినదీ నాగేశ్వరులు స్వీయ దృష్టితో సమీక్షించినారు. "వైదికమతమునందలి దేవతార్చనము, వేదాంతము నందలి తత్త్వార్థము, జైన బౌద్ధములందలి సంఘారాధనము, వివిధ మతములందలి కర్మారాధనము వీరశైవభక్తియందు సంయోగమును బొందినవి" అని వారు సమన్వయించిరి. "జీవయాత్రను, విషయయాత్రను జేయక శివయాత్రను జేయుటకూ సర్వకాల సర్వావస్థలయందునుశివసందర్శన సంస్మరణ సంకీర్తనములు సాధనములుగ నున్నవి....జీవయాత్రను దేహయాత్రార్థముగాక ఆత్మయాత్రార్థము చేయవలసినవిధమును సాధకునకు వీరశైవము వివరముచేయుచున్నవి. వీరశైవాగమములందు వేదాంత మంత్రశాస్త్రముల రహస్యములు భిన్నరూపములను సమన్వయమును బొంది, భక్తియోగప్రభావమును నిత్యజీవనమునందు విస్తరింపజేసినవి." ఇట్లెన్నోవిధముల నాగేశ్వరులు వీర

శైవము నగ్గించియు, "వీరశైవము తలపెట్టిన కులావరణ నిర్మూలనము దుస్తరమైనది. లింగాయతులు, జంగములు, సాలెలు, జాండ్రలు ప్రత్యేక కులములవారై, మరికొన్ని కులము లేర్పడినవి....భక్తిప్రధాన మైన వీరశైవము నిర్జీవమైన యాచారసంప్రదాయబద్ధమై సాంఘిక ప్రయోజనములకును, మానవ కల్యాణమునకును నిరుపయోగమైనది" అని నిర్భయముగా ఉద్ఘాటించి, తమ సత్య నిష్ఠను, వాస్తవిక దృష్టిని ప్రకటించిరి.

# 13

## విజ్ఞానసర్వస్వ వ్యాసములు

నాగేశ్వరులు సాధించిన మహాకార్యములలో వారు కావించిన రచనలు శతాంశముకంటె లేవు. వారి రచనలు మన కిప్పుడు స్పష్టముగా కనబడుచున్నవి కొన్ని సంపాదకీయములు, గ్రంథ పీఠికలు, ప్రస్తావనలు, సంచికల పీఠికలు, భారతిలో సాభిప్రాయవిశేషములు, విజ్ఞానసర్వస్వము లోని వ్యాసములు, భగవద్గీత వ్యాఖ్యానము మాత్రమే. వారి ఘనకార్యములలో అవి స్వల్పాంశమే ఐనా, ఇతరుల కవే ఘనత తేజాలైనవి. వారి రచనలన్నీ సమగ్రమైనవీ, వారి ఆదర్శజీవితములో నుండి వెలువడినందున కొత్త వెలుగు చూపేవీ అయివున్నవి. విజ్ఞానసర్వస్వములో వారివని (1) అజంతా విహారములు (2) అనాహతము (3) అనుభవ సారము(4) అపరోక్షానుభూతి (5) అల్లమప్రభువు అనునవి స్పష్టము. వారి పేరులేకుండ వ్రాసినవి మరికొన్ని ఉండివుండును.

వీనిలో 'అల్లమప్రభువు' అనేది సోమయదేవుని 'ప్రభులింగలీలలు' అను ద్విపదకావ్య మాధారముగా చేసికొని అల్లమ ప్రభువు దివ్యచరిత్రమును వర్ణించుచున్నది. 'అనుభవసారము' పాల్కురికి సోమనాథుడు ఆ పేరుతో రచించిన 234 పద్యములు కల కావ్యమును వివరించునది. ఈ రెండింటిలోనను వారు బసవపురాణ ప్రస్తావనములో- 1926 లో వ్రాసిన భరతఖండములోని మతముల పరిణామవిధానమునే సంక్షేపముగా మరల సూత్రప్రాయముగా తెలిపి వీరశైవము మహావాక్యార్థములనే సార్థకము

చేయుచున్నదని సమన్వయించిరి. మరియు "శ్రీ శంకరాచార్య విరచిత మైన అపరోక్షానుభూతి ఆచార్యస్వాములవారి అద్వైతానుభవమును వివ రించుచున్నట్లు, సోమనాథవిరచితమైన అనుభవసారము వీరశైవమతసార మును వివరించుచున్నది" అని తెలిపిరి.

'అపరోక్షానుభూతి' అనేది చిన్న వ్యాసము. ఆ పేరుతో ఆది శంకర కృతి యని ప్రసిద్ధిగల 144 శ్లోకాల గ్రంథవిషయమది సంగ్రహించినది. అందులోని 129 వ శ్లోక ముదాహరించినారు.

"భావవృత్త్యా హి భావత్వం శూన్యవృత్త్యా హి శూన్యతా,
బ్రహ్మవృత్త్యా హి పూర్ణత్వం తథా పూర్ణత్వ మభ్యసేత్"

"భావవృత్తి భావములను, అభావవృత్తి అభావములను గలుగ జేయునటులు బ్రహ్మవృత్తి పూర్ణయోగపరమైన బ్రహ్మత్వమునకు సాధనము" అని వివరించుటలో, అంతకుముందే వారి భగవద్గీత వ్యాఖ్యానములో అభిమానించిన 'పూర్ణయోగ' శబ్దమును అభిమానించుట గమనింపదగినది. అట్లే నాగేశ్వరులకు త్యాగమందుకూడ నెక్కువ యభిమానము. వా రందులో "త్యాగలక్షణము పరమార్థములను తెలుపు చున్నది" అని ఉపక్రమించి

"త్యాగః ప్రపంచరూపస్య చిదాత్మత్వావలోకనాత్
త్యాగో హి మహతాం పూజ్యః సద్యోమోక్షమయో యతః"

అని 106 వ శ్లోకము ఉదహరించి వ్యాఖ్యానించినారు. నాగేశ్వరుల సాధ నము ముఖ్యముగా త్యాగమునందును పూర్ణత్వమునందును ప్రసరించిన దనుటకు పై యుదాహరణలే తార్కాణములు.

'అనాహతము' అన్న వ్యాసము నాగేశ్వరులకు మంత్రతంత్ర శాస్త్రములందును మంత్రనిక్షేపమందును కల పాండిత్యమేః కాక యోగా నుభవముకూడా ప్రత్యక్షముచేసే గ్రంథరాజమే అనదగినది. "అనాహత చక్రము సప్తకమలములందును మధ్యస్థానము నందుండుటవలన కుండ లినీశక్తి ప్రబోధమునకు విశేషోపయోగముగ నున్నది. హృదయస్థానము జీవాత్మస్థానము. జీవాత్మప్రాణశక్తులను, భూలోక విషయవాసనలకు

వినియోగించునదియును, సత్యలోకారోహణమునకు వినియోగించునది యును అనాహతశక్తి నిర్ణయింపగలదు"—ఇది కారణముగా చేసికొని ఈ వ్యాసములో నాగేశ్వరులు తమబహుగ్రంథపఠన ఫలమును, యోగాను భవమునునిక్షేపించినారు. ఈ వ్యాసములో నాగేశ్వరులువిశిష్టమైనమార్గమ వలంభించినారు. అందులో ఈ క్రింది వాక్యములు యోగుల హృదయ చక్రములలో సువర్ణాక్షరములతోడను, విద్యుద్రేఖలతోడను ప్రతిష్ఠించు కోవలసినది.

"పరిమితమైన శక్తిని స్వతస్సిద్ధముగను ప్రక్షిప్తముగ నున్న యపరిమితమైన శక్తినిగ పరిణమింపజేయుట సకలయోగసాధనముల కును ప్రయోజనము...అధోముఖములును ముకుళితములును నైన శక్తి కమలస్థానము లూర్ధ్వముఖములును వికసితములును నగునప్పుడనంత మైన శక్తికి సర్వవ్యాపకత్వముగలిగి సకలాభీష్టములును సిద్ధించు చున్నవి...నాదస్వరూపమైన ఓఙ్కారము సప్తమకమల సంస్థితమైన చిచ్ఛక్తిని విశ్వవ్యాప్తమైన చిచ్ఛక్తిని నేకశ్రుతియందు మేళవించి ఆత్మ జ్ఞానమును సమకూర్చుచున్నవి....సకల యోగములకును పరమార్థ మాత్మజ్ఞానము ఆత్మజ్ఞానమునకు సకలజనులకును ప్రత్యేక యోగ ములు సాధనములుగ నున్నను సకలజనులకును సులభసాధ్యమైన రాజ యోగము సమాదరణీయముగ నున్నది. సమస్త విజ్ఞానము సందును నఖండపాండిత్యానుభవములను గలిగిన శ్రీ శంకరాచార్యులపరోక్షాను భూతియందు తెలిపిన ఆత్మజ్ఞానానుభవభావము ప్రాజ్ఞులకు సమాదరణీ యము, ఒక కాలమునందు వ్యాస, శంకరాదుల యాదరణమును బడ సిన కుండలినీయోగము వర్తమాన కాలమునం దపార్థములకును, దుర్న యములకును పాలైనది. ధీమంతు లీ యోగరహస్యములను, గుణదో షములను వర్తమాన పరిస్థితుల కనురూపముగ పరిశీలించి నిర్ణయించుట విజ్ఞాన సంరక్షణ వ్యాపనములకు ప్రయోజనకరము."

పూర్ణ పురుషోత్తములుగా నేను పేర్కొన్న వ్యాస, శంకరుల అడుగుజాడలలో నడక సాధించిన నేటి పూర్ణ పురుషునకే అట్టి మాటలు రాగలవు.

నాగేశ్వరులకు సంగీత సాహిత్యములలో, యోగవిజ్ఞానములలో కల విస్తార విజ్ఞానానుభవములు సూచించినాను కాని, వారికి చిత్రకళ, శిల్పములందుగల విజ్ఞానానుభూతులు ప్రస్తావించిననే కాని వారి సర్వతోముఖత్వము అనుభవానికి రాదు. వారు 'అజంతా విహారములు' అని వ్రాసిన విపులవ్యాసము దానికి ప్రతీక. అది చిత్రపటములతో ముద్రించినచో అజంతా విహారములను గూర్చిన సమగ్ర గ్రంథమే కాగలదు. అది శ్రద్ధగా చదివినవారికి అజంతా స్వరూపమంతా అచ్చుకట్టినట్లు అవగాహన కాగలదు. నా కెందుకు నేను, 'వాఘిరా' నవల వ్రాయుటకు అజంతాను గూర్చిన గ్రంథాలెన్నో ప్రామాణికమైనవి చదివినప్పటికీ, ఎన్నో చిత్రాలు చూచినప్పటికీ ఎక్కువగా ఉపయోగపడినది నాగేశ్వరుల వ్యాసమే. ఆ గుహలలో 1, 2 16, 17 గుహలు ఉత్తమోత్తమమయినవని తద్విదుల సిద్ధాంతము. ఆ వ్యాసములో ఆ నాలుగు గుహలలో ఎక్కడెక్కడ ఏ ఏ చిత్రాలు ఉన్నవో, సమగ్రంగా వర్ణించినారు. ఆ వ్యాసము విచక్షణకు, సమగ్రతకు, చిత్రములకు యథోచితమైన విలువ గ్రహించినందుకు దృష్టాంతముగా ఉన్నది. ఆ గుహాలయములలోని చిత్రము లన్నిటిలో 1 వ గుహలో వెనుకను, ద్వారానికి ఎదుటిభాగానికి ఎడమప్రక్క నున్న పద్మపాణి బోధిసత్త్వుని చిత్రము వ్రాసిన చిత్రకారుడు అజంతా చిత్రకారులలో అగ్రగణ్యుడని చిత్రకళావిదుల సిద్ధాంతము, దాని సమగ్ర వైభవము పటములో ప్రదర్శించేందుకు స్థలము చాలక ప్రధానభాగము మాత్రము త్రివర్ణ చిత్రముగా ప్రదర్శించి దాని అతిశయము వ్యాసములో యథోచిత వైభవముతో వర్ణించినారు.

"బోధిసత్త్వుడు—పద్మపాణి: (12 వ చిత్రము) అజంతా కుడ్య చిత్రములందు బోధిసత్త్వున్ని చిత్రము భారతీయ చిత్రకళయందుత్తమ చిత్రముగ నున్నది...మానవ పరిణామమందు బుద్ధావతారము చరమావతారము....బోధిసత్త్వ స్వరూపమునను పూర్ణయోగమును అజంతా చిత్రము దివ్యముగను పరిస్ఫుటము చేయుచున్నది. బోధిసత్త్వుని దివ్య సుందరచిత్రము ప్రేక్షకుల చిత్తవృత్తిని లగ్నము చేయుచున్నది. సుందరాకారము, సాధువిలాసము, సువర్ణచ్ఛాయ హృదయమును భక్తిభరితము చేయుచున్నవి...సురచిత కృష్ణ కపిల చిత్రరేఖావిన్యాసము

చిత్రమునకు జీవకళను గల్పించినవి. చిత్రకల్పనయందు ప్రధాన చిత్ర ప్రాశస్త్యమే కాక యితర పాత్రలను, రంగమును, పరిసరములను, చిత్రించుటయందు చిత్రకారుడు చూపిన బుద్ధివైభవము, కళాభినివేశము గోచరంబగుచున్నవి. శృంగారవిలాసశోభితమైన నీలరాణి మనోహరముగ దేహ ప్రమాణాకృతిని చిత్రింపబడినది ... చిత్రకల్పన యంతయును శృంగార ప్రేమమయమై ప్రకృతియందలి ఆనందస్వరూపములను మనోహరముగను ప్రత్యక్షముచేయుచున్నది. సుందరాంగులు వింజామర లను వీచుచున్నారు...ఒక దిశయందు మయూర మిథునము ప్రేమా మృతమును గ్రోలుచున్నది. ఒక పొదరింటియందు దంపతులు ప్రేమా నందము ననుభవించుచున్నారు...కోతులు గంతులు వేయుచున్నవి.... ఉద్యానవన మశోకవృక్షములతోను, పోకచెట్లతోను, లతాగుల్మములతోను, శృంగారవిలాసమయమై యానందమును గలుగజేయుచున్నది. శృంగారరస పరవశమైన ప్రకృతి పరిస్థితులందు బోధిసత్త్వుడు నిశ్చలుడై, నిర్వికల్పుడై, ధ్యానయోగియై చరాచర ప్రపంచమునంతను ప్రేమ శ్రుతియందు మేళవించి బ్రహ్మానందమూర్తియై వెలయు చున్నాడు...."

ఏమిది? నాగేశ్వరులు బోధిసత్త్వుని ఆస్థానకవియై ఆయన యోగ వైభవమును సత్యవాక్కులతో స్తోత్రము చేయుచున్నారా? ఆ విచిత్ర వైభవము కన్నులార చూచినవారికే శ్రీ నాగేశ్వరుల వర్ణనసంపద అవగతము కాగలదు. ఆ చిత్రవర్ణనములో నాగేశ్వరుల రసహృదయము ప్రత్యక్షమగుచున్నది. నాగేశ్వరులకు చిత్రకళయందు ఎంత విచక్షణ, అభిరుచీ ఉన్నవో ఈ వ్యాసము చాటుచున్నది.

# 14
## భగవద్గీతావ్యాఖ్య

శ్రీ నాగేశ్వరులు ప్రత్యేకముగా రచించిన గ్రంథము వారి భగవద్గీతావ్యాఖ్య. దానికి వారు వ్రాయనారంభించిన ఉపోద్ఘాతము పూర్తి కాకుండానే వారు పరమపదించిరి. అందువల్ల ఒక విధముగా అది అసంపూర్ణమే.

వైదిక మతములో వేదములు కర్మ ప్రతిపాదకమైనవి. వేదాంతము లనబడే ఉపనిషత్తులు జ్ఞానప్రతిపాదకమైనవి. బాదరాయణ సూత్రములు ఉపనిషత్తుల యదార్థ ప్రతిపాదన సూత్రించినగ్రంథము. స్వకర్మయైన యుద్ధమునకు విముఖుడై అస్త్రశస్త్రము లుడిగి సన్యసింపదలచిన అర్జునుని స్వవిధియైన యుద్ధకర్మయందు ఉచితమార్గమున ప్రవృత్తుని చేయుటకై ఉపదేశింపబడిన ధర్మగ్రంథము గీత. అదిజ్ఞానవిరుద్ధము లేకుండ కర్మాచరణము చేయువిధానము నుద్దేశించే ఉత్తమ గ్రంథము. అందులోని 18 అధ్యాయాలూ 18 యోగాలుగా ఉన్నవి. అర్జున విషాదయోగముతో ఆరంభించి మోక్షసన్యాసయోగముతో అంతమవుచున్నది. అది సంభాషణరూపముగా ఉన్నది. కనుక ఒకే పదము సందర్భానుసారముగా అనేకార్థాలలో ప్రయోగించబడినది. అందువల్ల శ్రోతయైన అర్జునుడే 'కృష్ణా' వ్యామిశ్రమైన వాక్యముతో నన్ను భ్రమ పెట్టుతున్నట్లున్నావు. కాబట్టి నాకు శ్రేయస్సు కలిగించే మార్గమేదో ఆ ఒక్కటే నాకు నిశ్చయించి చెప్పవలసినది'అని కృష్ణభగవానుణ్ణి ప్రార్థించినాడు. సమగ్రముగా ఏకవాక్యత కూర్చి సమన్వయము చేయగలవారికే తప్ప అది కొరుకుడు పడని జటిలమైన గ్రంథము. పైకి ఎంత తేలికగా కనపడుతుందో, అంత కష్టసాధ్యమైన గ్రంథము. ఏదో ఒక భాగము తీసికొంటే ఎవరు ఏమి చెప్పదలచుకున్నా, అనుకూలముగా ఉన్నట్లే కనబడుతుంది. సాంఖ్యము, యోగము, భక్తి, సన్యాసము, విజ్ఞానము, అక్షరోపాసనము. జ్ఞానము, కర్మ — ఏది ప్రధానమని చెప్పదలచినా అనుకూలమైనట్లే కనబడుతుంది. కాని చిక్కువచ్చేది గ్రంథమంతటినీ ఆ దృష్టితో సమన్వయము చేయడములోనే. అక్కడే భ్రాంతులూ, వాద ప్రతివాదాలూ సంభవిస్తవి. సమన్వయ గ్రంథాలలో ఉత్తమోత్తమమైన గ్రంథము భగవద్గీత.

ఆధునికకాలములో భగవద్గీతను ఎక్కువ ప్రచారములోనికి తెచ్చిన వారిలో వివేకానందులు అగ్రగణ్యులని తోస్తున్నది. శ్రీ నాగేశ్వరుల పూర్ణ యౌవనములో వివేకానందుల ఉపన్యాసాలు ఉత్సాహవంతులైన యువకులను ప్రభావితము చేసినవి. దివ్యజ్ఞాన సమాజమువారు, బాలగంగాధర తిలకు భగవద్గీతను ఎక్కువగా ప్రచారము చేసినారు. నాగేశ్వరులు ఆంధ్ర

పత్రిక స్థాపించినప్పటినుండి భగవద్గీతయం దభిమానము చూపుతూ వచ్చారు. 1910 వ సంవత్సరములో ప్రచురించిన మొదటి సంవత్సరాది సంచికలో 4, 5, వాక్యములివి: "విజయాఖ్య సార్థకనామధారియైన యర్జునుడు సైతము యుద్ధారంభాంతములందు విషాదాభిమానములు గలిగినవి. కాని శ్రీ కృష్ణుని హితోపదేశమువలన నీ విషాదాభిమాన భావనలు దొలగినవి." అప్పటి కెంతకాలంనుండియో అధ్యయనము చేసినదికాక మరల మరల మననముచేసి కొత్త కొత్త వ్యాఖ్యానములు చదివి పండిన అనుభవముతో నాగేశ్వరులు భగవద్గీతా వ్యాఖ్యానమును 1931 లో తీరికగా జైలులో వ్రాసిరి.

నాగేశ్వరులు వ్రాయ నారంభించిన ఉపోద్ఘాతములో వారు వ్రాయదలచినదానికి ప్రాతిపదిక కనబడుచునే ఉన్నది. గీతకు త్రిమత స్థాపకులేగాక ఎందరో యోగులు, భోగులు మొదలగువారు వ్యాఖ్యానములు రచించిరనియు, ఎంద రెంత వ్రాసినను ఉపనిషత్తులలో చెప్పినట్లు భగవద్విషయములు 'పూర్ణమే' శేషించి యుండుననియు చమత్కరించిరి.

ఎంద రెన్ని గీతావ్యాఖ్యానములు వ్రాసినను, నాగేశ్వరుల వ్యాఖ్యానము 1938 నుండి 1962 వరకు 7 మారులు ముద్రింపబడిన దానిని బట్టి చూచినచో, అది మొదటి నుండియు ప్రజాదరణము పొందినట్లు స్పష్టపడు చున్నది. ప్రతి శ్లోకమునకును టీకాతాత్పర్యములేకాక సంక్షేపముగా విశేష విషయములు వివరింపబడినవి. ఇందులో పూర్వ వ్యాఖ్యాతలు భేదించు విధము సూత్రప్రాయముగా సూచింపబడినవి. ఆ వాక్య విన్యాసములోననే వేరుగా ఖండనము లేకుండగా నాగేశ్వరులు తమ యభిప్రాయ విశిష్టతను సూచింతురు. వివాదభూయిష్ఠము చేయక ఇతరాచార్యుల మతములు సాధారణ పాఠకులకు అందుబాటులో నుండునట్లుగా సూచించుచు దీని రచన సాగినది. దీనిలో ప్రతి యధ్యాయమునకు ఆదియందు రాబోవు అధ్యాయమునకు వివరణ ముండును, అంతమందు దానిని సమీక్షచేసి రాబోవు అధ్యాయ విషయమును అవతరింప జేయుదురు. అధ్యాయాద్యంతములందు నాగేశ్వరులు చేసిన వివరణ సమీక్షలు ఈ వాఖ్యానములోని విశిష్టత. ఎక్కడను వాదోప వాదము లుండవు.

ఆధునికులలో లోకమాన్యుడు కర్మ యోగపరముగను. మహాత్ముడు అనాసక్తి యోగపరముగను వ్యాఖ్యానించిరని తెలుపుచు, తాము దానిని పూర్ణ యోగశాస్త్రముగా సమన్వయ మొనర్చిరి. మానవాభ్యుదయమున కును, విశ్వ శ్రేయస్సునకును కర్మ సంస్కారమును జ్ఞానసంస్కారమును సమన్వయము చేయుట తత్త్వములకు, మతములకు, శాస్త్రములకు, కళలకు, పరిశ్రమలకు, వృత్తులకు ధర్మములకు, రాజ్యాంగములకును పరమార్థము అని వారి భావన. "భగవద్గీతలు ప్రత్యేక మతస్థుల కేర్పడిన మతగ్రంథము గాకను మానవాభ్యుదయమున కనుకూలమైన పూర్ణయోగ శాస్త్రము" అనిరి.

"సుకృతులైన భగవద్భక్తులు నాల్గువిధములుగ నున్నారు. 1. దాన ధర్మపరాయణులై ఆర్తత్రాణపరాయణులు. 2. మానవాభ్యుదయమును సమకూర్చెడి శాస్త్రజ్ఞులు. 3. యంత్రాద్యుపకరణ నిర్మాతలు. 4. తత్త్వ జ్ఞులు." ఈ పరమార్థమే భగవద్గీత యందు 'చతుర్విధా భజంతే మామ్' ఇత్యాది శ్లోకములో తెలుపబడినది." క్రైస్తవమతమునందును, మహ్మదీయ మునందును భగవదారాధనకు మొదటి మూడు విధములును ప్రధాన ములు. హిందూమత పరిణామమునందు నాల్గవవిధమైన జ్ఞానము ప్రధా నము....సర్వమును బ్రహ్మమేయను పూర్ణ యోగజ్ఞానమును భగవద్గీత సుగమము చేయుచున్నది .... శోకమోహపరవశతను కర్మ సన్యాసము చేయుట కన్నను కర్మయోగమును పూనుటయే శ్రేయస్కరము. కర్మలను యజ్ఞార్థము ఫలాపేక్షలేకను చేయుటయే కర్మ యోగము."

పూర్ణపురుషులైన నాగేశ్వరులు భగవద్గీతను పూర్ణ యోగపరముగానే సమన్వయించిరి!

# 15

## మహాపురుషుడు — విశ్వదాత

శ్రీ నాగేశ్వరులు మహాపురుషత్వము కూడా సాధించిన అపూర్వ పూర్ణ పురుషులన్నాము కదా, వారు మహాపురుషులైనది ఎందువల్ల అని ప్రశ్నించ వచ్చు కాని ఉత్తరము సులభంగానే ఇయ్యవచ్చు, వారి

దాతృత్వంవల్ల అని. వారి దాతృత్వాన్ని గూర్చి వారితో తక్కువపరిచయ మున్నవారి మాటలు ముందు ప్రస్తావించి, ఎక్కువ సాహచర్య మున్న వారిని చివరకు ఉదహరిస్తాను.

శ్రీ మహాదేవదేశాయి హరిజన పత్రికలో 'ఆయన కుడిచేతితోనేమి యిచ్చెనో ఎడమ చేతికి తెలియకుండా ఎన్నో గుప్తదానములు చేసిన విశ్వదాత' అని వ్రాసిరి.

శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు నాగేశ్వరులు చేసినంత సర్వతో ముఖసేవ చేసినవారు ఆధునికాంధ్రులలో లేరనుచు, తెనుగు కర్ణుడని వర్ణించి, వారు చేసిన జ్ఞానదానము ప్రస్తావించి, 'దధీచి దేవతల మేలుకొరకు తన శరీర మిచ్చె. నాగేశ్వరరావు తెలుగువారి మేలుకొరకు తననొసంగె' ననిరి.

శ్రీ పెద్దిభట్ల వీరయ్యగారు 'ఈయన చొక్కాకు జేబులు పెక్కు' అని కనపడని జేబుల మహత్త్వము, ఉపయోగము వర్ణించిరి.

వారికి చిన్ననాటి నుండి మిత్రులైన శ్రీ కొండా వెంకటప్పయ్య గారు "గుప్తదానాలు చేయుటకన్న శాశ్వతమైన దానము స్థిరసంస్థకు దేనికైనా చేయరాదా అని నేనొకసారి సూచింపగా, 'బాగానేవుంది గాని ఇతరుల కష్టంచూచి ఓర్వలేను. ఇట్లాగే ఇస్తూవుంటాను. అంతకుమించి నేనేమీ చేయలేనని చెప్పిరి" అని ఆర్తి చెందినవారికి సహాయంచేసి దుఃఖము బాపుటే మోక్ష సాధనమని పంతులుగారు నమ్మినారనిరి.

వారితో ముప్పదేండ్ల పరిచయముండి 13 ఏండ్లు ఆంధ్రపత్రికా కార్యాలయంలో పనిచేసి, తర్వాత కరాచీలో సింధు అబ్జర్వరు పత్రికాధిపులైన శ్రీ కోటంరాజు పున్నయ్యగారు ఇట్లా వ్రాశారు: "తమ జీవితము నంతను పరోపకారము నిమిత్తమే వినియోగించిరి. భగవంతుని అనుగ్రహమువలన తనకు లభించిన అతులైశ్వర్యమునకు తాను ధర్మకర్తనే కాని స్వామినిగానను నట్టి నమ్మకముతో పంతులుగారు తమ విధిని ప్రశంసనీయముగా నెరవేర్చిరి.... ఆంధ్రదేశములో దారిద్ర్యాంధకారములో మునిగియున్న అనేక గృహములలో పంతులుగారు దీపారాధన గావించిరి."

కృష్ణా పత్రికాధిపతులు, "నాగేశ్వరరావుగారి ఉనికి లేనిది దేశములో నే యుద్యమమును దలయెత్తలేదు, ఏ సంస్థయు పెరుగలేదు, ఏ ప్రయత్నమును బలపడలేదు అన్నిటికిని వెనుక నుండియే దేనికిని కట్టుపడక తన విశ్వదాతృత్వమును స్థిర పరచుకొనినాడు'' అనిరి.

వారితో బహుకాల సాహచర్యమున్న మిత్రులు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారు ఎన్నో అనుభవాలు వ్రాకుచ్చినారు. అందులో చేయి చాపిన ముసలమ్మకు మంచి మామిడిపండ్లు కొనియిచ్చినది, ఒక సారి బీదల కన్నదానము చేయడములో పప్పుకూరలతోనే కాక గంగాళాల క్షీరాన్నముతో రాజబంధువులకువలె విందుచేసి, తినేవారిని చూచి పంతులుగారు ఆనందపడ్డది చిత్రించినది రోమహర్షము కలిగిస్తుంది. వారిచ్చిన లెక్కనుబట్టి శారదానికేతనాని కొక్కదానికే నాగేశ్వరులు రు 5,000/-లకు తక్కువలేకుండా సహాయము చేసి ఉండవలె.

రాజకీయ బాధితులకు కాంగ్రెసు సేవకులకు, వారి కుటుంబాల పోషణకు, బిడ్డల చదువులకు, దీర్ఘరోగుల మందులకూ, పథ్యాలకు ఎంతెంత ద్రవ్యసహాయము చేసేవారో ఉగ్గడిస్తూ పెండ్లిండ్లకూ, ఉపనయనాలకూ వారెంతో సహాయము చేసేవారన్నారు. అందులో ఉపనయనాలకు ఎక్కువ అవసరము. "వడక ఈడువచ్చిన పిల్లలు జంధ్యం లేకుండా తిరుగుతూ వుంటే అసహ్యంగా ఉంటుంది" అని నాగేశ్వరులన్నందుకు శ్రీ ఉన్నవ వారికే ఆశ్చర్యమైనదట. నాగేశ్వరులకు ద్విజత్వమందు ఎంత ప్రీతి ఉండేదో ఉన్నవవారికే తెలియలేదన్నమాట!

తాము 'ఈ ఇచ్చే చిన్నదానాలన్నీ లెక్కవేస్తే లక్షలవుతవి. పెద్ద దానాలయితే స్థిరంగా ఉంటవి' అని సూచించగా, నాగేశ్వరు లిచ్చిన జవాబు స్మరింపదగినది: 'అదేమోగాని పెద్దదానాలు చేయ వద్దనిగాదు. లక్షల పెద్దదానాలకంటే ఈ చిన్నవే బీదల కందుతవి, ఎక్కువ బాధా నివారణాలు కూడాను. నాకిదే మనస్సంతోషము. ఎదుట ఎంతమందో బాధపడుతూ ఉంటే, అవి నివారించక, దేనికో లక్షలు ఇయ్యడం నాకంత నచ్చలేదు.' ఇందులో నాగేశ్వరుల అమృతాంతరంగము ప్రత్యక్షమవుతుంది.

'న కంచన వసతౌ ప్రత్యాచక్షీత తద్వ్రతమ్. తస్మాద్యయా కయా చ విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్' అని తైత్తిరీయ వచనము లును, 'జరయు మృతియు లేని జనునట్లు ప్రాజ్ఞుండు, ధనము, విద్య గూర్పదలపవలయు, ధర్మ మాచరింపదగు మృత్యుచే దలపట్టి యీడ్వ బడినవాడువోలె' అని భారత నిర్దేశమును, 'ఉదార చరితానాంతు వసు ధైవ కుటుంబకమ్' అని రామచంద్రుడు మహర్షులకు బోధించినదియు, "త్యాగాయ సంభృతార్థానామ్" అని రఘువంశజులను గూర్చి కాళిదాసు వర్ణించినదియు ఆదర్శముగా పెట్టుకుని జీవయాత్ర దానయాత్రగా గడి పిన పుణ్యపురుషుడు నాగేశ్వరాయలని ఉన్నవవారు బహువిధాలుగా ప్రపంచించినారు. పూర్వము రాయని భాస్కరుడు గుంట ఓనమాలు దిద్దేప్పుడు లా కేత్వ మిచ్చి దాకు కొమ్ము ఇచ్చేవాడు కాదట. కాని నాగేశ్వరుల విషయములో అడగడమేలేదు, పెట్టడమే పని. ఏదయినా సరే పెట్టడమే వారి కానందము—ఈవిధంగా నాగేశ్వరుల దాతృత్వము ప్రసరించినది, అన్నారు.

ఆంధ్రపత్రిక బొంబాయినుండి వారపత్రికగా ప్రారంభించి నప్పుడు, దినపత్రికగా మదరాసులో వెలసిన తర్వాతను సంపాదక వర్గములో ఉండి శ్రీ నాగేశ్వరులను బాగా ఎరిగియున్న శ్రీ అవటపల్లి నారాయణరావు వ్రాసినంత కంటె బాగా శ్రీ నాగేశ్వరుల దాతృత్వాన్ని ప్రత్యక్షము చేసినవారు లేరు. వారి మాటలే కొన్ని ఈ క్రింద ఉదా హరిస్తున్నాను:

"కొంచెం లోతుగా ఆలోచించిచూచినట్లయితే వారి సేవా విధానం ఒక గీత గీచి, దీన్ని 'దాటిపోగూడదు' అనే ప్రసక్తే కనిపించదు.... ఆంధ్ర గ్రంథమాల అనే పేరుతో, డబ్బుపెట్టి స్వయంగా అచ్చువేయిం చుకోశక్తిలేని ఎందరో కవుల, ఎందరో గాయకుల, ఎందరో పండితుల, ఎందరో విద్యాధికుల గ్రంథాలను వారు ఉచితంగా అచ్చువేయించి యిచ్చినారు....అసంపూర్తిగా వదిలి పెట్టిన ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము యొక్క ప్రకటనభారాన్ని మీద వేసుకున్నారు. సుమారు మూడు సంవత్సరాలకు పైగా కృషిచేసి ఆంధ్ర సారస్వతంయొక్క విషయసూచి కను ప్రకటించి తరతరాల పండితులకు, విద్యార్థులకు మహోపకారం

చేశారు. ఆంధ్రపత్రిక, భారతి, విజ్ఞానసర్వస్వము, ఆంధ్ర గ్రంథమాల, ఆంధ్ర వాఙ్మయ సూచిక—వీటిమూలంగా వారు చేసిన అఖండమయిన సేవను ఒక ఎత్తుగాను, దాతలుగా, అన్నదాతలుగా చేసిన సేవను ఇంకొక ఎత్తుగాను భావించవలసి వుంటుంది.

"పంతులుగారి దాతృత్వరూపాన్ని గ్రహించాలంటే బెజవాడలో దుర్గా విలాసంలో ప్రొద్దునపూట, చెన్నపట్టణంలో ఆంధ్రపత్రికా కార్యాలయంలో సాయంత్రంపూట పంతులుగారి పద్ద నిలుచుంటే సరి! శాలువలు కప్పుకొని కొందరు, ఖద్దరు టోపీలు పెట్టుకొని కొందరు, లాగులు వేసుకొని కొందరు, పుస్తకాలు చేతపట్టుకొని కొందరు, కన్నీరు కారుస్తూ కొందరును, యిండ్లుకట్టుకొంటున్నామనీ, పెండ్లిచేసుకుంటున్నామనీ, పుస్తకాలుఅచ్చు వేసేదానికి డబ్బు లేదనీ, శరణాలయాలకనీ, విద్యాలయాలకనీ, సంతర్పణలకనీ, విదేశప్రయాణాలకనీ, పుణ్యక్షేత్రాలకనీ, స్కూలుజీతాల కనీ—ఈ విధంగా మరియెందరోనున్నూ, లోకంలో యెన్ని తరగతుల అవసరాలు, కష్టాలు, దుఃఖాలు, సుఖాలువున్నవో అన్నితరగతుల మనుష్యులూ కనబడేవారు. అప్పుడు పంతులుగారిఖజానాలో ఉండే నిల్వనుబట్టి పదులు, వందలు పట్టుకొనిపోనివారు లేరు. ఇవ్వడం అంటేను, భోజనం పెట్టడం అంటేను పంతులు గారికి ఒకవిధమైన సంతోషం ....తమ ప్రియ పుత్రిక శ్రీమతి కామాక్షమ్మగారి వివాహ సందర్భంలో సంచిలో చేయి పెట్టి చేతికి వచ్చినన్ని రూపాయలు పండితుల కిచ్చివేయగలిగారు"....

వారు చెప్పిన అనుభవంలో నాగేశ్వరులు ఒకఊరు వెళ్ళినప్పుడూ ఒక కుటుంబీకుడు భార్యాబిడ్డలతో కళ్ళనీళ్ళతో కాళ్ళమీద పడి బ్రతుకు తెరువు చూపించమని వేడుకోగా నాగేశ్వరులు చేసిన సహాయమూ, పరీక్ష రుసుముకోసం వచ్చిన విద్యార్థికి అడిగినదాని కంటె ఎక్కువ ఇచ్చి పంపడమూ స్మరింపదగినవే. కాని సాయంకాలం పనిచేసి అలసి ఇంటికి వెళ్ళ బోతున్న నాగేశ్వరులను ఖద్దరు టోపీమనిషి ఎదురుగా కుర్చీలో కూర్చొబడి నిలువవేసి, తర్వాత రమ్మని రెండుసార్లు చెప్పినా వినిపించు కోక ధార్ష్ఠికంగా, "ఎవరు వస్తారయ్యా మళ్ళా? నాకు యేమి పని లేదనుకొన్నావా? ఈ భాగ్యానికి తిప్పడంకూడా ఎందుకు? ఆ ఇచ్చేది

యేదో యిప్పుడే యివ్వరాదా ? పోతాను" అనీ, మళ్ళా "మీరు నాకో సమే కష్టపడు తున్నారా ? ఈమాత్రానికి యిన్నిసార్లు తిప్పాలా యేమిటి ? లేదని చెప్పరాదా పోతాను" అన్న మనిషికి పంతులుగారు సొంతఖర్చుకని తీసుకొనిపోతున్న డబ్బులోనుంచి కొంత యిచ్చి "క్షమించండి !" అన్న ఉదంతం తలచుకొని ఆలోచించినకొద్దీ అద్భుత మనిపిస్తుంది. ఆ ధాష్టీకం ముష్టి వెనక ఉన్న ఆర్తి నాగేశ్వరుల వెన్న వంటి హృదయాన్ని ద్రవింపజేసివుండవలె ! ఎవరికైనా ఇతరులకు కోపము వచ్చేది. ఇంకా కొన్ని అవటపల్లి వారి మాటలు:

"ఇక వారి అన్నదానవిషయంలోను, మిత్రుల ఆదరణ విషయం లోను ఎంత చెప్పినప్పటికిన్నీ తృప్తి తీరదు. బెజవాడలోని శ్రీ దుర్గా విలాసం ఎప్పుడూ పచ్చతోరణాలు కలిగి పెండ్లిండ్లు, వడుగులు, వేడు కలు మొదలయిన వాటి వాద్యాలతో మ్రోగుతూనే ఉండేది....రాష్ట్రీయ సభలు వచ్చినా, హరిజన సభలు వచ్చినా, యే సభలు వచ్చినా, వందలు వచ్చినా, వేలు వచ్చినా భోజనపు ఖర్చు ఎప్పుడూ పంతులుగారి మీదనే పడడం రివాజు అయిపోయింది....ఇక చెన్నపట్టణంలో పంతులుగారి శ్రీబాగ్ స్త్రీ పురుషుల కందరకూ అడ్డంలేని అతిథ్యక్షేత్రంగా వుంది.... జెయిలుకు పోయినా, తమకు సహజమయిన విందులు, సంతర్పణలు బీదలకు సహాయం తప్పలేదు.....

"ఇట్లా ఆంధ్రోద్యమం. హరిజనోద్యమం, భాండాగారోద్యమం, కృత్తివెన్ను నున్నంపాడు దేవాలయాలు, శ్రీశైల సోపానాలు, భద్రా చల విద్యుద్దీపాలు, కాంగ్రెసు మొదలగువాటి కెన్నిటికో అలవికాని ఖర్చుచేస్తూ వచ్చారు....

"అధునికాంధ్రంలో నాగేశ్వరరావు పంతులుగారు చేసినంత సర్వ తోముఖమైన సేవలు ఎవరూ చేసినట్లు తోచదు. స్వయం కృషిచేతనే స్వసహాయంవల్లనే ద్రవ్యాన్ని ఆర్జించారు. ప్రజోపయోగం నిమిత్తమై ఆ ద్రవ్యాన్ని ధారాళంగా ఇచ్చివేశారు." ఈ వాక్యాలన్నీ అక్షరశః సత్య మైనవి !

పైవారల కున్నంత పరిచయము నాగేశ్వరులతో మహాత్ముని కుండిఉండదు. ఐనా మహాత్ముడు గనుక స్వల్పపరిచయం తోనే స్వరూపావగాహన చేసుకోగల శక్తి ఉన్నది. మహాత్ముడు స్వయంగా నాగేశ్వరులను ప్రత్యేకంగా "విశ్వదాత" అని పేర్కొనడంకంటే నాగేశ్వరుల దాతృత్వ మహాపురుషత్వానికి వేరే తార్కాణం అనవసరము!

# 16

## జాతకాదులు

తపస్సంపన్నులు జ్యోతిశ్శాస్త్రంలో అనుభవ మున్నవారూ, వాక్శుద్ధి కలవారూ ఐ నాకు పూజ్య మిత్రులూ ఐన శ్రీ త్రిపురారిభట్ల వీరరాఘవ స్వామికి ఈ మధ్య శ్రీ నాగేశ్వరుల జాతక చక్రమిచ్చి, ఎవరితో చెప్పకుండా, స్థూలంగా గుణగణాలూ ఫలితాలూ చెప్పమని కోరగా, వారన్న మాటలు సంగ్రహంగా ఇవి :

1. సప్తమ రాజ్యాధిపతి అయిన బుధుడు నీచను పడినా, ఆ స్థానానికి ఉచ్చనాథుడైన శుక్రుడు చంద్రునితోసహా చంద్రలగ్న కేంద్ర మందుండుటచేత రాజతుల్యుడు మహాధార్మికుడూ ఈ జాతకుడు!

"నీచస్థితో జన్మని యో గ్రహః స్యాత్
తద్రాశినాథోపి తదుచ్చనాథః
సచంద్రలగ్నా ద్యది కేంద్రవర్తీ
రాజా భవేత్ ధార్మిక చక్రవర్తీ."

2. ధర్మస్థానాధిపతి ఐన రవి స్వోచ్చలో ఉన్నందున ధర్మాచరణ నిష్ఠ కలవాడవుతాడు!

3. షష్ఠాష్టమాధిపతులైన శుక్ర చంద్రులు ఆరూఢలగ్నమునకు ద్వాదశమం దుండుటచేతను, వ్యయాధిపతియైన కుజుడు నీచనుపడి అష్టమ మందుండుటచేతను, ఈ జాతకునకు విపరీతమైన నీచభంగ రాజయోగము పట్టినది.

4. లాభాధిపతియైన శుక్రుడు చతుర్థమందు ఉచ్చలో ఉన్నందున నిరంతర దైవభక్తి కలవాడు.

5. ద్వితీయాధిపతియైన శని ద్వాదశములో ఉన్నందున సత్య నిష్ఠ, దాతృత్వము, తత్త్వచింతనము, వైరాగ్యము కలవాడు.

6. ఈ జాతకుడు ధనుర్లగ్న జాతకుడు. ఆ లగ్న జాతకులకు సాధారణమైన గుణాలు ఉంటవి. పూర్వాచార పరాయణత, వ్యవహార దక్షత, బాహ్యాడంబరమం దనిచ్ఛ, దైవభక్తి, వినయము, సౌశీల్యము, ముఖ్యముగా స్త్రీల విషయములో ఆత్మనిగ్రహమూ ఉంటవి.

7. షష్ఠాధిపతి ఐన శుక్రుడు చతుర్థమందున్నందున ఔదార్యము, స్థానభ్రంశము, కారాగృహప్రాప్తి కలుగుతవి.

9. జన్మకాలానికి, శని మహాదశాశేషము సంవత్సరానికి లోపు, బుధకేతు మహాదశలు - అన్నీకలసి 25 ఏళ్లవరకూ జీవితము అతి సామాన్యము. శుక్రమహాదశ మధ్యలో రాజయోగ మారంభించి శుక్ర దశా శేషమూ రవి చంద్ర కుజ మహాదశలు-మొత్తము 33 సంవత్సరాలు అఖండంగా యోగిస్తుంది. ఆ తర్వాత రాహుమహాదశలో క్షీణదశ ప్రారంభిస్తుంది.

ఇన్ని విన్న తర్వాత ఈ జాతకునికి మోక్షమున్నదా అని ప్రశ్నించాను. ఆయన వెంటనే, "లేదు, లేదు. దేవపూజాకారకత్వము కల శుక్రుడు ఉచ్చలో ఉన్నందున పుణ్యలోకప్రాప్తి, ఊర్ధ్వ లోకప్రాప్తి మాత్రమే" అనిఖచ్చితంగా చెప్పివేసినారు.

అది వినగానే నేనొక నిట్టూర్పువిడిచినాను. పుణ్యాత్ములైన వాళ్ళు మోక్షము పొంది ఊరుకుంటే ఈలోకాన్ని ఉద్ధరించే వాళ్ళెవరు? శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణగారి వ్యాసములో నాగేశ్వరులది ప్రవృత్తి మార్గమని ఉద్ఘాటించారు.

"నీకు నిర్వాణసిద్ధికి అర్హత కలిగింది నిర్వాణములో ప్రవేశించ వలసినది!" అని ఇంద్రాది దేవతలు చెప్పగా, "ఈ సృష్టిలో ఉన్న

ప్రాణికోటులన్నీ నిర్వాణము పొందేదాకా, నిర్వాణములో ప్రవేశించి నిర్వాణసుఖ మనుభవించను" అని భీష్మించి ఉన్న దేవతా మూర్తిని బౌద్ధులు అవలోకితేశ్వరుడని భక్తిభావముతో అర్చిస్తారు. విశ్వకా[illegible]ణ్యానికి ఆ భావన అసమానమైన ప్రతీక. వైదిక మతభావనలో బ్రహ్మలోకములో అధికారిక పురుషులు కొందరుంటారనీ, వారు లోక సంగ్రహార్థము మధ్య మధ్య ఈలోకములో అవతరించి తలపెట్టిన కార్యము నెరవేర్చి తిరిగి బ్రహ్మలోకము చేరుకుంటారనీ, విశ్వాస మున్నది. అవలోకితేశ్వర భావన ఆదర్శవంతమైనదే ఐనా, ఆయన ఈ లోకానికి చేసేది ఏమీలేదు. అధికారిక పురుషులు కూడా ఏదో ఒక్కసారి మన మధ్యకు వచ్చి కొత్త వెలుగు చూపి మళ్ళీ తిరిగి రారు. వారు మనకు మహోపకారమే చేసినా, ఒక్కసారే చేస్తారు.

పుణ్య పురుషులట్లా కాదు. తాము పుణ్యపాపమిశ్రమైన ఈ లోకంలో మళ్ళీ మళ్ళీ జన్మించి, తమ పుణ్యవాసనల చేత తోడి మానవు లను పుణ్యభావోన్ముఖులనుగా చేసి ఊర్ధ్వలోకాలలో విశ్రాంతి తీసికొని అమరవాసనలతో మన మధ్య మళ్ళీ పుట్టి మనతో కలసి మెలసి సంచరించి, మళ్ళీ మన పుణ్యవాసనలను ఉద్దీపింపజేస్తూ ఉంటారు. వీరు పూర్ణ పురుషులూ మహాపురుషులూ ఐనప్పుడు సర్వతోముఖముగా సమర్థముగా లోక సంగ్రహము చేయగలుగుతారు. అటువంటి పుణ్యపురు షులు శ్రీ నాగేశ్వరరావు.

ఆయన మూర్తి వలెనే ఆయన ఆదర్శములుకూడా ఉన్నతమయి నవి. ఆయన కరుణామృత పూర్ణ హృదయాన్ని భావనచేయగా మార్కం డేయ పురాణములోని విదేహరాజు కథ జ్ఞాపకము వస్తున్నది.

'రాజ్యాంతే నరకం ధ్రువమ్' కాబట్టి లాంఛనంగా విదేహరాజుకు నరకాన్ని చూపి స్వర్గానికి బయలు దేరమన్నారట దేవతలు. అవతల నారకులంతా "ఓ పుణ్యమూర్తీ, నీవల్ల మాకిక్కడ దుర్గంధము పోయి సువాసన వచ్చింది; చీకటి తొలగి కాస్త వెలుగు వచ్చింది; మాదాహమూ బాధా కొంత ఉపశమించినవి, నీ సాన్నిధ్యమువల్ల. మమ్మ్ము వదలి వెళ్ళబోకు తండ్రీ !'' అని ఘోషించారుట. అందుమీదట విదేహరాజు

"నే నిక్కడ నుంచి రాను" అని భీష్మించాడు. ఇంద్రుడు స్వయంగా వచ్చి రమ్మన్నా రానని తాను చేసిన పుణ్యఫలమంతా, బాధపడే నారకులకు ధారపోసి నరకాలన్నీ ఒక్క క్షణములో ఖాళీ చేయించినాడుట. ఆ విదేహరాజు వంటి కరుణాస్వరూపులు మనకి కాలంలో అవసరమైనవారు!

బౌద్ధము భరత భూమిలో పొడుకొన్న తర్వాత, బౌద్ధులలో బోధిసత్త్వ భావన వచ్చినది. వారు సద్గుణాలన్నీ పారము పొందే వరకూ ఒక్కొక్కటే సాధనచేస్తూ అనేక జన్మలెత్తుతూ, చివరకు అనేక కోటి సంవత్సరాలకు బుద్ధత్వము పొందుతారట. త్యాగము, అహింస, క్షమ-ఇత్యాది సద్గుణాలు జన్మ జన్మలలో సాధనచేస్తూ తోడి మానవులకు మార్గదర్శకులయ్యేవారు బోధిసత్త్వులు. ఆ జన్మల కథలే జాతక కథలు. బుద్ధభావన కంటే కూడా బోధిసత్త్వభావన లోకోపకారకమైనది. కరుణామయులైన బోధిసత్వ రూపులు ఎందరైనా మనమధ్య అవతరించవలసి ఉన్నది. శ్రీ నాగేశ్వరులు అజంతా విహారములు అనే వ్యాసములో పద్మపాణి బోధిసత్త్వుణ్ణి గూర్చి ఎంత తన్మయ భావంతో వ్రాసినారో మనము గుర్తుంచుకోవలె. "అజంతా చిత్ర రచనాకల్పనకు బోధిసత్త్వుని చిత్ర కల్పన పరిపాకముగ నున్నది" అని "మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మ తత్త్వం యువానమ్" ఇత్యాది దక్షిణామూర్తి స్తవ శ్లోకము వ్రాసి, బోధిసత్త్వ చిత్రకళా వైభవము బహు విధాల నాగేశ్వరులు వర్ణించినారు. బోధిసత్త్వ భావన నాగేశ్వరుల నెంతో ఆకర్షించినది.

ఇప్పుడీ లోకమంతా, అవినీతితో, ఐశ్వర్యమదముతో, స్వార్థపరత్వముతో, పరస్పర ద్వేషముతో, ఆత్మవినాశనోన్ముఖమై కాంతి వేగముతో పయనిస్తున్నది. విదేహరాజు వంటి కరుణామయులు, బోధిసత్త్వునివంటి ధర్మనిష్ఠులూ, ఎందరైనా ఇప్పుడు లోకము నాలుగు మూలలా అవతరించి రక్షించవలసిన అవసరమెంతయినా ఉన్నది. నాగేశ్వరులు ఆ కోవలోనివారు! అటువంటివారు భరత ఖండములో అన్ని రాష్ట్రాలలోనూ అవతరించవలె! లేకపోతే ఈ మానవజాతి మాత్రమేకాదు, ప్రాణికోటిలో ఏదీ కూడా ఎక్కువకాలము ఈ భూమిమీద మనిఉండేందుకు అవకాశము మాబోంట్లకు కనబడడంలేదు. ఈ అకాల ప్రళయము

నుంచి జీవకోటిని రక్షించేందుకు శ్రీ నాగేశ్వరులవంటి కరుణామయులు, ధర్మతత్పరులు, పూర్ణపురుషులు, మహాపురుషులు వందలు వేలుగా జన్మలెత్తవలె!

ఆంధ్రవారపత్రిక ప్రథమ సంపాదకీయములో నాగేశ్వరులిట్లు వ్రాసిరి. "ప్రజలకు విద్యాభివృద్ధియు ప్రపంచ జ్ఞానాభివృద్ధియు గావించుటయే మా ముఖ్యాభిప్రాయము."

ఆరేండ్ల తర్వాత ఆంధ్ర దినపత్రిక ప్రారంభిస్తూ మొదటి సంపాదకీయములో పై ఆదర్శాన్నే పునరుద్ఘాటిస్తూ, "నిందాస్తోత్రములను పాటింపక శక్తికొలది యుద్దేశ నిర్వహణమునకై నిర్వాహకులు పాటుపడిరి. ముందును ఇట్టి యాదర్శములను బోధించుటయే పత్రికోద్దేశము. శాఖాభేదములను,జాతిభేదములను గమనింపక మిత్రభావమును వ్యాపింపజేయుటకై ప్రయత్నించెదము. దైవానుగ్రహము సకలాభీష్టసిద్ధికి సాధనము" అని ఉద్ఘోషించిరి.

ఆరాధ్య కుటుంబములోపుట్టి తమ ఇష్టలింగమూర్తికి ప్రాణలింగ మూర్తికి 'చెరవిడిపించి' భావలింగమూర్తియందు శివత్త్వము పరినిష్ఠించిన పుణ్యమూర్తులు శ్రీ నాగేశ్వరులు! వారి సందేశము సమన్వయ తత్త్వము. వారి ప్రతిచేతయు అమృతమయము, కృపాపరిపూర్ణము. ఆంధ్రదేశాన్ని, ఆంధ్రదేశంద్వారా లోకాన్ని ఉద్ధరించి రక్షించడానికి శ్రీ నాగేశ్వరులవంటి పూర్ణపురుషులు అవతరించడానికే మిగిలిఉన్న కొలదిమంది పుణ్యాత్ములూ భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నారు!

(శ్రీ నాగేశ్వర శతజయంతి సంచిక ఆంధ్రపత్రిక - 1967 - 68)

# స్వర్గీయ శ్రీ శివలెంక శంభుప్రసాద్ – సాహిత్య వికాసానికి చేసిన సేవ

'సాహిత్యం రాజకీయాలకు ఆయుధం కావాలన్న వాదం ఒకటి ఇటీవల ఇటీవల మరీ ప్రచలితం అవుతూ వస్తున్నది. సాహిత్యానికి మరణం అన్నది ఇంత కంటె వేరే ఉండదు. ఎందుచేత ననగా, ఏ రాజకీయానికి ఏ సాహిత్యం ఆయుధం కావాలి? రాజకీయం ఎప్పుడూ ఏకాకారంగా నిల్చిఉంటుందా? ఎప్పటికి అప్పుడు రాజకీయం మారుతూ ఉంటుంది. అని అంగీకరించే పక్షంలో, సాహిత్యంలో శాశ్వత సత్తాకు స్థానం ఎక్కడి నుంచి వస్తుంది.? రాజకీయం సాహిత్యాంశమే అవుతుంది కాని సాహిత్య సమస్తం కాదు. ప్రకృతిని, ప్రకృతి యొక్క వైవిధ్యాన్ని సాహిత్యపరుడు ద్రష్టయై, అనుశీలనంచేసి ఆ ప్రకృతిలోని సార్థమైన ఋతాన్ని, ధర్మాన్ని చూచి, ఆవిష్కరించ వలసి ఉంటుంది. అట్లాచేసే శక్తిగల్గిన వారే రచయితృ నామవాచ్యు లవుతున్నారు. కాని వారు విపరీతపు సిద్ధాంతాలను సాహిత్య ప్రపంచంలో ప్రవేశపెట్టి సాహిత్యాన్ని పర్యాప్తము, పరిమితము చేస్తున్నారు పరిమిత ధర్మాలకు అపరిమితమైన సాహిత్య భావమును కట్టివేయ చూడడం, కోరి బానిసత్వాన్ని కొని తెచ్చుకోవటం వంటిదే అవుతుంది.'

ఈ పరీధావి సంవత్సరాది సంచిక ప్రస్తావనలో పై వాక్యాలు చదవగానే నాకు కలిగిన ఆనందము ఇంతంత అని వర్ణింపలేను. బహు కాలము క్రిందటనే ఒక పత్రిక ప్రత్యేక సంచికకు 'వాఙ్మయంలో అక్రమ ప్రవేశము' అని వ్యాసము వ్రాసిఉంటిని. ఈ మధ్య రచయితలు రాజకీయ వాదులను 'Hands Off' అని ఎదిరించే నినాదము లేవదీయవలె నని ప్రచారము చేస్తున్న నాకు, పై వాక్యాలు ఎంతైనాధైర్యముకలిగించినవి. ఆ సంచిక సంవత్సరాదికి ఒకరోజు ముందుగానే నాకు శ్రీ శంభు

ప్రసాదుగారి నూతన సంవత్సర శుభాకాంక్షలతో వచ్చినందున, వెంటనే వారికి నా శుభాకాంక్షలు తెలియజేస్తూ ప్రస్తావన కలిగించిన ఆనందము కూడా తెలిపినాను. వారప్పుడు అస్వస్థులుగా ఉన్నట్లు నాకు తెలియదు. కొద్ది రోజులలో వారి దస్తూరితో నాకు ఉత్తరము రావలసిన దానికి బదులు ఆఫీసు నుండి వారికా ఉత్తరము చేరినదనీ, అస్వస్థులుగా ఉండి జవాబు వ్రాయలేదని తెలుప మన్నారనీ ఉత్తరము వచ్చినది. అప్పుడే నాకు వారి ఆరోగ్యము విషయము ఆదుర్దా కలిగినది. ఐనా వారెప్పుడూ శూల నొప్పితో బాధపడుతూ ఉండడము ఎరిగినందున, నయముకాక పోతుందా అని ఆశించాను. కాని అదే నాకు వారి చివరి సందేశమూ; రచయితల కందరికీ ఆ ప్రస్తావమే చివరి ఉద్బోధా అవుతవని అనుకో లేదు. రచయిత లందరూ వారి తుది సందేశము హృదయస్థము చేసు కొంటే, ఇప్పుడు దివగంతులై దివ్యదేహము ధరించి ఉన్న శ్రీ శంభు ప్రసాదుగారు తాము మనతో పాటు ఈ లోకంలో ఉండిచేసిన సాహిత్య యాత్ర సార్థకమైనదని ఆనందించి ఆంధ్ర రచయితల కందరికీ శుభా శీస్సులు అందీయగలరు.

## 2

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు 1908లో బొంబాయిలో ఆంధ్రవార పత్రిక ప్రారంభించి, తర్వాత మద్రాసు వచ్చి 1914లో దిన పత్రికగాచేసి, వారపత్రిక కూడా మధ్య మధ్య ఉద్ధరిస్తూ, 1924లో భారతిని ప్రారంభించినారు. సంవత్సరాదిసంచికలు 1910నుండివస్తున్నవి. పంతులుగారు 1938లో దివంగతులైనారు. వారు స్వయం కృషిచేత పత్రికా సంస్థలయందేకాక, రాజకీయము లందును, వ్యాపారమందును భారత దేశములో అగ్రస్థాన మలంకరించిన అసాధారణ ప్రతిభాశాలి యైన మహోన్నత పురుషులు. ఆంధ్ర పత్రికా సంస్థల నిర్వహణ భారము అప్పుడు 27సం. ల యువకుడైన శ్రీ శంభుప్రసాదు మీద పడినది. ఆ భారమే గురుతరమైనది. దానికితోడు శ్రీ పంతులుగారు విశ్వదాతలై చేసిన దానముల కేమి, సంస్థలకు అవసరమైన పెట్టుబడుల కేమి, చేసిన అనేక లక్షల ఋణభారము కూడా శ్రీ శంభుప్రసాదు మీద పడిన సంగతి

జగద్విదితము. ఎంత గట్టి గుండె కలవారు కూడా క్రుంగిపో వలసిన పరిస్థితులవి! వాటి నన్నిటినీ నిబ్బరముతో ఎదుర్కొని, ఆంధ్రపత్రిక నష్టము మీద నడుస్తూ, అమృతాంజనము లాభము మీద నిలుస్తున్నదనే భావము తొలగునట్లు చేసి, దినపత్రికకు, వారపత్రికకు, భారతికి వ్యాప్తి అనేక రెట్లు ఎక్కువచేసి, వాటి మర్యాదలస్థాయి తగ్గకుండా 34 సం. లు నడిపినారంటే శ్రీ శంభుప్రసాదు ప్రతిభా సామర్థ్యములు ఎంతటివో ఊహించుకో వలసినవే?

అదృష్టము కూడా శ్రీ శంభుప్రసాదును వరించినది. శ్రీ వంతులుగారు శ్రమపడి పోరాడిన భారతదేశ స్వాతంత్ర్యమూ, ఆంధ్ర రాష్ట్రావతరణమూ వారు కళ్ళార చూడనోచుకో లేదు. వారి కవి సుఖ స్వప్నములుగానే ఉండి పోయినవి. ఆ రెండు శ్రీ శంభుప్రసాదు కాలములో సిద్ధించినవి. పత్రికా పాఠకుల సంఖ్య కూడా విపరీతంగా పెరిగినది. వానితోపాటు బాధ్యతలుకూడా పెరిగినవి,

వంతులుగారి హయాములోనే ఆంధ్ర పత్రిక నిష్పక్షపాత వైఖరికి హుందాతనానికి ప్రసిద్ధి పొందినది, ఐనావారు కాంగ్రెసు పార్టీతో అవినా భావంగా ఉన్నందున, అది కాంగ్రెసు పత్రికగానే ఉండక తప్పలేదు. శ్రీ శంభుప్రసాదుగారికి కూడా కాంగ్రెసుపైన ఎంతో అభిమానమున్నా, అవసరమైనప్పుడు కాంగ్రెసు రాజకీయాలను గూడా నిర్మొహమాటంగా విమర్శించే నిష్పక్షపాత వైఖరిని పత్రికకు చేకూర్చినారు. ఇది శ్రీ శంభు ప్రసాదు ఆంధ్ర పత్రికకు తీర్చి దిద్దిన గొప్ప కొత్తమెరుగు!

# 3

శ్రీ శంభుప్రసాదు గావించిన సాహిత్యసేవ ముఖ్యముగా నాలిగింటి ద్వారా జరిగినది. అది 1. ఆంధ్ర పత్రిక సారస్వతానుబంధము 2. వారపత్రిక 3. భారతి 4. సంవత్సరాది సంచికలు. ఈ నాలుగింటిలో 'భారతి'కి అగ్రస్థానము సాహిత్యసేవ విషయంలో ఇవ్వడము సర్వ సాధారణమూ, కొంత న్యాయము కూడాను. కాని నా దృష్టిలో సంవత్స రాది సంచికలు చేసిన సేవ అంతకంటే ఎక్కువైనది. తక్కిన రెండూ చేసిన సారస్వత సేవకూడా అసాధారణమైనదే!

సారస్వతానుబంధము ద్వారానే ప్రపంచ కథానికల పోటీలో ఆంధ్ర కథానికల భాగము శ్రీ శంభుప్రసాదు నిర్వహించినారు. ఆ పోటీలో మొదటి నాలుగైదుస్థానాలు పొందిన కథలను, శ్రీ పద్మరాజు 'గాలివాన'తో సహా సారస్వతానుబంధములోనే ప్రచురించివారు. ఆకథానికల పోటీలు ఆంధ్ర కథానికా రచయితలకు ప్రపంచ సారస్వతంలో గౌరవస్థాన మిచ్చినవి. ఇది శ్రీ శంభుప్రసాదుగారు చేసి సాధించి పెట్టిన ప్రయత్నఫలమే.

సారస్వతానుబంధములోనే శ్రీ విశ్వనాథ 'తెరచిరాజు' వంటి సాంఘిక నవలలు, శ్రీ తెన్నేటిసూరి 'జెంఘిస్‌ఖాన్' శ్రీ నోరి 'ధూర్జటి' వంటి అపూర్వ చారిత్రక నవలలు వచ్చినవి.

తెలుగు ఏకాంకికలనుగూర్చి డా. శ్రీపాద వ్యాస పరంపర, యక్ష గానాలను గురించిన డా. యస్వీ జోగారావు వ్యాసాలు, క్షేత్రయ్య పదాలను గూర్చి వాద ప్రతివాదాలు, ఆంధ్ర దేశంలోని దేవాలయాలను గూర్చిన అనేక వ్యాసాలు సారస్వతానుబంధమే ప్రచురించినది. సారస్వత విజ్ఞాన విషయాలలో ఎంత విజ్ఞానము సారస్వతాను బంధము ద్వారా శ్రీ శంభుప్రసాదు ఆంధ్రులకు పంచి పెట్టినారో చెప్పలేము.

సంగీతములో శ్రీ శంభుప్రసాదుగారికి గల రుచి విశిష్టమైనది. ఈ మధ్య సంవత్సరంపై కాలము పాటు రేడియో సంగీత సమీక్షలు ప్రమీలా దేవిగారివి ప్రచురించినారు. మొన్న మొన్నటివరకు శ్రీ రవిశంకర అనుభవాలు పడ్డవి.

దేశంలో ప్రసిద్ధ చిత్రకళా ప్రదర్శనము ఎక్కడ జరిగినా, సమర్థులైన వారిచేత వాటి సమీక్షలు వ్రాయించి ప్రధాన చిత్రాల ప్రతికృతులతో పాటు అందులో ప్రచురించే వారు.

అంతరిక్షయానానికి, వైద్యానికి, అనేక భౌతిక మానసిక వైజ్ఞానిక వ్యాసాలు అందులో ప్రచురించేవారు. భారతీయ దర్శనాలమీద విద్వాంసులచేత వ్యాసాలు వ్రాయించినారు. ప్రాచీన సాహిత్యాన్ని అందజేయడానికి శ్రీ శిరోమణి రామాయణం, శ్రీ గణపతిశాస్త్రి మహాభారతము ప్రచురించారు. అవి రెండూ విశేష జనాదరణ పొందినవి.

అందులోని సమీక్షలకుకూడా విశిష్టత ఉండేది. ఈ అన్నిటికీ ఎన్నెన్నివిధాల రచయితలను, ఎంతెంతమందిని శ్రీశంభుప్రసాద్ సమీక రించేవారో ఊహించవలసినదే! సారస్వతానుబంధము సాధించిన సార స్వతసేవ అపారమైనది.

# 4

ఆంధ్రపత్రిక వారపత్రికగానే ఆరంభమైనది. దినపత్రిక వచ్చిన తర్వాత అది మధ్యమధ్య కొన్ని సంవత్సరాలపాటు రాకపోవడముకూడా ఉన్నది. 1946 సం. లో వినాయక చవితినాడు పునఃప్రారంభించిన తర్వాత నేటివరకూ నిరాఘాటంగా సాగుతూ ఉన్నది. సైజుమాత్రము మధ్యలో మార్చుకున్నది.

వారపత్రిక ప్రధానంగా కథానికలకూ, సాంఘిక నవలలకూ, సినీమా రంగానికి ప్రాధాన్యమిస్తున్నది. అందులోని కథానికలకుకొంత స్థాయి సర్వసామాన్యంగా ఉంటున్నది. అందులోనే శ్రీ నోరి నారాయణ భట్టు, రుద్రమదేవి, కవిసార్వభౌముడువంటి చారిత్రక నవలలు, కర్పూర ద్వీపయాత్రవంటి ఆధ్యాత్మికనవల వంటివికూడా ప్రచురించినారు. టామ్ సాయరు, డాన్‌క్విగ్జోటువంటి జగత్ప్రసిద్ధ రచనలు ఆంధ్రీకరణము చేయించి అందులో ప్రచురించినారు. జగత్ప్రసిద్ధికలనటుల, నాట్యకర్త్రుల వివరాలేకాక, బ్రిటనులో ఒక రాజును, ఒక మంత్రినీ గద్దెనుండి దింపిన సింప్సనుసతి, కీలరువంటివారి అద్భుతచరిత్రలు అందులో వచ్చినవి. మధ్య మధ్య శ్రీ ఆరుద్రవంటివారు రచించిన గేయఖండికలుకూడా వచ్చి నవి. పెద్దసైజులో ఉండగా అన్నమాచార్యులవారి కీర్తనలెన్నో శ్రీ రాళ్ళ పల్లి అనంతకృష్ణశర్మగారి స్వరకల్పనతో ప్రచురించినారు.

ఇందులో మరొక విశేషముకూడా జరిగినది. 'తెలుగు వెలుగులు' అనే శీర్షికతో వివిధ రంగాలలో ప్రసిద్ధులైన ఆంధ్రులమీద ఒకప్పుడు వ్యాసపరంపర వచ్చి పాఠకులను ఆకట్టినది. వాటి రచయిత ఎవరో అప్పుడు తెలియదుకాని, అవి స్వర్గీయ శంభుప్రసాదుగారు వ్రాసినవే అని వారు పరమపదించిన పిమ్మట బయటపడినది. ఈ 'తెలుగువెలు గులు' శీర్షికను ఒజ్జబంతిగా పెట్టుకొని ఇతర పత్రికలు నామాంతరాలతో

కొన్ని ప్రచురించినవి, కాని అవిఏవీ దీనిస్థాయిని అందుకోలేక పోయి నవి. ఇందులో స్వరూపావగాహనచేసే చురుకైన భాషఉండేది.

ఈవిధంగా ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము, వారపత్రికద్వారా శ్రీ శంభుప్రసాదు చేసిన సారస్వత సేవ మరువరానిదీ, అపారమైనదీను!

# 5

ఇక భారతి సంవత్సరాది సంచికలూ ఉన్నవి. ఈ రెండూ శ్రీ పంతులుగారు శ్రీ శంభుప్రసాదుగారికి అప్పగించిపోయిన సారస్వత మహావిధానములు. 'భారతి' శ్రీ పంతులుగారి పరదేవత. ఆ విధంగానే శ్రీ శంభుప్రసాదు గ్రహించి నడిపినారు.

శ్రీ శంభుప్రసాదు పరమశాంతి స్వభావులని ప్రతీతి. వారు స్వర్గ స్థులైన తర్వాత వారిని దీర్ఘకాలము సన్నిహితముగా ఎరిగినవారెందరో, వారి గుణగణములలో శాంతగుణమునే విస్తారముగా ప్రశంసించినారు. వారి ఆగ్రహముసంగతి ఎవరూ స్మరించలేదు.

'భారతిస్థాయి పడిపోయినది' అని ఎవరైనా ప్రసిద్ధులు అన్న ప్పుడు శ్రీ శంభుప్రసాదుకు నిజంగా ఆగ్రహమే వచ్చేది. అటువంటి సందర్భాలు రెండుమూడైనా నాకు గుర్తున్నవి. మరి ఒక సందర్భ ములో వారి ఆగ్రహము మిన్నుముట్టినది. దానికి సందర్భించిన వాద ప్రతివాదాలన్నీ సారస్వతానుబంధములో పడ్డవి. దానితో ఉభయపక్షాల స్వరూప స్వభావాలు లోకానికి అవగతమైనవి. చివరకు వాద ప్రతివాదాల ప్రచురణకు స్వస్తిచెప్పి, అవి అన్నీ ప్రత్యేకముగా అనుబంధరూప ముగా ముద్రించి, భారతి చందాదారులకు పంపినారు. అట్టి ఆగ్రహము సత్యాగ్రహమనదగినది. బహువిధాలుగా అది సత్యాగ్రహమే! అట్టిది ప్రదర్శించుట కూడా వారికి అరుదే. ఆ సత్యాగ్రహములో కూడా వారెంతో నిగ్రహము ప్రదర్శించిఉండుట గమనార్హము!

భారతి రజతోత్సవము 1949 లో శ్రీబాగ్‌లో ఎంతవైభవముగా వారు జరిపినారో చూచినవారికే కాని తెలియదు. ఆ గులాబిమహామాలల సౌరభము తలచుకున్నప్పుడల్లా గుబాళిస్తూ ఉంటుంది. ఆ సాయం

కాలము జరిగిన పార్టీ, రాత్రి విందూ జ్ఞప్తిలోకి వస్తున్నవి. ఆ సాయం కాలం జరిగిన సభకు శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు అధ్యక్షత వహిం చారు. ఆ సభలో ఇతరుల ఉపన్యాసాలతోపాటు, అంతకు పూర్వము భారతిలో ప్రచురితములైన వివిధాంశాల మీద వేరువేరుగా ఉపన్యా సకులు ఉపన్యసించినారు. హిందూపత్రికా సంపాదకులు సభలో ప్రశంస చేసి వారి పత్రికలో ఉత్సవ విశేషాలకు ప్రత్యేకస్థాన మిచ్చినారు. తక్కిన పత్రికలుకూడా అట్లే చేసినవి.

అప్పటికి 'భారతి' పంతులుగారి చేతిక్రింద 14 సం. లూ, శ్రీ శంభు ప్రసాదు క్రింద 11 సం. లూ నడచినది. పంతులుగారి చేతిక్రింద నుండగా నుండిన వృద్ధ నవవ్యాసకర్తలను ఆకట్టుకొనుచునే నూతన వ్యాసకర్తలను అన్వేషింప సాగినారు. పెద్దలయందు వినయమూ, చిన్నలకు స్వాగ తమూ; పూర్వమార్గముల యెడల గౌరవమూ, నూతన పంథాలమీద ఆదరమూ, మొదటినుండీ భారతి ప్రదర్శిస్తున్నది. శ్రీ శంభుప్రసాదు ఆవిధంగా జన్మాంతమువరకు పాటించి నడిపారు.

ఆ రజతోత్సవ సందర్భములో (1949) ప్రచురించిన రజతోత్సవ సంచిక శ్రీ శంభుప్రసాదు సంస్కార వైవిధ్యానికి ప్రతీక. అందులో వివిధాంశాలకు వారు ఎన్నుకున్న రచయితలను భావనచేస్తే, వారి విజ్ఞత ప్రకటమవుతుంది.

ఒకవిధంగా చూస్తే భారతి రజతోత్సవ సందర్భములో శ్రీ శంభు ప్రసాదు ఆత్మపరీక్ష చేసుకుని ఆంధ్ర రచయితల చేతకూడా ఆత్మపరీక్ష చేయించినట్లు తోస్తుంది. ఆ సంచికలో ప్రధానవ్యాసాల అంశాలను, వారే ఆలోచించి ఎన్నుకొని ఒకానొక క్రమపద్ధతిలో సంచికను రూపొం దించినారు.

అందులో కవిత్రయముమీద మూడు ప్రత్యేక వ్యాసాలూ, వీరశైవ వాఙ్మయము, దక్షిణదేశ వాఙ్మయము, ఆడవాళ్ళ పాటలు, ఆంధ్రదేశమున చరిత్ర పరిశోధన, ఆంధ్రుల-సంస్కృత వాఙ్మయము, బొమ్మలాటలు, అమెచ్యూరు నాటక ప్రదర్శనములు, తెలుగు చిత్రకళ- అందలి పొగసులు, కర్ణాటక సంగీతము, ఆంధ్రులు - భాషాశాస్త్రము -

దాని క్రమాభివృద్ధి, ఆంధ్రదేశపు దేవాలయములు-జాతీయ జీవనముపై వాని ప్రభావము, పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము, ఆంధ్ర వాఙ్మయరంగమున కళాప్రపూర్ణుని అమృతోదయము–అవి ముఖ్యమైన వ్యాసాలు. ఈ వ్యాసాల పేర్లనుబట్టి ఆంధ్రదేశములో అంతకుముందు గడచిన పాతికేళ్ళలోన్ని సాంస్కృతిక రంగాలలో కలిగిన వికాసము, అందులో పంతులుగారి ఆధ్వర్యాన ఆంధ్రపత్రికా సంస్థలు నిర్వహించిన పాత్ర, ఆ సంచిక ప్రతిబింబిస్తుందని వ్యక్తమవుతుంది. పై వ్యాసాలు కాక, 5 కథానికలు, 1 పద్యనాటిక, 2 ఏకాంకికలు, కొన్ని ఖండకావ్యాలు ఉన్నవి. ఆ సంచికలోని 'స్వవిషయములో' ఉన్న ఈ క్రిందివాక్యాలు గమనార్హములు.

'ఇరువదియవ శతాబ్దమున సాహిత్యము విప్లవ రూపమైన తరంగము లొకదాని వెంట నొకటి శీఘ్రగమనమున ముంచెత్తుకొని వచ్చినట్లు పరిణామగతిలో నడచినది....సామాన్యముగ ఈ ప్రక్రియ జరుగుటకు శతాబ్దముల అవధి మధ్య కన్పించుచుండును. కాని ఇరువదియవ శతాబ్దముయొక్క చైతన్యమున ఈ పరిణామక్రమము సర్వవిధముల అతి శీఘ్రముగ నొందినది...భావకవిత, వాస్తవిక కవిత, అతివాస్తవిక కవిత, అభ్యుదయపథము మొదలగున వన్నియు ఈ పరిణామములో క్రమములయి నిలిచినవి....

'పాశ్చాత్య కవిత్వమును తెలుగులమై అవగాహన మొనర్చుకొనుటలో 'రసాత్మకం వాక్య' మన్న నిర్వచనరీత్యా ఆంగ్ల 'వాక్య' ముల సంపూర్ణ రసరూపమేదో సర్వసామాన్యముగా అవగాహనము కాలేదు. ఆ వికృతితోనే తెలుగున, స్వభాషలో వ్యవహరించి కృషిచేయ వలసినప్పుడు, ప్రాచ్యకవితా స్వభావములోని 'భావాశ్రయగుణమును మించిన రసాశ్రయగుణమును' ఆలంబనముగా జేసికొన దృష్టి తగినంతగా ప్రచారము కాలేదు....

'బాల్యదృష్టిలో నేటి సాహిత్యస్థితి స్తబ్దమై యున్నట్లనిపించ వచ్చును. కాని ఇది నిస్పృహతో నీరవమై పతనమైయున్న స్తబ్దత కాదు....తెలుగు సాహిత్యక్షేత్రము ప్రతిభాయుతమగు ఫలములను

పండించుటకు అత్యంతోన్ముఖమై యున్నది. విశ్వసాహిత్యమున కలం కారప్రాయములగు కృతులను తెలుగు భారతి అందీయగలదు.'

అప్పటికి భారతదేశానికి స్వాతంత్ర్యమువచ్చి రెండేళ్ళయినది. ఆనాటి ఉత్సాహము రజతోత్సవానందముతో మేళవించినది. ఆ నూతన స్పందనతో శ్రీ శంభు ప్రసాదు రచయితలకు ప్రాచ్యకవితాస్వరూపము భావాశ్రయముకాక రసాశ్రయత్వమని సూత్రప్రాయంగా సూచనచేసి, ఆంధ్రసాహిత్యము విశ్వసాహిత్యములో ఉన్నతస్థానము అధిరోహింప గలదని ఉవ్విళ్ళూరినారు.

స్వాతంత్ర్యము లభించిననాటి ఆనందము ఆంధ్రరాష్ట్రము కొంత వరకు సిద్ధించిన 1953 వరకు పెరిగి, మహాంధ్ర మేర్పడిన పిమ్మట 1957 జనవరి భారతిలో ఉద్వేలమైనది. 1953 నుండి 1957 వరకు భారతి స్వవిషయము వ్రాయుటలో ఆంధ్ర సారస్వతానికి నూతనాధ్యాయము తేవలెననే ఆకాంక్ష శ్రీ శంభుప్రసాదు వ్యక్తంచేస్తూ వచ్చారు.

1953 జనవరి భారతి 'స్వవిషయము'లో, 'భాషారాష్ట్ర ప్రాతి పదికపై ఏర్పడు తెలుగుదేశమున దేశవ్యవహారములు తెలుగుభాషలో నడవవలసిన కాలమున దేశమున కుత్తమ సాహిత్య పత్రికల అవసరము అత్యధికము కాగలదు. ఆ అవసరముల కనుగుణ్యముగా తన్ను సంస్క రించుకొనుటకు 'భారతి' ఉత్సాహపడు తున్నది' అనివ్రాసి వ్యంగవైభ వముతో ఆంధ్ర రచయితల కర్తవ్యము ఉపదేశించినారు.

ఆంధ్రరాష్ట్ర మేర్పడినతర్వాత వచ్చిన భారతి 1954 జనవరి సంచికలో 'స్వవిషయము' అను శీర్షికను 'జన్మదివసము'గా మార్చి శ్రీ శంభు ప్రసాదు తన ఆనందము వ్యక్తముచేస్తూ, రచయితలకు వారి కర్తవ్యమును మరింత స్పష్టముగా ఉద్ఘోషించినారు.

'సజీవసారస్వతానికీ లక్ష్యం ఒక్కటే.... నేటి సారస్వతము ఏదో ఒక ప్రత్యేక వర్గానికిగాని, సంకుచిత సాహిత్య సిద్ధాంతానికిగాని ప్రతి నిధిగా మారిపోకుండా సంరక్షించుకోవాలి....ఒకజాతి సంస్కృతి, ఆత్మ వ్యక్తిత్వము, సారస్వతంలో సంపూర్ణంగా ప్రతిఫలిస్తున్నాయి....ఈ విష

యాలన్నీ సహజంగా ఆకళించుకొన్నప్పుడే సాహితీపరులు సమాజ ద్రష్టలై మార్గదర్శకు లవుతున్నారు. ఇవి గమనించ లేనివారేదో సంకుచిత రాజకీయ పక్షానికో, వర్గానికో వాఙ్మయథోరణికో ప్రచారచారణులుగా మారి, ఆత్మవిక్రయానికి పాల్పడుతున్నారు. ఈ విషయాలలో ఎంత మాత్రము ఏమరని వాఙ్మయస్రష్టలే ఆర్ష గౌరవం పొందుతున్నారు. 'నానృషిః కురుతేకావ్యం' అన్న ప్రాచీన ప్రవచనము సూక్ష్మంగా ఈ అభిప్రాయమే ధ్వనిస్తున్నది.'

1955 జనవరి భారతి "స్వవిషయములో" పై విషయమే మరింత ప్రస్ఫుటంచేస్తూ ఆంధ్రులను జాగ్రత్త పడమన్నారు.

"తెలుగుజాతి స్వతంత్రజాతిగా పరిణతి పొంది పునర్నిర్మాణోద్యోగమున ముందుకు నడచిపోతుంది. ఈ నిర్మాణ కార్యక్రమం విప్లవ రూపంలో సాగవలసి వుంది. క్రమబద్ధమూ, నిర్మాణోన్ముఖమూ అయిన పరివర్తననే విప్లవమనాలిగాని అరాచకపంథాను విప్లవమనే పెద్ద పేరున పిలువరు...జాతికి కావలసింది ఓజఃస్ఫూర్తిగాని, నిరాశావాదథోరణులూ, వ్యగ్రమనస్తత్వాలూ కాదు. కాని నేటి సాహిత్యవైజ్ఞానిక రంగాలపైన ఇట్టి అవాంఛనీయములైన అరాచక నిరాశావాద ధోరణులు కారు మబ్బుల్లా కమ్ముకున్నయ్."

1956 జనవరి భారతి 'స్వవిషయము'లో మరికొన్ని ముఖ్యవిషయాలు ప్రస్తావించారు.

'ప్రాచీనభారతీయ విజ్ఞానరంగంలో సమాలోచన వృత్తికి ఎన్నడూ అవరోధముండేదికాదు...కాని బానిసత్వం తటస్థించిన అనంతరదశలో.... భారతీయవిజ్ఞానం ఆత్మరక్షణార్థం తనచుట్టూ తానే....కంచుకోట నొకదాన్ని నిర్మించుకొని, సమాలోచనవృత్తికి స్వస్తిచెప్పి, తన పురోగమనాన్ని తానే అరికట్టుకుంది. ఇప్పుడు మనం స్వతంత్రులంగా వున్నా, బానిసదశలో ఏర్పడిన ఈ మనఃస్థితి ఇంకా మన్ని వదలటంలేదు. ఇది మన పురోగమనాన్ని యెడనెడా అరికట్టి వేస్తున్నది... సాహిత్యసంస్కృతులకూ, శాస్త్రీయ విజ్ఞానానికి సంబంధ మేమిటనేవారు కొందరున్నారు. శాస్త్రీయ విజ్ఞాన ప్రాతిపదికలపై నిర్మింపబడని సాహిత్య

సంస్కృతులు పేకమేడలవలె యే చిన్నగాలివేసినా భిన్నాభిన్నమై పోతాయి....ఈ సత్యాన్ని దృష్టిలో వుంచుకుని, దేశోద్ధారకుడు చూపిన వెలుగుబాటను పరిక్రమించుతూ, సాహిత్య సంస్కృతులకు దోహదంగా శాస్త్రీయ విజ్ఞానాన్నికూడా ప్రజాబాహుళ్యానికి వ్యాపింపజేయడానికీ, నిర్దుష్టమైన సమాలోచన వృత్తిని పెంపొందజేయడానికీ, ప్రయత్నించు తున్నాం. ఈ ఉద్యమానికి వివిధ విజ్ఞాన శాఖలలో సంపన్నులయిన మహాంధ్ర రచయితల సహకారం విస్తృతావధిని లభించగలదని ఆశించు తున్నాము.'

పై వాక్యాలు ఒకవంక ఆంధ్ర రచయితలకు ఆదరపూర్వ కాహ్వానమూ, మరియొకవంక చిత్రమైన సవాలుకూడానూ!

'1957 జనవరి భారతి' 'స్వవిషయము' నాటికి మహాంధ్ర ఏర్పడి ఉన్నది. అప్పుడు శ్రీ శంభు ప్రసాదు ఆనందంతోపాటు కించకూడా వ్యక్తంచేశారు.

'నవంబరు ఒకటవతేదీ ఆంధ్రజాతి చరిత్రలో ఉత్కృష్టమైన మహా పర్వదినం. శతాబ్దాల బానిసత్వకారణంగా, ఛిన్నాభిన్నమై, శిథిల శిథిలమై పోయిన మహాంధ్రసీమ ఆనాడు తిరిగి ఏకైకఖండగా సమగ్ర మూర్తిగా రూపొందింది...అవకాశాలతోపాటు బాధ్యతలుకూడా సంక్రమించుతూ వుంటాయి...ఈ రానున్న అవకాశాలను ముందుగానే గుర్తించి, భారతి భవిష్య నిర్మాణ కార్యక్రమానికి వలసిన సాధన సంపత్తిని చేకూర్చడానికి గత ఒకటి రెండు సంవత్సరాలుగా ప్రయత్నించుతూనే వుంది. కాని ఆశించిన అవధికి ఫలితాలు సాధించలేక పోయింది, ఇందుకు కించపడుతున్నాం.'

1958 జనవరి భారతి 'స్వవిషయము'లో 1957 లో చెప్పిన విషయాన్నే మరొకరూపంలో చెప్పినారు శ్రీ శంభుప్రసాదు.

"సమ్యక్ దర్శనము" "సమ్యక్ జ్ఞానము" "సమ్యక్ చరిత్ర" ఇవి జైనమత రత్నత్రయంగా చెప్పబడుతున్నా, నిజానికి ఇవి భారతీయ తాత్త్వికరంగానికీ, తద్ద్వారా భారత జాతీయ పురోగమనానికీ, ప్రధాన

ప్రాతిపదికలై వున్నాయి....ఇవి స్థూలంగా మూడుగా చెప్పబడుతున్నా, నిజానికి యివి ఒకేవ్యవస్థ యొక్క మూడుదశలు...విశ్వవిజ్ఞానము సమైక్యమై, ఏకముఖమై సాగిపోవుచున్న ఈ దశలో, నిజానికి మనం దాని గమ్యాన్ని అందుకోలేకుండా వున్నాము...నిజానికి యితర పురోగమన జాతులలో కంటె మనలో నేడుసమ్యగ్దర్శనము లోపించివున్నదంటే, ఇది అక్షరాలా అంగీకరించి తీరవలసిన పరమసత్యం....ఇది సాహిత్య పత్రికగదా, ఇందు శాస్త్రవిజ్ఞాన ప్రసక్తి యేలనని కొందరి ఆశంక. శాస్త్రీయ విజ్ఞాన పరిపుష్టి లేని సాహిత్యరంగం మూఢవిశ్వాసాల మురికి కూపమై జాతీయ పురోగమనానికిగాక తద్వినాశనానికి కారణమౌతుంది.'

ఈ పై విధంగా గట్టిగాచెప్పి, గత సంవత్సరం రచనలు పరిశీలించి నాటకరచనలో కొంచెము ముందడుగు ఉన్నా, కథాశిల్పం పతనమైనదనీ, కావ్యనిర్మాణము నిరుత్సాహజనకముగా ఉన్నదనీ, విజ్ఞాన ప్రచారానికి అత్యంత ప్రధానమైన వ్యాసరచన సన్నగిలిపోయినదనీ, విమర్శనా విధానానికి తగిన సంప్రదాయము సిద్ధించుటలేదనీ, కొంత విచారము వ్యక్తము చేసినారు.

మళ్ళీ 1959 జనవరి 'భారతీ జన్మదివసము'లో ఏమన్నారో చూదాము.

'అధునాతన సమస్యలకు సంబంధించిన ఆర్థికసాంఘిక తాత్త్వికాది విషయాలపై రచనలు ప్రచురిస్తున్నాము. ఇంకా వేర్వేరు శాస్త్రీయ విషయాలపై అందరికీ సులభగ్రాహ్యలైన వ్యాసాలు ప్రచురించాలని సంకల్పించాము.

'భారతిలోని నాటికలకు విరివిగా ప్రజాదరణము లభిస్తున్నది... కథలలో ఆశించినంతగా ఉత్తమ రచనలు రావడంలేదు....ఏ సారస్వత శాఖలోనైనా కేవల సాంప్రదాయిక ధోరణులే అభిమానించడం భారతి కభిమతంకాదు....పరిణత సాహిత్యదృక్పథమే భారతి ప్రత్యేకత.... సారస్వతక్షేత్రంలో ప్రసిద్ధులయిన పెద్దలు కొందరు వృద్ధులయినారు. నూతనమార్గాలవలంబించిన కొందరు యువకులలో అనిశ్చితస్థితి ఏర్ప

డింది....మహాంధ్రం నేడొక నూతనోత్సాహంతో తొణికిసలాడుతున్నది.... ఈ ఉత్సాహంతోనే తిరిగి ఆంధ్రభాషా సారస్వతోపాసనకు, పరిశోధనకు, కళాభివృద్ధికి అవిరళ కృషి చెయ్యవలెనని మా పత్రిక సంకల్పించింది.'

ఎంత ఉత్సాహంతో శ్రీ శంభుప్రసాద్ మహాంధ్ర రాష్ట్రాన్ని గ్రహించారో పై వాక్యాలు ధ్రువపరుస్తున్నవి.

1960 జనవరి భారతి 'స్వవిషయము'లో, "పరిశోధనశాఖలో కొంత చైతన్యం కానవస్తున్నా, సృజనశీలమైనశాఖ చిగిరించనందుకు చింతిస్తున్నాము: విమర్శశాఖ కొత్త రెమ్మలు వేయనందుకు చాలా విచారిస్తున్నాము" అంటూ 'ఈ సంస్కృతికి ఆలవాలము తెలుగుచదువు. అది లేక విదేశ భాషాసంస్కృతులలో వచ్చే రచనలు అసహజాలు. అపాతరమణీయాలు' అని ఎంతో విజ్ఞతతో సంయమనంతో ఉద్బోధించినారు.

1961 జనవరి భారతి "స్వవిషయము" అంతా సంతృప్తినే వ్యక్తముచేసినది. 'తెనుగు సారస్వతశాఖ సృజనాత్మకశాఖ కొత్త రెమ్మలువేసి కొత్త కావ్య కుసుమాలు పూసింది. కథానికలు, నాటికలు, సంగీతరూపకాలూ కొంత నూతనత్వంతో చిగిర్చాయి. విమర్శశాఖ ముందుకన్నా కొంత ముందంజవేసింది. భాషాశాస్త్ర విమర్శ, చరిత్రపరిశోధన ముందుకు సాగినవి" అని సంతోషించినారు. కాని ఆ ఒక్క సంవత్సరమే వారు కొంత సంతోషించినది.

మళ్ళీ 1962 సం. 'స్వవిషయము' అంతా చింతా పూర్వకంగానే ఉన్నది.

'ముఖ్యముగా కవులు, కథకులు, నాటక కర్తలు, వ్యాస రచయితలు, విమర్శకులుకూడ ఎంత చూచినను ప్రాతపుంతలనే బట్టి నడచుచున్నారు. క్రొత్త యేమైన నున్నచో నది తెచ్చిపెట్టు కున్నట్టు లుండి నైసర్గికతను వెలార్చుటలేదు ... ప్రాతలో లోతులకు పోవుటలేదు. క్రొత్త వచ్చినదో, దానికి బాధ్యత లేదు....రచింపబడు గ్రంథములలో తెలుగు జీవితము యొక్క సమగ్ర స్వరూపముగాని సమాజ లక్షణ పరి

ణామములుగాని ప్రతిబింబించుట లేదు, రచయిత ద్రష్టయై, ప్రతిభను పండించుట శశవిషాణ మగుచున్నది...భారతీయమైన పురా శాస్త్రముల యందు గాని, అధునాతనమైన విజ్ఞానాదిక శాస్త్రముల యందుగాని నికషమగు పరిచయము కలవారు అరుదై పోవుచున్నారు. ఈ రెండు జ్ఞానములును ఒక్కచో తారసిల్లుటయే లేదు. ఏ విషయమును గురించి కాని ప్రత్యేకమైన కృషి, అధ్యయనము జరుగుచున్న పద్ధతియే గోచరము కావుటలేదు వీరు ఇందులో పండితులని చెప్పదగినవారు ఇప్పుడు ఎందరున్నారు ?....మన దేశముననే కాక రాష్ట్రములో కూడ రాజకీయ నాయకులు సాహిత్యవేత్త లయినట్లు మాట్లాడుట, సాహిత్యమును శాసింపబూనుట ఈ స్థితికి కారణమన్నచో దోషముకాదు. అంతియకాక, సాహితీ పరులుకూడ రాజకీయ వేత్తలచుట్టును చక్రభ్రమణముగా తిరుగుచు నదియొక గొప్పయని భావించు చుండుటను గూడ చూచుచున్నాము... మరి ఈ రాజకీయవేత్తలు రాజకీయముగా తమకు దక్కిన అధికారముచేత ఒక్క సాహిత్య జీవనమునేకాక, సర్వమగు జీవితమును శాసింపగల మను భ్రమలో బడుచున్నారు. ఆ భ్రమవలన జనించిన విపరీత తత్త్వమువలన సాహిత్య జగత్తు స్తబ్ధతను భజించుటగా పరిణమించు చున్నది. ఈ స్థితిని సాహిత్యమునుండి తొలగబెట్టగల్గిచో భారతికి కావలసినదిలేదు.'

శ్రీ శంభుప్రసాదు స్వయముగా రాజకీయవేత్తఅయి ఉండియు సాహిత్యకారులకు రాజకీయవేత్తల శృంఖలములనుండి విముక్తికొరకు ఎంత పరితపించిరో పై వాక్యములు కొంత ప్రదర్శిస్తవి. బ్రిటిషు ప్రభుత్వముతో స్వాతంత్ర్యమునకై మనము పోరాడుచున్న రోజులలో, మనకై పోరాడిన కొందరు బ్రిటిషు మేధావులు జ్ఞప్తికి వస్తున్నారు. ఇక్కడ ఒక విశేషమేమిటంటే, అప్పుడు మనము స్వాతంత్ర్యముకోసము పోరాడినాము; కాని నేటి సాహిత్యకులు రాజకీయవాదులకు చెక్కభజనలు చేయుట గొప్ప అనుకొంటున్నారు. ఇంతకంటె రచయితలకు హీనస్థితి ఉండదు.

1963 సం. లో స్వవిషయములో 'విమ్మరపట్ల రాజకీయనాయకులు ప్రదర్శించు చున్న అసహనభావమునే సాహిత్యరంగంలో పెద్దలైనవారు

కూడ చూపించు చున్నారు. విమర్శను వ్యక్తిగతమైన విరోధముగా ఎంచుకొనుట జరుగు చున్నది.' అని చింత వ్యక్తము చేసినారు శ్రీ శంభుప్రసాదు.

మరల 1964 సం. జనవరి భారతి స్వవిషయములో వారు కొంత విస్తారముగా తమ ఆశయములు ప్రకటించినారు. అదే చివరిసారి !

'ఒకవైపున కల్పనా సాహిత్యము విశృంఖలముగా పెరుగుచున్నది. మరొక వైపున ప్రాచీన సాహిత్య విజృంభణ జరుగుచున్నది. ఇది సాహిత్య వ్యాప్తిదృష్ట్యా శుభసూచన. కాని కల్పనాసాహిత్యములో సమకాలీన సమాజముకాని సమకాలీన సమస్యలుకాని కానరావడము లేదు. ప్రాచీన సాహిత్య పర్యాలోకనములో పూర్వము వుంటూ వచ్చిన ప్రత్యేక కృషి శ్రద్ధ కనిపించడము లేదు . ప్రస్తుత ఆశయములు పూర్వసంప్రదాయముల నుంచి సహజపరిణామ మార్గమున రావలసివున్నవి...దీనిని కాదని, పాశ్చాత్య విధానములను యథాతథముగా స్వీకరించుట, ఆరాధించుట ప్రమాదకరము. ఈ ప్రమాదమును తప్పించుకొనుటకు నూతన సాంఘిక దృక్పథము అవసరము. పురాణ యుగధర్మములను, వైదిక మతమును ప్రచారము చేయుడమువల్ల దీనిని సాధించలేము....కేవలం సాహిత్యమునకేకాక, ఆర్థిక సాంఘిక రాజకీయ సమస్యల పై రచనలను కూడా భారతి ప్రోత్సహించు చున్నది విమర్శ సాహిత్యములో అంతర్భాగము...భారతి ఒక సంస్థ. దానికి రాగవిరాగములు, ఈర్ష్యా ద్వేషములు లేవు.'

ఈ విధంగా ఉద్ఘాటించి ఊరుకున్నారు. ఇన్నాళ్లు తాముచేసిన ఉద్బోధలవలన రచయితలలో ఆశించినంత స్పందనము కలుగలేదని నిరుత్సాహపడిరో, కాక తాము రచయితలకు మరల స్వాతంత్ర్యమును విధులను తెలియజెప్పుచుండుట వృథా శ్రమయని భావించిరో తెలియదు. కాని 1965 నుండి 1972 జనవరి వరకు భారతి 'స్వవిషయము' ఒకటే మతలబీలో నడచినది. సంవత్సర సంఖ్య మార్పుతప్ప పేరుమార్పు లేదు. శ్రద్ధగా భారతి పఠించుచువచ్చిన నాబోట్లకే, ఈ వ్యాసపందర్భములో వెనుకటిసంచికలన్నీ పరిశీలించినప్పుడుకాని ఈ విషయము

స్ఫురించ లేదు. ఇప్పుడు తలచుకుంటే శ్రీ శంభు ప్రసాదు నేటి రచయి తల హీనస్థితికి ఎంత పరితపించినాడో గదా అనే ఊహ కలిగి మనస్సు కలుక్కుమన్నది.

# 6

'భారతి' పంతులుగారికిని శ్రీ శంభు ప్రసాదు గారికిని ఉపాస్య దేవతగా ఉండినదనేది జగత్ప్రసిద్ధ విషయము. వారే ఆ విషయము పలుమారులు ప్రకటించినారు కూడాను. మరి సంవత్సరాది సంచికలో ? నాటిగూర్చి వారిద్దరూ ప్రత్యేకించి ఎక్కడా చెప్పినట్లు లేదు. పేరుకూడా భారతివలె పరదేవత పేరుగాక లౌకికనామమే. ప్రథమములో సంవత్సరాది సంచిక 1910 లో పంతులుగారు ప్రారంభించినప్పుడు, తమకు ఆంధ్ర దేశములోని ప్రజ్ఞావంతుల సర్వతోముఖ పరిచయమునకై ఉద్దేశించి నట్లు దానినిచూచిన వారికి తోచక మానదు. పంతులుగారు దానికి నెమ్మది నెమ్మదిగా ఆదర్శరూప మిచ్చినారు. పంతులుగారి ప్రస్తావనలు గత సంవత్సరములోని ప్రపంచ సంఘటనలు, భారతదేశ సంఘటనలు, ఆంధ్రదేశ సంఘటనలు అద్భుతముగా సమీక్షచేసేవి. శ్రీ శంభుప్రసాదు గారి ప్రస్తావనలలో అంత సమగ్రవివరణ లేకపోయినా సూత్రప్రాయంగా పంతులుగారి ప్రస్తావనల దారిలోనే నడిచేవి.

ఒక విధంగా యోచిస్తే వారిద్దరికీ భారతిమీద కంటెకూడా సంవత్స రాది సంచికలమీదనే ఎక్కువ శ్రద్ధాభక్తు లుండేవేమో అనిపిస్తుంది. ఒక్క సంవత్సరము మాత్రము, రెండవ ప్రపంచ సంగ్రామకాలములో, ఎంత ప్రయత్నించినా కాగితము లభింపక సంవత్సరాది సంచిక ప్రచు రింపలేక పోయినందులకు శ్రీ శంభుప్రసాదుగారు పొందిన పరితాపము తర్వాతి సంచికలో ప్రకటించారు. శ్రీ శంభుప్రసాదు హయాములో రెండు సంచికల విషయములో క్రొత్త ప్రయోగాలు కూడా చేసినారు. విశ్వావసులో (1964-65) దానిని ఆంధ్రపత్రిక స్వర్ణోత్సవ సంచికగా ప్రకటించినారు. అది 55వ సంచిక. అందులో ప్రస్తావము కూడ లేకుండ 1910 నుండి 1949 వరకు సంవత్సరాది సంచికలలో ప్రచురించిన రాజకీ యేతర వ్యాసాలే కొన్ని ఏరి ప్రకటించినారు. చివర చేర్చిన 'స్వవిష

యము'లో 'ఈ యాభై సంవత్సరాల చరిత్రను సింహావలోకనము చేస్తున్నట్టిది, ఈ స్వర్ణోత్సవ సంచిక. ఇరవయ్యో శతాబ్దంలో తొలి సగం ... అర్ధశతాబ్దికి పైగా ధారావాహికంగా వెలువడుతున్న సంవత్స రాది సంచికలు ఆంధ్రజాతి సంస్కృతి రంగంలో చేసిన సేవ ఎలాటిదో, ఆంధ్రావళికి తెలుపుతాయి; మణిదీపాలుగా వెలుగుతాయి. ఆ మణిదీపాల వెలుగును ఎంతో కొంత ప్రతిఫలింపజేసే వెలుగురేక ఈ స్వర్ణోత్సవ సంచిక !' అన్నారు.

రెండవ నూతన ప్రయోగము ప్లవంగ సంవత్సరాది సంచిక (1967–68). దానిని శ్రీ నాగేశ్వర జయంతి సంచికగా వెలువరచినారు. అందులో ఒక్క పేజీ 'ప్రస్తావన'. తర్వాత దేశోద్ధారకుని గూర్చి గాంధీజీ ఎంగుఇండియాలో వ్యాసమూ, చిత్రపటావిష్కరణలో వారి ఉపన్యా సమూ, పంతులుగారి నిర్యాణానంతరము శ్రీ మహాదేవదేశాయి హరిజన పత్రికలో వ్రాసిన వ్యాసమూ, తర్వాత అన్నీ శ్రీ పంతులుగారి వివిధ రచనలూ, చివరకు మాత్రము 'పూర్ణపురుషుడు, శ్రీ కాశీనాథుని నాగేశ్వర రావు పంతులుగారు' అని నేను వ్రాసిన 45 పేజీల సుదీర్ఘవ్యాసమూ– ఇంతే ఉన్నవి. దాని 'ప్రస్తావన'లో శ్రీ శంభుప్రసాదు ఇట్లా వ్రాసినారు.

'శ్రీ పంతులుగారు బహుముఖమనీషి; మహోద్యమము. బహు ముఖమైన వారి ఉద్యమం తెలిసినంతగా, దేశానికి వారి వైదుష్యము తెలియలేదు. ముఖ్యంగా ఈ తరంవారికి తెలియలేదు... ఆ కాలంలో నాయకులకు వైదుష్యం కూడా ఒక పరికరం. శ్రీ పంతులుగారి రచనలు అనేకం. కాని లక్ష్యం ఒక్కటే. అది మానవాభ్యుదయ సాధనం, ఎడతెగని అన్వేషణ !'

'సంవత్సరాది సంచిక, ఉగాది సంచిక –' అని దాని రెండు పేర్లూ నిరాడంబర మైనవే. 'భారతి' అన్నట్లు దేవతానామంకాదు. కాని అది నిజంగా పంతులుగారికీ శంభుప్రసాదుగారికీ హృదయస్థమైన పర దేవతా స్వరూపంగానే ఉండేది. అది వారికి స్థిర ప్రతిష్ఠతమైన ఇష్ట దేవతామూర్తి. తర్వాత వచ్చిన 'భారతి' దాని చరప్రతిష్ఠతమైన మూర్త్యంతరము. సంవత్సరాది సంచికను స్థిర ప్రతిష్ఠిమైన పరదేవతా

మూర్తిగా భావించారనడానికి శ్రీ శంభుప్రసాదు వ్యంగ్య ప్రధానంగా వ్రాసిన వాక్యాలే ప్రమాణము. చూడండి, శోభకృతు ఉగాది సంచికలో (1963-64) ప్రస్తావనలోని ఈ క్రింది వాక్యాలు :

'ఇది ఆంధ్రపత్రిక ఏభై నాలుగవ ఉగాది సంచిక. సంవత్సరాది సంచికపేరున ప్రసిద్ధికెక్కినది. ప్రసిద్ధికి తగిన ప్రత్యేకతను సంపాదించుకొనియున్నది. తాత్కాలిక ప్రయోజనముకలది కాక శాశ్వత ప్రయోజనముకల సంపుటిగా ప్రసిద్ధి పొందినది. ఆ ప్రతిష్ఠను నిలుపుకొనుటకు సర్వవిధముల ప్రయత్నించితిమి'.

శ్రీ శంభుప్రసాదు సాహిత్యాశయాలు భారతి 'స్వవిషయము'లలో ప్రతిఫలించినట్లుగానే, ఈ సంచికలందును ప్రతిఫలించినవి. అందువలన వాటినుండి విస్తారంగా ఉదాహరింపదలచలేదు. పరాభవ సంవత్సరాది సంచిక (1966-67) నుండి ఈ క్రింది ఉదాహరణ ఒక్కటి చాలును :

'సాహిత్యరంగంలో అధికారంలో ఉన్నవారి ప్రాపు సంపాదించాలనే వ్యామోహం ఎక్కువైంది. దేశంలో ఇప్పుడు సాహిత్యకలాపం అంటే అకాడెమీ అవార్డుల సంపాదనకు వ్యూహాలు పన్నడం, అంకితాలకు రాజకీయ నాయకులను 'పరులు'గా ఎంచడం, ఆవిష్కరణోత్సవాలకు ఆహ్వాన సంఘాలను నిర్మించుకొనడం పద్ధతిలో కొనసాగుతున్నది. ఏ కొద్దిమందో సాహిత్య కృషి చేస్తున్నా, సాంఘికతత్త్వవేత్తలను రాజకీయవేత్తలు దరికీ రానీయని విధంగానే, ఈ నవసాహితీపరులు నిజమైన సాహితీపరులను తమదరికి రానీయడం లేదు. రాజకీయవేత్తలు, సాహితీపరుల మనుకొనేవారు, సినిమా 'స్టారులు' తారలు వెంటపడుతున్నారు... ఇప్పుడు ఇది అంతాకూడా కవిత్వపోషణ కళాపోషణ అనే రాచరికపు భావం మంత్రులలో, నాయకులలో పోతున్నది. ఈ స్థితి తొలిగితేనే కాని మన సాహిత్యం బాగుపడదు. అభివృద్ధి చెందదు. రచయిత స్వతంత్రుడై స్వతంత్రంగా వూహచేయగల స్థితిలోనికి రాడు. స్వాతంత్ర్యానికి పూర్వం దేశంలో నాయకులు ఎట్లా ఉన్నత ప్రవర్తనం కలిగియుండే వారో, అట్లాగే రచయితలుకూడా వున్నారు. ఉత్తమ రచనలు చేశారు. స్వాతంత్ర్యం తర్వాత నాయకత్వం ఏతీరులో వున్నదో

సాహిత్యంకూడా ఆ తీరులోనే వున్నది. స్వాతంత్ర్యం రానిరోజుల్లో రాజకీయ వేత్తలు సాహిత్యం జోలికి పోలేదు. ఇట్లా రాయాలి, అట్లారాయాలి అని చెప్పలేదు. అప్పుడు అట్టి అట్టహాసాలతో కూడిన అంకితాలు, ఆవిష్కరణలు లేవు. ఇప్పుడు ఇవన్నీ వచ్చాయి. రాజకీయవేత్త విమర్శకుడు- ఆలంకారికుడు- సాహిత్యసిద్ధాంత నిర్మాత- పోషకుడూ- బహుమతులు పంచేవాడూ అయిపోయినాడు...ఈ పతనం నుంచి సాహిత్యం తిరిగి బయటపడి ఉద్దీప్తిని పొందాలంటే, రాజకీయవేత్తలకు సాహితీపరులు దూరంగావుండాలి. సాహిత్యంలో అనభిజ్ఞులైన రాజకీయవేత్తలు జోక్యం పెట్టుకో కూడదు. మంత్రి అయినంత మాత్రాన మనీషికాడు. ఆస్థితిని చేకూర్చుకోగలిగినప్పుడు తిరిగి మన సాహిత్యంలో వసంతోదయము అవుతుంది. కొత్త ఉగాది వస్తుంది.'

రచయిత లందరి పక్షాన వారి స్వాతంత్ర్యానికి శ్రీ శంభుప్రసాదు ఎంత పోరాడినారు ! ఇంతకంటే ఏమికావలె సాహిత్య సేవకు !

పంతులుగారు దేశస్వాతంత్ర్యం కోసము పోరాడినారు. స్వతంత్ర భారతంలో రచయితలు ఎట్లా ఉండవలెనో దానికి దారులు తీర్చిదిద్ది ఆ దేశస్వాతంత్ర్యం చూడకుండానే స్వర్గస్థులైనారు.

అట్లుకాక శ్రీ శంభుప్రసాదు భారతస్వాతంత్ర్యం చూచినారు. ఆంధ్రరాష్ట్రావతరణం కూడా చూచి ఆనందించారు. కాని భారతదేశమంతటానూ ప్రత్యేకించి ఆంధ్రప్రదేశంలోనూ, స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత రచయితలు విదేశభావాలకూ, విదేశ సంస్కృతులకూ కేవలం బానిసలై పోవడము చూచారు. రాజకీయ నాయకులకు దాసులై చారణులై పోవడం చూచి పరితపించారు. పంతులుగారు పోరాడినది ప్రత్యక్ష స్వాతంత్ర్య శత్రువుతో. వారికి దారిచూపిన మహాత్ముని వంటి మహానాయకులున్నారు; తోడుగా పోరాటంలో బుజం కలిపిన ఆంధ్రకేసరి వంటి ధీరులున్నారు; వారిని అగ్గించిన నలభై కోట్ల మంది భారతీయులున్నారు.

మరి శ్రీ శంభుప్రసాదు పోరాడినది అప్రత్యక్ష శత్రువుతో, ఆ శత్రువు మేఘనాథునివలె మేఘాల మరుగునుండి నాగబాణాలు వేసిన

వాడన్నా కాదు. ఈ క్రొత్త శత్రువు రచయితల హృదయాంతరాళాల్లో కనబడకుండాచొచ్చి తిష్టవేసి దిగలాగడం చూచారు. శ్రీ శంభుప్రసాదు విజ్ఞాన నేత్రము ఆ శత్రువును చూచింది. ఆయన కరుణాహృదయం కరిగింది. ఈ క్రొత్త శత్రువుతో పోరాడడానికి వారికిదారిచూపిన మహాత్ములు లేరు, తోడునిల్చిన కేసరులు లేరు. అగ్గించిన ప్రజలు లేరు. అయినా కన్నుమూసేవరకూ ఏకాంగవీరుడై రచయితల అంతశ్శత్రువుతో యుద్ధం సాగిస్తూనేవచ్చారు. పరీధావి ప్రస్తావనే వారు ఈ స్వాతంత్ర్య శత్రువు మీదవేసిన చివరి అస్త్రము.

ఒకవిధంగా చూస్తే దేశస్వాతంత్ర్యం చూడనోచుకొని శ్రీ పంతులు గారివలెనే, రచయితల స్వాతంత్ర్యం చూడజాలని శంభుప్రసాదు కూడా దురదృష్టవంతులే! కాని సత్యదృష్టితో తత్త్వ దృష్టితో చూస్తే ఇద్దరూ ధన్యజీవులే. శ్రీ కృష్ణ భగవానుని గీతోపదేశ మేమిటి?

'కర్మణ్యే వాధికారస్తే
మాఫలేషు కదాచన!'

ఇద్దరూ ధర్మవీరులై జన్మాంతముపరకు దేశస్వాతంత్ర్యం కొరకు ఒకరూ, రచయితలవ్యక్తి స్వాతంత్ర్యం కొరకు ఒకరూ, బొందిలో ప్రాణమున్నంత వరకూ ధర్మయుద్ధము సాగించిన మహావీరులు! తమ స్వాతంత్ర్యంకోసము పోరాడిన పంతులుగారి వంటివారిని దేశము కృతజ్ఞతతో, స్మరిస్తున్నది. కాని తమ స్వాతంత్ర్యంకోసము తుదివరకు పోరాడిన శ్రీ శంభు ప్రసాదు వీరవిహారమును కృతజ్ఞతతో స్మరించే రచయిత లెంతమంది ఉన్నారు? అట్టివారు లేకపోరు. కొద్ది మందిఐనా ఉన్నారు. వారందరితరపునా నేను శ్రీ శంభుప్రసాదుకు జోహారు లర్పిస్తున్నాను!

## 7

శ్రీ శంభుప్రసాదు అమృతస్మరణతోనే ఈ వ్యాసము సాగినది. నా సొంత మాటలతోకంటె వారి సొంతమాటలతోనే వారి స్వరూప స్వభావాలు ప్రదర్శించడానికి యత్నించాను. అనేక రంగాలలో ప్రసిద్ధులైన

ఆంధ్రనాయకులను గూర్చి ఆంధ్ర పత్రికలో 'తెలుగు వెలుగు' అనే శీర్షికతో 50 దాకా వ్యాసాలు వచ్చినవి. అవి వ్రాసినది శ్రీ శంభుప్రసాదు గారని ఇప్పుడు తెలియవచ్చినది. ఆంగ్లాది భాషలలో 'లిటరరీ ఎస్సే' అనే సాహిత్య ప్రక్రియ ఆంధ్రభాషలో ఏదో సకృత్తుగాకాని రాలేదు. ఆ శాఖకు చెందినవి 'తెలుగు వెలుగులు.' వాటిలోనాకిప్పుడు ఉపలభ్యమైన కొన్నిటినుండి భాగాలు ఉదాహరిస్తాను. హృదయంగమమైన చమత్కారంతో ఆయా వ్యక్తుల వెలుగు లవి ప్రదర్శిస్తున్నవి.

తాను జబ్బుగాఉండి మహాత్ముని దర్శనానికి రాలేనని శ్రీ కాశేశ్వరరావు చీటీ పంపినారు. 'మహాత్ముని కార్యదర్శి ప్యారేలాల్ ఆ చీటీకి సమాధానంగా ఈ విధంగా ఒక కార్డు వ్రాసి....పోస్టు చేసారు : మీరు ఎందుచేత తరుచూ జబ్బుపడుతున్నారు? బాపు హుకుం అయింది; ఇకమీద జబ్బు పడకూడదు. భయపడకండి.' అంతే; ఆకార్డు ముక్క చేరిన ఉదయం నుంచే జ్వరం ఎటుపోయిందో పోయింది.'

శ్రీ డి. వి. సుబ్బారావునుగూర్చి: 'ఒకసారి ఆయున ఒక పాత్రను, 'చంపుతాను' అని భయపెడుతూ నటించేసరికి, ఆ నటుడు, ఎన్నో రిహార్సల్సు వేసి ఉన్నా ఆ క్షణంలో భయపడి పారిపోయాడు... ఉత్సాహ ప్రభుశక్తియుతమైన 'ఉద్యోగం' వారిది.'

శ్రీ దామోదరం సంజీవయ్యను గూర్చి: 'అదృష్టం వెంటపడతారు కొందరు. అదృష్టమే కొందరి వెంటపడుతుంది.... అదృష్టం వెంటపడితే పారిపోకుండా ఉన్నవారే నిజానికి అదృష్టవంతు లవుతారు. అలాంటి అదృష్టవంతుడు శ్రీ దామోదరం సంజీవయ్య!'

శ్రీ చంద్రమౌళినిగూర్చి:- 'ఈ రాజకీయ వేత్తల కందరికీ ఒక జబ్బున్నది. అది ఆశ్రిత పక్షపాతం. శ్రీ కల్లూరి చంద్రమౌళిగారికి ఇది కాస్త హెచ్చుపాళంలో ఉన్నది. అంతేకాకుండా, ఆయునకు ఆగ్రహం వచ్చినా, అనుగ్రహంవచ్చినా ప్రమాదమే. తనకి తగిలేదీ తెలియదు, ఇతరులకు తగిలేదీ తెలియదు. అయితే చంద్రమౌళిగారు కొంతవేదాంతి.'

శ్రీ మొసలికంటి తిరుమలరావును గూర్చి;—'శ్రీ తిరుమలరావు ఏదో గ్రహపాటున గాంధీమాయలో పడ్డాడుగాని లేకపోతే ఓ ఛోటా

పాదుషాలాగా అనవరతము చిన్నదర్బారు నడుపుతూ ఉండేవాడు...శ్రీ తిరుమలరావుకు ఇంతకాలమూ ఢిల్లీవైపే చూపు. అది ఇంతవరకు రాష్ట్ర రాజకీయాలవైపు మళ్లలేదు.'

శ్రీ అద్దంకి శ్రీరామమూర్తి:—'నాటకం చూసిన తర్వాత కొన్నాళ్ల వరకు అద్దంకివారి దశరథుని ఆవేదనాస్వరం వెంటబడి వినబడుతుంది. అద్దంకి మరుగుపడిపోయి దశరథుడే కనబడుతాడు.... అద్దంకి శ్రీరామమూర్తి కంఠం శంఖనాదంలాగా ఆరంభమై ఘంటానాదంలాగా నిలిచి మోగుతుంది.'

శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్: 'కనకదుర్గమ్మవలె ఈ కాకినాడ దుర్గమ్మ శక్తిమయి....అప్పటికి (ఉప్పు సత్యాగ్రహం) ఆమెకు పట్టుమని ఇరవయి ఏళ్ళుకూడా లేవు. అందుకనే అవిడను 'జోన్ ఆఫ్ ఆర్కు' వంటి వీరవనిత అని ప్రస్తుతించారు...(సోషల్ వెల్ఫేర్ బోర్డు) ఒక చిన్న సామ్రాజ్యం. ఆమె దానికి మహారాజ్ఞి. 'స్తోత్రప్రియాయై నమః.'

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు: 'శిష్యవర్గం ప్రచారంతో కొందరు, అభిమానుల ఆదరంతో కొందరు, అధికార ప్రాభవంతో కొందరు గొప్పవారు అవుతుంటారు. కేవలం తమ పరిశోధనతోనే, దాని ఫలితమైన రచనలతోనే గొప్ప కెక్కినట్టివారు శర్మగారు ... శర్మగారు చాకలిబండ అనుకున్నవాటిని కూడా చదువుబండలుగా చదివిన దిట్ట.'

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు: 'వండబారుతున్న పసిడిమైతీగ; పట్టుపీతాంబరం, ఉజ్జ్వలమైన ఊర్ధ్వత్రిపుండ్రాలు; అనుష్ఠాన తత్పరతతో శేషించిన ఆనందచ్ఛాయలు.... సప్తతి సమీపించినా, ఆయనలో మెరుపు తీగవంటి చురుకుదనం ఉంది.... ఆయనది ప్రధానంగా విమర్శాధికారంగల వ్యక్తిత్వం.... వ్యుత్పత్తి మీద గౌరవంకంటె వ్యుత్పన్నతమీద ఆదరం.'

అత్యున్నతమైన ఆశయాలతో శ్రీ శంభుప్రసాదు తమ సంస్థలోని అన్ని సాహిత్యవిభాగాలకూ రూపుదిద్ది, బహుముఖ రచనలు చేయుటకు రచయితలను ఆకర్షించి, ప్రతివారికీ యథోచిత స్థానమిచ్చినారు. కవితలో సంప్రదాయకవిత, భావకవిత, అభ్యుదయకవిత, వాస్తవిక

కవిత, వచనకవిత, దిగంబరకవిత—అన్నిటికీ స్థానమిచ్చినారు. వారి వారి సిద్ధాంతాలకు, వాద ప్రతివాదాలకు అవకాశము కలిగించినారు. కవితా శాఖలోవలెనే కథానిక, నాటిక, వ్యాసరచన మొదలైన అన్ని సాహిత్య ప్రక్రియలను ప్రోత్సహించారు గ్రంథ సమీక్షలకు గౌరవస్థానము లభించి నది. సంవత్సర సాహిత్య సమీక్షలూ, పది సంవత్సరాల సాహిత్య సమీక్షలు చేయించినారు. విశ్వసాహిత్యములో నూతన సిద్ధాంతకర్తల భావాలు విపులంగా ఆంధ్రులకు పరిచయం చేశారు. నిరాడంబరంగా శ్రీ శంభుప్రసాదు చేసిన సేవ దిఙ్మాత్రంగా ప్రదర్శించడానికి ప్రయత్నించాను. స్వానుభవాలు కొన్ని ముచ్చటించి ముగిస్తాను.

నాకు మొదటిసారి భారతిలో సమీక్షకై 1962లో భాసర్వజ్ఞ రచితమైన న్యాయసారః, ఆనందపూర్ణ మునీంద్ర ప్రణీతమైన న్యాయ చంద్రికా వంటి బరువైన గ్రంథాలు కొన్ని పంపుతూ 'ఈ కాలంలో పెద్దలలో కూడా మోమోటము ఎక్కువవుతున్నది. నిష్పక్షపాతంగా సమీక్ష చేయవలెనని నాకోరిక' అని తాత్పర్యంగల ఉత్తరము వ్రాసినారు. నేనందుకు అంగీకరించి ఇంతవరకు నామాట దక్కించుకొన్నాను. నేనూ మానవమాత్రుడను కనుక పొరపాట్లుచేసి ఉండవచ్చునుగాని బుద్ధిపూర్వముగా పక్షపాతము చూపుటగాని, వృథాదూషణ చేయుటగాని, ఉన్న గుణము విస్తరించక పోవుటగాని చేయలేదని నావిశ్వాసము. నామాట యందు శ్రీ శంభుప్రసాదు గారికి చివరివరకూ విశ్వాసముండిన దనడానికి, వారు చివరకు జబ్బుతో ఉండికూడా నాకు సమీక్షార్థము పంపుచుండిన గ్రంథాలే నిదర్శనము. ఇతర సమీక్షకులకు కూడా వారు ఇట్లాగే వ్రాసి ఉంటారు.

వారెప్పుడూ ఆద్యంతము స్వదస్తూరీతోనే నాకు ఉత్తరాలు వ్రాసేవారు. నాకేకాదు, మా పట్టణములోనే ఉన్న యువరచయిత్రికి కూడా స్వదస్తూరితోనే వ్రాసినదాన్నిబట్టి తమ వ్యాసకర్తల కందరికీ అట్లాగే వ్రాసేవారని అనుకుంటున్నాను. ఆమె "తమ ఉత్తరాలలో నమస్కారాలువద్దు. చిన్నదానను ఆశీర్వదించండి" అని వ్రాస్తే, 'మా వ్యాసకర్తలందరూ నాకు పూజ్యులూ, పూజ్యురాండ్రే కనుక నమస్కారమే చేస్తాను'

అని శ్రీ శంభుప్రసాదు జవాబు వ్రాసినారు. ఈ ఉదంతాన్నిబట్టి వారికి తమ వ్యాసకర్తలమీద ఎంత గౌరవ భావముండేదో అనుమేయించ వచ్చును.

ఆంధ్ర వారపత్రికను ఒక వినాయక చవితి నాడు ఉద్ధరిస్తూ ప్రారంభించిన ప్రథమ సంచికలోనే, నా 'నారాయణభట్టు' ధారావాహికంగా ప్రచురించడమారాంభించినారు. నారాయణభట్టు ఎప్పుడు చూచినా నాకు శ్రీ శంభుప్రసాదు స్మృతికి వస్తారు. ఆ నవల పునర్ముద్రణము చేయబోతూ వారిని బెజవాడలో కలసికొని 'ఈ మాటు ముద్రణలో మీ పేర అంకితముచేసి ప్రచురిస్తాను, ఉత్సవాదులు ఏమీ వద్దు!' అని నేను కోరగా, వారు మర్యాదగా వద్దన్నారు. నా హృదయములో మాత్రము ఆ నా ప్రథమ నవల వారికే అంకితమైనది.

సాహితీ సమితికి నేను కార్యదర్శిని ఐన తర్వాత ఒక సంవత్సరము వార్షికోత్సవానికి వారిని ప్రారంభోత్సవము చేయమని అర్థించగా, మళ్ళీ మర్యాదగా తప్పుకున్నారు. ఆ విషయము నా సమక్షములో తర్వాత ఇతరులతో ప్రస్తావించి 'ఒకసారి నన్ను ప్రారంభోత్సంలోకి దింపడానికి శ్రీ శాస్త్రిగారు ప్రయత్నించారు గాని తప్పించుకొన్నాను' అం టూ నవ్వుతూ చెప్పినారు. కాబట్టి వారప్పుడు కొంత తటపటాయించి ఉండవలె!

శ్రీ శంభుప్రసాదుగారు రచయితల కందరికీ ఇచ్చిన ప్రధాన సందేశ మొక్కటే! మీ స్వాతంత్ర్యం చేజేతులా వదులుకొని బానిసత్వం లోకి దిగజారి పోకండి! 'నిరంకుశాః కవయః!' అని గుర్తుంచుకోండి! దానితో పాటే మీరు విజ్ఞానం పెంచుకొని మీ బాధ్యత గ్రహించండి. మీరు జగత్తుకు ప్రవక్తలు. నా నృషిః కురుతే కావ్యమ్! సర్వేజనాః సుఖినో భవంతు!

(భారతి జులై_1972)

# శతావధాని వేలూరి శివరామశాస్త్రి

మార్చి 18 ఉదయాన ఆంధ్రపత్రిక చూడగానే వేలూరి శివరామ శాస్త్రి అస్తమయ వార్త ముందు కనబడ్డది. వెంటనే ఒక్కసారిగా నా మనస్సు 56 సం॥లు వెనక్కు పరుగెత్తుకొనిపోగా, వారు గుంటూరు కాలేజి హాలులో చేసిన మొదటి శతావధానము ఆరంభించిన నాటి వారి మూర్తి తళుక్కున మెరిసింది. ఎర్రని ఎరుపు రంగు, కొంచెము పొట్టి అయినా పుష్టిగల జబ్బలతో బలిష్ఠమైన శరీరమూ, అంతటా 20 ఏళ్ళ యౌవనకాంతి మిసమిసలాడుతున్న వారి రూపము ప్రత్యక్షమైనది. ఉత్సాహానికి పొడుము పీల్చినప్పుడల్లా, ఆ ఎర్రటి పెద్దముక్కు రక్తము చిందుతున్నట్లుండేది. కవుల తగాదాలు ఉద్ధృతంగా సాగుతున్న రోజు లవి ! అప్పటికే ఆయన తిరుపతి వారి శిష్యులలో అగ్రగణ్యుడనే ప్రతీతి ఉన్నది. ఏ మాత్రము పొరసందు వచ్చినా అల్లరి చేయవలెననే పట్టు దలతో ప్రతి పక్షమువారు కాచుకొని ఉన్నారు. ఆ సందర్భంలో ఆ ఇరవై యేళ్ళ యువకుడు మొదటి శతావధానమూ, అది సంపూర్ణ శతావ ధానము చేయపూనుకొన్న ఆయన సాహసమూ, గురువులకు ఉన్న విశ్వాసమూ తలంచుకొంటే ఇప్పుడు కూడా గగుర్పాటు కలుగుతున్నది.

నా కప్పుడు సరిగ్గా పదకొండేళ్ళే, ఐనా ఆనాటి సభా చిత్రము అచ్చొత్తినట్లు స్పష్టంగా స్మృతి పథంలో ఇప్పటికీ నిలిచి ఉన్నది. అవ ధానారంభంలో వెంకట శాస్త్రిగారు ఇష్టదేవతా స్తుతి పిమ్మట "ఎరుగడు పిల్లకాయ, ఎటులే యొనరించు శతావధానమున్" అన్న పద్యపాదము వారి ప్రత్యేకపు గొంతులో గింగురు మంటున్నది. పృచ్ఛకులడిగిన చిత్ర చిత్రమైనవాటిలో అలుకుగుడ్డ మీద సీసపద్యము చెప్పమన్నది స్పష్టంగా జ్ఞాపకమున్నది, ఆ పద్యము మొదటి పాదముతో సహా !

'శృంగారు కట్టచే జిమ్మిన భూమిని
జలము సింగారించి యలుకు కొరకు'

మళ్ళా మూడవనాడు గాని సభ వద్దకు నేను వెళ్ళలేదు. అప్పుడు వారి మూర్తి అంతా ఎంత వాడిపోయి ఉన్నదా అనిపించినది చూడ గానే! ధారణ శక్తిని ఎంత గుంజివేస్తుందో తెలిసినది.

వారే ఒకచోట శతావధానాలవల్ల తనకు సిద్ధించినది ఉబ్బసమే అని వ్రాసినారు. ఆ ఉబ్బసము, నిరంతర విద్యావ్యాసంగము, స్వగృహముతోపాటు అమూల్యమైన వారి గ్రంథ భాండాగారము, వారి రచనలూ అగ్ని ప్రమాదంలో నీరవుట, కొన్ని రచనలు చోర గ్రస్తమవుట, సంసారబాధలు వారి శరీర దార్ఢ్యాన్ని పిల్చి వేసినవి. కవులకు సర్వ సాధారణమైన దారిద్ర్యం బాధ ఒక్కటే వారిని బాధించనిది. ఇన్ని బాధలతో వారు 76 సం॥లు జీవించినారంటే, పూర్తిగా నూరేళ్ళు జీవించ డానికి జన్మించినారని తోస్తుంది.

ఆ తర్వాత మళ్ళా వారిని అప్పుడప్పుడు చూస్తూ వచ్చినా, భారతి రజతోత్సవ సభకు అధ్యక్షులుగా వారు వచ్చినప్పుడు, శ్రీ బాగ్‌లో వారితో సన్నిహితుడనై గడపిన నాలుగైదు రోజులు మళ్ళా జ్ఞాపకము వచ్చినవి. అప్పుడు వారు గుండెలో బాధతో ఏ క్షణానికి ఆ క్షణము ప్రాణము వదలేట్లు కనబడేవారు. ఐనా శాస్త్ర ప్రశంస వస్తే వారి వాక్కు స్వచ్ఛంగా వినబడేది. శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారు తమ కావ్య మొకటి వారికి వినిపించి సూచనలు గ్రహించి వెళ్ళినారు.

నే నప్పుడు 'రుద్రమదేవి' నవల వ్రాస్తున్నానని తెలుసుకొన్నందున వారు ఇంటికి వెళ్ళగానే, ఆ కాలపు శాసనపు ప్రతి ఒకటి వ్రాసి అవసరమయితే ఉపయోగించు కొమ్మని నాకు పంపినారు. నే నడుగకుండానే అంత ప్రేమతో వారది పంపినందుకు ఎంతో ముగ్ధుణ్ణి ఐనాను.

వేలూరి శివరామశాస్త్రి అస్తమయముతో పూర్వకాలపు మేటి విద్యాంసులకూ, నేటి నవనాగరక లోకానికి ఉన్న లంకె మరొకటి అంతరించినది!

## 2

శివరామశాస్త్రి గాఢముగా అధ్యయనము చేయని శాస్త్రమంటూ లేదు. వ్యాకరణము, సాంఖ్యము, యోగము, న్యాయము, వైశేషికము,

పూర్వోత్తరమీమాంసలు, ధర్మశాస్త్రములు, తంత్రశాస్త్రములు-అన్నిటితో పాటు సాహిత్య శాస్త్రము వారు పఠించినవే. కాని వాటి అన్నిటిలో గురుకులవాసము చేసి పూర్వుల నియమాలతో అధ్యయనము పూర్తిగా చేసినది వ్యాకరణ శాస్త్రము, జయంతి భగీరథశాస్త్రి పూజ్యపాదుల వద్ద. కొంతవరకు అదే విధంగా సాహిత్య శాస్త్ర రహస్యాలు తిరుపతి వెంకటేశ్వరుల వద్ద గ్రహించుట వల్లనే వారి శిష్యులు. అందువల్లనే కాబోలు, ఆ రెండు శాస్త్రాల ప్రశంస వచ్చినప్పుడు, వారు అధికారికంగా నిలిచేవారు: అనాదిగా వస్తున్న సంప్రదాయ పద్ధతులు ఆ రెంటి విషయంలో విడనాడడానికి అంగీకరించే వారు కారు. సంస్కృతంలో శబ్ద దోషము వారేమాత్రము సహించేవారు కారు. ఆంధ్రముకూడా, గ్రాంధికముప్రాసినా వ్యావహారిక మవలంబించినా, కట్టుబాటుతో ఉండేది వారి రచన.

ఇక సాహిత్యశాస్త్ర మంటేనే నిత్య నూతనమైనది. ఎక్కడ నవనవోన్మేషము కల ప్రతిభ కనబడ్డా వారు అభినందించేవారు. భావ కవిత్వము మీద పండిత పామరలోకము దాడి చేసి హేళన చేస్తున్న రోజులలో, వారు 1928 సం॥ సెప్టెంబరు భారతిలో 'భావ కవిత్వము' అనే చక్కని వ్యాసము ప్రచురించినారు. అందులో భావ కవిత్వము అనే పేరుతో చలామణి అవుతున్న 'లిరిక్' నిజముగా మంచి కవిత్వమే అని నిరూపించారు. రాయప్రోలు వారి 'విరహము' ఉదాహరించి "సాహిత్య శాస్త్రములో ఇది రసధ్వని. విప్రలంభము వ్యంగ్యము" అన్నారు శ్రీ శివశంకరుల 'చిత్తకుబ్జ' ఉదాహరించి, 'సాహిత్య శాస్త్రమున దీనికి భావధ్వని అని పేరు' అన్నారు. అందులోనే చివరకు ఇట్లా అన్నారు; ఈ జాతి (లిరిక్) కవిత్వము నిక్కముగా కవి సర్‌ఫకాస్ (సొంత అస్తి) (Private Property) ఇందు కవి దానవీరుడై....(కవి మనస్సును ద్రాక్ష వలె పిండి యిచ్చును) 'న మమ' అని సంకల్పించి తన సర్వస్వమును లోకులకు ధారవోయును. ఈ విధంగా ఆ కోవ కవిత్వాన్ని సమర్థించినా, భావ కవిత్వము అనే పేరు మాత్రము సమర్థించ డానికి వారి మనస్సొప్పకోక సరసంగా దాట వేశారు. 'భావ కవిత్వము అనునది ఒక పుస్తకమునకు పేరును కాజాలదు...ఆ జాతి

గ్రంథమునకు లాక్షణికముగనో వ్యంజకముగనో ఒక పేరు కావల యును...ఆ పేరునకు మనకు అంతగా తొందర లేదు.' ఇట్లా అంటూ వ్యాసంలో ఎక్కువ భాగము దాన్ని లిరిక్ అనే ఇంగ్లీషు పేరుతోనే నిర్దే శించారు వ్యాకరణ సాహిత్యాలలో శివరామశాస్త్రి బుద్ధి ప్రహతమైన బాటనే నడిచేది

తక్కిన శాస్త్రాలలో వారి పాండిత్య మంతా స్వయంకృషి చేసి సాధించినదే. సంస్కృత వ్యాఖ్యలు, ఇంగ్లీషువ్యాఖ్యలు అసంఖ్యాకంగా ఉన్న గ్రంథజాతము నిశితముగా నిరంతరంగా పఠించి వాటి స్వరూ పము తెలుసు కున్నారు. మహాసముద్రమువంటి దర్శనామృతాన్ని వారు అగస్త్యువలెనే చుళికింపవలెనని పాటు బడ్డారు. ఈ దర్శనాలు అభిమాన ముతో పఠించే వారికి దేని కదే సత్యదర్శనముగా భాసిస్తుంది. వాటిలో యోగము, యోగసాధనము చేయనిది సంపూర్ణముగా అవగతము కాదు; పూర్వ మీమాంస యజ్ఞ యగాది క్రతువులు చేసిన వారికే కాని సిద్ధింపదు; ఉత్తర మీమాంస ప్రణవానుసంధానము చేయువారికే కాని ఆత్మ స్వరూప మందింపదు. తంత్రశాస్త్రము కూడా మంత్రానుష్ఠానము చేయు వారికే కాని ప్రత్యక్షము కాదు. వీటిలో గ్రంథాలు అవలోడన చేసేటప్పుడు అతి సులభంగా కన్పడేవే, ఆచరణలో అతి కష్టసాధ్యములుగా తెలుసు కుంటాము.

శివరామశాస్త్రి దర్శనాలు శాస్త్రదృష్టితోనే పఠించినారు. కాని ఆచరణము జూపించడానికి వారు పూనుకోలేదు. అందువల్ల వారు దర్శ నాదుల విషయము ఏది చెప్పినా, స్వానుభవముగా చెప్పబోక, పూర్వ చార్యులయు ప్రసిద్ధపండితులయు, మహాయోగులయు రచనలను అనువదించుచు వచ్చినారేకానిస్వయంగా వ్రాయడానికి పూనుకోలేదు. మాయావాదమును గూర్చి భారతిలో వారుచక్కని వ్యాసాలు నాలుగు వ్రాశారు. విశ్వభారతిలో విధుశేఖర భట్టాచార్యులవారు ప్రచురించిన 'ప్రాచీన భారత వర్షమునందు శూద్రులకు గల యధికారము' అనే వ్యాసము భారతిలో (1965)అనువదించారు. ఈ మధ్య భారతిలో అరవింద యోగుల అభిమానతత్త్వాన్ని గూర్చి ప్రచురిస్తూ వచ్చిన వ్యాసాలూ ఆ

కోవలోనివే అవి అతిజటిలమైన విషయము!' చివరివ్యాసము 'ఋత—చిత్' వ్యాసాంతములో అథోజ్ఞాపికలో యోగశాస్త్ర వ్యాఖ్యామునుండి ఋతంభరా ప్రజ్ఞను ఉద్ధరించి వివరించారు.

# 3

ఈ మధ్యనే భారతి యందు అభిమానమున్న ఒకానొక పాఠకులు ఈ వ్యాస పరంపరలో ఒక దానిని పేరెత్తి చూపడము విచారకరమైన విషయము. అది ఆ పాఠకుని దోషము కాదు. ఈ కాలము నావహించిన దోషమే. జటిలమైన విషయాలు ఉన్నవని కాని, అవి తెలుసుకోవలసిన వని కాని భావించే జనుల సంఖ్య తక్కువై పోతున్నది. మరి వాటిని అవగాహన చేసుకోడానికి వారెట్లా శ్రమపడి ప్రయత్నిస్తారు ?

ఇంతవరకూ శివరామశాస్త్రి శాస్త్ర వ్యాసంగాలను గూర్చియే ప్రస్తావించినాము. కాని వారు ప్రధానంగా కవీశ్వరులని ప్రసిద్ధులు కదా, కావ్య రచనలో వారు సాధించిన దేమి అనే ప్రశ్న వస్తుంది.

వా రెన్నో పద్య కావ్యాలు రచించినారు. కాని అవి అన్నీ అగ్నిహోత్రునికి ఆహుతి ఐపోయినవి, గుణాఢ్యుని బృహత్కథ వలెనే పాఠకులకు దక్కకుండా! బృహత్కథలో కొంత కాలము వరకు జీమూతవాహన చరిత్ర మాత్రము నిలిచి ఉన్నట్లే శివరామశాస్త్రి కావ్యాలు కూడా ఇంకా ఏవో మిగిలి ఉంటవనే ఆశ నాకున్నది. వారి పద్య రచనలోని సొగసు ప్రదర్శించేందుకు భారతి రెండవ సంపుటంలో ప్రచురింపబడ్డ పద్యాలు కొన్ని ఉదహరిస్తున్నాను :

కవి

'నా రాజ్యంబున దొత్తి వర్షము వసంతం బావలం
గాని పై వేరే కాలము లేదు, ధౌతసికతా విశ్రాంతిధామాలె కానీ
రొంపుల్ కనరావు. వెన్నెలలె కానీ యెండలే లేవు,
పుష్పారామంబులె కాని లేవొకట శూన్యంబౌ స్థలా భోగముల్!
'మాకు నాహార వస్తువుల్ మంచి మంచి
యూహ లానంద సందోహ దోహలములు

వాని బడసిన యెడ మాకు బారణంబు
పడయు గలుగనిచో హరి వాసరంబు.'

x x x

శిల్పి

వ్రాయుదు నాకాశంబును
వ్రాయంగా గలను నేను వాయువును మరిన్
వ్రాయుదు జీవలహస్యము
వ్రాయంగా గలను నేను భగవాను నొగిన్.
"ఎవ్వ రాయన్న వారహో, యీశ్వరునకు
లేదు రూపంబు రూపంబు లేదటంచు,
వ్రాసి యుంటి నిదే భగవంతు నిందు
దీని గని మీ మతంబు దిద్దికొనుడయ్య!"

పై పద్యాలలో కవిని ఎంత ఆనంద మూర్తిగా చిత్రించారు! శిల్పిని ఎంత ధీమా కల వానిగా ప్రదర్శించారు!'

"ఎవ్వరా యన్న వారహో!"

'ఆంధ్రుడా' అని వ్రాసిన మరొక ఖండకావ్య విషయాలు ఆంధ్రు లంతా గమనింప దగినవి!

'తెలివికి సంస్కృతమున్ మరి
కలిమికి నాంగ్లేయమో యికం దురకంబో
విలువ యిడి నేర్చి యీ వీ
తెలు గెవ్వరి పాలుచేసి తిరిగెద వాంధ్రా!
'ఒక్క భాష కాదు చిక్కిన భాషల
నన్ని గూడ నేర్వు మయ్య యాంధ్ర.
నీదు మాతృభాష నిఖిల పుష్పరసమ్ము
చేత దేనె పెరను జేయు మయ్య

వాక్కుండియును మాతృభాష రాకుండుచో గడుమాటలేల మూకు డవు సుమ్ము- బధిరుడవు- అంధుడవు- అన్యదేశ్యుడవు- పంగుడవు- పిచ్చివి- అని ఉద్బోధించినారు.

వారి లేఖినిలో తెలుగు భాష కొత్త పలుకు బళ్ళు అంద చందాలు శక్తి సంపాదించు కొన్నది. వారు సంస్కృతాంధ్రములే కాక ఇంగ్లీషు, ఫ్రెంచి, బెంగాలీ, గుజరాతీ భాషలు కూడా బాగా నేర్చు కొన్నారు.

దొరికిన కొద్ది పద్యాలూ చదివి నప్పుడు, ఇంకా ఎన్ని ఐనా దక్కి ఉంటే బాగుంటుందనిపిస్తుంది. వ్రాసిన కావ్యాలు అగ్ని కాహుతి కావడంతో విరక్తి కలిగి పద్య రచన చేయలే దంటారు. కాని తిరిగే కాలూ, తిట్టే నోరూ ఉరుకోలేక పోతే. పద్యాలు వ్రాసే చేయి మాత్రము ఉరుకో గలదా? త్వరలోనే కొన్ని కావ్యాలైనా బయట పడక పోవని నా విశ్వాసము!

## 4

శివరామశాస్త్రి వచన రచనలలో బహుళ ప్రచారము పొందినవి వారి అనువాద గ్రంథాలు. అన్నిటిలో ముందు స్మరణకు వచ్చేది మహాత్ముని 'ఆత్మ కథ' అనువాదము, ఆంధ్ర గ్రంథమాలలో ప్రచురించి నది. ఆ అనువాదము ఎంత ముచ్చట కలిగించే తెలుగులో సాగిందో చదివిన వారికే కాని తెలియదు. దుష్కరమైన కార్యము సాధించారు.

వంగభాషలో నుండి శరత్‌బాబు నవలలు ముందు అనువదించి తెలుగు వారికి శరత్ సాహిత్యము రుచి చూపింది వారేమో!

ఇంకా వారెన్నో శాస్త్ర గ్రంథాలకు వివరణలు వ్రాశారు. ఇతరుల గ్రంథాల కెన్నిటికో చక్కని పీఠికలు వ్రాసినారు. ఏమి వ్రాసినా వారి బుద్ధి సూక్ష్మత సమన్వయము వైపుకే ఒగ్గేది కాని ఖండన వంకకు మళ్లేది కాదు. వారి అపారశాస్త్ర పాండిత్యము వల్ల ఇతరుల గ్రంథాలలో ఎన్నో దోషాలు కనిపించి ఉండవలె. కాని వారు ఇతరులను ఖండించిన ప్రస్తావము కనబడదు. మరీ దోషముగా కనిపించి నప్పుడు కొంచెము దిద్దుబాటు వలె సూచిస్తారు, వారి శిల్పి 'దిద్దు కొనుడయ్యా' అన్నట్లే! అల్ప పాండిత్యా లున్నవారు ఇతరుల దోషాలు చూపితే తమకు అతి శయము వస్తుందను కొంటారు. కొంత మందికి దోషాలు కొట్ట వచ్చినట్లు కనిపిస్తవి. కాని శి. రా. శాస్త్రికి ఏదో విధంగా సమన్వయము మీదకే దృష్టి పోతుంది. కవుల పట్టుదలలు తగాదాలు అల్లరుల మధ్య మొదట

వెలుగులోకి వచ్చిన వీరు, ఈ విధమైన సంయమనము సాధించినారంటే, వీరికి స్వతస్సిద్ధమైన సౌశీల్యము. సహృదయత, అపార కరుణ-ఇవే కారణాలని చెప్పక తప్పదు. వారు వైదుష్యముతో పాటు ముఖ్యంగా జీవితములో సాధించినది ఈ సౌజన్యమే! వారందు వల్ల నిస్సందేహంగా ఉత్తమ సాధకులు!

## 5

ప్రస్తుతము లభ్యమవుతున్న వారి రచన లన్నిటిలో ఉత్త మోత్తమమైనవి వారి కథానికలు అనడంలో రెండభిప్రాయాలు ఉండవు. కథానికా రచన తెలుగులో బాగా విస్తృతి పొందక పూర్వము దాని రూపు తీర్చి దిద్దిన వారిలో అగ్రగణ్యులు శివరామశాస్త్రి. వారు మొదట టాల్‌స్టాయి కథానువాదంతోనే ఆంధ్ర కథానికా ప్రపంచంలో అడుగు పెట్టడము గమనార్హము. కాని త్వరలోనే వారి స్వతంత్ర కథానికలు రాసాగినవి. వాటిలో కొద్ది మాత్రము స్కెచెసు ఆనదగినవైనా ఎక్కువ భాగము పరిపూర్ణత కల కథలే. వాటిలో కొద్దిగా మాత్రమే గ్రంథ రూపంగా వచ్చినవి. భారతిలో ప్రచురించిన వారి కథలే ఎన్నో సంపుటాలుగా ప్రచురించ వచ్చు!

కథానికా రూపంలో వచ్చిన వారి ప్రతి రచనా ఒక్కొక్క కొత్త అందంతో ప్రకాశిస్తుంది. అందమూ శక్తి సాధించినవారు ఆంధ్ర కథకులలో నాకు కనిపించలేదు. ఈ క్రింద వారి కథలలో కొన్ని భాగాలు ఉదాహరిస్తున్నాను. అంత బాగా తామెవరైనా వ్రాయగలరేమో నేటి కథకులను ఆత్మశోధన చేసుకోమని అర్థిస్తున్నాను. వాటిని అనుకరించడము కూడా కష్టసాధ్యమని తోస్తుంది.

'కృతి' (భారతి సంపు. 2 సంచిక 3) అనే కథ వ్యంగ్యంగా మానవులలో కుల భేదాదులు పుట్టిన క్రమము వర్ణిస్తుంది- బ్రహ్మ శాస్త్రి రామచయనుల సంభాషణలో. ఈ కథలో సందర్భవశాత్తుగా తమ గ్రంథాలు పోయిన సంగతి మరో రూపంగా చూపించారు. అందులో కవులను గూర్చి వారన్న మాటలు చూడండి!

'వారు సంపూర్ణ సత్యమును తెలియ జేయుటకు మాత్రమే యసత్య మాడుదురు. వారి మాట పాట. వారు నవ్వి యేడిపింతురు. దుఃఖమును సుఖింప జేయుదురు. వారి భాషయే సత్య భాష, దేవభాష. అట్టి భాషతో మాటలాడిన వారింత వట్టు మృతి యెరుగరు."

'జన్మాంతర సంబంధము' (భా. సం. 3–9)లో చదువు రాని మంచన్నను గూర్చి. "మంచన్నకు గుంట ఓ న మా లు దిద్దుటచే చూపుడు వేలుకు ఒక కణుపే మిగిలింది " ఎంత సున్నితమైన హాస్యము!

'సౌందర్యోపాసనము' (భా. 3-10)లో గురుకులంలో వస్తువులు కైంకర్యము కాసాగినవి. తన చెప్పుల జత కూడా వాటి దారినే పట్టగా ఉపాచార్యుడు ఆచార్యులతో, 'నాకును తిరుమంగయ్యాళ్వారులు ఎదురుగా వచ్చిరి' అనును.

'చంద్రిక' (భా. 4-1) వెలమవారిలో రెండు ప్రభు కుటుంబముల మధ్య బహు కాలంగా సాగుతూ వచ్చిన విరోధము సరి దిద్దడానికి ఉద్య మించిన వివాహమే ఆ రెండు వంశాలను ఏ విధంగా నిర్మూలము చేసి నదో ప్రదర్శించిన కథ. ఇందులో భయాన కాద్భుతాలు పెనవేసు కొన్నవి.

ఈ కథ విశ్వసాహిత్యంలో గౌరవస్థాన మలంకరించ దగినది. వివాహవేదిక రణరంగంగా మారుట వర్ణించిన వాక్యాలివి;

'ఆ ఘోషణమే యుద్ధారంభమునకు డుబ్బుచ్చి. ఈ సంకులారావ మున రెండు సేనలును తలపడెను. వెన్నెలకంటి వారి వంశమునకు విక్రమరావుగారే మిగిలిరి; కలువ వారి వంశమునకు వెంకయ్యమ్మా రావుగారే శేషించిరి ' కథాంతములో వారిద్దరూ కూడా భయంకరంగా నిశ్శేషులవుతారు.

'అతిథి దేవుడు' (భా. 4-3)లో వెంకట్రావు వర్ణన 'కొన్నాళ్ళు నాటకములలో ఉండెను. కంఠమున కాకి అధిదైవతముగా ఉండుట వలనను ఆంధ్రమున ఆదరము లేకపోవుట వలనను అందులకును తిన్నగా

పనికిరాలేదు. అతనికి పూటకూలి యింటనే అన్నప్రాశనమైనది. అతని కదే స్వగృహము

'దర్జా' (ఖా. 5-7)లో తహశీల్దారుగిరి కావలెనని సుందరకాండ పారాయణ చేస్తున్న అప్పరు సెకండరీ మేజస్ట్రేట్‌ను వర్ణిస్తూ, 'ఇహ నుంచీ కావ్యం యొక్క ఉపయోగాలలో వ్యాజ్యాలు గెలవడం, ఉద్యోగాలు పొందడం- ఈ రెండూ కూడా పరిశిష్టాల కింద పరిగణించాలి' అంటారు. ఈ కథ కూర్పులో నేర్పు అద్భుతమైనది. ప్రతి చిన్న సంఘటనా ఆ మేజస్ట్రేట్‌కు తనకే తహశీల్దారు ఆర్డరు వస్తుందని నిరూపిస్తుంది. తహశీల్దారు ఉద్యోగం ఆర్డరు తెచ్చిన టెలిగ్రాము బంట్రోతుకు రు 10/లు ఈనాము ఇచ్చి చదువుకుంటాడు. బి ఏ ప్యాసయి నాలుగేళ్ళబట్టి ఉద్యోగం రాకుండా ఉన్నదని చెప్పిన తన అతిథి బిందు మాధవరావుకు ఉద్యోగము రావడం లిమిటేషను పట్టినట్లే అని సానుభూతి అంతకు ముందే చూపి ఉన్నాడు. ఈ ఆర్డరు వచ్చినది ఉద్యోగము లిమిటెషను పట్టిన ఆ బిందు మాధవరావుకే !

'క్షమాపణ' (ఖా. 5-10)లో జమీందారీ కుటుంబపు కథానాయిక భర్త ఎంత చెప్పినా ఘోషా మానక, భర్త మిత్రుని మీద వ్యామోహం చేత మాని అతని వద్దకు పోయి ఉంటుంది. అతడు మాత్రము ఆమెను అమ్మనుగానే చూడగా పశ్చాత్తాపంతో ఆమె తిరిగి ఇంటికి వచ్చిన ఘట్టము.

'నేను మేడమెట్లెక్క దొడగతిని. ఒక్కొక్క మెట్టెక్కుట లోకమెక్కినట్లుండెను. చివర మెట్టు నెక్కి నా యవమానము నెక్కితిని. డాబా మీద నిలువబడి తొల్లిటి నా మీద నేను నిలువబడితిని'.

ఈ కథలో మిత్రుల సంభాషణలో 'తర్కము, వైశేషికము, పూర్వ మీమాంస, ఉత్తర మీమాంస, తంత్ర శాస్త్రము, వైద్య శాస్త్రము, ఆస్ట్రేలియాలజీ, ఫైలాలజీ, జియాలజీ, బయాలజీ, థియాలజీ, కెమిస్ట్రీ, ఫిజిక్సు, కొరాను, బైబులు, జెందవెస్తా, బుక్కు, ఉపనిషత్తులు లోనగునవి సులువుగా ఉపబృంహితము లగుచుండెను' అని చెప్పి శివరామ శాస్త్రి తమకు అభిమాన విషయాలు పరోక్షంగా ఏకరువు పెట్టించినారు.

'అంతర్నాటకము' (భా. 5-2)లో గోపాలుడు భార్య రాధచేత స్త్రీ పాత్రధారణ చేయమని పోరాడుతాడు. ఆమె వినదు. అప్పటి వారి ప్రణయ కలహమును గూర్చి శాస్త్రి మాటలు ఎంత హృదయంగమములో చూడండి !

'ప్రణయ కలహము ప్రేమ యొక్క గొలుసుకట్టు, దానిలో కాలాక్షరములు కానరావు. అది అద్వైతమునందు పర్యవసించు ద్వైతము. దీని కొలిమిలో గరళము కరగి కరగి యమృతమగును'.

చిత్రమేమంటే ఆమె ఒప్పుకొని అడవేషాలు వేస్తుంది. ఆ నాటకాలు చూడడానికి రావద్దని భర్తను నిషేధిస్తుంది. చివరకొకసారి దొంగతనంగా చూడ వస్తాడు. అది మృచ్ఛకటిక నాటకము వసంతసేన పాత్రగా రాధ చారుదత్త పాత్రధారుని కౌగిలించుకోబోతుంది. అది చూచి గోపాలుడు వారిద్దరి మధ్యకు వచ్చి అడ్డు నిలవడంతో కథ ముగిస్తుంది. కథలు ఆరంభించడంలోనూ ముగింపులోనూ కూడా చాకచక్యము ఉన్నది వారికి.

ఈ విధంగా చెప్పుకుంటూ పోతే ఎన్నయినా ఉన్నవి. కథలలో చాలా పాత్రల పేర్లు వింతగా ఉంటవి. కాని ఎక్కువ భాగమవి సార్థక నామాలు. విషాదాంతమైన 'పద్మాక్షి' (భా. 4-6) గాథలో నాయిక అంధురాలు. 'దత్తు' (భా. 5-4)లో పిల్లలు లేని దంపతులు దుర్గ అనే పిల్లను ప్రేమతో లాలిస్తూ ఉంటారు కాని, ఆ పిల్ల తండ్రి దూరము చేస్తాడు. తుదకు దుర్గ కనక విగ్రహము పూజా స్థానములో వెలుస్తుంది. 'సదాచారుడు' (భా. 5-6)లో పూర్వాచార పరాయణుని పేరు ప్రతీపుడు

శివరామ శాస్త్రి కథలలో 'వావి' (భా. 5-3) ఎంతో మంచిది. 'పితల్ కా దర్వాజా' అందరి మెప్పు పొందినది. 'డిప్రెషను-చెంబు' శివ శంకరుల సంపాదకత్వాన వెలువడిన ఢిల్లీ సాహిత్య అకాడమీ వారి 'కథామంజూషి'లో ఉచిత స్థానము సంతరించుకొన్నది.

వారి రచనలు ఎక్కువ భాగము 'భారతి' ద్వారానే ఆంధ్ర పాఠక లోకానికి పరిచయమైనవి.

శివరామశాస్త్రికి భగవంతుడు ఉత్తమలోక మనుగ్రహించు గాక!

'అథవా యోగినా మేవ కులే భవతి ధీమతామ్
ఏ తద్ధి దుర్లభ తరం లోకే జన్మ యదీదృశమ్.'

అన్న శ్రీ కృష్ణ భగవానుల వాక్యము ప్రమాణము!

(భారతి ఏప్రిల్-1967)

# శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవుల విజయ యాత్రలు

'జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః'

## 1

### శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి

జననము: ప్రమోదూత శ్రావణ శు. 12 సోమవారము రాత్రి: యానాము; 1870; స్వగ్రామము: కడియము; తండ్రి: కామయ్య; తల్లి చంద్రమ్మ; నిర్యాణము: విరోధి మహాశివరాత్రి, బుధవారము 5-2-50 బెజవాడలో.

ఆరామద్రావిడులు; కృష్ణయజుశ్శాఖ.

తల్లిదండ్రులు పెట్టిన పేరు: వేంకటాచలం.

### శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రి

జననము: ప్రజోత్పత్తి ఫాల్గుణమాసము. (20-3-1872)

తండ్రి: వెంకటావధాని ఘనపాఠి, తల్లి: శేషమ్మ.

నిర్యాణము: రౌద్రి కార్తిక బ. 12 మంగళవారము(7-12-1920). వెలనాటివారు. కృష్ణయజుశ్శాఖ.

గోత్రము: హరిత.

స్వగ్రామము: ఎండగండి.

ఇద్దరికి ప్రధాన గురువు: చర్ల బ్రహ్మయ్య శాస్త్రి. స్వగ్రామము: కడెద్ద; తర్వాత ధవళేశ్వరము.

# 2

కవులు పండితులు దేశాటనము చేయుట లోకమంతటా- హోమరు నాటినుండి అనూచానముగా వస్తున్న ఆచారమే ఏకచ్ఛాత్రాధిపత్యము నెలకొనని కాలములలో, దేశములలో ఇది విస్తారముగా సాగుతుంది. బ్రిటిషు వారి పరిపాలనలో భరత ఖండము ఏకచ్ఛత్రము క్రింద ఉన్నా, పాలకులకు సంస్కృతాంధ్రములందు అభిమానములేదు. కాని ఆ కాలంలో సంస్కృతాంధ్రాలను అభిమానించే స్వదేశ సంస్థానాలు కొన్ని వందలుండేవి. సంపన్న గృహస్థులు పట్టణాలు ప్రజలూ కూడా కొంత ఆదరించేవారు. కవులు పండితులూ ఆ సంస్థానాలను, సంపన్నులను, పట్టణవాసులను రాజస్థానాలుగా భావించి సంచారముచేసి సమ్మానాలు పొందేవారు.

తిరుపతి వెంకటేశ్వరులకు సమకాలికులు, వారికి పూర్వులు, తరువాతివారు ఐన కవులు పండితులు సంచారము చేసినవారున్నారుగాని వారి యంతగా విస్తారయాత్రలు చేసినవారుగాని, అన్ని వివాదములలో పాల్గొని నెగ్గినవారుగాని, అంత సర్వతోముఖ సమ్మానములు పొందిన వారుగాని, మరి యొకరు లేరనుట అతిశయోక్తి కాదు.

పూర్వాంధ్ర కవులలో శ్రీనాథ కవిసార్వభౌముడు మాత్రము ఆంధ్ర దేశమంతటా సంచారము చేసినట్లు కొంత ఆధారాలు ఉన్నవి. ఆయన మొదట కొండవీటిలో 16 సం॥లు విద్యాధికారి పదవిలో ఉండి పండితులకిచ్చిన శాసనాలలో కానవస్తున్నాడు. కొంతకాలము రాజమహేంద్రవరరాజులవద్ద ఆస్థానకవి. ఒకమారు విద్యానగర యాత్రచేసి గౌడడిండిమ భట్టును ఉద్భటశాస్త్ర (అలంకారశాస్త్ర) వివాదములో జయించి, ఇతర కవీశ్వరులను కించపరచుచున్న కంచుఢక్కను పగులగొట్టించి కవి సార్వభౌముడుగా దీనారటంకాలతో అభిషేకము పొందినాడు. రాచకొండ వెళ్ళి సర్వజ్ఞ సింగభూపాలునిచే సమ్మానము పొందినాడు. అతడు కంచి, పలనాడు, మొరసనాడు, రేనాడు, ఇత్యాది భాగములు దర్శించినాడు. ఒక్క విద్యానగరయాత్ర తప్ప తక్కిన యాత్రలు, విజయయాత్ర లన లేము; విద్యాప్రదర్శనయాత్ర లనుటయు సమంజసముగా తోపదు, ఆయన దీర్ఘజీవిత కాలములో ఆంధ్ర ప్రదేశములో ఏర్పడిన అస్థిరరాజ్య

పరిస్థితులూ, ఆయన హృదయములోగల అశ్రాంత ధర్మమూ ఆయన యాత్రలకు ప్రధాన కారణములై ఉండును.

ప్రసిద్ధాంధ్రులలో జగన్నాథ పండితరాయలు గోదావరీతీరము నుండి ఢిల్లీ వరకు యాత్ర సాగించి 'ఢిల్లీవల్లభపాణిపల్లవతలే నీతం నవీనం వయః' అని చెప్పుకొన్నట్లు అక్కడ స్థిరపడినవాడు ఆయన యును వ్యాకరణములో, అలంకార శాస్త్రములో, శిష్టాచార వ్యవహారము లతో ఆనాటి పండితులతో వివాదములు పెట్టుకొని 'అప్పయ్య దీక్షిత దవానల దగ్ధపూర్వం సాహిత్య మంకురయతే సరసైః ప్రబంధైః' అని ఆసేతు హిమాచలము విద్వత్పూజ్యుడైన అప్పయ్య దీక్షితులవారిని ఆధి క్షేపించిన సాహసికుడు.

ఈ యిద్దరిని శ్రీ తిరుపతి వెంకటేశ్వరులు తమ యాదర్శమూర్తు లుగా పెట్టుకొని దేశసంచారము చేసినట్టు తోస్తుంది. వారిద్దరుకాక, వారికి కొంచెము పూర్వులయ్యు సమకాలికులైన శ్రీమాన్ మాడభూషి వెంకటా చార్యులుగారి శతవధానములును, వారిని నిస్సందేహముగా ప్రభావితు లను చేసినవి.

ఈ ముగ్గురును విద్వత్ప్రకాండులు, కవీశ్వరులు. శ్రీనాథునకు, పండితరాయలకునేకాక, మాడభూషి వారికిని ఉన్న పాండిత్యస్థాయి తిరుపతి వెంకటేశ్వరులకు లేకుండుగాక ! శ్రీనాథునకున్న కవిత్వస్థాయి కూడా ఈ జంట కవులకు లేకుండుగాక !

ఐననేమి ? శ్రీనాథుని కంటెను, జగన్నాథున కంటెను, వెంకటా చార్యులకంటెను విస్తారముగా విజయయాత్రలుచేసి ఆంధ్రదేశమునంత టినీ తమ కవితావేశముతో ఉర్రూత లూగించినవారు. వారికున్న శిష్య ప్రశిష్య సంతతి లెక్కచేసినవారు లేరుగాని వేల సంఖ్యలో ఉంటుంది. అట్టిది మరియొకరికి 'నభూతో న భవిష్యతి'.

వారు యాత్రలుచేయని సంస్థానములేదు, పట్టణములేదు. వారి యాత్ర లెన్నో చిన్నపల్లెటూళ్ళకును ప్రాకినవి. విజయనగరములో ఆనం దగజపతి మొదట దర్శనమీయకపోగా వారుచెప్పిన ఈ పద్యమునుబట్టి, వారి యాత్రావిస్తృతియేకాక, వారి దర్పమును విశదమగును,

'అటు గద్వాలిటు చెన్నపట్టణము మధ్యం గల్గు దేశమ్మునన్
జటులస్ఫూర్తి శతావధానములు మెచ్చం జేసియున్నట్టి మా
కిట రాజీయకయున్న దర్శనము నిలకెవ్వారికి రాజోసం
గుట చెప్పంగదవయ్య, పాలితబుధా, కోదండరామాఖిదా !'

వారు తమ శక్తి సామర్థ్యముల నీ విధముగ గద్వాలలో ఉద్ఘాటించినారు.

'శతఘంటకవనమ్ము సల్పు సంగతి యన్న గరతలామలకంబు గాదె మాకు,
అష్టావధాన కష్టావలంబన మన్న నంబి కొండయ దండనంబు మాకు
ఆశుధారాకవిత్వాడంబరం బన్న నల్లేరుపై బండి నడక మాకు
సత్కావ్య నిర్మాణ చాకచక్యం బన్న షడ్రసోపేత భోజనము మాకు
వ్యర్థ మగువాద మొనరించు నట్టి వారి
డంబ మణగించు టాపోశనంబు మాకు
దానరాధేయ కవి సముదాయ గేయ
వందిత విధేయ, రామభూపాల రాయ!'

ఈ జంట కవులు తాము పొందిన గౌరవములను ఆత్మకూరులో సరస్వతీదేవి కిట్లు నివేదించు కొనిరి.

'ఏనుగు నెక్కినాము, ధరణీంద్రులు
మ్రొక్కగ నిక్కినాము, స
న్మానము లందినాము, బహుమానములన్
గ్రహించినార, మె
వ్వానిని లెక్కపెట్ట కనివారణ
దిగ్విజయం బొనర్చి, ప్ర
జ్ఞా నిధులంచు పేరు గొనినారము
నీ వలనన్ సరస్వతీ!!

ఈ జంట కవుల కెన్నో బిరుదము లున్నవి. వానిలో 'కింకవీంద్ర ఘటా పంచానన' బిరుదము వారు స్వయముగా పట్టు కొన్నది. ఇద్దరును

జన్మాంతము శిష్టాచారము పాటించినవారే. సభలలో పవిత్రములగు ధోవతి యుత్తరీయములే గాని శిష్టులపవిత్రములుగా భావించు చొక్కాలు తొడిగి ఎరుగరు. ఐనను వైదికులైన వీరు వైదికాచార విరుద్ధముగా కత్తెర మీసములు పెట్టుకొనిరి. ఆత్మకూరులోని పండితులు అశాస్త్రీయమైన మీసములు తీసివేయ రాదాయని సూచింపగా కవులిచ్చిన జవాబిది.

'దోసమటం చెరింగియును
దుందుడు కొప్పగ బెంచినార మీ
మీసము రెండు బాసలకు
మేమె కవీంద్రుల మంచు దెల్పగా,
రోసము గల్గెనే, కవివ
రుల్ మము గెల్వుడు, గెల్చిరేని యీ
మీసము దీసి మీ పద స
మీపములం దలలుంచి మ్రొక్కమే!'

ఈ విధముగా పౌరుషముగా మాట్లాడు వారికి ఎందరో శత్రువులు ప్రాప్తించుట సహజము. 'అగ్రే డిండిమ తాండవం' అని డిండిమము మ్రోగించు కొనుచు ఇతర కవీశ్వరుల నవమానించిన గౌడడిండిమ బట్టారకుని బహుకాలమునకు శ్రీనాథబట్టారకుడు ఢీకొని డిండిమము పగుల గొట్టింప గల్గినాడు. తిరుపతి వెంకటేశ్వరుల మీసములలో 'ఆంధ్ర మీసము' నైనను తీయింతుమని ప్రగల్భములు పల్కిన వారున్నారుగాని తీయించ గలిగిన మొనగాళ్ళు లేక పోయిరి.

ఈ కవిద్వయము పండితులను, పామరులను, సంపన్నులను, పేదలను సమానముగా నాకర్షించిరి. స్పర్థాళువులైన ఏకొద్ది మంది యోతప్ప, వారిని వారి జీవిత కాలములో అగ్గింపని వారులేరు. ఆంధ్రులే కాక తమిళులు, ఆంగ్లేయులు వారికి నివాళు లర్పించిరి.

పండిత ప్రపంచములో వారి కానాడు ఎట్టి గౌరవముండెడిదో తెలుపుటకు మా పితృపాదులగు శ్రీనోరి హనుమచ్ఛాస్త్రిగారి వాక్యము లెక్కువ యుక్తములని తోచినందున అవి ఉదాహరిస్తున్నాము. తిరుపతి

వెంకటేశ్వరులె 'కంఠ పాఠము నాటకములెల్ల శ్రీనోరి హనుమద్బుధుని కెవ్వడగును సాటి' అని ప్రస్తుతించిన సంస్కృతాంధ్ర పండితులు వారు. వారు మా స్వగ్రామమైన బ్రాహ్మణ కోడూరులో జరిగిన శతావధానము సందర్భములో తిరుపతి వెంకటేశ్వరుల మీద చెప్పిన సీస పద్యములో ఎత్తుగీతి యిట్లున్నది:

'పుడమి వీరికి సరియగు పురుషు లెవరు
నరుడు నారాయణుండును బరమ కృపను
వరుస దిరుపతి వేంకటేశ్వరులె యగుచు
జగతి జన్మించినారలు సత్యమిదియ।'

వారు వెంకటశాస్త్రిగారి కంటె 12 సం.లు పెద్దలని మనము గుర్తుంచు కొనవలెను.

ఈ తిరుపతి వేంకటేశ్వరులను నరనారాయణావతారములుగా వర్ణించుట సంప్రదాయవిదులకు ఎంతైన ప్రమోదావహమైనది. వారిద్ద రికి ఎక్కడికి వెళ్ళినను జయము సమకూరు చుండెడిది.

'యత్ర యోగేశ్వరః కృష్ణో
యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీ ర్విజయో భూతి
ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ'

అని కదా గీతలోని ఉపసంహార వాక్యము!

పూర్వకాలము మన దేశములో ఏదైనా శాస్త్రములో నూతన సిద్ధాంతము ప్రతిపాదించే గ్రంథము వ్రాసిన వారు, దేశాటనముచేసి సత్సభాంతర వనసీమలందు ఆ గ్రంథము వినిపించెడివారు. పండితుల నిశిత పరీక్షకు నిలిచి నప్పుడే గ్రంథానికి ప్రచారము వచ్చేది. అందుచేత నవి విజయ యాత్రలన వచ్చును.

కాని కావ్య విషయములో ఆ విధంగా విజయము సాధించడము సాధ్యపడదు. నూతన కావ్యము సభలో వినిపించి నప్పుడు దానిలోని గుణదోషాలు- అర్థములో, శబ్దములో, ఔచిత్యములో, రసాద్యులలో,

పండితులు పరామర్శిస్తారు. దాని మంచి చెడులు విచారిస్తారు. పండితులు తృప్తిపడినంత మాత్రముచేత అది కవికి విజయమన జెల్లదు. కావ్య జగత్తులో జయానికి సరియైన ప్రమాణము లేదు.

అందువల్ల కవితా విజయానికి తిరుపతి కవులు నూతన ప్రక్రియ చేపట్టినారు. అది అవధాన ప్రక్రియ- అష్టావధానము, శతావధానము; దానికి ఆశుకవిత్వము జోడించినారు. రెండు విధాల అవధానములలో పృచ్ఛకులు అవధానుల యవధానమును భంగించుటకు యత్నింతురు. భంగము కలిగింపలేనిచో అవధానులు జయించినట్లే కదా! అది గాక అవధాన పద్యాలలో దోష విచారణ రావచ్చును, దోష నిరూపణ చేసినచో అవధాను లోడినట్లు, దోషములు లేవని నిరూపించినచో అవధానులు జయించినట్లగును. ఇందుకుతోడు 'మాకంటె సుష్ఠుగా ఎవరు అవధానము చేయగలరు?' అను సవాలు కూడ మధ్య మధ్య వినిపించుచుండెను.

అసలీ అవధానాల పుట్టుపూర్వోత్తరాలు, స్వరూప స్వభావాలూ నిర్దుష్టముగా విచారణచేసి ప్రదర్శించినవారు కనబడరు. వేదాధ్యయనము చేసిన వారిని అవధాను లనుట బహుకాలము నుండి పరిపాటి. కవుల అవధానముల గూర్చి శ్రీమాన్ ఈయుణ్ణి వెంకట వీరరాఘవాచార్యులుగారు 'సంస్కృతములో కొందరు శతావధానులు, ఆశుకవులు' అను వ్యాసములో (భారతి సంపు. 27, సం. 3) కొంత సూచించినారుగాని సమగ్రముగా లేదు. నూరు విషయములందు ఒక్కసారిగా ఏకాగ్రత ఉండుట శతావధానము, ఎనిమిదింటి మీద నుండుట అష్టావధానము-అని మూలభావమై యుండును. ఈ భావము మనస్సులో పెట్టుకొనియే, ఈ వ్యాసకర్త తన 'కవి సార్వభౌముడు' లో శ్రీనాథునిచేత వేదవేదాంగశాస్త్రాదులు నూరింటి మీద ఏకాగ్రత నిలిపి దేవరాయల సభలో అపూర్వాద్భుత శతవధానము చేసినట్లు కల్పించినాడు. అట్టిది శ్రీనాథభట్టువంటి వేదశాస్త్ర విద్వద్వర్యునికేకాని సాధ్యపడదు. తత్తుల్యమైన అవధాన ప్రదర్శనముతోనే, అవధానములు ప్రారంభించి నానాటికి రూపాంతరములు పొంది యుండుననుటకు సందేహము లేదు. నూరు రాగి చెంబులలో నీళ్ళుపోసి వేరే గదిలో పెట్టి, వాటిని సంఖ్యచెప్పి కర్రతోకొట్టి వినిపింపగా, శబ్దభేదమును

బట్టి ఆ నూరింటిని తర్వాత శ్రీమాన్ మాడభూషి వెంకటాచార్యులు గుర్తింపగలిగిరట !

రామరాజభూషణుడు తాను, 'ఏకైక దిన ప్రబంధ ఘటనాసద్య శ్శతగ్రంథ కల్పనుడ'డనీ, 'శతలేఖనీ పద్య సంధాన ధౌరేయుడ' ననీ, 'ఘటికాశత గ్రంథధుర్యుడ' ననీ, 'ఆశుప్రబంధబంధాభిజ్ఞుడ'ననీ, 'వ్యస్తాక్షరీధుర్యుడ' ననీ చెప్పికొనెనుగాని, వాని స్వరూపమెట్టిదో తెలియ వచ్చుట లేదు. నేటి భావములనుబట్టి ఆ కాలములో గూడ నట్లే యుండె నని భావించుట యుక్తము కాదు.

19 వ శతాబ్దములో ముఖ్యముగా దీవులవల్లి సోదర కవులూ, శ్రీమాన్ మాడభూషి కవివర్యుడు అవధానమును నొకదారిలోనికి తెచ్చి నట్లు తోస్తుంది. వారి యడుగు జాడలలో నడచి తిరుపతి కవులు అవధాన ములకు రాచబాట ఏర్పరచినారు. ఐనా ఇప్పటికిని అష్టావధాన విషయ ములో, ఏ అవధానియైనను ముందుగా తన యిచ్చచొప్పున అవధాన విషయము లెనిమిదింటిని నిర్ణయించుట చూచుచున్నాము. అందుచే మార్పులున్నవి. కాని శతావధానము మాత్రము తిరుపతి కవులు పెట్టిన ఒరవడిలోనే నేటికిని నిరాఘాటముగా సాగుచున్నది.

ఏ అవధానములోనైనా ప్రధానమైనది ధారణతోకూడిన అవధా నత. అది లేనిది అంతా అభాసు అవుతుంది. అవధానానికి శోభను కూర్చేవి, పద్యస్ఫూర్తి, కల్పనాపటిమ, పాండిత్యము, చమత్కార వైభ వము. తిరుపతి కవులకు ముందును తర్వాతను అవధానాలు చేసినవారూ చేస్తున్నవారూ ఉన్నారు. కాని వారితో సాటిగా చేసినవారు మరొక్కరు కానరారనుట నిస్సందేహము. వారు అవధాన పద్యాలు చెబుతూనే, మధ్య మధ్య ఎన్నో చమత్కార ప్రసంగాలు, శాస్త్రప్రశంసలూ, లోకాభి రామాయణాలూ, ఆశుకవిత్వ ప్రదర్శనము, అవధానముతో సంబంధము లేని సమస్యాపూరణాలూ, దత్తపదులూ చేసేవారు. ఈ విధంగా సభారం జనము చేసేది తరుచుగా వెంకటశాస్త్రిగారే. వారి అవధానాలలోని చమ త్కృతులను గూర్చిన కథలెన్నో వ్యాప్తిలో ఉన్నవి. ఒక్కటి మాత్రము ఉదాహరిస్తాము.

పృచ్ఛకు డొక్కడు-వేమవరాగ్రహారములోనని తోస్తుంది-చింత కాయపచ్చడిమీద పద్యము చెప్పుడనగా వెంకటశాస్త్రి పాట చెప్పెను. అప్పుడాతడు చింతాకుమీద పద్యము చెప్పుడనెను, అధ్యక్షులు 'మంచి విషయమేదైన అడుగ' మని హెచ్చరింపగా, నతడు 'చీకుముల్లు మీద సీసము చెప్పుదురా?' యనెనట. వెంటనే వెంకటశాస్త్రిగారు ప్రారంభించి, నిన్ను గాల్చినగాని నీ బుద్ధి మానవే, ఛీ! –' అనిచెప్పి ఆపిరట. ఆ వృచ్ఛకుడు తెల్లవోయి తన్నే తిట్టుచున్నారనుకొని 'నన్నట్లా తిడతా రెందుకండీ ?' యని యడిగెను. తిరుపతిశాస్త్రిగారందుకొని 'నిన్ను తిట్టుట కాదోయి, చీకుముల్లు మీద పద్యమే' అనుచు, 'ఏమనందునే చీకుముల్ల !' అని సీసపాదము పూరించిరట. సభఅంతా సంతోషంతో గొల్లుమన్నది.

ఇందులో మొదట కొంత మోటుదనముతో కూడినదైయైనా, చమత్కారపర్యవసానమైన పద్య స్ఫురణ ప్రకట మవుచున్నది. వెంకటశాస్త్రిగారి పద్య పాదభాగమును తిరుపతి శాస్త్రిగారు వెంటనే ఉచితరీతిగా పూరించుటలో విశేషమున్నది. పృచ్ఛకునికిగూడ తుదకు సంతోషమే కలిగియుండవలెను. 'చీకుముల్లు' మీద ఈ సీసపద్యము ఆంధ్రభాషలో శాశ్వతముగా నిలువదగిన ఉత్తమచాటువులలో నొకటి. ఈ పద్యము అన్యాపదేశముగా ఎవరినో ఉద్దేశించి చెప్పినదేమోయని స్ఫురించుచున్నది కాని ఆ రహస్య మెవ్వరును మా దృష్టికి వచ్చినంత వరకు బయలు పెట్టలేదు.

ఇటువంటి చమత్కార సంఘటనలు వందలుగా దేశమంతటా పెద్దలు నేటికి చెప్పుకుంటారు. అవే వారి అవధానాలు పండిత పామర జనరంజకంగా ఉండడానికి ప్రధాన హేతువులు.

వీరిద్దరిలో మొదటి అవధానము చేసినది శ్రీ వెంకటశాస్త్రి. అది అష్టావధానము. 'జాతక చర్య'లో దాని వివర మిట్లున్నది.

అప్పటికీ శ్రీ వెంకటకవి చదువుకై ఎందరెందరు గురువులనో ఆశ్రయించి తిరిగితిరిగి శ్రీ చర్ల బ్రహ్మయ్యశాస్త్రిని ఆశ్రయించినాడు. అప్పటికే వారివద్ధ కౌముది చదువుచున్న శ్రీ తిరుపతితో పరిచయ

మైనది. కాని కాలు నిలుకడ లేని శ్రీ వెంకటపతికి విద్యాగ్రహణమునకై కాశికి పోవలెనను ఉబలాటము కలిగినది. గురువులతో మాయ మాటలు చెప్పి ఒక మిత్రునితో కాశికి బయలుదేరినాడు. డబ్బులేదు.

నిడమర్రుచేరి అక్కడి ఉద్యోగుల సభలో శతఘంట కవనము, అష్టావధానము చేయగలనని శ్రీ వెంకటకవి ప్రగల్భముగా పద్యములు చెప్పెను. అప్పటి కాయనకు 20 వ ఏడు.

'కూత' ఘనముగా ఉన్నది. చూతమని సభ చేసి అష్టావధానము చేయించిరి. అవధానము పూర్తి చేసి, 'అయ్యా నేనెప్పుడూ అవధానము చేయలేదు. ఊరక అడిగిన ధనమివ్వరు గదా అని ప్రగల్భములు పలికితిని. లోపములున్న క్షమింపు'డని విన్నవించెను.

వెంటనే సభ్యులందరు 'లోపములేమీ లేవు. ఇది మీ ప్రాకృత పుణ్య ఫలము!' అని దీవించిరి. సభాకారకుడైన శ్రీ రామదాసు 'చంద్రునికొక నూలు పోగు' అని పళ్ళెములో రు. 30—లు పోసి సమర్పించి నమస్కరించెను. ఆ సభాసదుల ఆశీర్వచనమే శ్రీ వెంకటశాస్త్రికి దిగ్విజయములు ప్రసాదించినది. ఆనాడే శ్రీ శాస్త్రిగారి పూర్వ పుణ్యఫలములు ప్రారబ్ధమైనది !

రెండవ అవధానము గుండుగొల్లులో. శ్రీ శాస్త్రి గారు కాశిలో ఎక్కువకాల ముండలేదు. గురువుల యాదేశము ననుసరించి స్వదేశము వచ్చిరి.

కాని కాశీ సమారాధనమునకు, గంగపూజకు డబ్బులేదు. శ్రీ శాస్త్రి కోనసీమలో ముమ్మిడివరము, ఐనాపురము, కేతనకుర్తిలలో అవధానములుచేసి యశము ధనము అర్జించి గంగాపూజ నిర్వర్తించెను.

ఆ పిమ్మట శ్రీ వెంకటశాస్త్రి బ్రహ్మ గురువులనుజేరి నిలుకడగా శ్రీ తిరుపతిశాస్త్రితో కలసి విద్యాభ్యాస మారంభించెను. వారిద్దరికిని మొదట విద్యాస్పర్థ ఉండేది. ఇతర శిష్యులు కొందరీయనను కొందరాయనను బలపరచేవారు. అ స్పర్ధేవారి మైత్రికి బీజమైనది. అప్పటికి శ్రీ తిరుపతి సంస్కృత రచనమేకాని ఆంధ్రపద్యరచన యెరుగడు. శ్రీ

వెంకటశాస్త్రి సాహచర్యమువలన ఆయన ఆంధ్ర కవిత్వములోనికి దిగెను. అప్పటినుండియే జంట కవిత్వకృషి ఆరంభమైనది. అప్పటినుంచియే 'ఒక్కరు రచియింతు రేనియును గాదగు దిర్వతి వెంకటీయమై' అను ఖ్యాతి కల్గినది. ఆమాట శ్రీ వెంకటకవి జీవితాంతమువరకును (శ్రీతిరుపతి తర్వాత 30 ఏడ్లు జీవించినను) నిలుపుకొనెను.

# 4

ఈ సందర్భములో ఈ జంటకవుల స్వభావ తారతమ్యము వివరించు టవసరము.

శ్రీతిరుపతిశాస్త్రి కొంత సంపన్న వంశములో జన్మించెను. వారి పెద్దలు వేదవిదులు. తండ్రి ఘనపాఠియేకాక 'సాహిత్యముకూడ కలవాడు. శ్రీ శాస్త్రి తండ్రిగారివద్దనే కావ్యారంభము చేసిరి. తర్వాత నిలుకడగా కోనసీమలో గురువులయెద్ద ఇతరకావ్యములు, చంపువులు, భాణములు, నాటకములు, తర్కసంగ్రహము న్యాయబోధినితో చదివిరి. ఇంతలో బ్రహ్మయశాస్త్రిగారు కాశినుండి వచ్చినారని విని వారిని చేరి కౌముది ఆరంభించెను.

ఈ సందర్భములో శ్రీ తిరుపతిశాస్త్రి మేధాతిశయమునుగూర్చి కొంత చెప్పవలసి యున్నది. ఆయన అప్పుడు ప్రారంభించినది కౌముదియే. ఐనా సంస్కృత పంక్తులు చక్కగా నన్వయింపగలశక్తి అలవడినది. దానికితోడు అఖండమైన జ్ఞాపకశక్తి ఉండేది. అందువల్ల కౌముది పూర్తిచేసిన విద్యార్థులకు కౌముదిపై వ్యాఖ్యానగ్రంథములు గురువులు పాఠము చెప్పుచుండగా విని ఆ వ్యాఖ్యానపాఠములు తనపై విద్యార్థులకే చింతన చెప్పేవారట. అందువలన బ్రహ్మగురుల కాయనయందు వాత్సల్యాతిశయము కలుగుటలోఆశ్చర్యము లేదు. తాను విన్న పాఠము చింతన చేయవలసిన పని లేకుండగానే కంఠస్థముగా ఉండేది. తిరుపతిశాస్త్రిగారు కౌముదిలో కారకము పూర్తియగుచున్న రోజులలో శ్రీ వెంకటశాస్త్రి సహపాఠిగా బ్రహ్మగురులయొద్ద చేరెను.

శ్రీ వెంకటశాస్త్రిగారు బ్రహ్మగురులవద్దకు రెండవసారివచ్చి

కుదురుకునేవరకు ఒకచోట కాలు నిలువక, ఒకచోట నని విద్యాభ్యాసము చేయక, ఒక చదువనికాక, రకరకాలుగా కొంత ఆకతాయిగా తిరిగెను. ఇందుకు కొంతవరకు ఆయన బాల్యములో తండ్రి ఆర్థికస్థితి అంత బాగుండకపోవుట ఒక కారణము. కాని మూలకారణము ఆయన అశాంత చిత్తమే. బడికి సరిగాపోలేదు. కాలుగాని మనస్సుగాని ఓకచోట నిలిచేది కాదు. తాతగారి గ్రంథసంచయమునుండి ఆంధ్ర గ్రంథాలు స్వయముగా పఠించినాడు. సంస్కృత భాషాధ్యయనమునకై ఎందరెందరు గురువుల నాశ్రయించెనో చెప్పలేము. ఆంధ్రకవిత్వముచిన్నతనములోనే అభ్యస్త మైనది. పద్య కవిత్వమును అభ్యసించెను. హరికథలు, వీథినాటకములు వ్రాసెను, పురాణప్రవచనములుచేసెను. కొంచెమువేదము, కొంచెముసంగీతము. కొంచెము మృదంగ వాదనము, కొంచెము ఇంగ్లీషు—కొంచెము కుస్తీకూడా అభ్యాసముచేసెను. ఈచిల్లర విద్యలలో తిట్టు కవిత్వముకూడా ఒకటి. ఈ తిట్టు కవిత్వముతో ఒకమారు జెయిలు ప్రాప్తించే ప్రమాదము వరకూవచ్చి తప్పినది. అక్షధూర్తులతో సహవాస మొనర్చెను. కొంతకాలము చదువుకంటె చదరంగమును ఎక్కువగా అభ్యసించెను. ఆయన చిన్నచిన్న చదువులకే ఎందరో గురువుల నాశ్రయించెను. మనస్సు కెంతో కష్టమనిపించినా, మూడు మాసములు మాధుకరము కూడ చేసెను. మొదటినాడు కళ్ళనీళ్ళపర్యంతమైనది. మాధుకరాన్నము నిట్లు వర్ణించిరి:

> 'ఒకపొర సన్నము మరి యిం
> కొకపొర సూపమ్ము నింక నొకపొర కూరల్
> చికిబికిగా జోలెను'

దాల్చి ఆ యన్నము తిని చదువు సాగించెను.

అన్నిటికి దోడు కంటిజబ్బు. ఆ కన్ను పోయినచో పోవుగాక, ఒంటికంటి శుక్రాచార్యులవలె కవి నౌదుగాక యని చదువు వదలలేదు.

కొన్ని రాత్రులు రెండుక్రోసుల దూరములో ఉన్న పిల్లంకకు పోయి లఘుకౌముదియు, కొన్ని రాత్రులు క్రోసెడుదూరములో ఉన్న పల్లెపాలెము వెళ్ళి భారవి పాఠముచేసియు, తెల్లవారుసరికి ఇంటికి

వచ్చు చుండెను. ఈ విధంగా చదువుకు ఎక్కడ ఏ చిన్న అవకాశము చిక్కినా, వదలక క్షణశః క్షణశః విద్యా సంగ్రహము కావించెను. ఇంత మందివద్ద ఇంత ముక్కముక్కలుగా చదువుకున్నందున సామాన్యుల కైతే చదువంటేదికాదు. కాని వారికి విస్తారమైన ధారణ ఉన్నందున, చదివిన చదువు గట్టిగా నిలుచుటేగాక, హృదయమున విస్తృతినిగూర్చి లోకానుభవమును ఎక్కువచేసింది. ఆయన చిన్నప్పటినుంచి గట్టి పట్టుదల ఉన్నవాడు.

నూతన యౌవనములో ఆయన కొక అనుభవము కలిగినది. అప్పుడు 17 సం.లు. యానాము వెంకటేశ్వరునిపై శతకముచెప్పి విని పింపగా కొందరు అందులోని ఒప్పులుగూడ తప్పులని ఆక్షేపించి సంస్కృత సమాసగతసంధినిగూర్చి ప్రశ్నించిరి. అప్పటి కాయన ఆంధ్ర వ్యాకరణముతప్ప రానందున ఒప్పని ఎరిగియు సదుత్తరము చెప్పలేక పోయెను. అది అవమానము కలిగినట్లు భావించెను. వ్యాకరణ శాస్త్రము సాధించవలెనను పట్టుదలతో కాశికి వెళ్ళ నిశ్చయించి, కంటి వైద్య మునకు వెళ్ళు చుంటినని ఇంటిలో చెప్పి, ఒక మిత్రునితో కాశికి బయలు దేరెను. విశాఖపట్టణము వరకు వెళ్ళిరి. అక్కడ ఏడు నూతుల వీథిలో మధ్యాహ్న భోజనము చేసిరి. 'అ అన్నసుఖసు, మాషసూపంబు, దుర్గంధమయముసేయి'తో హడిలిపోయి మిత్రుడు వెనుతిరిగిరాగా, తప్పనిసరియై తానును తిరిగి వచ్చెను.

బ్రహ్మగురునివద్ద చేరువరకు ఆయనకు సుఖభోజనము, నిలుకడగా చదువు కుదురలేదు. కాని కాశిలో వ్యాకరణాధ్యయనము చేసిరావలెననే వ్యామోహము వదలలేదు. బ్రహ్మగురునివద్ద చేరిన కొలది కాలమునకే కాలునిలువక, గురులతో మాయమాటలుచెప్పి, కాశికి బయలుదేరెను. మొదటి అష్టావధానాదులుచేసి ధనము కూర్చుకొని కాశికి నిజముగా ఈ మారువెళ్ళి నాల్గు నెలలుండెను. కాని తల్లిదండ్రుల గొడవవలన బ్రహ్మగురువులు ఉత్తరము వ్రాయగా దానిని మన్నించి తిరిగివచ్చి స్థిరముగా బ్రహ్మగురునివద్ద చదువుకు కుదురుకొనెను.

ఈ విధముగా శ్రీ తిరుపతి నిశ్చలమైన పర్వతాగ్రమువంటి

వాడైతే, శ్రీ వెంకటేశ్వరులు మహా ప్రభంజనముపంటివాడు. శ్రీ తిరుపతి ఎక్కువ మాటకారి కాదుగాని, ఎప్పుడో ఒకసారి ఆయనకు కోపము కలిగితే సింహగర్జనమువలె ఎవరాపినా ఆగక నిరాఘాటంగా విజృంభిచే వాడట. కాని శ్రీ వెంకటశాస్త్రి నోరు ఒక్క క్షణము ఊరుకొనేది కాదు. ఎన్నో అపూర్వాద్భుత విషయాలు, చమత్కారాలూ, మధ్య మధ్య ఎత్తి పొడుపులూ, వర్ణించేవారు. శ్రీ తిరుపతి పద్యపఠనము బాగుండేది కాదు. శ్రీ వెంకటశాస్త్రి పద్యపఠనములో ఒక కొత్త బాణి–ఈనాడు శ్రీ విశ్వనాథవలె– ఆంధ్రభాషలో ప్రచారములోనికి దెచ్చినారు. ముఖ్యముగా శ్రీరాగములోగాని మోహనరాగములోగాని చదివేవారు. అప్పుడాయన ముఖములో చిత్రమైన విరుపు ఉండేది. శతాధికంగా జనులారోజులలో ఆయన బాణీలో, ముఖం విరుపుతోసహా—పద్యాలు చదవడం పరిపాటి! శ్రీ తిరుపతిశాస్త్రి దృఢకాయుడు, ఆరోగ్యశాలి, శ్రీ వెంకటశాస్త్రి పీలగా, ఎప్పుడూ జబ్బుతో బాధపడేవాడు.

వారిద్దరిలో ఇంత వైవిధ్యమున్నా, చిత్రముగా ఇద్దరూ గాఢ మిత్రులైనారు. కవితావాక్కుకూడా కలసిపోయింది. సంస్కృత ప్రౌఢ మైన భాగాలు శ్రీ తిరుపతిశాస్త్రివనీ, ఆంధ్రప్రచురమైనవి శ్రీవెంకట శాస్త్రివనీ లోకములో ప్రవాదము వ్యాపించినది కాని అది వాస్తవము కాదని శ్రీ వెంకటశాస్త్రి గారే నిరూపించినారు. మా ఇతర వృద్ధ మిత్రులును దానినే స్వయముగా ఎరిగి బలపరచినారు.

ఈ కవిత్వమునకు మధ్యమధ్య పొరుపులు రాకపోలేదు. ఒకమారు శ్రీ వెంకటశాస్త్రి తూర్పు దేశమునకు సభలకు వెళ్ళుచు శ్రీ తిరుపతికి రమ్మని కబురంపెను. అప్పుడాయన శ్రీ పోలవరము ఆస్థానములో ఉన్నందున వెంటనే రాలేక సభనాటికి తంతి పంపితే వత్తునని ఉత్తర మంపెను. శ్రీ వెంకటశాస్త్రికి ఏందుకో కోపము వచ్చినది. 'నీవు లేనిది నేనూ అవధానము నిర్వహింపలేనని తోచినప్పుడు అట్లే కబురంపుదునులే' అనుకొని ఒక్కడే వెళ్ళి అనకాపల్లి, శ్రీకాకుళము, ఉర్లాములలో అవధాన ములు పూర్తి చేసెను. ఆ తర్వాత ఇద్దరు వేరుగా వెళ్ళి గద్వాలలో కలసిరి.

ఇది శ్రీ వెంకటశాస్త్రి స్వీయచరిత్ర అనదగిన జాతకచర్యలో వ్రాసిన వృత్తాంతము. ఒకసారి నూజివీడుకు కూడ ఒంటరిగా వెళ్ళినట్లు తోచును. కాని ఇటువంటి పొరపులు ప్రియులమధ్య ప్రణయ కలహముల వలె ప్రేమభావమును వృద్ధి చేయునవేకాని భంగకారులు కావు.

దివాకరాస్తమయమున శ్రీ వెంకటశాస్త్రి ఇట్లు విలపించినారు.

'ఏబది దాటె నా కతని
కేబది కింక నెలల్ గొరంత నా
ల్గా బుధమాన్యు డిందనుక
నాగక సల్పె శతావధాన, మే
నో బహుకాలమై యొకట
నుండియు నాతని చేతియూత బ్ర
జ్ఞా బహుళా వధానపు బ్ర
సంగము లీడ్చుచు నుంటి నెట్టులో
'ఏ నల నూజవీటి సభ
కేగితి నిద్దిగ ద్రావి యన్నకో
పానన కాదె యొంటరిగ
బాగపురిన్ గనబోయి తిప్పుడో
ధీనిధి, త్వరత్, యచటి
ధీరులతో గలహమ్ము గల్గు న
ప్డేనియు నేను నీ స్మృతికి
నెక్కక పోనుజుమీ సుమిత్రమా!'

శ్రీ తిరుపతిశాస్త్రి శ్రీ వేంకటశాస్త్రి కంటె సంవత్సరము ఏడు మాసములు చిన్నవాడై నందున నేమి, ఆంధ్ర కవిత్వము చెప్పుటకు దారి చూపి నందున నేమి ఆయనను కొంత గురు భావముతో అన్నను వలె చూచెడు వాడు. దానికి నారు చెప్పిన ఈ పద్యమే సాక్షి!

'వితతాత్మీయ శతావధాన కవితా
విద్యావయోరాశి సం
భృత శిష్యాంబుద వాఙ్మయా మృతరస

ప్రీతాఖిలాంధ్రక్షమా
ధృత రజ్య ద్రసికా వంతస కృత వం దిస్తోత్రమాలా విభూ
షితు మా వెంకటశాస్త్రినే బొగడెదన్ శిష్యస్వరూపమ్మునన్'
వారిద్దరికి పరస్పర మున్న ప్రమాణ బుద్ధి ఈ పద్యములో గోచరించును.

'అభినవ రామలింగ బిరు దాంకుడ నాకవనమ్ము నందు నీ
యభవపు గాండ్లు తప్పు లిడ నర్హులె? కాదని తప్పు దిద్దు మా
యుభయులలోన నొక్కడు మరొక్కనికిం దగుగాక ఈర్ష్యచే
యభము శుభమ్మునుం దెలియ కార్చెడి దేబెలు మాకు లెక్కయే!

## 5

తిరుపతి వేంకటేశ్వరుల దిగ్విజయములకు నాంది పలికినది కాకినాడలో. అది వారి మొదటి శతావధానమేకాక సంపూర్ణ శతావధానము కూడను. శ్రీ వేంకటశాస్త్రికి 20 సం.లు; శ్రీ తిరుపతికి 19 వ ఏడు. బాల సరస్వతులవలె నున్నవారిని సభ్యులు అభిమానించుచునే అడుగడుగున చిక్కులు పెట్టి గడ్డు పరీక్షలు చేసిరి. కవులన్నిటిలోనెగ్గిరి. ఒక పండితుడు దోషము లారోపింపగా పురపండితు లాయనపై మండి పడిరి. ఆ శతావధానములో ఎన్నో విశిష్ట విషయము లున్నవి. కావున దాని వివరములు ప్రధానముగా 'జాతక చర్య' నాధారము చేసికొని విపులముగా వర్ణించుచున్నాము.

వారప్పుడు బ్రహ్మగురుని యొద్ద వ్యాకరణము అధ్యయనము చేయు చుండిరి. ఇద్దరును కలసి మొదటి సారి అష్టావధానము చేయుటకు కాకినాడకు బయలు దేరిరి.

అప్పటికి శ్రీ తిరుపతికి సంస్కృత కవనమే కాని ఆంధ్రఛ్ఛందస్సు బాగారాదు. దారిలో శాస్త్రి తిరుపతికి ఆ రహస్యాలు బోధింగా వేదవిదుల ఇంటి బిడ్డ గనుక వెంటనే ధారణ చేసెను.

వారిచేత శ్రీ దురిసేటి శేషగిరిరావు అష్టావధానము చేయించి గౌరవవించెను. అది శ్రీరామశాస్త్రి వలన విని శ్రీ బాదము వెంకటరత్నము

కవులను పిలిపించి, 'అష్టావధానము కష్టము కాదు, మీరు శతావధానము చేయగలరా?' అని అడిగి దాని వివరములు తెలిపెను. జంట కవులు అహంకరింపలేదు. ఆలోచించి జవాబు చెప్పెదుమని వ్యవధి అర్థించిరి.

వారిద్దరు ఏకాంతముగా ఒక కొబ్బరి తోట చేరుకొనిరి. అక్కడ నూరు కొబ్బరి చెట్లను పృచ్ఛకులుగా భావించుకొని చెట్లకు శతావధానము చేసిరి. దానితో తమకా శక్తి కలదని నిర్ధారణ చేసుకొని వచ్చి సభలో శ్రీ వెంకటరత్నముతో 'శతమునకే కాదు సహస్రమునకైనను చెప్ప గలము' అని చెప్పిరి. తర్వాత సంపూర్ణ శతావదాన సభ ఏర్పాటైనది.

మొదటి రోజు సాయంకాలమునకు మొదటి పాదమైనది. అప్పుడు సభ్యులు 'ఈ రోజు వదలినచో ఇద్దరు ఆలోచించు కొందురు గనుక కొన్ని పద్యములైనా ఈ రోజే పూర్తి చేయగలరా? ఒక వరుస లేకుండ పూరింప గలరా' అని యడిగిరి. కవులట్లే చేయుదు మనిరి. ఒక వరుసలేదు పంక్తిలో మొదట కూర్చున్న వారులేరు. అంకెల ప్రకారము వారడిగి నట్లెల్ల పూరించిరి. అట్లు నిర్వహింప గలుగుట బుద్ధిబలమో, దైవబలమో చెప్పలేమని శ్రీ వెంకటశాస్త్రిగారే జాతకచర్యలో అబ్బురము ప్రకటించిరి. ఇంకేమున్నది! సభ అంతా 'అహా, ఆహా!' అని అగ్గింపులతో మారు మ్రోగినది. కవులకు కొందరు మ్రొక్కువారు, నరనారాయణులే ఈ రూప మున అవతరించిరని ప్రశంసించు వారునైరి. అట్లారంభించినది జయ ప్రదముగా కొనసాగుట కభ్యంతర ముండరాదు. ఐనా పానకములో పుడక రాకమానదు. అది అవధానము పూర్తికానున్న 7వ నాడు వచ్చినది. అది తెచ్చినది శ్రీ వెంపరాల వెంకటశాస్త్రి.

శ్రీ వెంపరాల శాస్త్రి సభకు తాను రాక తను కుమాళ్ళను 53, 54 స్థానములలో కూర్చుండబెట్టిరి. ఒకరు భూపుత్రి వివాహము ఉప జాతిలోను. ఒకరు కాకినాడ ద్విజవర్ణనము వంశస్థ లోను అడిగిరి. 7 వ నాడు తండ్రియే సభకువచ్చి అధ్యక్షులైన వెంకటరత్నముగారితో హేళనగా కవులు చెప్పినది ఉపజాతి కాదనియు, వర్ణ్యము తప్పిన దనియు రెండు దోషము లుద్ఘాటించిరి.వారు కవులను పిలిచి 'మీపద్యము తప్పు లున్నవట, ఏమందురు?' అని అడిగిరి. కవులు వినయముగా

అవధానములో ఎంతవారికైనను తప్పులు రావచ్చును. ఐనా ఆ తప్పులు ఏవో సెలవీయండి' అని అడిగిరి.

అప్పుడు శ్రీ వెంపరాల శాస్త్రి కుమార సంభవము మొదటి శ్లోకము చదివి, 'ఉపజాతిలో ఉపేంద్రవజ్ర ఇంద్రవజ్ర సాంకర్యము సమముగా ఉండవలె. మీ పద్యములో నట్లులేదు గనుక తప్పు' అనిరి.

వెంటనే కవులు రఘువంశము రెండవ సర్గలోని మొదటి శ్లోకము చదివి 'రెండూ ఉపజాతులే' అనుచు అనన్తరోదీరిత లక్ష్మభాజౌ పాదౌ యదీయా ఉపజాతయస్తాః' అని మల్లినాథసూరి వ్యాఖ్యాన పఙ్క్తులనుదాహరించిరి. దానితో శాస్త్రి నిరుత్తరుడై రెండవ దోష మెత్తుకొనబోయెను. 'ముందు ఇందులో మీకు అపజయము ఒప్పుకోండి' అని సభ్యులు కేకలు వేసి చప్పట్లు కొట్టిరి. ఆయన రెండవ దోషమున్నదన్న పద్యమిది.

"ఈ నా పుత్రి నొసగెద ననూనాకృతి
భాసమాన నొగి భార్యగ ని
ద్దాని దగనేలు కొమ్మని వీనికి
నర్థంబు తేట తెల్లముగాగన్"

ఈ పద్యము సీత పెండ్లికేకాక ఎవరి పెండ్లికైనను అన్వయించును కనుక వర్ణ్యము తప్పినది అని శ్రీ శాస్త్రి వాదము.

కవులప్పుడా పద్యమునకు సీతా వివాహమునకే అన్వయించు నట్లర్థము చెప్పగా, వినిసంతోషించి సభలోని పండితులైన నరసింహ శాస్త్రిగారలు ఇట్లాక్షేపణలు చేయరాదని శ్రీ వెంపరాల శాస్త్రికి చెప్పి సద్ది చేయ జూచిరి. ఆయన వినక 'ఇది క్లిష్టాన్వయము, దీనిని బుధు లొప్పుదురా?' అనుచు ఇంకను ఎదిరించెను.

అప్పుడు రామశాస్త్రి మండిపడి 'అవధాన పద్యములో క్లిష్టతాదోష మెన్నుచున్నావు. నీ వెప్పుడైనా పద్యముచెప్పి ఎరుగుదువా?' అని అడుగగా ఆయన తా నెప్పుడో చెప్పిన పద్యము చదివెను. అందులో 'వర్ధిష్యద్బుద్ధి' అని ఉన్నది.

అది విని వెంటనే రామశాస్త్రి 'వర్ధిష్యద్బుద్ధి' అన్నపదము శబ్ద

శాస్త్ర విరుద్ధము. మా బోంట్లము చెవులు మూసికొనవలెను' అనిరి. నర సింహశాస్త్రి ఇత్యాది పండితులును రామశాస్త్రినే సమర్థించిరి. దానితో సభ్యులు "వహ్వా, వహ్వా" అని కవులను ప్రశంసించుచు చప్పట్లు కొట్టిరి.

అంతట అవధానపూర్తి సభ జరిగినది. ఒకరు పద్యములు తల క్రిందులుగా అప్పజెపుమనిరి. ఒకరు నాచరణము మీరే చెపుడని శ్రీ వెం కట శాస్త్రిని, ఇంకొకరు శ్రీ తిరుపతిని అడిగిరి. ఈ విధముగా ఆ మహా సభలోని సభ్యులలో ఎవరికేమి కష్టమని స్ఫురించెనో, ఆ పద్ధతులెల్ల నడి గిరి. అందరికి కవులు సుష్ఠుగా సమాధానములు చెప్పిరి. సభ జరిగిన పాఠశాలా భవనము పాలసముద్రమువలె ఆనందముతో పొంగి పొరలినది. అద్భుతమని అందరు ప్రశంసించిరి.

కాకినాడ పౌరులు నాలుగు నూటవదార్లు, జోడు శాలువలు, రెండు చాపులు సమర్పించి, అత్తరు తాంబూలము లిచ్చి మ్రొక్కిరి. తాము పుట్టి బుద్ధి ఎరిగిన తర్వాత ఇట్టి కవీశ్వరులను చూడలేదని బహువిధముల నగ్గించుచు పురప్రముఖులు ఉపన్యాసములు చేసిరి. కవులను హారాదు లతో నలంకరించి అశ్వశకటముపై నెక్కించి మేళతాళములతో నూరే గించిరి. అది 1891 సం॥ము; అప్పటికి మోటారులు రాలేదని నేటి పాఠ కులు గుర్తించుకొనవలెను.

ఇంత ఘనసమ్మానము పొంది మరికొన్ని అవధానములుచేసి బ్రహ్మగురుని యొద్దకువచ్చి కవులు మ్రొక్కగా గురువు లానందముతో నాశీర్వదించిరి.

శ్రీ తిరుపతి వెంకటేశ్వరులకు కాకినాడలోనంత గౌరవము జరిగి నది. కాని అప్పటికి నాలుగైదేళ్ళ క్రిందట ఆ కాకినాడకే వెంకటశాస్త్రి మేఘ సందేశము అధ్యయనము చేయుటకు పోగా, వారములు కుదరక కాటవరమను పల్లెకు చేరవలసిన వాడాయెను. కాలము కావించు చమ త్కార మీ విధముగా నుండును!

కాకినాడ శతావధానమైన తర్వాత కోనసీమ అగ్రహారములలో ఎన్నో అవధానములు చేసిరి. అమలాపురములో అష్టావధాన శతావధాన

ములు కాకినాడలో నంతగా వైభవముగా జరిగినవి. ఆ పిమ్మట వ్యాకరణ మహాభాష్యాధ్యయన మారంభమైనది.

ద్రవ్యార్జనకై ఏలూరు వెళ్ళి అవధానముచేసి బందరు వెళ్ళిరి. బందరులో వారికి అమిత ధనలాభముతోపాటు గౌరవాదులును చేకూరినవి. విందులు, సభలు, గానములు, నాటకములు సాటిలేకుండ సాగినవి, అక్కడ అష్టావధానము వ్యస్తాక్షరిలో రెండు భాషల పదము లిచ్చిరి. అక్కడ సిడ్నీవి. ఎడ్జి అను హూణుడు ముగ్ధుడై ఆ సంవత్సరము డిసెంబరులో అడయారులో జరుగు థియొసాఫికల్ కన్వెన్షను సభకు రమ్మని యాహ్వానించెను.

అది 1893 డిసెంబరు. ఆ సభకు అనిబెసెంటమ్మ, అనేక దేశముల నుండి ప్రసిద్ధులు వచ్చిరి. వారి సమక్షములో కవులు చేసిన అష్టావధానమునకు అందరు ముగ్ధులైరి. బెసెంటమ్మ నూటపదార్లిచ్చి అభినందన పత్రిక కూడ నిచ్చినది. చెన్నపట్టణ పౌరులు కూడ నెంతో సమ్మానించిరి.

నెల్లూరులో అష్టావధానము విశేషనియమములతో జరిగినది. పద్యము అక్షరము ఒక్కటొక్కటే చెప్పవలెను. అవధాన పూర్తికి ఆనందించి "బాలసరస్వతి" బిరుదమిచ్చి విందులతో ఘనముగా సమ్మానించిరి.

పిఠాపురము, బెజవాడ, విజయనగరము, హైదరాబాదు, గుంటూరు ఇత్యాది పట్టణములందంతటను అవధానములు, సభలు జరిగెను. గుంటూరు సభలో, 1911 సం॥లో అగస్టు మాసమని తోచును. శ్రీ కొప్పరపు కవుల అభిమానులు లేవదీసిన కుర్చీ తగాదాలతో, అప్పటికే కుములుచున్న అగ్గివలెనున్న వైదికనియోగి స్పర్ధలు మంటలుగా ప్రజ్వరిల్లినవి. ఏది ఎట్లున్నను, దానితో అటు కొప్పరపువారికిని, ఇటు తిరుపతి వెంకటేశ్వరులకును సభలు, సమ్మానములు అశ్రుత పూర్వముగా సాగినవి. పట్టణములలోనేగాక పల్లెలలోగూడ శ్రీ తిరుపతి వెంకటేశ్వరులు సభలు అవధానములు చేసిరి.

ఒక్క విశేషము మాత్రమున్నది. శ్రీ తిరుపతి వెంకటేశ్వరు లెన్నడును నియోగులను దూషింపలేదు. అందువల్లనే వారియందు కేవల

శాఖాభిమానదోష దూషితులుకాని నియోగులందరు గౌరవాభిమానములు చూపుచుండిరి. శ్రీ తిరుపతి శాస్త్రిని ఆస్థానకవిగానుంచుకొని అసమానా దరాభిమానములు ప్రదర్శించిన పోలవరము జమీందారుగారు నియోగి ప్రభువులు. వారి శిష్యులలో అగ్రగణ్యులై, శ్రీ వెంకట శాస్త్రిగారికి అమ రణము జరిగిన మహా సన్మానములకు ఆధ్వర్యవము వహించిన శ్రీ పింగళి లక్ష్మీకాంతము, శ్రీ కాటూరి వెంకటేశ్వరరావులు నియోగులే యని గమనింపవలెను.

కవుల తగాదాల పిమ్మట పల్లెటూళ్ళలో జరిగిన అవధానములు సన్మానములలోనెల్ల అగ్రగణ్యమైనది. వేమవరాగ్రహార శతావధానము. దాని వైభవము మహానగరముల సభలను మించి పోయినది. కవులను బ్రహ్మరథముపట్టి ఊరేగించిరి. కంకణ ప్రదానాదులతో గౌరవించిరి. ఆ సమయములో జరిగిన అన్నప్రదానము తిరుపతి వెంకటేశ్వరులకే ఆశ్చ ర్యమనిపించినది.

అశ్వమేధంబొ రాజసూయంబొ సత్ర
యాగమో నాగ్ల నవధాన మలవఱిచిరి

అని ప్రశంసించిరి. అప్పటికే తిరుపతి వెంకటేశ్వరులకు వయస్సు మీరు చున్నది. కావున నవధానారంభములో శ్రీ వెంకటశాస్త్రి కాత్యాయనీదేవి నిట్లు ప్రార్థించెను.

'గిరగిర గిర్రగిర్ర గిర
గిర్గిరగిర్గిర గిర్రుగిర్రుగా
దిరిగెడి శీర్ష, మేగతిని దేవి,
వధాన మొనర్ప నేర్తునం
చరయక నీ కటాక్షమది
యాదరు వుండుట జేసి సాహస
స్ఫురణకు బూనినాడ
గృప పొంపిరివో భరియింపు మింపుగన్.'

ఆ యగ్రహారములో జరిగిన మర్యాదలకు ఆనందపరవశులై వెళ్ళుచు, దారిలో శ్రీ వెంకటశాస్త్రి చెప్పిన పద్యములలో నొకటి:

'ఎక్కించితివిగదా యేగుచో మేనాల
  సర్వతస్సుమవృష్టి సంకులముగ
బట్టించితివిగదా బ్రహ్మ రథముగూడ
  స్వస్తి వాచన పురస్సరము గాగ
గల్పించితివిగదా గాఢోత్సవమ్ముల
  వారాంగనా కదంబముల తోడ
దాల్పించితివిగదా తలలపై బాదర
  జంబు నా బాలవృద్ధంబుగాగ

దురభిమాన గ్రహావేశ ధూమధూపి
తాప్రయోజక గర్తపురాంతర స్థి
తాత్మ పద్ధతి పక్షానుయాయి సుజన
సంకలిత నిత్యమూర్ఛ, అననపు జర్చ!'

# 6

శ్రీ తిరుపతి కవుల విజయ యాత్రలలో నానారాజ సందర్శనము ప్రత్యేక ఘట్టము. వారు లబ్ధ ప్రతిష్ఠులైన తర్వాత ఎందరో రాజులు వారిని ఘనముగా సన్మానించిరి. ఈ గౌరవమునకు రాచబాట పడక ముందు వారెంతో చిక్కులు పడవలసి వచ్చినది. మొదట వెంకటగిరిలో, తర్వాత గద్వాల, ఆత్మకూరు, వనపర్తి, విజయనగరములలో; తక్కిన చోట్ల చిక్కులు స్వల్పమైనవి.

అప్పటి రాజుల సంగతి ముందు కొంత ప్రస్తావించుట అవసరము. నైజాము సంస్థానములోని ప్రభువులకు తప్ప, బ్రిటిషు భాగములోని వారికి రాజమహారాజ బిరుదము లున్నను ఎవరికిని ప్రభుత్వాధికారములు ఏవీలేవు. కొద్ది గ్రామములకో, ఎక్కువ గ్రామములకో మేలువరము శిస్తు వసూలు చేసుకొను అధికారము మాత్రమే కలవారు. పాలిత ప్రజల పైన సివిలు క్రిమినలు అధికారాలు లేవు. ఐనా వారికున్న పలుకుబడిని బట్టి ప్రభుత్వమున్నవారి వలెనే వ్యవహరించేవారు.

వారి ఆస్థానాలను ఆశ్రయించి పండితులు, పెద్దలో పిన్నలో ఉండే వారు. ఎటువంటి వారైనా వారి మాటలకే ఆయా ప్రభువులవద్ద చెల్లుబాటు ఉండేది.

అప్పటి ఆస్థానము లన్నిటిలో దిగ్దంతులైన పండిత ప్రకాండు లున్నది విజయనగరము. ప్రభువు ఆనంద గజపతులు స్వయముగా పండితుడేకాక విస్తార సంస్కృతి కలవాడు.

ఇక నైజాము రాజ్యములోని గద్వాల, ఆత్మకూరు, వనపర్తి ప్రభువులకు సివిలు క్రిమినలు అధికారాలు కూడా ఉండేవి. అక్కడ ప్రధాన విద్వాంసులు శ్రీవైష్ణవులు. వారు పెద్ద పెద్ద విద్వాంసు లవుటచే వారి మాటకు తిరుగు ఉండేది కాదు. స్మార్తులైన తిరుపతి కవులకు తమ ప్రభువులు సన్మానములు చేయకుండా ఎన్నో ఆటంకాలు కలిగించినారు. అన్నిటిని ప్రతిఘటించి గద్వాల ఆత్మకూరులలో తిరుపతి కవులు విశేష గౌరవములు పొంద గలుగుట వారు ప్రదర్శించిన ప్రజ్ఞా ప్రభావము వల్లనే. అట్టి విజయము వనపర్తిలో మాత్రము సాధ్యపడినట్లు తోచదు. కాని ప్రభువు సమక్షములో అవమానకరముగా చాటువులు చెప్పి రాగలుగుటే వారి మహత్త్వమునకు నిదర్శనము.

వనపర్తి వలెనే విశాఖపట్టణములో శ్రీ గోడె గజపతిరావుగారు కవులను సరిగా సన్మానింపలేదు. వారికి కవులు పెట్టుకున్న అర్జీ పైకి వినయము, అంతరములో కొంత ధూర్తత్వమూ ప్రదర్శిస్తుంది. అది చాలా మంచి చాటువు:

'సంగర శక్తి లేదు, వ్యవసాయము చేయుట సున్న, సంతలో
నంగడివేసి యమ్ముటది యంతకు మున్నెహుళక్కి, ముష్టికిన్
బొంగు బుజాన వేసుకొని పోయెద మెక్కడికేని, ముష్టిచెం
బుం గొనిపెట్టు మొక్కటి, యమోఘ మిదేకద దంతిరాణ్ణృపా'

వనపర్తిలో దానినే మరి యొక విధముగా ప్రదర్శించినారు. గద్వాల, ఆత్మకూరు, విజయనగరాదులలో సన్మానములు పొందిన తర్వాతనే కవులు వనపర్తి ప్రభువును దర్శింప గలిగిరి. అప్పటికి ఎనిమిదేళ్ళ నుండి

వెళ్ళుచున్నను దర్శనము కాలేదు. వనపర్తి ప్రభువు వదాన్యుడని ప్రసిద్ధి. కవులు వ్రాసిన పద్యాలను బట్టి తమ వలన ప్రభువుకావ్య మొకటి అంకింతము గొని ఘనముగా గండ పెండారమువంటి బిరుదములతో సమ్మానించునను నాశతో ఉన్నట్లు కనబడును. కాని ప్రభువు కృతి పొందలేదు. అవధానమైన చేయింపక పది రూప్యములిచ్చెను. కవులు మండిపడి యిట్లనిరి:

'అరుదుగ వత్తురంచును మహాకవులంచును దోడివారలం
దొరు నవధానశక్తిగని నూరులు వేలు నొసంగిరంచు నీ
వెరిగియు, మేటిదాతవయి యే, పదిరూపిక లిచ్చినావుగా
తిరుపతి వేంకటేశకవి ధీరుల కో వనపర్తి భూవరా!'

'అన్నములేక వచ్చితి మటంచు మనమ్మున నెంచినాడవో,
చిన్నగజూచుటే యశము సేయునటంచు దలంచినాడవో.'

'అనుభవించితిమి దివ్యద్భోగములను రా
జాధిరాజులకన్న నధికముగును
సంచరించితిమి రాజ్యస్థానముల బూర్వ
కవులకన్నను నిరాఘాటముగను
ఆర్జించితిమి యింత యతిధుల కిడి మేము
ననుభవింప జాలినట్టి వృత్తి
రచియించితిమి వచోరమణి తోడుగ రప
వంతమ్ములైన ప్రబంధములను
రాజమిత్రుల మదిగాక రాజబంధు
వులము కవిరాజులము పదువురుగలట్టి
కులమువారము మాకెందు గొదవలేదు
కీర్తికై రాక చుమి వనపర్తిభూప.'

'ఎందుకేతెంచితి మటంచు నెడద దుఃఖ
పడుటయే మేటి లాభమ్ము పార్థివేంద్ర,
ద్రవ్యమిదియేల కైకొమ్ము దయయె చాలు,
దానికింత యనెడి వెల తనర దధిప.'

'సివిలు మొదలగు నధికృతి చెలగు మీర
లేమి యొనరించినను మంచిదే యటంచు
సంతసింతుము మాకెట్లు సంభవించె
నేని యది హెచ్చు గౌరవమింతకన్న.'

కవులను చెరసాలలో వేయించగల అధికారమున్న ప్రభువు వనపర్తిరాజు! అకాలపు నైజాము రాజ్యములో చిన్న నేరానికే ఒకసారి జైలులో వేసిన మనిషి పత్తా దొరకడానికి నెలలు పట్టేదని మనము గుర్తించుకోవలె!

వనపర్తినుండి తిరిగి వచ్చుచు శ్రీ తిరుపతి చెప్పిన పద్యములో ఒకటి.

'వొండు గద్వాల కాత్మకూర్పురమునకును
ఏమొసంగిన సరసు లా భూమిపతులు
వినుడు మామాట, పైనెందు జనకుడయ్యు
పాకనాటి నృపాలు రెప్పట్ల లేరు.'

శ్రీ వెంకటశాస్త్రి చెప్పినపద్యము ఇంకొక విధముగా ఉన్నది.

'ఒక యేగానికి జిన్నికుర్రనికి
నాయుష్కర్మ చేయించి దా
నికినై కాని యొసంగి తక్కుసగమున్
దెమ్మన్న నాచేత లే
దకటా నాగమ, క్షేరపుంగృతికి
దా నంగీకృతిం జొప్పు లౌ
ల్యకులాయమ్మగు ముద్దరాలి
చరితం బాలించితే తిర్పతీ!'

ఈ రెండు పద్యాలతో కవులిద్దరిలో వ్యత్యాసము కూడా కనిపిస్తుంది. తిరుపతి సూటిదనము, వెంకటకవికి లోకానుభవమువలన కలిగిన వ్యంగ్య వైభవము గోచరిస్తవి.

# 7

తక్కిన ఆస్థానలలో వివాదాలన్నీ ఒక ఎత్తూ, గద్వాల ఆత్మ కూరులలో జరిగిన తగాదాలు ఒక ఎత్తూ. ఆ రెండు సంస్థానాలలో తుదకు వారికి ప్రాప్తించిన విజయాలుకూడా నిస్తులమైనవే. రెండు సంస్థానాలకు కృష్ణానదియే అడ్డము. రాజధానులకు మూడుక్రోసులే ఎడము. ఇద్దరూ రెడ్డి ప్రభువులే. రెండు సంస్థానాలూ పండితులను పరీక్షించి ఘనముగా సమ్మానించినవే! రెండింటిలోను ఆస్థానవిద్వాంసులు గట్టివారే. గద్వాలవారికి కేశవస్వామి ఇష్టదైవము. అక్కడ ఏటేట కార్తికములో వేదశాస్త్ర పండితులకును, మాఘములో కవిగాయకులను సమ్మానములు జరుగును. ఆత్మకూరువారికి కురుమతి స్వామి ఇష్టదైవము అక్కడ ఫాల్గుణ మాసములో కవి పండిత గాయక నాట్యవేత్తలకు సమ్మాన మొనర్తురు. విద్వత్కవిపోషణలో రెండు సంస్థానములకును స్పర్ధకూడా కలదు. ఆ రెండు సంస్థానములో రెండు చిన్న భారత యుద్ధములు జరిగిన తర్వాతగాని తిరుపతి కవులకు సమ్మానములు జరుగలేదు. సమ్మానములు పొందువరకు వారా యాస్థానములకు పోక మానలేదు. తిరుపతి కవుల విజయయాత్రలకు ఆ సంస్థానముల సమ్మానములును రెండు ఉన్నత జయపతాకలు. ముందు గద్వాలలో జయపత్రిక పొందిన తర్వాతనే అత్మకూరుయాత్ర కావించిరి.

గద్వాలకు మొదటిసారి 1895 సం. మాఘమాస ప్రాంతములో వెళ్ళిరి. వేళ కన్నములేక చాలా బాధపడిరి. కష్టమైన ప్రయాణము. కవుల మనవులు ప్రభువు చెవి కెక్కలేదు. అక్కడ నప్పుడు గాయకులకే ఘన గౌరవము కాని విద్వత్కవులకు లేదని విరక్తితో తిరిగి వచ్చిరి.

ఆ పిమ్మట విజయనగర యాత్రచేసి అక్కడ సమ్మానము సాధించి, 1896లో మరల గద్వాల వెళ్ళిరి. ప్రవేశ పరీక్షలో వారికి త్రిపాద సమస్య నిచ్చిరి.

'రామాయ రామభద్రాయ
గురుం నత్వాకఒరోత్కవిః
వేణీ సంహార నాటకమ్....'

దానిని వెంటనే కవులిట్లు చక్కగా పూరించిరి;

'తపస్స్వాధ్యాయ నిరతం గురుం నత్వాఽకరోత్కవిః
రామాయ రామభద్రాయ వేణీసంహార నాటకమ్,'

అక్కడ ధర్మాధికారి ప్రభువు చెవిలో ఏవేవో నూరిపోసి అవధాన పభ కాకుండ విఘ్నము కావించెనను కోపముతో కవులిట్లనిరి:

'అవాసమా, గౌతమా పత్యతటినీ త
టీ రాజితంబైన యూరు మాకు...
అట్టి మేమిట్టి గద్వాల కరుగుదెంచి
కుటిల ధర్మాధికారి వాక్కులను వినిన
రాజుచే మన్ననలు పొందలేక యూర
కేగుచుంటిమి మా శక్తియీ నృపాలు
చెవిని వేయు మీవైన గేశవ, మహాత్మ!'

ఆ మాటలలో ప్రౌఢి కలసిన బెదరింపున్నది. గద్వాల ప్రభువులకు కేశవస్వామి యెడలగల భయ భక్తుల చేతనే వారు కవి పండిత సమ్మానములు చేయుట. అప్పు డాస్థానములోని ఆదిపూడి ప్రభాకర కవి ప్రభువుల కిట్లు ఆశువుగా సిఫార్సు చేసెను;

'కనకాభిషేకమ్ము గావింపు మనలేదు
వెయ్యార్లు లిమ్మని వేడలేదు......
గండ పెండేరమ్ము గావలెనన లేదు
మాన్యమ్ము లిమ్మని మనవి లేదు
ఒక సభచేసి తోచిన వక్కలాకు
లిచ్చి పంపించు మనుటకే యింతలాయె...'

దానితో ప్రభువు మనస్సు తిరిగినది. సంస్కృతాంధ్రములతో కవులచే 21-2-1896న 57 మందికి శతావధానము చేయించి ఆనందించి, ప్రభువు కవులకు రాంకవములు హేమ బిరుదములు నూరార్లు బహూకరించి ప్రతిపక్షి సమక్షములోనే 'తగిన కవి చంద్రు'లని ప్రశంసించి గద్వాల మొహరుతో జయ పత్రిక సమర్పించిరి. అవధాన సమయములో కవులు ప్రతి పక్షులను నిశ్శంకముగా దుయ్య బట్టిరి.

* ఈ సమ్మానమునకు పూర్వమే 'శనిగ్రహము' అను పేర పరోక్షముగా ధర్మాధికారిని నిందించినారు. అది 27 పద్యముల లఘు కృతి. ఐనా తిట్టు కవిత్వములో అద్వితీయమైనది. అన్ని తిట్టు కవితలలో వలెనే, అందులోను ప్రత్యక్షముగాను వ్యంగ్యముగాను కొంత అసభ్యత కూడా కలదు. మొదటి పద్యములో శ్లేషాను ప్రాణితమైన వ్యంగ్యమెంతో ఉన్నది.

'ధరణీ నాయకు డుత్తముండవని నిన్ ధర్మాధికారమ్ము నం
దు రహి న్నిల్పుట, తుచ్ఛ బుద్ధివయి క్రిందున్ మీదునుం గాన కె
ల్లరి కార్యమ్ములు పాడు సేయుటకె నీ లక్ష్యమ్ము మా బోటు లెం
చరు, చండాల, శనిగ్రహంబ యిక మా సామర్థ్యముం జూడుమా!

ధర్మాధికారి శబ్దమును ధర్మ + అధిక + అరి అని కూడ విరువ వచ్చును. ధర్మము అనగా ధనస్సు అను నర్థమున్నది. ధనుర్లగ్నము బృహస్పతికి స్వస్థానము. శని చండాల గ్రహము. ధరణీ నాయకుడు, రాజా- అనగా చంద్రుడు.

శని నింకా కవులిట్లు తిట్టినారు.

'నీ తోబుట్టువు దున్న నెక్కు.......'
'నిరుడే తెంచిన, వచ్చు వత్సరమటంటే కాదె...'
'కుంకా, పాప మటంచు నెంచక వృధా
కొండెంబులన్ రాజుతో....'
'నీకంటెన్ ఘనులంచు మమ్ము జనులెం
తే బేర్కొనం దాన బల్
శోకం బందికాదా' సభన్ జెరచి నీ
శూరత్వముం జూపి తీ

---

*'శనిగ్రహము' ఆత్మకూరు విద్వాంసుని గూర్చి వ్రాసినదని శిష్టా లక్ష్మీకాంతశాస్త్రిగారు వ్రాసిరి. దానినే శ్రీ రావూరి దొరస్వామి శర్మగారు కూడ ననుసరించిరి. అది పొరపాటని తోచును. శ్రీ వెంకటశాస్త్రిగారి జాతక చర్యకు ప్రామాణ్య మిచ్చితిమి.

శోకంటే కడతేర్చు నిన్ను...
'గురుడున్ సూర్యుడు చంద్రుడున్ గుజుడు శు
క్రుండున్ బుధుండుం బర
స్పరముం గార్యము నిర్వహించుటకునై
పల్మారు యత్నించుచుం
డిరి కాకుండునె, రాహు కేతువులతో
నీ వొక్కడుం జేరి మ
త్సరముంజూప శనిగ్రహంబ యిక మా
సామర్థ్యముం జాడుమా!'

ఆస్థానములోని ఇతర పండితు లెందరో తిరుపతి కవుల పక్షమైరి. ఇద్దరు మాత్రము- రాహు కేతువులు శని పక్షము. తిరుపతి కవుల యత్నము నెరవేరినది.

తిరుపతి కవులెంత బాధతో తిట్టు కవిత్వమునకు దిగినారో ఈ పద్యములో వ్యక్తమవుతుంది.

'అకలంకమ్ముగ దేవతా కృతులుగా నైనన్ మహారాజ వ
ర్యకృతుల్గా గనునైన గ్రంథములు చేయం బూను మాచేత ది
ట్టు కవిత్వమును జెప్ప జేసితివి పాడుం బుద్ధి చూపించి
దుష్ట, కులభ్రష్ట, శనిగ్రహంబ యిక మా సామర్థ్యముం జూడుమా'

శనిగ్రహబాధ తొలగిన తర్వాత నుండి గద్వాలకు తిరుపతి కవులు నిరాఘాటముగా వార్షిక యాత్రలు సాగించిరి. ఐనను శత్రుపక్షమువారి యలజడి పూర్తిగా పోలేదు. 1902 లో వారు ఆత్మకూరు మీదుగా గద్వాల వెళ్ళిరి. గద్వాల రామభూపాలుడు చనిపోవుటచే ఆయన సంవత్సర దినమువరకు గద్వాల రాణి కవుల నుండుడని యాపినది. అప్పుడు ఆత్మకూరు రాజు మేనల్లుడు, గద్వాల వారికిని బంధువగు శ్రీనివాసుడు పచ్చిగా పూరింపదగిన సమస్య ఈయగా, కవులు దానిని తగిన విధమున పూరించిరి. అది శత్రువులైన వారు తమకే అన్వయించుకొని కుపితులై, కవులపై పేరు పెట్టియే బూతుపద్యము వ్రాసి, తమ శిష్యుడైన భట్టును కర్తగా కల్పించి, కవులకు పంపిరి. ఇది తెలిసి గద్వాలరాణిగారు వెంటనే

ఆ భట్టును ఖైదులో వేయించిరి. అంతట ఆ పండితులు తామే ఆ పద్యము వ్రాసినట్లు ఒప్పుకొని, భట్టుకు వేసిన ఖైదు తమకు వేసినట్లె యని వేడుకొనగా, రాణిగారు మన్నించి భట్టును ఖైదునుండి విడిపించిరి. ఇదంతయు సరిగా వేలకొలది బ్రాహ్మణ్యము, పండితులు రామభూపాలుని దినమునకు వచ్చిన రోజుననే జరుగుటచే పండితులందరు కవుల శత్రువులను గర్వించిరి. ఆరేడు సంవత్సరములు సాగిన గద్వాల తగాదా ఈ ఉదంతముతో శమించినట్లు తోచును.

# 8

ఆత్మకూరు తగాదా ఒకటిరెండు సంవత్సరములే సాగినా అది తీవ్రతరమైనది ; కవులు అంతిమ విజయముకూడా అఖండతరమైనది.

అప్పటి ఆత్మకూరు రాజు సీతారామరాజుగారు. ఆస్థానపండితులలో ప్రధానుడు తర్కతీర్థ, బాలసరస్వతీత్యాది బిరుదాంకితుడైన శ్రీ తిరుమల బుక్క పట్టణము శ్రీనివాసాచార్యులుగారు. ఆయన వరుసగా ఎనిమిది తరాలుగా మహావిద్వాంసులుగా ప్రసిద్ధి వొందినవారి వంశములో పుట్టిన విద్వత్కవి. ఇందోరు, గ్వాలియరు, ధారానగరము సంస్థానములలో వైదుష్యము ప్రదర్శించి మెప్పు లందినవారు. వారిగూర్చి శ్రీ వెంకట శాస్త్రి జాతక చర్యలో 'ఆయన చదివినది తర్కము, సంగ్రహించినది వ్యాకరణము. వైష్ణవుడు కనుక అన్ని విద్యలు నేర్తుననును. గద్వాల నృసింహాచార్యులకన్న తాను కవితలో నధికుడననును. ఆయనకు తెలుగు రానందున సికపట్లు కలిగెను'అని వ్రాసిరి. వారే 'కథలు గాథలు' లో ఇట్లు వ్రాసిరి. 'ఆత్మకూరు సంస్థానంలో ఒక పండితుడున్నాడనిన్నీ, ఆయన నాలుగు శాస్త్రాలు వచ్చినవారనిన్నీ, ఆశుకవిత్వము చెప్పే వారనిన్నీ, చాలా సమర్థులనిన్నీ చెప్పడంమాత్రం వింటూ ఉన్నాము. ఆయన కున్నంతపేరు ఆప్రాంతంలో ఎవ్వరికిన్నీ లేదు.'

ఆ యాస్థానంలో ప్రాచీనకవియైన కవిసార్వభౌమ శఠమర్షణ కృష్ణమాచార్యులు 'శ్రీనివాస విలాసము' అను చంపూకావ్యమును సంస్కృతములో రచించిరి సీతారామప్రభువు దానిని ఆంధ్రీకరింపుడని

ఎందరికో ఇచ్చినను, అందరును చేతకాదని వదలుకొనిరి. అట్టి దాని నాయన, కొంత పరీక్షార్థమే తిరుపతికవుల కిచ్చిరి. వారు చదివి చెప్పెద మని ఒక రాత్రిలో చదివి మరునాడు దాని నాంధ్రీకరింతుమని ప్రభువుకు నివేదించిరి ప్రభువాశ్చర్యముతో నాదరించెను.

ఆ యాదరము చూడగా ఆస్థానకవి శ్రీనివాసాచార్యులకు అసూయ కలిగినది. ఆయన కవులకు మీసములుండుటనుబట్టి చూడగా వీరు పండితులు కాదని పలికెను. ఆ సందర్భములోనే జగత్ప్రసిద్ధమైన 'దోసమటంచెరింగియును' ఇత్యాది మీసము పద్యము పుట్టినది.

మాకాలోచింపగా, కవులకప్పుడు మీసముండుటకు కారణము తండ్రి జీవించియుండగా మీసములు తీయుట కొంతమంది వైదికులు తప్పుగా భావించు నాచారముండుట వల్లనని తోచును. ఏమైననేమి, మీసములెందుకుంచినారనగా, పౌరుషముగా కవులు ప్రత్యుత్తరమిచ్చిరి.

తర్వాత నొకనాడు రాజసభలో కవులు తమ దేవీభాగవతము వినిపించుచుండిరి. అందులో 'గుణాలయ' శబ్దము, 'దేవతలు ధర్మవర్తులు' అనుటయు సంస్కృత వ్యాకరణ విరుద్ధములగుటచే అప శబ్దములని ఆచార్యులు నిరూపించిరి. కవులు నన్నయాదుల ప్రయోగములు చూపి సమర్థింపగా, ఆచార్యులవి అచ్చు తప్పులనిరి. ఆయన వాదమును సభలోని ఇతర పండితులొప్పలేదు. రాజుతో కవులిట్లు చెప్పిరి:

'ఆంధ్రభాషకు నన్నయ రచించినట్టి భా
రతము కవీంద్ర సమ్మతమయేని
అస్మత్ప్రయుక్త గుణాలయ పదము భా
రత ప్రయోగానుగతమయేని
అచ్చు లోపంబన్న యట్టి మీ ధర్మాధి
కారి వాదము వట్టి కల్లయేని
మన పండితుని కద్దు మాటాడిరని పట్టు
దల నీ మనమ్మున గలిగెనేని
కుర్మతిక్ష్మాధరస్వామి దుర్మతులకు

శిక్షకుండయ్యేనేని మాచేయు ప్రతిన
త్రిప్పివేయంగ నల బ్రహ్మదేవుతరమె !'

ఈ సందర్భముతో గద్వాల వారికి కేశవ స్వామియందువలెనే ఆత్మకూరు వారికి కుర్మతిస్వామి యెడల భయభక్తులు కలవని గుర్తుంచు కోవలెను.

ప్రభువు కేమి చేయను తోచక సభనుండి లేచిపోవుచుండగా తిరుపతికవు లీ పద్యము చెప్పిరి:

'మదనాభిరామ రాణ్మణి బిల్హణ కవీంద్రు
తో విరోధించి తా జేవ చెడడె ?
రాజ కళింగ గంగ్రాజు భీమ కవీంద్రుతో....చెడడె
అల్ల నీలాద్రి రాజల జగ్గసుకవీంద్రుతో....చెడడె ?
మున్ను దమ్మన పిండిప్రోలు లక్ష్మణ కవితో....చెడడె
యేము గెల్చితి మనుమాట కీవె సాక్షి
తగవెరింగియు బక్షపాతమ్ము పూని
మమ్ము నిరసించు టంతక్షేమమ్ముగాదు
ఆత్మకూరు పురీరాజ, యతులతేజ !'
కవుల కెంతటి ధైర్యసాహసములు !

ప్రభువుకును కవులకును రాయబారములు జరిగినవి. రు. 50/– లు సేల్జోడు ఇత్తుము ! సభ చేసెదరా యని కబురువచ్చినది. కవుల సమాధానమిది.

'తక్కిన బహుమానము మా
కక్కరయే లేదు బత్తెమది చాలునయో,
నిక్కమది దంపినమ్మకు
బొక్కినదే కూలిగాదె భూపలలామా !
'శివుడెవ్వరికినైన సేవనీయుడుగాడె
వైష్ణవోత్తముల పాపమ్ముగాక,....
విష్ణువెవ్వరికైన వినతిపాత్రుడుగాడె

శైవుల దురదృష్ట సరణిగాక
మాదు దురదృష్టమునబట్టి మమ్ము గార
వింపకున్నంతనే మీకు వెలితియగునె'....

ఈ జవాబు పంపగా, ప్రభువు 'మా పండితులకును మీకును కలహ మేల ? మీరు శ్రీనివాస విలాసము నాంధ్రీకరించి తెచ్చినతర్వాత సమ్మా నించెద' నని సద్ది చెప్పెను. అప్పుడు కవులు,

'భారతమ్ము తెలుంగు పరప రాజనరేంద్ర
నృపతి నన్నయకవి కిచ్చినట్లు........
శ్రీనివాస విలాస మాంధ్రీకరింప
సరస తిరుపతి వేంకటేశ్వరుల కిప్పు
డానతిచ్చుట మిగుల భాగ్యంబుగాదె
యాత్మకూరు పురీరాజ, యతులతేజ!'

కుర్మతి శ్రీశుని ఉత్సవసమయానికి ఆంధ్రీకృత గ్రంథముతెచ్చి విన్పించెదమని కవులు రాజువద్ద సెలవు తీసుకొనుచు నిట్లనిరి:

'వేసవి దగ్గరాయె, మిమ్ము
వీడుటకున్ మనసొగ్గదాయె, మా
వాసము దూరమాయె, బర
వాస మొనర్చుట భారమాయె, మా
కోసము తల్లి దండ్రులిదిగో నదిగో యని చూచుటాయె వి
శ్వాస మెలర్ప వే సెలవొసంగిన బోయెదమయ్య, భూవరా!"

కవులు మాట తప్పక శ్రీనివాస విలాస మాంధ్రీకరించి ఆ తర్వాత ఫాల్గుణ మాసములో కుర్మతిస్వామికి జరుగు ఉత్సవ సమయానికి ఆత్మ కూరు వెళ్ళిరి. ప్రభువు కుర్మతిగిరిపతి ఉత్సవానికి అంబాపురము వెళ్ళిరని తెలిసి కవు లక్కడికి వెళ్ళిరి. గ్రంథము ఆ స్వామిని గూర్చినది గనుక అక్కడనే ప్రభువు వినదలచెను గాని అందరికి జ్వరములు వచ్చుటచే వీలుపడలేదు. ఉత్సవానంతరము ఆత్మకూరు వచ్చిన తర్వాత ప్రభువు పండిత సమక్షములో 15 రోజులు గ్రంథము వినెను. పండితులు కొందరు

గుణములు, మరి కొందరు దోషములు ఎన్నిరి. ఆ వివాదములు వివరించుట భారత మంత గ్రంథ మవునని 'జాతక చర్య' చెప్పు చున్నది.

సీతారామభూపాలుడు ఆనంద తన్మయుడై కవులను ఘనముగా గౌరవించెను. ఆసమయమున కవులిట్లు ప్రతిజ్ఞ చేసిరి.

'పనిగొని నిమ్మ, కంఠమున
ప్రాణము గల్గిన యంతలోన నో
జనవర, యింత కన్న సర
సమ్ముగ దీని దెలుంగు చేసినన్
వినయమునన్ నమస్కృతులు
వేయొనరించి భవద్వి తీర్ణమౌ
ధన మఖిలంబు నాతనికి
దానము చేసి తరింప కుందుమే!'

ప్రభువు కవులకు మంచి జరీ వస్త్రములు, సేలువలు, బంగారు చంద్రహారములు, భార్యలకు చీరెలు, పైన రెండు నూరార్లు ఇచ్చి, గ్రంథముతో కవులను ఏనుగుపై నెక్కించి, సకల పండితులును వెనువెంట నడువగా, శత్రువులకు ఖేదము, మిత్రులకు మోదము ఇనుమడింపగా ఊరేగింప జేసెను. అంతే కాక సం.కు. రు 200/-లు ఆదాయము వచ్చు భూమిని గూడ సమర్పించెను.

కాని చిత్రముగా కరినెక్కి దిగిన దాదిగా తిరుపతి వెంకటేశ్వరుల కిద్దరికి తీవ్రముగా జ్వర మారంభించినది. ఇదేమని ప్రభువు మనస్సులో కాగిలెను. శత్రువుల క్షుద్ర ప్రయోగమని యందరు సందేహించిరి.

ఇంతా చేస్తే, శ్రీనివాస విలాస మూల కావ్యము మీద తిరుపతి కవులకంత గౌరవము లేదు. అది వారు దాచ లేదు. అవతారికలో నిట్లు వ్రాసిరి.

'......శబ్దా కలనంబునం దితని కాదర మెక్కువ.'
'కేవల శబ్దముల్ దగ లగించి బిగించిన యట్టి సంస్కృతం
బేవగ విప్ప చెప్పనగు, నేమన గుడ్డలు రైక లోపలం

బ్రోవడినట్టి శుష్కకుచ పొంకము బైటకు బెట్టినన్ రసం
బావహిలంగ నేర్చునె, మహాకవులార, యనుగ్రహింపుడీ!
'అల్లి తిమి తోచుగతి గని
తల్లజు లొనరించు గ్రంథతతి కిది సమమా;
ఢిల్లికి ఢిల్లే, పలికి
పల్లేయని చెప్పునట్టి పలుకులు వినరే!'

# 9

విజయనగరములో ఆనంద గజపతుల దర్శనము అతి కష్టము మీద గాని కవులకు సాధ్యపడలేదు. మొదట మహారాజులు తామే తిరుపతి కవుల నాహ్వానించినట్లు శ్రీ తాతా సుబ్బరాయశాస్త్రిగారు వ్రాసినట్లొక ఉత్తరము చేరినది. దానిని తీసుకొని కవులు విజయనగరములో రాయడుశాస్త్రిగారిని దర్శింపగా వారు తామా యుత్తరము వ్రాయ లేదనుచు, 'ఈ దస్తూరీ శ్రీ కాశీనాథ శాస్త్రులుగారిది. గత సంవత్సరము మీరు విశాఖపట్టణము వచ్చి ఇక్కడికి రాకుండుట తనకు భయపడియే యనుచున్నాడు 'తన కవధానములో ఎవ్వరును సాటిలేరని ఆయన విర్రవీగు చుండును. మీ రాయన గర్వమడచుట కష్టము కాదు. నేను మీ కనుకూలుడనే' అని సెలవిచ్చిరి.

అక్కడ ప్రాడ్వివాకుడగు లక్ష్మీనరసింహంగారు ఆదరించి దివాను కోదండరావుగారికి పరిచయము చేసెను. దివానుగారు తాను సేవకుడు గనుక రాజ దర్శనము చేయించ లేననెను. అప్పుడే 'అటు గద్వాలిటు' ఇత్యాది పద్యము 'రాజు మాకే దర్శన మీయనిచో మరి ఎవరికిచ్చు'నని దర్పముతో పద్యము చెప్పిరి. దివాను తానే సమ్మానము చేతుననగా కవులు దర్శన మీయని రాజ ద్రవ్యము తామొల్లమని నిరాకరించిరి.

పట్టణములో మహారాజా కాలేజీ అధ్యాపకులు కవులచేత సభ చేయించిరి. దానికి కాలేజి ప్రిన్సిపాలు శ్రీమాన్ కిళాంబి రామావతారముగారు వచ్చి ఆనందించిరి. ఆయన ఎం. ఏ. మాత్రమే కాదు, సంస్కృతములో విద్వాంసుడు, కవి. ఆయనకు మహారాజలతో మిత్రులకుండు చన వుండుటచే, చెప్పి కవులకు రాజ దర్శనము చేయించెను. ఆనంద గజపతి

పురాణమున, గానమున, కవనమున నానా శాస్త్రములందు నిపుణుడు, మహా బలశాలి. సుందర రూపుడు. వారి యాస్థానములో ఉన్నంత మంది విద్వత్ప్రకాండులు మరి ఎవరి యాస్థానము నందును ఆకాలములో లేరు. వారి యెదుట శ్రీ తిరుపతి వెంకటేశ్వర కవులు సంస్కృతాంధ్రము లలో చెప్పిన పద్యములుకూడ ఉత్తమ శ్రోత యధికారమునకు తగినట్లే ఉండి వారి సర్వతోముఖ ప్రజ్ఞకు నిదర్శనములుగా రాణించు చున్నవి. అందులో కొన్ని మాత్రము ఉదాహరిస్తున్నాము.

'అల పతంజలి కృతంబైన భాష్యమునకే
   పరిఢవిల్లును మహా భాష్య పదము
అల దేవదేవుడై యలరారు శివునకే
   తేజరిల్లును మహాదేవ పదము
అల త్రివిష్టపవిభుండైన పాకారికే
   యెన్నంగ దగును మహేంద్ర పదము
అల కాళికా దాసుడౌ కవీశ్వరునకే
   గణన కెక్కును మహాకవి పదమ్ము

రమణ బరికింప నల మహారాజ పదము
నీకు తగుగాక యన్యులౌ లోకపతుల
కొకరికైనను జెల్లునే యోగరూఢి
విజయనగర మహారాజ, విపులతేజ!'

'రాజు రాజనగనే రాజాయెనే చంద్రుడల రాజశేఖరు నాశ్రయించె..
....రాజనిన రాజరాజన్న రాజులందు నీక తగుగాక యన్యులౌ....

'తత్కిం చంద్రాత పోఽయం.
నను భవతి దివాప్యస్య కస్మా త్ప్రచారః
సత్వా చ్చంద్రస్య, సత్త్వేఽ
వ్యరుణ కిరణతోఽ జాగళ స్త నోఽయమ్

నోచే దానంద దంతీశ్వర విమలయశ. స్సత్య, మిత్యాది వాక్యైః
శాస్త్రార్థం కుర్వతే త్వద్యశసి నృపమణే తార్కికా స్తర్కరీత్యా.'

'అర్థవత్తని యనధీనమని సమస్త
దేశసంగత మనియు నదేహ మనియు
నర్థవత్సూత్ర మందు నీ యశము కొంత
గూఢముగ జెప్పె బాణిని కువలయేశ!'

'....నను పరమపరో వర్ధతే కీర్తి చంద్రః
సోఽపి శ్రీ చక్రరక్షా జమరితి కవయ శ్చక్రవాక్యై వదంతి.'

'కొందరు పచాద్యజంతం
బందరు మరి కొందురర్శ ఆద్యంతంబే
యందురు, మే ముభయంబని
యందుము నీ నామధేయ మానందనృపా!'

'మాపసమా నీసొగము గాపసమా మాపధాపగా గమనిసమా
మాపస నీపసగని గా దాపరిపరి పరితుష్టిచెందె నానందనృపా!

వ్యాకరణము, తర్కము, కవిత్వము, గానము, సమస్త కళలు, శాస్త్రాలూ అభిమానించే ఆనంద గజపతి మహారాజు ఆనందించేవిగా తిరుపతి కవుల పద్యాలున్నవి.

విజయనగర సభలో కవులను వ్యాకరణ మహా భాష్యముతో పరీక్ష చేయింపగా, వారు నిలువలేక పోయిరని యొకరు వ్రాసినది నిజము తెలిసి వ్రాసినదిగా తోపదు. ఆనందగజపతి కవులకు నూరార్లు బహూక రించి ప్రతిసంవత్సరము రండని యానతిచ్చెను. జాతకచర్యలో 'రాజంటే అతడే, మంత్రి రాట్టంటే అతడే. మునసబంటే అతడే, పురమంటే అదే' అని శ్రీ వెంకటశాస్త్రి యా రాజును, మంత్రిని, మునసబునూ, ఆ పురమును విశేషముగా కొనియాడుటే అందులకు నిదర్శనము!

# 10

పై వాటితో పోలిస్తే. కవులకు వెంకటగిరిలో సమ్మాన మాలస్య మౌట ప్రణయ కలహము వంటి దనిపిస్తుంది. తిరుపతి కవుల నానారాజ సందర్శనములో వెంకటగిరి యాత్ర మొదటిదిగా తోస్తుంది. చెన్నపట్టణ ములో బెసెంటు వగైరాలచేత ఘన గౌరవము పొందియున్న ఉత్సాహ

ముతో కవులు వెంకటగిరి వెళ్ళినారు. అడుగులోనే హంసపాదు పడినది. పెద్ద రాజుగారికి అర్జీపంపగా దర్శనమిచ్చే వీలులేదని రూపికలంపిరి. వారు నలుగురు సోదరులు. తర్వాతి సోదరుడు ముద్దు కృష్ణయాచేంద్రుడు మంచిదాత. ఆయన వద్ద ఉన్న బట్టుకవి సలహాలేనిది ఏమీ చేయరు. ఆ బట్టుకవి యప్పుడు ఊరిలో లేనందున కవులకు అస్తినాస్తి కబురు రాలేదు. కవులు సత్ర భోజనము, మధ్య మధ్య స్వహస్త పాకముతో అవస్థపడి, ఇంతలో నెల్లూరు నుండి యాహ్వానమురాగా వెళ్ళిరి. నెల్లూరు వెళ్ళుచు వారు చెప్పిన పద్యము ద్రాక్షపళ్ళందక పుల్లగా ఉన్నవన్న పంచతంత్ర కథనే తలపించును.

'ఈశుండో హరియో చతుర్ముఖుడొ దివేంద్రుండొ యీ ముద్దు కృ
ష్ణేశుం డీతని దర్శనమ్మునకుగా నింతేల చింతింపగా
గాశీసేతుల మధ్య నిప్డు నృపతి క్షామమ్ము జన్మించెనే
ఆశా, నన్నిటు లేల వేపెదవు నీ కాయాసమున్ బుట్టదే!'
'కరు లర్పించునొ యగ్ర హారములు దా గల్పించునో....'

కవులట్లు నెల్లూరు వెళ్ళి అద్భుతముగా అవధానము చేసి జిల్లా జడ్జిని పౌరులను మెప్పించి శతకము చెప్పి ఘన సమ్మానముతో బాల సరస్వతి బిరుదము పొంది విందులు కుడుచు చుండిరి.

ఇంతలో వెంకటగిరి రమ్మని మిత్రుని యుత్తరము వచ్చెను. అప్పటికి పెద్ద రాజు కాశీకి వెళ్ళుచు బావమరది శ్రీ చెలికాని గోపాల రాయలకు సంస్థాన భార మప్పగించెను. కవులు వెంకటగిరి వెళ్ళి సులభ ముగా శ్రీ గోపాలరాయలను దర్శించి అవధానముచేసి నూరార్లు భూషణ ములు పొందిరి. శ్రీ గోపాలరాయలు తానంత ధనవంతుడను కానందున శ్యాలకుల దర్శనము చేయింతుననెను. తక్కిన వారొప్పుకొనిరి గాని, కవులు తమవద్ద సెలవు తీసుకొన కుండా నెల్లూరు వెళ్ళినందున ముద్దు కృష్ణయాచేంద్రు లొప్పుకొనలేదు వారికి కవులిట్లర్జీ పెట్టుకొనిరి.

'పరదేశ సంపాదన రతి మీకు నరేంద్ర
పరదేశ సంపాదన రతి మాకు........
మీకు రాజపదము మాకును గతి

రాజపదము కలది కెందు గొదువలేదు
కాన సామ్యమిచ్చి మానించు టొప్పదే
ముద్దుకృష్ణ యాచభూవరేణ.'

'దేవర యాజ్ఞ గైకొనక తెంపున నెల్లూరి పట్టణమ్ము మున్
బోవుట మంచిగా, దయిన బోవుటకేమి నిమిత్తమన్న, నో
భూవర, శుద్ధవైదికుల బుద్ధి మహత్వ పటుత్వ సంపదల్
దేవర వారి చిత్తఫణితిన్ జొరబారి ముదము సేయగన్.'

శ్రీ ముద్దుకృష్ణ యాచేంద్రులు కృత్తిపడి కవులను ఘనముగా సమ్మానించిరి. తక్కిన సోదరులును సమ్మానించిరి. వారిలో మూడవ సోదరుడగు శ్రీ వెంకటకృష్ణ యాచేంద్రుల మీద కవుల పద్యములలో ఒకటి జగత్ప్రసిద్ధమైనది.

'ప్రాసాద నిర్మాణశక్తి మీకు నృపాల
ప్రాసాది నిర్మాణరక్తి మాకు
సాధు వృత్తి విధాన సక్తి మీకు నృపాల
సాధు వృత్త విధానసక్తి మాకు
నవరసా సంపాద రతి మీకు నృపాల
నవరస సంపాదన రతి మాకు
సతత సద్గుణ గణాసక్తి మీకు నృపాల
సతత సద్గుణ గణాసక్తి మాకు
మీకు యాచ బిరుదు మాకును యాచక
బిరుదు గలదు వర్ణభేద సూత్ర
ముండె, దీని నెన్న కొనగు మీ వేంకట
కృష్ణ యాదభూవ యిపుడు సమత'.

ఇంతలో కాశీనుండి పెద్ద రాజును వచ్చి కవులను ఘనముగా సమ్మానించెను. వెంకటగిరి యుదంతములో కవుల పాలిటి కల్ప వృక్షమై వేళకు వచ్చి సాయపడినది ప్రభువుల బావమరది శ్రీ గోపాలరాయులు. వారు కవుల యందెంతో అభిమానము చూపిరి. శ్రీ వెంకటశాస్త్రి కప్పుడు 24 సం.లు.

# 11

ఈ విధముగా పెద్ద తగాదాలు కాని చిన్నవి గాని జరిగిన పిమ్మట కవులు సమ్మానము సాధించుటలో వారి ప్రజ్ఞ ప్రస్ఫుట మవును. కాని ఎందరో ప్రభువులు తిరుపతి కవులను తమంత తాము పిలిచి బహువిధ సమ్మానము లొనర్చిరి, వారిలో కొందరినైనను ఈ సందర్భములో స్మరింప కుండుట ధర్మము కాదు.

వారందరిలో, సంపద తక్కువైనను, ముందు స్మరింప దగినవారు చిత్రాడవాసి కావ్యనిధి శ్రీ చెలికాని లచ్చారావుగారు. వారు గొప్ప భాషా పోషకులు. వారు శ్రీ తిరుపతిశాస్త్రిగారిని పోలవరము జమీందారుగారు పరమపదించిన తర్వాత తుదివరకు పోషించిరి. ఇక వెంకటశాస్త్రిగారిపై వారు చూపుచు వచ్చిన సమాదరము అసమానమైనది. వారిని స్వయముగా సమ్మానించుటయే కాక తమ సోదరి లక్ష్మీనరసాపురము జమీందారిణి యగు శ్రీ రావు రామాయమ్మ గారిచేత బహుపర్యాయములు సమ్మానింప జేసిరి. శ్రీ లచ్చారావుగారి అకాల నిర్యాణమునకు శ్రీ వెంకటశాస్త్రి విల పించుచు చెప్పిన పద్యములును, ఆ సందర్భములో వారిసోదరి రామాంబ గారికి చేసిన ఉపదేశ పద్యములును శాస్త్రిగారికి వారి యెడగల ఆత్మీ యతను వ్యక్తీకరించును.

ఆ తర్వాత పేర్కొనదగిన వారు శ్రీ పోలవరము జమీందారు కృష్ణభూపతి. అయిన కవులచేత బుద్ధ చరిత్రము వ్రాయించి కృతిభర్త య్యెను. తన యవసానకాలముదాక శ్రీ తిరుపతిని ఆస్థాన కవిగా 18 సం. లు పోషించెను. ఆయన నిర్యాణమును గూర్చి శ్రీ తిరుపతి వ్రాసిన పద్యములు ఎంతో హృదయ విదారకముగా నున్నవి.

'మా కాప్తుడు మా కొడయడు
మా కాలంబంబు రాజమౌక్తిక మపుడే
నాకాలయమున కరిగెన్
మా కృష్ణరాయభూమి నాథుం డకటా!

'పీటపై గూర్చుండి పిలువ నంపక యుండ
నేదినమ్ము ను భుజియింప లేదు
మొదటి నుండియు దుట్ట తుదదాక నొకరీతి
గురుభావమున కోటు జరుపలేరు....'

వారి నిర్యాణము తర్వాత శ్రీ తిరుపతి రెండేళ్ళ కంటె జీవింప లేదు.

కిర్లంపూడి ప్రభువు ఇనుగంటి చిన్నరాయడు కవుల నాదరించి వారికి ప్రీతి పాత్రుడయ్యెను.

'ఇనుగంటి న్నినుగంటి భేదమొక యింతేనిన్ గనన్రాదు. పో
మునుగంటిన్ నినుగంటి భేదమొక యింతేనివ్గనన్రాడు, మే
ఘునిగంటి న్నినుగంటి భేదమరయన్ గోరంతయున్ లేదు, మీ
యినుగంట్యన్వయమెంత చేవగలదోయీ చిన్న రాయాధిపా.'

ఆయన ప్రతిసంవత్సరము శ్రీ దేవీ నవరాత్రి పూజలు చేసెడివారు. విలంబి సంవత్సరపూజ చూచి 1898 లో శ్రీ తిరుపతి కవులు దండకముగూడ చెప్పిరి.

ఈ ఇనుగంట్యన్వయములో ప్రకాశరాయప్రభువు అన్నవరము సత్యనారాయణస్వామి ధర్మకర్తలు. వారు శ్రీ వెంకటశాస్త్రిని స్వామివారి అస్థాన కవిగానేచేసి ప్రతిసంవత్సరము ఉత్సవములకు పిలిచి సమ్మానించు చుండిరి. శ్రీ ప్రకాశరాయలను శ్రీ వెంకటశాస్త్రి ఎన్నెన్నో పద్యములలో ప్రశంసించెను.

శ్రీ నూజివీటి శ్రీరామచంద్ర అప్పారాయ ప్రభువు తిరుపతి కవులను మొదట 1903 లో పిలిపించి సంపూర్ణ శతావధానము చేయించి సమ్మానించి నూర్రార్లు వార్షికము ప్రకటించెను. తర్వాత మరియు నెన్నో మార్లు పిలిపించి సమ్మానించెను. ఒకమారు వారి గురువులు వానమామలై స్వాములు నూజవీడురాగా, వారు కవులను రాకతప్పదని పిలిపించిరి. కవులు వెళ్ళగా వానమామలై స్వామి కవులచేత అవధానము చేయించి నూర్రార్లు శాలువలతో జయపత్రిక ప్రసాదించిరి. శ్రీరామచంద్ర

అప్పారావు గారు పరమపదించిన పిమ్మట వారి రెండవ కుమారుడు సింహాద్రి అప్పారావుగారు వార్షికము పంపుచునే యుండెనుగాని ఆ దాత కంతధనములేదని భావించి శ్రీ వేంకటశాస్త్రి రెండు సంవత్సరముల వార్షిక మొక్కసారిగా గ్రహించి ఆపైనిక నివ్వవలదని మనవిచేసి ఒప్పించెను. ఇందులో శ్రీ శాస్త్రి ప్రతిగ్రహములో ఎంతో ఉదారత ప్రదర్శించెను.

ఇట్టిదే మరియొకటియు గలదు. జమీందారు అనదగినంత ఒక సంపన్న బ్రాహ్మణ గృహస్థు కవులకు వేయినూర్లుటపదారు లిత్తునని పాణిగృహీత వ్రాయించి అంకిత మిమ్మనెను. ఎన్నిమారు లడిగినను, స్థితి చిదికిపోవుటచేత, ఇయ్యలేక కవులపేర ప్రోనోటు వ్రాసిపంపెను. వెంటనే కవులానోటు రద్దు వ్రాసి పంపివేసిరి. గ్రంథము ఆ గృహస్థు కంకితముగానే ప్రకటించిరి. వీనినిబట్టి తిరుపతి కవులు దాతల శక్తిని మించి వార్షికాదులు గ్రహింప నిరాకరించు చుండిరని తెల్లమగును.

శ్రీ తిరుపతిశాస్త్రి నిర్యాణానంతరము శ్రీ వెంకటశాస్త్రి చల్లపల్లి రాజాగారగు శ్రీ అంకినీడు ప్రసాదరాయలయు, శ్రీ శివరామ ప్రసాద ప్రభువులయు పట్టాభిషేకములకు వెళ్ళి ఘనముగా సమ్మానము లందెను.

అట్లే బొబ్బిలి రాజాగారి పట్టాభిషేకమునకు శ్రీ వెంకటశాస్త్రి వెళ్ళి, తర్వాత పట్టాభిషేక కావ్యము రచించెను. ఆ కావ్యము వినిపించుటకు శ్రీ శాస్త్రి శిష్యసహితము బొబ్బిలి వెళ్ళెను. ప్రభువు శ్రీ శాస్త్రిని వేయినూర్లుటపదార్లు, శాలువల జోడు, కంకణములు ఇచ్చి సమ్మానించి, నూరార్లు వార్షికము ప్రకటించుటకాక వెంటవచ్చిన శిష్యులకును నూటపదార్లిచ్చి గౌరవము చేసెను.

ఈ విధముగా శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల నిద్దరినిగాని తిరుపతి నిర్యాణానంతరము వేంకటేశ్వరునిగాని సమ్మానించిన ప్రభువులును ప్రభుసమ్మితులును అసంఖ్యాకులు. కొందరిని మాత్రము పేర్కొందుము. విరవ, కోటరామచంద్రపురము, వీరవరము, ఉర్లాము, మందాపా, తోట్లవల్లూరు, సొతువల్లూరు, తేలప్రోలు, ఖాశింకోట, మైలవరము,

ధవళేశ్వరము, గంపలగూడెము, శనివారప్పేట, తంగెళ్ళమూడి, కాట్రావులపల్లి, మురుమండ, ముక్త్యాల, నూజివీడు, గూటాల, దొడ్డంపేట, కోలంక, జయపురం, రామచంద్రపురం ఇత్యాది సంస్థానముల అధిపతులు, యానాము శ్రీ మన్యం మహాలక్ష్మమ్మ జమీందారిణిగారు, శ్రీ విక్రమదేవ వర్మగారు, మోతేగంగరాజుగారు, మోతే నారాయణరావుగారు, చెన్నపట్టణములో శ్రీ అల్లాడి కృష్ణస్వామయ్యగారు శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు.

# 12

శ్రీ వెంకటశాస్త్రికి బందరులో ఉపాధ్యాయ పదవి విరమించు సందర్భములోను, తర్వాత అక్కడనే షష్టిపూర్త్యుత్సవములోను బందరు పౌరులు చేసిన సమ్మానములు అద్వితీయమైనవి. తర్వాత వారిని చెన్నరాజధాని ప్రభుత్వము ప్రథమాంధ్రఆస్థానకవిగా వరించిబెజవాడలో చేసిన ఉత్సవము వారి జయ పతాకలలో ఉన్నతోన్నతమైనది. అవి మూడునూ ఒక్క వెంకటశాస్త్రికే జరిగినను తిరుపతి వెంకటకవులిద్దరి విజయములుగానే గ్రహించుటయుక్తము. అవి వారి విజయయాత్రలకు పరమావధులు గావున సంక్షేపముగా వర్ణించు చున్నాము.

1916 లో శ్రీ వెంకటశాస్త్రి ఉపాధ్యాయ పదవి వదలి వెళ్ళు చున్నారని తెలియగానే, బందరు పౌరులు గగ్గోలుపడిరి. శ్రీ పల్లూరి సూర్యనారాయణరావుగారి అధ్యక్ష్యమున సభ చేసిరి. అధ్యక్షులు, 'వీరిక్కడికివచ్చి 12 సం.లు దాటినది విద్యార్థులంతా కవులైరి. మనము ఘనముగా సమ్మానింపవలె' ననిరి. 1916 సం. ఆగష్టు 5, 6 తేదీలలో సమ్మానసభలు వైభవము జరిగినవి.

5 వ తేదిన సాయంకాలం సభ పురమందిరములో జరిగినది. చల్లపల్లి కుమార రాజాగారు, న్యాయవాదులు, ఉపాధ్యాయులు, వర్తకులు, విద్యార్థులు, పండితులు వచ్చిరి. అధ్యక్షత వహించిన కవిసార్వభౌమ శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రిగారు 'శ్రీ వెంకటశాస్త్రి కుశాగ్రబుద్ధి కవితలో పదముల పొందిక, రసౌచితి శ్లాఘ్యములు. ఆంధ్రభాష యున్నంత

కాలము వీరి కృతులుండు' నవి శ్లాఘించి పురజనుల పక్షమున వారే కవికి వస్త్రములు కాశ్మీరశాలువఇచ్చి చేతికి కింకిణి కంకణము తొడిగిరి. శ్రీ వెంకటశాస్త్రి అధ్యక్షులకు పాదాభివాదనముచేసి పౌరులకు కృతజ్ఞత తెలిపిరి. ఆరాత్రి శ్రీ పురాణం సూరి శాస్త్రిగారు విందుచేసిరి.

ఆ మరునాడుదయమున ఊరేగింపు జరిగినది. శ్వేత పతాకముపై పురాతనాధునిక కవీశ్వరుల పేరులు వ్రాసి ముందుసాగినది. మకర తోరణముపై 'జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః' అని స్వర్ణాక్షరములతో వ్రాయబడినది. అ వెనుక సరస్వతీవిగ్రహము కదలీ స్తంభములతో నలుకరింవబడిన పీఠముపై సాగినది. వేదవిదుల స్వస్తి వాచనములతో భజనలతో శాంతమల్లేశ్వరస్వామి ఆలయమునకు వెళ్ళిరి. అక్కడ కవిగారు సరస్వతీ పూజచేసి ఉపన్యసించిరి. ఆ మధ్యాహ్నము శ్రీ మానపూడి లక్ష్మీనారాయణగారు విందు చేసిరి.

అవరాహ్ణమున నాటకశాలలో శ్రీహరి నాగభూషణముగారు పాట కచ్చేరి చేసిరి.

సాయంకాలము హిందూహైస్కూలు ఆవరణములో మహాసభ జరిగినది. శ్రీ మానపల్లి రామకృష్ణ కవిగారు అధ్యక్షులు. ఉపన్యాస ములు జరిగినవి. శిష్యులు దుఃఖభారముతో పద్యపఠనము చేయగా, శ్రీ వెంకట శాస్త్రిగారును కంట తడిపెట్టిరి. జయజయధ్వానములతో సభ ముగిసింది.

ఆరాత్రి హిందూథియేటరువారు పాండవోద్యోగము ప్రదర్శించుచు ప్రథమాంకమైన తర్వాత నాట్య ప్రముఖులగు శ్రీ బసవయ్యనాయుడు పింగళి లక్ష్మీకాంతముగార్లు వెంకటశాస్త్రిగారి కిచ్చుటకు గండపెండేరమును అనేక శాస్త్రములలో విద్వద్వరేణ్యులగు శ్రీ శిష్టా నరసింహశాస్త్రిగారి కీయగా, వారు సంస్కృతాంధ్రములలో నిరర్గళధారతో కవిని ప్రశం సించి కవిగారి కిచ్చిరి. తమ గురువులు శ్రీ పాదవారు సెలవొసగి ఆశీర్వ దించిననేగాని శ్రీ శాస్త్రిగారు తాము దానిని గ్రహించమనిరి. అప్పుడు శ్రీ పాదవారు లేచి 'వారర్హులే'యని ఉద్ఘోషించిరి అంతట నాటక సభ్యులు శ్రీ వెంకటశాస్త్రిగారి పాదమున గండ పెండేర మలంకరించిరి. ఆ రెండు

రోజులు పౌరులు కవికి బహూకరించిన అమూల్య వస్త్రములకు, శాలువ వలకు, సువర్ణాంగుళీయకములకు లెక్కలేదు. 12-8-16 కృష్ణా పత్రికలో 'కవిపూజ' నుండి కొన్ని వాక్యములు:

'వీరి శిష్యసమూహము భారత సైన్యమంత యున్నది. వీరి గ్రంథము లెల్లెడల వ్యాపించి యున్నవి. వీరు తిరుపతి వెంకటకవులకు సంఘటిల్లిన సంఘర్షణములు మరి యొకరికి సంభవించినచో, మరి యొక రీతిని విని యుందుము. నలువైపుల నుండి నిశాతఖడ్గములు వీరిపై తాండవించినవి. అన్ని కత్తులను వీరు తిరిగి ఎదిరించిరి. లోకము వీరిని ధన్యులుధన్యులు అని పొగుడుచున్నది. వీరి వీరాధివీరత్వము అంగీ కరింపబడినది. వీరు ఎవ్వరు బడయని గౌరములు పడపిరి. అనేక కవీం ద్రులు రాజులచే పూజింప బడినారుగాని బహుళప్రజానురాగము బడసిన వారువీరు! ఈపూజ ఆంధ్ర కవితకు గౌరవకారణము!'

# 13

1932 సం. లో శ్రీ వెంకటశాస్త్రిగారు బందరు వెళ్ళినప్పుడు అక్కడి శిష్యప్రశిష్యులు వారికి షష్టిపూర్త్యుత్సవము చేయుదుమని ప్రస్తావించిరి. శ్రీ శాస్త్రిగారు కొన్ని యభ్యంతరాలు చెప్పగా శిష్యులు 'అది వైదిక విషయము. మేము లౌకికముగా జరిపింతు'మని ఒప్పించిరి. శ్రీ శాస్త్రి గారు తెలిపిన యభ్యంతరములు శాంతి కమలాకరాదులు శ్రద్ధగా పఠించి చెప్పినవి కావు. గర్భములో పడిన దాదిగా 60 ఏండ్లు నిండగా మానవుని అతని ఆ పుత్తులను ఉగ్రరథుడు ఆవేశించునట. అందుచే శాంతి చేయవలె నట. శ్రీ శాస్త్రిగారి జాతకచర్య చదువగా వారిపై ఉగ్రరథుడు కొంత ప్రభావము చూపినట్లే తోచును. ఆ ప్రాంతములలో శ్రీ శాస్త్రిగారికి ముమ్మారు జబ్బు చేసినది. ఒక సారి మొండి వ్యాధిరాగా సూర్యస్తోత్రము చెప్పిరి. భార్యచేత వీలునామా వ్రాయించిరి. కుమాళ్ళకు జబ్బులు వచ్చి నవి. రెండవ పిల్ల వివాహము నిశ్చయింపగా, ముహూర్తమునకు ఆరు రోజుల ముందు వరునికి మోటారు ప్రమాదము కలిగి ఆసుపత్రిలో చేర్చ బడెను. శ్రీపాద గురువుతో తగాదా వచ్చినది. ఏమైననేమి? ప్రత్యేక శాంతి చేయకుండగనే వారి నిత్య తపస్సు, సూర్యస్తోత్రాదుల వల్లనే

ఉగ్రగరథుని దంష్ట్రలలో నుండి బయటపడ గలిగినారు. వారి శిష్యులు శాంతిగాకాక లౌకికముగా షష్టి పూర్త్యుత్సవముగానే, అన్నట్లే మహా వైభవముగా 1933 సం. సెప్టెంబరు 30, అక్టోబరు 1 తేదీలలో బందరులో జరిపిరి. శ్రీ శాస్త్రిగారు కళత్రము, పుత్రికా పుత్రులు. అల్లుళ్ళు కోడండ్రు, జననీ జనకులు, స్వబంధువులతో వివాహమునకు వలె తరలి బందరు వెళ్ళిరి.

30-9-33 శనివార ముదయమున దుర్ముహూర్తము వెళ్ళగానే శాస్త్రిగారిని కళత్ర సహితముగా నూతనాంబరా భరణాదులతో నలంక రించి మోటారుపై నూరేగించిరి. రామా హైస్కూలులో జరిగిన సభకు పండితులు కవులు శిష్యులు ప్రశిష్యులు మిత్రులు అభిమానులు విచ్చేసిరి. అనేక శత సంఖ్యాకులగు వేదవిప్రులు మహదాశీర్వచనము కావించిరి.

ఆహ్వాన సంఘము పక్షమున రావుబహదూరు శ్రీ శెడింబి హనుమంతరావు పంతులుగారు సమ్మాన పత్రము చదివి శాలువలు సమర్పించిరి. శాస్త్రిగారి అల్లుడు 11 సం,ల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి ఆశీర్వచనపనస ఘన జటలతో చెప్పెను.

సాయంకాల సభకు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారు అధ్యక్షత వహించి, 'శ్రీ కృష్ణదేవరాయల కాలము తర్వాత మూరు మూలల దాగియున్న తెలుగు కవితను ప్రచారమునకు గొనివచ్చి శ్రీ శాస్త్రులుగారు నవీనాంధ్ర సారస్వతమునకు సృష్టికర్తయై'రని ప్రశం సించిరి. సందేశములు కానుకలు ప్రవాహముగా వచ్చినవి.

మరునాడు ఆదివారము ఉదయసభకు శ్రీ ప్రభల లక్ష్మీ నరసింహముపంతులుగారు అధ్యక్షులు. కానుకలు కురిసినవి.

సాయంకాల సభలో శ్రీ శాస్త్రిగారి ఉపన్యాస ముండుటచే జనము తండోపతండములుగా వచ్చిరి. అభివందపద్యములు భక్తితో నెందరో చదివిరి. ఎందరో ఉపన్యసించిరి. ఆరుగంటలకు శ్రీహరి నాగభూషణంగారి పాటకచ్చేరి జరిగినది. శ్రీ అశ్వధాటి రామమూర్తి మృదంగవాదన మొనర్చిరి. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి సందేశము. 'ఇది చెళ్ళపిళ్ళ

వెంకటశాస్త్రి గారికి చేసిన బహుకృతికాక ఆంధ్ర లోకమున కంతటికి చేసినదిగా విద్వల్లోక మంగీకరించెడునని మా యభిప్రాయము.'

కృతిసమర్పణములు చేసినవారు ప్రశంసాపద్యములు చరివిసవారు అసంఖ్యాకులు. అవకాశము చిక్కనివారు తమ కావ్యకుసుమములను ఆహ్వాన సంఘమువారి కర్పించిరి. పై వానిలో కొన్నిమాత్ర ముదాహరిస్తునాము.

శ్రీ వెంకటశాస్త్రి గారి శిష్యాగ్రేసరులు శ్రీయుతులు పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వెంకటేశ్వరరావులు తమ సౌందరనంద కావ్యమును వారికి కృతిసమర్పణము చేయుచు అందులో నిట్లనిరి.

> 'జగదాశ్చర్యకరావధాన కవితా సంపత్తికిన్ మ్రొక్కి, మీ
> యుగళస్నేహము ప్రస్తుతించి, భవదీయోదారభావప్రసా
> దగుణోత్ఫుల్ల కృతిప్రసూన విగళన్మారందధారాసురాపగ నోలాడి
> రచించి తెచ్చితిమి దేవా, నీకు నీ దక్షిణన్.'

శ్రీ సర్వా శేషయ్య గురులకు సుదర్శనోపాఖ్యానమను ఐదాశ్వాసముల కావ్యము కృతి యిచ్చిరి.

శ్రీ వడ్డాది సుబ్బారాయకవిగారు, 'రచియించెన్ బహునాటక ప్రముఖ సద్ గ్రంథంబు లాంధ్రంబునం దుచితప్రక్రియ బెక్కురాజ సభలన్ బొందెన్ సుసత్కారముల్' అని ప్రశంసించిరి.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి 'మోహనంబుగ జగన్మోహనంబుగ బద్యపఠనంబు నిచ్చట బాదుకొల్పె' అనుచు, 'తిరుపతి వెంకటకవులు ప్రౌఢపండిత ప్రభుసభలలోనే కాదు, బాలపామర చోరాదుల గోష్ఠులలో గూడ కవిత చమత్కారములను గల్పించి సత్కారములను బడయగలరు. వెంకటశాస్త్రి గారికి లల్లాయి పదములు పాడ వేడుక. కొల్లాయ గుడ్డలు వాడ వేడుక, వారికి భాషాడంబరము గిట్టదు. సమయస్ఫూర్తి, హాస్యోయుక్తి ప్రయుక్తిచమత్కారము అజానజమగునలవాటు' అని అగ్గించిరి.

శ్రీ తిరుపతిశాస్త్రి కుమారుడు శ్రీ వెంకటావధాని,

'శకుని మత్తవిదారణ కుంభదళన
విక్రమ పటిష్ఠమై సుంత విశ్రమించు
వృద్ధకవిసింహ మియ్యది వేళయయ్యె' అనిరి.

శ్రీ వేలూరి శివరామశాస్త్రి,

'జయజయ షష్టి పూర్తి పరిషత్పరమేశ్వర వేంకటేశ్వరా,
జయజయ పూర్వ నవ్య కవి సంఘ కృతాదర వేంకటేశ్వరా....
'మోయగ రాని వేదనకు మూడు శతాబ్దులనుండి మూగయై
పోయిన యాంధ్ర భారతిని బుట్టినతోన వసంత మాసపున్
గోయిలజేసి యెల్లెడల గ్రుమ్మరజేసిన మేటి'...అనెను.

శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి ఇట్లనిరి.

'వీరి శుశ్రూష చేసిన కారణమున
గౌరవమును గద్వాలాత్మకూరు ముఖ్య
రాజ సభలందు లాతి పురంబులందు
బడసితి నవధాన కవితా విభవము వలన'

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ,

'బంపులమారి ధూర్త కవులన్
గికురింతలు సేయు నేర్పు
సెల్లింపులు మీకె దక్కనవిలే...అనిరి.

శ్రీ జాషువా,

'గంటలు కొట్టి మీ మధురకావ్యము లాంధ్రుల మేలు కొల్పి యిం
టింటను నాటుకొన్నవి కవీశ్వర, కోతకు వచ్చియున్న దీ
పంటను గోసికొమ్ము'...అనిరి.

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి యిట్లనిరి.

'గురువుల గొల్చి పాండితిని గొందురు, గందురు దానికేమి, మా
తిరుపతి వేంకటేశ కవిధీరుల పాద సరోజ యుగ్మ సం
స్మరణము చేతనే మధుర మంజుల కావ్యము లల్లనేర్చి యెం,
దరో కవులైరి యెందుగలదా మరి యిట్టి మహత్త్వ మొజ్జలన్।

మరియు శ్రీయుతులు జంధ్యాల పాపయ్య శాస్త్రి, వేమూరి సీతారామశాస్త్రి, సామవేదం జానకి రామశర్మ, మల్లంపల్లి భైరవ మూర్తి, వద్దాది సీతారామాంజనేయులు, కొండపల్లి గోపాలరావు, హరి రామలింగ శాస్త్రి, పండితారాధ్యుల నాగభూషణం, నందివాడ వెంకటరత్నం, మంచాపజ్ఝల సీతారామయ్య, ధారా అప్పయ్యశాస్త్రి, స్నేహలతా కవితాబృందము కొల్లాపురము, పువ్వాడ శేషగిరిరావు, చోడవరపు జానకిరామయ్య, పిశుపాటి వెంకటరమణయ్య, అభినవ సరస్వతి సంపాదకులు జానపాటి పట్టాభిరామశాస్త్రి, ప్రభృతులెందరో ఎన్నో పద్యములతో కానుక లర్పించిరి. అన్నింటికంటె శ్రీ వెంకటశాస్త్రి హృదయమునకు అత్తుకొన్నది శ్రీ నందివాడవెంకట రత్నము సమర్పించిన పద్యాల కొన్క. కవి వడ్డెకులస్థుడు, వికారరూపుడు అంధప్రాయుడునట. ఆయన ఇట్లనెను.

'అన్న మింటనె పెట్టి నన్గన్నతండ్రి
కరణి కాపాడినట్టి నా గురు డితండు
మద్గురూత్తము గొల్చిన మడ్డిమృగము
వంటివాడైన జ్ఞానినై వన్నెకెక్కు.'

శ్రీ వెంకటశాస్త్రి ప్రత్యభినందనలో నుండి ఒక్క పద్యము.

'బందరు పట్టణంబు నను బంపె బహూకృతిచేసి మున్నె యా
ముందొకసారి ఎక్కుడుగ బూజితులన్ బొనరించె నిద్ధరన్
విందొనరించె నా కిపుడు వేవురు గల్గు సభాస్థలిన్ మహా
నందము గల్గె నీ పురి కనంత సుఖమ్ములరారు గావుతన్!'

కృష్ణా పత్రిక సంపాదకీయములోనుండి కొన్ని వాక్యములు.

'తిరుపతి వెంకటేశ్వరులు పొందని గౌరవము లేదు. వీరి కవిత్వము ప్రాచీన కవిత్వమునకు భరత వాక్యము, నవీన కవిత్వమునకు నాంది. ఈ కవుల కవిత్వము ఆధునిక కవిత్వమునకును ప్రాచీన కవిత్వమునకును సేతువు వంటిది. ప్రాచీన కవిత్వమందలి దీప్తి, నవీన కవిత్వమునందలి ప్రసాదము సౌలభ్యము పొడసూపును. వీరి రచనలు చిరకాలము వర్ధిల్లుననుటకు సంధియములేదు!'

శ్రీముఖ ఆశ్వయుజ సంచికలో 'భారతి' ఇట్లభినందించినది. ఇందులో పంతులుగారి శైలి ప్రత్యక్షమగుచున్నది.

'ధన్యమైనది, ఆంధ్రదేశము ధన్యమైనది. జీర్ణప్రాయముగా నిండిన ఆంధ్రకవితా సామ్రాజ్యము నుద్ధరించి దేశమునందు నలుగెలకుల విజయపతాకలను ప్రతిష్ఠించి ఆంధ్రకవితకు శకపురుషులన మించిన నిక్కపు కవిసార్వభౌమునకు సంకల్పించిన షష్టిపూర్తి మహోత్సవాభ్యర్హాణము సర్వలక్షణసంపన్నముగా మహావైభవముతో నిర్వహించి సకలాంధ్ర ప్రపంచము కృతకృత్యమైనది. విశ్వభారతి సంతసించినది. శాశ్వతస్మృతిచిహ్నమును, రచన లన్నిటిని సంపుటములుగ అచ్చొత్తించుటకు, ఆంధ్ర విశ్వకళా పరిషత్తులో బహుమతి పథకము నెలకొల్పుటకు శిష్య ప్రశిష్యులు సంకల్పించినారు. ఆంధ్రభారతికి ఈడులేని సేవ చేసి శాస్త్రిగారు ధన్యులైనారు. అట్టి మహానుభావునకు ఉడుతభక్తిగ పూజగావించి తెలుగు మాగాణము ధన్యమైనది.'

# 14

ఇంత గొప్పగా షష్ట్యబ్ద పూర్త్యుత్సవము జరిగిన శ్రీ వెంకటశాస్త్రిగారికి ఇంత కంటె గొప్పగా సమ్మానము జరుగుట ఊహకందని విషయము. కాని యదియు సంభవించినది.

అప్పటి మదరాసు ప్రభుత్వము 1950లో శ్రీ వెంకటశాస్త్రిని ప్రథమాంధ్రాస్థాన కవిగా ఎన్నుకొని బెజవాడలో ఆస్థానకవి పట్ట ప్రదానముతో నలంకరించినది. శ్రీ శాస్త్రిగారప్పుడు అస్వస్థులుగా నుండుటచే వారికి పట్టప్రదాన మొనర్చుటకు వారి యప్పటి నివాసమైన బెజవాడకే మదరాసు ప్రభుత్వమే ముఖ్య మంత్రి రాజుగారు, మంత్రీశ్వరులు శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ఇత్యాదులైన ముఖ్యాధికారవర్గముతో, తరలి వచ్చినది. అక్కడికి అప్పుడాంధ్ర దేశము అష్ట దిక్కుల నుండి విచ్చేసిన కవి పండితులకు లెక్కలేదు. ఆంధ్ర దేశములోగాని, మరి యొక్క ప్రాంతములోగాని, దేశములోగాని, ఏపరిషత్సభ కావి, కవిసమ్మానము గాని, అంత గొప్పగా జరిగి యుండుట ఊహించుటకు గూడ మాకోంట్లకు

సాధ్యము కానంత మహావైభవముగా జరిగినది. అధ్యక్షులైన శ్రీ రామ లింగారెడ్డిగారు 'ఇప్పుడు నేను కళ్ళు మూసికొని రాయి విసరినచో ఒక పండితునకో కవికో తలకు తగులు'నని చమత్కరించిన మాటలలో నతిశయోక్తి లేదని ఆసభ చూచిన మాబోంట్లకు అనుభవ సిద్ధము. మదరాసు ప్రభుత్వము సంస్కృతా స్థానకవిగా వరించిన మహా మహోపాధ్యాయ ద్రావిడ శాస్త్రిగారు కూడ ఆ సభకు స్వయముగా దయచేసి, సంస్కృత శ్లోకములతో శాస్త్రిగారిని అభినందించుట విశేషములలో నెల్ల విశేషము.

ముఖ్య మంత్రి రాజుగారు, 'నేను అంధ్రలిపిరాక అరవలిపిలో ఈ ఉపన్యాసము వ్రాసుకొని చదువు చున్న తెలుగు వాడ'నని చెప్పుచు, శాస్త్రిగారి వైదుష్యమును కవిత్వ మహత్వమును ప్రశంసించిరి. ఎన్ని సాహిత్య సంస్థలు ఎందరు కవులు సమ్మాన పత్రములు ప్రశంసా పద్యములు సమర్పించిరో లెక్కించ సాధ్యము కాదు. అటువంటి కవి విద్వన్మహా సభ 'నభూతో న భవిష్యతి!'

ఈ విజయసభ జరిగిన కొద్ది నెలలకే మహా శివరాత్రి పర్వదినమున శ్రీ వెంకటశాస్త్రిగారు పరమపదించుటయే వారి అంతిమ విజయ యాత్రగా భావింప దగును. 'శవనార్థం బుదయించితిని. ఈ భవమద్దాన ధరింతు'నను శ్రీ శాస్త్రిగారి యాశయము సిద్ధించినది. అది 5-2-50 బుధవారము.

విరోధి సం. ఫాల్గుణ మాస భారతిలో (సంపు. 27 నుంచి. 3) శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి 'కనుమరుగైన కళాప్రపూర్ణ కవి' అను వ్యాసములో 'నా మురుపు ముచ్చట లన్నియు మొన్నటి శివరాత్రితో ముగిసిపోయినవి, ఆ దయామయుని నిర్యాణము నా హృదయమునకు పెద్ద యాఘాతమైనది' అని విలపించుచు శ్రీ శాస్త్రులవారి ప్రతిభా సంపత్తి, కవితా ప్రాశస్త్యము, ధారా ధారాళత, ధారణాపటిమ, వాక్చమత్కారము మొదలగు గుణ విశేషములను దెలుపు ఘట్టములొక కొన్ని ప్రస్తావించి నారు!

# 15

తిరుపతి వేంకటేశ్వరుల విజయ యాత్రలో గద్వాల ఆత్మకూరు వివాదములే ఘనమైనవి, అవి ఏనాడో జరిగి నందున జనుల స్మృతిలో నుండి కొంత మరుగు పడినవి. కాని శ్రీ రామకృష్ణ కవులలో, శ్రీ కొప్పరపు కవులతో, శ్రీ బెల్లముకొండ రామరాయ కవితో, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారితో నడచిన వివాదములు పూర్తిగా విస్మృతములు కాలేదు. అందు వలన శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు- అందును ముఖ్యముగా శ్రీ వెంకటేశ్వరులు- గిల్లి కయ్యము తెచ్చుకొనువారను అపప్రథ లోకములో కొంత వ్యాప్తిలో నున్నందున, వాని స్వరూపము సంక్షేపముగా కొంత ప్రస్తావింతుము.

శ్రీ రామకృష్ణ కవులు మేనత్త మేనమామ బిడ్డలు. ఆరామ ద్రావిడులు. శ్రీ రామకవి పూర్తి పేరు శ్రీ ఓలేటి వెంకటరామశాస్త్రి. ఆయన కొంత కాలము శ్రీ చెళ్ళపిళ్ల వెంకటశాస్త్రి ఇంట నుండి శుశ్రూష చేసెను. తర్వాత రామకృష్ణ కవులు ఇతరగురువుల యొద్ద శాస్త్రాధ్యయనము చేసిరి. చిన్నతనములోనే పిఠాపురా స్థానమున అవధానము చేసి ఆస్థాన కవులైరి. తన గురుత్వమును గూడ ఒప్పుకొన వలెనని శ్రీ చెళ్లపిళ్ళ ఏదో కొంత కాలము చదివినందుకే ఒప్పుకొనవలెనాయని రామకవి పట్టుదల. పట్టుదలలు పెరిగినవి. రామకృష్ణ భారతము మొదలగునవి. రామకృష్ణకవులు వ్రాయగా తిరుపతి కవులు 'గీరతము' ఇత్యాదులు వ్రాసిరి. కాకరపర్రు అరామద్రావిడులకు జీవగర్ర. ఆక్కడివారు, ఒక మారు శ్రీ వెంకటశాస్త్రి అక్కడికి వెళ్ళగా ఎంతో బాధించిరి. దానిని గీరతము చప్పట్ల పర్వములో శ్రీ వెంకటశాస్త్రి తిరుపతితో నిట్లు మొరపెట్టుకొనెను.

'కౌముది పాఠమ్ము గాపలె నాకిప్పు
డం చొక్క విద్యార్థి యడుగజొచ్చె
కానిమ్ము రఘువంశమేని జెప్పు మటంచు
నిక నొక్క విద్యార్థి యీాసడించె

కాకరపర్తి యీ గ్రామం బెరుగుమంచు
పేరొక్క విద్యార్థి వెక్కిరించె
పెద్ద పేరుగ వింధు మిదియేనా పస
యంచొక్క విద్యార్థి హంకరించె........

అతని ధైర్యమ్మునకు బోలునట్టి ధైర్య
మన్నృతమునయందునే నేనెందు నరయ సఖుడ.
'అట్లు చుట్టుకొనిన యవ్వార లెల్లరు
నరవ లేనుగూడ నరవ నగుట
నరవగోల యనెడి యార్యుల మాట య
త్తరిని మదికి దగిలె దరుణ మగుట

ఒకరు,

'భటరాజ కవనమ్ము పచరింతు వీవని
యొక్కొక్కపరి నన్ను నొక్కి పలుకు
మీసాలు దీయించి వేసెదనని మరి
యొక్క మా రాగ్రహం బొందుమండు'

మరియొక పెద్ద,

'కౌముది చెప్పనేరవట కాదగు
సంగతి చూచుకొమ్ము నీ
వేమెయి గాగితమ్ము పయి
నిట్లని వ్రాయుదటంచు గోపము
ద్రాముషితాత్మ గౌరవ భరంబుగ
బల్కెను........
'గణపతిని బోలు విద్యార్థి గణము కొంత
ఆంజనేయుని బోలెడు నదియు కొంత
కుంభకర్ణుని బోలెడు కొంత గణము
చుట్టు ముట్టె సేనాపతి చూచుచుండ'

పై దానినిబట్టి ఆనాడు శ్రీ శాస్త్రిగారిపై నెంతదౌర్జన్యకాండ జరిగినదో ఊహింపవచ్చును.

రామకృష్ణ కవులెంత దురుసుగా ప్రవర్తించిరో ఊహించుటకు, వారు కొప్పరపువారికి ఈ క్రింది విధముగా జాగితము పంపుటయే చాలును.

'తిరుపతి వేంకటేశ్వరులు
దేబెలు కూళలు మోరకుల్ కవి
త్వ రచనయే యెరుంగరు
వృథాయశమున్ గడియించినారు వా
రిరువురు శుద్ధశుంఠలు...

రామకృష్ణ కవులు విద్వాంసులు, బహుగ్రంథకర్తలునైనా వారు తిరుపతి కవులతో పెట్టుకొనిన వివాదము వలన మాత్రమే ముఖ్యముగా స్మరింపబడుచున్నారని సహృదయులు గమనింపగలరు. గీరతము ముగించిన ఈ క్రింది పద్యము వివాదములలో గూడ తిరుపతి కవుల హుందాతనమును ప్రకటించుచున్నది.

'కలికిన్ మంగళమస్తు, దానికి సిరిన్ గల్పింపయత్నించు ధీ
రులకున్ మంగళమస్తు, నిస్తులవచోరూఢిన్ గలిన్ ద్రుంచు నా
ర్యులకున్ మంగళమస్తు, వేదమత శాస్త్రోక్తార్యధర్మైకమ
ర్త్యులకున్ మంగళమస్తు, గీరత వచోదుగ్ధాబ్ధికిన్ మంగళమ్'

ఈ వివాదము జరుగుచుండగా శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి శ్రీరామ కృష్ణ కవులకు చేసిన 'సతీర్థ్యప్రార్థనము'ను బట్టి యథార్థమవగత మగును.

'గురువుల్ తిర్పతి వేంకటేశ్వరులు మీకు న్మాకు నిక్కంబు, త
త్కరుణాసారమె కారుణ మ్మరయు విద్యాబీజ మొక్కింత
యంకురమందన్ మనకెల్ల నిక్కముగుమాకున్ వారికిన్ శిష్యతా
గురుతల్ లేవను మీనుడుల్ వినిన నే క్రూరుండునుం గుందెడున్'

మరియొక సందర్భముకూడ తిరుపతి కవులదే అంతిమ విజయ మని బుజువు చేయును. లోగడ అంత అల్లరి చేసిన కాకరపర్రు పౌరులే, 1932 వ సం. లో శ్రీ వెంకటశాస్త్రి గారిని పుత్రశిష్య సమేతముగా నాహ్వానించి అందరునేకముఖముగా ఎదురువచ్చి మేళతాళములతో తోడితెచ్చి ఊరేగించి సభచేసి సన్మానించిరి.

# 16

శ్రీ కొప్పరపు సోదర కవులు ఆరువేల నియోగి బ్రాహ్మణులు. వారి యనర్గళమైన ఆశుధారకవనము పండిత పామరులను చకితులను చేసినది. ముఖ్యముగా కథాకావ్యములు ఆశువుగా చెప్పుటలో గంట కెన్ని పద్యములు చెప్పేవారో లెక్కించ శక్యమయ్యేది కాదు. ఎన్నో గౌరవము లందుకొనిరి. వారికి సంస్కృతము రాదు. ఆంధ్రభాషాజ్ఞానము కూడ పరిమితమైనదని ప్రతీతి. వారు మొదట తిరుపతి కవులను దర్శించి గౌరవించిరి. తిరుపతి కవులను నాదరించి సంస్కృతాంధ్రములలో పాండిత్యము సంపాదించినచో ఎక్కువ వన్నె కెక్కుదురనిసూచింపగా, వారంగికరించిరి. కాని అప్పటి గుంటూరుపరిస్థితులు వారి సామరస్యమును సాగనీయలేదు.

రేపల్లె లో ప్రారంభమైన పద్ధతి నియోగము అప్పటికి నరసారావు పేట గుంటూరులకు మ్మెరముగా ప్రాకి వైదిక నియోగాల మధ్య కక్షగా పరిణమించినది. అప్పుడు గుంటూరు న్యాయవాదులలో నియోగు లెక్కువ. అన్ని రంగములలోను న్యాయవాదుల కెక్కువ ప్రాబల్య మున్న రోజులవి. తిరుపతి వెంకటేశ్వరులు చేయుచున్న శతావధాన సభలో కొప్పరపు సోదరులలో జ్యేష్ఠులగు శ్రీ సుబ్బారాయ కవికి అవ ధానులతో పాటు వేదికమీద కుర్చీ వేయించవలెనని నియోగి పెద్దలు సూచించిరి. తిరుపతికవులొప్పుకొన లేదు. అప్పుడు సభలో గుంటూరు వాస్తవ్యులైన ఎందరో ఉద్దండ విద్వాంసులు ,విద్వత్కవులు ఉన్నారు. వారికెవ్వరికినీయని ప్రత్యేకాసనము వీరికేలయని తిరుపతి కవుల వాదన. కాని యది కొప్పరపువారి యభిమానులకు నచ్చలేదు, వీరామాట లన్నారు వారామాట లన్నారు అని 'రూమర్లు' ప్రాకినవి. వారి యభి మానులు కొప్పరపువారికి పురి యెక్కించిరి. అప్పటికే రగులుచుండిన నియోగివైదికద్వేషములు కొప్పరపు వారికి తిరుపతి కవులకు మధ్య వివాదము రూపముగా షంటగా ప్రజ్వరిల్లి మహాజ్వాలగా సర్వతోముఖ ముగా వ్యాపించినది.

శ్రీ కొప్పరపు సుబ్బారాయ శర్మగారు తిరుపతి కవులకు పద్య మయమైన సవాలు ఉత్తరమును 20-8-1911 న పంపిరి.

'అష్టావధానంబు నాచరించెదరేని
యద్దానిమించి సేయంగలేము
శతఘంట కవనంబు సల్ప బూనెదరేని
యద్దానిమించి సేయంగలేము...
తెలుగు మీసంబు నిలువంగ దివురుడింక'

దానికి 21-8-11 న శ్రీ తిరుపతిశాస్త్రి తక్కిన విషయములు వదలి 'మీ పరువును మాపు మాటనుఎత్తి ఏ సందర్భమునం దేవిషయమునం దేరూపముగా మా యేమాటకు మీ పరువు మాపినదో వివరింపు' డని వచనములో ఉత్తరము వ్రాసిరి.

అందుపై 22-8-11 న శ్రీ సుబ్బారాయ శర్మగారు పద్యములలో తిరుపతి కవులను వాద సభకు రమ్మని సవాలు చేయుచు లేఖ పంపిరి

'గురుతరలీల రేపె సభ గూర్పగ
మంటిమిగాని భానువా
సరమున దక్క రారెవరు.......
ఆశుకవిత్వ శతావధానముల్
విరచనసేయ రావలయు వెంటనె
మేమని యాచరించి ధీ
వర సభ మీ ప్రతిజ్ఞ దెలుపంగల
మీసము దీయ జేతుము'...

దానికి జవాబుగా 23-8-11 న తిరుపతి కవులు మరల వచనములోనే సమాధానమిచ్చిరి. అందులోని కొన్ని భాగములు.

(1) 'మా మీసముల పద్యము మీ కర్థము కాలేదు. పెద్దల నడుగుడు. (4) మీరే వివాదకుం దిగుటచే నంగీకరింపక తప్పినది కాదు (9) ఆంధ్ర భాషైకదేశమగు గ్రామ్యభాష యందుగాని నిర్యతిగణప్రాప సౌరబ్ధ్యరసాభాస కవిమార్గమునంగానికాలు ద్రవ్వినచో మా గ్రహచారమందుకు వొడబడవలసినదేనా? శాంతం పాపమ్! (12) ఈ వ్రాతవలన దెలునేనేనిమీకు వదలితిమని యనుకొనరాదు '

మీసపు పద్యపు ప్రతిజ్ఞ సంస్కృతాంధ్ర కవిత్వములు రెండును చెప్పగలవారికే అన్వయించును. గాని, ఒక్క సంస్కృతములోగాని ఒక్క తెలుగులోగాని కవిత్వము చెప్పువారి సవాళ్ళకు అన్వయింపదని తిరుపతి కవుల భావమని మన మీ సందర్భములో గ్రహింపవలెను. దీనితో ఒక్క తెలుగు కవిత్వమునకే సవాలుచేసిన కొప్పరపువారికి తమ పద్యమే అర్థము కాలేదని తిరుపతి కవులెంతో నేర్పుగా సూచించిరి.

పై యుత్తరములుగాని ముందు ఉదహరింప బోవునవి కాని ఒకరి కొకరు పంపుకొన్నవి మాత్రమే కాదు. ఎప్పటికప్పుడు వాటి కాపీలు వేలకొలదిగా అచ్చొత్తించి గుంటూరు పట్టణ వీథులలోను చుట్టుపట్టులను విరివిగా పంచిపెట్టబడినవని మనము గుర్తుంచుకొనవలెను. వెంటవెంటనే ఉత్తర ప్రత్యుత్తరములు సాగినవి.

25-8-1911న శ్రీతిరుపతిశాస్త్రి 'జరూరు'అని ఉత్తరము పంపగా, శ్రీ శర్మగారు 27 న 11 గంటలకు జవాబు పంపిరి. దానిపై శ్రీ తిరుపతి ఆ నాడే జవాబిచ్చిరి. అందులో కొన్ని భాగాలు.

'1. సభముందు మీరే చేయవలెను. ముందు కాలు ద్రవ్వినవారు మీరుకాని మేముకాము. 4. మా విషయమై మీరును, మీ విషయమై మేమును అవధానపు టేర్పాటులు చేసికోనవలసినదేకాని యయ్యని సభ్యు లేర్పరుప దగినవి కావు. 5. ఈ విషయముల కంగీకరించుచు మీరు సభకూర్పుడు, లేదా మేము సమకూర్చెదము. రేపు సూర్యోదయమునకు దప్పక జవాబు పంపవలెను.'

దానికి జవాబు రాకపోగా శ్రీ తిరుపతి, గుంటూరు 28-8-1911 ఉదయం 8 గంటలకు ఇట్లు వ్రాసిరి.

'ఈ దినమున సభ తప్పకజరుగునను మీప్రకటనను పురస్కరించు కొని యనేక గ్రామములనుండి వచ్చి నిరీక్షించుచున్నారు. వారిని వృథా శ్రమ నొనరించుట యుచితము కాదు కావున నవధాన సభావిషయ మేమయినదనియు బ్రకటించి వారి సందియముదీర్పుడు. మా యుత్త రమునకు బ్రత్యుత్తరము రాకుండగనే మేము ప్రకటించుట యుక్తము కాదుగదా!'

కొప్పరపు వారు సభానియమముల కంగీకరింప లేదు. మొదట వారే నిర్ణయించిన 28-8-1911 తేది సభ చల్లగా దాటవేసిరి. తర్వాత వారవధానములు చేసిరిగాని అప్పటికి అలవాటు పడలేదు. అదిగాక అవధాన సభ తిరుపతి కవులు కూర్చినచో ఎట్టిగడ్డు సమస్య లిప్పింతురో యను జంకు కలిగి యుండవలె. ఈ పక్షమువారు ఆ పక్షమువారు చేరి వీరే బాగా చెప్పిరను గలభాసభకే వారు సిద్ధపడిరిగాని నియమబద్ధమైన సభకు సిద్ధముగా మన్నట్లు తోచదు.

శ్రీ తిరుపతి కవులు 30-8-1911 వరకు వేచియుండి ఆనాడు సాయం. 6 గం.లకు గుంటూరు పట్టు కంపెనీ హాలులో సభ చేసిరి, ఆనాడే శ్రీ వెంకటశాస్త్రి కోర్టులో స్వర్ణకారుల తగాదాలో సాక్ష్యమిచ్చి అలసి సభకు వచ్చెను. సభకు శ్రీమాన్ వంగిపురము కృష్ణమాచార్యులు, బి. ఏ. యల్. టి., సంస్కృతాంధ్ర విద్యత్కవి సభకు అధ్యక్షత వహించెను. ముందు శ్రీ తిరుపతిశాస్త్రి సభ వారికి తమకు కొప్పరపువారికి జరిగిన ఉత్తర ప్రత్యుత్తరములు వినిపించిరి. తర్వాత శ్రీ వెంకటకవి కవిత్వమును గూర్చి ఉపన్యసించిరి, ఆ సభను ఆపి కవుల తగాదాలు విరమింపజేయు నుద్దేశముతో గుంటూరు లాయర్లలో ప్రధానుడనదగిన శ్రీ గోవిందరాజుల శ్రీనివాసరావు పంతులుగారు! సభకు వచ్చిరి. వారే ఉత్తర ప్రత్యుత్తరము లన్నియు విన్న తర్వాత కొప్పరపువారి ఉత్తరముల దురుసుదనమునకు నొచ్చుకొనిరి.

అంతలో శ్రీ వేలూరి శివరామశాస్త్రి రైలుదిగి సభకు వచ్చెను. శ్రీ వెంకటశాస్త్రి వద్దనుచున్నను వినక శ్రీ కొప్పరపు వారిపై సవాలు పత్రికను పద్యమయమైన దానిని వ్రాసి మరునాడుదయమే అచ్చు వేయించి పంపెను. అట్లే శ్రీ శాస్త్రిగారు వద్దనుచున్నను వినక సవాలు పత్రికను పంపిన వారి శిష్యులలో శ్రీ త్రిపురనేని రామస్వామి చౌధరి గారు మరియొకరు- శ్రీ తిరుపతి కవుల శిష్యుల సవాళ్ళు సాగినవి.

కవుల తగాదా రణరంగముగా మారినది.

తిరుపతి కవులు గుంటూరుసీమ ప్రథమభాగము ప్రకటించిరి. దానిపై నెందరో అభినందనపు ఉత్తరములు పంపిరి.

శ్రీ కొప్పవరపు సుబ్బరాయ శర్మగారు మాత్రము దానివలన తనకు గౌరవ భంగమును ఆదాయ భంగమును గలిగినదనియు, కోర్టుకు వెళ్ళెదననియు శ్రీ తిరుపతి కవులకు రిజిష్టరునోటీసు ఇచ్చిరి. దానికివారు జవాబిచ్చిరి.

నిజముగా గుంటూరు తగాదావలనఇటు తిరుపతి కవులకును, అటు కొప్పరపు కవులకును అభిమానులుపెరిగి ఆదాయము లెంతో వృద్ధియైనవి గాని ఏమాత్రము తరుగలేదు.

ఉభయ పక్షములలో మాటల తారతమ్యమునకు ఈ క్రింది యుదాహరణములు చాలును

శ్రీ కొప్పరపు వారిట్లు వ్రాసిరి.

"బుర్రగొరిగించి సున్నపుబొట్లుపెట్టి
ఖరముసెక్కించి యూరేగగా నొనర్చి
మాలదాసులు ఛీ యని గేలిసేయ
తిరుపతిని వేంకటన్నను త్రిప్పినాము"

కొప్పరపు కవులనుగూర్చి తిరుపతికవుల మాటలు కొన్ని:

'దారయొక్కటిమాత్రమే తనకు గలదు
దాని కెన్నియుండిన మీద దఙ్ఞడొప్పు
తండులమ్ములు మాత్రమేయుండి యెవడు
షడ్రసోపేతముగ భుక్తి సలుపనేర్చు.'

"శాఖలో గొందరాకాశ సౌధమొకటి
గట్టిపెట్టిరి కొప్రంపు గవులకొరకు
ఎక్కలేము మొర్రోయన నెక్కితీర
వలయునని త్రోయుచున్నారు బలముకొలది"

కొప్పరపువారి ధారనుగూర్చి తిరుపతి కవులు,

"గడియకుమూడు వందలట గంటకు డెబ్బది వందలంట త
ప్పడు కవనమ్ము చెప్పుటకు బూనినవారిని బుట్టజేసి యె
ప్పుడు సరసాశు సత్కవనమున్ బచరించు మదీయ వక్త్రిమున్
ఖడబడమ్రోగు తాషమరపా లొనరించెదవమ్మ శాంకరీ!"

ఈ నియోగి వైదికుల కక్షలు తిరుపతి కవుల కెంతమాత్రము నిష్టములేదు. వారు గుంటూరుసీను ఉత్తరరంగ మిట్లారంభించిరి;

"వలదునియోగి వైదికవిభాగము కొంపలు ముగ్గుదాన,
వర్తిలుడు యథానుపూర్విగ విధేయులు విద్యకు గండు...."
'వలదునియోగివైదిక విభాగము వల్వ దసత్యగోష్ఠి...."

ఈ వివాద సందర్భములో శ్రీ వెంకటశాస్త్రి బందరులో తన యుపాధ్యాయ పదవికి 3 నెలలు సెలవుపెట్టి ధర్మపత్నితోసహా గుంటూరు వచ్చి నివాసమొనర్చెను. వారెక్కువ భాగము శ్రీశిష్ట్లా హనుమచ్ఛాస్త్రి గారింట్లో ఉండేవారు. ఈ వ్యాసకర్త కప్పుడు 11 సం.లు అప్పటికి సంవత్సరము క్రిందటినుంచే పద్యాలు గిలుగుతుండేవాడు మా యింటికి శిష్టావారి యిల్లు రెండు ఫర్లాంగుల లోపగుటచే అప్పుడప్పు డక్కటికి వెళ్ళి శ్రీ వెంకటశాస్త్రిగారు నిరంతరాయముగా జరుపుచుండే పండితగోష్ఠి ఆల కించే అదృష్టము కలిగింది. అప్పుడప్పుడు శ్రీ శాస్త్రిగారి పత్నికూడా వరండాలో దర్శనమిచ్చేది చొక్కాలు తొడిగి ఎరుగని శ్రీ శాస్త్రిగారు పొందిన కనకబిరుదములన్నీ వారి పత్ని కాసులపేరువలె హారముగా ధరించేది.

1665 లో ప్లేగున్నూ 1666లో మహాగ్ని ప్రమాదమున్నూ లండను నగరాన్ని చాలాభాగము తుడిచి పెట్టినది. ఆ మహాప్రమాదాల వల్లనే లండను నగరము అందముగా మరల నిర్మించే అవకాశము కలిగినదని చరిత్రకారులందురు. అట్లే ఎంతో బాధాకరమైన ఈ నియోగ వైదిక కక్షలవల్లను. కవుల తగాదాల వల్లను గూడా కొన్నిలాభాలు రాకపోలేదు.

వద్ధతి నియోగమువలన నియోగులతో అప్పటికి లుప్తప్రాయ మగుచున్న స్మార్త కర్మాచరణ మందు శ్రద్ధ విజృంభించినది. వారు స్పర్ధతో వైదికులకంటె వైదికాచార మవలంభించుటకు పూనుకొనిరి. వైదికులు కూడ తమ యాచారమే శాస్త్రీయ మైనదను దృఢవిశ్వాసముతో నుండగా, శ్రీ మార్కండేయ శర్మగారి గ్రంథములవల్ల వైదికుల దృష్టి కూడ ధర్మశాస్త్ర గ్రంథములవంకకు ఎక్కువగా తిరిగినది. ఉభయ శాఖ లకు నూతనోజ్జీవము కలిగినది.

అట్లే ఈ కవుల కలహములు సామాన్య జనములోగూడ ఆంధ్ర కవిత్వమందు ఉత్సాహము ఉవ్వెత్తుగా రేకెత్తించెను, 35 మంది విద్యార్థులమున్న మూడవఫారము మా ఒక్క డివిజనులోనే 15 మంది పద్యము లల్లసాగిరి. దీనిని కొలబద్దగా గ్రహించి ఆ కాలములో గుంటూరు చుట్టుపట్ల ఎంత కవితోత్సాహము పొంగినదో ఊహించ వచ్చును.

# 17

శ్రీ బెల్లముకొండ రామారావుగారితో వివాదము శ్రీ కొప్పరపు వారితో తగాదాలో శాఖగానే పుట్టినది. కాని దాని నడక పరిణామము వేరు విధముగా కొనసాగినవి. అప్పటికి నియోగి బ్రాహ్మణ పండితులలో నిస్సందేహముగా శ్రీ రామారావుగారు అగ్రేసరులు. హయగ్రీవాను గ్రహముచే యౌవనముననే విద్యలు గ్రహించి, సంపన్నుడును, ఉదారుడును గనుక స్వగ్రామ మగు పెదపాడులో విద్యార్థులకు సుఖ భోజనము పెట్టి విద్య గరపుచుండిన పుణ్యాత్ముడు. ఆయన యందు నియోగులకేకాక వైదికలోకమందును విశేష గౌరవముండెడిది. సంస్కృత ములో కావ్యరచన చేసిన కవి.

వారు అనూచానముగా శ్రీ వైష్ణవగురువుల వలన తప్త చక్రాంకనము పొందిన కుటుంబములోని వారు. ఐనను శ్రీ వైష్ణవులు భోజనాదుల లోను, శ్రాద్ధాదులలోను వేరుగానుండి తమ్ము పంక్తిబాహ్యులుగాచూచుట వారి కిష్టముకాక, విశిష్టాద్వైతమువదిలి స్మార్తపక్షము వహించి విశిష్టాద్వైతమును తీవ్రవాక్కులతో ఖండించుచు ఎన్నో సంస్కృత గ్రంథములు రచించిన విద్వాంసులు. వారు ప్రత్యక్షముగా ఎన్నడు శ్రీ తిరుపతి కవులతో వివాదమునకు దిగలేదు. కాని పరోక్షముగా వివాదము కలిగినది.

నరసారావుపేట శతావధానములో శ్రీ తిరుపతికవుల ప్రత్యర్థి ఒకరు రామారావుగారిని అడిగి 'పశ్యాపశ్యౌ నపశ్యతః' అను సమస్యను తెచ్చి పూరింపుడని పృచ్ఛకుడుగా కవుల నడిగెను.

కవులిద్దరిలో ఎవరన్నారో గాని—బహుశః శ్రీ వెంకటశాస్త్రియేమై యుండును —అది తప్పు కనుక పూరింప వీలులేదనిరి. ఆ భ్రాంతి వారికి

ఆవేశములోనో, తొందరలోనో కలిగియుండును. ఆ పృచ్ఛకుడు వెళ్ళి శ్రీ రామరాయల కిది చెప్పగా, వారు కౌముది చూచుకొని తప్పులేదని నిశ్చయించుకొని అట్లాతనికి ధైర్యము చెప్పిరి. మర్నాడా పృచ్ఛకుడు తిరిగివచ్చి, 'సమస్యలో తప్పులేదని విద్వాంసులన్నారు. తప్పేమిటి ?' అని నిగ్గదీసెను. ఆ విద్వాంసుడెవరో సభకువస్తే తప్పు నిరూపింతుమని కవులనిరి. ఆ సమస్య కష్టమైనదవుటచే కవులు తప్పించు చున్నారని వారి యభిమానులు గూడ కొందరు భావించుటచే, దానిని చక్కగా నిట్లు పూరించి వారిని తృప్తి పరచిరి.

'యః పశ్యతి జగత్సర్వం
యో నపశ్యతి సర్వతః
తా వుభౌ పరమాత్మానం
పశ్యాపశ్యే నపశ్యతః'

శ్రీ రామరాయలు ఎదుట పడలేదుగాని వారి పక్షమున ఇతరులు కవులను వాదసభ కాహ్వానించిరి. అట్లు వ్రాసిన వారిలో శ్రీ రామరాయల వైదిక శిష్యులును గలరు.

"రామరావు పత్రికలోని వ్రాలుచేసి
పంపుచో నుత్తరం బీయవలయు ననియు
పట్టి శశ్ఛటిగాంద్రతో వాదమేల
యనియు భావించి ప్రతిపంప మంబమేము'

అని కవులు ఊరకుండిరి.

ఈ వాద మంతటితో నాగలేదు. ఆంధ్రదేశములోగల ఉద్దండ వ్యాకరణ పండితులకు ప్రతికక్షులు ఈ సమస్యను తీసికొని పోయిరి. మహా మహోపధ్యాయ తాతా సుబ్బరాయ శాస్త్రిగారు సమస్యలో తప్పు లేదనిరి. వారట్లు చెప్పినది యెరుగక వారి శిష్యులైన జయంతి భగీరథ శాస్త్రిగారు సమస్యలో తప్పున్నదనిరి.

పశ్య శబ్దము తప్పనియు ఉపసర్గ పూర్వక పశ్యశబ్దము సాధు వనియు కాశికావృత్తికారుని మతము. కౌముది రెండును సాధువులనెను,

కాశికా వృత్తికారుడు ప్రాచీనతరు డగుటచే కౌముదీ కారునికంటె ఎక్కువ ప్రామాణికుడనే శ్రీ తిరుపతి కవుల వాదము. కౌముదీకారుని మతము మహాభాష్య సమ్మతమని ప్రతిపక్షుల సిద్ధాంతము. ప్రతిశాస్త్రములోను కొన్ని పట్టులలో ఆచార్యులకు మతభేదములున్నవి. ఈ వాదములో శ్రీ తిరుపతి కవులు తొందర పడినను, కాశికావృత్తికారుని బలముతో కొంత మర్యాదగా బయటపడ గలిగిరి.

ఈ సమస్య తగవు ప్రారంభమైనది, 1911 సం. అక్టోబరులో. అంతకుముందు నాలుగు నెలల కిందట తిరుపతి కవులకు శ్రీరామ రాయలు తాము రచించిన కృష్ణలీలా తరంగిణియను సంస్కృత కావ్యమును పంపియుండిరి. దానిని కవులిప్పుడు పైకితీసి అందులోని అసభ్య భాగములను బయట పెట్టిరి. ఆ భాగములు అసభ్యములు కావని శ్రీరామ రాయలయందు గౌరవమున్నవారుగూడ సమర్థించుట సాధ్యముకాదు. చుక్కలలో అక్షరాలు వదలి నాల్గింటిని ఉదాహరిస్తున్నాము.

1. 'సనంద తనయః కరపంకజేన పస్పర్శ శి—మ్.

2. 'మయి మాత్రణాయ సదనా ద్బహిర్గతే....

3. 'నవనీతచోర తవ శి........మాహరామి
....మమ శి....చుంబన మిదమ్.

4. సుభగే త్వదీయ మయి శోభనం భ—ం దర్శయ'

శ్రీ కృష్ణలీల వర్ణనములో గూడ నిటువంటివి అసభ్యములు కావన లేముగదా!

ఈ విధముగా అసలు వాదమును ప్రక్కదారి పట్టించుటలో. శ్రీ తిరుపతి కవులకు వాద ప్రతివాదములలో గల చాకచక్యము ప్రస్ఫుటమవును

# 18

ఇక శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారితో శ్రీ వెంకటశాస్త్రికి జరిగిన తగాదా విచిత్రమైనది. శ్రీపాదవారు సంస్కృతాంధ్ర భాషలలో పండితులే గాక వేదము శ్రౌతముకూడా అధ్యయనము చేసిన పుణ్యమూర్తులు

ఒక్క చేతిమీదుగా మహాభారతము, రామాయణము భాగవతము అనువదించి శతాధిక గ్రంధకర్తలైన కవిసార్వభౌములు మహామహోపధ్యాయ బిరుదాంచితులు. వారివద్ద శ్రీ వెంకటశాస్త్రి, మేఘసందేశము ఐదునెలలు శుశ్రూషచేసి కొంత చెప్పుకొనిరి. ఈ విషయమున దాచక ఎప్పుడును ప్రకటించుచునే యుండెను.

శ్రీకృష్ణ భారతముపై కొందరు కుశంకలు లేవదీయగా మహాసభలో శ్రీ వెంకటశాస్త్రి వానిని ఖండించి శ్రీపాదవారిని సమర్ధించిరి. శ్రీపాద వారికి గండపెండేరము సమర్పించు సభకువెళ్ళి శ్రీ వెంకటకవి స్వయముగా గురుపాదమునకు బిరుదుటందె నలంకరించిరి. శ్రీ వెంకటశాస్త్రి గారికి గండపెండేరము సమర్పించు సభలో శ్రీపాదవారుండుటచే వారి యనుమతిలేనిది తామది గ్రహింపమని చెప్పగా శ్రీపాదవారు వెంకట శాస్త్రిగారు అందుకు తగినవారేయని ప్రకటించిరి. ఆ గురుశిష్యులమధ్య తగాదవచ్చుట ఆశ్చర్యకరమే! ఐనను వచ్చినది.

శ్రీపాద శాస్త్రిగారు కొంత అమాయకులు. లోకము 'వెర్రి వెలనాటి వార'ని చమత్కరించు నామడికి ఉదాహరణ ప్రాయులైనవారు:ఎవరో ఏదో శ్రీ వెంకటశాస్త్రిగారిపై వారి చెవిలో నూదిరి.

బొబ్బిలి పట్టాభిషేక కావ్యములో సహస్రాధిక దోషము లున్నవని శ్రీపాదవా రారంభించిరి, వాద ప్రతివాదములు ఒకరి శబ్దదోషము లొకరు చూపుట, సమర్ధించుకొనుట ఇత్యాదులు సాగినవి. ఏమైననేమి? అట్టిపెద్దల మధ్య కలహము తగదని వారి యభిమానులు రాజీచేసిరి. దానినిగూర్చి తుదకు శ్రీ వెంకట శాస్త్రిగారు 25—6—1931 ఆంధ్రపత్రికలో శాంతి వ్యాస చర్చలో వ్రాసిన మాటలు ఆ వివాద స్వరూపమును సూత్ర ప్రాయముగా ప్రదర్శించును.

'విస్తరంబికనేల విపుల యులుకయు
దృణహంతాశనమ్ము దీర్ఘమగునె
అన్నమాట కస్మదాచార్య వర్యుండె
ప్రథమమగు నుదాహరణము తెలియు.'

వారి తగాదా మధ్యలో శ్రీపాదవారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి పదప్రయోగమును ఖండించుట, శిష్యుని శ్రీ వెంకటశాస్త్రి గారు సమర్థించుటతో రామాయణములో పిడకలవేట్లాటయు జరిగినది.

వారిద్దరిమధ్య పరోక్షముగా మరియొక తగాదా కూడా వచ్చినది. మదరాసు ప్రభుత్వమువారు ప్రథమాంధ్రాస్థాన కవిని నియమింప నిర్ణయించినపుడు వీరిద్దరిలో ఎవరిని నియమించుటాయని మంత్రు లాలోచించిరట. తుదకు ప్రభుత్వము శ్రీ వెంకటశాస్త్రినే వరించి గౌరవించినది. అ తర్వాత కొద్దినెలలకే వారు పరమపదించగా, వెంటనే రెండవయాస్థాన కవిగా శ్రీ పాదవారిని ప్రభుత్వము వరించినది. ఆ రెండు పట్టప్రధాన సభలకును ఈ వ్యాసకర్త ప్రేక్షకుడుగా వెళ్ళెను.

శ్రీ వెంకటశాస్త్రిగారి పట్టప్రదానము బెజవాడలో రాజమర్యాదల తోడనేగాక అశేషాంధ్ర జనములయు కవిపండితులయు గౌరవాభిమానములతో జరిగినది,

శ్రీపాద వారిని మదరాసులో పెద్దలతో నిండిన శ్రీ రాజాజీహాలులో రాజమర్యాదలతో మాత్రమే జరిగినది.

# 19

కొందరు పూర్వపుణ్య విశేషమువలన తమకు ప్రాప్తించిన ప్రతిభను నిగ్రహించుకొను సంయమము లేక బళ్ళకు లారీలకు ఎత్తింతురు. వారు జీవించియుండగా వారు పలికిన ప్రతియక్షరము తలదాల్చు భక్తులుందురు. విస్తార రచనలుచేసినవారి రచనలు తరుచుగా వారితోనే అంతరిస్తవి. పూర్వపుణ్య విశేషము పరిపక్వమై జీవయాత్ర గడిపినవారిలో తిరుపతి వేంకటేశ్వరులు అగ్రగణ్యులు. శ్రీ తిరుపతి గతించి 50 సం. లూ. శ్రీ చెళ్లపిళ్ళ గతించి 20 సం.లూ గతించినవి. అప్పుడే వారి ప్రియ శిష్యులొకరు వారి కావ్యములలో రసము పాలు తక్కువ యనెను. వారి భారతనాటకాలూ, బుద్ధ చరిత్రమూ కలకాలము నిలుచునను సద్విమర్శకు లున్నారు. శ్రీ దేవీభాగవతమును, శ్రవణానందమునుగూడ వాణిలో కలుపువారును గలరు.

ఏవి యేమైనను శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల విజయ యాత్రలు మాత్రము ఆంధ్రదేశ మెన్నటికిని మరువదు. వారిద్దరూ కలసి 40 సం.లు శ్రీ వెంకటశాస్త్రి 60 సం.లు అప్రతిద్వంద్వముగా ఆంధ్రభూమిలో కవితా సామ్రాజ్య మేలినారు. వారి విద్వద్విజయయాత్రలు బహుముఖ ప్రజ్ఞా విభాసితములు, శ్రీనాథుని యాత్రలకంటె విస్తారమైనవి. ఆంధ్రభాష యున్నంతకాలము శ్రీనాథుల విజయ యాత్రలతోపాటు శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల విజయయాత్రలును ఆంధ్ర సహృదయుల స్మృతులలో ధ్రువముగా ఉండగలవు.

మరియొక విశేషముకూడా ఉన్నది. శ్రీ తిరుపతి కవుల ఆంధ్ర కవిత్వము సంగతే ఇంతవరకు ప్రస్తావింప బడినది. వారి సంస్కృత కవిత్వమెంతో ప్రౌఢమైనది. వెనుక నుదాహృతమైన వానికితోడుగా వారి వేమవరాగ్రహార శతావధానము లోనుండి యాదృచ్ఛికముగా గ్రహించి మరి రెండు ఉదాహరిస్తున్నాము.

మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యుల నామప్రయుక్తశ్లేష:

"సత్యాసక్తం సదాపాణి న్యుప్తచారు సుదర్శనమ్
యశోదయాలాల్యమానం కృష్ణం కృష్ణం నమామ్యహం'

సమస్యా పూరణము:

'పాణిన్యువచితే సూత్రే సభాయాంకు కవిర్యథా
సాకంసుకవి భిస్తద్వత్ శ్యామఘోనా రమంస్థితః॥

ఈపై శ్లోకమువల్ల తిరుపతి కవులకు పాణిని అష్టాధ్యాయి ఎంత కంఠస్థమో ఎంత సద్యస్స్ఫూర్తిగా భాసించేదో అభివ్యక్త మవుతుంది.

ఇట్టి చక్కని శ్లోకాలు వారు శతావధానాలలో రాజసభలలో మహా సభలలో శతాధికముగా చెప్పినారు. వారు బ్రహ్మగురువులయొద్ద వ్యాకరణాధ్యయనము చేయుచుండగా 'ధాతు రత్నాకర"మను చంపువును. "పాణినీయోప యోగ మగుగతిని" రచించిరి, అందులో 'రామకథ క్రమముగా ధాతుపుల్ గ్రాల నమరు'నట. "వీథి" నొకదానిని రచించిరి. కాశీసహస్రము చెప్పిరి. శుకరంభా సంవాదము వ్రాసిరి, వారి సంస్కృత

కావ్యాలు చదివే భాగ్యము ఈ వ్యాసకర్తకు లభింపలేదు. శతావధానా దులశ్లోకములను బట్టి అవి యుత్తమ కావ్యములై యుండునని అనుమే యించుచున్నాము వారి శిష్యులు అభిమానులు వారి సంస్కృత కావ్యా లను చాటుపులను సేకరించి నాగరాక్షరసములతో ముద్రించి ప్రకటించి వారి యశస్సు ఆసేతు హిమాచలము వ్యాప్తము చేసినచో వారి శతవార్షిక జయంత్యుత్సవములు మరింత సార్థకములు కాగలవు.

## 20

శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవు లిద్దరును పుణ్య పురుషులు. శిష్టాచార మెన్నడును కట్టులో గూడ విడనాడని ఆచారవంతులు. వారెన్నడు అశాస్త్రీయ ప్రవర్తనకు, అవినీతి కార్యములకు ఒడకట్టియుండలేదు. ఇద్ద రును గురుభక్తి, భగవద్భక్తి కలవారు, వారిలో తారతమ్య మెన్నుట ఉచి తము కాదనవచ్చును కాని వ్యక్తులిద్దరైనప్పుడు అట్టి విచారణ రాక తప్పదు.

వారిద్దరిలో పూర్వపుణ్య విశేషము గాని ఈ జన్మలో చేసిన తపః ఫలముగాని శ్రీ తిరుపతిలో కంటె శ్రీ వెంకటశాస్త్రిలో ఎక్కువ అభివ్యక్త మైనదనుట సత్యదూరము కాదు. శ్రీ తిరుపతి మా వెలనాటివాడు, మా హరితసగోత్రికుడు కూడాను. శ్రీ వెంకటశాస్త్రిది ఆరామ ద్రావిడశాఖ భారద్వాజ గోత్రము కావున మనకు శాఖాభిమానము, గోత్రాభిమానమూ అంటగట్ట వీలులేదు

శ్రీ తిరుపతి బలశాలియైనను 49 సంవత్సరములే జీవింపగా, బల హీనుడైన శ్రీ వెంకటశాస్త్రి 80 సంవత్సరములు- దాదాపు సహస్రమాస ములు- జీవించెను.

శ్రీ తిరుపతి ఈ లోకములోని చిన్నప్రభువు వద్ద ఆస్థానకవి. శ్రీ వెంకటశాస్త్రి అన్నవరస్వామి ఆస్థానకవి తుదకు చెన్నరాష్ట్రాంధ్రాస్థాన కవి.

శ్రీ వెంకటశాస్త్రి, తనకూ తన కుటుంబమునకు ఎన్నోమారులు జబ్బులు చేయుగా, ఆరోగ్య కామేశ్వరి, ఆరోగ్య భాస్కరస్తవము,

మృత్యుంజయ స్తవమువంటి కావ్యములు చెప్పి వ్యాధి విముక్తులైరి. శ్రీ తిరుపతిశాస్త్రి జబ్బుచేసినప్పుడు సూర్యనారాయణ స్తవము రచించిరి గాని వారిని స్వామి యనుగ్రహింపకుండుటచే మృత్యువశులైరి.

శ్రీ వెంకటశాస్త్రి శరన్నవరాత్రములలో కామేశ్వరీపూజ యెన్నడు విడనాడలేదు. వారు మహాశివరాత్రినాడు అస్తమించుటయు వారి పుణ్య విశేషమునకు నిదర్శన మనవచ్చును.

మరి రెండు సంఘటనలుకూడ శ్రీ వెంకటశాస్త్రియందు పూర్వ పుణ్యమెంతగా ఫలితమునకు వచ్చినదో నిరూపించును.

ఒకటి శ్రీ శాస్త్రిగారి వివాహము. అది చిత్రముగా జరిగినది. అప్పు డాయనకు 19 సం. లు. బ్రహ్మగురువులు కిర్లంపూడి వార్షికమునకు వెళ్ళి నప్పుడు ఒక విధముగా గురువులే శ్రీ వెంకటశాస్త్రి వివాహము నిశ్చ యించి పెళ్ళి ఖర్చులకు జమీందారిణి బుచ్చి సీతమ్మగారిని చూడబోయి పరిచారికల అధినేత్రియగు కామాక్షి అమ్మగారి అనుజ్ఞతో ఈ శుభ కార్యము నేనే చేయించి పుణ్యముపొందెదననిచెప్పి, అట్లే రాణీగారి యనుజ్ఞపొంది ధనమంతయు వెనుదీయక వెచ్చించి తాను తరించితి ననెను. స్నాతకపు ఖర్చంతయు గురువులు వసతి చేయు తేజోమూర్తుల అన్నపూర్ణమ్మగారు భరించిరి. అది 1889 లో.

తర్వాత 1932 లో శ్రీ వెంకటశాస్త్రి గెద్దనాపల్లి వెళ్ళగా, అక్కడ శ్రీ పంతము సూర్యారావుశాస్త్రి గారిని పిలిచి బహూకరించి 'మీరు పూర్వ మెప్పుడో ఇక్కడ పెళ్ళిలో ఊరేగితిరట. అప్పటికి నేను పుట్టకుండుటచే చూడలేకపోతిని. ఇప్పుడూరేగించి చూతును' అని ఊరేగించెను

ఎంత పూర్వజన్మ పుణ్యము పండనిది ఇంత సర్వజనానురాగము పొందుట సాధ్యమౌను!

శ్రీతిరుపతి నిర్యాణమునకు విలపించుచు, 'నన్ను ఒంటరిగా విడిచి స్వర్గపురికి వెళ్ళినావు. అక్కడి ధీరులతో కలహము కలిగినప్పుడైనను నన్ను స్మరింపవా ?' అనిరి. సరిగా శ్రీనాథుడు, 'దివిజకవివరు గుండియల్ దిగ్గురనగ అరుగుచున్నాడు శ్రీనాథు డమరపురికి' అనట్లు

గానే, పురుష పుంగవుడైన ధర్మరాజుకే ఈ మానవదేహముండగా రాగద్వేష మలినమైన అజ్ఞానము వదలలేదు గదా, దిగ్విజయ యాత్రలతో జీవితము గడిపిన శ్రీనాథునికి, శ్రీ వెంకటశాస్త్రికి అట్టి అజ్ఞానము క్షంతవ్యమే.

స్వర్గసుఖము రాగద్వేషాలకు అతీతమైనదని గ్రహించిన పిమ్మటనే నిజమైన స్వర్గసుఖమనుభవించినాడు ధర్మరాజు. అది ఆయన సాధించిన విషయాలన్నిటికంటె సర్వోత్కృష్టమైన విజయము. శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల ఇష్ట దైవమైనకామేశ్వరి ఈ జంటకవులకట్టి రాగద్వేషాతీతమైన ఉత్కృష్ట విజయము స్వర్గములో ప్రసాదించుగాక !

(భారతి నవంబరు-1970, డిసెంబరు-1970, జనవరి-1971, ఫిబ్రవరి-1971)

# అరవై యేళ్ల ఆంధ్ర సాహిత్యంలో నిలిచేది

## కాలావధి నిర్ణయము

అరవై యేళ్ళు నిండితే షష్టి పూర్తి చేసుకుంటాము కదా! 1913 లోనే నవ్య కవిత్వమనేది ప్రత్యక్ష రూపంలో 'అభినవ కవితామండలి'తో ఆవిర్భవించినది. ఆ మండలి పక్షాన రాయప్రోలు సుబ్బారావు ఆ సంవత్సరమే 'తృణకంకణము', 'కష్ట కమల' ప్రచురించారు. 'తృణ కంకణము' పీఠికలో ప్రాచీన కవిత్వము మీద తిరుగుబాటు ప్రకటించి తన రచన 'భావగీతము' Lyric అని పేర్కొన్నారు.

బొంబాయినుండి ఆంధ్రవారపత్రిక చెన్నపట్టణము దినపత్రికగా చేరినది 1914 లో ఐనా, దానిని గూర్చిన విజ్ఞప్తి 9-4-1913 ప్రమాదీచ సంవత్సరాది సంచికలోనే పంతులుగారు ప్రకటించినారు. పత్రిక చెన్నపట్టణ యాత్ర ఆంధ్రుల చరిత్రలో నూతనాధ్యాయానికి అంకురారోపణ

1913 లోనే ప్రథమాంధ్ర మహాసభ బాపట్లలో సమావిష్టమైనది. 1913 లోనే శ్రీ గిడుగువారి 'నిజమైన సంప్రదాయము' వావిళ్ళవారు ప్రచురించినారు ఆప్పటికి రెండేళ్ళ క్రిందటనే శ్రీ చిలుకూరి వారి 'ఆంధ్రుల చరిత్ర' ప్రథమ భాగము ప్రకటింప బడినది

అట్లాగే 1911 లోనే ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల స్థాపింపబడి భారతీయ నవలల ఆంధ్రీకరణలు ప్రచురించసాగినా, ఆ గ్రంథాల వ్యాప్తి విస్తారమైనది 1913 నుంచే.

తిరుపతి వెంకటేశ్వరులకూ, కొప్పరపువారికి తగాదాలు 1911లోనే ప్రారంభమైనా, ఆ తగాదాల దుష్ఫలితాలతో పాటు, ఆంధ్ర లోకములో ఆంధ్ర కవిత్వాభిమానము సర్వ సాధారణమై కవితా రచనోత్సాహము ఉత్తుంగ తరంగరూపము ధరించినది 1913 నుంచే!

1913 కు కొద్దికాలము క్రిందటనే శ్రీ గురుజాడ వారి వ్యావహారిక భాషా కవితలు అరంభమైనవి.

ఈ వ్యావహారిక భాషా ప్రమాదమునుండి గ్రాంథిక భాషను తప్పించవలెనను ఉద్దేశముతో, ఆంధ్ర సాహిత్యము పరిషత్తు 1911 లో అవతరించి ప్రాచీనాంధ్ర గ్రంథ ప్రచురణకు ఎంతో దోహదము చేసినది. ఆం. సా. పరిషత్తు 1913 లోనే గుంటూరు కాలేజి హాలులో సమువేశము జరిపినది.ఆంధ్ర దేశములో అన్ని మూలలనుంచీ వచ్చిన ఆంధ్ర దేశ విద్వాంసులను, గ్రంథకర్తలను దర్శించే మహా భాగ్యము ఈ వ్యాసకర్తకు కలిగినది,ఆ సందర్భములోనే.

ఈ వ్యాసకర్తకు 13 సం.లు నిండి సాహిత్యంరుచి మరిగినది 1913 నుంచే. అందువల్ల కూడా ఈ అరవై ఏళ్ళ సాహిత్యంలో నిలిచేది స్మరించి అక్షర రూపమిచ్చి రసవ ద్రచనల మననముతో ధన్యత పొంద దలచినాడు.

## ప్రమాణ సూచన

సాహిత్యశాఖ లన్నిటిలో అగ్రగణ్యమైనది కవిత్వము. ఈ అరవై ఏళ్ళలో ఆంధ్రములో భావ కవిత్వము,ప్యూచరిస్టు కవిత్వము,అభ్యుదయ కవిత్వము, అధివాస్తవిక కవిత, వచన కవిత, దిగంబర కవిత్వము, విప్లవ కవిత్వము, జానపద కవిత్వము కొత్తకొత్త పుంతలు తొక్కినవి. ఐనా సంప్రదాయ కవిత్వము నూతన చైతన్యముతో నిశ్చలంగా సాగుతూనే ఉన్నది, దాని ఛాయ ఈ నూతన శాఖ లన్నిటిలోనూ రూఢంగానో, ప్రత్యక్షంగానో, హెచ్చుగానో, తగ్గుగానో అవహిస్తూనే ఉన్నది.

నాటికలు, నాటకాలు సహస్రాధికంగా పుట్టినవి. కథానిక ఎన్నెన్నో రూపాలు ధరించినది. నవల బహుముఖముగా విజృంభించినది. విమర్శ రంగము విస్తరించినది.

ఇన్ని శాఖలుగా విశేష వ్యాప్తి పొందిన ఆంధ్ర సాహిత్యంలో నాలుగు కాలాలపాటు నిలిచేది ఏది ? ఇది ఒకరి దృష్టితో తేలే విషయము కాదు. తమ తమ దేశాల రాజకీయ ప్రాబల్యమువల్లనూ, ఈ కాలపు

ప్రచార సాధనాలవల్లనూ సామాన్య జనంలోనే కాక కొంత బుద్ధిమంతులలో కూడా వ్యాప్తి పొందుతున్న సరికొత్త సిద్ధాంతాల కొలబద్దతోనూ తేలే విషయం కాదు. తాదాపు 3,000 సం.ల నుంచి నేటివరకూ నిలిచివున్న గ్రీసు సాహిత్య గ్రంథాలూ, 2.000 సం.ల పైకాలము నుంచీ నిలిచివున్న లాటిను గ్రంథాలూ, 600 సం ల నుంచీ నిలిచిన ఇటాలియను, స్పానిష గ్రంథాలూ, 600 సం.ల నుంచీ వున్న ఫ్రెంచి, ఇంగ్లీషు, జర్మను గ్రంథాలు, 300 సం.ల నుంచీ విజృంభించిన రష్యా సాహిత్యమూ, 150 సం.ల నుంచీ ప్రపంచాన్ని మింగుతున్న అమెరికను గ్రంథాలూ, ఎందుకు నిలుస్తున్నవి? సంస్కృతంలో కాల నిర్ణయము చేయ వీలులేని వేధాలూ, 2,000 సం.ల పై చిలుకు నిలిచిన రామాయణ భారతాలూ, 2,000 సం.ల లోపుగా పుట్టి నిలిచివున్న భాసకాళిదాసాది మహాకవుల గ్రంథాలూ ఎందుకు నిలిచినవి? తమిళములో 1600ల సం.ల నుంచీ, కన్నడంలో 1000 సం.ల నుంచి, ఆంధ్రంలో 900 సం.ల నుంచీ, నాలుగు ఐదు, ఆరు వందల సంవత్సరముల నుంచి వంగ, హిందీ, మరాటీ, మళయాళ, గుజరాతీ, ఒరియా మొదలయిన భారతీయ భాషలలో కొన్ని గ్రంథాలు ఎందుకు నిలిచినవి? అరబ్బీలో 1300 సం.ల నుంచీ, ఫారసీలో 900 సం.ల నుంచీ ఎట్లా నిలిచినవి? ఏ భాషలోనైనా మానవీయ గ్రంథాలుగా—క్లాసిక్సుగా ఎందుకు పరిగణింప బడతాయి? ఏ లక్షణాలు నాలుగు కాలాలపాటు నిలవడానికి దోహదించినవో భావన చేయడము న్యాయము గదా!

ఏ భాషలో రచన ఐనా నిలిచేందుకు ప్రధాన కారణము రసవత్తరము. దీనికి మన సంస్కృత లక్షణవేత్తల నిర్వచనాన్ని కొంత విస్తృతి చేయక తప్పదు. రసము, సాహిత్య సూత్రాలకు—ప్రాచీనమైనవైనా, ఆధునికమైనవైనా— కట్టువడదు.

ఐతే కవిచౌడప్ప శతకము పద్యాలలో పచ్చి బూతులు చేర్చినందుకే నిలిచినది. "లేడీచాటర్లీను లవరు' తత్తుల్యమైన కారణాల వల్లనే జగద్వ్యాప్తి పొంది వ్యామోహం కలిగించినది. రాధికా సాంత్వనాదులూ ఆ జాతివే. నేటి దిగంబర కవిత్వము కూడా అటువంటి కారణాలవల్లనే

నిలుస్తుందేమో చెప్పలేము. అట్లా ప్రత్యేక కారణాలవల్ల నిలిచేవి వాటి సాహిత్యగుణం వల్లకాదు కనుక అటువంటి వాటిని ఇందులో గ్రహింప దలచలేదు

నిలవడానికి సర్వసాధారణంగా కొన్ని లక్షణాలు ఉపకరిస్తవి. అట్టి వాటిలో లయ ఒకటి అందువల్ల వచనానికి కంటె ఛందోబద్ధమైన రచనలకే నిలిచేందుకు అవకాశమెక్కువ ఉన్నది లయ జ్ఞాపక ముంచు కోవడానికి, మళ్ళీ మళ్ళీ మననము చేయడానికీ అనుకూలిస్తుంది. అందు వల్ల ఇందులో పద్యకావ్యాలది ప్రథమ గణ్యత్వము వచ్చింది. కాదంబరి వంటి గద్య కావ్యాలు పుట్టలేదు కాని, పుట్టిఉంటే అటువంటి వాటిని పద్య కావ్యాలతోపాటే పరిగణించవలసి వచ్చేది.

ఏ రచనా ఐనా మరీ చిన్నదైతే, మనస్సుకు ఎక్కినా శాశ్వ తంగా సంపూర్ణతృప్తి నివ్వలేదు. ఈ కాలంలో మంచి ఖండకావ్యాలు ఎన్నో పుట్టినవి. వాటిని స్మరింపలేదు. చిన్న కథలు కూడా అంతే. ఇవన్నీ పూర్వమెప్పుడో ఎవరో చెప్పిన చాటువుల వంటివి. అవి నేటికీ నిలిచి ఉన్నమాట నిజమే. వాటిలో ఒక్క మెరుపు తళుక్కుమం టుంది. మెరుపుకు 'క్షణప్రభా' అన్న సార్థక నామ మున్నది.

అదేవిధంగా కావ్యము మరీ పెద్దదైనా నిలిచేగుణము ఉండడము కష్ట సాధ్యము. ఏ వాల్మీకియో వ్యాసుడో చేయి చేసుకుంటే తప్ప! ఈ కాలంలో ఆంధ్రదేశంలో వ్యాస వాల్మీకులు పుట్టలేదు.

ఈ అరవై యేళ్ళ సాహిత్యంలో నిలిచేది ఏది? చాలా కష్టమైన ప్రశ్న. ఏమి చెప్పినా దూషణతిరస్కారాలు కుప్ప తెప్పలుగా వస్తవని తెలిసే ఈ సాహసానికి ఒడిగట్టినాను. విమర్శ పరంపరకు మనస్సు చెడి పోయి ఆసుపత్రికి పోవలసిన దౌర్బల్యము లేదు. అన్యాయంగా విమ ర్శించినా విశ్వాసం కోల్పోయి మాట్లాడే దౌర్బల్యం కూడా లేదు. ఈ అరవై యేళ్ళబట్టీ ఆంధ్రము, సంస్కృతము, ప్రాకృతములలోనే కాక, గ్రీకు, లాటీను, ఇటాలియను, స్పానిషు, ఫ్రెంచి, ఆంగ్లము, జర్మను, రష్యను, ఫారసీ, అరబ్బీ, జాపనీసు— ఇత్యాది విదేశీయ భాషలలోనూ, వంగ, మహారాష్ట్ర, తమిళ, కన్నడ, హిందీ ఇత్యాది స్వదేశ భాషలలోనూ,

"క్లాసిక్సు" అని ప్రఖ్యాతిపొందినమహాగ్రంథాల స్వరూపము, ముఖ్యంగా ఆంగ్లానువాదాల ద్వారా తెలుసుకోడానికి తపనతోకూడిన ప్రయత్నము, తపస్సు— అండగా చూసుకొని ఈ సాహసానికి వ్యాసకర్త ఉపక్రమిస్తున్నాడు. కొన్ని ఆంధ్ర మహాగ్రంథాలు దృష్టిలో పడక తప్పిపోయి ఉండవచ్చు. విశాల హృదయులని భావించిన నలుగురు మిత్రులను జాబితాలు పంపుడని అర్థింపగా రెండు వచ్చినవి. ఇద్దరు ముగ్గురు సహృదయులతో సంప్రదించినాను. కొన్ని చేర్చడమా వద్దా అనే సందేహము కలిగినప్పుడు, వాటిని తీసి మళ్ళీ పఠించినాను. ఐదారు సంవత్సరాల నుంచీ ఈ విషయము మథనచేస్తూ సాహితీ మిత్రులను సంప్రదిస్తూ వచ్చినాను. ఐనా కొన్ని ఉద్గ్రంథాలు తప్పిపోయి ఉండవచ్చు, ఆ గ్రంథాలకూ గ్రంథకర్తలకూ క్షమాపణ చెప్పుకొని ఉపక్రమిస్తున్నాను.

ఐనా ఒకమనవి! ఇందులో వదిలినవి చూడవద్దు. చేర్చిన వాటిని చూసి అవి నిలిచేవని వ్యాసకర్తతో ఏకీభవిస్తే ధన్యుడు సందేహము కలిగితే ఆ గ్రంథాలు సంపాదించి జాగ్రత్తగా పఠింపుడని సహృదయులను వేడుకొంటున్నాను ఈ పరిగణనవల్ల ఆంధ్ర సాహిత్య క్షేత్రం ఈ అరవై ఏళ్ళలో ఎంత మంచి పంట పండించిందా అని తలచుకొని ఆనందించాను. ఈ ఉత్తమ కావ్యాల స్మరణ వ్యాసకర్తకు రెండు నెలల బట్టీ కలిగించిన ఆనంద మింతంత కాదు.

## పద్యకావ్యాలు

1913 సం. రము కాలపరిధిగా పెట్టుకొన్నందున గతశతాబ్దిలోనూ, ఈ శతాబ్ది ఆరంభంలోనూ భాషాసేవ చేసిన ఉద్దండ పండితులూ రచయితలూ ఇందులో రారు. శ్రీయుతులు వేదము వేంకటరాయశాస్త్రి, కందుకూరి, కొక్కొండ, ధర్మవరం కృష్ణమాచార్యులు, చిలకమర్తి, వావిలకొలను సుబ్బారావు, నాదెళ్ళ పురుషోత్తమకవి, గురజాడ అప్పారావు, వడ్డాది సుబ్బారాయుడు, జనమంచి శేషాద్రి శర్మగార్ల వంటివారు ఇందులో సకృత్తుగా తప్పరారు. వారి రచనలలో శ్రీ వేదమువారి ప్రతాపరుద్రీయము రాశపోయినందుకు ఎక్కువగానూ, శ్రీ గురజాడ కన్యాశుల్కము రానందుకు తక్కువగాను, విచారము కలిగినది. శ్రీ తిరుపతి

కవుల పాండవోద్యోగాలు కాల పరిధిని దాటవని భావించినాను. పాండవ విజయం ముందే వచ్చినా రెండిటి మిశ్రమము కాలపరిధిలోనే జరిగింది.

1913 లో ఆంధ్రోద్యమము విజృంభించి కవులను ఉద్రూత లూగించినది కొంత తర్వాతనే ఐనా శ్రీ విశ్వనాథ 'ఆంధ్ర ప్రశస్తి', 'ఆంధ్ర పౌరుషము', శ్రీ తుమ్మల 'రాష్ట్రగానము' వచ్చినవి. కాని ఆంధ్రాభిమానము కేవలం కవిత్వపు ముద్దగా రూపు కట్టినది. శ్రీ రాయ ప్రోలు సుబ్బారావు 'తెనుగు తోటలో'. అది ఆంధ్ర కవితా కన్యకు మేలు కొలుపు పాట. శ్రీ రాయ ప్రోలు భావ కవులలో అగ్రగణ్యుడు, నవ్యకవితా స్థాపకుడు. అది 1914లో వచ్చినది. అది చదివిన ప్రథమక్షణం నుండి నేటివరకూ వ్యాసకర్తకు మధుర స్మృతిగా నిలిచి ఉన్నది. శ్రీ రాయ ప్రోలు తొలి కావ్యాలలో "తెనుగుతోట" నిలుస్తుంది. ఆయన పరిణితుడైన కొద్దీ కవితాశక్తి క్షీణించ సాగినది. ఐనా పరిణితుడైన తర్వాత కొంత కావ్య లక్షణ సిద్ధాంతాలతో కలిసినా కావ్యరూపం పొందిన "రమ్యా లోకము" కూడా నిలుస్తుంది. ఆ రెండిటితో తేటగీతిలో కొత్తదీప్తి నిక్షే పించినారు.

దాదాపు 'తెనుగుతోట' పుట్టినప్పుడో, కొంచెము ముందుగానో పుట్టిన శ్రీ గురుజాడ 'పూర్ణమ్మ కథ' మధురమైనదే. కాని దాని కథా వస్తువు శ్రీ రాయప్రోలువారి "కష్ట కమల'లోవలె అన్ని కాలాలలో ఆక ట్టేదికాదు. కాబట్టి నిలిచే కావ్యకోటిలో చేర్చలేకున్నాను. ఐనా దానిలో ఉన్న వ్యావహారికాంధ్ర భాషా మాధుర్యము దాన్ని నిలిపే అవకాశ మున్నది.

ఈ యుగారంభంలో తేటగీతికి ఎక్కువ వ్యాప్తి కలిగినది. ఆ ఛందస్సులో కొత్త మాధుర్యము చూపడానికి తోడ్పడ్డవారిలో శ్రీ వెంకట పార్వతీశ్వరకవులు ముఖ్యులు. కాని వారు ద్విపదలో వ్రాసిన 'ఏకాంత సేవ' అపూర్వాద్భుతమైన ఆధ్యాత్మికానుభూతి కలసిన మధుర వాస నలతో గుబాళిస్తున్నది. "ఏకాంతసేవ" తప్పక నాలుగు కాలాలపాటు నిలుస్తుంది.

భావ కవులలో ముందు ప్రసిద్ధికి వచ్చినవారు శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రి, శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి. వారి కావ్యాలన్నీ ఖండకృతులు.

అవి ఎన్నో ఎంతో మధురమైనవైనా ముందుచేసిన నియమం ప్రకారము క్షణప్రభలు. శ్రీ దేవులపల్లి నాటికలు నిలిచేవి ఉన్నవి. వాటి ప్రస్తావన ఆ సందర్భంలో వస్తుంది.

శ్రీ శివశంకరుల "హృదయేశ్వరి", "వకుళమాలిక' తప్ప తక్కిన ఖండకావ్యాలన్నీ ఆ కోవలోనే కనుక వదిలివేయ బడినవి. 'హృదయేశ్వరి' ప్రపంచ ప్రసిద్ధమైన ప్రేమ కావ్యాలలో ఒకటిగా పరిగణింప వచ్చును. అందులో వకుళ వృక్షము తరుచుగా ప్రత్యక్ష మవుతుంది. "వకుళమాలిక' పగడపూవు ఎండినా వాసన బహుకాల ముంటుంది. వకుళ మాలిక కూడా కలకాల ముంటుంది. శ్రీ శివశంకరుల పద్యగేయ నాటికలు ఆ సందర్భంలో ప్రస్తావిస్తాము.

ఆ కాలంలోనే ఒక్క వెలుగు వెలిగి ఆరిపోయిన ఇద్దరు కవులున్నారు. చామర్తి రాజశేఖరరావు 23 సం.ల ఈడులోనే గతించినారు. అందువల్ల ఎక్కువ రచనలు ప్రచురించలేదు. ప్రచురించిన కొద్ది వాటిలో 'బృందావనము" అగ్రగణ్యము, అందులో కృష్ణరూపములో భారత నాయకాన్వేషణము చిత్రించినారు. శ్రీకృష్ణ కర్ణామృతము, భాగవతముల లోని మధుర భక్తికి నాయకాన్వేషణమనే నూతనశక్తి జోడింపబడినది. ప్రచారము లేక ఈ కావ్యము విమర్శకుల దృష్టికి తగినంతగా రాలేదు. ఆంధ్రులు 'బృందావనం' మరిచిపోతే, జాతిరత్నాన్ని ఒకదాన్ని - కోహినూరు వంటిదాన్ని పోగొట్టు కొన్నట్లు.

చామర్తివలెకాక శ్రీ కొడవటిగంటి వెంకటసుబ్బయ్య సరదాగా దేశాటన చేయడానికి చిన్నతనంలోనే లేచిపోయి మళ్ళీ కనిపింపలేదు. వెళ్ళుతూ "సంధ్యారాగము" అనే పేర కావ్యసంపుటి ప్రచురించినాడు సాహితీసమితి సభ్యులు అతని 'కళ్యాణి"ని ఎక్కువ ప్రశంసించేవాళ్ళు, కాని అతని భిక్షువు కలకాలము నిలుస్తుంది.

1924 ప్రాంతాలలో బందరు ప్రసిద్ధిముండి బయటపడి, ఆంధ్ర ప్రదేశ్ ప్రసిద్ధి సంపాదించి, నేడు జగత్ప్రసిద్ధుడైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఉన్నారు. ఆయన యౌవ్వనములో వ్రాసిన 'గిరికుమారుని ప్రేమగీతాలు' ఉన్నవి. అవి ఖండికలే ఐనా ఏక నాయికా నిష్ఠమైనవి

గనుక నాలుగు కాలాలపాటు నిలుస్తుంది. వారు తర్వాత వ్రాసిన వాటిలో 'శృంగారవీధి", "శశి దూతము" తప్పక కలకాలము నిలుస్తవి. మా దృష్టిలో "కల్పవృక్షము' మరీ పెద్దదైపోయినది. వ్యాస వాల్మీకుల శక్తి అధునికులకున్న దనడానికి మాకు సాహసము చాలదు. అదిగాక అది వాల్మీకికి వ్యాఖ్యానమంటున్నారు కవి. వ్యాఖ్యానాలు కావ్యాలు కావు కదా! దానికి జ్ఞానపీఠ పురస్కారము వచ్చినందుకు ఆనందమే, దాని విలువ లక్షరూపాయలు గనుక! 'కిన్నెరసాని పాటలు' సభాపరివ్యాప్తమైనవి. వారు సభలలో చదివేతీరులో ఆపాటల ఆకర్షణ మున్నది కాని కావ్యము కాదు. కనుక, వాటినినిలిచే కావ్యకోటిలో చేర్చలేదు.

శ్రీ విశ్వనాధకంటె ముందే కావ్యరచన ఆరంభించిన శ్రీ పింగళి, కాటూరికవులున్నారు. ముఖ్యంగా "కృష్ణాపత్రిక" ద్వారా వారి "సౌందర నందము" విస్తారవ్యాప్తి పొందినది. అందులో ఉండవలసిన బౌద్ధ వాతావరణము కంటె గాంధేయ వాతావరణముండడము ఔచిత్య భంగమని మాబోంట్ల సందేహము. కాని అటువంటి ఔచిత్య భంగాలు ప్రపంచ సాహిత్యాలలో కొత్తలుకావు. షేక్స్పియరు నాటకాల నిండా అట్టివి కానవస్తున్నవి. అది గాక అందులో పద్యరచన మధురంగా సాగింది. అందువల్ల 'సౌందరనందము" నిలిచే కావ్యాలలోది అనక తప్పడంలేదు.

మొదటి రోజులలో ప్రసిద్ధికి వచ్చిన కవులలో' బసవరాజు అప్పారావు శ్రీ గురజాడ అడుగు జాడలలో నడిచిన వాడంటారు. కాని నిజానికి శ్రీ బసవరాజు స్వచ్ఛమైన కవితాత్మగల స్వతంత్ర కవి. ఆయనకావ్యాలు మధురమైనపైనా ఖండికలు గనుక పరిగణించే వీలులేదు. వారు వినిపించగా విన్న "వాయుసందేశము" అనే దూతకావ్య ముండవలె. అది ఆంధ్రదేశంలో ప్రధాన ప్రదేశాలను వర్ణిస్తుంది. అది ఎంత ప్రయత్నించినా దొరకలేదని వారి కావ్యాలు ప్రచురించిన వారన్నారు. ఎన్నటికైనా దొరికితే అది నిలుస్తుంది. ఇట్లా అవాంతరకారణాల వల్ల నిలిచే కావ్యాలు కొన్ని పురిటిలోనె సందుగొట్టి పోవడము విచారకరము!

ఇక నండూరి సుబ్బారావుగారి ఎంకి పాటలు నిజానికి చాలా చిన్న ఖండికల చిన్న సంపుటి. ఐనా అన్నిటిలో అనుబంధంగా 'ఎంకి' ఉన్నది

గనుక 'అతి చిన్నది' అనలేము. దాన్ని నిలిచే వాటిలో పరిగణించక పోతే దాని అభిమానులు బ్రతుక నివ్వరు. అందులోని భాష జానపద భాష కాదనీ, కృతకంగా ఆ భాష అనిపించేట్లు మలచబడినదనీ మాబోంట్ల ధర్మ సందేహము. అందులో హృదయంగమమైన భావన లున్నవి కనుక నిలుస్తుంది. భాష ఏమైతే ఏమి?

శ్రీ కొడాలి సుబ్బారావు 'హంపీ క్షేత్రము'లో ఒకానొక చిత్రమైన మోటుదనముతో కలసిన శక్తి ఉన్నది. సరిగ్గా ఆయన శరీరానికే అది ప్రతిబింబము. అది నిలవడానికి దాని శక్తీ, వస్తుగౌరవమూ దోహదిస్తాయి.

శ్రీ విశ్వనాథ ప్రధాన మిత్రులలో ఒకరుగా అప్పట్లో ప్రసిద్ధి కెక్కిన శ్రీ నాయని సుబ్బారావు 'సౌభద్రుని ప్రణయ యాత్ర', 'మాతృ గీతాలు' నిలుస్తవి. ఆ రెండిటిలో ఎగుడు దిగుడు భాషతో హృదయ వేదనను వ్యక్తము చేసే సుకుమార గుణమున్నది. అవి నిలుస్తవి. 'వేయి పడగల'లో 'కిరీటి' పేరుతో సౌభద్రుని ప్రణయ యాత్రావృత్తాంతమే ఎక్కించ బడినదని జగద్విదితము!

ఎక్కువ వ్యాప్తి పొందక పోయినా, శ్రీ విశ్వనాథ వెంకటేశ్వర్లు 'కాళిందీ పరిణయము' నిలిచే కావ్యాలలో ఒకటి. అందులో కాళింది ప్రేమ అమృత మధురంగా ఉపాసనానుభవంతో, సుష్ఠువైన పద్యాలలో ప్రదర్శింప బడ్డది. ఆం. ప్ర సాహిత్య అకాడెమీ మొదటి సంవత్సరమే ఉత్తమ కావ్యంగా పరిగణించి బహూకరించింది.

ఆంధ్రాభిమానాన్ని పురస్కరించుకొని వచ్చిన శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారి 'ఆంధ్ర పురాణము' విస్తార వ్యాప్తి పొందినది. అందులో పద్య రచన ప్రౌఢమై నిర్దుష్టమైనది, ఐనా అందులో ఆంధ్రాభిమాన మున్నంతగా కవితాస్ఫూర్తి కనిపింప నందున నిలిచే వాటిలో చేర్చడం లేదు.

శ్రీ ఏటుకూరి రచనలలో కర్కశమైన మాధుర్యమున్నది. ఆయన 'మగువ మాంచాల' నిలుస్తుంది.

శ్రీ దువ్వూరి రామిరెడ్డి విస్తార సంస్కారమున్న కర్షక కవి. ఆయన 'కృషీవలుడు', 'వనకుమారి' నాలుగు కాలాల పాటు నిలుస్తవి. ఆయన మంచి కవి అనడానికి శ్రీ అక్కిరాజు ఉమాకాన్తంగారి తీవ్ర విమర్శకు గురి కావడమే పెద్ద తార్కాణ!

శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి మరి యొక అచ్చపు కృషీవల కవి. ఆయన వ్రాసినవి ఎక్కువ భాగము ఖండ కావ్యాలు. నిర్దుష్టమైన భాష. నిజాయితీగల హృదయం. అయన వ్రాసిన మహా కావ్యము 'బాపుజీ ఆత్మకథ'. అది భాషాంతరీకరణమై పోయినది. అనువాదసాహిత్యానికి ఈ వ్యాసంలో స్థానం లేదు.

శ్రీ చింతా దీక్షితులు చిత్రమైన కావ్య మొకటి వ్రాసినాడు. 'హనుమంతుని తోక'. 'హనుమంతుని కొక తోక ఉన్నదీ, అందమైన తోక' అని ప్రారంభించి రామాయణ కథ చాలా భాగం హనుమంతుని తోకతో నడిపించాడు. హనుమద్రామ చంద్ర భక్తి విస్తారమున్న ఆంధ్రంలో అది తప్పక కలకాల ముంటుంది.

ఈ మధ్య శ్రీ ఊటుకూరి సత్యనారాయణ 'ఉదయరేఖలు' అనే చిత్రమైన కావ్యము వచ్చినది. అందులో వచనము వ్యావహారిక భాష. పద్యాలు నిర్దుష్ట మనదగిన గ్రాంథికము. ఆ కావ్యంలో మహా భక్తుని ఆర్తి, వరాహస్వామి కిరణావళి ప్రత్యక్ష మవుతున్నవి. ఆ కావ్యం తప్పక నిలుస్తుంది.

శ్రీ మాన్ వానమామలై వరదాచార్యుల 'పోతన చరిత్ర' విస్తార ప్రచారము పొంది, ఆం. ప్ర. సాహిత్య అకాడెమీ బహుమతి పొందినది. ఈ వ్యాసకర్తకు దానిని శాంతముగా పఠించే అవకాశము కలుగ లేదు. శ్రీ వరదాచార్యులు శ్రావ్యంగా వినిపింపగా పలుమార్లు శ్రద్ధగా విన్నాడు. వారి పాఠ మాధుర్యానికి ముగ్ధుడనైతినా అనే సందేహ మొకమూల బాధిస్తూనే ఉన్నది. ఐనా అది చరిత్ర కాదు. పోతననుగూర్చి లోకంలో ప్రచారంలో ఉన్న పుక్కిటి పురాణాలకే రూపమిచ్చినది. పోతన మీద ఆంధ్ర పాఠకులకున్న అభిమానం వల్ల కూడా అది నిలుస్తుంది.

ఈ అరవై యేళ్ళలో ఆంధ్రాభిమానంతోపాటు జాతీయాభిమానం కూడా వెల్లివిరిసింది. కవులు ఆంధ్రవీరులనువదలి, రాజస్థానానికీ, మహారాష్ట్రానికి ప్రయాణాలుచేశారు. అట్టికావ్యాలలో శ్రీదుర్భా రాజశేఖరశతావధాని 'రాణాప్రతాపసింహ చరిత్ర' అగ్రగణ్యము. ఆ తర్వాత ఎన్నదగినది శ్రీ గడియారం వెంకటశేషశాస్త్రి' శివభారతము'. ఆ యిద్దరి మహావీరుల స్మరణే వాటిని ఎల్లకాలము నిలిచేట్లు చేస్తుంది.

శ్రీ జాషువా కవిత్వానికి అభిమానులు చాలామంది ఉన్నారు. ఆయన పద్యాలు ఎంతోసొగసుగా సాగుతూ అకస్మాత్తుగా అనుచిత శబ్ద ప్రయోగంతో కరకరలాడుతవని మాంబోట్ల బాధ! ఆ లక్షణమే ఆయన అభిమానులకు ప్రత్యేక మభిమానపాత్రమంటే రుచి భేదాన్ని తెలుపుతుంది. ఆయన అజన్మ క్రైస్తవుడు. క్రీస్తు ప్రభావంలో పుట్టి పెరిగినవాడు. ఆయన 'క్రీస్తు చరిత్ర' నేటికాలపు కవులు బుద్ధుని విశేషాలు తెలుసుకోకుండా, తమ తమ వూహలకొద్దీ వ్రాస్తున్న బుద్ధకావ్యాలవలె గాక, ఉచితమైన వాతావరణాన్ని చిత్రిస్తుందనడానికి సందేహములేదు. అది నిలుస్తుందనుకుంటాము. కేంద్ర సాహిత్య అకాడమీ బహూకృతి లభించడము ఈ అభిప్రాయానికి బలం చేకూరుస్తున్నది.

శ్రీ కవికొండల వెంకటరావు ఎన్నో కావ్యాలు, మంచివీ, సామాన్యపువీ వ్రాసినారు. వాటిలో 'శివరాత్రిప్రభ' తప్పక నిలుస్తుంది

శ్రీ మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి సభారంజన కోసము పద్యాలెన్నో వ్రాసి చదివి చదివి మెప్పులు పొంది, నిజమైన కవితాశక్తిని కుంఠితము చేసుకున్నాడు. పాపము! అయినా ఆయన 'పంచవటి' నిలుస్తుందనవచ్చు.

ఇంకా మరికొందరు 'సభారంజనకవు' లున్నారు. వారు వ్రాసిన కావ్యాలు నిలుస్తవనుకోము.

శ్రీ దాశరథి తీవ్రత కల కవులలో ఒకరు. ఆయన 'మహాబోధి' తప్ప తక్కినవి ఖండికలు. అందులో సిద్ధార్థుని మారధర్షణము, మహాబోధి, మూడు జాతక కథలూ ఏదో విధంగా కలిపి రచన చేసినాడు, అందులో నిలిచే లక్షణాలు కనబడలేదు.

శ్రీ నారాయణరెడ్డి మూడు దీర్ఘకావ్యాలు వ్రాసినాడు. 'నాగార్జున సాగరం', 'కర్పూర వసంతరాయలు', 'విశ్వనాథ నాయకుడు'. ఆయన అవ్యాంధ్రకవుల పోకడలన్నీ పఠనచేసి సిద్ధాంత గ్రంథంకూడా వ్రాసి నాడు. అభ్యుదయ కవులతోనూ వచనకవులతోనూ కవిత్వం కంటే శబ్దాల గారడీ ఎక్కువ ప్రచారంలోకి వచ్చింది. శ్రీ నారాయణరెడ్డి తెలిసి తెలిసి ప్రయత్నసంగా వాతావరణంలోని శబ్దచమత్కృతికి వశుడైపోవడం షావిదకరం. అయినా ఆయన 'నాగార్జున సాగరం' నిలుస్తుంది.

ఈ అరవై యేళ్ళలో కేవల కవిత్వంగా (Pure poetry) పుట్టిన విశిష్టకావ్యము శ్రీ పుట్టపర్తి నారాయణచార్యుల 'శివతాండవము'. అది ఆయన చదువుతుంటే బాగుంటుందంటారు. ఈ మధ్య వినడం తటస్థిం చింది. కాని విన్నప్పటికంటే కూడా శాంతంగా చదువుకున్నప్పుడే ఎక్కువ ఆనందం కలిగించింది. అది ఈ అరవైయేళ్ళ ఆంధ్రకవుల తపస్సులో నుంచి పుట్టిన ఉత్తమోత్తమ కావ్యాలలో ఒకటి దానికి బహుకాలము నిలిచేశక్తి ఉన్నది.

ఇతర కవులూ, అభిమానులూ, వారి వారి గ్రంథాలను పొరపాటున వదిలినందుకు మన్నిస్తారు గాని, వచన కవితా కవులు, శ్రీశ్రీ అభిమా నులూ అట్లా ఊరుకోరు గనుక వాళ్ళను గూర్చి 'చేదుసత్యం' వ్రాయడ మవసర మనిపించింది.

ముందు శ్రీశ్రీ: ఆయన ముందు భావకవిగా శ్రీ రాయప్రోలును అబ్బూరిని అనుకరించి 'ప్రభవ' ప్రచురించినాడు. ఈ వ్యాసకర్తకు ఒక కాపీ బహూకరించినాడు కూడాను. తర్వాత కొన్నాళ్ళకు 'మహాప్రస్థాన' గీతముతో 'ఎర్రబావుటాధగధగలు' మెరిపించి, అభ్యుదయ కవిగా అవతరించి సామ్యవాదుల ప్రచారంతో మహాకవిగా చలామణి ఐనాడు. ద్వితీయ మహాసంగ్రామంలో, రష్యా యుద్ధంలోకి దిగకముందే, బ్రిటిషు వారిసైన్యంలో చేరి కొన్నాళ్ళు ఉండి ఎందువల్లనో తిరిగి వచ్చినాడు. ఆ తర్వాత బ్రిటిషువారు దెబ్బలు తింటున్న రోజులలో భారతదేశాన్ని జోకొట్టడానికి చేపట్టిన కార్యక్రమంలో చేరి 'నటాళీబృందము' అనే పేరు గల కన్యకల బృందంచేత గేయనాటిక ఒకటి ఆడిస్తూ, దేశ పర్యటన

చేశాడు. ఘా రేవల్లెలో జరిగిన ప్రదర్శనమూ, ప్రేక్షకుల గోలా, ఇంకా జ్ఞాపకమున్నవి ఆ బ్రిటిషువారు ఆడుతున్న నాటకం మీద అసహ్యం వల్ల ఈ వ్యాసకర్త వెళ్ళదలచక పోయినా, మిత్రుడు శ్రీశ్రీ అభ్యర్థన వల్ల వెళ్ళవలసి వచ్చింది. గోలను శాంతింప చేయడానికి రంగస్థలం మీదికి ఎక్కడం కూడా తప్పలేదు.

ఆ తర్వాత అధివాస్తవికత 'Surrealism' అనే పడమటి గాలి చేపట్టి కొన్ని అధివాస్తవిక రచనలు చేశాడు. తర్వాత రష్యా వెళ్ళి వచ్చి రష్యాను ఆకాశానికెత్తడంతో పత్రికలలో పెద్దగాలి దుమారం రేగింది. దానితోజబ్బుపడ్డంత అవస్థపడగా, ఆసుపత్రిలో15 రోజులు చికిత్స పొంది నాడు అభ్యుదయ కవిగా ప్రచారము పొందుతున్నందున ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ విశిష్టసభ్యునిగా ఎన్నుకున్నది. అందుకు అంగీకరించి, శాలువ మెడలుతోపాటు ప్రశంస అందుకుని సంవత్సరం తిరుగకుండానే రాజీనామా చేశాడు. అవసరానికి సినిమాపాటలు వ్రాసిప్రస్తుతం సంపన్నుడైనట్లు తెలుస్తుంది. ఇంతలో షష్టిపూర్తి సందర్భంగా దాదాపు నూరు సంఘాలు సమ్మానం తలపెట్టగా అంగీకరించి హైదరాబాదుకు వచ్చినాడు. ఈ మధ్యలో 'జనధర్మ' వారు ఆయనను ఇంటర్వ్యూచేసి, ఆయనకు మార్క్సిజము సుష్ఠుగాతెలియదనితేల్చివేసినారు. అంతటితోఅంగీకరించిన సమ్మానాలన్నీ ఒక్కపెట్టున నిరాకరించి, అభ్యుదయ కవితకు విడాకులిచ్చి ఆ అర్ధరాత్రికే 'విప్లవ రచయితల సంఘము' స్థాపించి దానికి అధ్యక్షుడైనాడు. ఈ మధ్య దానికి కూడా రాజీనామా చేసిన వార్తలు వచ్చినవి. గత సంవత్సరం కేంద్ర సాహిత్య అకాడమీ ఆయన గ్రంథానికి బహుమతి ఇచ్చిన సందర్భంలో కూడా గొడవ ఏదో జరిగినట్లు వార్తలు వచ్చినవి.

ఇదీ శ్రీ శ్రీ పబ్లికు జీవితము. ఆయన కవిత! ఎప్పటి కప్పుడు సరికొత్త మార్గంలో చిత్రరచన చేయడమే ఆయన ధ్యేయము. ఆధునికులలో పూర్వాంధ్ర గ్రంథాలు క్షుణ్ణంగా చదివి భాష మీద అధికారం సంపాదించిన కొద్ది మందిలో ఆయన ఒకడు పాశ్చాత్యులలో నవీన మార్గాలు తొక్కేవారిని గూర్చి నిరంతర పరిశోధన చేస్తూ ఉంటాడు. అన్నిటికీ

తోడు అసమాన ప్రతిభాశాలి ఐన నారాయణదాసుగారు హరికథలలో నిక్షేపించిన అపూర్వమైనట్టి నడకలను ఎన్నిటినో స్వాయత్తం చేసుకున్నాడు. ఆంధ్రభాష మైనమువలె ఆయన చేతికి స్వాధీనమై ఉంటుంది. ఇట్లా నడకలో, భాషలో, భావములో చిత్రము చూపడము అభ్యసించి సిద్ధహస్తుడైన మేధావి. అందు వల్లనే ఆయన కవితలో చిత్రకవితా స్థాయిని ఎన్నడూ దాట లేక పోతున్నాడు. అటువంటి నూతన చిత్రకవితా ప్రక్రియకు ప్రతీకలుగా రెండు గీతాలు ఆయనవి నిలుస్తవి. ఒకటి 'మహాప్రస్థాన' గీతము. రెండవది ఏదో వెండితెర చిత్రానికి వ్రాసిన హనుమంతుణ్ణి లేవమనే గేయము.

ఇక వచన కవులున్నారు, వారు వ్రాసినవి చాలా భాగము ఖండికలు కనుక గ్రహించే వీలు లేదు. సకృత్తుగా శ్రీ ఆరుద్ర, శ్రీ కుందుర్తి దీర్ఘ రచనలు చేసినారు. అవి నిలిచే స్థాయికి చేర లేదు. కవితా వస్తువును మననము చేయడమూ, ఆత్మలో అవలోడనము చేయడము వారికింకా అభ్యస్తము కాలేదు. భాషను ఎట్లా వాడవలె, అంత్యాను ప్రాసలు ఎట్లా కూర్చవలె, వచనత్వము ఎట్లా విరచవలె, అనే బాహ్యదృష్టి కంటె లోతుకు పోలేకున్నారు. వారికి నేటి ప్రపంచపు తీరుల మీద కలుగుతున్న వేదన బహిర్ముఖులను మాత్రమే చేయ గలుగు తున్నది. ఏదో విధమైన సమాధి దశ సాధిస్తే తప్ప రచనకు నిలిచే శక్తి ఉండదు. ఆ సమాధి తరుచుగా లోపిస్తున్నందువల్లనే జగత్ప్రసిద్ధుడే గాక, అనితర సాధారణ ప్రతిభాశాలి ఐన శ్రీ విశ్వనాథ రచనలనే ఎన్నిటినో ఇందులో గ్రహించ లేక పోతున్నాము. ఈ బహిర్ముఖత్వము ఈ కాలపు ధర్మమై కవితను ధ్వంసం చేస్తున్నది.

## నాటికలు నాటకాలు

నాటకము గాని నాటిక కాని మరీ పెద్దది కాదు, మరీ చిన్నదీ కాదు. కనుక అవి నిలిచేందుకు ఎక్కువ అవకాశమున్నది. అంతేకాక ప్రపంచ సాహిత్యంలో నాటకానికి అత్యున్నత స్థానమున్నది. ఆంధ్రములో గద్య నాటకాలు, పద్యగద్య మిశ్రితమైనవీ, కేవల గేయ పద్య నాటకాలు కూడా వచ్చినవి. అన్నిటినీ ఏక ముఖంగా విచారిద్దాము.

ఆంధ్రలో రంగస్థలం మీద ఆకర్షించి విశేషప్రశస్తి పొందిన నాటకా లెన్నో ఉన్నవి. వాటిలో చాలా భాగము నటీ నటుల ప్రజ్ఞవల్లనూ, ప్రేక్షకుల అల్పస్థాయి రుచివల్లనూ, ప్రసిద్ధికి వచ్చినవే కాని స్థాయివల్ల కాదు. ఐనా సాహిత్యస్థాయి కూడా ఉన్నవీ, సాహిత్యస్థాయి మాత్రమే ఉన్నవీ నాటికలు నాటకాలూ రాకపోలేదు అట్టివి నిలుస్తవి.

ముందు పేర్కొన దగినది శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల పాండవో ద్యోగాలు. ఇందులో అభిప్రాయ భేదముండదు. నిర్ణయించిన కాల పరిధి అందులో ఉన్నందున అవి స్వీకృతమైనవి.

తర్వాత పేర్కొన దగినది శ్రీ పానుగంటి వారి 'రాధాకృష్ణ'.

శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంత కవి ఎన్నో నాటకాలు వ్రాశారు. వాటిలో 'సత్యహరిశ్చంద్ర' కలకాలము నిలుస్తుంది.

శ్రీ విశ్వనాథ 'నర్తనశాల', 'వేనరాజు' రంగప్రదర్శనకు ఉద్దే శించి వ్రాసినారు. కాని వారి 'అనార్కలి' రచనకు అట్టి ఉద్దేశమున్నట్లు తోచదు. మొగలు యువరాజు సలీమును ప్రేమించి అతని ప్రేమ పొందిన టానిసకన్య విషాద గాథ అది. అనార్కలిని గూర్చి తెలుగులో కావ్యనాటకాలు ఎన్నో వ్రాసినారు. కాని శ్రీ విశ్వనాథ దానిని అపూర్వ మనోజ్ఞ కవితాస్థాయి ఆద్యంతము నిల్పినట్లు నిల్పినవారు లేరు. ఆ 'దానిమ్మ పువ్వు' శ్రీ విశ్వనాథ రచనా మహాసముద్రంలో వెలసిన అనర్ఘ రత్నము అందులో పద్యాలు, గేయాలు రకరకాలుగా నడిచి కాళిదాసు విక్రమోర్వశీయము చతుర్థాంకాన్ని స్మరణకు తెస్తున్నవి. దాని అను కరణ కాదు. శ్రీ విశ్వనాథ 'అనార్కలి' కి ఎన్నటికీ క్షతిలేదని ఘంటా పథంగా ఉద్ఘోషించ వచ్చును.

శ్రీ శివశంకరుల సంస్కృతి, కవితా శక్తి ముఖ్యంగా వారి పద్య గేయనాటికలలో మూర్తిభవించినది. వాటిలో ముఖ్యంగా 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి', 'దీక్షిత దుహిత', 'కవిప్రియ' స్థిరంగానిలుస్తవి. వాటిలో మొదటి రెండూ రంగస్థలం మీదకూడా విజయవంతంగా ప్రదర్శింపబడ్డవి.

శ్రీ దేవులపల్లి పరిణత దశలో ఆయన కవితాత్మ రేడియో నాటిక లలో రూపొందినది. వాటిలో 'శర్మిష్ఠ' కవితా శక్తికీ, 'ధనుర్దాసు' భక్తికీ అగ్రశ్రేణిలో పేర్కొనవలె. గ్రంథ రూపంగా ప్రచురిస్తే అవి చిరస్థాయిగా ఉంటవి.

శ్రీ చింతా దీక్షితులు 'శబరి' ఈ యుగంలో పుట్టిన భక్తి నాటకా లలో అద్వితీయమైనది. శబరి, హనుమంతుడు ఇందులో నూతన వ్యక్తిత్వముతో ప్రత్యక్ష మవుతారు. అది తప్పక నిలిచే నాటకము. ఆయన 'చక్రవాక మిథునము' కూడా నిలుస్తుంది. అది మనోజ్ఞ కల్పన గల మధుర నాటిక. గోదావరి వరదవల్ల వేరైన చక్రవాక మిథునము ఒక్కరాత్రి పడ్డ విరహ బాధను అది ప్రదర్శిస్తుంది.

శ్రీ చలం 'భానుమతి' స్వతంత్రమైన కల్పన. శ్రీ బుచ్చిబాబు 'శిష్య రక్షిత' ఆధ్యాత్మభావన మీద కామ విజయము చిత్రిస్తుంది. శ్రీ రాజమన్నారు 'నిష్ఫలం' వేశ్యలలో వసంతసేన లున్నారని నిరూపిస్తుంది. ఇవి మూడూ నిలుస్తవి.

శ్రీ జి. వి. కృష్ణారావు 'భిక్షాపాత్ర' వ్యాసుని కాశీ నిష్కాసన కథను ఆధునిక దృక్పథంతో ప్రదర్శించే శక్తిమంతమైన నాటిక. శ్రీ మొదలి సుబ్రహ్మణ్య శర్మ 'విధి నిర్వహణము' అద్వితీయమైన మంచి నాటిక, ఆ రెండూ నిలుస్తవి.

శ్రీ శ్రీనివాస శిరోమణి 'పరివర్తనము' అశోకుని మనః పరివర్తనము సమర్థతతో చిత్రించిన మంచి నాటిక. అది నిలుస్తుంది.

శ్రీ వావిలాల సోమయాజులు 'నాయకురాలు' బహు ప్రదేశాలలో బహు పర్యాయాలు విజయవంతంగా ప్రదర్శింపబడ్డ నాటకము. దానికి సాహిత్యస్థాయి కూడా ఉన్నది. అది నిలుస్తుంది.

శ్రీ నోరి వ్రాసిన గేయ నాటికలలో 'షణ్ణవతి' ఆద్యంతము భక్తి, విరక్తి, ధర్మరక్తి, కవితా శక్తితో కలిసిన మంచి నాటిక. ఆయన 'సుహృత్సౌదామము' కుచేల భక్తిని భాగవత కథకు విరుద్ధంగాని నూతన దృక్పథంతో ప్రదర్శించే స్వతంత్ర నాటకము. ఆయన 'పూజాపనము'

పుష్పాలలోని పుణ్యగంధమూ, తేజస్సూ ప్రదర్శించి, భారతీయ భక్త కవులనే కాక ప్రపంచ భక్త కవుల నందరినీ పూజావనంలో అవతరింప చేసి, తుదకు పాపాత్ములకు కూడా భగవంతుని అపారకరుణా సముద్రంలో స్థానమిచ్చిన పుణ్య నాటిక. ఆధ్యాత్మిక భావనలు ఆంధ్ర దేశంలో పూర్తిగా విస్మృతము లయ్యే దాకా ఆ మూడు నాటికలూ నిలుస్తవి.

సహాయ నిరాకరణోద్యమంతో పుట్టి ఆనాడు జనాన్ని ఉర్రూత లూగించిన నాటకాలెన్నో ఉన్నవి. వాటికి సాహిత్య స్థాయి లేదు. వాటి ప్రయోజనము తీరింది గనుక వాటి విషయస్మరణ మాత్ర ముంటుంది. శ్రీ మల్లాది విశ్వనాథ కవిరాజు, ఆయన కుమారుడు శ్రీ అవధాని వ్రాసిన నాటిక లెన్నో ఉన్నవి. ఇద్దరికీ రంగస్థలానుభవమూ, సంభాషణ నడిపేశక్తి అద్వితీయంగా ఉన్నవి. తండ్రిగారి 'డొంకలోషరాబు' 'దొంగనాటకం' 'రాజీ' నిలుస్తవి. శ్రీ అవధాని నాటికలలో రెండు నాటికలు 30 సం. నుంచీ ఈ వ్యాసకర్త దృక్పథంలో ఉన్నవి. ఒకటి దుర్గా భక్తురాలు దుర్గావిగ్రహం నాశనం కాకుండా. దండెత్తి వచ్చిన ముసల్మాను సేనానికి తన్ను అర్పించుకున్న నాటిక. రెండవది ఇటలీ దేశంలో సన్యాసినిగా మారిన ప్రియురాలి కోసం పరితపించే ప్రేమికుని నాటిక. వ్యాసకర్త నిల్వచేసిన వాటిలో కనబడ లేదు. శ్రీ పి. యస్. ఆర్. అప్పారావుగారి గ్రంథంలోగాని, శ్రీనివాస చక్రవర్తిగారి గ్రంథంలోగాని వెదకినా కనబడ లేదు. అని మళ్ళీ ప్రచురిస్తే నిలుస్తవి. లేకుంటే ఈ వ్యాసకర్త జీవిత కాలము మధురస్మృతులుగా నిలుస్తవి. వాటి పేర్లు జ్ఞాపకం రావడం లేదు.

శ్రీ దువ్వూరి రామిరెడ్డి 'కుంభరాణా' నిలుస్తుంది. శ్రీ నార్ల వెంకటేశ్వరరావు 'పైపంట' నిలుస్తుంది.

నేటి తరం కవులలో పద్యగేయ నాటికలు ఎన్నో వ్రాసినవారు శ్రీ నారాయణరెడ్డి. వారి రచనలలో శబ్ద చమత్కారము ఆకర్షించినంతగా కవితాస్థాయి గాని నాటకీయత గాని ఆకర్షించదు. కేవల గేయ నాటిక కాదు కాని వారి 'రామప్ప గుడి' వస్తు గౌరవం వల్లనూ, దానికి వచ్చిన అధిక ప్రచారము వల్లనూ నిలవ వచ్చు.

ఎన్నో నాటకాలూ పద్యగేయ నృత్య నాటకాలు వ్రాసిన శ్రీబోయి భీమన్న ఉన్నాడు. ఆయనకు రచనా శిల్పము తక్కువ. ఐనా ఆయన భావనలకి ఒకానొక ప్రాకృతికమైన elemental- పటుత్వమున్నది. ఆయన 'మానవుని మరొక మజిలీ' మోటుగా చెప్పిన మానవాభ్యుదయ చరిత్ర. ఆ గేయనాటకం నిస్సంశయంగా నిలుస్తుంది.

బౌద్ధాన్ని చిత్రించ వలెనని ప్రయత్నాలు చాలా జరిగినవి కాని సాధించినవి అల్ప సంఖ్యాకాలు. వాటిలో బౌద్ధము క్షీణదశను చక్కగా చిత్రించిన చాలామంచి నాటకము శ్రీఆమంచర్ల గోపాలరావు 'విశ్వంతర'. దానికి కేంద్ర బహూకృతి కూడా లభించింది. అది నిలుస్తుంది.

శ్రీ రాయప్రోలు సుబ్బారావు 'రూపనవనీతము' అనే నాటకము వ్రాసినట్లు తెలిసిన వారు కొద్ది మంది. చదివిన వారికి అందులోని కవితా వచన రచన వెగటు పుట్టిస్తుంది. ఐనా దానిలోని భావన. రూప చిత్రణా విశిష్టమూ హృదయంగమము ఐనవి. అది నిలవ దగినది.

## 5. నవలలు

నవల లున్నవి. మరీ పెద్దవని తోసివేద్దా మంటే నవల రచనా పతనము అతిశయించిన ఈ రోజులలో ఆ పని కుదరదు.

ముందు ప్రస్తావించ దగినది శ్రీ ఉన్నవ వారి 'మాలపల్లె'. దానిలో ఉన్న 3 భాగాలలో మొదటి దానిలోనే ప్రాణమున్నది. అది మాత్రము నిలుస్తుంది.

నవలలకు ఎన్నో సంస్థలు బహుమతు లిస్తున్నవి. ఆం. ప్ర. సాహిత్య అకాడెమీ బహుమతులు పొందిన వాటిలో శ్రీ మహీధర రామ మోహనరావు 'కొల్లాయి గట్టితేనేమి', శ్రీ దాశరథి రంగచార్యుల 'చిల్లర దేవుళ్ళు' నిలు స్తవి. తెలుగు భాషా సమితి బహుమానము పొందిన వాటిలో శ్రీ కొమ్మూరి వేణుగోపాలరావు "పెంకుటిల్లు" కూడా నిలుస్తుంది. తక్కినవి చేర్చనందుకు వ్యాసకర్తకు పక్షపాత మారోపించే వీలులేదు. ఆ రెండు సంస్థలూ బహూకరించిన తన 'కవి సార్వభౌముడు' 'నారాయణ భట్టు' కూడా తీసి వేసినాడు గనుక!

ఆంధ్ర విశ్వ విద్యాలయము మొదట శ్రీ విశ్వనాథ 'వేయి పడగల'కు శ్రీ బాపిరాజు 'నారాయణరావు'కు బహుమతి పంచినది. వాళ్ళ పేర్లు చూచి అని తోస్తుంది. 'వేయి పడగల'తో 'నారాయణరావు' సాటి రానేరాదు. ఐనా 'వేయి పడగలు' మరీ పెద్దదై కర్తకు అలవి తప్పి పోయినది. అందులో మూల భావము చాలా అద్భుతమైనది, నవలలో వైవిధ్యమెంతో ఉన్నది. ఐనా ఎన్నో భాగాలలో అది పత్రిక రిపోర్టు స్థాయికి దిగజారి పోయింది. కాబట్టి దాన్ని నిలిచేదిగా గ్రహించడం లేదు.

అయితే శ్రీ విశ్వనాథ నవలలో 'మా బాబు' కలకాలము నిలుస్తుంది. శ్రీ బాపిరాజు నవలలలో 'హిమ బిందు' ఉత్తమమైనది. అది నిలుస్తుంది. శ్రీ బాపిరాజుకు భావనాబల మున్నంతగా భాషాబలం లేదు. ఆ లోపము హిమబిందులో మాత్రం కనబడదు. ఎక్కువగా దాని భాషను శ్రీ కురుగంటి సీతారామయ్యగారు పరిష్కరించినట్లు తెలియవచ్చినది.

శ్రీ నోరి నవలలలో 'మల్లారెడ్డి'లో ఆత్మీయత మూర్తీభవించింది. ఆంధ్రదేశము నాయక విహీనమై శ్మశాన సదృశంగా ఉన్న సమయంలో సామాన్య జనంలోనుంచి మహాదాయకులు ఉత్పన్నమై, ఆంధ్ర దేశాన్ని ఉద్ధరించిన పుణ్య కథ కాబట్టి నిలుస్తుంది. ఈ మధ్య వ్రాసిన 'ధూర్జటి' కూడా నిలుస్తుంది- అందులో మహా భక్తుడు కాలుజారి నిలదొక్కుకోవడమూ, శ్రీ కృష్ణదేవరాయల అవసాన దశా ప్రదర్శింపబడ్డవి కాబట్టి. అతని 'కర్పూర ద్వీపయాత్ర' జన్మాంతరాల స్వరూపం నిరూపించేది కనుక నిలవ వచ్చు!

శ్రీ కేతవరపు వెంకటశాస్త్రిగారి నవలలలో 'ఇచ్ఛినీకుమారి' అశోకుని పాలనకు సంబంధించినది. చాలా మంచిది. అది నిలుస్తుంది.

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారి నవలలలో 'వడ్లగింజలు' అద్భుతమైనది. అది నిలిచేవాటి కోవలోనిది.

ఈ కాలంలో పుట్టిన నవలల్లో చాలా శక్తిమంతమైనది శ్రీ తెన్నేటి సూరి 'చెంఘిజ్‌ఖాన్'. అది తప్పక నిలుస్తుంది.

ఇంకా ఇతర నవలలో శ్రీ జి. వి. కృష్ణారావు 'కీలు బొమ్మలు' నేటి గ్రామీణ జీవితంలో ఆదర్శజీవులు ఎట్లా అగచాట్ల పాలవుతారో అనుభవంతో సరసంగా చిత్రించిన మంచి నవల. కోర్టు వ్యవహారాలు చెప్పడంలో చిన్న పొరపాట్లున్నా అది నిలుస్తుంది.

ఇంకా ఏవేవో వాదాలూ, పద్ధతులూ పాశ్చాత్యులవద్ద నుంచి ఎరువు తెచ్చుకొని వ్రాసిన నవలలు, కొన్నివచ్చినవి. అవి ఆయా భావాలతోనే అంతరిస్తవి.

కాని శ్రీ గోపీచంద్ ఆ భావాలన్నీ తెలిపినవాడైనా, బుద్ధిమంతుడు గనుక వాటికి లొంగిపోయి అమ్ముడు పోలేదు. ముఖ్యంగా ఆయన 'చీకటి గదులు' స్వానుభవంవల్ల, బహుశః తన కుటుంబాన్నే, మనస్సులో ఉంచుకొని వ్రాసిన మంచి నవల. ఆయన తండ్రిగారు శ్రీ రామస్వామి చౌదరి 'కృష్ణస్వామి' గోపీచంద్ 'గోపాలం' ఐనారు. ఆ నవల బుద్ధిమంతుల ఆలోచనలను ప్రేరేపిస్తుంది. అది నిలుస్తుంది.

నవలా రచయిత్రులలో శ్రీమతి హేమలత వ్రాసిన 'మోహనవంశి' నిలుస్తుంది.

## 6. పెద్ద కథలు

నవలలు మరీ పెద్దవని తోసివేసే వీలులేక పోయింది కాని చిన్న కథలు, కథానికలు-ఖండ కావ్యాలవలె మరీ చిన్నవి కాబట్టి పూర్ణ తృప్తిని ఇయ్యలేవు గనుక వాటిని పరిగణనలోకి తీసుకోవడం లేదు. కాని పెద్ద కథలు అనదగినవి అట్లా కాదు. వాటిని నిలిచే వాటిలో గణించక తప్పదు.

ఈ పెద్దకథలనుండి, కథా గుచ్ఛాలనుండి, వాటిలో అగ్రగణ్యమైనవి శ్రీ మునిమాణిక్యంగారి 'కాంతం కథలు' నిలుస్తవి.

శ్రీ మొక్కపాటి బారిస్టరు పార్వతీశం ప్రథమ భాగము కూడా పెద్ద కథ వంటిదే. అదీ నిలుస్తుంది.

శ్రీ బుచ్చిబాబు 'మేడ మెట్లు' కథన నైపుణ్యంకల మంచి పెద్ద కథ. నిలుస్తుంది.

డా. నేలటూరి వెంకట రమణయ్యగారు చాలా మంచి పెద్ద కథలు వ్రాశారు. వాటిలో ముఖ్యంగా రాయల అవసాన కాలానికి సంబంధించి నది 'పశ్చాత్తాపము'. తప్పక నిలుస్తుంది. అట్లాగే 'మధుమావతి' కూడాను. ఓరుగల్లు మీద జునాఖాన్ దండయాత్రను చిత్రించేది.

శ్రీ అడివి బాపిరాజు 'భోగీర లోయ', 'బొమ్మల రాణి', 'నాగలి' చాలా మంచి కథలు. అవి నిలుస్తవి.

ఫెయిరీ కథ అనేది జానపదులలో నుంచి పుట్టుతుంది. రచయితలు సామాన్యంగా వ్రాయలేరు. ఆండర్సన్ మాత్రము కొన్ని చాలా మంచివి వ్రాశాడు. మన చింతా దీక్షితులుగారు కూడా కొన్ని వ్రాశారు. వాటిలో 'లీలా సుందరి' తప్పక నిలిచే అద్భుతమైన కథ. దాని వచనము పద్యమువలె నడిచింది. అది కొత్తగా వచ్చిన రోజులలో, మా పిల్లలు చదివి పేజీలకు పేజీలు సరదాగా కంఠపాఠం చేశారు లీలా ప్రాయంగా!

ఈ వ్యాసకర్త వ్రాసిన 'వధూసర' అనే పెద్ద కథ కూడా నిలుస్తుందనే ఆశ ఉన్నది. అది వేదకాలమనేదాన్ని చిత్రించడానికి ప్రయత్నించింది.

శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి 'కథలు-గాథలు' పెద్ద కథ లనవచ్చు. విమర్శలనవచ్చు. ఏ శాఖ కిందికి వచ్చినా అవి నిలుస్తవి.

శ్రీ మల్లాది రామకృష్ణ శాస్త్రిగారివి అన్నీ చిన్నకథలై పోయినవి. అట్లాగే శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిని కూడాను. అందువల్ల గ్రహించ వీలులేక పోయినది.

## 7. విమర్శలు

ఆంధ్రభాషలో విమర్శ గ్రంథాలు రాలేదనడం పరిపాటి. కాని ఎన్నో మంచివి వచ్చినవి. వాటిని పట్టించుకోక రాలేదంటారు.

ఈ కోవలో శాస్త్ర విషయాలు ఉన్నవున్నట్లు విశదంగా ప్రదర్శించే గ్రంథాలు చేర్చదలచలేదు. శ్రీ దివాకర్ల వెంకటావధాని 'సాహిత్య సోపానాలు' తప్ప. దాని తేటదనము విశిష్టమైనది.

దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఎన్నో అమూల్యమైన వ్యాసాలు వ్రాశారు. సంవత్సరాది సంచికలకు వారు వ్రాసిన 'ప్రస్తావనము' లన్నీ ఆయా సంవత్సరాల సర్వతోముఖ చరిత్రకు ఉపయోగిస్తాయి. ఐనా వారు వ్రాసిన రెండు వ్యాసాలు ఎన్నటికీ నిలిచేవి ఉన్నవి. అందులో ఒకటి వారు బసవ పురాణానికి వ్రాసిన పీఠిక. అది వారి సూక్ష్మ దృష్టికీ, మత సమన్వయ దక్షతకూ మచ్చుతునకయై కలకాలము నిలుస్తుంది. ఇక వారు విజ్ఞాన సర్వస్వములో వ్రాసిన 'అజంతా చిత్రములు' అనే వ్యాసము వారి విస్తార గ్రంథ పఠనానికీ, వాటి ప్రధాన విషయాలు సమగ్రంగా క్రోడీకరించే నేర్పుకూ, విశాల హృదయానికీ ప్రతీకగా ఉండి కలకాలము నిలుస్తుంది.

అపసిద్ధాంతాలు చెప్పినా ఆత్మవిశ్వాసంతో, ఆత్మీయతతో వ్రాసిన గ్రంథాలు మాత్రమే చేర్చ దలచినాము ఆత్మీయతలో ప్రాణముంటుంది కనుక!

ఇట్లా అప సిద్ధాంతాలతో నిండిఉన్నా, ఆత్మ విశ్వాసమూ, అహంభావమూ, అధికార గర్వాంధ్యమూ (అంతకంటె సరసమైన మాట దొరక లేదు) చురుకైన భాషలో ప్రదర్శించే గ్రంథము శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి[1] 'కవిత్వతత్వ విచారము'. అది నిలుస్తుంది. ఇది కేవల పాశ్చాత్య దృష్టితో ఆంధ్ర ప్రబంధాలను విమర్శించే శక్తి మంతమైన గ్రంథము.

శ్రీ అక్కిరాజు ఉమాకాన్తంగారి 'నేటి కాలపు కవిత్వము' మరొక తప్పుడు కోణమునుంచి నవ్య కవిత్వాన్ని దుయ్యబట్టినది. గ్రంథకర్త దేహాన్ని ఆవేశించి ఉండిన అజీర్ణ వ్యాధి, కావ్య రస జీర్ణానికికూడా అడ్డు వచ్చింది. ఆయనకు నేటి కవులలోనే కాదు నన్నయనుండి నేటిదాకా ఆంధ్ర కవులలో కవిత్వమేకాక, ఆంధ్ర పండితులలో పాండిత్యం కూడా కనిపింప లేదు. సంస్కృతాలంకారికుల గ్రంథాలు కొంత చదివినందున సంక్రమించిన మరొక రకమైన ఆంధ్యము. పైగా దానిశైలి పూర్వ పక్ష సిద్ధాంతాలు చేసే భాష్య రచనా పద్ధతిలో డాంబిక ధోరణిలో సాగింది.

(1) ఆయన అప్పుడు ఆంధ్ర విశ్వ విద్యాలయం ఉపాధ్యాయులు.

ఆయనకు వాల్మీకి కాళిదాసు తప్ప లోకంలో కవులే కనిపించరు. పైగా వాల్మీకియే,

'శక్య మంజరిభిః పాతుం వాతాః కేతకి గంధినః' అని ఎంతో మధురంగా చెప్పినది మరచి పోయి అట్టివి నేటి కవులలో చూపి, దానికి 'పులుముడు' అనే పేరు పెట్టి దోషంగా పరగణించారు. ఆయన ఆ గ్రంథ రచన చేసిన రోజులలో ఆంధ్ర దేశమంతా పర్యటనచేసి గ్రంథ భాగాలు వినిపించారు. ఆయన అభిమానులు దాన్ని బ్రదికించడానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా బ్రదుకదు. ఆంధ్రులు కవిత్వ తత్వ విచారంలో ఆంధ్రకవులను తిట్టిన తిట్టైనా సహిస్తారు కాని దీనిలోని సర్వ నాశకత్వము సహించరు.

శ్రీ కురుగంటి సీతారామయ్యగారి 'నవ్యాంధ్ర సాహిత్య వీధులు' ప్రథమ ముద్రణము, మధ్యమధ్య కొద్ది అనౌచిత్యాలు చోటుచేసుకున్నా, ప్రాణమున్న గ్రంథము. దానిని ద్వితీయ ముద్రణములో సమగ్రం చేయవలెనని వారి అల్లుడు శ్రీ పిల్లలమర్రి చేసిన పరిశ్రమ వల్ల దానిలో ఉన్న ప్రాణం పోయి ఊరుకున్నది. మొదటి గ్రంథం మళ్ళీ ముద్రిస్తే నాలుగు కాలాల పాటు నిలుస్తుంది.

శ్రీ ఆరుద్ర 'సమగ్రాంధ్ర సాహిత్యం'లో శ్రీ కురుగంటి వారి సాహిత్య వీధుల్లోని జీవము మధ్యమధ్య కనిపిస్తుంది. కాని దాని సమగ్రత్వ ప్రయత్నంలో ఆ కాస్త ప్రాణం వూపిరాడక ఉక్కిరి బిక్కిరై పోతున్నది.

శ్రీ విశ్వనాథ 'కావ్య పరిమళము' నిలుస్తుంది. అది పాఠకులను మరీ బడిపిల్లలనుగా చేయడము చిరాకు తెప్పిస్తుంది. అయితే ఆయన అర్థము చెప్పడంలో చేసిన తప్పులు చూచి నవ్వాడు 'ఓహో ఇదా కారణ' మనిపిస్తుంది. ఉదా: ధూర్జటి పద్యంలో (పే. 180) 'ఖండపరశువు' అంటే 'శివుడు' అని సాఫీగా అర్థం చెప్పే బదులు గొడ్డలిముక్క అని అర్థం చెప్పుకొని అవస్థపడ్డారు. స్వానుభవంవల్ల ఎవరైనా చిన్న మాటల అర్థంలో కూడా తనవలెనే పొరపడవచ్చుననే భావంతో అర్థవివరణ చేస్తారని సమర్థించుకుంటాము. గ్రంథమంతటా మన పూర్వకవుల కావ్యాల

లోని అపూర్వ పరిమళాలు అత్తరుగా చేసి అందించారు గనుక తప్పక నిలుస్తుంది.

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారికి పాండిత్యముతోపాటు రసజ్ఞతా శక్తిగల శైలీ ఉన్నవి. మధ్య మధ్య హాస్యము తళుక్కు మంటుంది. ప్రతిపక్షుల వాదము వెర్రివాదముగా ప్రదర్శించడములో నిగ్రహముతో కూడిన నేర్పు ఉన్నది. వారి 'రాయలనాటి రసికత' శైలికీ, హాస్యానికీ 'రంగనాథరామాయణము' 'ఆంధ్ర వాఙ్మయమున నాచన సోమనాథుని స్థానము' అనే రెండువ్యాసాలు వాదపటిమకూ ఉదాహరణాలు. ఆ మూడు వ్యాసాలే కాక, వారి 'నాచన సోమనాథుని నవీనగుణములు', 'నిగమశర్మ' సూక్ష్మ పరిశీలనకు ప్రత్యక్ష నిదర్శనాలుగా కలకాలం నిలవ గలవు.

శ్రీ తిరుమల రామచంద్ర సంస్కృతాంధ్రాలలోనే కాక అనేక భాషలలో గాఢ పరిచయమున్నవారు. అటువంటివారు ఆంధ్ర దేశంలో అరుదు. ఈ సువిస్తార విజ్ఞానానికి తోడుగా సావధానత ఉంటే ఎంతో రాణించేది. ఆయన పత్రికా విలేఖరి కావడము అందుకు అడ్డువస్తూ ఉంటుంది. ఐనా 'సాహితి సుగతుని స్వగతం'లో ఎన్నోమంచి వ్యాసాలున్నవి. 'నేటి సాహిత్య విమర్శ', 'దేసీ నామ మాలలోని మరికొన్ని పదాలు', 'నాయని వారి ప్రణయ సూక్తం', 'పద కవితా పితామహుడు', 'ఆఫ్రికా సాహిత్యంలో కల్పనలు', 'అమరావతి ఆదర్శంగా దిద్దుకున్న ఆగ్నేయాసియా' వంటి మంచి వ్యాసాలున్నవి కనుక నిలుస్తుంది. దానికి ఆం ప్ర. సా. అకాడమీ బహుమతి కూడా లభించినది. వారి 'నుడీ-నానుడీ' కూడా వారు చూపిన విశేషాలకూ, తొందరలో పడే పొరపాట్లకూ నిదర్శనమై నిలవవచ్చు.

స్వర్గీయ సురవరం ప్రతాపరెడ్డి గారి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' కలకాలం నిలిచే పుస్తకం.

శృంగార గ్రంథమాల వారు ప్రచురించిన 'క్రీడాభిరామము'నకు శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాసిన విపుల పీఠిక కలకాలం నిలుస్తుంది. మనము బూతు పద్యాలనుకునే పద్యాలు ఎన్నో, అందులో

పెద్దలవి క్రోడీకరించి సమర్థించారు. దానికి జవాబుగా వచ్చిన శ్రీ బులుసు పాపయ్యశాస్త్రిగారి "శ్రీనాథుడు శృంగారియా' కూడా నిలుస్తుంది. అవి రెండూ తూర్పు పడమరలవలె ఎడముఖంగా ఉంటవి.

ప్రతి సంవత్సరమూ ఆం. ప్ర. సాహిత్య అకాడమీ రెండు విషయాలు ముందు ప్రకటించి వాటిమీద వచ్చే ఉత్తమ గ్రంథాలకు రు. 2,000- లు బహుమతి ఇస్తున్నది. ఈ సం. నుంచీ రు. 3,500- లకు పెంచినది. అట్లా బహుమతులు పొందిన గ్రంథాలలో ముఖ్యంగా నాలుగు గ్రంథాలు నిలుస్తవి. వాటి వస్తు గౌరవమువల్లనూ, రచనా విశిష్టత వల్లనూ, వాటిలో ప్రదర్శించిన ఆత్మీయతవల్లనూ। శ్రీ వేదము వేంకట రాయశాస్త్రి (మనమడు) రచించిన 'నన్నెచోడుని కవిత్వము' అపూర్వమైన గ్రంథము. 1957-58 లో బహుమతి పొందినది. సాహిత్య విమర్శకులు తగినంతగా దానిని పట్టించుకొనక పోవుట విచారకరము. ఈ వ్యాస కర్త ఈ మధ్యనే దానిని పఠించి ఇన్నాళ్ళూ చదువనందుకు విచారపడినాడు. 2. శ్రీ జి. నాగయ్యగారి 'తెలుగు కావ్యాలలో అవతారికలు' (1966-67) 3. కుమారి పండా శమంతకమణి 'తెలుగు సాహిత్యములో రామకథ' (1969-70) 4. కుమారి ఎం. యస్. ఆర్. ప్రమీలాదేవి 'తెలుగులో పద్యగేయనాటికలు' (1971-72).

ఈ వ్యాసం వ్రాస్తున్నట్లు తెలిసి ఒక యువమిత్రుడు 'అతివినయానికి పోయి మీ రచనలు వదలబోకంది' అని వ్రాసినాడు. ఆయన సలహా పాటించి ఈ వ్యాసం కూడా నిలిచేవాటిలో చేర్చదలచినాను.

## 8. ఆత్మ కథలు

ఆత్మకథలలో శ్రీ టంగుటూరి ప్రకాశంగారి 'నా జీవితయాత్ర' నిలుస్తుంది.

దరిశి చెంచయ్యగారి ఆత్మకథ (పేరు జ్ఞాపకం లేదు) 'నేను-నాదేశం' శ్రీ కె కె సుబ్రహ్మణ్యం, కరేడు వ్రాసిన కార్డు 13-3-74 నిలుస్తుంది. అది ప్రథమ మహాసంగ్రామకాలంలో ఆయన విప్లవకారులలో చేరి జర్మనీపక్షాన గూఢచారిగా ఉన్ననాటి అనుభవాలను వర్ణిస్తుంది. అది అపూర్వాద్భుతమైనది. మాసపత్రికలో ధారావాహికంగా వచ్చినది.

శ్రీ తాపీ ధర్మారావుగారి 'కొత్తపాళీ' ఆత్మకథవంటిదే. అందులోని తీవ్రభాషవల్ల నిలవవచ్చు.

శ్రీ శివశంకరుల 'నాలోమార్పు' నిలిచే వాటిలో చేర్చడం లేదు, అందులో తీవ్రత లేదు గనుక!

## 9. శాస్త్ర గ్రంథాలు

శాస్త్ర గ్రంథము- అందులో వ్యాకరణానికి సంబంధించినది సాహిత్యకోటిలో పరిగణించి నిలుస్తుందంటే నమ్మడము సాధ్యంకాదు. కాని శ్రీ దువ్వూరి వెంకటరమణ శాస్త్రిగారి 'రమణీయము' అటువంటి కమనీయ గ్రంథము. నిలిచి తీరుతుంది

శ్రీ వేమరాజు భానుమూర్తి 'సైన్సుకథ' కూడా సాహిత్య గ్రంథంగా నిలుస్తుంది ఆద్యంతము చదువుతుంటే ఇంకా చదవ బుద్ధి పుట్టుతుంది

శ్రీ వసంతరావు వెంకటరావుగారి 'విశ్వ రహస్యం' కూడా నిలుస్తుంది. విజ్ఞానశాస్త్ర విషయాలను భావనా ప్రపంచంలోకి తీసుకొని వచ్చింది కనుక!

## 10. సిద్ధాంత గ్రంథాలు

మన మూడు విశ్వవిద్యాలయాలలో అధ్యాపకులు వ్రాస్తున్న థెసెస్సులు ఎన్నో ఉన్నవి. అవి విమర్శకు దోహదం చేస్తవి. భావి కాలంలో విషయావగాహనకు ఎంతో ఉపయోగపడతవి. అవి పెద్ద చిన్న గ్రంథాలయాలలో పండితుల పరిశీలనకు అవసరం కాబట్టి తప్పక నిలవ ఉంటవి. వాటి ధ్యేయము ఆత్మీయత కాక అనాత్మీయత. అవి సిద్ధము చేసేప్పుడు కాబోయే పరీక్షాధికారుల భావాలకు అనుగుణంగా మలచబడు తున్న వనేది బహిరంగ రహస్యము, అవి చాలా అవసరమైన గ్రంథ ములు. ప్రయోజనకరమైనవి కూడాను అవి తప్పక గ్రంథాలయాలలో నిలవ ఉంటవి. కాని అటువంటి నిలవ ఉండడము నిలవడమైతే, వస్తు ప్రదర్శన శాలలో లక్షల సంవత్సరాలనాటి జీవకోటుల అవశేషాలు కూడా నిలిచి ఉన్నవనే అనుకోవలసి వస్తుంది వాటిలో ఆత్మీయత లేనందున

వాటికి సాహిత్యస్థాయిలేదు. వాటికి ఒక నమస్కారం చేసి వదిలి వేస్తు న్నాను.

ఈ అరవై యేళ్ళలో ఆంధ్రభాషలో ఇంత మంచి సాహిత్యం పుట్టినదని వినియైనా గర్విస్తే ఈ వ్యాసకర్త ధన్యుడవుతాడు ఉత్తమ సారస్వతస్మరణవల్ల ఈ వ్యాసకర్తకు కలిగిన ఆనందము ఇంతంత కాదు. ఆ ఆనందమే ఆంధ్రులంతా అనుభవించవలెనని ఈ వ్యాసకర్త ఆకాంక్ష! ఈవ్యాసం వ్రాస్తున్న రెండు నెలలలో ఈ గ్రంథాలను మళ్ళీమళ్ళీ చదవవలసి వచ్చినది. అన్నిటిలో ఎక్కువ ఆనందం కలిగించినది శ్రీ విశ్వనాథ 'అనార్కలి'. నిజానికి దానిమ్మ పువ్వుకు రంగూ రూపమేకాని సువాసన లేదు. 'పువ్వు దానిమ్మ' అనేది ఉన్నదని చాలా మందికి తెలియక పోవచ్చు. అది కాయ కాయదు. సువాసన ఎక్కువ ఉండదు. దాని రంగూ. ఆకారము అపూర్వమైనవి. ఈ వ్యాసకర్తకు పొరుగింటిలో బాల్యములో చూచిన ఆ పువ్వులు ఇంత వరకూ మరపురాలేదు. వృక్షము మామూలు దానిమ్మ వలనే ఉంటుంది. కాయగాయు పువ్వు దానిమ్మ పువ్వుకు ఇతర పుష్పాలవాసనలన్నీ ఆరోపించి అద్భుతరచన చేశారు!

(స్వర్ణోత్సవ పంచిక భారతి జనవరి-1974 ఫిబ్రవరి- 1974 మార్చి-1974)

# ఉత్తమాది కావ్యభేదములు

రత్నము కూడ నొక రాయియే. తెలియనివారి కది గాజు పూస వలెనే యుండును. సామాన్య జనులను గాని, ఎన్నో ఇతర విధముల బుద్ధిమంతులై లోకజ్ఞానము శాస్త్రజ్ఞానము కల జనులనుగాని ఆకర్షించి నంత మాత్రము చేతనే రాయియు, గాజుపూసయు రత్నమన జెల్లదు. రత్న పరీక్షలో సమర్థత కల తద్విదుని నిర్ణయమే రత్నత్వమునకు ప్రమాణము!

కావ్య పరీక్ష కూడ రత్నపరీక్షవంటిదే యని మాబోంట్ల నిశ్చ యము! అనేక విధములగు కావ్యముల మథనమును, సాహిత్య వేత్తల ఆశయముల విచారణయు కావ్య పరీక్షకు అధికారి నొనర్చును. అట్టి యధికారము కలవారిని నేడు మన మంగీకరింపక పోవచ్చు. దేశ స్వాతంత్ర్యమునకై బహుకాలము పోరాడి నూతనముగా స్వాతంత్ర్యము సంపాదించిన దినములలో అన్ని విషయములలో స్వాతంత్ర్య నినాదా ములచే గలుగు మైమరపు సహజము. ప్రతివాడును ఏమి తలచుట కైనను స్వాతంత్ర్యము కలిగి యుండవచ్చును గాని చెప్పుట కంత స్వాతంత్ర్య మున్నదని తలచరాదు. రాజ్యభారము వహించు మంత్రీ శ్వరులను, రాజ్య విచ్ఛేధము చేయ నుత్సహించు విప్లవకారులను కావ్య సూత్రములు నేడు నిర్వచించుట చూచుచున్నాము. అట్టివారెవరైనను వారి ప్రభుత్వాద్యవసరములకు అంగముగా, సాధనముగా మాత్రమే కావ్యస్వరూపము వారు భావించుచున్నారు. అంతే గాని రత్నపరీక్ష కులకుగాని, కావ్యవైజ్ఞానికులకు గాని తుల్యమగు దృష్టితో వారు భావన చేయుట లేదు. అట్టివారి మాటలకు తాత్కాలికముగా ఎంతటి ప్రచార మైన నుండవచ్చును. కాని వాని విలువ మాత్రము శూన్యము

రత్నముల క్రయవిక్రయములలో విశేషధనము చేతులు మారును. ఆ ధనము విలువ తెలిసియుంటచేనైనను జనులు రత్న పరీక్ష

కుల నిర్ణయ మాశింతురు. కాని ముద్రణము వచ్చిన పిమ్మట ఎట్టి ఉత్తమ కావ్య ప్రతియైనను స్వల్పమూల్య మిచ్చికొని చదువవచ్చును గదా! ఆ స్వల్పమూల్యము వెచ్చించినవాడు దానిని గూర్చి అడిగినను, అడుగకున్నను తన అభిప్రాయమును వెల్లడించును. అట్లు వెల్లడింప సాహసించువారి సంఖ్య ఎక్కువగుచున్న కొలదియు విమర్శకమ్మన్యుల సంఖ్యయు పెరుగుచున్నది. అట్టివారిని బుద్ధిలో నుంచుకొని ఈ విచారణకు ఉపక్రమించుటలేదు.

## 2

పాశ్చాత్య దేశములలో విమర్శ గ్రంథములు అసంఖ్యాకములుగా ఉన్నవి. వానిని స్థూలముగా మూడు విధములుగా విభజింప వచ్చును. అందులో అగ్రగణ్యములు సౌందర్యతత్త్వ గ్రంథములు (Aesthetic). అవి ఆ దేశములలో విచారణలో కుశలురగు విద్వాంసులు వ్రాసినవి. కావ్యము, శిల్పము, చిత్రరచన– ఇత్యాదుల కన్నిటికిని మూలమగు సౌందర్యతత్త్వ మన్వేషించు గ్రంథము లవి. మరి రెండవవి సాహిత్య శాస్త్రమునకు (Rhetoric) సంబంధించినవి. వానిలో కావ్యభేదములు, లక్షణములు, గుణదోషములు వివరింపబడి యుండును. ఈ గ్రంథములు తత్త్వవేత్తలు కాకున్నను బహుకావ్యవేత్తలు వ్రాసినవి. ఇక మూడవ తరగతికి చెందినవి సామాన్య విమర్శ గ్రంథములు. ఇందులో సౌందర్య తత్త్వమును తెలుసుకొని బహుకావ్యానుభవము కలిగి ప్రత్యేక కావ్యములను చక్కగా విచారణచేయు గ్రంథముల వద్దనుండి తోచిన దెల్ల– అసందర్భములతోసహా– వ్రాయు గ్రంథములవరకు, అన్ని రకములును ఉన్నవి.

పాశ్చాత్యులు కావ్యస్వరూపము తెలిసికొనుట కెన్నియో విధముల ప్రయత్నించిరి. వారి కృషి యెంతయు ప్రశంసాపాత్రమే. కాని వారి తత్త్వవిచారణ గ్రంథములలోకంటె వారు తత్త్వమని నిర్ధారణ చేసిన దానిని కావ్యముల కన్వయించుటలో ఎక్కువ సమర్థత గోచరించును. కల్లోలములతో పొంగిపొరలు నీ లోకములోని కష్టసుఖములు పూర్తిగా అనుభవించి తుష్టి నొంది దాని కలవరముల నుండి మాత్రము విరమించి

శాంతముతో తపోవనములలో తత్త్వ చింతనతో చరమకాలము గడప వలెనను నాదర్శము ఆదేశములలో మధ్యమధ్య ఎప్పుడోగాని తల ఎత్తలేదు. అందుచే భరతఖండ వాసులకు తత్త్వవిచారణ చేయుటలో గల సమర్థతయు, అందుకు గల అవకాశమును వారలకు లేకపోయినది. మన దేశములో ప్రతిశాస్త్రమునకును ఋషులే మూలపురుషులు. సాహిత్య సూత్రములకు కూడ ప్రథముడు కాకున్నను ప్రధాన పురుషుడు భరత ఋషియే.

తత్త్వచింతనలో అసమానులగు ప్రాచీన భారతీయ సాహిత్య వేత్తలు కావ్యాత్మ ననేకవిధముల భావించిరి. కాని అందెల్ల ప్రబల మైనదికావ్యాత్మ రసమను మతమే. ఈ రసవాదమును వారు మిక్కిలి విపు లీకరించిరి. ఈ రసస్వరూపము పాశ్చాత్యతత్త్వ వేత్తలకును, సాహిత్య వేత్తలకును, విమర్శకులకును అచుంబిత విషయము. అందుచే పాశ్చా త్యులు కావ్యాత్మ విచారణలో దానితత్త్వము సరిహద్దులుకూడ చూడజాల రైరనుట అతిశయోక్తి కానే కాదు

మా కింత పూజ్యభావము గల భారతీయ సాహిత్యవేత్తలలో కొందరు చేయుచువచ్చిన కావ్యపరీక్షా సూత్రములను గూర్చియే ఈ విచారణ ప్రారంభించినాము.

# 3

సాహిత్య గ్రంథములలో కావ్యముల ననేక విధముల విభజించిరి. ఒకటి శ్రవ్యదృశ్య భేదము. మరియొకటి మహాకావ్య ఉపకావ్యాది భేదము. వీనిలోని ఉపశాఖ లెన్నియేని కలవు. కాని ఆ విభాగము లన్నియు మన కిందు ప్రస్తుతములు కావు. కావ్యముల నన్నిటిని సామా న్యముగా ఉత్తమ మధ్యమాధమములని వారొక విభజన చేసిరి. దానినే విచారింతము.

మమ్మటుడు కావ్యప్రకాశములో నిట్లుచెప్పెను:"కావ్యములలో దేని యందు వాచ్యము నతిశయించు వ్యంగ్యము కలదో అది 'ధ్వని' యను ఉత్తమ కావ్యము; అట్లు అతిశయించని గుణీభూత వ్యంగ్యము మధ్యమ కావ్యము; అవ్యంగ్యమైన శబ్దచిత్రము అవరమగు కావ్యము."

ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకములో నిట్లనెను: "వ్యంగ్యార్థము ప్రధానమైనచో నది ధ్వని యను కావ్యప్రకార మగును; గుణ భావము పొందినప్పుడు గుణీభూత వ్యంగ్య మగును; అట్లుగాక రస భావాది తాత్పర్యరహితమై వ్యంగ్యార్థ విశేషప్రకాశనశూన్యమై కేవల వాచ్య వాచక వైచిత్ర్యమాత్రాశ్రయమై కూర్చబడి ఆలేఖ్య ప్రఖ్యమైనది చిత్ర మను కావ్యము."

విశ్వనాథుడు సాహిత్యదర్పణములో నిట్లు చెప్పెను: "కావ్యము ధ్వని, గుణీభూతవ్యంగ్యము అని ద్వివిధము". ఆ పిమ్మట వాని స్వరూ పము కావ్యప్రకాశకారుని వలెనే వర్ణించెను. తుదకు కొందరు చిత్రాఖ్య మగు కావ్యభేద మున్నదనిరని చెప్పుచు ధ్వన్యాలోకము నుదహరించి వ్యంగ్యము లేనే లేనిచో దానికి కావ్యతత్వమే ఉండదనియు, క్షుద్ర మగుటచే అనాస్వాద్యమనియు నిర్వచించెను.

ఆంధ్రులకు ఆదరపాత్రమైన విద్యానాథుని ప్రతాపరుద్రీయములో నిట్లున్నది: "వ్యంగ్యము ప్రధానమైనచో ధ్వనియను ఉత్తమకావ్యము; వ్యంగ్యము అప్రధానమైనచో గుణీభూతవ్యంగ్యమను మధ్యమ కావ్యము, వ్యంగ్యము అస్ఫుటమైనచో చిత్రమను అధమ కావ్యము అగుచున్నవి."

జగన్నాథుడు రసగంగాధరములో కావ్యభేదములు చెప్పుచు నిట్ల నెను: "ఉత్తమోత్తమము, ఉత్తమము, మధ్యమము, అధమము అని కావ్యములు నాలుగు విధములు. ఎందు శబ్దార్థములు గుణీభావితాత్మలు కలవై ఒకానొక యర్థమును అభివ్యక్తము చేయునో అది యందులో మొదటిది. ఎందు వ్యంగ్యము అప్రదానమై చమత్కార కారణమగునో అది రెండవది. ఎందు వంగ్య చమత్కారముతో సమానముగా వాచ్య చమత్కారముండదో అది తృతీయము. ఎందు శబ్దచమత్కృతి ప్రధా నమై అర్థచమత్కారముచే ఉపస్కరింపబడుచుండునో అది అధమమగు నాల్గవది."

ఇట్లు ఎన్ని చేసినను వ్యంగ్యమును బట్టి చేసిన విభాగములే అన్నియు. ప్రతాపరుద్రీయములోని విభాగము ప్రకారము వ్యంగ్యము

వరుసగా ఉత్తమము మధ్యమము, అధమము, అను మూడు కావ్యములు వచ్చుచున్నవి. మరల ధ్వని బహువిధములు, గుణీభూత వ్యంగ్యము పలు తెరగులు. చిత్రము అర్థచిత్రము, శబ్ద చిత్రము అని రెండు ప్రధాన విధములు.

ఈ విధముగా సూత్రప్రాయముగా వారు కావ్యముల విలువ కనుగొను విధానము నిర్ణయించినారు. అందుకు నిదానభూతమైనది వ్యంగ్యము. వారంతటితో నాగలేదు. వ్యంగ్యమున ఏదో అవ్యక్తమై అర్థముకాని, అర్థములేని అభావముగా తెలియనివారు తలచునట్టిది కాక, వైయాకరుణులచే నంగీకరింపబడి శబ్దశక్తిచే వచ్చు నొకా నొక అపూర్వసద్భావమే అను నిశ్చయముతో ధ్వనిభేదములు, గుణీభూత వ్యంగ్య భేదములు వారెంతో ఓపికగా వివరించి ఉదహరణము లిచ్చి విశదీకరించినారు. అట్లే అర్థాలంకారములు, శబ్దాలంకారములు విస్తరించినారు. ఇన్నవ ఛందస్సులో ఇన్నివృత్తములున్నవని గణితముచే ప్రస్తరించినట్లే, సాహిత్య దర్పణకారుడు ధ్వని భేదములు యాభైయొక్కటిగా విభజించి మరల నవియే సాంకర్యముచే 5,308 ను, సంసృష్టిచే 5, 355ను అగునని నిర్వచించినాడు ధ్వనికారుడు అవి అనంతములే అని పలికినాడు.

ఇంత శ్రద్ధగా మన సాహిత్యవేత్తలు ధ్వనిప్రాధాన్యము చెప్పి భేదములు చూపి ఉదాహరణములతో సమన్వయపరిచిరి.

## 4

కాని పాశ్చాత్యవిమర్శకుల వాసనతో మన సాహిత్య గ్రంథములు తిలకించు మాబోంట్లకు ఒక్క సందేహము పొడగట్టును. కావ్యము ఉత్తమ మగుటకు వ్యంగ్యప్రధానముగా నుండవలెను గదా! ధ్వని కావ్యములే ఉత్తమ కావ్యములు కదా! అట్లైనచో ఆదికవికృతమైన శ్రీమద్రామాయణమన్నది, మహాకవికృతములగు రఘువంశ కుమార సంభవాదిమహాకావ్యము లున్నవి. ఇవి మహాకావ్యములని సాహిత్య వేత్తలందరు ప్రశంసించినవే. అంతే కాక అవి ఉత్తమోత్తమ కావ్యములు

కూడనై యున్నవి కదా! కా వనుటకు నేటి సాహసికులకుగూడ సాహస ముండదు.

ఐతే అవి వ్యంగ్యప్రధానములా? కాంతా సమ్మితముగా ధర్మోప దేశము చేయునుగాని అందుచే ధ్వని యన వీలగునా? కాక దానిలో రసధ్వని యున్నదని సమర్థింప వచ్చునా? లేనిచో అవి ధ్వని కావ్యములు కాకున్న గుణీభూతవ్యంగ్యము లనియైన ననుటకు వీలున్నదా? తుదకు అర్థచిత్రముకాని, శబ్దచిత్రముకాని, ప్రధానమగు కావ్యములనిగాని యన వీలు లేదే! మరి ఉత్తమాది కావ్యముల కన్వయించుటెట్లు? వానికే అన్వయించనిచో ఈ విభాగమునకు విలువ ఏమి?

ప్రాచీన సాహిత్య వేత్తలు కూడ ఈ విభజనకుఉదాహరణములుగా ఏకైక శ్లోకములనే తీసికొని విచారణచేసిరి. ఇతర సందర్భములలో ఈ మహాకావ్యముల ప్రసక్తి తెచ్చినను ఈ విభాగములోకి వానిని తెచ్చి అన్వయించలేదు. దానికి కారణమేమి? మనకిప్పుడు కర్తవ్యమేమి?

ప్రాచీనరసవేత్తలు మహాకావ్యము నుండికూడ ఏకైక శ్లోకములను తీసికొని ధ్వన్యాది భేదవిచారణ చేసిరే కాని కావ్యములను సమగ్రముగా గ్రహించి విచారణ చేయలేదు. అందుచేతనే గదా ప్రాచీన సంప్రదాయ ములో ఆరితేరిన పండితులు ప్రత్యేకముగా నొక పద్యములోని విశేష ములను అనుభవించినట్లు పెద్దకావ్యములు మొత్తముగా గ్రహించుటలో వెనుకబడుచున్నారు! వారి బుద్ధికుశలత ఎట్టి వ్యంగ్యము, ఏ అలం కారము ఇందుకలదు అను విచారణలో పర్యవసించుచున్నది. మహాకావ్య మనగా చక్కని పద్యముల లేక చిన్న కావ్యముల కూర్పుమాత్రమేనా? కాక సమమై, సమవిభక్తాంగమై, పుష్టి కలిగి, సజీవమగు నొక వ్యక్తి వంటిదా? రత్నములును రాళ్ళును గడ్డలును కలిపి పోసిన రాశివంటిదా మహాకావ్యము?

ఇక మరి పాశ్చాత్యవిధానమో? వారికి సాధ్యమైన తత్త్వవిచారణ గ్రీసులో ప్రారంభమైనది. సామ్రాజ్యమోహితులైన రోమనులచేతులలో గ్రీకుతత్త్వము పడి కృత్రిమరూపము పొంది లాటిను సంస్కృతిగా

రూపొందినది. ఈ గ్రీకులాటిను సంస్కారములే పాశ్చాత్యుల నాగరికతకు మూలాధారములు ఏది ఎట్లున్నను వారు అనుభవవాదులు. ఈ అనుభవ వాదులకు కావ్యతత్త్వములోని సూక్ష్మము తెలిసినను తెలియకున్నను, వారు తమ అనుభవముచే, ఉత్తమకావ్యశ్రవణపఠనములచే, హృదయములో హ్లాదరూపముగా గలుగు స్పందవిశేషమును మాత్రము దృఢముగా గ్రహించి దాని వివరణకు పూనుకొనినారు. కావ్యతత్త్వవిదులకు వారి విస్తారవిన్యాసము లొక్కచో పసిపిల్లల ముగ్ధవచనములుగను, కొంటొకచో ఉన్మత్తప్రలాపములుగను కనిపించవచ్చునుగాక! ఏమైనను వారి ప్రయత్నములు శ్లాఘ్యములు. అంతమాత్రముచే మన విమర్శకులు వారిని కన్నులు మూసికొని అనుకరించి వారి ఉత్తమ కృషి వదలి వారి ముగ్ధవచనములచే గూడ వ్యామోహితులై ఉన్మత్త ప్రలావములోనికి దిగవలసినదేనా?

వ్యంగ్యము నిదానముగా చేసికొని కావించిన ఉత్తమ మధ్యమాది కావ్యవిభాగము తృప్తిగా ఉన్నచో నంగీకరింతము. లేకున్న వానిని ఖండకావ్యములకే అన్వయింపదగునని వ్యవస్థ చేసికొందుము. కాకున్న నది విసర్జింతము.

కాని కావ్యస్వరూపమును గూర్చి పెద్దలు అంగీకరించినది ఒకటి యున్నది. ఇది సర్వసామాన్యముగా సాహిత్యవిదులు చెప్పునది :

"కావ్యమునకు శబ్దార్థములు శరీరము. రసాదికము ఆత్మ. గుణములు శౌర్యాదులవంటివి. దోషములు కాణత్వాదులను పోలును. రీతులు అవయవసంస్థాన విశేషములట్లు. అలంకారములు కటకకుండలాదుల స్థానీయములు."

ఇట్టి యద్భుతవిధముగా కావ్యస్వరూపము వారు నిర్ణయించినారు. వారికి కావ్యముకూడ సర్వాంగ సుందరమై మధురమగు ఆత్మగల మనుష్యవ్యక్తిని బోలు ఒకానొక అద్భుత సృష్టియే! ఈ నిర్వచనములు సాహిత్యపరులు ఎన్నిమారులు మరలమరల చెప్పినను స్మరించినను దోషము లేదు. జాతీయగీతముతో సమస్తకార్యములు ప్రారంభించుట

లేదా! ఇదియు మన జాతీయ కావ్యసూత్రము! అంతేకాదు, ఇదే కాదు. ఇదే సమస్తకావ్య జాతీయ సూత్రము!

కావ్యమునకు రసమాత్మ యను మతము మనకు భరతముని నాటికే ఉపలబ్ధమైనది. అగ్ని పురాణములో సేకరింపబడినది. మమ్మటుడు, ధ్వనికారుడు, ఆనందవర్ధనుడు, విశ్వనాథుడు, విద్యానాథుడు, జగన్నాథుడు- ఇత్యాదులనుండి నేటివరకు పరంపరగా మూలసూత్రమునకు భిన్నము కాకుండ వచ్చుచున్నదీ రసమతమే. తెలుగులో ఉత్తమకవిత నెలకొల్పిన నన్నయనాటినుండి శ్రీ తిరుపతి వేంకటకవులవరకును ఆంధ్ర కవులలో పెద్దలు అభిమానముగా ఆదరించిన దీరసవాదమే. ఈ రస తత్త్వమును, దాని విస్తరించిన విధానమును గ్రహించి-కేవలము అవచ్ఛిన్నావచ్ఛేదక పదసంకలిత పూర్వపక్షసిద్ధాంతములను వల్లెవేయుటతో తృప్తిపడక-సమస్త కావ్యములకు ప్రయత్నించినచో మన విమర్శకులు లోకమున కంతటికి మార్గదర్శకులు కాగలరు. అప్పుడే రత్నపరీక్షకుల గౌరవమును కావ్యవిమర్శకులుకూడ పొందగలరు.

పెద్దలు నిధులు నిక్షేపించినారు. కొంచెము శ్రమపడినచో అవి మనకు లభించును. అవి మనము సంపాదించి సద్వినియోగము చేసి అనుభవించుచు వృద్ధిచేయుట మనవిధి కాదా! "విద్య నిగూఢ గుప్తమగు విత్తము."

"సత్కీర్తి ఘటించు విద్యయను దివ్యధనం బఖిలార్థికోటికిం బూర్తిగ నిచ్చినం బెరుగు, బోదు యుగాంతపు వేళకైన!"

(విరోధి సంవత్సరాది సంచిక-ఆంధ్రపత్రిక-1949-50)

# దుర్గోపాసనాతిశయము

నారాయణ సమారంభాం వ్యాసశంకర మధ్యమామ్।
కల్యాణానంద పర్యంతాం వందే గురుపరంపరామ్॥

వేదమాతకును దుర్గాదేవికిని అవినాభావసంబంధమున్నది. శ్రుతి యందు పరమప్రామాణ్యము విజృంభించిన కాలములలో దుర్గోపాసనము బహుళ ప్రచార మంది యుండెను. అట్టి కాలములలో జనము లిహలోక భోగము లందుచు స్వర్గాపవర్గ సాధకులై యుండిరి. నేటి కాలమున దుర్గోపాసన ఉత్తరదేశములో విశేషముగా నున్నను అది వేదవిరోధుల సంపర్కముచే అపమార్గములు త్రొక్కియున్నది. అంతకంటె వైదిక నిష్ఠకొంచెమెక్కువగా నిలిచియున్న దక్షిణభారతములో దాని నిజ స్వరూపము చక్కగా భాసింపకుండుటచే, దుర్గోపాసనమన్న నొకానొక భయము ప్రవేశించినది. కావున దేశమంతటను అవైదికమార్గములనుండి దుర్గోపాసనము నుద్ధరించి దక్షిణమార్గమును ప్రవర్తింపజేయుట వైదిక మతాభిమానుల ప్రథమకర్తవ్యమై యున్నది. దీనిని బహుకాలము క్రింద టనే గుర్తించి శ్రీజగద్గురు శ్రీ కల్యాణానంద భారతీ మహాస్వాముల వారు అనేక గ్రంథములు రచించి శ్రీవిద్యా పరిషత్తునుస్థాపించి సూక్ష్మము లగు ననేక విషయముల నుపదేశించి శిష్యప్రశిష్య సంతతి నభివృద్ధి చేయుచు లోకోద్ధరణకు దీక్ష వహించియున్నారు. శ్రీగురువుల కరుణా కటాక్షలేశమే నన్నీ ప్రయత్నమునకు పురికొల్పినది.

ఏ స్మార్తకర్మ ప్రారంభింపబోయినను ముందు విఘ్నేశ్వరపూజ నిర్వర్తించుట అందరు నెరిగినదియే. ఆ విఘ్నేశ్వర పూజకంటె కూడ ముందీ మంత్రములు నేటికిని పఠించుచున్నాము.

"దేవీం వాచ మజనయంత దేవాస్తాం విశ్వ
రూపాః పశవోవదంతి సానో మంద్రేష
మూర్జం దుహానా ధేను ర్వా గస్మా నుపసుష్టుతైతు॥"

''యశ్శివో నామరూపాఖ్యాం యా దేవీ సర్వమంగలా
తయో స్సంస్మరణా త్పుంసాం సర్వతో జయమంగలమ్ ॥"

"సర్వమంగలమాంగల్యే శివే సర్వార్థసాధికే
శరణ్యే త్ర్యంబకే దేవి నారాయణి నమోస్తు తే"

ఈ అనుక్రమణము అనూచానముగా పెద్దలనోట వచ్చుచున్నదే కాని ఒకరు కల్పించినది కాదు. ఈ మంత్రములు దుర్గోపాసనలో అగ్రగణ్యములని నేడు పలువురు గుర్తింపలేకుండుట ఆశ్చర్యకరము.

తైత్తిరీయోపనిషత్తులో నారాయణీయ మను ప్రసిద్ధ నామము గల చతుర్థప్రశ్నలో ఈ సందర్భములో నీక్రింది మంత్రములు గమనింపదగినవి.

"కాత్యాయనాయ విద్మహే కన్యకుమారి ధీమహి
తన్నో దుర్గిః ప్రచోదయాత్॥

"జాతవేదసే సునవామ సోమ మరాతీయతో
దిదహాతి వేదః, స నః పర్ష దతిదుర్గాణి విశ్వా
నావేవ సింధుం దురితా త్యగ్నిః ॥

"తా మగ్నివర్ణాం తపసా జ్వలంతీం వైరోచనీం
కర్మఫలేషు జుష్టామ్, దుర్గాం దేవీం శరణ
మహం ప్రపద్యే సుతరసి తరసే నమః" ॥

ఈ మంత్రములలో మొదటిది మూడవది స్పష్టముగా దుర్గామంత్రములే. శ్రీ విద్యారణ్యులు తమ భాష్యములో నవి రెండును వనదుర్గాదేవతా మంత్రములని నిర్దేశించి యున్నారు. మూడవదానికి అవ్యవధానముగా ముందున్న 'జాతవేదసే' ఇత్యాది మంత్రమును తర్వాతనున్న "అగ్నే, త్వం పారయా" ఇత్యాదిగాగల అనువాకములోని నాలుగు మంత్రములును అగ్నిపరముగా కనబడుచున్నను దుర్గామంత్రములుగనే భావింపవచ్చును. ఏమైనను ఈ మంత్రములవలన దుర్గాదేవి మహత్త్వమొక్కించుక గోచరించును. ఈ దుర్గాదేవత అగ్నివలె జ్వలించుచు శత్రుతాపన మొనర్చునది; స్వయంప్రకాశమాన మైనది. కర్మఫలములు

కోరువారిచే నుపాసింపబడినదిదే. సంసారమునుండి తరింపజేయునది కూడ నిదియే. ఈ దుర్గకే కాత్యాయని కన్యకుమారి అను నామాంతరములు కలవు.

దుర్గాదేవి యవతారమునుగూర్చి కేనోపనిషత్తులో మనోహరమగు నొక యాఖ్యాయిక కలదు. అసురులను జయించిన దేవత లొకచో గూడి ఎవరికి వారు తామే జయమునకు కారణులమని ప్రగల్భములు పలుకుచు సర్వకారణ శక్తిని మరచిపోగా, నది వారి యెదుట ముందు ముక్కు మొగము లేని తేజఃపుంజమూర్తియైన యక్షరూపముగా నావిర్భవించి దేవముఖ్యులను పరాభవించినది. ఇంద్రపురస్సరముగా దేవత లాయక్షము నుపాసింపగా కొంతకాలమున కది వారికి హైమవతీరూపముతో ప్రత్యక్షమై అనుగ్రహించినది దానినే శ్రుతి 'తస్మిన్నేవాకాశేస్త్రియ మాజగామ, బహుశోభనాముమాం హైమవతీం' అని పలుకుచున్నది. ఈ యాఖ్యానమునే శ్రీదేవీ భాగవతము ద్వాదశ స్కంధములో ఎనిమిదవ అధ్యాయములో కావ్యస్వరూపమున ననువదించి యున్నది.

నారాయణీయమునుండి ఉదాహరించిన కన్యకుమారి శబ్దముతో కేనోపనిషత్తునందలి ఉమాహైమవతీ శబ్దములు జోడించి ధ్యానము చేసిన వారికి కర్మభూమియైన ఈ భరత ఖండమంతయు దుర్గాదేవీ స్వరూపముగా భాసింపకపోదు. ఈ దేశమునకు దక్షిణాగ్రమందు పూర్వదక్షిణ పశ్చిమ సముద్రజలములచే నిత్యము నభిషేకింప బడుచున్న కన్యకుమారి దుర్గాదేవాలయము క్షేత్రము నేటికిని ప్రత్యక్షముగా నుండి ఎవ్వరికిని ఎన్నటికిని చెరుప సాధ్యముకాని సీమా చిహ్నముగా నున్నది. అట్లే ఉత్తరాగ్రమున హిమవత్పర్వత రాజము భాసిల్లుచు తన యుత్సంగములో వాత్సల్యముతో ఉమను హైమవతిని భీమాదికములగు ననేక రూపములతో ప్రతిష్ఠించుకొని యున్నది.

ఈ రెండు సీమా చిహ్నములమధ్య నెన్నియో దుర్గాక్షేత్రములున్నవి. ఉత్తరభాగముననున్న క్షేత్రముల కన్నిటిలో కాశికాపురి విశాలాక్షియు, దక్షిణ క్షేత్రములకు శ్రీశైల భ్రమరాంబికయు కేంద్రస్థానయములు, పశ్చిమ భారతమున బృందావనక్షేత్రములోని రాధాదుర్గయు

పూర్వ భాగమున జగన్నాథ సమీపమున భువనేశ్వరియు వెలసిరి. ఇట్టిది మనస్సులో భావించియే శ్రీవిద్యాశంకర భగవత్పాదులు జగద్గురువై దిగ్వి జయమొనర్చి వైదికనిష్ఠసుప్రతిష్ఠితమొనర్చి పరమహంస సామ్రాజ్యము తద్గుప్తికై నెలకొల్పనెంచి ద్వారకయందు, బదరికాశ్రమమున, జగన్నాథ క్షేత్రమున, శృంగగిరిని నాలుగు జగద్గురు పీఠములలో భారతీ దుర్గను ప్రతిష్ఠించిరి. శ్రీదేవీ భాగవతమున సప్తమస్కంధమున ముప్పదియవ యధ్యాయములో ప్రధానమైన దుర్గాక్షేత్రముల నూటయెనిమిదింటిని పేర్కొనుచు చివరకు, 'వేదవదన మందది గాయత్రిగను, శివసన్నిధిని పార్వతిగను, దేవలోకములో ఇంద్రాణిగాను, బ్రహ్మముఖములందు సరస్వతిగను, సూర్యబింబమున ప్రభగా, మాతలలో వైష్ణవిగా, సతు లలో అరుంధతిగా, సర్వశరీరుల చిత్తములందును బ్రహ్మకలా స్వరూప ముగను ప్రతిష్ఠింప బడియున్న'దని యద్భుతముగా వర్ణించియున్నది.

ఇంతేకాదు. భరత దేశములో పూర్వరాజులే నగరము నిర్మించినను ముందుగా ఆ నగరలక్ష్మిని, నగరదుర్గను ప్రతిష్ఠించు నాచారముండెను. అట్లే ఏ కొత్తగ్రామము నిర్మించినను గ్రామశక్తిని గ్రామరక్షణకై ప్రతి ష్ఠించు నాచారము మనదేశములో ననాదిగా వచ్చుచున్నది. పురదుర్గలు పురవాసులను గ్రామదుర్గలు గ్రామీణులను కాపాడుచుండును. అదేవిధ ముగా వనమున గాపాడునది వనదుర్గ, పర్వతములందు కాపాడునది పర్వతదుర్గ. గంగమొదలు కావేరి వరకు నదులన్నియు నదీదుర్గలు. సరస్సులును దుర్గలే.

మరియొక , విషయము గమనించినచో నిది విస్పష్టకరము కాగలదు. కోటయను పదములకు దుర్గమునకు దుర్గము అనునది పర్యాయ పదముగదా! ఏ కోట కట్టినను ముందక్కడ కోటశక్తిని ప్రతిష్ఠించుట వృద్ధాచారము. ఆ కోటశక్తికి నిత్యము పూజలును, సంవత్సరమున కొకసారియైన విశేషపూజలను జరుగుచుండెను. ఆధునికులిప్పుడది మరచి నను, పాడుపడిపోయిన కోటలలో నివసించువారు తాము కోటశక్తిని చూచి భయపడితిమన పలువురు చెప్పుచుండుట అట్టి ప్రదేశముల కేగిన వారికి విదితమే శత్రువులబారినుండి రక్షించుటచేతనేకాక అందు

ప్రతిష్ఠింపబడిన దుర్గాదేవత కారణముగూడ కోటలకు దుర్గములను నన్వర్థనామము వచ్చినది.

పురములు గ్రామములు వనములు పర్వతములే కాదు. మన గృహములే దుర్గాక్షేత్రములు. గృహప్రవేశ మొనర్చునపుడు గణపతి నర్చించి పుణ్యాహవాచన మొనర్చి వాస్తుపూజ నవగ్రహపూజ నిర్వ ర్తించి, నూతన గృహములో తూర్పు భాగమున పూర్ణకలశ ద్వయము ప్రతిష్ఠించి, గృహదేవతా పూజ గావింతుము ఆ వెంటనే అగ్ని ప్రతిష్ఠా పనము జరుగును. గృహ దేవతయే గృహదుర్గ దాని ప్రత్యక్ష స్వరూ పమే అగ్ని. దానికే సంధ్యావేళల దీపారాధన మొనర్చి నమ స్కరింతుము.

ఎన్ని విధముల మనము విస్మరించుటకు యత్నించినను మనయం దనుగ్రహబుద్ధితో దుర్గాదేవత మనలను వదలక కటాక్షించుచు అనేక రూపములతో కొట్టవచ్చినట్లు ప్రత్యక్ష మవుచున్నది. ఆసేతు హిమాచల మధ్యస్థ మగు ఈ పుణ్య భూమిలో జను లుపాసించు దేవత దుర్గ. అందులో గ్రామీణులని నాగరకులని, వనవాసులని, పురవాసులని, పేదలని ధనవంతులని, సేవకులని మహాప్రభువులని, స్త్రీలని పురుషులని తారతమ్యము లేదు అందరకును దుర్గాదేవి ఆరాధ్యయే ఎప్పటికిని వివాహమునకు పూర్వము వధువు విధిగా గౌరీపూజ చేయుట యాచారము కదా! రుక్మిణీ కల్యాణ కథ విన్నవారికి దుర్గను పూజించుటకు రుక్మిణి పురి వెలువడి వచ్చుట ఎరిగినదే కదా: రఘువంశ కావ్యములో పదునారవ సర్గలో కుశస్థలములో నున్న కుశునికి సాకేత పురాధి దేవత అర్ధరాత్ర మున ప్రత్యక్షమై అతనిని మరల కులరాజధానిని ప్రవేశించినది ఈ సందర్భమున గుర్తునకు తెచ్చుకొనదగును.

ఈ విధముగా భరత దేశ మందంతటను సర్వకాలము లందును దుర్గాదేవత ప్రధానముగా పూజింప బడుటకు కారణమేమి? భరత ఖండ ములో ధర్మమంతటికి మూలము శ్రుతి కదా! అది స్వతః ప్రమాణ మని పెద్ద లంగీకరించిన విషయము. అందులో పై నుదాహరించిన మంత్ర ములే కాక శ్రీసూక్తము మొదలగు మంత్రము లెన్నో దుర్గాపరమైనవి

కలవు. అయితే ఒక్క దేవిపరములైన మంత్రములే కాక మరి ఎందరో ఇతర దేవతలను ప్రతిపాదించు మంత్రము లున్నవి కదా యని ప్రశ్నించుట సహజమే. కాని ఒక్క విషయము గమనించినచో ఆ శంక నివృత్తి నందగలదు.

వేదాధ్యయనమున కధికారము ఉపనయన దీక్షతో నారంభించు చున్నది గదా! ఉపనీతునికి ముందు గాయత్రీ మంత్ర ముపదేశించి నిత్యము ముప్పూటలు సంధ్యావందనము చేయించి ఆ పిమ్మట సమస్త వేదములు ఉపదేశించు చున్నారు. సంధ్యోపాసనము ప్రధానముగా గాయత్రీ మంత్రానుష్ఠానమే కదా। అందులో గాయత్రిని ఆవాహన చేయుచు, గాయత్రితోపాటు సావిత్రిని సరస్వతినిఛందర్షులను శ్రీ దేవతను ఆవాహన చేయు చున్నాడు. తర్వాత గాయత్రికి ఉద్యాపన చెప్పుచు ఆమెను వరదాన శీలయైన వేదమాతనుగా కీర్తించుచున్నాడు. కాబట్టి వేదమాతయే గాయత్రి ఉపాసనలలో నెల్ల ప్రథమమైనది ప్రధానమైనది. ఉత్తమమైనది గాయత్ర్యుపాసనమే. దానికి దేవత, సవిత, ముఖమగ్ని, శిరస్సు బ్రహ్మ, హృదయము విష్ణువు, శిఖ రుద్రుడు, యోని పృథివి. మరియు నది త్రిపద. మూడు సంధ్యలలో మూడు రూపములతో నుండినది. సద్యోజాతాది పంచబ్రహ్మమంత్రములే శిరస్సులుగా గలది. ఇట్టి గాయత్రి నుపాసించుట భరత ఖండములో అనాది గదా!

గాయత్రితోడనే ద్విజులకు అగ్ని హోత్రార్చనము వచ్చుచున్నది. దాని రూపము గనుకనే దుర్గను తరుచుగా అగ్నివర్ణము కలదిగాను తేజస్స్వరూపమున నావిర్భవించునట్లును వర్ణింపబడినది. శ్రీదేవీ భాగవతము గాయత్రి నారాధించుట నిత్యవిధి యని చెప్పి మరల తుదకు ద్వాదశ స్కంధములో నిట్లు చెప్పుచున్నది. "సత్యయుగమం దందరు గాయత్రీ జపతత్పరులును తారహృల్లేఖల జపించువారునై యుండిరి. విష్ణూపాసనము నిత్యము కాదు. శివోపాసనము నిత్యము కాదు. ఒక్క గాయిత్రి ఉపాసనముతప్ప తక్కినదేవతల ఉపాసనలు నిత్యములు కావు. గాయత్రి నుపాసింపనిచో ద్విజుడు ద్విజత్వమునే కోల్పోవును. అట్టి ద్విజత్వహాని మరి యే యితర మంత్ర ముపాసింపకున్నను కలుగదు.

మనువుకూడ ఇతరములు చేసినను చేయకున్నను గాయత్రిమాత్ర మనుష్ఠింపవలెనని శాసించినాడు. గాయత్రిని వదలి విష్ణూపాసనము శివోపాసనము చేయువారు నరకమే పొందుదురు. ఇట్లుద్ఘోషించి గాయత్రీమంత్రాధిక్యతను ప్రతిపాదించు నాఖ్యాయిక చెప్పి శ్రీదేవీ భాగవతము ఉపసంహార మొనర్చినది.

గాయత్రి యనగా గానము చేయువానిని త్రాణము చేయునదని యర్థము. దుర్గ యనగా భక్తులను కష్టములనుండి రక్షించునది యని యర్థము. ఈ రెండును ఒక్కదేవత నామములే. దుర్గాప్రతిపాదకము లైన మంత్రములన్నియు గాయత్రీ మంత్రభేదములే. కావుననే ఉపాసనా రహస్యము లన్నియు నిక్షేపింపబడియున్న సామవేదీయోప నిషత్తగు లలితారహస్యనామస్తోత్రములో ఆ దేవత ఒకచోట 'గాయత్రీ వ్యాహృతి స్సంధ్యా ద్విజబృంద నిషేవితా' అనియు, మరి యొకచో 'దుర్లభా దుర్గమా దుర్గా దుఃఖహంత్రీ సుఖప్రదా' అనియు, ఇంకొకయెడ 'సర్వశక్తిమయీసర్వమంగలా సద్గతిప్రదా సర్వేశ్వరీ సర్వమయీ సర్వ మంత్ర స్వరూపిణీ సర్వయంత్రాత్మికా సర్వతంత్రరూపా' అనియు, వేరొకయెడ 'అపర్ణాచండికా చండముండాసురనిషూదినీ' అనియు ఇత్యా దిగా బహువిధముల కీర్తింపబడినది.

వేదమంత్రాధికారము నొసంగు గాయత్రీ మంత్రము పురుషులగు ద్విజులచేతనే అనుష్ఠింపదగినదని పెద్దల నిర్ణయము మరి స్త్రీలను ద్విజేతరులను తరింపజేయు గాయత్రి యేది? ద్విజపురుషులనేకాక ద్విజేతరులను స్త్రీలను అందరను తరింపజేయుటకు శ్రుతి విధించిన సాధన ములే దుర్గామంత్రములు ఇట్లందర నన్నివిధముల రక్షింపగల గాయత్రీ దేవతా స్వరూపములే దుర్గాదేవీమూర్తులు. రహస్యనామ మందువల్లనే దానిని 'ఆబాల గోపవిదితా' అని కీర్తించినది. నగరము లలో గ్రామములలో గృహములలో ఆయతనములలో వనములలో గిరులలో ప్రతిష్ఠించిన దుర్గామూర్తులే కాదు; భరతఖండము మహా దుర్గామూర్తి; భరతమాత భారతీదుర్గ;

దుర్గోపాసన ఇప్పటికి కొంతకాలమునుండి వెనుకపట్టిన మాట నిజమే. వేదాధ్యయనమే ఆ స్థితిలోనున్నది గదా! ఈ ఉపాసన కేవలము వేదములో గూఢముగా దాగి యున్నది కాదు. వేదముల తర్వాత పంచమ వేదమని విశేషపూజ్యత నందుచున్న మహాభారతము చూచినను ఈ ఉపాసనాతిశయము కాన్పించును పాండవు లే గడ్డు పని సాధింపవలసివచ్చినను ముందుగా నుపాసించినది దుర్గాదేవతనే.

వారు సాధించిన గడ్డుపనులలో గడ్డైనది అజ్ఞాతవాస వత్సర పరిసమాప్తి. విరాటనగరమును సమీపించుచు తమ అజ్ఞాతవాససమయము నిర్విఘ్నముగా పూర్తియగుటకు ధర్మరాజు ప్రార్థించినది దుర్గాదేవినే. ఆ స్తోత్రము చదివినవారికి దుర్గాసప్తశతిలోని స్తోత్రములు స్పష్టముగా స్ఫురించును.

"విరాటనగరం రమ్యం గచ్ఛమానో యుధిష్ఠిరః
అస్తువన్ మనసాదేవీం దుర్గాం త్రిభువనేశ్వరీమ్॥
యశోదాగర్భసంభూతాం నారాయణవరప్రియాం
నందగోపకులేజాతాం మంగల్యాం కులవర్ధనీమ్॥
భారావతరణే పుణ్యే యే స్మరంతి సదాశివామ్
తాన్వైతారయతే పాపాత్ పంకే గా మివ దుర్బలామ్॥
స్తోతుం ప్రచక్రమే భూయో వివిధైః స్తోత్రసంభవైః
అమంత్ర్య దర్శనాకాంక్షీ రాజా దేవీం సహానుజః॥
నమోస్తువరదే కృష్ణే కుమారి బ్రహ్మచారిణి
బాలార్కసదృశాకారే పూర్ణచంద్రనిభాననే॥
త్రైలోక్యం రక్షణార్థాయ మహిషాసురనాశిని
ప్రసన్నా మే సురశ్రేష్ఠే దయాం కురు శివా భవ॥
జయా త్వం విజయాచైవ సంగ్రామేచ జయప్రదా
మమాపి విజయం దేహి వరదా త్వంచ సాంప్రతమ్।
దుర్గాత్తారయసే దుర్గే తత్త్వం దుర్గా స్మృతా జనైః
కాంతారే ష్వవపన్నానాం మగ్నానాంచ మహార్ణవే॥

దస్యుభిర్వా నిరుద్ధానాం త్వం గతిః పరమా నృణామ్
త్వం కీర్తిః శ్రీ ర్ధృతిస్సిద్ధిః హ్రీ ర్విద్యా సంతతి ర్మతిః
సంధ్యారాత్రిఃప్రభా నిద్రాజ్యోత్స్నా కాంతిః క్షమాదయా
నృణాంచ బంధనం మోహం పుత్రనాశం ధనక్షయమ్
వ్యాధిం మృత్యుభయం చైవ పూజితా నాశయిష్యసి."

దుర్గాదేవి ప్రత్యక్షమై అన్న వాక్యాలలో క్రిందివి ఉన్నవి

"అటవ్యాం దుర్గకాంతారే సాగరే గహనే గిరే
యే స్మరిష్యంతి మాం రాజన్ యథాహం భవతా స్మృతా।
న తేషాం దుర్లభం కించిత్ అస్మిన్‌లోకే భవిష్యతి।
రక్షాం కృత్వాచ పాండూనాం తత్రైవాంతరధీయత।"

ఆ పిమ్మట వారు సాధించినది మహాభారత యుద్ధములో విజయము. యుద్ధభూమిలో ప్రవేశించిన వెంటనే శ్రీకృష్ణ భగవానుడు అర్జునునితో నిట్లనెను :

"శుచి ర్భూత్వా మహాబాహూ సంగ్రామాభిముఖః స్థితః
పరాజయాయ శత్రూణాం దుర్గాస్తోత్ర ముదీరయ"

వెంటనే అర్జునుడు రథముపై నుండి దిగి దుర్గాస్తోత్ర మొనర్చెను।

"నమస్తే సిద్ధసేనాని ఆర్యే మందారవాసిని
కుమారి కాలి కాపాలి కపిలే కృష్ణపింగలే॥

భద్రకాలి నమస్తుభ్యం మహాకాలి నమోస్తు తే
చండి చండే నమస్తుభ్యం తారిణీ వరవర్ధినీ॥

గోపేంద్ర స్యానుజే జ్యేష్ఠే నంద గోపకులోద్భవే
మహిషా సృక్ప్రియే నిత్యం కౌశికీ పీతవాసిని॥

వేదశ్రుతి మహాపుణ్యే బ్రహ్మణ్యే జాతవేదసి।
త్వం బ్రహ్మవిద్యా విద్యానాం, మహానిద్రాచ దేహినామ్।
స్వాహాకారః స్వధాచైవ కలా కాష్ఠా సరస్వతీ
సావిత్రీ వేదమాతా చ తథా వేదాంత ఉచ్యతే॥

జయో భవతు మే నిత్యం త్వత్ప్రసాదా ద్రణాజిరే।
త్వంజృంభనీ మోహినీచ మాయా హ్రీఃశ్రీ స్తథైవచ
తుష్టిః పుష్టిః ధృతి ర్దీప్తిః చంద్రాదిత్య వివర్ధినీ
భూతి ర్భూతిమతాం సంఖ్యే వక్ష్యసే సిద్ధచారణైః।"

ఈ స్తోత్రముచే అర్జునుని భక్తి ఎరిగి దుర్గాదేవి గోవిందుని ముందు నిలిచి అర్జునునికి ప్రత్యక్షమై శీఘ్రముగా జయింతువని అదృశ్య యయ్యెను.

మహాభారతముననే కాక భారతపరాంశమగు హరివంశ మందును దుర్గామహత్త్వము, స్తోత్రము కలవు తిక్కన సోమయాజివలె వదలక ఎఱ్ఱయ ఆ భాగములు తెలిగించినాడు గనుక ఎఱ్ఱకవి వాక్కులలో నవి ప్రదర్శింతును. శ్రీమహావిష్ణువు అవతరించుటకు ముందు యోగమాయతో నిట్లనెను.

"నా మేనితోఁ దుల్యమై మేను నవమేఘ
కాంతి నొప్పార సంకర్షణునకు
నెనయైన వదన పూర్ణేందుండు శోభిల్ల
నెనిమిది బాహువు లెసఁగి శార్ఙ
చక్రగదాఖడ్గ జలరుహ మధుపాత్ర
మునలశూలముల నుల్లసితములుగ
నుజ్జ్వలహార కేయూరాది దివ్య భూ
షణ గంధమాల్యవిస్తారలీల
నీలకౌశేయవసనవై నిఖిల సిద్ధ
గణము పూజింప దివి కేగఁగలవు నిన్ను
నెదురువచ్చి తోడ్కొనిపోయి యింద్రుఁ డెలమి
నాదిశక్తిగ నభిషేక మాచరించు॥"

"నీవు నాకు నక్కౌశికునకుం జెలియలవై కౌశికి యను పేరం బ్రసిద్ధివహించి వింధ్యాచలంబు నివాసంబుగా నుండి శుంభనిశుంభులను దైత్యుల వధియించి లోకహితం బొనర్చెదవు. శ్రీయు ధృతియుఁ శాంతియు హ్రీయు విద్యయు సన్నతియు మతియు సంధ్యయు

రాత్రియుఁ బ్రభయుఁ గాంతియు నిద్రయుఁ గాలరాత్రియు నను నామంబులు నీకు వాచకంబులుగా మహామునులుం గీర్తింతు రార్తులై కొలుచువారికి దారిద్ర్య బంధన వధప్రముఖంబులగు సుఖదుఃఖంబు లపనయించి యాయురారోగ్య ధనధాన్య పశు పుత్రభృత్యాదికంబులగు కల్యాణంబులు గరుణింపుము".

పిమ్మట యోగమాయను కంసుడు రాతితో నడుచుటకై పూని యెత్తిన మెత్తనఁ బ్రిదిలి చదలి కెగసి యయ్యుగ్మలి యద్భుతాకారయై యందుండి,

తనచేతి పానపాత్రం
బున నొలికెడి దివ్యమధువు ముదమున నాస్వా
దన మొనరించి మదోద్ధత
నినదంబునఁ బెలుచ నవ్వి నిష్ఠురభంగిన్॥

కంసునితో నాతని జంపు శత్రు వున్నాడనియు తాను మృత్యుమూర్తియై యాతని ప్రాణములు రుధిరములు నొక్క పూఁపున గ్రోలుదు ననుచు నదృశ్య యయ్యెను.

ఈ సందర్భమున దుర్గా సప్తశతిలో మహిషాసురమర్దనమునకు ముందు భగవతి,

"ఉవాచ తం మదోద్ధూతముఖరాగాకులాక్షరమ్।
గర్జగర్జ క్షణం మూఢ మధు యావ త్పిబామ్యహమ్॥

అన్న మాటలు జ్ఞప్తికి తెచ్చుకొన్నచో రెండు విషయములు స్పష్టమగును. ఈ ఇద్దరు ఒకే దేవత అవతారభేదము లని; ఆమె చేతిలోనిది 'దివ్యమధువు' కల సుధాపాత్రమే కాని సప్తశతి అవపాఠములలోనున్న సురాపాత్రము కాదనియు స్పష్టము. దేవత ఒకటే యనుటకు సప్తశతిలో శుంభ నిశుంభవధానంతరము శ్రీదేవి ప్రత్యక్షవచనములే ఉన్నవి.

"వైవస్వతేఽంతరే ప్రాప్తే ష్టావింశతితమే యుగే
శుంభోనిశుంభశ్చైవాన్యా వుత్పత్స్యేదే మహాసురౌ ॥

నందగోపగృహే జాతా యశోదాగర్భసంభవా
తత స్తౌ నాశయిష్యామి వింధ్యాచల నివాసినీ॥

అనిరుద్ధుడు బాణుని నాగపాశములచే బద్ధుడై యుండి ఆర్యాస్తోత్ర మొనర్చి పాశవిముక్తు డయ్యెను. అందులో నుండి యీ భాగములు ఉదాహరించిన జాలును!

"నందునికూర్మి నందన యనంగ యశోద కృశోదరంబు జెందం దగ నావహించి ప్రకటంబుగ విష్ణుని తోడఁబుట్టువై సుందరి గోకులైక నవ శోభనయై జనియించి యే జగద్వందిత యొప్పె నాయసురదారణి నాదిమశక్తిఁ గొల్చెదన్. తనువులందెల్ల నెలసి చేతనయనంగ....

లక్ష్మి సరస్వతి లజ్జఁగీర్తి....సావిత్రి, దుష్టి శాంతి, దైవమాత భక్తప్రియదలఁతు భక్తి...దుర్గ దుర్జయ...శివ వజ్రపాణి భగిని....శుంభ నిశుంభవ్యామర్దిని...ఎల్లపేళ్ళెల్ల రూపములెల్ల నీవ వరదాయిని మహిషాసురపరిమర్దని వైదికాద్రి బ్రహ్మణి శివసుందరి నారాయణి యచలేశ్వరి కన్యక యనఁగ నీదు సంజ్ఞలు తల్లీ!"

ఇక ఆదికావ్యమగు వాల్మీకి రామాయణములో దుర్గా పూజ ఉన్నదా అని కొందరికి సందేహము కలుగవచ్చును. అందులో సీతాదేవియే ఆదిశక్తి యని సమాధాన మిచ్చి మిన్నకుండ నవసరము లేదు. శ్రీరామునికి వనవాసమునకు బోవుచుండ సర్వరక్ష యొనర్చి కౌసల్య తుద కిట్లు మంగళ మొనర్చినది.

"య న్మంగలం సహస్రాక్షే సర్వదేవ నమస్కృతే
వృత్రనాశే సమభవత్ త త్తే భవతు మంగలమ్॥

య న్మంగలం సుపర్ణస్య వినతా కల్పయత్ పురా
అమృతం ప్రార్థయానస్య త త్తే భవతు మంగలమ్"॥

అమృతోత్పాదనే దైత్యాన్ ఘ్నతో వజ్రధరస్య యత్
అదితి ర్మంగలం ప్రాగాత్ త త్తే భవతు మంగలమ్॥

త్రీన్విక్రమాన్ ప్రక్రమతో విష్ణో రమిత తేజసః
యదాసీ న్మంగలం రామ తత్తే భవతు మంగలమ్॥
ఋతవ స్సాగరా ద్వీపా వేదా లోకా దిశశ్చ తే
మంగలాని మహాబాహూ దిశంతు శుభ మంగలాః॥

ఈ విధముగా సర్వమంగలా దుర్గనే కౌసల్య యావాహనమొనర్చినది. రామాయణ పారాయణ క్రమములో పెద్ద లీ మంగల శ్లోకములు పఠించు చుండుట సంప్రదాయము గదా! వృత్రవధ మందు, అమృతాహరణ మందు, క్షీరసాగర మథనమందు, త్రివిక్రమ క్రమము నందు ముందుగా స్తుతింపబడినది సర్వమంగలా దేవతయే యనియు దీనిచే సూచింప బడు చున్నది. నేటికిని ప్రయాణ సమయముల సర్వమంగలా మంత్ర స్మరణ మొనర్చుట వృద్ధాచారము.

పురాణ పురుషులే కాక, నేటి వారు చారిత్రక పురుషులన్ని భావించు చున్న మహానుభావు లందరు దుర్గోపాసకులే. వారిలో అగ్రగణ్యులు శ్రీ విద్యాశంకర భగవత్పాదులు. వారి ఆశ్రమ నామమే భారతి. వారు ప్రతిష్ఠించిన పీఠము లన్నియు భారతీ పీఠములే. వారి శిష్యపరంపర భారతీ నామము ధరించి ప్రత్యక్ష దుర్గామూర్తులుగా విలసిల్లుచున్నారు. శ్రీ విద్యాశంకరులు దిగ్విజయము చేయునప్పుడే వక్రమార్గములు పట్టిన దుర్గోపాసనము వైదిక మార్గమునకు త్రిప్పినట్లు స్థలపురాణము లెన్నో చెప్పు చున్నవి. అట్టివానిలోనిదే బెజవా లోని కనదుర్గ. ఆ దుర్గ రాత్రుల పురవీథుల సంచరించుచు నెదురు పడిన నరులను భక్షించు చుండెడి దనియు శ్రీ విద్యాశంకరులు బంధించి శాంతమూర్తి నొనర్చిరనియు నైతిహ్యము కలదు.

శ్రీ విద్యాశంకర పరంపరలో ప్రత్యేకముగా నెన్నదగిన మహానుభావుడు శ్రీ విద్యారణ్యులు వారి యిష్టదైవము వనదుర్గ. తన యిష్ట దేవతనే నగర రక్షణకు ప్రతిష్ఠించి శ్రీ విద్యానగరము నాతడు ప్రతిష్ఠ చేసెను. ఆ దుర్గకు పూజ జరిగినన్నాళ్ళు శ్రీ విద్యానగర రాజ్యమునకు చ్యుతిరాలేదు.

మహాకవి కాలిదాసు దుర్గా భక్తుడు. చాళుక్య ప్రభువులు తమ వంశ కర్త 'నందాం భగవతీం ధ్యాయన్' సామ్రాజ్య చిహ్నములు వడసెనని శాసనములలో వ్రాయించుకొనిరి. వైదిక నిష్ఠతో తెలుగు దేశము పాలించి మన కాంధ్ర మహాభారతము ప్రసాదింప జేసిన రాజ రాజ నరేంద్రుడు చీదమార్యుడను బ్రాహ్మణున కిచ్చిన దానశాసనములో తాను 'చండీ ప్రసాద లబ్ధ సామ్రాజ్యధౌరేయుడ' నని చెప్పుకొన్నాడు. ఈ మధ్య కాలములో వైదిక ధర్మ రక్షణకు పూనుకొన్న శివాజీ మహారాజు దుర్గా భవానీ భక్తుడు.

వైదిక ధర్మమును ప్రతిఘటించిన బౌద్ధులు జైనులు ఇత్యాదు లుపాసించి నదియు తారాది దుర్గామూర్తి భేదములనే. వారివలననే దుర్గాపూజ అపమార్గములు పట్టినది. మనకు ప్రస్తుతము లభించు తంత్ర గ్రంథముల ప్రతులలో వారల సంపర్కము విశేషముగా కనబడు చున్నది. వానిలో నీరక్షీరములు వేరు చేయ గలిగిన పరమహంస రూపు లగు కల్యాణపాదులను మన మాశ్రయింప వలసి యున్నది.

అన్నిటి కంటె నాశ్చర్యకరమగు విషయమీ మధ్య 'హిందూ' పత్రిక బయల్పరచినది. వైదిక మత ద్వేషి యని యాంగ్లేయ చరిత్ర కారులు చిత్రించిన టిప్పుసుల్తాను తనకు యుద్ధములో జయము కొరకై శతచండీ యాగము చేయింప వేడుచు శ్రీ శృంగేరీ పీఠాధిపతులకు పంపిన యుత్తరము లా పత్రిక ప్రకటించినది.

దుర్గా దేవతాతిశయమునకు చెరుపరాని గుర్తు ఎప్పటికి ఉన్నది. మన పండుగలలోగొప్ప పండుగ ఏది? దీనికుత్తర మిచ్చుటకు ఆలోచింప నక్కరలేదు. శరన్నవరాత్రములు, దుర్గాష్టమి, మహానవమి మిగిలిన మూడు నవరాత్రములు మరచినను మనము ఇంకను శరన్నవరాత్రములు మరవలేదు. గడలు పట్టుకొని ఊరేగు పిల్లల తండములును, వారి ఉపాధ్యాయులును మనల మరవ నేరరు.

దుర్గా స్వరూపము లనంతములు. ఐనను వానిలో ప్రధానముగా చండీదుర్గ వనదుర్గ శూలినీదుర్గ యను మూడు దుర్గామంత్రములు విశేష

ప్రచారము నొంది యున్నవి. దుర్గోపాసనల కన్నిటికిని మూలముగా చండీ నవార్ణ మంత్రమును తత్సంబంధమైన దుర్గాసప్తశతీమాలా మంత్రమును గ్రహింప వచ్చును. శివపంచాక్షరియు దాని మాలా మంత్రమగు శతరుద్రీయమును ఎట్లు అనంత ఫలప్రదములో, అట్లే ఇవియు అనంత ఫల ప్రదములు. ఇవి రెండును శివా శివశక్తి ప్రతి పాదకములగు మహోపాసనలు.

ఈ శరన్నవరాత్రములలో దుర్గాదేవి నారాధించి పిమ్మట దుర్గా సప్తశతి విశేషములు విచారింతము.

(ఆరాధన, అక్టోబరు-1955)

# నత్కీరుని కథ ఔచిత్యము

శ్రీ కాళహస్తి మాహాత్మ్యమునందు తృతీయాశ్వాసములో 92 గద్య పద్యములలో ధూర్జటి నత్కీరుని కథ చెప్పినాడు. బహుశః దాని కథా మూలము శ్రీ కాళహస్తి స్థలపురాణమైయుండును. ఇందులో ప్రయత్నపూర్వకముగా గానీ, అప్రయత్నపూర్వకముగా గాని, శ్రీ కృష్ణ దేవరాయల సభలో మధ్య మధ్య కవులకు కవులకు నడుమ పొడసూపు చుండిన స్పర్ధలు, అసూయలు, వివాదములు ధూర్జటికి అనుభవ సిద్ధము గనుక, అవి ఏ కొంచమైనను ప్రతిబింబించి యుండునని భావించుట సహజమే. ఆధునిక కవులు, మిథ్యాదోషము ఆరోపించిన విమర్శకునిగా నత్కీరుని తరుచుగా ఉదాహరించుట పరిపాటి యైనది. కొంతవరకు ధూర్జటికి గూడ ఆ భావమే ఉన్నదేమో సందేహమే!

ఏమైనను నిజముగా కథాంశము అందులోనున్నవున్నట్లు నిర్భయముగా సూక్ష్మదృష్టితో పరిశీలించిన యెడల, నత్కీరుడు చేసిన సాహిత్య విమర్శ సహేతుకమనియే తోచును. అతడు చేసినాడను శివనిందయు, ఆ వచ్చినది వేషధారి యగు నైంద్రజాలికుడను భావముతో చేసినదే కాని, శివుడని తెలిసి చేసినది కానందున నిజముగా శివనింద యనుటకు గూడ వీలు లేదు. అందులో నాతడు చూపిన నైతిక ధర్మము హర్షింప దగినది. చివరకు శాపము పొంది తీర్థయాత్ర చేయుచు గూడ, 'ఈ కవితాభిమానము వహించితి నేటికి?' అనియే విచారపడినాడు కాని, దుర్వాదము చేసితినని చింతపడలేదు. ఇట్టి అనుభవము మోమోటము లేకుండ విమర్శించు వారికి ఏ కాలమందైనను ఉండునదే. నత్కీరుడు ప్రదర్శించిన ధైర్యము అసూయా దోష దూషితులు చేయగలిగినది కాదు. అందువలన తుదకు అతని నీశ్వరుడు శపించుట అన్యాయముగా తోచును. ఈ సందర్భములో ఔచిత్యము లోపించిన ధనికూడ తోపక తప్పదు.

ఈ విధముగా ఔచిత్య లోపమే కాక పరస్పరము విరుద్ధముగా నుండి అసందర్భముగా కనిపించు నంశములు కూడ ఈ కథలో లేక పోలేదు. పాండ్య భూపతి సభలోని శంఖ ఫలకము అంతకు ముందెన్నడో అగస్త్యుడు ద్రవిడ కవిత్వ సరణి నిర్మించుచు ఇచ్చినది. అది కూర్చుండు టకు 'భారతీదేవి కెనయైన వారి కెందరికైన జోటిచ్చు'నట్టిది. అందుపై కథా కాలమందలి పాండ్యరాజు నత్కీరాది కవీంద్రులను వన్నిద్దర నుంచెను. వారందరును 'ద్రావిడ భాషాదేవీ గ్రైవేయక మనగ గీర్తి గని తత్కవితా శ్రీ విపుల శంఖ ఫలకము పై వసియింపదగు విభాసిత మతులు'. వారింకను 'దివిష దన్న ప్రాయ వాగ్గుంభ సంపత్కావ్య ప్రతిపాదక ప్రతిభులు,' మరియు 'శైవ సంవిత్కాసార మరాళ రత్న ములు." అట్టి సభవారు మెచ్చునట్లుగా ఏ సరసుడు కవిత్వమును చెప్పి నను రాజు వేయి మాడలు బహూకరించుచుండెను.

మధురా నగరములో గొప్ప క్షామము వచ్చినది. ఆహారము కరవు కాగా భరింపలేక అందలి మూలస్థానములోని హరద్విజుడు వలస పోదలి చెను. అతనిపై మహేశ్వరుడు కరుణించి పాండ్యరాజు మీద అరవభాషలో 'శృంగార రసానుబద్ధముగా' పద్యమొకటి వ్రాసి ఇచ్చి దానిని రాజసభలో చదివి రాజు వద్ద వేయిమాడలు తీసుకొని కరవు తీర్చుకొమ్మని పంపెను.

పాపమా హరద్విజుడు రాజసభకు పోయి ఆ పద్యము చదివెను. ఆ పద్యము పూర్తి పాఠమేదో మనకిప్పుడు తెలియరాదు. అరవభాషలో చాటువులలో నైనను అది ప్రసిద్ధముగా నున్నదోలేదో మనమెరుగము. ఇది ద్రావిడ భాషా కవి పండితులు విచారించి మన ఆంధ్రులకు తెలిపి విప్ప దగిన చిక్కు. శ్రీ కాళహస్తి మహాత్మ్యములో చెప్పిన దానిని బట్టి అందులో 'సింధురాజ గమనా ధమ్మిల్ల బంధంబు సహజ గంధంబు' అను అర్థము వచ్చు పదబంధము కలదట. అది విని నత్కీరుడు సభలో నవ్వుచు, "వేనలికి సహజ గంధము కలదన్న, లోకము నవ్వదా? ఇది తప్పు చెప్పరాదు. కవితా సమయమైనా లేదు నీవిటు వ్రాయుట తగదు." అనెను ఆ బ్రాహ్మణుడు మారుమాటాడక తలవంచుకొని పోయి పార్వతీశ్వరునికి జరిగినది విన్నవించుకొనెను.

అది విని, 'నేను చెప్పిన దానిలో తప్పుకూడా ఉండునా?' అని అహంకరించెడి కొందరీకాలపు కవుల వలెనే, నిటలాక్షుడు కోపించి నత్కీరుడు ఎట్లు తప్పు పట్టెనో చూతునని స్వయముగా సభకు వచ్చెను. సభకు వచ్చి, 'ఈరాజన్యుని మీద నేఁ గవిత సాహిత్య స్ఫురన్మాధురీ చారు ప్రౌఢముఁ జెప్పి పంప విని మాత్సర్యంబు పాటించి నత్కీరుండూరకె తప్పు పట్టెనట, యేది లక్షణంబో యలంకారంబో పదబద్ధమో రసమొ చక్కఁజెప్పఁడా తప్పనన్.' సరిగ్గా కొందరాధునిక కవులు తమ పద్యములు తామే పొగడుకొన్నట్టే ఈశ్వరుడు తన పద్యమును పొగడుకొన్నాడు. నత్కీరుడు చెప్పిన దోషము తెలిసియు, అతడు చెప్పని దోషములమాట అసందర్భముగా ఎత్తి ఏమిటా దోషమని గర్జించెను. మరల నత్కీరుడు వెనుకటి వలెనే ఆక్షేపించెను.

ముక్కంటి పాండ్యరాజు ప్రియురాలి మీద తాను చెప్పుటకు దిగిన పద్యమును సమర్థించు కొనుటకై "పార్వతీ దేవి కచ భారము సహజగంధము" కలది అని సమర్థించెను.

పాపము, నత్కీరు డప్పుడేమనెను? "ఆ గిరిజకచభారమునకు సహజ గంధముండుట ఉచితమే, ఆమె పరమేశ్వరి. కాని ఈ లోకములోని స్త్రీల వెంట్రుకలకు సహజ గంధము గలదనుట తగదు. మత్సరము మానుము. గగన ప్రసూన వాదము ప్రత్యక్షమునకు సరికాదు. ఈలూలా మాలపు మాటలు చాలింపుము!"

ఫాలాక్షునికి కోపము వచ్చినది. తానుచేసిన పని సమర్థించుకోలేక, అధికారము ప్రదర్శించు అధికారి వలెనే, నత్కీరునితో హేతువాదము చేయలేక తన మహత్త్వము చూపి బెదిరింప దలచెను. నిటల నేత్రము చూపినాడు నీలగ్రీవుడు!

అహా, ఏమి, ఆ నత్కీరుని ఆత్మ విశ్వాసము! "నీవెవరవో మాయ దారివిగా నున్నావు. తలచుట్టువార గన్నులు గలిగిన బద్యంబు తప్పు కాదన వశమే? వలదిచ్చట నీ మాయా విలసనములు, పనికిరావు విడువుము" అనెను.

నత్కీరుడాతడు మాయాధారియే అని నిశ్చయించుటకు ఆధారమున్నది. నిటల నేత్రము చూపినచో భువనములకే ప్రళయము రావలె. నత్కీరునితో పాటు రాజసభ యంతయు మాడిపోవలె. అది జరుగలేదు. నత్కీరునికి వేడి కూడ తగులలేదు.

అప్పటికైన సర్వజ్ఞునికి నత్కీరునిపై ననుగ్రహము కలుగవలసినది. అట్లు కాకపోగా అధికార దుర్మదుడైన ఏ ప్రాకృత ప్రభువు వలెనో రుద్రుడు కోపించి నత్కీరుని కుష్ఠువ్యాధి వచ్చునని శపించినాడు.

అప్పటికి గాని తానంతవరకు వాదించినది ఈశ్వరునితోనని నత్కీరునికి తోచినట్లు లేదు. తోచిన వెంటనే అతడు శివుని పాదాలపై బడి శాపాంతము అనుగ్రహింపుమని ప్రార్థించినాడు. భక్తమందారుడు కైలాస శైలదర్శనముతో వ్యాధి శాంతి పొందునని అనుగ్రహించినాడు. స్థల పురాణము లన్నిటిలోవలెనే, ఇక్కడ గూడ మధుర సుందరేశ్వరుని కంటె శ్రీ కాళహస్తీశ్వరుడు ఎక్కువ మహాత్మ్యము కలవాడను సూచన యున్నది.

"ఈ కవితాభిమానము వహించితి నేటికి?- దేవుని తోడ నేల చార్వాక మొనర్చితిని?" అని మొదలుగా పరితాప పడెనే కాని అసూయతో లేని దోషము ఆరోపించితినని పశ్చాత్తాప పడలేదు, 'ఆ కవి సింహము!' ఆ 'నత్కీర కవి చంద్రుడు' ఇట్లెన్నో తీర్థయాత్రలు చేసెను. మధుర నుండి బయలుదేరి విక్రమసింహపురము వద్ద పెన్నదాటి కూడా సమీపములో నున్న కాళహస్తికి పోక, కాశి గయ మొదలైన క్షేత్రాల వరకు కాళిదాస మేఘునివలె యాత్ర చేసెను. ఇంత బాధలో గూడ నత్కీరుని కవితాత్మ గమనింప దగినది. ఒక చోట వటవృక్షపు ఆకులు కొన్ని క్రింద నున్న 'జలాశయంబున సగమును తట ప్రదేశంబున సగంబును బడి మీన పక్షిత్వంబులు గైకొని లోపలికి వెలుపలికిం దివియు చమత్కారమును నత్కీరుండు చూచి యద్భుత రసపరవశుడై యుండె' నట. ఇంతలో భూత మొకటి యాతని నెత్తుకొని పోయినది. కుమార స్వామిని ప్రార్థింపగా స్వామి రక్షించి 'ఆ కవి మండలేంద్రుని' దక్షిణ కైలాసమగు శ్రీ కాళహస్తిని దర్శింప జేసెను. కుష్ఠ వ్యాధి మానినది.

అప్పుడు నత్కీరుడు ద్రావిడోక్తిలో నూరు పద్యములతో శివుని స్తుతించెను. జ్ఞాన ప్రసూనాంబా నాథుడు నత్కీరునికి ప్రత్యక్షమై ఆతడు కోరినట్లు సాయుజ్యము ప్రసాదించెను.

భక్తానుగ్రహమునకై పరమేశ్వరుడు ఏమైన చేయవచ్చును, ఆ సందర్భముగా వాదించి యుండవచ్చును, ఈశ్వరుని లీలలు మానవమాత్రులకు బోధపడునని కావు, శంభోమహాదేవా అని నమస్కరింపవలసినదే ! అంతేకాని అట్లు వాదించినది శివుడు కాక మానవమాత్రుడే అని భావించి విమర్శించినచో, నత్కీరుని వాదమే సమంజసమైన దనక తప్పదు.

ఆ పద్యములో ప్రతాప రుద్రీయములో 'విరుద్ధ' మని చెప్పిన కావ్యదోషము కలదు. విరుద్ధము దేశ కాలాది విరుద్ధమని బహుధా చెప్పవచ్చును. ఇందులోనిది 'లోక విరుద్ధము'. ఈ దోషమునే కావ్య ప్రకాశములో 'ప్రసిద్ధి విరోధ' మనియు దర్పణములో 'ప్రసిద్ధి త్యాగ' మనియు చెప్పిరి. ఈ 'విరోధము' అను దోషము కవి సమయ సిద్ధమైనచో దోషము కాదు. అందువల్లనే నత్కీరుడు 'కవితా సమయంబున కొవ్వు కాదు' అని కూడా చెప్పెను.

పద్మినీజాతి స్త్రీల శరీరమునకు పద్మగంధ ముండునని ప్రతీతి కలదు. అది లోక సిద్ధమని తెలియని వారు కూడ కవి సమయ సిద్ధమని అంగీకరింతురు. ఆ వాదమును శివుడు శ్రీ కాళహస్తి మాహాత్మ్యములో ఎత్తలేదు. అది ఎత్తినను ఆ సహజ గంధము దేహమునకు గాని ప్రత్యేకముగా వేనలి కుండదని నత్కీరుడు ప్రతివాదము చేసి యుండును.

ధూర్జటి చెప్పిన నత్కీరుని కథలో ఎన్నో అసందర్భములు కూడా సూక్ష్మముగా చూచిన వారికి పొడగట్టును. కాని వాని నిప్పుడు ప్రస్తావింప తలంపలేదు. శివుని వాదములోని ఔచిత్యము, న్యాయమే ప్రస్తుత విషయము !

ఈ నత్కీరుని కథయే స్కాంద పురాణములో శివరహస్య ఖండములో కూడ నున్నది.[1] అందులోను శివుడే పద్యము వ్రాసి పంపినాడు. ఐతే అది అరవపద్యము కాదు. సంస్కృత శ్లోకము. అదియు గౌరీ దేవిని గూర్చి చెప్పినది కాని రాజుగారి ప్రియురాలి మీద చెప్పినది కాదు. అక్కడ శివుడు భట్టు కవుల స్థితికి దిగజారి పోలేదు. ఆ శ్లోక మెంతో మనోహర మైనది. అందులో రాజుగారి ప్రియురాలగు 'సింధురరాజగమనా ధమ్మిల్ల బంధంబు సహజ గంధంబు' అని లేనేలేదు. నత్కీరుడు చూపిన దోషము అందులో లేదు. ఈశ్వరుని వాదము న్యాయ సమ్మతమై యున్నది. ఫాలనేత్రము చూచి భస్మమై పోవలసిన నత్కీరుడు అట్లు కాక పై పెచ్చు అధిక ప్రసంగము కావించినట్లు అందులో లేదు. స్కాంద పురాణ కథ చదివిన తరువాత, ధూర్జటి కథలో నత్కీరునితో శివుడు చేసిన వాదము సమంజసముగా లేదని మరింత దృఢపడగలదు. స్కాంద పురాణ కథ ఆ నోట ఆ నోట పడి స్థల పురాణ కథలోని కెక్కి యుండును. ధూర్జటి భక్తి భావము చేతను, ప్రమాణ బుద్ధి చేతను, దూరము విమర్శింపక ఉన్న దున్నట్లు గ్రహించెనని తోచును. అందు వల్లనే అప్రయత్నముగానో ప్రయత్న పూర్వకముగానో ధూర్జటి నత్కీరునిపై అభిమానాదరములు కూడ ప్రదర్శించినాడు

మరియు ధూర్జటి కథలో కవులు కూర్చుండు శంఖ ఫలకము పాండ్య రాజులకు అగస్త్యుడు ఎప్పుడో పూర్వయుగములలో బహూకరించినది. అందులో నాతడు అష్టాదశాక్షర మాతృక వ్రాసి 'ఇది ద్రవిడ కవిత్వ సరణి' అని చెప్పెను.

స్కాంద పురాణ కథలో 48 మంది పండితులు రుద్రాభిషేకములు చేసి స్తుతి చేయగా, సుందరేశ్వరుడే ఒక పీఠము ననుగ్రహించి నట్లున్నది. అది అకారాది క్షకారాంత మాతృ కాక్షరములతో, అనగా పంచాశద్వర్ణములతో అలంకరింపబడి చంద్ర బింబాకారముగా నున్న సరస్వతీ పీఠము. దానిపై మొదట కూర్చున్నవాడు కపిలుడు. తక్కిన వారిలో అసూయాధురంధరుడగు నత్కీరుడు కూడ నొకడు. అతడు తానే

1. శ్రీ నోరి గురులింగ శాస్త్రి పూజ్యపాదుల ఆంధ్రీకరణము ననుసరించితిని.

పండితోత్తముడ నని పొగడుకొనుచు బ్రాహ్మణ వేషముతో వచ్చిన సుందరేశ్వరునితో ఒకమారు వృథా వాదము చేసి ఆకాశవాణి వచనముచే పరాభూతుడయ్యెను. ఆకాశవాణి, 'నత్కీరుడు పండితోత్తముడైనను ఈ విప్రునకు తుల్యుండుకాడు' అని చెప్పినది. శ్రీ కాళహస్తి మాహాత్మ్యములోని వాద కథకు మూలమైనది ఈ వంశ శేఖర భూపాలుని కుమారుని కాలములో మరియొక మారు శివునితో నాతడు చేసిన వాదమునకు సంబంధించినది. ఆ కథ ఇట్లున్నది.

వంశ శేఖర భూపాలుని తర్వాత ఆతని కుమారుడగు వంశ చూడామణి పాండ్య దేశమునకు రాజయ్యెను అతడు గుణములచేతను శివభక్తి చేతను తండ్రి కంటె గూడ నధికుడు. ఆరాధనలలో నాతడు విశేషముగా చంపక పుష్పములను ఉపయోగించుట చేత అతనికి చంపక పాండ్యుడను నామము ప్రసిద్ధమైనది. ఒకనా డతడు పార్వతీదేవిని పూజించుచుండగా, ఆమె శిరోరుహములు ఘుమఘుమ మని పరిమళింప సాగినవి. ఆ చిత్రము చూచి, ఈ పరిమళము సహజముగా నున్నదా, సాంసర్గికముగా కలిగినదా, యని వితర్కింప సాగెను. తన సందేహము తీర్చుకొనుటకు ఒక యుపాయము చేసెను. వేయి నిష్కములతో ఒక నీవి (పందెపు ముడుపు) నిర్మించి తన యభిప్రాయము తెలిపిన వారికి ఆ నీవి నిత్తునని ప్రకటింప జేసెను. సరస్వత్యంశసంభూతులైన సంఘ కవులు వచ్చి ఎవరికి తోచిన విధముగ వారు పద్యములు చెప్పిరి. అవియేవియు రాజు నభిప్రాయమునకు సరిపోలేదు. అందులకు పండితులు ఖిన్నులైరి.

అప్పుడు మధురలో తర్క వ్యాకరణములు బాగుగా చదివిన సుందర నాథుడను బ్రహ్మచారి యుండెను. అతడు శివభక్తుడు. తన సహాధ్యాయు లందరకు వివాహము లైనను తనకు దారిద్ర్యముచే కాలేదని సిగ్గు పడుచుంటినని సుందరేశ్వరుని అనేక విధముల స్తుతించెను. ఈశ్వరుడు దయాళుడై పాండ్యరాజు అభిప్రాయమునకు అనుకూలముగా శ్లోక మొకటి వ్రాసి ఇచ్చెను. ఆ బ్రహ్మచారి ఆనందించి పత్రిక గ్రహించి చంపక పాండ్యుని యెదుట నిట్లు చదివెను :

"జానాసి పుష్ప గంధాన్
భ్రమర త్వం బ్రూహి తత్త్వతో మేఽద్య
దేవ్యాః కేశకలాపే
తుల్యో గంధేన కిం గంధః ?"

(భ్రమరమా, నీవు ఎన్నో పుష్ప గంధముల నెరుగుదువు. దేవి కేశ కలాపమందలి గంధముతో తుల్యమైన గంధమేదో దాని తత్త్వము నా కిప్పుడు చెప్పుము.)

ఆ శ్లోకము విని నత్కీరుడు తప్ప తక్కిన పండితు లందరు సంతసించి, 'పార్వతీ దేవి కేశ కలాపములోని పరిమళము సహజమా సాంసర్గికమా అని రాజుగారికి సందేహము కలదు. అది దీనితో తీరినది' అని వ్యాఖ్యానించిరి. నత్కీరుడు మాత్రము అసూయాపరుడై ఇట్లాక్షేపించెను : "పండితులారా, మీ రందరు వివేకహీనులు. పార్వతీ శిరోరుహముల యందు సహజ పరిమళము కలదనియు అది సాంసర్గికము కాదనియు చెప్పెడి ఈ బ్రాహ్మణుని మాటలు శ్లాఘించుచున్నారు. లోకమున నెక్కడ నైనను శిరోరుహములకు సహజ పరిమళ ముండునా ?"

ఆ పరిహాస వాక్యములు విని సుందర నాథు డిట్లనెను. "ఓ పండితులారా, నా వాక్యములు యుక్తములు కావని ఈ నత్కీరుడు వచించు చున్నాడు. మా ఇద్దరి వాదమునలోని సత్యా సత్యములు నిర్ణయించుటకు సుందరేశ్వరుడే ప్రమాణము !" ఇట్లనుచు సుందరేశ్వరు నాతడు ప్రార్థించెను.

వెంటనే సుందరేశ్వరుడు కవి వేషము ధరించి వచ్చి, 'ఓ విబుధులారా, ఈ విప్రుని వచనములను ఆక్షేపించిన దెవరు? శాస్త్ర యుక్తులచే నతని పరిభవించెదను.' అనెను. నత్కీరుడది విని కోపించి "ఓ పండితాధమా, ఈ బ్రాహ్మణుని నధిక్షేపించినది నేనే, నా వాదములో దోషము చెప్పు" మనెను.

సుందరేశ్వరుడాతని వాదములో దోషము లెన్నో ప్రదర్శించి సభలోని పండితులే పరిశీలించి న్యాయము చెప్ప గలరనెను, నత్కీరుడు

వినిపించు కొనక రెట్టించినకోపముతో. "ఓరీ పండితాధమా, కేశములందు సహజమగు పరిమళ ముండదని నే నంటిని. అందులో దోషమేమి?" అనెను

దానికి సుందరేశ్వరుడు, "ఓరి పండితంమన్యుడా, పద్మినీజాతి స్త్రీల కేశములందు సహజమగు పరిమళ ముండును, ఇది లోక ప్రసిద్ధ మైన విషయము కదా! ఇంత మాత్రమే నీకు తెలియదా?" అనెను.

నత్కీరు డప్పటికిని తన పట్టు విడువక, "ఓ బ్రాహ్మణాధమా, పద్మినీజాతి స్త్రీలకు కురులయందు ఈ కాలములో పరిమళ ముండదు" అని వాదించెను.

అది విని చంద్రశేఖరుడు, "ఓరి మూర్ఖాగ్రేసరా, లోక ప్రసిద్ధ మైన పద్మినీజాతి స్త్రీల కేశముల సహజ పరిమళమునే కాదను చున్నావు. మరియు దివ్య స్త్రీల కేశ పాశములందు సహజ పరిమళము ఒక కాల మందు ఉండు ననియు మరి యొక కాలమున ఉండదనియు నీ వెట్లు చెప్ప గలవు? నీ కది తెలియదు" అనెను.

నత్కీరుడు మొండితనము వదలక, "ఓరీ దుష్టకులాగ్రణీ కేశ పాశము కస్తూరి కాదుల చేతను, ప్రసూనాదుల చేతను సాంసర్గికముగా పరిమళించునని తెలియ నేరక, అది సహజగంధ మని కామమోహితు లెన్నుదురే కాని విజ్ఞులది ఒప్పుకొనరు" అని వాదించెను.

తుదకు నత్కీరుని నిరుత్తరుని గావింప దలచి సుందరేశ్వరుడు ఇట్లనియె: "ఓరి దుష్టా, పార్వతీదేవి కేశపాశము సర్వదా పరిమళము కలదు. ఆమె సకలావయవ సౌందర్యము నే నొక్కడనే ఎరిగిన వాడను. నేను వ్యర్థముగా పలుకు వాడను కాను."

ఆ వచనములకు సభలోనిపండితులెల్లరు పరమానంద భరితులైరి. నత్కీరుడు మాత్రము, "నీ వచనములు నమ్మదగినవి కావు" అని తిరస్కరించెను.

సుందరేశ్వరుడు కోపోద్దీపితుడై "ఓరీ మూఢా, జ్ఞానలవ దుర్వి దగ్ధుని బ్రహ్మకూడ మెప్పింప లేడు. నిన్ను చూచి పాపము వచ్చును," అనుచు నత్కీరుని దగ్ధము చేయుటకు ఫాలనేత్రము తెరువ దలచియు

నంతలో నంతర్హితుడయ్యెను. శివుని భావనా మాత్రము చేతనే, నేత్రాన లము ఏ కొంచెమో సోకి నత్కీరుని శరీరము తపించి పోయెను. అతడు ఆ తాపమునకు తాళలేక హేమ పద్మాకర జలములలో ప్రవేశించి సుందరేశ్వరుని అనేక విధముల స్తుతించి ఈశ్వరానుగ్రహముచే మరల ప్రకృతి నొందెను.

సుందరనాథుడు చంపక పాండ్య భూపాలుని వలన సహస్ర నిష్కములు కల నీవిని పరిగ్రహించి దానితో సుందరాంగి యగు కన్యను వివాహ మాడెను.

ఇట్లున్న స్కాంద కథకును ధూర్జటి చెప్పిన కథకును ఎన్నో పోలిక లును భేదములును ఉన్నవి. స్కాందములోని నత్కీరుని వా ద ము యుక్తికి, శాస్త్రమునకు, అనుభవమునకు, న్యాయమునకు విరుద్ధమైనది. సుందరేశ్వరుని వాదము యుక్తి, శాస్త్రము, లోకానుభవము, న్యాయము లకు తోడుగా ఆత్మానుభవముతో కూడి యున్నది. నత్కీరు డిందులో కేవలము మూర్ఖుడుగాను అసూయాపరుడుగాను కనబడు చున్నాడు.

మరి ధూర్జటి తన ప్రబంధములో అందులకు విపరీతముగా ఏల వ్రాసెను? అతడు స్కాంద పురాణ కథ చూచి ఉండడా? మహా శివభక్తు డగు ధూర్జటి స్కాందము చూడలేదనుట సాహసము. కాక అతడు చూచిన స్కాంద పురాణ ప్రతిలో నత్కీరుని కథ లేకపోయి యుండ వచ్చును. వేంకటగిరి వారు సంస్కృత కాళహస్తి మహాత్మ్య మొకటి ముద్రింపిం చిరట. ధూర్జటి సోదరునికి శ్రీ కృష్ణరాయ విజయకర్తయైన కుమార ధూర్జటి మనుమడు. కుమార ధూర్జటి పుత్రుడైన లింగరాజకవి సంస్కృత కాళహస్తి మాహాత్మ్యము ననుసరించి తెలుగులో ఒక కాళహస్తి మాహాత్మ్యము వ్రాసెను. అందులో నత్కీరుని కథ లేదని శ్రీ కాళహస్తి మాహాత్మ్య ప్రకటన కర్తలు పీఠికలో తెలిపిరి. స్కాందములో నత్కీరు నికి శ్రీ కాళహస్తితో సంబంధము లేనందున అది వదలి, అట్టి సంబం ధము కల్పించిన స్థలపురాణ కథను ధూర్జటి గ్రహించి యుండును. ఏమైనను ధూర్జటి ఏ మూలము ననుసరించి తన ప్రబంధము రచించెనో తెల్పుకొననిది ఇదమిత్థమని నిర్ధారణ చేయ సాధ్యము కాదు.

సుందరేశ్వరుడు నక్కీరుని త్రొక్కివేయు చున్నట్లు మధురలో శిల్పమూర్తి కూడ కలదు. అది ఈ రెండు కథలలోను లేదు. అందు వలన నక్కీరుని కథ ఎన్నెన్ని రూపములు పొందినదో కూడ పరిశోధన చేయవలసి యున్నది.

నక్కీరుడు ద్రావిడభాషలో రచించినాడను ప్రతీతికల శతకరూప మగు శివస్తుతిమీద ధూర్జటి కెంతో అభిమాన మున్నది. చతుర్థాశ్వాసము లోని వేశ్యపుత్రికల కథలో వారు 'కవితా చమత్కారము మీద నక్కీరుడు చెప్పిన నూరు పద్యంబులు పాఠంబు చేసి నిత్య వ్రతంబుగా చరించు చుండిరని వర్ణించినాడు. మరల వారు శ్రీ కాళహస్తి విభుని గోపురము సమీపించుచు గూడ 'ద్రవిడ కవి రచితనుతిశత మవిరళగతి జదువు కొనుచు నన్య విచార వ్యవహార దూరులగుచున్ భవ భవన ద్వారమును గదిసి' రని పలికినాడు.

మరి యొక విశేషము కూడ శ్రీ కాళహస్తి మాహాత్మ్యములో కన బడు చున్నది. ద్వితీయాశ్వాసములో 'శతానందు'డైన బ్రహ్మదేవుని కామవాంఛకు అనుకూలముగా వాణి 'శత వాగ్వన జాననలుగా' రూపొం దిన కథ కలదు. భూతమునకు ఆహారము కానున్న వారిలో నక్కీరుడు సరిగా నూరవ వాడు. మనుష్య శతకమునే గాని ఆ భూత మాహారింపదు.

ఇప్పుడది ఉపలబ్ధమైనను కాకున్నను, ఎన్నడో ద్రావిడ భాషలో నక్కీరుడు శ్రీ కాళహస్తీశ్వరుని మీద శతకము చెప్పినాడను ప్రతీతి విని యున్నందుననే, ఆంధ్రభాషలో ధూర్జటి తన శ్రీ కాళహస్తీశ్వర శతకము వ్రాసినట్లు తోచు చున్నది. అది చదివిన వారికి కవిధూర్జటి జీవితములో పొందిన కష్ట సుఖములెన్నో పొడకట్టును. ఆతడు ప్రాపంచిక రాగద్వేషము లచే నాకృష్టుడై కలత నొందుచు, ప్రయత్న పూర్వకముగా శ్రీ కాళ హస్తీశ్వరునకు తన సర్వస్వమును కట్టి వేసుకొనుటకు పొందిన ఆరా టము, చేసిన తీవ్రసాధనయు శతకములో గోచరించును. భక్తుని ఆర్తి అందులో ప్రతిబింబించుట చేతను ధూర్జటి శతకము శివభక్తులకు నేటికిని నిత్య పారాయణ యోగ్యమైన భక్తి శతకముగా ప్రచారములో నున్నది.

ఆ శతకములో శ్రీ కృష్ణదేవరాయల అవసాన కాలములోని విజయనగర పరిస్థితులు కూడా కొంత కొంత స్ఫురించు చున్నవి.

ఈ విధముగా నత్కీరుని కధలోని ఔచిత్యముతో పాటు దానికి సంబంధించిన విషయములు సహృదయులు విద్వాంసులు పరిశోధకులు వెలువరింప దగినవి ఎన్నో ఉన్నవి.

(భారతి, మే-1964)

# శ్రీ శివశంకరుల పద్యనాటికలు*

నాటక ప్రక్రియయే ఆంధ్ర సారస్వతమునకు నూతనమైనది. గత శతాబ్దములో అది మొదట ప్రధానముగా సంస్కృత నాటకాంధ్రీ కరణముతో ఆరంభమైనది. తర్వాత స్వతంత్ర నాటకములు నెమ్మదిగా వెలసినా, అవి మొదటినుండి కేవల సంస్కృత నాటక లక్షణాలకు కట్టువడక కొద్దిగానో గొప్పగానో పాశ్చాత్య నాటక మర్యాదలను గ్రహించుచునే వచ్చినవి. ఐనను అవి ఛందస్సు విషయములో ఎంత మాత్రము పాశ్చాత్య పద్ధతులను అవలంబించలేదు అవి యన్నియు పద్య వచన మిశ్రమములే.

ప్రాచీన గ్రీకు లాటిను భాషలలో గాని ఇటాలియను, ఫ్రెంచి, జర్మను, ఆంగ్లాది భాషలలో గాని పాశ్చాత్య నాటకాలు బహుకాలమువరకు పద్యాత్మకములే కాని గద్యపద్యమిశ్రమములు కావు. పాశ్చాత్యనాటకాలలో వచనము నెమ్మదిగా చోటు చేసుకొని పెరిగిన మీదట కేవల వచన నాటకరచన ఆధునిక ప్రక్రియగా రూపొందినది. ఆధునిక పాశ్చాత్య నాటక కర్తలలో యుగపురుషుడైన ఇబ్సెన్‌కూడ మొదట పద్యనాటకములే వ్రాసెను. ఆధునిక కాలమువరకు ఐరోపా భాషలలోని ప్రసిద్ధ నాటకము లన్నియు పద్యప్రధానములే. వానిలో వచనము అపవాదప్రాయము.

సంస్కృత భాషకును, సంస్కృతభాషా ప్రభావితములైన భారతీయ భాషలకును పద్యనాటక నాటికాప్రక్రియ నూతనము. సంస్కృత రూపకము లన్నియు గద్యపద్య మిశ్రమములే ఐనను ఒక విశేష మున్నది. వానిలో గద్యభాగ మెంత విస్తారముగా ఉన్నను, ఆదినుండి వానిలో పద్యభాగములే ఎక్కువ ఆకర్షించు చున్నవి రాను రాను

---

* పద్యశబ్దము గేయమును గూడ గ్రహించు విపులార్థమునను, నాటికా శబ్దము లాక్షణికార్థములోగాక నేటి వ్యావహారికార్థమునను వాడబడినవి.

సంస్కృత నాటక కర్తలు పద్యములతో నింపసాగిరి. ఐనను కేవల పద్య నాటకము లేవియు కనబడవు.

ఆంధ్ర భాషలో కేవల పద్యనాటికా ప్రక్రియను, గేయ నాటికా ప్రక్రియను ప్రారంభించినదియు, విస్తార రచన చేసినదియు, ఆ ప్రక్రియను ఉత్తమస్థాయికి తీసుకొని పోయినదియు శ్రీ శివశంకరులే. ఇటీవల ఎందరో పద్య గేయ నాటికలు వ్రాసి మెప్పించుచున్నవా రున్నారు గాని వారి రచనలు శ్రీ శివశంకరుల నాటిక లందుకొన్న ఉన్నత సాహిత్య స్థాయిని అందుకోలేదు.

## II

పాశ్చాత్య నాటకములు పద్యమయములుగా ఉండుట ప్రహతమైన మార్గము. ఐనా అక్కడ కూడా ఆధునిక నాటకములలో వచన ప్రక్రియ వలె పద్యప్రక్రియ ఉత్తమస్థాయి నందుకో లేకున్నది. అట్టిచో సంస్కృతములో గాని ఆంధ్రములో గాని మార్గదర్శక రచనలు లేని ఈ పద్య నాటికా ప్రక్రియను శ్రీ శివశంకరులు అవలంబించుట ఎంత సాహసమో ఊహింప వలసినదే! ఆయన సంస్కృత నాటకము లెంత విస్తారముగా పఠించినాడో, ఐరోపా భాషల ప్రాచీనాధునిక నాటకములను అంత విస్తారముగా పఠించినాడు. ప్రామాణిక పాశ్చాత్య నాటకకర్త లవలంబించి నదియు నేటి నాటక కర్తలు విసర్జించినదియు ఐన ఈ పద్యనాటికా ప్రక్రియను ఆంధ్రములో ప్రవేశ పెట్టిన ఖ్యాతి సంపాదింప వలెననే ఉబలాటముతో ఆయన అందుల కుపక్రమింపకుండుట విశేషము. ఈ పద్యప్రక్రియ ఆయన రచనలకు స్వభావ సిద్ధముగా అనుకూలించుట చేతనే అవి రాణించు చున్నవి. ఆయన నాటికలను కేవల వచనములో గాని పద్య గద్య మిశ్రములుగా గాని రచించియుండినచో అవి ఇంతగా రాణించేవి కావు.

శ్రీ శివశంకరులు స్వతస్సిద్ధముగా కవి. ప్రధానముగా సంస్కృతాభిమాని. సంస్కృతాంధ్రాంగ్లములలో విద్వత్తే కాక, అనేకములైన ఇతర భాషలలో మంచి పరిజ్ఞాన మున్నవాడు. విశ్వసాహిత్యము తోడనే కాక లలితకళ లన్నిటితో గాఢ పరిచయమున్నవాడు. ఆయన రచన లన్నిటిలో ఆయన సర్వతోముఖ సంస్కృతి ప్రతిబింబిస్తూ ఉంటుంధి.

ఆయన జీవితములో 1924 ప్రాంతములో పెద్ద మలుపు వచ్చినది. అంతకు మునుపు ఆయన రచించిన ఖండ కావ్యములకును, 'హృదయేశ్వరి'తో ప్రారంభమైన రచనలకును ఎంతో అంతర మున్నది. హృదయేశ్వరిలో ఆశాజనకముగా ఉన్న గాథ ప్రేమగాథ స్ఫురించును. కాని తర్వాతి తర్వాతి కావ్యములలో విఫలమైన ప్రేమయే ఎక్కువగా ప్రతిఫలించు చున్నది. అసలు ప్రేమింపకుండుట కంటె ప్రేమించి విఫలు డవుటయే మేలని ఆంగ్లకవి చెప్పినాడు గదా!

శ్రీ శివశంకరుల నాటికలు ప్రధానముగా విఫల ప్రేమికములే, సఫలమైనవియు, అతికష్టము మీద సఫలమైనవి.

మరియొక విశేష మున్నది. మన దేశములో పూర్వ కాలమున కథా నాయికగా వితంతువు, పునర్భువు ఉండుట అశ్రుతము. ఎక్కడెక్కడి వితంతువులో, పునర్భువులో వచ్చి కథా నాయిక లవుట శ్రీ శివశంకరుల నాటికలలోని అసాధారణ విషయము!

విఫల ప్రేమలూ, అతికష్టము మీద ఫలించిన ప్రేమ కథలూ ఈ నాటికలలోని కథా వస్తువులైనను, 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' మాత్రము మొదటి నుండి తుది వరకు సుఖముగానే నడిచినది. అది జయదేవుని గీత గోవింద కావ్యము సభా మోదము పొందుటే కావ్య వస్తువుగా కలది. ఇందులో ఉత్కంఠ మొదటి నుండి కలుగుచునే ఉండును, ఈ నాటిక రంగస్థలము మీద పలుమార్లు ప్రదర్శింపబడి రక్తి కట్టించినది.

ఈ నాటికలలో వస్తువైవిధ్య మున్నట్లే విస్తారమైన వృత్తవైవిధ్యమును కలదు. పాశ్చాత్య దేశాలలో 'అపేరా' (Opera) అను పేర ప్రసిద్ధికల సంగీత నృత్య ప్రధాన నాటికలును వీనిలో కలవు. అట్టి వానిలో 'పదాంకము' అగ్రగణ్యము.

నాటకమునకు సంభాషణము ఆయువు పట్టు. వచనములో జరిగే సంభాషణము పద్యములో కూర్చుట చేత అస్వాభావికముగా కనబడే ప్రమాద మున్నది. ఈ చిక్కును అధిగమించుటకు సరళమైన భాషను పద్యములలో శివశంకరులు వాడినారు. ఈ పద్ధతిలో పద్యము పేలవ

మైనదిగా జారే ప్రమాద మున్నది. దీనిని గూడా అధిగమించి భావా వేశముతో సంభాషణలలో పుష్టి కలిగించి యుండుట శ్రీ శివశంకరుల రచనా వైశిష్ట్యము. సులభమైన భాష కాక అద్యంతము భావముననే కాక భాషలో కూడ ప్రౌఢముగా సాగిన నాటికలును కొన్ని యున్నవి. ఇట్లు ఆద్యంతము శృంగార భక్తి భావావేశముతో ప్రబంధ కవితా ప్రౌఢితో సమవృత్తములలో నడచిన వానిలో అగ్రగణ్యము 'దివ్య లోచనములు'

## III

శ్రీ శివశంకరుల పద్య నాటికలను వస్తువును బట్టి స్థూలముగా నాలుగు రకములుగా విభజింప వచ్చును.

1. వితంతు నాయికములు
2. భగ్న ప్రేమికములు
3. సఫల ప్రేమికములు
4. ఇతరములు.

## IV

వితంతువులు నాయికలుగా కలవి ముఖ్యముగా మూడు నాటికలు (1) దీక్షిత దుహిత (2) యక్షరాత్రి (3) ప్రతాప కుమారి.

(1) వీనిలో ప్రథమ గణ్యము 'దీక్షిత దుహిత'. అది విఫల ప్రేమికము గూడను. ద్రావిడ దేశములో నివాసము కల్పించు కున్నను ఆంధ్రాభిమానము వదలని ఆంధ్రబ్రాహ్మణుడు అప్పయ దీక్షితులు. 16, 17 శతాబ్దములలో అద్వితీయ విద్వాంసుడనియే కాక శిష్టాగ్రేసరుడనియు అపరశంకరుడనియు అఖిల భారత విఖ్యాతి పొందిన స్మార్తశివభక్త శిఖామణి. ఆయన కుమార్తె యొకతె బాల్యములో వితంతువు కాగా పునర్వివాహము చేయ నెంచియు శిష్టాచార విరుద్ధ మని సంక్షేపించు కొనెనని వృద్ధుల వలన విన్న ఐతిహ్యము ఆధారముగా ఈ నాటిక రచింప బడినది. అప్పయ దీక్షితులు తప్ప తక్కిన పాత్రల నామములు కల్పిత ములు.

దీక్షితులకు మరదలు సరసవాణి. పెద్ద కూతురు మరకతవల్లి. చిన్న కూతురు బాల వితంతువు మంగళాంబా. శిష్యుడు చంద్రమౌళి. వృద్ధియా

మముల కాలములో నడచుట చేత ఇంచు మించుగా పాశ్చాత్యుల ప్రాచీన నాటకములలోని స్థలకాలఘటనల ఏకత్వము (Three Unities) ఇందులో పాటింపబడినట్లే.

శిష్యుడు చంద్రమౌళి తాను ప్రేమించిన మంగళాంబ మీద పద్య రచన చేయు చుండగా, ఆమె వచ్చి అతడు వారించుచున్నను అవి చదువుటతో వారి పరస్పరాను రాగము ఇద్దరికి ప్రకటమవుటతో నాటక మారంభమౌను. ఆమె వలెనే వితంతువై వీరి యింట జేరిన పిన్న తల్లియు, సుఖసంసార జీవనము చేయుచున్న అక్కయు వారిద్దరికి వివాహము ఘటించుటకు ప్రోది చేతురు. దీక్షితులు స్త్రీ పునర్వివాహము శాస్త్ర సమ్మతమని నిశ్చయించి కుమార్తెకు వివాహము చేయుట కుద్యుక్తుడు కాగా, ఆయన మనస్సులో సంఘర్షణ మారంభించును ఈ సంఘర్షణములో వివాహము చేయ వలెననునది యువ బ్రాహ్మణులయు వితంతువులయు స్వరమేళల రూపముననను, శిష్టాచారమును గౌరవించి వివాహము చేయరాదనునది వృద్ధ బ్రాహ్మణ స్వరమేళగాను రూపొందింప బడినవి. ప్రాచీన పాశ్చాత్య నాటకములలో ప్రసిద్ధమైన కోరసు (Chorus) ఇక్కడ స్వరమేళలుగా గ్రహింపబడినవని మనము గమనింప దగినది. ఆ సంఘర్షణ మారంభించును. ఈ సంఘర్షణములో శిష్టాచార ముమ గౌరవింపవలెనను భావమే జయించును. శివధ్యానముతో తీర్థ యాత్రాపరుడై చంద్రమౌళి మంగళాంబ వద్ద సెలవు తీసుకొనుటతోను. నాయిక దుఃఖ భారముతో నటరాజ శివధ్యానమే గతియని నమస్కరించుటతోను నాటకము పూర్తియౌను.

శిష్ట విద్వత్కుటుంబ మిందులో చక్కగా చిత్రింప బడినది. శివ శంకరుల నాయికానాయకులు తరుచుగా విద్వత్కవులు కవయిత్రులు నగుట ఇందులోనను కాననగును. చంద్రమౌళి రచించుచున్నట్లు చిత్రింపబడిన పద్యాలు శివశంకరుల హృదయేశ్వరిలోని పద్యాలనే తలపించును. హృదయేశ్వరిలో నాయిక తరచుగా 'లక్ష్మి' యని వర్ణింపబడినది. అందుకు పర్యాయపద మనదగినదే ఇందలి నాయిక మంగళాంబ పేరు.

దీనిలో మంజరీద్విపదలు, తేటగీతులు, ముత్యాలసరాలు, రగడలు ముఖ్యముగా ప్రయోగింపబడినవి. మొదటినుండి చివరవరకు కరుణతో కూడిన కావ్యామోదము వాసించు మూడురంగముల ఈనాటిక, శ్రీశివశంకరుల పద్యనాటికలలో ఉత్తమశ్రేణిలో పరిగణింపదగినది।

(2) ఇక 'యక్షరాత్రి', వికటనితంబ పేరుమీద వినవచ్చుచున్న ఐదారు శ్లోకములును, ఆమె పునర్భువు అను ప్రతీతిమీదను కల్పింపబడిన దీ నాటిక. ఆమె ప్రథమభర్త నిరక్షరు డనుటకు ఈ క్రింది శ్లోకము విద్వత్పరంపరగా శ్రుత మవుచున్నది.

"కాలే మాషం సస్యే మాసం
వదతి శకాశం యచ్ఛ సకాశమ్
ఉష్ట్రే లుంపతి రంవా షంవా
తస్మై దత్తా వికటనితంబా"

శ్రీశివశంకరుల నాయికలు తరుచుగా విద్వత్కవయిత్రులే కాక సంపన్న లగుటయు కొంతుము. అందుకు వికటనితంబ ప్రథమోదాహరణము.

యక్షరాత్రి యనునది శుక్ల పక్షము రాత్రిలో యక్షులను గూర్చి చేయు ఒకానొకవ్రతము. కాలక్రమాన జూదముతో కాలముపుచ్చు క్రీడారాత్రముగా మారినది. కొందరి మతములో దీపావళి అమావాస్యయే యక్షరాత్రి. మరికొందరిమతములో నది కార్తిక పూర్ణిమరాత్రి. వెన్నెల రాత్రి యని శివశంకరులు నిర్దేశించుటచేత కార్తికపూర్ణిమనే గ్రహించి రనుట యుక్తము. ఒకవెన్నెలరాత్రి ద్వితీయయామములో నారంభమై షుమారు యామము కాలములో పూర్తి అవుతుంది. రంగ మన్నా అంక మన్నా ఒకటే. కాళిదాసాదిమహాకవులజన్మస్థాన మని ప్రసిద్ధిగల ఉజ్జయినీ నగరములోని సౌధారామము రంగస్థలము వికటనితంబానామమే ప్రసిద్ధమైనను నితంబవతిగా మార్చుట శివశంకరుల కళాభిరుచికి దృష్టాంతము.

నితంబవతి గణిక యనియు, తనకు ప్రీతిపాత్రులైన కవులను, గాయకులను శయ్యాసౌఖ్యముతో సత్కరించు ననుభావముతో నేమికవియు, భీమరథుడను గాయకుడును ఆమె విడిదికి వచ్చినారు. ఇంతలో నక్కడికి గణికలయింటికి రాడను ప్రతీతి కల గౌరవపాత్రుడగు ఇందురాజు వచ్చుట వారి కాశ్చర్యమైనది. నితంబవతి చెలికత్తె యగు సునందచేత అడ్డుగా కాండపటముపెట్టించి కవితాగోష్ఠి సాగించును. కొంతసేపైనపిమ్మట నేమి కవికి భీమరథునికి ఆమె తాంబూలము లిప్పించును. అది వెళ్ళవచ్చు నని సంకేతము. వారిద్దరు వెళ్ళినతర్వాత కాండపటము తొలగించి ఇందురాజుతో కవితాగోష్ఠి జరుపును. అతడు తనయందు కవయిత్రి యను గౌరవముతో వివాహ మాడవలె నను సదుద్దేశముతో వచ్చినా డని తెలిసికొని ఆదరించి తాను వితంతువు ననియు క్షత్రియాంగన కనుక బ్రాహ్మణుడైన ఇందురాజుకు వివాహ యోగ్యను కాననియు, విన్నవించును. కాని అతడు,

"వికటనితంబావిభు డను నభిదయె
నాకు జాలు ప్రియ, నరలోకములో"

అనును. ఉభయుల గాఢాలింగనముతో పునర్భూ నాయిక మగు ఈనాటిక ముగియుచున్నది.

ఉజ్జయినీనగరము, సౌధారామము, శిప్రానదీ తీరము, వెన్నెల రాత్రి. పాత్రలందరు కవులు, కవయిత్రులు, గాయకులు. సంస్కృత ప్రాకృత కవనములతో గుబాళించుచున్న దీనాటిక. భారతదేశ చరిత్రలో సువర్ణయుగ మని ప్రసిద్ధి కల గుప్తయుగములో 6వ శతాబ్దములో కథ జరిగినట్లు భావింపబడినది.

ఇందులోకూడ పాశ్చాత్యుల దేశకాల ఘటనల ఐక్యము పూర్తిగా పాటింపబడినది. బహువిధములైన ఛందస్సులలో నడిచిన దిది. సందర్భమునుబట్టి హృదయములో నుండి ఏఛందస్సులో పంక్తులు రూపొందెనో దానియందే రచన సాగినది. ఒకవిధముగా అల్పబుద్ధులగు కళాకారులపై ఉదాత్తనిర్మల భావము కల కవి విజయమే ఇందులో చిత్రింపబడినదని చెప్పదగును.

3. 'ప్రతాపకుమారి' చాల చిన్ననాటిక. ప్రతాపకుమారి మాళవరాజుపుత్రిక. నాయకుడు హమీరసింగు ఉత్తమక్షత్రియుడు, ప్రసిద్ధమైన బప్పరాట్కులుడు. శత్రువైన మాళవరాజు తనకుమార్తెను ఇచ్చుటకు సమ్మతించుటచే, ఏదో మోసము జరుగునని శంకించుచు హమీరకుమారుడు ప్రతాపకుమారిని సమీపించును. నెమ్మదిగా వారి కన్యోన్యప్రేమ గాఢముగా కలదని సంభాషణములో వ్యక్తమగును. అప్పు డామె తనవాస్తవవిషయము వెల్లడించును. ఆమెకు ఊహ తెలియని వయస్సున ఒకానొక క్షత్రియకుమారునితో ఉద్వాహము (ప్రధానము వంటిది) జరిపినారు. వివాహము కాకముందే అతడు యుద్ధమరణము నొందెను. కావున తాను అన్యదత్త కనుక పవిత్ర బప్పరాట్కులక్షత్రియు డగు హమీరసింగునకు భార్యగా నుండదగదు.

ఇట్లు విన్నవించిన ప్రతాపకుమారిని అసదృశురాల వని హమీరకుమారుడు అగ్గించి భార్యగా పరిగ్రహించును.

ఇదియుఏకాంకికయే. స్థలకాలఘటనల ఐక్యము ఇందును పాటింపబడినది.

ఇందులోని పద్యములన్నియు ఉత్పలములు, శార్దూలములు. పద్యపాధములు కూర్చుటలో, విరుచుటలో ఎంతోనేర్పు మధ్యమధ్య ప్రదర్శింపబడినది. చిన్నదైనను మనోజ్ఞమైన దీనాటిక,

భగ్నప్రేమికములలో అగ్రగణ్యమైనది 'దీక్షితదుహిత'. అది వెనుకటి శీర్షికక్రిందనే వచ్చినది. అదికాక పేర్కొనదగినవి. (1) వరపరీక్ష (2) దీపారాధన.

## V

(1)"వరపరీక్ష" - దుర్గాధిపతియగు గంభీరసింగు కుమార్తె అలకాదేవిని జ్యోతిస్సిం గను క్షత్రియకుమారుడు ప్రేమించినాడు. తండ్రి దుర్గములో లేడను ప్రియురాలి సంకేతమందుకొని రహస్యముగా దుర్గములో ప్రవేశించినాడు జ్యోతిస్సింగు. నాయికానాయకులిద్దరూ ప్రేమ సల్లాపములో నుండగా, అనుకొనకుండా తండ్రి వచ్చి చూచి దొంగవలె నాకోటలో ప్రవేశించినా వేమని జ్యోతిస్సింగును ప్రశ్నించును. నీకుమా

ర్తైను ప్రేమించి వివాహ మాడు పవిత్రాశయముతో వచ్చితి నని జ్యోతి స్సింగు జవాబు. అంతకుముందే తండ్రి అలకాదేవిని దుర్జయసింగున కీయ తలపెట్టియుండెను. ఇప్పుడాతడు వీరిద్దరికిని చిత్రమైన వరపరీక్ష పెట్టి నెగ్గిన కుమార్తె నిత్తునని ప్రతిజ్ఞ చేయును.

"ఒక్కరోజు పూర్ణముగా నుపవసించి శుచులయి
ఇరువురిలో నెవరు కన్య నెత్తుకొని నగంబు నెక్కి
దేవిమందిరంబుకడను దింపగలరు వారి కేను
ప్రీతితోడ కన్నెనిచ్చి పెండ్లి చేతు; ఇది ప్రతిజ్ఞ"

ముందు జ్యోతిస్సింగు ఒప్పుకొని బయలుదేరినాడు. అలకాదేవి ప్రోత్సాహముతో చాలవరకు పర్వతమెక్కగలిగినాడు. కాని గమ్యము సమీపములో నుండగా శ్రమకు ప్రాణాలు వదిలినాడు జ్యోతిస్సింగు. అది చూచి అలకాదేవి చురకత్తితో పొడుచుకొని ప్రియుని దేహముపైన ఒరిగిపోయినది. 'లోపించెను లోచనతారక' అని తండ్రి విలపించెను. అంతకంటెను ప్రతికక్షియైన దుర్జయసింగు దుఃఖించుచు పలికిన ఉదాత్త గంభీరవాక్యములతో నాటిక ముగియుచున్నది.

"దుర్గేశా యెల్లరమును దోషావిష్టులమైతిమి ప్రాయశ్చిత్తసూచకముగ ప్రణమిల్లుద మీస్థలమున"

(అందరును మోకరింతురు)

"ఇది పవిత్రమైనభూమి! ఈరంగముమీద చంద్ర
కాంతశిలామంటపంబు కట్టింపుడు దుర్గేశా
పూతముగా నెగడుగాక పుణ్యదంపతీచరిత్ర
విన్నవారిమానసములు విగతకల్మషమ్ము లగును"

ఎక్కువభాగము రగడలతో మధ్య మధ్యద్విపదలతో గీతికలతో వీరము, ప్రేమభక్తివైరాగ్యములు ఆవేశింపజేయుచు నడచిన దీ ఉత్తమ నాటిక !

(2) 'దీపారాధన' చిన్నదైనా ఎంతో గంభీరము కరుణము అయిన వస్తువు.

ఝూలారాజకుమారిని ప్రేమించి బలవంతముగా తెచ్చి కుంభరాణా తన కుంభమీరు దుర్గములో బంధించినాడు. అత డామెను తనకు రాణివి కమ్మని కోరెను. ఆమె వినయముతో తా నన్యుని ప్రేమించినానని తెలిపి తండ్రి కడకు తిరిగి పంపుడని ప్రార్థించుచు, మీరు గీతగోవిందమునకు రసికప్రియ యనువృత్తి రచించిన భావుకులు గదా! అని గుర్తుచేసినది.

కుంభరాణా తా వామెను పొరపాటున తెచ్చినాననియు, ఐనను ఇప్పుడామెను వదలుట తన గౌరవమునకు హీనత ఆపాదించుననియు చెప్పి, "ఏమియు కోపము లేకుండా ఇక్కడనే సుఖముండి ఎప్పుడు బుద్ధిమారిన నప్పుడు తెలిపి గ్రహింపు" మని వెడలిపోవును.

ఝూలా రాజకుమారికి ప్రియుడైన మందర దుర్గపాలునిమీద- ఆరని దీపశిఖవలె ప్రేమ ప్రజ్వరిల్లుచున్నది. తన ప్రేమకు ప్రతీకగా దీపము వెలిగించి ప్రార్థించుటతో నాటిక సమాప్త మవుచున్నది.

"శుక మట్లు పంజరము జొచ్చితి ప్రాణనాథా
అనిశంబు నాదు హృదయాలయమందు నాథా
అనురాగదీపశిఖ ఆరక ప్రజ్వరిల్లున్
కనుగొంచు నాయెదద కాంతు డెరుంగునట్లుల్
పెనుదీప మగ్రమున పెట్టుదురాత్రివేళన్
(దీపము వెలిగించి)
మదిలో నిరంతరము 'మందర' దుర్గపాలు
పదపద్మముల్ నిలిపి భక్తిని పూజచేతున్
బ్రతికించుకొండు తమభార్య నటంచు తెల్పం
గదె దీపికా, హృదయకాంతున కెట్టులైనన్"

అస్వతంత్రులై ప్రేమను ఆరని దీపికగా హృదయములో నిలుపు కొనువారి కందరికి చిహ్నముగా వెలసిన దీ దీపారాధన. కుంభరాణా మాటలు వసంతతిలకా వృత్తముననను, రాజకుమారిమాటలు అతిశక్వరి ఛందములో హంసయానమువలె కొంతవరకు సాగి తర్వాత భేదించు అపూర్వ సమవృత్తములోను సాగినవి.

## VI

సఫలప్రేమికములతో ఎన్నదగినవి (1) కవిప్రియ (2) ప్రభు వాక్యము (3)సహజయానపంథీ (4) సద్వాక్యము.

1. ఈ యన్నిటిలో 'కవిప్రియ' పెద్దదీ, వైవిధ్యముకలదీ. ఇది ప్రసిద్ధమైన యామినీ బిల్హణుల ప్రేమకథ ఆధారముగా రచింపబడినది. కాండపట నిర్మాణము లేకుండుట వంటి మార్పులు చేయబడినవి సందర్భానుకూలముగా కొత్త పాత్రలు సృష్టింపబడినవి.

ఇందులో బిల్హణునికంటె యామినియే ప్రేమతో ముందడుగు వేసినది. వారి ప్రేమకథ తెలిసి తండ్రి మదన భూపతి బిల్హణకవి అంతఃపుర ద్రోహము చేసినందుకు శూలారోపణ శిక్ష విధించినాడు. అతడెందరెంత చెప్పినను వినడు. తుదకు శూలారోపమునకు సిద్దమగుచున్న వేళలో గూడ మహాయోగివలె ప్రియురాలినే ధ్యానించుచున్న బిల్హణకవి ప్రేమయోగమునకు ముగ్ధుడై శిక్షను వారించి కవిని సగౌరవముగా అల్లునిగా చేసుకుంటాడురాజు. సంస్కృత బిల్హణచరితములోని శ్లోకములెన్నో ఇందు ఆయా సందర్భములలో గ్రహింపబడినవి.

"బాలార్కద్యుతిమత్కిరీటము శిరోభాగమ్ము మీదన్ మణి
ప్రాలంబం బురమందు కాంతులెసగన్ భద్రేభయానమ్ముపై
నీలచ్ఛత్రము క్రింద బిల్హణుని నిర్నిద్రోత్సవ శ్రీలతో
ఆలోకింపగ పౌరులెల్ల కొనిరమ్మా, కోటిపాలాగ్రణీ!"

కవిప్రియ 5 రంగములనబడిన 5 అంకముల సంపూర్ణ నాటకము. ఎనిమిదిమంది పాత్రలు. ఇది కేవలము ప్రేమ విజయము, కవితా విజయముగానే అనేక రసవద్ఘట్టములతో కూర్పబడినది. భావతీవ్రత బహువిధములైన ఛందస్సులలో వ్యక్తము చేయబడినది. అత్యంత ప్రసన్నముగా ఆనందతుందిలముగా సాగిన కథ ఆకస్మికముగా విషాద భరితమై చివరి క్షణములో ఆనంద పర్యవసాయి ఐనది. దీనిని శ్రీ శివశంకరులు రచించిన పద్యనాటికలలో విస్తృతిలోనే కాక గుణమునందును ప్రథమ గణ్యమన దగును.

2. 'ప్రభువాక్యము' చాల చిన్నది రెండేరంగములు. ఉత్కళ రాజు కాంచీ రాజపుత్రికను తనకిమ్మని వార్త పంపగా కాంచీరాజు 'నీవు

సమ్మార్జకుడవు. కులహీనునకియ్యను' అని నిరాకరించెను. ఉత్కళరాజు క్రుద్ధుడై దండెత్తివచ్చి కాంచీ రాజకుమారుని చెరబట్టి సమ్మార్జకున కిచ్చి వివాహము చేయుమని మంత్రి నాజ్ఞాపించెను.

కాంచీ రాజకుమారి ఉత్కళరాజు పురుషోత్తమునిపై తనకు గల ప్రేమను తెలిపి చిక్కు తీర్పుడని మహామాత్యు నాశ్రయించినది. సంవత్సరమున కొకమారు నీలాచల క్షేత్రమున జగన్నాథస్వామి సన్నిధానమున ఉత్కల ప్రభువు బంగారు సమ్మార్జనితో ప్రాంగణ మూడ్చుట యాచారము. ఆసమయములో రాజుకు కాంచీరాజకుమారిని అర్పించి మహామాత్యుడు రాజశాసనము నిర్వర్తించితి నను. సరసుడైన రాజును కాంచీరాజకుమారిని ప్రేమతో పరిగ్రహించి మహామాత్యుని బుద్ధికుశలత నగ్గించును. అభిమానము, గర్వము, హెచ్చుతగ్గులు జగన్నాథ స్వామి సన్నిధానములో అంతరించుట హృదయంగమముగా చిత్రించబడిన దీ చిన్ని నాటికలో.

3. సహజయానపంథీ: వంగమహాకవి చండీదాసు చాకెతయైన 'రామి' ని ప్రేమించిన కథ. ముఖ్యముగా వంగదేశములో వ్యాప్తి నొందిన 'మధుర భక్తి' చిత్రంచు నాటిక యిది. తాంత్రిక సాధనలలో ప్రియురాలిని పరమేశ్వరీ భావముతో అర్చించుట కనబడును. అట్టి వానిలో 'సహజయాన' మొకటి. శిష్టాచారము వదలిన చండీదాసును అతని కుటుంబమును వంగబ్రాహ్మణలు వెలివేయుదురు. కాని కొందరు బ్రాహ్మణులే,

"చాకెత కాదే చతుర్భుజంబుల
జనని 'వాసులా'చ్ఛాయ కనంబడు

నందురు. శిష్టబ్రాహ్మణులు మాత్రము,

"భ్రష్టత్వమునకె ప్రాబల్యం బిక
పదుడు పదుండో బ్రాహ్మణులారా"

అని విచారముతో నిష్క్రమింతురు కాని చండీదాసు మాత్రము అర్ధనిమీలిత నేత్రుడై,

"రామమణీ రామమణీ రామమణీ బ్రహ్మమయీ,
రామమణీ బ్రహ్మమయీ రామమణీ రామమణీ!"

అనియే ఆలాపించును. ప్రమాదభూయిష్టమైన సహజ యానము ఉత్త మాధికారులకు ఏ విధముగా ఉత్తమ సాధ్యముగా పరిణమింపగలదో మూడు రంగములున్న ఈ నాటికలో చిత్రింప బడినది.

4. "సద్వాక్యము" నాలుగు రంగముల చిత్రమైన నాటిక. ధాన్య కటకము రంగస్థలము. కాలము 3వ శతాబ్దము.

రాజీవలోచన, సుమతి, ఒండొరులను ప్రేమించిరి. కాని రాజీవ లోచన భదంత రాహూలుని బోధలచే బౌద్ధధర్మ మాశ్రయించి భిక్షుని కానెంచి యున్నది కాని ఆమెకు సుమతిపై గల ప్రేమ విడువక ఇటు నటు తూగులాడుచున్నది. యౌవన మధ్రువ మని మనసు కెక్కించు టకు భదంత రాహేలు డామెకు కపాలమును బహూకరించెను. యౌవన మధ్రువమను భదంతుని ఉపదేశమును శిరసావహించి ఆమె వెంటనే సుమతిని వివాహమాడి సంసార సుఖము అనుభవింప నిశ్చయించినది. ఆమెను పొందుటకై సుమతి ఆర్యధర్మము పరిత్యజించి బౌద్ధధర్మ మాశ్రయించుటకు సిద్ధమైనాడు. కాని తుదకు రాజీవలోచనయే ఆర్య ధర్మమును పరిగ్రహించినది.

కేవల సన్యాసమే గతి యని బోధించి శిథిలోన్ముఖ మవుచున్న బౌద్ధ ధర్మమునకు ప్రతీకగా ఈ నాటికను భావింపవచ్చును. మధ్య జరి గిన ఊగులాట కంటె అంతమున వచ్చిన మలుపు నాటికలో మెరపువలె ప్రకాశించుట సద్వాక్యములోని విశిష్టత.

## VII

పై మూడు శీర్షికలలో అంతర్భవింపని నాటికలు పెద్దవి చిన్నవి అనేక మున్నవి. వానిని విస్తరించి వర్ణించుట ప్రత్యేకముగా చేయదగి నది. వాని నిందు స్పృశించి వదలుదుము.

వీటిలో 'పద్మావతీ చరణ చక్రవర్తి' అగ్రగణ్యము. జయదేవుడు రాజ సభకు పోవుచుండగా గీతాగోవిందములో తనపేరు వచ్చిన మూడు భాగములు మార్చుమని పద్మావతి భర్తను వేడుకొనును. సభలో ఆ మూడుతావులనే కవికి విశేష గౌరవము కలుగుట ఇందలి ప్రధాన విష యము. ఇది గీత గోవింద కావ్య విజయము! విద్వాంసులకు కవులకు రసికులకు హృదయాహ్లాదము కలిగించు ఉత్తమ నాటిక. ఇది మొదటి

రచనయేమో కూడను. శ్రీ శివశంకరుల కిది మిక్కిలి ప్రీతిపాత్రమైనది. కావున భార్యాస్మృతికి అంకితము చేసినారు.

తర్వాత ఎన్నదగినది పదాంకము. ఇది సంగీత నృత్య నాటిక (Opera) అనవచ్చును. దీని వస్తువు అత్యద్భుతమూ, అసాధారణమూ. కాశ్మీర ప్రభువు లలితాదిత్యుడు నటవిట గాయకులతో ప్రొద్దు పుచ్చుచున్నాడు. కల్యపాలుని పుత్రిక జయను అంకము చేర్చినంతలో రాజనర్తకి రాగా జయను అంతఃపురము చేర్చినాడు. కోపించిన రాజనర్తకిని శాంతింప చేయుటకు ఆనాడు రాజపరివారమంతయు శ్రీ చందనముతో రాజనర్తకి పదాకింతములైన నిచోళములే ధరింపవలె నని శాసించెను. పురప్రముఖులు మొరపెట్టుకొనుటకు రాజదర్శనార్థము రాగా వారికి అగ్నిపర్ణునివలె గవాక్ష ప్రసారిత పాద దర్శనమే ఇచ్చును. బ్రాహ్మణులు తమ నీతిబోధ వృథకాగా అగ్రహారములు విడిచి వెళ్ళుదురు. మహామంత్రి ఉద్యోగమునుండి విరమించును. కొంచెము వెనుకాడినరాజు ఇంతలో చాటుకారుల పల్కులతో ప్రబోధితుడై రాజనర్తకి పదాంకితనిచోళము తానే ముందు ధరించి ఆసవ సేవతో నృత్యగీతములతో ప్రపంచము మరచి పోవును ఇంతటి భోగ లాలసత్వములో గూడ రాజుకు సంస్కృత భాషయందు గల నిశిత విజ్ఞానము, అభిమానము తొంగిచూచుచుండును. అపూర్వ విధానమున రచింపబడినది.

'దివ్యలోచనములు' ప్రియురాలి మనోజ్ఞలోచనములకు ముగ్ధుడై తుదకు శ్రీ మద్రామానుజులు చూపిన శ్రీ రంగనాథస్వామి దివ్యలోచనములు దర్శించి ధనుర్దాసు మహాభక్తుడుగా మారుట వస్తువుగా కలది. ఉత్పల చంపక శార్దూల మత్తేభవృత్తములతో ప్రౌఢ భాషలో సాగిన మంచి చిన్ననాటిక

'శిష్యరాలు' ఆశ్రమముతో స్త్రీలరాక నిషేధించిన రూపగోస్వాముల నియమములను తన శుద్ధ ప్రవర్తనముచే మీరాబాయి మార్చి శిష్యరాలగుట వస్తువు. రెండే రంగములు.

'ప్రభుతీర్థము' చైతన్య స్వామివారు శ్రీకృష్ణుడని భావించి సముద్రమును కౌగిలించిన ఘట్టమును ప్రదర్శించు చిన్న ఏకాంకిక!

'ప్రలితకేశము' మఖాదేవప్రభువు తన శిరస్సున పలితకేశము చూచి తను వశాశ్వత మని బుద్ధ ధర్మము స్వీకరించి సన్యాసి యయిన కథ ముత్యాలసరములలో నడిచిన ఈ నాటికలో విరక్తి పుట్టకముందు రాజు భోగపరత్వము కళాభిమానము మనోజ్ఞముగా వర్ణితమైనది. శివ శంకరులు తన శిరస్సున మొదట శుక్లకేశములు చూచినప్పుడు ఖండ కావ్య మొకటి వ్రాసియుండిరని మనము గుర్తుంచుకొనవలెను.

బ్రాహ్మసూత్ర భాష్యవివృతి వ్రాయుటలో నిమగ్నుడై భార్యతో కాపురము చేసి యెరుగని వాచస్పతి మిశ్రులు సన్యసింపబోవుచు తన కృతికి భార్యపేర 'భామతి' అని నామకరణము చేయుటయే 'భామతి' నాటిక!

'లోపాముద్ర' దానికి తుల్యముగానే నడచి భార్యభర్తల సంయోగముతో సుఖాంతమైన నాటిక!

'క్రుద్ధముని' జమదగ్ని కథ. 'గురుశిష్యులు' స్త్రీరక్ష అవశ్య కర్తవ్య మని బోధించు పురాణ కథ 'అశరీరవాణి' 'అదృష్టదేవత' చిన్నవి. 'రత్నాకరము' పెద్దదే కాని దానిని వేరుగా విఫల ప్రేమికము లలో వివరింపదగును. అట్టిదే 'నౌకజాయ' హృదయేశ్వరిలో నంతర్గత ములైన 'శుభస్వప్నము' 'లోకయాత్ర' 'దేవాలయము' ను, 'అశా వాన్' 'శిలాప్రతిమ'- ఇత్యాదులింకను కలవు. అన్నియు విశిష్టత కలవే. వానిలో తళుక్కుమని మెరపించనిది ఒక్కటియు లేదు.

## VIII

శ్రీ శివశంకరుల పద్యనాటికలు ప్రదర్శన యోగ్యములా యను ప్రశ్న వేయవచ్చును. దీనికి సదుత్తర మిచ్చుటకు ముందు కొన్ని సం గతులు ఆలోచింపవలసియున్నది.

నాటక ప్రదర్శనము రక్తి కట్టుటకు మూడు కలిసిరావలెను. ఒకటి, నాటకము. రెండు, దానికి తగిన రంగస్థలము, మూడు, ప్రేక్ష

కులు. మొన్న మొన్నటివరకు పద్యములు రాగములు దీసి పాడినప్పుడు వన్సుమోరులతో అగ్గించి ఆనందించుచుండెడి ప్రేక్షకులను నేటి వచన నాటికలు రంజింప జేయలేవు. వీరిని అవి రంజింపజేయలేవు. అధికారి భేదములు బట్టి అవియు మారుచుండును. పూర్వము బి. సి. లో అథెన్సు నగరములో ఆరుబయల ప్రదర్శింపబడి అశేషజనామోదము పొందిన ప్రామాణిక నాటకము లీనాటి సాధారణ నాటకశాలలలో ప్రదర్శించినచో రెండు నిముషములకంటె సాగవు. అంతమాత్రమున వాటికి నాటకీయత లేదనలేముగదా!

ఉత్తమ నాటికా నాటకములకు ప్రథమ రంగస్థలము సహృదయుల హృదయ రంగమే. అక్కడ నాటకము రక్తి కట్టినచో ఉచితమైన రంగస్థలమును నటీనటులు నిర్మించుకొని సహృదయుల సమక్షమున ప్రదర్శించినచో నది తప్పక రక్తి కట్టగలదు. సహృదయుడనగా సంస్కార మున్నవాడుగాని పై క్లాసుదో, క్రిందిక్లాసుదో, టిక్కెట్టు కొన్నవాడు కాదు. ఏ కాలములో నైనను ఏ దేశములో నైనను ప్రేక్షకు లందరు సహృదయులుగా నుండరు. సహృదయుల అభిరుచి ప్రేక్షక లోకమంతటి మీదను అప్రయత్నముగా ప్రసరించి మార్గదర్శకముగా నుండవలెను. అప్పుడే ఉత్తమ సాహిత్యస్థాయి కల నాటకములు రక్తి కట్టగలవు. నేడు రంగస్థలము మీద రక్తి కట్టుచున్న నాటకములు సర్వసాధారణముగా సాహిత్యముగా ఎక్కువ విలువలేని వగుట చేదైన సత్యము. ఇది మారవలెనంటే ప్రేక్షకులస్థాయి పెరుగవలె!

పద్యము సంభాషణలో అస్వాభావికముగదా యని మన దేశములో శంక గలుగును. నాటక ప్రదర్శనమే అస్వాభావికము. ఏదో కథ జరుగుతున్న దని భ్రాంతి పడుటకే ప్రేక్షకులు గూడుదురు. శ్రీ శివశంకరుల పద్యనాటకానాటికములు ఉచితరంగస్థలము మీద, తగిన నటీనటులు సహృదయ ప్రేక్షకుల సమక్షమున ప్రదర్శించినచో తప్పక రక్తి కట్టగలవు. అందుకు అవి పఠించి నప్పుడు హృదయ రంగమున నాట్యమాడి రక్తికట్టించుచుండుటయే ప్రథమ ప్రమాణము. వారి 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' రంగస్థలము పైన అనేక పర్యాయములు

ప్రదర్శింపబడి రక్తి కట్టించిన దనుట రెండవ ప్రమాణము. రెండవది ప్రత్యక్షము. మొదటిది అనుమానము. ప్రత్యక్షానుమాన ప్రమాణములు రెండును ఇవి ప్రదర్శనార్హములని నిరూపించుచున్నవి. 'సహృదయాః ప్రమాణమ్'.

(అక్షరార్చన-1972)

(డా॥ పాటిబండ మాధవశర్మగారి షష్టిపూర్తి సన్మాన సంచిక)

# జామ్బవతీ పరిణయమ్

కర్ణాట క్షితిపాల శేఖరమణియైన శ్రీ కృష్ణదేవరాయలు రచించిన ఈ సంస్కృత నాటకమును ఆం. ప్ర. సాహిత్య ఆకాడెమీ వారు దేవనాగరి లిపిలో అందముగా ప్రచురించుట సర్వవిధముల సంభావ్యము. అనేక సంస్కృతాంధ్ర గ్రంథములకు సంపాదకత్వము వహించిన అనుభవజ్ఞులగు డా. బి. రామరాజుగారికి పరిష్కరణ భారము అప్పగించుటయు సమ్మోదావహము. శ్రీ రామరాజుగారు పరిష్కరణములో తమ గురువర్యులగు రఘునాథ చక్రవర్తిగారియు, మిత్రులగు డా. పుల్లెల రామచంద్రుడు, శిరోమణి విఠలదేవులయు సహాయము పొందుట సంపాదకులు చూపిన శ్రద్ధకు నిదర్శనము.

ఆముక్తమాల్యదావతారికలో రాయలు రచించినట్లు పేర్కొనబడిన సంస్కృత గ్రంథములలో ఈ నాటకము లేకున్నను రాయల కర్తృత్వమున కెట్టి సందేహమును లేదు.

ప్రథమ నాందిశ్లోకమే ఆర్షతుల్య వాక్కులతో పాఠకులను ఆకట్టుతున్నది.

'వాఞ్ఛాం వ స్సతతం దేయా
త్త ద్వారణ ముఖం మహః
యచ్చన్ద్ర మౌళే రానన్ద నిష్యందం
ప్రథమం విదుః'

ఇందులో నాందీ లక్షణము ననుసరించి ద్వాదశపదము లున్నవి. చంద్రపద మున్నది. ఆశీర్వచన రూపమైనది. రెండవ నాందీ శ్లోకములో కమలానాథుడు, మూడవ దానిలో నీలా రుక్మిణీనాథుడు, నాల్గవ దానిలో వాయుపుత్రుడు సౌఖ్యాదు లిత్తురుగాక అని ఆశీర్వచనము లున్నవి. ఈ నాలుగు నాందీ శ్లోకముల పిమ్మట సూత్రధారుడు ప్రవేశించి రామ

మహస్సుకు నమస్కరించి పుష్పాంజలి సమర్పించును. నటిని రావించి సూత్రధారుడిట్లు నాటక ప్రస్తావన చేయును.

'అద్యఖలు భగవత శ్చరాచరరోః అపార కరుణా పారావారస్య సమ దమర శిరో మన్దార కుసుమ వాసిత పాదారవిన్దస్య విజయనగర నివాస వాసనావ ధీరిత ధనద నగర విహార దోహలస్య హేమకూటగిరి కటక వాస్తవ్య కుటుమ్బినః కర్ణాట రాజ్యరక్షామణేః శ్రీ విరూపాక్ష దేవస్య చైత్రోత్సవాలోకనాయ సఙ్గతా పరిషత్.'

అని వర్ణింపబడిన సభలో నాటక ప్రదర్శనము జరగనున్నట్లు ప్రస్తావింపబడుట గమనార్హము. తర్వాత 'కృష్ణరాయః కవిః' అని చెప్ప బడినది. పిమ్మట మనోజ్ఞముగా,

'అసారా మపి గృహ్ణన్తి వాచం హరికథా శ్రయామ్
సుమనో గన్ధలోభేన సూత్రం శిరసి ధార్యతే'

ప్రస్తావన పూర్తి యగునప్పటికి సూక్ష్మ దృష్టి కలవారు ఈ నాటక కర్తయగు రాయలు ఆముక్త మాల్యదలోవలె రామానుజ వైష్ణ వాభిమానమును, పరమత ద్వేషమును గల రాయలుగా గాక, ఇతర సాక్ష్యముల వలన మనకు తెలియ వచ్చు సర్వమత సామరస్యము గలిగి ప్రజారంజకుడగు ప్రభువుగా దర్శన మిచ్చు చున్నట్లు గమనింప గలరు. నాలుగవ నాంది శ్లోకములో వాయుపుత్రుడు ప్రస్తావింప బడుటచే రాయలకు గల విష్ణుప్రీతి మాధ్వవైష్ణవుల సంప్రదాయము ననుసరించిన దనియు తోచును. రాయల 'సకల కథాసార సంగ్రహము' అవతారిక లోనిదిగా సంపాదకులు పీఠికలో ఉద్ధరించిన ఈ శ్లోక భాగము ఆ భావమును బలపరచును.

'ఉత్సాహం మమ వీక్ష్య మద్గురు రథ
శ్రీ వ్యాస తీర్థో మునిః....

ఈ వ్యాసతీర్థుల వారు మాధ్వపక్షమున ననేక గ్రంథములు రచించిన ఉద్దండ పండితులు. వారికి రాయలు తిరుపతిలోను, విజయనగరము

లోను వసతులు కల్పించినట్లు శాసనాధారము కూడ కలదు. రాయలకు అభిమాన పాత్రమైన మతమును గూర్చి ఇంతవరకు తగినంత విచారణ జరగలేదు దాని కీ గ్రంథమెంతయు నుపయోగపడగలదు. గతానుగతికముగా నతడు రామానుజమత వైష్ణవుడనుట పునఃపరిశీలించదగినది.

జాంబవతీ పరిణయమునకు జాంబవతీ కల్యాణము అను నామాంతరము కూడ కలదు. ఇది ఐదంకముల నాటకము. కథా సంగ్రహము పీఠికలో సంపాదకులు చక్కగా ఇచ్చినారు. భాగవతాది గ్రంథాలలో కనపడే శమంతకమణి హరణ కథయే కథావస్తువు. లీలాపవాద నివారకముగా వినాయక చతుర్థినాడు అవశ్య పఠనీయము లుగా స్కాంద పురాణములో చెప్పబడిన కథలలో నిది ప్రధానమైనది. ఆ కథలన్నియు చదువలేని వారు ముఖ్యముగా నీ శ్లోకమైన పఠింప వలెనని స్కాందము ఉపదేశించుచున్నది. శ్రీ గౌరి వాక్యమది!

'సింహః ప్రసేన మవధీ
త్సింహో జామ్బవతా హతః
సుకుమారక మారోదీ స్తవ
ఏష శ్శమంతకః'

ఈ నాటక ప్రస్తావనలో,

'లోకాపవాదా ద్భే తవ్యం దుష్టా దాశీ విషాదివ'

ఇత్యాది శ్లోకముండుటయు ప్రథమ నాంది గణపతిని స్మరించుటయు చూడగా రాయ లీ నాటకమును లీలాపవాద నివారక కథగానే భావించి రచించినట్లు తోచును.

ఈ నాటక రచనను గూర్చియు అందలి కవిత్వ వైభవమును గూర్చియు సంపాదకులు పొగడినారు. కాని ఆంధ్రుల కందరికి వలెనే వారికిని రాయలయందు గల గౌరవాభిమానములచేత మాత్రమే ఆ వని చేసినట్లు పాఠకులకు తోచక మానదు. సంస్కృతములో ఉత్తమ నాటక రచనా పరంపర విచ్ఛిన్నమైన తర్వాత రచితములైన నాటకములలో సర్వసాధారణముగా గోచరించు క్షీణలక్షణము లన్నియు నిందును

ప్రత్యక్షమగు చున్నవి. దీని కూర్పులో బిగువు కాని నేర్పు కాని కన బడదు. నాటకీయత మృగ్యము. సంపాదకులు పీఠికలో నుదాహరించి నట్లు ప్రసిద్ధులైన వాల్మీకి, కాళిదాసు, భవభూతి, శ్రీహర్షుడు, మాఘుడు మొదలగు మహాకవుల భావములయు పదబంధములయు అనుకరణ ములే కాక సంఘటనల అనుసరణములుకూడ గ్రంథమందంతట కనిపించు చున్నవి. సంపాదకులు చూపినవేకాక ఇతరము లెన్నియో కూడ కలవు. అది కాల ధర్మముగా మాత్రమే గ్రహింపదగును.

నాటక రచనలో కూర్పులో నేర్పు లేదనుటకు కొన్ని ఉదాహరిం చెదము.

నాటక ప్రారంభములోనే నారదుడు ప్రవేశించి, 'బిలములో నివసించు జాంబవతికిని ద్వారకలో నివసించు శ్రీ కృష్ణునికిని సమావేశము కూర్పుమని తన్ను బ్రహ్మ పంపెనని పలికి ఆ కార్యము సాధించుటకు ద్వారవతికి పోయెద ననుచు ప్రారంభించును. కాని ఇప్పటికే శ్రీ కృష్ణుడు బిలపరిస రారణ్యమునకు వచ్చియుండెను. నారదుని ప్రయత్న మేమాత్రము లేకుండగనే జాంబవతికిని శ్రీకృష్ణునికిని సమాగమమై అనురాగము వృద్ధియైనది. వారి కల్యాణమునకు గూడ నారదుడు చేసిన దేమియు లేదు. సింహ రూపమున తన శిష్యుని పంపె ననునది ఒక్కటి మాత్రమే నారదుని ఘనకార్యము. ఈ కల్పన కూడ హృదయంగమమైనది కాదు.

నారదుని వలెనె కిన్నరమిథునము, గంధర్వుడు, హంసుడు, బ్రహ్మ, సరస్వతి పాత్రలును వృథాగా ప్రవేశపెట్టబడినారు. కిన్నర మిథునము చేసిన పని జాంబవతి విరహవేదనను శ్రీ కృష్ణుని కడ వర్ణించుట మాత్రమే. జాంబవంతునితో శ్రీ కృష్ణునకు సంభవించిన యుద్ధమునకు మంచి కారణమైనను కల్పింప బడలేదు.

శ్రీకృష్ణుడు స్వతంత్రుడు గదా! అతడే జాంబవతిని మరల దర్శింప గోరినచో ద్వారకలో విరహవేదనతో కుమిలిపోక, బిలపరిసరా రణ్యమునకు వెళ్లియుండవచ్చును. అట్లుగాక ప్రసేనుని గూర్చి

విచారించుటకు పొమ్మని బలరాము డాదేశించు వరకు ద్వారకలోనే ఉండి విరహబాధ పడుచుండుట చిత్రముగా తోపకమానదు. కవికి విరహవేదనను వర్ణింప వలెనను ఉబలాటమే కాని వేరు ఆలోచన లేదు. శ్రీ కృష్ణుడు జాంబవతీ సామీప్యమును వదలి వెళ్ళవలసి వచ్చుటకు ద్వారకలో అవసర కార్యమైనను కల్పింపబడలేదు. సంస్కృతములో ఉత్తమ నాటక రచన క్షీణించిన తర్వాత పుట్టిన నాటకములలో నాటకీయత లోపించి నను కవితా వైభవము సర్వసాధారణముగా కానవచ్చును. పద్యభాగ ములు ఎక్కువ కాసాగినవి. ఇందులో గూడ పద్యభాగము విస్తారమే. 270 శ్లోకాలు ఉన్నవి. అది గ్రంథంలో మొత్తమున్న 2,295 పంక్తు లలో 900 పంక్తులలో ముద్రింప బడినవి. ఇన్ని శ్లోకము లున్నను కవితా వైభవమున్న శ్లోకములు 21గా సంపాదకులు తెలిపినారు. ఇవి గాక మరికొన్ని కూడగలవు. అట్టి వానిలో గణపతిని స్మరించు ప్రథమ నాందీ శ్లోక మొకటి. మరియొకటి ప్రస్తావనలోనేగల 'అసారామపి గృహ్ణన్తి...........' ఇత్యాదిగా గల పూర్వోదాహృత శ్లోకము. అది చంద్రాలోకములో అర్థాంతరన్యాసాలంకారమునకు ఉదాహరణముగా చెప్పిన శ్లోక భావమునకు అనుసరణము మాత్రమే కాదు.

'గుణవ ద్వస్తు సంసర్గాత్
యాతి స్వల్పోఽపి గౌరవమ్
పుష్పమాలాను షంగేణ
సూత్రం శిరసి ధార్యతే॥

చివరి పాదము పూర్తిగా ఉన్నదున్నట్లు గ్రహింపబడినది.

ఈ నాటకములో హృదయంగమంగా ఉన్న శ్లోకాల సంఖ్య నిష్పత్తి మొత్తం శ్లోకాల సంఖ్యతో పోలిస్తే అతి స్వల్పము. బాగున్న వనిపించు శ్లోకాలు కూడా తరచుగా పైదాని వలెనే పూర్వకవుల అను సరణలు. జాంబవతీ శ్రీకృష్ణుల విరహ వేదనలు ప్రబంధనాయికా నాయకుల విరహవేదనల ప్రతిశబ్దాలే.

ఆముక్తమాల్యదాకర్త స్వభావోక్తిలో నిరుపమాను డనుచు,

ప్రథమాంకములోని అరణ్యవర్ణన మట్టిదని సంపాదకులు పేర్కొనినారు. అరణ్య వర్ణవ శ్లోక మిట్లున్నది.

'ఆరణ్యానీ సేయం కరటి కరటా నర్గల గల
న్మద స్రోతోజాతోదయ బహుల సౌరభ్య భరితా
స్ఫురజ్ఝిల్లీ ఝాట ప్రకటకటు ఝుంకార జనిత
శ్రవ ఘూర్ణా హేలా కలిత రవ కణ్ఠీరవ కులా!॥

ఇందులో స్వభావోక్తి కంటె అతిశయోక్తియు కేవల శబ్దాడంబ రమును మాత్రమే గోచరించు చున్నవి.

ఈ నాటకము బయటపడుట వలన రాయలు ఆముక్తమాల్యదను రచింప లేదనువారి వాదము వీగిపోవునని సంపాదకులు తెలిపినారు. కాని నిష్పక్షపాతముగా నిశితదృష్టితో చూచువారికి సందేహము బలపడునేకాని ఉపశమింపదు. దానికి ముఖ్యమైన ఉపపత్తులివి:

(1) ఆముక్తమాల్యదలో కవితా వైభవము, విశిష్టత, స్వతంత్ర రీతి ఆద్యంతము కనిపించును. ఈ నాటకము అందులకు విరుద్ధము.

(2) ఆముక్తమాల్యదా రచయిత ద్రావిడామ్నాయము లెరిగిన వాడు కాకున్నను, రామానుజ వైష్ణవేతర మతములన్న కంఠోక్తిగా ద్వేషము చూపిన వాడు. ఈ నాటక కర్త అట్టిభావములకు దూరుడే కాక మాధ్వవైష్ణవ మందు ప్రత్యేక ప్రీతికల వాడనిపించును.

ఈ రెండు కారణములచే ఈ రెండు కావ్యములను రచించిన కవి ఒకడే ఐయుండునా అను సందేహమే బలపడుచున్నది. 'సాహితీ సమరాంగణ సార్వభౌముడు' అని మహా కవులచేత కీర్తింపబడిన రాయలు కావ్యరచన చేయలేని వాడని వాదింప నక్కర లేదు.

ఈ నాటకమునకు సంపాదకత్వము వహించిన డా. బి. రామరాజు గారు పరిష్కరణాదికములలో ఎంతో శ్రద్ధను ఓర్పును చూపిరి. ఈ నాటకము వ్రాత ప్రతులు మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండా గారమునను, తంజావూరు సరస్వతీ మహలు నందును, కాకినాడ ఆంధ్ర

సాహిత్య పరిషత్తునందును కలవనుచు మొదటి రెండు గ్రంథాలయముల లోని మూడు ప్రతులను బట్టి మాత్రమే మూలపాఠము గ్రహించితి మనిరి. కాకినాడ పరిషత్తు ప్రతిని ఎందుకు సంప్రదించలేదో తెలుపరైరి.

సంస్కృత నాటకములందన్నిటిలోవలె ఇందును సంస్కృత ప్రాకృత భాషలు రెండును ఉన్నవి. సంపాదకులు తమకు సుష్ఠుగా ప్రాకృతము రానందునను, ప్రాకృత భాషా విద్వాంసులు అందుబాటులో లేనందునను, ఇందలి ప్రాకృత భాగములు సరిగా లేనందునను, విధిలేక ప్రాకృత భాగములు ఉన్నవున్నట్లు ముద్రించితిమని తెలిపిరి. అందు వలననే సంస్కృతచ్ఛాయ ఈయ లేదని తోచును. మోమోటములేని వారి సత్యోక్తికి వారిని అభినందించు చున్నాము.

ఈ నాటకములో మొత్తము పంక్తులు 2,295. వానిలో ప్రాకృత పంక్తులు 831, సంస్కృత పంక్తులు 1464. సంస్కృతము మాట్లాడు పాత్రల సంఖ్య 12, ప్రాకృతము మాట్లాడు వారిది 12. కాబట్టి గ్రంథ పంక్తులలో మూడవ వంతునకును. పాత్రలలో సగము మంది భాషకును సంస్కారము జరుగలేదన్న మాట. ప్రాకృతములో ఆవలి పాత్ర మాటాడినదేమో తెలియరా కున్నందున ఈవల సంస్కృతము మాట్లాడిన పాత్ర మాటల సందర్భముకూడ ఎన్నోచోట్ల చక్కగా తెలియరా కున్నది.

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీ వారు 1968లో నెలకు రు 250/-ల ఉపకార వేతన మిచ్చి ప్రాకృత భాషాధ్యయనము చేయుటకు ఒకరిని పూనాకు పంపియుండిరి. ప్రాకృత భాగ సంస్కరణమునకు వారి సహాయముకూడ అందలేదని భావించు చున్నాము.

సంపాదకులు సంస్కృత భాగములకు పాఠ నిర్ణయములు చేయుట యందును, లుప్తభాగములు పూరించుట యందును, అవసరమైన సంస్కరణములు చేయుట యందును శ్రద్ధయు సమర్థతయు చూపినారు. గ్రహించని పాఠాంతరములు అధస్సూచికలలో నిచ్చినారు. తాము పూరించిన భాగములు కుండలీకరణము చేసినారు. పూరింప సాధ్యము కానివి చుక్కలు పెట్టి వదలినారు. ఈ విధముగా సంపాదకత్వమున ఔచిత్యము ప్రదర్శించినారు.

సర్వసామాన్యముగా మూలములో ముద్రించిన పాఠములే యుక్త తరములుగా ఉన్నవి. ఎక్కడనో లోపములు లేక పోలేదు, ఉదాహరణము :పే. 19. అం. 1 శ్లో. 41.

'మధువ శుక పిక వృతానాం
పుష్పిత పల్లవిత ఫలిత శాఖామ్ ..'

క్రింద ఇచ్చిన పాఠాంతరము 'మధువ పిక శుక వృతానాం' ఇత్యాదిగా ఉన్నది.

పికములు పల్లవములను శుకములు ఫలములను గ్రహించును. పికశుక పాఠమే యుక్తతరము. గ్రహించిన పాఠములో క్రమభంగము కలిగినది.

లుప్తపూరణములు చక్కగా ఉన్నవనుటకు ఒక ఉదాహరణము. పే4. ప్రస్తావన.

'(కర్ణాటక్షితి పాలశేఖర మణిః శ్రీ)
కృష్ణరాయః కవిః
సూక్తిః కర్ణరసాయనం
సుమనసాం శ్లాఘ్య స్వభావా సభా
చారిత్రం యదువంశ శేఖర
మణే ర్దేవస్య సర్వోత్తరమ్
పారమ్పర్య కృత శ్రమః
పున రమీ నాట్యేన పారావయమ్'

'శేఖరమణిః' రెండు చోట్లను వచ్చుటచే పూరణము అందగించినది.

బాగుగానే పూరించినను మనోజ్ఞతరముగా పూరించుటకు అవకాశమున్న దానికి ఒక ఉదాహరణము పే. 43. అం. 2 శ్లో. 26.

'వహతి పులిన ముచ్చైః కక్ష్యా దావర్త మారాత్
లసతి వియతి శైల ద్వంద్వ మున్నేయ భేదమ్
శ్రయతి తిమిరరేఖా చన్ద్ర సౌహార్ద ముద్రామ్
(కువలయ యుగ మేత ద్రాజతే పద్మ మధ్యే.')

పూరించిన చతుర్థ పాదములో తక్కిన వానిలోవలె విరోధాలంకారము చక్కగా అమరినది. కాని తక్కిన పాదములు 'వహతి, లసతి, శ్రయతి' అని క్రియాపదములతో ప్రారంభమైనట్లే నాల్గవది కూడా ప్రారంభమైతే ఎక్కువ బాగుండేది. 'ధరతి మృదుల తేయం సాధు, రంభాప్రకాండే'-అన్నరీతిగా పూరిస్తే ఎక్కువ బాగుండును కదా!

నాటక ముద్రణములో నాటకములో వచ్చు పాత్రల పేర్లు ఇచ్చుట సర్వసాధారణము. ఇందులో లేకుండుట కొరతగా ఉన్నది.

రాయలు రచించిన ఈ యపూర్వ గ్రంథమును ఉత్తమ మార్గము లవలంబించి ఆంగ్లములో తెలుగులో రెండు పీఠికలతో పరిష్కరించి అందించిన డా. రామరాజుగారికి సంస్కృత భాషాభిమానులు ఎంతయు కృతజ్ఞత చూపవలసియున్నది. భారత దేశములోని ప్రాకృతభాషా విద్వాంసులు ప్రాకృత భాగములు సంస్కరించుటకు తోడ్పడి ద్వితీయ ముద్రణమును సంపన్నమొనర్తురు గాక!

ఈ గ్రంథ ప్రచురణము చేపట్టి అందముగా మంచికాగితములమీద దేవనాగరాక్షరములతో సర్వ ప్రపంచమునకు అందుబాటులో నుండునట్లు తక్కువ మూల్యముతో అందించిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీవారు అభినందనీయులు. సెక్షను కుట్టు లేకపోవుట ఒక్కటే లోపమనిపించినది. ఆంధ్రభోజుని రచనను ప్రచురించుటలో ధన వ్యయమునకు వెనుకాడవలసిన పని యుండగూడదు గదా!

---

(జామ్బవతీ పరిణయమ్ : కర్త : శ్రీ కృష్ణదేవరాయః : సంపాదకులు : డా. బి. రామరాజు, ప్రకాశకులు: ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీ, కళాభవనము, సైఫాబాదు, హైదరాబాదు-4-డెమీ 1/8 పేజీలు 166 (పీఠికలతో) పూర్తి క్యాలికోబైండు. వెల రు. 4/లు.)

(భారతి, జనవరి-1973)

# యయాతిచరిత్ర - ఉపోద్ఘాతము

పొన్నికంటి తెలగనార్యుడు రచించిన ఈ యయాతి చరిత్రము ముఖ్యముగా నాలుగు విధముల నపూర్వమైన తెలుగు గ్రంథము!

ఆంధ్ర భాషలో పుట్టిన అచ్చతెనుగు కావ్యములలోనెల్ల నిది మొదటిది. కవి తనదే మొదటి అచ్చ తెనుగు కావ్యమని కావ్యావతారికలో పూజ్యుడగు మఱింగంటి అప్పనగారు కృతిసమర్పణముచేయుమని తన్ను అర్థించినట్లు వర్ణించిన సందర్భమున స్పష్టముగా తెలిపినాడు.

"మున్నెవ్వరు నొడువని యీ
తెన్నిడి కడుమీఱి యచ్చ తెనుఁగుం గబ్బం
బెన్నిక మీఱఁగఁ జెప్పిన
నిన్నుం బొగడంగఁ గలఁడె నెలతాల్పయినన్."

"అచ్చతెనుంగుఁబద్దె మొకటైనను కబ్బములోన నుండినన్
హెచ్చని యాడుచుందు రదియెన్నుచు, నేర్పునఁ బొత్తమెల్ల ని
ట్లచ్చ తెనుంగున న్నొడువ నందుల చంద మెఱుంగువా రెదన్
మెచ్చరొ, యబ్బురం జనరొ, మేలనరో కొనియాడిరో నినున్?"

(ఆ. 1. ప. 11-12)

కవి యిట్లు చెప్పించుకొనుటేకాదు. ఈ గ్రంథమునకు పూర్వము అచ్చ తెనుగులో వ్రాసిన గ్రంథము లింతవఱకు ఇతరములేవియు లభ్యము కాలేదు. వాల్మీకికి పూర్వమే ఛందోబద్ధమైన శ్లోకములు శ్రుతిలో వినబడుచున్నను అతడు సంస్కృతమున నాదికవి యైనట్లును, నన్నయకు పూర్వమే ఆంధ్రపద్యము లెన్నియో శాసనాదులలో గనబడు చున్నను అతడు ఆంధ్రమున నాదికవియను గౌరవము పొందినట్లును, అట్లే అచ్చతెలుగు పద్యము లంతకు ముందుండినను పొన్నికంటి తెలగ నార్యుడు నిస్సందేహముగా అచ్చతెనుగు కావ్యములకు ఆదికవి!

కావ్యరచనలో వాల్మీకి చూపిన త్రోవలే సంస్కృత కవులందరు ననుసరించిరి. నన్నయ పెట్టిన యొరవడినే గౌరవించి తిక్కన ఎఱ్ఱయ మున్నగు ఆంధ్ర కవీశ్వరులు కావ్యరచన సాగించిరి. తెలగనార్యుని తర్వాత అచ్చతెనుగు కావ్యములు రచించిన కవులందరు నాతడు పెట్టుకొనిన నియమములనే పాటించిరి. అచ్చతెను గనగా దేశ్యములు, ప్రాకృతసమములు, తద్భవపదములు మాత్రమున్న భాష. ఆంధ్రభాషలోని సంస్కృత సమపదములు మాత్రము వర్జింపవలెను. కాని నామములు బిరుదములు తరుచుగా సంస్కృత సమపదములుగానుండును. అట్టి వానిని మార్చివేయవలెనా? ఉన్న వున్నట్లుగా ఉంచవలెనా? అచ్చతెనుగు కబ్బములకు ఆదికవియైన తెలగనార్యుడిట్లు విన్నవించుకొనెను.

"తెనుఁగునను మాఱుపేళ్ళిడి
పెనఁచిన వినఁగూడ దనుచు బిరుదులుఁ బేళ్లన్
మును వేల్పుబాస వెంబడి
నునిచెదఁగా దనకుఁడయ్య యుల్లములందున్."

(అ. 1 ప. 14)

ఔచిత్య మాలోచించి బిరుదములు నామములు సంస్కృత భాషలో నున్నట్లే, ఉంచెదననియు, దానిని కాదనకుడనియు కవి యర్థించెను. ఈ విన్నపమే సంప్రదాయమై తర్వాతి కవులకు విధియైనది. రెండు అచ్చతెనుగు కావ్యములే కాక, ప్రౌఢములగు ననేక కావ్యములు రచించిన కూచిమంచి తిమ్మకవి యంతవాడు తన యచ్చ తెనుగు రామాయణములో నిట్లు చెప్పించుకొనెను.

"ఒనరఁ బేరులు బిరుదలు దెనుఁగుసేయఁ
బోలదని మున్ను పెద్దలు పూని త్రోవ
యిడిరి గావునఁ గూరుపు మిదియునట్లు."

తెలగనార్యుడు కావించిన నియమమువలన అచ్చతెనుగు వంకర దారులు పట్టకుండ కొంత నిలిచినది. అందుచే యయాతి చరిత్రము, ప్రథమాశ్వాసము, వచనము, గద్యము, శర్మిష్ఠ, దేవయాని, తురగారోహణ రేవంతుండు, చంపకమాల కందము- ఇత్యాది పదములు

సంస్కృత సమములుగానే నిలిచినవి. లేనిచో [కందపద్యమును 'దుంవ పద్దెము' అనియు, చంపకమాలను 'సంపెంగలదండ' అనియు ఇత్యాదిగా మార్చివికృతాకారములు చేయవలసి వచ్చెడిది. అట్లు చేయ యత్నించిన కవులును కలరు కాని వారి అచ్చ తెనుగు కావ్యములు వాసికెక్కలేదు. తెలగనార్యుడు ఉచితములైన నియమములకు మార్గదర్శకుడయ్యెను.

తెలగన అచ్చతెనుగు కవులలో ఆదికవి యగుటయు, తర్వాతి వారికి మార్గదర్శకుడగుటయునే కాదు, ఇప్పటికి పుట్టిన అచ్చతెనుగు కావ్యము లన్నిటిలో ఈ 'యయాతి చరిత్రము' సర్వవిధముల నుత్తమమైనది. ఈతని తర్వాత అచ్చతెనుగు కవులలో ఎన్నదగినవాడు కూచిమంచి తిమ్మకవి కందుకూరి వీరేశలింగము 'ఇతని యయాతి చరిత్రము కూచిమంచి తిమ్మకవి అచ్చ తెనుగు పుస్తకములకంటె సర్వవిధముల శ్రేష్ఠతరముగా నున్నది' అని వ్రాసినది హర్షింపదగినది.

ఆంధ్రకవులు తమ కావ్యములను మహమ్మదీయులకు కృతియిచ్చి ముసల్మానులగు తమ కృతిపతులకు హరిహరాదులగు హైందవదేవతలు శుభములు కలిగింతురు గాక యని యాశీర్వదించుటయు, వారిని హైందవ పురాణ ప్రసిద్ధులగు భగీరథాదులతో పోల్చుటయు అరుదు. అట్టి కావ్యము లితరము లుండవచ్చును గాని యట్టివి రెండే ప్రసిద్ధి కెక్కినవి. వానిలో నొకటి అద్దంకి గంగాధరకవి రచించిన తపతీసంవరణము. అది గోల్కొండ నవాబైన మల్కిభరాము (ఇబ్రహీముల్ముల్క) నకు అంకితమీయబడినది. రెండవది ఈ యయాతి చరిత్రము. ఇది మల్కిభరాము సరదారుడగు అమీనఖానునకు కృతి ఈయబడినది. గంగాధరుడును, తెలగనయు సమకాలికులు. వీరిద్దరి గ్రంథములలో ముందరి దేదియో నిశ్చయింప సాధ్యముకాదు.

ఈ విధముగా యయాతి చరిత్రము అచ్చతెనుగు కావ్యములలో ఆది కావ్యమై, తరువాతి వానికి ఒరవడి పెట్టినదై, అట్టి వానిలో నుత్తమమైనదై, ముసల్మాను సరదారుకు కృతి యీయబడినదై - నాలుగు విధములుగా విశిష్టమైనది.

## కవి కాలాదికము

పొన్నికంటి తెలగనార్యుడు తన గ్రంథములో తన కులముగాని, గోత్రముగాని, సూత్రముగాని ఎక్కడను చెప్పుకొనలేదు. వానిని తెలిసికొనుటకు ఇతరాధారము లేవియు నింతవరకు లభింపలేదు. అందువలన వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారు ప్రచురించిన యయాతి చరిత్రము పీఠికలో, "దీనిని రచించిన కవి పొన్నికంటి తెలగనార్యుడు, తండ్రిపేరు భావనామాత్యుడు నని గ్రంథాంతగద్య చెప్పుచున్నది. కాని సూత్రగోత్రములు చెప్పుటలేదు. నియోగి బ్రాహ్మణుడు ఆపస్తంబ సూత్రుడు నని కం. వీరేశలింగము పంతులుగారు వ్రాయుట కాధారము కనంబడదు" అని వ్రాసిన మాటలు సర్వవిధముల ప్రమాణ బద్ధములు. అమాత్యపదము ఉద్యోగమునే తెలుపునుగాని కులమునుగాని, శాఖనుగాని తెలుపదు. అమాత్యపదము కుల శాఖా నిర్దేశకమైనచో భావనామాత్యుని కుమారుడగు తెలగన్న తెలగనామాత్యుడు కావలసినది. కాని యాత డట్లుకాక అప్పనగారు తన్ను 'పొన్నికంటి తెలగన్న' అని సంబోధించినట్లు చెప్పి, అశ్వాసాంతగద్యము లన్నిటిలో 'పొన్నికంటి వంశ్య తెలగనార్య ప్రణీతంబు' అనియే చెప్పుకొనెను. అంధపరంపరా న్యాయముగా వచ్చుచున్న యీ భ్రాంతిని యిప్పటికైనను విజ్ఞులైనవారు వర్జింప దగును. ఆర్యశబ్దమును బట్టి యతడు బ్రాహ్మణుడై యుండునని యనుమానింపదగును గాని యది కూడ నిశ్చయింపలేము ఈ కవి బ్రాహ్మణుడు కాడని తలంచుటకు కొన్ని లక్షణములు కూడ కానవచ్చుచున్నవి.

ఈ కవి తన్ను గూర్చి గ్రంథావతారికలో నేమియు చెప్పికొనలేదు. ఆశ్వాసాంత గద్యలన్నియు ఒకే విధముగా లేకున్నను, మొత్తము మీద నీ విషయములు తన్నుగూర్చి యీతడు వానిలో జెప్పుకొనెను. ఇతడు శ్రీ మదనగోపాల మంత్ర వరప్రసాద లబ్ధసారస్వతుడు, సుకవిజనహిత వచోవైభవుడు, పొన్నికంటి తెలగనార్యుడు.

మన్మథబీజము ఆదిగా గలిగి గోపీజనవల్లభుని ఉపాసించు మంత్రమునకు మదన గోపాల మంత్రమను ప్రసిద్ధి కలదు. ఆ మంత్ర

మును ప్రత్యేకధ్యానముతో జపించి విధివిహితమైన హోమాదిక మాచ రించినచో విద్యలు సాధింప వచ్చునని మంత్ర శాస్త్రగ్రంథములు చెప్పు చున్నవి. తెలగన్న యట్టి యుపాసన చేసినవాడని భావింపవచ్చును. ఆ మంత్రము చాతుర్వర్ణ్య జను లందరికి సాధారణమైనదిగానున్నది.

విద్యలను సాధించుటకు విహితమైన మంత్రము లెన్నియో యుండగా ఈ కవి మదన గోపాలమంత్రమునం దభిమానము చూపుట కొంతవర కాతని మనఃప్రవృత్తిని ప్రతిబింబించు చున్నదనే తలంప వచ్చును. ఈ గ్రంథము నందంతటను స్త్రీ పురుషుల కామ ప్రవృత్తిని వర్ణించి విస్తరించుట గమనింపదగును. ఇది కవియున్న దేశకాలముల లక్షణములకు, జీవిత విధానమునకు, అనుగుణముగా నున్నదని గ్రహింపదగును.

ఈ గ్రంథమునకు కృతిపతియైన అమీనుఖాను గోలకొండ నేలిన కుతుబ్‌షాహి వంశీయులలో నాల్గవ సుల్తానునైన ఇబ్రహీంషాకు సరదారు లలోనివాడు ఈ ఇబ్రహీంషా పలువురు తెలుగు కవులను పోషించి వారి చేత మల్కిభరాం నామముతో పొగడుగన్నవాడు. అతడు క్రీ శ. 1550-1580 వరకు గోలకొండ రాజ్యము పాలించెను. అమీనుఖాను కుమారు లలో ఫాజిలఖాన రాయడు విజయనగర రాజగు సిరంగరాయనివద్దకు గొప్పసేనలతో బోయి మంచి మాటలతో నాతనిదెచ్చి మల్కకు మిత్రు నిగా జేసెనని అవతారికలో గలదు. ఈ శ్రీరంగరాయడు 1574-1585 వరకు చంద్రగిరి రాజధానిగా రాజ్యము చేసినవాడు. కావున యయాతి చరిత్రము శ్రీరంగ రాయలు రాజ్యమునకు వచ్చిన 1574 తర్వాతను, మల్కిభరాము మృతినొందిన 1580 కి పూర్వమును రచింపబడినదని నిశ్చయింపవచ్చును. తెలగనార్యుడు 16 వ శతాబ్దము ఉత్తరార్ధమున నున్నవాడని స్పష్టపడుచున్నది.

కృతిపతియైన అమీనుఖానుని తాతయగు హుమామియా సత్య చింతామణి పొట్లచెఱువులో రాజ్యము చేసెను. అతని కుమారుడగు బడే మియానుగూడ పుడమితేడనియే కవి వర్ణించుటచేత నతడుకూడ నచ్చ టనే రాజ్యమేలియుండును. వీరు గోలకొండ నవాబులకు సామంతరాజులై

యుండుటచే వారిని పుడమిఱేండ్లని కవి నిర్దేశించెనని యూహింప వచ్చును. బడేమియా కుమారుడును, కృతిపతియు నగు అమీనుఖాను ఎక్కడ రాజ్యము చేసెనో చెప్పలేదు కాని యతడు తనపేర గలుగు అమీను పురములో మున్నీటివంటి చెఱువు త్రవ్వించెననియు, ఆ పురము ననే ఎన్నియో వర్ణనీయములగు పండ్ల తోటలు వేయించె ననియు అవతారికలో కలదు. కావున నతడు అమీను పురమునకు నివాసము మార్చెనను సందేహము కలుగు చున్నది. కాని యతడు తన తాత కాలము నుండి నివాసమైన సత్యచింతామణి పొట్లచెర్ల యందు అభి మానము వదలక కాబోలు, అక్కడ నద్భుతమైన మశీదు కట్టించెనట!

ఈ అమీనుపురము, పొట్లచెఱువు, అను పట్టణము లెక్కడివో నిశ్చయించినచో తెలగ నార్యుడు ఏ ప్రాంతమువాడో ఊహించవచ్చును. శ్రీ చాగంటి శేషయ్య ఆంధ్రకవి తరంగణిలో ఈ రెండును గుంటూరు మండలములోనివని వ్రాయుచు, గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూ కాలోగల అమీనుబాదు గ్రామములో మూలాంకూరమ్మగుడి తూర్పు ద్వారమునగల శాసనము కూడ నుదహరించిరి. అది గోలకొండ ప్రభు వగు ఇభరాం పాదుషా సేనాని అమీనుముల్కు శ. సం. 1514 లో (క్రీ. శ. 1592) చెక్కించిన ప్రతాప ధర్మశాసనము. ఇభరామ్ పాదుషా కొండవీడు రాజ్యమును జయించిన ప్రస్తావనము అందులో నిట్లున్నది.

"మొదలను శాలివాహన శకవర్షంబులు 1502 అగు నేడు విక్రమ సం. చై. బ. 14 భౌమవారంనాడు హజరత్ యిభరాహిం పాదుశహా వొడయలుంగారు తమ నామజాదు అంపితేను.

"ధాటిగనేగి వుద్దగిరిదార్కొని వెంకటరాజు దోలి ముం
గోటలు లగ్గవట్టి వినుకొండయు బెల్లముకొండ తంగెడల్
పాటవరిన్ హరించి మరి బల్మిని గైకొనె కొండవీడు క
ర్ణాటక రాజధాని యిభరాముడు బాహుబలంబు మీరుచున్"

"ఈలాగు ప్రతాపాన కొండవీటి రాజ్యం పుచ్చుకొని రాజ్యం పరి పాలిస్తున్ను వుండెను."

పై నుదహరించిన సాధనములనుబట్టి శ్రీ చాగంటివా రన్నట్లే తెలగ నార్యుడు గుంటూరు మండలమువాడను నభిప్రాయము కలుగు చున్నది. కాని దానికొక చిక్కు కలదు. ఇభరాం పాదుషా కొండవీటి రాజ్యము జయించినది. క్రీ. శ. 1580 లో గావున, ఆ సంవత్సరమునకు ముందే యయాతి చరిత్రము రచింపబడినదను నూహ సరియైనదైనచో, అమీఖాను పరిపాలనలో నప్పటికి లేని గుంటూరు మండలము నివాస ముగా గల కవి యది రచించెననుట కష్టసాధ్యము

అదియుగాక యయాతి చరిత్రములోననే కవి సత్యచింతామణి, పొట్లచెఱువు కాసలనాట గలదని స్పష్టముగా తెలిపెను 'ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళ' కర్తలగు శ్రీ కుందూరి ఈశ్వరదత్తు తమ గ్రంథ ములో కాసలనా డనునది ప్రస్తుతము మెదకు, కరీంనగరం జిల్లాలుగా వ్యవహరింపబడుచున్న ప్రదేశములో కొంత భాగమని నిర్ధారించి, ఈ పొట్లచెరువు గ్రామము మెదకు జిల్లాలో సంగారెడ్డి తాలూకా యందలి గ్రామమని గుర్తించిరి. ఇది యుక్తిసహజముగా నున్నది. కావున తెలగ నార్యుడు బ్రాహ్మణుడైనచో కాసలనాటివాడని యూహించుట భావ్యము. కావున, కాసల్నాటి శ్రేష్ఠుడు మీసాలప్పయ్యగారి మేనల్లుడు, కుసుమ శరాసన సముడు, కామమఃజరితో మదన సామ్రాజ్యమునకు పట్టభద్రుడు, క్రీడాభిరామ కథానాయకుడు నగు గోవింద మంచన శర్మయు, అతని మామయగు మీసాలప్పయ్య ద్వివేదుల కుమారుడును తన జొన్నగడ్డాగ్ర హారమును అహివెట్టిన రూకలతో ఏకశిలానగరములో మదాలసయను వేశ్యతో సుఖించుచున్న శ్రీధరుడును, మదన గోపాల మంత్రోపాసకుం డగు మన తెలగనార్యుడును ఒకే నాడునకు చెందినవారై యుండ వలెను!"

కృతిపతియైన అమీనుఖాను నిండుకొలువుండి కవిని పిలిపించి దండ నుంచుకొని నెయ్యముతో మన్నించును.

"కలవము చేసిన గందం
బలదించిన వెనుక వన్నియల వచ్చడముల్

పలు మానికముల సొమ్ములు
బలు తేజీలిచ్చి కూర్మి పై పైఁ బర్వన్."

(అ. 1. ప. 8)

తన మనస్సులోని మాట తెలిసిన మతింగంటి యప్పనగారివంక చూడగా, అప్పనగారు కవితో అతడు రచించుచున్న అచ్చ తెనుగు కావ్యము విషయము ప్రస్తావించి, దానిని అమీనుఖానునకిచ్చి 'పుడమిలోన సిరులఁ బొగడు గనుము' అని చెప్పగా కవి సంతోషముతో నంగీకరించెనట. ఈ మతింగంటి అప్పనగారిగూర్చి కవి తన యవతారికలో "తనకు న్నిచ్చలు మ్రొక్కువారిని సిరుల్ దైవాఱగాఁ జల్లు చూపున నెల్లప్పుడుఁజూచి మన్పఁగల ప్రోడ" అని సంక్షేపముగా వర్ణించిన దానినిబట్టి అతడు గురుస్థానము వహించినవాడని తోచుచున్నది. ఆంధ్రకవి తరంగిణీకారులు ఈ యప్పనగారిని గూర్చి మరికొన్ని విషయములు తెలిపినారు.

"ఈ యప్పలాచార్యుఁ డాకాలమున అశ్వపతి, గజపతి, నరపతులు ముప్వురి చేతను మ్రొక్కులను గొనుచు మహోన్నతపదవియం దుండె నని వారణాశి అచ్యుత రాయకవి విరచిత సురతాణీపరిణయము నందును, మతింగంటివారి గ్రంథములయందును జెప్పఁబడియున్నది. ఈతడు మతింగంటి సింగరాచార్య కవి కగ్రజుఁడు" పై వాక్యములు అప్పనగారి గౌరవపదవిని ధ్రువపరచుచున్నవి. అప్పనగారు తనతో పల్కినట్లు కవి చెప్పిన ధోరణినిబట్టి కవి అప్పనగారికి ఆదరపాత్రుడైనవాడని స్పష్ట మగుచున్నది. అప్పనగారి సోదరుడుగా పైన బేర్కొనబడిన సింగరా చార్యకవి నిరోష్ఠ్యరామాయణము రచించినవాడు. తన సోదరుడు నిరోష్ఠ్య గ్రంథము రచింపగా, అప్పనగారికి తెలగన్న అచ్చతెనుగుకావ్యము వ్రాయుచుండుట తెలియవచ్చి విశేషాదరము కలిగియుండును. ఆ పిమ్మట సింగరాచార్యకవి కూడ 'చిలువపడగ రాణేనికత' అనుపేర నొక యచ్చ తెనుగు కావ్యము రచించెను.

## కృతిపతి విశేషములు

గోలకొండ రాజ్యమును క్రీ. శ. 1518-1687 కుతుబ్‌శాహీలు

పాలించిరి. వారిపూర్వులు పర్షియాను పాలించిన ప్రభువులు. వారు రాజ్యభ్రష్టులై బహమనీ సుల్తానుల కొలువులోచేరి ఉన్నతపదవులు సంపాదించిరి. కుతుబుశాహీలలో రెండవ సుల్తానగు జంషడు వృద్ధుడగు తండ్రిని చంపించి అన్నగారి కన్నులు పీకించి, తానే రాజై 1543-1550 వరకు పాలించెను. ఆతని తమ్ముడగు ఇబ్రహీము తప్పించుకొని పారిపోయి విద్యానగర రాజ్యములో అళియ రామరాయల శరణుచొచ్చి ఏడు సంవత్సరము లక్కడ తల దాచుకొనెను. అప్పు డాతడు ఆంధ్ర భాషయం దభిమాన మలవరచుకొనెను. అతని యన్న చనిపోగానే ఒక పక్షమువా రాతని కుమారుని సింహాసన మెక్కించిరి కాని ప్రతిపక్షము వారు విద్యానగరము నుండి ఇబ్రహీమును ఆహ్వానించి సింహాన మెక్కించిరి. ఆతని గోలకొండయ్యాత్ర విజయయాత్రవలె మహావైభవముగా సాగినది.

ఈ ఇబ్రహీము గోల్కొండ రాజ్యమును విస్తరింపజేసి, పరిపాలనము పటిష్ఠమొనర్చి రాజ్యమును సంపన్నము కావించెను. 1565 లో జరిగిన రాక్షసి-తంగడి (తల్లికోట) యుద్ధములో ఈతడును విజాపురము, అహమ్మదు నగరము, బీదరు సుల్తానులతో ఏకమై, యుద్ధములో సంపూర్ణముగా పాల్గొని, తన్ను పూర్వము రక్షించిన అళియరామరాయల మృతికిని, విజయనగర రాజ్య విచ్ఛిత్తికిని తోడుపడెను. ఆ విజయముతో నతనికి అపారధనమును రాజ్యవిస్తృతియు లభించెను. ఈత డెన్నో ప్రజోపయోగకార్యములు కావించి, గంగాధరుడు మొదలగు ఆంధ్ర కవులను పోషించి, కృతులంది, పాలితులకు ప్రీతిపాత్రు డయ్యెను. మల్కిభరామ నామముతో నీతడు ఆంధ్ర కవులచే బహుధా కీర్తింపబడెను.

"రాయిటుభట్ట! యేమి కవిరత్నమ, పిల్చితి? వీవి పద్యముల్
ఏ యవనీశుపై! నృపకులేశ్వరుఁడౌ నిభరాముశాహిపై,
నాయత పుణ్యమూర్తి యతఁడర్థులు వేడిన నిచ్చు; నిచ్చునా
వేయును రెండువేలు? పదివేలును లక్షలుఁ గోట్లు నిచ్చునా!"

మరియు నతడే ఏడవచక్రవర్తియని, పదునేడవ రాజనియు, రాజ

నగా ఇభరాముడే రాజసియు, ఇభరామునకు తక్కిన రాములెవ్వరు సమానులు కారనియు, ఇంకను ఎన్నెన్నియో విధముల నాతని కీర్తించిన చాటు పద్యము అనేకము లున్నవి. అతడు బ్రతికియున్నప్పుడే కాదు ఆ ప్రభువు మరణవార్తవిన్న కవి విధాతను తిట్టుచు.

"చారుయవేధనున్ సుగుణిఁ జంపితి, వర్థుల కేమి దిక్కురా,
చేరిక నింతరాజును సృజింపఁగ నీ తరమా వసుంధరన్!"

అని విలపించెను.

అట్టి మల్కిభరామప్రభువు సామంతుడు యయాతిచరిత్ర కృతిపతియైన అమీనఖాను, మూడుతరములనుండి అతని కుటుంబమువారు గోలకొండ కుతుబ్షాహీల కొలువులో నుండిరట. గ్రంధావతారికలో మల్కిభరాముని కొలిచిన సంగతి మాత్రమే కలదు. పంచమాశ్వాసాంత పద్యములలో నొకదానిలో ఇభరాముశాను కొలిచినట్లున్నది. రెండవ పద్యములో ఈ వంశమువారి కందరకు అన్వయించు 'కుతుబుశాహు' అనుపదమే వాడబడినందున, గ్రంథము సమాప్తియగునప్పటికి మల్కిభరాము మరణించేనేమో యను సందేహము కలుగుచున్నది. ఏది ఎట్లున్నను అమీనుఖాను మల్కిభరాము తర్వాత గోల్కొండ రాజ్యము సమర్థతతో నేలిన అతని కుమారుడగు కులీకుతుబ్షా కాలములో కూడ మహోన్నత పదవిలోనున్నమాట నిజము. తెలుగుభాషా సమితివారు ప్రచురించిన విజ్ఞాన సర్వస్వములో జనాబ్‌సిద్దీకి, అబ్దుల్‌మజీద్ వ్రాసిన వ్యాసములో నిట్లు ప్రస్తావించిరి.

"మొహమ్మద్ అమీన్ అమీనుల్‌ముల్క్ అను మరియొక విద్వాంసుడు అతని (కుతుబ్షా) యాస్థానమున మీర్‌జుమ్లా (ఆర్థికమంత్రి) పదవి వహించి రాజ్యమునకు సంబంధించిన జాత్యభివృద్ధిదాయకములగు కార్యములయందు రాజునకు సాయపడుచుండెను. ఇతనికే పొన్నికంటి తెలగనార్యుడు తన యయాతిచరిత్రము నంకితమిచ్చినది."

కాబట్టి గ్రంథావతారికలో కవి కృతిపతి ఉన్నత పదవిని గూర్చియు, ఆతని కుమారుల సమర్థతను గూర్చియు ప్రస్తావించిన

విషయములు కవి సహజములైన యతిశయోక్తులుగానే గాక సత్యోక్తులు గానే మనము గ్రహింపవలెను.

అవతారికవలన అమీనుఖాను వీర శిఖామణియై శత్రువులను జయించిన వాడనియు 'బట్లకు పట్టంచుల వచ్చడాలు, వరహాలు, సరాలు, గుఱ్ఱాలు, పల్లకీలు, కుంచెల యందలాలు, గొడుగులు, పడగలు తోరహత్తుగా' నిచ్చినవాడనియు తెలియవచ్చుచున్నది. అమీను పురములో గొప్ప చెఱువు త్రవ్వించెనుకా. సలనాట సత్యచింతామణి, పొట్లచెర్లలో బెడగైన మసీదు కట్టించెను. దానిని చూచి శివుడు అక్కడే ఉండి వెండికొండకు పోదలపకున్నాడని కవి వర్ణించుటచేత, అది తెల్లని పాలగచ్చుతో చేయబడినదని ఊహింపదగును. అత డెన్నో కృతులు అంకితము కావించుకొనెను. మామిళ్ళు, పనసలు మొదలగు ఫలవృక్షము లను, చంపకములు, పొగడలు మొదలగు పూలచెట్లును, మల్లింగులు, గొజ్జగులు మొదలగు తీగెల పొదల మొక్కలును గలిగి పూచి కాచియుండు తోట లెన్నియో నిలిపెను. 'చలిపందిరులును, సత్తరువులు, నూతులు, బావులుం బుపుదోటలు చెర్వులు సల్లిండ్లును మొదలుగా' ఎన్నియో నిలిపెను.

అతనికి ముగ్గురు భార్యలు బడేబీబీ, సెక్కరబీబీ, సెమ్మెబీబీ. వారందరు గూడ భర్తవలెనే ధర్మకార్య తత్పరలు. వారిలో బడేబీబీ అత్తవారిండ్లకుబోవు కన్యలకు కట్నము లిచ్చెడిది; ప్రొద్దుననే లేచి-వాడలలో పసిబిడ్డలకు పాలుపోయును; అర్ధరాత్రమున వచ్చినను ఆకొన్నవారికి అన్నము పెట్టెడి ధర్మాత్మురాలు. సెక్కరబీబీ చుట్టముల పాలిటి తంగెటిజున్ను. సెమ్మెబీబీయు బంధుప్రీతిగల పతివ్రతాతిలకము.

ఈ ముగ్గురివలనను అమీనుఖానుకు ఐదుగురు కుమాళ్ళు పుట్టిరి. వారందరు వీరులు. రాజనీతి విశారదులు, బహుబిరుదాంచితులు. గతాతఖాను డను కుమారుడు అక్బరును మెప్పించెను; విశ్వనాథ దేవుని వలన నేనుగులు సంపాదించెను; ఏదులఖాను వీటికిపోలు కప్పములు గొనెను; మాదనమల్కు బరీదు నిజాంశాహును తన ప్రభువగు మల్కిభ రామునకు పన్నులు కట్టునట్లుచేసి మన్నన వడసెను. మరియు

నతడు న్యాయాధిపతిపదవి వహించి అరబి, పారసి, గుజరాతి, అరెమచ్ఛ, తెనుగు, కన్నోజి మొదలగు భాషలు వ్రాయను, చదువను నేర్చినవాడు. కర్తారుని మనసులో నెప్పుడును నిలుపుకొనువాడు. రెండవ కుమారుడగు ఫాజిలుఖానుడు పెద్దసేనలతో శ్రీరంగరాజు కడకేగి మంచిమాటలతో దెచ్చి తన ప్రభువుకు మిత్రునిగా నొనర్చెను. మూడవ కుమారుడగు అబ్దులల్లీ వీరుడేకాక అరబీ, పారసి, కన్నడము, రుమీ, కన్నోజి, తెనుగు మొదలగు భాషలు, నేర్చి కుతుబుశాను మెప్పించినవాడు. నాల్గవ వాడగు అబ్దుల్‌కరీము పారసి, యరబి నేర్చి ఇభరాముశాహును చేతలచే మెప్పించి 'తగటు దట్టీలు, కుళాయీలు, గుఱ్ఱములు, అందలములు, గొడుగు' బహుమానములుగా పొందినవాడు. ఐదవవాడగు షేకిభరాముడు శత్రువుల జయించిన వీరుడు.

వీరందరును భగవద్భక్తి కలవారు. మొదటి నలుగురును హజరతి మోఖిదుంజి ఖాదిరి శిష్యులు. చివరివాడు హజరతి శేఖుబుదురుది ఖాదిరి శిష్యుడు.

కృతిపతియగు అమీనుఖానుడుతానును, తనకుమాళ్ళును, ఇభరాము శాహును విశ్వాసపాత్రులై కొలుచుచు ఇష్టులై వర్తించినవారు.

ఆ కాలమున గోలకొండ రాజ్యము సంపన్నమై ప్రజలు సుఖ శాంత జీవనము చేయుచుండి రనుట నిశ్చయము. ఆ సుఖజీవనము యయాతిచరిత్ర రచనలోగూడ ప్రతిబింబించుచున్నది.

## కథానుసరణాదికము

యయాతిచరిత్రము ఐదాశ్వాసముల ప్రబంధము. స్థూలముగా నందులోని విషయములు ఈ క్రింది విధముగా విభజింపవచ్చును.

| ఆశ్వాసము | పద్యములు | విషయసంగ్రహము |
|---|---|---|
| I | 1-74 | గ్రంథావతారిక |
| ,, | 75-100 | ప్రతిష్ఠానపుర వర్ణనము. రాజు యయాతి-సభ. |

| | | |
|---|---|---|
| ,, | 101-121 | చెంచుల విన్నపముపై వేటకు రాజు ఆజ్ఞ ఇచ్చుట. |
| ,, | 122-124 | ఆశ్వాసాంతములు-గద్య. |
| II | 1-2 | ఆశ్వాసాదికము. |
| ,, | 3-32 | వేట వర్ణనము. |
| ,, | 33-51 | రాజొక ఇఱ్ఱివెంటబడి హిమవంతమును ఆకాశ గంగను చూచి జాబాలియాశ్రమము చేరి మునికి మ్రొక్కుట. |
| ,, | 52-60 | సంభాషణములో యయాతి వేటలో ఇఱ్ఱిని వెంబడించి వచ్చితినని చెప్పగా, జాబాలి పూర్వము రక్కసిరూపమున నున్న మెకము వెంటబడి రాముడు మోసపోయె ననెను. ఆ కథ ఏమని యయాతి యడుగుట. |
| ,, | 61-87 | రామాయణ కథా ప్రారంభము. రావణుడు స్వర్గముపై దండువెడలి వెండికొండకడ విడిసి వెన్నెలలో విరాళితో విహరించుట. |
| ,, | 88-101 | రంభనుచూచి బలాత్కరించుట, నలకూబరుడు రావణుని శపించుట. |
| ,, | 102-117 | రావణుడు దేవతలను జయించుట. దేవతలు మొరపెట్టుకొనగా విష్ణువు అభయ మిచ్చుట. |
| ,, | 118-123 | దశరథుని వివాహములు, కుమారజననము, విశ్వామిత్రాగమనము. |
| ,, | 124-126 | ఆశ్వాసాంతములు-గద్య. |
| III | 1-2 | ఆశ్వాసాదికము. |
| ,, | 3-40 | రావణాదిక సంహార మొనర్చి రాముడు |

| | | |
|---|---|---|
| | | అయోధ్యకు వచ్చి సుగ్రీవాదులను పంపి బహుకాలము రాజ్యము చేసిన కథ వాల్మీకి విస్తరించినది తాను సంక్షేపముగా చెప్పితినని జాబాలి ఒంటిగా నడవులలో తిరుగరాదని యుపదేశింపగా యయాతి సెలవుతీసికొని వెళ్ళుచు దప్పిగొనుట. |
| ,, | 41-30 | యయాతి నూతిలోనున్న దేవయాని నుద్ధరించి ఆమె కథ ఘూర్ణిక యను చెలికత్తె చెప్పగా వినుట. |
| ,, | 61-81 | జలక్రీడావర్ణనము దేవయానిని శర్మిష్ఠ నూతిలో త్రోయించిన కథ-యయాతి తన ప్రోలి కేగుట |
| ,, | 82-100 | దేవయాని పట్టువట్టగా శుక్రాచార్యులు, వృషపర్వుడు వచ్చుట. శర్మిష్ఠ కన్యకాసహస్రముతో దేవయాని దాసి యగుట. |
| ,, | 101-159 | కులాచారమునకు విరుద్ధముగా పెద్దగా పెరిగిన దేవయానికి వివాహము చేయలేదేమని వృషపర్వు డడుగగా శుక్రుడు కచునికథ ఆ శాపాంతము చెప్పుట. |
| ,, | 160 | అందరు వీటికి తిరిగివచ్చుట. |
| ,, | 161-163 | ఆశ్వాసాంతములు-గద్య. |
| IV | 1-2 | ఆశ్వాసాదికము. |
| ,, | 3-13 | వసంతర్తు వర్ణనము. |
| ,, | 14-29 | దేవయాని చెలులతో చేసిన వనవిహారము, పుష్పావచయము. |

| | | |
|---|---|---|
| ,, | 30-52 | యయాతి వచ్చి శర్మిష్ఠను చూచి ఆమె సోయగము వర్ణించుట. |
| ,, | 53-55 | యయాతి దేవయానిని చూచి ఎరిగియు ఎరుగనట్లే ఇరువురినిగూర్చి ప్రశ్నించుట- శర్మిష్ఠనుగూర్చి తెలియుటే కోరిక. |
| ,, | 56-64 | దేవయాని శర్మిష్ఠసంగతి చెప్పి తన్ను వివాహ మాడుమని కోరగా బ్రాహ్మణ కన్యను వివాహమాడుట దోషమని యయాతి నిరాకరించి, శుక్రాచార్యు డొప్పిన నొప్పుకొందువా యన నొప్పు కొందుననుట. |
| ,, | 65-73 | శుక్రాచార్యుల అనుమతితో దేవయానివి వివాహ మాడుటకు యయాతి సమ్మతించుట. |
| ,, | 74-124 | దేవయాని యయాతుల వివాహము. |
| ,, | 125-150 | అప్పగింతలు. |
| ,, | 151-162 | యయాతి దేవయానితో స్వపురమునకు వచ్చుట. |
| ,, | 163-165 | ఆశ్వాసాంతము-గద్య. |
| V | 1 | ఆశ్వాసాదికము. |
| ,, | 2-35 | దేవయానీ యయాతుల రహఃక్రీడలు. |
| ,, | 36-41 | దేవయాని యదు దుర్వసుల గనుట. |
| ,, | 42-44 | శర్మిష్ఠ తన దుస్థ్సితికి చింతిలుట. |
| ,, | 45-49 | కొలువున్న యయాతిని వనముచూడ రమ్మని వనపాలిక యర్థింపగా నతడు వచ్చుట. |
| ,, | 50-69 | అటువచ్చిన యయాతిని చూచి శర్మిష్ఠ |

| | | |
|---|---|---|
| | | నమస్కరించి తన్ను ఏలుకొనుమని వేడుట. శుక్రునియానతి తెలిపి మనస్సు మరల్చుకుని యయాతి నగరికి పోవుట. |
| ,, | 70-88 | శర్మిష్ఠ విరహము. శిశిరోపచారములు. |
| ,, | 88-108 | యయాతి విరహవేదన |
| ,, | 109-133 | వెన్నెలలో శర్మిష్ఠయు, యయాతియు విరహవేదనతో మైమరచి వెడలి ఒకరినొకరు చూచి పొదరింటి లోనికిపోయి వలరాచ కలయికల నలరుట. |
| ,, | 134-150 | శర్మిష్ఠను కానక ఆమె చెలులును, యయాతిని కానక ఆతని చెలువలును వారికై వెదకి వారిని చూచి సంతసించుట. |
| ,, | 151 | సూర్యోదయము కాగా దిడ్డిత్రోవను యయాతి నగరు చొచ్చుట. |
| ,, | 152 | రేయి పవలనునవి ఎరుగక యయాతియు, శర్మిష్ఠయు మదనక్రీడల దేలుట. |
| ,, | 153-154 | శర్మిష్ఠయందు ద్రుహ్యుండును, అనుండును, పూరుండును పుట్టుట. |
| ,, | 155 | ఐదుగురు కొడుకులు తన యాజ్ఞలు చేయుచుండగా యయాతి రాజ్య మేలుట. |
| ,, | 156 | ఫలశ్రుతి. |
| ,, | 157-159 | ఆశ్వాసాంతములు-గద్య. |

పైన నిచ్చిన కథాసంగ్రహమును బట్టి యయాతి చరిత్రములోని కథ నన్నయ ఆదిపర్వములోని యయాతి కథనే అనుసరించెనని స్పష్టమగుచున్నది ముఖ్యమైన భేదము ఒకటి. యయాతికి శుక్రుని శాపము వలన వార్ధకము వచ్చుట మొదలగు కథయు, తపోమహిమచే బ్రహ్మలోకమున బహుకాలముండి ఇంద్రలోకమునకువచ్చి యచ్చట ఇంద్రునితో సంభాషణమున మహర్షుల తపంబు నవమానించి నందులకు స్వర్గ

లోకభ్రష్టుడై పడిపోవుచు అంతరిక్షమున దౌహిత్రులున్న సద్భువనంబున సత్సంగతిచే మరల ఊర్ధ్వలోకప్రాప్తి నందుటయు నను కథాభాగములు ఇందులో వదలివేయబడినవి. నన్నయ ఆదిపర్వము తృతీయాశ్వాసములో ప 94-225 వరకు నున్న కథలో 97–181 పద్యములలో నున్న కథనే ఈ కావ్యములో గ్రహించి విస్తరింపజేసెను.

నన్నయ 85 గద్య పద్యములలో చెప్పిన యయాతి కథను తెలగన్న 519 పద్యగద్యములలో పెంచెను. ఈ పెంపు ముఖ్యముగా వర్ణనల వలనే కలిగినది. ఆ వర్ణనలకు ఆధారములును నన్నయ కథలో నున్నవే యని ఈ రెండు ఉదాహరణములచే స్పష్టపడును. (1)నన్నయ ఒక కంద పద్యమునను, చిన్న వచనములోనను (ఆ. ప. ఆ. 3 ప. 154–155) దేవయాని శర్మిష్ఠాదులతో పుష్పావచయము చేయుచు నిష్ట వినోదంబుల సున్నదని చెప్పిన కథను తెలగన్న చతుర్థాశ్వాసములో 3–29 వరకు పద్యములలో పెంచెను. (2) ఆ తర్వాత నన్నయ ప. 158 లో "అతిశయ రూపలావణ్య గుణసుందరి యయిన శర్మిష్ఠ నెఱుంగ వేఁటి" అని మాత్రమున్న వచన భాగ మాధారముగా జేసికొని శర్మిష్ఠ ప్రత్యంగ వర్ణనము చేయుచు యయాతి మనస్సులో కైవారము చేసినట్లు 24 గద్యపద్యములలో (ఆ 4. ప. 31–54) పెంచెను. తక్కిన పెంపుదలలును ఇట్టివే.

ఇది ప్రబంధము కనుక దాని కనుకూలముగా నన్నయ పురాణ కథను కొన్ని యెడల ముందు వెనుకలుగా తెలగన్న మార్చెను. పురాణ పక్కికి సహజముగా భారతములో ముందే కచ దేవయానుల వృత్తాంతము చెప్పబడినది. అట్లు చేసినచో యయాతి చరిత్రమను నీ ప్రబంధమునకు ఉచితముగా నుండదు, కనుక ప్రతిష్ఠానపుర వర్ణనముతోడను, దానిని పాలించు యయాతి వర్ణనముతో, అతని వేటతో ప్రారంభమైనది. ఈ విధముగా ప్రబంధ కథానాయకుడు యయాతికి ప్రాధాన్య మీయబడినది. కచదేవయానుల వృత్తాంతము ఆ తర్వాత వృషపర్వు డడుగగా శుక్రాచార్యులు చెప్పినట్లు సందర్భము కల్పింపబడినది. ఆ కథ శుక్రాచార్యులచే చెప్పించిన తీరులో కొంత ఔచిత్యభంగమున్నను, ప్రబంధ

రచనా పద్ధతికి అనుగుణముగా ఆ మార్పు చేయబడినది. ఇట్టివే మరి కొన్ని చిన్నమార్పులును గలవు.

కాలానుగుణముగా తెలగన్న చేసిన రెండు మార్పులు ప్రత్యేకముగా ప్రస్తావింపదగినవి. అవి కాలప్రభావముచే కవులలో వచ్చిన మార్పును సూచించును.

జలక్రీడానంతరమున శర్మిష్ఠయు దేవయానియు పొరపాటున ఒకరి వలువ యొకరు కట్టుకొనిరి. అందులకు ముందు అసహ్యించుకొని నిందించినది బ్రాహ్మణ కన్యయగు దేవయానియే. నన్నయ భారతములో అట్లు నిందింపబడిన పిమ్మట కోపించి శర్మిష్ఠ యుత్తరముచెప్పి నూతిలో పడద్రోసినది. తెలగన్న కథలో ముందు అసహ్యపడి నిందించినది రాచబిడ్డయైన శర్మిష్ఠ. దేవయాని ముందు మంచిగా చెప్పి చూచినది; పిమ్మట నవ్వులాటగా త్రిప్పజూచినది. అప్పటికిని రాచకూతురు ఉడుగక కేరడము లాడగా ఓర్వలేక దేవయాని తాను రాక్షసాచార్యుని కూతురనని యతిశయము చెప్పుకున్నది. ఆమీదట శర్మిష్ఠ గయ్యాళియై వినిపించుకొనక దేవయానిని నూత త్రోసివెళ్ళినట్లు తెలగన్న వర్ణించి మార్పుచేసెను.

ఈ మార్పు తెలగన్న సంస్కృత భారతమునుండి తెచ్చినదియు కాదు, తెలగన్న తన కథా రచనమునకు సంస్కృత భారతము చదివినట్లే కనబడదు. ఈ సందర్భములో సంస్కృత భారతములో గూడ ముందసహ్యపడినది దేవయానియే. కాని శర్మిష్ఠ ప్రతి వచనములో నన్నయ వాడినకంటె తీవ్రమైన పదజాల మున్నది. అందులో శర్మిష్ఠ దేవయానిని "నీవు యాచకవి, రిక్తవు, భిక్షుకివి" ఇత్యాదిగా నిరసించినట్లున్నది. రాచకూతురగు శర్మిష్ఠ అతిశయమును, గయ్యాళితనమును చెప్పదలచిన తెలగన్న సంస్కృత భారతము చూచియుండినచో ఆ మాటలు కూడ చేర్చియుండెడివాడే!

రెండవ మార్పు శర్మిష్ఠా యయాతుల సంయోగ సందర్భములోనిది. భారతములో నాకథ యిట్లున్నది. శర్మిష్ఠ యయాతిని తన

భర్తగా జేసికొను కుతూహలముతో నున్న సమయమున అశోకవనికా లోకన తత్పరుడైన యయాతిని జూచి తన్ను భార్యనుగా పరిగ్రహింపుమని ప్రార్థించినది. యయాతి తాను శుక్రునికి శయనమున శర్మిష్ఠను పరిహరించితిననియు, బొంకనేరననియు చెప్పెను. కాని శర్మిష్ఠ యాతనితో నా వాక్యము వివాహసమయమున నిచ్చినమాట కావున బొంకుటచే అసత్యదోషము రాదని శుక్రనీతినే తెలిపి ఒప్పించినది.

ఈప్రబంధములోగూడ యయాతి పుష్పవనము జూడబోయినపుడు శర్మిష్ఠ యాతనికి నమస్కరించి భార్యగా నేలుకొమ్మని ప్రార్థించినది. కాని యయాతి యియ్యకొనక శుక్రుని యానతి తెలిపి "అతని యానతికి వెఱచి మిగుల నమ్మగువ పయిందగిలిన తనమది మగుడించి నగరికిం జనియె"ను, అంతేకాని భారత కథలోవలె వివాహ సందర్భములో ఇచ్చినమాట తప్పుటచే నసత్య దోషము రాదని చెప్పి ఒప్పించినట్లు ఇందులో లేనేలేదు అట్లు శుక్రభయముతో వెళ్ళిన యయాతియే ఆ పిమ్మట మదన పరవశుడై వెన్నెలలోవచ్చి, తనవలెనే మదన పరవశురాలై వచ్చిన శర్మిష్ఠను కూడెను ఈ సందర్భములో ఏ ధర్మమును పాటింపక, శుక్రకోపమునకు భయపడక పోవుటే కాక దానిని పూర్తిగా విస్మరించి, ప్రకృతి సిద్ధమగు కామావేశముచే పరవశులై ఇద్దరును సంయోగము చేసినట్లు కథ మార్చబడినది. పైగా ఈ ధర్మవ్యత్యయము వలన యయాతి కెట్టి బాధయు కలిగినట్లు సూచితము కాలేదు. కావ్యాంతమందు దేవయానివలనను, శర్మిష్ఠవలనను కలిగిన ఐదుగురు పుత్రులు భక్తితో సేవించుచుండగా యయాతి సుఖముగా రాజ్యము చేయుచున్నట్లు వర్ణింపబడినది.

ఈ రెండు మార్పులలో మొదటిది కవికాలములో బ్రాహ్మణత్వమునకు కంటె రాచరికమునకు వచ్చిన యతిశయమును ప్రతిబింబించును. రెండవ మార్పు కామధర్మమే అన్ని ధర్మములకంటె నెక్కువయని సూచించుచు ఆ కాలములో ప్రబలిన సుఖజీవనముచే జనులలో ప్రవృద్ధమైన భోగాలాలసతను స్పష్టముగా చిత్రించుచున్నది.

యయాతి చరిత్రములో తెలగనార్యుడు నన్నయ రచించిన

భారత కథనే కాక పద్యములను పద్యములనే పెక్కుతావుల ననుసరించెను. పై రెండిటిలో మొదటి దాని కథాసందర్భములో 'సురకరువలి' 'వలువలు వీడ్వడుట' ఇత్యాది పదములు కూడ నన్నయ ప్రయోగించినవే తెలగన్న గ్రహించెను.

పైన నుదాహరించిన మార్పులేకాక కథకు తెలగన్న చేసిన పెద్ద చేర్పుకూడ ఒకటి ముఖ్యముగా గమనింపదగినది.

ఈ ప్రబంధములో యయాతి వేటాడుచు లేడిని తరుముచు ఒంటిగా పోయి జాబాలి యాశ్రమము చేరుట, అక్కడ జాబాలి యయాతితో అట్లురాజులు ఒంటరిగా రారాదనుచు, పూర్వము రాముడిట్లే ఒంటిగా మృగము వెంటబోయి అలజడి పడెనని చెప్పుట, అందుపై ఆ కథ యేమని యయాతి యడుగగా జాబాలి రామాయణ కథ చెప్పుట కల్పింపబడినది. ఇది యాంధ్ర భారతములో గాని సంస్కృత భారతములోగాని లేదు. స్పష్టముగా ఇది యెదోవంక కల్పించుకొని కొంత యసందర్భముగా చొప్పించిన కథగా కనిపించును. ఇది 120 గద్య పద్యములలో విస్తరింప బడినది ఈ ప్రబంధములో కథా సందర్భమున్న గ్రంథభాగము మొత్తము 639 గద్యపద్యములు గనుక అందున ఈ రామాయణకథ రమారమి ఐదవవంతు నడచినదన్నమాట!

దీనికి కారణమేమని విచారించినచో, వెంటనే స్థూలదృష్టికి స్ఫురించునది ఆంధ్రకవుల కందరికి అభిమానపాత్ర మైన శ్రీరామకథ చెప్పిననే కాని కవితాశక్తి సాఫల్యము నొందదను కవుల విశ్వాసము. సందేహము లేకుండ ఇది తెలగన్నను శ్రీరామకథ చెప్పుటకు ప్రోత్సహించెను.

తెలగన్న శ్రీరామకథ ప్రారంభించిన తీరు చూడగా మరియొక సూక్ష్మకారణముకూడ స్ఫురించును. ఇందులో రామాయణకథ రావణుడు లంకాపట్టణ మేలుచు స్వర్గముపై దండువెడలుటతో నారంభమగుట గమనింపదగినది. ఆ పిమ్మట రావణుడు వెండికొండ కడ విడిసి వెన్నెల రాత్రిలో విరాళినొంది రంభను బలాత్కరించి నలకూబరశాపము నొందుట వర్ణింపబడినది. ఇంతవరకు ఈ కథ 41 గద్య పద్యములలో నడచినది.

ఈ భాగము పూర్తిగా తిక్కనామాత్యుని నిర్వచనోత్తర రామాయణ కథను ఒరవడిగా పెట్టుకొని సాగినది. వెన్నెల వర్ణన, చకోరముల విందు వర్ణించుటలో తెలగన్న తిక్కననే అనుసరించెను. ప్రధానకథలో నన్నయ ననుసరించెను గనుక, ఈ సందర్భము కల్పించుకొని తెలగన్న తనకు తిక్కన కవితపై గల గౌరవాదరములు వెల్లడించెను. అట్లే తెలగన్న ఎఱ్ఱనను గూడ అనుసరించి కవిత్రయముపై తనకుగల భక్తి ప్రదర్శించెను. పూర్వకవుల యనుకరణములు ముందు ప్రత్యేకముగా ప్రస్తావింతుము.

ఈ ప్రబంధకథ యయాతి తనయైదుగురు కుమారులు సేవించుచుండగా వైభవముతో పుడమి యేలెనని పూర్తికావింపబడినది. ప్రబంధములో వస్త్వైక్యమును గూర్చి మంగళాంతము చేయవలెనను నిచ్చుమాత్రమే ఇందులకు కారణముకాదు. కృతిపతియైన అమీనుఖాను తన ఐదుగురు కుమారులు సేవించుచుండ సిరిసంపదలతో నట్లే వర్ధిల్ల గలడని సూచించుచు, యయాతికిని, కృతిపతియగు నమీనుఖానునకును సామ్యము కూడ ప్రదర్శించుట కవి యాశయముగా తోచుచున్నది. గ్రంథాదిలో

"అమీనుఖానునకున్, సిరులుం గడు నమరు కొమరులుం గలిగి మనునట్లుగా నా యొనర్పం బూనిన...కబ్బంబునకు."

అని పేర్కొని గ్రంథము ముగించి గ్రంథపఠనాదిక ఫలశ్రుతిగా,

"విడిముడిచేఁ బొంగి వెండియుఁ బైఁడియుఁ
ద్రవ్వి తండముగాఁగఁ దవిలి మెఱసి
కొడుకులుఁ గోడండ్రుఁ గూతులు మనుమలు
మనుమరాండ్రును మేలిమగువపిండు
పాఁడియుఁ బంటయుఁ బల్లకీ లేనుఁగుల్
సాలల గుఱ్ఱముల్ చాలఁ గలిగి
సెంపు వేల్పులరాయని సొంపు నొనర
మనుచు నుందురు తనరు సేమముల నెపుడు"

అని యిహలోకైశ్వర్యము మాత్రమే కవి చెప్పి తన కాలములో ప్రబలియున్న సుఖభోగైకచింతను వెల్లడించెను.

ఈ కవి యవలంబించిన స్వతంత్ర పద్ధతులు మరికొన్ని కూడ కలవు మొదటిది అచ్చ తెనుగు కావ్యము వ్రాయుట. తర్వాత పూర్వకవి స్తుతి, కుకవి నింద ఇత్యాదికము చేయుకుండుట, కవి తనవంశము వర్ణించుకొనకుండుట, మహమ్మదీయుడైన తన కృతిభర్తను ముక్కంటి మొదలగు హైందవుల దేవతలతోడను, పురాణ పురుషులగు భగీరథాదుల తోడను సామ్యము చెప్పి, విష్ణువు మొదలగు హైందవ దేవత లాతనకి జయైశ్వర్యములు కూర్తురుగాక యని ప్రార్థించుట.

ఈ గ్రంథము సూతుడు శౌనకాదులకో, మరియొకరు ఇంకొకరికో చెప్పినట్లు లేదు. కాని ద్వితీయాశ్వాసాదినుండి కృతిపతి సంభోధనమైన తర్వాత 'అటమీద తెఱంగు వినుండు' 'అటమీఁది తెఱంగు వినుము'– ఈ విధముగా కృతిపతికే వినిపించినట్లు కనబడుచున్నది. ఒక్క చతుర్థా శ్వాసాంతమున మాత్రము "అనవుడు నట మీఁది తెఱం గెట్లుండెనని యడుగుటయు" అను వచనము కలదు. అది కృతిపతి ప్రశ్న యనుట సమంజసము కాదు. ఈ కథకూడ కవి మొదట వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె అనియో దానికి తుల్యమైనట్టిదో కల్పించి, ఏదో కారణముచే నది తొలగించి యుండును. పొరపాటున చతుర్థా శ్వాసాంతమున మొదట వ్రాసినది మిగిలిపోయిన దని ఊహింపదగి యున్నది. తెలగనార్యుడీ గ్రంథము వ్రాయుచుండగా తెలిసి, అమీనుఖాను డడిగి తనకు కృతి యిప్పించుకొనెను గదా!

## కవితా విశేషములు

ఆ కాలమున ఒకవంక రాఘవపాండవీయము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము వంటి సరిక్రొత్త ద్వ్యర్థి కావ్యములు పుట్టినవి. సూరన రాఘవపాండవీయముతో తృప్తినొందక, కళాపూర్ణోదయమును కథా నిబంధనములో ఒక్క క్రొత్తపోకడ తోడను, ప్రభావతీ ప్రద్యుమ్నమును కథాకథనములో క్రొత్త మార్గమునను రచించెను. భట్టుమూర్తి

వసుచరిత్రము శ్లేషప్రధానమై సందితశ్రుతివలె నడచిన యపూర్వ మహా కావ్యము. విద్యానిలయమైన శ్రీ విద్యానగర రాజ్యములో కవు లీ విధముగా క్రొత్తత్రెన్నులు త్రొక్కుచుండగా గోలకొండ రాజ్యములోని ఆంధ్ర కవులు కూడ క్రొత్త క్రొత్తదారులు త్రొక్కుటకు యత్నించిరి మరింగంటి సింగరాచార్యుడు నిరోష్ఠ్యరామాయణమును, తెలగన్న అచ్చతెనుగులో యయాతి చరిత్రమును రచించిరి. నేటి కాలములో వలెనే కవులు సరిక్రొత్తరీతులు వెదుకసాగిన కాలమది! ఏ కాలమునందైనను ఈ నూతనత్వచింత చిత్రకవిత్వ పథములకే దారి తీయుట సహజము.

పాల్కురికి సోమనాథుడు "ఆరూఢ గద్యపద్యాది ప్రబంధపూరిత సంస్కృత భూయిష్ఠరచన మానుగా సర్వసామాన్యంబు గామి జాను తెనుగు విశేషము ప్రసన్నతకు" అని తనకు సంస్కృతముపై కంటె జానుతెనుగుపై విశేషాభిమాన ముండుటకు కారణము దాని ప్రసన్నత సర్వసామాన్యత్వము అని స్పష్టపరచినాడు. తెలగన్న అచ్చతెనుగు కావ్యము వ్రాయుటకు కారణము అట్టిస్వమత ప్రచారదృష్టి కాదు ఒక్క అచ్చతెనుగు పద్యము కావ్యములో ఉన్నను గొప్పగా చూతురు కావున కావ్యమంతా అచ్చతెనుగులో చెప్పినచో 'మెచ్చరొ, అబ్బురం బనరొ, మేలనరో, కొనియాడరో నినున్ ?" అన్నారట అప్పన్నగారు ; కావ్యమంతా అచ్చతెనుగులో చెప్పడమే ఈ కావ్యములోని ప్రధాన విశేషముగా తలపోసినట్లున్నాడు కవి. ఆదిపైగా 'మున్నెవ్వరు నొడువని తెన్ను' కూడదు. అంతేగాని తెలగన్నకు అచ్చతెనుగుమీద ప్రత్యేకాభిమానము కాని, సంస్కృతముపై ద్వేషముకాని ఉండి చేసినదికాదు. పైగా సంస్కృతము నాతడు వేల్పుబాస యని గౌరవముతో పేర్కొనెను. సంస్కృతములోని బిరుదులు, పేళ్ళు తెలుగులో మారుపేళ్ళు పెట్టినచో వినగూడదనికూడ నియమము చేసికొనెను.

తెలగనార్యుడు తేదలచిన ఈ క్రొత్తదనములో నిస్సందేహముగా కృతార్థుడయ్యెను. పెద్దకథను ఇట్టి భాషానియమముతో సరసముగా సాగించుట దుష్కరమగు కార్యము. భావసూక్ష్మములను ప్రదర్శించుట

యందును, వివిధవర్ణనలు చేయుట యందును, కథాకథనము సాగిం చుట యందును సంకెళ్ళు వేసికొన్న బందివలె కుంటువడి వ్యవహరింప వలసి వచ్చును; తెచ్చికోలు మాటలతో రచన సాగింప వలసి వచ్చును. కాని యట్టి లోపములు యయాతి చరిత్రములో నెక్కడను కానరావు. అచ్చతెనుగీ కవికి సహజముగా వచ్చినది. పాఠకులే కొంచెము అచ్చ తెనుగు అభ్యసింపవలెగాని, అట్లు చేసినవారికి కావ్యము మేలనిపించును. సంస్కృత పదఘటితములైన గ్రంథభాగములు సంస్కృత భాషా జ్ఞానము లేనివారు పఠించునప్పుడు కలిగించుశ్రమను కూడ ఇందులోని అచ్చ తెలుగు పదములు కలిగింపవు. ప్రతిష్ఠానపురములోని మేడల వర్ణ నము తిలకింతము :

> "తళుకుల్ గుల్కెడు నందు మేడల తుదందార్కొన్న బంగారు కుం
> డలు మిన్నేటను గానిపించుచును విన్నాణంపుఁ దెల్వీన్ గడున్
> విలసిల్లం గని పైఁడితమ్ములనుచున్ వేల్పుం బువుంబోండ్లు చే
> తులఁ దేరంజనఁజూచి నవ్వుదురు రంతుల్గాఁగ జేజేదొరల్"
>
> (ఆ 1. ప 78)

పుష్పలావికలను వర్ణించు సీసపద్యము.

> "బెళుకువై తళుకులు గులుకుకన్నుల చెన్ను
> కలువల కొకవింత చెలువు గొలుప" (ఆ. 1 ప. 84)

ఇత్యాదిగా ఆద్యంతము ఒకటే విధముగా శబ్దార్థాలంకారములతో నడచి నది. ఈ ప్రబంధములో చెంచులువచ్చి యయాతిని వేటకు రమ్మనుట, వేట, రమారమి 60 గద్య పద్యములలో కవి వర్ణించెను. ఆ భాగములో నన్నివిధముల వేటలు చక్కగా వివరింపబడినవి. ఏదువేట, గంటవేట, తెరవేట యను మూడు విధములైన మృగముల వేటయు, పాదివేట, విడివేట యను రెండు విధములగు పక్షుల వేటయు కవి చక్కగా పోషించెను. ఆ భాగములు చదువునపుడు వేటవర్ణనకు అచ్చ తెనుగు పదము లదికి పోయినట్లు సంస్కృతపదములు కుదురవనిపించును.

వెన్నెలతీపిని, చకోరదంపతుల కేలియు ముందు వర్ణించిన కవీశ్వ

రుడు తిక్కనామాత్యుడేయైనను దాని నాధారముగా జేసికొని తెలగన్న చకోరములవిందు అద్భుతముగా విస్తరింప జేసినాడు.

"అనుకువెన్నెలఁ దాల్చి తునిచి సేవెలుచేసి
వెన్నెల పాలను జున్నొనర్చి
గట్టివెన్నెల పిండిగొట్టి వెన్నెల వెన్న
గలయ వెన్నప్పాలుగా నమర్చి...

పండు వెన్నెలయను వెండిపళ్ళెరములఁ
జెలఁగి యిల్లాండ్రు వడ్డింపఁ జెలులుఁ దాము
వేడుకలు మీఱ బువ్వంపుఁగూడుఁ గుడిచి
పొదలు తమితోడ వెన్నెల పులుగు లమరె." (ఆ. 2 ప. 84)

ఆ వర్ణన సందర్భములో తెలగన్న తానును వెన్నెల పులుగుగా మారిపోయి, వెన్నెల బువ్వములో పాఠకులనుగూడ చెలులను చేసి విందారగింప జేసినాడు.

ఇంతటి సుఖమైన వెన్నెలయే పంచమాశ్వాసములో విరహవేదన పడుచున్న శర్మిష్ఠకును, యయాతికిని ఎట్లు కార్చిచ్చువలెనై సెగ కలిగించినదో వర్ణితమైనది. ఆ వెన్నెలచిచ్చే తుదకు వారి నిద్దరిని ఏకము చేసినిది.

"మరుఁతు తమిరేఁచఁగా డ
గ్గరి యంతట మిగులఁ జెలఁగు కాఁకలచే నొం
డొరులం గౌఁగిటఁ జేర్చుచుఁ
బరికింపుచుఁ గల్లయనుచుఁ బాయుచు మగుడన్."

"కదియుచుఁ బాయుచుఁ గ్రమ్మఱఁ
గదియుచుఁ బాయుచును మిగుల గరగరితోఁ బూఁ
బొదరింటిలోనికిం జని
వదలుచు దిగజాఱు జిలుఁగువల్వల తోడన్.
(ఆ. 5 ప. 128, 129)

కథాప్రారంభమునకు ముందు కవి "నా యొనర్పంబూనిన యబ్బురంబగు నిబ్బలు కబ్బంబునకుం బ్రావయగు త్రోవ యెట్టిదనిన" అని చెప్పుటచేత దీనిని 'బలు కబ్బంబు' అనగా మహా కావ్యముగానే భావించెననుట నిశ్చయము. మహాకావ్యమనగానే ప్రధాన లక్షణముగా ప్రతాపరుద్రీయములో చెప్పిన అష్టాదశ వర్ణనములును కలవా యను ప్రశ్న ఉదయించును.

యయాతి చరిత్రములో (1) నగరము ఆ. 1 వ. 75-90 లోనను, (2) అర్ణవము ఆ. 3 వ. 28-33 నందును, (3) శైలము ఆ. 2 వ. 34-41 లోనను, (4) ఋతువు ఆ. 4- వ. 3-13 నను, (5) చంద్రోదయము ఆ. 2 వ. 78-84 నను, (6) సూర్యోదయము ఆ. 5- వ. 28-30 యందును, (7) ఉద్యాన విహరము ఆ 3. వ. 54 55, ఆ. 4- వ 14-26, ఆ. 5. వ. 50 60 అందును (8) సలిల క్రీడ ఆ 3 వ. 56-73 నను, (9) రతోత్సవము ఆ. 5 వ. 10-35, 128-152 అందును, (10) విప్రలంభము ఆ. 5 వ 70 126 నను, (11) వివాహము ఆ. 4 వ. 84-143 నను, (12) కుమారోదయము ఆ. 5 వ. 36-41, 153-154 అందును, (13) ప్రయాణము ఆ 4-వ, 151-165, యుద్ధయాత్ర ఆ, 2 వ. 64-67 అందును, (14) ఆజి ఆ. 2. వ. 107, ఆ 3, వ. 38 లను, (15) నాయకాభ్యుదయము ఆ. 5 వ 155 నందును వర్ణింపబడినవి. శర్మిష్ఠ చెలులును. యయాతి చెలువలును వారి విరహతాపము తగ్గించుటకు చేసిన యాలోచనలు పంచమాశ్వాసములోనను, ద్వితీయాశ్వాసాంతములో రావణవధార్థము దేవతలు విష్ణువుతో చేసిన మంతనమును కలవు కనుక మంత్రముకూడ నున్నట్లే భావింప వచ్చును. మధుపాన వర్ణనము లేనట్లే కాని చకోరముల వెన్నెల విందు దానిస్థాన మాత్ర మించినట్లు గ్రహింపదగునేమో! ద్యూత వర్ణనము వదలి వేయబడినది.

ఇవిగాక అప్పకవి మరి నాలుగు వర్ణనలు కూడ చేర్చి 22 చేసెను. అవి కూడ నీ ప్రబంధమున గలవు. (1) వేట ఆ 1 వ 109-121, ఆ 2, వ 3-33 నను. (2) మౌనీంద్ర పుణ్యాశ్రమము ఆ. 2, వ 48-51 అందును, (3) కన్యాంగ సౌందర్య కథనము ఆ. 4, వ. 33-51 లను, (4) దౌహృదము ఆ. 5, వ. 36-37 అందును వర్ణింపబడినవి.

ఈ విధముగా ఏదో ఒక లెక్కను కవి అష్టాదశ వర్ణనములును పూర్తి కావించినాడు. కొలది వర్ణనలు తగ్గినను మహా కావ్యత్వమునకు లోపమురాదని లాక్షణికులు అభ్యనుజ్ఞ యిచ్చిరి.

పై నిచ్చిన వివరణమును బట్టి భోగలాలసతను ప్రదర్శించు నగర వర్ణనము, కేవలము వసంతర్తు వర్ణనము, చంద్రోదయము, ఉద్యాన విహారము, సలిలక్రీడ, రతోత్సవము. విప్రలంభము, వివాహము లను ఈ కవి విస్తరించి తక్కిన వర్ణనములు సంక్షేప రూపమున జేసినట్లు తెల్లమగును. ఇది కూడ ఈ కవి సమకాలిక ధర్మమునే సూచించును.

పారశీక భాషా సంపర్కము చేతనో, మరి ఏ యితర కారణముల చేతనో, ఆంధ్ర కవిత్వములో విలాస ప్రియత్వము 16వ శతాబ్దములో విజృంభించి తర్వాత శతాబ్దములలో మిన్నందినది. దేశములో ఐశ్వర్యము ఉన్నతస్థాయి నధిరోహించి, పతనోన్ముఖమైన దశను చేరుట కిది ప్రతీకగా భావింప వచ్చును. దీని కంతటికిని మూల కారణము లను మన భాషా పరిశోధకులును, చరిత్రపరిశోధకులు అనాటి యితర భాషల సాహిత్యములను చరిత్రాధారములను ఇప్పటికంటె లోతుగా పరి శీలించి ప్రదర్శించిననే కాని స్పష్టముగానిర్ధారింపలేము ప్రస్తుత ముపల భ్యములైన సాధనములను బట్టిఆనాటి వాఙ్మయమును తరచిచూడ వల పిన యావశ్యక మున్నదని మాత్రమేచెప్పగలము.

ఈ కావ్యసౌందర్యము అమూలాగ్రము చదివినవారికేకాని పూర్తిగా నవగతము కాదు. ప్రత్యేకముగా గమనింపదగినవానిలో దేవ యానీ యయాతుల వివాహవర్ణన మొకటి. అది చతుర్థాశ్వాసములో ప. 73-151 వరకు కలదు. సందర్భ వశాత్తుగా నప్పటికిని ఇప్పటికిని కలిగిన యాచార భేదములుకూడ గమనింప దగును. పంచాహ్నికముగా జరుగు వివాహములలో నేటి కాలమున బువ్వముబంతి, హాస్యములు నాల్గవనాటి సాయంకాలమునను, నాగవల్లి ఐదవనాటి సాయంకాలము నను జరుగుచున్నవి. యయాతి చరిత్రలో నవి వరుసగా 3 వ నాడును, నాల్గవనాడును జరిగినట్లున్నది (ఆ. 4. ప 115) నేడు వైభవముగా జరుగు సదస్యము ఇందులో ప్రస్తావింపబడనైన లేదు.

ఇందులో పంచమాశ్వాసములో రెండు రతోత్సవములు, రెండు విరహ వేదనలు మనోహరముగా వర్ణింపబడినవి. అచ్చతెనుగులో కవి కున్న సౌలభ్యము కావ్య మంతటను కానవచ్చును. అది ప్రత్యేకముగా చతుర్థాశ్వాసములోనున్న (వ. 13)దీర్ఘవచనమునందును, రెండు రగడల లోనను (ఆ. 4. వ. 26: ఆ. 5. వ. 77) అది కానవచ్చును.

శ్లేషచమత్కారములు గ్రంథమం దెన్నియోతావుల కానవచ్చును. ఈ సీస పద్యభాగములు గమనింపదగినవి.

"పలవలకై ప్రానుపడి పండ్లు చూపెడు
పుడుకుఁజెట్లను వేఁడఁబోవనేల,
మించు చూపుచునె నమ్మించి నిల్కడయేది
విసమొసం గెడు మబ్బుఁ గొసరనేల,
యొలివోయి యాలేక యొకపూఁట వెట్టెడు
తామరచెలిపట్టిఁ దడవనేల,
పొరలంగఁబడుచుఁ దాఁ దెరమఱుంగున నుండి
కసరెడు మున్నీటిఁ బొసఁగ నేల?

(ఆ. 1 వ. 29)

కృతిపతి అమీనుపురములోని
"మేనితోఁట లరసి కాంచు
ముసలి వారికైనఁ బసిబిడ్డలకునైనఁ
బండ్లువచ్చు నలరుఁ బ్రాయ మొదవి."

(ఆ. 1. వ. 37)

అనే వర్ణించి కవి ఎంత ముచ్చటగా పళ్ళుపోయిన ముసలివారి నూరించినాడు! నగర వనితలను వర్ణించుచు,
"నలువ తాఁ జేయఁగలిగిన పొలుపుఁ గూర్చి
కరముఁ జేతులఁబట్టినఁ గందునంచుఁ
దలఁచెఁ గొమ్మలుగా నవ నలరునట్టి
పువ్వుఁబోండ్లు దనర్తు రాప్రోలిలోన"

(ఆ. 1 వ. 81)

అని కవి అలవోకగా చమత్కరించినాడు.

కావ్యసౌందర్యము సంపూర్ణముగా పఠించి యానందింపవలసినదే. కాని ప్రతి కావ్యమునందును కొన్ని కంఠపాఠముచేసి మరల మరల స్మరింపదగిన పద్యము లుండును. అట్టివి ఎన్నో ఈ కావ్యములో కలవు. వానిలో కొన్ని మాత్రము ఈ క్రింది ఉదాహరించుచున్నాను. కొలనును జోగురాలితో పోల్చిన ఈ క్రింది సీస పద్య మెంత యపూర్వముగా నున్నది!

"నలువగు కలువమొగ్గలు జడల్గా, నాచు
 ఫాలుపైన కుచ్చలిబొంత గాఁగఁ
గడునొప్పు సంకులు కామాక్షి కవగాఁగఁ,
 దామరవిరి ముద్దుమోము గాఁగఁ,
గైవ్రాలు తొగరేకు కకపాల గాఁగఁ, బు
 ప్పొడి మై నలందిన బూది గాఁగ;
సిరి మీలులేఁదూడు సింగినాదము గాఁగఁ,
 దలిరు లే దీగ లాతంబు గాఁగ,

ముదురు మంకెనపువ్వు కెమ్మోని గాఁగఁ
దములు చూపఱఁ గొలిపెడు కొమరుఁ దనపు
జోగురాలును బోలెను సొబగు మీఱు
కొలను గాంచిరి మదిలోని కోర్కులడర."

(అ. 3. వ. 57)

పై పద్యములో 'కామాక్షి' అనునది ఇప్పటికిని తెలంగాణా ప్రాంతమున వాడుకలో నున్న ఒక విధమైన దీపారాధన చేయు కుంది పేరు. ఈ పద్యము చదవండి.

"ఎలమిం దుమ్మెద మ్రోఁత వాసెరవల్లై యింపొంద, మత్తిల్లు కో
వెల సీకారుల కూఁకపాట లమర న్వేవేడ్కతో నాలిగా
డ్పులపేరం గల నట్టువుల్గలఁ గోవు ల్పూపు లేఁదీవపా
త్రల కయ్యామని పూవుము త్తెపు సరుల్దాల్పంగ నిచ్చెం గడున్."

(అ. 4 వ. 12)

లేఁదీవపాత్రలకు వాని నాట్యముతీరు చూచి ఆనందించి ఆమని పూవులనే ముత్తపు సరులు బహూకరించెనట! యయాతిని చూచి పునస్స మాగము నాడు సిగ్గుపడుచున్న దేవయానిని కవి ఎంత మధురముగా వర్ణించినాడు అచ్చతెలుగు మాటలతో!

"నడుము వడంకి సిబ్బితి కనంబడ విప్పగు గొప్పకప్పు క్రొ
మ్ముడి విడి జాఱ నందియల మ్రోతకుఁ దోడుగఁ దమ్మికెంపు పెం
దొడవలు మ్రోవఁ బయ్యెద చనుంగవ చక్కి నొకింత చూపఁగా
వడి మగుడంగ నేగు చెలువం గని నవ్వుచు నింతు లింపుగన్"
(ఆ. 5. ప 14)

ఇట్టి పద్యములు గ్రంథమున నిండారుచున్నవి. లలిత వర్ణనములు చేయుటలో తెలగ నార్యుడు కడునేర్పరి.

తెలగనార్యునికి సమకాలికులైన పింగళి సూరన, భట్టుమూర్తి వంటి దిగ్దంతులగు ఆంధ్రకవులు ఆవల జీర్ణ విద్యానగర రాజ్యములో నూతన మార్గములు ఆంధ్ర కవితలో వెలయించు చుండిరి. వారి గొప్ప దనమును స్పృశింపగల కవులు ఏ కాలమునందో కాని పుట్టరు. వారితో తెలగనార్యుడు సమానుడు కాడన్నంత మాత్రమున అతని తక్కువ చేయుట కాదు. తెలగన్న త్రొక్కిన మార్గములో నాతడు ప్రథముడే కాక అద్వితీయుడు. అచ్చ తెనుగు అతని కావ్యములో తేటయై, సొబగులతో నొప్పి శబ్దార్థాలంకారములతో నిండారి యున్నది. శబ్దరత్నాకర కర్త దీనిని గూర్చి "అది శ్రుతికటువుగాక మృదువుగాను పొందికగాను నున్న యది ఇది యచ్చ తెనుఁగు గ్రంథములలో మేలైన దనితోఁచెడి'' నని వ్రాసిన మాటలు అక్షరశః సత్యములు. అచ్చ తెనుగు పదముల కర్థము లిచ్చుటలో వారి నిఘంటువులో ఎక్కువ భాగము యయాతి చరిత్రము లోని పద్యములను, పద్య భాగములను ఉదహరించి యుండుట గమనించినచో, ఈ కవికి గల భాషాప్రామాణికత్వము కూడ గ్రహింప దగును.

## ఛందో వ్యాకరణ రీతులు

తెలగన్నకు అచ్చ తెనుగుపై గల అధికారమును తెలుపుటకు

అతడు వాడిన ఛందో భేదములను గూడ గమనింప దగును. ఆంధ్ర కవులు సామాన్యముగా కావ్యములలో నెక్కువగా నుపయోగించిన ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము, మత్తేభములను ప్రసిద్ధములైన సమవృత్తములను, జాతులలో కందమును, ఉపజాతులలో సీసము, తేటగీతము ఆటవెలది ఎక్కువగా తెలగన్నయు వాడెను. ఇవికాక మొత్తము 16 విధముల ఇతర ఛందస్సులను ప్రయోగించెను. 4 తరలలు, 5 మత్తకోకిలలు, 2 పంచ చామరములు, 2 మాలినులు, 2 లయగ్రాహులు, 2 రగడలు, ఒక్కొక్కటి చొప్పున మహాస్రగ్ధర, స్రగ్ధర, సరసిపము,తోదకము, ఉత్సాహ, సుగంధి, తోటకము, బంధురము, లయవిభాతి, మణిగణ నికరము కలవు. ఏ ఛందస్సులోనైనను తెలగన్న అచ్చతెనుగు పోకడలు సుఖముగా నడుచును. ఉత్సాహలో చివరి గురువుకు ముందు సూర్యగణములు రెండిటిలో నేదైన వరుసగనే ఉండవచ్చును గాని, తెలగన్న గలములు మాత్రమేవాడి, విశేష నియమము పాటించెను. అందుచే దానిని సుగంధి వృత్తముగా గ్రహించినను సరిపోవును చతుర్థాశ్వాసములో సుగంధినామముతో నొక పద్యముకూడ వ్రాసినాడు. సుగంధికి 7 గలములపై గురువుండును. గాన దానిని ఉత్సాహయని కూడ పిలువ వచ్చును. నగణములు కలసిన ఉత్సాహను మాత్రము సుగంధియన వీలులేదు.

కవి ప్రయోగించిన రెండు రగడలలో ఒకటి ఆ. 4. ప 26 మధురగతి రగడ, రెండవది ఆ. 5, ప 77 ద్విరదగతి రగడ. సోమనాథాదులు రగడను భగవన్నుతికి వాడిరి. దానిని విలాస విషయ వర్ణనకు మొట్టమొదట వాడినది పెద్దనార్యుడని తోచును. అతని ఒరవడినే తెలగనార్యుడును అనుసరించి రగడను విలాసవర్ణనలకు ఉపయోగించెను. పెద్దన పుష్పాపచయ వర్ణనకు ద్విరదగతి రగడను వాడగా తెలగన్న అట్టి రగడను శైత్యోపచార వర్ణనకు వాడి పుష్పాపచయమునకు మధురగతి రగడను వాడెను.

రెండు సమవృత్తములలో మాత్రము తెలగన్న స్వాతంత్ర్యము వహించెను. ఒకటి సరసిజ వృత్తము, ఆ. 2, ప. 46; రెండవది బంధుర

వృత్తము, ఆ. 4, వ. 165. ఈ స్వాతంత్ర్యము ప్రామాదికమని తోచు చున్నది. కాని బుద్ధిపూర్వకముగా చేసినదని సందేహించుటకును అవ కాశము కలదు.

సరసిజవృత్తము పాదమునకు 24 అక్షరములుండు సంకృతి చ్ఛందము లోనిది సరసిజమునకు ఆ ఛందములోనిదే యగు క్రౌంచ పదమునకును ఎక్కువ భేదము లేదు. సరసిజమునకు మ, త య, న, న, న, న, స గణములును, క్రౌంచపదమునకు భ, మ, స, భ, న, న, న, య గణము లుండును. సరసిజములోని మొదటి గణములోని రెండవ గురువుకు బదులు రెండును లఘువు లుంచి, చివరనుండు నగణములోని మొదటి రెండు లఘువులను గురువుగా చేసినచో క్రౌంచ పదముగా మారును. రెండింటికి మాత్రలు సమానమే. తెలగన్న సరసిజ వృత్తము లోని 3 వ పాదము క్రౌంచపద పాదము; మొదటి పాదములోని 'కప్పగ' అను దానిని 'కప్పం' అని మార్చినచో సరసిజ వృత్తపాద మగును. రెండవ పాదములో 25 అక్షరములుండి ఎక్కడను సుకరముగా మార్చుటకు వీలులేదు. అట్లే నాల్గవ పాదము చివరనున్న 'వెవ్వరికిన్ అనునది 'వెవరికిన్' అని సులభముగా సవరింపవచ్చును గాని, మొదట నున్న 'తప్పక' అనుదానిని గగముగా మార్చిననేగాని సరసిజ పాదము కాదు. అట్లు మార్చుట కష్టము.

పైన నుదాహరించిన స్థలము లన్నిటిలో గురు వుండవలసినచోట రెండు లఘువులో, రెండు లఘువు లుండవలసిన స్థలములలో ఒక్క గురువే వాడుటో కవి చేసిన వ్యత్యాసము. అందువలన పద్యపునడక కుంటు వడదు. అతి సూక్ష్మముముగా పరిశీలించిననే కాని లక్షణ భంగము చెవికి వినిపింపదు. రేచన కవిజనాశ్రయమందును, అనంతుడు ఛందోదర్పణమునందును ఈ రెండు వృత్తములకు పాదమునకు రెండు చోట్ల యతిస్థానములు విధించిరి. కాని లక్షణభంగములో విధింప కున్నను వారి యుదాహరణ పద్యములలో నిద్దరును సరసిజములో 4 వ యక్షరము మీదను, క్రౌంచ పదములలో 5 వ యక్షరము మీదను ప్రాసయతి వాడిరి. వారి ననుసరించి వారు విధించినయతులేకాక, ప్రయో

గించిన విశేష ప్రాసయతి నియమముకూడ తెలగన్న ఈ పద్యమున పాటించి పద్యమునకు అందము కూర్చినాడు. ఈ కవికంటె అర్వాచీను డగు అప్పకవి ఈ ప్రాసయతి నియమము పాటింపలేదు.

ఈ కవి చతుర్థాశ్వాసాంతమున (ఆ. 4 ప. 165) వేసిన బంధుర వృత్తములో గూడ నించుక లక్షణ వైరుధ్య మున్నది. ఇందులో ప్రతి పాదమునకును వరుసగా న, న, న, న, స, భ, భ, భ, గురువు లుండ వలెను, యతి 15 వ అక్షరము తర్వాత నుండును. తెలగన్న ఈ పద్యములలో 6 వ గణమగు భగణము అన్ని పాదములందును పాటించ లేదు. మొదటి రెండు పాదములలో నక్కడ నలములు, 3 వ పాద ములో గగము ప్రయోగించినట్లు కాన్పించుచున్నది. కాని ఈ మార్పుల వలన మాత్రా సంఖ్య మారకపోవుటచే పద్యపునడక చెడక నిలచినది. పైగా రెండవ పాదములో సమవృత్తములకు నిషిద్ధమైన ప్రాసయతి కలదు. మొదటి పాదములో నక్కడ కొద్ది మార్పుతో సరిచేయవచ్చును గాని రెండవ పాదములో సులభ సాధ్యము కాదు. అందువలన నది లేఖ కుల దోషముగా కనిపింపదు.

పైన జెప్పిన రెండు వృత్తములలో తెలగన్న చేసిన మార్పులు ప్రామాదికము లైనను, బుద్ధిపూర్వకము లైనను, అతడు ఛందో వేత్త లకు విశేషవిషయము ప్రదర్శించినాడు. ప్రసిద్ధములైన సమవృత్తము లెన్నిటిలో ననో గురుస్థానమున రెండు లఘువులను, రెండు లఘువు లుండవలసిన చోట ఒక్క గురువును ఉంచి ఎన్నో క్రొత్త సమవృత్త ములను కల్పించుట కవకాశమున్నదని నిరూపించినాడు.

అచ్చ తెనుగుపై తెలగనార్యున కెంత యధికారమున్నదో తెలుపు టకు గ్రంథములో నతడు త్రిప్రాసములు, ద్విప్రాసములు వేసి పద్యములు సుఖముగా నడిపించిన తీరువలన ద్యోతమవును. ఈ త్రిప్రాసకందము నందము తిలకింపదగినది.

"వలరాయా వేఁడిన నీ
తల రాయా, యించుకైనఁ దలఁపవు మదిలోఁ

గలరా యీ రాజున కెన,
కొలరా, యేలయ్య తిట్టు కుడువగ నీకున్ ?"

(అ. 5, ప. 107)

దాని ముందే ద్విప్రాసకంద మున్నది. అ. 5, ప. 122 కూడ ద్విప్రాస కందమే.

గ్రంథారంభమందు అంధ్రకవులు ప్రయోగించు శ్రీకారమునకు బదులు 'సిరుల'తో నీ గ్రంథ మారంభించినాడు. శ్రీ శబ్దము సంస్కృత సమమని వర్జించి యుండును. కూచిమంచి తిమ్మకవి తన నీలాసుందరీ పరిణయమును శ్రీకారము తోడనే ప్రారంభించినాడు. ఆత డది నామ మను భావముతో అచ్చతెనుగు కావ్యములలో నిషిద్ధము కాదని గ్రహించి యుండును.

నగణము అచల లక్ష్మీకర మని రేచనకవి జనాశ్రయములో చెప్పెను. దాని ననుసరించి తెలగన్న ఈ గ్రంథమును 'సిరుల' అని నగణముతో ప్రారంభించినట్లు ఊహింపదగును.

తెలగనార్యుడు కావ్యరచనయందేకాక లోకవ్యవహారము నందును మిక్కిలి దక్షుడనుటకు ఈ కావ్యములో ముఖ్యముగా ఒక చక్కని సరసమైన సూచన కలదు. ఈ కవి కృతిపతివలన కృత్యాదిలో 'పలు మానికములు సొమ్ములు (అ.1.ప.8) పొందియుండెను. ఋణమాతడు తనపై నుంచుకొనదలపలేదు. దానిని తీర్చుకొనుటకై, కవి కృతిపతిని కావ్యాంతమున మణిగణనికరము (అ. 5. ప. 159) తో నలంకరించి ఋణవిముక్తుడ నైతినని వాచ్యముగా చెప్పక సరసముగా సూచించి తనయాత్మగౌరవము ప్రకటించుకొనెను.

తెలగనార్యుడు ఛందోవిషయములలో నేమి, వ్యాకరణ విషయము లలో నేమి, లాక్షణికులను శ్రద్ధగా ననుసరించెను. లఘువులఘురేఫలను అతడు వేరుగనే ఉంచినాడు గాని వానికి యతిప్రాసలలో మైత్రి గ్రహింప లేదు. క్వాచిత్కముగా కనబడుచున్న ప్రాసమైత్రి మతభేదముచే వచ్చిన దని తలంపవలెను.

ఈతడు కావ్య మంతటను సలక్షణమైన యాంధ్రభాషనే ప్రయోగించెను. ఈ క్రిందివానిని విశేషప్రయోగములుగా గ్రహింపదగును.

ఆ. 2, ప, 66 వేలం గుమ్మరిసారి పోల్కి-నేలయు అను నర్థములో

ఆ. 3, ప. 84 వల్పెవయ్యెద-వలిపెపయ్యెదకు

ఆ. 3, ప. 86 ఈ లాగు నిచ్చోట-ఈ లాగునన్‌కు

ఆ. 3. ప. 135 అన్నింజూచి-అన్నియుఁ జూచి కి

ఆ. 5, ప. 37 తొమ్మిదినెల్లు-నెలలు

ఇట్టివే మరికొన్నియు గలవుగాని అవి యన్నియు వ్యాకరణ వైచిత్రులుగా మాత్రమే గ్రహింపదగినవి!

## అనుసరణాదికము

ప్రసిద్ధులగు కవులందరును పూర్వకవుల కావ్యములను గాఢముగా పఠించియున్నవా రగుటచే ప్రయత్నపూర్వకముగనో, అప్రయత్నముగనో ఆ యా కవుల ఛాయలు భాషలోను, విషయములోను, రీతిలోను కావ్యములలోను గోచరించును. ఆ కవిలో విశేషమున్నచో నతనిని తర్వాతివారు అనుకరింతురు. ఈ రెండు సంపదలును తెలగనార్యునికి కలవు.

కథాభాగము నన్నయ రచించిన ఆదిపర్వములోనుండి గ్రహించిన దగుటచే గ్రంథమందంతటను నన్నయ పద్యములను, కొన్నిచోటుల ప్రత్యేకశబ్దములతో సహా, అనుసరించుట కనిపించును.

నూతిలోపడియున్న దేవయానిని నన్నయ యిట్లు సీసములో వర్ణించెను.

"తత్కూపమున విలసత్కూల ఘనవల్లి
యన్నిష్ట సఖినూది యున్నదాని....
దనసమీపమునకు జనుల యాగమనంబు
వన్నుగాఁ గోరుచు నున్నదాని
వరుణదేవుతోడఁ గరమల్గి జల నివా

సంబు విడిచి భూస్థలంబు వలని
కరుగుదేర నున్న వరుణేంద్రు దేవియ
పోని దాని...."

ఆ ఘట్టములో తెలగన్న సీసపద్యభాగము లివి :

"మాట మాటై యల్గి మఱుఁగుమై డాఁగిన
నీటిరాయని కూర్మి నెలఁత యనఁగ....
ననుఁగుఁజెలిని బోలె నలరుఁదీవియ మాఁది
నిగుడు మనము లోన నెగులుచేతఁ
జవ్వాదేమియైన నగర నాలించుచు
నున్నదాని...."

(ఆ. 3. ప. 42)

శుక్రుడు క్రోధము పనికిరాదని దేవయానికి పలుకు ఘట్టములో నన్నయ,

"అలిగిన నలుగక యెగ్గులు
పలికిన మఱి వినని యట్లు ప్రతివచనంబుల్
వలుకక బన్నమువడి యెడఁ
దలవక యున్నతఁడ చూవె ధర్మజ్ఞుఁ డిలన్.

"కావున బుద్ధిగలవారికిఁ గ్రోధంబు గొనియాడం దగదు శర్మిష్ఠ రాచ కూఁతురు గొండుకయది దానితోడిదేమి రమ్మనిన దేవయాని యిట్లనియె.

"కడు నమరక్త్రియు నేర్పును
గడఁకయుఁ గలవారి నుఱక కడవఁగ నెగ్గుల్
నొడివెడు వివేకశూన్యుల
కడ నుండెడు నంతకంటెఁ గష్టము గలదే ?
"ఈ వృషపర్వు పురంబేను జొర నొల్ల...."

ఈ భాగమునే తెలగనార్యు డెట్లు వ్రాసెనో గమనించినచో, నత డెంతగా నన్నయ రచన ననుసరించెనో అవగత మగును.

"కొమ్మ శర్మిష్ఠ తా రాచకూఁతు రగుట
నెఱుఁగ కేలాగు నిచ్చోట నెగ్గొనర్చి
తప్పుచేసిన నదినీకుఁ దడవఁ దగునె
కొండికయుఁగాదె యదియు నట్లుండె వినుము.
"తట్టినఁ గొట్టిన బన్నము
ముట్టిన నలుకయును వరపు మును దొఱగోచు నె
వ్వట్టున నలరిన మరలం
బుట్టువు వారలకు లేదు పువ్వుంబోఁడీ.

"కావున నలుక నలఁకువకు నిలుకడ యగుట దాని విడువ వలయు....ఇదియేమి రమ్మనపుడు దేవయాని యిట్లనియె....

(అ. 3. వ. 86-89)

"నెలకొను చుట్టఱికంబును
జెలికారము మునుపుఁ దనకుఁ జేసిన మేలుం
దలఁపక యెగ్గులు పలికెడు
ములుచలకడ నుండిరేని మోసము వచ్చున్.
"కావున నేను వృషపర్వుని పీడు సొరనొల్ల ...."

(అ. 3. వ. 91)

కచుడు రాలేదని దేవయాని చింతించుటను నన్నయ.
"వాఁడి మయూఖముల్ గలుగువాఁ డవరాంబుధిఁ
గ్రుంకె ధేనువుల్
నేఁడిట వచ్చె నేకతమ నిష్ఠమెయిన్
భవ దగ్నిహోత్రమున్
వోఁడిగ వేల్వఁగాఁ బడియెఁ బ్రొద్దును బోయెఁ
గచుండు నేనియున్
రాఁడు వనంబులోన మృగరాక్షస పన్నగబాధ
నొందెనో"

అని వర్ణింపగా, తెలగన్న దానినే,

"అకట ప్రొద్దుగ్రుంకె నావులు చనుదెంచెఁ
గచుఁడు రాఁ డిదేమి కతమొ నేఁడు
చిలువగములు రక్కసులుఁ గొట్టుముట్టాడు
నడవిలోన నేమి యయ్యె నొక్కొ!"

(అ. 3. ప. 121)

అని వర్ణించెను. ఇక్కడ నన్నయను తెలగన్న ఎంతవరకు కనుస రించెనో, దానికంటె అతడు పరిహరించిన 'నిష్ఠమెయిన్ భవదగ్నిహోత్ర ముల్ పోఁడిగ వేల్వఁగాఁ బడియె' అను భాగము ఎక్కువ గమనింప దగినది! శుక్రునివంటి కర్మిష్ఠునకు అగ్నిహోత్రములు ఎంత ప్రియములో బ్రాహ్మణులకుముఖ్యముగా హృదయమునవాటుకొని యుండును. సరిగా నదియు నిట్టివే మరి ఎన్నియో మూలములో నివియు వదలుటచేత తెల గన్న బ్రాహ్మణుడు కాడేమో అను సందేహము కలుగును. కాకున్నచో ముసల్మానుల నాశ్రయించి ముసల్మాను రాజ్యములో నివసించిన ఫలితమని సరిపెట్టుకొనవలెను.

కచునికొరకై శోకింపవలదనుచు శుక్రుడు దేవయానితో "అతఁడు సుగతికిఁ జనుఁగాక యేల శోకింపగన్" అనగా నన్నయ దేవయాని మాట లిట్లు వర్ణించెను.

"మతి లోకోత్తరుఁడైన యంగిరసు మన్మం డాశ్రితుం డా బృహ
స్పతికిం బుత్త్రిుఁడు మీకు శిష్యుఁడు సురూప బ్రహ్మచర్యాశ్రమ
వ్రతసంపన్నుఁ డకారణంబ దనుజవ్యాపాదితుండైన న
చ్యుత ధర్మజ్ఞ మహాత్మ యక్కచున కేశోకింప కెట్లుండెదన్!"

తెలగన్న ఈ భాగములో శుక్రుడు "అతని కింత వగవనేటికిఁ జనుఁగా కలపుట్టు వేదు చక్కికిఁ గడఁకన్" అనగా, దేవయాని ప్రత్యు త్తర మిట్లు వర్ణించెను

"గొనముల ప్రోక, యంగిరసు కూరిమి మన్మఁడు, వేల్పు టొజ్జ పె
ర్మిని గనుగొన్న బిడ్డ, మఱి మీకును జట్టు, కడిందిరూపు నే
ర్పును గడునేమముం గలుగుప్రోడ, తావి తొలువేల్పుమూఁకచేఁ

జనిన కచుం దలంప మది జాలిఁ గరంగదె యెట్టివారికిన్!"
(ఆ. 3. ప. 132)

ఆ తర్వాత నదీభావమును పెంచి యొక్క సీసపద్యముకూడ చేర్చెను. ఈ విధముగా తెలగన్న నన్నయ ననుసరించిన కావ్యభాగము లెన్నియో కలవు.

ఇక తిక్కనామాత్యుని ననుసరించుటకే యేమోఅన్నట్లు, ద్వితీయ తృతీయా శ్వాసములలో రామాయణకథను చొప్పించి రావణుడు దిగ్విజయమునకు వెడలిన ఉత్తర కాండలోని కథతో తెలగన్న యారంభించెను. తిక్కన మిక్కిలి ప్రీతిగల తన పద్యములు కొన్ని నిర్వచనోత్తర రామాయణమునుండి మహాభారతములోగూడ చేర్చుకొనెను. అట్టివానిలో యమునిసేనలపై రావణుడు పాశుపతము ప్రయోగించినప్పుడును, ఉత్తరగోగ్రహణ సమయములో అర్జునుడు దేవదత్తము పూరించినప్పుడును జరిగినది వర్ణించుటలో చెప్పిన యీ పద్యము ఒకటి.

"కలఁగెం దోయధి సప్తకంబు గిరివర్గంబెల్ల మాటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం
దల మందెం ద్రిదశేంద్రు పట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె నా
కుల మయ్యెన్ గ్రహతారకాకులము సంక్షోభించె నవ్వేధయున్.

దీనికి ప్రతిగా తెలగన్న రావణుడు ప్రయాణభేరి వేయింపగా జరిగిన దిట్లు వర్ణించెను.

"రాలెం జుక్కలు గుబ్బలు ల్వగిలె సంద్రంబు ల్గలంగె న్వడి
న్నేలం గుమ్మరిసారి పోల్కిఁ దిరిగెన్ వ్రీలెన్ దెసల్ బీతుచేఁ
దూలె న్వేలుపుటెంకి పాఁవనెలవుం దోడ్తో వెతం బొందె వే
జాలిం బొందిరి బేసికంటి దొరయున్ సైరింప కా వెన్నుఁడున్."
(ఆ. 2. ప. 66)

రెండు పద్యములలో నన్నియు నొకటే. బ్రహ్మాకుబదులు హరి హరు లిందులో క్షోభించిరి. అచ్చ తెనుగులో నిటువంటి మహాక్షోభము కూడ నెంత సుఖముగా, నేర్పుగా ఈ కవి వర్ణింపగలడో ఈ పద్యమే చాటుచున్నది.

రావణుని సేనలు రెండు కథలలోనను వెండి కొండకడనే విడిసినవి. సూర్యాస్తమయము, చీకటి తిక్కన వర్ణించినట్లే తెలగన్నయు నిక్కడ వర్ణించెను. ఆ తర్వాత చంద్రోదయ వర్ణనము రెండింటను గలదు. ఉత్తర రామాయణము షష్ఠాశ్వాసములో వ. 41-56 వరకు తిక్కన చంద్రోదయమును, వెన్నెల తీపిని, చకోరముల విందును రమణీయా ద్భుతముగా వర్ణించెను. తెలగన్న కావ్యములో ద్వితీయాశ్వాసములో వ. 79-84 వరకు దానిననుసరించియే వ్రాసెను. చకోరముల విందుపైన నుదాహృతమైనది. తిక్కన చంపకమాలలో,

"కలయఁగ నూనునట్లుగ జగంబు సమస్తముఁ జాలదోగెనో
జలజభవుండుగోరి పెఱచాయల నెల్లను మాన్చి యెందునుం
దెలుపు ఘటించెనో యమృతదీధితి వేడుక విశ్వరూపుడై
నిలిచెనొ నాఁగ నెల్లెడల నిండఁగ వెన్నెల పర్వె సాంద్రమై."

అని వర్ణించిన భావమునే తెలగన్న ముచ్చటగా కుదించి సీసపద్యపు ఎత్తుగీతిలో నిట్లు వర్ణించెను :

"అన్ని రంగులు తనరంగులై తలిర్ప
నిగిడి తెలిచాయ వెల్లియై నిండెననఁగ
నిక్కి జగముల నెల్లను బిక్కటిల్లి
నిలిచి పొంగుచుఁ బండు వెన్నెల దనర్చె."

(అ. 2. వ 82)

ఆ తర్వాత రావణుడు రంభను బలాత్కరించుట, నలకూబరుడు శాపమిచ్చుట వరకు తిక్కన ఒరవడినే తెలగన్న రచన సాగినది.

పైన నిచ్చిన చీకటిని వర్ణించిన సందర్భములో ఎఱ్ఱయ నృసింహ పురాణములోని పద్యమును తెలగన్న అనుసరించెను.

"పొదలియొండొండ దివియును భువియు దిశలుఁ
బొదివికొనియుండు చీఁకటి ప్రోవువలన
మిక్కుటంబుగఁ గాటుక గ్రుక్కినట్టి
కరపటంబన జగదండఖండ మమరె"

(నృ. పు. అ. 3 వ. 80)

"ఇరులు జలియుచును వలకుల్
కరమరుదై కరుడుకట్టి కదిసిన కరణిం
బరఁగఁగఁ దోఁచుడుఁ గాటుక
కరవటముంబోలె నిజ్జగంబు దనర్చెన్."
(య. చ. ఆ. 2. ప. 75)

ఈ విధముగా తెలగన్న కవిత్రయమునేకాక శ్రీనాథుని, పోతనను, పెద్దనను, నందితిమ్మనార్యుని, ఇంకనుమరియెందరో పూజ్యులగుకవులను అనుసరించి వారి యెడల దనకు గల గౌరవ భావమును ప్రకటించుకొనెను. యయాతి చరిత్రమునందును, ప్రభావతీ ప్రద్యుమ్నమునందును దగ్గర పోలికలుగల వర్ణనము లెన్నోకలవు. సూరనయు, తెలగన్నయు సమ కాలికులగుటచే ఎవరెవరిని అనుసరించిరో ప్రస్తుతము నిర్ణయింపలేము. ఆ కాలములో గోలకొండ రాజ్యములోని కవులకును, విద్యానగర రాజ్యములోని కవులకును రాకపోకలు, ఇచ్చిపుచ్చుకొనుటలు, గ్రంథపఠనములు విశేషముగా నెలకొనియుండవలెనని మాత్రము నిర్ధారింప వచ్చును. రాజ్యముల మధ్య యుద్ధములు జరుగుచునే యున్నవి. కవులు మాత్రము ఒకరి నొకరు అవగాహన మొనర్చుకొనుచు సంస్కృతిలో సామ్యమునకు మార్గదర్శకులైరి.

తెలగన్న అచ్చతెనుగు కావ్యరచనకు ఆదికవియగుటచే నాతని ప్రభావము తర్వాతి కవులపైనను, అందులో ముఖ్యముగా అచ్చతెనుగు కావ్యకర్తల పైనను విశేషముగా కలదనుటకు సందియములేదు. ఒక్క ఉదాహరణము మాత్ర మిత్తును.

యయాతి దేవయాని మొదటిసిగ్గు పోగొట్టుటకై చేసిన పనులను, ఆ. 5. ప. 25 లో

"పసుపడు కూర్మి నొక్కొకనెపంబునఁ జెక్కులుఁ గొప్పు గుబ్బలుం
గనుఁగవ యంటి సిబ్బితిఁ దగం దొలఁగించుచు"

ఇత్యాదిగా వర్ణించగా, దానినే కూచిమంచి తిమ్మకవి నీలాసుందరీ పరిణయమున సీసపద్యముగా,

"తెలిముత్తియపుసరుల్ దిద్దు నెపంబున గిబ్బచన్నొ్గడలఁ గేలఁ జెనకి
చెవుల కమ్మలు చక్కఁజేయు జాడల ముద్దు చిప్పిల నిద్దంపు చెక్కులంటి....
పువ్వుటెత్తులు దుటిమెడి పొలుపెలర్ప
గవ్వమీఱిన బలితంపుఁ గొవ్వుముట్టి"

విస్తరింప జేసినాడు.

## ఇతరుల అచ్చతెనుగు గ్రంథములు

పొన్నికంటి తెలగనార్యుడు ఈ యచ్చతెనుగు ప్రబంధము వ్రాయగానే, వెంటనే ఈ రచన ఇతర కవుల నాకర్షించినది. అప్పటికే నిరోష్ఠ్యరామాయణము రచించిన మరింగింటి సింగరాచార్యులు తానును అచ్చతెనుగు ప్రబంధ మొకటి వ్రాసి దానికి 'చిలువ వడగ రాజేనికత' యని పేరిడెను. ఆతడు నామములలో గూడ నచ్చతెనుగు వ్రాయుటకు ప్రయత్నించినట్లు తోచును. ఆ గ్రంథమింతవరకు ముద్రితము కాలేదు.

పదునేడవ శతాబ్దములో ఆడిదము బాల భాస్కరకవి శుద్ధాంధ్ర రామాయణము రచించెను.

పదునెనిమిదవ శతాబ్దములో కూచిమంచి తిమ్మకవి అచ్చతెనుగు రామాయణమును, నీలాసుందరిణయమును రచింపగా, శ్రీ దేవీభాగవత కర్తములుగు పావయారాధ్యులు 'సర్వమధురము' రచించెను.

పందొమ్మిది, ఇరువదియన శతాబ్దములలో కందుకూరి వీరేశలింగము, దేవులపల్లి నరసింహశాస్త్రి, హరికథా పితామహుడు ఆదిభట్ల నారాయణదాసు ఇత్యాదులగు ప్రసిద్ధ కవులు అచ్చ తెనుగు కావ్యములు పెద్దవి, చిన్నవి రచించిరి. ఇప్పుడును వ్రాయుచునే యున్నారు. నారు నాగనార్య విరచితమగు 'మనువు పుట్టువు' అను అచ్చ తెనుగు కావ్యము భారతి 1967 ఫిబ్రవరి సంచికలో సమీక్షింపబడినది. అచ్చ తెనుగు నిఘంటువులును ఎన్నియో పుట్టినవి. వానిలోనెల్ల పైడిపాటి లక్ష్మణకవి 'ఆంధ్రనామ సంగ్రహము', అడిదము సూరకవి 'ఆంధ్రనామ శేషము'

ప్రసిద్ధిచెంది, అమరమువలెనే భాషాభిమానులచే వల్లించబడుచున్నవి. 'సాంబనిఘంటువు', 'ఆంధ్ర భాషార్ణవము', 'వెంకటేశాంధ్రము' మొదలగు నితర శుద్ధాంధ్ర కోశములును గలవు.

## పరిసమాప్తి

ఆంధ్ర ప్రదేశ మంత్రివర్యులు శ్రీ యం. ఆర్. అప్పారావుగారు చేసిన సూచన ననుసరించి ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ తెలుగు భాషలోని ప్రాచీన సాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లుగ ప్రకటించవలెనని నిర్ణయించినది. అపూర్వమైన ఈ యయాతి చరిత్రము అచ్చుకు ప్రతి సిద్ధముచేసి ఉపోద్ఘాతము వ్రాసి యిచ్చుటకు నన్ను నియమించిన శ్రీ ఆంధ్ర ప్రదేశ అకాడెమీవారికి, ముఖ్యముగా ఆ సంస్థ కార్యకర్తలకు నా కృతజ్ఞతను తెలుపు చున్నాను.

ఈ గ్రంథపఠన సందర్భములలో గ్రంథస్థ విషయములను కేవల సారస్వత ప్రీతిచే నాతో గాఢముగా విమర్శించి ఎన్నో అమూల్యములగు సూచనలుచేసి సహకరించిన మిత్రులు భాషాప్రవీణ శ్రీ గిద్దలూరు చెంచు బసవరాజు బి ఏ., గారికి ఆశీర్వచనపురస్సరముగా నా కృతజ్ఞత తెలుపు చున్నాను.

అపూర్వమును, అద్భుతమున్నునై మధురమైన యీ గ్రంథమును పఠించునప్పుడు నాకు కలిగిన యానందమే ఈ గ్రంథము నందుకొన బోవుచున్న పాఠక మహాశయులకును తప్పక కలుగ గలదని యాశించు చున్నాను. వారికి ఈ విందారగించుటలో నా యీ ప్రయత్నమేమాత్రము సహకరించినను కృతార్థమైనట్లు భావింవగలను.

(ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1967 లో ప్రచురించిన గ్రంథమునకు వ్రాసిన పీఠిక.)

# తెలుగుతోట

ఆంధ్రోద్యమము ప్రారంభమైన పిమ్మటను అంతకు పూర్వము తెలుగు వారిని గూర్చిన కావ్యము లెందరో కవులు రచించినారు. కొన్ని వారి గొప్పదనమును ప్రదర్శించును, కొన్ని వారి జీవనమును చిత్రించును. దాసు శ్రీరాములు కవి వ్రాసిన 'తెనుగునాడు' వంటి కావ్యములు తెలుగు వారిలో పలు తెగలవారి యాచార వ్యవహారములను, కట్టుబాటులను, మాట మంతులను నర్మోక్తితో చిత్రించును. శ్రీ రాయప్రోలు సుబ్బారావు 'ఆంధ్రావళి'లో ఆంధ్రుల శౌర్య ప్రతాపములను ఎన్నియో ఖండ కావ్యములలో శ్లాఘించినాడు. అందులో 'ప్రబోధము' వంటి కృతులు విశేష ప్రచారము గన్నవి.

'అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ విద్యాలయములు స్థాపించునాడు...'

ఇత్యాది పద్యము లెరుగని విద్యార్థులుగాని విద్యాధికులుగాని అరుదు. ఐనను కేవల కావ్యదృష్టితో చూచినచో తెనుగు దేశముపై ప్రేమాభిమానములు ప్రదర్శించు నాధునిక కావ్యములన్నిటిలో శ్రీ సుబ్బారావు 'తెనుగు తోట' విలక్షణమైనది. దాని కవిత నిరుపమానమైనది.

ఇందులో తెలుగువారి పూర్వపు నాటి గొప్పదనమును ఆవేశముతో వర్ణించు పద్యములు లేవు; నేటి వారి నుద్బోధించు ప్రయత్నమున్నట్లును ప్రత్యక్షముగా నగుపడదు. తెలుగు దేశములోని యాచార వ్యవహారము లిట్టివని చెప్పుచు చేయు వర్ణనములు కనిపింపవు. వాచ్యముగా తెలుగు గడ్డపై నభిమానము చెప్పబడదు. ఐనను, ఈ కావ్యము చదువు వారికి కృష్ణవేణీ తరంగిణిపై పూల నావ కట్టుకొని తరుణులు సహవాసమున సముద్రములో కలయు వరకు వాహ్యాళి పోవుచున్నట్లుండును;

తెలుగు దేశము ప్రత్యక్షమగును; ముఖ్యముగా ప్రాతఃకాల దృశ్యము లన్నియు గోచరించును; తెలుగు దేశముపై ప్రేమ అతిశయించును; అందులో మంచి చెడ్డలు తెలిసి కొననగును; పూర్వపు ఔన్నత్యము స్మరణకు వచ్చును. ఈ కావ్యము కవి చెప్పిన నాటికి భరత భూమికి స్వాతంత్ర్యము లేదు. ఇందులో తెలుగుతల్లి దర్శింపబోవు, దివ్యజ్యోతి భారత స్వాతంత్రమనియే అప్పుడు కవి ఉద్దేశించి యుండును. నిశ్చయమే! కాని అతడామాట స్పష్టముగా చెప్పలేదు. అందుచే పారతంత్ర్యము పోయిన ఈనాడు గూడ మనము సాధింపవలసియున్న యనేక లక్ష్యము లను కవి వాక్కు సూచించును. ముందెన్నడైన సాధింపవలసి వచ్చు నాదర్శములను గూడ అది ధ్వనింప జేయగలదు. ఈ కావ్యము చెప్పిన వ్యక్తి ఉద్దేశించి యుండని వస్తువునే కావ్యము సాధించినది. కావ్య రచనా సందర్భమున సుబ్బారాయ వ్యక్తి కేవల కవి వ్యక్తిగా వివృత మయినందుననే అట్టిది సాధ్యపడినది. వెనుక ఋషి తాను ఋషినైతి ననుకొన్నట్లే సుబ్బారావు కూడ 'కవి రభవ'మ్మని యనుకొని యుండ వలెను!

శ్రీ సుబ్బారావు తెనుగునాటి (తెలఘాణ్య) బ్రాహ్మణుడు. తెలంగాణమే పెద్ద యుద్యోగమున నాతని నిలిపినది. తన నాడియందాతనికి ప్రేమ అభిమానము కలవు. ఎవరికుండవు? కాని యాతడు తన తెలుగునాడు చిన్న తెగకేగాక సమస్తమైన తెలుగు వారికి అన్వయించు నట్లు విస్తృతము చేసినాడు. మంగళా చరణము చూడుడు.

'ప్రొద్దుపొడుపు నోములు నోయబూనినావొ
చిట్టిబొట్టు కుంకుమబెట్టు చిన్నదాన!

* * *

కడలనెల్ల నాకర్షించి కనులుగుట్టు
తెనుగు మీరిన గరువంబు దీరులేల?

* * *

తీయని తెనుంగు మాటల దెలుపగలవొ
కన్నెవౌదో తెనుగునాటి చిన్నదాన!'

## 2

తెనుగుతోట కావ్యవస్తువు చిన్నది. అవతారికలోని మూడు ఘట్టములు కాక ఇరువది మూడు ఖండ కృతులే! అందులో ఏదియు పాతిక పంక్తులు దాటదు. ఆ వస్తువు కూడ స్వల్పమే. ఈ చిన్న కావ్యములోనే నిత్యమనోజ్ఞమైన తెలుగునాటి సర్వస్వమును ఇమిడ్చినాడు కవి!

ముందు 'లేఖినీ శుభావాహన' చేసినాడు. మిల్టనువంటి పాశ్చాత్య కవులు సాహిత్య దేవతను 'నా చేత నేమి పల్కింతువు?' అని సంబోధించుటను జ్ఞప్తికి తెచ్చును. కాని సామ్య మంతవరకే!

'మధుర మధుమాస సాంధ్యయామములలోన
ఇసుక పడకలబడి యింపయి ప్రవహించు
ఏటియొడ్డుల దిరుగాడ నిచ్ఛగింతొ?

* * *

కొమ్మపై నిల్చి పిల్లనగ్రోవి నూదు
గొల్లచిన్న వానిని జూడ నుల్లసింతొ?'

* * *

ఇట్లడిగి యడిగి కవికుమారుడు,

'విలస దుదయప్రవతోద్వాహవిధము జెప్పి
రసికజనుల లాలింపుము రమ్యగీతి!'

అని లేఖిని నాహ్వానించినాడు.

ఆ పిమ్మట కవి 'గీతాసఖ్య' మాచరించినాడు. గీతంతో సఖ్యము చేసికొనని లేఖిని వ్రాయగలుగునది లాభనష్టముల పద్దులేకదా! గీతాసఖ్యమున్న లేఖిని భావపద మందుకొనును.

'పొడుపుటేళ్ళు త్రుళ్ళింతలాడెడు విధాన
పాడవమ్మ, గీతాసఖీ, భావపదము!
కోయిలకు మారుగూయు లేగొల్లకొమిరె

మసగి వచ్చీసులాడు బ్రాహ్మణకుమారి
బ్రమసి వలపెత్తనాలింప బ్రచురఫణితి
పాడవమ్మ, గీతాసఖీ, భావపదము!
రుధిర కణపూతమైన వీరునికరంబు
ద్రోహమున నల్లబడిన యస్త్రులభరంబు
ప్రేమచే ధౌతమైన సాధ్వీనఖాళి
రత్నగర్భ దాచిన గుప్తరంగములను'

భావపదము పాడునట్లు గీతాసఖ్యము సాధించినాడు.

అంతట 'మంగళాచరణము' ప్రారంభించెను. తెలుగునాటి చిన్నది ప్రొద్దుపొడుపు నోముకు బయలుదేరినది.

"ఎచటకేగెదు? నోము పేరేమి? చెపుమ!
ఎవరధిష్ఠానదైవము? వృత్తమెద్ది?
సాంగపూజావిధానమే భంగి జరుగు?
తగు నుపాయన మేది? తత్ఫలము లెవ్వి?"

ఇత్యాదిగా ఆంధ్ర యువకు డొకడు కన్నెను వరుసగా మూణ్ణాళ్ళు ప్రశ్నించినాడు; తుదకు సోదరుని కాపిల్ల యాదేశించినది:

'ఆలకింపుము బాలరసాల శాఖ
నుయ్యెలల నూగుచును మధులియ్య ఫణితి
పాడుచున్నది కోయిల పాటకత్తె
పావనంబైన మాతృసేవా వ్రతంబు!'

ఆ పిమ్మట నాతనికి 'కోకిల పాట' వినిపించినది. ఆ పాటలో తరంగములు ఇరువదిమూడు!

సంక్రాంతిపండుగ రోజులలో కృష్ణాతీరమున బొమ్మలు పెట్టుకుని కన్యకలు గొబ్బి దేవరను పూజింతురు. ప్రతి రాత్రియు దేవరకు పవళింపు సేవ చేయుదురు. మరల ఉదయమున దానిని లేపుదురు! ఎట్లు?

'నిద్రలే గొబ్బెమ్మ, నిద్రలేవమ్మా!
నిద్ర కన్యలు వచ్చి నిన్ను లేపేరు,

ఆట కన్యలు వచ్చి ఆడి పొయ్యేరు,
పాట కన్యలు వచ్చి పాడి పొయ్యేరు,
నిద్రలే గొబ్బెమ్మ, నిద్రలేవమ్మా!'

మరియు వా రిట్లు పాడిరి.

'మట్టులు మట్టులు నరికేరూ
మట్టుల మేడలు గట్టేరూ
మట్టి క్రిందా శ్రీ మహాలక్ష్మి నిద్రాలే, నిద్రాలే!'

అట్లే 'రావులు రావులు, చింతలు చింతలు, అరట్లు అరట్లు' నరికి రావుల మేడలు, చింతల మేడలు, అరట్ల మేడలు ఆదిలక్ష్మికి కట్టించి, రాత్రులు నిద్దురపుచ్చి, ఉదయము నిద్దురలేపుదురు. అది యొక గౌరి వ్రతము! ఇవి ఇంటింట చూచిన సుబ్బారాయునికి తెలుగు కన్యచేత నూతనవ్రత మొకటి పట్టింపవలెనను ఉబలాటము పొంగినది. కోయిల చేత పాట మొదలు పెట్టించినాడు.

'నిదుర నెలతలు వచ్చిరి నిదురలేవ,
భద్ర కన్యలు దరిసిరి పాటపాడ,
తెలియరాని చక్కిలిగింత వలపు బనుల
మేలుకొలిపెడు పవనుడు బాలు డట్ల.

* * * *

కొమ్మ లొక క్రొత్తరుచి సరసమ్ము లయ్యె.

* * * *

లేచి రావమ్మ, మాతల్లి లేచి రమ్మ,
పిలువ వచ్చిరి నీతోడి బిడ్డలరుగొ!'

కోయిల ఇట్లు ఇరువదిమూడు పాటలతో నిద్రలేపును. తోటలో బంతి యాటకు తోడి చెలులు పోవుచున్నారు. వారిలో,

'క్రొత్తగా పెండ్లియైన లేగుబ్బెతలును
నిన్న మొన్న నీడేరిన కన్నియలును

పరికిణీ లింక విడువని బాలికలను
గడుసు నెరజాణలగు ప్రౌఢపడతుకలును.'

కలరు. తోడి బాలికలతో సమానముగా నాడుటకు రమ్మని కన్నె నొకమారు పిలుచును. ఒకమారు తోటలోనికి దూర దేశముల నుండి వచ్చి వ్రాలిన పిట్టలను తోలివేయ నుద్బోధించును. ఒకమారు ఉపాయముగా తోటలోని తేనె నొంచుకొని కంచె తీసి త్రోవలు చేయు వంచకులను తెలిసికొని కాపుదనము మానకుండుమని వేడును. ఒకమారు నౌకలో బోవుచు ఇళ్ళిళ్ళకు పంచిపెట్టు గీతాప్రసాదము గ్రామ కుంకుమము వలె తీసికొమ్మని యర్థించెను. 'మాతృ పూజా విధానమే మరవద్దు.' శుభ ముహూర్తము వచ్చినది. ప్రేమ సామ్రాజ్యపాలనకు రాజరాజేశ్వరి స్తన్యమోహాంధయై సాక్షాత్కరించును. ఆంధ్రబాలా!

'పసుపు కుంకుమ పూవులు కొసరిచల్లి
చిన్ని కర్పూర హారతి చేతబట్టి
ప్రమదలక్ష్మికి నారతి పాటబాడి
సుప్రసన్నుల జేయుము స్తోత్రనియతి!

అని యుపదేశించి 'ఋషులు, తథాస్తు, ఆంధ్ర బాలకు పూర్ణ కళ్యాణ మందురు, నిదుర లేచిరమ్ము!' అని కోకిల పాట ముగిసినది.

ఇది 'తెనుగుతోట' లోని విషయము, పొడి మాటలతో చెప్పినచో!

# 3

గ్రంథమంతయు తేటగీతములో మాలికగా నడచింది. నవ్యాంధ్ర కవిత్వమునకు ముందు దారి తీసినది తేట గీతము! దాని మాధుర్యము నామముననే ఉన్నది కాని నవకవులకు ముందుగా అభిమానపాత్రమైనది. అందులో ప్రౌఢతరముగా పలికినది 'తెనుగుతోట!'

పూర్వ కవులు పలువురు కేవల ద్విపదలో కావ్యములు రచించినారు. దానిని ద్విపద యని శ్లేషించి ఇతర పద్యములను చతుష్పాత్తులని సూచించినారు. కాని సుబ్బారావు తేటగీతి నేమన్నాడు!

'తెగిన తంత్రుల మరల బంధింపబోకు
నిలిచియున్న యేక శ్రుతిని సవరించి
వేడుకయు వేదనయు రసవిధులు మురియ
పాడవమ్మ, గీతాసఖీ, భావపదము !'

పూర్వకవులు తరచుగా అనేక ఛందస్సులలో రచన చేసినారు. తాను ఏక శ్రుతితో పాడునట! శ్రుతి ఎల్లప్పుడు నొకటియే! కాని తెలుగు పాటలు ఏకాంత స్థలములో ఏకతార మ్రోగించుచు, శ్రుతిగలిపి నిశీథ సమయములలో పాడుచుండ విని, దాని మాధుర్య మనుభవించిన వారికి గాని 'ఏకశ్రుతిని సవరించుట' బోధపడదు !

మరియు నది గీతము! మరియొక ఛందస్సులో చెప్పిన పద్య మును గీతమని గానమని పల్కుట ఉచితము కాదు. అందుచే కవి కావ్యారంభముననే 'గీతా సఖ్యము' చేసినాడు. విహంగసమితి 'సరభ సోత్కట గీతాప్రసాదరసము నాలకించునట! 'కిన్నెరలు పాడుచున్నవి గీతములను' అనును. నౌకలో పంచిపెట్టునది 'సరసకౌతుక గీతాప్రసాద మొకడె' యట !

'మదవదళికుల సంతాన ముదయగీతి
బాడుచున్నది కర్ణోత్సవముగ నిపుడు !'

మరియు,

'వీణలందు ననంతకళ్యాణగీతి
భువన మూర్ఛాకరమ్ముగ మ్రోయుదగిన'
దివ్య సమయము వచ్చిన'దట !

తెనుగుతోట ఎన్ని విధముల జూచినను నవ్యాంధ్ర జీవనమునకు వైతాళిక కళ్యాణగీతి! అట్టి గీతమాలికయే ఆంధ్రవైతాళికులకు అభిమాన పాత్రమగు ఛందస్సుగా బహుకాలము నిలుచుట వింతకాదు !

## 4

శ్రీ సుబ్బారావు బాల్యము, కౌమారము బాపట్లలో గడిపినాడు. బాపట్ల, చీరాల, వేటపాలెము ప్రాంతములవారికే సొనల అందము

తెలియును. అవి ఆకస్మికముగా నొకచోట ఇసుక పడకల జీల్చుకొని పుట్టి లోతులేని స్వచ్ఛ జలముతో ప్రవహించును. వాని ప్రక్కల ఇసుక కట్టలు మాత్రము ఎత్తుగా ఉండును. సొన రెండు ప్రక్కలను పచ్చగా పచ్చిక పొదలు తోటలు పెరుగును.

'వీనులకు ముద్దుగొలుపు నవీన మధుర
సుస్వరమ్ములు పాడెడు సొనలు నేడు
మొలక లెత్తెడు ప్రక్కల మోహనముగ
నవతృణాంకుర లోకరత్నాలశయ్య,'

మరియు,

'శుచియయిన దోయిళులబట్టి సొనల నీరు
పదలబోవుచున్నార లావలి మహర్షులు.'

మహర్షులు వదలునదికూడ సొనల నీరేనట!

మరియు నా ప్రాంతములలో మల్లె పందిళ్ళ ప్రోది ఎక్కువ. చీరాల నుండి బస్తాలతో విజయవాడకును, ఆ పైకిని రైళ్ళలో జనము పట్టకుండ మల్లెపూల బస్తాలు రవాణా యగును. అ వ్యాపారము కవికి ఎందుకు ఉపయోగించినది? మూడు పంక్తులు చెప్పినాడు!

'దివ్యమగు మల్లెపూల పందిళ్ళ పజ్జ
చీర యొడిబట్టి మొగ్గలు చిదుపు చిన్ని
కన్నియల ముద్దు నడలపై గాంక్షపడెదొ?'

అని లేఖిని నడిగినాడు. మరియు ఏతములతో దొరువులనుండి నీరెత్తు చుందురా వైపుల!

'ఏతములనుండి దొరువు నీ రెత్తువార
లన్యరతులైరి ప్రాల్మాలి యక్కటకట!'

బాపట్ల చుట్టుప్రక్కలనున్న తోటలే సుబ్బారావుకు గ్రంథనామము స్ఫురింపజేసినది కాని యది యాయన కవితాత్మచే తెనుగు తోటగా విస్తరించినది. తెనుగుదేశ మంతటను సర్వసామాన్యమగు మధుర దృశ్యములు చిత్రించి వానికి విశేషార్థము స్ఫురింపజేసినాడు కవి! చూడుడు!

కృష్ణవేణీ సరిత్కూల రేఖలందు
ప్రొద్దు తిరుగుడు పువు లభిముఖము లయ్యె !'

మరి యిది వినుడు, స్వాతంత్ర్య పిపాస తెలిసికొనుడు:

'తల్లి పాల్ద్రావకుండ బందాల బడిన
వత్సములు లాగు లాడెడు పాలకొరకు !'

ఇంకను ఈ దృశ్యము లెవరి కనుభవములో లేవు:

'బువ్వదుత్త నెత్తినిబెట్టి నవ్వు కనుల
రవిక దొడుగని గొల్ల కుఱ్ఱది యొకర్తు
పోవుచున్నది పొందైన ముద్దునడల :
కలికి యొడిసెల వలెవాటు గాగ దాల్చి
పిరుదు లసియాడ జీరరాపిళ్ళతోడ
కాపుకూతురు పొలములు కాయ నేగు!
చిన్ని బంగారు పూసల చెండ్లవంటి
జొన్న కంకులు పండిన సొగసుచేల
ఎక్కడెక్కడ నుండియొ చక్కవచ్చి
వ్రాలుచున్నవి పిట్టలు రక్తి బెరయ!'

కవి గుంటూరు ప్రాంతములలో చూచినవి ఎట్లు చెప్పినాడు: విదేశీయులు భరతభూమిలో వ్రాలుచున్నారని వాచ్యముగా అనడు:

ఇక మన విద్యార్థుల చదు వెట్టిది?

'చదివిన పురాణపంక్తులె చదివికొనుచు
స్నాతకుండైన విద్యార్థి చాయ జూడు:

* * *

ఎరుగ డాబిడ్డ డాయుమ హృదయపరణి.'

కవికి కవిత్వముకంటె అభిమానపాత్రమైన దేముండును? ఆ గీత మిట్లు ప్రారంభించినాడు.

'దధిమథన మోహన ధ్వనుల్ మధురముగను
శ్రవణముల కుత్సవము చేయు సమయమయ్యె.'

అది అమృతమథనము! అందుచే జ్ఞాపకము చేయుచున్నాడు!

'ముసుగునంబడి యున్నది మోహవీణ
చిరనిరాదరణాహతి జెడియ నేమొ!
తలచి దరిడాసి స్పృశియించి లలిత లలిత
సుశ్రుతి స్వీయ సామ్రాజ్యశోభ నింత
క్రొత్తలకు రుచిచూపించి హత్తవమ్మ!

* * *

పాడితివి కొన్ని నాళులు భవ్యముగను
లోకమోహనమైన సుశ్లోకసరణి
రాగరవ బంధురంబైన రమ్యగీతి.

* * *

మరచిపోయితె నీవీణ సిరుల మురువు?
మేళవింవంగ దరియయ్యె మెలపులోలయ!'

ప్రేమ సామ్రాజ్యమునకు మనలను నావపై లయానుకూలముగా తీసికొనిపోయి పవిత్ర తేజోబింబమును దర్శింవజేయు లలిత మధురమైన తెనుగు గీతి, సుబ్బారాయని 'తెనుగుతోట'!

(భారతి-1952)

# సాహితీ సమితి కవులు

సాహితీసమితి కవులు తెనుగు దేశములో నవ్య కవిత్వము వ్యాప్తి లోకి తెచ్చిన వారని ఇప్పటికి కవిలోకములో వారియందు కొంత అభి మాన మున్నది అయితే,- అదొక విధమైన రోహిలాల క్రాపింగులు పెట్టుకొని కవిత్వపు చూపులు చూస్తూ రెండు కాళ్ళతో తిరిగే విచిత్రమైన మృగాలనే భావం కూడా కొందరికి లేకపోలేదు. సాహితీ సమితియందు విశేషాభిమాన మున్నవారికిగాని, అసహ్యము ఉన్న వారికి గాని సమితి సంగతి ఎక్కువ తెలియదు సమితివీ, సమితి సభ్యులనూ గూర్చి కల్పిత కథలు- మంచినీ, చెడ్డవీ కూడా- ఎన్నో వినడం తటస్థించినది. చివరకు ఆ కల్పనాకథలుకొన్ని విశేషప్రచారమున్న పత్రికలలోకి ఎక్కడముకూడా తటస్థించినది. అందువల్ల సాహితీ సమితి స్వరూపము ప్రస్తావించవలసిన అవసరము కలిగినది.

అంతేకాక ఈ సమితికవులు అనేక మార్గములు తొక్కినారు. ఇప్ప టికీ వారి నవ్యత సజీవమై ఉన్నది. సమితికవుల స్మరణవల్ల తెలుగు కవులలో నవ్యకవితా మార్గాలు సమగ్రముగా స్మరించినట్లు కూడా అవు తుంది. ఇది ప్రగల్భోక్తి కాదని సహృదయులు గ్రహించగలరని మా విశ్వాసము.

## 2

సాహితీసమితి స్వరూపం తెలుసుకోవలనంటే ముందు కొంచెము శ్రమచేసి మన ఊహను 1918, 1919 సంవత్సరములలోకి ప్రసరింప చేయ వలసి ఉంటుంది. అప్పటికి రేడియోలు లేవు, టాకీలు లేవు. భారత రాజకీయ రంగంలో సత్యాగ్రహం లేదు, మహాత్మునికి కాంగ్రెసులో సర్వాధిపత్యం లేదు. తెలుగు దేశంలో వాఙ్మయ పత్రిక అంటే ఏమిటో తెలియదు. 'ప్రతిభ' లేదు. 'భారతి' పుట్టలేదు. 'సాహితి' ఇంకా తెలుగు తల్లి గర్భంలోనే ఉన్నది. ఆ రోజులు ఊహించుకోవలె! కవులు తమ

ఖండ కావ్యాలు ఆంధ్రపత్రికలో గాని, కృష్ణాపత్రికలో గాని ప్రచురించ వలసి వచ్చేది. 'గ్రంథాలయ సర్వస్వము' అనే మాసపత్రికలో కూడ కొన్ని ఖండ కావ్యాలు ప్రచురించేవారు. అన్నిటికంటే ముఖ్యశరణ్యము ఆంధ్ర పత్రికవారి సంవత్సరాది సంచిక.

ఆ రోజులు మన మూహించుకోవలె! 'చిన్న కథలు' ఒక్క డజను కంటే వచ్చి ఉండవు. అవి కూడా చిన్నకథలే కాని 'చిన్న కథ' స్వరూపం ఎరిగి వ్రాసినవి కావు. 'ఏకాంక నాటిక' లే- సంస్కృత మర్యాదలో వచ్చినవికాక_ ఎరగము. శ్రీ రాయప్రోలు సుబ్బారావు తృణకంకణాది ఐదు కావ్యాలూ, శ్రీ అబ్బూరి రామకృష్ణరావు 'మల్లికాంబ'- ఇవి తప్ప పుస్తక రూపకంగా వచ్చిన ఆధునిక కవుం కావ్యాలు లేవు శ్రీయుతులు గురజాడ బసవరాజు, అప్పారావులు మాత్రము గేయాలు వ్రాసేవారు. అప్పటి ఆధునిక కవి ప్రపంచము అంతే! చదువుకున్న వారిలో సామాన్యముగా కవిత్వముపరమావధి అవధానాలు ఆశుకవిత్వమూ. అభినవకవు లని ప్రతీతి కల కొందరు సంఘ సంస్కరణోపన్యాసాలు ఛందోబద్ధము చేస్తూ ఉండేవారు తెలుగు దేశములో శిష్టుల వ్యావహారిక భాష 'గ్రామ్యభాష' అనే పేరు సంపాదించుకొని పండిత పామరులచేత పనికి మాలిన దనిపించుకున్నది. ఆ రోజులవి! శ్రీ గిడుగు పిడుగు ఉపన్యాసాలు అరణ్యరోదనమైన రోజు లవి! అటువంటి రోజులలో ఈ 'సాహితీ సమితి' పుట్టింది.

ఈసాహితీసమితి ఒక రిజష్టరు సంఘమూ కాదు, ఏవోకొన్ని నిబంధన లున్న సామాన్యసంఘమూ కాదు. పోనీ, అందులో సభ్యులు కావడానికి నియమాలైనా లేవు. సభ్యత్వానికి చాలా 'అర్హుల' మనుకునేవారికి చాలా మందికి అందులో సభ్యులయ్యే అవకాశమే ఉండేది కాదు. చాలా 'అనర్హులకు' చిత్రముగా అందులో సభ్యత్వము వచ్చేది. సభ్యులకుకూడా వారు అందులో ఎప్పుడు సభ్యులైనారో తెలిసేది కాదు. సభ్యుల పెద్దకు పాతికేళ్ళూ, చిన్న వానికి పదిహేడేళ్ళూ.

## 3

ఈ సమితి పుట్టడానికి ముఖ్యమైన కారణము ఆ రోజులలో తెనాలిలో జరిగిన ఒక విచిత్ర సంఘటన. ఆ చిన్నపట్టణములో ఒక్కసారిగా

కవిత్వమూ, లలిత కళలూ అంటే విశేషము అభిమానమున్న అనేక మంది కూడడము తటస్థపడ్డది. వారందరూ మిత్రులైనారు. అందరూ యువకులు, కార్యదీక్ష కలవారు ఓర్పులేని తనమూ, ఉడుకు బోతు తనమూ ఎరగనివారు.

అందులో ముఖ్యుడూ, అన్ని విధాలా జ్యేష్ఠుడూ శ్రీ శివశంకర శాస్త్రి. శ్రీయుతులు వీర రాఘవస్వామి, వెంకట సుబ్బయ్య, శివకామే శ్వరరావు, పూర్ణశర్మ, హనుమంతరావు, బాబురావు- వీరు ముఖ్యులు. వీరెవరూ పెద్ద పరీక్షలు ప్యాసయినవారు కారు. అయితే ఇంగ్లీషు వాఙ్మ యము, అందుమీద ఉన్న ఆదరమువల్ల చదివినవారు. పరీక్షల కోసము చదివిన చదువు కానందున వారికి వాఙ్మయ స్వరూపము అవ గాహన ఐనది. శుష్కమైన మాటలతో వారు కావ్య విమర్శ చేసేవారు కారు. ఇంగ్లీషులోకి చేసిన తర్జుమాల ద్వారా వారు ఫ్రెంచి, జర్మను, రష్యను,స్పానిషు, స్కాండినేవియను, జాపనీసు, పర్ష్యను ఇత్యాదిభాషల లోని ప్రసిద్ధ కావ్యాలు కూడా పఠించారు. ఈ విధంగా ప్రపంచవాఙ్మ యమూ, దానితోపాటు లలిత కళల సంగతీ తెలుసుకోవలె నని తీవ్ర ముగా ప్రయత్నము చేసినారు

కాని అట్లా, ఇతర దేశభాషలతో ఊరుకోక మన దేశములో బంగాలీ, హిందీ, మరాఠీ ఇత్యాది భాషలు కూడా అభ్యసించి కావ్యాలు చదవసాగినారు. వారిలో ఆధునిక కవుల తీరులు తెలుసుకుంటూ ఉండే వారు.

మొదటి నుంచీ వీరికి చింతా దీక్షితులు మిత్రుడే. ఆ మిత్రులలో ఏ ఒకరికి కవి మిత్రుడున్నా శీఘ్రముగా అందరికీ మిత్రుడయ్యేవారు. వారిలో కొందరు గుంటూరులో కాపుర ముండడము తటస్థించినది. అప్పుడు ఈ వ్యాసకర్త, ఇతని ద్వారా శ్రీమాన్ కొమాండూరి కృష్ణమా చార్యులు, శ్రీ చామర్తి రాజశేఖరరావు ఆ మిత్రకోటిలో కలిసిపోయి నారు. ఆ మిత్రులు కూడినప్పుడు నిరంతర సాహిత్య గోష్ఠితోను, మనస్సు నొప్పించని చమత్కార భాషణములతోనూ రోజులు నిముషా లుగా గడిచిపోయేవి.

అందులో ఏ ఒకరు కొత్త కావ్యము వ్రాసినా అందరూ వినేవారు. విని తమతమకు తోచిన మార్పులు సూచించేవారు. శ్రీ శాస్త్రి సూచనలు ముక్కుకు సూటిగా ఉండేవి. శ్రీ శివకామేశ్వరరావువి పాండిత్య ప్రకర్ష కముగా ఉండేవి.— ఈ విధంగా ఆ సూచనలలో వారివారి అభి మానాలు ద్యోతమయ్యేవి. ఆ సూచించిన మార్పులమీద ఒకరి నొకరు హాస్యమాడుకునేవారు. అందరి మనస్సూ ఆ కావ్యముమీద ప్రసరించి పని చేసినందువల్ల ఆ కావ్యము కొంత మార్పు చెందేది ఆ సూచనలు చేసిన వారికి గర్వముగాని, మార్పులు సూచించినందుకు కవికి కోపముగాని ఉండేవి కావు. అంతా మహానందంగా వెళ్ళిపోయేది.

అటువంటి రోజులలో ఈ మిత్రులకు ప్రత్యేకముగా—సారస్వ తానికీ, చిత్రకళకూ, శిల్పానికీ- ఒక పత్రిక పెట్టవలెననే సంకల్పము కలిగింది. ఇందులో ధనవంతుడు ఒక్క హనుమంతరావు గనుక ఆయన పెట్టుబడి పెట్టేట్లూ, అందరిలో సమర్థుడైన శ్రీ శివశంకర శాస్త్రి సంపాద కుడుగా ఉండేట్లూ నిశ్చయమయింది. అది ఒక సంఘము ప్రచురిస్తు న్నట్లు వేయడము ఆ కాలములో ఆచారమైపోయినందున ఈ మిత్ర బృందానికి ఒక పేరు పెట్టుకోవలసిన అవసరము కలిగింది. చాలా రోజులో, నెలలో మథనపడ్డ తర్వాత 'సాహితీసమితి' అనే పేరు నిర్ధారణ ఐనది. కాని ఆ పేరు 'సాహితి' పత్రిక వచ్చేదాకా గట్టివడలేదు.

ఎప్పటికప్పుడు పత్రిక ప్రచురిద్దా మనుకుంటున్నా, ధనము రానందువల్ల పత్రిక చాలా కాలము రాకుండానే ఉండిపోయింది. ఇంతలో సభ్యులలో ఒక పెద్ద మార్పు కలిగింది.

## 4

అప్పటికి ఆ మిత్రబృందము వారంతా గ్రాంథిక భాషావాదులే. వారికి వ్యావహారికభాష పనికిరాదు. దానికితోడు ఆ రోజులలో వ్యావహారిక భాషలో సరియైన సాహిత్యరచనలులేవు. అట్టి సమయంలో శ్రీ శివశంకర శాస్త్రి వ్యావహారిక భాషలో రచన చేయడము రసవంతముగా ఉంటుం దనే నిశ్చయానికి ముందువచ్చినాడు. తర్వాత కొన్ని నెలలపాటు

ఆయనతో 'గ్రామ్యవాదము' పనికిరాదని వాదించి ఈ వ్యాసకర్త కూడా అంగీకరించినాడు. మిగిలినవారు ఒప్పుకోలేదు. శ్రీ వీరరాఘవస్వామి ఒక్కడు మాత్రము 'కొంత మార్పు' పనికివస్తుందని అంగీకరించినాడు. శ్రీ శివకామేశ్వరరావు అసలే పనికిరాదు, అపమార్గాన పోతున్నారని పట్టుపట్టినాడు. శ్రీ వెంకటసుబ్బయ్య ఇష్టము లేకపోవడము కనపరచే మౌనము అవలంబించినాడు శ్రీ చింతా దీక్షితులు ఎప్పుడు మారినదీ తెలియదు, కాని 'సాహితి' మొదటి సంచికలోనే ఆయన వ్యావహారిక భాషా రచనలు పడ్డవి.

సాహితి 1920 జనవరిలో వచ్చింది. ఆ రోజులలోనే శ్రీ ముని మాణిక్యం నరసింహారావు 'సమితి' బృందములో చేరసాగినాడు. ఆయనకు పూర్వ భాషాజ్ఞానము తక్కువ అనే భయముతో రచన చేసేవాడు. కాని మొదటినుంచీ ఆయనకు సుఖమైన రచన అలవడ్డది. ఆయన 'ఉఫ్' 'సాహితి' మొదటి సంచికలోనే ఉన్నది. ఆ ప్రాంతాలలోనే శ్రీ పెద్దిభట్ల రామచంద్రరావు కూడా ఈ బృందములో కలిసినాడు.

'సాహితీ' పత్రిక ప్రచురణతో 'సాహితీ సమితి'కి దేశములో కొంత ఖ్యాతి వచ్చింది. ఈ సమితి సభ్యులు తమ రచనలు ఎందులో ప్రచురించినా తమ పేరు ప్రక్కన 'సాహితీసమితి' అనికూడా వేసుకోవడము అలవాటు చేసినారు. దానితో దేశములో ఇప్పుడు మనము ఊహించుకోలేనన్ని సారస్వత సమాజాలు బయలుదేరినవి. సాహితీ సమితిలో సభ్యత్వము కోసము దరఖాస్తులు రావడం మొదలు పెట్టినవి.

'సాహితి' పుట్టిన తర్వాతనే శ్రీయుతులు వేదుల సత్యనారాయణ శాస్త్రి, దేవులపల్లి కృష్ణశాస్త్రి, మొక్కపాటి నరసింహశాస్త్రి సభ్యులైనారు. శ్రీ శ్రీనివాస శిరోమణి కూడా ఆ ప్రాంతాలలోనే సభ్యుడైనాడు. శ్రీ కె. ఎచ్. వి. యస్. నారాయణ శ్రీ దీక్షితులు ద్వారా సభ్యుడైనాడు. శ్రీ స్వామి ద్వారా శ్రీ కొత్తపల్లి సుబ్బణ్ణాచార్యులు సమితిలో చేరినాడు. శ్రీ వింజమూరి పార్థసారథి కొన్ని చక్కని కథలు వ్రాసి సభ్యత్వము సంపాదించినాడు.

శ్రీయుతులు విశ్వనాథ సత్యనారాయణ, కొడాలి అంజనేయులు, నండూరి సుబ్బారావు, నాయని సుబ్బారావు సమితి సభ్యులైనారు. ఇప్పుడు వారికున్న ప్రసిద్ధి వారి కప్పుడులేదు. వారు నలుగురూ సమితిలో ఒక ప్రత్యేక బృందముగా ఉండేవారు.

సాహితీ సమితి లోకములో స్థిరప్రతిష్ఠ సంపాదించిన తర్వాత శ్రీ గిడుగు రామమూర్తి పంతులును అందులో గౌరవసభ్యునిగా చేర్చినాము. ఆ గౌరవము అసమాన మేధాశాలియైన వారి కొక్కరికే సాహితీ సమితివారు చేసినారు.

# 5

సాహితిలో మొదటినుంచీ వ్యావహారిక భాషలో రచనలు ప్రచురణ మైనవి. శ్రీ శివకామేశ్వరరావుకు అది ఇష్టములేకపోయింది. కొంతకాలము అయన కావ్యాలు 'సాహితి'లో ప్రచురణకు ఇచ్చినాడు కాని మొత్తము మీద అయనకు ఈ అపండిత' సమూహములో కలిసి రచనలు చేయడము ఇష్టము లేకపోయింది. అప్పటికి సమితిలో ప్రవేశానికి దరఖాస్తు లేనట్లే రాజీనామా ఇయ్యడము కూడా లేదు అయన నెమ్మదిగా 'సాహితి'కి తన రచనలు ఇయ్యడము చాలించి 'మీమాంస' అనే పత్రిక కొన్నాళ్ళు నడిపినాడు. కొద్దిరోజులలోనే ఆయన కవిత్వము చెప్పడము కూడా చాలించినాడు. పండితకవి కావలసినవాడు కేవల పండితుడైనాడు. కాని కవిత్వము చెప్పిన రోజులలో ఆయన బహుమనోహరమైన కవిత్వము చెప్పేవాడు. 'తమోనిరసనము' అనే కావ్యములో మొదటి పంక్తి—

"చీకటిమ్రాని నీడలకుఁ జేరెద వేల మనోహరంబుగన్"

జ్ఞాపకము వచ్చినప్పుడు ఎంతో విచారము కలుగుతూ ఉంటుంది. ఈ కవి 'సాహితీ సమితి'లో నుంచీ, దానితోపాటు నవకవి ప్రపంచము తెర మీదినుంచీ 'ఫేడ్ అవుట్' అయినాడు.

'సాహితీసమితి'కి కొంత నియమాలు పెట్టవలెనని కొంతకాలము ప్రయత్నము జరిగింది. ఆ రోజులలో శ్రీయుతులు విశ్వనాథ, నండూరి,

నాయని, కొడాలి ఆంజనేయులు సభ్యులైనారు. కొద్దికాలమే సభ్యులుగా ఉండి, వారు నిష్కారణముగా రాజీనామాలు ఒక్కసారిగా పంపి సమితి రంగములో నుంచి నిష్క్రమించినారు.

సమితి సభ్యులలో మొదటి నుంచీ ప్రముఖుడుగా ఉన్నవాడు శ్రీ కొడవటిగంటి వెంకటసుబ్బయ్య. అతను పూర్వాంధ్రభాష క్షుణ్ణముగా గ్రహించినాడు. ఇంగ్లీషువాఙ్మయము — అందులో ప్రధానముగా నవలలు, చిన్నకథలు, నాటకాలు—బాగా చదివినవాడు. అప్పటి సమితి సభ్యులలో చిన్నకథలు, నాటకాలు, కావ్యాలు—అన్నీ చక్కగా వ్రాయగలవాడు అతను ఒక్కడేనని సభ్యుల విశ్వాసము. స్వయముగా రంగము మీద పాత్రధారణ చేసి నటించినవాడు. తెనాలిలో 'శ్రీ రామ విలాస సభ' స్థాపించడానికి ముఖ్యకారకులలో అత నొకడు. కొన్ని కథలు, 'మాయపెళ్ళి' అనే నాటిక ప్రచురించినాడు. అతని కావ్యాలలో 'కల్యాణి', 'భిక్షువు' తెలుగు లోకము ఎన్నటికీ మరువలేదు. తన చిన్న కావ్యాలు అన్నీ 'సంధ్యారాగము' అనే పేరుతో ప్రచురించి ఎవరికీ చెప్పకుండా దేశాంతరగతుడైనాడు. ఎవరి మీదనో కోపము వచ్చి పోవడము కాదు; సంసారముమీద విరక్తి కలిగి కాదు. అతను బహు సాహసికుడు. బైరాగి వలె దేశాటనము చేయవలె నని ఊహ కలిగి అకస్మాత్తుగా వెళ్ళిపోయి నాడు ఒక విచిత్రమైనవ్యక్తి! అందుకనే శ్రీశాస్త్రి—

"ఊహకు మీరి పోయిన వ
హో భవదీయ విచిత్ర వర్తనల్"

అని విచారపడినాడు. బైరాగి కావ్యాలతో ఎప్పుడో అకస్మాత్తుగా వచ్చి తెలుగు వాణిని కులికించ గల సమర్థుడు. అయితే అతను కనవడి ఇరవై యేళ్ళు దాటిపోయినవి. తిరిగి వస్తాడని ఆశ మృగతృష్ణికా ప్రాయ మవుతున్నది.

శ్రీ చామర్తి రాజశేఖరరావు సాహితి పుట్టిన రెండేళ్ళకే అకాల మృత్యువు వాత పడ్డాడు. అతను కవిత్వముతో పుట్టి కవిత్వముతో పెరి గినవాడు. గుంటూరు విద్యార్థులలో కవి అంటే అతనే. అతనికి విశేషమైన దేశాభిమాన ముండేది. కాని తన అభిమానపు ఉపన్యాసాలు ఛందో

బద్ధము చేయడానికి పూనుకోలేదు. అతనికి కార్లైల్ వ్రాసిన 'హీరోస్ అండ్ హీరోవర్షిప్' అనే గ్రంథం అభిమాన పాత్రమైనది. కాని అతను కార్లైలును అనుకరించ మొదలు పెట్టలేదు. ఆ రోజులలో తెలుగు దేశములో బెంగాలీ అనుకరణముతోపాటు కృష్ణ చైతన్య మతాభిమానము కవులలో వ్యాపించినది. అయితే అతను రాధగా మారిపోయి కృష్ణ విరహగీతాలు వ్రాయలేదు. 'బృందావనము' అనే కావ్యము ప్రారంభించినాడు. అందులో కృష్ణుని కోసము గోపికా గోపకులు అన్వేషణము చేస్తారు. కృష్ణుడు వారి నందరినీ తన మధుర వేణుగానముతో ఆనందపరచిన గానరసికుడు, కృష్ణుడు కనపడక పోగానే 'గోవులు చిందర వందరయ్యె'; 'తల్లిగోవు పాలీయదు'; 'వ్రేపల్లెను పెద్దగొల్ల డొకడైనను కన్నుల కానరాడు'—అందరూ విలపిస్తారు.

"ఓ యమునా, నిరంతరము
  నొక్కగతిన్ బ్రవహించు దానవై
ఆయెడ గ్రోలియుంటితిని
  ఆ మృదుగాన రసామృతమ్ము—"

కృష్ణాన్వేషణము నాయకాన్వేషణము ఐనది. భాగవతము, కృష్ణకర్ణామృతము అద్భుతమైన నవ్యరూపము పొందినవి. విశేషమైన ప్రజ్ఞ కలవాడు. అకస్మాత్తుగా- అతనిని ఎత్తుకొని పోవుటకే బెజవాడకు వచ్చిన కలరా తెలుగు వాక్కుకు తియ్యని రాగము లేకుండా చేసివేసింది. అతని కావ్యాలు చాలా భాగము అతని మిత్రు లనే వారి వద్ద ఉండిపోయినవి. 'సాహితి' లో అచ్చుపడ్డ కొద్ది కావ్యాలే మనకు మిగిలి పోయినవి.

శ్రీ పెద్దిభట్ల పూర్ణశర్మ మనోహరమైన కవిత్వము చెప్పేవాడు. కథాకథనములో నేర్పు ఎక్కువ. అతని ఖండకావ్యములోనుంచి ప్రత్యేకించి ఒక పద్యము చదివితే సొగసు ఉండదు. కావ్యమంతా చదివి నప్పుడే దాని హృద్యత బోధపడుతుంది. 'తరంగమాలిక' అనే సంపుటి అముద్రితము-'సాహితి' రాకముందే తయారైంది. అందులో తన పద్యాలను—

"పొండు, దేశాటనము చేయ పొండు, మీరు!
వంపుచున్నాను మిమ్ము హృద్భారమునను!"

అని సంబోధించి పంపదలచినాడు. కాని అతనే దారిద్ర్యమువల్ల తెనాలి విడిచి హృద్భారముతో ఉద్యోగానికి జయపురము వెళ్ళినాడు. మళ్ళీ అతని కవిత్వము వినవడడములేదు. 'తరంగమాలిక' ఏ మైనదో విచారించవలసి ఉన్నది. అతను ఈ మధ్య పరమపదించినట్లు తెలియ వచ్చినది.

శ్రీ కొప్పర్తి నారాయణమూర్తి మరి ఒకరు సమితి సభ్యులలో చనిపోయినవారు. ఆయన కథలు, నాటికలు, పద్యాలు అనేకము వ్రాసినవాడు. ఎక్కువ స్నేహపాత్రుడు. ఆయనకు అతిథిగా వెళ్ళినప్పుడు ఆయన చూపుతూఉండిన ఆదరాతిశయము సమితి సభ్యులు మరిచి పోవడము సాధ్యముకాదు· గతించిన మిత్రులకు కన్నీటితో తర్పణము కంటె మనము చేయగలిగినది లేదు.

సాహితీ సమితి గౌరవ సభ్యులైన శ్రీ గిడుగు రామమూర్తి పంతులు కీర్తి జగద్విదితము. వారు దివంగతులై ఒక్క సాహితీసమితికే కాక తెలుగులోకానికే తీరనిలోటు కలిగించినారు.

(భారతి : చిత్రభాను కార్తీకము)

# 6

సమితి సభ్యులలో సమర్థులు కొందరు గతించినారు. ఒకరు దేశాంతరము పోయినారు. కొందరు సభ్యత వదులుకున్నారు. అయితే, ఒకప్పుడు భరత ఖండము మహోన్నత దశలో ఉన్నదని మనవారు కొందరు చెప్పుకునేరీతిగా లేదు, సాహితీసమితిస్థితి! అది ఇప్పటికీ సజీవమై ప్రవర్ధమానమై ఉన్నది. సమితి సభ్యులలో ప్రాగల్భ్యము పొందినవారు అనేకులున్నారు.

అందులో ప్రథమగణ్యుడు శ్రీ కొమాండూరి కృష్ణమాచార్యులు. అయన పూర్వులకూ, ఆధునికులకూ ఒకలంకె; వంతెనవంటివాడు. ఆయన కవిత్వము ఆధునికము కాదని వాదించేవా రున్నారు; కాని అది కవిత్వము కా దనగల సహృదయులు లేరు. ఆయనకు సంస్కృతాంధ్రములలో

విశేష పాండిత్య మున్నది. బి. ఏ. పరీక్షకు వెళ్ళినాడు. అఖండమైన ధారణ కలవాడు. ముప్పైఏళ్ళు దాటినతర్వాత యజుర్వేదము సమగ్రముగా చెప్పుకొని వల్లించి పదముకూడా కొంత చెప్పుకున్నవా డన్నప్పుడు ఆయన జ్ఞాపకశక్తి ఎంత గొప్పదో పాఠకు లూహించుకోవచ్చును. అచ్చమైన పూర్వాచారపరాయణుడు. నిష్కలంకమైన ప్రవర్తన కలవాడు. అయితే అటువంటివాడు దేహపరిశ్రమ చేసి 'కుస్తీ' పట్టడముకూడా చిన్నతనములోనే అభ్యసించినాడు. మంచి ఈతగాడు!

ఆయన ఈవ్యాసకర్తకు స్కూలు ఫైనలు నుంచీ సహాధ్యాయి ఐనందున చిరపరిచితు డైనప్పటికీ, సాహిత్యపరిచయము ఆతర్వాత ఐదారుసంవత్సరాల వరకూ కాలేదు. ఈ వ్యాసకర్తకూ, సమితిసభాపతికీ ఆయన ఒక స్నేహితునితో కలిసి 'ఈత'నుగూర్చి ఒక గ్రంథము వ్రాస్తున్నట్లు తెలిసి కలుసుకోవడము తటస్థించినది. ఆయనవద్ద ఉన్న గ్రంథాలలో 'ఈత'మీద మిస్కెల్లరుమను, వుల్ఫు వ్రాసిన గ్రంథాలు చదివిన జ్ఞాపకమున్నది. ఆయన అప్పటికి 'సాహితి' చందాదారు. 'గీత గోవిందము' తెలుగు కవులు మెచ్చుకోవడము అప్పుడు ఫాషనులోకి వచ్చినది. మళ్ళీ ఒకరోజు ఆయనను కలుసుకోగా అష్టపది ఒకటి ('వదసి యది కించిదపి' ఇత్యాది) తెలుగులో గీతమాలికగా తర్జుమాచేసి చూపినాడు. అది ఆ తర్వాత వచ్చిన 'సాహితి'లోనే ప్రచురణమైనది. అదే ఆయన చెప్పిన మొదటికావ్య మంటే నమ్మలేకపోయినాము. ఆవెంట వరసగా కొద్దికాలములోనే ఎన్నో కావ్యాలు చెప్పినాడు. షుమారు ఒక్క సంవత్సర కాలములో 'కుసుమాంజలి' అనే కావ్య సంపుటము సాహితీసమితి పేర ప్రచురించినాడు.

ఆయనలో సుప్తమైఉన్న కవిత్వము సమితి మిత్రుల సాహచర్యమువల్ల ఉద్బుద్ధమైనది అప్పటికే ఆయన పరిణతబుద్ధి కాబట్టి వాల్మీకికివలె మొదటి పద్యమే హృదయంగమముగా వచ్చినది. 'విరహోత్కంఠిత', 'అభిసారిక' వంటి నాయికావస్థలు వర్ణించే కావ్యాలు చెప్పినాడు. ఆయన నాయకులు 'నీలమహీధ్రకందర వినిర్గతమైన మహాగజంబునుంభోలె'డు వారు; 'అజానుదీర్ఘ బాహార్గళద్వితయంబు' కలవారు;

'విశాల దృఢ వక్షఃపీఠభాగంబుతో' 'బలభిద్వారణ తుండదండనిభమౌ బాహాద్వయస్ఫూర్తితో' ఒప్పేవారు; 'ఆయసపరిఘపీవరభుజు'లు. ఆయనకు అభిమానము గల నాయికలు కూడా వారికి అనుకూలురే। 'స్తనజఘనాతి భారలు'; 'కుచకుంభవిజృంభణత్వము' కలవారు; 'క్రోధం బారగ బాహువల్లికల నాగోవిందు బంధించెదన్, బాధింతున్ నఖదంతఘాతముల బుంభావక్రియాదక్షనై' అని ఊహించేవారు. శ్రీ కృష్ణమాచార్యులు దేహమువలెనే, పాండిత్యమువలెనే కవిత్వము కూడా కండకలది అందువల్లనే శ్రీ శాస్త్రి తరచుగా ఆయనది 'తాలింఖానా కవిత్వ' మని చమత్కరిస్తుంటాడు. ఆయన పద్యాలు సమాసాడంబరము కలిగిఉండి పూర్వకవుల ధోరణిలో ఉంటవి. ఆయన 'పాదుకా సహస్రము'లో నుంచి చేసిన పద్యానువాదాలు 'శ్రీకృష్ణకర్ణామృతము', 'భర్తృహరి' ఇత్యాదికావ్యాలకు పూర్వకవులు చేసిన అనువాదాలకంటె ప్రశస్తముగా ఉన్నవి

ఇటువంటి రచనలు చేసినందువల్ల ఆయనలో నవ్యత లేదని కొందరు సరసులుకూడా భ్రమపడుతూ ఉన్నారు అయితే అది వట్టి భ్రమ ఆయన 'సికందరు', 'పురుషోత్తమ దేవుడు' వంటి కావ్యానామములే ఆయన నవ్యతను కొంత సూచించగలవు. ఆయన కథాకథన విధానముకూడా విశేషనవ్యత కలది. 'సాహితీసమితి' కవులు వాఙ్మయ రంగము మీదికి కాలుపెట్టక పూర్వము ప్రసిద్ధులైన శ్రీయుతులు రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణారావు చెప్పిన కావ్యాలు కథాకథనములో మాత్రము అయోమయ మార్గములో ఉన్నవి. సమితి కవులు ఒక్కొక్క రొక్కొక్కవిధముగా కథాకథనములో సొగసు చూపినారు. అందులో శ్రీ కృష్ణమాచార్యులుది ఒక నవ్యమార్గము. అయితే పండితుడూ, ధారణకలవాడూ కనుక అప్రయత్నముగా పూర్వభాష ఆయన కవిత్వములోకి దొర్లుకొని వచ్చి పడుతూఉంటుంది.

ఆయన కవిత్వము గిరిగహ్వరములో సుప్తమైన సింహము వంటిది. సమితికవుల అనవరతసాహచర్యమువల్ల ఒక్కసారిగా మేలుకొని వివిధ విహారాలు చేసినది. ఈ వ్యాసకర్త గుంటూరు వదలడమూ,

సభాపతి గుంటూరులో స్థిరనివాసము లేకపోవడమూ, ఇతరమిత్రులు దూరస్థులు కావడమూవల్ల ఆయన కవిత్వము మళ్ళీ ఆ గుహలో చేరి నిద్రపోతున్నది. ఈమధ్య 'హర్ష చరిత్రము' అనువాదము చేసినాడుకాని స్వతంత్రరచనలు చేయడములేదు.

# 7

సాహితీసమితికవు లందరిలో శ్రీ కృష్ణమాచార్యులు బలిష్ఠుడైతే, శ్రీ చింతా దీక్షితులు ప్రాంశువు. ఆరడుగులు పైచిలుకు మనిషి. గోదావరి వరదలో ఇద్దరినుండి అద్దరికి ఈదేవాడు. ఆయన దేహమువలెనే ఆయన ఊహకూడా ఎప్పుడూ ఉన్నతముగాఉండి ఆకాశము అంటుతూ ఉంటుంది.

శ్రీ దీక్షితులు తాను ఇతరులను కోరకుండగానే కొందరు చేరి సభ చేయకుండానే, జనవాక్యమువల్ల 'కథకచక్రవర్తి' అని పేరు తెచ్చుకున్నాడు, ఆయన కథలకంటెకూడా 'శబరి' ఇత్యాది ఆయన నాటికలు ఉత్తమమైనవని ఈ వ్యాసకర్తమతము. ఆయన కథలకూ, నాటికలకూ వచ్చిన ప్రసిద్ధివల్ల ఆయన కవి అనే మాట లోకము తరచుగా మరిచిపోతున్నది.

శ్రీ చింతా దీక్షితులు, శ్రీ చింతా భీమశంకరము అనే మిత్రులు కలిసి, చింతా శంకరదీక్షితులు అనే పేరుతో కథలు ఇత్యాదికము ప్రచురిస్తూ ఉండేవారు శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవుల ప్రసిద్ధినిబట్టి జంటకవుల ఫాషను ఐన రోజులు అవి! శ్రీ భీమశంకరము ద్వారా శ్రీ దీక్షితులు, సాహితీసమితి పుట్టకముందే, శ్రీ శాస్త్రికి మిత్రుడైనాడు. దాని ప్రథమఫలితము రచనలలో వారి జంట విడిపోవడము! అట్లా విడిపోని పక్షములో శ్రీ శాస్త్రి తానుకూడా వారిలో కలిసి 'శివశంకర దీక్షితులు' అని వ్రాస్తానని బెదిరించినాడు.

శ్రీ కృష్ణకర్ణామృతకవి "శైవా వయం....తథాపి చేతో మదీయం ...స్మేరాననం స్మరతి గోపవధూకిశోరమ్" అన్నాడు. ఏసు పిల్లలను తనవద్దకు రానిమ్మన్నాడని చెప్పుతారు. పిల్లల నవనీతమువంటి

మనస్సు పెద్దలను చాలామందిని ఆకర్షించింది. శ్రీ దీక్షితులు కవితాత్మను కూడా 'పిల్లలు' ఆకర్షించినారు. ఆయన కలములో 'బాలవాఙ్మయము' తెలుగులో పుట్టినది. ఆయన పిల్లల పాటలు కొన్ని 'లక్కపిడతలు' అనే పేరులో చిన్న సంపుటముముగా ప్రచురించినాడు. అందులో 'కమలాలు'లో

"చిట్టి చిట్టి కమలాలు చెరువులోని కమలాలు
నవ్వేటి కమలాలు నాకు తెచ్చి పెట్టే...."

అని అమ్మను కోరి, తీసుకురాకపోతే,

"బువ్వ తినను బజ్జోను నవ్వ మంటే నవ్వను
నీకు ముద్దు పెట్టను—"

అని బెదిరిస్తుంది తల్లిని పిల్ల,
'తిన్నారు' అనే కావ్యంలో—

"పప్పూ బెల్లం తిన్నారు
...................
అమ్మ క్కోపం వచ్చింది అప్పుడు తన్నులు తిన్నారు
తిన్నారోయ్ తిన్నారు!"

తల్లిచేత తన్నులు తినడం ముద్దుగా వర్ణించినాడు.

అందులోకల్లా పొడుగాటిది 'హనుమంతుడి తోక.' ఇది బొబ్బిలి పాటఫణితిలో ఉన్నది:

"హనుమంతుడి కొక తోక ఉన్నది అందమైన తోక
హనుమంతుడి కొక తోక ఉన్నది పొడుగాటి తోక
హనుమంతుడి కొక తోక ఉన్నది లావుపాటి తోక—"

ఈ 'హనుమంతుడి తోక' తో రామాయణమంతా జరుగుతుంది:

"భగభగ భగభగ భగభగ భగభగ మండుతోంది తోక
చురచుర చురచుర చురచుర చురచుర అంటుకొంది లంక"

* * *

"తోక కాదురా శంభుడి శూలం ఖస్సున పొడిచింది
తోక కాదురా విష్ణుని చక్రం గిర్రున తిరిగింది
తోక కాదురా ఇంద్రుని వజ్రం పరపర నరికింది"

* * *

"తోకను చూచి రాక్షసు లంతా బెదిరి చెదిరినారు"

* * *

"తోక ముడిచి హనుమంతుడు వచ్చి రాముని మొక్కాడు."

ఇది అత్యద్భుతమైన చిన్న కావ్యము; 'లక్క పిడతలు'లో ప్రచురించినవికాక శ్రీ దీక్షితులు అనేక కావ్యాలు చెప్పినాడు. ఆయన దారి చూపినతర్వాత ఎంతో బాలవాఙ్మయము తెలుగులో పుట్టింది. కాని శ్రీ దీక్షితులు రచనలతో తులతూగగలది అందులో ఇప్పటికి మృగ్యము.

ఈ బాలవాఙ్మయముకాక ఇతర కావ్యాలు కూడా శ్రీ దీక్షితులు అనేకము చెప్పినాడు. కాని ఆయన ప్రత్యేకత బాలకావ్యాలలోనే విశేషము కనపడుతుంది. శ్రీ దీక్షితులు నిష్కల్మషమైన ఉపాసకుడు, శ్రీ భగవానునిగూర్చి ప్రస్తుతము చేస్తున్న రచనలలో కూడా 'దొంగ దొరికాడు' ఇత్యాది శీర్షికలనుబట్టి చూస్తేనే, పసిపిల్లల నిష్కలంకవృత్తి ఆయన ఆత్మలో పాదుకొనిపోయినట్లు ధ్రువపడుతుంది

## 8

శ్రీ దీక్షితులును స్మరించగానే, ఆయన జిల్లాసామ్యం వల్ల, ఎందుకో 'గోదావరికోకిల', 'గౌతమీ కోకిల' అని పేరు సంపాదించుకున్న శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రి తలపుకు వస్తాడు. కవులకు కోకిల అనే పేరు వాల్మీకినాటినుంచీ వస్తున్నది. ఎవరో ఒక కవి "కూజంతం రామరామేతి....వందే వాల్మీకి కోకిలమ్'' అన్నాడు. శ్రీ వేదులకు గోదావరి విశేషణము అతను గోదావరిజిల్లావా డయినంతమాత్రానే రాలేదు. అతని గీతాలకు గోదావరీ నినదము ఆధారశ్రుతి:

"నావలె శుష్కజీవనమునన్ దురపిల్లెడి యీపవిత్ర గో
దావరి పేదవడ్డ నినదమ్ములతో శ్రుతిగల్పి ప్రేమ రా

గావహదుఃఖగీతు లివు డల్లుచు గ్రుచ్చుచు నుంటి నొక్క మం
క్తావళి నాపవిత్ర నయ నాంబుకణోజ్జ్వలమౌక్తికమ్ములన్"

అని 'ముక్తావళి' అనే కావ్యములో అన్నాడు. అతని 'నొదలు' వెళ్ళబోసుకునేదికూడా గోదావరి తీరాననే :

"ఆ విమలగౌతమీస్రవంతీవివిక్త పులినముల నానొదల
వెళ్ళబోసికొనగ—"

అన్నాడు 'భగ్నవీణ'లో.

శ్రీ వేదుల ప్రథమములో శతావధాని; ఆంగ్ల భాషాజ్ఞానము లేనివాడు. పవిత్రమూ, మధురమూ ఐన ఒకానొక వేదన శ్రీ వేదుల హృదయమును ఆవేశించింది. ఒక్కసారిగా అతను నవకవీ, సాహితీ సమితి సభ్యుడూ అయినాడు. అతను ప్రాచీనచ్ఛందస్సులలో పద్యాలు చెప్పడములో సిద్ధహస్తుడు. అవి సానలుదీరిన రత్నములుగా ఉంటవి. తర్వాత తర్వాత పదకవిత్వము కూడా కొంత చెప్పినాడు; కాని పద్యాల లోని మాధుర్యము పదకవిత్వములోకి తీసుకొని రాలేకపోతున్నాడు. అతని కావ్యాలు చాలా భాగము 'దీపావళి' అనే పేరుతో ఒక సంపుటిగా అతని మిత్రులు కొందరు అచ్చువేయించినారు. ఆ కావ్యావళి నిజముగా నవ కవిత్వములో ఒక దీపావళే !

## 9

శ్రీ వేదులకున్నూ, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రికిన్నీ కొంత సామ్య మున్నది. వారి ఉభయుల కవిత్వమూ కరుణతో ప్రారంభించినది. అంతే! కాని ఒకరి కవిత్వమును ఒకరు అనుకరించలేదు. స్వతంత్రులైన ఇద్దరు ఎందుకు అనుకరిస్తారు ?

నవ్యకవి అనగానే ముందు స్ఫురించేది శ్రీ దేవులపల్లి. నవ్య కవిత్వము పర్లాకిమిడినుంచి చెన్నపట్టణము వరకూ సహజ మధురమైన తన కంఠస్వరముతో చదివి వినిపించి ప్రచారము చేసినది అతనే! ఐతే అతని ప్రాధాన్యము ప్రచారముతో ఆగలేదు. నవ్యత అతని కవిత్వములో మూర్తీభవించినది. అతని తర్వాత వచ్చిన యువకవులు ఎందరెందరో

అతనిని కవిత్వములోనేగాక వేషభాషలలోను, చూపులలోకూడా అనుకరించ సాగినారు. అతని కావ్యాల ప్రతిధ్వనులు ఇప్పటికీ పత్రికలలో తరచుగా వినబడుతుంటవి. యువకవిహృదయాలను అతనివలె ఆకర్షించిన కవి ఇంకొకడు లేడు.

అతనికి ప్రఖ్యాతి వచ్చినట్లుగానే శత్రువులు కూడా ఎక్కువ ప్రాప్తించినారు. అతని అనుయాయులకంటె ప్రతివిమర్శకులే ఒక విధముగా అతనిని ఎక్కువ గౌరవించినారు. ఆయన 'కృష్ణపక్షము'కు ప్రతిగా అటువంటివారిలో ఒకరు 'శుక్లపక్షము' అనే కావ్యము రచించి ప్రచురించినారు. 'కృష్ణపక్షము'లో మూర్తీభవించిన నూతనజీవము అట్టివారికి వేదన కలిగించింది. కంసాదులు కృష్ణునిమీద పగతో మోక్షము సాధించినారు కాదూ !

శ్రీ దేవులపల్లి కవిత్వము అర్థము కాదని వారి మొదటి అల్లరి. పూర్వకవుల కావ్యాలు అర్థము కాని వారిని భాషాజ్ఞానము లేనివారని నిరసిస్తాము ! మరి వీరి నేమనవలెను ! అర్థము లేదనడానికి వారు సాహసించరు. ఉత్తమకావ్యాలు వాచ్యార్థమువల్ల కంటె, దానివల్ల స్ఫురించే వ్యంగ్యార్థమువల్ల మనోహరముగా ఉంటవి. 'ఉర్వశి' కన్నులు వర్ణిస్తూ ఈకవి అన్నాడు:

"ఆమెకన్నులలో ననంతాంబరంపు నీలినీడలు కలవు;
.........ఎదియొ అపూర్వమధుర
రక్తి స్ఫురియించుగాని, అర్థమ్ముకాని భావగీతమ్ము లవి... .."

అతని భావగీతాలు అర్థం కావనేవారిలో సహృదయులైన వారికి ఆ కవి ఇచ్చిన జవాబు సరిపోవచ్చును.

అతని కవిత్వములో నిజమైన 'ఏడుపు' లేదని రెండవ గోల. అతను ఎప్పుడు చూచినా కులాసాగా ఉంటాడు, కష్టములు పడ్డట్లే కనపడడు. కావ్యాలలో ఎప్పుడూ దుఃఖము వర్ణిస్తాడు. కాబట్టి ఇదంతా దొంగ ఏడుపు అయి ఉండవలెనని వారి వాదము.

అయితే నిజమైన ఏడుపు కావలె ననేవారు కావ్యాలు చదవనక్కర లేదు,—ఏ వీధిలోనైనా ఒక ముసలమ్మ తన ఏడుపు ఆరోహణావరోహణలతో వినిపించేది, అట్టివారికి, కోరినప్పుడు దొరకకపోదు. 'ముక్కు తిమ్మన ముద్దుముద్దుగా ఏడ్చినాడు' అనే హాస్యోక్తి లోకవిదితము. శ్రీ దేవులపల్లి ఏడుపులో మాధుర్యము చూపించినా డన్నా, అతని కవిత్వానికి లోటు కాదు. నిజముగా ఒక్కొక్కప్పుడు ఆయన దుఃఖము పసిపిల్లలు మారాము చేసేట్లుగానే ఉంటుంది;

"మీరు మనసారగా నేడ్వనీరు నన్ను—
నన్ను విడుపుడు! ఒకసారి నన్ను విడిచి
నంత నేకాంతయవనికాభ్యంతరమున
వెక్కి వెక్కి రోదింతును—విసుపులేక
విరతిలేక దుర్భరశోకవిషమగీతు
లేడ్చిపైతు; ఎలుంగెత్తి యేడ్చిపైతు—"

"ఆ పని చేయక ఎవరు అడ్డుపెట్టినారు నిన్ను?" అంటారు ప్రతిపక్షులు. "అపుడు గొంతెత్తి యేడ్చినాను" అని కూడా ఈకవి అన్న సంగతి మరవరాదు.

శ్రీ కృష్ణశాస్త్రి కావ్యాలు స్థూలదృష్టితో మాత్రమే చదివినవారికి ఈ శంక కలుగుతుంది. అతని కావ్యాలలో ప్రతిఫలించేది పవిత్రమైన ఒకానొక అవ్యక్తప్రేమ:

"వ్రాలె నా పాదు అడుగుల మ్రోల నొక్క
తారయే, యొక్క దివ్యమందారసుమమె!
మోహినీహాసమల్లి ప్రపుల్లరుచియొ,
శ్రీ లలిత వైజయంతీపరీమళమ్మొ,
హరజటాపారిజాతలతాంతమధువె,—"

ప్రేమతో సహచారిణి ఐన వియోగము ప్రధానమైన దుఃఖకారణముగా ఈ కవికి కనపడుతుంది. ఇది కవి ఎంత మధురముగా అన్నాడు.

"వానివాసమ్ము తొలుత గంధర్వలోక
మధురసుషమాసుధాగానమంజువాటి,

ఏ నొక వియోగగీతిక, నేను నిదుర
వెన్నెలలదారి నొంరేయి వెడలిపోతి
నొక విపంచీవిరహకంఠ మొరసియెగసి"

మరిఒకచోట, ఊర్వశిని సంబోధించి—

"నీవె నిట్టూర్పు, నీవె కన్నీరు, విశ్వ
వేదనామూల్యభాగ్య మీవే, నిజమ్ము
నే గళమ్మార పాడుకొనిన యఖాత
శోకగీతమ్ములం దివె శోకగీతివి !—"

అన్నాడు. ఇతను అనాదిగా పండితకవు లైనవారి వంశములో పుట్టి ఉగ్గుబాలతో కవిత్వమూ, భాషాసౌష్ఠవమూ అలవరచుకొన్నవాడు. ఏది చెప్పినా మధురముగా చెప్పగలడు. భాషలోగాని, భావములలోగాని జిలుగుపని అతనికి ఎక్కువ ఇష్టము. అతని అనుయాయులు ఆ జిలుగు పని మాత్రమే కవిత్వమనే భ్రాంతితో నగిషీపనులు పదాలతో చేసి అభినవకృష్ణశాస్త్రిల మని విఱ్ఱవీగుతున్నారు.

# 10

నవ్యకవి అని విశేషఖ్యాతి కలవాడు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి; అయితే నవ్యకవులలో అగ్రస్థానము అధిరోహించడానికి సర్వవిధాలా అర్హుడైనవాడు సాహితీసమితి సభాపతి శ్రీ శివశంకరశాస్త్రి !

ఆయనవిద్వత్తు అనన్య సామాన్య మైనది. సంస్కృతాంధ్రభాషల సంగతి చెప్పనక్కరలేదు. ఆంగ్ల భాషలో ఆయన చదివిన గ్రంథాలు అపారము. 1912 ప్రాంతాలలోనే వంగభాష అభ్యసించి నవలలు తర్జుమా చేసినాడు. హిందీప్రచారము రాకముందే హిందీ అభ్యసించినాడు. తర్వాత మరాఠీ, గుజరాతీ భాషలుకూడా కొంత నేర్చుకున్నాడు. పారసీ భాష మధ్యమధ్య ఉత్సాహముతో చదువుతుంటాడు. ఇంకా కొన్ని ఇతర భాషలుకూడా చదువవలెనని ప్రయత్నాలు చేసినాడు. ఏది చదివినా ఆ భాషలోని వాఙ్మయము కోసమే సాధనకాని మరొకదానికి కాదు. ఇన్ని భాషల పరిచయమువల్ల అనేకవిధములయిన రచనలు గ్రహించగలశక్తి ఆయనకు అలవడినది.

చాలామందికి చదివినకొద్దీ మతి పోతుంది. అయితే శ్రీ శాస్త్రికి చదివినకొద్దీ హృదయములో మార్దవమూ, వినయమూ ఎక్కువవుతున్నవి. నవకవి లోకములో ఆయన మెప్పు ఒక ఘనతగా భావించని కవి లేడు. అయితే రచనలో ఏమాత్రము సుగుణమున్నా అది ఆయన గ్రహించి కవికి ఉత్సాహము కలిగిస్తాడు: మార్పుకు సూచనలు చేస్తాడు; అధైర్యము కలగనీయడు. శ్రీ దేవులపల్లి తనరచనలవల్ల యువకవుల కెందరికో మార్గదర్శకుడైతే, శ్రీ తల్లావజ్ఝల తన మాటసహాయమువల్ల ఎందరో నవకవులకు అండగా నిలిచినాడు.

ఆయనకు మంచికావ్యా లంటే ఎంత ఇష్టమో, చక్కని పుస్తకమూ, మంచి అచ్చూ చూడడ మంటే అంత ఇష్టము. ఈ అభిప్రాయము ఇప్పుడు మనలో కూడా వృద్ధి అవుతున్నది. కాని 'సాహితి' ప్రచురించే నాటికి దేశానికి కొత్త. ద్రవ్యలోపమువల్ల ఆయన మనస్ఫూర్తిగా చక్కని పుస్తకాలు అచ్చువేయించలేకపోయినాడు. కాని, ఆయనచేతిలో ఏమి మాయ ఉన్నదో తెలియదు-ఆయన అచ్చువేయించిన పుస్తకానికి ఒక చక్కని రూపము ఏర్పడుతుంది. ఆయనకు ఇష్టములేని పుస్తకాలు, అచ్చు విషయము కూడా ఆయన శ్రద్ధ తీసుకున్నవి ఉన్నవి.

'సాహితి' అచ్చు వేసే కొత్త రోజులలో, అందులో అచ్చువేసే రచనలు అన్నీ తన దస్తూరితో జాగ్రత్తగా, మాటకూ మాటకూ మధ్య స్థలము పెట్టుకుంటూ వ్రాసి మరీ అచ్చుకు ఇచ్చేవాడు. అప్పటి కాయన దస్తూరి బాగుండేది. ఆసాపు వ్రాయడములో రచనలలో కూడా అక్కడక్కడ మాటలూ, రూపాలూ మార్పు చెందేవి. ఆ మార్పులు తరచుగా అవసరమైనవే; గ్రంథకర్తలు పొరబడ్డవే ఎక్కడైనా గ్రంథకర్తకు అభిప్రాయ భేదము కలిగినా, అందుకు ఆయనమీద ఎవరికీ కోపము వచ్చేదికాదు; నవ్వి ఊరుకునేవారు. సమితి కవులలో అంత సామరస్యము ఉండేది.

శ్రీ శివశంకరశాస్త్రి సంపాదకుడుగా ఉండి అచ్చువేసిన 'సాహితి' సంచికలు పదహారు మాత్రమే. అందులో "వానప్రస్థుని కావ్యాలు" అనే పేరుతో కొన్ని ఖండ కావ్యాలు ప్రచురించేవాడు. ఇతర రచనలు

లేకపోయినప్పుడే ఆ కావ్యాలు అచ్చువేసేవాడు. తన కావ్యాలు ప్రచారము చేసుకోవలెనని ఆయనకు అప్పుడు కూడా వ్యగ్రత ఉండేది కాదు.

ఈ "వానప్రస్థుని కావ్యాల" లో ఒక చిత్రమైన స్వాతంత్ర్యమున్నది. అయితే అందులో చురుకుదనములేదు. శాంతముగా ఉన్న సమయములో చదివినప్పుడే కాని అవి రమ్యముగా ఉండవు. అందులో కూడా ఔన్నత్యము కాని, లోతుగాని కనపడదు. ఇటువంటి పద్యాలు మాత్రమే వ్రాసి ఉంటే, కొద్ది కాలములోనే లోకము మరచిపోయేది.

ఆయనకు 1923 లో భార్యా వియోగము ప్రాప్తమైనది. ఆ తర్వాత "పుష్యపూర్ణిమ" అనే ఖండకావ్యములో శోకించినాడు:

"పుట్టిన దామె యోవిమల పూర్ణిమ! నీ హృదయంబునందు, చే
పట్టిన దస్మదీయ మృదు పాణిని, మత్కర పల్లవంబునం
దిట్టె గతించిపోయె హృదయేశ్వరి దివ్య వయో విలాస మి
ప్పట్టున ఘోరమై మిగిలె ప్రాణ విశోషక దుఃఖ కేలియే!

అయితే 1924-వ సంవత్సరములో ఆయనలో ఒక పెద్ద మార్పు కలిగింది. శీతల గంభీరమైన ఆయన హృదయ సముద్రములో ఒక బడబాగ్ని ప్రవేశించింది. చల్లని నీడలు ఇచ్చే వనస్పతులున్నా ఆయన ఆత్మవనములో కార్చిచ్చు అంటుకొన్నది.

"నా హృదయ వనమందు ననారతమ్ము
దారుణంబుగ జెలరేగు దావవహ్ని"

ఆ అగ్ని-ఆ చిచ్చు మూడేళ్ళపాటు నిరంతరాయముగా ఆయన మనస్సును మథించి, ఇప్పటికే పూర్తిగా చల్లారకుండగా ఉన్నది. ఆ అగ్ని స్పర్శవల్ల శ్రీ శాస్త్రి కవిత్వములో పెద్ద మార్పు కలిగింది. అది ఆర్ద్రముగా జ్వలించే జ్యోతిగా మారినది.

ఈ మార్పు వచ్చిన తర్వాత ముందు ఆవిర్భవించిన కావ్యము "హృదయేశ్వరి". "హృదయేశ్వరి లక్ష్మీపదాంకిత యయినది; కిరాతార్జునీయము లక్ష్మీ పదాలాంఛితము; మాఘుని కావ్యము శ్రీ పదాంకితము" అని కవి పీఠికలో చెప్పుకొన్నాడు; అది-

"అనిశము మెలంగు నేమనోహరమూర్తి
స్వచ్ఛమామక భావనాసౌధమందు
వెలసెను కవిత్వ మేదేవి వీక్షణమున
అట్టి హృదయేశ్వరికి నిది యంకితంబు."

"హృదయేశ్వరి" 130 పేజీలలో అచ్చయిన ఒక ప్రేమకథ. విభ్రమము, విరహవీచి, హృదయశాంతి, గీతావళి, సుఖస్వప్నము-అందులో అయిదు భాగాలు. నాయకుడు బహుభాషా కోవిదుడు.

"మున్ను నయనోత్సవంబుగా ముదమొసంగు
వివిధ భాషా మహాగ్రంథ వితతి ఇప్పుడు
ధూళి ధూసరితంబయి దొరలు చుండు—"
అతడు 'పౌరుషోదంచితు' డయినప్పటికీ ఆర్ద్రహృదయుడు.

"పౌరుషోదంచితుడ నయ్యు బాలుపోల్కి
రోదనము చేసినాను హృద్భేదకముగ"

నాయిక "మహాకులీన", "విద్యాబినిరత" అన్నాడు. ఆమె ఒక సారి "సంస్కృత గ్రంథరాజము సంతరించి నాయకునికి ప్రత్యక్ష మయినది. నాయకుడు ఎంత స్థిరప్రేమ కలవాడో, ఆమె అంత అధైర్యముతో కూడిన చాంచల్యము కలదిగా కనబడుతుంది. వారిప్రేమకు ఒక వకుళ వృక్షము సాక్షిగాను, నాయిక "గీత మాలాపించి కిన్నరీ కంఠాన" గుచ్చిన ఒక "వకుళమాల" వారి ప్రేమ బంధ చిహ్నము గాను కనబడుతుంది.

'వకుళ మాలిక' అనే మనోహరమైన కావ్యము "హృదయేశ్వరి"కి అనుబంధముగా వ్రాసినది. నాయకుడు ఆ వకుళమాలికను ఒక పేటికలో భద్రపరచి అప్పుడప్పుడు తెరచి చూచుకుంటాడు. ఆ "వకుళ మాలిక" తన కథ చెప్పుకుంటూ ఈ ప్రేమోదంతము చెప్పుతుంది. ఇందులో కవి అవలంబించిన విధానము అదివరకు తెలుగులో లేనిది. "గీతికాస్వగత" మని దానికి పేరుపెట్టినాడు. కావ్యము ప్రధానముగా మాత్రా ఛందస్సు మధ్య అనేకరాగాలు, తాళాలు కలపాటలు.

ఇవిగాక ఆయన ప్రచురించిన కృతులు అనేకములు. పద్మావతీ చరణ చారణ చక్రవర్తి, దీక్షిత దుహిత, వరపరీక్ష, యక్షరాత్రి, సహజయాన పంథి, సాధకుడు, దివ్యలోచనములు; వాటికి పద్యనాటిక, పద్య రూపకము, గీతి నాటిక, యవనికాంతరము, సంవాదము ఇత్యాది నామము లుంచినాడు. అవి అన్నీ కూడ కేవల పద్యాలతోగాని, పద్యాలు పదాలతోగాని, పద్యపద గీతాలలోగాని ఉన్న నాటకాలు. వాటి అన్నింటిలో కథలు వేరు. అన్నింటిలోను అన్ని విధాలుగా శ్రీ శాస్త్రి ప్రతిభ కనబడుతుంది. అయితే సూక్ష్మదృష్టితో అవి పరిశీలించే వారికి సూర్యునిలో నుంచి వచ్చే సహస్ర కిరణాలవలె, ఒక్క సూర్యకిరణములో నుంచి వచ్చే ఇంద్రధనస్సు రంగులవలె అవి అన్నీ "హృదయేశ్వరి"లో నుంచి ఆవిర్భవించిన అనేక రూపాలే అని ద్యోతకమవుతుంది. 1924 తర్వాత శ్రీ శాస్త్రి రచించిన కావ్యావళి కంతటికీ కూడా సామాన్యముగా ఈ సూత్రము వర్తిస్తుంది. ఇది వివరించడానికి ప్రత్యేక వ్యాస మవసరము కనుక ఇక్కడ అది విరమించడమైనది.

శ్రీ శాస్త్రి కావ్యాలలో చిత్రించిన ప్రేమ ఈ లోకానికి సంబంధించిన దైనప్పటికి అతిలోకమైనది. ప్రియురాలు ఆయన దృష్టిలో ఒకానొక దేవత. "అననాబ్జ కరాబ్జ పాదాబ్జములకు తారతమ్యము లేదు, నా తలపు నందు" అన్నాడు. అనేక కావ్యవస్తువులు. అనేక మార్గములలో, అనేక ఛందస్సులలో రచించి అద్వితీయమైన మేధతో నిర్వహించినాడు సాహితీ సమితి సభాపతి శ్రీ శివశంకరశాస్త్రి!

# 11

తెలుగు వాఙ్మయములో "గాలి దుమారము" రేపిన "యెంకి పాటలు" రచించిన శ్రీ నండూరి సుబ్బారావు సమితిలో నుంచి ఒకానొకప్పుడు రాజీనామ ఇచ్చినప్పటికీ, మరల సభ్యుడై పోయినాడు. పుస్తక రూపంగా అచ్చయినవి ముప్పైఐదు పాటలు. అందులో ఎక్కువ భాగము ద్విపదకు దగ్గరగా నడుస్తవి. శ్రీ పొక్కులూరి లక్ష్మీనారాయణ భారతిలో ఈ కవిత్వము నిరసిస్తూ వ్రాసిన వ్యాసము ఆధారము చేసికొని

పత్రికలన్నీ విమర్శలూ, ప్రతి విమర్శలూ ప్రారంభించినవి. దానితో తెలుగు సీమలో ఈ పాటలు స్థిరమైన ప్రతిష్ఠ సంపాదించుకొన్నవి.

అందులోని భాష పల్లెటి దిక్కు జనము మాటలవలె ఉంటుంది. అది గ్రామ్యమని కొందరు భ్రమపడ్డారు. ఈ పాటలలో అసభ్యత ఏమీ లేదు పవిత్రమూ, అమాయకము ఐన ఒకానొక శృంగారము వీనిలో ద్యోతమవుతుంది. కొందరు కొన్ని పాటలలో అసభ్యత ఉన్నదనేవారు ఉన్నారు. కాని ఆ అసభ్యత ఆ అనేవారి మనస్సులలో మాత్రమే ఉన్నది.

"యెంకి పాటల" సంగతి విశేషము చెప్పడము చర్విత చర్వణము. అమరుకుని ఒక్కొక్క శ్లోకమే నూరు కావ్యాలని పెద్దలంటారు. ఆ విధము గానే ముప్పైఅయిదు పాటలూ అయినవి. ఇంకా కొత్త పాటలు వ్రాస్తున్నారు.

# 12

సాహితీసమితి మంత్రి శ్రీ వీరరాఘవస్వామి కొన్ని స్వతంత్రమైన ఖండకావ్యాలూ, కొన్ని చక్కని అనువాదాలు చేసినాడు. స్వతంత్ర రచనలలో "వృద్ధుడు" అనే కావ్యము ముఖ్యమైనది. అయితే ఆయన ఉత్తమ రచనలన్నీ ఆయన హృదయ గర్భములోనే ఉన్నవి. ఆయన సమితి కవులకు ఎందరికో ఉత్సాహకారిగా ఉన్నాడని సభ్యులకందరికీ తెలుసును.

శ్రీ నూతక్కి రామశేషచౌదరి సమితి సభ్యులతో ప్రత్యేక సాహచర్యమున్న రోజులలో చక్కని రచనలు చేసినాడు. "కాపు పెండ్లి" అనే కావ్యము మనోజ్ఞమైనది. జయపురము అసిస్టెంటు దివాను ఐన తరువాత రచనలేమీ చేసినట్లు తోచదు. ఆయనవంటి సహృదయులు మన తెలుగు దేశములో అరుదు.

'సాహితి' ప్రచురించిన రోజులలో తిరుపతి వాస్తవ్యులు శ్రీ కొత్తపల్లి సుబ్బన్నాచార్యులు పద్యాలు పడుతుండేవి. ఈ మధ్య ఆయన వాక్కు మళ్ళీ ఎందువల్లలో వినబడడం లేదు.

సమితి సాహచర్యమువల్ల ప్రధానముగా వచన రచయిత లైనవారు కూడా కొందరు కొన్ని కావ్యాలు చెప్పినారు. వారిలో శ్రీ ముని మాణిక్యం నరసింహారావు, శ్రీ వజ్ఝ బాబారావు చెప్పిన పద్యాలు స్మరించ వలసియున్నది. శ్రీ శ్రీనివాస శిరోమణి తానెన్నడూ పద్యాలు చెప్పలేదని చెప్పుకున్నా, ఆయన చెప్పిన కావ్యమొకటి ప్రచురించినది ఉన్నది. అంతమాత్రము చేత ఆయన మాట అసత్యము కానేరదు.

శ్రీ పెద్దిభట్ల రామచంద్రరావు కొన్ని కావ్యాలు 'సాహితి'లోను, సఖిలోను, ఈ మధ్య 'ప్రతిభ'లోను ప్రచురించినాడు. ఎప్పుడో కాని అతను పద్యాలు చెప్పడు. ఇప్పుడు జెయిలులో విశ్రాంతి తీసుకొంటు న్నాడు గనుక అక్కడ వచ్చిన కావ్యాలతో బయటికి వచ్చి తెలుగు లోకాన్ని మెప్పిస్తాడని విశ్వసిస్తున్నాము.

శ్రీ తెలికిచర్ల కృష్ణమూర్తి నూనూగు మీసాల నూత్న యౌవ్వన ములో మధురమైన ప్రేమ గీతాలు చాలా ఆలాపించినాడు. ఈ మధ్య మళ్ళీ అవి వినబడడము లేదు. రెండవ యౌవనము కోసము అవి ఎదురు చూస్తున్నవి.

శ్రీ తెలికిచర్ల వెంకటరత్నము అనేకమైన కావ్యాలు చెప్పినాడు. అవి ఆయన లోకానికి ప్రచురించలేదు. గనుక ఆయన మిత్రులు వాటిని స్వయముగా బహిర్గతము చెయ్యడము న్యాయము కాదు. అవి ఉన్నట్లు సమితి సభాపతి సాక్ష్యమున్నది.

"బారిష్టరు పార్వతీశము" వల్ల అపారకీర్తి సంపాదించిన శ్రీ మొక్కపాటి నరసింహశాస్త్రి ఒక్కడు మాత్రము పద్యాలు రాసిన పాపాన పోలేదు. ఆ ప్రత్యేక గౌరవము ఆయన ఒక్కడిదే !

పండితాగ్రేసరులైన శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి సాహితీ సమితి సభ్యుడని చాల మందికి తెలియక పోవచ్చును. ఆయనకూడ "ధృతరాష్ట్రి విలాపము" అనే కావ్యము రసవంతముగా చెప్పినాడు.

ఇక ఒక్కని స్మరణము మిగిలిపోయినది. అది ఈ వ్యాసకర్త. ఇతను పంధొమ్మిదేళ్ళ లోపుగా వ్రాసిన కావ్యాలన్ని 'గీతమాలిక' అనే సంపుటిగా ప్రచురించినాడు. "భాగవతావతరణము" అనే పద్య

నాటిక ఒకటి 1933 లో ప్రచురించినాడు. సాహితి, శారద, భారతి, సఖి, జయంతి, వీణ- ప్రతిభ-అన్ని సాహిత్య పత్రికలలోను తన కావ్యాలు ప్రచురిస్తూనే ఉన్నాడు. ప్రతి పత్రికకు తన రచన లియ్యడు. అతని కవిత్వము ప్రబంధ స్త్రీల నడుమువలె అతనికే 'అస్తి నాస్తి విచికిత్సా హేతు'వుగా ఉన్నది. ఆధునికులలో ఒక్కొక్కరికి ఒక్కొక్క నదిమీద ఎక్కువప్రేమ. 'కృష్ణవేణి'అనేకావ్యము ఈ విధముగాప్రారంభించినాడు:

> "ఈ యాషాఢ నవాంబు దార్భటులతో నేకశ్రుతి గల్పి త
> ల్లీ, యీ రీతిగ నిత్యయౌవన సుధా శ్రీరాగ మాలాపనల్
> చేయం జాలితి వెన్నిమారు; లిటులన్ జీర్ణించు మా బొంట్లకున్
> ప్రాయ బింతయి గుర్భనేరితివె అంబా, కృష్ణవేణీనదీ!"

సాహితీ సమితి ఇప్పుడు లేదంటున్నారు కొందరు. అది అబద్ధమన డానికి ఈ వ్యాసమే ప్రబల సాక్ష్యము. మరికొందరు నవ్యసాహిత్య పరిషత్తులో ఐక్యమయినదంటున్నారు. సాహితీ సమితి సభ్యులందరూ నవ్య సాహిత్య పరిషత్తులో 'సభ్యులే', కాని నవ్య సాహిత్య పరిషత్సభ్యు లలో సమితి సభ్యులు అత్యల్ప సంఖ్యాకులు. పరిషత్తు సభ్యులు చాలా మంది సమితి సభ్యులు కావడానికి అవకాశమే లేదు.

మరి ఒక సంగతి. దేశములో ఆకలిబాధ ఎక్కువగా ఉన్నది. దరిద్రదేవత తాండవమాడుచున్నది. దారిద్ర్యము ఆకలిబాధ తగ్గించ డానికి ఈ సమితి కవులు ఏమి చేశారని ఈ కాలములో చాలా మంది అడుగుచున్నారు. ఏమీ చేయలేదని సమితి కవులు నేరము ఒప్పుకోవల సినదే కాకపోతే శ్రీ దేవులపల్లి "నేను ఆకలి పాటలు వ్రాశాను" అంటే అనవచ్చును. ఆ పాటలు పాడితే కడుపు నిండుతుందా? సాహితీ సమితి కవులంతా, అందరు కవులల్లేనే "వట్టి చావల్ ఖరాబ్" మనుష్యులు! అటువంటి వాళ్ళను ఏమి చేయగలము? కవుల చేతులలో వట్టి అక్షయ పాత్రలేకాని నిజమైన అక్షయ పాత్రలు లేవు!

(భారతి: చిత్రభాను కార్తికము)

# షష్టిపూర్త్యుత్సవములు

విజ్ఞులైనవారు షష్టిపూర్తికి ఉత్సవ మేమని ప్రశ్నింపవచ్చును. అయితే యీనాడుపలువురు పెద్దలకు జరిగిన, జరుగుచున్న, జరుగనున్న, షష్ట్యబ్దపూర్త్యుత్సవములను గూర్చి పత్రికలలో తరుచుగా చదువు చున్నాముగదా! కాబట్టి యామాట మనకు పరిపాటియైపోయినది. అందుచే దానిలోనసంబద్ధమేమియుస్ఫురింపదు ఐనను గోకులాష్టమికిని, పీర్ల పండుగకును కల సంబంధమే షష్టిపూర్తికిని, ఉత్సవములకును గలదనుట సత్యము !

గోకులమున లోకసంగ్రహమునకై శ్రీకృష్ణభగవాను అవతరించిన మహాపర్వమును ఏటేట స్మరించుచు నానందముతో భారతీయులు జరుపు కొను నుత్సవము గోకులాష్టమి. బర్బరదేశములో వీరులు చనిపోయిన వేళను స్మరించుచు ఏటేట ముసల్మానులు దుఃఖముతో వాపోవునది మొహరము. ఒకటి ఆనందకారణమును స్మరించునది, మరియొకటి దుఃఖకారణమును స్మరించునది; ఒకటి భారతీయులది, మరియొకటి ముసల్మానులది. దుఃఖకారణము కనబడినప్పుడు ఉత్సవము చేసికొను వారెవరైన నున్నచో, నట్టివారు షష్టిపూర్తిని ఉత్సవవేళగా భావింప వచ్చును.

మూలానక్షత్రముననో, జ్యేష్ఠయందో, కాక ఆ రెండు నక్షత్రముల సంధికాలమగు అభుక్తమూలమందో దంపతులకు కుమారుడు కలిగినచో వారేమి చేయుదురు? అట్టి దంపతులు లోకపూజ్యు లనుకొందము. అట్టి పుత్రు డట్టివేళ వారికి జన్మించి నందుకు, వారి యదృష్టమునకు వారి నభినందించుచు ఆంధ్రదేశములోని పెద్దలందరును విరాళము లొసగి మహాసభ కావించి గౌరవించి యుత్సవ మొనర్తురా? అట్లు చేసినచో నది యెంత యసంబద్ధముగా నుండునో, షష్ట్యబ్దపూర్తి సమయమున ఉత్సవము జరుపుటయు నంత యసందర్భమే !

# 2

మా చిన్నతనములో షష్టిపూర్తికి ఉత్సవములు చేయునాచారము కనిగాని వినిగాని యెరుగము. అప్పటి కింకను ఉత్సవాదులు నిర్ణయించునది తద్విదులగు పండితులే కాని ఉత్సాహోద్రేకపూరిత మగు జనసామాన్యము కాదు. ఇప్పుడు మాత్రము ఈ యుత్సవములు సర్వసామాన్యమైనవి. నామకుడ ననుకొను ప్రతి వ్యక్తియు అరవదియవ పడిలోపడగనే, నా షష్ట్యబ్దపూర్తి యెప్పుడా, యని వృద్ధవరుడు వివాహోత్సవమునకు వలెనే ఉవ్విళ్ళూరుచుండుట చూచుచున్నాము.

ఈ మార్పుకు కారణ మేమి? శ్రీ పానుగంటివారి 'కంఠాభరణమే' దీనికి మూలమని నా విశ్వాసము. ఆ నాటకము చదివిన వారును, ప్రదర్శింపగా చూచినవారును షష్టిపూర్త్యుత్సముల కుపక్రమించినట్లు తోచును. అందులో సుబ్బిసెట్టికి అరవైయేళ్ళు నిండినవి. పాప మాతనికి ఉత్సవము చేయువా రెవరును ఊరిలో లేకపోయిరి. అంతట నాతడు, 'ఈ కాస్త భాగ్యానికి ఇంకొకరు చేసే దేమిటి? మనమే చేసికొందామని' ఉపక్రమించినాడట !

'షష్టిపూర్తి' నిజముగా తానే యేదో చేసికొనవలెగానీ, ఇతరులు తన కిప్పు డుత్సవము చేయదగినదికాదని శ్రీ పానుగంటివారు తెలియక వ్రాసిరో, తెలిసియు చమత్కారమునకు వ్రాసిరో, మనము చెప్పజాలము కాని, ఆ భాగము చదివినప్పుడు గాని, ప్రదర్శింపగా చూచినప్పుడు గాని పాఠకులును, ప్రదర్శకులును కడుపుబ్బ నవ్వకుండ నుండరు. కానివాస్తవ మెరింగినచో, అట్లా పాఠకులును, ప్రేక్షకులును నవ్వుట చూచి, నవ్వుకొన దగినవాడు సుబ్బిసెట్టియే !

షష్టిపూర్తికి చేయదగినది యుత్సవము కాదు, శాంతి. మూలా నక్షత్రాదులలో పుత్రజననమైనచో చేయదగిన దానికంటె తీవ్రతరమగు శాంతి, షష్ట్యబ్దపూర్తికి చేయవలెను. ఏ శాంతికర్మలలోనైనను ప్రధాన మైనవి దానములు, జపములు, హోమములు! దానము లనగా నితరులకు ద్రవ్యము తామే యిచ్చుటగాని, యితరుల యొద్దనుండి పరిగ్రహించుట కాదు !

# 3

శాంతికర్మలు ప్రదర్శించు గ్రంథములు పరిశీలించినవారికి ఉగ్రరథశాంతి, భీమరథశాంతి, విజయరథశాంతి — అను మూడు శాంతులు గోచరించియుండును. వానిలో అరువదవయేట ఉగ్రరథ శాంతియు, డెబ్బదియవయేట భీమరథశాంతియు, డెబ్బదియెనిమిదవ యేట విజయరథశాంతియు, నాచరింపదగినవి. అందులో షష్టిపూర్తికి చేయవలసిన ఉగ్రరథశాంతినిగూర్చి యొకింత విచారింతము.

నాకు తెలిసినంతవరకు ఈ ఉగ్రరథశాంతికర్మ చేయుటకు మూడు విధానము లున్నవి. ఒకటి శౌనకోక్తము, ఇంకొకటి బోధాయనోక్తము, మరియొకటి శైవాగమోక్తము. ఈ మూడింటి ప్రక్రియలును, మూల సూత్రముల నొకటియేయైనను, తంత్రము నడపుటలోనను, విస్తృతి లోనను విశేషభేదము లున్నవి. వానిలోనెల్ల శైవాగమోక్త శాంతి బహువిస్తృతమైనది. దాని నున్నదున్న ట్లాచరింపగల సమర్థుడు, మహారాజో చక్రవర్తియో! ఐనను యథాశక్తిగా సామాన్యగృహస్థులును ఆచరింపవచ్చును. అట్టిది ఒకసారి చూడగలిగిన నాబోంట్లకు, దాని యద్భుతరూపము, లీలామాత్రముగనైనను, గోచరించిన దనుట అతిశ యోక్తి కానేరదు.

ప్రయోగవిస్తృతిలో నెన్ని భేదము లున్నను, ఆ మూడును విధించినది శాంతియే యనుట కెట్టి సందేహమును లేదు. శౌనకు డిట్లు చెప్పుచున్నాడు:

'జన్మత షష్టి మే వర్షే మృత్యు రుగ్రరథోనృణామ్
..........................
షాణ్మాసాన్మృత్యు మాప్నోతి ధనహానిశ్చ జాయతే
పుత్రనాశోదారనాశో ధననాశ స్తథైవ చ
తద్దోషశమనార్థాయ శాంతిం కుర్యాద్విచక్షణః
జన్మాబ్దే జన్మమాసేచ స్వజన్మదివసే తథా
జన్మర్క్షేచైవ కర్తవ్యా శాంతి రుగ్రరథాహ్వయా
దేవాలయే నదీతీరే స్వగృహేవా శుభస్థలే....'

జన్మాదిగా నరువదియవయేట నరులకు, మృత్యువు ఉగ్రరథ రూపమున నావేశించి, వారికేకాక వారి పుత్రులకు పత్నులకు నాశమును ధనక్షయమును కలిగించును!

అదియే శైవాగమములో నిట్లు చెప్పబడియున్నది. ఈశ్వరుని గుహుడు దానినిగూర్చి ముం దిట్లు ప్రశ్నించినాడు:

'స్వామి న్నుగ్రరథో నామ సర్వప్రాణిభయంకరః
పుత్రిపౌత్రక్షయకరో ధనధాన్య వినాశనః
రాజ్యభ్రంశకరో రాజ్ఞాం ఇత్యేవం బహుశశ్రుతమ్."

అది నిజమే యని యీశ్వరు డిట్లు వర్ణించెను.

'సాధుతే కథయిష్యామి తముగ్రరథమాదరాత్
మహామృత్యుసమః ప్రోక్తః ప్రాణినాం సర్వనాశనః.
మహాకాయో మహాదంష్ట్రో ఘోరరూపే భయానకః
ఆవిర్భావే యస్యపుత్ర ధనధాన్యాది నాశనమ్
భవేత్పీడాచ మహతీ రాజ్ఞాం రాజ్యవినాశనమ్
అనావృష్టిశ్చమహతీ శత్రుపీడా తథైవచ
గజాశ్వరథనాశశ్చ స్వరాజ్యాద్భ్రంశనం తథా
ప్రాదుర్భావే భవన్త్యేతే దోషా ఉగ్రరథస్యవై
ఉత్పత్త్యబ్దా దుగ్రరథ షష్టిమేబ్దే ప్రకీర్తితః
యస్యావిర్భావమాత్రేణ సంసారీ భయమాప్నుయాత్.'

వీనినిబట్టి చూడగా అరువదియవయేడు ప్రవేశించుటయే భయంకర మైనది. అప్పుడు మహామృత్యుసముడగు ఉగ్రరథుడు ఆవిర్భవించును. కావున వెంటనే యథాశక్తిగా నుగ్రరథశాంతి యాచరించుట శ్రేయస్కరము.

ప్రయోగములతో మృత్యుంజయ దేవతా కలశస్థాపనము, తత్ప్రతిమాస్థాపన పూజనములు ముఖ్యములు. అట్లే దుర్గను, గణేశుని, విష్ణువును, సముద్రములను, నదులను, దిక్పాలురను, నవగ్రహములను, చిరజీవులను కలశములలో నావాహన మొనర్చి తత్తత్ప్రతిమలు

సువర్ణముతో నొనర్చి పూజాదికము చేయవలెను. మరియు కలశములలో నావాహనచేసి పూజింపదగినవారు—అరువదిమంది సంవత్సర దేవతలు, ఆయన దేవత లిద్దరు, ఋతువులు, మాసములు, పక్షములు, తిథులు, వారములు, తారలు, యోగములు, కరణములు, రాసులు పండ్రెండు, పంచబ్రహ్మలు, సప్తవాయువులు, అష్టవసువులు, దశదిక్కులు, ఏకాదశ రుద్రులు, ద్వాదశాదిత్యులు'—ఈ యధిష్ఠానదేవత లందరిని వేరువేరుగా కలశములలో నావాహన మొనర్చి సువర్ణప్రతిమలుంచి పూజాజపములు వేర్వేర నొనర్చి తిలదూర్వాంకురాదులతో హోమములు చేయవలెను. తుదకు యజమానిని ఆయుస్సూక్తము, మృత్యుసూక్తము ఇత్యాది మంత్రములతో కలశోదకముల నభిషేకింపవలెను. ఆ పిమ్మట యజమాని ఆచార్యునకు, ఋత్విక్కులకు ప్రతి ాదికములు దానమొనర్చి, మరియు కంబళదానము, గోదానము, కార్పాసదానము, ఆయసదానము, దశదానములు, నవగ్రహ ప్రీతికరములగు నవధాన్యదానములు ఇత్యాది దానము లొనర్చి, బ్రాహ్మణుల భుజింపజేసి దీనులను అనాథులనుగూడ తుష్టి నొందింపవలయును. ఇట్లు చేసినచో నరువదియవయేట నావేశించు నుగ్రరథుడు శాంతించును; దీర్ఘాయుర్దాయము కలిగి పుత్రపౌత్ర వంతుడై సుఖముండును. ఇట్టిది ముఖ్యముగా షష్టిపూర్తికి చేయవలసిన క్రియ!

## 4

ఇంతవరకు చూచినవారికి షష్టిపూర్తి యన నెంత భయంకర మైనదో, అప్పుడు చేయదగిన శాంతి యెంత యుగ్రమైనదో, కొంతవర కవగతమై యుండవచ్చును. భీమరథశాంతి కూడ నిట్టిదే. అవి కేవల శాంతులే కాని యుత్సవము లెంతమాత్రము కానేరవు. ఆబ్దికమునాడు పెట్టిన గారెలు తిన్న యవనుడు వారింట నానాడు పండుగయనుకొని 'రోజూ మీ యింట్లో ఇట్లాగే ఉండవలె'నని యజమానిని దీవించినట్లు కథ యొకటి సర్వసామాన్యముగా చెప్పి నవ్వుకొనుచుందుము. ఆబ్దికము నాడు పితృదేవతలను పూజింతుము, కనుక అది పండుగయే అనుకొనుటలో గూడ ఆ యవను డెక్కువ పొరపాటు పడలేదు. షష్టిపూర్తి యొక

యుత్సవ సమయమని ప్రవర్తించుట మాత్ర మంతకంటె వేయిమడుగు లెక్కువ తప్పు; పైపెచ్చు, ఇది ఎంతో ప్రమాదకరమైన పొరపాటు! నవ్వుకొనునట్టిది కాదు.

శత సంవత్సరములు జీవించినవారును, సహస్ర చంద్రదర్శనము చేసిన వారును గూడ శతాభిషేకమను నొక శాంతి చేసికొనవలెను. అనియు శాంతులే యైనను అందులో ఉత్సవ విశేషము కూడ నున్నది. వానివలన ఫలముకూడ పీడానివృత్తిమాత్రమే కాదు. అందులో శతాభిషేకమైన తర్వాత యజమాని రథమెక్కి, స్వస్తి వాచనములతో దుందుభిశబ్ద పురస్సరముగా గ్రామము ప్రదక్షిణము చేయును. ఇది యొనర్చినచో నాతనికి లభించు ఫలమొక్క పీడానివృత్తియే కాదు. అట్టివాడు తనకు పూర్వులగు పదితరముల వారిని, తన్ను, తన తర్వాత వచ్చు మరి పదితరముల వారిని పునీతుల నొనర్చి, తాను పుత్రపౌత్రులతో షష్టివర్ష సహస్రములు స్వర్గలోకమున నుండి, యా పిమ్మట బ్రహ్మసాయుజ్య సాలోక్యముల నందునట. ఇవి బోధాయన భగవానుల వాక్యములు!

# 5

నా మిత్రులలో పలువుర షష్టిపూర్తి సమీపించు చున్నది. వారును ఆ సమయమున తమ్ము ఆంధ్రలోక మెట్టి యుత్సవ మొనర్చి సమ్మానించునో యని నిరీక్షించుచు ఉవ్విళ్ళూరుచుండ వచ్చును. వారిలో కొందరికి, అది యొక వేడుకయేకాక, అవసరమగు ధనసంపాదనకు మూలమగు మార్గమును కావచ్చును. అట్టివారు ముఖ్యముగా ఈ వ్యాస రచయితను ప్రత్యక్షముగా గాకున్న మనస్సులోనైన నిందింపకపోరు. అందుచే నాకు కొంత ప్రత్యవాయ ముండవచ్చును. కాని షష్టిపూర్తి సమ్మాన సంఘములవారు చేయు బలవంతములకు మోమోటపడి విరాళము లిచ్చు వారిలో పలువురుమాత్రము అది తప్పిపోయినందుకు, ఆనంద పూర్వకముగా నాశీర్వదింతురు గదా!

షష్టిపూర్తి దగ్గరపడిన మిత్రు లందుచే దాని స్వరూప మెరిగి, యథాశక్తిగా తమ ద్రవ్యము వ్యయ మొనర్చి శాంతి గావించుకొని,

చిరజీవులై, సహస్రచంద్ర దర్శనులు, శత సంవత్సర జీవులునై, అప్పుడు చేయవలసిన యుత్సవము చూచి యానందింప మా కావకాశ మిత్తురుకాక! వారును పునీతులై ముందు ముందు ఉత్తమలోకములు ప్రాపింతురు గాక!

[ఆంధ్రపత్రిక-ఖరసంవత్సరాది సంచిక 1951-52]

# నరాంకితము

## ౧

"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని సొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెటవ్రేటులం బడక సమ్మతితోఁ హరికిచ్చెఁ జెప్పె నీ
బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్."

ఏనాడు పోతరాజీ పద్యము చెప్పినాడో గాని, పోతరాజు భాగవతము తెలుగుదేశములో ప్రసిద్ధి కెక్కిన నాటినుండి గ్రంథము నరాంకితము చేయుట కూడని పని యను భావము తెలుగుదేశములో స్థిరపడిపోయినది. కూడనిపని కాదనుకొన్నను అది కక్కుర్తిపని యను భావమైనను పెల్లగించినను తెలుగు వారి మనస్సులలోనుండి తొలగిపోదు. పలువురు అనామకులగు కవులు తాము నరాంకితము చేయుట కిష్టము లేక భగవదంకితము చేసినట్లు చెప్పుకొనిరి, చెప్పుకొనుచున్నారు - మేమెంత కాదన్నను - ముందును చెప్పుకొనగలరు.

ఈ పద్యము చెప్పుటలో పోతన యుద్దేశమేమి? నరాంకితము పనికిరా దని యాతని భావమా? నరులను ఉద్దేశించి కావ్యములు రచించుట హేయమని యాతని తలంపా? నన్నయ తిక్కనాదులు చేసినపని తప్పు అని కాని, అంత సమంజసమైనది కాదనికాని యాతని తలంపా? మరి ఏమిటి?

నరుల నుద్దేశించి గ్రంథరచన చేయకూడదని యాతని యభిప్రాయ మన్నచో నది పొసగదు. పోతన శ్రీరాముని నుద్దేశించి శ్రీమద్భాగవత మేల చెప్పవలె? హరిహరనాథుని నుద్దేశించి శ్రీమదాంధ్రమహాభారతము తిక్కన సోమయాజి ఏల రచింపవలె? శ్రీరామునికిగాని, హరిహరనాథునికిగాని భాగ వత స్వరూపముగాని భారతస్వరూపముగాని తెలియదని యా కవీశ్వరులయుద్దే శము కాదుగదా! పోతన పై పద్యములోనే "జగద్ధితంబుగన్" చెప్పినట్లున్నది. ఆ తర్వాత కొన్ని పద్యముల పిమ్మట అతడు ఏమన్నాడు?

"కొండఱకుఁ దెనుఁగు గుణ మగుఁ
గొందఱకును సంస్కృతంబు గుణ మగు రెండుం
గొందఱకు గుణము లగు నే
నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్."

ఈ పద్యము శ్రీరాముని నుద్దేశించి చెప్పినది కానే కామగదా ! తెనుగు దేశములో నున్న జనులను బహురుచులు గలవారిని ఉద్దేశించియే యది వ్రాసినాడు. మరియు పలువు రనుకొనునట్లు పోతన భక్తితన్మయుడై గ్రంథరచనమునకు దొరకొనలేదు. జనులమెప్పు కావలెనని కోరిక పూర్తిగా నాతని కున్నది.

ఇక పూజ్యుడగు తిక్కనసోమయాజియో ? హరిహరనాథున కర్పితము చేసిన తన మహాభారతమునే "బుధసంతోషంబు నిండారగా రచియించు టొప్పు" అని తలంచెను. మరియు నది "యాంధ్రావళిమోదమున్ గూరయ" నుపక్రమించెను. అందుచే నాతడు ఆంధ్రావళి నుద్దేశించియే యది రచించెను. కాని, కృతి నాథునిగా హరిహరనాథుని జేయుటేమి ? అతడే చెప్పెను :

"ఈదృశంబు లగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం
బ్రశంసించుటయు నొక్క యారాధనవిశేషంబు"

నరుల నుద్దేశించి వ్రాసిన గ్రంథము పరమేశ్వరాంకితము చేయు పద్ధతి యిది యొకటి !

కాని నరుల నుద్దేశించి చెప్పు కావ్యములు నరోత్తములకు అంకితము చేయుట యుత్తమపద్ధతి కాగూడదా ? ఐనచో పోతన, తిక్కనసోమయాజివంటి పూజ్యులు తమ యుత్తమగ్రంథములు భగవంతుని కేల యంకితము చేసిరి ? ధర్మగ్రంథములు భగవదంకితమే చేయవలయు నన్నయెడల, వారితో సమానము గ నైన పూజ్యులగు నన్నయ ఎఱ్ఱయలు తమ యుద్గ్రంథములు నరోత్తముల కేల యంకిత మొనర్చిరి ?

ఈ విచారణకు మహర్షులయు, ఋషికల్పులయు నాచరణ మనుసరించి కడంగుదము. సందర్భవశమున నితర గ్రంథప్రసక్తి వచ్చినను అది ప్రమాణ భావముతో కాదు.

౨

ఆదికావ్య మగు శ్రీమద్రామాయణమును వాల్మీకి ఎవరి నుద్దేశించి వ్రాసెను ? ఎవరికైన నది యంకితము చేసెనా ? చేసియున్నచో నెవరికి ?

ఈ సందర్భమున వివాదము లన్నియు వదలి, ఉన్న శ్రీమద్రామాయణ గ్రంథమును గ్రహించి, పెద్దలు బహుకాలముగా నిర్ణయించిన సిద్ధాంతవాక్య సారము నిచ్చెదను

సీత వనవాసము చేయుచు తన యాశ్రమమున నుండగా వాల్మీకి యీ గ్రంథరచనము చేసెను. దాని నాతడు ముఖ్యముగా కుశలవుల కుపదేశించెను. మహాజనసమక్షమున నశ్వమేధయాగము చేయుచున్న శ్రీరామప్రభువునకు కుశలవు లది వినిపించిరి. దానితో సీతాదేవి విశుద్ధి సర్వజనప్రసిద్ధి నొందినది.

దీనినిబట్టి వాల్మీకి యా మహాగ్రంథమును శ్రీరామసార్వభౌముని యజ్ఞవాటికలో గూడిన యశేష మంత్రి సామంత దండనాథ దౌవారిక ప్రజాసమూహము నుద్దేశించి వ్రాసినను అది శ్రీరామప్రభువునకే అంకిత మయ్యెను. అట్లగుచో నది నరాంకితమే. శ్రీరామచంద్రుడు నారాయణాంశసంభూతు డయినను ఈ సందర్భమున నాతడు కేవల నరేశ్వరుడే !

౩

ఆదికావ్యము ఎంత మనోజ్ఞమైనను, ఎంత పూజ్యమైనను దాని రచనకు వాల్మీకిని ప్రేరేపించినది ప్రధానముగా సీతావిశుద్ధిప్రకటన మను ప్రత్యేక ప్రయోజనము. ఏ ప్రయోజనము నుద్దేశించి యది రచింపబడినను మహర్షినోట వచ్చుటచే నది యనంతప్రయోజనము ఘటించి లోకోత్తరగ్రంథ మైనది.

మహాభారతగ్రంథరచనములో నంతకంటె విశేషమున్నది. ఇది సర్వలోకసంగ్రహబుద్ధితో శ్రీకృష్ణద్వైపాయనముని రచించెను. అది 'విశ్వజనీనము.' అది వేదసారము, ధర్మశాస్త్రము, వేదాంతము, మహాకావ్యము — సాక్షాత్తు కామధేనువే.

ఇది యితరపురాణములవలెనే సూతుడు శౌనకాది మునులకు చెప్పిన ట్లున్నను, దీని ప్రధానశ్రోత జనమేజయుడు. వక్త వేదవ్యాసనిదేశము నిర్వర్తించు వైశంపాయనమహర్షి. ఇది విశ్వము నంతటిని ఉద్దేశించి వ్రాసినను దీనిని లోకమున ప్రవర్తింపజేసినది సర్పసత్రము చేయుచున్న జనమేజయుని సంబోధించుచునే గదా! అందుచే వ్యాసభారతము జనమేజయ మహారాజున కంకితము చేయబడిన దనుటలో నెట్టి యసంబద్ధోక్తియు లేదు.

జనమేజయునకు ఉపదేశించుటకు పూర్వము దీనిని వైశంపాయనునకు, శుకునకు చెప్పియుండవచ్చును. వారి కది చెప్పుట ప్రవర్తింపజేయుటకే కాని దానివలన వారు పొందవలసిన ప్రయోజన మంత లేదు. వారిరువురును కృతకృత్యులే. మరి యిక జనమేజయుడో ?

పెద్దల గణనప్రకారము శ్రీకృష్ణనిర్యాణముతో కలి ప్రవేశించినది. ఆ పిమ్మట కొద్దిదినములకు ధర్మజుడు రాజ్యపరిత్యాగము చేయుచు పరీక్షిత్తుకు పట్టము కట్టినాడు. అందుచే కలియుగమున భారతసామ్రాజ్యమునకు మొదటి ప్రభువు పరీక్షిత్తు. అతడు మొత్తముమీద ధర్మబుద్ధితోడనే రాజ్యపరిపాలనము చేసెను. అత డింకను ధర్మజుడు నిత్యస్మృతిలో నున్నాడు. ఐనను అవసానకాలమున నన్యాయముగా మునీశ్వరు నవమానించి విప్రశాపము నొంది దుర్మరణము పొందినాడు. కవిప్రభావము పోలేదు.

ఆపిమ్మట అతనికుమారుడు జనమేజయుడు పసితనముననే రాజైనాడు. ఇతడు కలియుగమున రెండవ సార్వభౌముడు. ముందుముందు రాజులకు ధర్మబుద్ధి క్రమక్రమముగా నంతకంతకు క్షీణింపగలదు. ధర్మములు ఎన్ని గ్రంథములలో చెప్పియున్న నేమి ప్రయోజనము ? ధర్మము ప్రవర్తింపజేయునది ప్రభువు. ధర్మగ్రంథములు ధర్మశాసకులగు ప్రభువుల కుపదేశించినపుడే

సార్థకత నొందును. మహాభారతమును జనమేజయునకు, ఆతనిద్వారా కొంత్ర వరకైనను ధర్మనిష్ఠ యుండగల అనంతరప్రభువులకు, ఉపదేశింపబడినది, అంకితము చేయబడినది.

ఈ జనమేజయు డెట్టివాడు ? అతనికి పసితనము వదలినంతనే అతడు ప్రారంభించిన ఘనకార్యము సర్పసత్రము. అది ద్వేషముతో ప్రారంభింపబడిన తామసయాగము. ఆ యాగము ఉద్దిష్టమైన తక్షకనాశనము సిద్ధింపకుండగనే విరమింపబడినది. అట్లు విరమించుటకు సభ్యులైన వ్యాసాదులే అనుమతించిరి. ఆ సర్పసత్రము జరుగుచున్న సమయముననే వైశంపాయనుడు జనమేజయునకు వ్యాసాదుల సమక్షమున భారతము నుపదేశించెను. జనమేజయుడు మధ్య మధ్య ప్రశ్నించుచుండును. వైశంపాయనుడు ధర్మసమ్మతముగా నుత్తర మిచ్చుచుండును.

అట్టి మహాభారతము భగవదంకితము చేసియున్నచో వ్యాసుని ప్రయత్నము వృథయై యుండును. వేదవ్యాసునికి తా నుపదేశింప దలచిన ధర్మము కలికాలమున ప్రజల కిష్టము కాదని యెరుక యున్నది. మహాభారత కథాంతమున వేదవ్యాసుడు రెండు బాహువులెత్తి ఉద్ఘోషించినాడు, కాదు ఎలుగెత్తి ఏడ్చినాడు. ఏమని ?

> "ధర్మమువలననే అర్థమును కామమును పొందవలెనుమా !
> నేను రెండు బాహువులెత్తి ఎలుగెత్తి ఏడ్చుచున్నాను.
> కాని, నా మాట లెవరును ఆలించునట్లు లేదు !"

మహాభారతము వేదవ్యాసుని ధర్మఘోష ! ఆ ఘోష పూర్తిగా పాలించువారు ఆ కాలముననే లేరని తెలిసి చేసిన ఉద్ఘోష. కొంతవరకైనను వినునటువంటి జనమేజయుని యాస్థానములో దాని నుద్ఘోషింప జేసినాడు.

మరల మరల కవులు, పండితులు ఆ భారత ధర్మజయఘోష ధర్మప్రభువుల మన్నవారి యాస్థానములలో నెల్ల ఉద్ఘోషించి భారతధర్మము నశించిపోకుండ నిలువబెట్టినారు.



మరల జనమేజయునితో తుల్యు డనదగిన ధర్మప్రభువు భారతదేశ మున వేంగీమండలములో నుదయించినాడు. ఆతడు రాజరాజు. అతనివలెనే ధర్మనిష్ఠులగు చోళచక్రవర్తుల కాతడు దౌహిత్రుడు, అల్లుడు, వియ్యంకుడు. ఆతనికుమారుడు చోళచక్రవర్తియై దక్షిణాపథమున విశేషభాగమున కధిపతి కానున్నాడు. ఆతడును జనమేజయుని వంశములోనివాడు. ఆతనికి వదలకుండగా ఐదు సద్గుణములు కలవు. భూదేవతాపూజ యన్న ప్రీతి, భారతశ్రవణాసక్తి, పార్వతీపతి పూజ, దానశీలత, సాధుసాంగత్యము. అట్టి భారతవంశ్యుడై మనుమార్గుడగు రాజరాజును ప్రధానశ్రోతగా పెట్టుకొని నన్నయభట్టారకుడు ఆంధ్ర మహాభారతరచన కుపక్రమించినాడు. ప్రతి ఆశ్వాసాదిని ఆశ్వాసాంతమునను ఆతడు రాజరాజునే సంబోధించును.

ఆ సంబోధనలలో విశేషమున్నది. ప్రాకృతులకవి స్తుతిపాఠములవలె భాసించవచ్చును. కాని, ఈ సంబోధనలు గమనింపుడు !

> "నిత్యధర్మప్రారంభ, మనుమార్గ, ధర్మనిరత, ఆదిక్షత్ర చరిత్ర, నిత్యనిరంతరధర్మమతీ, బుధనుతసుగుణాకర, కలియుగ పవిత్ర, ధర్మధురంధరా, మహాదాన తర్పిత ద్విజవర, వ్యసన వివర్జిత, పుణ్యావరేణ్యా, నిఖిలజగత్పావన శుభచరిత."

నిత్యసత్యవచనుడైన నన్నయభట్టారకుని సంబోధనములు సత్యములనియే గ్రహింపదగినవి. ఎన్నడైనను రాజరాజు ధర్మచ్యుతి చెందియున్నను నట్టి సంబోధన లాతని ధర్మనిరతి నాతనికి స్ఫురింపజేసి మరల ధర్మనిష్ఠుని గావింపగలవు.

ఇట్లు రాజరాజును సంబోధించుచు రచించిన నన్నయకృతి మహర్షియగు వేదవ్యాసునే అనుకరించెను. నన్నయను ఋషి యనుటకు వెనుకాడు పెద్దలున్నను, వారుకూడ నాతని ఋషితుల్యు డనుటకు సంశయింపరు. వేదవ్యాసునికి జనమేజయుడువలెనే, నన్నయభట్టారకునకు రాజరాజు ప్రధాన శ్రోత !

సామాన్యభాషలో చెప్పినచో నది రాజరాజాంకిత మనవచ్చును. కాని నిజముగా నది రాజరాజునకు ఉపదేశము.

ఈ మహాభారతరచన కుపక్రమించు వేళ రాజరాజు నన్నయభట్టారకు నెట్లు పూజించెనో మనకు తెలియదు. "జాంబూనదాంబ రాభరణంబు" లిచ్చినట్లు లేదు. అగ్రహార మిచ్చినట్లు లేదు. నన్నయ యాచకుడుగా దోపడు. అందులో యాచకు డన్నచో నతడు రాజరాజే. కాని రాజరాజును యాచకు డనుట యుక్తము కాదు. అతడు పృచ్ఛకుడు, నన్నయ వక్త. రాజరాజు శ్రోతగా నుండుటచే ఆంధ్రమహాభారతము కృతకృత్యత నొందినది!

౨

కాని, భారతధర్మము అప్పటిలో సుస్థిరముగా ప్రతిష్ఠితముగా నుండ నోచుకొనలేదు. మూడు పర్వములు పూర్తి కాకుండగనే ఆంధ్రమహాభారత మాగి పోయినది. వేంగీమండలమున విప్లవములు వచ్చినవి. రాజరాజుకుమారుడు చోళ చక్రవర్తియై ధర్మనిరతుడై రాజ్యము చేసినాడు. కాని యాతనికి, ఆతని వంశమువారికి మాతృవంశముమీదను, ద్రవిడ దేశముమీదను అభిమానము హెచ్చినది. ఆంధ్రభారతము మూలపడినది.

ఉత్తరదేశమును తురుష్కు లాక్రమించుకొని భారతధర్మమును పెల్ల గించివేయుచున్నారు. వారిదృష్టి దక్షిణదేశముమీదకూడ పారినది. దక్షిణదేశ ములో ననేక రాజ్యములు వెలసినవి. ఆ రాజ్యముల యధినేతలు ఒకరితో నొకరు కొట్లాడుచున్నారు. వారికి ధర్మకాంక్ష కంటె రాజ్యకాంక్ష, ఐశ్వర్య కాంక్ష ఎక్కువ ప్రబల మైనవి. భారతధర్మ మే రాజుకు కావలెను? ఆంధ్రదేశము నంతటిని జయించి గణపతిదేవుడు కొంతవరకు రాజ్యము స్థిరపరచినాడు. కాని యాతని చిన్నతనము యుద్ధములతో సరిపోయినది. పెద్దతనము తన యనంత రమున సింహాసనమునకు తగిన ప్రభు వెవరు? అను విచారముతో వెళ్ళిపోయి నది. రాజగురువు గౌడరాఠమఠాధిపతి యగు విశ్వేశ్వరశంభుదేశికుడు. అతడు పంచద్రావిడులలోవాడుగా తోచదు. గౌడులలోనివాడు. ఆ సమయముననే ఆంధ్రదేశములో గౌడబ్రాహ్మణులు స్థిరవసతు లేర్పరచుకొని బాలాజీమఠములు

స్థాపింప సాగిన ట్లున్నారు. మరియు గణపతిదేవుని యాస్థానమున జైనాచార్యులును పలువు రున్నారు.

ఆ కాలమున తిక్కన నెల్లూరులో నమాత్యుడుగా నున్నాడు. ఆతనికి చిన్నతనమునుండి ధర్మాభిమాన మున్నట్లు తోచును. కాని ధర్మనిష్ఠ యగుటకు కొంతకాలము పట్టినది. ముందాతడు మనుమసిద్ధి కంకితముగా నిర్వచనోత్తర రామాయణము రచించెను. అతడు శిల్పమున "బారగుడ" ననియు, "కవితా విదుడ"ననియు నిత్యాదికమగు స్వీయప్రతిభ నుత్తమపురుషలో చెప్పుకొని కృతి కుపక్రమించినాడు. అదియు "మనుమసిద్ధినృపతి కభ్యుదయము" గా చెప్పినాడు.

కాని యా మనుమన్నృపతికి లక్ష్మి స్థిరముగా లేకపోయినది. ఆతడును తిక్కన యుపదేశములకు పాత్రభూమిగా చిరకాల మున్నట్లు తోపదు. మొదలే యాతనిది చిన్న రాజ్యము. అదియు బలవంతులైన రాజులమధ్య సంధిస్థానములో నున్నది. ఇటు కాకతీయులయు, అటు చోళులయు, పాండ్యులయు, కాడవులయు పోటులకే కాక - జ్ఞాతుల పోటులకును, చిల్లరప్రభువుల పోట్లాటకును మనుమసిద్ధి గురి యైనట్లున్నాడు. ఆతనికి రాజ్య మెన్నిమారులు పోయినదో భగవంతునకే ఎరుక !

ఈ సమయమున తిక్కనకు "వైదిక ధ్యాయిత" ఎక్కువైనది. వైదిక ధర్మనిష్ఠమగు వర్తనము నిర్వహింపసాగినాడు. సోమయాజి యైనాడు. అనవరతము "స్వాహాస్వధావషట్కారములు" ప్రయోగింపసాగినాడు. మహాభారత రచనాకుతూహలము పెరిగినది. కాని యది ఎవరి కంకితము చేయుట ? దీని నాలించు ధర్మప్రభు వేడి ? ఏడి ? విని యాచరణలో పెట్టువాడేడి ? ఆచరణలో పెట్టదలచినను పెట్టగల సమర్థు డేడి ?

"అని రచనాకౌతుకమున
మన మలరఁగ నీ ప్రబంధమండలి కధినా
థునిఁగా నే పురుషునిఁ జే
ర్కొనువాఁడనొ యను తలంపు గూడిన మతితోన్."

ఇంచుక నిద్రించుసమయంబున - కొమ్మనామాత్యుడును, హరిహరనాథుడును ఆవిర్భవించి హరిహరనాథున కంకితం బొనర్ప నాదేశించిరి. అంతట

నతడును "ఈదృశంబులగు పుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రశంసించు టయు నొక్క యారాధనవిశేషం బగుటంజేసి, హరిహరనాథునకు విన్నపంబు సేయు తెఱంగుగా సంతస్సన్నిధిం గలిగించుకొని" యుపక్రమించెను. ఆత డెక్కడ రచించుచున్నను హరిహరనాథు డంతస్సన్నిధి నుండెను.

సోమయాజి పదునైదు పర్వములు రచించెను. వానిలో నెన్నియో యాశ్వాసము లున్నవి. కాని ఆ ప్రత్యాశ్వాసమును ఒకే వచనముతో ప్రారంభించును :

"దేవా ! వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె" ఈ మాట లాతడు పదే పదే చెప్పుటకు విసువులేదు. తనయంత వైదికనిష్ఠాభాసురుడు, ధర్మతత్పరబుద్ధి తన యజుశ్శాఖకు ప్రవర్తకుడగు వైశంపాయనమహర్షి జనమేజయున కుపదేశించినట్లు తానును ఉపదేశింతమన్న తగినధర్మప్రభువు లేడయ్యెగదా, "దేవా, దేవా" యని చింతిలుచు హరిహరనాథుని ఆరాధించెను. హరిహరనాథుని సాక్షిగా నుంచుకొని మహాభారతరచనమునకు గడంగెను. కాని, ధర్మసూక్ష్మవేత్త యగు సోమయాజి యితరులు భ్రాంతిపడకుండగలందులకు మరల మరల "వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె" అని చెప్పుచునే వచ్చెను.

ధర్మప్రభువు లేడని సోమయాజి ఎంత పరితపించెనోగదా !

౽

కాని, సోమయాజుల తపస్సు వెంటనే ఫలింపలేదు. సోమయాజులవలెనే ధర్మతత్పరులగు బహు వేదవిప్రుల తపస్సును కాలమాహాత్మ్యముచే వృథయైనది. తురుష్కులు దక్షిణాపథమును ముంచివేసినారు. ముందు దేవగిరి జయించి, పిమ్మట ఓరుగల్లు పట్టుకొనిరి. వెంటనే మధుర స్వాధీనము చేసికొనిరి. కనబడిన బ్రాహ్మణులను వధించిరి. వారినోళ్ళలో బలవంతముగా సురామాంసములు క్రుక్కిరి. ప్రతాపరుద్రుని సామంతమండలేశ్వరు లందరు, ప్రాణములు వదలినవారు పోగా, మిగిలినవారు పారిపోయిరి. దేశమంతటను మహాభయ మావేశించెను. వర్తకుల వ్యాపారము కట్టువడెను. పొలములలో వ్యవసా

యము సాగలేదు. ఎవరో ఒకరు పొలము పండించినను సిద్ధమైన పంట తురుష్కు లెత్తుకొని పోవుచుండిరి.

సార్వజనీనమైన మహాభయములో నుండి ధర్మబీజము మొలకెత్తెను. సామాన్యముగా వ్యవసాయము చేసికొనువారు, వర్తకము చేసికొనువారు, తమ తమ వృత్తులతో కాలక్షేపము చేసికొనువారు, చేతికి చిక్కిన యాయుధములు ధరించిరి. పల్లెపల్లెలందును వారు తురుష్కప్రభువుల మూకలను ప్రతిఘటింప సాగిరి. బ్రాహ్మణులును ఆయుధములు ధరించిరి. కాని, వారి యాయుధముల కంటె వారు సామాన్యజనులకు చేసిన బోధ, కలిగించిన యుత్సాహము, ఇచ్చిన యాశీర్వచనములు అమోఘములై యుండవలెను. దేశమంతటను బహుళముగా నాయకు లుద్భవించిరి.

ఆ సమయమున శంకరస్వామి శిష్యుడును, సూర్యకవిపుత్రుడును అగు ఎఱ్ఱనకును మహాభారతగ్రంథములోని మొరికి భాసించినది. ఆంధ్రమహాభారత గ్రంథము పూర్తి కానిది ధర్మప్రతిష్ఠ కాదని గురువు లుపదేశించియుందురు. నన్నయభట్టారకుడు ఎఱ్ఱన నావేశించినాడు. రాజరాజువంటి ధర్మప్రభువు కొరకై ఆ దేశప్రజలు తపస్సు చేసినారు. అట్టివాడింకను ఎఱ్ఱయకు పొడ కట్టలేదు. రాజరాజాంకితముగానే ఆరణ్యపర్వశేషము నాతడు పూరించినాడు.

అంతలో నొక విశేషము జరిగినది. ఆంధ్రదేశనాయకులందరు తాత్కాలికముగా నేకీభవించినారు. ఆ నాయకులకు అగ్రగణులుగా కొంతకాలము ప్రోలయయు, పిమ్మట కాపయయు నుండిరి. వారు తురుష్కులను తరిమితరిమి కొట్టిరి. భయభీతులైన ప్రజలు ధైర్యశాలు రైరి. ఆంధ్రసేనలు వచ్చుచున్నవని విన్నంతనే భయభ్రాంతులై తురుష్కులు పారిపోజొచ్చిరి. ఆంధ్రసేనలపాటు పోయి పోటు వచ్చినది. ఆంధ్రదేశమంతటను జాతీయప్రభుత్వములు నెలకొనెను.

ఆ ప్రభుత్వములకు అధినేతలు ఎక్కువభాగము శూద్రులు. ఆ శూద్రులు ఉత్తమ శూద్రులు. తమ శూద్రజన్మమందు గర్వమున్నవారు, తమ శూద్రధర్మమందు అభిమానమున్నవారు, భారతధర్మస్వరూపము పెద్దలవలన తెలిసికొన్న

వారు. అట్టివారిలో సుత్తమోత్తముడు ప్రోలయ వేమన. అతనికి అద్దంకి రాజధాని. ఆతడు బంధుసంపత్తి కలవాడు. సర్వసంపదలును గలవాడు. అతని చిన్న తమ్ముడగు మల్లారెడ్డికి ఆప్తసచివుడగు ఎర్రయను అతడు గ్రహించినాడు.

ఎర్రయ తపస్సు ఫలించినది. మరల రాజరాజువంటి ధర్మదీక్ష గల ప్రభువు మధ్యాంధ్రదేశమును పాలింప సాగినాడు. గుండ్లకమ్మ కిరుప్రక్కల నున్న మహాదేశము నాతడు రక్షించెను. పశ్చిమమున అహోబిలము, శ్రీశైలము లును ; తూర్పున సముద్రమును అతనిపరిపాలనలో కలవు. ఆతడు సమస్తాధి కారములు కలవాడైనను, క్షత్రియోచితములగు లాంఛనములు, బిరుదములు నాతడు స్వీకరించెను.

"ఇష్టాపూర్తరూపం బగు క్రియాకలాపంబు నిజకర్తవ్యానురూపం బుగాఁ దొడంగి."

"అగ్రహారములు విద్యాతపోవృద్ధుల కిచ్చి యజ్ఞకర్తలుగ సునిచెఁ గొమరారఁ జెఱువులు, గుళ్లుఁ బ్రతిష్ఠించి లోకసంభావ్యంబులుగ నొనర్చె, నిధులు నల్లిండ్లును నిలిపెఁ, దోటలు సత్రములు చలి పందిళ్ళు వెలయఁబెట్టె, హేమాద్రి పరికీర్తితామితవ్రత దాన నివ హంబు లన్నియు నిర్వహించెఁ,

జేసెఁ జేయుచునున్నాఁడు సేయ నున్న
వాఁడు పునరుక్తకృతి సుధావలుల నెల్ల
ననఁగ శ్రీ వేమవిభున కయ్యాలరు పేర్మి
వశమె వర్ణింపఁ దద్భాగ్యవైభవంబు!"

ఇవి ఎట్టియకవి స్తుతిపాఠములు కావు. ప్రోలయవేము డిచ్చిన దానశాస నములు, దానములు నేటివఱకు స్థిరముగా జరుగుచు ఎఱ్ఱన సత్యవచనములను వేముని ధర్మబుద్ధిని చాటుచున్నవి. బ్రాహ్మణుల కగ్రహారము లిచ్చి వారిని తమయగ్నులతో నందుప్రవేశించి యజ్ఞయాగాదులను అతిథిపూజలును నిరతాన్న దానములను సాగించుకొనవలసినదని ప్రార్థించినాడు. ఆ దానములచే తాను కృతార్థుడనైనట్లు భావించినాడు. ఆ ప్రతిగ్రహీతల నామములు శాసనములతో

చదివినచో వారందరు అధమపక్షము మూడు నాలుగు తరములుగా వేదవేదాంగ వేత్తలగుటయేగాక బహువిధ యజనములు చేసిన తపస్సంపన్నులని విదితము కాగలదు.

అట్టి ప్రోలయవేమన ఎఱ్ఱయచే శ్రీమద్రామాయణము చెప్పించినాడు. ఆ రామాయణము ఇప్పుడు ఏలనో దొరకకున్నది. అది దొరకినచో తెలుగులో నెన్ని రామాయణము లున్నను తృప్తి కలిగించు రామాయణము తేఁలోటు తీరిపోయియుండును. అంతేకాదు, ఆ కాలపుచరిత్ర అజ్ఞాతముగా నుండక విజ్ఞాతమై యుండును. ఆ రామాయణము చెప్పించుటచే ప్రోలయవేముడు తాను "అత్యుత్తమ ఖ్యాతిం బొందితి"నన్నాడు. అది ప్రోలయవేమునకే అంకితమైన దని మనము భావించుటలో పొరపాటుండదు.

కాని యంతటితో ప్రోలయవేముడు "కావ్యామృతాస్వాదన" తో తనియ లేదు.

> "భారతపరాంశ మని యిం
> పారఁగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
> వా రమ్యకథఁ దెనుంగుగ
> ధీరోత్తమ ! నిర్వహించి తెలుపుము మాకున్."

> "అనినం బ్రహర్షపులకితదేహుండనై యమ్మహాభాగుని సమగ్ర సంప్రార్థనంబుఁ గృతార్థతాకవితస్ఫూర్తం బగు చిత్తంబునం గైకొని యిట్లంటి."

> "నన్నయభట్ట తిక్కకవినాథులు చూపిన త్రోవ సాహసం
> బెన్నఁ బరాశరాత్మజమునీంద్రుని వాఙ్మయ మాదిదేవుఁ డౌ
> వెన్నుని వృత్త మీవు కడువేడుకతో విను నాయకుండ వి
> ట్లెన్నియొ సంఘటించె మదభీప్సితసిద్ధికి రాజపుంగవా !"

పై వాక్యములతో ఎఱ్ఱయ హరివంశరచన కుపక్రమించినాడు.

వేదములకు ఉపనిషత్తు లెట్టివో, రామాయణమునకు ఉత్తరకాండ మెట్టిదో, మహాభారతమునకు హరివంశ మట్టిది. ఆ హరివంశము పూర్తి కానిది

మహాభారతము పూర్తికాదు. యోగీశ్వరుడును, శంకరస్వామిశిష్యుడును అగు ఎఱ్ఱయ చేతులలో మహాభారతము పూర్తియగుట ఆంధ్రుల మహాభాగ్యము.

అది నరాంకితము కాదు. భారతమూలమువలెనే ఆంధ్రభారతములోని మొదటి మూడు స్కంధములును, దాని శిఖ యగు హరివంశమును ఉత్తము లయిన యధికారుల కుపదేశింపబడినవి. జనమేజయునకు వైశంపాయను నందెట్టి భక్తి యున్నదో, అట్టిదే ప్రోలయవేమునకును ఎఱ్ఱయయందు కలదు. "అమ్మహాభాగుని సమగ్రసంప్రార్థనంబు" అని స్తోత్రపాఠకుడగు కవి వ్రాసికొనగలడా? మరియు నొక్క విశేషము! హరివంశమును వేముని సాశీర్వదించుచు ఎఱ్ఱయ యిట్లు పూర్తి చేసెను.

> "శ్రీవేమక్ష్మావల్లభ
> భూవల్లభపూజనీయ భుజవైభవ ల
> క్ష్మీవల్లభ గుణవితరణ
> పావన నినుఁ బొందుఁగాత భవ్యశుభంబుల్ !"

ఇట్టివి నరాంకితము లని యూసడింపదగినవా ? ఇట్లు ముఖ్యశ్రోత నొకరిని పెట్టుకొని చెప్పుట సత్సంప్రదాయము గనుకనే ఇతరులుకూడ పలువురీ పద్ధతినే యవలంబించినారు. పాల్కురికి సోమనాథుడు, నన్నయాదుల మార్గము నిరసించువాడు, పరమశివభక్తుడు తన ప్రధానగ్రంథములకు ముఖ్యశ్రోతలను పెట్టుకొన్నాడు. బసవపురాణమునకు సంగయామాత్యుని, పండితారాధ్యచరిత్రమునకు సూరనామాత్యుని శ్రోతలనుగా నుంచుకొన్నాడు.

౩

ఎఱ్ఱయపిమ్మట కొలదికాలమునకే పోతన యవతరించినాడు. ఎఱ్ఱయ వృద్ధుడై యుండగనే పోతన జన్మించియు నుండవచ్చును. అప్పటికి దక్షిణ దేశములో మార్పులు చాల వచ్చినవి. గుల్బర్గాలో భామినీసుల్తానులు స్థిరపడి పోయినారు. శ్రీ విద్యానగరములో క్షత్రియవంశజులగు రాజులు శ్రీ విద్యారణ్యుల యాశీర్వచనముచే సుప్రతిష్ఠితులై భారతధర్మము నుద్ధరింప కృతకంకణులై సుల్తానులతో నిత్యము పోరాడుచున్నారు. అద్దంకినుండి కొండవీటికి తమ రాజధానిని మార్చిన రెడ్డిరాజులు రాజమహేంద్రవరము వరకుగూడ తమ

రాజ్యమును విస్తరింపజేసిరి. కాని, ప్రోలయవేమని ధర్మదీక్ష వారిలో నుంచ గించినది. ధర్మనిరతి నశింపలేదు. కాని, భోగలాలసత అతిశయించినది. "వసంతరాయడు" రాజుగా వెలసి తన మంత్రియగు కాటయ వేమునికి రాజ్యపాలన మప్పగించినాడు. తుదకు జనకంటకుడగు ప్రభు వైనాడు. షుమారు నూరు సంవత్సరములలో ధర్మమూర్తులగు రెడ్డిరాజులురాజ్య మంత రించినది.

ఆ సమయముననే అవల "రాచకొండ" లో సింగమనేతు ప్రభువు వా రిప్పుడు కాపయనాయకుని కాలమునవలె కాదు. వారు రెడ్డిరాజులతో నిరంత రము పోరు పెట్టుకొనసాగిరి. వీరి తలకొట్టి వారు, వారి తలకొట్టి వీరు, తమ తమ్మ పడిగలలో దాపించుకొన మొదలుపెట్టిరి. "మరణాంతాని వైరాణి" అను ఆర్యోక్తి మరచిపోయి ఓడిపోయిన శత్రువులపుత్తెలు తెచ్చి తమ తమ్మ ఉమియు పళ్లెములుగా నుపయోగింపసాగిరి. మరియు వారు బహమనీసుల్తానులతో చెలిమి చేసి ఇటు రెడ్డిరాజులతోడను, అటు శ్రీ విద్యానగర ప్రభువులతోడను కల హింపసాగిరి.

కాని, యీ రాజుల పూర్వుల ధర్మబుద్ధియే వారిలో నశించినది కాని వారి సాహిత్యాభిమానము నశింపలేదు. వారికి సాహిత్యగ్రంథములు ఆస్థానాలంకార ములు. లోకములో నున్న సమస్త రత్నములను సంగ్రహించిన యుంధ నిజు ఘులు స్త్రీరత్నమగు చండికను కాంక్షించినట్లే, వారును ఉత్తమ గ్రంథములు తమ కంకితము కావలెనని కాంక్షించియుందురు. అట్టిది పోతన రచించుచున్న భాగవతము.

పోతన యాంధ్రీకరించిన మూలగ్రంథము వ్యాసప్రోక్తమా కాదా యను వివాదము పోతననాటికే కలదు. ఏది యెట్లున్నను అది వ్యాసకృత మను పరమ తాత్పర్యముతోడనే పోతన యాంధ్రీకరింపసాగినాడు. అందునకు చిత్రవిశే షము లున్నవి.

పోతనతండ్రి 'శైవశాస్త్రమతము గనిక'వాడు. అన్న 'ఈశ్వర సేవాకాముడు,' అతడును స్వయముగా శివభక్తుడు. ఐనను అతడు "శ్రీమన్నారాయణ కథా ప్రపంచ విరచనాకుతూహలు'' డయినాడు. ఒకానొక పూర్ణిమనాడు సోమోప

రాగసమయమున గంగయందు (గోదావరికూడ కావచ్చును.) గ్రుంకులిడి మహే శ్వరధ్యానము చేయుచు పులినతలమండపమున కన్నులరమోడ్చినాడు. "రాజ శేఖరు" డొకడు ప్రత్యక్షమై తాను "రామభద్రుడ" నని పేరు చెప్పుకొని తన కంకితముగా శ్రీమహాభాగవతము తెనుగుచేయుమని యాతని కానతిచ్చెను.

పోతనకుకూడ ఆ గ్రంథము 'రాజశేఖరు'నకు అంకితము చేయుట సత్సంప్రదాయ మని తెలియును. రామభద్రున కంకితము చేసినను అతడు రాజశేఖరు డను భావముతోడనే అంకితము చేసినాడు. ధర్మప్రభువగు రామ భద్రునితో తా నెరిగిన మనుజేశ్వరులను పోల్చినాడు. వారెవరో తమకు భాగవ తము కృతి యిమ్మనియు, అగ్రహారాదికము లిచ్చెద మనియు ప్రలోభపెట్టిన ట్లున్నారు. ఆయనను గూర్చి లోకములో వ్యాప్తమై యున్న కథలలో కొంత సత్య ముండకపోదు అత డెరిగిన యా రాజులు పరీక్షిత్తువంటివారు కాదు, జనమే జయునివంటివారు కాదు, రాజరాజువంటివారు కాదు, ప్రోలయవేమునివంటివారు కాదు వారు "మనుజేశ్వరాధములు." నరాంకితము చేయుట పోతనకు ఇష్టము లేకపోలేదు. తన రచనకు మూలగ్రంథమే కలికోని ప్రథమసార్వభౌముడగు పరీక్షితున కంకితమైనది. పోతన దృష్టిలో నా కాలపు "మనుజేశ్వరాధములు" కొందరు భాసించియుండవలె. వారి నుద్దేశించి,

"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి"

ఇత్యాది పద్యముల నాతడు చెప్పినాడు.

ఆ తర్వాతివారు చరిత్ర మరచినారు. ధర్మగ్రంథములు వ్రాయుటయు మరచినారు. వాని నుపదేశించు సంప్రదాయమును మరచినారు. ఉపదేశింపగల మను ఆత్మవిశ్వాసమును పోయినది. ధనసహాయము చేసినవారికెల్ల తమకృతులు సమర్పింపసాగినారు. కోరినంత ధనము ఇచ్చువారు లేనియెడల, ధనవంతులపై గోపముతో, ఇదిగో భగవంతునికి కృతి యిచ్చుచున్నామని బెదరింపసాగినారు. కొందరు నిజమైన భక్తులును నరాంకితము చేయుట దోషమని పోతన తలంచె నని భ్రాంతిపడినారు. గ్రంథము లంకితము చేయు పద్ధతిలోనే పెద్దమార్పు వచ్చినది. కొందరు ధన మిచ్చినవారిపేరనే తమ గ్రంథములు రచించి గ్రంథ

కర్తృత్వమే వదలుకొన్నారు. అది యిప్పటికిని జరుగుచునే యున్నది. ముందు గూడ జరుగగలదు.

అంతేకాని నరాంకితము చేయుట పోతన హేయమని తలపలేదు. కవీశ్వరులకు అంకితము చేసినందున నన్నయకును, ఎఱ్ఱయకును ఎట్టి న్యూనతయు ఆరోపింపరాదు. ధర్మగ్రంథములే కాదు, గ్రంథము లన్నియు, నరులకొరకు వ్రాసినవే కాని, భగవంతు నద్దేశించి వ్రాయలేదు. హరిహరనాథునకు వ్యాస భారతము అర్థము కాక పోలేదు ; ఆతనికి ఆంధ్రభారతమే వినవలెనని కుతూహలము కలిగియుండదు. శ్రీరామభద్రునికి పోతనభాగవతమే వినవలెనని కాంక్ష కలుగదు. తిక్కనసోమయాజియు, పోతనయు మహాతపస్వులు. వారు లోక సంగ్రహమునకై ఉద్గ్రంథములు వ్రాయబూనినారు. అందులో వారి కుత్కంఠతోపాటు జంకు కలిగియుండవలెను. తుదకు వారికి ధైర్యము కలిగినది. ఆ సమయమున వారికి కలలోనో, ధ్యానముననో భగవంతుడు ఏదో ఒకరూపమున సాక్షాత్కరించినట్లు భాసించినాడు. వారిధైర్యము స్థిరపడినది. వారు ఉద్గ్రంథములు ఉదాత్తవిధముగా నందుచే నిర్మింపగలిగినారు.

వారి కలలు దూరము తరచి చూడగూడదు. అట్లు చేసినచో కొన్ని యసందర్భములు కనిపించును. అప్పకవి కలలో నున్నన్ని యసందర్భములును కఠినముగా పరీక్షించువారికి కనబడవచ్చును. కాని, వారిస్వప్నములు నిజముగా వచ్చినవే. అసందర్భము లేకున్న స్వప్న మెట్లగును ? ఆ కలలు వారి భావనా బలమును భగవద్భక్తియు రూపించును. అందుకు సందేహము లేదు. వారుచేసిన రచనలే వారి మహోపాసనలుగా పరిణమించినవి.

తిక్కన "యుపలాలితుండగు డింభకుండు దనకొలంది యెఱుంగక మహాపదార్థంబు వేఁడు విధంబున బ్రహ్మానందస్థితిం గోరి"నాడు. కలలో హరిహరనాథుడును "జనన మరణాదులైన సంసారదురితములకు నగపడకుండంగఁ దొలఁగు తెరువుగను వెలుంగు నీ కిచ్చితి" ననెనట ! ఆ కోర్కెతో నాతడు మహాభారతము వ్రాసినాడు. ఆ కలలో నాతడు ఆశ్వాసాది పద్యములు నాశ్వాసాంతపద్యములు మరల మరల వ్రాసినాడు. అందుచే నట్టి వెలుగును సమీపించి యుండుననుటకు ఎట్టి సందేహము నుండరాదు. అట్లే పోతనకును

శ్రీరామభద్రుడు "నీకు భవబంధంబులు తెగు"నని యానతిచ్చెను. ఆ నిశ్చయముతోడనే పోతనయు గ్రంథము వ్రాసెను. వారికి అది ఆజన్మములోనే ప్రాప్తించెనని కాని, ప్రాప్తించలేదని కాని చెప్పలేము. వారు ఆ జన్మములలో చేసిన సాధనచే భవబంధములు తెగిపోవు వెలుగును సమీపించినా రనుటకు ఎట్టి విప్రతిపత్తియు నుండరాదు. వా రా వెలుగును పొందినా రనుటకు ఇతరాధారము లున్నచో పొందిరనియే అందుము. అది మానవమాత్రులకు అందనిది కనుక ఆ వెలుగును సమీపించినారని చెప్పి తృప్తి పొందుదము. అంతమాత్రమున మనము పిసినిగొట్లము కాము. తిక్కన పోతనలయందు తక్కువ గౌరవము కలవారము కాము. బ్రహ్మజ్ఞానముయొక్క సర్వాతిశాయిత్వము కొంత లెక్కవేయగలవారమే యగుదుము !

## ౨

మన తెలుగుదేశములోవలె గ్రంథములు కృతి యిచ్చు నాచారము కర్ణాటక కవులలో నున్నదేమో ! పూర్వపు సంస్కృతకవులలో లేదు. కాని, సంస్కృతములో నుత్తమగ్రంథములకు ప్రత్యక్షముగనో, అప్రత్యక్షముగనో ప్రధానశ్రోతలు లేకపోలేదు. పురాణము లన్నిటను శ్రోత లున్నది జగద్విదితము కనుక వానిని వదలి కావ్యప్రపంచములోనికి వచ్చి ఒక్క ఉదాహరణ మిత్తుము.

సంస్కృతకవులలో ఋషితుల్యుడు మహాకవి కాళిదాసు. అతని రఘువంశము విద్యార్థులు ప్రథమ కావ్యముగా పఠించుట మనదేశములో నాచారమైనది. పరిణతులయిన పిమ్మటను ముఖ్యముగా పఠింపదగిన దా కావ్యము. అందులో దిలీపునియొద్దనుండి రఘువంశరాజుల చరిత్రము వర్ణింతునని ప్రారంభించెను. వా రెటువంటివారు ?

ఆజన్మశుద్ధులు, యథావిధి హుతాగ్నులు, యథాపరాధదండులు, త్యాగార్థము సంభృతార్థులు, ప్రజార్థము గృహమేధులు, శైశవమందు విద్యలభ్యసించినవారు, వార్ధకమున మునివృత్తి యవలంబించినవారు, తుదకు యోగముచే తనుత్యాగము చేయువారు.

దిలీపుడు, రఘువు, దశరథుడు, శ్రీరాముడు ఇత్యాదు లందులో పర్ణింపబడిన రాజులు. వారు రాజర్షులు. తుదకు సుదర్శనుడను రాజు ప్రజా పాలనము చేసి రాజ్యభారమునకు తన కుమారుడగు నగ్నివర్ణుని నభిషేకించి వనము నకు పోయి మునివృత్తి యవలంబించెను. అతని కచ్చటి ఉటజముల సౌఖ్య ముతో రాజమందిరసౌఖ్యమును, దర్భశయ్యల సుఖముతో హంసతూలికాతల్ప ముల శయనించిన సుఖమును మరపువచ్చెను.

మరి యాతని సుపుత్రు డగ్నివర్ణుడో ? అతడు తండ్రి సంపాదించిపెట్టి యిచ్చిన రాజ్యము తనభోగమునకే వినియోగింపదగునని నిశ్చయించి ప్రవర్తిం చెను. కొద్దికాలమే రాజ్యపరిపాలనము చేసి పిమ్మట అతడు ఆ భార మంతయు మంత్రులపై నుంచెను. తాను స్త్రీలతో రమించుచు నృత్తగీతవాద్యములతో కాలక్షేపము చేయసాగెను. అతనియంకతలమున వదలక ఎప్పుడును వీణయును మంజుభాషిణి యగు యువతియు నాశ్రయించి యుండిరి. అత దద్దములో తన రాజవేషము జూచుకొనుటకు కంటె, భోగచిహ్నాంకితమైన తనరూపము చూచుకొన నిచ్చగించుచుండెను. ప్రజలకు దర్శనమే యిచ్చుట చాలించెను. వృద్ధామాత్యు లెవరయినను ప్రజలకు దర్శన మీయవలెనని బలవంతపెట్టినచో, గవాక్షము నుండి తన చరణముమాత్రము ప్రజలకు కనబరచువాడు.

అట్టివా డే మగును ? రాజయక్ష్మచే నకాలమరణము నొందెను. అనేక స్త్రీలతో భోగించినను అతనికి సంతానము కలుగలేదు. అతడు చనిపోయినది ప్రజలకు తెలుపుట కిష్టము లేక మంత్రులు రోగశాంతి చేయించుచున్నామని ప్రచురించి యాతనిదేహమునకు గృహోపవనములోనే దహనాదిసంస్కారములు రహస్యముగా చేయించిరి.

అంతలో అదృష్టవశమున రాణి గర్భవతి యయి యున్నదని ఎరిగి అమాత్యులు ఆమెనే ఆధారము చేసికొని పుత్రోత్పత్తి నర్థించుచు రాజ్యము రక్షింపసాగిరి.

ఈ కథతో రఘువంశము పూర్తియగును. కాళిదాసుకు ఈ అగ్నివర్ణుడు సమకాలికు డేమో ! ఏమైనను రఘువంశమను మహాకావ్యముతో కాళిదాసు రాజుల కందరకు ఎట్లు పరిపాలింపవలెనో, ఎట్లు ప్రవర్తింపగూడదో, మహోప దేశము చేసినాడు. అందుచే నాకావ్యము భగవదంకితము కాదు, ధర్మాంకితము. ధర్మపరిపాలకులగు రాజుల కంకితము, నరోత్తమాంకితము.

---

# తెలుగు కవుల ఆదర్శములు *

## అమాత్య తిక్కన

### ౧

శ్రీ మదాంధ్రమహాభారతము రచించిన కవులు ముగ్గురికి కవిత్రయ మను పూజ్యనామము ఆంధ్రలోకమునం దంతట ప్రసిద్ధిలోనికి వచ్చినది. మరియు వా రితరగ్రంథములను రచించినను మహాభారతమునే ప్రమాణముగా గ్రహించుట శబ్దవేత్తల వృద్ధాచారము. చిరకాలముగా నాంధ్రపండితలోకములో కవిత్రయమునకు సమానమైన గౌరవము స్థిరపడినందున వారిలో తారతమ్యము లెన్నఁబూనుట, అట్టి ప్రయత్నము చేయువారి అజ్ఞానమునే ప్రకటించును. వారు ముగ్గురును త్రేతాగ్నులవలె పవిత్రమూర్తులు. వారి వైదికధర్మతత్పరతయే మార్గదర్శకముగా నుండి ఆంధ్రకవిత్వమునకు సంస్కృతగౌరవము అధికముగా చేకూర్చినది. ఆంధ్రకవిత్వము అవతరించుటకు పూర్వమే అనేక కావ్యములు పుట్టిన కన్నడాది భాషలలోని కవిత్వమార్గములను, అనంతరము పుట్టిన మహారాష్ట్ర వంగాది భాషలలోని ప్రసిద్ధకవుల మార్గములను ఉత్తమాంధ్రకవుల మార్గములతో పోల్చిన విశేషభేదము గోచరించును. ఆంధ్రకవిత్వమునకు ఋషిమూర్తులయిన కవిత్రయము పెట్టిన వరవడి తప్ప ఎప్పటికప్పుడు కన్నడ మహారాష్ట్ర ద్రావిడ భాషాదుల కవిత్వమార్గములు చూచి వ్యామోహముతో అనుకరించుచు మరల ఆంధ్రకవిఋషిమార్గము చూచుకొని దిద్దుకొనుటయే ఆంధ్ర కవిత్వచరిత్రలో ప్రధానవిషయమని తజ్ఞులకు గోచరింపకమానదు. మాకున్న ముప్పదేండ్ల సాహిత్యానుభవములో వరుసగా ఇంగ్లీషు, వంగ, హిందీ, సోవియట్ రష్యా వాఙ్మయములు ఆంధ్రకవుల నెంతగా ఆకర్షించుచున్నవియు కన్ను

---

* ఈ శీర్షికతో తెలుగుకవులు వారి కావ్యములలో పలికిన మాటలనుబట్టి వారి కవితాదర్శములు వివరించుటకు ప్రయత్నించుచున్నాము.

లార కాంచుచున్నాము. కాని, ఉత్తమాంధ్రకవు లందరూ నేటివరకు కవిత్ర యము ఆర్షదృష్టి అలవరచుకున్నవారే అని ఘంటాపథముగా చెప్పగలము.

అట్టి మహాభారతములో ఎక్కువభాగము రచించినది తిక్కన సోమ యాజి. అతడు "భక్తి జనంబు వైదికధ్యాయిత కిచ్చ మెచ్చు భద్రాయితమూర్తి యైన పరతత్త్వమును, సకల బ్రహ్మము" నుపాసించువాడు. అతని పితృపాదు లగు కొమ్మనామాత్యుడు "సాంగవేదవేది." భగవంతు డతనికలలో "వైదికమార్గ నిష్ఠమగు వర్తనముం దగ నిర్వహించుచున్ భేదములేని భక్తి......తత్పర భావము కల్మి," "కావ్యరసముం గొనియాడుచు నుండ దెప్పుడున్" అని చెప్పి నాడు. "పరమధర్మప్రకారం" బని "సాత్యవతేయ సంస్మృతి శ్రీవిభవాస్పదం బయిన చిత్తముతోడ మహాకవిత్వదీక్షావిధి నొంది... పుణ్యప్రబంధంబు" ప్రారం భించినాడు. మరియు నా భారత మెట్టిది ?

"విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు గృ
ష్ణద్వైపాయనుఁ డర్థి "లోకహితనిష్ఠం బూని" కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యం బైన "యామ్నాయమున్."

"వేదములకు నఖిల స్మృతి
వాదములకు బహుపురాణవర్గంబులకున్
వాదైన చోటులకు దా
మూదల ధర్మార్థ కామ మోక్షస్థితికిన్.

ఇట్టి పీఠికారచన చేసి విరాటపర్వాదిగా మహాభారతము పూరించిన తిక్కనసోమయాజియు, నిర్వచనోత్తరరామాయణకర్తయగు తిక్కనయు నొక్కరా ? కారు. ఒకడు సోమయాజి తిక్కన. ఒకడు అమాత్య తిక్కన. ప్రాకృతదృష్టికి కనపడు దేహములు చూచినచో వారిద్దరు నొకటియే. కాని, తత్త్వదృష్ట్యా వారిద్దరు వేరు. ఇది పలువురు గమనించక తిక్కనామాత్యుని ఆదర్శములు తిక్కనసోమయాజికి అంటకట్టి పులిమి పుచ్చుచున్నారు, శబ్దరత్నా కరకారులు నాల్గవతరగతిలో వేసిన కంకంటి పాపరాజు రచించిన ఉత్తరరామా

యణమును, తిక్కనామాత్యుని నిర్వచనోత్తరరామాయణమును చదివిన రసికులను పెక్కురను పాపరాజుకృతి ఎక్కువ ఆకర్షించుట ఎరుగుదుము. కవులలో ధాన్యాదులవలె తరగతులు వేయుటయు, కవులలో ఒకరెక్కువ ఒకరు తక్కువ యనుటయు మాకంత సమ్మతము కాకపోయినను, పాపరాజుకృతికి తిక్కన కృతికంటె ఎక్కువవ్యాప్తి తెలుగుదేశములో నుండుట మనము గమనింపదగినది. తిక్కనసోమయాజి మహాభారతము వ్రాయునాటికి ఎట్టి పరిణతి పొందెనో, నిర్వచనోత్తరరామాయణము రచించిన తిక్కనామాత్యుని ఆదర్శములు పరిశించినచో మనకు ద్యోతమగును.

౨

నిర్వచనోత్తరరామాయణము రచించిన తిక్కన తాను అమాత్యుడనని ఎక్కడను గ్రంథములో చెప్పుకొనలేదు. కాని, అతడు "మంత్రి భాస్కరుని" మనుమడు, "కొమ్మనామాత్యుని" పుత్రుడు. మరియు మనుమసిద్ధి యాస్థానమున నుండి యతనిచే 'మామ'యని పిలిపించుకొనినవాడు. ఇన్నిటినిబట్టి అతని నామముచివరగూడ అమాత్యశబ్దముతో పూరించుచున్నాముకాని, ఆతడు 'తిక్కాంకుండ,' 'తిక్కననామధేయ' అనిమాత్రమే చెప్పికొన్నాడు. కాని అమాత్య శబ్దము మనము చేర్చి వ్యవహరించుట అసమంజసము కాదు.

తిక్కనామాత్యుని మతమున కావ్యనిర్మాణము ప్రధానముగా 'శిల్పము.'

"అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించు 'శిల్పము'నం
బారగుఁడం గళావిదుఁడ'-"

అతడు తాను కావ్యశిల్పమునందు పారగుడ ననియేకాక "కళావిదుడ"నని కూడ చెప్పుకొన్నాడు. ఉత్తమకావ్య కల్పనము శిల్పమును, కళయును కాకపోదు. అయితే కేవలము శిల్పకళ గల కావ్యము ఉత్తమకావ్య మనిపించుకొనదు. కాని అమాత్య తిక్కనకు శిల్పమే కావ్యాదర్శము.

కావ్యధోరణిలో నొకచోట నతడన్న శబ్దములనుబట్టి ఇది మేము చేయు దూరార్థకల్పన కాదు. కృతికర్తృనియమములని గ్రంథాదిలో నాతడు మొదట

పం(డ్రెండు పద్యములు చెప్పినాడు. వానియందం దంతటను ఈ భావమే ద్యోతము కాగలదు.

ఎఱ్ఱాప్రెగ్గడ కవిబ్రహ్మను వినుతించుచు "తన కావించిన సృష్టి త క్కొరులచేతం గాదు నానాముఖంబులం దాం బల్కిన పల్కు లాగమములై పొల్పొందునా వాణిభర్తకు సీతం డొకరుండనాం జను మహత్త్వాప్తిన్ గవి బ్రహ్మ నా వినుతింతున్ గవి తిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్" అని వర్ణించినదానిలో హరివంశకారుడగు ఎఱ్ఱాప్రెగ్గడకు ఎట్టి కవిత్వాదర్శము లున్నదియు గోచరించును. అందాతడు వినుతించునదియు తిక్కయజ్వ కాని తిక్కనామాత్యుడు కాడు. పూజ్యుడగు ఎఱ్ఱాప్రెగ్గడచే నింత పూజ్యముగా వర్ణింపబడిన తిక్కన నిర్వచనోత్తర రామాయణములో తన కృతి నియమము లేమని చెప్పుకొన్నాడు ?

"ఇంపారెడు పల్కులం బదయ నప్పులుకు ల్సరిగ్రుచ్చునట్లుగా
జేరుప నేరగా వలయు జేసెద నేం గృతి యిచ్చువారికిన్."

ఇది చిత్రకారులయు శిల్పులయు కళ కూడ కాదు, అంతకంటెను హీనమగు పుష్పమాలాకారుల నైపుణ్యము.

"తెలుగుకవిత్వము చెప్పందలచిన కాని యర్థమునకు, దగా యుండెడు మాటలు గాను" చిత్రకారుడు రంగులు కుంచెలు ఏరుకొన్నట్లే కవి మాటలు "ఏరుకొను"నట. వాగర్థముల అన్యోన్యాశ్రయత్వము ఇతనికి హృదయములో రూఢిగా లేదు.

మరియు నితనికి వళులు ప్రాసములు నిలుపుట ముఖ్యము. కావ్యశరీర నిర్మాణమునకు సంబంధించినదే ఇది. మహాకవి యతిప్రాసలు పద్యములలో నుండవలె ననుట విశేషము కాదు.

"సంస్కృతశబ్దము తెలుగుబడి విశేషంబు తేటపడంగాం బలుకు
నెడ లింగవచనంబులు భేదింపమి"కావలెను.

"జాత్యము గామి నొప్పయిన సంస్కృత మెయ్యెడఁ జొన్పను."

"గద్యము తోడుగఁ జెప్పిపెట్టను."

"ప్రాసము ప్రకారము వేఱగు నక్షరంబులన్ శ్రుత్యనురూపమం చిడను."

[ఈ నియమభంగ మొక్కచోట మాకు గోచరించినది.]

మరియు "సరస మధుర వచోగుంభన ప్రసాద సంబోధక గోచర బహువిధార్థ తాత్పర్యముగాన్" అనుచో వచోగుంభన కెక్కువ అభిమానము చూపినాడు. అట్లనుచు తుదకు,

"అలఁతి యలఁతి తునియలు గాహల సంధించిన విధంబు
నమరఁగవలయున్."

ఈ పద్యములో "కాహల సంధించిన విధంబు" అని "హల సంధించిన విధంబు" అనియు రెండుపాఠము లున్నట్లు తోచును. "హల సంధించిన విధంబు" మా కర్థము గాక 'కాహల'పాఠ మంగీకరించినాము. చిన్నముక్కలు కూర్చి ఒక వాద్యవిశేషము నిర్మించినట్లుగా పదపద్యంబులతో కావ్యము అమరించవలెనని తిక్కనామాత్యుని ఆశయమైనట్లు స్పష్టము. చిత్రకారుడు, శిల్పి, మాలాకారుడు, కాహలఘటికుడు, శబ్దగుంభనచతురుడు - ఇట్టివారితో నా కవిగా కవిని గూడ తిక్కనామాత్యుడు భావించినట్లు ద్యోతమగును.

కావ్యము ప్రధానముగా కళ యను భావము మరియు నక్కడక్కడ గోచరించును. కలికాలభూవిభుని వర్ణించుచు,

"సకల విద్యాపరిశ్రమముఁ దెల్పగనేల కవిసార్వభౌమాంక మవనిఁ
జెల్లు" అనియు,

శ్రీరాముని వర్ణించుచు నట్లే.

"సరస సాహిత్యవేదియై" యని వెంటనే "సకలకళల నెరిగి"
అని వర్ణించినాడు.

ప్రథమాశ్వాసాంతములో మనుమసిద్ధిని "కళాస్ఫారుండు" అని "పౌలస్త్యుండు - 'నిర్మలకళాస్ఫారీభవన్మూర్తి' అనియు అన్నాడు.

ఆదికావ్య శ్రవణసందర్భమునగూడ 'అభినవాకృతి యగు కృతి యగుటంజేసి యాత్మం గౌతుక మంతంత కగ్గలింప నమ్మునీశ్వరు చెప్పిన యాది కావ్యమయిన రామాయణము చెవులార వినుచు -

ఇట్లు కృతి యని కౌతుకప్రద మనియు ముఖ్యముగా వర్ణించినాడు. శ్రీరాముడు 'ఈ ప్రబంధమే మునికృత మన్నా'డట. మరియు కుకవి నిందలో వారిని దుర్విటులతో నిట్లు పోల్చినాడు.

"పలుకుల పొందులేక రసభంగము సేయుచుం బ్రాతవడ్డ మా
టలం దయ సేర్చుచూపి యొకటన్ హృదయం బలరింప లేకయే
పొలమును గానియట్టి క్రమముం దగ మెచ్చుగ నాకమెల్ల న
వ్వులం బొరయం జరించు కుకవుల్ ధర దుర్విటులట్ల చూడగాన్."

కుకవులు దుర్విటులవంటివారు. మరి తిక్కనామాత్యుని దృష్టిలో సత్కవులు విదగ్ధవిటులా ? అట్టి అభిప్రాయము తిక్కనకు అంటించుట మాకు సమ్మతము కాదు. కాని, అట్టి సందేహమునే బలపరచు సందర్భములు మరి కొన్ని కలవు.

కవిశిల్పులకు కవిత్వములో చమత్కృతి ప్రధానము. కవిత్వ విదగ్ధ విటులకు కవిత్వము ఒక విలాసము !

## 3

తిక్కనామాత్యుని కవిత్వము ఒక విలాసముగాను, కవులు రాజాస్థానములలో విలాసవస్తుకోటిలోనివారుగా పరిగణింప దగినవారుగాను తోచుచున్నట్లు కూడ నిర్వచనోత్తర రామాయణమువలన తెలియుచున్నది.

తాను "కవితావిలాసవిస్తర మహనీయుండ"నని కృతిప్రశంస మొదటి పద్యములోనే వర్ణించుకొన్నాడు. మరియు మనుమసిద్ధి "సరస బహుమాన విరచనాశాలి" యనియు తలంచి 'ఈ కృతికిం దొడవుగా' మనుమసిద్ధిని చేసి వంశ వర్ణన కుపక్రమించెను.

మనుమసిద్ధి "కరుణ దీనానాథ కవి బంధుజన చకోరములకు చంద్రా తపముగఁ జేసిన" దట.

మరియు నతడు "కవిహృదయ శుకప్రతతి సమాస్వాదనీయ రసికత వెలయన్" ఉదయించెనట. తృతీయాశ్వాసాంతములో నతనినే 'కవిలోక వస వసంతుడు' అనియు, షష్ఠాశ్వాసాంతములో 'కవీంద్రమందార'మనియు వర్ణించి నాడు. కవు లిట్లు ప్రభువులను వర్ణించుట ఆచారమైనది. కాని, తిక్కనా మాత్యుడు అంతటితో నాగక తరుమగా కవులను కావ్యసందర్భములలో విలాస వస్తుకోటిలో చేర్చినాడు.

కార్తవీర్యార్జునుడు "సరస కవి విట విదూషక పరిహాసక గాయకాది పరి జనము"లతో బయలుదేరినా డని వర్ణించి వారినే వర్ణించుచు నావల. (ఆ. 7. ప. 58.)

"తరుణీజనము వినోదపుఁ బరివారము మున్ను నడవఁ బనిచి విఱుందై పురమున కరుగ"

అని ఒక్కమాటలో సరసకవులు మొదలగువారిని 'వినోదపుఁ బరివార'మని తేల్చివేసినాడు. సరసకవుల ప్రక్కనే విట విదూషక పరిహాసకులను కూడ ఈ అమాత్యకవి చేర్చియుండుట గమనింపదగినది. వాల్మీకిని వ్యాసుని పలికిన నోట విట విదూషకులను ఎవరైన బలుకుదురా ? విట విదూషకతుల్యు లయిన కవులను గాక !

అట్టి దొక్క కార్తవీర్యార్జునుడే కాదు, శ్రీరాముడు ఈ విధముగా నిద్ర లేచెనట !

"రవి యుదయంబుకంటె మును రాజశిఖామణి మేలుకాంచె దా
నవకులమర్దనాంక సునినాదము లైన సురంగగీతముల్
వివిధగతి ప్రవర్తన నవీనములై సొగయింప మాగధ
ప్రవరులు పాడు మంజుమృదుభంగికి వీనులు దొల్త మేల్కనన్."

4)

ఈ పద్యములో సురంగగీతముల్ సొగయించినవను వర్ణన చూడవలెను కాని భట్టుకవిత్వము వర్ణింపబడినదని కొంద రనవచ్చును. కాని ఆ తర్వాత రెండవ పద్యములో కొలువున "కవులుం గవీంద్రులు నియోగులు వందిజనంబు లిష్టభృత్యులు మొదలైనవారలు" కొలిచినారని వర్ణించి కవీంద్రుల నెక్కడ చేర్చినాడో మనము గమనించదగినది.

మరియొకచోట శ్రీరామునే :

"మంత్రి భృత్య సుకవీశ్వరు లాదిగ నెల్లవారలున్ వచ్చి మహేశుఁ
గొల్చి"రని వర్ణించినాడు.

శ్రీరాముడే అగస్త్యుని దర్శించి అయోధ్యకు వచ్చి యచ్చట,

"సమయ కరణీయ కవిజన
సముదయ గోష్ఠీవినోద సారస్యా సం
గమునఁ దగఁ బ్రొద్దుపుచ్చె
న్సముచిత చతురాల్పపరిజనంబులతోడన్.

అని వర్ణించుచు శ్రీరామునికి కవిజనుల చతురత వినోదము కలిగించి ప్రొద్దు వుచ్చుటకు సాధన మైనదని వర్ణించినాడు.

ఈ వర్ణనలలో తిక్కనామాత్యుని దృష్టిలో సామాన్యకవులు ఉన్నారని కొందరు భావించవచ్చును. కాని, శ్రీమద్రామాయణమే ఆతనిదృష్టిలో నట్టిదిగా కనిపించినట్లు తలంచుటకుకూడ నాధారము కలదు.

వాల్మీకియే కుశలవులతో దానిని "గేయరసంబు నింపు నవకిల్బిషవర్ణము లందు మాగధశ్రీయలవద్ద కోవిదుల చిత్తము లార్ద్రిత పొందునట్లుగా'' పాడు డని చెప్పెను.

"సరసధ్వనిఁ బాడగ'' శ్రీరాముడు విని "తదీయ రసానుగుణప్రకర్ష మభినందింపన్"

"తఁచి మహేశులన్ మునులఁ దమ్ముల బంధుల సత్కవీంద్రులం గలల విదగ్ధులైన నట గాయక వైణిక వాంశికాదులం బిలువఁగఁ బంచి వైభవము పెంపెసలారఁగ వార లెల్లఁ దన్ గొలువగ నా కుశలవులకుం దగ దర్శన మిచ్చె"నట ! ఆహా ! సత్కవీంద్రులవెంటనే కలల విదగ్ధులైన నటగాయకాదులు శ్రీరామసభకు వచ్చినారు. ఇక వారు ఎట్లు పాడిరి ?

"రాముచరితంబు గేయాభిరామ మధుర
పదవిలాస మనోహర భావభంగిఁ
జతుర వాక్యార్థ సువ్యక్త సరసలీల
వివిధగతి...."

ఇట్లు పాడగా ఎవరి దని యడుగగా కుశలవులు దానిని 'రసోల్లాస మధురమగు దీని"దని శ్రీమద్రామాయణమును గూర్చి చెప్పినారు. పై వర్ణన లలో "పదవిలాస, చతురవాక్య, రసోల్లాస" శబ్దములు మనము ముఖ్యముగా గమనించదగినవి.

నన్నయభట్టారకుని ననుకరించుచు తిక్కనామాత్యుడును తన కావ్య మునుకూడ సంస్కృతశ్లోకముతో ప్రారంభించెను. కాని తెలుగుకవులకే ఉపాస్య దేవతయగు "శ్రీ" తిక్కనామాత్యుని ప్రథమశ్లోకములో మనుమసిద్ధీశ్వరుని భుజా స్తంభములోని సాలభంజికగా మారిపోయినది. అప్పటికి తిక్కనకు శ్రీ స్వరూపము మాటుపడియే యున్నదనుటలో సందేహ ముండరాదు.

ఏ జాతిలోనైనను క్షీణదశ ప్రారంభించినపిమ్మట శిల్పకవులును ఇంకను క్షీణించినపిమ్మట విలాసకవులును విశేషజనాదరపాత్రు లగుదురు. నేటి పాశ్చాత్యదేశములలో అట్టి కవులకున్న ఆదరమునుబట్టి పాశ్చాత్యదేశముల బలము క్షీణప్రాయముగా నున్నదని మన మనుమేయించుట సత్యదూరముకాదు. భారతజాతి క్షీణప్రాయ మైననాటనుండియు కవులు విలాసప్రియులుగాను, నట విట తుల్యులుగాను ఉండవలెనను దురూహ వ్యాపించి మహాకవి కాళిదాసుకు

స్త్రీలౌల్యము ఆరోపించి కథ లల్లినారు. అట్లే తిక్కనకుకూడ తెల్లవారుజామున వారస్త్రీగృహమునుండి వచ్చుచు రాజదూతలను చూచినట్లు మొదలగు నైతిహ్యము మన తెలుగుదేశములో అల్లినారు. ఆ ఐతిహ్యము కల్పించినవారి ఉద్దేశము నన్నయకవనమునకు తిక్కన రంగువేసినా డనియేకాని తిక్కన వేశ్యాలోలుపత వర్ణించుట కానేరదు. కాని, ఆ కథాకల్పన చేసినవాడు నిర్వచనోత్తర రామాయణములోని తిక్కనామాత్యుని కవితాదర్శములు సూక్ష్మముగా పరిశీలించెనేమో!

ఈ చతురకవి, శిల్పికవి, విలాసకవి అగు అమాత్య తిక్కన, తిక్కన సోమయాజిగా నెట్లు మారిపోయెను? దానికి బీజ మేమైనను అమాత్య తిక్కనలో గూడ గోచరించునా? నిర్భయముగా గోచరించును.

"ఎత్తటినైనను ధీరోదాత్తనృపోత్తముఁడు రామధరణీపతి స
ద్వృత్తము సంభావ్య మగుట..."

నీ కావ్యరచన ప్రారంభించెను. దానినే వాల్మీకిచేత "పావనమగు నృపుచరితము" అనిపించినాడు.

మరియు నతడు 'శిల్పమునం బారగుడం గళావిదుఁడ'నన్న పద్యముననే 'అమలోదాత్తమనీష' ననియు, తాను 'మహేశ్వరాంఘ్రికమలధ్యానైకశీలుండ' ననియు, 'సన్మాన్యుఁడన్' అనియు చెప్పుకొన్నాడు. ఆశ్వాసాంతగద్యములలో 'బుధారాధనవిధేయుఁడ' నన్నాడు.

కుశలవులకు శ్రీరాముడు రత్నాది బహుమానము లీయబోగా నవియొల్లక "అసమ భవద్గుణస్తుతికథైకపరత్వవిభూతి చాలదే"అందురు. వారే 'మధురమగు దీని నుపాసింతుము' అన్నారు.

తిక్కనామాత్యుని కున్న బుధారాధనవిధేయతయు, సన్మాన్యతయు పెంపొంది అమలోదాత్తమనీషను వృద్ధిచేసి పావనచరిత్రకథనమందు ఆదరము కలి

గించి కావ్యోపాసకునిగా జేసినవి. అన్నిటికంటెను అతని 'మహేశ్వరాంఘ్రి కమలధ్యానైక శీలత' అతనిచే సోమయాగము చేయించి ఆర్షధర్మనిష్ఠ స్థిరము చేసినది. అంతట పురోడాశపవిత్రమైన అతనివాక్కున ఆంధ్రమహాభారతము విరాటపర్వాదిగా తెలుగుభూమికి ప్రసాదించునట్లనుగ్రహించినది.

మధ్యమధ్య తలచూపుచున్నను అతని సోమయాజి తిక్కన తన స్వాధీనములో నుంచుకొనగలిగినాడు.

ఆంధ్రమహాభారతరచన ప్రారంభించిన పిమ్మటగూడ నమాత్య తిక్కన ఋషికల్పుడయిన తిక్కన సోమయాజి కవితాదర్శములు మరియొకమారు ఉగ్గడించి మావాక్కు పవిత్రము చేసికొనగలము.

# విమర్శకుల మామూలు పొరబాట్లు

## నాటక విమర్శకులు

౧

ఎవరిఅభిప్రాయము వారు చెప్పడానికి స్వాతంత్ర్య మున్నది. కాని, వినే వారికి కూడా ప్రతివారు చెప్పే మాటా విన మనడానికికూడా స్వాతంత్ర్య మున్నది. ఇప్పుడు "వినదగు నెవ్వరు చెప్పిన" అను సూక్తి ఆచరణలో పెట్టే వారు అధిక సంఖ్యాకులుగా ఉన్నందున వినేవారు తగినంతగా తమ స్వాతంత్ర్యము వినియోగించడము లేదు. సమగ్రమైన సమర్థత అటుంచి, కొంచెము దూరమైనా దృష్టి సారించక చేసే విమర్శకులను దృష్టిలో ఉంచుకొని ఈ వ్యాస సంచయము ప్రారంభిస్తున్నాము. సమగ్రదృష్టిగల పండితవిమర్శకులు ఇవి చదవ నక్కరలేదని వినయపూర్వకముగా ముందు మనవి చేసుకుంటున్నాము! కావ్యములలో నాటకము ఉత్తమమైనదే కాక సర్వసామాన్యమైనదికూడా కాబట్టి నాటకవిమర్శకుల పొరపాట్లు ముందు ప్రారంభిస్తున్నాము.

అన్నిటిలో సర్వసామాన్యమైన పొరబాటు, ప్రయోగయోగ్యముకాని నాటకము పనికిమాలిన దనడము! దీనికి మొదటికారణము: ఇంగ్లీషులో పాఠ్యపుస్తకాలు వ్రాసే విమర్శకులు తరుచుగా ఆ పొరపాటుమాట అనడమే! ఈ సామాన్య విమర్శకులకు ఆ పాఠ్యపుస్తకాల మాటలు ఎక్కించడము కంటె ఎక్కువ విచక్షణ ఉండదు.

వీరు ఉదాహరణ మిచ్చినా ఇంగ్లీషునాటకాల ఉదాహరణకంటె ఇందులో "నాటక" శబ్దము వ్యుత్పత్తిని చూచినా నటింపబడునది నాటకముగనుక ప్రదర్శన యోగ్యము కానిది నాటక మనడము ఎట్లా భావ్యమని మమ్ము సరసు లడిగితే దానిని కాదనము. సంభాషణరూపముగా ఉన్న గ్రంథమొకటి వ్రాసినాడు. అది ప్రయోగార్హము కాదనుకుందాము. అయినా రమణీయముగా ఉంటే దానిని

ఉత్తమకావ్య మెందు కనగూడదు ? అంతమాత్రముచేత ఆ కావ్యము పనికిమాలిన దవుతుందా ?

అంతే కాదు ! ఈ ప్రయోగార్హత అనేది కూడా సులభముగా నిర్వచించడానికి సాధ్యమైనది కాదు. ఇది ఏ నాటకరంగములో ప్రయోగార్హము కాదు ? ఇప్పుడు 'కంపెనీడ్రామా నాటకాలు' వీథి నాటకరంగములో ప్రయోగార్హములా? అవీ ఇవీ పూర్వప్రభువులు, ధనికులు ఏర్పాటుచేసే సహృదయుల పరిషత్తులలో ప్రయోగించ సాధ్యములా ? మే మెరిగినప్పటినుంచీ ఇంతవరకూ నాటకరంగము ఎన్నో మార్పులు చెందుతున్నది. ఐనా ఇన్ని రకరకముల నాటకరంగములూ ఇప్పటికీ ఏదో ఒకమూల ఉండనే ఉన్నవి.

నాటకము ఉజ్జ్వల మైనదైతే, రంగమూ, ప్రదర్శనపద్ధతీ మార్పు చేసే సమర్థత ప్రదర్శకులకు ఉండవలె ! అసమగ్రమైన రంగస్థలము, సంస్కారము లేని నటులు, శుంఠాగ్రేసరచక్రవర్తులు ఐన ప్రేక్షకులు రంగస్థలమును బుద్ధిలో ఉంచుకొని అక్కడ ప్రదర్శనయోగ్యము కాకపోవుటచే నాటకమే ప్రదర్శనయోగ్యము కాదని తీసివేయడము సమంజసమా ?

విద్వాంసులకుమాత్రమే ప్రదర్శనయోగ్యమైన నాటక ముండవచ్చును. సూక్ష్మమైన హృదయస్పందనములు గ్రహించగల ప్రేక్షకుల ఎదుటనే ప్రదర్శింపదగిన నాటకము లుండవచ్చును. ఇట్టి భేదము లెన్నియైన నూహించుకోవచ్చును. మనకు ప్రస్తుతము కనబడుచున్న రంగాదులు కొలబద్దగా పెట్టుకొని ఏదైనా ఒక నాటకము ప్రదర్శన యోగ్యము కాదనడము పెద్ద పొరపాటు !

పెద్ద వజ్రము తెచ్చి "ఇద్ది నా ప్రియురాలి ముక్కుపుడకకు పెద్దదైనది పనికిరా"దని పారవేయుట, సున్నపు గానుగరాయికి చిన్నదై వృథా ఐనదని పారవేయుట ఎట్టి విచక్షణ తెలుపునో పై విమర్శలు కూడా అట్టివే !

౨

నాటకవిమర్శకులు తరుచుగా చేసే తప్పు ఇంకా ఇంకొక్కటి ఉన్నది. దానిని ముప్పిరితప్పు అని వర్ణించవచ్చును. "నాటకములో పద్యము లుండవచ్చునా ? పాట లుండవచ్చునా ? వచననాటకము లుండవచ్చునా ? పద్యనాట

కము లుండవచ్చునా ? గీతి నాటకము లుండవచ్చునా ? ఈ ఐదు ప్రశ్నలూ అనవసరమే ! ప్రశ్నలు ఐదైనా వచనము, పద్యము, పాట - ఈ మూడిటి మేళనకు సంబంధించినది కాబట్టి దీనిని ముప్పిరితప్పు అన్నాము.

కొన్ని చక్కని పద్యనాటకము లున్నవి. ఎన్నో మంచి వచననాటకము లున్నవి. అందులో పద్యములు కలిసినవి, పాటలు కలిసినవి, పద్యములు పాటలు కలిసినవి లెక్కకు మించి ఉన్నవి. వచనములో నాటక మున్నంత మాత్రముచేత సహృదయుల మెప్పించు రస మందులో ఉండదనుకొనరాదు. పద్యములో ఉన్నంతమాత్రముచేత వాస్తవేతరముగా ఉంటుందనరాదు. పాట ఉన్నంతమాత్రముచేత పాటకచేరిగా మారిపోదు. గీతి నాటక మైనంతమాత్రము చేత నాటకయోగ్యత పోదు. దేని శక్తి దాని కుండును. నాటకములో అనేక విధ ముల ప్రతిభ ద్యోతము చేయవచ్చును. వచనములో సాధారణమైన చమత్కారము చూపవచ్చును. కవిత్వములో అసాధారణమైన అలౌకికత చిత్రింపవచ్చును. పాటలో మధురమైన తన్మయత ప్రదర్శింపవచ్చును.

నాటకప్రదర్శనము చూడ వచ్చేవారు రంగస్థలమునకు వస్తున్నామనీ, నటకుల నటన చూస్తున్నామనీ ఎన్నడన్నా మరచిపోతారా ? కాబట్టి వాస్తవిక తకు హద్దు ఉన్నది. అయితే అంతమాత్రముచేత అసందర్భములు చొప్పించ వచ్చునని కాదు. నాటకము ఒక కొత్త జగత్తును సృష్టిస్తుంది. అది సృష్టించే జగత్తులో మాత్రము పరస్పరవిరోధము రానీయరాదు. అట్లు చేసినచో రస భంగము కలుగుతుంది. కాళిదాసుకాలంలో పురూరవుడువంటి రాజులూ, ఊర్వశి వంటి దారలూ మధ్యమధ్య పద్యాలలో మాట్లాడుకొనేవారా ? అని ప్రశ్నించ వచ్చునా ? పురుషులు సంస్కృతములో ప్రశ్నిస్తే స్త్రీలు ప్రాకృతములో జవాబు చెప్పేవారా ఏ కాలములోనైనా ? కాక శ్రీ శివశంకరశాస్త్రి పద్మావతీ జయదే వులు, కవులుగనుక పోనీ పద్యాలలోనే సంభాషించినా రనుకొన్నా, వాళ్ళు తెలుగుపద్యాలలో మాట్లాడుకొనేవారా ? అని అడుగవచ్చునా ?

నాటకస్వరూపము తెలియని రసహీనులు తప్ప అట్టి ప్రశ్నలు వేయరు. ఈ ముప్పిరితప్పుకు పాలుపడే విమర్శకుల నందరినీ మరి ఎందులో జమ కట్టవలె ?!

## 3

మనదేశములో పెద్దలు రంగముమీద ప్రదర్శించరానివిగా కొన్ని చెప్పి నారు. ముద్దు పెట్టుకొనుట, భోజనము, యుద్ధము, మరణము వానిలోవి. ఈ నిషేధములు పనికిరావని నేటి విమర్శకులు అనుట పెద్దతప్పు. వారనేది ఏమంటే ఒక్కొక్క సినిమాలో చూపే ముద్దు చూడడానికి, ఆ శబ్దము వినడానికి జనము పొర్లబడుతున్నారే— సర్వ జనాకర్షకమే కాక సర్వజనానుభవ సిద్ధమైన ముద్దు రంగస్థలముపైన మాత్రము ఎందుకు ప్రదర్శింపరాదు? అని. పౌండరీక మనే మహాక్రతువులో పందిరిమైథున మని ఒకటి ఉంటుందంటారు. దాని కానాడు జనము పొర్లబడ వచ్చినట్లు ఏనాడూ ఆ యజ్ఞము ముఖము చూడడానికి రారుట. జనాకర్షణమే నాటకపరమావధి ఐతే సంభోగముకూడ రంగముమీద ప్రదర్శించడానికి అభ్యంతర ముండరాదు. ఉత్తమమైన సభ్యత కలవారికి రంగముమీద చూచినప్పుడు "ముద్దు" కూడా విరసముగా కనపడుతుంది. అట్లాగే భోజనము జుగుప్సాకరముగాను, యుద్ధము భయప్రదముగాను, మర ణము అసహ్యముగాను కనిపిస్తవి. చుంబనాదులు నిషేధించే నాటకాలలో ఒక ఉదాత్తమయిన సత్యమున్నది. కాబట్టి ఆ నిషేధాలు పూర్తిగా తీసివేయరాదు.

ఇంకా పెద్దల నియమము లెన్నో ఉన్నవి. కథానాయకులుగా కొన్ని నాటకములలో ఉత్తమపాత్రలే కాని నీచపాత్రలు పనికిరా రందురు. ఈ నియ మము పొరపాటనడము పొరపాటు. ఉత్తమ నాటకముల పరమాదర్శము సామాన్యజనులను రంజింపచేసి వారి సామాన్యబుద్ధిని ఉదాత్తవీథులలో విహ రింపజేయడమే. అట్టిది నీచపాత్రల ఆధారముతో సాధ్యమా?

నాటకము విషాదాంతముగా ఉండగూడదని మన పెద్దల నియమము. విషాదాంతములే కాక విషాదనాటకములే ఉత్తమోత్తమ కావ్యము లని అరి స్టాటిల్ మతముగా కనపడుతుంది. రసముల కన్నిటికి శాంతరసము తల్లి అని అనుభవమున్న సాత్త్వికస్వభావము కలవారికి విషాదాంతకావ్యములు పనికి రావు. అటుకాక కేవలము తామసబుద్ధులకు మద్యపానమువలె మత్తెక్కించి సర్వరసవిరమణ కలిగించి శాంత్యాభాసకు కారణమైన విషాద విషాదాంతనాటక ములు అభిమానపాత్రము లవుతవి. దైవీసంపత్తు గలవారి కొకజాతి నాటకము,

ఆసురసంపత్తి కలవారికి రెండవరకము నాటకము పనికివస్తుందని నిర్వచిస్తే ఈ సందర్భంలో విమర్శకులు చేసే విమర్శలన్నీ కట్టుబడవచ్చునని ఆశింతును.

౪

ఆ కాలములో ఉన్న రంగముమీద ప్రదర్శనయోగ్యమై ఆకాలపు ప్రేక్షకులను రంజింపజేసినంతమాత్రముచేత నాటకము కృతార్థమైనట్లే భావించుట మరియొక తప్పు. నాటకము కావ్యభేదములలో ఒకటి. ఉత్తమకావ్యములందుండవలసిన సామాన్యలక్షణము లన్నీ ఉత్తమనాటకములకు కూడా ఉండవలెనని విమర్శకులు మరచిపోరాదు. నాటకకర్తలు కేవల వినోదకుల జాతిలోనివారు కారు. అటుగాక వారు ఋషితుల్యులయిన కావ్యకర్తలు. సమ్యగ్దృష్టి లేని విమర్శకులు కొన్ని సూత్రములు పెట్టుకొని వానితో కొలిచి ఆ కొలతలకు సరిపడని నాటకములను త్రోసిపుచ్చుట ముఖ్యముగా ఈమధ్య వెలువడిన ఏకాంకనాటకాలు విమర్శకులలో ఎంతయినా కనిపించినది.

ఇక పెద్దనాటకములకు సామాన్యముగా ఉండు భాగాలు చిన్న నాటికలకు అన్వయించడము మరొక సామాన్యపు తప్పు. ఏకాంకనాటికలను ఆదిమధ్యావసానములే కాని పంచభాగము లుండవు. కొన్నిటిలో అంతమే ఆదిమధ్యాంతములుగా ఉండవచ్చును. కాక కొన్నిటిలో అద్యంతములే ఉండవచ్చును. ఇందులో ఏదీ లేనివికూడా ఉండవచ్చును.

పాశ్చాత్య నాటకాలలో ఉండే ఐదు భాగాలు ఆలంకారికులు చెప్పిన పంచసంధులతో ముడిపెట్టడానికి ప్రయత్నించడము అన్నిటికంటె పెద్ద తప్పు.

ఈ కాలములో నాటికలు త్రొక్కుతున్న త్రోవలు అనంతములు. నాటికారచన ప్రపంచమంతట విజృంభిస్తున్నది. నాటికలు ఈనాటి వాఙ్మయములో ప్రత్యేకస్థాన మాక్రమిస్తున్నవి. నాటికారచనలో తెలుగుదేశము ఏ మాత్రము వెనకపడలేదు. ప్రపంచములో ఏ దేశములో పుట్టుతున్న ఎట్టి ఉత్తమ నాటికతో నైనా తులతూగగల నాటికలు తెలుగులో పుట్టినవి.

మరియొక విశేష మున్నది. ఈ నాటికలు నేటి రంగస్థలముకంటె, నటులకంటె, సామాన్య ప్రేక్షకులకంటె— విమర్శకులకంటె కూడా చాలా ముందడుగు వేసి ఉన్నవి. ఇది గమనించకపోవడము విమర్శకుల తప్పు లన్నిటిలో పెద్ద తప్పు!

౨౪

నాటకరచన సంగతి సూక్ష్మముగా పాత్రధారణకు రంగనిర్మాణమునకు సంబంధించిన విమర్శకుల తప్పులు ఒకటిరెండు మాత్రము స్మరిద్దాము.

స్త్రీపాత్రలు పురుషులు ధరించరాదను వాద మొకటి పెద్ద తప్పు. స్త్రీ పాత్రలు ధరించిన పురుషులు పలువురు కట్టెవారిన శరీరాలతో, బొంగురుగొంతుకలతో కొజ్జాలను అనుకరించి ఏవగింపు కలిగిస్తున్నా రనడము సత్యదూరము కాదు. కాని, కొందరు వారి నటనాకౌశలముచే సామాజికులను మరపింపజేయు శక్తిగలవా రున్నారు. మరి ఒక స్త్రీపాత్రలు ధరించు స్త్రీలో? పలువురు వారిలో సామాజికులను మెప్పించువా రున్నారు. కాని, వారు ధరించు పాత్రనిర్వహణము చేతనా వారాకర్షించునది ? లేక తద్భిన్నమైన తమ దేహాకర్షణ చేతనూ, కామోద్దీపక మైన కంఠము చేతనా ? అను ప్రశ్న వేసుకుంటే విమర్శకులు తమతప్పు తెలుసుకొంటారు.

రంగపరికరములు విశేషముగా వృద్ధి కానిది నాటకప్రదర్శనము వృద్ధి కాదనుకోవడము విమర్శకుల మరొక తప్పు. రంగపరికరములు వృద్ధి ఐనకొద్దీ ప్రదర్శనము వాస్తవమనే భ్రాంతి బలవత్తరము చేయవచ్చునని అట్టివారి భ్రాంతి. మితిమీరి చేయకపోతే అట్టి భ్రాంతి కలిగించవలెనని ప్రయత్నించడము పొరపాటు కాదు. కాని ధనవ్యయము ఎక్కువ చేయలేని మనదేశములో రంగ పరికరములు పాశ్చాత్యదేశములలోవలె వృద్ధిచేసుకోవలెనంటే సాధ్యము కాదని మనము తెలుసుకోవలె. మన దేశములోని సామాజికులకు ధనము తక్కువైనా సంస్కారధనమూ, ఊహాధనమూ, కల్పనాధనమూ విశేషముగా నున్నవి. కాబట్టి బహు స్వల్పపరికరములతో బహు ఉదాత్తమని రక్తి మన నాట్యరంగము పైన కట్టించవచ్చును. అందుచేత పరికరబాహుళ్యముమీద కాక పరికర సంకోచముమీద ధ్యాన ముంచుకొని నాటకప్రదర్శకులు పనిచేసినచో నాటకరంగము భరతముని భావించిన ఉత్తమభావమునకు ప్రేక్షకులను తీసికొనిపోగలుగుదురు.

ఇది మాటిమాటికి చెప్పక మరుగుపడుట విమర్శకుల పెద్ద పొరపాటు :

---

# కవితలో ముసలితనము

౧

దేహములో ముసలితనము ప్రవేశించినదంటే పటుత్వము తగ్గినది. స్వతస్సిద్ధమైన శక్తిలేక, కర్రమీదనో, మరి ఒక దేహముమీదనో ఆధారపడవలసి వచ్చిన దన్నమాటే. ముసలివారి చర్మము నున్నగా ఉండక ముడతలు పడిపోతుంది. దేహముకూడా వంకరలు తిరిగిపోతుంది. ముసలిదేహమంటే పని చాలించడానికి సిద్ధముగా ఉండి తన నిలకడకే పరాధీనమై ఉన్నదన్నమాటే కదా!

అయితే కవితకు ముసలితనమంటే ఏమిటి? కవిత్వానికికూడా మృత్యువున్నదా? మనదృష్టికి కనపడే దూరంలో దానికి మృత్యువులేదు. కనుక దానికి మృత్యువు లేదే అనుకుందాము. పోనీ దానిని మన దేహములతో పోల్చక జీవనదులతో పోలుద్దాము!

మన కృష్ణా గోదావరీ నదులు ఎండాకాలములో ఏ విధంగా ఉంటవి! అందులో రసప్రవాహము క్షీణించి ఏదోవిధముగా నిలిచి ఉండటానికి మెలికలు తిరిగి ఇసుకతిన్నెలు ప్రదక్షిణాలు చేసి అతిప్రయత్నంమీద నూతనజీవము వచ్చేదాకా నిలుపుకుంటుంది! ఏ దేశము కవిత్వమైనా ఒక మహాప్రవాహముతో పోలిస్తే ఆ ప్రవాహానికిగూడా కృష్ణా గోదావరులకు వలె ఎండకాలములు ఉంటవి. ఆ సమయములలో దానికి వార్ధక్యము వచ్చిన దనవచ్చును. అట్టిదానిని ఆంగ్లేయులు డికెడెన్సు (Decadence) అంటారు.

౨

ఈ వార్ధక్యలక్షణా లేవి? దేహానికీ, నదులకూ పట్టిన లక్షణాలు ఈ కవిత్వానికి అన్వయిస్తవి.

మహాకవులవాక్కులకు స్వతస్సిద్ధముగా హృదయంగమత్వ మున్నది. వారు తమభావము సూటిగా చెప్పితే కవిత్వము కాకపోతుందని భయపడరు. వారి వాక్యములుగాని, భావములుగాని మెలికలు తిరగవు. వంకర టింకరలుగా

ప్రసరించి, ఎక్కడో పుట్టి, ఎక్కడో మాయము కావు. వాల్మీకి, వ్యాసుడే కాదు, ఇట్టి రచనలు చేయగలిగినది. కాళిదాసురచనలు కూడా అట్టివే. వారు వృద్ధు లయినపిమ్మటనే వ్రాసినారేమో కాని వారికవిత్వానికి మాత్రము వార్ధక్యము సంక్రమించలేదు.

ఈ కాలములో యువకు లైనవారు చెప్పు కవిత్వము తరుచుగా ఈ వార్ధక్య లక్షణాలతో నిండి ఉన్నది. వారి దేహములలో చిత్రముగా యౌవనము తొణికిసలాడుతుంది. కంఠధ్వనిలో నిర్భయత్వము వ్యక్తమవుతుంది. కాని, రచనలు కేవలము నీరసములు అవి ఆకర్షకమైన ముఖభంగిమతో, కన్నుల అభినయముతో, గొంతునొక్కులతో వారు చదివి వినిపించినప్పుడేకాని బాగున్నట్లు తోచవు.

తెలుగుకవిత్వములో ఈ వార్ధక్యము భావకవిత్వముతోనే ప్రారంభించినది. దానితోపాటు అట్టి విమర్శకలోకమే పెరిగిపోయింది. వంకరలే, మెలికలే, జిలుగులే, నగిషీలే ఈ విమర్శకబ్రువులకు ఉత్తమకవితగా కనిపిస్తుంది.

3

నాగబంధములోనో, రథబంధములోనే అమరునట్లు వ్రాసినది కవిత కాదా ? చిత్రమైన అక్షరములకూర్పుతో వ్రాసిన పద్యములు కవిత్వము కాదా ? భావములు చిత్రవిచిత్రములుగా ప్రసరించునట్లు చెప్పినది కవిత్వము కాదా ?— అవును. అన్నీ కవిత్వ మనవచ్చును. ఈ మూడూ ఒకేజాతి కవిత్వమే : ముసలితనము మూర్తీభవించిన కవిత్వము.

నెరసిన వెండ్రుకలకు రంగువేసి ముడుతలుపడిన చర్మముమీద బెందడి పట్టించి నిలవలేని దేహము రంగులచేతికర్ర ఆధారముగా నిలువబెట్టి, దేహములోని వంకరలు త్రిభంగిలలితముగా ఉండవలెనని ప్రయత్నించు తొంభైఏళ్ళ వృద్ధయౌవనముకూడా ఈ కవిత్వము వంటిదే !

వ్యయసంవత్సరము వస్తున్నది. ఈ వ్యయసంవత్సరముతో నయినా తెలుగుకవిత్వము అవ్యయమార్గము పట్టవలెననే ఆశయముతో ఈ ఢంకానాదము మున్మారు చేస్తున్నాము.

—o—

# శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

"పూవుం జిమ్మలు తేనెవాకలు రసంపుంబల్కు లానంద మో
హావేశమ్ములు నీవు పెట్టినది పేరన్నా ! భవద్గాన వీ
ణా వైశద్యము సన్నగించి, గళితానందాశ్రురేఖా వ్యథా
భావమ్ముల్ వెలిబుచ్చ వేమిటికి నీ పాటల్ వయష్షట్పదా !"

"రోలంబేశ్వర ! నీది నిర్జరవయోరూపంబు శృంగార ల
క్ష్మీలీలారసపట్టభద్రుడవునున్ మేలే ! యిటుల్ వంతచే
వ్రాలంగా గత మేమి ? లో మరచితో స్వాతంత్ర్య కల్యాణగా
నాలీలామృత గీతికాక్షర సమామ్నాయంబు ప్రాయంబునన్ !"

అది 1922, 23 ప్రాంతము. బెజవాడలో శారదాభాండార ప్రెస్సుకు వెళ్ళగా, అక్కడ ప్రెస్సుమేనేజరు శ్రీ కొడాలి ఆంజనేయులు, శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, శ్రీ శివశంకరశాస్త్రి ఇత్యాది కవిమిత్రులు కలిసినారు. అదే నేను శ్రీ విశ్వనాథను ప్రథమపర్యాయము కలసికొనుట. కవిగా అప్పటి కాయనపేరు బందరంతా మారుమ్రోగుతున్నా, బయటిప్రపంచానికి తగినంతగా ప్రాకలేదు. అందరమూ ఉత్సాహంగా సాహిత్యప్రసంగంలో పడియున్న సమయంలో అప్పటికి రాబోతున్న సాహితీ తృతీయసంపుటము ప్రథమసంచికకు పద్యాలు వ్రాసిపెట్టమని శ్రీ శి.శం. శాస్త్రి శ్రీ విశ్వనాథను తొందరచేస్తున్నాడు. కొంత సేపటికి ఆయనను శ్రీ శాస్త్రి, ఆంజనేయులు ఆదరముతో ప్రేమతో ప్రెస్సు వెనకభాగంలో ఉన్న గదిలోనికి పంపినారు. ఇష్టం లేకుండానే వెళ్ళి తిరిగి అరగంటలో ఉత్సాహంతో, ఎర్రపడ్డ ముఖంతో శ్రీ విశ్వనాథ మామధ్య ప్రత్యక్ష మైనాడు. అప్పుడే వ్రాయడ మైనదా అని ఆశ్చర్యంతో అడిగేలోప లనే ఆరుపద్యాల ఖండకావ్యము వినిపించి ప్రచురణకు శ్రీ శాస్త్రికి ఇచ్చినాడు. అందులో మొదటిదీ, చివరిదీ పైన ఉదాహరింపబడ్డవి. మధ్య రెండు సీస పద్యాలుకూడా ఉన్నవి. అప్పటి కింకా శ్రీ ఆంజనేయులుతో జంటకవనము మానలేదు గనుక "సత్యాంజనేయులు" పేర "విపర్యాసము" అనే శీర్షికతో సాహి

తిలో అవి ప్రచురింపబడ్డవి. అప్పటికి శ్రీ విశ్వనాథకు పాతికేళ్లు ఉన్నట్లు జ్ఞాపకము. పద్యాలలోకూడా ఆ వయస్సునే సూచించే "నిర్జరవయోరూపంబు" అనే పదప్రయోగ మున్నది. ఆ వయస్సుకే శ్రీ విశ్వనాథకు శబ్దముమీద ఎంత అధికారమూ, భావనలో ఎంత పరిణతీ సుస్థిరమైనదో ఆ పద్యాలు ప్రదర్శిస్తవి. ఆ జన్మము కవులయినవానికేగాని అది సాధ్యము కాదు.

ఆ తర్వాత ఆయనను కలిసినది కొద్దికాలమునకే తెనాలిలో జరిగిన సాహితీసమితి సమావేశములో. ఆ సమావేశము ఒక విధంగా అపూర్వమైనది. దానికి శ్రీయుతులు శివశంకరులు, విశ్వనాథ, దేవులపల్లి, వేమల, నండూరి, కొడాలి ఆంజనేయులు, చింతా దీక్షితులు, త్రిపురారిభట్ల, శ్రీనివాస శిరోమణి ఇత్యాదు లెందరో వచ్చినారు. అప్పటికి రచయితగా పరిణమించని శ్రీ గుడిపాటి, కొత్తగా పద్యరచన సాగిస్తున్న పెనుమర్తి వెంకటరత్నం ఉత్సాహవంతులగు ప్రేక్షకులుగా ప్రతిసమావేశానికీ హాజరైనారు. సమితి కాన్‌స్టిట్యూషను సిద్ధము చేయడానికి జరిగిన తర్జనభర్జనలూ నాకేకాక, శ్రీదీక్షితులుకుకూడా వచ్చిన కోపతాపాలు, రాజీనామా లిస్తామనే బెదరింపులు లీలగా జ్ఞాపకమున్నవి. అప్పటినుంచీ 1962 లో నేను ఒక్కడనే తయారుచేసి సమితిచేత అంగీకరింప జేసేవరకూ సమితి వ్రాతపూర్వకముగా లేని నియమావళితోనే నడిచింది.

ఆ సభల కార్యక్రమాలకంటె నా మనస్సులో స్థిరముగా నిలిచియున్నది వచ్చిన వారము తీరిక సమయాలలో ఒకరితో ఒకరము ఇష్టాగోష్ఠిగా చేసుకున్న సంభాషణలు.

శ్రీ విశ్వనాథకు తిక్కనసోమయాజుల కవితారీతులమీద నాతోపాటు అభిమానము పొంగిపొరలుతున్న రోజులవి. ఇప్పటివలెనే అప్పుడుకూడా శ్రీ శివశంకరులకు శ్రీనాథునిరీతిమీద విశేషాభిమానము. ఒకవంక శివశంకరులు శ్రీనాథునిపద్యాలు వినిపిస్తుంటే, వాటికి దీటైన పద్యాలు నేనూ శ్రీవిశ్వనాథ సోమయాజుల రచనలోనుండి వినిపించినట్లు జ్ఞాపకము. సోమయాజులు బహువిధముల పోకడలు పోగా వానిలో కొన్నికొన్నిటినే శ్రీనాథాదులు గ్రహించి విస్తరించినారని మా వాదము. ఆ రోజులలో శ్రీ విశ్వనాథకు సోమయాజుల

రచనయందు ఎంత గాఢాభిమాన ముండేదో గిరికుమార నామముతో ప్రచురించిన తిక్కన ప్రశంసాపద్యాలలో స్పష్టపడుతుంది.

"తెరల నెత్తెడు దింపెడు తెరలు పొరలు
చున్ననే వాఙ్నదీవారి యొరపు మిగిలి
యస్మదాదిక శిష్యహంసాలి ముక్కు
కొనల తడుపుచు తా ముంచుకొనుగు మసరు !"

సత్యాంజనేయుల జంటకవనము నుండి విడివడే రోజులలో ముందు ఆయన "గిరికుమార" అనే లేఖినీ నామము ధరించాడు. మేమా రోజులలో ఆయనను ముఖ్యంగా గిరికుమారుడనే నిర్దేశించేవారము. పొంగులు వారుతున్న యౌవనంలో ఆయన స్వీకరించిన "గిరికుమార" నామము ఆయన స్వభావాన్ని చక్కగా ప్రతిబింబిస్తూంది.

మూడు గీతపద్యాలు కలసిన ఖండకావ్యపరంపర "గిరికుమారుని ప్రేమ గీతాలు" ఆ రోజులలో సాహిత్యలోకానికి పవిత్రమైన దాంపత్యప్రేమలోని మాధుర్యము చవి చూపినది. ఏ కృష్ణునిమీదనో, ఏ గోపికమీదనో పెట్టి తమ అపవిత్ర కామావేశాలు ప్రేమగీతాలుగా ప్రచురించడము కవులకు సర్వసాధారణముగా ఉన్న ఆ రోజులలో, గిరికుమారుని ప్రేమగీతాలు ఆయనను మాబోంట్లకు కేవల మాత్మీయునిగా చేయగలిగినవి.

గిరికుమారునిలో నుండి సరాసరి పుట్టినదే "కిన్నెరసాని వాగు." అప్పటికి 'కిన్నెరసాని పాటలు' పుట్టలేదు. "కిన్నెరసాని వాగు" అనే శీర్షికతో గీతమాలిక కృష్ణాపత్రికలో చదివిన జ్ఞాపకము. అందులో తన కవిత్వము సరాసరి గట్లమధ్య ప్రవహించే కాలువ కాదనీ, వంకరలు తిరుగుచు, దూకుచు కొండలలో అడవులలో స్వేచ్ఛగా గానము చేస్తూ, సాగే కిన్నెరసాని వాగు అనీ సమర్థించుకున్నాడు. తన పద్యాల నడక ఎగుడుదిగుడుగా ఉంటుందని ఎవరో అన్నారుకాబోలు. "ఓయి రసహీన" అని ఆయనను సంబోధిస్తూ ఆ కావ్యము చెప్పినాడు. భద్రాచల యాత్రలో తాను చూచిన కిన్నెరసాని వాగూ, దాని నామమూ ఆయన నెంతో ఆకర్షించి ఉండవలె! తర్వాత కిన్నెరసాని పాటలు

పుట్టినవి కిన్నెరసానివాగుగా ప్రారంభించిన ఆయన సాహిత్య స్రవంతి పోను పోను మహాగోదావరిగాను, కృష్ణవేణీనదీ ప్రవాహముగాను పరిణమించినదిగాక!

నాకు ప్రథమ పరిచయమైన ఆ రోజులనుండి నేటివరకు శ్రీ విశ్వనాథ ప్రతిభావ్యుత్పత్తులు ఊహ కందరానివిగా విస్తరించినవి. నా కా పరిచయమును విస్తరించినది. సభావేదికలమీద ఆయనస్వరూపము నానావిధాకారాలు ధరిస్తుంది. కాని, ఆయనను ఇంటివద్ద కలసికొని ఆయన ఆతిథ్యము చవిచూచినవారికి ఆప్యాయతతోకూడిన అమృతహృదయ మొక్కటే గోచరిస్తుంది.

ఇంచుమించు కటకటగా ఉన్న రోజులలో బెజవాడలో చేసిన ఆయన కుమార్తె వివాహానికి నేనూ వెళ్ళడము తటస్థించినది. మధ్యాహ్నభోజనా లయిన తరువాత ప్రక్కనున్న మేడమీద పలువురు సాహిత్యవేత్త లానాడు ఇష్టాగోష్ఠి జరిపినారు. ఆంధ్రదేశంలో ప్రసిద్ధకవు లందరి ప్రస్తావనా వచ్చినది. ఆ రోజులలో కొత్తగా తెలుగులో కవిత్వము చెప్పసాగిన ఒకానొక ముసల్మానుకవిమీద అప్పుడు శ్రీ విశ్వనాథకు అభిమానము కలిగినది. ఆ కవిప్రశంస ఆయన ఆనాడు విస్తారముగా చేయసాగినాడు. ఆ బాలకవి పద్యా లెన్నో మెప్పుతో ఆయన వినిపించినాడు అందరమూ సద్యఃఉమధ్య ఆ కవిని ప్రసిద్ధిలోకి తీసుకొని రావలెనని తీర్మానించినాము. కాని, ఇప్పటికీ ఆ బాలకవి అజ్ఞాతకవిగానే ఉండిపోయినాడు. ఈ విధంగా మధ్యమధ్య శ్రీ విశ్వనాథకు అభిమానము ఎంత చిత్రమైన పోకడలు పోవునో చెప్పలేము. ఆ కవి రచనలో ఏదో ఒక మూల చిన్న విశేషము ఆయనకు భాసిస్తుంది. దానితో వెంటనే అభిమానము పొంగులు వారుతుంది. ఎక్కడో కొంచెము వర్షముపడినా చప్పున పొంగే వాగు వలెనే !

శ్రీ విశ్వనాథకు చాలామంది శిష్యులూ, భక్తులూ ఉన్నారు. వా రాయన రచనలు పదే పదే, ఒకరిన్నట్లు ముడిగట్టుకొని కూడా అధ్యయనము చేస్తారు. పారాయణ చేస్తారు. ఆయనమాటలు స్మరిస్తూ పారవశ్యము పొందుతారు. ఆయన పాత శైలి అవలంబిస్తారు. ఆయన తీరుతెన్నులుకూడా స్పష్టంగా అనుకరిస్తారు. తమ రచనలు ఆయనరచనల ఒరవడిలో సాగిస్తారు. ఆయనమీద ఇంత ఈగవాలినా సహించలేరు.

అట్లాగే ఆయనకు భక్తు లెందరున్నారో శత్రువులుకూడా అందరున్నారనిపిస్తుంది. వారిలో ఎక్కువభాగము పౌండ్రకవాసుదేవుడు, కంసుడు, శిశు

పొలుడు పంటివారు. వైరానుబంధము వల్లనే వాళ్ళాయనరచనలు శ్రద్ధగా ప
స్తారు లోపాలు లెక్కించడానికి! కృష్ణానది వరదలో ఉన్నప్పుడు ఎన్ని కళే
రాలు కొట్టుకొనిరావు! వాళ్ళు వాటికోసమే గాలించి ఇదుగో పట్టుకొన్నా మ
గంతులు వేస్తారు. ఏ ఉద్దేశంతో చేసినా వాళ్లకు అప్రవాహావగాహనము తప్పద
ఆ అవగాహనమువల్ల భక్తులు పరిపూతుల మయినట్లు భావిస్తారు. ఆ శత్రువు
తమ శరీరాలూ కట్టిన పుట్టాలూ మురికిపడ్డవని అసహ్యపడతారు అందుక
తలమునుకలై ప్రాణాలతో బయటపడ్డందుకు నిట్టూర్పులు విడుస్తారు కొందర
ఆ శత్రువులుకూడా విపరీతరూపము ధరించిన భక్తులే. వైరానుబంధముచే
సమస్తము హరిమయమని భావన చేసిన కంసునివంటివారే!

మరి ఇక శ్రీ విశ్వనాథకు మిత్రులెవరయినా ఉన్నారా అన్నది వ
టోల్లను విడదీయలేకున్న చిక్కుసమస్య. ఆయన కత్తివంటివాడు. ఒక
ఒరలో రెండు కత్తు లిముడవనిగదా లోకోక్తి! ఆయనతో సమాన ప్రతిపత్తిత
అప్తులై వ్యవహరించేవా రెవరయినా ఉన్నారా అని నా కెప్పుడూ సందేహమే
అట్టివారు నా దృష్టిలో పడలేదు. అటువంటి ఆప్తమిత్రులు కాదగినవా రెందర
సన్నిహితులు కాకుండాపోయినారని నా నిశ్చయము. అట్టివారే కొందరు దు
హంకారులై నందున ఆయన శత్రువులుగా పరిణమించినారని నా విశ్వాసము
ఇతరులు సహృదయు లయినవారు వీలయినంతవరకు దూరముగా ఉంటార
ఆయనతో ఏకాంతముగానయినా మంచిచెడ్డలు పర్యాలోచించు సమయము క
మయినందున సన్నిహితత్వము ప్రమాదకరమని అట్టివారు గుర్తించి ఉంటారు.

శ్రీ విశ్వనాథ బాల్యదశలోనుండి శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల నానా
సందర్శనములు, విజయయాత్రలూ బాగా విన్నవాడు. పూర్వకాలమునుండి మ
దేశములో విద్వాంసులు శాస్త్రవాదములతో విజయయాత్రలు చేయుట పరిపాట
కాని కవు లట్టివి చేయుట అరుదు. శ్రీనాథభట్టు విజయయాత్ర అట్టి అపవా
సూత్రాలలోని దండాము. లేక ఆకృతిగణము అందాము. శ్రీనాథుని యాత్ర
కథలు మనస్సులో పెట్టుకొని శ్రీ తిరుపతి వేంకటేశ్వరులు నానాసభా విజయ
ములు అద్వితీయముగా సాగించినారు.

ఆ భావములతోనే శ్రీ విశ్వనాథ కూడా ప్రభావితు డయినాడు. అయి
ఆయనకు పెద్దరికము వస్తున్న రోజులలోనే రాజులందరూ అకస్మాత్తుగా మాం

మైనారు. ప్రజలే ప్రభువులై కూర్చున్నారు. మహాసభలే రాజాస్థానా లయినవి. శ్రీ విశ్వనాథను సభకు ఆహ్వానించని పేరుగల పల్లెకూడా ఆంధ్రదేశంలో లే దనడములో అతిశయోక్తి లేదు. పల్లెలోగాని, పట్టణములోగాని, మహానగరము లోగాని ఆయనిది ఎప్పుడూ అగ్రస్థానమే. ఆయన కావ్యాలు వినిపిస్తే మస్తులై వింటారు. ఆయన దీవించినా, ఎందుకైనా కోపమువచ్చి ఒకవేళ తిట్టినా ఒక్కరూ అక్కడ నోరెత్తరు. ఆ తర్వాత ఇంటికి పోయి గొణుగుకొనవలసినదే! అట్టి వాళ్ళే మళ్ళీ మరొకసభకు ఆయనను భక్తిప్రపత్తులతో ఆహ్వానిస్తారు. ఈ విధ ముగా తన చిన్ననాటి దిగ్విజయస్వప్నాలు ప్రత్యక్షానుభవంలోకి తెచ్చుకొన్న సుకృతి శ్రీ విశ్వనాథ!

ఈ వ్యాసము ప్రారంభించినపుడు యాదృచ్ఛికంగా ఒక మిత్రుడు వచ్చి ఆయనను గూర్చి "నెందుమనంబు నవ్యనవనీతసమానము, పల్కు దారు ణాఖండల శస్త్రతుల్యము" అని అందించినాడు. నవ్యనవనీతసమానమైన ఆయన పల్కులుకూడా ఎరిగిన నాకది న్యాయమని తోచలేదు.

ఆయన రచనలలోగాని, వ్యక్తిలో గాని ఏదో అలౌకికమైన మహాశక్తి ద్యోతకమవుతుంది. అది మహాప్రభంజన శక్తి. ఆ శక్తిని ఆంగ్లభాషలో చెప్ప వలెనంటే (Tritausic) అని నిర్దేశింపవచ్చును. ఆయన తన్నుగూర్చి ఎక్కడో యోగభ్రష్టుడ నని గీతావాక్యార్థముతో చెప్పుకొన్నట్లు జ్ఞాపకము కొంతవరకది సత్యమే కావచ్చును. నాకుమాత్రము విజ్ఞానదృష్టితో భావన చేయగా, ఒకటి స్ఫురించినది. శ్రీ సాంబసదాశివుని సేవించే గణములలోనుండి ఏదో శివాజ్ఞ నిర్వర్తించడానికి మన ఆంధ్రభూమిలో అవతరించిన సహస్రబాహువులు సహస్ర శీర్షములు గలిగిన ప్రమథమూర్తి యేమో అనిపించింది శ్రీ విశ్వనాథ! అందు వల్లనే ఆయన విశ్వనాథవారింట, శివప్రతిష్ఠ చేసిన పుణ్యదంపతుల గర్భవా సాన జన్మించినాడని నా విశ్వాసము!

# ఆధునికాంధ్ర సాహిత్యము -
# సాహితి అవతరణము

౧

"సాహితి" మొదటిసంచిక ఎంత అపూర్వ ప్రచురణమో నేటివారికి చాలా మందికి తెలియదు. తెలిసినవారు పలువురు మరచిపోయినారు. స్మృతిలో ఉన్నవారిలో కొందరు తమకు ఇతరాభిమానములు ప్రబలినందున దానిని ఉగ్గడించరు. కొందరు అభిమానముతో కూడిన అతిశయోక్తి అని లోకులనుకొనిపోతారేమో అని చెప్పడానికి జంకుతారు. ఇంకా కొందరికి సరిగా ఆలోచించనందున దాని స్వరూపము తెలియక మాట్లాడక ఊరుకుంటారు. దాని నిజస్వరూపము సరిగా అవగాహన చేసుకోడానికి ముందు అప్పటి ఆధునికాంధ్రసాహిత్య పరిస్థితులు కొంత తెలుసుకోవలె.

అంతవరకూ చిన్నయసూరి వలెనో, ఆయనను మించి కాదంబరీవచనములను అనుకరించియో వచనము వ్రాసేవారే సరియైన గద్యకావ్యకర్తలుగా భావించబడేవాళ్ళు. కందుకూరివారు కొంత దారికి తెచ్చినా, చిలకమర్తివారు ప్రోత్సాహం చేసినా వాళ్ళనుకూడా వెనకటి ఛాయలు వీడలేదు. కాకపోతే పెద్ద సమాసాలూ, తేనెపోసిన సంస్కృతాంధ్రపదాలూ వాడడమే కాస్త తగ్గించారు. కాని ప్రాణముగల తెలుగుభాషజోలికి వారు పోలేదు. ఆంధ్రపత్రిక ప్రతిష్ఠాప్రశస్తి కల సంపాదకీయాలు కూడా భాషాడంబరము వదలలేదు. వ్యావహారికభాషా వాదము పండిత పామరులు కొందరికి అసమ్మతంగా ఉండేది. శ్రీ గిడుగువారి సింహగర్జనము అరణ్యఘోషగానే ఉండేది. వ్యావహారికభాషలో ఒకటి రెండు వ్రాయ సాహసించిన సెట్టి లక్ష్మీనరసింహం, అక్కిరాజు ఉమాకాంతం వంటివారు వ్రాసినవి పామరులనుగూడా ఆకర్షించలేకపోయినవి. సకృత్తుగా చేసిన గురజాడ వచన రచన కూడా జీవద్వ్యవహారపు మెరుగును అందుకోలేక పోయింది.

ఏకాంకనాటికలు నామమాత్రంగా కూడా పుట్టలేదు. కథానికలని ఏదో విధంగా సరిపెట్టుకోదగ్గవి రాలేదనలేము కాని అవి వేళ్ళమీద లెక్కపెట్టినా ఒక చేతివేళ్ళు దాటవు. అసలు కథానిక సమగ్రరూపంతో పుట్టలేదు.

ఇక కవిత్వము సంగతి ! ప్రబంధాలూ, శతకాలూ ఎప్పటివలె పుడుతూనే ఉన్నవి. కాని వాటి శక మంతరించింది. సర్వసామాన్యమైనవి, అవకాశము చిక్కినప్పుడల్లా ప్రబంధశైలిని అనుకరించే పంచరత్నాలు, నవరత్నాలు, పాపము, చాలామంది కవులు, ఏ పేరుపడ్డ వ్యక్తి పరమపదిస్తాడా, కవితా ప్రాగల్భ్యం మనది ప్రదర్శించడానికి ఎప్పు డవకాశం చిక్కుతుందా అని నిరీక్షిస్తూ ఉండేవాళ్ళా అనిపిస్తుంది, ఆ నాళ్ళలో పరమపదించిన వ్యక్తులనుగూర్చి విషాదపద్యాలు పత్రికలనిండా ప్రకటించే కవులను జ్ఞాపకం చేసుకొంటే !

అట్లాగే ఆంధ్రమహాసభలు, చిన్న సభలు, పెద్దసభలు - కవుల కావ్యగానానికి ప్రధానవస్తువులు. కొలదిమంది కన్యాశుల్కమునో (వరశుల్కము కాదు), బాల్యవివాహాలనో, అంటరానితనమును నిందిస్తూనో, వితంతు వివాహాలను విదేశయాత్రలను ఉగ్గడిస్తూనో ఉపన్యాసధోరణిలో ఉండే ఛందోబద్ధ వ్యాసాలు ప్రచురించేవాళ్ళు. అట్టివారు నూతనత్వము సాధించామని గర్వించేవాళ్ళు.

ఆ కాలములో ఉన్న కవితాదారిద్ర్యమూ, సృజనశక్తిలోపమూ మననం చేసుకొంటే, చాలా విచారం కలుగుతుంది. అప్పుడుండే పత్రికలలోని పద్య గద్యాలు తిరిగి నేడు చదివితే మన కాశ్చర్యం కలుగుతుంది. ఎప్పుడో సకృత్తుగా గాని, హృదయంగమమై రసవంతమైన రచన కనబడేదే కాదు.

ఆంధ్రసాహిత్యక్షేత్రము అటువంటి మరుభూమిగా ఉన్న సమయములో సాహితి మొదటిసంచిక వచ్చింది. అది రాయలుసైజులో ఉన్న చిన్న సంచిక. అయితే ఏమి ! విజ్ఞానశాస్త్రంలో న్యూటను భూమ్యాకర్షణ సిద్ధాంతం ఎంత విప్లవాత్మక మైనదో, ఆధునికాంధ్ర సాహిత్యములో సాహితి మొదటిసంచిక అంత విప్లవాత్మక మైనది.



అది కొడవటిగంటి వెంకట సుబ్బయ్య ఆతిథ్యముతో ప్రారంభించినది.

"ఆగు మాగుము తెరువరీ, ఆ
యాస ఖేదం బపనయింపుము
మా గృహాంగణ కుసుమచయమధువు లియ్యవియే.
... ... ... ...
మావి పూగుచ్ఛముల నపక్వ
న్మత్త మధుపచయమ్ము లాడగ
ప్రోవుపడిన పరాగముల యనుభూతి యియ్యదియే !

తూరుపున సిందూరరాగము
తొలుక దొయ్యలు లేరి తెచ్చిన
పారిజాత ప్రసవమాలా బహుళ మియ్యదియే !"

ఈ ఆతిథ్యము సాహితి ఆంధ్రసాహిత్యలోకమునకే కాక ప్రపంచసాహిత్యము నకే ఇచ్చినది.

ఆ తర్వాత "చందుని ప్రతిజ్ఞ." హంసాదేవి కన్యాదాన సూచకముగా కుమార చందుని కీయవలసిన టెంకాయను రాయబారి పొరపాటున అతని ముసలితండ్రి పాదాలముందు పెట్టినాడు. ఆపైన తండ్రి ఎంత చెప్పినా హంసాదేవని చందుడు వివాహమాడ నిరాకరించినాడు. తండ్రి కోపించి తానే ఆ కన్యను వివాహమాడి ఆమెవల్ల కలిగిన పుత్రునికే తన రాజ్యముకూడ ఇత్తు నన్నాడు. చందుడు తానే అతనికి రాజ్యాభిషేకము జేసెదనని ప్రత్యుత్తరము పలికినాడు. ఆ కథను పూర్ణశర్మ :

"మూడువంతుల కాలము ముగిసిపోయె
తల నరసె, దేహదార్ఢ్యంబు తప్పిపోయె ;
ఈ వయస్సున నుండిన యేను నేడ ?
పడుచుకన్నియతోడ వివాహ మేడ ?"

ఆని ప్రారంభించి,

"చంద్ర సూర్యాది దేవతల్ సాక్షులుగను
జేతు వానికి రాజ్యాభిషేక మేనె ;"

అని పూర్తి చేసినాడు. అంత మనోజ్ఞముగా తేటమాటలతో, ధీరగంభీరముగా చెప్పిన కథాకథన కావ్యము అప్పటికి పుట్టలేదు.

మూడవది చింతా దీక్షితులు రచించిన "నా కొడుకు" అనే చిన్నకథ.

"ఆ అను అమ్మా, ఆ అను'' అని నేను నా కొడుకును చేతులలో ఇముడ్చుకొని వాడు నోటిలో పెట్టుకొన్న మంటిబెడ్డను తీసివేయడానికి ప్రయత్నము చేస్తిని. నా యత్నము సాగనియ్యక, పిల్లవాడు ముఖమును ఇటూ అటూ తిప్పుతున్నాడు. ఏలాగయితేనేమి కష్టముమీద మంటిబెడ్డ బైటికి లాగినాను.''

ఈ మూడువాక్యాలతో ఆరంభమైనది ఆ కథ! అప్పటికి వ్యావహారిక భాష వ్రాస్తున్నవాళ్ళు ఉన్నా, ఈ విధంగా ముచ్చటగా మన ఇళ్ళలో మాట్లాడుకొనే తెలుగులో రచన సాగించినవాళ్లు లేరు. పిల్లవాడు ఎంత బుజ్జగించినా, ఊరుకోక అల్లరి చేసిచేసి, పుస్తకాలమీద సిరాపోసి, కోపమువచ్చి కొట్టవస్తున్న తండ్రిమీద సిరాబుడ్డి విసరివేశాడు. సరిగ్గా ఆ వేషంతో ఉన్నప్పుడే తండ్రి ఎదురుచూస్తున్న పై ఆఫీసరు వచ్చాడు. తండ్రి సిగ్గుపడుతూ ఆఫీసరుకు ఎదురుపోయినాడు. కాని పిల్లవాడి అల్లరి ఆ ఆఫీసరుకు విశేష ప్రీతే కలిగించింది. ఈ కథ చెప్పడంలో దీక్షితులు చూపిన నేర్పు అది చదివినవాళ్ళకేగాని తెలియదు.

దానితర్వాత దీక్షితులే వ్రాసిన ''కమలాలు'' అనే గేయము:

"చిట్టి చిట్టి కమలాలు,
చెరువులోని కమలాలు,
నవ్వేటి కమలాలు,
నాకు తెచ్చిపెట్టే!
అమ్మ తెచ్చి పెట్టే!
ఆడుకొంటాను!
... ... ... ... ...
బువ్వ తినను, బజ్జోను,
నవ్వ మంటే నవ్వను,
నీకు ముద్దు పెట్టను,

చిట్టి చిట్టి కమలాలు
తెచ్చిపెట్టితే గాని ;

అమ్మ తెచ్చిపెట్టే !
ఆడుకొంటాను !"

అందులోని మొదటిదీ, చివరిదీ పైన ఇచ్చాను. ఈ ఒక్క గేయము చాలు, దీక్షితులు పేరు తెలుగుభాష ఉన్నన్నాళ్ళూ ఉండేందుకు. ఇది రవీంద్రుని "క్రేసంట్ మూను"లోని గేయాలకు ఎందులోనూ తీసిపోదు. కాని, ఆ కాలంలో రవీంద్రుని కావ్యాలు చదివి "ఇందులో ఏమున్నది ?" అని అడిగేవారట! అట్లే సాహితీసమితివారిని కూడా ఎంతమంది ఎన్నిసారులు ఎన్నిరకాలుగా "ఈ గేయము బాగానే ఉండికాని ఇందులో ఏముంది ?" అడిగారో లెక్క చెప్పడం సాధ్యం కాదు. కవి ఒకానొక కొత్తరుచి దానిలో చూపినాడు. అందులో పెద్ద పెద్ద మాటలు లేవు; నోరు తిరగని సమాసాలు లేవు ; ఏదో గంభీరభావనా లేదు. ఐనా అది అవ్యక్త మాధుర్యంతో హృదయానికి హత్తుకుంటుంది పాప మా పిల్లవాడి [పిల్లకు] కేం తెలుసు ! చిట్టి చిట్టి కమలాలు కావలె అందాకా ఆహార మక్కరలేదు నిద్ర అక్కరలేదు !

సరిగ్గా ఇప్పుడు తెలుగ సాహిత్యలోకం పసితనంలోనే ఉన్నది. ఏవేవో మనోజ్ఞ వస్తువులూ, వాసనలూ జనాన్ని ఆకర్షిస్తున్నవి. అవే సాహితి ఇచ్చింది. ఒకవిధంగా చూస్తే, సుబ్బయ్య ఆతిథ్యమూ, దీక్షితుల కమలాలూ అ కాలంలో వ్యక్తావ్యక్తముగా సాహితీపరులు ఎదురుచూస్తున్న నూతన కమలపర్ణామోదాలే. ఆంధ్రులకు గుబాళింపజేసి ప్రదర్శించిన దనవచ్చును.

ఆ తర్వాత త్రిపురారిభట్ల వీరరాఘవస్వామి "అలగ్జాండరు – యతి". ఉదాత్తమైన కథావస్తువు. ఒక సాయంవేళ సింధునదీతీరములో కౌపీనము ధరించిన యతిని ధ్యాననిష్ఠుడయినవానిని చూచి అలగ్జాండరు సంప్రీతుడై "సమస్త భోగభాగ్యములు నీ కిత్తును. నాతో గ్రీసుకు రమ్ము"అని ఆహ్వానించెను.

"ఎల్ల బ్రహ్మాండ మేను సృజించినాడ
నీ మకుటమందు మెఱయు మాణిక్యములును

నాదు ప్రభచేతనే నిరంతరము వెలుగు."

అట్టి నాకు నీ సంపద ఎందుకు ? అని నిరాకరించినాడు. అలగ్జాండరుకు కోపము వచ్చి చంపుటకు కత్తి ఎత్తెను. చిరునవ్వు నవ్వుచు యతి "చంపుము' చూతు" మనెను. అప్పు డా యతి ముఖ మెట్లుండెను ?

"సుంత చెదరని పూర్ణప్రశాంతితోడ
యతి ముఖం బుండె మధ్యందినార్కు బోలె"

అప్పు డేమైనది ?

"సవితృ డస్తంగతుం డయ్యె శాంతగతిని
ఆక్రమించె బ్రశాంత మాశాంతములను ;
సరగ నా గ్రీసు నృపతి హస్తంబునుండి
యప్రయత్నంబుగా ఖడ్గ మవని బడియె."

ఇట్లు పరిసమాప్త మైన ఈ కావ్యములో గంభీరభావములే కాదు, కథా కథన దక్షతయే కాదు ఉన్నది, అన్నిటితోబాటు అది ఎన్నెన్ని మధుర పంక్తులతో నిండి ఉన్నది.

"అలస పవన పరీరంభములను గులికి
శాంత మోహన ప్రకృతితో సరసమాడి
స్వచ్ఛ లోలోర్మి పంక్తి నుయ్యాల లూగి
పార్థివునిదృష్టి యొక యతిపైన వ్రాలె."

ఇట్టి వర్ణన లెన్నో ఉన్నవి.

ఇక ఆపైన మునిమాణిక్యం నరసింహారావు వ్రాసిన "ఉఫ్" అనే చిన్న స్కెచ్. "వేసవికాలము సాయంత్రము గాలి కాస్త చల్లగా వీస్తున్నది. కృష్ణ వొడ్డున ఖులాసాగా కూర్చుండగా నిద్ర వచ్చినట్లయి ఇసుకతిన్నెమీద నడుము వాల్చగా నిద్ర వచ్చింది. కలలో అతడు పోయిపోయి నిద్రపోతున్న గాలిరాజు

గదిలోకి వెళ్ళాడు. లోపలికి వెళ్ళడము కష్ట మనిపించింది. ఎదురుగాలితో నడిచినట్లు ఉన్నది.''

కొంత కథ జరిగిన తర్వాత

''అందరిలో చిన్నపిల్ల నన్ను చూచి పక్కన నవ్వింది. మనుషులను చూస్తే వాళ్లకు చాలా నవ్వుగా వుంటుంది. ఆ నవ్వుకు నా టోపీ ఎగిరి పోయింది.

... ... .... ... ...

''గాలిదేవుడి పిల్లలు వట్టి ఆటఖోరులు .... సాయంత్రముపూట మేద మీది ఆఖరు అంతస్తుమీద .... షికారుచేస్తూ వుండేవాళ్ళ టోపీలు ''ఉఫ్'' అని ఎగరగొడతారు.''

''సాయంత్రం మనం షికారు వెళ్ళేటప్పుడు మనకు తగిలేగాలి ఆ పిల్లలు ఊదేదే ; అందుకనే వాటిని పిల్లవాయువు లంటారు.''

భోజనా లయినవి.

''అప్పుడాయనభార్య నన్ను చూసి నీవింక వెళ్ళు ఇప్పుడొక పెద్దగాలి వస్తుంది. మా ఆయన భుక్తాయాసంచేత నిట్టూర్పు విడుస్తాడు. నీవు కొట్టుకుపో తావు. దబ్బున ఇంటికి చేరుకో !''

ఈ విధంగా వచనంలో కవిత్వములోవలె మునిమాణిక్యము ఇందులో కల్పనమీద కల్పన చేసుకొంటూ'ఉఫ్'రచన చేసినాడు. ఆయనరచనల్లో ముందు ప్రచురించిన దదే। అప్పటి కింకా కాంతము ఆయనను వరించలేదు. ఇంటరు విద్యార్థే కాని ఎంతో అనుభవ మున్నవాళ్ళ ప్రౌఢితో వ్రాశాడు. అబ్బా ఆ రోజు లలో 'ఏమిటో ఉఫ్ ?' అని అడిగినవాళ్ళకు జవాబు చెప్పలేక మా ప్రాణాలు విసిగేవి. అప్పటికే అట్టివా ళ్ళెంత రమ్యమైన రచన చదివి ఉండరు.

ఈ వరస చూసినవాళ్ళకు ఆ యా రచనలలోని విశిష్టగుణాలే కాక సంపాదకుని నేర్పుకూడా అవగాహన మయి ఉంటుంది. చివరిదాకా సభాపతి శివశంకరుల సంపాదకత్వములో సమర్థత గోచరిస్తుంది. సంపాదకీయము కూడా

ఇందులో లేదు. కాని ఉన్న దానికంటె కూడా బలవత్తరంగా ఆ సంచిక విశిష్టత వ్యక్త మవుతుంది.

'ఉఫ్' తర్వాత బసవరాజు అప్పారావు గేయాలు రెండు. మొదటిది "తగనా?"

"దాసిగా నుంటకై
తగనా ప్రాణేశ, దేవా? ॥దాసిగా॥

పరవశమున నీ ప్రేమము
పాడుట కైనను తగనా? ॥దాసిగా॥

రెండవది గోపికా గీతము.

"తలుపు తీయు నంతలోనె
తత్తర మది యేలనోయి?
తలుపుదీతు వీలు చూసి
తాళుము కృష్ణా!
కాస్తసేపు తాళుము కృష్ణా!"

ఇత్యాదిగా ఉంది. వంగదేశ వైష్ణవ మనండి, క్షేత్రయపదాల ఉద్ధరణ మనండి, వీటిలో ద్యోతక మవుతుంది.

ఆ తర్వాత "ఉజ్జీవనము" అనే కొమ్మూరి హనుమంతరావు వ్రాసిన కథ. అందులో బ్రాహ్మణకుటుంబంలో చిన్నవాడైన ఇంటిపెద్ద చనిపోతే అనుభవంతో కనబడేటట్లు జరిగేదంతా కన్నులకు కట్టినట్లు కథకుడు వర్ణించాడు. కరుణ, కొంచెము హాస్యము, కొంత వైరాగ్యము, భక్తి మిశ్రమై ఉన్నాయి. కథలో తుదివిశేషము చనిపోయినా డనుకొన్నవాడు చితిమీద లేచి బ్రదకడము. ఇందులో పద్ధతి యథాచిత్రణము (realism) అనదగును.

దానిపిమ్మట మల్లీ వెంకటసుబ్బయ్యది "భిక్షువు" అనే కథనకావ్యము. అందులో నూట నాలుగు గీతపంక్తులే ఉన్నా, ఆధునికాంధ్రకావ్యసందోహంలో శాశ్వతస్థానం సంపాదించుకొన్న దది. తాను ప్రేమించిన కన్య ఇంకొకరిని

వివాహ మాడినది. ఆతడు సన్యసించినాడు. నాయిక ప్రేమ పదలక వానికి కబు రంపినది. అతడు వచ్చి మాట్లాడి ఆమెను అసహ్యించుకొన్నాడు.

"చంద్రబింబము మేఘసంఛన్న మయ్యె
వెనుదిరిగి చూడక ప్రశాంతమనముతోడ
హర్మ్యసోపానములు దిగి యంధకార
మండలమ్మున భిక్షువు మాయమయ్యె."

ఈ విధంగా ఉన్నత నీతిజ్ఞానములతో మిశ్రితమయిన విషాదముతో అంత మౌతుంది కావ్యము.

దీనితో మూడు కథనకావ్యాలు. మూడూ మూడువిధా లయినవి. ఒకటి విమలోదాత్తము. ఒకటి శాంతోదాత్తము. ఒకటి మధురోదాత్తము.

ఆ వెనుక కురుగంటి సీతారామయ్య "వాఙ్మయ చక్రము" అనే వ్యాసము. అప్పటి కాయన గ్రాంథికవాది. "ప్రపంచంబున నే వాఙ్మయమును జూచినను వృద్ధిక్షయము లొక పరంపరగ గానవచ్చుచున్నవి" అని ప్రారంభించినాడు. ఆంగ్లవాఙ్మయ పరిణామములోని దశలు వివరించి అప్పటి కది తుదిదశలో, అనగా హీనదశలో నున్నదని చూపి, ఆంధ్రవాఙ్మయములో నట్టి దశలే వచ్చిన వని తెలుపుచు ప్రస్తుత మది ప్రకృతియుగము, స్వాతంత్ర్యయుగములో నున్న దని నిరూపించిరి.

దానివెంటనే "తమోనిరసనము" అనే కోపల్లె శివకామేశ్వరరావు ఖండ కృతి,

"నల్లని చీరె కట్టుకొని నావలన న్నదతేరనేల ? ని
న్నొల్లగ నిచ్ఛ లేదు విను మో యువతీ ! వలదన్న వీడిపో
వెల్లదె ? నిన్ను జూడ నవశీకృతచిత్తుడ నైతి భీతి, నీ
యుల్లము రాతజేసినదియో కదె, నన్విడు మింక బోయెదన్."

"చీకటిమ్రానినీడలకు జేరెదవేల మనోహరంబుగన్
బ్రాకెడి చంద్రికాలతల బాటలు నాడగ బోవుచుంటి ; ని
న్నీ! కనుమంచు జూపె దతసీకుసుమమ్ముల ; మల్లెపూవు లె
న్నో కల వాత్మమోదము మహోదయ మయ్యెను వీని జూడగన్."

ఈ విధంగా ఈ కవి సాహితీ ఆతిథ్యములో ఆశపెట్టిన మధువు పాఠకులకు పంచిపెట్టినాడు.

ఆ తర్వాత అక్కిరాజు ఉమాకాంతం వ్రాసిన "అక్కడ భిన్నప్రకృతి లేదు" అనే కథానిక. అందులో తాత్త్విక సౌందర్యం గోచరిస్తుంది. భాషలో గ్రాంథిక వ్యావహారికాల మిశ్రణము గమనింపదగినది. పండితులు వ్యావహారికములోకి ఎట్లా మారబోతున్నారో సూచిస్తుంది.

తర్వాత మల్లి శివకామేశ్వరరావు "ప్రియాహ్వానము." అది ప్రణయాహ్వానమే.

"కనుపించి కన్పడవు నిన్గను మార్గ మేదీ?
తనుమధ్య నీ విరహబాధల ముంచెదేలా ?"

ఇటువంటి మధురపంక్తు లిందులో ఉన్నవి. తెలుగులో ఎక్కువ వాడుకలో లేని సరసాలకవృత్తము అందంగా నడపడంకూడా మరొక విశేషము !

దానితర్వాత "ఇంగ్లీషు వాఙ్మయమువల్ల వికాసము"అనే వ్యాసము, నోరి నరసింహం వ్రాసినది. ఇత డప్పుడు బి. ఏ. విద్యార్థి. "తెలుగువారికి ఇప్పటికి మూడుజాతులవారితో సంస్పర్శ కలిగినది ; మొదట కన్నడులతోను, తర్వాత ముసల్మానులతోను, ప్రస్తుతము ఇంగ్లీషువారితోనూ." ఈవ్యాసంలో మూడవ వారితో కలిగిన సంపర్కమువల్ల సర్వతోముఖముగా కలిగిన ఉజ్జీవము ప్రదర్శించినాడు.

అన్నిటికంటె చివరకు వానప్రస్థునివి (శివశంకరశాస్త్రి) ఐదు ఖండకావ్యాలు. వాటిలో చివరదైన "ఒకనాడు"అనే కృతిలో ఆద్యంతము లివి :

"కాలాభ్రంబున జంచలా లత లనంగా నా శిరోగ్రంబునం
దాలోకించితి నీ వయస్సువలె యాహా ! శుక్లకేశంబులన్."
"చేయ న్నేరక చేతనా పనులు నిశ్చేష్టుండనై యుండగా
నాయు స్సార ! అదృష్టమార్గములు నిత్యక్షీణతం గాంచెడిన్!"

ద్విపాదవృత్తములు ఇందులోనేకాక మరి రెండు ఖండికలలో కూడా ఉన్నవి. ఒకదానిలో త్రిపాత్తు. ఒక్కటే చతుష్పాత్తు ! ఇంతకూ ఈ వానప్రస్థుని వయ స్సప్పటికి 26 సంవత్సరాలే!

## 3

ఈ విధంగా నలభై పేజీలలో సాహితి మొదటిసంచిక, అంతకుపూర్వమే కాక, ఆ తర్వాత 43 సంవత్సరాలలోగూడా, ఏ ఒక్క పత్రికాసంచికా అందించ లేనన్ని ప్రాణమూ, వైవిధ్యమూ గల రచనలు అందించింది. దానికి కారణం సమితికవుల కున్న ఉత్సాహము, పొంగుతున్న సృజనశక్తే. వారి కప్పుడు ధన కాంక్ష ఏమిటో తెలియదు ; కీర్తికాంక్ష లేనే లేదు. ఒకటే కాంక్ష. చక్కని కావ్యాలు, కథలు, వ్యాసాలూ వ్రాసి పాఠకుల నానందిపజేయవలె ననేదే! ఒక్క ఏకాంకనాటిక తప్ప నేటి సాహిత్యంలో అన్ని రకాలూ దానిలో ఉన్నవి. ఆ ఏకాంకనాటికకూడా సంవత్సరం తిరగకముందే వెంకట సుబ్బయ్య సాహితి లోనే ప్రకటించాడు.

సమితి ధనికులసంస్థ కాదు, కార్మికులదీ కాదు, పండితులదీ కాదు, పామరులదీ కాదు. అది నిజమైన కవులది ! వారందరిలో వయస్సులోను, రచనా వైవిధ్యంలోను, శరీరౌన్నత్యంలోను పెద్దవాడు దీక్షితులు. వాఙ్మయానుభవంలో పెద్దవాడు శివశంకరశాస్త్రి. అందరిలో ధనికుడు కొమ్మూరి హనుమంతరావు. పేదవాడు పూర్ణశర్మ. అతడు అప్పటికి తనకున్న చివరి ఆస్తి ఐన ఇల్లు రు. 65/- లకు అమ్మి, ఉద్యోగంలో చేరక, ఆ డబ్బుతోనే కాలక్షేపం చేస్తూ, ముఖాన అవంత చింతకూడా చూపకుండిన యోగి.

ఆధునికాంధ్ర వాఙ్మయము నిర్దుష్టంగా 1919 సంవత్సరంలో సాహితి మొదటిసంచికతోనే అవతరించింది !

—o—

# నవ్యకవిత్వ రీతులు

నన్ను పిలవడానికి కారణము అభిమానమే. నాకు పెద్దతనము వస్తున్నది. చిన్నవాళ్ళతో సాహచర్యము అవకాశము పోగొట్టుకోలేను. అందువల్ల ఆహ్వానము అంగీకరించినాను, తెలిసినవాణ్ణని కాదు.

గురువు లున్న ఈ సభలో ఉపన్యసించడానికి భయముగా ఉన్నది. ఈ విషయములో ఉన్న అభిమానముచేత సాహసిస్తున్నాను. నవ్యసాహిత్యపరిషత్తు సభ్యుణ్ణి కాబట్టి నా విధి.

"నవ్యకవిత్వము"ను గూర్చి ఉపన్యసించడానికి గుంటూరు కంటె ఉత్తమమైన స్థానము ఇంకొకటి లేదు. ఇది నవ్యకవిత్వానికి పుట్టిల్లు. రాయప్రోలు, తల్లావజ్ఝల ఇక్కడివారే. "సాహితి" ఇక్కడనే. నవ్యసాహిత్య పరిషత్తు కార్యస్థానము ఇక్కడే. మొదటి అతినవ్యకవి శ్రీ ఉమామహేశు కూడా ఇక్కడివాడే !

నవ్యకవిత్వ మంటే ఇప్పటి కవిత్వ మనికాదు. నవ్యత్వమున్న ఇప్పటి కవిత్వము. ఏమి టా నవ్యత్వము? అంటే జవాబు తేలిక కాదు. ఈ రోజున ఉపన్యాసములో దాని స్వరూపము కొంత విచారిద్దాము. నిదర్శనము. నవనాగరకు డంటే ముక్కు, చెవులు, కళ్ళు, నోరూ లేని మనిషి అనా ? అవి లేకపోతే మనిషే కాడు. క్రాపు ఉన్నదనో, మీసాలకు Cutting లోనో, కట్టులో మార్పు ఉన్నదనో, తొడిగిన చొక్కా Cutలో కొత్తో — ఒక్కొక్క నవనాగరీకుడు ఒకదాంట్లో కొత్త చూపిస్తాడు. అట్లాగే నవ్య కవిత్వ మంటే వేషభాషలలో కొంత నవ్యత్వ ముంటుంది. ఇంతేకాని గగన కుసుమువలె ఆకాశంలోనుంచి ఊడిపడదు.

రాయప్రోలు సుబ్బారావు అభినవకవితామండలి, తృణకంకణము పీఠిక. కవి అయినవాడు శతావధాని కాని, అష్టావధాని కాని కావలసిన రోజులు. ఆ కవిత్వము, ఆ ధోరణిలో పడి తప్పించుకొని నిజమైన కవిత్వములో పడ్డాడు.

## 3

ఈ విధంగా నలభై పేజీలలో సాహితి మొదటిసంచిక, అంతకుపూర్వమే కాక, ఆ తర్వాత 48 సంవత్సరాలలోగూడా, ఏ ఒక్కపత్రికాసంచికా అందించలేనన్ని ప్రాణమూ, వైవిధ్యమూ గల రచనలు అందించింది. దానికి కారణం సమితికవుల కున్న ఉత్సాహము, పొంగుతున్న సృజనశక్తే. వారి కప్పుడు ధనకాంక్ష ఏమిటో తెలియదు ; కీర్తికాంక్ష లేనే లేదు. ఒకటే కాంక్ష. చక్కని కావ్యాలు, కథలు, వ్యాసాలూ వ్రాసి పాఠకుల నానందిపజేయవలె ననేదే! ఒక్క ఏకాంకనాటిక తప్ప నేటి సాహిత్యంలో అన్ని రకాలూ దానిలో ఉన్నవి. ఆ ఏకాంకనాటికకూడా సంవత్సరం తిరగకముందే వెంకట సుబ్బయ్య సాహితిలోనే ప్రకటించాడు.

సమితి ధనికులసంస్థ కాదు, కార్మికులదీ కాదు, పండితులదీ కాదు, పామరులదీ కాదు. అది నిజమైన కవులది ! వారందరిలో వయస్సులోను, రచనా వైవిధ్యంలోను, శరీరౌన్నత్యంలోను పెద్దవాడు దీక్షితులు. వాఙ్మయానుభవంలో పెద్దవాడు శివశంకరశాస్త్రి. అందరిలో ధనికుడు కొమ్మూరి హనుమంతరావు. పేదవాడు పూర్ణశర్మ. అతడు అప్పటికి తనకున్న చివరి ఆస్తి ఐన ఇల్లు రు. 65/- లకు అమ్మి, ఉద్యోగంలో చేరక, ఆ డబ్బుతోనే కాలక్షేపం చేస్తూ, ముఖాన అవంత చింతకూడా చూపకుండిన యోగి.

ఆధునికాంధ్ర వాఙ్మయము నిర్దుష్టంగా 1919 సంవత్సరంలో సాహితి మొదటిసంచికతోనే అవతరించింది !

—०—

# నవ్యకవిత్వరీతులు

నన్ను పిలవడానికి కారణము అభిమానమే. నాకు పెద్దతనము వస్తున్నది. చిన్నవాళ్ళతో సాహచర్యము అవకాశము పోగొట్టుకోలేను. అందువల్ల ఆహ్వానము అంగీకరించినాను, తెలిసినవాణ్ణని కాదు.

గురువు లున్న ఈ సభలో ఉపన్యసించడానికి భయముగా ఉన్నది. ఈ విషయములో ఉన్న అభిమానముచేత సాహసిస్తున్నాను. నవ్యసాహిత్యపరిషత్తు సభ్యుణ్ణి కాబట్టి నా విధి.

"నవ్యకవిత్వము"ను గూర్చి ఉపన్యసించడానికి గుంటూరుకంటె ఉత్తమమైన స్థానము ఇంకొకటి లేదు. ఇది నవ్యకవిత్వానికి పుట్టిల్లు. రాయప్రోలు, తల్లావఝ్ఝల ఇక్కడివారే. "సాహితి" ఇక్కడనే. నవ్యసాహిత్య పరిషత్తు కార్యస్థానము ఇక్కడే. మొదటి అతినవ్యకవి శ్రీ ఉమామహేశ్వరరావు కూడా ఇక్కడివాడే !

నవ్యకవిత్వ మంటే ఇప్పటి కవిత్వ మనికాదు. నవ్యత్వమున్న ఇప్పటి కవిత్వము. ఏమి టా నవ్యత్వము? అంటే జవాబు తేలిక కాదు. ఈ రోజున ఉపన్యాసములో దాని స్వరూపము కొంత విచారిద్దాము. నిదర్శనము. నవనాగరకు డంటే ముక్కు, చెవులు, కళ్ళు, నోరూ లేని మనిషి అనా? అవి లేకపోతే మనిషే కాడు. క్రాపు ఉన్నదనో, మీసాలకు Cutting లోనో, కట్టులో మార్పు ఉన్నదనో, తొడిగిన చొక్కా Cutలో కొత్తో — ఒక్కొక్క నవనాగరీకుడు ఒకదాంట్లో కొత్త చూపిస్తాడు. అట్లాగే నవ్యకవిత్వ మంటే వేషభాషలలో కొంత నవ్యత్వ ముంటుంది. ఇంతేకాని గగనకుసుమమువలె ఆకాశంలోనుంచి ఊడిపడదు.

రాయప్రోలు సుబ్బారావు అభినవకవితామండలి, తృణకంకణము పీఠిక. కవి అయినవాడు శతావధాని కాని, అష్టావధాని కాని కావలసిన రోజులు. ఆ కవిత్వము, ఆ ధోరణిలో పడి తప్పించుకొని నిజమైన కవిత్వములో పడ్డాడు.

Subjects :

తృణకంకణము
స్నేహలతాదేవి
కష్ట కమల
స్వప్న కుమారము
తెలుగు తోట
జడకుచ్చులు
రమ్యాలోకము
ఉమర్ ఖయ్యాం.

కొత్త ఏమిటి ? ఆంగ్లకవిత్వములోనుంచి Lyric తెలుగులోకి తెచ్చినారు.

కావ్యములో కథావస్తువు రాజులో, పురాణపురుషులో అక్కరలేదు. సామాన్యజీవితములో నుంచి కూడా తమకు వచ్చునని చూపినాడు.

కథ చెప్పే విధానములో కూడా మార్పు. ఆశీర్నమస్క్రియ వస్తునిర్దేశాలు అవసరం లేకుండా కథాప్రారంభము. కథ నడపడంలో కూడా మార్పు.

ప్రయోజనము లేకుండా వర్ణనలకోసమే వర్ణనలు చేయడము చాలించినాడు.

ఖండకావ్యాలు వ్రాయడం ప్రారంభించినవాడు - శ్లేషలు-శబ్దాలంకారాలు ప్రధానంగా ఉండే చిత్రకవిత్వముమీద వ్యామోహము పోగొట్టినాడు.

జడకుచ్చులలో తప్ప భాషలో కూడా పూర్వభాషే వాడినాడు.

ఛందస్సులలో కొత్త పోకడలు పోలేదు కాని, పాతఛందస్సులలో కొత్త మాధుర్యము కూర్చినాడు. తేటగీతిని మాలికగా వాడి దాన్ని ఎక్కువ వాడుకలోకి తెచ్చినాడు. జడకుచ్చులలో పాటలు కూడా వాడినాడు. కాని ఎక్కువ భాగము ద్విపద మీదనే నడిపినాడు.

రాయప్రోలు సుబ్బారావు తెలుగుకవిత్వానికి చేసిన ఉపకారము మరిచిపోయేది కాదు. పెడత్రోవలు పట్టిన తెలుగుకవిత్వాన్ని సరియైన దారికి ధైర్యముతో లాగిన కళావీరుడు. ఒక్క ఛందస్సులో తప్ప మిగిలిన కవు లంతా ఈయన చూపిన మార్గాన నడుస్తున్నవారే. ఈ విధముగా అయనప్రాముఖ్యము

గు ర్తెరిగినందువల్లనే జరిగిన నవ్యసాహిత్య పరిషత్తు సమావేశములో బెజవాడలో వీరిని సన్మానించి నవ్యకవు లందరూ ఉపన్యసించినారు. 'కవిశేఖరు' డని ఆయనను సంబోధించినారు.

సున్నితమైన కవితాత్మ కలవాడు. ఇప్పుడు తూగుటుయ్యాలలో ఊగుతున్నా ఒకప్పుడు దారిద్ర్యబాధ రుచి చూచినవాడు. ప్రణయశీలి. సరసుడు. సంస్కారి. అటువంటివాడు ఎటువంటి చక్కని కవిత్వము చెప్పినాడో ఆయన కావ్యాలు చదివినవారికి తెలుస్తుంది.

ఆ సమయంలోనే ఒకవంక గురజాడ అప్పారావుగారు తెలుగుకవిత్వములో సుబ్బారావుగారు వదిలిపెట్టిన కొత్త మార్పులు కొన్ని తెచ్చినాడు. అవి భాష, ఛందస్సు.

అప్పారావుగారు కన్యాశుల్కము వ్రాసిన ప్రసిద్ధ నాటకకర్త. వ్యావహారిక భాషావాదములో శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారికి కుడిభుజముగా నిలిచినవాడు. సంస్కర్త. ధైర్యశాలి. సమర్థుడు.

కవిత్వములో వ్యావహారికభాష వాడి చూపినాడు. భాషతోపాటు ఛందస్సులలో కూడా తప్పనిసరిగా మార్పు తేవలసివచ్చింది. గణబద్ధమైన ఛందస్సులు కాకుండా మాత్రాబద్ధమైన ఛందస్సులు వాడుకలోకి తెచ్చినాడు. పల్లెపదాలు, స్త్రీల పాటలు ఇత్యాది.

వసంతము[1] వచ్చింది. చెట్లు చిగిర్చినవి.

వర్షాలు[2] కురిసినవి. నదులు నిండి పొర్లిపోయి గట్లు తెంపి పారినవి.

యౌవనము[3] వచ్చింది. ఒక కొత్తపొంగు – ఒక కొత్త ఉత్సాహము – ఒక కొత్త శక్తి – ఒక కొత్త ఆవేదన—ఒక కొత్త గర్వము- ఒక కొత్త అహంభావము - ఒక కొత్త ఆర్ద్రభావము - ఒక కొత్త నిగనిగ - ఇట్లా కొత్తవెన్నో అంకురించినవి.

ఒక్కొక్క కాలములో, ఒక్కొక్క దేశములో అటువంటి కొత్త శక్తి[4] పుట్టుతుంది. మన అదృష్టమువల్ల అటువంటి కాలమే ఇది.

సామాన్యంగా లోకంలో రెండు రకాల[5] మనుష్యులుంటారు.

---

1. Spring 2. Rains 3. Youth 4. Newness 5. Two types —
ఈ ఇంగ్లీషుపదాలు ఎందుకో margin లో వ్రాసుకున్నారు శాస్త్రిగారు.

పురాణమ్ ఒకరికి పాతదే కాని రుచించదు. పూర్వకవిత్వము. పూర్వ లక్షణాలు, పూర్వగుణాలు, పూర్వదోషాలు – ఇవేకానికి వారికి పనికిరావు. కాళిదాసంతవాడు కూడా ఇటువంటివారితో అవస్థ పడ్డాడు. అందుకనే,

"పురాణ మిత్యేవ న సాధు సర్వం
న చాపి కావ్యం నవ మిత్యవద్యమ్"

అన్నాడు. మహావిద్వాంసుడు ఐన భవభూతి కాళిదాసుకంటె కూడా సమకాలికులతో అవస్థపడి విసిగిపోయినాడు. ఎక్కువ కఠినంగా అన్నాడు :

"యే నామ కేచిదిహ నః ప్రథయం త్యవజ్ఞాం"

"ఇది ఇష్టం లేనివాళ్ళ కోసము ఇది నేను చెప్పడం లేదు. అనంతమైన ఈ కాలంలో నాతో సమానధర్మము కలవాడు ఇంకొకడు పుట్టకపోడు. వానికోసమే ఇది చెప్తున్నాను" అన్నాడు.

కాబట్టి కొత్త దంటేనే పనికిరానివాళ్లు మునుపూ ఉన్నారు. ఇప్పుడూ ఉన్నారు. ముందూ ఉంటారు.

ఆ విధంగానే కొత్తదైతే సరి వచ్చేవాళ్ళు ఇంకో రకం.[1] మంచైనా, చెడ్డైనా కొత్తదైతే సరి వాళ్ళకు ఇష్టము. పాతదానిముఖం చూడరు. కవిత్వమంతే. తినే వస్తువులూ అంతే. ఇవ్వాళ తిన్న వస్తువు వారికి రేపు రుచించదు. మనుష్యులుకూడాను. ఇవ్వాళ ఇష్టమైనవాళ్ళు రేపు ఇష్టులు కారు

ఈ ఉభయపక్షాలవారూ అతివాదులే. ఆలోచన ఉన్నవాళ్ళు – సమబుద్ధి[2]గలవాళ్ళు balanced people ఈ రెండు పొరపాట్లు చేయరు. కాళిదాసు అన్నట్లు

"సంతః పరీక్ష్యాన్యతరం భజంతే."

విద్వాంసులు గుణము ఎక్కడ ఉంటే అది గ్రహిస్తారు.

ఇక్కడ ఇంకొక ప్రశ్న రావచ్చును. నిజమే – ఇప్పటివాళ్ళుకూడా మంచివే వ్రాస్తున్నారేమో కాని సంస్కృతంలో కాళిదాసాదులకంటే, ఆంధ్రంలో నన్నయాదులకంటే, ఇంగ్లీషులో షేక్స్పియర్ ఇత్యాదులకంటే ఇప్పటివాళ్ళు

1. Extreme love of new. 2. Truth is the middle course.
ఇవికూడా శ్రీ శాస్త్రిగారు మార్జినులో వ్రాసుకున్నవే.

గొప్ప కవనము చెప్పగలరా, అందంగా చెప్పగలరా? పెద్దలు వ్రాసిన గ్రంథా లెన్నో ఉండగా వాటిని మమ్మును చదువుకొని ఆనందించనీయక మీ గ్రంథా లన్నికూడా మా నెత్తిన వేసి బాధించడ మెందుకు అని కొంద రడగవచ్చును.

ఈ ప్రశ్నకు జవాబు చెప్పడము కొంచెము కష్టము. కాళిదాసుకంటె నీ వెక్కువ కవిత్వము చెపుతావా అంటే అవునని చెప్పడానికి ఎవడు సాహ సిస్తాడు !

ఇటువంటి ప్రశ్నకు జవాబు చెప్పలేకనే కొందరు చప్పని పాతవస్తు వుల నన్నిటినీ ముసలివనీ, చనిపోయినవనీ ఒక్కపెట్టున దూషించివేస్తారు. కాళిదాసాది మహాకవుల కవిత్వమే జరాక్రాంతమైతే, మృతవస్తువైతే జీవించి ఉన్నదీ, యౌవనముతో నవనవలాడుతూ ఉన్నదీ వస్తువింకోటి ప్రపంచంలోనే కనపడదు. కాబట్టి short cut జవాబు పనికిమాలినది

నే ననేదేమంటే ఆ ప్రశ్నే పనికిమాలినది. ఆ ప్రశ్న పనికిమాలినది అన డానికి ఎదురుప్రశ్న వేస్తాను. ఆదికవి వాల్మీకి శ్రీమద్రామాయణము చెప్పి నాడు. అంతకంటె ఎక్కువ కవిత్వము చెప్పవలెననే వ్యాసమహర్షి పురాణాలు చెప్పినాడా ? ఆ మహర్షులు ఇద్దరికంటే కొమ్ములుతిరిగినవాణ్ణి అని కాళిదాసు కవిత్వము ప్రారంభించినాడా? వాళ్ళముగ్గురికంటే ఎక్కువవాళ్ళ మని నన్న యాది కవులు కావ్యాలు చెప్పినారా ? వ్యాసమహర్షి వద్దనుంచీ మీ రంగీకరించే కవు లంతా చేసినతప్పు మేమూచేస్తే సహించలేరా ?—అని అడుగుతాను.

ఐతే ఇది వట్టి యుక్తివాదము అంటే అనవచ్చును. నిజంగా ఆలోచిస్తే అటువంటి ప్రశ్నలు వేసేవారికి కవిత్వస్వరూపముగాని, అది కలిగించే ఆనం దముయొక్క స్వరూపముగాని తెలియదన్నమాట.

కవిని స్రష్ట అంటాము. కావ్యము అంటే కవికి ఏదోపొద్దుపోక పొద్దు పోనివాళ్ళకోసము చేసే గారడీ వినోదము కాదు. ఇంగ్లీషులో Creator అంటావు. Creative Instinct అంటాము.

పురుషుడికి పుంస్త్వము ఎటువంటిదో - స్త్రీలకు స్త్రీత్వము ఎటువంటిదో కవికి కవిత్వము కూడా అటువంటిది ఆ శక్తి అపుకుంటే ఆగేది కాదు. బల

వంతాన రమ్మంటే వచ్చేది కాదు. కాబట్టి కవు లయినవాళ్ళు కావ్యాలు చెప్ప కుండా ఉండలేరు. వాళ్ళ జీవమే అది! ఎవరినయినా "నీ వెందుకు బ్రతి ఉన్నావు ?"—అని అడగవచ్చునా ?

అదే విధంగా కవిత్వ మిచ్చే ఆనందముకూడా చిత్రమైన శక్తి కలది కడుపునిండా తింటే గారెలు చేదు! అయితే కవిత్వము అనుభవము తెలిసి వాడికి కడుపు నిండడమంటూ ఉండదు. ఒక్కొక్క కవిత్వ మిచ్చే ఆనందమ ఇంకొక్క కవిత్వ మీయదు. దక్షిణరాయకత్వముతో పోలిస్తే పెద్దలు కొందరి రుచించకపోవచ్చు. కాబట్టి అనేక స్నేహితులు గలవాడితో పోల్చవచ్చును. ఒక స్నేహితుడు కలిగించే సంతృప్తి ఇంకొకడు కలిగించడు.

మహానుభావులతో మనలను పోల్చుకొని మనము బ్రతకడ మెందుక ఆత్మహత్య చేసుకోవచ్చునా? శంకరాచులవంటివాళ్ళు కాదని చిన్నపిల్లలన గంగలో కలుపుతామా? — పోనీ సంతాననిరోధము అవలంబిస్తామా? విసుగ లేకుండా ఇంతమందిని సృష్టి చేస్తున్న భగవంతుడికికూడా బుద్ధిలేదా? మన పిల్లలు మన కానందము కలిగిస్తారు. మన బంధువులు, ఇష్టులు, పరిచితులు మాట్లాడే మాటలు మన కానందము కలిగిస్తవి. వాళ్ళ కష్టసుఖా లంటే మన కెక్కువ ఆదరము. సృష్ట్యాదినుంచి పుట్టి బ్రదికి చచ్చిపోయిన అందరికంటే ఇప్పటివాళ్ళు ఎక్కువవా రనా మన కీ ఆదరము? కాదు. మనము జీవించి ఉన్నాము కాబట్టి జీవముతో ఉన్నవారిమీద మన కాదరము ఎక్కువ. ఇప్పటి కవుల కష్టసుఖాలు మన కెక్కువ దగ్గర. వారి కల్పనలు మన కెక్కువ తృప్తి కలిగిస్తవి. వారి వాక్కులు మనకు ఎక్కువ మధురంగా ఉంటవి. కాబట్టి నవ కవిత్వము ప్రతివాడికి ఒక ఆప్తమిత్రుని వంటిది. ఆప్తమిత్రులు ఎక్కువై పోయినారు వద్దనుకొనేవాళ్లు ఎవరయినా ఉంటారు. నవ్యకవులలో ప్రథముడు రాయప్రోలు సుబ్బారావు ఏమన్నాడు?

"వల దనెడివార లెవ్వ రవ్యక్తమతులు
ఆదరింపనివా రెవ్వ రాదువాంధ్రుడు?"

(తెనుగుతోట పేజి 18)

"కిన్నెరలు పాడుచున్నవి గీతములను" మొదలయినవి.

కావ్యాదులలోనుంచి కొత్త ఛందస్సులు వాడుకలోని తెచ్చినాడు. మేలు కొలుపుల పాటల ఫణితిలో ముత్యాలసరాలు ఎక్కువ వ్రాసినాడు.

మెచ్చనంటా వీవు ...
మెచ్చకుంటే మించిపోయెను
కొయ్యబొమ్మలె మెచ్చు కళ్లకు
కోమలుల సౌ రెక్కువా ?

తాను కవిత్వము :

కొత్త పాతల మేలు కలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా

చెప్పుతా నన్నాడు.

కవిత్వములో ఈయన తెచ్చిన మార్పు ప్రత్యక్షంగా స్థూలదృష్టికికూడా కనపడుతుంది. సుబ్బారావుగారు తెచ్చిన మార్పులు సూక్ష్మమైనవి.

అప్పారావుగారుకూడా చక్కని కవిత్వమే చెప్పినారు. అయితే ఆయన కవిగా కంటె కవులకు మార్గదర్శి ఐనాడనే ప్రఖ్యాతి ఎక్కువ ఉంటుంది. సుబ్బారావుగారికి కవి అనే ప్రఖ్యాతి మార్గదర్శకు డనే దానితోపాటు నిస్సందేహంగా ఉంటుంది.

సాక్షాత్తు సుబ్బారావుగారి మార్గములోనే అబ్బూరి రామకృష్ణారావుగారు "మల్లికాంబ" అనే కావ్యము ఒకటి ప్రచురించినారు. గురజాడ అప్పారావుగారి త్రోవలోనే బసవరాజు అప్పారావుగారు ఖండకావ్యాలు ప్రచురిస్తూ వచ్చినారు. బసవరాజు ఎక్కువ కవితాత్మ కలవాడు. ఆయన చెప్పిన కవిత్వము తక్కువ. వృద్ధిలోకి రావలసినవాడు. అకాలమృత్యువు వాత పడ్డాడు.

ఈ సమయంలో "సాహితీసమితి" వెలసి దేశంలో 'సాహితి'అనే పత్రిక ఒకటి ప్రకటించసాగింది.

Direction by Sastry. His capacity as poet, maker. *

మొదటలో శాస్త్రి కవిత్వమూ ఎక్కువ చెప్పలేదు. శాస్త్రి, స్వామి, శర్మ, వెంకటసుబ్బయ్య, దీక్షితులు, కొమాండూరి, చామర్తి, నోరి కూడాను.

తర్వాత వేదుల, దేవులపల్లి, విశ్వనాథ, కొడాలి ఆంజనేయులు, నండూరి, నాయని చేరినారు. అందులో నలుగురు Resign చేసి స్వతంత్రులయినారు.

వాళ్ళకవిత్వాలు అందులో నండూరిలో speciality.

భాష ఏదైనా పనికివస్తుందన్నాడు.

దేవులపల్లి ప్రచారకుడైనాడు. విశ్వనాథ ప్రసిద్ధుడైనాడు.

కొడాలి సుబ్బారావు ఒక్కడూ ప్రత్యేకము.

దువ్వూరి రామిరెడ్డి, రాయప్రోలు వారి పద్ధతితో పల్లెల జీవనము ఎక్కువ చిత్రిస్తారు.

బొడ్డు బాపిరాజు - అడవి బాపిరాజు.

ఇంతలో అతినవ్యకవిత్వము వచ్చింది.

శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణబాబు, ఉమామహేశ్, పఠాభి రామిరెడ్డి, పిలకా, జనమంచి, కొంపెల్లి, ఇంద్రకంటి.

జాషువా కవికి కొన్ని ప్రదేశాలలో ప్రసిద్ధి ఉన్నది. ఆయనకు నవ్యమార్గాలు ఉన్నవి. కాని, నవ్యులంటే ఆయనకు ఇష్టము లేదు. పద్యాలు ధాటీగా చెప్పతాడు. కాని, శతావధానకవిత్వము పద్ధతి పోలేదు. ఆ కవిత్వము పదిమందిలో మంచి కంఠముతో చదివితే విన్నప్పుడు రక్తి కట్టుతుంది. కాని ఒంటరిగా, శాంతముగా చదువుకొంటే bad taste లో ఉంటవి. ఆ సమయములో వ్యావహారిక భాష ప్రయోగిస్తాడు.



ఈ వ్యాసంలో ఇలాగే ఇంగ్లీషులో వాక్యాలూ, వాక్యాంశాలూ కనిపిస్తున్నవి. ఆయా విషయాలను ఇంకా వివరించాలని శ్రీ శాస్త్రిగారు అనుకొని ఉండవచ్చు.

# సాహిత్యము

## ౧

లోకమంతయు అనేక భేదములతో నొప్పారుచున్నది. ఇన్ని భేదము లను విచారణ చేయగా చేయగా ముఖ్యముగా ద్వంద్వము లని గోచరింపగలదు. సుఖదుఃఖములు-జయాపజయములు - లాభాలాభములు- స్త్రీ పురుషులు-ఆర్యులు అనార్యులు - పండితులు పామరులు - ధనికులు పేదలు - దొరలు దొంగలు— వాక్కు అర్థము — ఈ విధముగా అనంతకోటి ద్వంద్వములు మన మూహించు కొని పోవచ్చును.

ద్వంద్వ మున్నప్పుడు ఆ రెండింటికి సంఘర్షణ ముండుట తప్పనిసరి. సంఘర్షణము సాధారణముగా కల్లోలమునకు దారితీయును. పరస్పరము ద్వేషిం చుట, ఒకరిపై నొకరు కక్షలు పెంచుకొనుట జరుగుచుండును. నేటి ప్రపంచ స్థితిగతులే దానికి తార్కాణము. జగద్రాజ్యములకు అధినేతలు బుద్ధిమంతులే కాని ఇప్పటి పరిస్థితులనుబట్టి ఆలోచించినచో అందులో సందేహము కలుగు చుండును. ఈ భూలోకమునే విద్వేషజాడ్య మావహించినదా యనిపించును.

సుఖదుఃఖములు, లాభాలాభములు, జయాపజయములు సమముగా భావిం చుచు వానికి అతీతులయినా నిర్మలు లయినవారు కొందరుందురు. వారు జ్ఞానులు. వారికి ఈ ద్వంద్వ శక్తులను సమన్వయము చేయవలసిన అవసర మే లేదు, గనుక సాహిత్యముతో స్వయముగా పని లేదు.

అజ్ఞానుల స్థాయిని — అందులో లేకున్నను శాంతి నాకాంక్షించు కర్మ వీరులు లోకములో ననేకు లున్నారు. వారికి బంధము లున్నవి ; కామ క్రోధము లున్నవి ; ప్రేమ ద్వేషములున్నవి ; సుఖదుఃఖములున్నవి. ఐనను ఈ ద్వంద్వ ములకు సామరస్యము కూర్చుటకు వారు యత్నింతురు. వారు భూమ్యాకాశము లకు అంతరిక్ష మనే నిచ్చెన వేసెడివారు. లోక మనే మహావార్ధిని తరచి తరచి అమృతమే కావలెనని కాంక్షింతురు. వారు వాగర్థములకు సామ్యము కావలె నని

కోరుదురు. అట్టివారికి సాహిత్యమవసరము అట్టివారికొరకే ఆదికవి రామ రావణ యుద్ధముతో సీతామహాదేవిని సాధించెను. ఇంకొక కవిఋషి కురు పాండవ సంఘర్షణముతో ధర్మజయము పుట్టించెను.

మరియొక మహాకవి ఊర్వశీ పురూరవుల ప్రణయచిత్రణముతో దేవ మానవులకు సంబంధము ప్రతిపాదించి, దిలీపాది ధర్మప్రభువులతో అగ్నివర్ణుని విషయలోలుపత కలిపి వంశగ్రథన మొనర్చి, కామదహనముతో గౌరీశంకరు లకు కుమారసంభవము కావించి, ఋషివాటికలను నగరాలంకారములుగా శోభిల్లునట్లు చేసెను.

సాహిత్యము లోకమందలి సమస్త ద్వంద్వశక్తుల కలయిక. ఆ శబ్దమే సహిత భావమును ద్యోతము చేయును. సృష్టి సర్వము ద్వంద్వముల సంయో గము వల్లనే కలుగుచున్నది. కావుననే సాహిత్యపరులు సృష్టికర్తలు. వారి సృష్టిలో విరుద్ధశక్తులకు సామరస్యము కలిగి శాంతి యుదయించును.

శాంత మనగానే అది నల్లమందు వంటి మాదకద్రవ్యమా అని కొంద రడుగుదురు. కవులు నల్లమందు వ్యాపారులా అని అడిగినవా రున్నారు. కాని నల్లమందు శాంతి కలిగింపదు. అది మత్తునిద్ర మాంద్యము కలిగించును. అది తామసగుణమునే ఉద్రేకింపజేయును. శాంతము తామసగుణము కాదు. అది సత్వగుణముయొక్క నివాసస్థానము. అది యొక చైతన్యవిశేషము, అది ఉత్సా హాతిశయము, ధీరత్వము, వీరత్వము, నిర్వేద మనబడు సంపూర్ణత్వము.

సాహిత్యము శాంతము కలిగించునది. కనుక అది విప్లవశక్తి కాదని వేరుగా చెప్ప నవసరము లేదు. కాని, విప్లవకవులని ఈ కాలములో కొందరిని ప్రశంసించుచుండుట సాధారణమైనది కనుక ఈ విషయము ప్రస్తావింపవలసి వచ్చినది. ప్లవము అనగా తరింపజేయునది. దానికి విపరీత మైనది అనగా పుట్టి ముంచునది విప్లవము. విప్లవశబ్దమున కర్థము సరిగా తెలిసినవారు అది మంచి సాహిత్యస్రష్టలకు విశేషణముగా నెన్నటికి ప్రయోగింపరు.

సాహిత్యసృష్టి, బ్రహ్మసృష్టి అనబడు ఈ జగత్సృష్టికంటె విలక్షణ మైనది. బ్రహ్మసృష్టి అదృష్ట మైన కర్మఫలాదులచే నియతమైనది. ఆ బాధ కావ్యసృష్టిలో లేదు. బ్రహ్మసృష్టి అస్వతంత్రమై అణ్వాదుల సమ్మేళనములమీద

ఆధారపడియున్నది. సాహిత్యసృష్టికి అట్టి అస్వాతంత్ర్యము లేకుండుటచే స్వతంత్ర మైనది. బ్రహ్మసృష్టిలో సుఖమే కాక దుఃఖమూ ఉన్నది. కావ్య సృష్టిలో సుఖదుఃఖము లున్నను అవి సమ్మేళన మంది ఆహ్లాద మొక్కటే కలి గించును. బ్రహ్మసృష్టిలో ఆరే రసములు; అవియును అన్నియు రుచికరములు కావు. కావ్యసృష్టి నవరసరుచిర మైనది - ఆ రసములు నిత్య నూతన మైనవి. అవి తొమ్మిది. అవి యన్నియు మనోజ్ఞమైనవి.

సాహిత్యము మానవజాతి చింతాశల్యములకు విశల్యకరణి. అది లోక మందలి సమస్త ద్వంద్వములకు సంధానకరణి. అది పరస్పరవిద్వేషములకు సావర్ణ్యకరణి. అది క్రోధాది శత్రుబాధా మూర్ఛితులకు సంజీవకరణి.

కరుణగీతికలు పాడి లోకములోని కాఠిన్యమును కవు లుపశమింపజేయు దురు; హాస్యకథలు వినిపించి వివేకము కలిగింతురు; వీరుల సుద్దులు చెప్పి ఉత్సాహము రేకెత్తింపజేయుదురు; భయానకములు విస్తరించి ధీరత ప్రతిష్ఠిం తురు; రౌద్రము ప్రదర్శించి అధర్మక్షయమునకు పురికొల్పుదురు; ప్రేమగాథ లతో వారు లోకము అమృతతరంగితము చేయుదురు; అద్భుతకథనముతో సర్వతోముఖమగు విజ్ఞానతృష్ణ పెంపొందింతురు; శాంతముతో సమస్త ద్వంద్వ ములకు సుఖసంయోగము కలిగించి లోకకల్యాణము సృష్టి చేయుదురు.

సాహిత్యస్రష్టలు మనుష్యభావతత్త్వవేత్తలు. ఈ భూలోకములోని మిత్రుపల్లములను సమానముగా చూడగల ఆకాశచారులు. వారి కల్పనలు జగ న్మంగళకరములయిన ఇంద్రజాలములు. అట్టిదే ఉత్తమ సాహిత్యము!

## సాహిత్యలక్ష్యము



నేడు జగత్తుకు ఉద్వేగము ప్రధానలక్ష్యముగా కనిపించుచున్నది. అందు చేత, అదియే సాహిత్యమునకు లక్ష్యము అను భావముకూడ లోకములో నిప్పుడు ప్రబలినది. అది ఎంతవరకు సత్యమో, ఆ భావము ప్రబలుటకు మూలకారణ మేదో కొంత విచారింతము.

గ్రహము పూనినవాని చుట్టును నలుగురు చేరి నాలుగుమాట లనినకొలది ఆతని యావేశమును పెచ్చుపెరుగును. అట్టివాడు అరచి అరచి చివరకు నిస్సత్తువతో క్రింద పడిపోవును.

మనశ్శాంతి లేనివా రెందరో మద్యపానము కావించుట మన మెరుగుదుము. త్రాగినకొలదియు మరింత త్రాగవలెనను తృష్ణ అట్టివారికి పెరిగిపోవును. త్రాగిత్రాగి అసంబద్ధాసభ్యప్రలాపములు చేసిచేసి తుదకు నీరసావస్థలో నేలకు వాలిపోవుట మనము చూచుచుందుము.

ఇట్టిది కేవలము శారీరకవిషయములకు మాత్రమే సంబంధించినది కాదు. ఐశ్వర్యమదము, అధికారమదము తలకెక్కినవారుకూడ అంధులై పేదలను, పాలితులను కొల్లగొట్టి తుదకు తామే దరిద్రులై పతితులయినవారిని చాలమందిని మన మెరుగుదుము.

తామసశక్తులను ఏదో విధముగా వశపరచుకొని కొంతకాలము దేవాదులనుకూడ జయించి, బాధపెట్టి, చివరకా తామసశక్తికే వశులై ఒండొరులతో కలహించి మృతులైన సుందోపసుందులను గూర్చి పురాణములలో చదివియున్నాము. అట్టివారిని ప్రత్యక్షముగాకూడ ఈ లోకములో చూచుచున్నాము.

అందువలననే ఉద్వేగము - ఆవేగము - ఆవేశము- ఇత్యాది పదములతో నేటి విమర్శకులు కొందరు ఉద్దేశించుచున్న భావము కలిగించుట నిజముగా కవిత్వ లక్ష్యమా అని మనము ప్రశ్నించుకొనవలసిన యవసరము కలిగినది.

అట్టి శక్తి సాహిత్యమునకు ఉన్నదనుటకు సందేహము లేదు. సంగీతమువలెనే సాహిత్యముకూడ సర్వతోముఖ మగు శక్తికల సాధనము. నిద్ర పుచ్చుటకు లాలిపాటలు, నిద్ర లేపుటకు మేలుకొలుపులు పాడుట మన మెరుగుదుము. త్రాగినవారు లల్లాయిపదములు పాడుదురు. వీరభటులు వీరగీతముల లయకు అనుకూలముగా అడుగులు వేయుచు కదనరంగములో ముందుకు సాగుదురు. స్త్రీపురుషులను మోహింపజేయుటకు నటీనటులు కామోద్దీపకము లగు పదముల కనుగుణముగా నృత్య మొనరింతురు. పనిపాటలు చేసుకొనువారుకూడ వారివారి వృత్తుల ననుసరించి పడవపాటలు, కలుపుపాటలు, సువ్విపాటలు, ఏలపాటలు మొదలయినవి పాడుచు పనులు చేసికొందురు. ఈ యన్నిటిలో సంగీతము,

కవిత్వము రెండును మిళితములై యున్నవి. ఇన్ని విధములుగా కవిత్వము ఉపయుక్త మగుచున్నను కవిత్వలక్ష్య మిదే యని పైనుదాహరించిన వానిలో ఒకటిగాని, కొన్నిగాని, అన్నియుగాని అవు నని చెప్పనగునా ?

మానవుల ప్రవృత్తి అనేక విధములుగా నున్నది. కొందరి లక్ష్యము ధన సంపాదనము. కొందరి లక్ష్యము సుఖభోజనము. మరికొందరి లక్ష్యము కాముకత. ఎప్పుడు చూచినను కొందరు నిద్రించుచుందురు. ఎక్కడ చూచినను పోట్లాడుచుండువా రున్నారు. క్షణమైనను ఒకచో కాలు నిలువక నిరంతరముగా ఒకస్థలమునుండి మరియొకస్థలమునకు తిరుగాడువా రున్నారు. ఐనను ఆ యా మానవుల జీవితలక్ష్యము లవి యవి యని చెప్పనగునే కాని మానవజీవితమునకే ఆహారనిద్రాభోగాదులే లక్ష్యము లనుట సమంజసము కాదుకదా !

అదే విధముగా సాహిత్యమున కున్న ఉపయోగములనుబట్టి సాహిత్య లక్ష్యము నిర్ణయింపరాదు. ఉత్తమమానవుల ప్రవృత్తినిబట్టి మానవ జీవిత లక్ష్యము నిర్ణయించునట్లే, ఉత్తమ సాహిత్యమును అనుసరించియే సాహిత్య లక్ష్యము—సాహిత్యాదర్శము నిర్ణయింపవలె ననుట అసమంజసము కాదుకదా !

ఇది యింత స్వల్పవిషయ మైనను నేటికాలములో సాహిత్య విమర్శకు లనబడువారు దీనిని విస్మరించి ప్రవర్తించుచున్నందున ఇది ప్రస్తావింపవలసి వచ్చినది.

ఆవేశము – ఉద్వేగము కలిగించుట సాహిత్యలక్ష్య మను భావము ముఖ్యముగా మనకు పాశ్చాత్య సాహిత్యములతో సంపర్కము కలిగినప్పటినుండియు ప్రవేశించి నానాటికి ప్రబలుచున్నది. మన మనఃప్రవృత్తులకు అనుకూలముగా మన ఆదర్శము లప్పటప్పటికి కల్పించుకొనుచుందుము. పాశ్చాత్య సంపర్కము వల్ల అంకురించిన ఈ భావము మన పూర్వసాహిత్య వేత్తలకు అనుకూలమా, విరుద్ధమా ? విరుద్ధమైనచో ఏది ఉపాదేయము ? ఏది గ్రాహ్యము ?

ఈ పాశ్చాత్య సంపర్కమువల్ల అంకురించిన భావము మూలకారణము తెలియుటకు పాశ్చాత్యుల సాహిత్యాదర్శములకు మూలసూత్ర మేదో కొంత స్థూలముగా నిక్కడ విచారణ చేయుట యుక్తము.

పాశ్చాత్యుల సాహిత్యశాస్త్రానికి మూలపురుషుడు అరిస్టాటిలు అను గ్రీకుతాత్త్వికుడు. ఆతడు క్రీస్తుశకమునకు పూర్వము నాల్గవశతాబ్దములో పొయి టిక్సు అను గొప్ప గ్రంథ మొకటి రచించెను. ఆతడు అందులో సాహిత్య మంతయు ఇతర కళలవలెనే ప్రకృతికి అనుకరణము, ప్రతిబింబము అని నిర్వచించెను. ఆ విషయము ప్రత్యేకముగా ఇంకొక ప్రకరణములో విచారింప బడును.

ఆయన సాహిత్యగ్రంథము పుట్టినప్పటినుండి ఇప్పటికి నాలుగు వందల సంవత్సరములవరకుకూడ యూరపుఖండ మందంతటను తిరుగులేని సాహిత్య సిద్ధాంత ప్రమాణగ్రంథముగా అంగీకరింపబడుచుండెను. తర్వాత ఈ మూడు నాలుగు వందల సంవత్సరములలో పాశ్చాత్య సాహిత్య వేత్తలు అరిస్టాటిలు సిద్ధాంతములతో పూర్తిగా ఏకీభవింపకపోయినను, ఆయన ప్రధానసిద్ధాంతము లను మాత్రము అంగీకరించుచునే ఉన్నారు. నేటికిని అంతకంటె ప్రమాణకోటి నలంకరించు గ్రంథ మింకొకటి లేదనుట అతిశయోక్తి కాదు.

ఆ గ్రంథములో ఆయన సాహిత్యశాఖలను విచారించి వాని యన్నిటిలో ఉత్తమ మైనవి ఎపిక్, ట్రాజెడీ అనున వని ముందు నిర్ధారణ చేసెను. ఎపిక్ అనగా ఇతిహాస మనవచ్చును. ట్రాజెడీ అనగా విషాదాంతమైన ఉదాత్త నాటకము. ఈ రెండిటిలోగూడ ట్రాజెడీ శ్రేష్ఠతరమైన సాహిత్యశాఖ అని అరిస్టాటిలు మతము.

ఆయన మతములో ఈ ట్రాజెడిలో ఉన్న విశేష మేమి? సూత్రప్రాయ ముగా ఆయనమత మీ విధముగా నిర్వచింపవచ్చును. "ట్రాజెడీ చదివిన చదు వరులకు గాని ప్రదర్శనము చూచిన ప్రేక్షకులకుగాని అంతరంగములోని (భయము, జాలి, కరుణ) భయ కరుణ భావములు విపరీతముగా ప్రకోపించి అవి బయటికి వెళ్ళగొట్టబడును."

అదే వివరించినచో వాంతిభేదులు కలిగించు మందులు దేహమునకు చేయు చికిత్సవంటి చికిత్సనే అంతరంగభావములకు ఈ ట్రాజెడీలు చేయును. అనగా వాంతిభేదులవలన దేహమునకు కలుగు స్వాస్థ్యమువలెనే ట్రాజెడీ అను ఉత్తమోత్తమ సాహిత్యశాఖ కూడ భయ కరుణలకు ఉపశాంతి కలిగించి అంత రంగమునకు సామరస్యమువంటిది, శాంతివంటిది చేకూర్పగలదు.

ఎక్కువ పరుగెత్తినవానికి -బడలికవల్ల కాళ్ళాడక ఆగిపోవును. తీవ్రముగా జ్వరము వచ్చినవానికి లోపలిశక్తి ఉడిగినపిమ్మట దేహమున శైత్యమావహించును. దుఃఖ మతిశయించి ఏడ్వగా ఏడ్వగా చివరకు మూర్ఛవచ్చును. మితిమీరి మద్యపానము చేసినవానికి నిద్రవచ్చును. అట్లే ఆరిస్టాటిలు సిద్ధాంత రీత్యా ఉత్తమసాహిత్యలక్ష్యము మృత్యుముఖముగా పాఠకులను, సామాజికులను తీసికొనుపోవు తామసశక్తులను ప్రకోపింపజేయుటే యని సూక్ష్మదృష్టితో ఆలోచించినవారికి ద్యోతము కాగలదు. అది శాంతివలె స్థూలదృష్టికి గోచరించినను నిజముగా నది శాంతి కాదు. అది నిద్ర. అది క్షుధ. అది తృష్ణ. అది జర. అది రుజ. అది మృత్యువు !

ఇప్పటి మన నవనాగరకులు తాము చదివిన పుస్తకముల ప్రభావమును గురించి ఈ విధముగా చెప్పకొనుచుండుట వినుచుందుము.

> " ఈ పుస్తకము నన్ను కదలించివేసినది - ఈ గ్రంథము చదివినంతసేపు ఆవేశము పట్టరాకుండ పెరిగిపోయినది - ఇందులోనిపాత్రలు నన్ను రాత్రింబవళ్ళు మనస్సులో పూనినట్లు విడువకున్నవి-ఇది మొదలు పెట్టిన దగ్గరనుండి పూర్తి చేయువరకు ఇంకొకపని చేయలేకపోతిని - అంత దూరపుప్రయాణమూ ఈ గ్రంథ కాలక్షేపముతో క్షణము వలె గడచిపోయినది."

ఇత్యాదికముగా ఆ యా పుస్తకాల గుణాలు స్తుతి చేయుదురు. గ్రంథము చదువవలెనను ఉత్కంఠ కలిగించుట నిస్సందేహముగా దాని గుణములలో నొకటే కాని ఎందువల్లనోగాని,

> "ఇది రమ్యముగా నున్నది - ఇది మనోహరముగా ఉన్నది - ఇది చదువుచున్నంతసేపు హృదయములో అమృతస్రావ మవుచున్నట్లున్నది - ఇది ఆనందము కలిగించినది."

ఇట్టి మాటలు సకృత్తుగాగాని పాఠకులనుండి వినకున్నాము. మన నాగరికుల సాహిత్యసీమలో పాశ్చాత్యవాతావరణము సంపూర్ణముగా ఆవరించినది. ఇట్టి పాఠకుల ఇచ్ఛల కనుకూలముగా కావ్యనిర్మాతలదృష్టికూడ మార్పు చెందుచున్నది. రోగులకు అపథ్య వస్తువులమీదికి కోరిక ప్రసరించుట సహజమే. కాని

సాహిత్య భిషక్కులుకూడ వారికోరికల కనుకూలముగానే పథ్యము నిర్ణయింప వచ్చునా ? అటువంటివైద్యులు రోగులకు తాత్కాలికముగా ప్రియులు కావచ్చు గాని వారు వైద్యులేనా ?

మన దేశములోగూడ అతి ప్రాచీనకాలమునుండి కావ్యలక్షణములు కావ్య లక్ష్యము విచారణ చేయుచునే ఉన్నారు. మన లక్షణవేత్తల కాలనిర్ణయము చరిత్రకారులు సరిగా చేయలేకున్నందున వీరే పూర్వులో, అరిస్టాటిలు పూర్వుడో నిర్ణయింప సాధ్యము కాదు. ఎవరు పూర్వులయిన నేమి ? ఎవరిది ఉపాదేయ మనిగదా మన ప్రశ్న !

మన లక్షణవేత్తలు కొందరు రసాత్మకమైన వాక్యమే కావ్య మన్నారు. కావ్యాత్మ ధ్వని యన్నవా రున్నారు ; రీతి యని కొందరనిరి. ఔచిత్యమునకే ప్రాధాన్య మిచ్చినవారును కలరు ; అలంకారములకు ప్రాముఖ్య మొసంగినవా రును లేకపోలేదు. ఎన్ని మతము లున్నను లక్షణపరిష్కారముకొరకై ఏ శబ్ద ములతో అవస్థ పడినను, అందరు ప్రధానముగా రసవిషయము చర్చించినవారే. అందువల్ల మొత్తముమీద మన లాక్షణికుల దృష్టిలో రసనిష్పత్తియే కావ్య లక్ష్య మనెడి భావమే ప్రబలమైన దనుటలో సందేహము లేదు.

ఇక ఈ రస మేమిటి ? దాని స్వరూపమును ఒక రీతి విధముగా నిర్వ చించినారు. "రసము సత్త్వోద్రేకము వలన అఖండ స్వప్రకాశానంద చిన్మయ మయినది. అది వేద్యాంతర స్పర్శశూన్యము, బ్రహ్మాస్వాదసహోదరము. దానికి ప్రాణము లోకోత్తర చమత్కారము. ప్రమాతలచేత స్వాకారముకంటె అభిన్న ముగా ఈ రస మనునది ఆస్వాదింపబడుచున్నది. ఇది రజస్తమోగుణములచేత అస్పృష్టమైన సాత్త్విక మను మనోధర్మము. — ఈ రససంతతిని యోగులవలె పుణ్యవంతులు ఆస్వాదింతురు !

పై మాటలనే మరొకవిధముగా చెప్పుకొనినచో ఈ రసము సాత్త్విక మైన ఒకానొక అనుభవమనియు, అది బ్రహ్మానందముతో పోలిక కలదనియు, యోగులవంటి పుణ్యశీలురు దాని నాస్వాదింతు రనియు చెప్పనగును. అది కద లిక లేని నిస్తబ్ధమైన జడభావము కాదు. అది ఉద్రేకమువలననే జనించును ; కాని అది సత్త్వోద్రేకము.

ఇప్పు డిక రసనిష్పత్తి కావ్యలక్ష్యముగా గల మన పెద్దల ఆశయము గొప్పదో, వాంతిభేదులవల్ల వచ్చెడి దేహస్వాస్థ్యము వంటి భయ కరుణాదుల ఉపశాంతి ఉత్తమ కావ్యలక్ష్యముగా గల అరిస్టాటిలు ఇత్యాదుల ఆశయము గొప్పదో వాచ్యముగా వివరింప నవసర ముండదు.

రసము నిజస్వరూపములో ఒకటే యైనను దాని విచారణ చేసినచో నది తొమ్మిది స్థాయిలలో తొమ్మిది విధములుగా ప్రతీయమాన మవుచున్నది. రసములు తొమ్మిది లేవు ఎనిమిదే, శాంతము రసము కాదు, అది ఇతర రసముల సామరస్య మన్నవారు కలరు. వాత్సల్య మని పదవ రసము కలిపినవారును ఉన్నారు. ఇట్టి స్వల్పపు హెచ్చుతగ్గు లున్నను నవరసవాదమే భరతముని నాటినుండి నేటివరకు లాక్షణికుల ప్రబల సమ్మతి పొందిన మత మనుట నిర్వివాద విషయము.

ఈ రసము లన్నిటిలో బహుసూక్ష్మ మైనది శాంతరసము. అందువలననే అది ప్రత్యేక మొక రసమా యను సందేహము కొందరికి కలిగినది. అద్భుతాది శృంగారాంతమైన తక్కిన రసములు శాంతములోనుండి సృష్టిక్రమములో వివర్తము నొంది మరల సంహారక్రమములో శాంతరసములో లయమందు నను విషయము రసోపాసన చేయువారికి స్ఫురింపకపోదు. అందువల్ల ఇతర రసము లన్నిటికి గమ్యముకూడ నని గ్రహింపనగును.

శాంతరసమునకు స్థాయీభావము నిర్వేదము. నిర్వేద మనగా నిత్యానిత్య వస్తువివేకము వలన జన్మించిన విషయవిరాగము.

దీనినిబట్టి శాంతరస ప్రధానమైన కావ్యము ఎవరో యోగులను వేదాంతులనే కాని సామాన్యమానవుల నాకర్షింప దను భావము కలుగవచ్చును. కాని యది భ్రాంతి. వ్యాసరచితమైన మహాభారతమును ప్రత్యక్షముగానో, అనువాదముల వల్లనో తెలియని రసజ్ఞులు లోకములో నుండరు. మహాభారతము శాంతరసప్రధాన మైన మహాకావ్యమని సాహిత్యలక్షణవేత్తలలో అగ్రగణ్యులు నిర్ణయించిరి. మహాభారతములో నున్నంత ఘర్షణము, పాత్రవిస్తృతి, పాత్రవైవిధ్యము, కథాచమత్కారము కల కావ్యము లోకములో నెక్కడను, ఏ కాలములోను ఇంతవరకు పుట్టియుండలేదు. అది విశ్వజనీనమని నిత్యసత్యవచను లగు నన్నయభట్టారకులు నిర్దేశించినారు. కావున శాంతరసప్రధాన మయిన కావ్య

ములు ఈ లోకముతో సంబంధము లేని ఏ కాలమందికో ఉద్దేశించినవని భావించుట తగవు కాదు.

అంతమాత్రముచేత కావ్యము లన్నియు శాంతరసప్రధానములుగా ఉండవలె నను నియమము లేదు. కావ్యజాలముకూడ ఒక మహాప్రపంచము. చక్షురాదీంద్రియములచేత మనము తెలిసికొనుచున్నా మనుకొనుచున్న ఈ బాహ్య ప్రపంచముకంటె కావ్యప్రపంచము కూడ ఏ మాత్రము తక్కువ సత్యమైనది కాదు. ఒక్కొక్క కావ్యము ఒక్కొక్క రసప్రాధాన్యము కలిగి యుండవచ్చు. ఐనను అన్నియు పాఠకులను శాంతోన్ముఖులనుగా చేయునవిగా ఉండవలె.

కావ్యలక్ష్యము అశాంతి కాదు. కావ్యనిర్మాతలు తామసశక్తులను ప్రకోపింపజేసి విద్వేషణము, ఆవేశనము, స్తంభనము, మారణము ఇత్యాది హేయ క్రియలకు తమ సృష్టిశక్తిని ఉపయోగింతురా? అట్లు చేయువారు కవి రాక్షసులు.

ఉత్తమ కావ్యలక్ష్యము శాంతము. అది సాత్త్వికగుణము కలది. అది జ్ఞానస్వరూపము, ఆనందస్వరూపము కాని మూర్ఛాది స్వరూపము కాదు. కావ్యములు ఆనందపర్యవసానముగా నిర్మించువారు కవివృషభులు. వారిని ఉద్దేశించియే పెద్దలు "నానృషిః కురుతే కావ్యమ్" అన్నారు.

## సాహిత్య స్వరూపము: ప్రకృతికి అనుకరణమా?

### 3

వెనుకటి ప్రకరణములో సందర్భవశమున అరిస్టాటిలు తన పొయిటిక్సు అను సాహిత్యకగ్రంథములో సాహిత్యమంతయు ప్రకృతికి అనగా సృష్టికి అనుకరణము అనె నను విషయము ప్రస్తావింపబడినది. అది ఎంతవరకు గ్రహింపదగినదో ఇప్పుడు కొంచెము విచారింతము.

ఈ విచారణ చేయుటకు ముందు ఈ ప్రయత్నము అరిస్టాటిలు సిద్ధాంతములను పాశ్చాత్యసిద్ధాంతములను చులకనచేయు నుద్దేశముతో చేయునది కాదు.

అరిస్టాటిలు గ్రీకుతాత్త్వికులలో అగ్రగణ్యుడు. లోకములో సాహిత్యస్వరూపమును నిర్వచించు గ్రంథములలో ప్రథమశ్రేణిలో అతని గ్రంథమున కొక గౌరవస్థాన మున్నది. అది విస్తృతిలో చిన్నదే యైనను స్వరూపములో మహర్షుల సూత్రగ్రంథములవలెనే గొప్పది. సాహిత్యవిదు లందరు అది ముఖ్యముగా పఠించి మననము చేయుట అవసరము. ఆ గ్రంథమునందు మాకున్న గౌరవ భావముచేతనే అందలి మూలభావము లిందులో విచారింపబడుచున్నవి.

అరిస్టాటిల్ మతములో ప్రకృతిని అనుకరించునది ఒక్క సాహిత్యమే కాదు, లలితకళ లన్నియు ప్రకృతికి అనుకరణములే. ప్రకృతి యనగా మన దేశ పరిభాషలో బ్రహ్మసృష్టి యని భావించుట యుక్తము.

"ఇతిహాసకావ్యములు, నాటకములు, పాటలు Dythirambies ను, వేణు వీణావాద్యములు చాల భాగమును అనుకరణములు. అనుకరణమునకు అవి ప్రయోగించు సాధనములలోను, అనుకరించు వస్తువులలోను, అనుకరించు పద్ధతిలోనే వానిలో పరస్పరభేదము లున్నవి."

"కొందరు మానవులు కళలద్వారాను, మరికొందరు అభ్యాసవశమునను బాహ్యవస్తువులను వర్ణము, రూపము, స్వరము అను మూడింటితో అనుకరింతురు. పైన ఉదాహరించిన కళలు లయ, శబ్దములు, రాగము అను మూడు సాధనములలో ఏదో యొకదానితో గాని రెండు మూడిటి సమ్మేళనముతో గాని అనుకరించును."

"ఈ ఉదాహరణములతో పై వాక్యములు వివరింపవచ్చును. వీణావేణు వాద్యములు తమ అనుకరణమున రాగమును, లయను గ్రహించును. కొన్ని విధములగు నృత్యములు రాగముకూడ నవసరము లేకుండ కేవలము లయనే గ్రహించును."

"ఐతిహాసిక కావ్యములు మొదలగు కొన్ని కావ్యభేదములు ఈ అనుకరణములను కేవలము శబ్దములతోడనే, అనగా ఛందోబద్ధములయిన శబ్దముల తోడనే నిర్వర్తించును. ఒక్కొక్క విధమగు కావ్యము ఒక్కొక్క ఛంద

స్సనే ప్రయోగించును. కాని, అనేక చ్ఛందస్సులు ప్రయోగించిన కావ్యము లును కలవు."

"ఇక నాటకములు మొదలగు కావ్యములు లయ, రాగము, ఛందోబద్ధ మైన శబ్దములు - ఈ మూడిటిని కొన్నిటిలో వేరు వేరుగను, మరికొన్నిటిలో అన్నిటిని కలిపియును ప్రయోగించును."

పై వాక్యము లన్నియు అరిస్టాటిల్ వ్రాసిన పొయిటిక్సు అను గ్రంథము నుండి మూలభావము పోకుండ సంక్షేపవిధముగా అనువదింపబడినవి. వానిని చదివినవారికి అరిస్టాటిల్ బుద్ధి ఎంత సూక్ష్మమైనదో, ఎంత క్రమశిక్షణ కల దియో గోచరించును. ఐనను మన మిప్పుడు విచారింప నుద్దేశించినది ఆయన అనుకరణ వివరణములు కావు. కావ్యకళ అనుకరణమా, కాదా ? చిత్రలేఖనము, విగ్రహ నిర్మాణము, సంగీతము మొదలగు ఇతర లలితకళలుకూడ అనుకరణము లనియే ఆయన మతము. కావ్యకళ అనుకరణ మైనచో మిగిలిన వంతకంటె నతిశయముగా అనుకరణము లనవచ్చును. కావ్యకళ అనుకరణము కానిచో తక్కినవి కూడ కావని భావించుట యుక్తము. ఈ విచారణము కావ్యకళను గూర్చియే ప్రత్యేకము చేయబడుచున్నది.

కావ్యములు సృష్టికి అనుకరణములు అను భావమునే తర్వాతి పాశ్చాత్య విమర్శకులు కావ్యసృష్టి ప్రకృతిని అద్దములోవలె ప్రతిబింబింపజేయు నని మరి యొక విధముగా నిర్వచింపసాగిరి. ఈ భావములే పాశ్చాత్యప్రపంచములోననే కాక అంతకంటె విపరీతముగా మన విమర్శకులలోనికి ప్రాకిపోయి చిత్ర విచిత్ర పరిణామములకు దారి తీయుచున్నవి.

సాహిత్యము ప్రకృతికి అనుకరణమని ఒక లక్షణమే చెప్పినాడుకాని, వారుకూడ ఈ అనుకరణము చేయవలెనని విధిగా నియమించలేదు. కాని, మన సాధారణవిమర్శకుల బుద్ధి కది విధిగా భాసించినది. ఆ మాటలు తరుచుగా పత్రికలో చదువుచుండుటచేత బుద్ధిమంతులైన సాహిత్యవేత్తలుకూడ దూర మాలోచింపక గతానుగతికముగ అదేభావము వెలిబుచ్చుచుండుట సర్వసామాన్య మైనది. దీని ప్రభావము ఇప్పుడు వచ్చుచున్న సాహిత్యముమీదకూడ విశేష ముగా పడుచున్నది.

సాహిత్యము కేవలము అనుకరణమే యైనచో, సృష్టిని అద్దముపెట్టి చూపుటే యైనచో, నేడు వార్తాపత్రికలలో ప్రచురింపబడుచున్న వార్త లన్నియును కావ్యములే అయిపోవును. దేవరాక్షసులను చిత్రించిన మహాకావ్యము లన్నియు కావ్యములే కాకుండపోవును.

లోకములో నెల్లప్పుడు ధర్మము జయించుటలేదు. బలము తరుచుగా జయించుచున్నది. బలము దుర్మార్గుల కున్నను వారే జయించుచున్నారు. నీచులను, స్వేచ్ఛాచారులను, కఠినులను, దుష్టులను, బుద్ధిహీనులను, పిచ్చివారిని మనము చూచుచున్నాము. వారిని స్వస్వరూపములలో ప్రదర్శించినంతమాత్రమున సాహిత్య మగునా ?

వ్యభిచారులు, వ్యభిచారిణులు కామక్రీడలలో తేలియాడువా రెందరో అన్ని కాలములలో కలరు. వారి వ్యాపారములను ఉన్నవున్నట్లు చిత్రించుటకు సాహిత్యము కావలెను.

ఇట్టివే ఎన్నియో అసందర్భప్రలాపము లన్నియు సాహిత్యముగా పరిగణింపబడవలసి వచ్చును. సాహిత్యము ప్రకృతికి అద్దముగా ఉండవలెనను భావము ప్రబలుటచేతనే కవులు, కథకులు అని పేరుగన్నవారు అట్టి అద్దములను పట్టుచున్నారు. అందువలననే అసభ్యవాఙ్మయము వృద్ధి గాంచుచున్నది. అందువల్లనే సర్వసామాన్యమైన నీరసవిషయములే వందలకొలది ప్రచురించుచున్నారు. కావ్యకర్తల స్థానమును వ్రాతగాళ్ళు ఆక్రమించి ప్రచారము పొందుచున్నారు.

అవినీతి, అబద్ధము, దొంగతనము, హత్యలు ఆకర్షకముగా ప్రదర్శించు సాహిత్యము నానాటికి పెరుగుచున్నది. విద్వేషములు, విరోధములు ఉద్బోధించు గ్రంథములే సాహిత్యముగా చలామణి యగుచున్నవి.

గ్రంథసమీక్షలు తరుచుగా గ్రంథము లెంతవరకు నేటి జీవితమును చిత్రించుచున్నవి ? అను నంశమునే ముఖ్యముగా విచారణ చేయుచున్నవి. మన ప్రసిద్ధపత్రిక లన్నియు ప్రతిసంవత్సరము సంవత్సరాంతముననో, సంవత్సరాదినో గత సంవత్సర సాహిత్య సమీక్షను విమర్శకు లనువారిచేత చేయించుచున్నవి. ఆ సమీక్షలు నేటి జీవనమును పేలవముగా ప్రదర్శించు గ్రంథజాలము

నకు ప్రాముఖ్యమిచ్చి పొగడుచు, గతకాలమును చిత్రించురచనలను సార్వకాలికము లగు రచనలను ఈసడించుట పరిపాటి యైనది.

దీని కంతటికి మూలకారణము సాహిత్యము ప్రకృతికి అనుకరణమనియు, జీవితమును ప్రతిబింబింపవలె ననియు భావములు వ్యాపించుటయే. విధి సంగతి యటుంచి సాహిత్యము ప్రకృతికి - బ్రహ్మసృష్టికి అనుకరణ మేనా అను విషయము విచారింతము !

సూక్ష్మముగా విచారణ చేయగలవారికి కావ్యము సృష్టి కాని, అనుకరణము కాదని వెంటనే స్ఫురించును. కేవలము ఛాయాచిత్రములు ఫోటోగ్రాఫులు తీయుట చిత్రకళ కానట్లే ఊరక జీవితమును ప్రతిబింబింపజేయుట ఉత్తమ సాహిత్యము కానేరదు.

కావ్యము సృష్టి యన్నందువలన లోకములో ఎక్కడను లేనివి కావ్యకర్తలు సృష్టింతురని కాదు. లోకములో ఉన్నవానినే ఏర్పు, కూర్పు, పేర్పు, మార్పు, ఇత్యాది క్రియలవలన మనకు తెలిసిన విషయములే క్రొత్త వనిపించునట్లు చేయుదురు. అది వారి సృష్టివిధానము.

లోకములో ధర్మము జయించుటే కాక అధర్మము జయించుటయు కాంచుచుందుము. అధర్మము జయించుట చూచినప్పుడు మనకు కష్టము కలుగును. ధర్మమందు విరక్తియు కలుగును. అది యింపుగా నుండదు. అందువల్ల లోకవృత్తములలో అధర్మము జయించిన భాగములతో కవులు కావ్యములు పూర్తి చేయరు. ఈ సూత్రము ననుసరించి వారు ధర్మపక్షము జయించిన వృత్తములనే ఏరికొందురు. అందువల్ల ఆదికవి వాల్మీకి శ్రీరామవిజయమును వర్ణించు రామాయణమే చెప్పెను. ఆ కథ పరిణామమే విపరీతముగా ఉండె ననుకొందము. రావణునిచేతిలోనే శ్రీరాముడు మృతినొందె ననుకొందము. అట్టి కథ మనకు సాహిత్యము కలిగించు నానందము కలిగింపదు. అసహ్యభావము కలిగించును. అట్టి కథలను కవులు ఏరుకొనరు.

కూర్పు బహువిధములుగా నుండును. లోకములో జరిగిన రెండు మూడు వృత్తములను ఒక కథలో కలుపవచ్చును. అట్లుకాక రెండుమూడు వస్తువుల లక్షణములను కలిపి ఒక వస్తువుగా సృష్టింపవచ్చును లోకములో అశ్వము

లున్నవి ; మనుష్యు లున్నారు. మనుష్యుల తలలున్న యశ్వములు కాని, అశ్వ ములు తలలున్న మనుష్యులు కాని ఉండదు. కవులు అట్టివి కూర్చి కల్పించి గరుడ గంధర్వ కిన్నర కింపురుషాదులను సృష్టించినారు

కవిసృష్టి బాహ్యసృష్టిలో వలె కలగూరగంపగా ఉండదు. కవులు ఔచిత్యము ఎరుగుదురు. కరుణ కలిగించు ఘట్టముల నుండి హాస్యప్రసంగములు వేరు చేయుదురు ; శృంగార ప్రధానభాగములనుండి జుగుప్స కలిగించు వర్ణనలు దూరము కావింతురు ; లోకములో అసందర్భ ప్రసంగములును, అసంబద్ధ ప్రలాపములును ఉండునుకాని అవి కవి తన సృష్టిలోనుండి వదలివేయును.

అట్లే కవులు తమ కావ్యములలో లోకములో కనబడు కథలను మార్పు చేయుదురు. కవుల అతిశయోక్తి ప్రసిద్ధమే. ఉదాత్తగుణము కలవానిని మరింత ఉదాత్తునిగను, క్రూరుని మరింత క్రూరునిగను. వికృతాకారుని మరింత వికృతాకారునిగను మార్పు చేసి వర్ణింతురు.

కవిసృష్టిలో ఉండు ప్రక్రియలు కొన్ని ఇంతవరకు ఉదాహరించితిమి. ఇట్టివి మరియు నెన్నో ఉన్నవి. భాష యున్నది. భాషలో పదము లున్నవి. పదములలో అక్షరము లున్నవి. సందర్భమునుబట్టి పరుషాక్షరము లున్న పదములనో, లలితపదములనో కవి ప్రయోగించును. ఈ ప్రయోగభేదమునే లాక్షణికులు రీతిభేదము లని వివరించిరి.

ఇట్లు బహువిధసాధనములతో కవి స్వతంత్రముగా కావ్యసృష్టి కావించును. అది హృద్యముగా నుండునట్లు చేయును. అతని చమత్కారము లోకోత్తరచమత్కారము. సాహిత్యకారులు కేవలము లోకవృత్తములను అనుకరించి ప్రతిబింబింపజేయువారు కారు. వారు బ్రహ్మసృష్టికి ప్రతిసృష్టి చేసిన విశ్వామిత్ర మహర్షివంటివారు. వారు చేసిన సృష్టి హృద్యముగా ఉన్నదా లేదా ? అనియే విమర్శకులు విచారింపవలె గాని ప్రకృతికి ప్రతిబింబముగా సరిగా ఉన్నదా లేదా ? అను విచారణలు చేయుట ప్రియురాలితో ప్రేమసల్లాపము లాడు నవసరములో ప్రియురాలు కట్టిన చీరవెల ఎంత ? యని అడుగునటు వంటి విరస ప్రసంగము.

సాహిత్యము అనుకరణము కాదు సృష్టి యని దాని స్వరూపము నిష్ట యించుటకు ఇంతవరకు అరిస్టాటిలు తన సాహిత్యగ్రంథములో చెప్పిన మాట లతో ప్రారంభించితిమి. కాని అరిస్టాటిలువంటి మహనీయుడు ఇట్టి భ్రాంతికి లోనయ్యోనా అని ఎవరికయినను సందేహము కలుగవచ్చును. నేటి గ్రీకుభాషా విద్వాంసులకును అదే సందేహము కలిగి పాతవ్రాతప్రతులు పరీక్షలు చేసి అనుకరణ మన్నచోట పునఃసృష్టి యను నర్థము వచ్చు పదమే మొదట వ్రాయగా దానిని తర్వాతివారు తుడిచివేసి అనుకరణశబ్దము వ్రాయబడినట్లు కన బడుచున్నదని సందేహముగా నున్నదని ప్రకటించినారు.

అంతేకాదు. మొదట ఉదాహరించిన వాక్యములలో అనుకరణ మను శబ్దమే అరిస్టాటిలు ప్రయోగించినను మరియొకశబ్దము ప్రయోగించినను ఆయన మతములోగూడ కావ్యము సృష్టియే అని ఆ గ్రంథములోనే ఇతరభాగములను బట్టి స్పష్టపడుచున్నది.

"అనుకరింపబడు వస్తువులు మానవులక్రియలు. మానవులు మంచి వారుగనో, చెడ్డవారుగనో ఉందురు. కవి యనుకరణములో మూడు విధము లుండును. హోమరుపాత్రలను నిజముగా వారున్నదానికంటె గొప్ప వారినిగా చిత్రించెను. క్లియోఫను ఉన్నవారి నున్నట్లు చిత్రించెను. హోమరు, నికోకారిసు మానవులను వారున్నకంటె తక్కువవారినిగా చిత్రించెను."

... ... .... ... ...

"కథావస్తువు అనగా కథానాయకుడు ఒక్కడే అగుట చాలదు. ఒక మానవునకు కలిగిన అనుభవములు అనేకముండును. కాని, అవి యన్నియు ఒక కథావస్తువుతో సంధించుటకు వీలు పడదు. అట్లే ఒక మానవుడే అనేకవిధములగు కార్యములు కావించును. అవి యన్నియు ఒక కథావస్తువులో సంధింప సాధ్యపడదు. ఇది తెలియకనే హెర్క్యు లీడ్సు, థెసీడ్సు రచించిన కవులు పొరపాట్లు చేసిరి. కాని, హోమరు నేర్పువల్ల నేమి, స్వాభావసిద్ధమగు ఉపజ్ఞవల్ల నేమి అట్టి దోషములు చేయలేదు."

"కాబట్టి ఇతర కళలవలెనే కావ్యములో గూడ కథావస్తువులో ఒక్కదానినే అనుకరించవలెను. కథావస్తువనగా ఒక కార్యము క్రియ

సంగ్రహ మయిన అనుకరణము. కాబట్టి అది ఒకే ఒక కార్యమునకు పూర్తిగా సంబంధించిన అనుకరణముగా ఉండవలెను ; దానితో సంబంధము కల అంగము లన్నియు దృఢముగా నుండి అందులో ఏ యొక్క అంగము మార్చినను, తీసివేసినను సంపూర్ణవస్తువు పాడగునట్లో, మార్పు చెందునట్లో ఉండవలెను. ఒక అంగము ఉన్నను, లేకున్నను ఒకటే యైనచో అట్టిది అంగమే అనుటకు వీలు లేదు."

ఈ విధముగనే అరిస్టాటిలు అనుకరణశబ్దము వాడినను మన లాక్షణికులు కావ్యసృష్టి యని దేనిని నిర్దేశించిరో దానినే అతడును ఉద్దేశించె ననుటకు సందేహము లేదు అరిస్టాటిలు మతము సంపూర్ణముగా గ్రహింపక ఏదో ఒక సందర్భములో ప్రయోగించిన పదమును అపార్థము చేసికొని, దానినిబట్టి తమ యల్పభావములను పెంచిన పాశ్చాత్యవిమర్శకులవలనను, వారినికూడ సరిగా అవగాహన చేసకొనని కొందరు మన విమర్శకులవలనను, దురభిప్రాయములు లోకములో వ్యాపించుచున్నవి.

సాహిత్యవిదులు సాహిత్యము ఆనందము కలిగించు నూతనసృష్టి యనియు, కవికి స్వాతంత్ర్య మున్నదనియు ఏకగ్రీవముగా నంగీకరించిరి.

## సా హి త్య ప్ర యో జ న ము



కావ్యము లెందుకు వ్రాయుదురు? కావ్యము లెందుకు చదువుదురు? ఈ లోకయాత్రలో కాలహరణమునకు, వినోదమునకు పనికివచ్చు చతురంగము చీట్లపేకవంటి క్రీడలవంటిదేనా కావ్యాలాపము కూడను? లేక అంతకంటె దానికి విశేషప్రయోజన మేమైన కలదా ?

దీనికి ముందుగా వచ్చు సమాధానము కళకు ప్రయోజనము కళే! Art for Art's safe! కళకు ఇతర ప్రయోజన ముండదు. అది ఉపయోగకరమైన సామాన్యలోకములోని వస్తుజాలమువంటిది కాదు.

"సౌరభము లేల జిమ్ము పుష్పవ్రజమ్ము ?
చంద్రికల నేల వెదజల్లు చందమామ ?"

ఈ విధముగా ఎదురు ప్రశ్నలతో ముఖ్యముగా కొందరు కవులు, రచయితారులు సమాధానము చెప్ప యత్నింతురు.

ఈ మాట యుక్తముగానే భాసించును. కలము వ్రాయుటకు ఉపయోగపడును. దాని అందము కళ. అందముగా లేకున్నను కలము బాగుగా వ్రాయ వచ్చును. పాలు త్రావు పాత్ర ఉపయోగము పాలు త్రావుటకేకాని దానిచేతలో అకారములో ఉండు సొగసు కళ. ఆ కళ లేకున్న ఏ వంకరటింకర పాత్రతో త్రావినను పాలు కుక్షిలో చేరి ఉపయోగపడునుగదా! మనలను శీతాతపముల నుండి రక్షించుటకు ఏకాంతనివాసమునకు గృహములు నిర్మించుకొనుచున్నాము. అవి పొరలు తప్పించి కట్టినను, హెచ్చుతగ్గులతో కట్టినను వాని ఉపయోగము కొరతపడదు. అది మనోహరముగా నుండవలెనని మన మెంతో ప్రయత్నింతుము. అది కళ. వస్తువు ఉపయోగము వేరు. దాని కళ వేరు. కళ ప్రయోజనము కళయే. దానివల్ల ఉపయోగము కనబడదు.

ఈ విధముగా కళకు సర్వసామాన్యముగా కనబడు ఉపయోగము లేదనుట సత్యమే. కాని, సూక్ష్మదృష్టితో పరిశీలించువారికి కళకు ప్రయోజనము కళయే అను మాటకు అర్థము లేదని స్పష్టపడగలదు. వస్తువూ, దాని ప్రయోజనమూ ఎన్నటికి ఒక్కటే కానేరవు. అద్వైత వేదాంతవిషయములలో ఏమో కాని, సామాన్య లోకవృత్తము మాత్రము వస్తువు, దాని ప్రయోజనము భిన్నములుగానే ఉండును. ప్రయోజన ముద్దేశింపక మందబుద్ధికూడ ఎందును ప్రవర్తింప దని సంస్కృతసూక్తి యున్నది. అట్లయినచో కవులు కావ్యపాఠకులు మందబుద్ధుల కంటె నికృష్టులా ? అది కానేరదు. కావ్యమునకు ప్రయోజన మొకటి ఏదో ఉండియుండవలెను.

కాని, కావ్యములకు ప్రయోజన ముండుట అది యేదో కావ్యగౌరవమును దగ్గించుట అను భావము కలవారు పలువురున్నారు. అందులో నేటి భావకవులు ప్రధానులు. వారు వెంటనే తమ కవితాసృష్టి అనుభవము వర్ణింతురు. "బ్రహ్మాండములో మధ్యమధ్య అవ్యక్తమయిన కారణములవలన గాలివానలు

చెలరేగి శాంతించునట్లే, మా హృదయములలో గూడ భావోద్రేకము పెల్లు రేగును. పాలపొంగువలె అది కావ్యరూపమున పెల్లువయై ప్రవహించి శాంతించును. అంతేకాని మా కావ్యసృష్టికి వేరు ప్రయోజన మేమియు నుండదే !"

ఇట్లు వారు తెలుపు మాటలు సత్యములే. భావోద్రేకము లేనిది భావకవిత్వము చెప్పుట తగదు. అట్లది లేక చెప్పినవారిది పేలవముగా నుండును, అదె కవిత్వమే అనిపించుకొనదు. కాని, భావకవులను కొన్ని ప్రశ్నలు వేయుదము.

మీరు భావోద్రేకము పట్టలేక వ్రాసితిరి, సరే కాని, మీ కావ్యములు అచ్చువేయించు టెందుకు ? వానిని పదిమందికి వినిపించి బాధించు టెందుకు ? నీ కేదో దుఃఖము కలిగి కరుణగీతములు వ్రాసి, వాని రూపమున ఏడ్చితి వను కొందము. కాని నీ ఏడుపు నీవే ఏడ్వక అవి ప్రచురించి లోకము నంతటిని ఏడ్పించు టెందుకు ? నీ వొక కన్యను వలచి ప్రేమ భరింపలేక ప్రేమగీతము లాలపించుటతో ఊరుకొనక మా కందరకూ అవి వినిపించుటెందుకు ? నీకు పని లేక వ్రాసినట్లే వినిపించినా వనుకొన్నను, మే మందరము నీవలె పని లేని వారము కాదే !

ఈ ప్రశ్నలకు ఉత్తర మీయలేరు వారు. కేవలము హృదయశాంతి కొరకే వారు కావ్యసృష్టి కావించినా రనుకొన్నను, కావ్యప్రకటనమునకైనను ఏదో ప్రయోజన ముండవలెనని అంగీకరింపక తప్పదు.

అదియుగాక ఈ హృదయశాంతి పక్షమునకు ఇంకను ఎన్నో ఆపత్తులున్నవి. కావ్యసృష్టిలో కల్పన, శిల్పము, కళ కూడా కలవు. ఈ వాద మంగీకరించినచో వానికి స్థానము లేకుండపోవును. మరియు నిది ఆత్మానుభవము వర్ణించు క్షుద్రకావ్యములకే కాని దృశ్యప్రబంధములకు, కథాకావ్యములకు ఎంత మాత్రము అన్వయించదు. కాబట్టి సాహిత్యము నిష్ప్రయోజక మని ఎన్ని విధముల వాదించినను ఆ వాదము నిలువదు.

సత్కావ్యరచనము చేసిన కవికి తరుచుగా యశస్సు వచ్చును. మిత్రుల చేతను, శిష్యులచేతను పలుమారులు పలు పత్రికలలో వ్రాయించుకొనుటచేతను, సభావేదికలలో సమ్మానములు పొందుటచేతను కలుగు కేవల ప్రకటన కాదు

యశస్సు. సహృదయుల మెచ్చు, బహుకాలము నిలుచుటచే సత్కవులకు ప్రాప్తించు మహాభాగ్యము ఈ యశస్సు. అది పుణ్యస్వరూపమైన కీర్తి. ఇది కావ్యప్రయోజనమే కాని ఇది కవికే అన్వయించును. కాని, పాఠకులకు కాదు.

కొంచెము హెచ్చుతగ్గుగా యశస్సువంటిదే ధనమును. కొన్ని కొన్ని కాలములలో ధనలాభము సత్కావ్యకర్తలకు కంటె అసత్కావ్యకర్తలకే లభించు చుండుగాక ! కొన్ని కాలములలోనైనను మహాకవులు తమ కావ్యముల వలన ధన మార్జించిరి గనుక అర్థలాభము కూడ కావ్యప్రయోజన మనదగును. కాని ఇదియును కవికి కలుగదగిన ప్రయోజనమే కాని పాఠకులకు కాదు.

కాబట్టి పాఠకులకు ఉపయోగించు మరియొక ప్రయోజన మేదో సాహిత్యమున కుండవలె. మనము సాహిత్యగ్రంథములను పర్యాలోకనము చేసినచో, ఆ గ్రంథపఠనము వలన మన కెంతో లోకజ్ఞానము కలిగినట్లు వెంటనే గ్రహింతుము. సీత, సావిత్రి అనసూయ వంటి మహాపతివ్రతలు మనకు స్ఫురింతురు. ద్రౌపదివంటి మానినులు, అంద్రోమెకీ, పెనిలోపీ వంటి బుద్ధిమంతులు భాసింతురు. శ్రీరాముడు, ధర్మజుడు ఒడిస్సియసు తెలియవత్తురు. బహుకాలములలో, బహుదేశములలో బహువిధముల స్త్రీపురుషులు, వారల బహువిధముల వృత్తములు మన కెరుకపడును. ఎంత స్వానుభవమున్నవారైనను స్వయముగా తెలిసికొనలేని అనేక విషయములు మనకు కావ్యములు చదువుటచే తెలియవచ్చుచున్నవి. ఇట్లు కలిగిన లోకజ్ఞత వలన మనకు వ్యవహారజ్ఞానము కలుగుచున్నది. ఇది కావ్యప్రయోజనము !

కావ్యప్రయోజనములలో వ్యవహారజ్ఞానముకూడ ఒకటి యనుటకు సందేహము లేదు. కావ్యములు చదువకున్నను, చరిత్రగంథములు, అర్థనీతి, దండనీతి మొదలగు వ్యవహారగ్రంథములు చదువుటచేతనే వ్యవహారవేత్తలు కావచ్చు కదా ! కావున నిది సాహిత్యగ్రంథముల ప్రత్యేకప్రయోజనము కానేరదు.

కాబట్టి కావ్యమునకు ఏదో గొప్ప ప్రయోజనముండవలె. ఒకవేళ ఆ ప్రయోజనమే ఇతర సాధనములచేత సిద్ధించినను, కావ్యము దానినే సాధించుటలో మరియొక మార్గమైన అవలంబింపవలెను. కావ్యము తన రమ్యస్వరూపముచే కలిగించు ఆనందముతోపాటు ఏదో లోకసంగ్రహము కావించుచుండవలె. ఉత్తమ

కావ్యము లన్నియు మన కేదో సదుపదేశము ననుగ్రహించుచున్నవి. ఆ ప్రయోజన ముండుటచేతనే సత్కావ్యములను మనము ఆదరించుచున్నాము. సత్కవులను గౌరవించుచున్నాము.

విప్రవినోదకునివలె కావ్యకర్తయు పదములతో గారడీ చేయును; ఇంద్రజాలికునివలె మాయాలోకము నాతడు సృష్టించును; చాటుకారునివలె చాటువాక్యము లాడును; చిత్రకారునివలె మనోజ్ఞవర్ణములు భాసింప జేయును; విగ్రహశిల్పివలె రూపములు గండరించును; గాయకునివలె తాలమానములతో తల లాడింపజేయును; నృత్యము చేయు విలాసినివలె సర్వావయవ చలనములతో మనస్సులకూడ నాట్యము చేయించును. కావ్యకర్త అంతటితో తృప్తి నొంది యూరకుండడు. ఆతడు సదుపదేశము చేయు ఉపదేష్ట.

ఉపదేశము కావ్యప్రయోజన మన్నచో వేదశాస్త్రములలోను, మతగ్రంథములలోను, నీతి గ్రంథములలోను ఉపదేశ మున్నది కదా! కేవల పురాణములలోగూడ ఉపదేశ మున్నదికదా! కావ్యములు చేయు నుపదేశములో విశేషమేమి? అను ప్రశ్న పుట్టును.

శాస్త్రాదులు చేయు ఉపదేశమువలె కావ్యములును చేయుచున్నవి. ఉపదేశ విషయములో వానికి కావ్యములకు భేదము లేదు. ఉపదేశించుటలో అవలంబించు మార్గములోనే వానికి, కావ్యములకు తారతమ్య మున్నది.

తక్కినవానిలో కొన్ని ఇది చేయుము, ఇది చేయవద్దు అని శాసించును. ఆ శాసనములు దృఢచిత్తులకే కాని ఇతరులకు తలకెక్కవు. మరికొన్ని మంచి మాటలతో మిత్రునివలె నుపదేశించును. అవికూడ నందరికి రుచింపవు.

మరి కావ్యములో? అవి మన ప్రేమపాత్రయైన ప్రియురాలివలె చాటువాక్యములతో వాచ్యముగా చెప్పక, వ్యంగ్యవైభవముతో మనకు కార్యాకార్యములు హృదయంగమముగా నుపదేశించును. ఈ పద్ధతి పరిణతబుద్ధులకే కాక మందబుద్ధులయిన సామాన్యులకుగూడ సుఖముగా మనస్సులో హత్తుకొనును. పరిణతబుద్ధి కలవారికిగూడ శాస్త్రాదులవలనకంటె సుఖతరముగా, పంచదారలో పొదిగిన ఔషధమువలె ఉపయోగపడును.

ఉపదేశము లోకోపకారక మైనదిగను, జగత్ప్రతిష్ఠకు సహకరింపగలది గను ఉండవలెను. అట్టి ఉపదేశములు చేయుటకు అధికారము కలవారే మహా కవులు. వారి కావ్యములు అపరిమితప్రయోజనము కలవి. వారు ఈ జన్మమే కాక అతీతానాగతజన్మకోటులును, ఈ లోకమే కాక అనేక కోటి బ్రహ్మాండము లును, ఈ కాలమేకాక ఆద్యంతరహితమైన కాలపురుషుని స్వరూపమును, మన స్సులో స్థిరముగా నిల్పుకొని ధర్మనిష్ఠులై లోకుల శాశ్వతనిర్వృతికి తోడ్పడ గలవారు. అందువలననే వారు ఋషులు. "నానృషిః కురుతే కావ్యమ్"అన్నారు పెద్దలు.

ఉత్తమ కావ్యరచనచేత మయూరాదులైన పూర్వకవులకు, అమంగ శము శాంతించెనని ప్రసిద్ధి కలదు. నేటికిని ఋషిప్రోక్తములైన శ్రీమద్రామాయ ణాది మహాకావ్యములను, శుభాకాంక్షు లయినవారు నియమముతో పారాయణము చేయుచున్నారు. మంగళము కలిగించుటకూడ కావ్యప్రయోజనములలో ఒకటిగా చెప్పవచ్చును.

ఋషులని కావ్యకర్తలు గౌరవము పొందినది ఒక మన దేశములోనే కాదు. గ్రీకుదేశములో హోమర్, జుడన్లూలో సాలమన్, డేవిడ్ ఇత్యాదులు పారసీకములో జొరాస్టర్, చీనాలో కన్ఫ్యూషియస్, లయట్జ్ ఇత్యాదు లందరు వారి వారి భాషలలో ఋషులని అర్థము వచ్చు గౌరవపదములతో నిర్దేశింప బడినవారే !

# సాహితీసమితి - సాహిత్యకృషి

౧

సాహిత్యరంగమున వివిధశాఖలలో స్వతంత్రముగా కృషి చేయుచున్న కవులు, రచయితలు సభ్యులుగా ఉన్న సాహిత్యసంస్థ సాహితీసమితి. ఇందలి సభ్యు లందరు స్వతంత్రులు. ఎవరి నిర్మాణమార్గము వా రనుసరించువారేకాని ఒకరిశాసనము అనుసరించువా రిందులో ఎవ్వరును లేరు. భాషలో గాని, భావములో గాని, విధానములో గాని - ఇట్లే ఉండవలె నని వారిని సమితి సూత్రములచే నియమింపదు. వస్తువునకు అనుకూలమైన విధముగా సహృదయులకు ఆహ్లాదజనక మయిన రచనలు చేయుటే ఇందలి సభ్యుల ఆదర్శము.

నియతికృత నియమరహితము, హ్లాదైకమయము, అనన్యపరతంత్రము, నవరసరుచిరము అగు కావ్యనిర్మాణమే సామితేయుల పరమావధి !

౨

కేవల సాహిత్యకృషికే అంకితమైన ప్రథమపత్రిక "సాహితి." ఆ పత్రికను కొంతకాలము సాహితీసమితి నిర్వహించినది. "సాహితి" పుట్టిన నాటికి "భారతి" లేదనియు, "శారద" కూడ పుట్టలేదనియు గమనింపదగినది.

సాహితి తర్వాత "సఖి" అను సాహిత్య పత్రికను ఆదేమార్గమున మరి కొంత కాలము సమితి నడిపినది.

సాహితి, సఖి అప్పుడు ప్రచురించిన కావ్యములు, కథలు, నాటికలు మార్గదర్శకములై నేటికిని నవ్యాంధ్రసాహిత్యములో అగ్రస్థాన మలంకరించుచున్నవి.

౩

సమితి కవులలో కొంతమందిని స్మరింతము !

భావకవిత్వముతో దేశమును ఉఱ్ఱూత లూగించిన దేవులపల్లి కృష్ణశాస్త్రి, వేదుల సత్యనారాయణశాస్త్రి సమితి కవులు.

నండూరి వెంకటసుబ్బారావు తన "ఎంకిపాటల"తో గాలిదుమారము రేపినాడు.

రాయప్రోలు సుబ్బారావు తెలుగుకవితలో నవ్యత ముందుగా తెచ్చి ప్రాచీనకవితామార్గములకు చైతన్యము కలిగించినాడు.

సంస్కృత మహాకవుల రచనావిధానమునందు అభిమానముండియు, అతి నవీనులకును సన్నిహితు డయినవాడు సమితి సభాపతి శివశంకరశాస్త్రి.

ఆధునికకావ్యములలో పూజ్యత గడించిన సౌందరనందము రచించిన కవు లిద్దరిలో ఒకరగు కాటూరి వెంకటేశ్వరరావు సమితి సభ్యుడు.

పుట్టపర్తి నారాయణాచార్యులు "శివతాండవము" ఇత్యాది కావ్యములతో ఆంధ్రదేశమును ఆనందతాండవ మాడించుచున్నాడు.

మొక్కపాటి కృష్ణమూర్తి "విరహి" మొదలగు చక్కని గేయము లెన్నో రచించినాడు.

కరుణశ్రీ మొదలగు అనేక కావ్యములతో ఆంధ్రులహృదయపీఠములలో ఆవేశించి యున్నవాడు జంధ్యాల పాపయ్యశాస్త్రి.

"వీరగాథలు" రచించినాడు కూచిభట్ల ప్రభాకరశాస్త్రి.

పాదుకాసహస్రము, హర్షచరితము ఆంధ్రీకరించి స్వయముగా ప్రౌఢ కావ్యములతో "కుసుమాంజలి" సమర్పించినవాడు కొమాండూరి కృష్ణమాచార్యులు.

విభ్రాంతామరుకాదులు రచించినవాడు పిలకా గణపతిశాస్త్రి.

ఎన్నో గ్రీకుకథలు రచించి శ్రీ దేవీభాగవతము వంటి ఉద్గ్రంథము ఆంధ్రీకరించుచున్నవాడు సమితి కార్యదర్శి నోరి నరసింహశాస్త్రి.

గాథాసప్తశతి, శిశుపాలవధము ఆంధ్రీకరించి కామసంజీవనమను మహా కావ్యము రచించి ప్రస్తుతము తురీయాశ్రమము స్వీకరించి నృసింహ భారతీ స్వాము లయినవాడు గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి.

తన గేయకృతులతో ఆంధ్రుల నాకర్షించిన అడివి బాపిరాజు, "బృందా వనము"తో పులకింపజేసిన చామర్తి రాజశేఖరరావు, "బిక్షువు, కల్యాణి" వంటి లలితకృతులతో సంధ్యారాగము ప్రదర్శించిన కొడవటిగంటి వెంకట సుబ్బయ్య తమ భౌతికదేహములు చాలించినను కీర్తికాయములతో కావ్యరూప మున నిలిచియున్నారు.



నేటి సాహిత్యప్రపంచములో ప్రముఖస్థానము వహించుచున్న కథానికల రచనకు దారి చూపినది, నేటికిని వానిని సమర్థతతో నిర్వహించుచున్నవారు సాహితీ సమితి సభ్యులు !

చింతా దీక్షితులు రచించిన చెంచుదంపతులు, శిలాప్రతిమ ఇత్యాదికథలు ఆంగ్లేయాది భాషలలోనికి అనువదింపబడి మన్నన లందినవి. ఆయన "ఏకా దశి"కథల సంపుటిని సాహిత్య అకాడెమీవారు భారతీయభాష లన్నిటిలోనికి అనువదించుచున్నారు.

అద్వితీయములని ప్రసిద్ధి గన్న భోగీరలోయ, నరపతి, హిమాలయరశ్మి ఇత్యాదికముగా ఉత్తమ కథలు అడివి బాపిరాజు రచించెను.

బహువిధములుగా ఆలోచనలు రేపునట్టి పంచవటి వంటి కథలు శిరోమణి వ్రాసెను.

మల్లాది రామకృష్ణశాస్త్రి "కథలు" నిజముగా మణిదీపాలు. వానిలో బహుగ్రంథ పరిచయము, స్వతంత్రమగు శయ్య వ్యక్తమగుచుండును.

సామాన్యుల కుటుంబములలోని ఆర్ద్రత, హాస్యము వ్యక్తీకరించుచు హృదయాహ్లాదకరముగా "కాంతం కథలు" ఇత్యాదులు అపూర్వముగా వ్రాసి మునిమాణిక్యం నరసింహారావు తెలుగువాణిని రంజింపజేయుచున్నాడు.

హాస్యము, కరుణ - రెండు ముఖములు గల ఒకే మూర్తియని నిరూపించుచు "ఏకోదరులు" మొదలగు ననేక కథలు రచించినాడు మొక్కపాటి నరసింహశాస్త్రి.

నీలకంఠం కథలవంటి ప్రౌఢరచనలు చేసినవాడు శివశంకరశాస్త్రి.

బాబూరావు కథలు మొదలుపెట్టినచో తుదవరకు లాగుకొనిపోవును.

సమితి కథకులు పలువురింకను కలరు. వారందరు కథాస్వరూపము అవగాహన మొనర్చుకొని ప్రథమమునుండియు కథారచన సాగించినవారలే.

౨౪

ఏకాంకనాటికారచన తెలుగులో ఆరంభించినవారు సమితి సభ్యులే. వారి ఏకాంకికలు ఆంధ్రవాఙ్మయములో చిరకాలము నిలువ గలవి.

నోరి నరసింహశాస్త్రి ఖేరూ భిక్షిణి, సోమనాథ విజయము, శబ్దవేధి, సర్పసత్రము, పతంగయాత్ర - ఇత్యాది నాటికలు రచనావైవిధ్యము, పటుత్వము ప్రదర్శించును.

కైలాస శిఖరము, చక్రవాక దంపతులు, వరూధిని, దసరా డబ్బు — మొదలగు నాటికలతో చింతా దీక్షితులు ఉన్నతభావశిఖరము లధిరోహింప జేయుచున్నాడు.

మల్లాది విశ్వనాథకవిరాజు శతాధిక నాటికలతో నాటకరంగమును ఉత్తేజింపజేసి కీర్తిపదము చేరినాడు.

మొక్కపాటి నరసింహశాస్త్రి మ్రొక్కుబడి; శివశంకరశాస్త్రి స్త్రీవిరోధి; శిరోమణి పరివర్తనము ఎన్నటికి మరపురాని ఉత్తమ నాటికలు.

తన రేడియో నాటికలతో కవితామాధుర్యము వెదజల్లినవాడు దేవులపల్లి కృష్ణశాస్త్రి. అతని శర్మిష్ఠ, ధనుర్దాసు, గుహుడు ప్రసారమునందిన నాళ్ళలో అవి చిలికిన కవితామృతరసము నేటికిని తెలుగువారిహృదయములకు చల్లదనము గూర్చుచున్నవి.

౨౫

కేవల పద్యనాటికలు కూడ ఆంధ్రనాటకరంగమున ప్రదర్శనయోగ్యము లని నిరూపించినాడు శివశంకరశాస్త్రి. పద్మావతి, దీక్షిత దుహిత, కవిప్రియ —

మొదలగు పద్యనాటికలు ఆయన కావ్యశిల్పమునకు మచ్చుతునకలు. ముసల్మానులు కాన్స్టాంటినోపిలు పట్టుకొనగా, అక్కడి విద్వాంసులు యూరపుఖండమంతట వ్యాపించుటచే అక్కడ లలితకళలలో కలిగిన నూతనోజ్జీవనమును గూర్చిన గ్రంథము లెన్నియో పుట్టినవి. కాని, ముసల్మానులు కాశ్మీరము ప్రవేశించి శారదాపీఠము నిర్మూలింపగా, అక్కడ నుండెడి ఉద్దండపండితులు భారతదేశ మన్నియెడల విస్తరిల్లి, దేశమును కుంకుమరంజిత మొనర్చి కస్తూరి వాసనలతో గుమాళింపజేసిన విషయమే మన చరిత్రకారులు చక్కగా ఇంతవరకు సరిగా గుర్తింపనేలేదు. శివశంకర కృతులలో ఆ కాశ్మీరపండితుల విద్వదేకసాధ్య మగు లలితకావ్యసృష్టి తరుచుగా ప్రతిబింబించుచుండును. దాని విశిష్టత సహృదయులకే గాని అవగతము కాదు.

పద్యనాటికలే కాక, యక్షరాత్రి, నౌకకజాయ, సహజ యానపంకే - మొదలగు గీతికా నాటికలుగూడ ఈతడు రచించెను. అవి కాశ్మీరము నుండి వచ్చిన మేలి కుంకుమపువ్వువలెనే నేత్రపర్వము చేయుచు సువాసించుచుండును.

సారస్వతశాఖలలో దేనికి చెందునో నిర్ధారణ చేయరాని అపూర్వ కళాఖండము ఆయన వకుళమాలిక.

నోరి నరసింహశాస్త్రి భాగవతావతరణము, షణ్ణవతి మొదలగు పద్యగేయ నాటికలును చెప్పదగినవి. వావిలాల సోమయాజులుకూడ పద్య గేయ నాటికలు రచించెను.

3

నేటి నవలాకారులలో అగ్రగణ్యుడు అడివి బాపిరాజు. అతని "నారాయణరావు" విశ్వకళాపరిషత్తు బహుమాన మంది, నేడు అకాడెమీవారిచే భారతీయ భాషలలోనికి తర్జుమా చేయబడుచున్నది. అతని "హిమబిందు" ఉత్తమ నవల. గోన గన్నారెడ్డి, తుఫాను, కోణంగి మరపురానివి.

నోరి నరసింహశాస్త్రి ''నారాయణభట్టు'' తెలుగుభాషా సమితి బహుమతి నందినది. రుద్రమదేవి అకాడెమీవారిచే భారతదేశభాషలలోనికి అనువాదము

చేయబడుచున్నది. ఆ రెండును మల్లారెడ్డితో కలసి కవిత్రయమువారి కాలము లను ప్రదర్శించు చారిత్రక నవలలు.

మొక్కపాటి నరసింహశాస్త్రి "బారిష్టరు పార్వతీశము" జగత్ప్రసిద్ధి నొందిన హాస్యనవల.

కథాసరిత్సాగరము ప్రాచీనకథాసాహిత్యములో ప్రధానమైనది. ఆ బృహ ద్గ్రంథమును ఆంధ్రీకరించినవారు శివశంకరశాస్త్రి, కృత్తివాసతీర్థులు. అట్లే ప్రసిద్ధి కన్న జాతకకథ లన్నియు పాలీభాషనుండి ఆంధ్రీకరించినాడు శివ శంకరశాస్త్రి.

వాల్మీకి రామాయణము బహువిధముల నెందరో ఆంధ్రీకరించినారు. ఈ మధ్య ఆంధ్రపత్రికలో వచ్చిన శిరోమణి రామాయణము ఆంధ్రలోకమును ఆక ర్షించినంతగా మరి ఏ రామాయణమూ ఆకర్షించలేదు.

౮

ఇప్పుడిప్పుడు బాలవాఙ్మయముమీద దేశములో మోజు వ్యాపించు చున్నది. కాని ఇప్పటికి ३౬ సంవత్సరములకు పూర్వమే దాని అవసరము గుర్తించి చింతా దీక్షితులు చిట్టిచిట్టి కమలాలు, వరహాలతల్లి, బాజాలు, రానాన్న మొదలగు రమ్యమయిన గేయములు రచించినాడు. అతని లీలాసుందరి, శంపాలత వంటి కథలు, జగద్విఖ్యాతులగు ఆండర్సను వంటి కథకులు వ్రాసిన కథల కెంతమాత్రము తీసిపోవు. ఆయన సూరి-సీతి-వెంకి తెలుగు బాలల ముద్దునడకలు అద్దములో వలె ప్రదర్శించును. ఆయన లక్కపిడతలు ఎకాడెమీ వారి బహుమతి నందుకొన్నది.

శివశంకరశాస్త్రి మురారి కథలు బాలవాఙ్మయములో విశిష్టస్థాన మాక్ర మించును.

నోరి నరసింహశాస్త్రి ఈ మధ్య ప్రచురించిన కర్పూరద్వీపయాత్ర అపూర్వమైన స్వతంత్ర రచన. పిన్నలకు పెద్దలకు సుబోధ మగునట్లు భారతీయ భావశిఖరములు అందులో అందింపబడినట్లు విమర్శకులు చెప్పుచున్నారు.



ఇంగ్లీషులో లాంబు మొదలగువారు వ్రాసిన ఎస్సే వంటి వ్యాసరచన తెలుగుదేశము పూర్వ మెరుగదు. ఆ లోటు "మణిప్రవాళము"తో వావిలాల సోమయాజులు తీర్చినాడు. అట్టి విశిష్టవ్యాసములు రచించినవారిలో కాటూరి వెంకటేశ్వరరావు గణ్యుడు. ఆయన 'దర్బారు పాయరు' ఇత్యాది వ్యాసములు మరల మరల ఆనందముతో అలకింపదగినవి.



ప్రదర్శనయోగ్యములైన నాటకములు వ్రాసినవాడు వావిలాల సోమయాజులు. అతని నాయకురాలు, వసంతసేన నాటకరంగమును బహుపర్యాయము లలంకరించినవి.

భక్తిపారవశ్యమును ప్రదర్శించు చింతా దీక్షితులు 'శబరి' అద్వితీయమయినది.

రాయప్రోలు సుబ్రహ్మణ్యము 'కొండవీడు' స్మరింపదగినది.

సంస్కృతములు అనేకము ఆంధ్రీకరించినాడు గట్టి లక్ష్మీనరసింహశాస్త్రి. భాస నాటకము లన్నియు అత డాంధ్రీకరించినాడు.

సంస్కృత నాటకములు చక్కగా ఆంధ్రీకరించినవారిలో కాటూరి వెంకటేశ్వరరావు ప్రత్యేకముగా గుర్తింపదగినవాడు.



సాహితీసమితి సభ్యులు కేవల కావ్యసృష్టితో తృప్తిపడలేదు.

కురుగంటి సీతారామయ్య నవ్యసాహిత్యవీథులు నవ్యసాహిత్యమునకు గౌరవస్థానము తెచ్చినది. అదే రెండవముద్రణములో పిల్లలమఱ్ఱి హనుమంతరావు సహాయముతో విస్తృతి నొందినది.

అదిగాక సాహిత్యసమీక్ష మొదలగు సమీక్షాత్మక వాఙ్మయము పిల్లలమఱ్ఱి విస్తరింపజేసినాడు.

అలంకారశాస్త్రములో నిష్ణాతుడయిన జమ్ములమడక మాధవరామశర్మ నవరసగంగాధరము భాషాసమితి బహుమాన మందుకొన్నది. అతని ప్రతాప

రుద్రీయము సాహిత్యదర్పణమునకు సమగ్రవ్యాఖ్యానము. కావ్యప్రకాశిక, ధ్వని సారము సాహిత్యస్వరూపమును ప్రదర్శించు ఉత్తమ గ్రంథములు.

పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి ధ్వన్యాలోకము ఆంధ్రీకరించినాడు. అది విద్వత్పరిగ్రాహ్య మైనది.

సూర్యదేవర సంజీవదేవ్ చిత్రలేఖన విమర్శలు భారతదేశ మంతటను మన్నన లందుచున్నవి.

మొక్కపాటి కృష్ణమూర్తి స్వయముగా కవి. చిత్రకారుడే కాదు. అతని వ్యాసములు లలితకళలను గూర్చిన స్వరూపజ్ఞానము వ్యాపింపజేయుచున్నవి.

వసంతరావు వెంకటరావు రచనలు ఆధునిక విజ్ఞానశాస్త్ర విషయములనే వాఙ్మయసృష్టికి అనుకూలముగా ఆకర్షించుచున్నవి.

గిడుగు రామమూర్తి సాహితీసమితిలో గౌరవ సభ్యుడుగా ఉండెను. ఆయన భాషాసేవ వేరుగా చెప్పబూనుట సాహస మనిపించుకొనును.

ఉపసంహారము

సాహితీసమితి 1919 లో ప్రారంభ మైనది. 1944 లో జరుపవలసిన రజతోత్సవము 25–2–1946 న గుంటూరులో వైభవముగా జరుపుకొన్నారు.

రజతోత్సవానంతరము నూతనసభ్యు లెందరో చేరినారు. ఇంకను చేరుచున్నారు.

సమితి సర్వతోముఖముగా ఇంతవరకు చేసిన సాహిత్య కృషి ఇందులో దిఙ్మాత్రముగ ప్రదర్శింపబడినది.

సమితి సభ్యు లింకను కృషి చేయుచున్నారు. ముందు ఇంకను ఉత్సాహాతిశయముతో ఇతోధికముగా సాహిత్యోపాసనము కావించుటకు ఉవ్విళ్ళూరుచున్నారు.

—o—

# స్వతంత్ర భారతములో చరిత్ర రచన

## ౧

కవులకు, సాహిత్యపరులకూ చరిత్రోపన్యాస మేమని మీలో కొందరికి ఆశ్చర్యముగా ఉండవచ్చును. చరిత్రలో విశేషపరిశ్రమ చేసిన విద్వాంసు లీ సభలో ఉన్నారు. అట్టివారికి ముఖ్యముగా మా బోంట్లము ఇట్టి ఉపన్యాసమున కుపక్రమించుట సాహసముగానే కాక అక్రమప్రవేశముగా కూడా అనిపించ వచ్చును. కాని, పాతహద్దులన్నీ అతిక్రమిస్తున్న ఈ కాలములో, ఈ కొత్త హద్దులు నిలువగల వంటారా ?

ఆంధ్రచరిత్రలో, అందులో ముఖ్యముగా, శాతవాహన చాళుక్యయుగ ములలో, విశేషపరిశ్రమ చేసిన శ్రీ భావరాజు కృష్ణారావుగారు ఈమధ్య నాటి కలు వ్రాసియుండుట మీరు చూచి ఉందురు. మరియు మా మిత్రులు, ఆంధ్రుల చరిత్రల్లో, అందును కాకతీయయుగములో నిధియైన, శ్రీ డాక్టరు మారేమంద రామారావుగారు ఎన్ని నాటికలు వ్రాసినారు ? అట్టి చరిత్రకారులు వాఙ్మయ రంగములోనికి చొచ్చుకొని వచ్చుచున్నప్పుడు మా బోంట్లము కొందరమైనా వారిచరిత్ర రంగములోకి జొరబడడము తప్పంటారా ?

మరొకటి గమనించండి ! మన మిప్పు డెరిగి మనకు ప్రచారములోకి వచ్చిన చరిత్రరచనాపద్ధతి ఇంగ్లీషువారి వలన దిగుమతి ఐ వచ్చినదే గదా ! ఇంగ్లీషులో గిబ్బను, కార్లైలు, ఫ్రూడో వ్రాసిన చరిత్రగ్రంథములు సారస్వత ములో ఉన్నతస్థాన మలంకరించినవి. ఈమధ్య వెల్సు వ్రాసిన ప్రపంచ చరిత్ర మీరంద రెరుగనిది కాదు. ఈ విధముగా నాకీ అక్రమప్రవేశములో మార్గదర్శకు లెందరో ఉన్నారని విదితము కాగలదు.

అంతేకాదు ! కవులు, చరిత్రకారులు ఒకేపని చేసేవార మనే అనుభవ జ్ఞానము సంపాదించినప్పుడే ఉభయుల కృషి సఫలము కాగలదని నా విశ్వాసము. ముఖ్యముగా ఆ నిశ్చయముతోనే దీని కుపక్రమించినాను. ఇది చివర వరకూ విన్నవారికి విశదము కావచ్చును.

౨

ఆంగ్లేయుల పరిపాలనలో భరతదేశపు పాఠశాలలో ఇంగ్లీషుభాష ప్రారంభించుటకు కారణమేదో అది మన కందరికీ ఇప్పుడు తెలిసిపోయినది. రాజకీయాందోళనము చేయుటకు మన ఉపన్యాసకులు వేదికలపైనుండి పదే పదే మెకాలే వ్రాసిన రిపోర్టు ఉద్ఘాటించినారు. అది అందుచే పేలవమైనది. మన జాతీయసంస్కృతిని నాశనము చేసి విజాతీయసంస్కృతిపై వ్యామోహము దేశములో కల్పించి విజాతీయప్రభుత్వము నిరాటంకముగా పరిపాలన చేయగలందులకు ఉపకరణములనుగా మన మనుష్యులను మార్చుటకే కదా అది పెట్టినది ! ఈ విషయము మన చుట్టు ఆవరించిఉన్న గాలివలె సర్వసామాన్య విషయమే కాని గాలివలెనే అది సర్వాధార మైనదని మరవరాదు.

మన దేశవిషయములు తెలియవలె నన్నా, ఇప్పుడు మన కాధార మైనవి ఇంగ్లీషు పుస్తకాలే కదా ! సంస్కృతములో కాని, తెలుగులో కాని ఉన్న పుస్తకాలు కూడా ఇంగ్లీషు తర్జుమా రూపంతో వచ్చినప్పుడు ప్రాకినట్లుగా దేశములో ప్రాకవు. ఇంగ్లీషు భాషాంతరీకరణము చదివినట్లుగా తెలుగుభాషాంతరీకరణము చదువము. పత్రికలు చూడండి ! మనము ఇంగ్లీషు పత్రికలు చదువుతామా ? తెలుగువా ? ఈ స్థితిలోకి ఇంగ్లీషు వారి ధర్మాన మన మిప్పుడు వచ్చినాము.

అయితే ఈ ఇంగ్లీషు వ్యామోహము ఒక్క భాషలోనే కాదు వారు ప్రవేశపెట్టినది ! సమస్త విజ్ఞానవిషయములలో అది వారు ప్రవేశపెట్టినారు. ఆ సంగతి మనము తెలుసుకోలేని స్థితిలోకి కూడా ఇప్పుడు వచ్చామంటే ఎంతమాత్రము అతిశయోక్తి కాదంటే నమ్మండి. మతములో, సంఘములో, రాజకీయములలో, సారస్వతములో, విజ్ఞానములో - సమస్త విషయములలో అది చొచ్చినది. తుదకు జాగ్రఫీలోకి కూడా వచ్చినదంటే నమ్ముతారా ? అయితే, అవి అన్నీ మనకు ప్రస్తుత విచార్య విషయములు కావు. ఆ విజాతీయదృష్టి చరిత్రరచనలో

ఆవేశించినది. అది ఎంత గట్టిగా అందులో ఆవేశించి మనలను గ్రుక్కతిప్పుకో నీయకుండా చేయుచున్నదో, అందరికీ తెలిసిన స్థూలవిషయములనే పరిశీలనచేసి నివేదించ దలచినాను. అందరూ గతానుగతికముగా ఏ కోశమునా సందేహ లేశము లేకుండా వ్యవహరించుచున్న విషయములతోడనే నా అభిప్రాయము ఉదహరించి వివరించెదను.

౩

ఏ చరిత్రగ్రంథమైనా తీసికోండి ? హిందూదేశచరిత్ర మూడు యుగ ములుగా - పీరియడ్లుగా - విభజించి ఉంటుందిగదా ! మొదటిది హిందూ పీరి యడు, రెండవది మహమ్మడన్ పీరియడు, మూడవది బ్రిటిషు పీరియడుగదా! మన చరిత్రకు ఈ విధముగా విభజన చేయుటలో దోషమేమైన కనబడుచున్నదా మీకు ? ఇందులో తప్పేమాత్రమైనా ఉన్నదనిపిస్తున్నదా ? లేదు !

నాకుకూడా 1947 సం॥ ఆగస్టు 15వ తారీకు వచ్చినంతవరకూ ఏమీ కనపడలేదు. ఆ తర్వాత రోజురోజుకూ ఒక కొత్త విధమైన దోషము నాకు కనపడుతున్నదంటే నమ్మండి ! దాని అంతరార్థము స్ఫురించినకొద్దీ నా హృద యములో రోషాగ్ని ప్రజ్వరిల్లుతున్న దంటే కూడా నమ్మండి !

ఈ విభజనవల్ల వారు సాధించిన ఫలము సూత్రప్రాయముగా చెప్పితే ఇది ! అది ఎంత పటుత్వము కలదో, ఎంత క్రూరమైనదో ఆపైన మీరే అనుమేయించండి !

పూర్వము ఆర్యులు ఈ దేశములోనికి పైనుండి ప్రవేశించి ద్రావిడులను దస్యులను మర్దించి తమ సంస్కృతి కొన్నాళ్ళు ఈ దేశములో బలవంతముగా వ్యాపింపజేసినారు. ఆ పైన కొంతకాలమునకు వేడిదేశములో వారు చిరకాలము ఉండుటచే వారి జాతీయశక్తి క్షీణించినది. పరస్పరకలహము లెక్కువయినవి. దేశద్రోహులు పొడసూపినారు. ఇంతలో బలవంతులగు మహమ్మదీయులు పైదేశములనుండి దండములు తండములుగా వచ్చి ఈ దేశము పాలించినారు. ముందు వచ్చిన మహమ్మదీయతండము గెలుపొందసాగినది. ఈ మహమ్మదీయులు క్రూరులై బలహీనులగు హిందువులను హింసింపసాగినారు. వారు ఈదేశములో

చిరావాసము వలన విషయలంపటులై క్షీణించినారు. అల్లకల్లోలముగా ఉన్న ఈ దేశములో ఆంగ్లేయులు దూరమునుండి వచ్చి ఇతర శ్వేతజాతులను పార దోలి, మహమ్మదీయులను జయించి, శాంతి నెలకొల్పి నిష్పక్షపాతముగా పాలించుచున్నారు. - ఇదీ యుగవిభజన సూత్రసారము !

మన దేశములో చిరకాల మున్నవారు నిర్వీర్యు లవుతారట : అందుచేత ఈ దేశవాసులము ఎల్లప్పుడూ దాస్యము చేయవలసినవారమే. ఇప్పటికి కూడా ఈ వేడిదేశములో ఉండడమువల్ల జాతి నిర్వీర్య మవుతుందనే భావము మనలో ఎందరికి లేదు ? కాని ఇది నిజముగా అనుభవసిద్ధమేనా ? ఇంతకంటె చలి దేశములో ఉండే అలవాటున్నవారికి ఈ దేశము వేడిగా ఉండి ఒంటికి పడక క్షీణ కారణము కావచ్చును. అట్లే వేడిదేశములో ఉండేవారికి చలిదేశములో నివాసము క్షీణకారణము కాదా ? మన మిప్పుడు నిర్వీర్యులముగా ఉండవచ్చును. కాని దానికి కారణము ఈ భరతభూమిలో నివాసమే. ఐతే మన కిక గతి ఏమిటి ? నైజామునుండి, పాకిస్థాన్‌నుండి వలస వచ్చేవారివలె మనమూ ఎక్కడికయినా వలస పోవలెనా ? ఎక్కడికి పోదాము ఈ ముప్పైమూడు కోట్లమందిమినీ ? లేక నిరంతరము ఎవరో ఒక విదేశీయులకు ప్రభుత్వము సమర్పించి మనము వారికి సేవ చేయవలసినదేనా ?

రెండు మహాయుద్ధములలో జర్మనీవారు నిర్వీర్యులయ్యే ఓడిపోయినారా? మొన్నటి యుద్ధములో జపానువారు నిర్వీర్యులయ్యే ఓడిపోయినారా ? తాత్కాలికముగా ఒక దేశము స్వాతంత్ర్యము పోగొట్టుకొనడానికి అనేక కారణాలు ఉంటవి. వేడిదేశము కావడమువల్ల భారతజాతి నిర్వీర్యమైన దనడము మనలను నిరంతరము దాస్యములో ఉంచడానికి విదేశపాలకులు నేర్పిన తప్పుడు చదువు. మనజాతి మొదట నిర్వీర్య మైనదా ? మహాసంగ్రామ విజయానంతరమున మదించి మైమరువవలసిన బ్రిటిషు వారివద్దనుండి విముక్తి ఎట్లా సంపాదించినాము ? మనది నివాసయోగ్యముకాని వేడిదేశమా ? అయితే ఇన్ని కోట్లమంది జనము పిలవకుండా వచ్చి ఇక్కడ నివాసము కల్పించుకొని వృద్ధి పొందుతున్నారు. పవిత్రమై, మూడుపూటలను స్నానసంధ్యాది క్రియలకు యోగ్యమైన ఈ భరతభూమి వేడిదేశమని చెప్పిన చదువు మనము మరవవలెను. అయితే ఇది జాగ్రఫీవిషయము కాబట్టి ప్రకృతమైన చరిత్ర అనుసరింతాము !

ఈ పీరియడ్ల విభాగములో ఇంత దూరార్థము ఇమిడి ఉన్నదా ? అని మీరు ప్రశ్నించవచ్చును. ఇంకా చాలా దూరార్థ మున్నదని మనవి చేసెదను.

సృష్ట్యాది నుండి ఇప్పటికి ఎన్ని కోట్ల సంవత్సరములో గడచిపోయినవి గదా ? 195 కోట్ల 85 లక్షల 560 సంవత్సరములు గడచిపోయినవి. నిముషములతో సహా మన సిద్ధాంతులు ప్రతి సంవత్సరమూ పంచాంగములలో లెక్కలు వ్రాయుచున్నారు. మానవజాతి ఈ భూగోళముపైన అవతరించి అటువంటి ఊహాతీతమైన సంవత్సరముల సంఖ్య కల కాలమే కడచినదని నేటి భూతత్త్వశాస్త్రవిదులు కూడా గణన చేయుచున్నారు.

భారతదేశచరిత్ర అంటే ఇన్నికోట్ల సంవత్సరములచరిత్ర అంటే పొరపాటు లేదుగదా ! ఇందులో బ్రిటిషువారున్న 190 సం॥లూ, మొగలు లున్న 181 సంవత్సరములూ, లోడీల 75 సంవత్సరములూ, సయ్యదుల 37 ఏళ్ళూ, తుఘలకుల 94 సం॥లూ, ఖిల్జీల 30 సం॥లూ, బానిసల 84 సం॥లూ ఏ అంశలోకి వస్తవి ? ఈ చిన్నభాగాలకు పెద్ద పీరియడ్లు అని విభాగా లెందుకు ? భరత చరిత్రలో మహమ్మదీయులు పాలించినారనే 500 సం॥లూ, బ్రిటిషువారి 190 సం॥లూ బహుస్వల్పము. మనకు సన్నిహిత మయిందున అవి గొప్పగా కనపడవచ్చును. కాని, చరిత్రకారుని దృష్టికూడా అంత సంకుచితముగా ఉండవచ్చునా ?

ఈ చరిత్రగ్రంథములలోనే గుప్తసామ్రాజ్యము 190 సం॥ములు ఉన్నదనీ, అది స్వర్ణయుగమనీ చదువుచున్నామే ! శాతవాహనులు 464 సం॥ములు పాలించిరనీ, అంత దీర్ఘకాలము పాలించినవంశ మింకొకటి లేదనీ చదువుచున్నాము. మరియు కుషానులు 230 సం॥లు రాజ్యము చేసిరట. మౌర్యులు 160 సం॥లు, నందులు 73 సం॥లు రాజ్యము చేసిరట. అంతకుముందు బింబిసారాదులు అధమపక్షము 200 సం॥లు రాజ్యము చేసిరట.

ఈ చరిత్రకారుల దృష్టిలో భారతదేశచరిత్ర ఇప్పటికి 2,500 సం॥ల నుండి ప్రారంభించుచున్నది. అట్లే చూచినా 1300 సం॥లు ఒక పీరియడా ? 500 సం॥లు ఒక పీరియడా ? 190 సం॥లు ఒక పీరియడా ? ఈ మూటికి సమాన ప్రతిపత్తియా ? కాలమునుబట్టి గాని, ప్రాముఖ్యమునుబట్టి గాని ఇవి

సబబా ? ఈ విభజనము అనవసరముగా మన పారతంత్ర్యకాలమున కెక్కువ ప్రాముఖ్య మిచ్చుటలేదా ? స్వతంత్రములై ఉత్తమము లయిన కాలములచరిత్ర విస్తరించి వివరించి విభజించి మనకు బోధించి, ఈ తర్వాతి రెండుకాలములను పారతంత్ర్యస్థితి యని క్లుప్తముగా వ్రాసి అందు భరతభూజనులు స్వాతంత్ర్య మునకు పోరిన విధానము వివరించుచు చరిత్ర వ్రాయరాదా ? జపానువారు వారి ప్రస్తుత పారతంత్ర్య స్థితిని వారి చరిత్రలో వ్రాయదలచలేదని మీరు పత్రిక లలో చదవలేదా ? ఒక పీడకలను వివరించి మన విద్యార్థుల కెందుకు బోధించవలెను ?



ఈమాట అనగానే చరిత్రకారులు సత్యము మరుగుపరచరాదని, కొందరు సత్యసంధుల మనుకునే చరిత్రకారులే కాక బుద్ధిమంతులు కూడా నాతో వివదిం చెదరు. అందువల్ల ఈ యుగవిభజన అంగీకరించుచున్న చరిత్రకారులకు ఎంత సత్యదృష్టి ఉన్నదో కూడా విమర్శ చేద్దాము !

బ్రిటిషువారు భరతఖండ మంతటినీ పరిపాలించినా రనుటలో ఎట్టి సందేహమూ లేదు. స్వతంత్ర సంస్థానము లనేవి 800 పైచిలుకు ఉన్నా అవి అన్నీ వారి దయాధర్మ భిక్షములకు లోబడి ఉన్నవే ! వారి యుగ మని చెప్పే 190 ఏళ్ళు కాకపోయినా, అందులో 100 సం॥ల కాలమైనా వారు భరతఖండ సామ్రాజ్యమునకు ప్రభుత్వము చేసినా రనుటలో సందేహము లేదు.

మరి మహమ్మదీయులో ? ఢిల్లీలో పరిపాలన చేసిన మహమ్మదీయరాజు లలో ఏ కొద్దిమందో తప్ప దక్షిణదేశములో రాజ్యములు స్థాపించలేదు. దక్షిణ దేశముపై వారిదృష్టి ఎప్పుడు మరల్చినను, వెంటనే వారిరాజ్యములు విచ్ఛిన్న మైనవి. ఇది ఒకసారి మహమ్మదు తుఘ్లుకుతోను, మరియొకసారి ఔరంగజేబు తోను సంభవించినదని అందరికీ బాగా తెలిసినదే ! ఉత్తర భారతములో మహమ్మదీయులు ప్రభుత్వము చేయుచున్న రోజులలో దక్షిణదేశములో కొన్ని

వందలయేళ్లు కాకతీయులు బలవంతులయిన ప్రభువులుగా ఉండిరి ; మరికొన్ని వందల సంవత్సరములు విజయనగర చక్రవర్తులు ప్రభువులై యుండిరి. 1320 వరకూ కాకతీయయుగమనీ, 1565 వరకూ విజయనగర సామ్రాజ్య యుగమనీ ఎందుకనగూడదు ? 18వ శతాబ్దములో మహారాష్ట్రులు ఆసేతు హిమాచలమున బలవంతులయిరి. అది మహారాష్ట్రయుగమని ఎందుకనగూడదు ? ఉత్తరభారతమును పాలించిన విదేశీయులనుబట్టి భరతఖండచరిత్రలో యుగవిభజన ఎందుకు చేయవలెను ?

జాతీయాభిమానము లేక కేవల సత్యాన్వేషణపరాయణు లయినవారికైనా ఈ యుగవిభజనము సమంజసము కాదని అంగీకరించెదరని తలంతును. మూడు యుగముల విభజనకు అలవాటుపడిన మన బుద్ధికి ఇది ముందు విపరీతముగా అసందర్భముగా తోచవచ్చును. కాని విచక్షతో యోచించేవారికి ఇందులో సత్యమేదో ఉన్నట్లున్నదని సందేహము కలిగినా నేను కృతార్థుడనే।

౨౩

కాని దీనితో నేను చెప్పదలచినది పూర్తి కాలేదు. మరొక పెద్ద భ్రాంతి దేశములో వ్యాపించినది. హస్తినాపురము భరతఖండమునకు రాజధాని గనుక దానిని పాలించినవారి చరిత్ర వ్రాయుటతో భరతఖండ చరిత్ర కృతార్థమగునని కొందరి భావము. మరికొందరికి వింధ్యా హిమవత్పర్వత మధ్యప్రదేశముల చరిత్రతో పూర్తి యగునని అభిప్రాయమున్నది.

ఈ రెండవభావము ఇప్పుడిప్పుడు తగ్గినందుకు కొంత సంతోషము. నేను విద్యార్థిగా స్కూలుఫైనలువరకు చదివినరోజులలో శాతవాహనుల పేర్లుగాని, పులకేశిపేరు కాని, రాజేంద్రచోళ చక్రవర్తిపేరుగాని, కాకతి గణపతిదేవ చక్రవర్తిపేరు కాని చదివిగాని, వినిగాని ఎరుగము. ఇప్పుడు కొంత మార్పు వచ్చినా, ఉత్తరదేశ చరిత్రకు ప్రాధాన్యము పోలేదు.

భరతఖండమునకు హస్తినాపుర మొక్కటే రాజధాని కాదు. కౌరవచక్రవర్తులకు హస్తినాపురము, రాఘవసార్వభౌములకు అయోధ్య రాజధానులు. కొంతకాలము పాటలీపుత్రము రాజధాని. కొంతకాలము ఉత్తరదేశములో భార

తీయ సంస్కృతి వికసించినది. మరికొంతకాలమున కది దక్షిణదేశములో బల పడినది. చాళుక్యులయు, చోళులయు, పల్లవులయు సామ్రాజ్యము లెంత గొప్పవో, కాంచీనగరము ఎంత ఉన్నతస్థితి ననుభవించినదో మన మందరమూ తెలిసికోవలసిన విషయము.

౯

మరియొక విషయము! క్రీస్తుకు పూర్వము 220 ఏండ్లు [550-830] పారశీకచక్రవర్తులు గాంధారము, పంజాబు రాష్ట్రముల నేలిరి. అట్లే గ్రీకులు 150 సం॥లు [2౮0-20] ఆ ప్రాంతములనే పాలించి మధ్యమధ్య మగధవరకు చొచ్చుకొని రాగా ఒకసారి ఖారవేలుడు పారద్రోలెను. గ్రీకులను పార్థియనులు జయించిరి. పిమ్మట శకులు 200సం॥ పాలించిరి. కుషానులు కొంతకాలముండిరి. వారిలో కనిష్కునిపేరు విఖ్యాత మైనది. ఆ దండయాత్రలును, రాజ్యములును పలువురు మహమ్మదీయుల దండయాత్రలకును, రాజ్యములకును తక్కువవి కావు. మన దేశములో రాజ్యములు స్థాపించిన మహమ్మదీయులు కూడా అంతా ఒకటే అనే భ్రాంతి చాలామంది కున్నది. వారిలో కొందరు షియాలు, కొందరు సున్నీలు. ఉత్తరదేశములో పారశీక సంస్కృతి ఎక్కువ. దక్షిణదేశములో అబిస్సినియా సంస్కృతి ఎక్కువ. వారిలో వారికి ఉన్న భేదములు గ్రీకులకు, పార్థియనులకు, శకులకు, కుషానులకు ఉన్న భేదముల కంటె తక్కువవి కావు. అట్టియెడ నందరను మహమ్మదీయులని సామాన్యనామముతో వ్యవహరించుటచే వారికి సంఖ్యాబలము ఎక్కువ చేయడముకాదా? ఇదంతా మహమ్మదీయ మహాయుగ మని విభజన చేయడమువల్లనే సంభవించినది!

తురుష్కుల ఆపద, మొగలుల ఉపద్రవము, సున్నీల ఇక్కట్లు, షియాల సంక్షోభము, బ్రిటిషుప్రళయము- ఇట్టి పేర్లతో ఈ మన చరిత్ర భాగములకు నామకరణము ఏల చేయరాదు?

౧౦

మరి మాబోంట్లకు భరతచరిత్ర ఏ విధముగా కనపడునో ఆలకించండి!

మన దేశములో రెండే తెగ లున్నవి. ఆర్యులు - అనార్యులు. ఇవి అనాదులు. ఒకరు ముందూ ఒకరు వెనుకా కాదు. ఈ దేహములో ఎన్ని విధము

లయిన జీవరాసు లున్నవి ? అందులో కొన్ని దేహమును నిలువబెట్టేవి. ఇతర మైనవి దానిని నాశనము చేయ జూచేవి !

ఆర్యు లంటే ఎవరు ? ఈ దేశక్షేమము కోరేవారు ; ఆసేతు హిమాచల పర్యంతమైన భూఖండమును తమ తల్లిభూమిగానే కాదు, తండ్రిభూమిగానేకాదు సాక్షాత్తు పరదైవతముగానే చూచేవారు ఇదే వారి జన్మభూమి, విలాస భూమి, విహారభూమి, కర్మభూమి, తపోభూమి, పుణ్యభూమి ! దేహపాతమందు తుదకు వారిదేహముల భస్మము ఈ భూమిలో అణువుగానే మారిపోయి పంచ భూతములలో కలిసిపోతుంది. వారు దివ్యలోకాలకు చేరుకుంటూ కూడా మరల మరల ఈ భూమిలోకే అవతరిస్తూ ఉండవలెనని కోరుకుంటారు. వారు, క్షమించండి ! మాది ఆంధ్రమనీ, తమిళమనీ, కర్ణాటకమనీ, మహారాష్ట్రమనీ, ఘూర్జర మనీ, వంగ మనీ ప్రత్యేక స్పర్థలు లేనివారు. వారికి వేదము, వేదాంగములు పరమ ప్రమాణములు. సంస్కృతము వారి శిష్టవ్యవహారభాష !

మరి అనార్యులో ? దానికి వ్యతిరేకులు ! వారికి స్వలాభము ఎక్కడ లభించినా దానికి ప్రాకులాడుతారు. నేడీ దేశము, లాభసాటిగా ఉంటే ఇక్కడ ఉంటారు. కాకపోతే రేపు ఇంకో దేశము పోతారు. వారికీ దేహపోషణమే పరమావధి ! దేశద్రోహము సమర్థించుటకై సర్వసమత్త్వము వాంఛించేవార మంటారు !

మన దేశము ఎప్పుడూ కూపస్థమండూకము వలె ఉండలేదు. అన్ని వైపులనుండీ విదేశీయుల అలజడి అనాదిగానే వస్తూ ఉన్నది. ఒక్కొక్క అలజడి వస్తే దాన్ని ముందు ఎదురొడ్డి నిల్చినాము మితిమించినప్పుడు తలవంచి బాధపడ్డాము. పిమ్మట నెమ్మదిగా జీర్ణించుకున్నాము ! ఈ విధముగానే పూర్వము గ్రీకులను, పార్థియనులను, శకులను, కుషానులను, హూణులను, పహ్లవులను మరి ఎందరనో జీర్ణించుకున్నాము. అందులో ఒకప్పుడు ప్రతికూల మైన శక్తులనే మరొకప్పుడు ఆత్మరక్షణకు ఉపయోగించుకున్నాము. పూర్వము దండెత్తి వచ్చిన విదేశీయులు మనలో కలిసిపోయినారని చరిత్రకారులు చెప్పు చున్నారు కదా ! అట్లే మహమ్మదీయులూ కలిసిపోగలరు !

జ్వరాది వ్యాధులు ఆవేశించిన దేహమును ఊహించుకోండి! మనదేశము ఇప్పుడు మహాజ్వరావిష్టమై ఉన్నది. మన దేశమే కాదు; ప్రపంచమే మహాగజజ్వరముతో ప్రస్తుతము అట్టుడికిపోవుచున్నది. భూభారము దుర్భరముగా ఉన్నది. అదే ఇట్టి అలజడులకు నిదానము.

మన చరిత్రకారులు శాంతచిత్తులై దేశశ్రేయస్సుకు ఉపయోగించే విధముగా చరిత్ర అవగాహన చేసికొని పాఠశాలలో చదువుకొనే విద్యార్థులకే కాక మనబోటి విద్యార్థులకుకూడా అవగాహన చేయవలె! అప్పుడే మన దేశము ఉద్ధారము కాగలదు; ఈ లోకోద్ధరణబీజము లోకమంతటా వ్యాపింపగలదు!

౨

అసలు చరిత్ర మన మెందుకు చదువవలె? ఖారవేలుడు, కాక కనిష్కుడు, ఏ సంవత్సరమువాడు? పది ఏళ్ళు ఇటా అటా అని పేజీలకు పేజీలు వాదోపవాదములు చరిత్ర అవుతుందా? కొన్నివందల ఏళ్ళు ముందైనా వెనుకయినా ఫలితాంశములో భేదము లేదు. చరిత్ర ద్రవ్యపరిశోధన వంటిది కాదు! బింబిసారునిపేరూ, అజాతశత్రునిపేరూ మీరు విన్నారుగదా! వారిని జైనగ్రంథములలో శ్రేణికుడనీ, కుణికుడనీ ఉదహరించినట్లు మీకు తెలియునా? ఏ పేరైతే నేమి?

పురాణములలో ఎన్నో రాజవంశముల చరిత్రలు సూక్ష్మముగా ఉన్నవి. అందులో పెద్ద కల్లోలములు కలిగినప్పుడు ఆర్యధర్మము నిలవబెట్టిన వారి చరిత్ర వివరించి ఉంటుంది. శత్రువులు ఎవరో, ఏ విధముగా విజృంభించినారో, ఎంతకాలము చెలరేగినారో, తుదకు ఏ విధముగా అణగినారో అందులో వినబడుతుంది. మన పెద్దలు వ్రాసిన పురాణచరిత్రలు మన కిప్పుడు ప్రమాణము కావాయెను! అలగ్జాండరుతో వచ్చిన గ్రీకులు, చంద్రగుప్తునివద్ద ఉన్న మెగాస్తనీసు, హ్యూయన్‌త్సాంగు, ఫెరిస్తా, మార్కోపోలో, అబ్దుల్‌రజాక్ వ్రాసిన గ్రంథము మనకు ప్రథమప్రమాణము లాయెను. ఆ గ్రంథములు సూక్ష్మముగా చూచినవారికి ఎంత ఆత్మశ్లాఘలతో నిండి ఉంటవో ఎరుకే! వానిని చదవవద్దనను. మన చరిత్రకు మన దేశసాక్ష్యముమీద ఆధారపడి, సహాయముగా విదేశసాక్ష్యము తీసికోవలెను. అది సక్రమపద్ధతి. విదేశగ్రంథములు

ప్రథమ ప్రమాణములుగాను, స్వదేశ గ్రంథములు ఆలోచించదగిన ప్రమాణము గాను తీసికొనుట తల్లక్రిందులు చేయుట. ఇప్పుడు మనదేశమునుగూర్చి విదేశ యాత్రికులు ఎన్ని కథలు వ్రాయుచున్నారో గమనించి ఫాహియాను గ్రంథము, హ్యూయనుత్సాంగు గ్రంథము మన పరిశోధకులు అవగాహన చేసికొందురు గాక !

చరిత్రరచనలో మనము జాతీయదృష్టి అలవరచుకొనవలె ! అదే ఆర్య దృష్టి ! జాతీయమైన చరిత్రదృష్టితోనే వాల్మీకి శ్రీమద్రామాయణము వ్రాసి నాడు ; వేదవ్యాసుడు భారతము రచించి పురాణగ్రథనము చేసినాడు. వాల్మీకి శ్రీరాముని ఆస్థానకవి కాడు ; వేదవ్యాసుడు జనమేజయుని ఆస్థానకవి కాడు. ఒకవేళ వారు ఆస్థానకవులే ఐనా ప్రభువులను అనుసరించుకొని ఆశ్రయించి విధేయులగు ఈ కాలపు ఆస్థానకవులవంటివారును, ఇతరదేశముల ఆస్థానకవుల వంటివారును కారు. వారు ప్రభువులకు ప్రభువులు. ఆర్యజాతీయ సంస్కృతికే వారు ప్రభువులు.

ఇప్పటికి 5,550 సం॥ల క్రిందటి తన కాలపుచరిత్రను మహాభారత మనే జయకావ్యములో చిత్రించినాడు. పాండవపక్షపాతముతో అది వ్రాసినా దనువారు మతిహీనులు. పాండవులు చేసిన ధర్మవ్యతిక్రమము లతడు దాచలేదు. అతనికి ధర్మమందే పక్షపాతము. ఆ కాలములో సాధ్యమైనంత ధర్మబుద్ధి ఉన్న ధర్మ రాజు జయము వర్ణించినాడు.

అతడు మహాభారత రచనతో ఊరకొనలేదు. అప్పటికి 193 కోట్ల 85 లక్షల సంవత్సరములు గడచిపోయినవి. ఆ చరిత్ర అప్పటికి పెద్దల స్మృతిలో నిలిచి ఉన్నంతవరకు క్రోడీకరించి పురాణములు, ఉపపురాణములు గ్రథనము చేసినాడు. వానిలో తర్వాతివారు ఎన్నో ప్రక్షిప్తములు చేసినమాట వాస్తవమే. బుద్ధిమంతులు విమర్శించి, వానిని వేరు చేయుటకు ప్రయత్నించ వలయునుగాని అందులో ఉన్న చివర ప్రక్షిప్తమునుబట్టి దాని కాలము నిర్ణయిం చుట న్యాయమా ?

మహాభారత యుద్ధకాలము తిథి వార నక్షత్ర విశేషములతో శ్రీ మహా భారతములోను, పురాణములలోను ఉదహరించి ఉన్నది. విదేశీయులదృష్టితో

చూచుటకు మనకు అలవాటు వచ్చునంతవరకు అది నిర్వివాదముగా అంగీకరించిన విషయము అది సందేహించుటకు మన కిప్పుడు క్రొత్తకారణ మేమి దొరకినది ? ఇప్పటికి 5,538 సం॥ల క్రిందట జరిగినదనే ఎందుకు వ్రాయగూడదు ? ప్రతి సంవత్సరము జాగ్రత్తగా కలిశకము పంచాంగములలో వ్రాయుచున్నామే! ఏ కర్మ చేసినా ప్రతివారూ నిత్యమూ ఆసేతుహిమాచలమూ ఒకే విధముగా ఈ కాలము స్మరించుచున్నారే ! ఇన్నికోట్లమంది నిరంతర నిత్యస్మరణతో ఉన్న కాలప్రమాణము సరికాదని ఎందుకు శంక కలిగినది ? ఋగ్వేదము క్రీస్తుకు పూర్వము 1500—2000 సం॥ల క్రింద పుట్టినది కాదని దీనివలన ఋజు వయితే మనకు హృదయవేదన ఎందుకు ?

193 కోట్ల 87 లక్షల 550 సం॥ల చరిత్ర వ్రాయవలెనని మనము దృష్టిలో పెట్టుకొన్నచో చరిత్రను ఏ విధముగా ఊహించుట ఉచితమో మనకు స్పష్ట మవుతుంది. ఆ మహాకాలములో వందల సంవత్సరాలు లెక్కకు రావు. మహాకాలపురుషుని ఒడలిపై ఈగవాలగా దులుపుకున్నంతకాలము క్రిందికికూడా బ్రిటిష్‌పరిపాలనకాలము లెక్కకు రాదు. ఈ విషయము గమనించకపోయినా అబద్ధము కానేరదు.

చాళుక్యశాసనములలో శక్తివర్మ రాజ్యమునకు వచ్చుటకు ముందు 80 ఏళ్లు దేశము అరాజకముగా ఉండెనని వ్రాసినారు. అట్లే నూటముప్పైఏళ్లు కాక ఏడువందల ఏళ్లు అరాజకమనే దృష్టితో భారతచరిత్ర వ్రాసినా అబద్ధము కాదు. మన భూమిలో మనదేవతలకు మన ధనముతో ఆయతనములు నిర్మించుకొనుటకు కూడా హక్కు లేకుండా చేసి మన శిరస్సులపై పవిత్రమైన శిఖ యున్నందుకు పన్ను వసూలుచేసినవారిని మన రాజులని మన మెందుకు ఒప్పుకొనవలెను ? రాజంటే ధర్మపరిపాలకుడు ! అది కానినాడు అతడు గుండా ! గుండాలు వారి మాటలు చెల్లించుకొనిన రోజులు అరాజకస్థితి అనుట అసత్య మవుతుందా ?

ఆసేతుహిమాచల మధ్యమైన భూమి ఒకటనే భావము ప్రబలినప్పుడు ఈ దేశము వీర్యవంతమైనదని మన మూహింపవచ్చును. ఇప్పటికి వేయి సంవత్సరముల పైకాలమునుండి నిర్వీర్యదశ మనకు ప్రారంభించినది. చాళుక్యులు, చోళులు, రాజపుత్రులు, కాకతీయులు, విజయనగర ప్రభువులు, మహారాష్ట్రులు

ఈ వేయిసంవత్సరముల కాలములో భారతైక్యము కొరకు ప్రయత్నించియు సాధించలేకపోయినారు. అది మన జాతీయతను విచ్ఛిన్నము చేయవలెనను దురుద్దేశముతో ప్రారంభించిన బ్రిటిష్‌వారు మనకు సాధించిపెట్టినారు. వారి ప్రతికూల ప్రయత్నమే లేకున్న మన కీ జాతీయశక్తి విజృంభించదు. ఈ వేయిసంవత్సరములలో లేని ఐక్యము ఇప్పుడు సాధ్యమైనది. ఈ ఐక్యబుద్ధి, జాతీయబుద్ధి, ఆర్యబుద్ధి మనము పెంపొందించుకొనుటకు చరిత్రకారులు సహాయము చేయవలెను. ఉత్తరభాగమునకు దక్షిణభాగమునకూ, ఒక రాష్ట్రమునకు మరియొక రాష్ట్రమునకూ భేదములు వెదుకక అందరికి సమానమైన ఆర్యధర్మము అలవరచుకొనవలె! అప్పుడే మన జాతి వీర్యవంత మైనదని ఋజువు కాగలదు.

వేదవ్యాసుడు, వాల్మీకి మనకు ఆదర్శఋషులు, ధర్మప్రవర్తకులు, చరిత్రకారులు, కవులు! చరిత్రకారులు స్వయముగా ఋషు లయినప్పుడు కవులే అవుతారు. చరిత్రకారులు కవులు కావలె! కవులు చరిత్రకారులు కావలె! ఉభయులూ ఆర్యధర్మము గ్రహించిన ఋషులు కావలె! అప్పుడే మరియొక ఉత్తమ మైన జయకావ్యము ఉద్భవిస్తుంది. అప్పుడే జాతీయాభ్యుదయము కలుగుతుంది; దానితో లోకకల్యాణము కూడా ప్రారంభించగలదు.



# చరిత్రాత్మక నవల

## ౧

చరిత్రాత్మకనవల అనగానే రెండు విరుద్ధవిషయాల కలయికగా తోస్తుంది. చరిత్రకు సత్యమే కావలె. అందులో జరిగినదే కాని కల్పన ఉండరాదు. మరి నవల అంటే అందులో ముఖ్యముగా కావలసినది కల్పన. దానికి జరిగినదా అనే దానితో నిమిత్తము లేదు. కల్పన హృదయంగమముగా ఉండవలె. జరిగినది జరిగినట్లుగా చెప్పితే, ఎప్పుడో సకృత్తుగా కాని, పేలవంగా ఉంటుంది. ఇట్లా పరస్పరవిరుద్ధములయిన రెండిటిని జోడించడము సాధ్యమా ? అది సాధ్యము కాకపోతే చరిత్రాత్మక నవల అస్తిత్వమే మరుమరీచిక అవుతుంది. ఆ విరోధము ఆభాస మాత్రమే ఐతే అది సాధ్యమవుతుంది.

చరిత్రాత్మక నవలలను విమర్శచేసేవారు తరుచుగా ఈ రెండింటికలయిక ఎట్లా జరుగుతుందో తెలుసుకోలేక విమర్శలు సాగిస్తున్నారు. ప్రసిద్ధులూ, సరసులూ, సద్భావయుతులూ ఐన సమీక్షాకారు లొకరు, ఈమధ్య చరిత్రాత్మక నవల నొకదానిని ప్రబల ప్రచారమున్న ఒకానొక పత్రికలో సమీక్ష చేస్తూ, ఈ తాత్పర్యము వచ్చే మాట లన్నారు :

> "ఇందులో ఒకరికి ఒకానొక కాలంలో జరిగిన సంఘటన ఆధారం చేసుకొని చక్కగా కల్పన చేసినారు. పాతికపాలు మాత్రము చరిత్ర. తక్కినది అంతా కల్పన. ఇది మంచి నవలే కాని, ఆ మాటకు వెనక "చరిత్రాత్మక" అనేది లేకపోతే బాగుండేది."

ఆ సమీక్షకులు అన్నట్లుగా పాతికపాలు కూడా కేవల చరిత్రాంశము ఆ నవలలో నిజంగా లేదు. కాని, అందులో జరిగినది వర్ణించిన ప్రధాన విషయము మాత్రము వాస్తవముగా జరిగినదే. అందలిపాత్రలలో సగము మందికి పైగా ఆ కాలములో నిజముగా ఉన్నవారే. అయితే ఇదమిత్థ మని చరిత్రకారుడు నిశ్చయంగా చెప్పగలిగిన విషయాలన్నీ వరుసగా మనము క్రోడీకరించి వ్రాస్తే,

సరిగ్గా ఒక పేజీకంటె పట్టదు. అంటే కార్లైల్ Dry as Dust (దుమ్ము వలె ఎండుగా) అని నామకరణము చేసిన చరిత్రకారుల పద్ధతిన వ్రాస్తే అన్నమాట. ఆ నవలలో 304 పేజీలు ఉన్నవి. కాబట్టి ఆ నవలలో ఉన్న చరిత్రాంశము $\frac{1}{304}$ వ వంతు మాత్రమే ఆ సమీక్షాకారులు చరిత్రాంశము పాతికపాలు ఉన్నదని ఉదారంగా లెక్క కట్టినారు.

అట్లా అయినప్పటికీ ఆ నవల చరిత్రాత్మకము అని అనదగినదే అని మా ఆశయము. దానిలో ఆ కాలపు రాజకీయ పరిస్థితులు, సాంఘికాచారాలు, మర్యాదలు, ప్రయాణపద్ధతులు, సౌకర్యాలు వర్ణించడములో లోపాలు ఉన్నట్లు ఆ సమీక్షకులు ఒక్కటి కూడ నిరూపించలేదు. సూచన కూడా చేయలేదు. అందులోని ప్రధాన సంఘటన జరగలేదని వారనలేదు. ఒక్క చరిత్ర విరుద్ధాంశమైనా అందులో కలదని చూపడానికి ప్రయత్నించనూ కూడా లేదు. అయినప్పటికీ ఆ సమీక్షకులకు అది చరిత్రాత్మక మౌతుందా అనే సందేహమే కాక కాదని నిశ్చయముకూడా ఉన్నట్లు మనము నిశ్చయింపవచ్చును. అట్టిది చరిత్రాత్మక నవలే అని మనము నిరూపించగలిగితే, అట్టి బుద్ధిమంతు లగు సమీక్షకులకుగూడా చరిత్రాత్మక నవల స్వరూపము ఎట్టిదో అవగాహన కాలేదని మనము భావించవచ్చును.

చరిత్రాత్మక నవల—ఈ సమాసములో నవల అనే శబ్దము ఆంగ్లములో నావెల్ (Novel) అనే పదాన్ని మన ఆంధ్రపండితులు సంస్కృతీకరించి నిర్మించిన అపూర్వ సంస్కృత శబ్దము. అది ఆంధ్రదేశ మంతటా వ్యవహారములో రూఢమై పాతుకొని పోయినది. మనము కర్ణాటాదులవలె "కాదంబరి" అని కాని, ఔత్తరాహులవలె "ఉపన్యాసము" అని కాని, దానికి అన్వయించని సంస్కృత శబ్దాలు గ్రహించక, ఆ మాటకే సంస్కృతరూప మిచ్చినాము. ఈ సమాసములో ప్రధానమైన శబ్దము "నవల." "చరిత్రాత్మక" అనేది దానికి విశేషణము, అంత ప్రధానమైనది కాదు. అది చరిత్రసంఘటన ఆధారంగా, ఆత్మగా చేసుకొని నిర్మించిన నవల అన్నమాట. డ్రైయాజ్ డస్ట్ చరిత్రకారుడు సేకరించి పెట్టిన చిన్న ఎండిన మంటిబెడ్డల నలుసులను ఒకచోట ప్రతిష్ఠించి, దానికి ఇతర మృత్తికనుకూడ మేళవించి, ఆ చరిత్రకారుడే తాను సంగ్రహించిన ఎండుధూళితోపాటు ఏరిపెట్టిన జరిగిన విషయము పోకుండా పదిలపరచి, పాదు

చేసి కల్పన అనే అమృతరసము చల్లి మొక్కనుగాచేసి పెంచి చివరకు అది మహావృక్షమై పుష్పఫలవంత మయ్యేట్లు చేసినాడు. ఆ నవలాకారుడు చేసిన పని అది అంటే చరిత్రకారుడు సేకరించిన ఎండుమట్టిలో దాగి నిక్షిప్తమై ఉన్న బీజాన్ని ఆ నవలాకారుడు ప్రాణవంతమైన మహావృక్షంగా పరిణమింప చేసే మంచి వనపాలకునివలె పెంచి పెద్దది చేసినాడు.

కార్లైల్ వంటి వారి దృష్టిలో అసలు చరిత్ర అనేదే అట్లా ఉండవలె. మరి నవలాకారునికి అంతమాత్రమైనా స్వాతంత్ర్యము ఉండరాదా ?

౨

పాశ్చాత్యులు మృతులయినవారి కళేబరాలనే సమాధులలో పదిలపరుస్తారు. అది వారి ప్రకృతి, వారి ఆచారము. అట్లాగే వారు బహుకాలము నుండీ అక్కడ జరిగిన సంఘటనలను, ముఖ్యమైనవీ అముఖ్యమైనవీ కూడా, వ్రాత రూపంగా పదిలపరుస్తూ వచ్చారు. అక్కడి చరిత్రకారులు పూర్వులు వ్రాసి పెట్టిన విషయాల నన్నిటినీ ఓపికతో గాలించి సేకరించి గతచరిత్రను విస్తరించి వ్రాయగలుగుతున్నారు. సందేహము కలిగినప్పుడు ప్రభుత్వానుమతితో ఎన్నడో చనిపోయినవారి సమాధులు తెరిపించి సిద్ధాంతాలు చేసిన సందర్భాలు కూడా ఎన్నో ఉన్నవి. కవులు, శిల్పులు, చిత్రకారులు, వాగ్గేయకారులు, రాజులు, మంత్రులు, ప్రభువులు, వారి భోగస్త్రీలు, వర్తకులు, మతాచార్యులు, నటీనటులు, వీరులు, జనాకర్షణ కల అందగత్తెలు - ఇంకా ఎందరెందరో, ఎప్పు డెప్పుడు ఏ యే విధంగా, ఎవరెవరితో ఏమేమి మాట్లాడినది, ప్రవర్తించినది వ్రాయగలిగినారు.

ఆ యా కాలాల పుస్తకాలు, పత్రికలు రికార్డులు, డైరీలు, ఉత్తరాలు, శాసనాలు, సమాధులపైన చెక్కే స్మారక వాక్యాలు - మొదలయిన ఎన్నెన్నో ఆధారాలు వాళ్ళకు ఉపయోగపడుతున్నవి. ఐనప్పటికీ కొత్తఆధారము దొరికే టప్పటికి పాతసిద్ధాంతాలు తారుమా రవుతున్నవి. ఆంగ్లమహాకవి షేక్స్పియరు జన్మగృహమని భావింపబడి అనేక సంవత్సరాలుగా తీర్థయాత్రికుల నాకర్షించి నది నిజముగా అతనిది కాదనీ, పచ్చి మోస మనీ ఈ మధ్యనే పరిశోధకు లొకరు

ప్రకటించి సభ్యలోకంలో న్యూక్లియరు బాంబు ఒకటి విసరినారు. ఏది ఏమయి నప్పటికీ ఎంతో సూక్ష్మముగా ఆ యా కాలాలలో జరిగిన విషయాలు తెలియ వస్తున్నందువల్ల. కొంతకాలమునుండి అక్కడ అద్భుతములయిన చరిత్రాత్మక నవలలు పుట్టినవి. కొన్ని ప్రసిద్ధకవుల, కళాకారుల, వీరుల, భోగస్త్రీల జీవితా లకు సంబంధించినవి. చిత్రకారుడయిన వాన్ గోగ్ (Van Goge) జీవితచరి త్రకు సంబంధించినది Lust for Life అనే నవల. అట్టివాటిలో The Map Veafear అనేది నావిక విద్వాంసుని జీవితచరిత్ర చిత్రిస్తుంది. Madasore Serpent, Lord Vacsity - ఎన్నెన్నో నవలలు పుట్టినవి. ఆధారాలు దొరికి నందున తైమూరు వంటి ఆసియాపీరుని కథకూడా నవలారూపము వహించింది. జెంఘిస్‌ఖాన్ మూలముకూడా అట్టివానిలోనిదే.

మోషే (Moses) అనే నవల షోలెమ్ ఆష్ వ్రాసినాడు. అది ప్రధా నంగా బైబిలు పాతనిబంధనలో ఎక్సొడస్ మొదలయిన పుస్తకాలు ప్రధానం గానూ, ఈజిప్టుదేశచరిత్ర, ఆ ప్రాంతాల దేశచరిత్రలూ ఆధారంగా చేసుకొని రచించిన నవల. అందులో సంఘటనలు కన్నులకు కట్టేట్లు చిత్రించినాడు. అందులో బైబిలులో విస్తారంగా ఉన్న అలౌకికసంఘటనలు జరిగేందుకు అవ కాశము ఉండేవిధంగా చిన్నచిన్న మార్పులు చేశాడు. అయినా అనేక అద్భుత అలౌకిక సంఘటనలు ఉంచక తప్పలేదు. ఆ అలౌకిక సంఘటనలు ఉంచినం దుకు ఆ గ్రంథకర్త నెవరూ తీవ్రంగా విమర్శించినట్లు తోచదు. అక్కడివా రేమోకాని, మన నవనాగరక విమర్శకులు మాత్రము వాటినిగూర్చి పల్లెత్తుమాట అనరు; సగౌరవంగా పాటిప్రస్తావన చేస్తారు. మా దృష్టిలో అది కూడా నిస్సం దేహంగా చరిత్రాత్మక నవలే !

క్రీస్తు పుట్టకముందు ఉన్నవారిలో పశ్చిమాసియాలో, ఉత్తరాఫ్రికా, యూరపు అమెరికాఖండాలను ప్రభావితం చేసిన వ్యక్తులందరిలో మోషే అగ్రగణ్యుడు గదా ! యూదులు, క్రైస్తవులు, ముసల్మానులూ అతన్ని నేటికీ భయభక్తులతో భావిస్తారుగదా !

ఏది ఏమైనా పైన ముందు తెలిపిన విధంగా పాశ్చాత్యులు సాధించిన పద్ధతిన మన దేశంలో చరిత్రాత్మక నవలకాని, జీవితాత్మక నవలలుకాని వ్రాయ

దానికి ప్రయత్నించేందుకుకూడా అవకాశము లేదు. మన కంత చరిత్ర, సాధన సామగ్రి ప్రస్తుతము లేదు. సరిగా అటువంటి చరిత్ర కూర్చేందుకే అవకాశము తక్కువగా ఉన్నప్పుడు చరిత్రాత్మక నవల వ్రాయడము సాధ్యమా ? అని అడగవచ్చును.

సాధ్యమే అని మా ఆశయము. మోషే వంటి నవలలు వ్రాసే సామగ్రి ఉన్నది. అట్టి ప్రయత్నాలలో శ్రీ మన్షీ రచించిన "భగవాన్ పరశురాముడు" ఒకటి. శ్రీ రాహుల్ సాంకృత్యాయన్ రచించిన "సింహ సేనాపతి" ఒకటి. అందులో మొదటిది నేటి జాతీయ భావాలదృష్టితో వైదిక పౌరాణిక వాఙ్మయాన్ని పునఃసృష్టి చేయడానికి యత్నించినది. రెండవది బౌద్ధవాఙ్మయం పరమప్రమాణంగా వైదికవాఙ్మయాన్ని గ్రహిస్తూ, నేటి కమ్యూనిస్టు దృక్పథముతో రచించిన నవల. ఉభయులకూ అనుయాయులు అనేకు లున్నారుగనుక వాటి జోలి మనకు వద్దు. మోషేవంటి చరిత్రాత్మకనవలలు వ్రాసేందుకు మనకు ఆధారాలు ఉన్నవి అనేందుకే ఆ రెండు నవలలూ ఉదాహరించాము.

## 3

అసలు చరిత్ర అంటే ఏమిటి ? మనము చరిత్ర ఎందుకు వ్రాయవలె ? ఎందుకు తెలుసుకోవలె ? వార్తాపత్రికలో వార్తలు చదివినట్లే ఏమి జరిగినదో తెలుసుకోడానికేనా ? ఈ విషయాలు మనము బాగా మననము చేయవలె ?

గడిచిన మూడురోజుల చరిత్రలో నిజంగా జరిగిన విషయాలలో కొన్ని ఉన్నవి ఉన్నట్లుగా ఈ క్రింద తెలుపుతున్నాను.

"మూడురోజులనాడు రాత్రి నాకు నిద్రపట్టలేదు. మర్నాడు 8-10 నిముషాలకుగాని నిద్ర లేవలేదు. మొన్నరాత్రి గార్డినాలు పుచ్చుకొని సుఖంగా నిద్రపోయినాను. నిన్న సూర్యోదయాత్పూర్వమే నిద్ర లేచాను. రాత్రి మళ్ళీ నిద్రపట్టలేదు. ఇవ్వాళ తల తిరుగుతూ ఉన్నా ఏడు గంటలకే లేచినాను. ప్రొద్దుటిభోజనములో మొన్న కాబేజి, నిన్న వంకాయ, ఇవ్వాళ చిక్కుడుకాయ కూరలు తిన్నాను—"

ఈ విధంగా జరిగిన మూడురోజులలో నేను నిజంగా చేసిన పను లన్నీ వ్రాసుకుంటూ పోతే కొన్ని సంపుటాలగ్రంథ మవుతుంది. అన్నీ నిజంగా జరిగిన విషయాలే. కాని అవి చరిత్ర అనదగునా ? నిన్నటివి మొన్నా, మొన్నటివి ఇవ్వాళా జరిగినట్లు వ్రాశా మనుకొందాము. అంతమాత్రముచేత తలక్రిందు లయి పోతుందా ? మా దృష్టిలో అది చరిత్రే కాదు. "కూచుని గుమ్మడికాయ తిన్నాడు, వంగుని వంకాయ తిన్నాడు" అని మన ముసలమ్మలుకూడా హేళన చేసే చరిత్ర అవుతుంది.

అట్లాకాక ఈ మూడురోజులలో నా జీవితాన్ని మంచికో, చెడుకో, అల్పత్వానికో, ఉదాత్తతకో, మలచడానికి కారణభూతమైన సంఘటన ఏమయినా ఉంటే అది చరిత్ర అవుతుంది. అవి కూడా నా చరిత్రే ! ప్రపంచచరిత్రలో దానికి స్థానమే ఉండదు.

దేశచరిత్రకు కాని ప్రపంచ చరిత్రకు కాని ప్రధానసంఘటనలే ప్రాణప్రదాలు. అట్టివే కాపాడుకోవలె. కాని ప్రతిస్వల్పవిషయము కాదు. జరిగిన విషయాలు ఉన్న మనుష్యులపేర్లు, తారీఖులు చరిత్రకు శరీరము వంటివి. శరీరవర్ణనములో నిమగ్నుడై దానిని సజీవముగా చేసిన ప్రాణాన్నే చరిత్రకారుడు విస్మరిస్తే ఎట్లా ? ఆ శరీరాన్నీ ప్రాణాన్నీ విస్మరించినా విస్మరించవచ్చు. ఆ రెండిటికి అధిష్ఠాన మైన ఆత్మను మాత్రము చరిత్రకారుడు మరవరాదు. అది విస్మరిస్తే అతడు చరిత్రకు తీరని అపచారము చేసినవా డవుతాడు.

ఈ విధంగా ఆలోచిస్తే చరిత్ర పరమార్థము మన పురాణకర్తలు ఎరిగినంత బాగా నేటి చరిత్రకారులు ఎరుగుదురా ? అనే సందేహము కలుగుతుంది. రామాయణంలో భారత భాగవతాలల్లో ఎన్నో ఉపాఖ్యానా లున్నవి. పురాణాలలో ఎన్నో కథలున్నవి. ఒక్కొక్కటి చదువుతున్నప్పుడు, "ఇది కల్పనా కథ కాదు; జరిగిన సంఘటన ప్రధానంగా చేసుకొని పుట్టిన కథయే'' అనిపిస్తుంది. అది ఆ కథలో చెప్పిన కాలంలో జరిగి ఉండకపోవచ్చును. ఆ పేరు గలవాడికిగూడా జరిగినది కాకపోవచ్చును. కాని ఎవరో ఒకరికి, ఏదో ఒక దేశంలో, ఏదో ఒక కాలంలో తప్పకుండా జరిగిందే. దానివల్ల, ఈనాటికిగూడా మనము నేర్చుకో దగినది ఎంతో ఉన్నది. అటువంటి సంఘటన పోకుండా

సేకరించిపెట్టుట చరిత్రకారుని ప్రథమకర్తవ్యము. అది ఏ రూపంతో మనకు ప్రదర్శించినా చరిత్ర కాకపోదు. అదే చరిత్ర.

మన పంచాంగాలు సృష్టి జరిగి ఇప్పటికి 195 కోట్ల 58 లక్షల 85 వేల 68 సంవత్సరాలు అయినవని తెలుపుతున్నవి. అంటే అసలు సృష్టి కాదు. మన మన్వంతరానికి సంబంధించిన సృష్టి. ఈ సృష్టిలో మనమిప్పుడు 28వ కలి యుగంలో ప్రథమపాదంలో ఉన్నామని మనము రోజూ చేసే సంకల్పంలో చెప్పుకుంటున్నాము.

విజ్ఞానశాస్త్రజ్ఞులు ఈ భూమిమీద మొదటిజీవి ఆవిర్భవించినదని లెక్క వేస్తున్న కాలముకూడా సుమారుగా మన పాత పంచాంగాల లెక్కకు సరిపో తుంది. ఈ సరిపడటము ఆనుషంగికమే కావచ్చును. మనపురాణకథలు వాటిలో ఉన్నట్లు సరిగ్గా అట్లాగే జరిగినవని నమ్మకం కలిగేటంత విశ్వాసము నాకు ఉన్నదని తలపవద్దు. కాని మనకంటె వాస్తవంగా మన పురాణకర్తలకూ, వాటిని గ్రథనము చేసిన వ్యాసులకూ కాలము ఎంత నిరవధికమయినదో దాని భావన కలదు. నిరవధికమైన ఈ కాలంలో చరిత్రగా ఏది వ్రాసి ఉంచవలెనో వారెరిగినంత బాగా మనకు తెలియదేమో అనిపిస్తుంది. మనకు మనమీద ఉన్న అభిమానంచేత మన నేటి సంకుచితభావాలే విస్తృతికల ఉదాత్తభావాలనే అజ్ఞానము వల్లా వాటితత్త్వము గ్రహించలేక పోతున్నామా అనిపిస్తుంది.

గ్రీకు చరిత్రకారులలో ప్రథముడైన హెరోడోటస్ నిజమయిన చరిత్ర వ్రాస్తున్నానని ఎన్నో అభూతకల్పనలు వ్రాసినాడు. అయినా అతనిని చరిత్ర కారులలో రాజు అని గౌరవిస్తున్నాము. చీనానుండి వచ్చిన యాత్రికులు తమ అతిశయము వర్ణించుకుంటూ వ్రాసిన వ్రాతలన్నీ ప్రమాణభూతంగా తీసు కొంటున్నాము. ముసల్మాను చరిత్రకారులు, క్రైస్తవ చరిత్రకారులు వ్రాసిన దంతా చరిత్ర అని మింగగలుగుతున్నాము, అది తరుచుగా మన పురాణాలలో చేరిన పుక్కిటిపురాణాలకు ఎంతమాత్రము తీసిపోదు, అటువంటివే మనుష్యులు వ్రాసుకొన్న డైరీలు, ఉత్తరాలు, వ్రాతలూ.



నవల స్వరూప మేమిటి? అది ఎప్పుడో, ఏదో రూపంలో మొదట ఇటలీ లోనో, ఫ్రాన్సులోనో ఆరంభమైనదని పాశ్చాత్య విమర్శచరిత్రకారు లంటారు. కాని అప్పటినుంచి ఇప్పటివరకు చూస్తే, అది ఎన్నెన్ని కాలాలలోనో, దేశాల లోనో ఎందరో నవలాకారుల చేతులలో లెక్కలేనన్ని ఆకారాలు ధరించింది, ఇంకా ధరిస్తున్నది. దాని స్వరూపము ఇది యని నిర్ధారణ చేయలేము. అది ఒకా నొక అనిర్దిష్ట స్వరూపము కల సాహిత్యప్రక్రియ. అదే దాని విశిష్టత. అందు లోనే దాని శక్తి ఉన్నది.

అది నాటకరూపంగా ఉండవచ్చు, కథనరూపంగా ఉండవచ్చును. ఆత్మకథవలె, జీవితచరిత్రమువలె, కొన్ని తరాల కుటుంబ చరిత్ర వలె ఉండ వచ్చును. డైరీరూపంగా లేఖలుగా కూడా ఉండవచ్చును. కర్త నేర్పుకొద్దీ ఎన్నో ఇతర రూపాలు పొందవచ్చు. ఈ ప్రక్రియలలో కొన్నిటిని సమ్మిశ్రము చేసి, కొంత నాటకంగా, కొంత కథగా, కొంత లేఖలుగా, కొంత డైరీగా ఉండ వచ్చు. పెద్దది కావచ్చు, చిన్నది కావచ్చును. ఒకే కథగా సూటిగా నడవ వచ్చును. అనేక కథలు కలసి నదులన్నీ కలసే మహాసముద్రముగా ఉండ వచ్చు. కూర్పులో బిగువే కాక సడలింపుకూడా ఉండవచ్చు.

కాదంబరి, దశకుమార చరిత్ర, సింహాసనద్వాత్రింశతి, భోజచరిత్ర, పంచతంత్రము, హితోపదేశము, నీతిచంద్రిక కూడా నవలలుగా పరిగణించేం దుకు అవకాశము కల్పించవచ్చును. పద్యకావ్యముగా ఉన్నా కళాపూర్ణోదయము మన విమర్శకులు నవల అంటున్నారు. ప్రస్తుత కాలములో పాశ్చాత్య దేశాలలో ఎక్కువ వాడుకలోకి వస్తున్న నవలారూపాలే ఆదర్శప్రాయంగా గ్రహించ డము మాత్రము పొరపాటు. ఫ్యాషను అందుకు అంగీకరించవచ్చుగాని సద్విమ ర్శకు లంగీకరించరు ఒక విధంగా ఆలోచిస్తే పాశ్చాత్యుల ఫ్యాషనులకు ఎంత దూరంగా ఉండగలిగితే అంత మంచివి సృష్టి చేయగల మేమో!

దానికి కారణము ఒకటే. పాశ్చాత్యనవలాకారులకు నవలారచన వృత్తి. వృత్తిలో ముందుకు రావలెనంటే ఏదో ఒక విశిష్టత, కొత్తదనము చూపవలె. దానికి గుణముతో నిమిత్తము లేదు. కొత్తదనము ఉంటే, దాన్ని ఆకాశానికి

ఎత్తి అడ్వర్ టైజు చేసే ప్రకటనకర్త లభిస్తాడు. అడ్వర్ టైజుమెంటు మీద తమ సాహిత్యరుచులు మలచుకొని, మేమే ఎక్కువ టేస్టు కలవారమని ఆసంచించే గొర్రెమంద చదువరులున్నారు. అట్టివాళ్ళకు అనుగుణంగా వంతపాటలు పాడే విమర్శకంమన్యులు కోకొల్లలు. ఆ గ్రంథాలు మఖలో పుట్టి పుబ్బలో మాడిపోయే గడ్డిమొలకలు. ప్రతి సంవత్సరమూ బెస్టుసెల్లర్సుగా ప్రపంచఖ్యాతి పొందుతున్న గ్రంథజాతమే ఇందుకు ప్రత్యక్షనిదర్శనము. వాటి ప్రయోజనము ఇతరులతోపాటు రచయితకుకూడా జేబులు నాలుగుడబ్బులతో నిండడమే. వాటి ప్రయోజనము కావ్యసిద్ధి కాదు, ద్రవ్యార్జనము. సద్విమర్శకు డెవ్వడూ వాటినిగూర్చి తీవ్రముగా ఆలోచించడు.

మన ఆంధ్రదేశములో నవలారచన ఇంకా వృత్తిగా పరిణమించలేదు. ఆర్థికవేత్తలు అది దురదృష్ట మంటున్నారు. కాని, మాబోంట్లదృష్టిలో అది అదృష్టమే. ఈ మధ్యనే కొద్దికొద్దిగా అది వృత్తిగా పరిణమిస్తున్న సూచన లున్నవి; దానికి అనుగుణంగానే దానిస్థాయి దిగజారుతున్నది. ఆ విధంగా దిగజారనివాటినే మనము నవలలుగా పరిగణిద్దాము. నవలకూడా సాహిత్యశాఖలలో ఒకటికాబట్టి సాహిత్యము అనిపించుకోడానికి ఉండవలసిన సామాన్య ధర్మాలు తప్పనిసరిగా దానికి కూడా ఉండవలెనని విధించడములో విప్రతిపత్తి ఉండరాదు.

నవలాకర్తకు విస్తారమైన అవకాశమున్నది. చిన్నకథలోవలె మినిమేచరు పెయింటరు పడే సంకోచవ్యథ లేదు. పెద్దకథకువలె ఒకే జాలులో సాగి ప్రవహింపనక్కరలేదు. నాటికలు నాటకాలవలె ప్రదర్శనశాలల మీదను, నటీనటుల వైత్యభ్రమల మీదను, అరసికులైన ప్రేక్షకమహాశయుల దయాధర్మభిక్షముల మీదను ఆధారపడే బాధలేదు. నాటకానికి ప్రాణభూతా లయిన సంభాషణలో వైచిత్రి, నాటకీయసంఘటనలు గ్రహించి, వాటితో కవితాశక్తి జోడింపవచ్చు. మధ్యమధ్య సంగీతం చేర్చవచ్చు. విజ్ఞానసంపద అంతా ప్రతిఫలింపజేయవచ్చు. కాకపోతే కథాకథనమే ప్రధానగుణంగా చేసుకొని నాటకీయత అంగముగా చేసికోవచ్చును. నవలను ఎన్నెన్ని విధాలుగానో, ఎన్నెన్ని సాహిత్యశక్తులతోనో ప్రభావింపజేసేందుకు అనంతమైన అవకాశాలు ఉన్నవి. ఇప్పటికి మన కందిన

సాహిత్యశాఖ లన్నిటిలో నవల పరాకాష్ఠ నందినది. "నాటకాంతం సాహిత్యమ్" అనే నానుడి "నవలాంతం సాహిత్యమ్"గా మనము మార్చుకోవచ్చును.

౨౩

పైన వివరించిన స్వరూపం గల చరిత్రతో కూడిన నవల చరిత్రాత్మక నవల అనదగి ఉంటుంది. ఆ విధంగా గ్రహిస్తే ఆ విశేషణవిశేష్యాలకు విరోధము కనిపించదు. పైగా అవి రెండూ చాలా సన్నిహిత మైనవని విజ్ఞు లయినవారికి గోచరింపక మానవు.

సమకాలిక రచనల గొప్పదనము కాని, అల్పత్వము కాని, సరిగా లెక్క వేయుట, మన మెంత సమర్థులమైనా, ఎంత నిష్పక్షపాతంగా ఉండదలచినా, కష్టసాధ్యమని విజ్ఞు లందరికీ తెలిసినవిషయమే. కొంచెము దూరము నుండి చూచినప్పుడే కాని కావ్యపు నిజమైన విలువ మనకు గోచరింపదు.

అదేవిధంగా మనము కొంచెము దూరమునుండి వ్యక్తులను సంఘమును సంఘటనలను తిలకించినప్పుడే కాని వాటివాటి విలువలు నిజస్వరూపంతో భాసింపవు. అప్పుడేకాని అవి కావ్యత్వం గల రచనలకు ఇతివృత్తాలయ్యే స్థాయికి రాలేవు. ఈ కారణమువల్లనే అన్ని కాలాలలో, అన్నిదేశాలలో తమ పూర్వ చరిత్రకు సంబంధించిన వీరుల కథలు, సంఘటనలూ తరుచుగా కావ్యాల ఇతివృత్తాలుగా రచయితలు గ్రహిస్తూ ఉంటారు. అంతమాత్రముచేత ఏ కాలపు సంఘటనలు ఆ కాలములో నవలలుగా, కావ్యాలుగా రూపొందించరాదని కాదు. అది కష్టసాధ్యమైన పని. ఆ పని సాధించగల కావ్యకర్తలు అరుదు. ఒకవేళ ఎవరో ఒకరు అట్టిది సృష్టించినా దానిని సామాన్య పాఠకలోకము గుర్తింపదు. వారే కాదు, వారిలో నుంచే పుట్టుకొని వచ్చే ఫ్యాషనబులు విమర్శకులుకూడా గుర్తించలేరు. తాత్కాలిక ఫ్యాషనే వారికి రసవంత మైనదిగా, అపూర్వ మైనదిగా, అభ్యుదయకర మైనదిగా భ్రాంతిపడి పత్రికలలో వ్యాసాలు నింపుతుంటారు. అవి పసిపిల్లలు మాట్లాడే పెద్దరికపుమాటల వంటివి ; వినోదము కలిగిస్తవి.

ఈ పని విమర్శకులు చారిత్రక నవలలను గూర్చి వ్రాసే మామూలు పడికట్టు మాట లివి :

"ఈమధ్య కొందరు నేటి సమాజమును, నేటి సమస్యలను ఎదు ర్కొనలేక తమ భావాలకు అనుగుణంగా ఉన్న పూర్వకాలాలను ఆశ్ర యించి నవలలు వ్రాస్తున్నారు."

ఇటువంటి వ్రాతలలో కావ్యగుణాలకు సంబంధించిన అజ్ఞానము ఎన్ని విధాలుగానో వ్యక్తమవుతుంది. నేటి సమాజాన్ని చిత్రించనిది నవలే కాదా, కావ్యమే కాదా? సామాజిక సమస్యలు తీర్చడమేనా కావ్యప్రయోజనము? ఈ వ్రాతలే కావ్యస్వరూపాన్ని రూపిస్తూ ఉన్నట్టయితే వచ్చే ఫలితాలు కొన్ని ఉదాహరిస్తాను.

టాల్‌స్టాయి తన "యుద్ధము - శాంతి" అను నవల నెపోలియను చేసిన రష్యా దండయాత్ర ఆధారంగా వ్రాశాడు. అందుకు చరిత్రకారుల వ్రాత లతో తృప్తిపడక స్వయంగా చరిత్రాధారాలు మళ్ళీ గాఢంగా పరిశోధించి వ్రాశాడు. ఆయన ఋషివంటివాడు గనుక అన్ని విశేషాంశాలు తెలిసినా, దేని కెంత ప్రాధాన్యమివ్వవలెనో విస్మరించక అత్యద్భుతమైన నవల సృష్టించ గలిగినాడు. అది చరిత్రాత్మక నవల అనడానికి సందేహం లేదు. ఆదర్శప్రాయ మైనది కూడాను. అంత గొప్పనవల గతశతాబ్దంలోగాని, ఈ శతాబ్దంలోగాని గాని పుట్టలేదు - అటువంటిదికూడా తన కాలపు సమస్యలు ఎదుర్కొనలేక పూర్వకాలాన్ని ఆశ్రయించిన "పనికిమాలిన" నవల కావలసివస్తుంది.

అంతేకాదు! జగత్ప్రఖ్యాతి గన్న ఉత్తమోత్తమ రచనలు ఈ విమ ర్శకు వేలపిండివలె ఎగిరిపోవలె. గెటే "ఫాస్టు" మిల్టను "పారడైజు లాస్టు" షేక్స్పియరు నాటకాలన్నీ, వర్జిలు "ఈనిడ్" గ్రీకు విషాదనాటక కర్తల నాటకాలు, హోమరు "ఇలియడు - ఒడిస్సీ"లతో సహా ఎగిరిపోవలె. మనమూ మన వ్యాఖ్యాతలు పిల్లవిమర్శకులూ ఎన్ని గంతులు వేసినా, ఆ మహాగ్రంథా లకు చలన ముండదు. అవి కావ్యహిమాలయాలు!

అటువంటి విమర్శలు అంగీకరిస్తే మరొక చిత్రమైన ఫలితం కూడా తప్పనిసరిగా కలుగుతుంది. నవలాకారులు నేటికాలపు "డాన్ క్విగ్జోట్"లుగా తయారు కావలె. కొందరు తయారు అవుతున్నారు కూడాను.

కాబట్టి కొంచెము పూర్వకాలానికి పోయినప్పుడేగాని కవిగాని నవలా కారుడుగాని సామాన్యంగా ఉత్తమస్థాయిని అందుకొనే రచన చేయడము కష్ట సాధ్యమైన పని. ఈ కాలానికి సంబంధించిన ఇతివృత్తం గ్రహించినా దాన్ని కొంచెము దూరంలో ఉంచి దర్శింపగల సమర్థత ఉన్నప్పుడే ఉత్తమకోటికి వచ్చే రచన చేయగలుగుతాడు.

ఇందుకు ఉదాహరణంగా స్వానుభవము ఒకటి ఉదాహరిస్తాను. ఈ మధ్య చీనా రాక్షసంగా మనమీద చేసిన దండయాత్ర ఉన్నది. అది అందరిని వలెనే నన్నూ బాధించింది. ఒక్క భారతవీరుడి మృతికి ప్రతిగా, వెయ్యిమంది చీనావాళ్లు హతమారవలెననిపించింది. వాళ్లు ఆక్రమించిన భూభాగానికి బదులుగా మనము విజృంభించి చీనాదేశమంతా ఆక్రమించవలెననిపించింది. "అయ్యో! మన ప్రభుత్వము మెక్‌మహనురేఖవరకే తిరిగి గెలుచుకుంటామని బలహీనపు పలుకులు పలుకుతుందేమా,–ఆ మన మానససరోవరము, ఆ మన సదాశివుని నివాసస్థానమైన కైలాసమూ, మన భూభాగంలో ఉండేటట్లుగా సింధు, బ్రహ్మ పుత్రానదుల జన్మస్థానాలు కలిపే రేఖ మన ధ్యేయమనియైనా ప్రకటింపదేమా అని విషాదము కలిగేది! కాని ఇంత ఆవేశము కలిగినా నా నోట ఒక్క పద్యము రాలేదు; నాటిక రాలేదు. ఎందరో ఎన్నో కావ్యాలు వ్రాస్తున్నారు; పాటలు పాడుతున్నారు. అవి ఏవీ నాకు కావ్యదృష్టితో అవలోకించినప్పుడు రుచించడములేదు.

మరొక్క విషయము చీనాకు డ్రాగను సంకేతముకదా! దానికి సంస్కృత శబ్దము ఏమా అని ఆలోచించినాను. శరభమో శరభసాళువమో కావచ్చుననిపించింది. తృప్తి కలుగలేదు. 'అహి' అనే పేరుతో వృత్రాసురుణ్ణి ఋగ్వేదము కొన్నిచోట్ల వ్యవహరించింది. వేదమును ఆంగ్లంలోకి అనువాదం చేసిన విద్వాంసులు ఆ 'అహి'ని డ్రాగన్ అని అనువాదము చేసినారు. నాకు వృత్రాహిని వజ్రముతో ఛేదించిన ఇంద్రుని వర్ణించిన ఋక్కుమీదికి మనస్సు ప్రసరించినది. నాకు తెలిసినంతవరకూ మరి ఎవరికీ ఈవిధంగా ప్రసరించ లేదు. నాకైనా అది ఇంతవరకూ కావ్యరూపంతో దర్శనమీయలేదు. ఆలో చించగా నా హృదయము ప్రస్తుతము చీనాపై ద్వేషంతో కశ్మలమై ఉన్నది. ఆ కశ్మల భావము శాంతిస్తేనేకాని, రసవంతమైన కావ్యరూపము పొందే స్థాయికి రాదేమో అనిపిస్తున్నది.

౬

ఈవిధంగా యోచిస్తే, కావ్యప్రక్రియ లన్నిటిలో ఉత్తమమైనదనీ, నవలలలోకూడా చరిత్రాత్మక నవల ఉత్తమోత్తమమైనదనీ కావ్యతత్వవేత్తలకు భాసింపకమానదు. ఈ ప్రతిపాదనము వింతగానే తోచవచ్చునుగాని టాల్స్టాయి 'యుద్ధము-శాంతి' నవల స్థాయికి వచ్చిన కావ్యమేదైనా ఈ రెండు శతాబ్దాలలో పుట్టినదేమో ఆలోచింపగోరెదము.

అంతేకాదు. రామాయణమూ, మహాభారతమూ మనము ఇతిహాసాలంటున్నాము; అవి మహాకావ్యాలనికూడా అంటున్నాము. సంప్రదాయదృష్టిలో ఆ రెండూ ఆకాలములలో ఉన్న కవులు రచించినవే. ఐతే అవి గొప్పవి ఎట్లా ఐనవి, అని సంప్రదాయ దృష్టితో మమ్ము ప్రశ్నింపవచ్చును. వాల్మీకి తపస్వి; అతడు ఆ కాలపు చరిత్రను దూరమునుండి నిర్మలినమైన దృష్టితో దర్శింపగలిగిన ఋషి. అట్లే వ్యాసుడుకూడా భారతములోని ప్రధానపాత్రలందరితో సంబంధమున్నవాడైనా, అంటించుకొనకుండా ఉండగలిగిన మహర్షి. తన తపోవనంలో శాంతంగా ఉండి, ఆ ఇతిహాసము మననము చేసి స్వచ్ఛమైన హృదయదర్పణాలలో ప్రతిఫలింపజేసుకొని కావ్యరచన కుపక్రమించిన మహాకవి. అందువల్ల వారిద్దరూ తమ సమకాలిక ఇతిహాసాలను మహాకావ్యాలుగా చేయగలిగినారని సమర్థించవచ్చును.

అట్లాకాక ఆధునిక విమర్శకులు నిర్ధారణ చేయుచున్నట్లు ఆ రెండూ ఎందరెందరో వ్రాసిన ఎన్నెన్నో కథలు ఏదోవిధంగా ఒకరిద్దరిచేతనో పలువురచేతనో కూర్చబడిన గ్రంథాలుగానే భావించడమూ మాకు సమ్మతమే. ఎట్లా భావించినా అవి ఇతిహాసాలు కాకపోవు. వాటిలో వర్ణించిన ప్రతి చిన్న అంశమూ జరిగిఉండకపోవచ్చుగాక ! కాని మొత్తముమీద ఆ రెండు కావ్యాలలో నిబంధించిన కథలు నిజంగా జరిగిన ఘటనలమీదనే ఆధారపడియున్నవని నిశ్చయించడానికి ఏమాత్రము సంకోచింపనక్కరలేదు. వాటిలో ఒకానొక కాలము నాటి సాంఘిక రాజకీయ ధార్మిక వ్యవస్థలూ, యుద్ధపద్ధతులూ, ఆధ్యాత్మిక విచారణలు సత్యస్వరూపంతో ప్రదర్శించబడినవి అనడానికి ఏమాత్రము సందేహము లేదు. ఆ రెండు మహాగ్రంథాలకు భారతీయ సంస్కృతిమీద ఉన్న

ప్రభావము మరి దేనికి లేదనడము అతిశయోక్తి కాదు. అవి వేదమూలాలే అయినా వాటికి ఉన్న ప్రభావము వేదానికికూడా లేదంటే వైదిక నిష్ఠులుకూడా కాదనరు అ రెండు గ్రంథాలే కనుక మన సంస్కృతిని తీర్చిదిద్ది ఉండకపోయి నట్లయితే మనదేశములో నాగరకత ఎంత అధోగతి పాలయ్యేదో ఊహించ లేము. అందుకు వాటి ప్రభావములేని ఇతర దేశచరిత్రలే ప్రత్యక్ష సాక్ష్యాలు.

వాటిలో రామాయణము పూర్తిగాను, మహాభారతము ఎక్కువ భాగ మున్నూ పద్యాత్మకంగా ఉన్నవి. కాని వాటి భాష కాళిదాసాది పద్యకవుల గాని బాణభట్టాది గద్యకవులగాని క్లిష్టతర సంస్కృతము కాదు. నేడు మనము వచనరచనగానే భావించే భాషకు మిక్కిలి సమీపంగా ఉండే పద్యరూపంలో ఉన్న భాష. అ రెండూ ఐతిహాసిక కావ్యాలన్నా అనవచ్చును. అట్లుకాక వాటిని పద్యరూపంలో ఉన్న ఐతిహాసిక నవలలు అన్నా దోషము లేదు. మాట మార్పేకావి స్వరూపములో భేదము లేదు.

అందులో ఒకటి గంగాప్రవాహమువలె స్వచ్ఛముగా ప్రవహించే మహా నది. రెండవది అనేక మహానదులను తనలో భరించిన క్షీరసాగరము. నేటి చరిత్రాత్మక నవలాకారుడు పూర్వపు వ్యాసవాల్మీకి మహాకవుల అడుగుజాడ లలో నడిచే అనుయాయి. వారి ఆదర్శకవులు వ్యాసవాల్మీకులు.

వారు చరిత్ర శల్యాలు సంగ్రహించే ప్రేతకర్మకు యజమానులు కారు. సమాధులలో క్రిమిదష్టమైపోయిన మజ్జామాంసాలకోసము మట్టి కుళ్లగించే నక్కలు కుక్కలు కారు, దాని నాస్వాదించే రాబందులు గ్రద్దలు కారు. వారు చరిత్రయొక్క సత్యస్వరూపాన్ని ప్రదర్శించడానికి యత్నించే మౌనులు. వారి భాష తేటగా ఉండి రమ్యమై సంగీతమువలె శ్రుతి లయ రాగబద్ధమై ప్రసరించి రసహృదయాలను హత్తుకోవలె.

ఇది చరిత్రాత్మక నవలాకారుల ఆదర్శము. దాని స్వరూపము ఎంత వరకు గ్రహింపగలిగినాము, ఎంతవరకు అనుసరింపగలిగినాము అని తమ్ము తాము ప్రశ్నించుకొని చరిత్ర నవలాకారులు అనుకొనేవారు ఆత్మవిచారణ చేసు కోవలసికూడా ఉన్నదిసుమా !

—o—

# నవ్యసాహిత్య పరిషత్తు

## ౧

నేనిప్పుడు నవ్యసాహిత్య పరిషత్తులో కేవలము సామాన్య సభ్యుడను. అందులో నాకేమీ ప్రత్యేకాధికారము లేదు. కాబట్టి ఈ వ్యాసములో నేను తెలిపే విషయములకు నాదే బాధ్యత. కాని అందుకు పరిషదధికారము లేదు. వంగాది దేశములలో పుట్టినట్లుగానే తెలుగుదేశములోకూడా ఆంధ్ర సాహిత్య పరిషత్తు పుట్టి విశేష భాషాసేవ చేసింది. దాని పుట్టుక 1911 సం.లో చెన్నపట్టణములో. దానికి మూలకందము జయంతి రామయ్య పంతులుగారు. దాని భారము వహించినవారు ప్రధానముగా శ్రీ పిఠాపురము మహారాజువారు. ఆంధ్రసాహిత్య పరిషత్తులో అప్పుడు ఎందరో పండితులు, కవులు చేరి పరిషత్తును ఉన్నత స్థానము అధిరోహించునట్లుగా చేసినారు. ఆంధ్రగ్రంథవిమర్శనము, పరిశోధనము విరివిగా జరిగినది. చక్కని గ్రంథాలయము స్థాపించి అమూల్యమైన పుస్తకాలు సంపాదించినారు. మిక్కిలి వ్యయప్రయాసలకోర్చి విపులమైన సూర్యరాయాంధ్ర నిఘంటువు పూర్తిచేసినారు. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికద్వారా ఎంతో భాషాసేవ చేసినది ఆంధ్ర సాహిత్య పరిషత్తు. ఈ పరిషత్తు భారము భరించిన శ్రీ జయంతి రామయ్య పంతులుగారి కీర్తికి ఆంధ్ర సాహిత్యపరిషత్తు జయస్తంభముగా పరిగణించవచ్చును. అయితే ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపించిన రోజులలోనో లేక తర్వాత కొద్దిరోజులకో ఆంధ్ర భాషాలోకములో కొత్త సాహిత్యబీజము మొలకెత్తింది. దానిని ముందు పదిలపరచినవారు శ్రీయుతులు గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తి. దానిని ముందు ఆదరించినవారు ఆంధ్రభాషాజ్ఞానము విశేషములేని ఇంగ్లీషు చదివినవారు. కాని క్రమముగా ముందు కథకులు, పత్రికావిలేఖరులూ, నాటక రచయితలూ, చివరకు కవులూ, పండితులూ దానియందు అభిమానము కలిగినవారైనారు. ఇది వ్యావహారిక భాషావాదము. ఈ పక్షమువారికి పూర్వగ్రాంథికముమీద ఆదరాభి

మానములు ఏమాత్రమూ తక్కువకాదు. తండ్రిని గౌరవించని కుమారునికి ఆస్తికలోకములో స్థానము లేదు. శిష్టుల వ్యావహారిక భాషకు కూడా గ్రాంథిక మయ్యే యోగ్యత ఉన్నదనే వారి ప్రధానవాదము. లా ప్రకారము మాట్లాడితే కుమారుడు తనకు పుట్టినవెంటనే భాగము పంచుకోడానికి హక్కు ఉన్నది. (Right by birth) గనుక వ్యక్తత వస్తూవుండగానే భాగము పంచిపెట్టమని కోరినాడు. ఆంధ్ర సాహిత్య పరిషత్తులో అధికారమార్గములోనివారికి ఇది ఇష్టము లేకపోయింది. ఈ నూతన వాదమును వా రొక నూతన భాషాబీజమని గమనించక వేరుపురుగుగా భావించి దానిని ప్రతిఘటించి చిదిపివేయవలెనని చూచినారు. 1932 వ సంవత్సరములో ఆంధ్ర సాహిత్య పరిషత్తువారు 'రజతోత్సవ సంపుట' మొకటి ప్రచురించినారు. అందులో శ్రీ జయంతి రామయ్య పంతులుగారు "ఆంధ్ర సాహిత్య పరిషచ్చరిత్రము" అనే వ్యాసము వ్రాసినారు. అందులో ఇట్లా ఉన్నది.

> అన్ని విషయములలోనూ యథేచ్ఛావాదు లెప్పటికి నుందురు. వారి నడ్డుపెట్టువారు లేరు. కాని వాదమునకు రాజాదరముండుచో నది యనర్థదాయకమగును. గ్రామ్యవాదమున కట్టి యాదరము లేకుండ జేయుటయే పరిషత్తు నిర్వహించిన ఘనకార్యములలో నొకటి!

పై వాక్యములో ఎంత అర్థ మిమిడి ఉన్నది. పై ఉపమానము పెంచితే ఆంధ్ర సాహిత్య పరిషత్తు తన పుత్రునికి ఆస్తి లేకుండా చేయడానికి ప్రయత్నించినట్లు స్పష్టమవుతుంది. కుమారునికి హక్కు స్థిరపడేవరకూ రాజాదరము తండ్రికే. సందేహము లేదు.

శ్రీ రామయ్య పంతులుగారు విద్వాంసులు. బహుభాషాభిమానము గల వారు. అయితే వ్యక్తులు ఎంత గొప్పవారైనా వారికంటె సంస్థలు తరుచుగా గొప్పవి. ఆంధ్ర సాహిత్య పరిషత్తుకు అధ్యక్షులుగా ఉన్నవారే ఎందరో వ్యావహారిక భాషావాదములోని న్యాయము నెమ్మదినెమ్మదిగా అంగీకరించినారు. కాని ఆంధ్ర సాహిత్య పరిషత్తు మారలేదు.

కుమారుని సరిగా చూడకనూ, అడిగినప్పుడు తండ్రి భాగము పంచి ఈయకపోతేనూ కుమారుడు పంపిణీకి దావా వేస్తాడు. మేమది రోజూ కోర్టులలో

చూచేదే. నవ్యాంధ్రభాష చేసినది సరిగా అదే. ఆంధ్ర భాషాభిమానులకు చాలా మందికి తనయందభిమానము కలిగించుకొని ఆంధ్రలోకమనే న్యాయస్థానములో దావా వేసింది. ఆ దావా వేయడమే నవ్య సాహిత్య పరిషత్తు స్థాపనము.

ఈ భాషాభిమానులంతా ఆంధ్రసాహిత్యపరిషత్తులో చేరి దానిచేతనే ఈ వాదము అంగీకరించేట్లుచేసి కలిసికట్టుగా పోరాదా? అని అడుగవచ్చును కొందరు. ఆ ప్రయత్నము జరగకపోలేదు. శ్రీ గిడుగు రామమూర్తి అమరణాంతమూ సాహిత్య పరిషత్సభ్యుడనే నా విశ్వాసము. నవ్యసాహిత్య పరిషత్తుకు కొంత కాలము నుంచీ కార్యదర్శియైన శ్రీ తెలికిచెర్ల వెంకటరత్నము ఇప్పటికీ ఆంధ్ర సాహిత్య పరిషత్సభ్యుడనే నా విశ్వాసము.

మరొక విషయము! ఆంధ్రసాహిత్యపరిషత్తు 13వ వార్షికసభ తణుకులో జరిగింది. అందులో "గ్రామ్యముకాని వ్యావహారికాంధ్ర భాషలో పూర్వ సాంప్రదాయము ననుసరించి గ్రంథములు రచింపవచ్చును" అనే తీర్మానము చేసినారు. తర్వాత వార్షిక సభకు శ్రీ జయంతి రామయ్యపంతులుగారు వెళ్లి ఆ తీర్మానము రద్దు పరిపించి, అటువంటి తీర్మానము మళ్లీ పునర్విమర్శనము జరగడానికి సామాన్యావకాశం లేకుండా తీర్మానం చేసినారు. ఆ పైన వ్యావహారిక భాషావాదులు ఏమిచేయగలరు! ఆ పరిషత్తుకే వెళ్ళి ఆందోళనము చేయవలె! అల్లరి చేయవలె! లేకపోతే పెద్ద మనిషి తరహాగా వేరే సంస్థ పెట్టుకోవలెను. వ్యావహారిక భాషావాదులు మర్యాదస్థులకు యోగ్యమైన పనిచేసి నవ్యసాహిత్య పరిషత్తు స్థాపించినారు.

౨

నవ్య సాహిత్య పరిషత్తు స్థాపించడమంటే తండ్రిమీద వ్యక్తత వచ్చిన కుమారుడు వేసే పంపిణీ దావావంటిదని చెప్పినానుకదా! రాజాదరము ఆంధ్ర సాహిత్య పరిషత్తువారికే! నవ్య సాహిత్య పరిషత్తువారు అందువల్ల పాపరు దావా వేసినారు. 1933 వ సంవత్సరములో స్థాపించిన ఈ పరిషత్తుకు 1936 దాకా చిత్తు నిబంధనలు కూడా లేవు. పత్రిక లేదు. వార్షిక సభకు నలుగురూ కలవడముతో సరిపోయేది. ఈ మూడు సభలకూ శ్రీయుతులు చిలుకూరి

నారాయణరావు, రాయప్రోలు సుబ్బారావు, తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి క్రమముగా అధ్యక్షులుగా ఉన్నారు. అందరూ సమర్థులే. బరంపురంలో జరిగిన మొదటి సభ "అభినవాంధ్ర కవిపండిత సభ" అనే పేరుతో శ్రీ గురుభాగవతుల ధర్మారావు, శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రుల ఆహ్వానమువల్ల జరిగింది. ఆ సభా ప్రారంభకులు శ్రీ గిడుగు రామమూర్తి పంతులు. రెండవ సభ రాజమహేంద్రవరములో శ్రీ గిడుగు రామమూర్తిపంతులు సప్తతిమ జన్మవాసరోత్సవంతోపాటు జరిగింది. మూడవది అనంతపురంలో జరిగినది. ఈ మూడింటిలోకూడా సభకు నిశ్చయరూప మేర్పడలేదు. 1938 లో కాకినాడలో నాల్గవ వార్షిక సభ జరిగింది. దానికి అధ్యక్షులు శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి. ప్రారంభకులుగా ఉండవలసిన శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ప్రారంభ కార్యక్రమము జరుపుటకు రాలేక సభాంతముకు వచ్చి ముగిస్తూ ఇచ్చిన గంభీరోపన్యాసము ఇప్పటికీ చెవులలో మారుమోగుతున్నది. "నవ్య సాహిత్య నిర్మాతలలో ప్రధానులు ఒక సంఘముగా చేరి నవ్య సాహిత్యాభివృద్ధి ఏతీరున జరుగవలెనో ఆలోచింపవలెననీ, సంకుచితాభిప్రాయములు విడువవలెననీ" సెలవిచ్చినారు. పరిషత్తు సభ్యులు పద్యకావ్యములో, వచన కావ్యముల్లో, కథలో, నవలలో, నాటకములో, వ్యాసములో, విమర్శలో ఏదో ఒకటి రచించేవారుగా ఉండవలె. అందులో పరిషత్తు ప్రథమ దశలో ఉన్నందున సభ్యత్వానికి ప్రతిబంధకాలు ఎక్కువ లేకుండా ఉంచినారు. ఎవరికీ వ్యావహారిక భాషలో వచనరచన ఐనా చేయడానికి అభ్యంతరముండగూడదు. ఈ నియమమునుబట్టి వ్యావహారిక భాష గ్రాంథికత్వ గౌరవము పొందడానికి యోగ్యమని నిశ్చయము కలవారిదే ఈ పరిషత్తు అని స్పష్టమవుతుంది. వ్యావహారిక భాష గ్రామ్యభాష అని ద్వేషించేవారికి ఈ పరిషత్తులో స్థానము లేదు.

ఇక ఈ కాలపు రచయితలు బహువిధాలుగా ఉన్నారు. నన్నయాదుల వలె భారత రామాయణాదులు వ్రాసేవారిదగ్గిరనుంచీ ప్రబంధ ధోరణిలో కావ్యాలు వ్రాసేవారిదాకా, ఆంధ్రాభిమానము దగ్గిరనుంచీ సోవియటు అభిమానముదాకానూ, భావకవిత్వము దగ్గిరనుంచీ శ్మశాన కవిత్వముదాకానూ, ఆధ్యాత్మికానుభూతులదగ్గిరనుంచీ 'కాంటెకోణాలూ, (Vigbior) ఫిడేలు రాగాల డజను, నవమి చిలుకలదాకానూ-వివిధ కావ్యాలు వ్రాసే కవులున్నారు. కథకులలో భక్తుల వేదనపద్దనుంచీ కేవల కాముక వికారములవరకూ, ఆకలి బాధ

వరకూ చిత్రించేవారున్నారు. నాటక రచయితలలో స్వతంత్రమైన చక్కని ఏకాంకికల దగ్గరనుంచీ ఇతర నాటకాలు చెప్పక స్వాయత్తము చేసుకునేవారి వరకూ, కంపెనీ డ్రామా నాటకాలు వ్రాసేవారివరకూ ఉన్నారు. విమర్శకులలో నిష్పక్షపాతముగా సూక్ష్మదృష్టితో పరిశీలించేవారేకాక కేవల స్తోత్రపాఠము చేసేవారివద్దనుంచీ సమస్తమూ దూషించేవారివరకూ ఉన్నారు. ఏవిషయమైనా ఓజస్సుగల భాషతో ప్రదర్శించేవారూ కేవలము సందర్భములేని మాటలలో చెప్పేవారూ ఉన్నారు. రచనలలో సామర్థ్యభేదము విశేషమున్నవా రున్నారు. ఇందరూ ఎవరికి వారు ఉత్తమ సాహిత్యము నిర్మిస్తున్న సృష్టికర్తల మనుకోవడమూ కద్దు. వీరిలో సాధ్యమైనంతవరకూ బహుసంఖ్యాకులను ఏకముఖము చేయడమే నవ్య సాహిత్య పరిషత్తు ప్రధానోద్దేశమని చెప్పవచ్చును. ఈ పరస్పర సాహచర్యమువల్ల అనేకముఖములైన వాఙ్మయస్వరూపము ఎక్కువ మంది రచయితలకు విశదమవుతుంది. ఉత్తములు తమ దోషములు సవరించుకొని గుణములు అభివృద్ధి చేసుకుంటారు. ఒక మార్గమువారికి ఇంకొకమార్గము అభీష్టము కాకపోయినా దానిస్వరూపమైనా సరిగా తెలుసుకుంటారు. యువకులై వృద్ధిలోకి రావలసినవారు ఎందులో ప్రవేశిస్తే తమ ప్రజ్ఞ వికసిస్తుందో అవగాహన చేసుకోగలరు. వాఙ్మయ సౌధనిర్మాణములో పుష్టి, సమగ్రత, దూరదృష్టి ఉన్న మహాశిల్పులవద్దనుంచి చిన్న కూలివానివరకూ పని ఉన్నది. ఇది అందరూ కలిసి చేయవలసిన కార్యమని మాత్రము రచయితలు గమనించవలె. నవ్యసాహిత్య పరిషత్తు ప్రయత్నమిదే! కవుల విధులను ప్రభుసమ్మితముగా గాక, సుహృత్సమ్మితముగాను, కాంతాసమ్మితముగాను బోధించడానికి పూనుకున్నది. నవ్య సాహిత్య పరిషత్తు వార్షిక సమావేశాలు ఇప్పటికి తొమ్మిది జరిగి ఉన్నవి. ఈ వ్యాసము ప్రచురణ అయ్యేలోగా పదవది జరగబోతున్నది. ఆ సభలకు కేవల పండితులైన శ్రీయుతులు గిడుగు రామమూర్తి, చిలుకూరి నారాయణరావు, పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిలు అధ్యక్షులైనారు. పండిత కవులైన శ్రీయుతులు రాయప్రోలు సుబ్బారావు, శివశంకరశాస్త్రి, సత్యనారాయణ వంటివారు అధ్యక్షత వహించినారు. కేవల కవియైన శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి ఒక సంవత్సర మధ్యక్షుడైనాడు. గేయకవీ, కథకుడూ, నవలాకారుడూ, చిత్రకారుడూ ఐన శ్రీ అడవి బాపిరాజు ఒక అధ్యక్షుడు. ఒక సంవత్సరము

ఆంగ్లభాషాపండితుడూ, ఆంధ్రభాషాభిమానీ ఐన బుర్రా శేషగిరిరావు అధ్యక్షులు. ప్రధానముగా కవి అనదగిన శ్రీ కాటూరి వేంకటేశ్వరరావుగారు పదవ సభకు అధ్యక్షుడుగా నియమితుడైనాడు.

ఇటువంటి సమర్థులు ఈ పరిషత్సభలకు అధ్యక్షులుగా ఉన్నారు. ఈ సభలకు దయచేసిన రచయితలూ, ఉపన్యాసకులూ గణించ సాధ్యముకాదు. జరిగిన ప్రదేశములు బరంపురము, రాజమహేంద్రవరము, అనంతపురము, కాకినాడ, గుంటూరు, బందరు, బెజవాడ, చెన్నపట్టణము, ఏలూరు. సారస్వత ప్రియులు విశేషమున్న నెల్లూరు, హైదరాబాదులలో జరగకపోవడానికి కారణము పరిషత్తు లోపముకాదు.

నవ్య సాహిత్య పరిషత్తువారిపేర ప్రచురించిన గ్రంథాలు చాలాఉన్నవి. ధనాభావముతో వ్యవహరిస్తున్న ఈ సంస్థ ఇన్ని గ్రంథాలు ప్రచురించడమే ఒక గొప్ప విశేషము. నవ్య గ్రంథవిక్రయశాల అనే పేరుతో లభించినన్ని నవ్యగ్రంథాలు ఏకముఖము చేసి క్రయసాధ్యము చేస్తున్నారు. పరిషత్తు తరఫున గుంటూరులో, బందరులో ముఖ్యముగా వాఙ్మయోపన్యాసములు, కావ్యపఠనములూ జరుగుతున్నవని ఎరుగుదును. ఇతర ప్రదేశాలలోకూడా జరిగినవని నా విశ్వాసము.

ప్రస్తుతము గుంటూరు పరిషత్తుకు ప్రధానకార్యస్థానమైనందున అక్కడ గ్రంథాలయ మొకటి స్థాపించినారు. దానిని అభివృద్ధిచేసి ఉపయోగించుకొనవలసిన బాధ్యత కవిపండితులమీద ఉన్నది. పరిషత్తుకు హైదరాబాదులోకూడా ఒక శాఖ స్థాపించవలెనని ప్రయత్నము జరుగుతున్నట్లున్నూ, రాబోయే వార్షిక సభలో దానికి పునాది పడుతుందనిన్నీ తెలియవస్తున్నది. ఆవిధముగా నవ్య సాహిత్య పరిషత్తుకు దేశములో అన్ని కేంద్రస్థానములలోనూ శాఖలు స్థిరపడ వచ్చును. పరిషత్తు తరఫున ప్రతిభ అనే త్రైమాసిక పత్రిక 1936 లో ప్రారంభించి ఆరు సంపుటములు ప్రకటితమైనవి. యుద్ధ నిబంధనలవల్ల తర్వాత ప్రచురించే వీలులేక తాత్కాలికముగా ఆగిపోయినది. ఏలూరు వార్షిక సభ జరిగినపిమ్మట నవమ వార్షికోత్సవ సంపుటమొకటి పరిషత్తువారు ప్రచురించినారు. త్వరలో పత్రిక ఉద్ధరించడానికి ప్రభుత్వమువారు అనుజ్ఞ ఇస్తారని విశ్వసించవచ్చును. ఈ ప్రతిభ పత్రికలో విశిష్టత ఏమిటి? గతించిపోయిన సాహితి,

సఖి, జయంతి, ఉదయిని, శారద-ఇత్యాది పత్రికలకంటే సజీవమై ఉన్న భారతి కంటే-ఈ పత్రిక విశేషమేమిటి అని అడిగినవారున్నారు. ఈ అన్ని పత్రికలమీదనూ నాకు ఆదరాభిమానా లున్నవి కాబట్టి వాటి విలువలు కట్టడం సరసము కాదు. ఒక్కొక్క పత్రికలో ఒక్కొక్క గుణము విశేషముగా కనపడుతుంది. 'ప్రతిభ'లో నవ్యకవులందరి ప్రతిభా ఏకముఖముగా ప్రదర్శించవలెనని పరిషత్తు ప్రయత్నిస్తున్నది. ఆ ప్రదర్శనతో తృప్తిలేనివారికి నవ్యకవుల ప్రతిభతోనే తృప్తి లేదన్నమాట.*

సజీవమైన ప్రతి సంస్థకూ గుణదోషాలు ఉంటవి. అయితే చైతన్యముతో కూడుకున్నాన్నాళ్ళూ అభ్యుదయానికి అవకాశాలు ఉంటవి. నవ్య సాహిత్య పరిషత్తు తన ఆదర్శములు నిర్వహించలేదనేవారే ఈ పరిషత్తుకు ప్రధాన మిత్రులు. అటువంటివారు ఈ పరిషత్తు భారము వహించి ఇంతఉన్నతమైన స్థానమునకు తీసుకొనిపోవలసిన బాధ్యత తమమీదనే ఉన్నదని గమనించవలెను. పరిషత్తు తన కార్యము నిర్వర్తించినదని తృప్తిపడడములేదు. ఆసభలు జయప్రదముగా కొనసాగడానికి అదృష్టవశమువల్ల ఎన్నో కలిసివచ్చినవి. కాంగ్రెసువారి సబ్‌కమిటీ సమావేశము అక్కడ అప్పుడు జరగవలసి యుండెను. అది అప్పుడు జరగక వాయిదా పడినది. అదే అప్పుడు జరిగివుంటే ప్రజల దృష్టిని రాజకీయములు ఆకర్షించి సాహిత్య విషయములు విస్మృతిపథము అలంకరించేవి. కాని అందుకు సిద్ధముచేసిన విశాలమైన పెండాలలో నవ్య సాహిత్య పరిషత్సభలు జరిగినవి. స్వతంత్రమైన ఆదర్శములమీద అభిమానమున్న కాకినాడ ప్రజలు విశేషముగా హాజరైనారు.

నవ్య సాహిత్య పరిషత్తువారు రెండు నాటికలు అద్భుతముగా ప్రదర్శించారు. అందులో ఒకటి శ్రీ చింతా దీక్షితులు "తిరుప్పాళ్వార్" అనే వచన నాటిక. రెండవది శ్రీ శివశంకరశాస్త్రి "పద్మావతీ చరణచారణ చక్రవర్తి" అనే విశిష్టమైన పద్యనాటిక. పద్మావతి వేషము ధరించిన శ్రీ బి. వి. నరసింహారావు నాట్యకౌశలము-అన్నీ నవ్య సాహిత్య పరిషత్తు కళావైదగ్ధ్యము వెల్లడిచేసినవి. ఇంతేకాక ఆ సభకు దూరభాగములనుండికూడా కవులు భావుకులు వచ్చినారు. ఆ సభాసందర్భములోనే మొదటిసారి ఈ పరిషత్తుకు ఒక కాన్స్టిట్యూషన్ అంటూ ఏర్పాటు చేయవలెనని ఒకవిధముగా సిద్ధము చేసినాము. అప్పుడు

*నవ్యకవుల ప్రతిభ ఇంతకు మించదు అని వ్రాసి కొట్టివేశారు శాస్త్రిగారు.

చేసిన నిబంధనలమీదనే కొద్ది మార్పులతో ఇప్పటికీ పరిషత్కార్యక్రమము సాగుతున్నది. ఆ సభలో చేసిన తీర్మానముమీదనే నవ్య సాహిత్య గ్రంథ ప్రచురణము, పాత్యగ్రంథ విక్రయశాల, గ్రంథాలయము స్థాపించవలెనని తీర్మానించాము. పరిషత్తు తరపున 'ప్రతిభ' అనే త్రైమాసిక పత్రిక ప్రకటించ వలెనని నిశ్చయించి త్వరలో కార్యరూపము ధరించింది. దేశమంతటా అప్పు డప్పుడు సభలు చేస్తూ వాఙ్మయప్రచారము చేయ నిశ్చయించినాడు. అన్ని తీర్మానములూ కార్యరూపము దాల్చినవి. ఆ సభతో పాటు పిటిషన్ దాఖ లైంది. ఈ నవ్య సాహిత్యపరిషత్తు వ్యవహారము సమస్తాంధ్ర భాషా లోకము ముందు విచారణ ప్రారంభించింది.

## 3

సాహిత్య పరిషత్తులో విధులేమిటి ? నవ్యసాహిత్యపరిషత్తు చేస్తున్న పని ఏమిటి ? ఈ ప్రశ్నలు వెంటనే కలుగుతవి.

మన దేశములో పూర్వము ధర్మ నిర్ణయము చేయవలెనంటే శిష్టులు, వేదశాస్త్ర నిష్ణాతులు, మధ్యస్థులు ఐన పెద్దలను చేర్చి వారు చెప్పే నిర్ణయము ప్రకారము వ్యవహరించడము ఆచారము. ఏదైనా సత్కార్యము చేయ వలె నన్నా, దుష్కార్యమునకు ప్రాయశ్చిత్తము చేసుకోవలెనన్నా అటువంటి అనుజ్ఞ తీసుకోవలసి ఉండేది. అదే ఇప్పటికీ "పరిషదనుజ్ఞాం గృహీత్వా" అనే వాక్యాలలో కనబడుతున్నది. రానురాను అది కేవల యాజ్ఞికము జీవనోపాధి గాగలవారి చేతులలో పడి "పరిషద్దక్షిణాం గృహీత్వా"లోకి దిగింది. కాబట్టి పరిష్కారం చేసేది పరిషత్తు. అయితే ఇటువంటి ధర్మ పరిషత్తులేగాని సాహిత్య పరిషత్తులు మనదేశములో పూర్వమున్నట్లు తోచదు. ఒక్క తమిళ దేశములో "మణి మేఖలై" ఇత్యాది కావ్యాలు వ్రాసిన రోజులలో సాహిత్య పరిషత్తు వంటిది ఉండేదన్నట్లుగా తెలుస్తుంది. ఆ పరిషత్తు వారు విన్న కావ్య ములో దోషము వచ్చినప్పుడల్లా ఆ పరిషదధ్యక్షుడు ఆ బాధకు తల బద్దలు కొట్టుకొని గాయము చేసుకోవడమే. కాని దానికి ప్రత్యేక ప్రభుత్వమున్నట్లు కనబడదు. మన సాహిత్య పరిషత్తులు ఐరోపాలో అకాడెమీలనే పేరుతో ఉన్న వాఙ్మయ సంస్థలూ, కళా సంస్థలూ, మనస్సులో ఉంచుకొని వాటి అనుకర ణములుగా పుట్టినట్లు చెప్పవచ్చును. Academy పర్యాయపదంగా పరిష చ్ఛబ్దము ప్రయోగించినారని తోస్తుంది. ఫ్రెంచి అకాడెమీలో 40 మంది

మాత్రమే సభ్యులుగా ఉంటారు. గొప్ప విద్వాంసులే అందులో సభ్యులు. అందులో, సభ్యులు కావడము బహు కష్టసాధ్యము. ఫ్రాన్సుదేశములో ఈమధ్య కాలమువరకూ ఆ అకాడెమీకి చాలా పలుకుబడి ఉండేది. వారు భాషలో వాడుక మాటలు ఏవేవి గ్రంథస్థము చేయవచ్చునో నిర్ణయము చేస్తారుట. ఆప్రకారమే గ్రంథకర్తలు చాలామంది వ్యవహరించారుట. కాని గ్రంథకర్తలు ఆ అకాడెమీ పరిష్కారాలకు కట్టుబడడం పోయింది.

ఇంగ్లండులో రాయల్ అకాడెమీ ఆఫ్ ఆర్ట్సు ఉన్నది. చిత్రకళలోనూ, శిల్పములోనూ విశేష సమర్థులైనవారిని దానిలో చేర్చుకుంటారు. వారు సభా నియమాలకే గాక కళా నియమాలకుకూడా బద్ధులుగా ఉంటారు. అయితే అకాడెమీ సభ్యులు కానివారిని చాలామందిని లోకమాదరిస్తున్నది. ఎప్స్టేన్‌వంటి శిల్పి రాయల్ అకాడెమీని ధిక్కరించి గొప్ప శిల్పి అని ప్రఖ్యాతి పొందినాడు.*

నవ్య సాహిత్య పరిషత్సభ్యులలోకూడా రచనలో కొన్ని నిశ్చితమైన నియమాలు ఉండవలెనని తలచేవారు లేకపోలేదు. నవ్య సాహిత్య పరిషత్సభ్యులైన శ్రీ చేకుమళ్ల కామేశ్వరరావు ''వాడుకభాష : రచనకు కొన్ని నియమాలు'' అని ఒక గ్రంథము నవ్య సాహిత్య పరిషత్తు తరఫున ప్రచురించినాడు. దానికి శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు వ్రాసిన పీఠికలోనే ఆ ప్రయత్నమును ఖండించినారు. ప్రభుసమ్మితమైన పరిషత్తులకు ఈ కాలములో అవకాశము లేదు. భాషా శాసనముకాని రచనా శాసనముకాని సాహిత్య పరిషత్తుల కని అంటే అంగీకరించేవారుండరు. అటువంటి శాసనసభ ఉండవలెననే ప్రయత్నముతో నవ్య సాహిత్య పరిషత్తు ఉపక్రమించలేదు. అయితే నవ్య సాహిత్య పరిషత్తు చేసేది వార్షిక సభలకు చేరి లోకుల ఖర్చుమీద దేశాభిమానము చేయడమేనా ?

౮

పరిషత్తులు వాఙ్మయములో శాసనములు చేస్తే అవి తీర్మానములుగానే ఉండిపోతవి. ఆచరణలోకి రావు. సభ్యులే అవి ఆచరణలో పెట్టకపోవచ్చును. లేకపోతే సభ్యులు చీలిపోయి స్వతంత్రముగా వ్యవహరించవచ్చును. ఎంత

---

*ప్రభుసమ్మితమని పరిషత్తులకు ఈకాలములో స్థానము లేదు అని వ్రాసి కొట్టివేశారు శాస్త్రిగారు.

గౌరవమూ, బలమూ ఉన్న రాజశాసనమే ఈ రోజులలో తిరస్కరించడము కొందరు గౌరవమనుకొని కారాగారములు చేరుతున్నారు. అది లాభమనుకొన్న వాళ్ళు బ్లాకుమార్కెటు వృద్ధిచేస్తున్నారు. ఇక తన శాసనము అమలు జరిపేం దుకు అధికారమేమీలేని సారస్వత పరిషత్తులు ఏమి చేయగలవు? గుంటూరులో నవ్య సాహిత్య పరిషత్తు సభకు అధ్యక్షులుగా ఉండి శ్రీ గిడుగు రామమూర్తి పంతులు చేసిన అధ్యక్షోపన్యాసములో దీనిని "ధిక్కారయుగ"మన్నారు. ఈ ధిక్కారయుగములో పరిషత్తు ఏమిచేయవలెనో, ఏమి చేయగలదో నవ్య సాహిత్య పరిషత్తు గమనించవలసివచ్చింది. అందువల్ల వాఙ్మయశాసనము నవ్య సాహిత్య పరిషదుద్దేశములలో ఒకటిగా పెట్టుకోలేదు. నవ్యసాహిత్య పరిషత్తు కేవల వృత్తిపరిశీలనచే పండితపరిషత్తు కాదు. ఇది కవిపండిత పరిషత్తు. ఇందులో కేవల పండితులకూ, కేవల కవులకూ, కవిపండితులకూ స్థానమున్నది. కాని రచనతో సంబంధము లేనివారికి ఎవ్వరికీ ఇందులో స్థానము లేదు. రచన వల్లనే కదా పండితుల పాండిత్యమూ, కవుల వైదగ్ధ్యమూ లోకానికి ఉపకరించేది. రచనవల్లనే వారి చైతన్యము స్ఫురిస్తుంది.

1925 నుంచి కాంగ్రెసు ఆందోళన రోజులలో సభలకని అన్ని ఊళ్ల నుంచీ బయలుదేరివచ్చి కాఫీ హోటళ్లలో కాఫీ ఉప్మాలు సేవించడానికి ఈ వేదు వచ్చింది. కాఫీ తాగావా? అని దేశాభిమానముందా? అనే వాడుక ఉన్నది. ఏ సంస్థకైనా అటువంటి అసంతృప్తి కలిగినప్పుడు ఆ సంస్థ శవప్రాయమైన దని మనము గ్రహించవచ్చును. అప్పుడది రాలినపండు. ఇప్పటికి నవ్యసాహిత్య పరిషత్తు చేసిన పనితో తృప్తిలేదు. ఇంకా అనేక ముఖములుగా విస్తరిల్లవలెనని ఆవేదనపడే భావుకులే దాని శ్రేయఃకాములు. పరిషత్తు చేసినకృషి స్వల్పియము. చేయవలసినది అనంతము! అయితే అట్టి శ్రేయఃకాముకులకు నేను చేసే విజ్ఞప్తి ఇది!

వాఙ్మయ మొక మహావృక్షమైతే దాని ఫలములే ఆశించేవారు, మనకు అనుభవయోగ్యము కాదని దాని బెరడు తీసివేస్తే వృక్షమే నశిస్తుంది. వాఙ్మయ మొక ప్రపంచమైతే కవు లందులో ప్రజాపతులు. భగవత్సృష్టమైన ఈ జగత్తు 'మనసా ప్యచింత్యరచనా రూపమై'నది. ఈ జగత్తులోనే మనకు అనుపాదేయ మైనవి అనేకములు కనిపిస్తున్నవే. ఇక కవి సృష్టించిన కావ్యజగత్తులో అటు

వంటివి ఉండడములో ఆశ్చర్యమేమిటి? జగత్తు స్థితికే భంగము కలిగించే సమయములో తప్ప అటువంటివాటిని నాశనము చేయడము న్యాయముకాదు.

వాఙ్మయ మొక క్షీరాబ్ధి. దానిని మథించినప్పుడేకాని అమృతోత్పాదనము కాదు. అమృతముకంటే ముందు హాలాహలము అవతరిస్తుంది. దానిని సహృదయుడు సదాశివునివలె కంఠములో స్తంభించి అమృతము దివ్యలోకానికి అందజేయాలి. దేవాసురులు ఉభయులూ మథించనిది అమృతలాభము కాదని హృదయ వీథిలో స్మరించుకుంటే మనశ్శాంతి కలుగుతుంది. ఈ వ్యాసరచయితకుకూడా కలుగుతున్న సంక్షోభమూ అటువంటిది! మనశ్శాంతికూడా అటువంటిదే!

—o—

# ఆంధ్రభాషలో చరిత్రాత్మక నవల

## ౧

సాహిత్యశాఖలలో నవల కొత్తది. రెండు శతాబ్దాల క్రిందటనే రూపొం దినా అన్ని సాహిత్య శాఖల సద్గుణాలను ఏకముఖంచేసి బహుముఖాల వర్ధిల్లినది. ఇంకా విజృంభించే అవకాశాలు కానవస్తూ, "నవలాంతమ్ సాహిత్యమ్" అని పిస్తున్నది.

నవలకు మూలభూతమైనది కథ. నవలలో కథాకథనంతో పాత్రసృష్టి చేయవచ్చు. సాంఘిక, ఆధ్యాత్మిక జీవితము చిత్రించవచ్చు. వాఙ్మయ సంఘ ర్షణలు ప్రదర్శించవచ్చు నేటి జీవితాన్ని విమర్శించి ఆదర్శ జీవితం సూచించ వచ్చు. ఇంకా ఎన్నో సాధించి ఆనందం కలిగించవచ్చు. స్థూలంగా నిర్వచనం చేస్తే పూర్వకాలానికి సంబంధించినదైతే చారిత్రక నవల అవుతుంది.

చరిత్రాత్మక నవల అనేది రెండు విరుద్ధ శబ్దాల సమ్మేళనమనే భ్రాంతి కలిగిస్తుంది. జరిగినదంతా వ్రాసుకుంటూపోతే చరిత్ర కాదు. లోకానికో దేశానికో సంఘానికో వ్యక్తికో మంచికో చెడుకో ప్రభావం కలిగించే సంఘట నలు వ్రాస్తేనే చరిత్ర. దానితో అనుగుణమైన కల్పన జోడిస్తే చరిత్రాత్మక నవల అవుతుంది. దానికి చరిత్రబీజ ముంటే చాలును.

వేదవేదాంతాలలో పురాణాలలో కొన్ని కథలు వినీ వినడంతోనే ఎవరికో ఎప్పుడో తప్పక జరిగిన సంఘటనే అనిపిస్తవి. అది చరిత్రబీజము. అగస్త్యుడు వింధ్యపర్వతము దాటి దక్షిణానికి వచ్చిన కథ దక్షిణాపథమంతా ప్రభావితం చేసి బహువిధాల రూపుతాల్చింది. రామాయణ మహాభారతాలను ఇతిహాసాలంటు న్నాము. ఆ రెండు గ్రంథాలు భారత భూమినంతా ప్రభావితం చేసి నిత్యజీవి తంతో పెనవేసుకొన్నవి. ఇతిహాస లక్షణ మిట్లా పెద్దలు చెబుతున్నారు :

"ధర్మార్థ కామమోక్షాణాం ఉపదేశ సమన్వితమ్
పురావృత్తం కథాయుక్తమ్ ఇతిహాసం ప్రచక్షతే"

కాబట్టి చరిత్రాత్మక నవలకు రామాయణ మహాభారతాలు మార్గదర్శకములుగా భావించవచ్చు.

చరిత్రకూ నవలకూ వైరుధ్యం లేదు. డాక్టరు గోపాలరెడ్డి ఒకచో "చరిత్రాత్మక నవల ఐతిహాసకత్వమూ కల్పనాసౌందర్యమూ సమరసమొందిన కూర్పు-లేక సత్యసౌందర్యముల సమ్మేళనము" అన్నారు. అది ఒక మనోహర సూత్రప్రాయంగా గ్రహింపవచ్చు.

మనము ప్రత్యక్షముగా చూస్తూ వింటూవున్న నేటి సంఘటనలను కథా వస్తువులుగా గ్రహించి వ్రాయడము సులభమనిపిస్తుంది. కాని ఆ సంఘటనల లోని ప్రధాన విషయాలు గ్రహించి రచన చేయడానికి కొంత ఆర్షదృష్టి ఉంటేనే కాని రాణించదు. అది లేకపోతే వార్తాలేఖనంలోకి దిగజారుతుంది. లేకపోతే ధనికులంతా దుర్గుణ పుంజాలుగానూ, దరిద్రులంతా సద్గుణమూర్తులుగానూ చిత్రిస్తూ పరకృతంగా ఈకాలంలో వస్తున్న ప్రచార నవలలుగా రూపొందే ప్రమాద మెక్కువ ఉన్నది. కాబట్టి నేటికాలానికంటే గడచిన కాలాన్ని చిత్రిస్తేనే కొంత నిర్లిప్తతతో రచన చేసి సారస్వతసిద్ధి కలిగించేందుకు ఎక్కువ అవకాశమున్నదేమో !

చారిత్రక నవలాకారులను ఎదుర్కొనే ప్రమాదమొకటి ఉన్నది. ఇప్పటి తమ ఆదర్శాలూ భావాలూ పూర్వకాలాలవారికి అన్వయించి చరిత్రను తారుమారు చేయడము. ముఖ్యంగా నేటి రాజకీయవాదులు చేస్తున్న దోషమిది. ఇట్టి రచనల వల్లనే నేటి సంఘంలో లేనిపోని ద్వేషాలు కక్షలు ప్రబలుతున్నవి. సార్వకాలిక మైన ధర్మసూత్రాలు బుద్ధిలో దృఢంగా ఉంచుకుంటేనే రచనలు ఉత్తమస్థాయి నందుకొంటవి.

పాశ్చాత్యులు శవాలను శల్యాలను భద్రపరచినట్లే జరిగిన సంఘటనలు వ్రాతపూర్వకంగా పదిలపరుస్తారు అందువల్ల ఆక్కడ చరిత్ర శల్యాలకు ఎక్కువ ప్రాధాన్యముంటుంది. మన అదృష్టంవల్ల మన గతచరిత్ర వివరాలు అంత ఎక్కువగా లేనందువల్ల చారిత్రక నవలాకారులకు స్వతంత్ర కల్పనలు చేసేందుకు అవకాశా లెక్కువ ఉన్నవి. మన కావ్యాదులవల్ల ఆయా కాలాల సాంఘిక మతాచారాదులు తెలియవస్తున్నవి. వాటిని మాత్రము ఉల్లంఘించ

కుండా జాగ్రత్తపడితే చాలును. చరిత్రాత్మక నవల విశృంఖలంగా ఊహా వీధులలో స్వైరవిహారము చేయవచ్చును.



ఆంధ్రభాషలో నవలతోపాటుగానే చరిత్రాత్మక నవలకూడా క్రీ. శ. 19 వ శతాబ్దము చివరి దశాబ్దంలో అవతరించింది. అప్పుడు టాడ్ సేకరించి ప్రచురించిన రాజస్థాన్ కథావళి దేశాన్ని ఆకర్షించింది. దాన్ని ఆంధ్రీకరించిన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము "హేమలత" అనే మొదటి చరిత్రాత్మక నవల వ్రాశారు. అది రాజపుత్ర స్థానానికి సంబంధించినదే. ఆ తర్వాత శివాజీ మొదలైన మహారాష్ట్ర వీరుల గాథలు ప్రచారంలోకి వచ్చినవి. హోల్కారు రాజ్యానికి సంబంధించిన "అహల్యాబాయి" నవలకూడా చిలకమర్తివారే రచించారు. తర్వాత విజ్ఞాన చంద్రికా గ్రంథమండలివారు హిందూమహా యుగము, మహమ్మదీయ మహాయుగము, చంద్రగుప్తుడు, శివాజీ చరిత్ర ప్రచురించినారు. శ్రీ చిలుకూరి వీరభద్రరావు ఎంతో పరిశ్రమచేసి ఆంధ్రుల చరిత్ర ప్రకటించారు. ఐనా మండలివారి ప్రథమ బహూకృతులందిన శ్రీ భోగ రాజు నారాయణమూర్తి "విమలాదేవి" శ్రీ వేలాల సుబ్బారావు "రాణీ సంయుక్త" కూడా రాజస్థాన కథలకు సంబంధించినవే.

ఆంధ్రచరిత్రకు సంబంధించిన మొదటి నవలలు 1914 లో వచ్చినవి. శ్రీ దుగ్గిరాల రాఘవచంద్రయ్య "విజయనగర సామ్రాజ్యము", శ్రీ కేతవరపు వెంకటశాస్త్రి "రాయచూరు యుద్ధము". ఇవికూడా మండలివారి బహూకృతు లందినవే. ఐనా బహుకాలమువరకు ఆంధ్ర నవలాకారులకు రాజపుత్ర మహా రాష్ట్ర వీరగాథలే అభిమానపాత్రమైనవి. ఆ రచయితలు ఆ దేశకాలాలతో గాఢపరిచితి లేనివారుగనుక అవి నామమాత్రానికే చారిత్రక నవలలు. శ్రీ వేంకట పార్వతీశ్వర కవుల "వసుమతీ వసంతము"లో మౌర్య చంద్ర గుప్తుడు ప్రధానపాత్రగా వచ్చుట ఒకటే కొంత మార్పు. అశోకచక్రవర్తి జీవితాన్ని చిత్రిస్తూ శ్రీ కేతవరపు వేంకటశాస్త్రి రచించిన "ఇచ్ఛిపీకుమారి" అనే నవల చిన్నదైనా మొదట వచ్చిన చరిత్రాత్మక నవలలో ఉత్తమమైనది.

మేధావులు స్వాతంత్ర్య సమరముతో సతమతమవుతున్నందువల్లనేమి, రచయితల దృష్టి ప్రధానంగా కవిత్వరంగంమీద ప్రసరించినందువల్లనేమి, వచన రచయితలు ప్రసిద్ధ నవలల ఆంధ్రీకరణాలతో తృప్తిపడుచున్నందువల్ల నేమి, బహుకాలమువరకు ఆంధ్రులచరిత్ర నవలాకారులను తగినంతగా ఆకర్షించ లేదు.

## 3

ఆంధ్ర చారిత్రక నవలకు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ "ఏకవీర"తో 1932 ప్రాంతాలలో కొత్తమలుపు ఇచ్చారు. అది తమిళదేశానికి సంబంధించిన దైనా, మధుర నేలిన ఆంధ్ర నాయకరాజుల చరిత్రకు సంబంధించినదైనందున ఆంధ్రుల చరిత్రకుగూడా సంబంధించినది. అందులో ప్రధాన పాత్రలు ఆంధ్ర దేశంనుంచి వలసపోయిన కుటుంబాలవారు. ముద్దుకృష్ణప్పనాయకుని మరణమూ ఆ తర్వాతి తిరుమల నాయకుడు పట్టాభిషిక్తుడు కావడము జరిగిన కాలపు కథ. ఈ నవలలో ప్రధాన కథ ఇద్దరు మిత్రుల సాంసారిక జీవనానికి సంబంధించిన దైనా సందర్భవశాత్తుగా అప్పటి సాంఘిక పరిస్థితులు, పోర్చుగీసువారి దుండగాలు-దోపిడులు, రాబర్టు నోబిలి తత్త్వబోధకస్వామి అనే సన్యాసివేషంతో చేసిన దొంగమతబోధ, దేవాలయాలలోని శిల్పనైపుణ్యాదులు చక్కగా ప్రదర్శింపబడ్డవి. తమిళ కవయిత్రి అవ్వయారు వ్రాసిన "అతిచ్చూడి" లోని అఱం జేవిరుంబు (ధర్మము చేయుము) ఆఱవదు శివం (కోపపడకుము) ఇత్యాది బాలబోధలు ప్రౌఢబోధలై ప్రధాన పాత్రలను ధర్మపథాన నడిపించడము రమ్యముగా చిత్రింపబడ్డది. ఆంధ్రులు తమ నివాసము ఎక్కడ ఏర్పరచుకొన్నా అక్కడ ఉత్తమ సంస్కృతిని స్వాయత్తము చేసుకొనే తీరు మనోహరంగా సూచించారు నవలాకర్త. "ఏకవీర"లో కల్పనకూ చరిత్రకూ మంచి కుదిరిక ఏర్పడ్డది.

ఆ తర్వాత శ్రీ విశ్వనాథ "బద్దన్నసేనాని" ఇత్యాది చారిత్రక నవలలు వ్రాశారు. కాని అవి ''ఏకవీర'' స్థాయిని అందుకోలేదు. వారీమధ్య శరపరంపరగా ప్రచురిస్తున్న పురాణ వైదిక గ్రంథమాలలోని నవలలు ప్రత్యేకముగా ప్రస్తావిస్తాము.

ఇంతలో ఆంధ్రుల చరిత్రకు సంబంధించిన ప్రామాణిక గ్రంథాలు ఎన్నో రాసాగినవి. శ్రీయుతులు చిలుకూరి వీరభద్రరావు, భావరాజు కృష్ణారావు, మల్లంపల్లి సోమశేఖరశర్మ, కురుగంటి సీతారామయ్య, డాక్టరు నేలటూరి వేంకట రమణయ్య, డాక్టరు మారేమండ రామారావు ఎన్నో ప్రత్యేకగ్రంథాలు ప్రచురించారు. ఐతిహాసిక మండలివారు రాజరాజ నరేంద్ర సంచిక, కళింగ సంచిక, రెడ్డి సంచిక, కాకతీయ సంచిక, శాతవాహన సంచిక మొదలైన అమూల్య గ్రంథాలు ప్రచురించి ఆంధ్రుల చరిత్రతోపాటు మూలాధారాలు కూడా పాఠకుల అందుబాటులోకి తెచ్చారు. కాని వాటినన్నిటినీ కొద్దిమంది నవలాకారులు మాత్రమే ఉపయోగించుకున్నారు. వారిలో గణింపదగినవారు ఆంధ్ర విశ్వవిద్యాలయం బహుమతు లందిన ముగ్గురూ, తక్కినవారిలో శ్రీయుతులు అడవి బాపిరాజు, నోరి నరసింహశాస్త్రి. ఈ ఐదుగురి నవలలతో ఆంధ్ర చరిత్రాత్మక నవల సంపూర్ణ పుష్టితో అవతరించినది.

౪

ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు ఇంటర్మీడియేటు క్లాసుకు ఉపవాచకాలుగా నిర్ణయించే నిమిత్తము ఆంధ్ర చరిత్రకు సంబంధించిన ఉత్తమ నవలకు ఒక్కొక్కదానికి వెయ్యిరూపాయలు బహుమతి ప్రకటించారు. 1951 నాటికి ఆంధ్రదేశములో నవలాకారులలో ఏ కొద్దిమందికో తప్ప అంత ప్రతిఫలము నవలారచనవల్ల ముట్టడములేదు. ఇందువల్ల అంతకుముందు నవలలు వ్రాయని వారు చరిత్ర శ్రద్ధగా పఠించి చారిత్రక నవలలు వ్రాయడానికి పూనుకొని మంచి నవలలు వ్రాశారు.

అట్టివారిలో అగ్రగణ్యురాలు శ్రీమతి మల్లాది వసుంధర. ఆమె మొదటి నవల "తంజావూరు పతనము". ఆ బహుమతు లందిన నవల లన్నిటిలో సర్వ విధాల అగ్రగణ్యమైనది. ఆమె కాలేజి విద్యార్థినిగా ఉన్నప్పుడే అటువంటి నవల వ్రాయడము ఆశ్చర్యకరమైనది. "ఏకవీర"లో వలెనే దీనిలోని కథాంశము కూడా తమిళదేశములో జరిగినదైనా, తంజావూరు పాలించిన ఆంధ్ర నాయక రాజులలో చివరివాడగు విజయరాఘవరాయల పాలనమును చిత్రించినందువల్ల ఒకవిధంగా ఆంధ్రుల చరిత్రకు సంబంధించినదే. ఇందులో ఆ యాస్థానములో

కవిత్వము, సంగీతము, నృత్యము, శిల్పము, పరాకాష్ఠ నందుట చక్కగా పోషింపబడ్డది. కాని రాజు భోగలాలసత, వేశ్య రంగాజమ్మయందు వ్యామోహము, ముఖస్తుతియందు ప్రీతి, ఆస్థానకవులు స్తుతించుచున్నట్లు తాను నిజముగా భగవంతుడనే అనుకొనుట శ్రీకృష్ణదేవరాయల యంతవాడనని గర్వించుట, తన అష్టమహిషులతో దక్షిణ నాయకత్వము సమర్థింపలేకుండుట, వెంకన్న కుట్ర కననగుట, ఏవిధముగా రాజ్యపతనమునకు దారితీసినవో అద్భుతముగా చిత్రింపబడినవి. పరమభక్తుడైన పెద్దిదాసు పాత్ర, అమాయకుడైన ఎల్లు సోమయాజుల రాయబారములు యువరాజును బంధించినందున కోపోద్దీపితయైన పట్టమహిషి రాజగోపాలాంబిక విజృంభణము, విజయరాఘవ నాయకునకు ఉంపుడుకత్తెగా ఉన్న రంగాజమ్మ తనకు సోదరియని చివరకు తెలిసినందున కలిగిన నిర్వేదము పాఠకుల హృదయములలో చిరకాలము నిలిచిపోవును. ఈ నవల వసుంధర సర్వతోముఖ ప్రజ్ఞకు ప్రతీక.

కాకతీయ రాజ్యపతనమును గూర్చి ఆమె రచించిన 'సప్తపర్ణి' కూడా బహుమతి నందినది. ఇందులోగూడ కక్షలు, ద్వేషములు దురభిమానము, ఆడంబరముల కాస్థాన గౌరవము ఏవిధముగా రాజ్యపతనమునకు దారితీసినవో వర్ణించుటకు ప్రయత్నించినది. ఇందులో జక్కనాచార్యుడను మహాశిల్పి తన మంత్రతంత్రశక్తిని జోడించి సప్తపర్ణిని అష్టవర్ణినిగా చేసి రాజ్యము మరియొక తరమువరకూ నిలుపుటకు చేసిన ప్రయత్నానికి అవకాశము లభింపకపోవడమనే కల్పనమీద కథ నడచినది. ఈ భావనలోనే కొంత అసంబద్ధత ఉన్నందువల్ల హృదయానికి హత్తుకోదు. రాజవంశములో ఏడుగురు రాజులు ఉండిరనే విషయ మాధారము చేసుకొని సప్తపర్ణి కల్పన నడచినది. ఐనా ఈ నవలకూడా గణింపదగినదే.

ఆమెయే ఈమధ్య రచించిన "రామప్పగుడి" అనే నవల విశ్వవిద్యాలయ బహుమతు లందినది కాకపోయినా ఈ సందర్భములో ప్రస్తావింపదగినది. రామప్ప గుడిలోని శిల్పసౌందర్యము అనన్య సామాన్యము !

శ్రీ ధూళిపాళ శ్రీరామమూర్తి రచించిన "భువన విజయము", "గృహరాజు మేడ" విశ్వవిద్యాలయము బహుమతు లందినవి. ఆయన సాహిత్యవేత్త. "భువన విజయము"లో శ్రీకృష్ణదేవరాయలు ఆదిల్షానును జయించుటతో

ప్రారంభించి ప్రాచీ దిగ్విజయయాత్రచేసి దుర్గములనెన్నిటినో జయించి కటకమువరకూ యాత్రచేసి గజపతి కుమార్తె యయిన తుకాదేవిని వివాహమాడి "భువనవిజయ సభా" నిర్మాణము పూర్తిచేయించుటతో పర్యవసిస్తుంది. ఐనా ఈ కథయంతటిలో సూత్రరూపంగా నడిచిన కథ చిన్నాదేవి తిరుమలదేవితోపాటు శ్రీకృష్ణరాయల మహిషిగా గౌరవింపబడిన వృత్తాంతము. ఆమె నిజముగా రాజపుత్రికయే ఐనను వేశ్యచేత పెంపబడి "గాండ్లసంగి" అను పేర రాయలకు ప్రేమభాజన మవుతుంది. ఆమె ప్రణయకోపమువల్ల రాయలకు ఆమెపైన అనుగ్రహము తప్పుతుంది. నందితిమ్మన అనే మహాకవి తన పారిజాతాపహరణ కావ్యము రచించి రాయలకు మరల అనుగ్రహము కలిగించినాడను ఐతిహ్యముమీద ఈ మూలకథ నడచినది. ఇందులో శ్రీరామమూర్తి సూక్ష్మాతిసూక్ష్మ సన్నివేశములతో తన సాహిత్య వైశారద్యము ప్రదర్శించి "పారిజాత" సౌరభము నవలలో అంతటా గుబాళింపజేసినాడు. ఈ నవలలో తిరుమలదేవి ఉదాత్తత, తిమ్మోజు, కుండోజుల శిల్పప్రావీణ్యము, నంది తిమ్మన కవితా మాధుర్యము, పెద్దన మహాకవి సహృదయత హృదయంగమంగా రాణించినవి. రాయల వీణామధువను కృష్ణపండితుని చక్రవాకరాగము తిరుమలదేవి కంఠములో విరహవేదనగా మధురాతిమధురంగా మ్రోగి పాఠకుల శ్రోత్రాలలో ప్రతిధ్వనిస్తుంది.

వారి "గృహరాజు మేడ"లో కూడా సాహిత్య వైశారద్యము ప్రతిబింబిస్తున్నది.

మరొక విశ్వవిద్యాలయ బహుమతి నందిన నవల శ్రీ పాటిబండ మాధవశర్మ "రాజశిల్పి". ఇది కొండవీటి రెడ్డిరాజ్యమును కుమారగిరి పరిపాలించిన నాటి చరిత్రను చిత్రించునట్టిది. కుమారగిరి జీవించియుండగానే కొండవీటి రాజ్యమునుండి రాజమహేంద్రవర రాజ్యము చీలిపోయినది. కొండవీటి రాజ్యానికి ఆయన దూరపు జ్ఞాతియైన పెదకోమటి వేమారెడ్డి, రాజమహేంద్రవర రాజ్యమునకు కుమారగిరి మేనల్లుడూ ప్రభువులైనారు. కుమారగిరి హృదయపూర్వకముగా రెండు రాజ్యములు అర్పించి తాను కొండలలో ఎక్కడనో శిల్పిగా ఉండుటకు నిశ్చయించుకొనడముతో నవల అంతమవుతుంది. కుమారగిరి భోగలాలసుడైన ప్రభువనీ, లకుమాదేవి అతని ఉంపుడుకత్తెయని చారిత్ర

కుల భావము. ఈ నవలలో కుమారగిరి మకరంద మధురమైన హృదయముగల ఉత్తమ వ్యక్తిగాను, లకుమాదేవి ఉత్తమాదర్శములు గల కేవల కళోపాసన చేయు నాతని సోదరిగాను చిత్రింపబడినది. ఆ తర్వాత వేమభూపాల చరితము సంస్కృత పద్యకావ్యముగా రచించి గద్యకవి సార్వభౌముడని, వామన భట్ట బాణుడని బిరుదములందిన వామను డిందులో ఎక్కువ రాజనీతిధురంధరుడుగా భాసించును. ఆయన వైదుష్యము కంటె కాటయవేముని వైదుష్యము ఎక్కువ ప్రకాశిస్తున్నది. పెదకోమటి వేమారెడ్డి (వేమ భూపాల చరిత నాయకుడు) అల్పుడుగా భాసిస్తాడు. ఆయన రాజ్యకాలములో విద్యాధికారియైన శ్రీనాథ కవి సార్వభౌముడు కూడా ఈ నవలలో అల్పుడుగానే చిత్రింపబడ్డాడు. మంత్రి సింగన కూడా వీరశైవ కోలాహలముతో కలసినాడు. ఒకవిధంగా చూస్తే ఇది కుమారగిరి పక్షము వహించి వ్రాసిన నవల. అట్లా చేయడానికి నవలా కారులకు నిస్సందేహంగా స్వాతంత్ర్యమున్నది. మొత్తముమీద ఇందులో ఆనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులు ప్రతిబింబించినవి. వెంకోజు ఇంద్రజాలము, తిప్పయశెట్టి సమ్మానము, మల్లాంబిక సంగీతము, లకుమాదేవి నాట్యము, పీరాస్వామి సన్నాయి వాద్యము నవల యంతటా ప్రతిధ్వనిస్తవి! సామాన్య ముగా నవలలోని భాషకంటే ఇందులోని భాష ప్రౌఢతరమైనది.

౨౩

ఆంధ్ర చారిత్రక నవలను ఆంధ్ర సారస్వత పరిధిని దాటించిన వారిలో ప్రథముడు అడవి బాపిరాజు. ఆయన మూడు చారిత్రక నవలలలో "హిమబిందు" నిస్సందేహంగా ప్రపంచ భాషలలోని ఉత్తమ నవలల స్థాయి నందుకొన్నది. బాపిరాజు కొంతకాలము లాయరు, కొంత కాలము జాతీయ కళాశాలలో అధ్యాపకుడు, కొంత కాలము దిన పత్రికా సంపాదకుడు. కొంతకాలము వెండితెరమీద చిత్ర నిర్మాత. స్వయముగా చిత్ర కారుడు, కవి, కథకుడు. మెత్తని హృదయము కలవాడు. తరుగని ఉత్సా హముతో పొంగులు వారేవాడు. ఆయన బహుముఖానుభవము, ఆర్ద్రహృదయము "హిమబిందు"గా రూపొందింది.

ఇది శ్రీముఖ శాతవాహన చక్రవర్తి కాలము చిత్రించును. చక్రవర్తి యాదర్శము తన రాజ్యము చతుస్సముద్రవలయిత మొనర్చి ధర్మము నాలుగు

పాదముల నడిపించి రాజ్యము స్వర్గధామముగా చేయవలెనని. రాజగురువుల యాదర్శము. శాతవాహన వంశమును నిష్కల్మషమొనర్చి ప్రపంచమును విరించి యజ్ఞ యాగాదులతో దేవతాతృప్తి మానవ రక్తి ప్రసాదింపచేసి వైదిక ధర్మమును నిరసించు బౌద్ధ జైనములను నిర్మూలింపవలెనని. తుదకు ఇరువురి యాశయములు సిద్ధించును గాని చక్రవర్తి మతసహనమువల్లనే సాధ్యమవుతుంది, కాని రాజగురువుల మతద్వేషమువల్ల కాదు. ఈ నవలలో మూడు రకముల ప్రేమ కథలు కల్పింపబడినవి. విషకన్య శ్రీ కృష్ణ శాతవాహనుని దైవముగా ప్రేమిస్తుంది. హిమబిందు సువర్ణశ్రీని ప్రేమించి భర్తగా భావించును. నాగబంధునికా సమవర్తుల ప్రేమ గుణసామ్యముచే పరస్పరాకృష్టులైన వారి ప్రాపంచిక ప్రేమ. పవిత్రప్రేమ సమస్తావరోధాలను అధిగమించి విజయము సాధిస్తుంది.

ముద్రారాక్షసములో విషకన్యా ప్రయోగమే చెప్పబడినది. ఈ నవలలో చిన్ననాటినుండి అభిచార హోమములయు విషవైద్యుల యొక్కయు సహాయముచే విషకన్య ఎట్లయినదో అద్భుతముగా వర్ణింపబడినది. తుద కా విషకన్య శ్రీకృష్ణ శాతవాహనుని ప్రేమించి తాతగారిని ప్రతిఘటించి అమృతకన్యగా ఎట్లు పరివర్తన మందినదో అద్భుతతరముగా కల్పింపబడినది.

శ్రీ కురుగంటి సీతారామయ్య అన్నట్లు ఇందులో "బాపిరాజు ధర్మము నిర్వచించునపుడు ధర్మవేత్తయై, యుద్ధములు వర్ణించునెడల సమరశాస్త్ర విశారదుడై, ప్రేమికుల సంభాషణలలో రసమూర్తియై, శిల్పచాతుర్యము నుగ్గడించు వేళ శిల్పియై, గానము పాడించునెడల గాయకుడై, బాలికల యాటల నిరూపించు నెడల బాలుడై, శాస్త్రచర్చలు సల్పునెడల సకల శాస్త్రవేత్తయై, పాత్రోన్మీలన వేళలలో సహృదయుడై మొత్తముమీద నవలారచనమందు మహాకవియైనాడు!"

ఆయన మరియొక నవల 'అడవి శాంతిశ్రీ'. ఇందులోకూడా బౌద్ధ వైదిక మతముల సంఘర్షణము చిత్రింపబడ్డది. కథ ఎక్కువ భాగము విజయపురిలో జరిగినది. నాగార్జున బోధిసత్త్వులు ధర్మబోధ చేయుచుండిన కాలమది. ఇందులో కూడా మూడు ప్రేమకథలున్నవి. కాని కథానాయిక శాంతిశ్రీ ప్రేమ

కథయే విశిష్టమైనది. ఆమె విజయపురినేలిన శాంతిమూలుని పుత్రిక. ఆమె బౌద్ధ ధర్మముచే సంపూర్ణముగా ప్రభావితయై సన్యాసినివలె నుండి ప్రేమ స్వరూపమే ఎరుగనిది. తండ్రి యాజ్ఞకు బద్ధురాలై ఆమె కథానాయకుడగు బ్రహ్మదత్తుని వద్ద వైదిక ధర్మబోధ వినే శిష్యురాలవుతుంది. ఆయన ధర్మబోధవల్ల కంటె సంఘటనలవల్ల ఆమెలో నెమ్మదిగా ప్రేమ అంకురిస్తుంది. బ్రహ్మదత్తుడు గాలివానవల్ల కొట్టుకొనిపోయిన నౌకతో కొంతకాలము కనబడకపోగా ఆమె ఉద్విగ్నత పొందుతుంది. తర్వాత రాయబారిగా వెళ్లిన బ్రహ్మదత్తుని పులమావి బంధించినట్లు తెలిసిన వెంటనే ఆమె వీరాంగనాసైన్యము కూర్చుకొని నిరాఘాటముగా పులమావిపై దండెత్తుతుంది. ఆ విచిత్ర కథా ఘట్టము బాపిరాజు తన ప్రతిభచే సత్యమనిపించేట్లు చేసినాడు. బౌద్ధ ప్రచారమువల్ల జనములు సన్యసిస్తూ, గృహస్థాశ్రమ విముఖులు కాగా ధర్మబద్ధమైన కామముతో వైదికము దానిని లోగొన్నదన్న భావానికి ప్రతీకగా శాంతిశ్రీ ప్రేమకథ కల్పింపబడ్డది.

శాంతిమూలుడు వైదికమతనిష్ఠుడు. ఆయన పత్నులు బౌద్ధమత నిష్ఠులు. తుదకు అమరావతిలో శాతవాహనవంశ మంతరింపగా శాంతిమూలుడు సమస్త జనుల అభ్యర్థనము పాటించి నాగార్జునుల ఆశీర్వాదముతో చక్రవర్తి పదవి స్వీకరించి ఇక్ష్వాకు రాజ్య స్థాపకుడు కావడంతో నవల ముగుస్తుంది. పైరెండు నవలలలోను బాపిరాజుకు బౌద్ధమందు అభిమానమూ, వైదికమందు గౌరవమూ ద్యోతమవుతవి

ఆయన "గోన గన్నారెడ్డి" కాకతీయ రుద్రాంబ కాలానికి సంబంధించిన కథ. రుద్రాంబ అంతరంగిక విప్లవములను అడచి, మహారాష్ట్రుల దండయాత్ర నెట్లు ప్రతిఘటించినదో దీనిలో వర్ణితమైనది. బాపిరాజు రచనలన్నిటిలో రెండు లక్షణములు ప్రాధాన్యము వహించును. మొదటిది ప్రేమికుల ప్రేమ. రెండవది అపరిమితమైన ఆంధ్రాభిమానము. ఈ నవలలో ఆ రెండు గుణాలు ప్రత్యేకముగా కానవస్తవి.

౬

శ్రీ నోరి నరసింహశాస్త్రి ప్రకృతి ఒకవిధంగా బాపిరాజు ప్రకృతికి విరుద్ధమైనది. బాపిరాజు ఉత్సాహము నిరంకుశంగా పొంగులెత్తుతుంది. నోరి

ఉత్సాహము సంయమనంతో నిండి ఉంటుంది. బాపిరాజుకు ఆంధ్రాభిమాన మెక్కువ. నోరికి మహాభారతాభిమాన మెక్కువ. బాపిరాజు నాయికా నాయకులు ప్రేమావేశములతో తబ్బిబ్బులవుతారు. నోరి నాయికానాయకుల ప్రేమ సాంసారిక మాధుర్య మనుభవించేవారిదిగానో, వీరనారులకు, వీరులకు సంబంధించినదిగానో ఉంటుంది. బాపిరాజుకు బౌద్ధమందభిమానము, వైదికమందు బలవంతపు గౌరవము, నోరికి వైదికమతమందు నిష్ఠ, బౌద్ధాది సకల మతములందు ద్వేషము లేని సహనము. దురాచారము ఎవరిలో ఉన్నా సహించడు.

ఆంధ్రదేశము ఉత్తర దక్షిణ భారతములకు సంధి ప్రదేశముగా ఉన్నందున యావద్భారతమును ఏకముఖము చేయగల లక్షణాలు ఆంధ్రభూమిలో ఎక్కువ ఉన్నందుకే నోరికి ఆంధ్రదేశాభిమానముగాని తానీ జన్మలో అక్కడ పుట్టినందుకు కాదు. ఆంధ్రకవులకు పూజ్యతమమైన గ్రంథము కవిత్రయము ఆంధ్రీకరించిన వ్యాస మహాభారతము. కవిత్రయము కాలములు చిత్రించుచు నారాయణభట్టు, రుద్రమదేవి, మల్లారెడ్డి అనే నవలాత్రయము రచించినాడు. శ్రీనాథ కవిసార్వభౌముడు విద్యానగరయాత్ర చేసి డిండిమభట్టును జయించి ఆయన కంచుఢక్కను పగులగొట్టించిన వృత్తాంతము "కవిసార్వభౌముడు"లో వర్ణించినాడు.

'నారాయణభట్టు' క్రీ.శ. 1053 సం. వృత్తాంతము. అప్పుడు ఉత్తరభారతము ఛిన్నాభిన్నమై విదేశీయుల దండయాత్రలకు అనుకూలముగా ఉన్నది. అప్పుడు దక్షిణమున చోళచక్రవర్తులు దక్షిణభూమిని ఏకచ్ఛత్రము క్రిందికితెచ్చి భారతీయ ధర్మము పరిరక్షించుచున్నారు. గంగవరకు విజయయాత్ర చేసిన గంగైకొండ చోళుని అల్లుడగు రాజరాజనరేంద్రుడు కలికాల కలంక పంకముహరించుచు రాజమహేంద్రవరములో రాజ్యము చేయుచున్నాడు. అప్పుడు ఆంధ్రభూమిలోని బౌద్ధ సంఘారామములు తాంత్రిక దురాచారాలకు ఆటపట్టులై రాజకీయ విప్లవము సాగింపగా దానిని సకాలములో అడచివేసి, సామాన్య ప్రజలకు సంస్కృత భాషలో నున్నందున అందుబాటులో లేని మహాభారత ధర్మమును మహాభారతాంధ్రీకరణముతో అందుబాటులోనికి తెచ్చుటతో ఈ నవల ముగియుచున్నది.

క్రీ. శ. 1248 నాటికి ఉత్తరభారతము తురుష్కాక్రాంతమైనది. ఢిల్లీ సుల్తానుల దృష్టి దక్షిణభారతముపైకి ప్రసరిస్తున్నది. కాకతీయ సామ్రాజ్యమును అన్నివైపులనుండి పొరుగురాజులు ముంచివేయుటకు యత్నింపగా రుద్రమదేవి రాజ్యరక్ష చేసినది. ప్రధాన శత్రువైన దేవగిరి యాదవరాజును జయించినది. 'ఆంధ్రులకూ మహారాష్ట్రులకూ తల్లులైన గోదావరీ మంజీరా నదుల సోదరులిట్లా వృథా కలహాల పాలవుతున్నారే' అని శోకిస్తున్నట్టుగా రెండుదేశాల ప్రభువులకు తోచి సంధి చేసుకుంటారు.

రుద్రమ భర్త వీరభద్రేశ్వరుడు తనకు మరియొక పత్నివలన కలిగిన సంతానానికి రాజ్యపదవి కావలెనని ఆశిస్తాడు. కాని చక్రవర్తి రుద్రమకే పట్టాభిషేకము చేస్తాడు. భర్త రుద్రమమీద అంతఃకలహాలు ప్రేరేచి శత్రురాజుల దండయాత్రలుకూడా ప్రోత్సహిస్తాడు. రాజధర్మానికీ, వ్యక్తిధర్మానికీ రుద్రమలో ఘర్షణ ఉదయిస్తుంది. రాజధర్మం పాటించి నిర్దోషురాలైన సీతనే శ్రీరాముడు పరిత్యాగము చేసినది మనస్సుకు తెచ్చుకొని, దోషియైన భర్తను, రాజధర్మాన్ని ఆశ్రయించి ప్రతిఘటిస్తుంది. భర్త అమాయకులైన జైనప్రజలలో విప్లవము తెస్తాడు. వారిలో నాయకులను మాత్రము కఠినముగా శిక్షించి, సామాన్య ప్రజలను పొరపాటున తప్పుచేసిన సంతానమువలె క్షమించి, వారిలో నిష్కల్మషులైన వీరభల్లటదేశికులను, సిద్ధనందివంటివారిని, పూజిస్తుంది.

సందర్భవశాత్తుగా ఆనాడు ఏకశిలానగరములో విలసిల్లిన అన్నివరగతుల జనుల జీవితము చిత్రింపబడినది. తిక్కన సోమయాజి నిర్లిప్తుడై మహాభారత రచన కొనసాగిస్తూ, గడ్డు సమయాలలో రాజకీయనౌకను యోగ్యులైన వారిచేత నడిపిస్తాడు.

కొప్పెరుల జింగడు (రాజసింహుడు) అనే కాడవ ప్రభువు గోదావరీ తీరమువరకు భూసేనను నౌకాసేనను నడిపించుకొంటూ దండయాత్ర సాగించాడు. అతనికి 'సాహిత్యమల్లుడు' 'ఖడ్గమల్లుడు' అనే బిరుదాలున్నవి. ఆంధ్ర సేనలు గోదావరికద్ద భూమిమీదను సముద్రముమీదను అడ్డగిస్తవి. రాజసింహుడు తన సేనానులకు యుద్ధాలు నడపడానికి ఆజ్ఞలిచ్చి తన సాహిత్యమల్లత్వము

గోదావరి పండితులకు ప్రదర్శించడానికి పూనుకుని ఇష్టదైవమైన కనకసభాపతి పూజకు అంగముగా భాసుని "ఊరుభంగము" ప్రదర్శింపజేస్తాడు. భీమసేన దుర్యోధనుల గదాయుద్ధమునే అవల రెండుయుద్ధములూ అనుకరిస్తవి. ఆంధ్రుల గజఘంటలకు కాడవుల అశ్వదళాలకూ, ఆంధ్రుల పెద్దనౌకలకు, కాడవుల అసంఖ్యాకములైన చిన్నవౌకలకూ యుద్ధాలు దుర్యోధనునికి ఊరు భంగమైనట్లే పరిణమించినది. పన్నిందిన ఘట్టము అద్భుతశక్తితో నిర్వహింపబడ్డది. సాహిత్య అకాడెమీవారు ఈ నవలను భారతీయభాష లన్నిటిలోకి అనువదింప నిశ్చయించారు.

మల్లారెడ్డి క్రీ. శ. 1328 నాటిది. మహమ్మదు బిన్ తుఘ్లకు దక్షిణ దేశములో అరాజకము ప్రబలజేసెను. అప్పుడు సామాన్య ప్రజలలోనుండి మహావీరులు పుట్టి విప్లవము సాగించి ధర్మబద్ధమైన రాజ్యాలు స్థాపించారు. మొదట విముక్తి సాధించినది కృష్ణానది దక్షిణతీరాన రెడ్డి ప్రభువులు. రెడ్లకుల దైవము "నందికంత పోతరాజు" అనే కళారిదైవము వెలుస్తాడు. శ్రీ శంకర స్వామి చేయించిన సహస్ర చండీయాగముతో ధర్మవృషభము ఆవిర్భవించి నట్లయి ప్రజలు నిర్భయంగా మహాయుద్ధాలు చేస్తారు. దేశాంతరాలతో, ద్వీపాంతరాలతో, అనేక మహానౌకలతో, వ్యాపారము చేసే అవటిదేవయ నౌకలు ఆయుధాలు గజాలు హయాలు తెప్పించి సహాయము చేస్తాడు. కథా ప్రారంభంలో శ్మశాన సదృశంగా ఉన్న ఆంధ్రభూమి చివరకు సర్వసంపన్న మవుతుంది. ఎర్రయ మహాకవి మహాభారతరచన హరివంశముతోసహా పూర్తిచేస్తాడు.

'కవి సార్వభౌముడు'లో శ్రీనాథకవి కొండవీటి నుండి క్రీ.శ. 1420లో శ్రీవిద్యానగరానికి సాంస్కృతిక విజయయాత్రకై బయలుదేరి, యుద్ధయాత్రలలో వేసే ఎత్తులన్నీ వేసి అక్కడ డిండిమ భట్టారకుణ్ణి ఉప్పటశాస్త్ర వాదంలో జయించి ఆయన కంచుఢక్కను పగులగొట్టిస్తాడు. ఆ తర్వాత వారిద్దరికి పరస్పరమూ ఆదరగౌరవాలు కలుగుతవి. ఆస్థానములో శ్రీనాథుడు తన బహుముఖ ప్రజ్ఞ ప్రదర్శించి కవిసార్వభౌముడుగా కనకాభిషేకము పొందుతాడు. ఆనాడు శ్రీవిద్యానగరములో వేదవేదాంతములకు దర్శనములకు ఉండిన ప్రాభవము సామాన్య పాఠకులకుకూడా ఉత్కంఠ కలిగిస్తుంది. పర్వతమల్లులకూ, విద్యామల్లులకూ వాళ్ల శిష్యులకూ జరిగిన మల్లయుద్ధాలు శాస్త్రవాదాల ప్రతిధ్వని

వలె ఉండి నవలకు రమ్యత చేకూరుస్తుంది. రాజకీయముగా శ్రీవిద్యానగరానికి కొండవీటికి రాచకొండ దేవరకొండలకు ఎన్నెన్ని స్పర్థలున్నా, విద్వాంసులను గౌరవించడములో విరోధ ముండేది కాదనీ, శాస్త్రవాదాలలో ధర్మదీక్షతో పరిషత్తులు నిర్ణయము చేసేవని ఇందులో ప్రదర్శింపబడ్డవి ఆ తర్వాత కొద్ది కాలానికి ఆంధ్రులకు అభిమానపాత్రమైన భాగవతము వ్రాయమన్న పోతన, కన్నడములో "గదగిన భారతము" రచించి బాలవ్యాసుడనే ప్రసిద్ధి పొందనున్న నారనప్ప ఈ నవలాకథనాటికి యువకులై ఉత్తమ కావ్యరచనకు ఎట్లా ఆదర్శపూరితు లవుతుండిరో ఇందులో చిత్రింపబడ్డది.

కవి, నాటికాకర్త, కథకుడు, సాహిత్య విమర్శకుడు, ధర్మదీక్షితుడు ఐన నోరి పరిణత వయస్సులో చారిత్రక నవలారచనకు పూనుకొని తన సర్వతోముఖ ప్రజ్ఞను ప్రదర్శించి దానికి సంపూర్ణ వికాసము కలిగించినాడని విమర్శకుల నిర్ణయము !

౭

భారత చరిత్రపరిధులను దాటి రచించిన ఆంధ్ర నవల తెన్నేటి సూరి "చెంఘిస్‌ఖాన్". ఆ నవల సర్వాంగ సుందరమై అడుగడుగునా గోబీ ఎడారి వాతావరణముతో అక్కడి జనముల తీవ్ర రాగద్వేషాలతో స్పందిస్తున్నది. ఎక్కా మంగోలుజాతి నాయకుడైన యాసుకై మెర్కిట్ తండాలోని వాళ్లనందరిని చంపి పెళ్లికూతురు యూలమను బలవంతముగా ఎత్తుకొని పోవడముతో కథ ప్రారంభిస్తుంది. యూలమ మొండిగా బహుకాలము యాసుకై భార్యగా ఉండడాన్ని ప్రతిఘటిస్తుంది. కాని సోదరుడైన కరాచర్ బోధ పాటించి చివరకు ఒప్పుకొని టెమూజిన్‌ను కంటుంది. యాసుకై మంగోలు తండాల నన్నిటిని ఐక్యము చేసి కెరెటు ప్రభువైన తుఘ్రులుఖానుకు సహాయము చేయగల స్థితికి వస్తాడు. యాసుకై అకస్మాత్తుగా మోసముపాలై శత్రునిచే హతుడవుతాడు. మళ్లీ మంగోలు తండాలు విచ్ఛిన్నము కాబోతున్న సమయంలో టెమూజిన్ ప్రభుత్వము చేబట్టుతాడు. యువకుడైనా నయానా భయానా ఆతడు సమర్థతతో గోబి తండాలను కూడగట్టుకొని, తుఘ్రుల్‌ఖాను, చీనా చక్రవర్తి, టర్కీ ప్రభువు చేసే కుట్రలన్నిటినీ ఎదురెత్తులతోనూ సాహసంతోనూ ఎదు

ర్కాని చెంఘిస్‌ఖాన్ (జగజ్జేత) అవుతాడు. ఆతని సోదరుడు చమూగా చదువు కొన్నవాడు. వీరుడైనా శాంతిప్రియుడు. అతన్ని నైమాన్ ప్రజలకు ప్రభువుగా టెమూజిన్ పంపుతాడు. అతడు ప్రజలచేత ఆయుధ విసర్జన చేయించి దేశాన్ని సస్యశ్యామలంగా తాత్కాలికంగా చేయగలుగుతాడు. బౌద్ధము, ఇస్లాము, క్రైస్తవము ప్రచారము చేసేవారిద్వారా శత్రురాజులు చేసిన ద్రోహమువల్ల చమూగా ప్రయత్నమంతా విఫలమైన ఘట్టముకూడా ఉత్కంఠ కలిగిస్తుంది. క్రీ. శ. 1206 లో వసంత ఋతువులో జరిగిన విజయోత్సవాలతో టెమూజన్ చెంఘిస్‌ఖాన్ 'జగజ్జేత' కావడంతో నవల పూర్తి అవుతుంది. ఈ నవల ఆనాటి అనాగరక సాహస వీర ప్రపంచాన్నే చిత్రించినా, ఈ కాలములో మనము ఎంత నాగరకులమని గర్విస్తున్నా జాతులను ఆడించే మూల మహా శక్తి "పశుశక్తే" అనిపిస్తుంది. నవల చదువుతున్నంతసేపూ ఆంధ్రభాషలో పుట్టి ప్రాణవంతమైన ఉత్తమ నవలలో దీనికి నిస్సందేహంగా స్థానమున్నది. ఈ ఒక్క నవలే వ్రాసి చిన్నతనములోనే తెన్నేటి సూరి గతించినందువల్ల నవలా ప్రపంచానికే తీరని లోటు కలిగింది.

ర

ఆంధ్రభాషలో ఇంకా ఇన్నో చారిత్రక నవలలు పుట్టినవి. వాటిలో శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ "ఆర్యచాణక్యుడు" ప్రశంసించక తప్పదు. అందులో చారిత్రక విషయాలెన్నో ఉన్నవి. కాని అది చరిత్ర అనిపిస్తుంది. కాని నవల అనిపించదు.

ఆంధ్ర చరిత్రకారులలో ప్రామాణికులైన డాక్టరు నేలటూరి వెంకట రమణయ్య రచించిన "పశ్చాత్తాపము" "ఛత్రగ్రాహి" "మధుమావతి" మొదలైనవి పెద్దకథ లనదగినవే కాని వాటికి నవల కుండవలసిన విస్తృతి లేదు. వారి కథలలో చరిత్ర-కల్పన ఎంత చక్కగా జోడింపవచ్చునో ఆదర్శ ప్రాయంగా ప్రదర్శించారు.

ఉన్నత పాఠశాలలలో పాఠ్యగ్రంథాలుగా ఉద్దేశింపబడి ఎన్నో చిన్న చారిత్రక నవలలు పుట్టినవి. అట్టివాటిలో శ్రీ వావిలాల సోమయాజులు రచించిన 'నాలంద'లో ఆనాటి ఆచార్య వైభవము చక్కగా పోషింపబడ్డది. అనవేమారెడ్డి

జైత్రయాత్రను వర్ణించిన "వసంతరాయలు" విహారి-శాతవాహన రచించినది కూడా గణ్యమైనవి. శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యుల "అభయ ప్రదానము" కూడా ఎన్నదగినది. ఇంకా ఎన్నో చిన్న నవల లున్నవి.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ నేటి ఆంధ్ర సారస్వత రంగములో సర్వతోముఖ ప్రతిభ ప్రకటించి ఎన్నో ఉత్తమ నవలలు వ్రాసిన తర్వాత ఈమధ్య "పురాణవైరి గ్రంథమాల" అనే పేరుతో 16 నవలలు వ్రాయ సంకల్పించి చాలా భాగము పూర్తిచేశారు. ఈ వ్యాసము ఉపక్రమణములో మన పురాణాదులలో ఎన్నో చారిత్రక విషయాలు నిక్షిప్తములై ఉన్నవనీ, రామాయణ మహాభారతాలే ఐతిహాసిక నవలలకు మార్గదర్శకముగా ఉండదగుననీ సూచించినాము. ఈ గ్రంథమాల నవలలో శ్రీ విశ్వనాథ ఒక అడుగు ముందుకు పోయినారు. పురాణ కథలే చరిత్రగా గ్రహించి శ్రీ కోటవారు భారతజాతి చరిత్ర రచించారు. అదే నిజమైన చరిత్ర అని శ్రీ విశ్వనాథ నిశ్చయము. పాశ్చాత్యుల దృష్టితో ప్రారంభింపబడిన భారత చరిత్ర అత్యంతము పునః పరిశీలన చేసి రచింపవలసి ఉన్నదనుటలో మాకెట్టి సందేహము లేదు. కాని శబ్దసామ్యాన్నిబట్టి హూణ మిహిరగులుడు హూణుడు కాడనే మిహిరకులుడైన ఆదర్శ భారతీయ వీరుడనేవరకు మా బుద్ధి ప్రస్తుతము ప్రసరింపలేకున్నది. ఈ గ్రంథమాల నవలలలో రచనలోను, కల్పనలోను తొందరపాటు విశృంఖలత్వము గోచరించడము సంతాపకరమైన విషయము. మధ్యమధ్య శ్రీ విశ్వనాథ మహాప్రతిభ తెరచాటునుండి గోచరిస్తూ ఉండకపోతే వాటిని పరిగణించవలసినది కాదు. ఏమైనా పురాణవైరి గ్రంథమాలలోని శ్రీ విశ్వనాథ నవలలు చారిత్రక నవలా రచయితలకు విమర్శకులకు ఒక సవాలువంటివని మాత్రము అంగీకరించక తప్పదు!

—o—

# శ్రీ గిడుగు రామమూర్తి

గత శతాబ్దములో ఆంధ్ర దేశములో అవతరించిన మహానుభావులలో శ్రీరామమూర్తి ఉత్తమకోటికి చెందినవారు. వారితో ఏ కొంచెము పరిచయము ఉన్న వారికైనా ఋషిప్రాయులైన వారి వ్యక్తిత్వము గోచరిస్తుంది. ప్రాచ్య విద్వాంసులకు పాశ్చాత్య పండితులకు ఉండే విద్వత్తూ సద్గుణరాశీ వారిలో ఏకమై మూర్తీభవించినవి; సమస్తమునూ అతిశయించిన వారి వ్యక్తిత్వములో పర్య వసించినవి.

వారు జీవితమంతా వివాదములతో గడిపినారు. విపక్షుల వాదములను దయాదాక్షిణ్యములు లేకుండా ఖండించినారు. తమ వాద బలానికి ఉపపత్తుల కొరకూ, ఎదిరి వాదానికి ఆపత్తుల కొరకూ వారెంతో పరిశ్రమ చేసి గ్రంథావ లోడనము చేసినారు. కాని ఎన్నడూ తమకు దోషముగా కనబడినదానిని సమర్థించుకోడానికి ప్రయత్నించి ఎరుగరు. ప్రతిపక్షుల వాదముల మీదనే కాని ఆ ప్రతిపక్షుల మీద వారికి ద్వేషము ఎన్నడూ ఉండేది కాదు. ఆ విషయములో వారికి ఆత్మశుద్ధి కలదు.

నాకు క్రొత్తగా మైనారిటీ వెళ్లిన 1919 సం. నుండి, వారు స్వస్థలమైన పర్లాకిమిడి ఉత్కళరాష్ట్రములో కలిసిపోగా సమస్తమూ వదిలి రాజమహేంద్ర వరము వలస వచ్చినంతవరకూ, ఎన్నోసారులు వారిని దర్శించి, వారితో ఎన్నోరోజులు గడిపినాను. నాకంటె 37 సం. లు పెద్దలు. మొదటి మారు దర్శించినపుడు నావయస్సుకు వారివయస్సు మూడురెట్లు. ఐనా ఎప్పుడూ గౌరవాదరాదులలో తమ సమానులతో వ్యవహరించినట్లే వ్యవహరించేవారు. వారికి మర్యాద స్వభావ సిద్ధమై పోయినది.

వారు సవరభాషకు శబ్దశాసనులు. వారు తమ ఆరోగ్యమునూ శబ్ద గ్రహణ శక్తినీ ఆభాషకే ధారపోసినారు.

కొంత వయస్సు ముదిరిన తర్వాతనే వారి దృష్టి ఆంధ్రభాష వైపు మళ్లినది. అది కూడా భాషావాదిగా కాక విద్యావేత్తగా అందులోకి దిగినారు. విద్యాబోధ ప్రశంసనీయముగా జరగవలె నంటే, పాఠ్య గ్రంథాలన్నీ శిష్ట వ్యవహారములో ఉన్న భాషలోనే గ్రంథాలన్నీ వ్రాయవలె నని వారు విశ్వసించి, దానికై వాదానికి పూనుకొన్నారు. అందులో వారి ప్రయత్నము ఎదురీత ఐనది. అప్పుడు వారు ఆంధ్ర గ్రంథముల వ్రాతప్రతుల పరిశోధనకు పూనుకొన్నారు. అది బహు సూక్ష్మమైన పరిశోధన.

వారి పరిశోధనల వల్ల తేలిన విషయాలు రెండు. మొదటిది ఆంధ్ర వ్యాకరణా లన్నీ లోపభూయిష్ఠములై అసమగ్రంగా ఉన్న వనేది; రెండవది ప్రాచీనాంధ్ర గ్రంథముల అచ్చు ప్రతులు విశ్వసనీయమైన పాఠాలు ఇయ్యలేదనేది. ఈ విషయములలో వారు చేసిన కృషి ఎంత అపారమైనదో మన మూహింపలేము. దాని నింతవరకూ పూర్తిగా ఆంధ్రులము ఉపయోగించుకోలేదు.

ఆంధ్రసాహిత్య పరిషత్తువారు శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు వేయడానికి సంకల్పించినప్పుడు ఏర్పాటు చేసిన కమిటీలో శ్రీరామమూర్తిగారిని వేసుకోలేదు. వారిని వేసుకొంటే వ్యావహారిక రూపాలు చొప్పిస్తారంటూ తమ భయము వెల్లడించి, ఏవైనా విశేష శబ్దాలకు వారు అర్థాదులు వ్రాసి ఇస్తే అంగీకరించి పారితోషిక మియ్యగల మని వారికి తెల్పినారట. దానికి వారిచ్చిన సమాధానసారమిది :

"మీరంతా కలసి నిఘంటువు సిద్ధము చేయండి. అందులో నేను చూపే దోషాలలో మీరు సమ్మతించిన వాటికి ఒక్కొక్క దానికి ఒక్కొక్క దమ్మిడీ వంతున నాకు పారితోషికమిస్తే చాలు! నాకు వేలారూపాయల ఆదాయం వస్తుంది!"

పై మాటలు నేను వారి ముఖతః విన్నవి. వారు ఎన్నడూ ప్రగల్భాలు పలికే అభ్యాస మున్నవారు కాదు. వారి భాషా పరిశ్రమ ఎంత అపారమైనదో అచ్చులో ఉన్న ఆంధ్ర గ్రంథాలు మాత్రమే చదివే మన ఆంధ్ర పండితుల భాషా జ్ఞానము ఎంత స్వల్పమైనదో, వారి మాటల వల్ల మనకు బోధపడుతుంది. అప్పుడు రూపాయికి 192 దమ్మిడీలు !

శ్రీరామమూర్తి గారి శతవార్షిక జయంతి జరుపుతున్న ఈ పుణ్య సమయంలో ఒక ముఖ్యమైన సూచన చేయదలచినాను. శ్రీరామమూర్తి గారు సేకరించిన వ్రాతప్రతులు, ప్రాచీన గ్రంథ పాఠాల మీద వారు వ్రాసి ఉంచిన నోట్సు విస్తారంగా ఇప్పటికీ భద్రముగా నవ్యసాహిత్య పరిషత్తు వారి వద్దనో, మరి ఎక్కడనో ఉన్నవని వినికిడి. వాటి నన్నిటినీ ఏ విధంగానైనా సరే ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడమీ వారు సేకరించి, భద్రపరచి, ఉపయోగించుకొని భాషాపరిశోధకులింకా ఉపయోగించుకొనే అవకాశము కల్పిస్తే, వారు చేసిన అపార కృషిఫలము ఎప్పటికైనా ఆంధ్రభాష అనుభవించ గలుగుతుంది; మనము చేసే వర్ధంతి అప్పుడే సార్థక మవుతుంది !

# తిక్కన సోమయాజి

ఆంధ్ర కవులందరిలో కవిత్రయమునకు విశేష గౌరవము కలదు. (విమర్శకుల రుచిభేదమును బట్టి ఒక్కొక్కరికి) వారిలో (నొక్కొక్కరియందు అభిమానముండినను) ఎక్కువమందికి పూజ్యతముడైన వాడు తిక్కనసోమయాజి. ఉభయకవిమిత్రు డను బిరుదముండుటచే సంస్కృతాంధ్రములలో కవిత్వము చెప్పెనని ఊహింపవలెను. (ఆయన సంస్కృత శ్లోకములు రెండే ఉపలభ్యమగుచున్నవి) కవిబ్రహ్మ యనునది బిరుదము కాకపోయినను ఆయన కవితా సామర్థ్యమును బట్టియు ఉదాత్త గుణములను బట్టియు (ఆయన జీవించి యుండగనో కొంచెము పిమ్మట నుండియో) ఆపేరు కవిలోకములో సిద్ధించినది.

తిక్కన 13వ శతాబ్ద ప్రథమ దశకములో జన్మించి ఆశతాబ్దములో ముప్పాతిక భాగము వరకైన జీవించి యుండెనని చెప్పవచ్చును. మంత్రి దండనాథు లయ్యును కవులును వైదిక నిష్ఠాగరిష్ఠులైన వారి వంశములో నాతడు జన్మించెను. ఆయన తాత భాస్కరమంత్రి సారకవితాభిరాముడైన గుంటూరి విభుడు; తండ్రి గుంటూరి విభుడగు కమ్మనదండ నాథుడు, సాంగ వేదవేది. తిక్కన స్వయముగా మనమసిద్ధి యొద్ద బహుకాలము ప్రధానమంత్రిగా నుండి స్వయముగా కవియై అనేక యాగములు చేసిన సోమయజి. ఈయన పెద తండ్రి కుమారుడగు మరియొక తిక్కన మనుమసిద్ధికి దండనాథుడై ఖడ్గతిక్కన యని ప్రసిద్ధుడయ్యెను.

కొట్టరువు తిక్కన యని కేతన చెప్పుటచేత కొట్టరువు అనునది ఇంటి పేరు కావచ్చును; కాక భాండాగారాధ్యక్షు డని ఉద్యోగము పేరైనను కావచ్చును; తిక్కనకు పుత్రులు కలిగినట్లు తోచదు. ఆయన వంశమును వర్ణించుచు దశ కుమార చరిత్రలో ఆయన పెదతండ్రులను మనుమలను, ఒకరి మునిమనుమనిని గూడ పేర్కొని తిక్కన కుమారుని పేర్కొన లేదు. తిక్కన మీది గౌరవముచే ఎన్నో కథలు లోకములో వ్యాపించినవి. కాని అవి నమ్మదగినవి కావు. ఆతడు ఆరువేల నియోగి బ్రాహ్మణుడనుటకును అధారము లేమియు లేవు. ఆయన తర్వాత

నూట యేబది సంవత్సరముల వరకు ఆ పేరుగల బ్రాహ్మణ శాఖ చీలి పోలేదు. (రెడ్డి రాజుల చరిత్రలో శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు వంటి చరిత్రవిదులు చివరి రెడ్డిరాజుల కాలములో గాని ఆంధ్ర బ్రాహ్మణులలో వైదిక నియోగ భేదము రాలేదని తెలిపిరి.) తిక్కనది గౌతమ గోత్రము; ఆపస్తంబ సూత్ర మగుటచే కృష్ణ యజుశ్శాఖా బ్రాహ్మణుడు.

సోమయాజి కేవలము కవిగాను మంత్రిగానే కాక అమల చరిత్రము ఉదాత్త గుణములచే సమకాలికులకు గూడ ప్రేమ గౌరవభాజనుడైనట్లు కేతన దశకుమారచరిత్రములోని అవతారిక ఆశ్వాసాద్యంత పద్యములు మారన తిక్కన ఎర్రయల వాక్యములు ఉద్ఘోషించుచున్నవి. "సుకవీంద్ర బృంద రక్షకుడు, చిత్త నిత్యస్థిత శివుడు, దశదిశా విశ్రాంతయశుడు, సకల విద్యావిచక్షణుడు, మనుమసిద్ధి సమస్తరాజ్య భాగ్య ధేరేయుడు, అభిరూప భావభవుడు, దీనజనతా నిధానము, అని వర్ణించి పెక్కూళ్లు అగ్రహారములుగా నిచ్చెనని చెప్పి తిక్కనామాత్యుని దివాణము వైభవము కేతన వర్ణించెను. ఆయన రూపము మనసిజ సుందరమై యుండెడి దని మరల మరల కేతన వర్ణించినది సత్యమై యుండవలెను. శిష్యుడైన మారన యాతనిని పరతత్త్వ బోధనుడనియు నవీన పరాశర సూను డనియు ఉగ్గడించుటచే ఎంత పూజ్య పురుషుడై యుండెనో ఊహింపవచ్చును.

తిక్కన రచనలలో నిర్వచనోత్తర రామాయణమును విరాటపర్వాదిగా స్వర్గారోహణ పర్వాంత మగు మహాభారతమును మాత్రమే ఇప్పు డుపలభ్యమగుచున్నవి. (ఇవిగాక విజయసేనము, కవిసార్వభౌమ ఛందస్సు, కృష్ణ శతకము అను గ్రంథములు కూడ రచించెనను జనశ్రుతి కలదు.)

నిర్వచనోత్తర రామాయణమును సోమయాజి కాకముందు మనుమసిద్ధికి మంత్రిగా నుండి వ్రాసి మనుమసిద్ధికే అంకిత మొనర్చెను. అప్పటికే నలుబది యేళ్లు దాటిన ప్రౌఢ వయస్కుడై యుండును. అవతారికలో తన కవితాశక్తిని గూర్చి కొంచెము గర్వముతో కూడిన ఆత్మవిశ్వాసము ఉద్ద్యోతిత మగుచున్నది. "'అమలోదాత్త మనీష నేనుభయ కావ్య ప్రౌఢి బాటించు శిల్పమునం బారగుడను, కళావిదుడను," అని చెప్పు కొనెను. సత్కవీంద్ర మార్గము చెప్పుచు దళములందు సౌరభ మిచ్చు గంధవహు చందముగా ప్రకటము చేయవలెనని, దుర్విటులవలె

రసభంగ మొనర్పరనియు, వళులు ప్రాసములు పులిమి పుచ్చరాదనియు, విశేషణ విశేష్యములకు లింగవచనములు భేదింపరాదనియు చెప్పెను. "జాత్యము కాని సంస్కృతము చొప్పింపను. వచనమెక్కడను చెప్పను. భిన్నాక్షరములను ప్రాసలలో ఉంచను. లలిత పదములతో అలతి యలతి తునియలుగా కాహల (బాకా) పట్టిన విధముగా రచన కావింతును!"—ఈ విధముగా నాతడు ప్రతిజ్ఞ చేసెను.

నిర్వచనోత్తర రామాయణములోని అవతారిక సూక్ష్మముగా పఠించిన వారికి అందులో ఉదహరించిన దోషములు చేయు కవులెవరో తిక్కన మనస్సులో ఉన్నట్లు స్పష్టమగును. వీరశైవ మతావేశముతో పరమతధ్వంసము కావింప నుద్యమించిన పాల్కురికి సోమనాథుని అతని యనుయాయులనే తిక్కన యందులో పరిహరించెనని భావించుట సమంజసము. "సూత ఉవాచ" వంటి వచనములు సంస్కృత పురాణములలో బహుళముగా నున్నవి. అవికూడ లేకుండ ద్విపదలలోనే గాక వ్రాయుట సాధ్యము కాదని డంబములు పలుకువారికి వాగ్బంధముగా తిక్కన యీ నిర్వచనకావ్యము శక్తివంతముగా నిర్వహించెను. ఈ నిర్వచనపద్ధతి భారతరచనలో తిక్కనయే వదలి వేసెను. దీనిని ప్రసిద్ధ కవులెవ్వరును పిమ్మట ననుసరింపలేదు.

రామాయణ మంతయు వదలి ఉత్తరరామాయణ మేల వ్రాసెను? ఇది గడ్డు ప్రశ్నయే! అది శుభకరము కాదని నేడున్న వాడుక ఆనాడులేదా? శ్రీచాగంటి శేషయ్య నిర్ధారించినట్లు సారకవితాభిరాముడైన తిక్కన తాత భాస్కరు దేమైన రామాయణము వ్రాసి యుండెనా? కాక రంగనాథరామాయణ మును పూరించుట కిపి వ్రాసెనా? నిశ్చయింపలేము. (భాస్కర రామాయణ ప్రతులు పరిశోధించి కర్తృత్వమును నిర్ధారణచేసినచో శ్రీశేషయ్య సూచనలు ఊహలు సిద్ధాంతములు కావచ్చును.)

నిర్వచనోత్తర రామాయణములో వాల్మీకి మూలమును ఎక్కువ భాగము సంక్షేపించుచు, కొంత వదులుచు,కొలదిగా స్వతంత్ర కల్పనలు చేయుచు రచన చేసెను. శ్రీరాముడు వైకుంఠము చేరుట ప్రాకృత మానవుల దృష్టిలో అమంగళముగా భాసించు నని ఆ భాగము వదలివేసి కుశలవులకు రాజవిద్యలు నేర్పుచు ధర్మపరిపాలనము చేయుచుండుటతో గ్రంథ సమాప్తి కావించెను.

శంబూక వధ సందర్భములో శ్రీరామునికి నిర్వేదము కలిగినట్లు భవభూతివలె వర్ణించినాడు. సీతారాముల వనవిహారము, జలక్రీడలు వర్ణించుటలో వాత్స్యాయనుని నాగరక వృత్తము ననుసరించి విశేష కల్పనలు చేసెను.

నిర్వచనోత్తర రామాయణములో తిక్కన పద్య రచనా విధానము స్థిర పడినది. ఐనను అందులో మనలను మరల మరల చదివించు ఘట్టములు తక్కువ. కంకంటి వారి ఉత్తరరామాయణము ఆంధ్రులకు ఎక్కువ అభిమానపాత్రమైనది.

ఈ తిక్కనామాత్యుడు కొంత కాలమునకు మారిపోయి సోమయాజి యయ్యెను. అతనికి వైదికధ్యాయిత అలవడెను; వైదిక ధర్మ నిష్ఠమగు వర్తనము నిర్వహింప సాగెను. మంత్రిపదవి నుండి విరమించి యుండవచ్చును. కేవల కర్మాచరణము వలననే సిద్ధింపని అంతర దృష్టి ఇప్పు డలవడినది. మనుమసిద్ధికి మంత్రియై నప్పుడు అతడు శిల్పమున పారగుడైన కళావిదుడు. ఇప్పుడు హరి హరబ్రహ్మము నాస్థానములోని కవియై మహా కవిత్వ దీక్షావిధి నొంది, ఇదియు ఆరాధనా విశేషమని మహా భారతాంధ్రీ కరణమున కుప క్రమించెను.

అతడు విరాట పర్వముతో నారంభించి స్వర్గారోహణముతో పూర్తి కావించెను. నేడెన్ని చింతివాదములు వచ్చుచున్నను, నన్నయ యంతవానికి విఘ్నము కలిగించిన యరణ్యపర్వము నాతడు వదలివేసె ననుట నిశ్చయము. దానిపేరే అరణ్యపర్వము. మహాభారత కోశమునే గృహస్థులు తమయిండ్లలో ఉంచుకొనుట అమంగళమని ఇతర రాష్ట్రవాసులు భావింతురు. మంగళాంతము చేసిన నిర్వచనోత్తర రామాయణము కృతి నందిన విమ్మటనే మనుమసిద్ధి రాజ్య భ్రష్టుడై యుండును. తిక్కన మహాభారతమును తన తండ్రికి అంకితము చేయ వలెనని తలంచుచుండగా తండ్రిని ముందుంచుకొని కలలో హరిహర నాథుడు ప్రత్యక్ష మయ్యెను.

నన్నయ పర్వానుక్రమణికలో హరివంశమును భవిష్యత్పర్వమును చెప్పినను, వెంటనే చెప్పిన పర్వ సంగ్రహములో అష్టాదశ పర్వములు స్వర్గా రోహణముతో పూర్తి చేసి యుండుటచే పర్వసంగ్రహము ననుసరించి తిక్కన హరివంశమును వదలివేసెను.

సోమయాజి స్వప్నవృత్తాంతమును నిర్భయముగా తరచి చూచినచో ఆయనలో నప్పుడు రెండు భిన్నధర్మములు మెలివేసి కొన్నట్లు భాసించును ఒకటి మంత్రిత్వవాసన. అందువల్లనే హరిహర నాథుడే యాచకుడై కృతి పతిత్వ 'మర్థించి' వచ్చినాడు. ఇక రెండవది మోక్ష సిద్ధి కాతడు చేయుచున్న సాధన. తాను బాల్య స్వభావుడట, ఉపలాలితుండగు డింభకుండు తన కొలంది యెరుంగక మహా పదార్థంబు వేడువిధంబున నతడు కోరుకున్నది జన్మాంతర దుఃఖములు తొలగిన బ్రహ్మానంద స్థితి; భగవంతుడు వెలుగు ప్రసాదించినాడు.

మహాభారత రచన సాగిన కొలది పైవానిలో రెండవ లక్షణము క్రమ వృద్ధినొంది తుదకు పరిణతి నందినది. నిర్వచనోత్తర రామాయణ రచనా కాల మున నాతడు లౌకిక కవి, భారత రచనా ప్రారంభమున భక్త కవి, తుదకు ఋషి కల్పుడైన కవి. మహాభారతము నాంధ్రీకరించుటలో తిక్కన యవ లంబించుచు వచ్చిన విధానము ఆయన క్రమక్రమ పరిణతిని స్ఫురింప జేయును.

విరాటోద్యోగ పర్వములలో మూలములో కంటె విపులీకరణ మెక్కువ యున్నది. కీచక ఘట్టములో కవి సామాన్యులకుండు శృంగారరస పక్షపాతమును ప్రదర్శించినాడు. ఆ తర్వాతి పద్యములలో సంక్షేపించుటే అంతకంత కెక్కువయి నది. అక్కడ కూడ మధ్యమధ్య విస్తరించుట లేకపోలేదు. ఆనుశాసనికములో సుదర్శనను అగ్నిభట్టారకుడు ప్రేమించు ఘట్టములో సహజము పవిత్రము నగు శృంగార వర్ణనము చేర్చి అగ్నిహోత్రుని యందు సోమయాజుల కుండెడి అభిమానము ప్రదర్శించినాడు.

ఉద్యోగ పర్వములో ముఖ్యముగా మూడు రాయబారము లున్నవి. మూలములో ద్రుపద పురోహితుని రాయబారము కౌరవులను చకితులను జేసి ఆ మహాత్ముని ఆర్షవాక్కుచే ముందుగానే శాపోపహతులను చేసినది. సంజయు నిది తీయని మాటలతో ఎదిరిని మోసగించుటకు చేసిన ప్రయత్నము. తిక్కన ఆంధ్రీకరణములో ద్రుపద పురోహితుని రాయబారము వ్యవహార జ్ఞానము లేని వారి కటువైన సత్యవాక్కున వలె భాసించుటచే ఆవెంటనే వచ్చెడి సంజయు రాయబారములో సంజయు డొకవంకను ధర్మరాజు మరొక వంకను ఒకరికొకరు చిక్కకుంత మాటలనేర్పు ప్రదర్శించుట వ్యతిరేకాన్వయములచే మరింతగా ఆక ర్షింప జేయును. ఇక శ్రీకృష్ణుని రాయబారములో మూలములో నున్న వైభవ మంతయు తిక్కన ఆంధ్రములో మనకు ప్రసాదించినాడు.

వ్యాసమహాభారతము కేవల పురాణమే కాక ఉత్తమ కావ్యమని ఆలంకారిక మూర్ధన్యుల చేత మెప్పు వడసిన మహాసంహిత. అందులో సృష్టించిన పాత్రలు వైవిధ్యమున భూతో న భవిష్యతి! ఉపాఖ్యాన మొక్కొక్కటి ఒక్కొక్క అనర్ఘమణి.

నాటకీయత వ్యాసుని విశిష్టత. పాత్రలు వారి సంభాషణలతో తమ స్వభావములు ప్రదర్శించుటే కాదు, నాటకములలో కొన్ని విశిష్ట సంఘటనలు అపూర్వమైన చమత్కారమునో, అద్భుతమునో, సంకటమునో, ఆనందమునో పుట్టించును. మహాభారత యుద్ధమునకు ముందు రుక్మి తన సేనతో ఉభయ పక్షముల వద్దకు వచ్చి పంపివేయబడుట- శ్రీకృష్ణ సారథ్యమునకు ప్రతిగా శల్యుని సారథిగా నుండుమని వేడగా నతడు 'శల్య సారథ్యము' నిర్వహించుట, గదా యుద్ధవేళకు సరిగా తీర్థయాత్రలకు పోయిన బలరాముడు దిగుట- ఉత్తంకుడు జలము రావలెనని శ్రీకృష్ణుని వరము వేడగా భగవానుడు కరుణించి అమృతమే పంపగా చండాల స్పర్శ కలిగిన దని ఉత్తంకు డది గ్రహింపకుండుట- ధర్మరాజు సశరీరముగా స్వర్గమునకు పోయి అక్కడ దుర్యోధనాదులు సద్గతియు తనపత్నీసోదరుల నరకవాసమును చూచి స్వర్గలోక ధర్మ సూక్ష్మము తెలియక గర్హించుట- అట్టి అద్భుత సంఘటనలు శత సహస్రాధికముగా మహాభారతములో నున్నవి.

యుద్ధ వర్ణనలలో వ్యాసుడు వ్యూహ రచనకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చును. రంగములోని పాత్రల వలెనే యుద్ధము చేయుచున్న వీరులును మనకు దర్శన మిత్తురు.

తిక్కన సోమయాజి బహుకాలమననముచే వ్యాసహృదయమును బాగుగా నవగాహన మొనర్చుకొనెను. వ్యాసుని పాత్రోన్మీలన ప్రతిభ, నాటకీయత, యుద్ధాది వర్ణనలలో ప్రజ్ఞ- ఇవియన్నియు స్వాయత్త మొనర్చుకొని ఎన్నో ఘట్టములలో ఆ గుణములను ఒత్తియు, ఊది పలికియు, సద్దియు, బలవత్తరములుగను ఉజ్జ్వలములుగను కనుపడునట్లు భాసింప జేసినాడు.

ఇంతేకాదు. మూలగ్రంథములో పలువురు చేతులు మార్చుటచే పునరుక్తులు, అసందర్భములు, అనౌచిత్యములు, గ్రంథస్ఖాలిత్యములు మనను దొరకుచున్న ప్రతులలో ఎన్నో కనుపించుచున్నవి. సోమయాజి భక్తి భావముతో మూలమును

మథించి వ్యాస హృదయమును గ్రహించుచు ఆ దోషములు పరిహరించుచు రచన చేసెను.

ఉత్తరాభిమన్యుల వివాహ ఘట్టము పెంచి ఆంధ్రదేశ సంప్రదాయములతో వివాహము జరిగినట్లు వర్ణించినాడు. ఇట్లే ఎన్నో తావులలో ఆంధ్రత్వము ముద్రవేసి మనకు మహాభారతమును సన్నిహితము చేసినాడు.

సోమయాజి సంస్కృత పదములు తక్కువగా వాడునను ప్రతీతి పూర్ణసత్యము కాదు. వీరమో, రౌద్రమో, ఉదాత్త గంభీర వర్ణనమో వచ్చిన పట్టులలో ఒరలోనుండి పెరికిన ఖడ్గము వలె జటిల సంస్కృత పదసమాస ఘటితమైన శార్దూలమో, మత్తేభమో దూసుకొని వచ్చును. ఆయన రచనలో దేశ్య పదములకు సంస్కృత గౌరవము పొసగినది.

వాల్మీకి కాళిదాసుల ననుసరించిన నన్నయ శబ్దములు అర్థ గంభీరములై, సంగీతము వలె ప్రసన్న మధురములై హృదయమునకు హత్తుకొనును. తిక్కన పదముల కూర్పులో బిగియుండి వ్యంగ్య వైభవముతో నొప్పారును. పదములు తేటగా నున్నను అన్వయము ప్రయత్న సాధ్యముగా నుండును. అన్వయము సాధించిన పిమ్మట అర్థ సౌందర్యము బలవత్తరముగా స్ఫురించును.

ఇంత పెద్ద గ్రంథము వ్రాసినను విసుగు కలిగింప కుండుటకు సోమయాజి రచనా వైవిధ్యమే ప్రధాన కారణము. శ్రీనాథ పోతనల సీసములకు వృత్తములకు కందములకు ఒరవళ్లని చూపదగిన పద్యములెన్నో ఆయన వ్రాసెను. పింగళి సూరన వేమన మొదలగువారెందరో ఆంధ్ర కవులు ఆయన లక్షణము లొక్కొక్కటి అనుకరించిరి. కాని ఆయన రచనను సంపూర్ణముగా అనుకరించ గలిగిన ఆంధ్రకవి పుట్ట లేదు. అందువల్లనే ప్రబంధ పరమేశ్వరుడు 'తన కావించిన సృష్టి తక్కొరుల చేతం గాదునా' అని ఎన్నడో పరిష్కారము చేసినాడు !



# తెలంగాణములో సాహిత్య చైతన్యము

౧

ఒక్కొక్కకాలములో ఒక్కొక్క ప్రదేశములో ఒక్కొక్కదానిలో నూతనోత్సాహము కలుగుతుంది. అప్పుడు ఆ ప్రదేశములో ఆ ఉత్సాహము ప్రతిఫలించే పుణ్యమూర్తులు పుట్టుకువస్తారు. లేకపోతే దూరదేశాలనుంచి ఆ ప్రదేశం చేరుకుంటారు.

ఆంధ్ర సాహిత్యంలో అట్లాంటి చైతన్యము పదకొండవ శతాబ్దంలో వేంగీ మండలంలో పుట్టింది. నన్నయభట్టాది కవులు రాజమహేంద్రవరములో మహాభారతమువంటి గ్రంథాలు ప్రారంభించారు. అప్పుడక్కడికి వెదుక్కుంటూ కర్ణాటక భూములనుంచి నారాయణభట్టు వచ్చి చేరుకున్నాడు.

మళ్ళీ అటువంటి చైతన్యము పదమూడవ శతాబ్ద మధ్యభాగములో నెల్లూరులో పుట్టింది. తిక్కన సోమయాజి, మారనవంటి కవులు అక్కడ వెలసినారు. వెదకుకుంటూ వెల్లిరాలు అనే అగ్రము నుంచి కేతన అక్కడికి చేరుకున్నాడు.

మళ్ళీ అటువంటి చైతన్యపుపోటు పదునాల్గవ శతాబ్దము మొదటి భాగములో అద్దంకిలో పొంగింది. ఎఱ్ఱయ వెలసినాడు. దుగ్గకవి ఇత్యాదులు చేరుకున్నారు.

మళ్ళీ చైతన్యము పదునాల్గవ శతాబ్దపు చివరిభాగమున ఒకవంక కొండవీటిలోను మరియొకవంక రాజు(చ)కొండలోను, ఇంకొకవంక రాజమహేంద్రవరంలోను వెలసినది. శ్రీనాథుడు, పోతనవంటి ఉత్తమకవులు ఉద్బుద్ధమైనారు.

పదిహేనవ శతాబ్దము చివరి భాగములో సాహిత్య చైతన్యము శ్రీవిద్యానగరములో విపరీతముగా వెల్లివిరిసింది. అక్కడి కవులెవరో, దూరదేశాలనుంచి

చేరుకున్నవారెవరో, గుర్తించటానికి వీలులేనంతగా అన్నిదిక్కులనుంచి కవులు, పండితులు శ్రీవిద్యానగరము చేరుకున్నారు. పెద్దన్న, తిమ్మన్న, మల్లయ్య, ఇత్యాది కవులు కావ్యాలు వ్రాసినారు. అప్పుడు పుట్టిన పొంగు కొంతకాలము నిశ్చలంగా నిలపబడి ఉన్నది. తళ్ళికోట యుద్ధములో విజయనగర రాజులుండిన ఈ సాహిత్యోత్సాహము విజయనగర ప్రభువులు, వారి సామంతులు, వెళ్ళిన దేశదేశాలకు పాకిపోయింది. చంద్రగిరిలో రామరాజ భూషణుడు, వేద్రాద్రిలో రామకృష్ణుడు ఇంకను ఎందరెందరో కవులు వెలసినారు. పింగళి సూరన వరకు ఆ తరగ అట్లాగే సాగింది.

శతాబ్దములో చిత్రమేమోగాని ఈమాటు ఆంధ్రసాహిత్యములో నవ చైతన్యము పొంగువారినది ఆంధ్రభూమిలో కాదు. తమిళుల నడిగడ్డలైన మధురలో, తంజావురములో ఆంధ్ర సాహిత్యము ఉద్బుద్ధమైనది. చామకూర వేంకటకవి, రఘునాథ భూపాలుడు, ముద్దుపళని ఇత్యాదులైన కవులు, కవయిత్రులు, తమిళదేశ మధ్యములో మధురాంధ్ర కవితా గానమును సాగించినారు. ఆంధ్ర సాహిత్యచరిత్రలోకెల్ల చిత్రమైన ఘట్టమిది. ఈ విధముగా తెలుగు సాహిత్యములో చైతన్యము ఒకొక్కకాలములో ఒకొక్కచోట తీవ్రముగా సాగి, ప్రాచీనాంధ్ర సాహిత్య స్రవంతిని ఉపనదులవలె పుష్టి గూర్చినది.

౨

ఇంతలో ఆధునిక యుగము వచ్చినది. రాజధాని చెన్నపట్టణమైనందున ఈమారక్కడ నూతనోత్సాహము వ్యక్తమైనది. తెలుగుదేశము అన్నిమూలల నుండి తెలుగు విద్వాంసులు, కవులు, రచయితలు చెన్నపట్టణము చేరుకొన్నారు. చిన్నయసూరి బాలవ్యాకరణము, నీతిచంద్రిక వచ్చినవి. గురులింగశాస్త్రి పురాణములు, భారత రామాయణములు, జ్యోతిషము, ధర్మశాస్త్రము, వాస్తు, ఇత్యాది శాస్త్రగ్రంథములుకూడ తెలుగు చేసినారు. వీరేశలింగము, వెంకటరత్నం పంతులు, వెంకటరాయశాస్త్రి మొదలగు కవిపండితులు చెన్నపట్టణము చేరి రచనలు సాగించినారు. అదే సమయములో రాజమహేంద్రవరములోను, విజయనగరములోను, ఉద్దండపండితులు, కవులు వెలసి సాహిత్య స్రవంతిని పెంపొందించినారు.

పందొమ్మిది వందల పన్నెండు వచ్చినది. గుంటూరులో ఒక పొంగు వచ్చినది. కొప్పరపు సోదరకవులు ఆశుకవిత్వ ప్రదర్శనము సాగించినారు. గోదావరి తీరములనుండి తిరుపతి వెంకటేశ్వరులు గుంటూరు చేరినారు. కవులకు ఘర్షణ జరిగినది. ఏమైననేమి తెలుగుదేశములోని కవులందరకు ఇటువారికి, ఆటువారికి గుంటూరు యాత్రాస్థలమైనది. అక్కడ ఆ కాలములో ఉన్న సాహిత్యోత్సాహము అద్వితీయమైనది. గుంటూరు చేరుకొన్న కవులు దేశమంతట శతావధానము, ఆశుకవిత్వ ప్రదర్శనము చేస్తూ దేశమంతటా వ్యాపించారు.

అట్టి శతావధానములు, ఆశుకవిత్వములు, చేసినవారిలోనుంచే ఆధునిక కవులకు మార్గదర్శకుడైన రాయప్రోలు సుబ్బారావు ఉద్బుద్ధమైనాడు. అభినవ కవితామండలి పేరుతో తృణకంకణము, తెలుగుతోట ఇత్యాది కావ్యములు ప్రచురించి ఆంధ్ర సాహిత్యములో నవ్యయుగము ప్రారంభించాడు.

ఆ తరువాత కొద్దికాలానికే గుంటూరులో సాహితీసమితి పుట్టినది. శ్రీ శివశంకరశాస్త్రి దేశములోని నవ్యసాహిత్య నిర్మాతలను ఏకము చేసినాడు. ఈమాటు కవులకు చిత్రకారులుకూడ తోడైనారు. ఈ సమితి సభ్యుల ప్రోత్సాహముతో తెనాలిలో రామవిలాససభ ప్రారంభమై నాటకరంగములో కూడ క్రొత్తమార్పు ప్రవేశపెట్టింది. సాహితీసమితి నేటికిని ప్రసిద్ధులై నవ్యకవిత్వములో అగ్రగణ్యులనిపించుకున్న చాలమందిని ఆకర్షించినది. వారిలో ఎన్నదగినవారు దేవులపల్లి కృష్ణశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, నండూరి సుబ్బారావు, వేదుల సత్యనారాయణశాస్త్రి, చింతా దీక్షితులు, మొక్కపాటి నరసింహశాస్త్రి, మునిమాణిక్యం నరసింహారావు ఇత్యాదులు.

నవ్యసాహిత్యములో చిన్నకథలు, ఏకాంక నాటికలు, వ్యాసములు, ఖండకావ్యములు మాత్రమే గాక పద్యనాటికలు, గేయనాటికలు, నాటకములు, నవలలును, రామాయణకల్పవృక్షము వంటి మహాకావ్యములును నిర్మించువారిని ఆకర్షించి, దేశము నాలుగుమూలల నవ్యమార్గములు విరజిమ్మినది. కొంత కాలము గడచినది. సాహిత్యములోనికి రాజకీయప్రచారకులు ప్రవేశించినారు. వారి చేతులలో సాహిత్యపుష్పము నలిగిపోసాగినది. మరల ఎక్కడ సాహిత్య వికాసము కలుగునా అని ఆశతో మాబోంట్లము నలుదిక్కుల దృష్టుల ప్రసరింప

జేసినాము. రాయలసీమ కొంత ఆశ కొలిపినది. గడియారము శేషశాస్త్రి, పుట్ట
పర్తి నారాయణాచార్యులు కొత్త జీవము కలిగించినారు.

కాని, వారు స్వయముగా సత్కవులేగాని ఆ ప్రాంతములో చైతన్య వాతా
వరణము వలన కలిగినవారు కారు. రాజధాని అందోళనతో అక్కడ ఆశ
గొల్పిన సాహిత్యచైతన్యము ప్రస్తుతము అంతరించినది.

౩

ఇప్పటికి పాతిక సంవత్సరములనుండి సాహిత్యరంగములో తెలంగా
ణము పేరు వినపడుతున్నది. ముందు ప్రతాపరెడ్డిపేరు గట్టిగా వినవచ్చినది.
అక్కడ తెలుగుసారస్వతమునకు సంఘములు పెట్టుకొనుటే నేరము. తెలుగు
భాషలో ఉపన్యసించుటకు, సభలు చేయుటకే ప్రభుత్వానుమతి కావలయును.
తెలుగు మాట్లాడువారు అనాగరకులుగా కూడ ఎంచబడుచుండిరి. తెలుగుపత్రి
కలు పెట్టినవారిని ప్రభుత్వము అనుమానదృష్టితో చూస్తూ ఉండేది. తెలుగు
పుస్తకాలు ప్రచురించేందుకు అవకాశాలే బహుస్వల్పము. ముప్పాతికమంది
తెలుగువాళ్లున్న హైదరాబాద్ రాష్ట్రములో తెలుగుభాష పడ్డ అగచాట్లు వర్ణింప
లేము. అయితే అట్లా అగచాట్లు పడుతున్నసంగతే బ్రిటిషు ఆంధ్రానికి తెలియ
నిచ్చేవారు కారు. తెలియదు. అయితే ధైర్యంచేసి కష్టనష్టాలకు వెరవక ఆ పరి
స్థితులు గట్టిగా గొంతెత్తి అరిచి, ఆంధ్రలో వినపడేటట్టు ముందు చాట సాహ
సించినవాడు ప్రతాపరెడ్డి. ఆ కేకలు విని బ్రిటిషుఆంధ్రం "అయ్యో" అన్నది.
కాని అప్పటి రాజకీయపరిస్థితులలో ఏమి చేసేందుకు వీలులేకపోయింది. ఆ కేక
అరణ్యరోదనంగానే ఉండిపోయింది.

ఇంతలో పోలీసుయాక్షన్ వచ్చింది. ఒక్కసారిగా కట్టలు తెంచుకొన్న
గోదావరివలె తెలంగాణంలో సాహిత్యచైతన్యము పెల్లుబికినది. ఇన్నాళ్లు అణచి
పెట్టి ఉంచిన ఉత్సాహమంతా తెలంగాణంలో ఒక్కసారిగా విజృంభించింది.
"అయ్యో ! మన కిన్నాళ్ళుగా మన భాషలో రచనలు చేసేందుకు, ఉపన్యాసా
లిచ్చేందుకు వీలు లేకపోయిందే ! అందువల్ల మనకు అభ్యాసము తగ్గిపోయిందే,
వెనకపడి ఉన్నామే" అనే ఆదుర్దా బయలుదేరింది.

నిజంగా తెలంగాణంలో తెలుగుభాష వెనకబడిలేదు. కొంచెము వేరుగా ఉన్నది. అందులో అందచందాలు ఇతరభాగాలకు వ్యక్తం కాకుండా ఉన్నవి. అజ్ఞాతవాసంలోనించి అప్పుడే విడివడివచ్చిన విజయుని విజృంభణంగా ఉన్నది. పూజ్యులయిన ఇతరప్రాంతముల కవులయందు, రచయితలయందు వారి కభిమాన మున్నది ; గౌరవ మున్నది. ద్వేష మేమాత్రము లేదు. కాని, మాకు తెలుగువాక్కుమీద అభిమాన మున్నది. మా తీరుతెన్నులుగూడ వినండి - అని వారు ఉద్ఘోషించుచున్నారు.

ఈ ఉత్సాహము ఏదో కొద్దిమంది రచయితలు కాదలచినవారిలోమాత్రమే కాదు ఉన్నది, రచయితలలోను, రచించుచున్నవారిలోను, రచింపబోవుచున్న వారిలోను, రచనకు పూనుకొన తలపెట్టినవారిలోకూడ ఈ ఉత్సాహము కలదు. అబాలగోపాలములో ఈ ఉత్సాహమున్నది.

మధ్యమధ్య హైదరాబాదులో సాహిత్యసభలు జరుగుచుండును. ఈమధ్య అక్కడ మహాభారతమునకు సంబంధించిన మహాసభలు జరిగినవి. దేశము నలుమూలల నుండి కవులు, పండితులు విచ్చేసి మహోపన్యాసము లిచ్చినారు. అవి వినుటకు జనములు పొర్లబడి వచ్చినారు. కాని తెలంగాణములో పొంగుతున్న సాహిత్యోత్సాహము అక్కడగాదు చూడదగినది. హైదరాబాదు, సికింద్రాబాదువంటి మహా పట్టణములలో ఉత్సాహము కనపడినంత మాత్రముచేత రాష్ట్రమంతట అంతటి ఉత్సాహము ఉన్నదని తలచుట పొరపాటు కాగలదు. మహా పట్టణములలో అట్టిది సర్వసామాన్యము. కాబట్టి అక్కడకాదు చూడదగినది.



తెలంగాణములో కెల్ల కరీంనగర్ జిల్లా చాల వెనకబడియున్న జిల్లాయని ప్రసిద్ధి. ఈ మధ్య కరీంనగరమునకు సుమారు పదమూడుమైళ్ళ దూరములో ఉన్న సిరిసిల్లలో జరిగిన తెలంగాణారచయితల సంఘముయొక్క సిరిసిల్లా తాలూకా సంఘవార్షికోత్సవము చూచే భాగ్యము నాకు కలిగింది. అది ఒక తాలూకా కేంద్రమే. తాలూకారచయితల సభయే. అయితే కాకినాడలో గత సంవత్సరము జరిగిన ఆంధ్రసాహిత్య పరిషత్సభవంటి మహాసభలో నాకు కనబడిన ఉత్సాహముకంటె నూరురెట్లు ఉత్సాహము ఈ సభలో కనిపించింది.

ఈ ఉత్సాహము అందులో పాల్గొన్న కవులదే కాదు. కవుల సంఖ్య తక్కువని కాదు. గణములు, యతిప్రాసములు సరిగా రాని విద్యార్థులవద్దనుండి సంస్కారులైన నారాయణరెడ్డి వంటివారును, పండితకవులయిన వానమామలై వరదాచార్యులు వరకును కావ్యగానములో పాల్గొన్నారు. కవులకు తమ కావ్యములు వినిపించటంలో విశేషము లేదు. చదవమంటే సిగ్గుపడేవాళ్ళదగ్గరనుంచి, సందు దొరికితేచాలు తమ వ్రాతలు వినిపించి వాటిని గూర్చి మాట్లాడి విసిగించి ప్రాణం తీసేవాళ్ళదాకా అందరికికూడ తమ కావ్యాలు ఇతరులు వినాలని, విని ఆనందించాలని ఉంటుంది. వినకపోయినా, విని బాగుందలేదన్నా చిన్నబుచ్చుకోవటం దగ్గరనుంచి, తిట్లలోకి దిగేవరకు రకరకాల ప్రవర్తన కవులకు సామాన్యమే. అయితే నేను గమనించినది అక్కడ కవుల ఉత్సాహమే కాదు. సభలకు వచ్చిన వారందరిలోనూ ఆ ఉత్సాహ మున్నది. ఆ వచ్చినది, ఊళ్ళో చిన్నలే కాదు, పెద్దలే కాదు. చుట్టుపట్టుల నుండి కూడ ఎందరో వచ్చిరి. కరీంనగరమునుండి సారస్వతజ్యోతి సంపాదకులు వచ్చిరి. మా పట్టణములో తాళపత్రగ్రంథములు ఎన్నో ఉన్నవి, చూచుకొమ్మని మరికొందరు వచ్చిరి. ఆ వచ్చినవారందరు వేడుక చూచుటకు వచ్చినవారివలె ప్రవర్తించలేదు. వింతమృగములను చూడవచ్చినవారివలెకూడ చూసి పోలేదు. సభ జరుగునని ప్రచురించినవేళకు ముందుగానే అందరూ సమావేశమైనారు. సభ కొంచెము ఆలస్యముగా మొదలుపెట్టవలసి వచ్చినను, గోలపెట్టకుండ, శాంతముగా, మర్యాదగా వేచి ఉన్నారు. సభ మొదలుపెట్టినతర్వాత సభ వదలిపోవుటకు తొందర పడలేదు. సభ అయ్యేవరకు మొదట వచ్చినవారిలో ముప్పాతికమంది చివరిదాకా ఉన్నారు. మొదటిసభ నాలుగున్నరకు ప్రారంభించవలసినది. ఆరింటికి ప్రారంభమైనది. ఎనిమిదిన్నరకు ముగిసినది. అయినా వందనసమర్పణము పూర్తిగా చెప్పటమైనదాకా సభ్యులు కదలలేదు.

మళ్ళీ ఒక గంటలో కవితాగోష్ఠి జరుగునని చెప్పినందున తొమ్మిదిన్నరకే జనమంతా హాజరైనారు. లౌడ్‌స్పీకర్లు కొంత మరమ్మత్తు చేయుటకు ఆలస్యమై పదిన్నరవరకు కావ్యగోష్ఠి ప్రారంభము కాలేదు. రాత్రి ఒంటిగంట ముప్పావు వరకు సాగింది. సభ్యులు అంతసేపూ శ్రద్ధగా విన్నారు. కొన్ని ఉత్తమ కావ్యభాగాలు ఉత్సాహముతో విన్నారు. చిన్నపిల్లలు వారి ప్రథమ ప్రయత్నాలు వినిపించినా వారిని తొందరపెట్టక ఓర్పుతో విన్నారు.

కారులో నూట ఎనభై మైళ్ళు ప్రయాణము చేసివచ్చిన నేను మర్యాద కొఱకు పది పదిహేను నిమిషాలు ఉండి వద్దామని వెళ్ళాను. వస్తున్న వార్ధక్యముచేత పటుత్వము తగ్గుతున్న నా దేహము ప్రయాణపుబడలికతో నిలవలేకున్నది. అయినా ఆ సభప్రవర్తన నన్ను ముగ్ధుణ్ణి చేసింది. చివరివరకు కదలకుండా ఉండగలిగేందుకు నాకు ఓపిక వచ్చింది.

ఆ సభకు వానమామలై వరదాచార్యులుగారు అధ్యక్షులు. వారికి జబ్బుచేసి ఐదు పక్క ఎముకలు తీసివేసినారట. అయినా వారే అంతరాత్రివరకు అధ్యక్షత వహించినారు. తుదకు వారు రచించుచున్న పోతన చరిత్రము నుండి మనోజ్ఞమగు ఘట్టములు వినిపించినారు. శ్రమవల్ల వారికి జబ్బు కలుగునేమో అని ఆప్తులు సలహా ఇచ్చినారు. నేను సభలో ఉండుట వారికి మరింత ఉత్సాహము కలిగించిన దనుటకు సందేహము లేదు.

—o—

# శ్రీ దేవీ భాగవతము

[విజ్ఞాన సర్వస్వము : ఆరవ సంపుటము-తెలుగుభాషా సమితి 1961
అష్టాదశపురాణములు - పేజి 535/-537 ]

శ్రీ దేవీ భాగవతము సంస్కృతములో 12 స్కంధములు 18 వేల గ్రంథసంఖ్య కల శ్లోకాత్మకమైన సంహిత. వేదవ్యాసప్రోక్తములని ప్రసిద్ధికల అష్టాదశ మహాపురాణములలో ఇది ఒకటి. విష్ణుమాహాత్మ్యము వర్ణించు భాగవతము కూడ ఇంతే పరిమితి కలదే ఐనను దానిశైలి కావ్యశైలి. దీనిది పురాణ శైలి అగుటచేతను మరి ఎన్నో కారణములచేతను శ్రీ దేవీభాగవతమే మహాపురాణము అనుటకు ఎక్కువ అవకాశము ఉన్నది. కాని, ఈ విషయము బహుకాలమునుండి వివాదగ్రస్తమై ఉన్నది.

తక్కిన పురాణములవలెనే శౌనకాదులు కోరగా సూతుడు ఇది చెప్పినాడు. తన తండ్రి పరీక్షిత్తు ముని నవమానించి, మునికుమారుని శాపము పొంది మృత్యువు తప్పదని ఎరిగియు, స్నానదానాదు లాచరింపక, బహు విధముల ఆత్మరక్షణోపాయములలోనే నిమగ్నుడై తుదకు సర్పదష్టుడై మేడపై అంతరిక్షమరణము పొందినందున దుర్గతి పొంది బాధపడుచున్నాడని జనమేజయుడు వ్యాసమహర్షివలన విని దుఃఖించి తన తండ్రికి సద్గతి కలిగించు ఉపాయము తెలుపుమని ప్రార్థించెను. దానికి సాధనము శ్రీదేవీధ్యానపూజాదులు చేసి శ్రీ దేవీమఖము చేయుటే అని వ్యాసుడు తెలిపి శ్రీ దేవీస్వరూప మాహాత్మ్యముల వర్ణించు కథలు చెప్పి శ్రీ దేవీమఖము చేయించెను. దానికి ఫలితముగా పరీక్షిత్తు దివ్యవిమానముమీద స్వర్గమునకు పోవుచుండుట చూచితినని నారదుడు చెప్పగా జనమేజయుడు కృతార్థుడ నైతినని ఆనందించెను. (స్కం. 12. అ. 13) తర్వాతిదగు చివరి అధ్యాయములో సూతుడు శ్రీ దేవీభాగవత మాహాత్మ్యము తెల్పి,

"సచ్చిదానందరూపాం తాం గాయత్రీప్రతిపాదితామ్
నమామి హ్రీమయీం దేవీం ధియో యో నః ప్రచోదయాత్"

అని విరమింపగా శౌనకాదు లాతని సమ్మానించినట్లున్నది.

ప్రథమస్కంధములో మధుకైటభ వధ, హయగ్రీవావతారము, శుక జనక సంవాదము ప్రధాన ఘట్టములు. రెండవ స్కంధములో వ్యాసోత్పత్తి మొదలు పాండవుల మహాప్రస్థానాంతమైన భారతకథయు, పరీక్షిన్మరణము, జనమేజయుని రాజ్య ప్రాప్తియు ఉన్నవి. తృతీయస్కంధములో దేవీభాగవతావతరణము, త్రిమూర్తులు భువనేశ్వరిని దర్శించుట, శశికళా సుదర్శనుల వివాహము కలవు. నాల్గవదానిలో నరనారాయణులతో ప్రహ్లాదుని యుద్ధము, కృష్ణలీలాంతమైన శ్రీకృష్ణకథ ఉన్నవి. పంచమస్కంధమున కథాప్రాధాన్యము కలదు. ఇందులో మహిషాసురమర్దనము, శుంభనిశుంభవధ ప్రధానఘట్టములు. ఆరవదానిలో వృత్రాసుర వధ. నహుషుని పదచ్యుతి, భార్గవులకు, హైహయులకు వైరము, నారదుడు స్త్రీయై వివాహమాడుట మొదలగునవి కలవు. సప్తమస్కంధము సుకన్యావివాహము, త్రిశంకు హరిశ్చంద్రుల కథలు కలిగి బ్రహ్మవిద్యా ప్రతిపాదకమైన శ్రీ దేవీగీతతో ముగియును. అష్టమస్కంధములో జ్యోతిర్మండల తద్గమనములు, నరకాది లోకవర్ణనము ఉన్నవి. నవమస్కంధము సావిత్రి, మహాలక్ష్మి- స్వాహా, స్వధ, దక్షిణ, షష్ఠీదేవి, మంగళచండి, మనస, సురభి, రాధామర్గ ఇత్యాది శక్తుల ఉపాఖ్యానములకు, పూజావిధానములకు మంత్రవిశేషములతో కూడిన ఉపాసనలకు నిధి. దశమస్కంధములో వింధ్యాచల స్తంభనము, మనువుల కథలు కలవు. ఏకాదశస్కంధములో నిద్ర లేచినది మొదలు నిదురించువరకు నిత్యము చేయవలసిన స్నానసంధ్యలు, బ్రహ్మయజ్ఞ వైశ్వదేవాదికము, పునశ్చరణాది విశేష విధానములు వర్ణింపబడినవి.

ద్వాదశస్కంధము గాయత్రి ఉపాసనతో ఆరంభించి, మంత్రదీక్షా విధానము ఉపదేశించి కేనోపనిషత్తు ననుసరించి ఉమాహైమవతీ ప్రాదుర్భావము వర్ణించి, గాయత్రీ మాహాత్మ్యము తెలుపు గౌతమకథ చెప్పి, మకుటాయమానమైన మణిద్వీపవర్ణనము చేసి, పరీక్షిత్తు స్వర్గము చేరుటను తెల్పి పురాణీయసంహారముతో ముగియుచున్నది. అన్ని స్కంధములలోను మధ్యమధ్య వేదసూక్తముల వంటి శ్రీ దేవీ స్తవములు ఎన్నో కలవు. దేవీపూజావిధానము మాహాత్మ్య వర్ణనము పునః పునరావృత్తము లగుచుండును.

ప్రళయసముద్రములో నారాయణుడు వటపత్రశాయియై ఉండి ఆలోచించుచుండగా "సర్వం ఖల్విద మేవాహం నాన్య దస్తి సనాతనమ్" అను

శ్లోకార్థము వినబడినది. అదే మననము చేయగా శ్రీ దేవీభాగవతము భాసించిన దట. "నారాయణ సమారంభాం" ఇత్యాదిగా గురుపరంపరను స్మరించు శ్రీ శృంగేరీ విరూపాక్షాది శంకరపీఠములలో ఈ శ్లోకార్థము ఇప్పటికిని నిత్యము ధ్యానశ్లోకములలో ఉన్నది. ఇది ఔపనిషదులను ప్రసిద్ధనామములు కల శాంకర మతానుయాయులకు, స్మార్తుల ఉపాసనకు ప్రమాణభూతమైన గ్రంథము. ఇది శాక్తేయమత సంబంధమైనది కాదు.

ఇందులో గాయత్రి ఉపాసనము ముఖ్యముగా ఉపదేశింపబడినది. వేదోక్తకర్మలు పుష్కలముగా ఆచరించి సర్వకర్మ సన్న్యాసమునకు పూర్ణాధికారము సంపాదించుటకు ఉత్తమ సాధనముగా, భువనేశ్వరి అను పేరుతో మాయా బీజము విశేషముగా ఉపదేశింపబడినది. కర్మిష్ఠులకు సన్న్యాసులకు శ్రీ శంకరులు ఉద్ఘాటించిన వ్యవస్థ ఇందులో స్పష్టముగా ఉండును. ఈ పురాణము సులభ శైలిలోనే ఉన్నను, ఉపనిషదర్థములు తెలిసికొన్నవారికే కాని, కొన్ని పట్టుల సంపూర్ణముగా అవగాహనము కాదు.

దేవాంశ కలవారుకాని, రాక్షసాంశ కలవారుకాని ఆలోచన చేయగా పరిపక్వస్థితి పొందినప్పుడు సరిగా ప్రకృతిలో మనము వినునట్టి శబ్దములనుండియు, చూచునట్టి రూపములనుండియు మంత్రములు ధ్యానములు భాసించునని తెల్పుట ఈ గ్రంథమునందలి విశేషము.

మధుకైటభులు తమ జన్మాదులకు కారణమేమా అని మథనపడగా శక్తి అని స్ఫురించినది. సరిగా అప్పుడే ఉరుము ఉరిమినది. మెరపు మెరసినది. వారు వెంటనే ఉరిమిన శబ్దమే శక్తిబీజ మనియు, మెరపే ధ్యానింపదగిన రూపమనియు నిశ్చయించి తపస్సు చేసిరి. సత్యవ్రతుడు గాయపడ్డ వరాహమును చూచి జాలితో ఐ యై వంటి శబ్దము చేసి వాగ్భవ బీజము ఉచ్చరించుటచే వాల్మీకి అంతటి మహాకవి ఐనాడట. సుదర్శనుడు 'క్లీబ'అను శబ్దముచేత కామ బీజము గ్రహించి శ్రీ దేవ్యనుగ్రహము పొందెను. ఇట్టి వెన్నో కలవు.

జ్ఞానేంద్రియములలో కన్ను, చెవి ప్రధానము లయినను, ఆ రెండిటిలో చెవి సూక్ష్మతర మైనదని ఇందలి సిద్ధాంతము. రాక్షసాంశ కలవారికి శ్రీ దేవి సింహారూఢయై బహుబాహువులతో ప్రత్యక్ష మగును. దేవాంశ కలవారికి శ్రుతి రూపముగా వినబడుటే కాని ప్రత్యక్ష మగుట అరుదు.

ఇందులో హృదయంగమమైన ఆఖ్యానము లెన్నో కలవు. కొన్ని చిన్నవి; కొన్ని పెద్దవి. పెద్దవానిలో మహిషాసురమర్దనము నవరసరుచిర మయినది. మూడవ స్కంధమున భువనేశ్వరి వర్ణన, తుది స్కంధములోని మణిద్వీపవర్ణనము అద్భుతమైన వర్ణన ఘట్టములు.

ఆంధ్రానువాదములు : శ్రీ దేవీభాగవతమును మొదట ఆంధ్రీకరించినది ములుగు పాపయారాధ్యులు. ఆయన 18వ శతాబ్ది చివరిభాగములో ఉండెను. ఆయన భక్తుడు. రచనలో పోతనను అనుకరింప యత్నించెను. ఆయన మహత్త్వము తెలుపు కథలు కొన్ని ఆరాధ్యశాఖీయులలో వ్యాప్తములై ఉన్నవి. దీనిని సంస్కరించిన చెళ్ళపిళ్ళ కవి వాక్యములవలన ఈ కవికి సంస్కృతాంధ్రములలో శబ్దసంస్కారము లోపించెనని స్ఫురించును, కాని జాగరూకతతో పరిశీలించిన పండితకవిగానే కనుపట్టును. ఇందులో మొదటి ఆరుస్కంధములు, 9వ స్కంధము విపులముగా మూలమును అనుసరించినను, తక్కిన స్కంధములలో పెక్కు పెద్దభాగములు విడువబడుటయే కాక, ఉన్నవియు చాల సంక్షేపింపబడినవి.

అన్నిటిలో 12వ స్కంధములో కేనోపనిషత్కథ, గౌతమకథ, మణిద్వీప వర్ణనము వదలబడుటే కాక, శాంభవదీక్షకు బదులు నారాయణమంత్రదీక్షను పేర్కొనుటయు, పురాణోపసంహారములోని విస్తారమైన మార్పును మిక్కిలి విపరీతములుగా ఉన్నవి. దీనినిబట్టి గ్రంథసాంకర్య మున్నదా అనిపించును. స్తోత్రములు అనువాదము చేయుటలో ఈ కవి దేవీ స్థూలరూపమునకు ప్రాధాన్య మిచ్చెను. ఈ గ్రంథము అచ్చయినవానిలో మూడవది.

అంతకుముం దెవ్వరు ఆంధ్రీకరింపలేదని శ్రీ దాసు శ్రీరాములు బహుస్వల్పవ్యవధిలో ఒక సంవత్సరములోపలనే ఆంధ్రీకరించి దీనిని అచ్చునకిచ్చిరి. అప్పటికే తిరుపతి వెంకటేశ్వరులు ఆంధ్రీకరించుచున్నారని తెలిసికొనిరి. దాసువారి అనువాదము సరళశైలిలో ఉన్నది. ఉపనిషన్మతములో కాని, శ్రీదేవ్యుపాసనలో కాని వారికి ప్రవేశము తక్కువగుటచేతను, త్వరత్వరగా వ్రాయుటచేతను సూక్ష్మవిషయములు లోపించుట వింత కాదు. ఆ కాలములో శృంగారమే కవిత్వమునకు ప్రధాన విషయమను భావ ముండుటచేత కాబోలు ఇందు మూలములో లేని శృంగారవర్ణనలు కొన్ని చేయబడినవి.

శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల ఆంధ్రీకరణము అన్నిటిలో శాబ్దికముగా నిర్దుష్టమైనది. వారుకూడ శీఘ్రగతిలోనే హేలగా ఆంధ్రీకరించినట్లు తోచును. అందులో దశమస్కంధము ఆంధ్రీకరణము వారి శిష్యులగు చెళ్ళపిళ్ళ చిన వెంకటశాస్త్రికి అప్పగించిరి. కవిత్వము వారి శతావధానశైలిలో సులభగ్రాహ్యముగా ఉన్నది.

నోరి నరసింహశాస్త్రి శ్రీ కల్యాణానంద భారతీస్వామివారివలన పాదుకాంతదీక్ష పొంది, దక్షిణాచార మనష్ఠించు స్మార్తుల ఉపాసన కిది ప్రమాణభూతమైన పురాణగ్రంథమను అభినివేశంతో, ఈ ఆంధ్రీకరణముకూడ శ్రీ దేవ్యర్చనమను భక్తిశ్రద్ధలతో, నెమ్మదిగా ఆంధ్రీకరించుచు శ్రీ గురువులకే అంకితము చేసినాడు. కవిత్వము అన్వయకాఠిన్యము లేక పురాణకవుల ప్రౌఢిని అందుకొనుటకు ప్రయత్నించు చున్నది. ఇతరులు లౌక్యముతో విస్తరించిన తారాశశాంక కథ ఇతడు ఒక్కపద్యములో సంక్షేపించుట వంటివి గమనింపతగినవి. ఇది అసంపూర్ణగ్రంథము. మొదటి మూడుస్కంధములే అచ్చయినవి. మరి రెండు స్కంధములే వ్రాయబడినవి.

పైని ఉదాహరించిన పద్యానువాదములు కాక రెండు వచనానువాదములు వెలువడినవి ఒకటి శ్రీ సరిపల్లె విశ్వనాథశాస్త్రిగారిది. ఇదికూడ ఏడవ స్కంధమునుండి సంక్షేపింపబడినది. రెండవది శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారిది. శ్రీ దేవి స్త్రీదేవత అను అభిమానముతో ఆమె ఈ ఆంధ్రీకరణము చేసినట్లు తోచును. ఇది వ్యావహారిక భాషలో వ్రాయబడినది.

ఏది ఎట్లున్నను శ్రీ దేవీభాగవతమునకు ఇన్ని అనువాదములు కొద్దికాలములో వెలువడి ఉండుటచేత, ఆంధ్రదేశములోని ఉపాసకులలో స్మార్తమతమందు శ్రద్ధ అతిశయించుచున్నదని భావింపవచ్చును.

# ఆంధ్రకవుల ఆదర్శములు

## 1. నన్నయభట్టారకుడు

౧

ఏమి సాధించవలెనని కవి కావ్యము వ్రాయుచున్నాడు ? కవి కావ్యము ఎందుకు వ్రాయవలెను ? ఎట్టి కావ్యములు ఉత్తమములు ?-ఈ ప్రశ్నలువేయుట సులభమైనను ప్రత్యుత్తర మిచ్చుట కష్టసాధ్యమని సాహిత్యవేత్తలు ఎరిగిన విషయమే. కవుల ఆదర్శములు కాలాంతరములలో, దేశాంతరములలో వేరు వేరుగా నుండుటేగాక విరుద్ధముగాకూడ ఉన్నవి. సహృదయ లోకములోకూడ ఆ ఆదర్శములలో మార్పులు ప్రతిబింబించును. అట్టి మార్పులు సాహిత్యశాస్త్ర గ్రంథములలోను, విమర్శ గ్రంథములలోను మనము చూడగల్గుచున్నాము. కాని ఆంధ్రమునలో స్వతంత్రమైన సాహిత్యగ్రంథములు లేవు. అందువల్ల ఆలం కారిక మతములలో దేనియందు వారికి అభిమానమో నిర్ణయించుట సులభము కాదు.

కాని మన కవులు తమ కావ్య పీఠికలలో వారి కవితాదర్శములు సూచించుచు వచ్చినారు. సుకవి స్తుతి, కుకవి నిందలలో వారి ఇష్టానిష్టములు కొంత గోచరించును. మరియు గ్రంథ సందర్భములలో కావ్యలక్షణములకు సంబంధించిన ఉపమానాది వాక్యములవల్లను, కవిపాత్రములను వర్ణించిన సందర్భములను బట్టియుకూడ వారి ఆదర్శములు కొంత మన కవగాహన కాగలవు. వారికి అభిమానమైన రచనా విధానమును బట్టికూడ వారి ఆదర్శముల నూహించవచ్చును. తిక్కనకు నిర్వచనోత్తర పీఠిక వ్రాయునాటికి ఉన్న కవితాదర్శములు అతడు సోమయాజియై విరాటపర్వ పీఠిక వ్రాయునాటికి కొంత మార్పు చెంది పరిణతి పొందినవనికూడ నూహించవచ్చును.

౨

భారత కవులు ముగ్గురును తెలుగువారికి పూజ్యులే యైనను వారిలో తెలుగువారి యభిమానమునకు పాత్రమైన ఒక్కరిని వేరుచేసి చెప్పవలసినచో నతడు తిక్కన సోమయాజియే యనుట నిర్వివాదాంశము. ఆంధ్రత్వము తిక్కన సోమయాజిలో మూర్తీభవించినది.

"నన్నయ భాషలో సంస్కృత పదము లెక్కువ; తిక్కన భాషలో తెలుగు పదము లెక్కువ; ఎఱ్ఱనలో రెండును సమానము" అని ఆధునిక పండితులు తరచుగా ఉపన్యసించుచుందురు. కాని ఇంతవరకును ఎవరి భాగములో ఎన్ని తెలుగు పదము లున్నవో, ఎన్ని సంస్కృత పదము లున్నవో ఎవ్వరును లెక్క పెట్టినవారు లేరు. అదికాక సంస్కృతపదమేదో, తెలుగు పదమేదో నిర్ధారణ చేయుటయే కొంత కష్టము. అట్టిచో వారు ప్రయోగించిన పదజాలమునుబట్టి వారియందు అభిమాన భేదమున్నదనుటకు నిర్దుష్టమైన యాధారమిప్పటికి లేదు. ఆ ముగ్గురి తెలుగుభాషయు జాతీయమై ముద్దులు మూటకట్టుచుండును. నన్నయ సంస్కృత పదములు సంస్కృత మనిపించవు. ఆయన తెలుగు పలుకుబడి స్వచ్ఛమైనది.

తిక్కన సోమయాజిలో నాంధ్రత్వము మూర్తీభవించినచో, నన్నయలో ఆర్షత్వము మూర్తీభవించినదనుట నిశ్చయము. నన్నయ తెలుగుదేశములో నున్నందున నతడు తెలుగు భాషలో గ్రంథము రచించెను గాని, యాతని దృష్టి ఎల్లప్పుడును ఆసేతు హిమాచలమధ్యప్రదేశమున ప్రసరించుచుండునేకాని ఒక్క తెలుగు భూమిని అంటుకొనిలేదు.

నన్నయ భట్టారకుడు జీవించిన కాలపరిస్థితులు తెలియనివారికది యతిశయోక్తిగా కనిపించవచ్చును. నన్నయ భట్టారకుడు రాజరాజనరేంద్రుని ఆస్థాన కవి. రాజరాజ నరేంద్రుడు చోళచక్రవర్తులకు సామంత మహామండలేశ్వరుడో, వారి ప్రాపున నతి కష్టముమీద వేంగీరాజ్యములో కాలూదుకొనగలిగిన స్వతంత్ర రాజో కదాయని కొందరనవచ్చును. కాని యా చోళచక్రవర్తుల ప్రాభవాలే యీ యూహకు ఆధారము.

రాజరాజనరేంద్రుని (1020-63) రాజ్యకాలములో మొదటి భాగములో నాతని పట్టమహిషి తండ్రియగు రాజేంద్ర చోళదేవుడు చోళచక్రవర్తి. అతడు కన్యాకుమారివరకు దక్షిణదేశము జయించి నౌకాబలము కూర్చి సింహళము పూర్తిగా స్వాధీనపరచుకొనెను. ఆ పిమ్మట పశ్చిమసముద్రములో పన్నెండు వేల దీవులు వశపరచుకొని తూర్పున పెగూరాజ్యము, నికోబారు అండమాను ద్వీపములను కలిపి శ్రీవిషయ మను సామంతమండలముగా జేసెను. అంతట నతడు ఒరిస్సా, బీహారు, బంగాళములు జయించి గంగాజలము గ్రహించి గంగైకొండ చోళుడని బిరుదు వహించెను. అప్పటికే ఉత్తర హిందూస్థానము చైతన్యము తగ్గి భిన్నాభిన్నమై గజనీ మహమ్మదు దండయాత్రలకు గురి యయ్యెను. భారతమతాభిమానులగు చోళచక్రవర్తులు ఆసేతుహిమాచలము ఏకచ్ఛత్రాధిపత్యముగా పాలించవలెనని మహాప్రయత్నము చేసిన కాల మది!

రాజరాజు అట్టి రాజేంద్రచోళుని అల్లుడు. అతనికుమారుడుకూడ రాజేంద్ర చోళునికుమారుని అల్లుడు. అప్పుడే వేంగీమండలములో చోళరాజ్యము తమ కర గతము చేసికొనవలె నను ప్రయత్నము లుండియుండవలెను ఎంతప్రయత్నము లేనిది రాజరాజనరేంద్రుని కుమారుడు 1070 సం॥లో చోళచక్రవర్తియై, కులో త్తుంగ చోళచక్రవర్తి యను బిరుదు వహించి, తన మాతామహునితో సమాన మైన ప్రతిభతో నలుబదితొమ్మిది సంవత్సరములు సేతువు నుండి కళింగము వరకు గల రాజ్యమును పాలించియుండును!

ఈ స్థితిగతులు తెలిసినవారికి భారతపీఠికలో:

"బహుభాషల బహువిధముల
బహుజనముల వలన వినుచు భారతబద్ధ
స్పృహు లగువారికి"

ఇత్యాదిగా రాజరాజు పలికినట్లున్న వాక్యముల అర్థము ద్యోతము కాగ లదు. రాజరాజుకు, నన్నయభట్టుకు కావలసినది ఏదో వొక తెనుగుకావ్యము కాదు, తెలుగులో వ్యాసమహాభారతమే వారికి కావలెను. ఆ భారత మెట్టిది?

"ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రం బని
యధ్యాత్మవిదులు వేదాంత మనియు

నీతివిచక్షణుల్ నీతిశాస్త్రం బని
కవివృషభులు మహాకావ్య మనియు
లాక్షణికులు సర్వలక్షసంగ్రహ మని
యైతిహాసికు లితిహాస మనియు
పరమపౌరాణికుల్ బహుపురాణ సముచ్ఛ
యం బని మహి గొనియాడుచుండ

వివిధ వేదతత్త్వవేది వేదవ్యాసు
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరగుచుండ జేసె భారతంబు."

భారతగుణ సమూహము ఈ విధముగా ప్రశంసించి, తుదకు సంగ్రహించి "విశ్వజనీన"మైనదని సూత్రప్రాయముగా చెప్పినాడు. సంస్కృతమూలములో నీ విధముగా కానరాదు. విశ్వజనీన శబ్దముకూడ నందు లేదు. కాబట్టి నన్నయభట్టారకుని విశ్వజనీనత పరమాదర్శ మని మనము నిశ్చయించవచ్చును.

ఆంధ్రశబ్దచింతామణి నన్నయ వ్రాయలేదని నేటి విమర్శకుల మాట నిజమే యనుకొన్నను, అందులోని మొదటిసూత్రము ''విశ్వశ్రేయః కావ్యమ్" అనునది నన్నయ కావ్యాదర్శమునే అనువదించుచున్నదని మనము ఘంటాపథముగా వక్కాణింపవచ్చును.

మరియు నన్నయభట్టారకుడు "జగద్ధితంబుగన్" "భారతసంహితా రచనబంధురు" డయ్యెను. శాంతిపర్వమహిమ వర్ణించుచు నది ''సకల హితం'' బయిన దనెను. ఇట్టి మహాభారతము కృష్ణద్వైపాయనుండు "నిఖిలలోకహితార్థంబు" నిర్మించెనట. మరియు ఈ భారతీయభారతి "జగద్ధితం" బట. "సర్వలోకపూజ్య"మయిన భారతసంహిత ''సమస్త జగద్ధితంబుగా చేసె" నట. అది ''సర్వలోక జనులు" అమృతమువలె త్రావుదురట. అది "సభాంతరములన్ విదితం బగు"నది.

ఆర్షదృష్టి ఆసేతుహిమాచల మధ్యవర్తియై విశ్వజనీన మయినది. నన్నయభట్టారకుని ఈ యార్షదృష్టియే ఎఱ్ఱాప్రెగ్గడను ఎక్కువ యాకర్షించి

నట్లు ఆతని అరణ్యపర్వశేషము, భారతశేష మగు హరివంశము పరిశీలించిన వారికి ద్యోతక మగును. అతని పద్యములు నన్నయపద్యములనే పోలియుండును.

కాని, ఎఱ్ఱాప్రెగ్గడ నాటికి భారతధర్మ విజృంభణము వెనుకాడసాగినది. నన్నయనాడు పోటుతో పొంగుచున్న ధర్మప్రవాహము ఎఱ్ఱననాటికి పాటుకు మళ్ళ సాగినది. అది కేవలము పోటారిపోయిన ఈ కాలములో నన్నయభట్టారకుని, ఎఱ్ఱాప్రెగ్గడను స్మరించువారున్నచో, వారు మరల నెన్నటికో ఆ ప్రవాహము పోటుకు తిరుగగలదని ఉవ్విళ్ళూరు ఆశాశీలురు !

౩

రాజరాజు "విద్యావిలాసగోష్ఠి సుఖోపవిష్టుం'డయినప్పుడు కొలిచియున్న వారిలో 'మృదుమధుర రసభావ భాసుర నవార్థ వచన రచనా విశారదు లయిన మహాకవు'లుండిరి. రాజరాజు తాను'ఉదాత్త రసాన్విత కావ్య నాటకక్రమములు' పెక్కు చూచినట్లు చెప్పెను. సముద్రము 'నాటక ప్రయోగంబునుంబోలె ఘన రసపాత్ర శోభిత రంగరమ్యం'బని శ్లేషించెను. అట్టి శ్లేష సంస్కృత మూలములో లేదు. వీనినిబట్టి నన్నయభట్టారకుడు కూడ సాహిత్యములో రసవాది యనుటకు ఆధారము కలదు.

ఆంధ్రశబ్దచింతామణి నన్నయ రచన కాదన్నను, అందులోని "సావాగ్యా రసవృత్తిః, "సాధ్యోహి రసో యథా తథం కవిభిః" అను మూడు నాలుగు సూత్రములు మాత్రము నన్నయభట్టారకుని ఆశయమునే చాటుచున్నవని మాత్రము మనము నిశ్చయముగా చెప్పవచ్చును. మొత్తముమీద తెలుగుదేశము కావ్యమునకు రసమే ఆత్మ యను వాదము అంగీకరించిన దనుటకు ఆ తర్వాతి ఆలంకారికుల గ్రంథములుగూడ ప్రమాణము. రసవాదులే బహు రూపములతో రమ్యత, హృద్యత కావ్యములలో కోరువారు. ఆధునిక కవులకు ప్రథముడు శ్రీ రాయప్రోలు సుబ్బారావుకూడ 'రమ్యాలోకమే' వ్రాసినాడు.

నన్నయకు నదియే సమ్మత మనుటకు ఆధారమున్నది. అతడు "నానా రుచిరార్థ సూక్తినిధి"యట. శౌనకాదులకు "ఏయది హృద్యమో" ఆ కథ విన నిష్ట మట. ఆదిపర్వము, "మనః ప్రీతి ద"మట. సభాపర్వము "రమ్య"మై,

పండిత చేతోనిర్వృతి జేయునట. తృతీయపర్వము "సూరి సభారమ్య" మట. విరాటపర్వము 'సభారంజకమై సర్వమనోజ్ఞమై వెలయునట. ఉద్యోగపర్వము 'ఎంతయు నొప్పిదము.' భీష్మపర్వము 'హృదయరోచనములగు నేన్పర్వంబు లను పంచి విసం బొలుచును.' కర్ణపర్వ 'మతిహృద్యము.' పరాశర సుతుని "ముఖామృతాంశు బింబంబున నుద్భవం బయిన భారతవాగామృతంబు కర్ణ రంధ్రం బను నంజలిం దవిలి సర్వలోకజనులు త్రావుదురు.'' సదస్యులు ఆస్తీక మునీంద్రుని 'సంతతస్తుతి పదారావంబు రమ్యంబుగన్'కీర్తించిరి. మహా భారతము 'కమనీయ ధర్మార్థ కామమోక్షములకు సాధనము.' మహాభారతాఖ్యా నామృతిసూతి అమలజ్యోత్స్న జిత్తానందం బొసరించును. ఉపరిచరుడు గిరిక 'పలుకుల ముద్దును' తలచి తలచి హృదయము నిలిపినాడు. ఇన్ని ప్రదేశము లలో హృద్యత, రమణీయత, రమ్యత, రుచిరత్వము, కమనీయత కావ్యము లకు, వాక్కులకు ఆరోపించిన నన్నయభట్టారకుడు కావ్యములో రామణీయకత కాంక్షించువా డనుటకు సందేహింపవచ్చునా ?



''విగతజీవుడై పడియున్న వేదమూర్తి
యతనిచేత సంజీవితుడై వెలింగె
దనుజమంత్రి యుచ్చారణ దక్షుచేత
నభిహితం బగు శబ్దంబునట్ల పోలె."

కచుడు శుక్రుని సంజీవింపజేసినది వర్ణించు సందర్భములో నన్నయ పద్య మిది ! వ్యాసమహాభారతములో నిట్లు లేదు. అందులో—

"దృష్ట్వా చ తం పతితం బ్రహ్మరాశిం
ఉత్థాపయామాస మృతం కచోఽపి."

అని మాత్రమే ఉన్నది. నన్నయభట్టారకుని కల్పనవల్ల నా మహానుభావునికి శబ్ద మొక్కటేని ఎరిగి చక్కగా ప్రయోగించినచో కామధుక్కు అగునను నిశ్చ యము ఎంత గాఢముగా కలదో తేటపడగలదు.

భారతరచన చేయుమని రాజరాజు కోరిన సభలో నున్నట్లు ముందు పేర్కొనబడినవారు 'అపారశబ్దశాస్త్రపారగులైన వైయాకరణులు.' ఆ పిమ్మట

నన్నయ వర్ణనలో నతడు 'విపుల శబ్దశాసను'దని వర్ణింపబడెను భారతమును 'లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహ'మందురట. 'ప్రథమే విద్వాంసో వైయాకరణాః' మున్నాటుని వచనములోని సత్యము అప్పటికే లోకసిద్ధమై యుండవలె.

సభాపర్వము "పండితచేతోనిర్వృతి" చేయునట. తృతీయపర్వము 'సకల సూరి సభారమ్యము.' స్త్రీపర్వము 'సుకవి పండిత సభల'లో వెలయును. ఆనుశాసనికము 'విబుధశ్రేణినుతము.' భారత భారతీగంగ 'విబుధేశ్వరాబ్ధిసంగత్యుపశోభితంబు.' జనమేజయుడు 'విద్వజ్జన గోష్ఠి' నుండి "విద్వజ్జన పరివృతుడై వైశంపాయనుని పూజింపగా నతడు విద్వజ్జనంబుల యనుగ్రహంబు వడసి" భారతకథనము ప్రారంభించెను.

'తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ' 'జ్ఞాత్వా ప్రయుక్తః శబ్ద ఆర్షసమః' అను ఆంధ్రశబ్ద చింతామణిలోని రెండవ సూత్రమూ, తొమ్మిదవ సూత్రభాగమూ నన్నయ వ్రాసినవైననూ కాకపోయిననూ అవి నన్నయ భావములనే నిస్సందేహముగా ప్రదర్శించుటలేదా !

౨౪

కావ్యము విశ్వశ్రేయస్సుకొరకు రమణీయముగా శబ్దప్రయోగదక్షులచేత విద్వజ్జన గ్రాహ్యముగా నిర్మించదగినది. ఇది సంగ్రహముగా నన్నయ భట్టారకుని కావ్యాదర్శము : అట్టిది అక్షరమూ, రమ్యమూ, అక్షరరమ్యమూ !

కావ్య మొక సృష్టి ! "మహాభారతంబు ననేకవిధ పదార్థ ప్రపంచ సంచితంబు నుపపర్వ మహాపర్వోపశోభితంబు నుపద్వీప మహాద్వీప సంభృతంబయిన భువనం బజుండు నిర్మించినట్లు కృష్ణద్వైపాయనుండు నిఖిలలోక హితార్థంబు దత్తావధానుడై సంవత్సర త్రయంబు నిర్మించెనట ! మరియు నదియాతడు "నిజతపో మహత్త్వంబునం జేసి" తద్గ్రంథ విషయములు "తన విమల విజ్ఞానమయం బయిన వాగ్దర్పణంబునం దేర్పడ వెలుంగుచుండ" దర్శించెను.

ఇట్టి ఉత్తమకావ్యసృష్టి కధికారు లెవరు ? నన్నయ ఇద్దరుకవులనే పేరుపెట్టి స్తుతించెను. వారిలో'దుర్భరతపోవిభవాధికుడు గురుపద్యవిద్యకు నాద్యుడు

నంబురుహగర్భ నిభు డయిన పారిచేతను డొకడు, భారతకర్త యగు వేద వ్యాసుడు రెండవవాడు.

పీఠికలో వర్ణింపబడిన నన్నయ ఎట్టివాడు ? "కులబ్రాహ్మణుడు, అవిరళ జపహోమ తత్పరుడు, విపుల శబ్దశాసనుడు, సంహితాభ్యాసుడు, బ్రహ్మాండాది నానా పురాణ విజ్ఞాన నిరతుడు, పాత్రుడు, ఆపస్తంబసూత్రుడు, ముద్గల గోత్రుడు, సద్వినతావదాత చరితుడు, లోకజ్ఞుడు, నిత్యసత్యవచనుడు, మత్యమరాధిపాచార్యుడు, సుజనుడు"నయిన వా డట ! ఒక్కసారి వాల్మీకి రామాయణములోని ప్రథమ శ్లోకము స్మరింతము !

"తపస్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్,
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్॥"

ఇందులో వాల్మీకికి, అతనికి ఉపదేష్ట యయిన నారదునికి నుపయోగించిన విశేషణములు మనస్సులో నుంచుకొనియే నన్నయ వర్ణన చేయబడినట్లు గోచరించును. కావ్యసృష్టికి నన్నయ మతములో ఉత్తమాధికారులు స్వాధ్యాయ నిరతులు, తపస్వులు, వాగ్విదులలో శ్రేష్ఠులు నగు మునిపుంగవులే ! ఇప్పటికి తొమ్మిదవందల సంవత్సరముల క్రిందట వేంగీదేశములో ఎంత ఆర్షత్వము సంపాదించుటకు అవకాశము కలదో, అంత ఆర్షత్వము సాధించినవాడు నన్నయ భట్టారకుడు !

అట్టి నన్నయ కవిత్వము ఆర్షవిరుద్ధ సిద్ధాంతములు ప్రబలుచున్న ఈ కాలములోనివారికి రుచించునా? ఆధునిక కవివిమర్శనములు ప్రారంభించినప్పటి నుండియు నన్నయ గౌరవము తగ్గించుటకు ఎన్నియో ప్రయత్నములు సాగుచున్నవి.

అనుష్టుప్శ్లోకములు వేదములో ఉన్నను వాల్మీకికి ఆదికవి యను ప్రతీతి లేదా ? నన్నయకు పూర్వము పద్యము లున్నంతమాత్రము చేతనే ఆదికవి యనుట తప్పా ? 'విపుల శబ్దశాసను'డని భారతములోనే ఉన్నప్పుడు, అతడు ఆంధ్రశబ్ద చింతామణి గాని, అట్టి ఆంధ్రవ్యాకరణమును గాని వ్రాసినా డనుట పొరపాటా ? తుదకు భారతము తెనిగించినది కూడ నన్నయ కాదు అని నిశ్చయించి వాదించిన పండితాగ్రేసరు లున్నారు. మరియొకరు నన్నయ భారత

భాగము చూడకయే తిక్కన విరాట పర్వాదిగా ప్రారంభించినా డనిన విద్వాంసు లున్నారు.

ఆంధ్రకవులలో మహనీయుల పేర్లు వరుసగా చెప్పుచు, తమ ఊరు దాటని పేరు గల కవీశ్వరుల పేర్లు చెప్పి, నన్నయను పేర్కొనని ఆంధ్ర భాషాపోషకుల వ్యాసము సాహిత్య పత్రికలో చదివినాము. పరిశోధకులకు జన శ్రుతులు ప్రమాణములు కావు ; కాని, అట్టివారే వేములవాడ భీమకవి, అధర్వ ణుడు నన్నయ సమకాలికులు కారనుచు, ఆ నోటనే ఆ విమర్శకులే నన్నయ అసూయవల్ల వారలను రాజసభకు రానీయకుండజేసె నను కథలు వ్యాప్తిలో నికి తెచ్చినారు.

అయినను నన్నయభట్టారకుని ప్రతిభ మాబోంట్లు ఉగ్గడించనక్కర లేదు. నన్నయ రచన యకాయకి వ్రాయుటకు ప్రయత్నించిన ఆర్షవాక్సిద్ధి సంపాదించిన శంకరస్వామిశిష్యు డయిన ఎఱ్ఱాప్రెగ్గడ ఏమనెను !

"ఉన్నత గోత్రసంభవము
నూర్జితసత్వము భద్రజాతి సం
పన్నము నుద్ధతాస్య పరి
భావ మదోత్కటము న్నరేంద్ర పూ
జోన్నయ నౌచితంబు నయి
యొప్పెడు నన్నయభట్ట కుంజరం
బెన్న నిరంకుశోక్తి గతి
నెందును గ్రాలుట బ్రస్తుతించెదన్."

[భారతి ఏప్రెల్ 1946 సం, 23; సంచిక 4]



# కవిస్మరణము - చామర్తి రాజశేఖరరావు

౧

"ధృతరాష్ట్రం డతి కుత్సితుండు కల ధా
త్రీ నాయకుల్ భీరువుల్
ప్రతికూలంబు జగంబు కాలపరిప
క్వం బైన యందాక భా
రత సామ్రాజ్య రమాభిలాష తెలుపన్
రాదమ్మ ! దుశ్శాసనో
ద్ధతి సైరించునటమ్మ ! యుత్తమసతీ
ధర్మంబులన్ ద్రౌపదీ !"

ఈ విధంగా ఇంచుమించు ముప్పదివేళ్ళ క్రిందట పంజాబు దురంతాల గూర్చి రాజశేఖరకవి విలపించినాడు. ఈమధ్య పంజాబులో జరిగిన దురంతములు అంతకంటె భయంకరమైనవే కాని ఇవి జ్ఞాతికలహములు ఆ దురంతములట్లు కాదు. ఆంగ్లేయపరిపాలనలో మొదటి మహాసంగ్రామమైన పిమ్మట ఆంగ్లేయప్రభువుల సైనికులు స్వాయముగా చేసిన దురంతములవి. ఆ రాష్ట్రపు గవర్నరు, సేనాధిపతి కారకులు దానికి. ఆ దురంత కథలు విన్నప్పుడు బిగిసిపోయిన ముసలి భారతీయుల రక్తమే ఉడుకెత్తినది. నవయౌవనములో నున్న రాజశేఖర రక్తము మరి ఎంత ఉడుకెత్తినదో ! ఆ పొంగు నిండిన కవితాహృదయముతో ఆ పాంచాలీసాంత్వనము చేసినాడు. రౌలటుచట్టము అమలులోకి వచ్చినందున ప్రజలు తమకష్టము స్పష్టముగా వెలిబుచ్చుటకును వీలులేదు. కవికి శ్లేష సహాయమైనది. రౌలటుఆక్టు అను దుశ్శాసనము నుద్ధతి దుశ్శాసనోద్ధతి ఐనది. ఇప్పుడు మరల పద్యము చదివిన తేటపడును.

అందులోనే అత డింకా ఈ విధముగా అన్నాడు :

"చేసేతం గడు మూర్ఖులై భరత ల
క్ష్మిన్ నిన్ను సాధ్వీమణిన్
గాసిం బెట్టిరి ధార్తరాష్ట్రు లకటా !
కాలంబు దాపయ్యె ... ?"

కవులు ద్రష్టలు ! అందుచే భవిష్యత్తులో రాబోవునది వారికి గోచరించుటలో ఆశ్చర్యము లేదు. ఆ కావ్యము చెప్పిన ముప్పైఏండ్లలోపుకాని కాలము వచ్చి భారతసామ్రాజ్యలక్ష్మి సిద్ధించినది. కాని అది కండ్లార చూచి ఆనందించు భాగ్యము రాజశేఖరకవికి లేకపోయినది ; దానికై పోరాడినవారు మేము సంపాదించితిమని గర్వించుట వృథాభిమానము. ఈ పోరాడినవారు నిమిత్తమాత్రులే. సాధనప్రాయులే ! దాని సిద్ధికి నిజమగు మూలకారణము రాజశేఖరునివంటి కవి ద్రష్టల తీవ్ర తపస్సే !

౨

అతడు జన్మించినది 1898 ప్రాంతము. అతడు పుట్టిన ఐదవనాడే కన్న తల్లి గతించినది. తండ్రియు, తండ్రితల్లియు, ఆ పసిగ్రుడ్డును పెంచలేక కాబోలు పారవేయదలచి ఒక భోషాణముక్రింద చింకిచాపమీద వేసిరట. చీమలు, పురుగులు ఆ శిశువు నారగింపసాగినవి. — ఇది కథ కాదు ! అతని స్వహస్తలిఖితమగు ఉత్తరమే నాకు సాక్ష్య మున్నది. ముప్పై ఏళ్ళ క్రిందట అతడు వ్రాసిన మాట లివి.

"నాకు ఐదునోజు లప్పుడు కన్నతల్లి చచ్చిపోయినది. నా తండ్రి, తండ్రితల్లి, ఇతర బంధువులు నన్ను పారవేయుటకు నిశ్చయించిరట ! భోషాణముక్రింద ఒక చిరిచాప వేసి నన్ను పండుకోబెట్టి అందరును పోగా కొంతసేపటికి నా తల్లి వచ్చి చూచినది. శరీరమునకు చీమలు, దోమలు, ఈగలు మొదలగు పురుగులు పట్టినవి. అప్పటినుండి ఇప్పటి వరకు నా కాధారమై పోషించినది ఈ తల్లియే !"

అట్లు వచ్చి పోషించినతల్లి అతనిపెదతల్లి రాజమ్మగారు. ఆమె రాజశేఖరుని కస్తల నుండి జగ్గయ్యపేట తీసికొనిపోయినది. కాని ఆ పిమ్మట రెండేళ్లకే

ఆమె భర్త కాలము చేసెను ఆమెకు కన్నబిడ్డలు లేరు. రాజశేఖరుని తన కన్న కుమారునికంటె ఎక్కువ ప్రేమతో పోషించినది. కొన్నాళ్ళకు అతని చదువుకు గుంటూరు తెచ్చినది.

అంతకుముం దెప్పుడు వచ్చినాడో కాని నా కతనితో పరిచయము 1910 సం॥లో. సెకండు ఫారములో ఇద్దరము ఒకే డివిజనులో చదివినాము. ఆ సంవత్సరము స్కూలు ఫైనలు పద్ధతి కొత్తగా పెట్టినారు. ఆ యేడే స్కూలు సంవత్సరాంతము డిశెంబరునుండి ఏప్రియల్‌కు మారినది. అందుచేత మా కా సంవత్సరము సంవత్సరమున్నర ఐనది. అంత దీర్ఘసంవత్సరములోను నా కతని విషయములు జ్ఞాపక మున్నవి రెండే. అప్పుడు రోజూ క్లాసుమార్కులు వేసి నెల నెలకూ ప్లేసులు మార్చేవారు. ఒక్కనెలతప్ప ఎన్నడూ అతనికంటే పైప్లేసులో ఉంటినిగాని తెలుగుక్లాసులో మాకు పోటీ సమానముగా ఉండేది. నా కాసంవత్సరమే ఉపనయన మైనది. కాని నాకంటే అతనిమెడలో యజ్ఞోపవీతమే కాక విశేష మొక పట్టుత్రాడు వ్రేలాడుచున్నట్లు తొంగిచూచేది. అతడు లింగధారి; ఆరువేల నియోగి బ్రాహ్మణుడు. ఆ పట్టుత్రాడు ధరించునది అతని ప్రాణ లింగము !

1911-12 లో మేము మూడవఫారము ఒకే డివిజనులో పడ్డాము. నాకు పదకొండేళ్లు. లక్షణము నేర్చుకొని నేను పద్యము అల్లడము అప్పుడే ప్రారంభించినాను. అతడు నాకంటె కొంచెము పెద్ద. కాని అతడు ఆ సంవత్సరము ఒక్కసారి అకస్మాత్తుగా కవే అయిపోయినాడు. అంత పెద్దకాలేజీలోను ఆ మూడవఫారము విద్యార్థియే ఏకైక కవి ! ఏ టీచరు వెళ్ళిపోయినా, మరి ఏ క్లాసులో ఏ చిన్న ఉత్సవము చేసినా దాని కతడు పద్యములు వ్రాయవలసినదే ! సంగీతము రాకున్నను మనోజ్ఞమగు అతనికంఠముతో నతడు చదువవలసినదే! భాషాజ్ఞానము ఎంత తక్కువైనా మొదటినుండి అతని పలుకులలో పొందికా, తీయదనమూ ఉండేవి. అతడు పద్యము చదువుట కవి కంఠమువలె ఇంపుగా ఉండేది ! అతడు కవి యైనవెంటనే నాకు ఆప్తమిత్రు డైనాడు !

౩

ఆ సంవత్సరమే తిరుపతివేంకటేశ్వరులకు, కొప్పరపు సోదరకవులకూ గుంటూరులో కుర్చీవివాదము ప్రారంభమైనది. రెండు కాంపులలో రెండు పక్ష

ములవారు శిక్షవేసినారు. రెండుపక్షములపై నభిమానము కల విద్వాంసులు, కవులు గుంటూరుకు మూగసాగినారు. అది శతావధానయుగము ! అనుకవిత్వ యుగము ! నిజముగా కవియుగమే అది ! జనమంతటికీ కవిత్వాభిమానము ఒక్కసారిగా ఆవేశించినది. అవి నిజముగా కవిత్వ స్వరాజ్యోత్సవము జరిగిన రోజులే ! ఎక్కడెక్కడివారు - ఇటువారు - అటువారు - కవులను మారుమూల నున్న గ్రామములకు తీసికొనిపోయి ప్రజలు సన్మానించినారు. దాని కంతటికి మూలకారణము స్పర్థయే యగుగాక ! పొరపా టెవరిదయినను అగుగాక ! ఆ పండుగ చూచిన కవులే ధన్యులు.

శ్రీ తిరుపతివేంకటేశ్వరులు తమ కరపత్రములు వచనములో వ్రాసెడివారు. శ్రీ కొప్పరపుసోదరులు పద్యములలో వ్రాసెడివారు. ఇటుపక్షమువారు, అటుపక్షమువారు ఎన్ని పత్రికలు ! ఏ క్రొత్తపత్రము వచ్చినా క్లాసులు ప్రారంభము కాకముందు కాలేజీవా రందరూ హిందు ప్రేయరు హాలులో అది ముందు మాకు ప్రత్యక్ష మయ్యేది. అందుపై నియోగి వైదిక విద్యార్థులు ముందు నోటితోను, పిమ్మట చేతులతోను పోట్లాటలు ! అప్పటి లోకమే రెండుగా చీలిపోయినది - తిరుపతివారు, కొప్పరమువారు. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు కాలేజీ హాలులో చేసిన మొదటి శతావధానప్రారంభము నాకు గుర్తున్నది. ఇప్పటికీ తలచుకుంటే రెండు జ్ఞాపకము వచ్చును. శ్రీ వెంకటశాస్త్రిగారు తమ స్వంత కంఠముతో—

"ఎరుగదు పిల్లకాయ, ఎటు
లే నొనరించు శతావధానమున్"

అనడము, అలుకుగుడ్డమీద సీసపద్యము చెప్పమని ఒక పృచ్ఛకు డడుగగా శ్రీ శివరామశాస్త్రిగారు -

"సింగారకట్టతో జిమ్మిన భూమిని
జలము సింగారించి యలకు కొరకు"

అని చెప్పిన మొదటిపాదము జ్ఞాపక మున్నది.

మొదటిరోజున పాలుగారుచున్న శ్రీ శాస్త్రిగారిముఖము చివరి రోజుకు ధారణ చేసి వాడిపోయినది. చూడ నా కాశ్చర్య మైనది. ఎంత మార్పు !

సెకండు కంపెనీ హాలులో శ్రీ వింజమూరి భావనాచార్యులుగారు అధ్యక్షులుగా కొప్పరపు సోదర కవులు చేసిన ఆశుకవిత్వప్రదర్శనము గుర్తున్నది. ఆశుకవిత్వము దేనినిగూర్చి చెప్పటో ముందు నిర్ణయము కాదు. సభలో అధ్యక్షుడో, పెద్దలో అడిగెదరు. ఆనాడు అధ్యక్షులు బాల్యవివాహములను గూర్చి చెప్పు దని సభలో కోరిరి. అది సామాన్యముగా అడుగునట్టి కథ కాదు.

గంటకు వందలు వేలు పద్యములు చెప్పువారిధార ఆనాడు వెనుకటి వేగముతో సాగలేదుగాని అద్భుతముగానే ఉన్నది. అక్కడి గ్యాసులైట్లలో ఒకటి బాగా వెలుగుటలేదు. ప్రేమలేని యువతికాపురమును కాబోలును, కాంతి తగ్గిపోవుచున్న ఆ దీపపుకాంతితో శ్రీ సుబ్బరాయకవిగారు ఉపమించుట నాకు జ్ఞాపకము. ఇదంతయు నా జ్ఞాపకము ప్రదర్శించుకొనుటకు కాదు. రాజశేఖరునిలో కవిత్వము వికసించునాటికి ఎటువంటి వాతావరణము గుంటూరులో ఉన్నదీ కొంత ప్రదర్శించుటకే. పాతిక ముప్పదిమందిని పెట్టుకొని అతడు రెండుమూడవధానములు చేసినాడు. ఆశుకవిత్వముకూడ కొన్నిమారులు ప్రదర్శించినాడు. కాని వానిపై నతని కంత వ్యామోహము లేదు. ఆ కాలపరిస్థితినిబట్టి అట్లు చేసినాడు. అప్పటికే నాకును అట్టివానియం దుత్సాహ మసలే లేదు. ఆ ప్రదర్శనముల సంగతి నాకు వినికిడియే. నేను స్వయముగా చూడలేదు.

సెలవులకు ఆతడు మేనమామల ఇంటికి కస్తలవెళ్ళెడివాడు. అక్కడి కృష్ణాప్రవాహము, తీరమందలి పెద్దబండలు, చుట్టుపట్ల విరివిగా ప్రవహించు సెలయేళ్లు ఆతని వివాహమునకు ఆ గ్రామమునకు నేను వెళ్ళినప్పుడు నన్నెంతయైన ఆకర్షించినవి. కవిత్వమే ఎముకలు, మజ్జా మాంసములు, వసా రక్తములుగా శరీరము పొందిన రాజశేఖరుని అవి ఎంతగా ఆకర్షించెడివో ! మరల అక్కడినుండి గుంటూరు తిరిగివచ్చునప్పటికి ఒక క్రొత్త కావ్యమో, నాటకమో వ్రాసి తెచ్చెడివాడు. స్కూలు తెరచిన పొద్దునపూటనే నాకది క్లాసులో ఇచ్చేవాడు. ఆతనికోరిక ననుసరించి నేను వెంటనే చదివి నాకు కనిపించిన లోపాలన్నీ వదలిపెట్టకుండా ముఖాముఖిగా చెప్పేవాడను. ఒకసారి వ్రాతపూర్వకముగా అందిచ్చితిని.

ముందతనికి పట్టరాని కోపము వచ్చేది. నన్ను దూషించేవాడు. నేను నవ్వేవాడను. ఒకసారి పట్టలేక –

"తెలియని వన్ని తప్పు లని
దిట్టతనాన సభాంతరంబునన్
బలుకగ రాకు రోరి ... ....
సరసా, విరసా, తుసా, బుసా !"

అని పద్యమంతా చదివినాడు. నా పేరులో నరసింహశబ్ద మున్నదని జ్ఞాపక ముంచుకుంటే ఆతనితిట్టులో కూడ ఔచిత్యమున్నదని స్పష్ట మవుతుంది. ఆపైన నాకు కోపము వచ్చినది. మోమోటము లేకుండ లోపాలు చూపించ మంటే నేను చూపించినందుకు అత డిట్లు ప్రవర్తింపవచ్చునా? మరునాడే అతడు క్షమాపణ చెప్పికొన్నాడు. నేను చూపినతప్పులు మొత్తముమీద సరియై నవే అని ఒప్పుకొని నా విమర్శనాశక్తికి శ్లాఘించినాడు. నేను తప్పు లనుకొన్నవి కొన్ని కావని నే నంగీకరించినాను. ఇద్దరికి రాజీ ఐనది. ఇట్టి జగడము తరువాత కలిగిన రాజీవల్ల మాకు అన్యోన్యము ప్రేమ అతిశయింపసాగినది.

కాని ఇప్పుడు పెద్దవార మైనతర్వాత కవిమిత్రుల కావ్యదోషములు వారు ప్రార్థించిననూ, చూపుట వారి స్నేహభావమునకే నివాపాంజలి వదలుట యని ఇప్పు డిప్పుడు గ్రహించగలుగుచున్నాను.

విద్యార్థులకు సర్వసామాన్యమైన తిట్లు రాజశేఖరునినోట వచ్చుట నేను వినలేదు. కస్తలలో అతని దగ్గరవారిలో మాట మాటకు ఊతలుగా బూతు వేయని పెద్దలు పురుషులలో నాకు కనబడలేదు. అట్టిచోట పెరిగిన యతనికి అది అభ్యాసము కాకపోవుట మరీ ఆశ్చర్యము. నేను ఐదవఫారము చదువుచుండగా సహపాఠులతో అవి ప్రయోగించుట కొంచెము అభ్యసించినాను. ఒకనాటి సాయంకాలము కాలేజీస్పోర్ట్సు జరుగుచున్నవి. అక్కడ వేపచెట్టుక్రింద పుస్తకము లమ్ముటకు వచ్చి అవతలికి వెళ్లుచు మరియొకని కాపుండమని చెప్పుచు ఊతగా బూతు వేసినాడు. అది విని నేను ప్రక్క నున్న రాజశేఖరుని 'ఇత డే గ్రంథకర్త?' అని అడిగినాను. అతడు వెంటనే 'గ్రంథకర్త ఐతే అంత అసహ్యంగా మాట్లాడుతాడా?' అన్నాడు. గ్రంథకర్తను కాదలచుకొన్న నేను ఆ క్షణమునుండి ఆ దురభ్యాసము మానుకున్నాను.

అప్పుడు గుంటూరులో బహిరంగముగా నియోగి వైదిక స్పర్థలు చెలరేగి ఉన్నవి. అవి విద్యార్థులలో అసహ్యముగా ప్రాకినవి. మా క్లాసులో నియోగులే

ఎక్కువ. మా ఇద్దరిలో మాత్రము ఆ భేదము, పక్షపాతమూ కనిపించేది కాదు. మాలో దినదినప్రవర్ధమాన మవుతున్న ప్రేమకు ఎట్టి ఆటంకము అది కల్పించలేదు.

"కప్పను జూచి పాము గడగడ వడకెన్"

అను సమస్యను తిరుపతివారు వెంకప్పను అని చేసి పూరించినారు. కాని కొప్పరపు సోదరకవులు గరుత్మంతుని నీడను కల్పించి చక్కని ఊహతో ఆ సమస్యనే పూరించుట అతడు నాకొకసారి వివరించి కవితాకౌశలము ఒకరి సొమ్ము కాదని నాకు చెప్పినది జ్ఞాపక మున్నది.

౪

మే మిద్దరము స్కూలుఫైనలు పరీక్షకు 1915లో వెళ్ళినాము. ఆ సంవత్సరాంతమునకు మా హృదయములలో నాటుకున్న మైత్రి పవిత్రమై విచిత్ర మగు ఆవేదన కల ప్రేమగా మారిపోయినది.

ఒకరిని ఒకరము విడిచి ఉండుట కష్టమైనది. ఆ ఎండాకాలపు సెలవులలో అతడు కస్తల వెళ్ళినాడు. ఆ సెలవులలో మా కిద్దరికి ఒకరి కొకరము అంతము లేని పొడుగుపాటి ఉత్తరములు వ్రాసికొనడమే ముఖ్యమైన పని అయి పోయినది. నేను వచనము, అతడు పద్యాలూ వచనమూ.

"అల సూర్యాస్తమయంబు జూచితిని సం
ధ్యారాగ మీక్షించితిన్
బళిరే యంటి దరంగిణీపులిన సీ
మల్ గాంచి మోదించితిన్
జలముం ద్రావితి - నీ విధిన్ బ్రకృతిసౌం
దర్యైకలోలుండనై.
విలసన్మూర్తి మనోవికాసమున దృ
ప్తిం జెందు నవ్వేళ నో
చెలికాడా! యెదు రేగుదెంచి చెయిలో
జేవైచు చందాన నీ
చెలువంబైన సురూప మెల్ల గనుపిం
చెన్ నేత్రసంతుష్టిగన్.

వయ్యాళి చనువేళ బరిసరాగత బాల
మందగంధవహంబు మలయువేళ
సరసమాడెడువేళ మురిపింపు గారాబు
మఱదికి మాటలు గరపువేళ
నవల వ్రాసెడివేళ నలువురితోగూడ
మించుగా విందారగించువేళ
నిదుర వోయెడువేళ నిండుకల్వల ఱేడు
చల్లని వెన్నెలల్ చల్లువేళ

నన్నివేళల వేయేల యంతె కాదు
సర్వకాల సర్వావస్థ సమయములను
జ్ఞాపకము వచ్చుచుందువుగాని యిపుడు
వచ్చిన విధంబు భేదంబు ప్రాణసఖుడ!

డెంద ముప్పొంగె కన్ను లానందబాష్ప
సంయుతము లయ్యె, మొగము హర్షప్రపూర్ణ
మయ్యె, వెంటనే యొక్క పద్యము స్ఫురించె
నద్దియే పెక్కు పద్యంబు లయ్యె సఖుడ!

వెలియో నిక్కువమో మదీయ సుమనో
విభ్రాంతియో మాయయో
కలయో యేదొ యెఱుంగ నెట్లయిన ద్వ
త్కల్యాణరూపంబు క
న్నులకున్ గట్టినయట్లు గన్పడుట, సం
తోషంబు వాటిల్లుటన్
గలయే యంచు దలంతుగాని, యది ని
క్కంబంచు నూహించెదన్."

పై పద్యములు పంపిన ఉత్తరములతోపాటు ఆ కవరులోనే ఉన్న మరి యొక ఉత్తరములో నిట్లున్నది.

Between the hours of four and three. P. M. 15-5-15.

"ప్రాణసఖా! చెలికాడా! హృదయమిత్రమా! నెచ్చెలీ!
ప్రియవయస్యా!" — అని సంబోధించి:

"ఎఱుగవా ? నీ హృదంతర సరోవర నిరం
తర తరంగానీక నటన హంస ?"

ఇత్యాది పద్యాలు పంపినాడు.

అప్పటికి స్కూలుఫైనలు పరీక్షాఫలితాలింకా రాలేదు. అప్పుడే అతడు ఎంత చక్కని పద్యాలు చెప్పేవాడో చెప్పడానికి కాదివి ఉదాహరించినది. పరిపక్వబుద్ధి కలవారు మాత్రము ఎంతమంది ఇంత చక్కని పద్యములు చెప్పగలరో ఆలోచించమని సహృదయులను ప్రశ్నింతును.

అతడు స్కూలుఫైనలు చదువుచుండగానే "విజయధ్వజము" అనే నవల వ్రాసి ఒక పోటీకి పంపినాడు. అది ఏ పోటీయో నా కిప్పుడు జ్ఞాపకము లేదు. విజ్ఞానచంద్రికవారిదై యుంటుంది. ఆ పోటీకి వచ్చిన నవల లన్నిటిలో ఇదియు మరియొకటియు మాత్రమే ఉత్తమములుగా నిర్ణయించినారట. అందులో దేనికి బహుమతి ఈయవలెనో తేలక పరీక్షకులు చాలాకాలము—సంవత్సరాలు—ఆలోచించినారు. తుదకు పోటీ పెట్టినవారికి బహుమాన మీయగలస్థితి తగ్గినందువల్ల కాబోలు, వా రదికూడా త్రిప్పి పంపివేసినారు. బహుమతి ఎవ్వరికీ ఇయ్యలేదు. ఆ నవల వ్రాతప్రతి ఇప్పటికీ అతని బావమఱది కస్తల శివప్రసాద్‌వద్ద ఉన్నట్లు తెలియుచున్నది. నా కెప్పుడూ పూర్తిగా ఆ నవల చదువుట తటస్థించలేదు.

ఇంటరుమీడియేటు ఇద్దరము తోడుగా కొంత తప్పినందున మూడేళ్ళు చదివినాము. అప్పుడు సెప్టెంబరు పరీక్షలు లేవు. ఇంటరు సీనియరు చదువుచుండగా నాకు సాహితీసమితి సభాపతులతో పరిచయ మైనది. ఆయన నాకంటె ఎనిమిదేళ్ల పెద్ద. ఆయనద్వారా శ్రీయుతులు వీరరాఘవస్వామి, శివకామేశ్వరరావు, పూర్ణశర్మ, బాబూరావు, వెంకటసుబ్బయ్యగార్లతో .... అనగా సమితితో పరిచయము అయినది. దానితో ఉభయులము ప్రపంచములో పడ్డాము.

గుంటూరులో అప్పుడు బి.ఏ. క్లాసు లేదు. నేను చెన్నపట్నమూ, అతడు బందరూ వెళ్ళినాము చదువుకు! మా దేహములు దూరమైనప్పటికి ఉత్తరముల ద్వారా మా స్నేహము నిలుపుకొనసాగితిమి. బి. ఏ. చదువుచుండగా నా కతడు వ్రాసిన ఉత్తరాలు చదివేవరకూ అతడు చదువు కవసరమైన డబ్బుకై ఎంత

బాధపడుచుండెనో నాకు తెలియదు. మా తండ్రిగారి చాటున ఉన్న నా కట్టి బాధ తెలిసే అవకాశము లేదు. ఎన్నిమారు లతడు ధనసహాయమునకై శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి యొద్దకును, శ్రీ కె. వి. లక్ష్మణరావు పంతులుగారి యొద్దకును నన్ను వెళ్లమని వ్రాసెనో నేను చెప్పలేను. ధనసహాయమునకై ఇతరుల నర్థించుట నే నెరుగను. అందుచేత నేను వారిదర్శనము స్వయముగా చేయుటకు వెల్లక అతనికి దగ్గరబంధువును, మా ఇద్దరకు మిత్రమును అగు శ్రీ బుద్ధిరాజు సుబ్బారావుకు చెప్పి వారికి చెప్పించువాడను. వారల సహాయము అతనికి ఎంతో తోడ్పడియుండును!

ఆమధ్య ఆ ఉత్తరాలు చదువగా నాగుండె తరుగుకొనిపోయినది. విజయధ్వజమునకు బహుమానము రాకపోవుటవల్ల ఆనాడు అతనికి రావలసిన గౌరవము రాలేదనే పరితపించితినిగాని దానితోపాటు రావలసిన ధనము రానందున అతని కెంత ఆశాభంగ మైనదో నేనప్పుడు ఊహించలేదు.

బి. ఏ. చదువుచుండగా వ్రాసిన ఉత్తరా లన్నీ ధనాభావమును గూర్చి, అనారోగ్యమును గూర్చి. కాని, ఇంటరు చదువుచుండగానే అతనికి బాధలు ఎక్కువైనవి. 5—9—17 న ఎనిమిదిపేజీల ఉత్తరము వ్రాస్తూ, ఇట్లా ప్రారంభించినాడు.

> "I always rightly see that without closely reading your letters and with a superficial study, there is one characteristic feature, which pervades through your writings, and which pervading one has drawn me more and more towards you, and that feature is without any prolix statement, the spontaneous expression of your genuine love."

ఈ విధంగా ప్రారంభించి (ఇందులో నేనేమీ దిద్దలేదు. కామాలు కూడా అతనివే.) కొంతదూరము పోయి, తన అనుభవాలు తెలిపినాడు.

> "When I came up to the High School Classes and realised, I boast, my powers and being ignorant of my limitation, I indulged in high aspirations of life. As an impatient idealist, I determined to reach the destination at as early an age as possible, made some progress in litarary compositions and was successful so far ehat they were quite juvenile and

betrayed my want of vocabulary. As soon as stepped into the second year class, I contemplated to make it a period of preparation without composing a line of poetry. But lo! Fate waited for me! .........

When my period of preparation became a period of constant nervous debility etc., my hopes began to fail.

These evil instances necessarily drive me to the conclusion that I must be rotten in this, and at last, became an easy pray to death, destitute of intellectual advancement and the fulfiiment of my life purpose.

I think you are aware of the fact that I always aim him. Do you think that it is ridiculous on my part to aspire to become a great litarary thinker, having a vast knowledge of poiitical econamic and religlous including social problems of the world, with their soiutions."

ఇక నాలుగైదేండ్లకు దేహయాత్ర చాలించు ననగా ఇట్టి ఉత్తర మతడు వ్రాయుట చిత్రము. 1918 సం॥ ప్రాంతములో తెలుగుదేశములోని యువకపులకు ఎట్టి ఆదర్శము లుండెడివో రాజశేఖరుని ఉత్తరము విశదము చేయగలదు. అందులో ఎంత పసితనము గోచరించినను, కేవలము చౌకగా పేరు తెచ్చుకొనవలె నను ప్రయత్నము ఏ కోశమునా కనిపించదే! ఈ కాలపు యువకపులే కాక పెద్దలుకూడ రాజశేఖరుని పసితనపు ఆదర్శములను అనుకరించినచో కృతార్థులు కాగలరేమో కదా!

ఈ ఉన్నతాదర్శములను మనస్సులో పెట్టుకొని కొన్నాళ్ళకు "బృందావనము" అను కావ్య మతడు ప్రారంభించినాడు. బమ్మెర పోతన దశమస్కంధము పూర్వభాగమంతా అతని మనోవీథిలో చిత్రిత మైనది. పోతనవాక్కులోని తేనె రాజశేఖరుని వాక్కులో మిళితమైపోయినది. కాని అది పోతన అనుకరణ కాదు, కవులకు విద్వత్తు ఎందుకు? సంస్కారమునకు. అట్టి సంస్కారము పోతనవాక్కులచే రాజశేఖరునికి కలిగినది. రాజశేఖరుని గోపగోపికలు కృష్ణాన్వేషణము ప్రారంభించినారు. ఈ అన్వేషణములో ఒక నూతనభావ మావేశించినది.

రాజశేఖరుని శ్రీకృష్ణుడు గొల్లపడుచులను మరులుకొలిపించిన గొల్ల పడుచువాడు కాడు. అతడు భారతధర్మమును ఉద్ధరించు భగవంతుడు. అతడు వేణునాదముచే లోకము నంతటిని సామరస్యముతో లీనము చేయు గానరసికుడు. ఆ శ్రీకృష్ణుడు కనబడలేదు.

అతనికై అన్వేషణము బృందావనము!

"కనబడవోయి కృష్ణ! చిరు
గంటల నాట్యము సల్పవోయి, నీ
యనుపమ జాయమాన కరు
ణామృతముం గురిపింపవోయి, మా
మనసులలోన నివ్వటిలు
మాంద్యములం దొలగింపవోయి, మో
హన మొనరింపవోయి సచ
రాచర మైన ప్రపంచజాలమున్."

... ... ... .... ... ...

"ఆ యమునానదీజలత
రంగ మనంబున లీన మయ్యెనో
వాయు రవానుకారి యయి
వాయువుతో బరదేశ మేగెనో
కోయిల కూయితో గలసి
"కూ"యను శబ్దముగాగ మాఱెనో
యే యెడ జేరెనో జగతి
కింపగు వేణునినాద మక్కటా!"

ఈ బృందావనములోని పద్యములు చదివినప్పుడు మాబోంట్లకు ఆ శ్రీకృష్ణుడు రాజశేఖరుడుగానే భాసించి భావావేశము కలిగించి కన్నీరుకార్పించుట చోద్యము కాదు. ఈ బృందావనము వ్రాయుచు కొద్దికాలము గుంటూరు టవునుహైస్కూలు లోను, తర్వాత దుగ్గిరాలలోను, ఆపిమ్మట నందిగామలోను ఉపాధ్యాయుడుగా నుండెను. నందిగామలో ఉండి స్కూలుఫైనలు పరీక్షలకు అసిస్టెంటు సూపరిం టెండెంటుగా బెజవాడ వచ్చి పని పూర్తి చేసికొన్నాడు. బజారునుండి వస్తువులు

తీసికొని ఇంటికి వెళ్ళదలచినాడు. ఊరిలో బండిలో ఉండగానే కలరా తగిలినది. బెజవాడ వదలలేకపోయినాడు. పరీక్షలమధ్య సంవత్సరాదినాడు సెలవు రాగా గుంటూరు వచ్చి నన్ను చూచిపోయినాడు. మరునాడే కలరా! ఆ కలరా కూడ అతనికొరకే వచ్చినది. అప్పుడు బెజవాడలో కలరా లేదు. ఖననము చేసిన అతని శవమునుకూడ నక్కలు లాగివేసినవని తర్వాత కొన్నాళ్ళకు నాకు తెలిసినది. బెజవాడ వెళ్ళినపుడు తరచుగా నా కాళ్ళు గవర్నరుపేట ప్రక్కకు కృష్ణలో నున్న రుద్రభూమిలోనికి నన్ను లాగికొనిపోవును. అతడు అక్కడ నున్నాడా? ఏమి యజ్ఞానము! ఆ ప్రదేశములో నేను సంచరించిన పర్యాయములు శతాధికముగా నుండును. అతనిశల్యములే నా కాళ్ళనో, నా కళ్ళనో పలుమారు పడియుండును. కాని గుర్తింపగలనా?

ఆవసానకాలమునకు అతడు వ్రాయుచున్న గ్రంథములు బృందావనము కాక, సోమవార మహత్త్వము, విజయనగర సామ్రాజ్యస్థాపనము అను నాటకములు, చంద్రహాసవిలాసము అను ప్రబంధ మున్నవట! అవి ఏమైనవో తెలియదు. అతడు వ్రాసిన పుస్తకాలు ఎన్ని ఉండేవో కూడా చెప్పలేను.

నందిగామలో నత డుండగా అతనికి శ్రీ శేషాద్రిరమణకవులలో ఒక్కరితో స్నేహమయినది. ఆయన ఇట్లు విలపించినాడు:

> "కలకలలాడు నీ నగుమొగం బిక గానగరాదు, భావమం
> జులమగు నీదుకైత చెవి సోకదు మాకిక, నీ ప్రశాంత పే
> శలరవ జీయమూర్తి కనజాలు నదృష్టము వల్లదింక, నీ
> చెలిమికి బాష్పతర్పణము జేసెద గైకొను రాజశేఖరా!"

నాకీ దుర్వార్త వారమురోజులకు గాని తెలియలేదు. అప్పటికి నాకు ఇప్పుడున్న పూర్వాచారాభిమానము లేదు. కాని వెంటనే చిత్రముగా ఆశౌచము వచ్చినట్లు తోచినది. సమీపవర్తియైన శ్రీమాన్ కొమాండూరి కృష్ణమాచార్యులు గారికీ అనుభవము చెప్పగా ఆయన విని ఆప్తమిత్రుని మృతికి గూడ ఆశౌచమున్నదని నిర్ధారించినారు.

బృందావనములో అతడు వ్రాసిన కృష్ణవిరహగీతము లన్నీ నాకు అతని విరహగీతములుగా అన్వయించును. ఇరవై యేడేళ్ళయిపోయినను అవి వంటరిగా

చదివినప్పుడు నాకు కన్నీళ్లు ధారగా రాకమానవు. అతడు దుందుభి చైత్ర శుద్ధ తదియనాడు (31—3—22) ఈ లోకయాత్ర చాలించెను. కొంతకాలమునకు చైత్రమాసములో నాకు స్మృతి కలిగి "వాసంత స్మృతి" అనే పద్యాలు చెప్పినాను.

"నవచూతావళి పల్లవింపగ వసంత ప్రేమచేతం దిగం
త వనాంతంబుల మత్తబంభరము చింతాగానముల్ సేయగా
చివురుల్ వెట్టె బ్రసూన కోమల సుధాస్నిగ్ధాత్మసీమం దురం
త వియోగవ్యథ నాకు మిత్ర ! మృదుహార్దంబుల్ స్మృతిం బారుటన్"

కాని, మిత్రవియోగము కావ్యవస్తువుగా చేసికొన్నందుకు నాకే సిగ్గయినది. అందుపై "కవికాఠిన్యము" వ్రాసి ఆపిమ్మట "కాలధిక్కృతి" వ్రాసినాను. ఇంతకాలమైనను అతనిస్మృతి వ్రాయదలచిన పద్యకావ్య సంపుటి ఇంకా పూర్తి కాలేదు.

రాజశేఖరుని స్మరణ మరి లోకమున కెందుకు? అతని నవల "విజయధ్వజము" పెద్దపోటీలో బహుమతి పొందుటకు తగినదిగా అధికారులు నిర్ణయించినందున ప్రశస్తమైనదని ఊహింపవచ్చును. కాని అతని "బృందావనము" పద్యములు ఇప్పటికి లభ్యమైనంతవరకు భద్రపరచుకొన్నాను. తెలుగుభాషకు అలంకారముగా ఉండును. అమరుకకవి ఎన్ని శ్లోకములు వ్రాసెను? పుష్పబాణవిలాస మెంత? గ్రే ఎన్ని పద్యములు వ్రాసినను అతని 'ఎలిజీ' ఇంగ్లీషుభాష మరచిపోవునా? ఫిట్జ్ గెరాల్డు ఎన్ని కావ్యములు వ్రాసినా అతని "ఓమారు ఖయ్యాము" మరతుమా? రాజశేఖరుని 'బృందావనము' ఆంధ్ర సహృదయులు మరచినచో ఆంధ్రకవితాదేవి కిరీటములోని రత్న మొకటి పోగొట్టుకొనుటయే !

(భారతి జూన్ 1949 – సంపుటము 26, సంచిక 6)

—o—

# ఎఱ్ఱయ కవిత

౧

"క్రమపాకంబున గెంపుతోడి నలు పె
క్కన్ మిక్కుటంబైన గం
ధము దిక్కుల్ సురభీకరింప రసమం
తర్గామి యయ్యున్ వెలిం
గమియం గాఱుచు నున్న చాడ్పున విలో
కప్రీతి గావింప హృ
ద్యములై యున్నవి చూచితే ఫలము లీ
లతాద్రుమశ్రేణులన్."

ఈ విధముగా ధేనుకాసురుని తాళవనములోని ఫలములను బలరామునికి శ్రీకృష్ణుడు చూపుచు పలికినాడు. ముట్టినంతనే స్రవించిపోవు ద్రాక్షాఫలముల రసము కాదు ; అతికష్టసాధ్యమగు నారికేళరసమును గాదు, ఎఱ్ఱయ కభిమానమైనది. అంతర్గామియై చిక్కని రసముండుటేకాక, అది వెలింగమియం గారుచున్నట్లుండి నేత్రపర్వము చేయుచు ఉచితమగు పాకముచే దట్టమగు సుగంధము దిక్కులు నిండిపోవునట్లు చేయగల తాళఫలరసపాక మతని కభిమానపాత్ర మైనది.

అతడు తన కావ్యములలో స్తోత్రము చేసినది సంస్కృతకవులలో వ్యాసవాల్మీకులను, తెలుగువారిలో నన్నయ తిక్కనలను మాత్రమే ! ఎఱ్ఱయకు సూక్ష్మవిషయములలో గూడ ఔచిత్యవిచార మెక్కువ ! ఏ కావ్యములో ఎవరిని ముందు స్మరించవలెనో, ఎట్లు స్మరించవలెనో కూడ అతడు విచారించియే చేసెను. ఈ నలువుర స్మరణచే అతని కెట్టి కవిత్వ మభిమానమో కూడ సూచించినాడు. ఆంధ్రమహాకవులను మహర్షులగు వ్యాసవాల్మీకులతో పోల్చుట సాహసము. కాని, కవితామార్గములలో నన్నయకు వాల్మీకి ఫక్కియు, తిక్కనకు

వ్యాస పఙ్క్తియు ఇష్టము లనుటకు అభ్యంతరముండదు. అంతర్గామిరస మొక రికిని, వెలింగమియంగారు రస మొకరికిని కావ్యరచనలో అభిమతములు. ఈ రెండు మార్గముల రసయోగము సాధించుట ఎట్టియ ఆదర్శమా?

మహాభారతములో ఆ కాలమునకు మిగిలిపోయిన అరణ్యపర్వ శేషము పూరించుటకు ఈతనియందు ముందు నన్నయభట్ట మహాకవీంద్రు సరస సార స్వతాంశ ప్రశస్తి చెందినది. ఆ పిమ్మట 'ప్రాకసంయమితుల్య వర్తను' డగు నాతని పితామహుడు స్వప్నములో శాసింపగా కులదైవమగు అహోబల నృసిం హుని యవతారకథ వర్ణించెను. అంతట మన కింతవరకు లభింపకున్న శ్రీరామ కథ చెప్పి అన్నమ వేమభూవిభుని 'అత్యుత్తమఖ్యాతి గడింప' జేసినాడు. ఆ తరువాత హరివంశము భారతపరాంశము కనుక మహాభారత సంపూర్తికై యదియు తెలిగించినాడు. ఈ విధముగా భారత రామాయణముల భాసురార్థము లను పూర్తిగా "గానట బీసటే చదివి గాథలు ద్రవ్వ తెలుంగువారికి" అందజే సిన ధన్యుడు ఎఱ్ఱయ!

ఈ "శంభుదాసుడు" రచించిన గ్రంథము లన్నియు శ్రీ నారాయణావ తార లీలలు వర్ణించున పగుట ప్రాకృతులకు వింతగా నుండవచ్చును.

"గిరిశపదభక్తి రసత
త్పరభావము కలిమి శంభుదాసుం డనగా
బరగిన గోవిందగుణా
దర సంభృత సౌమనస్య ధన్యుడ వెందున్!"

అని పితామహుడు పల్కెను. హరివంశములో శ్రీకృష్ణుడు పంద్రెం డేళ్ళు తీవ్రతపస్సు చేసిన కథ కలదు. అత డప్పుడు —

"ప్రణిధానంబున నంబా
ప్రణయుం బశుపతి నమర్చి భక్తి యెలర్పన్
బ్రణవము రుద్రాధ్యాయము
బ్రణుతమతి జపించుచుండె బహ్వాయమునన్."

తుద కాతనికి హరుడు ప్రత్యక్ష మయ్యెను. అప్పుడు,

"హరి జూతురు హరు జూతురు
హరి జూతురు క్రమ్మఱంగ హరు జూతురు ని
ర్జరులును మునులును నిమ్మెయి
హరిహరతత్త్వముగ విస్మితాలోకనులై."

అందే బాణాసురుని సంహరింప శ్రీకృష్ణుడు చక్ర మెత్తెను. బాణుని రక్షింపుమని హరుడు కోరెను. శ్రీకృష్ణుడు సుదర్శనచక్ర ముపసంహరించి -

"దితిసుతుడు బ్రతుకుగా కను
మతి నిమ్మెయి నరిగెదను నమస్కృతి యిదె నీ
కతుల భవత్ప్రియకరణ
ప్రతిపాదన మెందు బరమభద్రము కాదే!"

కావ్యరసముకూడ రసయోగముపలెనే అభినవత్వము, నిత్యయౌవనము కలిగించు నని రసాభిమానము ప్రదర్శించినాడు.

"ఘనరసోపయోగంబున న్గ్రమ్మఱంగ
బడెసె బ్రాయంబు దగదె యిబ్బంగి యనగ
హరిత తృణ లతారుణ కోమలాంగి యగుచు
బృథ్వి యెంతయు గ్రొత్త యొప్పిదము నొందె"

అని వర్షర్తువును వర్ణించినాడు. వసుదేవుడు కంససభలో మొదటిసారి శ్రీకృష్ణుని —

" .... .... చూచుచున్
వెస నానంద రసానుభూతి నలవన్ సిద్ధుండ పోలెన్ జరా
వ్యసనం బేమియులేక యత్తఱి గుమారాకారు డయ్యెన్ మదిన్."

ఎట్టియ నందుచే కావ్యరససిద్ధు డనవచ్చునా ?

"అతి సౌమ్యము లతిఘోరము
లతిసూక్ష్మము లతివిపులము లద్భుతములు నీ

వితతాకారంబులు త
ద్గత హృదయుల కెఱుగవచ్చు గంధర్వహరా !"

శంభుదాసుని రసాకారములు మాత్రము ?

ఈ రసయోగదర్శనముచే వాక్కులో ఎట్టియకు హృద్యతయు, ఉదారతయు నభిమానమైనవి. హరివంశ 'రమ్యకథ దెనుంగుగ ధీరోత్తము' డగు నాతడు ప్రారంభించెను. 'అత్యంతహృద్యోక్తి విన్యాసం బొప్పగ శ్రుతితుల్యం బద్భుతార్థోదయ శ్రీసంభావితమగు' పురాణము చెప్పుమని సూతుని శౌనకుడు వేడెను. వైశంపాయనుడు దానిని జనమేజయునికి "ఉదాత్తతర హృద్యోక్తితో" పలికెను. వందిమాగధులు పృథుచక్రవర్తికి "మధురమనోహర పవిత్రచిత్రస్తోత్రంబుల" నుపన్యసించిరి. నారదుడు వీణను "మధుర దివ్యధ్వని మెరయ జిత్తప్రబంధోజ్జ్వలతానరచన" వాయించెను. కాళియుండు కృష్ణుని బట్టగా బలభద్రుడాతని "గంభీర మధురస్వనము"తో నుద్బోధించెను. అంతట కాళియుని పడగలపై శ్రీకృష్ణుడు నాట్య మొనర్చెను.

"యమునావీచిమృదంగవాద్యములు ప్రో
యం దీర గోపౌఘ హ
ర్ష మనోజ్ఞధ్వనితంబు గేయముగ జం
చత్కాళియ వ్యాళ భో
గ మహారంగతలంబునం బటుగతిం
గంజాను నిర్మథ్య నా
ట్యము హృద్యాద్భుతభీమమై పరగ ది
వ్యశ్రేణి చూచెం దివిన్."

అక్రూరుడు శ్రీకృష్ణుని "మధురతాభ్యుత్పన్న వాక్యములతో" స్తుతించెను. విశ్వకర్మ ద్వారకానగరమును "ఎంతయు నుదాత్తతరంబగు నాస్పదంబు పెంపలరగ నుత్పాదింతు" నని ఇంద్రునితో జెప్పి దాని నతడు "తన విద్యాతపములచేత నుపార్జితమైన పేర్మి దగ నఖిలంబును వినియోగించి విభుని పంచిన కంటె నుదాత్త శిల్పము దొడగెను.' నారదుడు 'వీణావల్లిక నక్కజూచి .... మధుర ప్రారంభ సంభూతితో . .. .... నిర్వాణానందముబట్టి చూపెడుగతిన్' వాయించినాడు. ప్రహ్లాదుడు —

" .... .... వెండిపల్కు నిం
పెలయగ నంబ లక్ష్మి జగదేకజనేత ముకుంద యంచు న
త్యలఘుతర ప్రబోధ మధురాక్షరవాక్య వివేకదక్షుడై."

హిరణ్యకశిపు డాతని -

" .... .... ప్రస్ఫురితార్థసారమై
తీపులు వీనులం గురియ దివ్యసుభాషితరత్న మొక్క టు
ద్దీపిత ధీవిజృంభణ విధేయత యొప్ప నుపన్యసింపుమా !"

అని కోరెను. భవనాశినీజలము 'అకలంకము అక్షయ రసోదాత్తము' 'చతుర మనోజ్ఞ విజ్ఞాన లతలు' లక్ష్మీవనములో కలవు. శ్రీకృష్ణుడు మార్కండేయునితో "లోకసమ్మానితవాక్య, నీదయిన మంజులవాగమృత ప్రవాహమున్ వీనుల దోయిలించుచును వేడుక గ్రోలికొనంగ నాత్మలం బూనెద"మని పల్కెను.

"పరిపక్వ మంజులఫలరసోద్ధతములై
పలుకు రాచిలుకల పటురవంబు"

సావిత్రికి సత్యవంతుడు వనములో చూపెను. వామనుడు బలి యొద్ద కరిగి 'యాశీర్వాదం బిచ్చి మధురోదాత్తస్వరంబున' బల్కెను. నారాయణుడు మార్కండేయునితో ప్రళయపయోనిధిలో 'విస్ఫుర దుదాత్త మనోజ్ఞ మితస్వరంబునన్' బలికెను. జనమేజయుడు వేదవ్యాసుని సమక్షమున భారతరచన నిట్లు ప్రశంసించెను.

"సర్వామ్నాయ పురాణశాస్త్ర పదవీ
సంభావితార్థస్థితుల్
నిర్వాహంబున బొంద సర్వకవితా
నిర్బంధ సంపూర్ణమై
గర్వారూఢి దలిర్ప సర్వజనతా
కర్ణామృత స్యందిగా
సర్వజ్ఞుల్ భువి మీరు భారతము ప్ర
జ్ఞం జేత యింతొప్పనే !"

"హరివంశకథోత్తరముగ
గురువంశ సుధారసంబు గ్రోలెదునెడ నొం
డు రసంబులు చెవు లొల్లవు
పరవశమై మనసు చెవుల పాలిద యయ్యెన్."

ఉజ్జ్వల, ఊర్జిత శబ్దములు ఎట్టియవర్ణనలలో దొరలుచుండుటయు నాతని యాదర్శములు ఎట్టివో అనుమేయించనగును.

౨

అవసరము కలిగినప్పుడు వ్యంగ్యరచనలో ఎట్టియ సిద్ధహస్తుడు. బలరామ కృష్ణులను మట్టుపెట్టించు నుద్దేశము మనస్సులో నిడుకొని కంసుడు వారలను చూడదలచినవాడువోలె నటించుచు తోడితెమ్మని శ్రీకృష్ణభక్తుడగు అక్రూరుని బృందకు పంపెను. కంసుని అంతరంగికోద్దేశము శ్రీబలరామ కృష్ణులకు తెలుపుట కంససేవకుడగు నాతనికి పాడిగాదు. భగవంతుడగు శ్రీకృష్ణుని కది తెలుపకుండ భక్తుడగు నత డెట్లుండగలడు ? ఆరాత్రియెల్ల నక్రూరుడు శ్రీకృష్ణునితో మాట్లాడుచునే యుండెను. ఎట్లు ?

"తీపు మిగులు నక్రూరు నాలాపములకు
నల్ల మపగతనిద్రమై యుల్లసిల్ల
నట్లు ప్రియ మందుచున్న దైత్యాంతకునకు
నరిగె నవ్విభావరి ముహూర్తాభ యగుచు."

అంతసేపును వాచ్యముగా నాతడు కంసునిభావము చెప్పలేదు. కాని, వ్యంగ్యముగా బహుభంగుల తెలుపకుండగనే తెలిపి ఇటు ప్రభుభక్తికి, అటు భగవద్భక్తికి విరోధము లేకుండ సమర్థించెను. ఆ ఘట్టము ఎట్టియ మిక్కలి సమర్థతతో నిర్వహించెను. కాని దానితో నాతనికి తృప్తి కలుగలేదు.

"అని యక్రూరుం డనేక క్రమంబులం జెప్పిన వాక్యంబుల యభిప్రాయం బంతయు నెఱింగి కృష్ణుండు"—

అని తుదకు చేర్చినాడు.

అట్లే వ్యంగ్యరచన కౌశిక కుమారుల ఘట్టమునను, నారదుడు అద్భుత ధన్యతముల నన్వేషించిన సందర్భమునను కలదు. కాని యా రెండునెడల గూడ తుదకు వివరణ యున్నది.

ఆంధ్రదేశము పూర్వమీమాంసకు కాణాచి. అందుచే స్పష్టమగు వాక్యమందు మన కభిమానము. ఎఱ్ఱయకును వాక్కులో విస్ఫుటత్వము నభిమానము. 'నన్నయ తిక్కనార్యులు భాసుర భారతార్థముల పరమార్థము తెనుంగువారికి' తెల్లగ జేసినారట. గాలవుడు 'విశద విస్తారముగ' కథ నుపన్యసించెను. రాజస్తవములో అత్రి "స్తు నిన్ను గొనియాడు బరిస్ఫుటవాక్యభంగులన్" అనెను. శౌనకుడు యాదవుల 'జన్మచరిత్ర ప్రపంచంబు సమస్తంబును విస్తర ప్రశస్తంబుగా నుపన్యసింపవలయు' నని యర్థించెను. బ్రాహ్మణుడు బ్రహ్మదత్తునకి 'సువ్యక్తవర్ణోచ్చారం బగు నెలుంగున శ్లోకంబులు' వినిపించెను. నారాయణుని సురలు 'ప్రకట మధురవాక్యంబుల' బ్రస్తుతించిరి. కృష్ణ సంపీడనంబుల సంక్లిష్ట విస్పష్టంబులగు వాక్యంబులం గ్రమంబునం జెప్పెను. ఆశ్వాసాంతములందు వైశంపాయనోక్తి వర్ణన మున్నది. ఒకచో, 'కథాప్రపంచంబు సమంచిత వ్యాఖ్యాన విఖ్యాతంబుగ' ననియు, 'విష్ణుచరిత్రాత్మకం బగు వాఙ్మయం బతి ప్రత్యుక్తంబుగ' ననియు, ఉపన్యాసము పరిస్ఫుటోల్లాసంబుగ ననియు, వ్యాఖ్యాతంబయిన వాక్యజాతం బభిజాతార్థ సమర్థంబుగ ననియు 'వినిపించిన కథ ప్రశస్త విస్తర ఫణితిన్' అనియు పరిపరి విధముల వర్ణించెను.

ఇట్లు విస్ఫుటముగా విస్తరించుటలో ఎఱ్ఱయకు ఔచితియం దభిమాన మెక్కువ. ఔచిత్యావసరమునకు మూలకారణము సత్యవచనాభిమానము. అనుచిత మెప్పుడును అనృతముగా నుండును.

స్తోత్రములోగూడ నతిశయవర్ణనము అనుచితము. లేనిగుణము లున్నట్లు వర్ణించుట నిజమైన స్తోత్రము కాదు. "మున్నంభోజభవు యాగంబునందు సుత్యాహమున జనన మొంది సూతుండును, మాగధుండును నా నొప్పు సంయమియు నా యజునాజ్ఞ గైవారులై దివిజుల పనినున్కి నందుల ఋషులు వేల్పులు ప్రియంబున వారిం బిలువ బనిచి పృథునరేశ్వరు దిటమీద బేర్మి యెసగ జేయగల కార్యంబులు సవిశేషకృతులు నాత్మదృష్టిమై గని మీర లతని యెదిరికేగి కైవార మొనరింపు డింపు మిగుల" నన వారట్లు చేసిరి. పిమ్మట పృథు వా

కార్యములు నిర్వర్తించెను. వంధి మాగధుల కైవారమే సత్యవాక్య మయినచో ఇతరస్తుతు లెట్లుండవలెను? అది అత్రిగౌతమ సంవాదములో ఎఱ్ఱయ వివరించెను.

అధ్వరదీక్షితుడైన పృథుచక్రవర్తిని అత్రి ఆశీర్వదించి —

"నీవ విధాత వింద్రుడవు నీవ సమస్త జనేశ్వరుండవున్
నీవ యశేషధర్మములు నీవ యెఱుంగుదు ...."

ఇత్యాదిగా స్తుతి చేసెను. అది విని సభలోనున్న గౌతముడు "కలుషించి ఇటు నోరఱువంగ బ్రేలెదవు .... అర్థకాంక్షివై మనమున శంకలేక యొక మానవు నింత నుతింప నేటికిన్" అని ఆధిక్షేపించెను. అత్రి తన స్తోత్రము సత్య మని సమర్థించుకొనెను. "వారు మహానాదంబుగా వాదించుచుండ" కాశ్యపుడు సకల ధర్మజ్ఞుడగు సనత్కుమారుని పాలికి జని వారివివాదంబు తెఱంగెఱింగిం చిన నతండు "అత్రి నిజంబు పల్కెదగు నాతనివాక్యము ధర్మయుక్తము" అని సమర్థించెను.

ఈ రహస్య మెరిగిన ఎఱ్ఱయ దేవశ్రవునిచే నిట్లు శ్రీ లక్ష్మీనృసింహావ తార* ప్రారంభమున చెప్పెను.

"ఏనును బెద్దలచే మును
వీను లలర దరతరంబ విన్న విధంబున్
మానసమున నున్న తెఱగు
గానుపునం గన్న క్రమము గథన మొనర్తున్."

నృసింహమూర్తిని "అని బహుభంగులన్ మునిసురావలి తన్వి నుతించు వాఙ్మయధ్వనులు నభోదిగంత మిళితంబులుగా .... దన నరసింహలీల వినుత స్థితి సార్థకమై తనర్పగన్" విలసిల్లె నట. మరియు భారతీవల్లభుండు సల్లాప రూపంబుగా నభిరుపార్థ నపంబులు గావించె. సావిత్రిస్తుతికి యము డిట్లనెను.

---

* ఎఱ్ఱయ తన్ను గ్రంథములలో నెక్కడను ఎఱ్ఱాప్రెగ్గడ అని చెప్పు కోక ఎఱ్ఱయనామధేయ యనియే చెప్పుకొనెను. అట్లే తన గ్రంథము శ్రీలక్ష్మీ నృసింహావతార మని యెల్లెడ జెప్పెనేకాని నృసింహపురాణమని యెక్కడ నన లేదు. లోకములో ఈ మార్పులకు కారణ మేమో !

"తృషితు డగువాని బరిలఘు
తుషార తోయములు మోదితుని జేయుగతిన్
హృషితాంగు జేసె నను గ
ల్మషరహితము లైన నీ సమంజసఫణితుల్."

మరియును "వివిధభంగి సత్యధర్మఫణితి సంస్తుతించుటయు గృపార్ద్రి చిత్తు డగుచు నజ్జముండు" సావిత్రికి సత్యవంతు నిచ్చెను.

బలదేవ ప్రభావ మడుగగా వైశంపాయనుడు "వచోబలశాలి యనగ బరగిన బలరిపుగురునకు, బొగడ భరము నరేంద్రా, అయినను మదీయ బుద్ధి వాక్య ప్రచారంబులకు గోపరంబులైనవి వినిపించెద"నని ప్రారంభించెను.

సత్యవాక్య భంగమునకు ఎఱయకు గలుగు కోపము బలదేవునితో ద్యూతములో రుక్మియు, కళింగుడు నన్నృత మాడగా తెలిసి —

"సీరాయుధుండు సంరంభంబున సముత్థితుండై పటుముష్టి ఘాతంబున రుక్మిం జదివి యుఱికి నెత్తపలక మెత్తి కాళింగుదల పగుల నడిచి పండ్లు డులిచి చంపి యంత నిలువక .... పలువుర బోడి చేసి .... మత్తదంతావళంబు విడివడి యనర్గళక్రీడం గ్రాలు చందంబునం జరియించుచు రుక్మిం గొప్పపట్టి సభాద్వారంబునందాక డిగిచి నిహత ప్రాయుం జేసి విడిచె." అను సిత్యాది వర్ణనలలో స్పష్ట మగును.

కవుల జీవితాదర్శములే వారి కావ్యములలో ప్రతిఫలించును. కవులు ఎంత తీయని మాటలతో వ్రాసినను, ఎన్ని యలంకారములు గుప్పించినను, ఏమి అభిమానముగా చెప్పుటకు ప్రయత్నించినను వారి జీవితాదర్శములు ఉదాత్తములు కానిచో కావ్యములుకూడ మహాకావ్యములు కానేరవు. కవిత్రయమునకు, వారితోపాటు పోతనకును, కొంతవరకు పెద్దనకును తెలుగుదేశములో ఇప్పటికిని నిలిచియున్న విశేష పూజ్యభావమునకు వారల పవిత్ర జీవితములే కారణములు !

ఎఱ్ఱయనుగూర్చి అరణ్యపర్వాంతమున "భవ్యచరిత్రుడు, గుణగణ గరిష్ఠత నొప్పు ధన్యుడు, ధర్మైక తత్పరాత్ముడు, లోకైకవిదితుడు, ధీరవిచారుడు,

సాధుజన హర్ష సిద్ధి గోరి కవీంద్ర కర్ణపుటపేయముగా" నారణ్యపర్వ శేషము పూరించెనని యున్నది.

శ్రీలక్ష్మీనృసింహావతారములో "గురుభజనపరాయణుడు, సరస బహు పురాణ ధర్మశాస్త్రకథావిస్తరవేది, వినయోదితభరితుడు, అతులానుభావభవ్యుడు" అని యున్నది.

హరివంశములో "అంచితచరితుడు, సకలభాషాకవిత్వవిశారదుడు, సాధు సమ్మతుడు, నిత్యసౌమ్యమతి, భవ్యుడు, ధీరోత్తముడు" అని కూడ నున్నది.

ఇవియన్నియు నతడు తన్నుగూర్చి స్వయముగా చెప్పుకొన్నవియు, ఇతరులు అన్నట్లున్నవియు నగు వచనములు. ఏమిటీ ఆత్మస్తుతి యని నేటివా రడుగుదురు. హరివంశమున వాచకలక్షణము లిట్లున్నవి.

"అనసూయున్ జితకామరోషు గమనీ
యాకారు సత్యోక్తి శీ
లు నశేషాగమ శాస్త్రతత్త్వ నిపుణున్
లోకజ్ఞు బ్రాజ్ఞున్ శుచిన్
జనతాసమ్మతు భవ్యభక్తి నియమ
శ్రద్ధాసమేతుం బ్రియం
బున సత్కారము లొప్ప వాచకునిగా
బూజించి యుంచందగున్."

ఇచ్చటి వాచకలక్షణములే పై వర్ణనలలోని ఎఱ్ఱయ కన్వయించి యతని కీ గ్రంథములు చెప్పుటకు గల యధికారమును చూపుచున్నవి.

ఎఱ్ఱయకాలమున ఉత్తరభారతము మ్లేచ్ఛాక్రాంతమైనది. దక్షిణభాగమున గూడ వారల యలజడి ఎక్కువైనది. పరస్త్రీలను బలాత్కరించు మ్లేచ్ఛుల కథ లతడు వినెనేమో! అట్టి ప్రయత్నము చేసిన సైంధవునిపాటు నత డిట్లు వర్ణించెను:

తల్లడపడి యరదము డిగి
విల్లును నమ్ములును విడచి వెల్ల నగుచు మే

నెల్ల జెమర్పగ నూర్పులు
పెల్లుగ నమ్మనుజపశువు పెలుచం బఱచెన్.

అట్లు "మనుజ పశువు" అని వర్ణించుటలో ఎఱ్ఱయ కట్టివారలపై గల యసహ్యము, అతని ధర్మతత్పరతను సూచించును.

భీముడు —

"ఒడిసి తలపట్టి నేలం
బడ దిగిచిన వాడు పెనగబడుటయు జిక్కన్
మెడ ద్రొక్కి గాఢముష్టిం
బొడిచె మొగం బవియ రక్తపూరము దొరగన్,"

ఒడలెల్ల బిండికూడుగ
బొడిచి యెగయనెత్తి త్రిప్పి భూస్థలి మరియుం
బడవైచి యురము మొగమును
నడిచెను వదముడి తల ప్రహారకుశలుడై."

అప్పుడును ఆ శిక్షకు పాత్రు డయినది సైంధవుడే యగుట చిత్రము! సింధుదేశములో నెప్పుడు నేదైన నున్నదా ?

అతనిని ధర్మజుడు "నిన్ను నింద్రియ విలోలు నల్పు ధృతివిహీను నేమి యందుము, అరుగుము" అని మాటలతో శిక్షించి పంపివేసెను.

ఇట్టి ఘట్టములలో కవివ్యక్తి కథాయవనిక చాటుననుండి సువ్యక్త మగుచుండును. "కామవిలోభక స్పృహల గర్వపరంపర పొందువాని...తుది దాకిన యున్నతిగన్న శంకరస్వామి గురుండు మా తలపు సర్వము దా నయి యుండుగావుతన్" అని ప్రార్థించిన ఎఱ్ఱయ తన్నుగూర్చి చెప్పుకొన్నది ఆత్మస్తుతి యనదగునా ? గురుభజనపరాయణుడును, వినయోదితచరితుడు ననుటకు —

"మహాకవిజన ప్రార్థనంబును సద్గురుచరణానుస్మరణ కీర్తనంబును సమర్థించి గృతార్థతం బొంది కతిపయాక్షర పరిగ్రహజనితంబైన నైసర్గికభావంబు కతంబున —

"మించిన వేడ్క వీనులకు మిక్కుటమై మధువృష్టి గ్రమ్మ రా
యంచలు గూయ గ్రౌంచమును నావల గూయగడంగుభంగి బ్రౌ
ఢాంచిత శబ్దసారులు మహాకవు లాద్యులు కావ్యశయ్య గీ
లించిన కీర్తిసంగ సుఖలీలకు నేనును గాంక్ష జేసితిని"

అను భాగములు చాలవా ? అట్లు చెప్పగలిగినవాడు అతులానుభావభవ్యు డనుట కేవల సత్యవర్ణనము కాదా !

## 3

రసములు తొమ్మిది యను మతము వృద్ధసమ్మతము. ఐనను అవి ఎనిమిదే యను వాదమును కలదు. అట్టివారు శాంతము ప్రత్యేకరసము కాదనియు, సర్వరసముల సామరస్యమే యనియు నందురు. ఎఱ్ఱయ అష్టరసవాది యనుటకు గొంత యాధార మున్నది.

వైకుంఠపురములో –

"కూడి సమగ్ర తత్త్వ రసగోష్ఠి సుఖింతురు యోగిబృందముల్
క్రీడ యొనర్తు రష్టరసకీర్తిత భంగి బ్రసన్ను లయ్యెడన్."

అని వర్ణించినాడు. క్రీడకు శాంతరసము యోగ్యము కాదు. కనుక అష్టరసము లన్నాడనికాని, మరి ఇక్కడ కావ్యరసములకు ప్రసక్తియే లేదని కాని సమర్థించవచ్చును. అష్టరసములు వాచ్యముగా నిచ్చట చెప్పినది బలపరచు సూచనలు మరికొన్నియు గలవు. ఇతర రసముల పేర్లక్కడక్కడ నతడు గ్రంథములలో ఉదాహరించినాడుగాని శాంతరసము పేరెత్తలేదు. అతనికి అద్భుతరసము అభిమానరసము. అద్భుతము, అద్భుతరసము అను మాటలు ప్రయోగించి నన్నిమార్లు శ్రీ కల్యాణ శబ్దములు తప్ప మరి యేవియు నితడు ప్రయోగించలేదు. ఈ మూడు శబ్దములును అతనికి అలవాటైన ఊతపదములా ఏమి అనునట్లు తిరిగి తిరిగి వచ్చుచుండును. అద్భుత శ్రీకల్యాణములే యతని నావేశించి గ్రంథములు పలికించినవా ? అవియే యతని కవితాదర్శములా ? శ్రీ కల్యాణములు వేరుగా విచారింతము. ఈ అద్భుతమును ముందు కొంత పరామర్శ చేయుదము.

[illegible] యాత్రకపర్వములో చనిపోయిన బాలకుని మహాద్భుతాత్మకులై [illegible]. [illegible] ఉదకము మత్స్యము అద్భుతవేగంబున నీదెను. బాల కృష్ణుడు ప్రళయకాలమునలో అద్భుతాకృతి నుండునట. ధర్మజుడు మార్కండే యుని ప్రసాదమున నత్యద్భుత కథాశ్రవణ పరితోషితు డయ్యెను. మందూ కాంగన [illegible] బాగా [illegible] అద్భుతాత్మకుం డయ్యెను. మార్కండే యుడు [illegible] వ్రతముల నెరిగించుట మహాద్భుతమట! కువలయాశ్వుని [illegible] ఉదంకుడు "నను మొక్క యద్భుతంబు సెప్పెద" నని ప్రారంభిం చెను. కౌశికుడు ధర్మవ్యాధునితో 'నీ చరిత్రముం గన మది నద్భుతం బొలసె' నెను. [illegible] పావకుడు పుట్టగా, 'తద్దయు నద్భుత మందె లోక ములు.' [illegible] నద్భుతముగ నుదగ్ర దహనశిఖావళు' లుద్భ వించె. [illegible] చేపురు [illegible] నసురకత్తె అగుట యద్భుతము. ధృతరాష్ట్రుడు [illegible] 'అట్టిసిగదా వివిధాద్భుత కర్మపాకముల్' అను చెను. జనమేజయుడు అద్భుతంబగు దుర్యోధనుని చరితము చెప్పుమని యడి గెను. [illegible] భీముని వీర్యము 'అనేక మద్భుత'మని వర్ణించెను. అతలంబున [illegible] నద్భుతముగ [illegible] నెగసిపోయిన సైంధవుని దెత్తు'మని [illegible] ప్రతిజ్ఞ చేసిరి. యాదవులు భూవివరము అద్భుతముగ గనిరి.

మరియు తిక్కన్న యెన్నిమారులు అద్భుత శబ్దప్రయోగములు చేసినాడో లెక్కిం చిన గ్రంథము పెరిగిపోవును.

అద్భుత ధన్య శబ్దవాచ్యు డెవరో వానికై నారదు డన్వేషించిన మనో హరమగు కథ యాఖ్యాయిక హరివంశములో నున్నది. నారదుడు ముందొక కూర్మమును చూచి దాని కా శబ్దము లన్వయించెను. కూర్మము గంగయే యం దుకు తగుననెను. గంగాసాగరమే యందుకు పాత్రమనెను. సాగరము భూమిని నిర్దేశించెను. భూమి తన్ను ధరించు కులగిరులను చూపెను. కులగిరులు "విశ్వ [illegible] పితామహు డాధారముకనుక పరమాద్భుతము నధికధన్యము నగు మహా నుభావుం డతండే" యనెను. నారదుడు బ్రహ్మను అత్యద్భుత ధన్యపదములతో సంబోధింపగా నతం డదిరిపడి "యట్టి ప్రభావము కలవి వేదములే" యనెను. అంతట నారదుడు వేదముల నారాధించి సాక్షాత్కారంబు నొందించుకొని బ్రహ్మవాక్యము లివి యని చెప్పెను.

"అనవుడు వేదములు తపో
ధనవర యాశ్చర్య ధన్యదశ కష్టంపే
యనుపమ మహత్త్వకలితము
లనంతములు యజ్ఞములు సమగ్రోదయముల్.

ఏము గల్గుటి ఎల్లను యజ్ఞార్థంబు, యజ్ఞంబులు లేనాడు మా కలిమియు నిరర్థకంబు, మాకుం బరమ పరాయణంబులు యజ్ఞంబులుగా నెఱుంగుము." అనెను. అంతట నారదుడు యజ్ఞంబుల ప్రతిష్ఠ గావించి అద్భుతధన్య శబ్దవాచ్యములుగా బలికి వాని పరమ ప్రశస్తి కొనియాడగా నధ్వరము లిట్లనియె:

"మా కాత్మ విష్ణు డాతడు
గైకొని నడపంగ జెడక కలుగు నిరుపమో
త్సేకం బగ్నియు హవియు న
నాకుల మంత్రవిభూతు లతడ మునీంద్రా!

ఇట్లగుటంజేసి యాశ్చర్య ధన్య శబ్దంబులు రెంటికి నారాయణుడే పురుషుం డని చెప్పిన యధ్వరంబుల పలుకులు విని"

యాదవగోష్ఠిలో శ్రీకృష్ణభగవాను డుండగా సకలజన స్తోత్రపాత్రం బగు చందంబు గల యెఱుంగున గనుంగొని –

"అమరులు లోనగు జనముల
సమితాద్భుతకీర్తితో మహాధన్యత పో
కమలాక్ష! నీవు నీతో
సము లెవ్వరు నిక్కమునకు జప్పింపంగన్.

అనిన సదృశమ సఖుడు పలికితోడ
ననఘ! యద్భుతాత్మకుడ సత్యంబె పిమ్మ
తముడ నగుదు నే నొకపన విమలదక్షి
ణాఢ్యపేత సద్భావ మమరునేని.

నా విని నారదుండు యదు
నాయక ! నా చనుదెంచినట్టి కా
ర్యావధి సిద్ధ మయ్యె ప్రియ
మందితి జెచ్చెల బోయివచ్చెదన్"

అని గమనోన్ముఖు డయ్యెను.

అద్భుతరసమున కింత యతిశయ మేమి ? ధన్యశబ్దముతోపాటు అద్భుత శబ్ద ముండుటకు కారణమేమి? కేవలాలంకారికులకు అద్భుతరసము నుత్కృష్టత ద్యోతము కాకపోవచ్చును. వారికి శృంగారము ప్రథమారాధ్యము. కొందరికి వీరము. ఉత్తమ నాటకములు శృంగార వీరములలో నేదో ఒకటి ప్రధానముగా నుండవలెనని వారి మతము. భవభూతి కరుణయందు అభిమానము చూపినాడు. ఇప్పుడిప్పుడు హాస్యమునుకూడ కవు లాదరించుచున్నారు. కాని యద్భుతము ఎఱ్ఱయ కభిమాన మనుటలో సందేహము లేదు. పై యాఖ్యాయికచే వ్యాసమహర్షికే దానియందు పక్షపాతము కనిపించును. భారతము శాంతరసప్రధానమనియు దానికి నాయకుడు శ్రీకృష్ణు డయినట్లును పెద్దలు నిర్ణయించినారు.

శివశక్త్యాత్మకమైన శ్రీచక్రరాజార్చనము మనదేశములో ననాదిగా నున్నది. శ్రీ చక్రరాజార్చనము నవావరణాత్మకము. అందులో అగ్రస్థానము నలంకరించునది బిందువు. ఆ పిమ్మట త్రికోణము కలదు. తొమ్మిదవదానికి భూపుర సంజ్ఞ. ఈ తొమ్మిది ఆవరణములను తొమ్మిదిచక్రములని భావన చేయుచు వానిని ఇతర భావనలతోపాటు నవరసాత్మకభావన చేయుట కూడ గలదు. ఒక్కొక్కచక్రము అనగా ఆవరణ ఒక్కొక్క రసాత్మకము. అందు భూపురము శృంగార రసాత్మకము ; త్రికోణము అద్భుతరసాత్మకము ; బిందువు శాంతరసాత్మకము. శాంతమునకు స్థాయి నిర్వేదము. అందుచే శాంతరసాత్మక భావనకు పుష్కలాధికారులు సర్వసంగ పరిత్యాగము చేసిన పరమహంసలే. గృహస్థు అగు ఎఱ్ఱయ దానికి అవ్యవహితమగు అద్భుతరసభావము హృదయ పద్మములో ఆరూఢము చేసికొనెనా ? ధన్యశబ్దము శాంతరసోపాసనాసిద్ధులకా ?

బృందావనములోని గోగణంబులను వర్ణించుచు నతడు—

"శ్రుతివిభవంబులుంబోలె లోకోద్ధారకంబులు, విష్ణుకీర్తనంబునుం బోలె శ్రవణ మంగళంబులు, సద్వ్రతంబులుంబోలె నిత్యనిర్మలంబులు,

మంత్రంబులుంబోలె రక్షణీయంబులు, దైవంబులుంబోలె నర్చనార్హంబులు, గురుసులుంబోలె నిరంతరానువర్తన పరితోష్యంబులు, శ్రీవిశేషంబులుం బోలె నఖిలలోక చకర్షంబులు, భావంబులుం బోలె రసజనకంబులు"

అని వర్ణించెను. ఈ శంభుదాసుడు శ్రీచక్రరాజార్చనాతత్పరుడా ? ఆ చక్రమునే ఒక ముఖముగా చూచిన శక్తిచక్ర మనియు, మరియొక విధముగా చూచిన శివచక్ర మనియు రూఢి యున్నది. అతడు శివకోణములు సమ్ముఖము చేసికొని యర్చించువాడా ?

౭

ఏమో ! కాని యొక్క టిమాత్రము నిశ్చయము. అతనికి అద్భుతశబ్దము నందుకంటె గూడ శ్రీ శబ్దమునం దెక్కువ పక్షపాతము కలదు. శ్రీ శబ్దమునకు పర్యాయపదమా యన్నట్లు కల్యాణ శబ్దమును గూడ నత డట్లే తరచుగ ప్రయోగించెను.

శ్రీ శబ్దమునందు తెలుగుకవు లందరికిని విశేష మభిమాన మున్నది. కాని, ఎఱ్ఱయది నిరుపమానము. శ్రీ కల్యాణ శబ్దములు పాదపూరణకు, పద్యపూరణకు నుపయోగించి యతడు తన గ్రంథము లన్నియు శ్రీకల్యాణాంకితములు చేసెను. అద్భుతశబ్ద ప్రయోగము చేసిన యెడల నెల్ల సందర్భశుద్ధి ఉన్నది. కాని ఈ శ్రీ కల్యాణశబ్దములు అతడు అక్కడక్కడ ఆత్మ విశ్రమించుటకు మాత్రమే వేసెనా యనిపించును. అతని హృదయకుహరములో నిత్యావాసము ఏర్పరచుకొనిన రెండు మహామంత్రములు – రెండు దివ్యనామములు – ఏమైన నీ విధముగా అప్రయత్నముగా బహిర్నిస్సృతమై అతని హృదయగతాదర్శమును సఫలము చేయుచు లోకమునకు వెదజల్లుచున్నవా ?

కావ్యములును ఆశ్వాసాది పద్యములును శ్రీకారముతో ప్రారంభించుట ఇతరాంధ్రకవులకువలె ఎఱ్ఱయకును సామాన్యము. కాని "శ్రీకర దైతేయ తనూభవోద్భవ కథాకల్యాణ ముద్ఘోషమై నిండా రె"నన్నాడు ఎఱ్ఱన.

కుమారస్వామి "శ్రీ సమేతుడై విశేషకాంతిస్ఫూర్తి నొలసెను."

"ఏ దినమునందు షణ్ముఖు
శ్రీదేవి వరించె గమలచిహ్నాతకరమై

యా దినము పంచమి లో
కాదరణీయంబు లక్ష్మి కాస్పద మయ్యెన్."

సైంధవుడు "శ్రీ విహీనుల గరం బర్థింతురే కామినుల్?" అని యడిగెను. రామభద్రుడు శ్రీరమణీయుడు. అట్టి రామభద్రుని నడవికి పంపించి 'దుష్కీర్తి నా యొదల గీలుకొల్పి శ్రీకి నెడ పెదవా?' అని భరతుడు తల్లి నడిగెను.

"ఇద్ధవైభవశ్రీసుఖ స్థిరాయువుల జెందగ బాత్రమవై తనర్చుటన్" జనమేజయునకు హరివంశోపదేశము ప్రారంభించెను. 'చరణపీఠశ్రీ కున్నతి యొసగ బ్రాహ్మడు చెన్ను వహించెనట.' 'పితరులు వసింతురు శ్రీతోడ.' ఆశ్వాస సాంత సంబోధనలో 'సత్కృప మఖశ్రీ ప్రీత గీర్వాణ'యనియు, 'రామాయణ హరివంశ శ్రీ మన్మధుర ప్రసంగ...... శ్రీ మల్ల చమూవరేణ్య.....' అన్నాడు. "వైదేహకన్య .... అతని చేతోదయిత యయ్యె సాక్షాచ్ఛ్రీదేవి యయోనిజాత సీత యనంగన్." శ్రీకృష్ణుడు శకటాసుర భంజన సమయమున 'శ్రీరమ్యాంఘ్రి యుగంబు గింజుకొనె'నట. ఆశ్వాసాదిలో నొకచో 'శ్రీకర కవిప్రబంధములు' అనెను. గోపాంగనలు 'శ్రీసంపన్నములైన పాటలముల' నలంకరించుకొనిరి.

"నీ కేల దగిలి శ్రీ నిత్యమై తనరు నివ్వేణువు త్రైలోక్యవినుతిపదము" అని వామదేవ భరద్వాజులు స్తుతించిరి. గోగణములు "శ్రీవిశేషంబులుంబోలె నఖిలలోకచీకర్షంబు"లట. గోవిందునికి "అభిషేక శ్రీమేనంజేసెను. సురపతి యీ నిఖిలంబునకు బరమహిత మగువొంటిన్." "గోపాలురు తద్వేణు రవాపూరము లోన మునిగి యానందరసశ్రీ పరిణతి నాత్మీయవ్యాపారము లెల్ల వదిలి రవి చేష్టితులై". కంసుడు కంసుడు వసుదేవుని సభలో "ఒక్క పడుచున్ వే తెచ్చి పోరించి యే శ్రీకిం బాత్రమవై తలిర్చెదవు?" అని నిందిపగా యాదవ స్థవిరు డొక్క డాతని "శ్రీదక్కి వనంబులో జడలు దాల్పగ బోయెదునట్లు" మాట లాడుదువా యని మందలించెను. "వాసుదేవు చరణద్వంద్వంబు నూతన గోమయంబున ననర్ఘశ్రీ" దనర్చెను. రామకృష్ణులు 'పుట్టినకోలె బరశ్రీ లెట్టివో' యెరుగరు, రాజదర్శనమునకు పోయెడివారికి 'శ్రీ మేదిల్లంగ మంచిచీరలు వలయును' "ఇంద్రచాపద్యుతి శ్రీలం గ్రాలిరి.' రామకృష్ణులు మల్లులు కంసుని 'విశ్వశ్రీలను' భజింపు మనిరి. గురువు 'కేశవున్ శ్రీనిండారగ నొక్క కౌగిటన యర్థిం జేర్చెను.' వారు విద్యాభ్యాసమై తిరిగి రాగా –

"లలితాయతనంబులలో
నలఘు సమభ్యర్చనముల నంది తనరు వే
ల్పుల ప్రతిమలును బ్రసన్నత
కలిమి యెఱిగించె భద్రకాంతి శ్రీలన్."

"మహాత్మ రామ సుభశ్రీ భాగి" యని గోపవృద్ధులు పొగడిరి. 'యాదవు లతిలోక భుజశ్రీ దర్పితు'లట. రేవతి 'వినయశ్రీవినుత.' 'రథాశ్వ గజబృంద శ్రీ లెలర్పంగ రుక్మి' మగధనాథు నెదుర్కొనెను. నారదుడు 'సనాతన యోగశ్రీ కుశ లుడు.' రుక్మిణి యలంకారములు 'సాధక సాధనశ్రీల'వలె నున్నవి. రుక్మిణీ కల్యాణము చూచుటకు 'భవ్యోజ్జ్వలాలంక్రియల్ వితతశ్రీల దలిర్ప వచ్చిరి.' శ్రీమత్కవితాగర్వితయని యాశ్వాసాది. 'స్థితికాలంబున దుగ్ధసాగరములో యోగసుప్తిరతుడై శ్రీదేవి పాదాంబుజ ద్వితయం బంకతలంబుపై నిడి ప్రమో దింపం బ్రమోదించు'నట. అచ్యుతుడు 'చిత్రోరుచాపశ్రీ నిండారగ' కృష్ణుండు యుద్ధము చేసెను. యోగమాయను సంబోధించుచు నారాయణుడు 'శ్రీయు..... హ్రీయు..., విద్యయు .... సంధ్యయు .... అను నామంబులు నీకు వాచకంబు లుగా మహామునులు కీర్తింతురు' అనెను.

ఇట్లే శ్రీపదప్రయోగము యెన్నియెడలనేని గలదు. చిత్రము! ఎఱ్ఱయ గోత్రమే శ్రీవత్సగోత్రము! అంతకంటెకూడ కల్యాణ శబ్దప్రయోగము అతని కావ్యములలో తరచుగా కానవచ్చుచున్నది.

'అప్రియములయందును బ్రియములయందును దైన్యహర్షముల దగులక యున్నట్టి కల్యాణవర్తన కాంక్ష లెస్స'అని ధర్మవ్యాధుని ఉపదేశము. 'కాకుత్స్థ కులప్రదీపకుడు కల్యాణకీర్తనుడు. యాజ్ఞసేని పరమకల్యాణి ధర్మసంభావ నీయ.'

'సవిత్రి వాణి త్రిజగత్కల్యాణి బ్రార్థించి .... కావున జెప్పెద గల్యా ణావహ మహనీయ రచన హరివంశము' అని ముందుగా ఎఱ్ఱయ ప్రతిజ్ఞ చేసి నాడు. 'కరుణా కల్యాణ'యాశ్వాసాంత సంబోధన. నందుడు 'గోవుల బూజించి

గోవాటం బలంకరించె నిట్టి కల్యాణంబున సంతసిల్లెను'. 'సుధాశీకరముల మెయి జిలుకునట్టి కల్యాణం బా పురుషోత్తమునకు నొదవును.' 'గోపాలదేవ మూర్తి యఖిలశోభాకలాప కల్యాణి యయ్యెను.' 'కలకల్ దేటి తనర్చె నేలులు శరత్కల్యాణ కల్యాకృతిన్.' 'మాద్యద్యూత బేతాళకీర్తన కల్యాణవిధి ప్రసిద్ధ బహుసంగ్రామంబు' లగు నాయుధములు వచ్చెను. యాదవులు బలరామునితో 'మీ వారనువారే వారు. వారు కల్యాణవాసు లుదార' యనిరి. అంత వారంద రును చేతోవిలాస కల్యాణంబులగు మాల్యంబులు అనేకంబు లా కల్యాణమూర్తికి సమర్పించిరి.' నారదుడు అవతారకథలు చెప్పగా యాదవులు విని 'ఇమ్ముని పుంగవుడు మన కింత కల్యాణం బొనర్చునె' అని ఆశ్చర్యపడిరి. రుక్మిణికి 'పుంసవన సీమంతా ద్యనుపమ కల్యాణంబు పొనర్చెను.'

హరివంశ కథాశ్రవణ ఫలము చెప్పుచు –

"భారతము గోవు విప్రుడు
భారతియును జాహ్నవియును బద్మావిభుడున్
గోరి నిరంతర చింత్యులు
గా రూపించు సుజనుండు కల్యాణి యగున్."

ఎఱ్ఱయ తన హరివంశములో ఒక్కటే సంస్కృతశ్లోక మునిచినాడు.

"నమః కైవల్య కల్యాణ కల్యాణానంద విధాయినే
నారాయణాయ మహతాం వరదాయ వరీయసే!"

నారాయణుడు వరాహరూపమున దన్నుద్ధరింపగా భూదేవి యాతనిని – "నీ వెవ్వరిం గానం బూనితి వారు ధన్యులు. జగత్కల్యాణ నారాయణా!" అని స్తుతించెను. ఇంతేకాదు, బృందారకులు పురుషోత్తమునికి మ్రొక్కుచు విశ్వ రూపము భావించుచు చేసిన స్తోత్రములో,

"ద్వైతభ్రాంతి కల్పితం బఖిలమున్
స్వప్నేంద్రజాలోపమం
బై తూలన్ బృథు రజ్జు సర్ప సదృశ
వ్యామోహ విచ్ఛేదనం

బై తత్త్వజ్ఞత యాజ్ఞవల్క్య యపరో
క్షాభేదవిత్సాఖ్యవి
ఖ్యాతుం గాంతురు నిన్ను నౌపనిషదుల్
కల్యాణ నారాయణా!" — అనిరి.

ఎఱ్ఱయ తాను "శ్రీ శంకరస్వామి సంయమీశ్వరచరణసరోరుహ ధ్యానా నంద సౌందర్యధుర్యుడ"నని గద్యలలో సగర్వముగా జెప్పుకొనినాడు. తన గ్రంథములలో శంకరస్వామి స్తోత్రము ప్రత్యేకముగా చేసినాడు. శాంకరపీఠ స్వాము లందరకు శంకరస్వాములవా రను సామాన్యనామము రూఢి యైనది. కాని, వారి వారి గురువు లిచ్చు సన్న్యాస దీక్షానామములు వేరుగా నుండును. ఎఱ్ఱయగురువులగు శంకరస్వాముల దీక్షానామము కల్యాణ పదముతో కూడి యుండుటచే నది ఇన్ని విధముల ద్యోత మైనదా? గురునామములు ప్రత్యక్ష ముగా చెప్పక గోప్యముగా నుంచుట కొందరకాచారము కదా! అందుచే ఎఱ్ఱయ యుపాస్య స్వరూపనామమే కల్యాణమా? కాక ఎఱ్ఱయయే కల్యాణ యోగియా?

శాంకరపీఠస్వాము లందరును భారతీ సాంప్రదాయయుతులు. అందుచే సరస్వతీదేవి నామములలో ఎఱ్ఱయకు భారతీశబ్ద మభిమానము. బ్రహ్మదేవునిం గూడ "భారతికి గాదిలి" యని యతడు వర్ణించెను. అత డారణ్యపర్వము ప్రారంభించిన కొద్ది వ్యవధిలోనే సరస్వతీగీత ఘట్టము వచ్చెను. తార్క్ష్యు డను మునివరుడు భారతి నారాధించి ప్రత్యక్షము చేసికొని ధర్మస్వరూప మామెను ప్రశ్నించెను. వేదాధ్యయనము, నానాధ్వరములునే ధర్మమని చెప్పి మరియు —

"అగ్నిహోత్రం బస్మదాత్మకం బని యెఱుంగుము. .... నేను మహనీయంబైన యగ్నిహోత్రముఖంబున బ్రభవింతును." ఇత్యాదిగా చెప్పగా తార్క్ష్యుడు కృతాంజలి యై —

"అంబ నవాంబుజోజ్జ్వల క
రాంబుజ శారదచంద్రచంద్రికా
డంబర చారుమూర్తి ప్రక
టస్ఫుట భూషణ రత్నరోచిరా

చుంబిత దిగ్విభాగ శ్రుతి
సూక్త వివిక్త నిజప్రభావ భా
వాంబరవీథి విశ్రుత వి
హార ననుం గృప జూడు భారతీ !"

అని వినుతించి కృతార్థు డయ్యెను. ఈ స్తోత్రము మూలములో లేకున్నను ఎఱ్ఱయ చేర్చుట యాతని అభిమానమును తెల్పును. ఇది కొన్ని భాగవతప్రతులలోనికి కూడ నెక్కించుటచే పోతనపద్య మను భ్రాంతి లోకములో కలిగినది. మరియు నా భారతి ఎట్టిది ?

"వరవస్తు ప్రతిపత్తిధుర్య మగు నై
శ్వర్యంబు పంచాశద
క్షర సంసిద్ధ సమస్త శబ్దరచనా
సంవ్యాప్తి నుద్దీప్తమై
పరగం గల్పలతా సమృద్ధి యగుచుం
బ్రజ్ఞావిశేషాఢ్యులన్
గరుణం బ్రోచు సవిత్రి వాణి ద్రిజగ
త్కల్యాణి బ్రార్థించెదన్."

ఈ భారతీదేవిని ఎఱ్ఱయ అపూర్వముగ భావించినాడు. శ్రీ లక్ష్మీ నృసింహావతారములో —

"కరకమలం బొసంగ బటి
కంపు గమండలు నంటి కాంతి భా
సురమగు మౌక్తికంపు జప
సూత్రము దాల్చుట బ్రహ్మవాదమై
పరగిన హంసముం బిలిచి
బాలమృణాలము జూపు చందమై
సిరి తిలకింపు నొప్పు బుధ
సేవితమూర్తి దలంతు భారతిన్."

భారతిని బ్రహ్మవాదియగు పరమహంస పరివ్రాజకాచార్యునిగా భావించుట శంకరస్వామి సంయమీశ్వరుడు తన తలపు సర్వము దానయయి యున్న యాతనిశిష్యుడగు ఎఱ్ఱయకే సాధ్యమయినది.

మన దేశములో భారతీ భారత శబ్దములకు గంభీరమగు స్వరూపమున్నది. ఈ దేశములో ప్రభుత్వ మెవరు చేసినను, రాజనామము అన్వర్థముగా ధరించదగినవారు పట్టాభిషేకము యథావిధిగా వైదికమంత్రములతో నైనవారే. అట్టివారిలోనెల్ల తక్కువవానికి "సమ్రా" ట్టను సంజ్ఞ ఉన్నది. అతడు సమ్రాట్టయినను చక్రవర్తి యైనను అభిషేకాంతరమున చేరిన పెద్దలు "ఇతడు మీకు రాజు భరతుడు" అని మహాసభలో ప్రకటింతురు. అట్టి యభిషేకమయిన రాజులందరికి భరతసంజ్ఞ వేదోక్తము. అట్టివారే ఇక్కడ అనాదిగా రాజులు గనుక ఇది భరతభూమి ; భారతము. ఆసేతుహిమాచల మధ్యస్థభూమి యందును ఉన్న ఈ కర్మ సమానమే.

ఇట్టి పవిత్రమగు భారతిని ఉపాసించువారల జీవితాదర్శ మేమి ?

"మగపొడవు లెల్ల శివుడును
మగుపలు శివ యనెడు శ్రుతుల మాటలు నిక్కం
బుగ దెలుపు భంగి దత్సము
లగు గణ దంపతుల యొప్పు లప్పుడు మెఱసెన్."

ఈ లోకయాత్ర చేయునపుడు స్త్రీ పురుషులందు యోగు లయినవారికి ఎట్టి భావన యుండిన కృతకృత్యు లగుదురో ఎఱయకే తెలియును. ఎఱ్ఱయ పూర్ణదీక్షాభిషేక పవిత్రీకృతాంగుడు. అతని దీక్షానామము కల్యాణ యోగియా యని సంశయము కలుగును. కాని, విజ్ఞానయోగి యని తోచును. శ్రీ లక్ష్మీ నృసింహావతార కథ వ్రాయుచు తన తండ్రి "శ్రీ సూర్యుడే విజ్ఞానాత్మక వాఙ్మయంబున ముదావేశోజ్జ్వలుం డయ్యెడున్" అని అశించెను. మరియు గ్రంథములలో పలు తావుల నా విజ్ఞానశబ్దమును చేర్చిన విధానముకూడ ఆ ఊహనే బలపరచుచున్నది. కాని ఏమైనను అది ఊహ మాత్రమే !

భారతీదేవిని పరివ్రాజక రూపములో భావించుటేకాదు, అతడు చేసిన వింతవర్ణన! వసంతాగమము ఏ కవికి అభిమానము కాదు ? ఎన్ని విధముల గాదు ? కాని ఎఱ్ఱయ కడి ఎట్లు భాసించినది ?

"చిగురుం గెంజెడ లొప్ప బుష్పరజము
లెల్లెల్వారగ నుర్వాదిపూ
తగ లేదేటల చుట్టుకోలు జపసూ
త్రశ్రీలుగా గోకిల
ప్రగుణాత్మాధ్యయనంబుతోడ సకలా
రామంబులున్ శాంభవం
బగు దీక్షావిధి నొందగా వెలసె జై
త్రాత్మూఢి విశ్వంబునన్."

మంత్ర దీక్షాభేదములలో విపులమైన ఒకానొక విధానమునకు శాంభవీదీక్ష యని సంకేతనామము కలదు. దాని ఫలము తంత్రములలో నిట్లున్నది :

"గురో రాలోకమాత్రేణ
భాషణాత్ స్పర్శనా దపి
సద్య స్సంజాయతే జ్ఞానం
సా దీక్షా శాంభవీ మతా."

ఎఱ్ఱయకు వామాచారమునందు గల యసహ్యమును నాలుగు తావులలో ప్రదర్శించినాడు.

ఒకానొక సందర్భములో శ్రీకృష్ణుడు – " అహంకారంబు పూరించెనే వామాచారుడు మృత్యువన్ ఖలుడు సాపంగోరె గాకేమి" అని విజృంభించెను.

జనమేజయుడు " ఈ యసతిన్ మదీయ గృహ మిప్పుడ వెల్వడ ద్రోసి రండు కౌలేయక లీఢమైన హవి లెస్సగ జూతురె ?" అని భార్యను పరిత్యజించెను.

కలియుగ ధర్మములు జెప్పుచు నందు —

"గొనకొని బ్రహ్మవాదు లయి

కొందఱు మద్యము గ్రోలి మాంసమున్
దిని ధన వాంఛమై జనుల
ద్రిప్పుదు రుగ్రపు వంచనంబులన్."

అని స్పష్టముగ నిందించినాడు.

మరియు పిశాచనాయకుడగు ఘంటాకర్ణుడు -

"ఇదె భూదేవశవంబు పావనము నీ
కే భక్తి నర్పించెదన్
సదయాత్ముల్ నతులైన యాశ్రితుల య
ర్చల్ గొంద్రు నిశ్శంకతన్."

అని శ్రీకృష్ణుని ప్రార్థింపగా —

"పీనుగు నంటరు మాదృశు
లై నెగడెడు పెద్దవార లటుగాన మహా
మానోన్నత నీ యిచ్చిన
యీ నీచపు బూజనంబు హేయము నాకున్."

అని యాతడు నిరాకరించెను.

మహాభారతమునం దెల్లెడల గానవచ్చునట్లే హరివంశమున గూడ దుర్గా స్తోత్రాదులు గానవచ్చుచున్నవి. అవి ఎక్కడ వచ్చినను అన్నింటికి మూలమైన దుర్గా సప్తశతి వివరణములుగనే ఉన్నవి. అనిరుద్ధుడు బాణుని నాగపాశముచే బంధితుడై బాధపడుచు చేసిన ఆర్యాస్తోత్రము హరివంశములోకెల్ల విపులమును, ఉత్తమమును ఐనది. అది ఎఱ్ఱయ వదలక వివరించెను.

విరాటనగర ప్రవేశమునకు పూర్వము ధర్మజుడు చేసిన దుర్గా స్తోత్రమే ఆరవ అధ్యాయ మంతా ! అదియంతయు తిక్కనసోమయాజి వదలివేసెను. అట్లే భారతయుద్ధమునకు ముందున్న దుర్గా స్తోత్రముకూడ తిక్కన తెలిగించ లేదు. ఇట్లు వదలుటలోనను, గ్రహించుటలోనను వారి వారి యాదర్శముల నను మేయింపవచ్చును గదా !

ఎ్కి

"ఈ లోక మయురు గొందఱు
కాలోకము కొందరకు నిహంబును బరమున్
మేలగు గొందఱు కధిపా !
యే లోకము లేదు వినవె యిల గొందఱకున్ !"

ఇహ పరలోక సాధనమైనది శ్రేయస్సు, శ్రీ, కల్యాణము! అట్టి శ్రేయస్సు లోకమునకు కలిగించుటకే ఎఱ్ఱయవంటి తపస్వులు కావ్యరచన కుప క్రమించినారు. అతనిని శ్రీలక్ష్మీ నృసింహావతారకథ గావింప నాతని పితా మహుడు 'జగద్ధితంబుగానే' పనిచెను.

కావ్యరసపాకముల సమ్మేళనములోననే కాక ఎఱ్ఱయ తన జీవయాత్ర యంతయు మహాయోగిగనే గడపెను. అతని దృష్టిలో భగవంతుడు, నారాయణ నామమైనను, శంకరస్వరూప మైనను,

"తలపులకు జేరగఁడ తాన తెలుపులకును
నిక్కఁడాన పలుకులకు నెడము దాన
యజరు దమరు దనంతు దవ్యయు దచింత్యు
దనఘు దజు దంచితశ్లోకు దచ్యుతుండు."

ఆ భగవంతుని బొందుట యన నాత్మజ్ఞానము సంపాదించుటే. తన గ్రంథమున ఈ ఆత్మయోగము నెన్నియెడలనేని అనుభవజ్ఞునివలె వర్ణించెను.

"ఇది పరమయోగి దర్శన
విదితం బిప్పాట బవనవిదులైన మునుల్
వదలక యభ్యాస విధిన
ముదమున ధరియింతు రాత్మ మూర్ధతలమునన్."
అనియు,

"అనుదినంబు నియతాశియు జితేంద్రియుడునై పూర్వ రాత్రమ్మున నపరరాత్రమ్మునందు యోగధారణనిరతుడై యుండవలయు - నపుడు బోధ దీపంబున నాత్మ నాత్మయందు గనుచు నివాత దీపానుకారియై వెలుంగుచు నమృతమయత్వ మొందు." — అనియు,

"శుక్రప్రముఖు లయిన వీరందఱు యోగవిద్యా ప్రవర్తకులు" అని ఆ యోగప్రవర్తకుల నొకచో వర్ణించెను.

అగ్రిమబోధ నిధి యగు సనత్కుమారుడు మార్కండేయున కిట్లుప దేశించెను.

''సకల క్లేశనిబర్హణంబును మహా
సారంబు సర్వార్థ ద
ర్శకమున్ సిద్ధనిషేవితంబు నగు సూ
క్ష్మ జ్ఞానయోగంబు నీ
వకలంక స్థిరబుద్ధి దాల్చి నియతా
హారుండవై యింద్రియ
ప్రకరోచ్ఛేద మొనర్చి యుండుము పర
బ్రహ్మంబు ప్రాప్తం బగున్."

"యోగధర్మంబునకు నెక్కు డొక్కటియును
నిఖిలమందును లే దిది నిశ్చయంబు
నీ మనమునందు నిక్కంబు నిల్పితేని
జేరు గాలక్రమంబున సిద్ధపదము."

ఆ తర్వాత కొంతకాలమునకు ఆ మార్కండేయునికి —

"విజ్ఞానము మునుపుగ భ
వ్యజ్ఞానము దివ్యచక్షురన్వితముగ స
ర్వజ్ఞుడగు నమ్మహాత్ముని
యాజ్ఞన్ బ్రాదుర్భవించె నప్పుడు నాకున్.''

అట్లే కౌశికపుత్రులు కూడ ఎంతో శ్రమపడి తుదకు —

"రాగాది దుర్గుణంబు ను
పాగత సత్యాద్వయోదితానంద నిరు
ద్వేగము నగు యోగం బా
యోగీశ్వరు లొంది చెంది రుత్తమసిద్ధిన్."

ఇట్టి వెన్నియైన గలవు. ప్రత్యక్షముగా నిట్టి యోగవివరణలే కాక ఉప మాన రూపముగా గూడ యోగవిషయములు దొరలుచుండును." యోగనియమం బునుం బోలె బవనపరిచయజనితకుండల్యుల్లాసంబును .... పరబ్రహ్మంబునుం బోలె నారణ్యకోద్గీతమాహాత్మ్యంబును .... వేదాంతసారంబునుం బోలె మహా యోగి దర్శనోపలాలితంబును" — అని ఇట్లెన్నియో కలవు.

కాని ఎఱ్ఱయ కిష్టమైనది హఠయోగమును గాదు ; వేదచోదిత కర్మల పరి త్యజించు మెట్టవేదాంతమును గాదు ; అశుచిగా అశాస్త్రీయముగా పరవశభావ ముతో ప్రదర్శించు నుత్తర భారతమున విపులప్రచారము గన్న భక్తి యను నదియు కాదు. వేదాధ్యయనము చేసి వేదోక్త యజ్ఞము లాదిగల ధర్మము లాచ రించి యందుపై నిరూఢమతులైన వారికి చిత్తశుద్ధిచే గలుగు పరమయోగమే అతనికి సమ్మతము !

"సోముడు వత్సముగా సు
త్రామగురుడు దోహకుడుగ దగ నఖిలచ్ఛం
దోమయ పాత్రిక బితికి ర
నామయులగు మునులు బ్రహ్మ మను దుగ్ధంబున్."

వైదిక కర్మలయందు అతని కున్నంత అభిమానము తిక్కనసోమయా జికే కాక నన్నయకే ద్యోతము కాదు. అతని అభిమానమును ఎన్నియో ఉపమా నములే రూపించును.

''పావకునకు నభిమంత్రితమై వేల్వగబడిన హవ్య మధిక సముద్వేగావహ మైనట్లు'' అనియు, మరియు ద్రౌపదిని సైంధవుడు ఎత్తుకొనిపోయిన సంద ర్భమున —

"బూదిలో దొరగిన పూర్ణాహుతియుబోలె....
నసునె సన్మంత్ర విశ్రుత పురోడాశంబు శునకమునకు...."

అనియు ఉపమించెను. మఱియు —

"భేదము లేక యజ్ఞమయ
కేసరముల్ గదలంగ విస్ఫుర

న్మేదుర హేషితధ్వను ల
మేయములై ప్రణవస్వరూపతన్
రోదసి నిండగా హయశి
రోవపు వొప్పు యుగాంత సంహృతిన్
వేదము లుద్ధరించిన ప
విత్రయశుండవు నీవు శ్రీనిధీ !

అని హయగ్రీవస్తోత్రము చేసిన ఎఱ్ఱయజిహ్వ ఎంత పవిత్ర మయినదో ఊహింపదగినదే గాని వర్ణింప సాధ్యము కాదు.

ఇట్టి మహాయోగి తన గ్రంథము నరాంకితము చేసెనే యని ఈ కాలపు వారడుగుదురు. పోతన 'ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురమ్ములు వాహనమ్ములున్ సొమ్ములు కొన్ని పుచ్చు'కొనట కిష్టము లేక శ్రీహరి కిచ్చి భాగవతము చెప్పినదాది దేశములో నెన్నియో కథలు వ్యాప్తమైనవి. అంతకుముందే తిక్కనయు, సోమనయు హరిహరాంకితముగను, నృసింహాంకితముగ ఎఱ్ఱయయు కావ్యములు రచించియుండిరి. కాని రాజదూషణ చేయలేదు. అంతేకాని గ్రంథములు నరాంకితము జేయుట దోషమనియు, భగవదంకితము చేయుట విశేషమనియు భావింపరాదు.

ఒకవేళ భాగవతమువంటి భక్తిగ్రంథములు అంకితము చేసినను ప్రమాదము లేదనవచ్చునేమో గాని మహాభారతమువంటి ధర్మప్రబోధక గ్రంథములు ఉత్తమ రాజాంకితము చేసినప్పడే కవికర్మ కృతార్థత నొందగలదని ఖండితముగా చెప్పవచ్చును. ధర్మమును లోకములో ప్రతిష్ఠించి అది పాలించి ఆచరణలో పెట్టించగలవారే నిజమైన రాజులు. అట్టి రాజులకు ధర్మ ముపదేశించినచో ప్రయోజనము ఘటించునుగాని వేరువిధముగా కానేరదు. ఈ ధర్మోపదేశకులు దేశికులు. వారు ధనాపేక్షతో ప్రభువుల నాశ్రయించు తర్వాతికాలపు ఆస్థానకవులు గాని, ఆ పిమ్మటికాలపు ముష్టికవులు కాని కానేకారు.

కలియుగము ప్రవేశించినతర్వాత భరతఖండ మేలిన ప్రథమచక్రవర్తి పరీక్షిత్తు. అతడు ధర్మపరిపాలనమే చేసినను కలిప్రభావము అతని అవసాన దశలో ఆవహించినది. అతని కుమారుడు జనమేజయుడు రెండవ చక్రవర్తి.

అతడు తామసమగు సర్పయాగముతో ప్రారంభించి తుదకు అశ్వమేధయాగము నానా భ్రష్టవిధానముగా ఆచరించెను. కాని అతనికి పెద్దలస్మృతి ఇంకను ఉన్నందువలన ధర్మాభిమానిగ నుండెను. ఇకముందు అంతకంటె హీనులు రాగలరను ఊహతో నతనికి వైశంపాయనమహర్షి ముఖమున భారతకథామిషతో వేదవ్యాసుడు భారతధర్మ ముపదేశించెను.

మరల ఆదిరాజనిభులైన రాజులు బహుకాలమునకు ఆంధ్రదేశములో వెలసిరి. అట్టివారిలో నొకడగు రాజరాజనరేంద్రునికి ఆంధ్రభాషలో ధర్మోపదేశము చేయవలసివచ్చినది. నన్నయ భారతాంధ్రీకరణమున కుపక్రమించెను. శ్రేయఃకృతులకు బహు విఘ్నములు ! ఆగిపోయినది మధ్యలో.

రెండువందల సంవత్సరములు గడచినవి. సమర్థుడగు రాజ్యనాథుడు లేడు. తిక్కన ఆ గ్రంథ మందుకొన్నాడు. అందు కథకారము సంపాదించుటకు యజ్ఞముచేసి సోమయాజి యైనాడు. కాని తన శక్తిచే ధర్మప్రతిష్ఠ చేయగల రాజతనికి గోచరింపలేదు. తనకు ఇష్టుడయిన మనుమసిద్ధి చిన్న రాజు. రెండు మూడు పర్యాయము లా రాజ్యమే అతడు పోగొట్టుకొనెను. అందుచే విరక్తుడై తిక్కన పుణ్యమైన దక్కునని హరిహరనామాంకితముగా విరాటపర్వాదిగా రచించెను. వ్రాసినకొలదియు అతనివాక్కునకు పవిత్రత ఎక్కువ కాసాగినది. రసాభిమానముతో విరాటపర్వ మారంభించి ఉద్యోగమును రాజ్యతంత్రజ్ఞతతో సాగించెను. యుద్ధపర్వములు దండనాథుల దృష్టితో వ్రాసెను. భారత కథ మారినట్లుగనే చివర పద్యమునకు అతడు అతిలోకాద్భుత ధర్మసూక్ష్మమును గ్రహించినవా డయ్యెను. అయినను ఆ ధర్మములు ఆచరింపజేయు ప్రభు డేడీ ?

మరల సుమారు నూరు సంవత్సరములు గడచినవి. ఎట్టియెదు రాహుగ్రస్తమైన చంద్రబింబమువలె శ్రీమదాంధ్ర మహాభారతములోని అరణ్యపర్వములోని మొరికి కనిపించెను. 'ధర్మశాస్త్రార్థవేది'యగు నాత దది పూరింప నిశ్చయించెను. కాని విను ధర్మరాజు లేడే ! ఆ భాగములో సరిగా కలియుగ ధర్మములే ప్రారంభము !

"అరులు మిగులగొని రాజులు నరులకు నెంతయును భయ మొనర్తురు. మరియును —

"ధరణీరక్షణ మాచరింపక నృపుల్
దర్పంబునం బశ్యతో
హరులై సాధుల దోచి చేకుఱు తదీ
య స్త్రీ ధన క్షేత్రముల్
హరియింపం గలవారు దారుణతరం
బై పెల్లు చెల్లుం బర
స్పరవైరంబు ధరాతలేంద్రులకు వి
శ్వప్రాణి నాశంబుగన్."

మరి మనుష్యులో ;— "తవిలి శరీరంబు తద్దయు బ్రోతురు." అట్టి రాజులయు, జనులయు స్థితి ఎఱ్ఱయ కనులార చూచెను. అరణ్యపర్వ శేషము ఆ రాజరాజు పేరనే ఆ నన్నయ రచించినట్లే పూరించెను. అతడు వ్రాసిన మొదటి యాశ్వాసాంతములో "చరమయుగచలిత ధర్మస్థిరీకరణ చతుర చరిత"అని ఎన్నడో పోయిన రాజరాజును సంబోధించుటలో నతని కట్టి ధర్మ ప్రభు డా కాలములో పొడకట్టనందుకు కలిగిన ఆవేదన వ్యక్త మగును.

ఆ పిమ్మట ఈ ఎఱ్ఱయమహాయోగి మహాప్రబంధ కల్పనాకు హాలా యత్తం బగు చిత్తంబుతో నొక్కనాడు తదనుసంధానానుబంధసమాధి నిమీలి తేక్షణుండై యుండెను. శ్రీలక్ష్మీనృసింహావతారకథ చెప్పుమను నాదేశ మాతనికి భాసించెను.

ధర్మ విప్లవ మెప్పుడు కలిగనను ధర్మరక్షణకు తాను అవతరించెదనని పలికిన భగవద్వచనములే సాధువులకు శరణ్యములు. అది చేతకానివారి అసమ ర్థత కాదు. అనుకూల కాల ప్రతీక్ష ; ముందు చేయబోవు కార్యమునకు సాధనా సంపత్తి సమీకరించుట! శ్రీ లక్ష్మీనృసింహావతారములో ఎఱ్ఱయచేసిన వైకుంఠ వర్ణనము ఉదాహరింప ప్రారంభించినచో నంతయు ఎత్తి వ్రాయవలసివచ్చును. ఆ కథ ఎత్తుకొనుటలో ధర్మసంస్థాపన కెంత భీకర మనోజ్ఞాకారము ఎఱ్ఱయ హృదయస్థము చేసికొనెనో ఊహించదగినదే. వీరాద్భుతరసములు క్షీరాబ్ధివలె పొంగి యా కావ్య మయ్యెను. ఆ కావ్యము అహోబల నృసింహస్వామికే అంకి తము చేసెను.

అతడు తామసమగు సర్పయాగముతో ప్రారంభించి తుదకు అశ్వమేధయాగము నానా భ్రష్టవిధానముగా ఆచరించెను. కాని అతనికి పెద్దలస్మృతి ఇంకను ఉన్నందువలన ధర్మాభిమానిగ నుండెను. ఇకముందు అంతకంటె హీనులు రాగలరను ఊహతో నతనికి వైశంపాయనమహర్షి ముఖమున భారతకథామిషతో వేదవ్యాసుడు భారతధర్మ ముపదేశించెను.

మరల ఆదిరాజనిభులైన రాజులు బహుకాలమునకు ఆంధ్రదేశములో వెలసిరి. అట్టివారిలో నొకడగు రాజరాజనరేంద్రునికి ఆంధ్రభాషలో ధర్మోపదేశము చేయవలసివచ్చినది. నన్నయ భారతాంధ్రీకరణమున కుపక్రమించెను. శ్రేయఃకృతులకు బహు విఘ్నములు ! ఆగిపోయినది మధ్యలో.

రెండువందల సంవత్సరములు గడచినవి. సమర్థుడగు రాజ్యనాథుడు లేడు. తిక్కన ఆ గ్రంథ మందుకొన్నాడు. అందు కధికారము సంపాదించుటకు యజ్ఞముచేసి సోమయాజి యైనాడు. కాని తన శక్తిచే ధర్మప్రతిష్ఠ చేయగల రాజతనికి గోచరింపలేదు. తనకు ఇష్టుడయిన మనుమసిద్ధి చిన్నరాజు. రెండుమూడు పర్యాయము లా రాజ్యమే అతడు పోగొట్టుకొనెను. అందుచే విరక్తుడై తిక్కన పుణ్యమైన దక్కునని హరిహరనామాంకితముగా విరాటపర్వాదిగా రచించెను. వ్రాసినకొలదియు అతనివాక్కునకు పవిత్రత ఎక్కువ కాసాగినది. రసాభిమానముతో విరాటపర్వ మారంభించి ఉద్యోగమును రాజ్యతంత్రజ్ఞతతో సాగించెను. యుద్ధపర్వములు దండనాథుల దృష్టితో వ్రాసెను. భారతకథ మారినట్లుగనే చివర పద్యమునకు అతడు అతిలోకాద్భుత ధర్మసూక్ష్మమును గ్రహించినవా డయ్యెను. అయినను ఆ ధర్మములు ఆచరింపజేయు ప్రభు డేడీ ?

మరల సుమారు నూరు సంవత్సరములు గడచినవి. ఎట్టయెకు రాహుగ్రస్తమైన చంద్రబింబమువలె శ్రీమదాంధ్ర మహాభారతములోని అరణ్యపర్వములోని మొరికి కనిపించెను. 'ధర్మశాస్త్రార్థవేది'యగు నాత దది పూరింప నిశ్చయించెను. కాని విను ధర్మరాజు లేడే ! ఆ భాగములో సరిగా కలియుగ ధర్మములే ప్రారంభము !

"అరులు మిగులగొని రాజులు నరులకు నెంతయును భయ మొనర్తురు. మరియును —

"ధరణీరక్షణ మాచరింపక నృపుల్
దర్పంబునం బశ్యతో
హరులై సాధుల దోచి చేకుఱు తదీ
య స్త్రీ ధన క్షేత్రముల్
హరియింపం గలవారు దారుణతరం
బై పెల్లు చెల్లుం బర
స్పరవైరంబు ధరాతలేంద్రులకు వి
శ్వప్రాణి నాశంబుగన్."

మరి మనుష్యులో । — "తవిలి శరీరంబు తద్దయు ప్రోతుచు." అట్టి రాజులయు, జనులయు స్థితి ఎఱ్ఱయ కనులార చూచెను. అరణ్యపర్వ శేషము ఆ రాజరాజు పేరనే ఆ నన్నయ రచించినట్లే పూరించెను. అతడు వ్రాసిన మొదటి యాశ్వాసాంతములో "చరమయుగచలిత ధర్మస్థిరీకరణ చతుర చరిత"అని ఎన్నడో పోయిన రాజరాజును సంబోధించుటలో నతని కట్టి ధర్మ ప్రభు డా కాలములో పొడకట్టనందుకు కలిగిన ఆవేదన వ్యక్త మగును.

ఆ పిమ్మట ఈ ఎఱ్ఱయమహాయోగి మహాప్రబంధ కల్పనాకు హాలా యత్తం బగు చిత్తంబుతో నొక్కనాడు తదనుసంధానానుబంధసమాధి నిమీలి తేక్షణుండై యుండెను. శ్రీలక్ష్మీనృసింహావతారకథ చెప్పుమను నాదేశ మాతనికి భాసించెను.

ధర్మ విప్లవ మెప్పుడు కలిగినను ధర్మరక్షణకు తాను అవతరించెదనని పలికిన భగవద్వచనములే సాధువులకు శరణ్యములు. అది చేతకానివారి అసమ ర్థత కాదు. అనుకూల కాల ప్రతీక్ష ; ముందు చేయబోవు కార్యమునకు సాధనా సంపత్తి సమీకరించుట! శ్రీ లక్ష్మీనృసింహావతారములో ఎఱ్ఱయచేసిన వైకుంఠ వర్ణనము ఉదాహరింప ప్రారంభించినచో నంతయు ఎత్తి వ్రాయవలసివచ్చును. ఆ కథ ఎత్తుకొనుటలో ధర్మసంస్థాపన కెంత భీకర మనోజ్ఞాకారము ఎఱ్ఱయ హృదయస్థము చేసికొనెనో ఊహించదగినదే. వీరాద్భుతరసములు క్షీరాబ్ధివలె పొంగి యా కావ్య మయ్యెను. ఆ కావ్యము అహోబల నృసింహస్వామికే అంకి తము చేసెను.

ఇంతలో మల్లచమూపతితోడను, అతనిద్వారా అన్నయగు వేమభూనాథుని తోడను ఎఱ్ఱయకు పరిచయ మైనది. వేమభూపాలుడు సమస్త శత్రువులను జయించిన 'శ్రీమదాంధ్రసుదేశ క్షేమదకరవాలుడు'ను 'శ్రీమధ్యాంధ్ర సుదేశ క్షేమదకరకలుడు'ను 'యవననృప బలాబ్ధివ్యాపి ఖడ్గోర్వ వేగుడు'ను మాత్రమే కాదు; 'వాణీధురీణాంతర్వాణి జనార్చితోజ్జ్వల గుణుడు!' 'మఖశ్రీప్రీత గీర్వాణుడు!' 'రక్షితానాదిమృతుడు!' "ఇష్టాపూర్తరూపంబగు క్రియాకలాపంబు నిజకర్తవ్యానురూపంబుగా దొడగి—"

"అగ్రహారములు విద్యాతపోవృద్ధవిప్రుల కిచ్చి యజ్ఞకర్తలుగ నునిచె-గొమరార జెరువులు గుళ్ళు ప్రతిష్ఠించి లోకసంభావ్యంబులుగ నొనర్చె.... చేసె జేయుచున్నాడు చేయనున్నవాడు పునరుక్తకృతి శుభావలుల నెల్ల."

ఎఱ్ఱయ తగిన ధర్మప్రభువు దొరికినా దనుకున్నాడు. ముందు శ్రీరామకథ యతనికి చెప్పి యట్టి మహాకీర్తిధనుడగు వేమక్ష్మాపాలునికి ముల్లోకముల ఖ్యాతి కల్పించినాడు. కాని హరివంశము వ్రాయనిది భారతధర్మము సంపూర్ణత నొందదని ఎఱ్ఱయకు పొడగట్టినది. ఆతని ఇచ్ఛకు అనుకూలముగా, వేమరాజు ఒకనాడు —

"చేతోమోద మెలర్ప రామకథ మున్
జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింక నేను దనియన్
గావ్యామృతాస్వాదనన్."

"భారత పరాంశ మని యిం
పారగ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వా రమ్యకథ దెనుంగుగ
ధీరోత్తమ! నిర్వహించి తెలుపుము మాకున్."

"అనినం బ్రహర్షిత పులకిత దేహుండనై యమ్మహాభాగుని సమగ్ర సంప్రార్థనంబు గృతార్థతాకలితవృత్తంబగు చిత్తంబునం గైకొని" యంగీకరించి 'కల్యాణావహ మహనీయరచన హరివంశము' రచింప ప్రారంభించెను. గ్రంథము నన్నయ తిక్కనల వలె గాక అమూలాగ్రిముగా పూర్తిచేసెను. ఆ

మహానందముతో గ్రంథమును, 'గుణ వితరణ పావన నిను బొందుగాత భవ్య శుభంబుల్!' అని వేమభూజాని నాశీర్వదించి సమాప్తి కావించినాడు.

ఉపనిషత్తులకు వేదశిఖలని సంజ్ఞ కలదు. అట్లే పంచమవేదమను ప్రసిద్ధి కల మహాభారతమునకు హరివంశము మకుటాయమానము.

నన్నయ సంహితాభ్యాసియు, నవిరళ జపహోమ తత్పరుడును నగు వేద వేదాంగవేత్త. తిక్కన స్వయముగా క్రతుకర్మ నిర్వహించిన సోమయాజి. అనేక జన్మాంతరములలో నిరంతరముగా చేసిన అధ్యయనము వలనను, అధ్వరముల వలనను, చిత్తశుద్ధి అధిగమించిన మహాయోగి ఎఱ్ఱయ. ఆ ముగ్గురలో అద్భుత కృతార్థశబ్దములకు పుష్కలముగా వాచ్యుడగువాడును అతడే !

కాని, ఈ కవిత్రయము నిజముగా ముగ్గురా? లేక మూడు కాలములలో మూడు మూర్తులు ధరించిన ఆంధ్రుల ధర్మ తపఃఫలమా?

( భారతి రజతోత్సవ సంచిక, జనవరి 1949 )



# శ్రీ శివశంకరుల రచనా విధానము

౧

(1) గ్రీకు శిల్పుల విగ్రహనిర్మాణములోని తూకము, (2) పురాతన ఇటాలియన్ మహాకవుల దివ్యమనోజ్ఞ ప్రణయము, (3) పరాసుకవుల తేటదనము, (4) జర్మనుకవుల ఉదాత్తత, (5) పారశీకుల గులాబివాసన, (6) ప్రపంచ వాఙ్మయములోని సంపన్నత, (7) ప్రాకృతకవుల మాధుర్యము, (8) సంస్కృత మహాకవుల సంపూర్ణతతో మేళవించి శివశంకరుల రచనా విధానముగా రూపు దాల్చినది.

చిత్ర మేమనగా, ఇంత బహుముఖప్రజ్ఞకు అవకాశము కలిగించిన ఆంగ్ల భాషలోని కవుల కావ్యములు కాని, వారు రచన చేయుచున్న తెలుగుభాషలోని కావ్యములు గాని వారిపై ఎక్కువ ముద్ర వేయలేదు.

ఆంగ్లకవులలో ఐరోపియా పండితులు రాబర్టు బ్రౌనింగు- ఇటాలియనులయిన రజెటు - ఆంధ్రకవులలో నన్నయ, పోతన, రామరాజ భూషణుడు ఆయన కిష్టులు.

ఇంత విస్తారమైన శక్తికి అవకాశము కలుగుటకు విశేషమైన కారణము ఉన్నది. వారు సంస్కృత ప్రాకృత భాషలలో అభిమానించి కృషి చేసిన రోజులలో నిర్ణయ సాగర ప్రెస్సువారు నిర్దుష్టముగా చవుకగా అనేక కావ్యనాటకాలను ప్రచురించి యుండుట ; సామాన్యముగా ఆంధ్రపండితలోకము పేరులు కూడ వినియుండని అనేక సంస్కృత కావ్యనాటక సట్టకాలను వారు దెప్పించి ఆకలి గొన్నవారివలె ప్రీతితో ఆబతో సమగ్రముగా చదివి రుచిచూచి ఉండుట. రెండవది ; అప్పటికి బ్రిటిషవారి బంగారపు స్టాండర్డు ఫ్రీ ట్రేడు నిలిచియుండుట చేత భరింపతగిన ధరలకు ఉత్తమమైన గ్రీకు లాటిన్ ఇటాలియన్ ఫ్రెంచి జర్మన్ స్పేనిష్ రష్యన్ వాఙ్మయమే కాక, యూరపుఖండములోని ప్రసిద్ధశిల్పుల ప్రతిబింబములు చిత్రకారుల వర్ణచిత్రములు జీవితచరిత్రలు ఆంగ్లేయభాష ద్వారా

కోరినవారికి లభ్య మయ్యేవి. శ్రీ శివశంకరులు ఆ అవకాశమును పూర్తిగా ఉపయోగించుకొన్నారు. ఒక A.E.L.M. కాలేజి లైబ్రరీలోనే అప్పు డెన్ని అమూల్యగ్రంథము లుండెడివో జ్ఞాపకము చేసికొన్నచో ఆశ్చర్యము కలుగును. డాలర్ బానిసతనమువల్ల నేడు కలిగిన రేషనింగు సంస్కారములో అప్పుడు లేదు.

వీటికితోడు శ్రీ పోతుకుచ్చి శ్రీరామమూర్తిగారివంటి మిత్రులు సీమకు వెళ్ళి తిరిగి వచ్చేప్పుడు అమూల్యములైన గ్రంథాలు. చైనీస్ఆర్టు, జాపనీస్ఆర్టు, పర్షియన్ఆర్టు, ఇండియన్ఆర్టు ఇండోనేషియన్ ఆర్టుకు సంబంధించిన చిత్ర వైభవము కొనితెచ్చినారు. అవి శివశంకరులకు ఉపయోగించినవి.

అవి అన్నియు జ్ఞాపకము చేసికొంటేనే గాని శ్రీ శివశంకరుల సంస్కృతి వైభవము గోచరింపదు.

ఈ కాలములో పది పన్నెండు పద్యాలతో మహాకవులుగా చలామణీ ఆయేవారి రచననే మచ్చుగా ఉంచుకొని కవిత్వము ఇట్లుండవలె ననుకొనుట సర్వసాధారణ మైనది. మహాకవుల పద్ధతియే మరపునకు వచ్చినది. వాల్మీకిని, వ్యాసుని మర్యాదకొఱకు పొగడుటయేకాని వారి రచనావిధానము నేటి సామాన్య కవులకు గాని, విమర్శకులకుగాని అవగాహన మగుటలేదు.

నేటికాలములో కవితాశక్తియే లేక కవులుగా, మహాకవులుగా చలామణి అవుటకు కొన్ని మాటలు, పద్ధతులు పట్ల వస్తువులు అమాయిక ప్రజలలో ప్రచారములు జరుగుచున్నవి. బుద్ధిమంతు లయినవారు వానిని ప్రతిఘటించుటకు మోమోటపడుచున్నారు. వాచ్యముగా (1) జాతీయత, (2) రాష్ట్రాభిమానము, (3) తెలుగుదనము, (4) నుడికారము, (5) కుటిలగతి, (6) మాధుర్య హీనత, (7) అనన్వయము, (8) తరచుగా అవ్యుత్పత్తి, (9) అనర్థక దీర్ఘసమాస ఘటనము, (10) వెంటాడి సభలలో పద్యాలు పట్టిపట్టి చదివి వినిపించుట. ఇవి దురదృష్టవశమున శివశంకరులకు సంక్రమింపకుండుట శివశంకరులలో విశేషము.

౨

శివశంకరులు ఈ విధముగా కవిత్వము ఉండవలెనని పద్య రచనకు ఉపక్రమింపరు. వస్తువునుబట్టి వారి కవితావాహిని ఉచితమార్గమున ప్రవహిం

చును. దివ్యలోచనములవంటి చిన్న కావ్యములో ప్రతిపద్యము సానలు తీరిన జాతిరత్నమువలెనే భాసించును. కొన్ని కావ్యములు ముక్తకముల వలె అచ్చ కాంతిని వెదచల్లును. మరల తస్లీమువంటి కావ్యములో —

''సలాం ఉస్తాద్ కాంతారాం జీ !
ఇలా వస్తా రెక్కడ నుంచీ !
మియా తాన్‌సేన్ మీ దోస్తేగా ?''

అని క్రొత్త నడకతో, క్రొత్తభాషతో ప్రారంభిస్తారు. మళ్ళీ పెత్రార్కా అనే ఇటాలియన్ మహాప్రణయకవిని స్మరించి –

"శిరసు కోశముమీద, చేత గ్రంథముతోడ
పోనెంతు నీలాగె పెత్రార్కా !
కలిసికొందము భావికాలాన భాషిత
ప్రతిబంధకము లేక పెత్రార్కా !''

— అనగలుగుతారు.

"అవధానులుగారి అల్లుడు"లో జంగంకథ పద్ధతిలో –

"అవధానులుగారి కూతు రందమ్ముల-రాజహంసి
ఆ పుల్లంపేటలోన అంతటి చక్కనిది లేదు"

— అనగలుగుతారు.

ఏ విధానములో చూచినా పూర్తిగా చదివేవారికి ఒక క్రొత్త అందము భాసిస్తుంది. అలతి అలతి పదముల కూర్పుతో మహార్థమును సాధించగలిగిన రచన శివశంకరులది. వ్రతభంగము, గురుశిష్యులు, ఛిద్రమటి, అగ్రపీఠ ఇట్టి కావ్యములలో తేలిక మాటలతో ఒక అద్భుతమైన మనోజ్ఞభావమును పుట్టించ గలుగుతారు. హృదయేశ్వరిలో పవిత్ర ప్రేమగాథ బాధతో చిత్రిస్తారు. వర పరీక్షలో అటువంటి ప్రేమికులే తండ్రి కాఠిన్యమునకు బలి యౌట చిత్రిస్తారు. దుర్జయసింగు ఆ దుర్గమును ఎక్కుటకు అడుగడుగున ఎంత కష్టపడినది చిత్రి స్తారు. సద్వాక్యములో నాయికానాయకుల వివాహమునకు నిమిత్తకారణము నాయికకు విరాగభావము కలిగించుటకు భదంతుడు చేసిన ప్రయత్నమే అవుతుంది.

కవిప్రియ కవిప్రియ. పద్మావతీచరణ చారణ చక్రవర్తికూడా అంతే! సహజయానపంఙ్క్తి (చండీదాసు రామామణి) మఱియొక కవిప్రియ. దీక్షిత దుహితకూడ మఱియొక కవిప్రియయే కాని దీక్షిత దుహిత కావున విషాదాంతము. యక్షరాత్రి యింకొక పద్ధతిలో నడిచినది. వకుళమాలిక హృదయేశ్వరి కథనే అపూర్వవిధానములో వకుళమాలచేత అనిపిస్తాడు. కొంత "రాబర్టు బ్రౌనింగు" పద్ధతి గ్రహించియుండవచ్చు గాని ఇది స్వతంత్ర విధానము.

పద్యాలు మధురముగా అన్వయసౌలభ్యము కలిగి గాంభీర్యము వదలక బిగువు ఏమాత్రము సడలక ఔచిత్యము పాటించుచు రామణీయకముతో శోభిల్లుచు మహాకవుల కవితాసౌరభములతో గుబాళించుచు సర్వతోముఖసుందరముగా ఉంటవి.

వైవిధ్యము : ఖండకావ్యాలు, ముక్తకాలు, వాకోవాకములు, పద్యనాటికలు, గీతినాటికలు, ( operas ) ఛందోగతులు, సమవృత్తాలు, జాతులు, ఉపజాతులు, జాతీయచ్ఛందస్సులు, రగడలు వగయిరా - వరసలలోకూడా ఒక తాళముమీదనే కాక అనేక తాళములమీద నడుస్తవి శబ్దప్రయోగములు.



# నేడూ - నలభై ఏళ్లనాడూ

ఆధునిక సాహిత్యము నేటికి నలభై ఏళ్ళ క్రిందట సాహితి ప్రచురణతో సంపూర్ణరూపం ధరించింది. ఖండకావ్యాలు, కథానికలు, నాటికలు - రసగుళికలుగా ఉండడమే నవ్యతకు ప్రధానలక్షణమని చెప్పడము సత్యదూరము కాదు.

నలభై ఏళ్ళనాడు యువకులై ఉత్సాహాతిశయంతో రచనలు సాగించినవారిలో ఎక్కువ ప్రతిభ కలవారిలో ఇద్దరు ముగ్గురు మాత్రమే జీవయాత్ర విరమించినారు. కాని తక్కినవా రందరూ మన అదృష్టవిశేషముచేత సజీవులై రచనావ్యాసంగము సాగిస్తున్నారు. వారికితోడు అప్పటికి పుట్టినవారు, పుట్టనివారు యువకులు పెద్ద లవుతూ రచనలు సాగిస్తున్నారు. సరికొత్త యువకులు చేరుతున్నారు. ఆనాటి ఉత్సాహమూ, నేటి రచనావిస్తృతీ చూడగలిగిన మా బోంట్లకు ఎంతో తారతమ్యము కనబడుతున్నది.

ఆనాడు కవులు ప్రాధాన్యం వహించారు. అజ్ఞాతమైన ఏదో వేదన పడి పడి కావ్యరచన చేసేవారు. ఇది వ్రాయవలెననీ, ఇట్లా వ్రాయవలెననీ వ్రాసేవారు కారు. చిన్నతనమువల్లనూ, లోకానుభవమూ కావ్యానుభవమూ కొంత తక్కువ ఉన్నందువల్లనూ, వ్యుత్పత్తిలోపము మధ్య మధ్య కనిపించినా వారి కున్న ప్రతిభ మనోహరమైన తెర కప్పేది. వారు వ్రాసేది ఖండకావ్యమైనా, కథానిక ఐనా, నాటిక ఐనా - మరే సారస్వతశాఖ దైనా - ప్రతిదానిలోనూ కవితాత్మ ప్రస్ఫుటమయ్యేది. ఆ రచనలు హృదయంగమంగా ఉండి లోకోత్తర మైన ఆనందం కలిగించేవి.

మరి నేడో? - పేలవమైన వచనము కవిత్వము స్థాన మాక్రమించింది. "ఏమి చెప్పినాడు? ఎట్లా చెప్పినాడు? ఏమి ఉపయోగము? — ఇవీ పాఠకులు వేస్తున్న ప్రశ్నలు ఇప్పుడు. అందువల్ల నేడు సాహిత్యలోకాన్ని ఆక్రమించుకొన్నవారు, రచయితలు వారిలో గట్టివారికి మంచి తెలివితేట లున్నవి. అందువల్ల ఎట్లా వ్రాయదలిచినా అట్లా వ్రాయగలరు. మనస్సును ఉత్తేజపరచేట్లు వాళ్ళు చేయగలరు. బాగా వ్రాసినప్పుడుకాని శాంతంగా ఏకాంతంగా

చదువుకొని (ఆనందిద్దా) ఆస్వాదిద్దా మంటే కావ్యరసముండదు. వీటిల్లో ఉండేవి షడ్రసాలే— పులుపో, కారమో, ఉప్పో, చేదో, ఒగరో—ఎప్పుడైనా తీపో !

ఈ పేలవ వచనభావము నేటి రచయితలను ఆవేశించింది. నాటి కవులు కూడా నేటి రచయితల ప్రభావానికి ప్రయత్నపూర్వకంగానో, అప్రయత్నం గానో దాసు లవుతున్నారు

ఖండకావ్యాలు వ్రాసేవారు కొత్త నడకలో, కొత్త గుణింతాలో, అప శబ్దాలో, అపస్వరాలో చమత్కార మనుకొంటున్నారు. పెద్ద కావ్యాలు వ్రాసే వారి స్థితీ అట్లాగే ఉన్నది.

చిన్న కథలూ అట్లాగే ఉంటున్నవి కథలు పెద్దపెద్దవై నవలలై ఆ విధంగానే మారిపోతున్నవి. నాటికలూ అట్లాగే ఉంటున్నవి.

విమర్శకు లనేవారికి అభిమానమూ, ద్వేషమూ, పక్షపాతమూ, అహం భావమూ మితిమీరిపోతున్నవి. కావ్యస్వరూపమే తెలియకుండ ఏదో ఏదో విస్తారంగా ఉపన్యసించేవారికే తాత్కాలికాదరం లభిస్తున్నది.

నేటి వాఙ్మయ స్వరూపము పూర్తిగా ఈ స్థితిలోకి దిగజారిపోలేదు అదృష్టవశాన ! హృదయంగమమైన కావ్యాలూ, కథలూ, నాటికలూ పెద్దలూ, పిన్నలూ నేటికీ వ్రాస్తూనే ఉన్నారు. కాని, వాటిని చదివి ఆనందించేవారూ, ఆ ఆనందాన్ని ఇతరులకు పంచిపెట్టే విమర్శకులూ అంతకంతకు విరళ మవుతున్నారు. అట్టివారు నిర్భయంగా, నిశ్శంకంగా తమ ఉత్తమమార్గము వదలక, సారస్వతంలో నిష్కామకర్మయోగము అవలంబించే యోగీశ్వరుల మనే ఆత్మతృప్తితో, ఉదాత్తకావ్యరచన సాగించవలసి ఉన్నది. వారిదే భవిష్యత్కాలంలో పూజ్యస్థానము !

~~~~~~~~~~
~~~~~~~~~~

# వాఙ్మయంలో

# అక్రమప్రవేశము

౧

ఒకరి స్వాధీనములో ఉన్న చరాస్తిని చెంబు, తప్పాలా, చెప్పులు ఇటు వంటివి ఆతని స్వాధీనములోనుంచి దురుద్దేశంతో కదిలిస్తే అది చోరీ అవుతుంది. అట్లాగే ఒకరి స్వాధీనంలో ఉన్న స్థిరాస్తిలోకి ఇల్లు, స్థలము, పొలము అతని ఇష్టము లేకుండా ప్రవేశిస్తే అక్రమప్రవేశము అవుతుంది. ఈ రెండూ పోలీసువారు విచారించి పెట్టదగిన కేసులే, గాని పోలీసువారు చాలా చోరీకేసులు పెడతారు. కాని, అనుభవంలో వారు పెట్టిన అక్రమప్రవేశము కేసు కనబడదు.

ఈ పక్షపాతము ఒక్క పోలీసువారికే కాదు, అక్రమప్రవేశము కేసు ఎవరన్నా ఒకరు స్వంతంగా పెట్టుకుంటే న్యాయమూర్తులుకూడా అది సివిలు తగాదా ఉన్నదని తీసివేయడమే సామాన్యముగాని శిక్ష వేయడము అరుదు. ముందసలు కేసు ఫైలులోకి తీసుకోవడమే కష్టము. వకాల్తనామా వేసినవారి మొహమాటమువల్ల ఫైలులోకి తీసుకున్నా చివరకు నెగ్గదు. అది వారి లోపము కాదు. అక్రమప్రవేశము సామాన్యముగా ఒక్కసారిగా కాకుండా నెమ్మదినెమ్మదిగా జరుగుతుంది. గట్టుమరమ్మతు అను పేరుతో కాస్త నరికి అవతల వేస్తాడు. ఒకప్రక్క మరికొంత గదుముతాడు. సర్వేరాయి కనబడకుండా జరిగి జరిగి కనపడకుండాపోతుంది. కొలిస్తే గొలుసులభేదాలు ఉంటవి. అక్రమప్రవేశము నిశ్చయముగా నిర్ధారణ చేయడము కష్టము.

మరికొన్నిటిలో తనహక్కు స్థిరపరచుకోడానికి అక్రమంగా ఇంకొకరి స్వాధీనంలో ఉన్న ప్రదేశములో ప్రవేశిస్తాడు. కేసుపెట్టితే తీర్పులో అతనికి తన హక్కు సమర్థించుకోడానికి ప్రవేశించాడుకాని దురుద్దేశము లేదని తీసి వేస్తారు.

రాళ్లు, కొలతలు ఉన్న పొలాలు స్థలాలు ఇళ్ళల్లో అక్రమప్రవేశము కేసులగతి ఇట్లా ఉంటే సరిహద్దులు నిర్ధారణ చేయడము కష్టసాధ్య మయిన వాఙ్మయరంగములో అక్రమప్రవేశ మేమిటని ఎవరన్నా అడిగితే నాకు కోపము రాదు. మాబోటివారము ఈ కేసు నెగ్గడము కష్టమని ముందుగా చెప్పినా ఆశ వదలక మాకు బాకీ ఉండి బలవంతాన కేసు తయారుచేయిస్తారు. అటువంటి ఛాందసులనే ప్రస్తుతము అనుకరించ దలచినాను.

మరొకటి ఉన్నది. క్రిమినలు కోర్టులో అక్రమప్రవేశము కేసులో ఊరికే పోయినా సివిలుకోర్టులలో ఆ అవస్థ లేదు. క్రిమినలు కోర్టువంటి కొందరు ఆలకించకపోయినా దూరదృష్టికల కొద్దిమంది సహృదయులైనా ఉంటారని వారిని ఉద్దేశించి ఈ ఫిర్యాదు ప్రారంభిస్తున్నాను.

౨

నా కిప్పటికి షుమారు ముప్ఫయి ఏండ్లనుండి వాఙ్మయరంగముతో పరిచయ మున్నది. నాకు దానితో పరిచయము ప్రారంభించినప్పుడు సంఘసంస్కర్తలు వాఙ్మయరంగములో ప్రవేశించి ఉన్నారు. ఏ పత్రికలో చూచినా సంఘసంస్కరణ కావలెనని ప్రబోధించే పద్యాలూ, కావ్యాలూ, నాటకాలూ, కొద్దిగా కథలూ కనపడేవి. ఎవరి నోటివెంట విన్నా సంఘసంస్కరణవాక్యాలే వచ్చేవి. ఆ వ్రాసినవారిలో పండితులూ, కవులూ, పండితకవులూ, కవిపండితులూ ఉండేవారు. వారు మిక్కిలి ఆవేశముతో వ్రాసేవారు. సంఘ పరిస్థితులమీద కొంత అసహ్యము కలిగించేవారు. వారు వ్రాసిన గ్రంథాలు అనంతమైనవి. కాని వారిఉద్దేశము సంఘ సంస్కరణ కాని వాఙ్మయసృష్టి కాదు.

శ్రీ కందుకూరి వీరేశలింగము వారిలో ప్రముఖుడు. ఆయన వ్రాతలవల్ల సంఘములో ఎంతో సంచలనము కలిగినది. ఆయనకు శిష్యులూ, భక్తులూ ఎంతో మంది ఉన్నారు. వారు వారిరచనలన్నీ శ్రద్ధగా సేకరించి ఎన్నో సంపుటాలలో ప్రచురించినారు. ఎన్నో గ్రంథాలయాలు ఆ పుస్తకాలు తెప్పించినవి. ఆయన పండితుడు, ఆవేశపూరితుడు. రచనలో సమర్థుడు. ఆయనను స్మరిస్తూ ఆయన వర్ధంతి ఉత్సవాలు నేటికీ పెద్దపట్టణాలలో తప్పకుండా చేస్తూ ఉంటారు. కాని ఆయనరచనల సంపుటాలు విప్పి చదివేవాళ్లు మాత్రము బహు కొద్దిమంది.

ముప్ఫయిఏళ్లు కాకముందే ఆయన వ్రాతలను తెలుగుదేశము మరచిపోయింది. ఆయన తన వ్రాతలకంటె గొప్పవాడు. కనుక ఆయననుమాత్రము తెలుగువారు త్వరలో మరచిపోరు.

ఈ సంఘ సంస్కారణరోజులలో పుట్టిన సంస్కారణవాఙ్మయములో సజీవముగా ఉన్నది కన్యాశుల్కము. కన్యాశుల్కము ఇప్పుడు ఎక్కడో తప్ప లేదు. కాని ఇప్పటికీ శ్రీ గురజాడ అప్పారావు "కన్యాశుల్కము" ప్రదర్శిస్తే పండిత పామరు లానందిస్తారు. ఆయననాటక భాగాలమీద ఉన్న శ్రద్ధ మొత్తము మీద లేదు. అందువల్ల అది పూర్తిగా ప్రదర్శిస్తే రక్తి కట్టకపోవచ్చును. కాని ఏ కొన్ని భాగాలు కలిపి వేసినా ఆకర్షిస్తుంది. ఆయన కాలంలో సంఘసంస్కారణమీద ప్రజాదృష్టి ఉన్నందున శ్రీఅప్పారావు ఆ వస్తువు తమకున్న వాఙ్మయ దృష్టితో రచించినాడుకాబట్టి దానికి చలనము లేదు.

౩

1921 సం॥ ప్రాంతమునుంచీ వాఙ్మయములో జాతీయత ఎక్కువగా ప్రవేశించ మొదలుపెట్టింది. దేశభక్తిగీతాలు, జాతీయత ఉద్బోధించే కథలు, నాటికలు పుట్టసాగినవి. పుక్కిటిపురాణా లెందుకు? బానిసజాతికి కావ్యరసాస్వాదన మేమిటి? బానిసజాతి బానిసకావ్యాలు కాని పుట్టించలేదు. నీ ప్రేమ గీతాలు ఎవరికి కావలె? ఈ విధమైన ప్రశ్నలు ప్రతివారు వేయసాగినారు. స్వరాజ్యప్రాప్తి అయ్యేదాకా పుత్రజన్మ కూడా నిరోధించవలె నని కొన్నాళ్లు ప్రచారము సాగింది. విజాతీయప్రభుత్వముమీద అసహ్యము చెలరేగింది.

ఐనప్పటికీ ముప్ఫయికోట్లకు లోపుగా ఉన్న జనాభా పెరిగిపెరిగి నలభై కోట్లదాకా పెరిగిపోయింది జాతీయోజ్జీవముతోపాటు సారస్వతోజ్జీవము ప్రారంభించింది. సాహితీసమితి తెలుగువాఙ్మయరంగములో వెలుగు మొదలుపెట్టింది. అంత రాజకీయాందోళనమున కూడా కేవల వాఙ్మయము నిర్భయముగా అభిమానము చూపి నిలువగలిగింది. దేహము బానిస ఐనా ఆత్మ బానిస కాకుండా ఉంచుకోవచ్చునని సమితి చూపింది. సృష్టినిరోధము చేసే జాతి ఏనుగుజాతివలె క్షీణించిపోతుంది.

జాతీయప్రబోధము ఉద్దేశించి పుట్టిన రచనలు తాత్కాలికంగా ఉపయోగించనే లేదు. వాటి ఫలితముగానే 1930 సం॥లో ఎందరో వీరకావ్యములు చేసి

నారు. కాని కేవలము జాతీయత ఆదర్శముగా పెట్టుకున్న రచనలు ఇప్పుడు స్మరించేవాళ్లు కూడా లేరు. ఆ రచనలలో స్మరించదగినది నాబోటివారికి ఇప్పుడు స్ఫురణలోకి రావడంలేదు. సాహితీసమితిమాత్రమే అప్పుడు చేసినట్లే ఇప్పటికీ కావ్యసృష్టి చేస్తున్నది. కొందరు సభ్యులు పరిణతి పొందినారు. మరి కొందరు చేరి పరిణతి పొందుతున్నారు. కాని వారందరికీ ఆదర్శము ఉత్తమ వాఙ్మయ సృష్టే. వారిలో జెయిళ్ళకు వెళ్ళినవారున్నారు. జెయిలు నరకమని ఉపన్యాసాలిచ్చినారు. కాని అవి కావ్యాలలోకి రానీయలేదు.

౪

తెలుగుదేశంలో 1930 సం॥ ప్రాంతమునుండీ ఒక కొత్తశక్తి ప్రవేశించింది. అది 1940 ప్రాంతమునుంచి వాఙ్మయరంగంలో నివాసము ఏర్పరచుకో వలెనని ప్రయత్నిస్తున్నది అది విజాతీయ కృత్య పాశ్చాత్యులు సృష్టి చేసిన యంత్రములోనుంచి ఆ యంత్రమును వినాశనము చేయడానికి పుట్టిన భయంకర కృత్య ఇది. మన దేశమునకూడ ఈ చంద్రభూతము ప్రవేశము కలిగించు కున్నది. కనుక ఈ మహాకృత్య మన దేశములో కూడా అడుగుపెట్టింది.

(ఈ వ్యాసము "ఢంకా" (Annual) కై వ్రాయబడినట్లు వ్రాతప్రతిలో ఉన్నది.)



# సారస్వతంలో విప్లవము

విప్లవం అంటే గాభరా పడనక్కరలేదు. విప్లవం అంటే అసలు అర్థము పెద్ద దాటు. విశేషమైన గంతు. రాజకీయరంగంలో విప్లవమంటే ఇటు ప్రభుత్వమువారు శిక్షిస్తారు. అటు కాంగ్రెసువారుకూడా మూతి ముడుస్తారు. అపాయము లేకుండా విప్లవము చేయడానికి వీలున్నది ఒక్క సారస్వతమే కాబట్టి మా మిత్రులు చాలామంది సారస్వతంలో విప్లవముకోసము ప్రయత్నిస్తున్నారు.

ఎట్లాగంటే ? మన మెవరినన్నా తిట్టదలచుకుంటే తేలికగా దేవుణ్ణి తిట్టవచ్చు ! మా దీక్షితులుగారు అన్నట్లు —

తురకను తిడితే తంతాడా ?

పాపము దేవుణ్ణి తిడితే, తర్వాత ఏమోకాని ప్రస్తుతము మాత్రము తన్నడము లేదు.

ఎవరినైనా ఎక్కిరించవలె నని మీకు బుద్ధి పుట్టిందనుకోండి ! కులాలల్లో బ్రాహ్మణులను ఎక్కిరిస్తే తగాదా రాదు ! వృత్తులలో మీ ప్లీడరులను వెక్కిరిస్తే ఇబ్బందిలేదు. చూడండి మన Social Pictures ! బ్రాహ్మణులూ, ప్లీడర్లే హాస్యాస్పదు లయినవాళ్లు ! సారస్వతంలో అధికారం చలాయించే సంస్థ లేదు. ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ఏమైనా శాసనము చేస్తే మా నవ్యసాహిత్య పరిషత్తు ఒప్పుకోదు. మా నవ్యసాహిత్యపరిషత్తుకు శాసనాలు పనికిరావు. ఒక వేళ శాసనము చేయబోతే మా సభ్యులే తిరుగుబాటు చేస్తారు. అందువల్ల సారస్వతంలో విప్లవము నిరపాయ మైనది.

సాహిత్యంలో విప్లవము చేయడము అపాయము లేకపోవడము ఒకటే కాదు. ఒక పాజిటివు (Positive) లాభముకూడా ఉన్నది. ఈ కాలంలో కవి అనే పేరు రావలెనంటే కొత్తరకంగా వ్రాస్తున్నాడనే ప్రతీతి పడవలె. సాహిత్యములో విప్లవము చేస్తున్నాడంటే ఉండే గౌరవము సలక్షణమైన కవిత్వము

చెపుతున్నాడంటేగాని రసవంత మైన కవిత్వము చెపుతున్నాడంటేకాని లేదు. కాబట్టి సారస్వతంలో విప్లవకారుల మని చెప్పుకోవడమున్నూ కవిమిత్రులకు ఇప్పుడు సామాన్య మయింది.

అయితే సారస్వతంలో ఎంత విప్లవము ఆధునికులు నిజంగా చేస్తున్నారు? ఎంత చేయగలుగుతారు? ఎంత సాధ్యమవుతుంది? ఆ విషయాలు మీ ఎదట ముచ్చటించ దలచుకున్నాను.

ఇప్పటికి షుమారు వంద సంవత్సరాలబట్టీ పాశ్చాత్య Scientists చేసిన కృషివల్ల Physical Sciences చాలా వృద్ధి యైనవి. అంటే విప్లవం వచ్చింది. పాశ్చాత్యుల Psychology మానసికశాస్త్రములో కూడా Psycho-Analysis వచ్చిన తర్వాత ఒక విప్లవము వచ్చింది. ఇప్పుడు సముద్రాలమీదనే కాకుండా గాలిలోకూడా విప్లవాలు చేస్తున్నారు. ఇంకా Stratosphere లో కూడా విప్లవాలు చేసి గ్రహాలను చేరుకోటానికి ఆశిస్తున్నారు. కొన్నాళ్లకది సాధ్యమయితే కావచ్చును,

ఈ విధంగా Sciences లో జరిగిన విప్లవము చిత్రకళలలోను సంగీతములోను సారస్వతములోను మాత్రము ఎందుకు సాధ్యము కాదు? ఆ విధంగా విప్లవము చేయక ఈ పాతదారులే తొక్కుతూంటే అభివృద్ధి ఏముంటుంది? అని మీ మిత్రుల ఉద్దేశము.

ఇటువంటి విప్లవము జరుపుదా మనుకోడానికి ఈ కాలంలో కొంత అనుకూలమైన పరిస్థితులు ఉన్నవి. పూర్వము కవులు కావ్యాలు వ్రాస్తే అవి లోకములో ప్రచారంలో పెట్టవలెనంటే మహారాజులవద్దకో, రాజులవద్దకో వెళ్ళి ఆస్థానాల్లో మెప్పు పొందవలసివచ్చేది. శ్రీ తిరుపతివేంకటేశ్వరకవులు కూడా నానారాజ సందర్శనము చేసినారు. ఇప్పుడు కూడా మన అగ్రాసనాధిపతిగారి వంటి ప్రభువులు కవులకు సన్మానాలు చేస్తున్నారు.

అయితే నేటి కవులు ప్రధానంగా ఇటువంటి ప్రభువులమీద ఆధారపడి ఉండడం లేదు. అచ్చాఫీసులు ప్రబలమైనతర్వాత గ్రంథాలు అచ్చువేసి ప్రజల చేతులలో వదిలిపెట్టవలసి వస్తున్నది. ఈ కాలపుకవులను పోషిస్తే ప్రజాసామాన్యమే పోషించవలె. వాళ్లు ఆదరించకపోతే ఉపవాసము చేయవలె. మునుపు

కవులు మహారాజులను తృప్తిపరచడానికి ప్రయత్నిస్తే ఇప్పుడు ప్రజాసామాన్యాన్ని రంజించడానికి ప్రయత్నించవలసింది. ఈ విధంగా పాఠకలోకంలో పెద్దమార్పు వచ్చింది. తల్లక్రిందులే ఐంది.

మనుష్యమాత్రుడైన ప్రతివానికీ అభిమాన విషయాలు ఉంటవి. అందువల్ల కొంత సంకుచితంగా ఉంటుంది బుద్ధి. మహారాజులు విద్వాంసు లయినప్పటికీ మానవసహజమైన ఒక సంకుచితబుద్ధి ఉండేది. ఆ అభిమానాన్ని తృప్తిపరచకపోతే ఆ మహారాజువద్ద ఆశ్రయము దొరకదు. వైష్ణవమతాభిమానియున్న ఒక మహారాజును తృప్తి పరచవలెనంటే వైష్ణవవిరుద్ధమైన గ్రంథము వ్రాస్తే లాభము లేదు. ఈ విధంగా ఏ మహారాజును ఆశ్రయించబోయే కవి ఆ మహారాజు అభిమాన విషయాలకు అనుకూలముగా ఉండే కావ్యాలు వ్రాయవలసి ఉండేది.

ఇప్పుడు కవులను పోషించే మహారాజు సామాన్యప్రజ. ఈ సామాన్యప్రజల ఆదరణ పొందవలెనంటే సారస్వతంలో విప్లవము తీసుకొనిరావలెనని మా నవకవిమిత్రుల వాదము.

బంగారము మంచిచెడ్డలు తెలుసుకోడానికి గీటురాయి ఉన్నది. అట్లాగే సారస్వతములో మంచిచెడ్డలు తేల్చుకోడానికి గీటురాయి ఏమయినా ఉన్నదా ? ఉంటే అది ఏమిటి ?

ఉత్తమ కవిత్వమును మహారాజులు ఆదరించినప్పుడు గీటురాయి మహారాజులూ కాదు, ప్రజాసామాన్యము ఆదరించవలసిన ఈ రోజులలో ప్రజాసామాన్యమూ కాదు. సారస్వతానికి గీటురాయి సహృదయులు. ఎటువంటివారు సహృదయులో అంత శీఘ్రముగా నిర్వచించే విషయముకాదు కాని సహృదయులకు ఆనందము కలిగించినప్పుడే అది ఉత్తమ కావ్యకోటిలోకి చేరుతుంది.

ఆపరితోషా ద్విదుషాం
న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానమ్
బలవ దపి శిక్షితానాం
ఆత్మ న్యప్రత్యయం చేతః॥

— అన్నాడు మహాకవి.

విద్వాంసు లనండి. సహృదయు లనండి - కవిత్వానికి ఈ నికషోపలం మారేది కాదు. రాజాభిమానము కోసము పూర్వమూ, ప్రజాభిమానము కోసము ఇప్పుడూ కవులు రచనలో ఏ కొన్ని మార్పులో చేయక తప్పదు. అవి బాహ్య రూపంలో చేసే మార్పులేకాని నిజస్వరూపములో మార్పులు ఉత్తమ కవులు చేయరు. వారు తాత్కాలికముగా కావ్యప్రచారము కోసము ఎవరిని ఆశ్రయిం చినా తమ ఆత్మను అమ్ముకోరు. అట్లా అమ్ముకున్నవాడు కవి కాడు. కాబట్టి మానవ కవిమిత్రులు సారస్వతంలో విప్లవము తెస్తారంటే వేషములో విప్లవము తీసుకురాగలరే కాని అంతకంటె విశేషము తేలేరు. దూరాలోచన ఉన్న ఆధుని కులు అంతకంటే ఎక్కువ విప్లవము తెస్తామని అనడం లేదు.

కాని, కొద్దిమంది ఆధునికులు మాత్రము అటువంటి విప్లవము తీసుకొని రాగలమనే అహంభావముతో ఉన్నారు.

కావ్యవిషయములో మార్పులు, ఉపమాన వస్తువులలో మార్పులు, పొగ గొట్టపు భూంకార ధ్వని Sulphuric acid ఇతర ఛందస్సులలో మార్పులు. కొంతమంది Mathemetical Signs — + — × — whole square వగయిరా తెస్తున్నారు; సంగీతపు గుర్తులు కూడా తెస్తున్నారు.

ఇవి అన్నీ సహృదయులను ఎంత ఆనంద పెట్టగలవో కాలమే తేల్చగలదు.



# గురజాడవారి కథానికలు

కథాసాహిత్యము లోకములో బహుప్రాచీనమైనదే అయినా చిన్న కథ అనబడే కథానికకు 19వ శతాబ్దంలో సాహిత్యప్రక్రియలలో ప్రత్యేకస్థానము వచ్చింది. అందులో కూర్పులోను, వస్తువులోను మంచి బిగువు ఏర్పడ్డది. నాటకమూ, ఏకాంకికమూ ఉన్న సంబంధమువంటిదే పూర్వపుకథలకూ ఈ కథానికలకూ ఉన్నది. ఇప్పుడిప్పుడు మళ్ళీ కథానిక కూడా కొంచెము కొంచెమే పుట్టి కొత్త అందము కూర్చుకుంటున్నది.

శ్రీ గురజాడ అప్పారావు గత శతాబ్దం చివరిభాగంలోను, ఈ శతాబ్దం మొదటిభాగంలోను అతిరథులు అలవరచుకొని రచనలు చేశారు. అప్పుడు కొత్తమార్గాలు అవలంబించవలెనని ప్రయత్నించే తెలుగురచయితలే తక్కువ. ఆ ప్రయత్నం చేసిన సాహసికులలో అగ్రగణ్యుడు శ్రీ గురజాడ.

ఆ కాలంలో మన రచయితలు తమ దృష్టిని కేవల కళాఖండాలు సృష్టించడంమీద కంటె సంఘసంస్కారం చేసి మనదేశాన్ని పాశ్చాత్యదేశాలతోపాటు అభివృద్ధి చేయించే ప్రయత్నంమీద ఎక్కువగా పెట్టేవారు. సంఘసంస్కరణకు సాహిత్యము సాధనము.

అప్పుడు దేశంలో అన్ని ఉత్సవాలలో భోగంమేళములు ఆడించడమూ, చూడడమూ పరిపాటి. వేశ్యాలోలత్వముగూడా సర్వసామాన్యంగా ఉండేది. భోగంమేళములు నిరసించేవారు ఆంటినాచి (anti-nautch) సంఘాలుగా ఏర్పడి ప్రచారం చేసేవారు. అటువంటివాళ్ళలో ఒకడు గోపాలరావు. ఆ ప్రబుద్ధుడు ఒక సాని పాట వినడానికి రోజూ వెళ్ళడం సాగించాడు. అనుకోకుండా దాని రూపానికి కూడా ముగ్ధుడై అర్ధరాత్రిదాకా ఇంటికి రావడం మానేశాడు. చివరకు ఒకనాటి రాత్రి ఇంటికి వచ్చేసరికి భార్య కనబడలేదు. ఖంగారుపడుతుండగా ఆమె పుట్టింటికి వెళుతున్నట్లుగా వ్రాసిన ఉత్తరం చూచి పశ్చాత్తాపపడ్డాడు. అంతలో ఇంతసేపూ మంచంకింద దాగిఉన్న భార్య దర్శనమిస్తుంది. "దిద్దుబాటు" అనే కథలో కథ ఇది.

ఇందులో సంభాషణల భాగాలలో వ్యావహారికభాష, కథ చెప్పడంలో గ్రాంథికభాష. ఈ కథలో చివరివాక్యాలు ఇవి.

"అంతట మంచముక్రింద నుండి అమృతనిష్యంది యగు కలకల నగవును కరకంకణముల హృద్యారావమును వినవచ్చెను."

ఈ కథలో హాస్యమున్నది. కాని అంత సున్నితమైనది కాదు. ఏది ఎట్లా ఉన్నా ఈ కథా ప్రారంభము పరిణతమైన కథానికల ప్రారంభమువలె ఉన్నది.

"తలుపు తలుపు"

"తలుపు తెరవబడలేదు"

... ... ... ... ...

"మీ పేరేమిటి?" అనేది ఇంకొక కథ. ఆది ఇట్లా పాటవలె ఆరంభిస్తుంది.

"మీ పేరేమిటి?
దేవుడు చేసిన మనుషుల్లారా
మనుషులు చేసిన దేవుళ్లారా
మీ పేరేమిటి?"

ఈ కాలంలో పెద్దదవుతున్న కథానికల లక్షణాలు ఈ కథలో ఉన్నవి. దీనిలో ప్రధానకథ రామగుండ మనే రామక్షేత్రంలో విష్ణుభక్తులకూ, శివభక్తులకూ వచ్చిన తగాదా. శివభక్తులూ, సంపన్నులూ ఐన ఆ వూరి దేవాంగుల ప్రాపు సంపాదించడానికి అక్కడ ఒక పెద్దగుహలో ఉన్న బౌద్ధవిగ్రహాలకు శివుడనీ, పార్వతి అనీ పేర్లుపెట్టి పూజలు సాగించారు. పూజారి జంగం శరభయ్య ఆధ్వర్యాన శివస్థలానికి వైభవం కలిగి పెద్దజాతర్లు సాగుతున్నాయి.

గ్రామంలో పెరిగిపోతున్న శివభక్తిని అరికట్టడానికి సాతాని మనవాళ్లయ్య తెల్లవారగట్ల రామధ్వజ మొకటి పట్టుకొని గ్రామవీథుల్లో అట్టహాసంగా ప్రభాతభేరీలు సాగించాడు. స్తోమత కల ఊరినాయుడ్లు వైష్ణవపక్షము అవలం

బించారు. శరభయ్య నందికేశ్వరుని అవతారమని శైవు లంటే, మనవాళ్ళయ్య గరుడావతారమని వైష్ణవులలో ప్రచార మవుతున్నది.

ఇట్లా ఉండగా హైదరాబాదు వైపునుంచి కొందరు శివాచార్లు ఆ ఊరు వచ్చారు. అర్ధరాత్రివేళ వారు శంఖాలు జయఘంటలు దమామీలతో శివార్చన సాగిస్తూ ఉంటే జనాన్ని ఆకర్షించింది. ఒక్కొక్క నాయడే వైష్ణవము వదలి విభూతి రుద్రాక్షలు ధరిస్తున్నారు.

వాళ్లు వచ్చిన పదోరోజు రాత్రి శివాచార్లు అగ్నిగుండము తొక్కుతారని ప్రకటించేప్పటికి వైష్ణవులలో అలజడి కలిగింది. గ్రామమునసబు రామినాయుడు, లక్షాధికారి సారథినాయుడు కూడా శైవమువైపు మొగ్గు చూపారు. ఆ రాత్రి గ్రామమునసబు తాగినకైపుతో మనవాళ్ళయ్యను గుండంలో దూకమని నిర్బంధించగా అతడు తప్పించుకొని ఆ పని రామాలయ ధర్మకర్త ఐన రంగాచార్యులుమీదికి నెట్టాడు. రంగాచార్యులు వృద్ధుడు, సాత్త్వికుడు. అంతవరకూ మతస్పర్థలలో కలిగించుకొన్నవాడుకాదు. ఐనప్పటికీ ఆయనను పిలిపించి గ్రామమునసబు బలవంతాన గుండంలోకి తోయించడానికి సిద్ధపడుతున్నాడు.

సరిగ్గా ఆ సమయంలో ఆచార్యులుగారి కోడలు నాంచారమ్మ కత్తి కాగడా పట్టుకొని వచ్చి మామగారిని తప్పించింది. అంతేకాదు 'విష్ణువును వైష్ణవులు సాత్త్వికంగానూ, తురకలు తామసంగానూ అర్చిస్తా'రంటూ 'రామభక్తుడయిన దూదేకుల పీరుసాహెబ్ చేత గుండం తొక్కిస్తా' నని చెప్పి జనాన్ని ఒప్పించింది.

ఆ రాత్రి శివాచార్యులు గుండము తొక్కిపోగానే "అల్లా–రాం" అంటూ పీరుసాయిబు పీరు పట్టుకొని గుండములో నడిచాడు. అతనివెంట సాతానులు కూడా గుండము తొక్కారు. ఆ తర్వాత ఆ పీరు త్రిశూలాకారంగా ఉన్నందున శివపీరు అని శరభయ్యా, దానికి పంగనామాలు ఉన్నవి కాబట్టి విష్ణుపీరే అని మనవాళ్ళయ్య ప్రచారం సాగించారు. వాళ్ళభక్తో ? మనవాళ్ళయ్య గుండము తొక్కమంటే మొహం తప్పించినవాడైతే, మరి శరభయ్యో ? అత డా గుళ్ళో శివవిగ్రహాన్ని పీకుకొనిపోయి ఒక తెల్లదొరకు రహస్యంగా అమ్మజూపి పారిపోయినవాడు.

ఈ కథలో భాష అంతా వ్యావహారికమే. పలుకుబడిలో సొగసు ఉన్నది. ఐనా అప్రయత్నంగా మధ్యమధ్య గ్రాంథికంలోనికి పరుగెత్తుతుంటుంది. ఈ కథ శాయన్న భుక్తగారి డాబామీద గురువుగారయిన శాస్త్రిలగారికీ, కథకుడూ మొదలయిన తోటిశిష్యులకూ శాయన్న చెప్పినది. కథ మొదటనూ మధ్య మధ్యనూ చివరనూ శ్రోతల వ్యాఖ్యానాలు కథాకథనానికి జీవము కలిగిస్తుంది. సాంబారమ్మపాత్ర ఉత్తమంగా మనస్సుకు హత్తుకుంటుంది.

తన ఉత్తమత్వముతోనే కాకుండా తన చక్కదనముతో కూడా పాఠకు లను ఆకట్టేది మెటిల్డా అనే కథలోని మెటిల్డా పాత్ర. ఆమె భర్తతో కాపురము చేసే ఇంటి సమీపాన లాడ్జిలో ఉండే విద్యార్థులంతా ఆమెవైపు అందానికి ముగ్ధులై చూస్తూ ఉండేవాళ్ళు. పెనిమిటి అనుమానంతో ఆమెను మహా ఒత్తిడి పెట్టేవాడు. అందువల్ల విద్యార్థు లతనికి "పులి"అని పేరు పెట్టారు.

కథకు డొకనాడు వాళ్ళ ఇంటిముందునుంచి కాలేజికి వెళుతూ గుమ్మ ములో ఉన్న మెటిల్డాను చూస్తున్నాడు. పులి అతన్ని లోపలికి పిలిచి "నా పెళ్ళాంవైపు చూస్తున్నావా ?'' అని అడిగాడు.

''చూశాను'' అన్నాడు కథకుడు.

"అది కంటికి కనబడితే నీకు అందము. అవునా కాదా?" అని అడిగాడు పులి

"అవును" అని జవాబు.

''అయితే ఈ ముండను తీసుకుపో'' అన్నాడు పులి.

మెటిల్డా వంచిన ముఖము, స్రవించిన కన్నీరు, అపుకొన్న నిట్టూర్పులు కథకునికి వ్యథ కలిగించినవి. తర్వాత కథకుడికి మెటిల్డా తమ వంటబ్రాహ్మ ణునిద్వారా ఒక ఉత్తరం పంపింది.

''తల వంచుకొని మీ రంతా మీ దారిన పోతే నేను బ్రదుకుతాను. నా కాపురం బాగుపడుతుంది'' — అని దాని సారాంశము.

ఆ ఉత్తరం చేత బుచ్చుకొని కథకుడు తన మిత్రునితో కలిసి వెళ్ళి పులితో మాట్లాడినాడు. దానితో పులికి భార్యమీద అనుమానం ఎగిరిపోయింది. మేటిల్డాకు చెర వదిలింది.

"మతము—విమతము" అనేది చారిత్రకమైన గాథ. శ్రీకాకుళంలో దేవాలయము పడగొట్టి షేరమ్ ? మహమ్మదు పెద్ద మసీదు కట్టించిననాటిది. ఈ కథలో సంభాషణ మాత్రము వ్యావహారికము. కథనము గ్రాంథికభాష.

శ్రీ గురజాడ తెలుగుదేశములో కథానికా రచనకు నాంది నిర్వర్తించాడు. ప్రాథమిక దశలో ఉండే చిన్న లోటుపాటులతోపాటు పరిణతదశలో ఉండే మెరుగులు కూడా ఈ కథలలో కనిపిస్తవి.



# కావ్యవస్తువు

ఆబ్రహ్మ స్తంబపర్యంతము సృష్టి సమస్తమూ కవితావస్తు యోగ్యమే. "అడవిపూవు" తెనాలి నవకవి పెనుమర్తి వెంకటరత్నాన్ని ఆకర్షించి తన రహస్యము చెప్పినది :

> "నేను కవి నయి బ్రతికియుండిన దినాల
> స్వప్నములు గంటి, నొక వనచ్ఛాయలోన
> నొక్క పువునైన బాగుండునో యటంచు
> దాని ఫలలబ్ధి నేటి జన్మాన గంటి !"

శ్రీ దువ్వూరి రామిరెడ్డిని "గడిక" తన్మయుణ్ణి చేసింది.

శ్రీ కవికొండల వెంకట్రావు 'ఆలుచిప్ప'మీద కావ్యమల్లినాడు.

ఈ రీతిగా కావ్యవస్తువులు అనంత మైనప్పటికీ, కవులకు ఎందువల్లనో గాని కొన్నిటిమీద పక్షపాతము. ఇప్పుడు మనలో కొందరికి, ముసలితనము రావడమువల్లనో, 'బాలనెరుపు'వల్లనో అది ఎంత రుచిగా లేకపోయినా 'ప్రేమ' అనేది ఉన్నదే, అది కవులకు విశేషాభిమాన మున్నవస్తువు. కాకపోతే దాని స్వరూపము కాలాన్నిబట్టి మార్పు పొందుతుంటుంది. కాని అసలు పోదు. వాల్మీకిమహర్షిని సీతారాముల ప్రేమ ఆకర్షిస్తే, మహాకవిని పార్వతీపరమేశ్వరుల దాంపత్యము ఆకర్షించింది. మన చారిత్రిక పరిశోధకులు విమర్శిస్తే అల్లసాని పెద్దన్న సోమయాగము చేయడానికి సంకల్పిస్తే విద్యానగరంలోని జైనులు ఆ మేకపిల్లను ఎత్తుకొనిపోయినారని తేలుతుంది. ఆయనకు తీరని దేవవేశ్యల మీది మోహంచేత మనుచరిత్ర ప్రారంభించినాడు. విప్రనారాయణచరిత్ర వ్రాసిన కవిని ఈ లోకంలోని వారకాంతల విలాసాలే ఆకర్షిస్తే అందుకు శ్రీమహావిష్ణువు కూడా సహాయ మైనాడు.

ఇక ఈ కాలంలో చూడండి ! సామాన్యంగా నవకవులను, పరస్త్రీప్రేమ ఆకర్షించినట్లుగా మరొకటి వారికి రుచించడం లేదు. "మాపసా" కథలు మన

వాళ్ళ దృష్టిలో పడ్డప్పటినుంచీ ఇటువంటి కథలే వ్రాస్తున్నారు ఎక్కువగా ! పొరుగింటి పుల్లకూర రుచి ! టాల్‌స్టాయి వంటివాడికి కూడా ఉంది ఈ రుచి ! Resurrection, Anna Karinina ఇత్యాదులలో నాయికలు వ్యభిచారిణులే! కాబట్టి మన మెంత వద్దన్నా శృంగారము ఏదో రూపంగా కవిత్వంలోకి వస్తూనే ఉంది. బహు ప్రాచీనమైన అగ్నిపురాణములో వ్యాసుడు అగ్నిదేవునిచేత ఏమని పించాడో విన్నారా !

"శృంగారీచేత్కవిః కావ్యే జాతం రసమయం జగత్"

అంతటితో ఊరుకోలేదు వ్యాసతాత !

"స చేత్కవి ర్వీతరాగో నీరసే వ్యక్తమేవ తత్."

అట్లాగే యుద్ధ మొకటి! పాపము 1914 సం॥లో యూరపులో కవులంతా యుద్ధాలు అంత మొందించే యుద్ధంలోకి ఉత్సాహంతో దూకినారు. మళ్ళీ 1939 సం॥లో అంతకంటె మహాఘోరమైన సంగ్రామము ఆరంభించింది. ఇది ఎప్పుడు అంత మవుతుందో తోచకుండా ఉన్నది. పాపము అహింస పరమధర్మముగా బోధించిన గౌతమ బుద్ధుడు చనిపోయినవెంటనే ఆయనఅస్థులకోసము ఏడుగురు రాజులమధ్య మహాయుద్ధము జరిగేందుకు సిద్ధమైంది. చీమనుకూడా హింసించని జైనులు పాపము నిద్రలేవగనే ముందు మూడుసార్లు "బ్రహ్మక్షయము, బ్రహ్మ క్షయము, బ్రహ్మక్షయము" అని జపిస్తారు. మన వీరోపాసకులు 'శ్రౌతస్మార్త నిత్య కర్మానుష్ఠాన నిరత కంటకాన్ భక్షయ భక్షయ' అంటారు. కాబట్టి కవులకు పోట్లాట—యుద్ధము—వీరరసము మీద అభిమానము పోయేట్లు లేదు.

కాకపోతే ఈ యుద్ధంలో కూడా కాస్త కాలాన్నిబట్టి మార్పు ఉంటుంది. మన పూర్వకవులకు దేవదానవయుద్ధాలూ, రామరావణయుద్ధాలూ, పాండవకౌరవ యుద్ధాలూ ఇష్టమైతే గ్రీక్‌పురాణకవులకు వీరులయుద్ధాలు ఇష్టము. మన మధ్య కవులకు రాజపుత్ర యుద్ధాలూ, పల్నాటి యుద్ధమూ, బొబ్బిలి పోట్లాటా ఇష్ట మైతే యూరపులో మధ్యకవులకు మతయుద్ధాలు అభిమతాలైనవి. ఆధునికులలో యుద్ధకథలో తన కథ ఎక్కువ మేధతో కూర్చినవాడు నాకు తెలిసినంతవరకు "And Quiet Flows the Don" అనే నవల వ్రాసినMikhoil Sholokhov! దానికి స్టాలిన్ బహుమానము వచ్చినదంటే సోవియట్‌రష్యాలో రసగ్రహణ పాటవము ఎంత అద్భుతముగా ఉన్నదో మనవారికి తెలుస్తుంది.

పోట్లాట ఎంత అసహ్యమైన వస్తువైనా, సంఘర్షణమీదనే మథనముమీదనే కావ్యజగత్తు ఆధారపడి ఉన్నదనడము అతిశయోక్తి కానేరదు. అదే సృష్టికి కూడా మూలము. హింస ఇష్టము లేనివారు "అహింసా సమరము" సాగించవలెనంటారు. యుద్ధాలు ఇష్టములేని మార్క్సిస్టుని 'క్లాసువారు' చిత్రిస్తారు. సామాన్య జనానికి యుద్ధమంటే ఎంత ఇష్టమో తెలియడానికి ఈ యుద్ధము ప్రారంభించిన తర్వాత పత్రికలకు అమ్మకము ఎంత పెరిగిందో కనుక్కుంటే స్పష్టపడుతుంది

ప్రేమా ఘర్షణా—వీటితర్వాత కవులకు ప్రియమైనది ఏమిటంటే, అచ్చ తెనుగులో అది 'ఏడుపు !' దొంగఏడుపులు ఏడ్చే కవులు కొందరున్నా, నిజంగా ఏడ్చే కవులు అసలు లేకపోలేదు. ఈ ఏడుపు ఈ కాలపుకవులే కొత్తగా అభ్యాసము చేశా రనుకోవడము మాత్రము పొరపాటు ! ఆదికవికి శోకము శ్లోకముగా మారిందట. మధ్యకవులలో భవభూతి కరుణ ఒక్కటే రసమన్నాడు. ఇక మన తెలుగుదేశంలో సాహితీసమితి కవులు ఏడ్చిన ఏడుపుల ప్రతిధ్వనులు ఇప్పటికీ అప్పుడప్పుడు వింటున్నాము. కవులు కొందరు ఆకలి అనీ, కడుపు అనీ కొత్తగా ప్రారంభించారు. ప్రేమ విఫలమైనా ఏడుపు తప్పదు. ఒక కవి "వెక్కి వెక్కి రోదింతును"అంటే మరొక కవి బెట్టుగా -

"పౌరుషోదంచితుడ నయ్యు బాలుపోల్కి
రోదనము చేసినాను హృద్భేదకముగ"

అన్నాడు. యుద్ధాంతమందు ఓడినవారు బహిరంగంగానూ, గెలిచినవారు అంతరంగంలోనూ ఏడవక తప్పదు. కాబట్టి ప్రేమా, యుద్ధముతోపాటు ఏడుపు కూడా ముఖ్యమైన కావ్యవస్తువే !

ఇంతటితో కావ్యవస్తువులు పూర్తి చేదామన్నా శ్రీ మొక్కపాటి, శ్రీముని మాణిక్యాలకు కోపము వస్తుంది. వారికోసమైనా పైవాటితోపాటు "నవ్వు" కలపకపోతే మాట దక్కదు. అయితే నవ్వులో ఒక విశేష మున్నది. మొత్తము మీద ప్రేమించే కవులూ పోట్లాడేవారూ, ఏడ్చేవారూ అమాయకులనే చెప్పవలె ! వాళ్లు ఉద్రేకము కలిగితే ఒళ్లు మరిచిపోతారు. వాళ్లందరికంటే ఈ హాస్యకవులు ఎక్కువ తెలివి గలవారు. వారు ఒళ్లు దగ్గరపెట్టుకుంటారు. వాళ్లకు ప్రేమ లేదు, పోట్లాడరు, ఏడవరు— అందరినీ చూచి నవ్వుతారు. వారు తటస్థులు.

ప్రధానమైన కావ్యవస్తువులు ఈ నాలుగే! ప్రేమా, పోట్లాటా, ఏడుపూ, నవ్వూ—ఈ నాలుగింటినీ రెండుజంటలనికూడా చెప్పవచ్చును. ప్రేమకు రెండవ ముఖము పోట్లాట! కరుణకు అవతలివైపు నవ్వు! పగలూ రాత్రీ లాంటివి! రెండు జంటలు. కావ్యవస్తువులు ముందు అనంతంగా కనపడ్డా వాటితత్త్వము పరిశీలిస్తే—తత్త్వము వేదాంతపుమాట కనుక ఇష్టము లేకపోతే — నవనవకవుల పరిభాషలో రాసాయనిక పరీక్ష చేస్తే (Chemical Analysis) తేలిన ప్రధాన పదార్థాలు (elements) రెండు జంటలు. కొద్ది రాసాయనికపదార్థాలు ఈ భూత ప్రపంచంగా పరిణమిస్తుండగా ఈ నాలుగుపదార్థాలూ కావ్యజగత్తుగా పరిణ మించడములో ఆశ్చర్యము లేదు.

ఈ రాసాయనికదృష్ట్యా కావ్యవస్తువులు ఇవే ఐనా స్థూలమైన సామాన్య దృష్టికి బహుగా భాసిస్తవి. రత్నాలు ఒక ఆభరణంలో పొదిగితేనేగాని రాణిం చవు. ఆ వస్తువులు కూర్చేందుకు ఆధారభూతంగా ఉండే కథ ఏదో ఉంటుంది. పాశ్చాత్యకళావిదులు దానిని Back ground అంటారు. ఈ ఆధారభూతమైన కథాదులనే సామాన్యముగా కావ్యవస్తువు లంటారు. బాహ్యదృష్టికి అవే కావ్య వస్తువులుగా కనపడతవి. కనుక ఆ విధమయిన వాడుక పండితులలో కూడా ఉన్నది.

ఈ స్థూలదృష్ట్యా కావ్యవస్తువు లనబడేవి అనేకములుగా ఉంటవి. ఒక్కొక్క దేశములో ఒక్కొక్క వస్తువుకు ఆదరముంటుంది. అట్లాగే కాలాన్ని బట్టి కూడా ఒక్కొక్కరకమయిన వస్తువుమీద జనానికి అభిమానము మారుతూ ఉంటుంది.

చూడండి ఒక ఉదాహరణము! ప్రస్తుతము లోకాన్ని సంక్షోభపెట్టు తున్న మహాసంగ్రామము. జర్మనీవారినీ, జపానువారినీ నాశనము చేయడమే మన కర్తవ్య మని ఎన్నెన్ని కావ్యాలు పుట్టినవి! ఈమధ్య ఉద్రిక్తుడ శ్రీ వట్టి కొండ రంగయ్య అట్టికావ్యమాలలు ప్రచురించినాడు.

ఒక ముస్లిములీగు కవి ఉన్నాడనుకోండి! "మనకు పాకిస్థాన్ రానిది న్యాయము జరగదు"అని దానికి దోహదము చేసే విధముగా హిందువు లెక్కువ ఉన్న రాష్ట్రాలలో మహమ్మదీయులు పడే బాధలు చిత్రిస్తూ కావ్యాలు వ్రాయ వచ్చును.

అదే విధంగా సామ్యవాదకవి ఉన్నాడు. Class war వల్ల లోక మెట్లా తల్లకిందు లవుతున్నదో చిత్రిస్తూ Communist State వస్తే—స్టేట్ అంటే వారికి ఇష్టము లేదేమో - ఏ విధంగా సమస్తజనులూ బలిచక్రవర్తి రాజ్యములోవలె ధన ధాన్యాదులతో సుఖపడతారో ప్రదర్శించవచ్చును.

ఈ రీతిగా దేశకాల వైపరీత్యాలవల్ల స్థూలమైన సామాన్యకావ్యవస్తువులు మారుతూ ఉంటవి. అయితే దేశకాలాలకు పైన వాటికి అతీతమైన మరొక వ్యక్తి ఉన్నది. అది కవిది ! ఆ కవి సర్వస్వతంత్రుడు. కావ్యజగత్తంతా దేశ కాలములతో పాటు వాడు నడిపించినట్లు నడుస్తుంది. వాడు ఆంధ్రదేశమువాడైతే బంగాలీకథలు వ్రాస్తానంటాడు. అమెరికా కవయిత్రి Pearl Buck చైనా కథలు వ్రాస్తున్నది. ఇంగ్లీషుకవి బ్రౌనింగు ఐరోపాఖండ మంతటికీ సంబంధించిన వస్తువులు తీసుకున్నాడు. మన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ నీగ్రో కథ ఒకటి ఎంతో మధురంగా వ్రాసినాడు ! ఎన్నాళ్ళనాడో అందులో చదివిన కాంగోనది పాటలు చెవులలో మోగుతుంటవి.

అదేవిధముగా కాలము. నేటికాలము. కవి తన అభిమానము కొద్దీ నేటి కాలానికి సంబంధించనవి వ్రాయవచ్చును. భవిష్యత్తులో రాబోయే "యుటోపియాలు" సృష్టించవచ్చును. పూర్వయుగాలలోకి పోయి అందులో తాత్కాలికముగా సంచరించవచ్చును. అందు కతనికి సర్వస్వాతంత్ర్యమున్నది. విశ్వసాహిత్య మంతా దీనికి ఉదాహరణలతో నిండి ఉన్నది.

ప్రతికాలమూ ఒక్కొక్క కొత్త కావ్యవస్తువును ప్రసాదిస్తూ ఉంటుంది. ఫ్రెంచి రివల్యూషను యూరపుకు "Freedom, Equality and Fraternity !" ప్రసాదించింది. 1919 లో రష్యా రివల్యూషను తర్వాత సోవియటు సిద్ధాంతాలు యువకలోకాన్ని ఆకర్షిస్తున్నవి. ఆ ఉత్సాహముతో కవులూ కథకులూ కావ్యాలు వ్రాస్తున్నారు.

అయితే ఏ కాలానికి అభిమాన మయ్యే వస్తువు ఏదో అది తీసుకోవడ ముతో కవిత్వము తన అవధి చేరుకోదు. సామాన్యలోకానికి అభిమాన మున్న వస్తువే తీసుకోవలె ననే విధి కవులకు లేదు. ఈ స్థూలకావ్యవస్తువులు దేశకాలా లనుబట్టి వ్యభిచరిస్తవి. అయితే స్థిరమైన కావ్యవస్తువులు శృంగారము, వీరము, కరుణ, హాస్యము—ఇవే! వీటిని కవి ఎట్లా నిర్వహించాడో అదే కావ్యరస రాసా యనిక పరీక్షకులు చూడవలసినది !

"పొడుస్తాము, చీలుస్తాము" అనగానే వీరరసము ఉట్టిపడదు. డాను క్విగ్జాటు వీరమువలె అది హాస్యాస్పదము కావచ్చును. ప్రేయసికీ, ప్రణయానికీ అన్ని భాషలలో ఉన్న పర్యాయపదాలు వాడినంతమాత్రముచేత శృంగారము కాదు. కొత్తగా పెనిమిటిపోయిన స్త్రీ ఏడుపుమాటలన్నీ వ్రాస్తే కరుణ పుట్టదు.

అసందర్భపు వ్రాతలు హాస్యము కాదు.

దేశకాలములతో మారుతూ ఉండే స్థూలమైన కావ్యవస్తువులే కవులు గ్రహించవలెననే భ్రాంతి ఈ కాలములో పెరిగిపోతున్నది. ముఖ్యముగా రాజకీయములందు విశేషాభిమాన మున్నవాళ్లు వాఙ్మయములోకి అక్రమప్రవేశము (Criminal Trespass) చేస్తున్నందువల్ల ఈ కాలములో ఈగతి పట్టుతున్నది.

"ఇది కళకు సంబంధించిన పవిత్రమైన దేవాలయము. ఇందులోకి నీ నీరసమైన పదాలు పెట్టి అపవిత్రము చేయబోకు''— ఈ తాత్పర్యము కల మాటలు ఎవరో మహానుభావు దన్నవి జ్ఞాపకము వస్తున్నవి.

కవి తాను గ్రహించిన కావ్యవస్తువును నిర్వహించడములో వైదగ్ధ్యము, ప్రతిభ చూపినాడో లేదో సాహిత్యప్రియు లైనవారు విమర్శించవలెె కావ్యవస్తు గ్రహణములో తమకున్న స్వాతంత్ర్యమును పడమటిగాలికి భయపడి వదులుకోకుండా ఉండడానికి కవులు అవుతున్నవారిని ఉద్బోధించనీయండి !



# ఎఱ్ఱన హరివంశములోని గ్రామజీవనము

ఎఱ్ఱన హరివంశములో కథాభాగములో మూలమునే అనుసరించినా, వర్ణనభాగాలలో చాలా స్వాతంత్ర్యము తీసుకొన్నాడు. వ్రేపల్లెలోని గోపాలకుల జీవితము వర్ణించడములో తాను తన కాలంలో చూచిన గ్రామజీవితము ప్రతిఫలింప జేసినాడు.

గుండ్లకమ్మ ప్రక్కన గుడ్లూరులోను చెరలువాడ మొదలయిన పరిసరాలలోను చూచిన జీవితాన్ని యమునాతీరములోని వ్రేపల్లెకు సమకూర్చినాడు. నదీతీరమూ, అడవి సామీప్యమూ రెంటికీ సమానధర్మాలు. ఎఱ్ఱన తాను చూసిన మనుష్యులనూ, వారి వేషభాషలనూ, ఆచార వ్యవహారాలనూ, కష్టసుఖాలనూ వర్ణించాడు. ఏ మారుమూల ఊళ్ళలోనో ఇప్పటికీ ఆ లక్షణాలు తెలుగు దేశంలో చూచాయగా కనిపిస్తవి.

ఎఱ్ఱన మనలను పాటబండిమీద నందయశోదలతోను, కృష్ణశిశువుతోను తెల్లవారుజామున వ్రేపల్లెమందకు మధురనుండి చేరుస్తాడు.

> పురిటిపాపని దొట్టెలో బొందుగాగ
> బెట్టి మోపించుకొని తాను బ్రియ సతియును
> మేటి గుజ్జుల గట్టిన పాటబండి
> ఎక్కి శీఘ్రంబ మందకు నేగె నెలమి.

ఈ పాటబండి ప్రస్తావన మళ్ళీ మళ్ళీ వస్తుంది.

అప్పుడు వ్రేపల్లె ఎట్లా ఉన్నది ? కాళిందీతటము, పుష్పఫలవంతమైన తరుషండములు, గట్టి ముళ్ళకంపలు తీర్చిన దొడ్లు, వేకువనే పోయి మేసి వచ్చి నెమరువేయుచున్న ఆవులు, ఎదురుగా దూడల హుంకారములు, ఒకదాని నొకటి దాటిపోవు బాలవత్సముల సంచారములు, రంకెలు వేయుచున్న పొగరు మిగిలి

కరకెక్కిన మెడలు వలంద మూపురములు వెడద పీపులు, తోరపు గంగడోళ్లు కల ఆబోతులు, ఆల నోటినురుగూ, పెయ్యల రేణమూ, పాలకుండల మసులూ తమకు అలంకారములు కాగా, ఉరుద్రాళ్లు తలలకూ, తలుగులు మొలలకు చుట్టుకొని దూడలను ఏర్పరించు గోపకులు, వల్లియలు వేసి కోడెలను పట్టి పెంచి వశపరచువారు, చూడుగొలుపులు వాదోళ్లు ముకుబంతులు మొదలగు సాధనములతో తెగులు గొంటులకు చికిత్స చేయువారు, దూడలను పొదుగులను ముట్టనీయకపోగా, పిళ్లు పెట్టి మందులు చల్లి చేపు కలిగించువారు, కావడిమోపు చేకాయలు కాచి వంగిన మూపులు, వెన్న లంటుటచే వాసన వేయు చుంచుతలలవారు, పశువుల కొమ్ముల తాకులకు అడవికంపల రాయిడికి దొంగల పోట్లవలన గాయములై కరకెక్కిన శరీరములు ఎఱ్ఱజీరల కన్నులు కలవారు గోపకులు.

మఱి గోపభామలో! చిలుమూరు ఇత్తడి కడియములు కంచుటుంగరములు కల చేతులతో కడవల మూతలు పట్టుకొని చిరుచెమటలతో నదినుండి నీరు తెచ్చువారు, కాంచన కంకణ ఝణఝణత్కారంబులతోను కంఠసూత్రపలనంబులతోను మృదుగీత మాధుర్యముతోడుగా దధిమథనము చేయు బాలికలు, నేయి పెరుగు విక్రయించువారు, ఇళ్ళలో నీళ్లు చల్లువారు, శిశువులను సమాశ్వాసించువారు, పిల్లలకు సేవకులకు అన్నములు పెట్టు పెద్దమ్మలు.

కుటీర కవాటములు కొత్తగడ్డితో కప్పి ఉన్నవి. వానిముందర శకటములు, శకటముల దగ్గర మంచెలు ఉన్నవి.

నేయి కాగుచున్న సుగంధము వ్యాపించి ఉన్నది. కాగుచున్న పాల చూత్కారములు వినవస్తున్నవి.

ఊరిపెద్దలు ఎదురు వచ్చి, నందుని అభినందించినారు. వృద్ధగోపికలు వారియింటికి వచ్చి పుత్రుని కని వచ్చిన యశోదకు నవసూతికా మంగళము చేసినారు.

శకటముక్రింద ప్రక్కమీద యశోదదగ్గర పడుకొన్న కృష్ణునికి పూతన విషపుపా లీయబోయి చచ్చినది. దాని కేకకు ఊరంతా లేచి వచ్చారు. నందుడు భార్యను అజాగ్రత్తకు మందలించాడు. యశోద జవాబు వినండి ;

"కడుపు నిండగ జన్నిచ్చి కొడుకు నిద్ర
వోవ, దీపియ మండంగ, ప్రొద్దుపోవు
నంతదాక మేల్కొనియుండి యలసి కన్ను
కింత మూసితి నాలస్య మేది యిందు ?"

నందుడు ఆనందముతో బాలు నెత్తుకొని ఆవుపేడ కలసిన భూధూళితో రక్షాతిలకము పెట్టినాడు.

తర్వాత గర్గుడు వచ్చి :

రామకృష్ణులకు జాతకర్మ నామకరణములు చేయగా నందగోపుడు బ్రాహ్మణులకు వస్త్రములు కట్టబెట్టి చుట్టాలందరికి బట్టలు పెట్టి, గోవులను పూజించి, గోవాట మలంకరించినాడు.

ముత్తైదువలు "యశోద గొడ్డు వీగి చక్కని కొడుకును కన్నది" అని పొగడినారు.

మళ్ళీ ఆ శకటము క్రింద నే మంచముమీద కృష్ణుని నిద్రపుచ్చి యశోద స్నానానికి ఏటికి పోయివచ్చినది. ఈలోపులోనే ఆ శకటాన్ని అవేశించిన శకటాసురుణ్ణి కృష్ణుడు తన్ని వికలము చేసినాడు. యశోద వచ్చి చూచి గాభరా పడి పిల్లవానికి పాలిస్తూ "నీతండ్రి వచ్చి కోపంతో నన్నెన్నెన్నిమాట లంటాడో గదా !" అని అనుకొంటూ ఉండగానే నందగోపుడు రానే వచ్చినాడు. ఎట్లు ?

కొంచెము నెరిసిన జుట్టుతో, చెట్లకేసరముల ధూళితో, ఆవుల డెక్కల దుమ్ముతో కలిసిన చెమట గల ముఖముతో, కట్టిన చెంగావికాసెతో, చేతిలో గట్టికణుపులున్న కఱ్ఱతో వచ్చాడు. భగ్నమైన శకటమును చూచి గాభరాపడి తల్లివద్ద బాలుణ్ణి చూచి గుండె నిమురుకొంటూ భార్య నడిగినాడు.

"శకటము ఇట్లా ఐనదేమి ? ఆబోతులు చెలరేగినవా ? పెద్దగాలిపాటు వచ్చినదా ? నిజము చెప్పు !"

యశోద గద్గదకంఠముతో "తప్పు నాదే. పిల్లవాడు నిద్రపోతూ ఉంటే ఏరు దగ్గరేగదా అని స్నానానికి వెళ్ళి వచ్చేలోపల ఈ పని జరిగింది" అని క్షమాపణ కోరుకొన్నది.

నందయశోదలు కొడుకును ముద్దాడి భూరజంబు పుచ్చిపిడచి తూఁ పొడిచిరి. అంటే థూ థూ అన్నారు నందుడు మళ్ళీ శకటమును సంఘటితము చేయించినాడు.

కృష్ణుడు పెరుగుతూ సర్వసామాన్యమైన ముద్దులు చేస్తున్నాడు. మువ్వలు గంటలు మ్రోగుచుండగా ముందటి కూకటి రావిరేకతో ఆడుతున్నాడు. తల్లి కొడుకుకు కడుపునకు పెట్టి మూతిబిడ్డు ముఖానికి ఒంటికి చమిరి చెక్కిళ్ళు నిమిరి, "జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం - ఏనుగులు తిన్న వెలక్కాయలు జీర్ణం" మొదలైన తెలుగు శాబరమంత్రము చెబుతున్నది.

బాలకృష్ణుడు పెరుగుతూ అల్లరిచేస్తున్నాడు. తోడిబాలకులను ఒక్కొక్క అటలోను ఓడించి ఒకరితర్వాత ఒకరిపైన ఎక్కి సవారి చేస్తున్నాడు. అందరి జుట్టు కలిపి ముడివేసి కో యని గోల చేస్తున్నాడు.

వెన్నలు పాలు పెరుగు నేయి ఇళ్లమీద బడి దొంగిలించి తోడిబాలురకు చూరవిడుస్తున్నాడు.

గోపికలు యశోదతో కృష్ణుని అల్లరినిగూర్చి ఫిర్యాదుచేసే సందర్భంలో అప్పుడు వాడే వరిముట్లూ, దాచుకొనే చోట్లూ, చేసుకొనే పిండివంటలూ తెలియవస్తున్నవి.

ఒకతె ఓవరిలో గొందిదక్కున పెద్ద భాండములలో నేయి దాచగా తలుపు తాళము పడగొట్టినాడు. (బొట్టులేకుండా త్రాగివేశాడు.) ఇంకొకతె తన మగడు మనసు పడగా పాలు పిండి ఫలకండము వెన్న కలిపి అట్లుగా వండి నాలుగైదు దొంతులు పెట్టుకొన్నది. (అన్నీ తినివేశాడు.)

ఆ మాట చెబితే నమ్మక మగడు తన్ను విడిచిపెడతాడో చంపుతాడో అని గోల పెట్టినది.

ఇంకొకతె యవపిండి పంచదార కలిపి మూల దాచిపెట్టింది. (కృష్ణుడు అంతా తిన్నాడు.)

వాళ్ళు వచ్చి చెప్పే తీరుకూడా ఎఱ్ఱన తనకాలంలో గ్రామీణస్త్రీల పోట్లాటలు చూచి విని వర్ణించినట్లు కనబడుతుంది. ఒకతె అందరికంటె ముందు వచ్చి చెప్పినది. ఇంకొకతె అందరినీ త్రోసుకొంటూ వచ్చింది. ఇంకొక గోపిక

నర్తించు విధంబున చేతులు చాచుచు చెప్పినది. వాళ్ళ మాటలూ తిట్లూ కూడా సొగసుగా వర్ణించాడు ఎఱ్ఱన. "నీవేనమ్మా, మహాముద్దులకొడుకును కన్నావు - కుటిలవు, పిల్లవాణ్ణి ఊరిమీద విడిచిపెట్టినావు - నీ కొడుకేమైనా రాక్షసుడేమో! - వాడి కడుపులో దయ్యా లున్నావేమో ! - ఈ పల్లెకు చిచ్చుపెట్టి మా పశువులతో ఎక్కడకన్నా పోయి ఎట్లాగో పొట్ట పోసుకుంటాము ! -నీవూ నీ ముద్దుల కొడుకూ సుఖంగా ఉండండమ్మా !"

ఆ మరునాడు యశోద కొడుకును శకటము దగ్గరఉన్న బలువైన రోటికి కట్టివేసింది. అతడా కట్టివేసిన రోటిని లాక్కుంటూ పోయి ఆ మందగవని సమీపంలో ఉన్న జమిలి మద్దుల రాక్షసులను కూల్చినాడు. ఆ రోజులలో పల్లెలకుకూడా చుట్టూ క్రూరమృగాలనుండీ దొంగలపల్లనుండీ రక్షణకై కట్టెలతోనో, కంపలతోనో ఆవరణలూ, వాటికి గవనులూ ఉండేవని ఊహించవలె !

కృష్ణునికి ఏడేళ్లు వచ్చినవి. తోడిబాలురతో రామకృష్ణులు దూడలను కాయుటకు చేరువపొలాలకు వెళ్లుతున్నారు. చిన్న కూకట్లతో చేతులలో చల్దిచిక్కములు సెలగోలలు పూని, కాళ్లకు కిరుచెప్పులు తొడిగి, కర్రిగోచులు పెట్టుకొని పోతున్నారు. తోడేళ్ళను తోలుతున్నారు. వేడుకగా పాడుతూ కేకలు వేస్తున్నారు. చెట్లు ప్రాకుతున్నారు. తేనెతెట్టెలు రేపి తేనెలు త్రాగుతున్నారు.

గోపకులకు ఆ ప్రదేశము నివాసయోగ్యముగా లేదు. మందలు గొఱజెక్కినవి. మేపుడుచోటు త్రొక్కుడువడ్డది. మడువులు బురదలైనవి. దూరము పోతేగాని పూరి కంప గడ్డి దొరుకుటలేదు. ఐనా ఉన్నచోటు వదలలేక మక్కువపట్ల కొన్నాళ్లు కదలలేదు. అంతలో సింహాలు, తోడేళ్లు, వరాహాలు చెలరేగినవి. ఒకనాడు నీళ్ళలో దిగిన తరిపిపెయ్యను, ఇంకొకరోజు పాలకావళ్లు తెచ్చే మందవాండ్రను, ఇంకొకరోజు పోకు మేసే పాడియావును, ఇంకోనాడు ఆబోతును గొర్రెలను మెకాలు మేసినవి. గోపకులు ఆలోచించి "ఈ ప్రొద్దే కదలవలె, ఇక ఇక్కడ ఒక్కదినము, ఒక్కముహూర్తము. ఒక్క గడియ నిలువరా" దని గోవర్ధనపర్వతమున్న బృందావనభూమికి ప్రయాణమైనారు. ఊరంతా వలస పోతున్నది.

ఎవరి తన కాలంలో కష్టాలు పడలేక ఊళ్ళకు ఊళ్లు వదిలిపోయినవారిని ఎందరినో చూచి ఉంటాడు. ప్రయాణపు హడావుడి సాగినది.

బండ్లమెట్టింపులపైన బరువు లెక్కించుట, కావళ్ళలో నేతిపనటు లుంచుట క్రొత్త గోనెలలో బియ్యములు, వివరీపడ్లు, పట్టీలు, చాపలు, మంచములు, దామెనలు, వల్లెత్రాళ్లు, తలుగులు, కొడవళ్లు, కత్తులు, సూదుఁగొడుపులు, వాదోళ్ళు మొదలయిన పనిముట్లు భద్రపరచుట జరిగినది. ముదుసళ్ళను, ఆడవారిని, కంపమోషులను ముందు కదిలించిరి. బలము గలవారు పశువులతో ముందు సాగినారు. ఆ వెనుక బండ్లూ, బండ్లజాడలో ప్రజలూ నడుస్తున్నారు. తరుణ తరుణీ జనములు మేలము లాడుకొనుచున్నారు.

కుంటివారిని, గ్రుడ్డివారిని తగినవారు కావలిగా ఉండి నడిపిస్తున్నారు.

బృందావనము చేరి ఉచితమైన ప్రదేశాలు నిర్దేశించుకొన్నారు. అమడ పరపున అర్ధచంద్రాకృతిగా శకటములను విడిచి వాటిమధ్య అందరూ విడిసినారు.

"గుడిసెలు నన్నియున్ ఘనని
　　కుంజము విండులు గాగ జొచ్చియున్
బెడ గగు జొంపము ల్గలిగి
　　పేర్చిన మ్రాకులక్రింద మంజియల్
గడక యెలర్ప దొడ్లకును
　　గ్రంపలు వైచియు నొక్కనాటికే
వడరగ బ్రాతకాపు లయి
　　రక్కడ గోపకుటుంబు లందరున్."

ఇక్కడికి వచ్చినా వారి ఊరిపేరు వ్రేపల్లెగానే ఉన్నది. పుష్కలంగా నీరూ పదార్థాలూ లభ్యమైనవి. ఆవులు ఏటేటా ఏపుగా ఈనుచున్నవి. క్రేపులు వర్ధిల్లినవి. వృషభవ్యాపారము చక్కగా సాగుతున్నది. కృష్ణునికి పదమూడేళ్లు నిండినవి.

వసంతము పోయి ఎండాకాల మారంభించినది.

గోపికలు పాటలపుష్పాలతో సీమంతము లలంకరించు కొంటున్నారు. గాలిలో మల్లికాగంధము నిండినది. మడుగులలో నీళ్లు ఇంకుతున్నవి. వడగాలి పొగినది. కార్చిచ్చులు వ్యాపించినవి. ఎండమావులు ఎదురైనవి.

ఎండలు ముదిరినకొలదీ పశుకోటికి ఉపసర్గములు పుట్టినవి.

"వడకుచు రోమకోటి నిలువం
బడి మేనులు దూల గన్నులం
దుడుగక బాష్పముల్ వడియు
చుండ తలల్ డిగపైచి నోర డే
గుడు చొలుగంగ నెంతయును
గ్రుప్పి ఖురంబులు ద్రిప్పి పుచ్ఛములం
గడుపున గార దద్దయును
గారియ బొందె వ్రజంబునం బసుల్."

"సరిడెతిప్పు కప్పుచావురు గడుపులు
హడరు డిక్క యనగ నడరె మరియు
తెవుళు లెవ్వియేని దపెలె .... .... "

వయోవృద్ధుల మంత్రౌషధములు నిష్ఫలమైనవి. యమునాతీర కానన ములలో ప్రాణులన్నీ మృగ పక్షి సర్పాదులు సూక్ష్మజంతువులతో సహా మృత కల్పము లయినవి. వ్యాధులు గోపగులకుకూడ వ్యాపించినవి. కొందరు జ్వర పడిరి. కొందరికి రోమకూపములనుండి నెత్తురు కారి చీములు కట్టినవి. దంత ములు జీర్ణమైనవి. ఎముకలు చిదికినవి. కంఠము, నాలుక, పెదవులు, చెవు లలో పొక్కులు లేవగా ఒక్కడైనను "త్రావ దడవలేక తలచీర ఎరుగక యార్తులైరి." గోపమందిరములు కుష్ఠుదుర్గంధమయము లయినవి.

యశోదానందులు రోహిణికూడా రోగార్తు లయిరి.

బలరామ కృష్ణులు కొందరు గోపకులతోను, కొన్ని గోవులతోను క్రోశము దూరము పోగా వారందరు రోగనిర్ముక్తులయిరి. అందరి వృద్ధులవలెనే నంద గోపుడు మాత్రము,

"ఏను జుట్టంపు జనులును ఎందు వోచు
మిచ్చటనె యుండగా నేమి వచ్చెనేని
అనుభవింతము గా కని చనక నిలిచె" —

విదేహదేశమునుండి వచ్చిన వృద్ధగోపుని సలహా అందరికి నచ్చినది. "మనము పశువులను ఆశ్రయించి బ్రతుకుతున్నాము. పశుపతిని ఆరాధిస్తే — ఈ ఉపద్రవము శాంతిస్తుంది."

శివభక్తి మంత్ర తంత్ర జ్ఞానము గల బ్రాహ్మణులను పిలిపించి శివ పూజ చేయించినారు. ఉపవాసాలు, కుండాలు, మండలాలు, అధివాసాలు, అభిషేకాలు, ఆవునేతి దీపాలు, నైవేద్యాలు, జపాలు సాగినవి. "కొందరు భ్రూవిక్షేపంబుల నక్షివివర్తంబుల చరణ తాళంబుల హస్తవిన్యాసంబుల నతి మనోహరం బగు భక్త్యావేశవర్తనంబు ప్రవర్తించి ప్రదక్షిణ ప్రణామా దులు చేసిరి."

వారిపూజ ఫలించినది. ఒక మహాద్విజుడు భూతావేశముతో మహాపావము చేసి దేవోద్భృతితో పాడుచు కఠోరముగా వర్తించి ఉపద్రవశాంతికి ఉపాయము చెప్పినాడు. కాలకవి అనే రాక్షసుడు వెలగచెట్టుగా పుట్టినాడు. వాని భార్యలూ, పిల్లలూ, పరివారమూ విషవృక్షాలుగా, గోవులుగా, అడవి వృషభములుగా పుట్టి నారు. ఆ విషవాసనలవల్ల ఈ ఉపద్రవము వచ్చినది.

బ్రాహ్మణులకు శంకరునకు నమస్కరించి శివాలయమునకు ప్రదక్షిణించి సింహనాదములు చేస్తూ కత్తులు గుదియలు గొడ్డండ్లు మొదలయిన సాధనాలతో బయలుదేరినారు. దుస్సహమైన పెనుకంపుతో కటువైన ఎదురుగాలి వీచినది. పోయి చూడగా ఆ వెలగచెట్టుకాయలు పెద్దకుండ లంతటివి. దానిని, చుట్టూ ఉన్న విషవృక్షాలను నరికివేసి తగలబెట్టినారు. అడవి వృషభములను చంపి వేసినారు. వ్రేపల్లె రోగార్తి విముక్త యైనది. గోపకులు యమునలో జలక్రీడ లాడినారు.

విదేహదేశములో యశోదతమ్ముడైన కుంభకుని ఇంటిలో ఏడుగురు రాక్షసులు వృషభములుగా పుట్టి ఊళ్లు గగ్గోలు చేస్తున్నారు. బలముగల గోపకులు —

"తల్లియలు వైచి విసివి యోదములు త్రవ్వి
త్రవ్వి వేసరి యురు లొగ్గి తగిలి నవియ
దోలి యోటరి పోనీక దొడ్డి నాగి
పొడువ నొడువను నలసత పొంది యోడి."

ఏమీ చేయలేక పోయినారు.

కృష్ణుడు పోయి వాటిని చంపి నీలను పెండ్లాడినాడు.

కాళియమర్దన ఘట్టములో గ్రామాలకు మధ్యమధ్య కలిగే సర్పబాధ వర్ణిత మయినది. గర్దభవేషధారియైన ధేనుకుని సంహారములో, అడవిలో నుండి అడవి గాడిదలు వచ్చి గ్రామాలమీద పడి చేసే అలజడి తెలుస్తుంది. అక్కడనే గ్రామీణులకు తాడిచెట్లు, తాటిపండ్లూ ఎంత ఇష్టమో కనబడుతుంది.

"క్రమపాకంబున కెంపుతోడి నలుపె
క్కన్ మిక్కుటంబైన గం
ధము దిక్కుల్ సురభీకరింప రస మం
తర్గామి యయ్యున్ వెలిం
గమియంగారుచు" నున్నట్లున్నవి.

ప్రలంబసంహారము సందర్భములో హరిణక్రీడనము అనే ఆట వర్ణింపబడ్డది. గోపాలకులు రెండు జట్లు అనారు. ఇటువారు, అటువారు జింకల వలె ఎగురుచు భాండీరవటము గురిగా పోవలె. గెలిచినవారిని ఓడినవారు తమమెడల పైన ఎక్కించుకొని గురిదాకా మోయవలె !

శరత్కాలము వచ్చినది.

"పిదుకకొలది కాక పెయ్యలు దనిపె వ్రే
పల్లె పసులు చేపి పాలు గురియ
నడరి పాలవెల్లి" యైనది.

ఆచారప్రకారము నందాదులు ఇంద్రోత్సవము చేయదలపెట్టి పల్లెలో చాటింపు చేయించినారు. విని కృష్ణుడు అడ్డుపడ్డాడు. ఎవరి వృత్తినిబట్టి వారికి దేవత. మనకు కానలు, కొండలు, పశువులు దేవతలు. కాని ఇంద్రుడు కాడు.

గోవర్ధనపూజ చేతాము అని ఒప్పించినాడు. జాతర సాగినది. గోపికా గోపకులు పూలమాలలు ధరించారు. పాయసము, అపూపాలు, మోదకాలు, అన్నాలు, మాంసాలు, మధువులు, ఆజ్యాలు, పాలు పెరుగుల కావళ్లతో, బండ్లతో, వాద్యాలతో బయలుదేరినారు. గోవర్ధనపూజ చేసి పశువులకొమ్ములకు రంగులువేసి మెడలలో చిరుగజ్జెలపేరులు కట్టి, తలలకు వనలతలు చుట్టి, ఇప్పుడు కోటప్పకొండవద్ద వలెనే కేకలు వేయుచు – గిరిప్రదక్షిణము చేయించి నారు.

ఇంద్రునికి కోపము వచ్చినది. అకాలవర్షం కురిసినది. (ఇక్కడ) అకాల వర్షచిహ్నాలూ (వర్షబాధా) వర్ణించినాడు ఎఱ్ఱన.

ఈశాన్యదిక్కున వేకువనే కోలమెరుపులు మెరసినవి. గాలి తీవ్రమైనది. నీరెండతో ఉబ్బ ఎక్కువయినది. ఇంద్రధనుస్సులు నిడుదగా నీడకాళ్ల కనబడి నవి. ఆకాశములో అగడపలు తోచినవి. పిన్నబిడ్డలు పింపిళ్ళు గూసిరి. జనుల పాదములు సిమసిమ లాడినవి. గడ్డిచెట్లు చీడ పట్టినవి. కొండలమీద వెలి మొగులు కప్పినది.

[అవి] చూచి వృద్ధులు భయపడ్డట్టుగానే ఏడురోజులు ఏకధారగా వర్షము కురిసినది. గోవులు వర్షధారలకు తడిసి, నలుదెసలం బరచి వేయు వాయువునం గొరవోయి యొండొంటి చాటున కొదింగి కన్నులు మోడ్చి కడ రెప్పలు నీళ్లు గారన్ తలలు డగ్గఱెచి, నెమరు లుడిగి, నిలువుజాలుండి, ఉండి కాళ్ల వడక, సైరణ తప్పి, రొంపి వొరల ద్రెళ్ళుచున్నవి. పశుపాలుడు గుడి సెలు కూలిబండ్లు తూలి, శిథిలపడి, పాకాదిక్రియ లుడిగి దోహనంబులు విడిచి కొందలంబు నొందిరి.

కేశి సంహారములో అడవిగుబ్బముల బాధ వర్ణింపబడినది.

కంసరాజు తనకు ఏటా గోపకులు చెల్లించవలసిన పన్నుతో రామకృష్ణు లను రమ్మని, తెచ్చుటకు —

అక్రూరుని పంపినాడు. అతడు వచ్చినపుడు వెన్నెలలో మెరసే గోవు లతో వ్రేపల్లె పాలసముద్రమును పుదడించుచున్నదట !

రామకృష్ణులు మధురానగరము చేరి పట్టణము చూడని గ్రామీణుల వలెనే వాడవాడల చూడబోయినారు. ఆయుధశాలలో ప్రవేశించి, రక్షకులను అడిగి "కంసరాజు ధనుస్సు ఏది?" అని చూచి, కృష్ణుడు ఎక్కుపెట్టి లాగి విరిచాడు. ఆ పెద్ద ధ్వనికి పరివారము దిమ్మెరపోయి చూస్తూ పట్టుకొనే లోపలనే తాను గానివాడునుంబోలె సందడిలోన సురిగిపోయినాడు.

"కట్టుకంబంబు విరుచు నుగ్రంపు గజము
లట్ట లవ్వియు విరిచి యయ్యెక్కజుండు
పవనచందంబు గతి పట్టువడక తూలి
పోయె తోడియాతడు రామభూపసింహ !"

అని రక్షకులు రాజుతో మొరపెట్టుకున్నారు.



# కవితా లక్ష్యము

## ౧

ఉద్వేగము నేడు జగత్తుకు ప్రధానలక్ష్యముగా కనిపిస్తున్నది. అదే కవిత్వానికి కూడా లక్ష్యమనే భ్రాంతి లోకములో ఇప్పుడు ప్రబలినది. కాబట్టి ఈ విచారణ ఆవశ్యకమైనది.

గ్రహము పూనిన వానికి చుట్టూ నలుగురూ చేరినకొద్దీ ఆవేశము పెరిగిపోతుంది. అట్టివాడు అరిచి అరిచి చివరకు నిస్సత్తువతో పడిపోతాడు.

శాంతి లేనివారు ఎందరో మద్యపానము అభ్యాసము చేసుకుంటారు. వారికి తాగినకొద్దీ మరింత తాగవలెననే తృష్ణ పెరిగిపోతుంది. తాగితాగి అసభ్య సంభాషణలు చేసిచేసి తుదకు నీరసస్థితిలో వారు నేలకు వాలిపోతారు.

మరికొందరు ఐశ్వర్యమదముతో విర్రవీగి అంధులై లోకులను కొల్లగొట్టి కొంతకాలానికి తామే దరిద్రు లవుతారు.

తామస శక్తులను ఏదోవిధముగా తమ వశము చేసుకొని దేవాదులనుకూడ జయించి, ముల్లోకములనూ చీకాకుపరచి బాధపెట్టి, చివర కా తామసశక్తికే వశులై పరస్పరము కలహించుకొని మృతులయిన సుందోపసుందులను పురాణములలోనే కాక ప్రత్యక్షముగా కూడా ఈ లోకములో చూస్తూ ఉన్నాము.

ఉద్వేగము, ఉత్తేజము, ఉద్బోధము, ఆవేగము, ఆవేశము — ఇత్యాది పదాలతో నేటి విమర్శకులు వ్యవహరిస్తున్న భావము కలిగించడమే నిజముగా కవితాలక్ష్యమా అనే ఆకాంక్ష కలుగుతున్నది.

సంగీతమువలెనే కవిత్వము కూడా సర్వతోముఖమైన శక్తి కల మహాసాధనము. నిద్రపుచ్చడానికి లాలిపాటలూ, నిద్రలేపడానికి మేలుకొలుపులూ పాడడము మన మందరమూ ఎరుగుదుము. తాగినవారు లల్లాయిపదాలు పాడుతారు. వీరభటులు వీరగీతాల లయకు అనుకూలంగా అడుగులువేస్తూ ముందుకు

సాగిపోతారు కాముకులను మోహింపజేయడానికి నటులు కామోద్దీపనమైన పదాలతో నటిస్తారు. పనిపాటులు చేసుకునేవారు వారి వారి వృత్తులకు సంబంధించిన పాటలు పాడుతూ పనులు చేసుకుంటారు. వాటి అన్నిటిలో సంగీతము, కవిత్వము మిళితమై ఉన్నవి. ఇన్ని విధాలుగా సంగీతమూ, కవిత్వమూ, ఉపయోగపడుతున్నా వాటి రెండిటి లక్ష్యమూ పైన ఉదాహరించిన వాటిలో ఒకటిగాని, కొన్నిగాని, అన్నీ గాని అని చెప్పవచ్చునా ?

మానవుల ప్రవృత్తి అనేక విధాలుగా ఉన్నది. కొందరికి జీవితావధి ధనసంపాదనము. మరికొందరి లక్ష్యము సుఖభోజనము. ఇంకా కొందరికి అభంగమైన నిద్ర. ఎప్పుడు చూచినా పోట్లాడేవాళ్లున్నారు. ఒక్క క్షణమైనా ఒక స్థలములో కాలు నిలవక అనుక్షణమూ తిరుగాడేవారున్నారు. ఆ యా మానవుల జీవితలక్ష్యములు అవి అవి అని చెప్పితే చెప్పవచ్చునుగాని మానవజీవితానికి లక్ష్యము ఆహార నిద్ర మైథునాదులనడము సమంజసము కాదు గదా !

అదే విధముగా కవిత్వముకూడా. వినియోగపడే కార్యాలనుబట్టి కవితాలక్ష్యము నిర్ణయించరాదు. ఉత్తమ మానవుల ప్రవృత్తినిబట్టి మానవ జీవిత లక్ష్యము నిర్ణయించినట్లే, ఉత్తమ కవిత్వమునుబట్టే కవితాలక్ష్యము—కవిత్వాదర్శము—నిర్ణయించుకోవలె ననడము న్యాయమే. అయితే అది తరచుగా మరచిపోతున్న సాహిత్యవిమర్శకులు ప్రబలుతున్నందువలన ఆ విషయమిక్కడ ప్రత్యేకముగా ప్రస్తావించవలసి వచ్చినది. కవిత్వమంటే ఈ సమాలోచనలో సాహిత్యశాఖ లన్నింటికీ ఉపలక్షణముగా గ్రహిస్తున్నాము.

పాశ్చాత్య దేశాలతో మన దేశానికి సంపర్కము కలిగినప్పటినుంచీ, కవిత్వము ఆవేశము కలిగించవలె- ఆవేశము కలిగించవలెననే భావము ఉదయించి నానాటికీ వృద్ధి అవుతున్నది. మన ప్రవృత్తికి అనుకూలంగానే మన ఆదర్శాలు కల్పించుకుంటాము. అయితే ఇది మనకు ఉపాదేయమా, కాదా? ఉపాదేయమైతే ఎంతవరకు ? మన సాహిత్యవేత్తలకు ఇది విరుద్ధమా ? ఐతే ఎవరిమతము మనము అంగీకరించదగినది?

౨

ఈ విషయాలు మనము విచారించేముందు పాశ్చాత్యుల సాహిత్యాదర్శాలకు మూలసూత్రభూతమైన దేదో దానిని కొంత తెలుసుకుందాము.

పాశ్చాత్యుల సాహిత్యశాస్త్రానికి మూలపురుషుడు 'అరిస్టాటిలు.' ఇతడు గ్రీసుదేశీయుడు ; అలెగ్జాండరుకు ఉపాధ్యాయుడు ఆయన గ్రీకుభాషలో వ్రాసిన సాహిత్యశాస్త్ర గ్రంథానికి "పొయటిక్సు" అనే పేరుతో ఇంగ్లీషులో తర్జుమాలు లభిస్తవి. ఆ తర్జుమాలవల్ల మనకు కావ్యలక్షణమునుగూర్చి తెలిసే ముఖ్య విషయము లివి.

సాహిత్యశాఖలో ఉత్తమమైనవి "ఎపిక్" అనేది, "ట్రాజెడీ" అనేది. ఆ రెంటిలోకూడా ట్రాజెడీ శ్రేష్ఠతర మైనది. అట్లా అనడానికి ఆయన చక్కని కారణాలు కూడా చెప్పినాడు. "ట్రాజెడీ" అంటే విషాదాంతనాటక మనే భావము లోకములో వ్యాపించి ఉన్నది. కాని ఆ అర్థములో అరిస్టాటిలు ప్రయోగించ లేదు, కనుక "ట్రాజెడీ" అనే పదమే ఉపయోగిస్తున్నాము.

ఉత్తమోత్తమ మైన ఈ ట్రాజెడీ అనేదాని ప్రయోజనమేమి ? ట్రాజెడీ చదివినందువలన కాని, ప్రదర్శనము చూచినందువల్లగాని ఆ పాఠక ప్రేక్షకుల అంతరంగములలోని భయాదిభావాలు (రసాలు ?) ప్రకోపించి బయటికి వెళ్ళగొట్టబడతవి — ఇదీ అరిస్టాటిలు చెప్పినదాని సారాంశము.

అరిస్టాటిలు మాటలు మన సొంతమాటలలో వివరించుకుంటే, దేహానికి వాంతీ, భేదీ కలిగించే మందులవలె ఈ ట్రాజెడీలు అంతరంగానికి పనిచేసి ఉపకరిస్తవని ఆయన ఉద్దేశమని తేలుతుంది.

పాశ్చాత్య సాహిత్యశాస్త్రానికి ఋషితుల్యు డయిన అరిస్టాటిలు మత మిది ! ఈ మతమే పాశ్చాత్య సాహిత్యపరు లందరూ అంగీకరించినా రనడము న్యాయము కాదు. కాని, ఇప్పటికి కొద్దికాలము కిందివరకూ ఆ అరిస్టాటిలు గ్రంథమే వారి సిద్ధాంతాలకన్నిటికీ ప్రాతిపదికగా ఉన్నదనడానికి ఏ మాత్రమూ సందేహము లేదు.

3

సరేకాని, అంతరంగానికి ఈ వాంతిభేదులవల్ల కలిగే ప్రయోజనమేమిటి? దేహానికి వాటివల్ల స్వాస్థ్యము కలిగినట్లే ఈ ఉత్తమోత్తమమైన సాహిత్యమువల్ల కూడా అంతరంగానికి ఒక సామరస్యము వంటిది కలుగుతుంది. దానివల్ల భయాదులకు ఉపశాంతి కలుగుతుంది. అయితే అది ఎటువంటిది ?

ఎక్కువ పరుగెత్తినవానికి బడలికవల్ల కాళ్ళాడక ఆగిపోతవి. తీవ్రముగా జ్వరము వచ్చి మితిమించిపోతే శక్తి ఉడిగిన తర్వాత దేహానికి శైత్యము వస్తుంది. దుఃఖ మతిశయించి ఏడ్వగా ఏడ్వగా చివరకు మూర్ఛ వస్తుంది. మితిమీరి తాగినవానికి నిద్ర వస్తుంది.

అరిస్టాటిలు మతము ప్రకారము ఉత్తమ సాహిత్యలక్ష్యము మృత్యుముఖముగా పాఠకులను నడిపించే తామసశక్తులను ప్రకోపింపజేయడమే నని ఆలోచించిన వారికి ద్యోతక మవుతుంది. స్థూలదృష్టితో చూచినప్పుడు ఆయన చెప్పిన లక్ష్యముకూడా శాంతివలెనే గోచరిస్తుంది కాని సూక్ష్మదృష్టి ప్రసరింపజేస్తే అది శాంతి కాదు - శ్రాంతి అని విశద మవుతుంది. అది నిద్ర - అది తంద్ర - అది క్షుధ - అది తృష్ణ - అది జర - అది రుజ - అది సాక్షాత్తుగా మృత్యువే !



ఇప్పటి మన నవనాగరకులు తరచుగా తాము చదివిన పుస్తకాల ప్రభావము అనేక విధాలుగా చెప్పుకోవడము వింటూ ఉంటాము.

"ఈ పుస్తకము నన్ను బహు కదిలించివేసింది" అంటారు ఒకరు.

"ఈ పుస్తకము చదివితే నాకు ఆవేశము పట్టలేకుండా పెరిగిపోయింది" అంటారు ఇంకొకరు.

''ఇందులో పాత్రలు నన్ను రాత్రింబగళ్ళూ మనస్సులో పూనినట్లు విడవకుండా ఉంటున్నారు'' అంటారు మరొకరు.

''ఇది మొదలు పెట్టినదగ్గరనుంచీ పూర్తి చేసేదాకా నా కింకేపని సాగలేదు'' అంటారు ఒక్కొక్కరు.

''అంత దూరపు ప్రయాణములోనూ ఈ గ్రంథముతో నాకు కాలక్షేపమయింది" అనేవారూ ఉన్నారు.

— ఈ మొదలైన విధంగా ఆ యా పుస్తకాల మహత్వాలు స్తుతి చేస్తారు.

కాని ఎందువల్లనో గాని "ఇది రమ్యంగా ఉన్నది."

"ఇది మనోహరంగా ఉన్నది." "ఇది ఆనందం కలిగించింది."

"ఇందులో పదాలు అమృతస్రావము వలె చక్కిలిగింత కలిగిస్తున్నవి" —ఇత్యాదికమైన మాటలు కరువై పోయినవి.

దీనినిబట్టి చూస్తే, మన నాగరకుల సాహిత్యప్రపంచములో పాశ్చాత్యుల తామస వాతావరణము ఎంతవరకు ఆవరించిందో మనకు కొంత బోధపడుతుంది; మన సాహిత్య వృక్షానికి ఎంత విష మెక్కినదో కొంత తెలుస్తుంది.

ఈ పాఠకుల రుచిభేదాన్ని బట్టి కావ్యనిర్మాతల ప్రయత్నముకూడా మారి పోతున్నది. రోగులు అపథ్యమైన వస్తువులమీదికి కోరిక ప్రసరించడము సహజమే! సాహిత్యభిషక్కులు కూడా వారి కోరికప్రకారము పథ్యమే నిర్ణయించవచ్చునా? అటువంటి వైద్యులు రోగులకు తాత్కాలికముగా ప్రియులు కావచ్చును, కాని - ? వారు వైద్యులేనా అసలు!

౨౪

మరలు నడిపేందుకు ఇంజనులు కావలెనంటే తెల్లవారిదేశాలకు వ్రాసి తెప్పించుకుంటున్నాము. మనకు లేనివస్తువులు తప్పక ఇతరులవద్దనుండి తెచ్చుకోవలసినదే. మనవద్ద మంచి వస్తువు లేకపోయినా, అదికూడా తెప్పించుకోవడము న్యాయమే.

సాహిత్యశాస్త్ర మయితే మనదేశములో చేయలేని మర కాదు. అది అనాది ఐన శ్రుతివల్ల సిద్ధమైన దనేమాట కూడా అటుంచినా, అధమపక్షము భరతముని కాలమునాటికీ, అగ్నిపురాణము కాలమునాటికీ మన దేశములో సాహిత్యశాస్త్రము విశేష పరిణతి పొంది ఉన్నదని మనకు తెలియవస్తున్నది.

రసము బ్రహ్మస్వరూపముగా వేదములో వినబడుతున్నది. మన అలంకారికులు రసాత్మకమైన వాక్యమే కావ్యమన్నారు. రీతి అన్నవారున్నారు. ఔచిత్యానికి ప్రాధాన్య మిచ్చినవారున్నారు. అలంకారాది ప్రాముఖ్యముగా చిత్రించిన వారు కూడా ఉన్నారు. ఎన్ని మతాలు ఉన్నా, ఏ విధముగా కావ్యలక్షణ పరిష్కారము కోసము అడ్డుపడినా, అలంకారికు లందరూ సామాన్యముగా కావ్య

ములో రసప్రాధాన్యము అంగీకరించినవారే. అందువలన మొత్తముమీద మన ఆలంకారికులలో కావ్యలక్ష్యము రసనిష్పత్తి అనే భావమే ప్రబల మయినదని చెప్పవచ్చును.

అయితే ఈ రసమనేది ఏమిటి? రసస్వరూపమును ఒక రీ క్రిందివిధముగా నిర్వచించారు.

> "సత్త్వోద్రేకము వల్ల అఖండ స్వప్రకాశానంద చిన్మయ మైనది. వేద్యాంతర స్పర్శ శూన్యము. బ్రహ్మాస్వాద సహోదరము, లోకోత్తర చమత్కారము ప్రాణముగా కలది. కొందరు ప్రమాతలచేత స్వాకారము వలె అభిన్నముగా ఈ రసము అనేది ఆస్వాదింపబడుతున్నది. అది రజస్తమో గుణములచేత అస్పృష్ట మైన, సాత్త్విక మైన మనోధర్మము."

మరిన్నీ,

> "ఈ రససంతతిని యోగులవలె పుణ్యవంతులు ఆస్వాదిస్తారు అని పెద్ద లన్నారు."

పై మాటలను సంక్షేపము చేసి చెప్పితే, ఈ రసము సాత్త్వికమైన ఒకానొక సుఖానుభవ మనీ, అది బ్రహ్మానందముతో పోలిక కలదనీ, అది యోగుల వంటి పుణ్యశీలురే అనుభవిస్తారనీ మనము పరిగణించవచ్చును.

ఇట్టి రసము నిష్పత్తి చేయడము కావ్యాదర్శముగా పెట్టుకొన్న మన పెద్దలకూ, వాంతి భేదులవల్ల వచ్చే దేహస్వాస్థ్యము వంటి భయాద్యుపశాంతి లక్ష్యమని చెప్పిన అరిస్టాటిలు అనుయాయులకున్నూ ఎట్టి తారతమ్యమున్నదో మనము ఊహించుకోదగినదే కాని వివరించదగినది కాదు.

౬

ఈ రసము తొమ్మిది విధాలుగా ప్రతీయమాన మవుతున్నది. అందువల్ల సామాన్యదృష్ట్యా రసములు తొమ్మిది అనే ప్రతీతి ఉన్నది.

రసములు ఎనిమిదేకాని తొమ్మిది కావు – శాంతము రసమే కాదు అనీ, అది ఇతర రసముల సామరస్యమనీ అన్నవారున్నారు. వాత్సల్యము ఇత్యాది రసాలు నవరసాలకు కలిపి రససంఖ్య పెంచినవారూ ఉన్నారు. ఆ వాదములు

ఇక్కడ అప్రస్తుతము. నవరసవాదమే భరతమునినాటినుంచీ ప్రాచీనలకూ, ఆధునికులకూ ప్రబలసమ్మతి పొందిన మతము. నవసంఖ్యాకథనములో రసము బ్రహ్మస్వరూపముగా తద్విదులకు భాసిస్తుంది.

ఈ రసము లన్నింటిలో సూక్ష్మమైనది శాంతరసము. అందువల్లనే అది ప్రత్యేకరసమా అనే సందేహముకూడా కొందరికి కలిగింది. అది అన్ని ఇతర రసాలకూ అధిష్ఠానరూప మైనటువంటిది. అద్భుతాది శృంగార రసాంతమైన ఎనిమిది రసాలూ శాంతములోనుంచి సృష్టిక్రమములో వివర్తమై, మళ్ళీ అన్నీ సంహారక్రమములో ఆ శాంతిరసములోనే లయమై పోతవి. ఈ విషయము రసోపాసన చేసేవారికి స్ఫురించకపోదు. కాబట్టి శాంతరసమే అన్ని రసాలకూ అధిష్ఠానమూ, లక్ష్యమూ కూడా అవుతున్నది.

"ఈ శాంతరసానికి నిర్వేదము స్థాయి. నిర్వేదమంటే నిత్యానిత్య వస్తు వివేకము వలన జన్మించిన విషయ విరాగము."

## 2

శాంతరసముయొక్క ప్రాముఖ్యము తెలిసిన శాస్త్రవేత్తలూ, కవులూ ధన్యులు! మహాభారతాది కావ్యాలు శాంతరసప్రధానాలు కనుకనే అవి కావ్య జాలములో మూర్ధన్యకోటిని అలంకరిస్తున్నవి.

అయితే అన్ని కావ్యాలూ శాంతరసప్రధానముగా ఉండవలెనని నియమము లేదు. కావ్యసంతతి కూడా ఒక మహా ప్రపంచము. చక్షురాదులచేత మనము తెలుసుకుంటున్నా మనుకునే ఈ ప్రపంచ మెంత సత్యమో, కావ్య ప్రపంచము కూడా అంతమాత్రము సత్యము కాకపోదు. ఒక్కొక్క కావ్యము ఒక్కొక్క రసప్రాధాన్యము కలిగి ఉంటుంది. అయితే అన్ని రసాలకూ మూల మొక్కటే కనుక అన్నీ పాఠకులను శాంతోన్ముఖులుగా చేసేట్లు ఉండవలె. అది ధర్మబద్ధ మయినప్పుడే ఆ విధముగా ఉంటుంది. అయితే అది వేరే విషయము!

ఉత్తమ కావ్యలక్ష్యము శాంతముకాని అశాంతి కాదు. శాంతము శుద్ధమైన సాత్త్విక స్వభావము కలది. అవి జ్ఞానగమ్యము. కాని మూర్ఛాదులవల్ల లభ్య

మయ్యేది కాదు. అది ఆనందస్వరూపము! ఈ సంగతి మన కావ్యనిర్మాతలు మరచిపోకుండా ఉంటే, ఎంత లోకకళ్యాణకారకు లవుతారు!

కవులు మన పెద్దలదృష్టిలో గొప్ప ఉపాసకులు. వీరు తమకు ఉపాస్యమైన కావ్యదేవతచేత తామసశక్తులను సృష్టి చేయించి విషీకరణము, వశీకరణము, విద్వేషము, స్తంభనము, మారణము ఇత్యాది హేయక్రియలు చేయిస్తారా? లేక తా మా దేవతాప్రసాదము యథాశక్తిగా సంపాదించి ఉత్తీర్ణులై ఇతరులను తరింపజేస్తారా?

కావ్యసృష్టి తామసక్రియలకు ప్రయోగించేవారు కవిరాక్షసులు. ఈ కాలములో ఇట్టివారే బహుళముగా కనిపిస్తూ ఉండడము సంతాపకరము!

కావ్యము ఆనంద పర్యవసానముగా సృష్టించేవారు ధన్యులు. వారు కవివృషభులు. వారిని ఉద్దేశించి చెప్పినదే "నా నృషిః కురుతే కావ్యమ్" అనే పెద్దల వచనము!

("భారతి" సంపుటము 21, సంచిక 5,
తారణ వైశాఖము. 1944 మే.)



# శ్రీ కృష్ణ కుచేల సఖ్య భావము

[శ్రీ విజ్ఞానానంద నాథుడు]

ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని — అని నాలుగువిధములైన పుణ్యాత్ములు తన్ను భజింతురని శ్రీకృష్ణభగవానులు గీతలలో వివరించిరి గజేంద్రుని వంటివారు ఆర్తులు. సుగ్రీవాదులు, ఉత్తమపదము నర్థించిన ధ్రువునివంటి వారును అర్థార్థులు. వీ రిరువురకంటే జ్ఞానము కావలెనని అర్థించు ఉద్ధవుని వంటి జిజ్ఞాసువులు శ్రేష్ఠులు. ఈ ముగ్గురును ఏదో కోరికతో భజించువారే. వీ రందరికంటె జ్ఞాని ఉత్తముడు. జ్ఞానికి కర్తవ్యతయే లేదు, కృతార్థుడు. వారి జ్ఞానమే నిష్కామమయిన భక్తిగా రూపొందును. సనక సనందనాదులయు, శ్రీ శుకునియు భక్తి ఈ నాల్గవభక్తి. అందువల్లనే వెంటనే భగవానుడు అట్టివారి యందు తనకు పక్షపాత మున్నదని చెప్పెను.

"తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే
ప్రియోహి జ్ఞానినో ఽత్యర్థమహం స చ మమప్రియః॥"

శ్రీ శంకరభగవత్పాదులు పై శ్లోకము వివరించుచు "లోకములో ఆత్మ ప్రియమై యుండుట ప్రసిద్ధము గదా! కాబట్టి జ్ఞానులకు ఆత్మ యైనందున వారికి వాసుదేవుడు ప్రియుడు: వాసుదేవుడనైన నాకు జ్ఞాని ఆత్మయే గనుక నా కాతడు మిక్కిలి ప్రియుడు" అని మనోహరముగా వ్యాఖ్యానించిరి

కుచేలునికథ శ్రీమద్భాగవతము దశమస్కంధము ఉత్తరార్ధము 80, 81 అధ్యాయములలో మొత్తం 87 శ్లోకములలో వర్ణింపబడిన రోమహర్షక మగు కథ. కుచేలు డనునది పేరు కాదు. చిరిగిన గుడ్డలవలన కలిగిన బిరుదము. విషయసూచికలో కొన్ని ప్రతులలో సుదామోపాఖ్యానమని ఉన్నది. శ్రీధరుల వ్యాఖ్యానోపక్రమణికలో "శ్రీదామానం గృహాగతం సంపూజ్యాపృచ్ఛదర్థేప్సుం కు కు — కథాం ముదా'' అని యున్నందున అతని పేరు శ్రీధాముడును కావచ్చును.

శ్రీకృష్ణుని దర్శించి సంపద పొందినవాడుకనుక, స్థూలముగా ఆలో

చించినప్పుడు, కుచేలుడు అర్థార్థిగానే కనిపించును. శ్రీధరుల ఉపక్రమణిక ఆ భావమునే బలపరచుచున్నది. ముందు కథాస్మరణము చేసి మరల కుచేల భక్తి పై నాలుగు భక్తులలో ఏ శ్రేణికి చెందినది అని విచారింతము. సంక్షేపముగా భాగవతములో ఆ కథ యిట్లున్నది :

"శ్రీకృష్ణుని సఖుడైన ఒకానొక బ్రాహ్మణుడు కలడు. అతడు బ్రహ్మవిత్తముడు, ఇంద్రియార్థములందు విరక్తుడు, ప్రశాంతాత్ముడు, జితేంద్రియుడు. యదృచ్ఛగా ప్రాప్తమైనదానితో సంసారము గడుపుచున్న గృహస్థుడు. అతనివంటిదే పతివ్రతయైన అతనిభార్య. వారికి గంపెడుమంది పిల్లలు. అన్నములేక బాధపడుచుండిరి. ఒకనాడామె పిల్లల ఆర్తి చూడలేక పాలి వాడిన వదనముతో వడకుచు భర్తతో నిట్లన్నది. "స్వామీ ! మీకు శ్రీకృష్ణుడు బాల్యసఖుడు కదా ! అతడు కృపాపరిపూర్ణుడు. ద్వారకలో నున్నాడు. మీబోటి బహు కుటుంబికి పుష్కలముగా ధన మీయడా ?" ఆమె మృదువుగా మరల మరల ప్రార్థింపగా తనకు ఈ రీతిగా ఉత్తమశ్లోకదర్శన మగును గదా ! యని బయలుదేరెను. ఆమె బ్రాహ్మణుల యిండ్లలో అడిగి నాలుగు పిడికిళ్ళ అడుకులు తెచ్చి మూటకట్టి భర్తకొంగున మూటకట్టినది, శ్రీ కృష్ణున కుపాయనముగా.

కుచేలుడు ద్వారకచేరి పదునారువేలమంది మహిషీమణుల మందిరములో ఒకదానిని చేరి తాను బ్రహ్మానందగతుడైనట్లు భావించెను. శ్రీకృష్ణు డాతని జూచినంతనే రుక్మిణితల్పము దిగి ఎదురువచ్చి గాఢాలింగనము చేసికొని ఆనంద బాష్పములు కార్చుచు లోనికి గొంపోయి తన తల్పముపైన అన్నవలె కూరుచుండబెట్టి అతని పాదములు కడిగి, ఆ పాదోదకమును లోకపావనుడైన భగవంతుడు శిరస్సున గ్రహించి, దివ్యగంధధూపాదులలో అర్చించెను. రుక్మిణీదేవి వింజామర వేసెను. అది చూచి అంతఃపురజనము "ఈ కుచేలుడు, మలినుడు, క్షాముడు ఎంత భాగ్యశాలియో" అని ఆశ్చర్యపడుచుండిరి.

సఖులిద్దరు తమ గురుకులవాస చర్యలు ప్రస్తావించుకొనుచుండిరి. మధ్యలో శ్రీకృష్ణుడు కుశలప్రశ్న చేయుచు, "నీ పత్ని నీకు సదృశురాలేకదా! నీవు కామహతుడవు కాకుండ గృహస్థధర్మము నడపుచున్నావు గదా ! నీకు ధనకాంక్ష లే

దని ఎరుగుదును. కొందరు కామము వర్జించి విహితకర్మను నేను లోకసంగ్రహము చేయునట్లే చేయుదురు" అనెను.

అంతట గురుకులములో తామిద్దరు ఒకనాడు సమిధలకై అడవికి పోయి పెద్ద గాలివానలో చిక్కుకొని బాధపడుటయు, మరునాడుదయమే తమగురువు వెదకికొనుచు వచ్చి చూచి, "అయ్యో, నాయనలారా! నాకోస మెంత బాధ పడినారు! మీరు కావించిన ఆత్మార్పణముతో తుష్టుడ నైతిని, మీ మనోరథములు సిద్ధించును, వేదములు అధీతము లగును" అని ప్రీతితో పలికినదియు శ్రీకృష్ణుడు ప్రస్తావించి 'జ్ఞాపక మున్నదా?' అనెను. దానికి కుచేలు డిచ్చిన ఉత్తరము గుర్తుంచుకొనవలె.

"ఎందుకు జ్ఞాపకము లేదు! జగద్గురుడవగు నీవు ఛందోమయ మయిన బ్రహ్మరూపుడవు. అట్టి నీకు గురుకులవాసము విడంబనార్థమే కదా!"

సర్వభూతముల ఇంగితములు తెలిసిన శ్రీకృష్ణు డప్పుడు చిరునవ్వు నవ్వుచు, ప్రేమతో "బ్రహ్మన్! నాకు ఇంటినుండి ఉపాయన మేమి తెచ్చితివి? భక్తులు ప్రేమతో అర్పించిన అణువైనను భూరి చేయుదును. భక్తితో పత్రము, పుష్పము, ఫలము, తోయము - ఏది తెచ్చినను ప్రీతితో గ్రహింతును" అనెను.

కుచేలుడు సిగ్గుచేత అడుకు లర్పింపలేదు. ఆతని ఆగమన కారణము తెలిసిన శ్రీకృష్ణుడు, "పూర్వ మీతడు శ్రీకాముడై నన్ను భజింపలేదు. పతివ్రత యైన పత్నిని సంతోషపెట్టుటకే ఇట్లు వచ్చినాడు. ఇతనికి అమర్త్య దుర్లభమైన సంపద లిచ్చెదగాక!" అని తలపోసి, తానే కుచేలుని కొంగుముడి విప్పి, పిడికె డడుకులు తిన్నాడు. మరియొక గుప్పెడు తినబోవుచుండగా చాలు నని రుక్మిణీదేవి వారించినది.

కుచేలు డా రాత్రి అచ్యుతమందిరములో అన్నపానాదులు సేవించి స్వర్గములో ఉన్నట్లే భావించెను. తెల్లవారగా నాత డింటికి పోవుచుండ, శ్రీకృష్ణుడు కొంతదూరము వచ్చి సాగనంపి పోయెను. కుచేలుడు ధనము పొందకయు, యాచింపకయు వెళ్లుచు సంతోషాంతరంగముతో ఇట్లనుకొనుచుండెను.

"ఆ బ్రహ్మణ్యదేవుని బ్రహ్మణ్యత చూడగలిగితిని. ఆత డెక్కడ? దరిద్రుడ నగు నే నెక్కడ? అతడు నన్ను ఆలింగనము చేసుకొని ప్రియురాలి

తల్పమునందు అన్ననువలె కూర్చుండబెట్టి దేవతనువలె అర్చించు పాదసంవాహనాదికము చేసినాడు. పత్ని వింజామర వేసినది. విప్రదేవు డయిన దేవదేవుడు నన్ను పూజించినాడు. సర్వసిద్ధులకు ఆతని చరణార్చనమే మూలము కదా !— దరిద్రుడనైన నాకు ధన మొసంగినచో మదించి తన్ను మరచిపోదు ననియే భగవంతుడు నాకు ధన మీయకుండ పంపినాడు. సందేహము లేదు - అదే కారణము !"

కుచేలు డిల్లు చేరగా అది దివ్యభవనముగా ఉన్నది. భార్య భక్తితో ఎదురువచ్చి లోనికి కొంపోయినది. అతడు తన కకారణముగా ప్రాప్తించిన సంపద చూచి "నా సఖుని మహావిభూతి ఎంత మహత్తర మైనది ! అడుగకుండగనే పర్జన్యుడు వర్షించినట్లే నా కీ సంపద ప్రసాదించినాడు. అతడు సఖవృషభుడు. నాకు జన్మ జన్మలలో సౌహృద సఖ్య మైత్రీ దాస్యమే ప్రాప్తించుగాక !" అని అనుకొనుచు, సంపదలయందు లంపటుడు కాక, జనార్దన భక్తితో సంసారము గడపెను. తుద కాతడు బంధనము లన్నియు వీడినవాడై బ్రహ్మవిదులు పొందు గతిని ప్రాపించెను !"

ఇది కుచేలుని కథావృత్తాంతము !

కామ క్రోధాదులచేత లక్కవలె గట్టిపడియుండు చిత్తము భగవంతుని స్వరూపాదుల ధ్యానముచేత ద్రవత్వము పొంది, ఈశ్వరునియందు సంతతధారగా వర్తించు చిత్తవృత్తియే భక్తియని లక్షణవేత్తలు వర్ణించిరి. ఈ భక్తి తొమ్మిది మార్గములలో నుండును. వానిలో నారదాదుల శాంతభక్తి, హనుమదాదుల దాస్యభక్తి, యశోదాదుల వాత్సల్యభక్తి, గోపికాదుల మాధుర్యభక్తి, అర్జునాదుల సఖ్యభక్తి ముఖ్యమైనవి. ఇందులో కుచేలునిది సఖ్యభక్తి.

అతడు శ్రీకృష్ణుడు పరమాత్మ యని తాత్పర్యమున్నవాడు. దారిద్ర్యశాంతికై శ్రీకృష్ణదర్శనమునకు వెళ్ళు డనగా, ఈ విధముగా ఉత్తమశ్లోక దర్శనమగునని బయలుదేరినాడు. అంతదూరము వెళ్ళి దారిద్ర్యబాధ తొలగింపుమని వేడలేదు. శ్రీకృష్ణుడు తన్ను దేవతనువలె అర్చించుచుండగా వద్దనలేదు. శ్రీకృష్ణ సన్నిధానమున నతడు స్వర్గములో ఉన్నట్లే భావించెను. ఇంటికి తిరిగి వచ్చుచు శ్రీకృష్ణుని ప్రేమాతిశయమునే స్మరించుచు ఆనందించెను. తనకు సఖుడు ధనమీయక పంపుటకూడ ఆ కృపాసాంద్రుని అనుగ్రహముగానే అన్వ

యించుకొనెను. తనకు జన్మజన్మములందును భగవంతునియందు సఖ్యభక్తియే ప్రాపించుగాక యని కోరుకొనెను.

మరి శ్రీకృష్ణుడో ! కోరకున్నను అతనికి సర్వసంపదలు ప్రసాదించెను. అతడును విషయలంపటుడు కాక, తుదకు బంధముక్తుడై బ్రహ్మవిదులు పొందెడి గతిని ప్రాపించెను.

కుచేలుడు ఆర్తార్థి కాడు. చతుర్విధభక్తులలో జ్ఞానకోటిలోనివాడు. అతనికి వాసుదేవుడు ఆత్మ వాసుదేవునికి కుచేలుడు ఆత్మ. అతనిని కథను "ఉపక్రమించుటలోనే శ్రీశుడనే బ్రహ్మవిత్తముడయిన శ్రీకృష్ణుని సఖుడని వర్ణించి, "తద్ధ్యావ వేగోద్గ్రథితాత్మబంధన స్తద్ధామ నేభేభిరతస్సతాం గతిమ్'' అని ఉపసంహరించుచు, ఉపక్రమోపసంహారములకు అనుగుణముగానే కథ నంతయు బహు చమత్కృతితో నడపెను. ఈ కథలో సఖ్యభక్తి పరాకాష్ఠ నందినది. జ్ఞాను లయినవారికి సఖ్యభక్తి యెట్లు లుండునో తెలిసికొనుటకు కుచేలునికథయే ఉత్తమోదాహరణము !

"ప్రియో హి జ్ఞాని నోఽత్యర్థ మహం, స చ మమ ప్రియః'' అని శ్రీకృష్ణభగవానుడు గీతలలో ఉపదేశించిన నిత్యయుక్తులై ఏకభక్తులలోనివాడు కుచేలుడు !



# ముష్టి కవిత్వము

భిక్ష కావలసిన సన్న్యాసి గృహస్థువాకిటిలోకి వచ్చి హుంకారము మాత్రము చేస్తాడు. బ్రహ్మచారి 'భవతీ భిక్షాం దేహీ' అని కులభేదమును బట్టి కొంచెము మార్పుగా అడుగుతాడు. ఈ ఇద్దరికీ భిక్షపెట్టడము తప్పించుకొనే వీలులేదు. వాళ్లు దానికి అధికారులు. వాళ్ళకు పెట్టకుండా ఉంటే శ్రాద్ధముకూడా పాడై పోతుందిట.

ఇక మిగిలిన ముష్టి రకరకాలు. ఒకడు పంచాంగము చెప్పుతాడు. మరి యొకడు 'యజ్ఞేశ్వరాయ నమః' అంటాడు. ఇతరులు 'రామకృష్ణాభ్యాం నమః' అనీ, 'శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః' అనీ, 'శ్రీమతే రామానుజాయ నమః' అనీ తాము ముష్టికి వచ్చినట్లు యథాసంప్రదాయంగా సూచిస్తారు. గంట వాయించి కొందరు శంఖు ఊదుతారు. కొందరు పాటలు పాడుతారు.

ముష్టి కావలసిన కవి పద్యముతో ప్రారంభించుతాడు. అందులో కుక్కుటేశ్వర శతకములో చెప్పినట్లు : "పరమలోభిని దివాకరతనూభవుడంచు, ధర్మ చిత్తుని హరిశ్చంద్రు డనుచు, పాపకర్ము నభంగ పాండవాగ్రజుడంచు, సమర భీరుని సవ్యసాచి యనుచు, కుండబీదను మరున్మండలేశ్వరు డంచు, మతి విహీనుని భోగిపతి యటంచు, కవులు కకుత్ర్సి ఇసుమంత కడుపుకొరకు, పొగడుచుందురు రవివేకబుద్ధు లగుచు."

ముష్టికి అంగముగా కవిత్వము చెప్పడము ఇతర దేశాలలో ఉన్నట్లు తోచదు. భరతఖండము సంపన్నమై ఆర్షసంపత్తి కలిగి ఉన్న రోజులలోకూడా అటువంటి దున్నట్లు కనబడదు. కాని, దేశము క్షీణప్రాయమై పరదేశదాస్యము ప్రారంభించిన మధ్యయుగమునాటినుండి భరతఖండ మంతట ఇది వ్యాపించి నట్లు తోస్తుంది. కవులకు అక్షరలక్షలు ఇచ్చేవా రనేది విక్రమార్కుడు, భోజ రాజుల కథలు చదివినవారికి స్పష్ట మగును. మధ్యయుగములో సంస్కృత కవులతో ప్రారంభించిన ముష్టికవిత్వ సంప్రదాయము ఇతర దేశభాషలలో

జనులు పోకుండా పట్టుకొని వచ్చినట్లు తోచదుగాని పూర్వాచారపరాయణులైన తెలుగుకవులుమాత్రము ఇది పోకుండగా పట్టుకొని వచ్చినారు. చిత్ర మేమంటే పూర్వాచారపరాయణత్వము ఇతర విషయములలో నిరసించే నేటి నవకవులు అతినవకవులు, భావకవులు, అహంభావకవులు, వాస్తవికకవులు, అతి వాస్తవిక కవులు అందరూకూడా ముష్టికవిత్వ సంప్రదాయముమాత్రము పోకుండా ఏదో ఒక రూపాన జాగ్రత్తగా పట్టుకొనివస్తున్నారు.

ఈ తెలుగుకవుల ముష్టి రకరకాలుగా ఉన్నది. అందులో ఎక్కువగా ధాష్టీకపుముష్టి కనబడుతుంది. వారిలో అగ్రగణ్యుడు శ్రీనాథుడు. అంతకు మునుపు తెలుగుకవులు ఏ రాజునో, ఏ సామంతునో, ధనవంతునో ఆశ్రయించి ప్రాప్తముకొద్దీ ధనసంపాదన చేసి బ్రతికేవారు. కాని, శ్రీనాథకవినాటికి దేశము తెనుగుమీరిపోయినది. కవులకు నాజూకు, సొగసు, కాముకత, విలాసములు ఎక్కువ అయినవి. అందువల్లనే శ్రీనాథకవి,

"కస్తూరికా భిక్షాదానము చేయరా" — అన్నాడు.

అతడు దీనారటంకాల ముత్యాలశాలలో తీర్థమాడినాడు. తన వాగ్ధాటిచేత బహుశః అతనికంటె ఎన్నోరెట్లు అధికవిద్వాంసు డయిన గౌడడిండిమభట్టు కంచుఢక్కా పగులగొట్టించినాడు. అటు హంపీవిజయనగరము నుండి కొండ వీడు, పల్నాడు, రేనాడుల మీదుగా వేగినాటిలో రాజమహేంద్రవరముమీదుగా కళింగమువరకు గూడా అతడే ధాష్టీకపుముష్టి చేసినట్లు తోస్తుంది. అంత జేగీయ మానముగా తెలుగుదేశ మంతటను తిరిగినవారు మరల ఈ కాలంలో కింకవీంద్ర ఘటాపంచాననులగు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులే!

మన తెలుగుకవులు పద్యము చెప్పి యాచించినంతమాత్రముచేతనే ధన వంతులు, ప్రభువులు తప్పనిసరిగా కోరినడబ్బు ఇయ్యవలె ననే భావము ఒకటి వ్యాప్తిలోనికి తెచ్చినారు. ఇది వేములవాడ భీమకవినాటికే ఉండి శ్రీనాథుని నాటికి వృద్ధియై కృష్ణదేవరాయల నాటికి దేశములో స్థిరముగా పాదుకొనిపోయి నట్లు కనబడుతుంది. దానికి దేశమంతటా వ్యాపించియున్న అనేక కథలూ, చాటుపద్యములే సాక్ష్యము. కాని అందరిలో ఎక్కువ దుడుకుదనము కలవాడు ~~ుచౌడప్ప.

"ఇయ్యగ నిప్పించం గల
యయ్యాలకే కాక మీస మందరి కేలా ?
రొయ్యకు లేదా బారెడు
కయ్యమునకు కుందవరపు కవిచౌడప్పా !"

"విద్దెల మే లెరుగని నరు
డెద్దగుగా గడ్డి తినెడి దెద్దా ; పసులం
దెద్దుకు కొంత వివేకము
కద్దప్పా కుందవరపు కవిచౌడప్పా!"

"కరణం బని తన నడిగిన
కరుణ బిలచి యొక్క కాసు కవి కియ్యనిచో
కరణము పేరు సమిండీ
కరణమురా ! కుందవరపు కవిచౌడప్పా !"

ఇంతేకాదు. ఈ కవిచౌడప్ప ఈ కాలములో అతివాస్తవికకవులకు దారితీసినాడు. ఈ కాలములో అవినీతికరమైన కథలు, పద్యాలు, అసభ్యమైన భాష కొందరు వ్రాస్తున్నారు. కాని, కవిచౌడప్పకు వారెవరు చాలరు. బూతు లేనిది సభను రంజింపజేయదని ఒక రహస్యము అతడుబయట పెట్టినాడు. ఎందుకంటే అత డన్నట్లు :

"నీతుల కేమి యొకించుక
బూతాడక దొరకు నవ్వు బుట్టదు ధరలో — అనీ

"పది నీతులు పది బూతులు
పది శృంగారములు గల్గు పద్యములు సభన్
జదివినవాడే యధికుడు
గదరప్పా కుందవరపు కవిచౌడప్పా !" అన్నాడు.

మరియొక కవి "చంద్రరేఖా విలాసము" అనే పేరుతో ఒక కావ్యము వ్రాసి ఒకానొక సంపన్నునికి కృతి యిచ్చినాడు. ఆ కవి అనుకొన్నట్లుగా ఆతడు కట్నము యివ్వకపోగా దానిని "చంద్రరేఖా విలాపము" గా మార్చి వ్రాసినాడు.

ఈ విధముగా ఈ కవిత్వానికి ముష్టి ఏ విధముగా పుట్టుతుందో ఆ విధముగా పద్యాలు చెప్పడమే పరమావధి అయిపోయినది. అడిగిన సమస్యలు పూరించడము, ఇచ్చిన మాటలు కూర్చి పద్యాలు చెప్పడము, చిత్రకవిత్వము, రథబంధాది కవిత్వము వ్యాప్తిలోనికి వచ్చింది. ఘంటకు నూరు పద్యాలు చెప్పటో, నూరు ఘంటములచేత ఒక్కసారిగా పద్యములు వ్రాయించటో శతఘంట కవన మనే పేరుతో ఒకటి వ్యాప్తిలోనికి వచ్చింది. రామరాజ భూషణుని వంటి ప్రాజ్ఞుడుకూడా ఒక్కగడియలో నూరు కావ్యములు (పద్యములు) రచించే సమర్థత తనకున్నదని చెప్పుకున్నాడు.

ఈమధ్య శతావధానములు, అష్టావధానములు బాగా వ్యాప్తిలోనికి వచ్చినవి. అక్కడ జ్ఞాపకశక్తి, చురుకుదనము కవిత్వముకంటె ప్రధానము. ఆ పిమ్మట ఆశుకవిత్వ మొకటి శ్రీ కొప్పరపు సోదరకవులు ముందు వ్యాప్తిలోనికి తెచ్చి తెలుగులోకమును కొంతకాలము దిగ్భ్రాంతిలో ముంచినారు. ఈ పై విధములయిన అన్నిరకముల కవిత్వములలోను కవులు తమ ప్రతిభావిశేషములచేత మధ్య మధ్య మనోజ్ఞమైన పద్యములు చెప్పినారు. అట్టివే శ్రీనాథాదులు చెప్పినారని ఇప్పటికిని తెలుగువారు జ్ఞాపకముంచుకున్న చాటుపద్యములు. శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు 'నానారాజ సందర్శనము'లో చెప్పిన పద్యములు తెలుగువారు ఎన్నటికీ మరచిపోరు.

నవకవులు శతావధానములు, అష్టావధానములు చేసినవారు, ఆశుకవిత్వము చెప్పినవారు ఉన్నారుగాని కొంతకాల మైనతర్వాత అవి చాలించినారు. కాని, నవకవులలో ఈ ముష్టి ఒక క్రొత్తరూపము పొందినది. పూర్వపుకవులు ఒకటో రెండో పద్యములు చెప్పి అక్షరలక్షలకొరకు ఆశపడేవారు. కాని, నవకవులకు అంత ఆశలేదు. సన్మానమనే పేరుపెట్టి ఐదురూపాయల ఖద్దరుశాలువ ఇస్తామంటే పరుగెత్తుకొనిపోయి పద్యాలు చెప్పేవారున్నారు.

వివాహమునకు పిలిచినదే వ్యవధానముగా సంభావనకు చేరి ఆశీర్వచన పద్యములు చెప్పి, ఇచ్చిన బహుమానము పుచ్చుకొనివస్తారు. ఒక అతి వాస్తవిక కవి :

> "విభాతవేళ, శుభానిలంలో
> పికాంగనా శ్రావ్యకూజితంలో,
> అమాత్యమణీ! నీ వివాహమని ఈ
> సమస్త లోకం పలికింది"

అని ఇత్యాదిగా కల్యాణగీతి పాడినాడు. మరికొందరు తమకు సన్మాన సభ చేయించవలెనని మిత్రులకు ముందుగా వ్రాసి, వారలద్వారా సన్మానాలు చేయించుకుంటారు. వారికిన్నీ సన్మానం చేస్తామని కవులు, సహృదయులు, పండితులు, పెద్దలు పట్టుపట్టితే తప్పించుకపోవలె నని ప్రయత్నము చేసిన పెద్దలకు ఎంతభేద మున్నదో గమనించండి !

అన్నిటికంటె ఈ కాలములో ఒక క్రొత్తరకమైన ముష్టికవిత్వము వ్యాపిస్తున్నది. ఇది దీనముగా యాచించే ముష్టి కాదు. దాష్టీకముగా ఎత్తుకొనిపోయే ముష్టీ కాదు. ఈ కాలపు మాటలలో చెప్పితే అది ఒక సయింటిఫిక్(Scientific) ముష్టి ! ఇది కొంచెము విచారిస్తేనేగాని బోధపడదు.

ముష్టికవిత్వము ప్రయోజనము ఏమిటి ? డబ్బు సంపాదించడమే కదా ! పూర్వము అడిగినవారికి ముష్టి పెట్టడము ధర్మకార్యముగా పరిగణించేవారు. అందువల్ల ముష్టి కావలసినవారు అడిగి తెచ్చుకొనేవారు. ఈ కాలములో ముష్టి ఎత్తటము చాలా దేశాలలో నేరమయిపోయినది. నేరముకాని దేశాలలో కూడా మర్యాదగా అడిగితే ముష్టి పుట్టదు. అంతేగాక ముష్టి అడగటానికి అభిమానము కూడా కవులలో పెరిగిపోయినది. కాని డబ్బుకక్కుర్తి మాత్రము కవులకు పోలేదు. ఎట్లా పోతుంది? అందుకని పాశ్చాత్యకవులు, రచయితలు ఒక క్రొత్త మార్గము కనిపెట్టినారు. ఏ విధముగా పుస్తకము వ్రాస్తే ఎక్కువమంది ఈ కాలములో చదువుతారు ? ఎక్కువ పుస్తకాలు ఖర్చవుతవి ? ఏ విధంగా ఆ పుస్తకాలు బజారులో పెట్టితే లాభిస్తుంది ? ఈ ప్రశ్నలే ఆధునికకవులను బాధిస్తున్నవి. ఎవరి తాహతుకొద్దీ వారు తమ చదువరులను నిర్ణయించుకొని వారికి ఇష్టమయ్యేట్లు పుస్తకాలు వ్రాయడము సాగిస్తున్నారు.

కొంతమందికి డబ్బెక్కువై పనిలేక ప్రొద్దుపోదు. మరికొంతమంది పనిమీద వెళ్లుతూ ప్రయాణములో రైలులోనో, ఓడలోనో కాలము వెళ్ళబుచ్చవలె. ఇంకొందరికి దారిద్ర్యబాధవల్ల మనస్సు మరియొకదానిలో లగ్నము చేసుకొని బాధ మరచిపోవలె. ఇంకనూ కొందరు పండితంమన్యులు ? వారికి తెలియనిది ఉండదు. అట్టివారికి క్రొత్త విషయము చెప్పినట్లు చెప్పి వినోదము కల్పించవలెను ఇంకా మరెన్ని రకములైన విధములలో ఉన్నవి.

తరుచుగా ఈ కాలములో లోకమంతటా పుట్టి ప్రచార మవుతున్న గ్రంథ జాలము చాలా భాగము ఈ జాతికి చెందినదే ఇంగ్లీషుపుస్తకములు గాని, మన దేశభాషల పుస్తకములుగాని తరుచుగా ఇటువంటివే అని బుద్ధిమంతులకు, సహృదయులకు కూడ తరుచుగా భ్రాంతి కలిగించజాలుతున్నవి. ఒక కావ్యముగాని, ఒక నాటకముగాని, కథగాని, నవలగాని చదివి ఆనందించిన తర్వాత —

"మరల నూరు సంవత్సరములు దాటినపిమ్మట దీనిని చదివేవారు ఎవరు ఉంటారు ?"

అనే ప్రశ్న మనము వేసుకొని ఆలోచించినట్లయితే విషయము తెలిసిపోతుంది. కాని తాత్కాలికమైన ఆవేశములో ఆనందమువలె భ్రాంతి కలిగించు వినోదములో మన మా సంగతి తరచుగా మరుస్తున్నాము. అనాదిగా వివేకవంతులు చదివి చదివి మననము చేసి చేసి, ఆనందము పొంది పొంది, తీరక మరల ఆ ఆనందము పొందిన కావ్యాలు ఎన్నో ఉన్నవి. అవి ఇప్పుడు ఈ చదివేవారిలో ఎంతమంది ఉన్నారు ? చదివినా, వాని ఉదాత్తత తెలుసుకొనగలవారు ఎందరున్నారు ?

ఈ మధ్యకాలములో మహారచయితలనీ, ప్రముఖులనీ పేరుపడ్డవారిలో విద్వాంసులూ సమర్థులూ ఐనవారేగదా, ఎచ్. జి. వెల్సు, జాన్ గాల్సువర్దులు! వారిని కూడా అప్పుడే లోకము మరచిపోతున్నదంటే అతిశయోక్తి కాదు. ఇక ఎప్పటికప్పుడు Best Sellers గా ఉన్న పుస్తకాలు వ్రాసినవా రెందరు లేరు ? రెండు సంవత్సరాలక్రిందట Best Seller ను ఈనాడు కొనేవా డుండడే ! వీరందరూ ఉత్తమ రచయితలేనా ? సర్వకాలములలో సహృదయుల కానందము కలిగించే జాతిలోని రచయితలేనా వీరు ! ఈ ప్రశ్న నేను అనేక గ్రంథములు పఠించుచున్న బుద్ధిమంతుల నడుగుతున్నాను.

ఇట్టిది మాత్రము ముష్టికవిత్వము కాదా ! ఈ ముష్టి పూర్వాచారబద్ధమైన ముష్టి కాకపోవచ్చును. కాలానుగుణముగా మారి ముష్టిగా కనిపించని కొత్త ముష్టి. ఇది సయింటిఫిక్కు ముష్టి !



# రసజ్ఞుని దృష్టిలో

# సారంగధర నాటకము

ఆంధ్రనాటకపితామహు డని ప్రసిద్ధి పొందిన ధర్మవరం రామకృష్ణమాచార్యులు రచించిన దీ నాటకము. " విషాద సారంగధరనాటకము " అని కవి దీనికి నామకరణం చేశారు. ఇది అచ్చు కాకముందే మొదట 1887 సం॥ములో బళ్ళారిలో ప్రదర్శింపబడ్డది. అప్పటినుంచీ ఈ 76 ఏళ్ళూ ఎన్నెన్నో నాటక సమాజాలవారు ఆంధ్రదేశ మంతటా వేలకొలదిగా ప్రదర్శనలు జరిపినారు. ఇందులోని సారంగధరుడు, చిత్రాంగి, రాజనరేంద్రుని పాత్రలు ధరించి ఎందరో నట నటీమణులు ప్రసిద్ధికి వచ్చారు.

ఇంత బహుజనామోదము పొందిన నాటకాన్ని గూర్చి రసజ్ఞుడు తన నిష్పక్షపాతదృష్టి ప్రసరింపజేసి చెప్పడము కొంత చిక్కుతో కూడుకొన్న విషయము. రసజ్ఞుడే సహృదయుడు. అతనిహృదయము ఎంత కోమలమైనదో అంత కఠిన మైనదికూడాను. రసవంత మైనది ఎంత ఆప్యాయంగా ఆస్వాదిస్తాడో రసభంగము కలిగించేదానిని అంత ఏవగించుకుంటాడు. జనసామాన్యము చూపే ఇష్టానిష్టప్రవాహంలో కొట్టుకొనిపోక నిదానంగా ఆలోచిస్తాడు.

నాటకాన్ని దృశ్యకావ్యం అంటారు. పేరునుబట్టే రెండు లక్షణాలు అవసరం. 1. దృశ్యత్వము, 2. కావ్యత్వము. కొందరినాటకాలలో రెండు గుణాలు సమంగా ఉంటవి. అప్పుడే వారు మహాకవుల కోవలోకి వస్తారు. పెక్కుమంది రచయితలు దృశ్యత్వంతో ప్రసిద్ధు లవుతారు. పూర్వకవులు దారి చూపని నాటకరచనకు నాంది పలికినవారిలో అగ్రగణ్యులు రామకృష్ణమాచార్యులు. కొద్దిగా సంస్కృతనాటక సంస్కారముతో ఎక్కువగా షేక్స్పియర్ నాటక సంప్రదాయము జోడించి ఆంధ్రభాషకు వారు ప్రదర్శనయోగ్యమైన అనేకనాటకములు రచించి ప్రదర్శింపజేసినారు, షేక్స్పియర్‌కు వలెనే వీరికి విశేషముగా

నాటకరంగానుభవము కలదు. ఈ నాటకములో వారు రాజరాజనరేంద్రుడుగా నటించేవారు.

ఈ నాటకానికి ఆధారమైన కథ గౌరన నవనాథచరిత్రలోను, చేమకూర వేంకటకవి సారంగధరచరిత్ర ప్రబంధములోను ఉన్నది. కవి ముఖ్యముగా చేమకూర ప్రబంధమే ఆధారము చేసుకొని కొన్ని మార్పులు చేసినట్లుతోస్తుంది. చేమకూరవారి ప్రబంధములో చిత్రాంగి రాజరాజనరేంద్రుని భోగస్త్రీ. ఇందులో ముందు సారంగధరునికి ఉద్దేశింపబడి రాజనరేంద్రుని వ్యామోహముచేత విధిలేక అతని వివాహమాడిన కులకాంత. సారంగధరుని నేరము ప్రబంధములో రహస్యంగా విచారణ చేసినారు. నాటకములో బహిరంగ విచారణ జరిగినది. అన్నిటికంటె చేసిన పెద్దమార్పు నాటకాంతములో ఉన్నది. ప్రబంధములో సిద్ధుని అనుగ్రహమువలన సారంగధరునికి కాలుచేతులు మొలిచి సిద్ధుడగును. నాటకములో సారంగధరుడు చనిపోవును. అందువలననే ఇది విషాద సారంగధర నాటకమయినది.

ఇట్లా నాటకము విషాదాంతము చేయటము అప్పటికి విప్లవాత్మకమయిన మార్పు. కవి జీవించియుండగనే పుణ్యాత్ముడైన సారంగధరునికి మరణము వచ్చునట్లు చేయుట నీతిదాయకము కాదనియు, మంగళాంతము చేయవలసినదనియు ఎందరో విమర్శించిరి. కవితా పీఠికలో తన్ను సమర్థించుకొన్నాడు. నరికిన కాళ్లుచేతులు మొలుచుట అస్వాభావికము. లోకములో ఎందరో ధర్మాత్ములు కష్టములపాలగుట అనుభవసిద్ధము. కావున విషాదాంతము చేయుట నీతిదాయకము కాకపోదు. షేక్స్పియరు మొదలగు మహానాటక కర్తలు విషాదాంత నాటకములు రచించినారు—అని.

భారతీయ సంప్రదాయము ప్రకారము మంగళాంతము చేయకుండుట దోషమే. కవిసృష్టి బ్రహ్మసృష్టికంటె విశిష్టమైనది. కనుక కేవలము లోకములో జరుగుచున్నట్లుగానే కావ్యములో ఉండనక్కరలేదు. కాంతాసమ్మితముగా సదుపదేశము చేయుటే కవి విధి అని వారి మతము. అందులో ఎంత సత్యమున్నను నేటి రసజ్ఞుడు ఆ దృష్టితోనే కొలుచుట తగదు. కవి కాలు చేతులు మొలిపించుట అస్వాభావికము కనుక విషాదాంతము చేయవలసి వచ్చినదని చెప్పిన కారణముమాత్రము సరికాదు. రాజరాజనరేంద్రుడు తాను చేసిన తీర్పు

రద్దు చేయుచు అశ్వికభటుని పంపినట్లు కవి కల్పన చేసెను. కాలుచేతులు నరకక ముందే ఆ పాత్ర అందియున్నచో నాటకములో ఏ మాత్రము అస్వాభావికత లేకుండగానే మంగళాంతమై యుండేది. కవి బుద్ధిపూర్వకముగా విషాదాంతము చేసినాడు.

గ్రీకు తత్త్వవేత్త అరిస్టాటిల్ విషాదాంతనాటకాలకు ఉన్నతస్థాన మిచ్చినాడు. కావ్యము లోకవృత్తానికి అద్దము వంటిది. మహాత్ముల విషాదాంతము దర్శించిన సామాజికులకు భావావేశము అతిశయించి భేదిమందువలె సామరస్యము కలిగించును అని ఆయన సిద్ధాంతము చేసినాడు. విషాదమువలన వైరాగ్యము కలిగి, శాంతరసము కలిగించుననికూడా కొంతవరకు మనముకూడ సరిపెట్టుకోవచ్చునేమో. భాస రచితమైన ఊరుభంగమువంటి నాటకాలు నిజముగా విషాదాంతాలే కాబట్టి పూర్తిగా ఇది భారతీయసంప్రదాయానికి విరుద్ధ మనటానికి కూడా వీలులేదు. ఏది ఎట్లా ఉన్నా నేటి రసజ్ఞుడు విషాదాంతము చేయడము దోషమని నిర్ధారించుటకు వీలులేదు.

ఇందులో ఐదు అంకాలు, పూర్వరంగము, ఉత్తరరంగము, ప్రస్తావనలతో కలసి మొత్తము 21 రంగములు ఉన్నవి. అచ్చులో పేజీలు 98—సామాన్యంగా షేక్స్పియరు నాటకాల పొడవే. ఇందులో అంతా ద్విపదగా నున్న ఉత్తర రంగము కాక 64 పద్యాలు, అనుబంధములో 58 పాటలు ఉన్నవి.

షేక్స్పియరు నాటకాలలో మధ్య మధ్య వచ్చే పాటలు ఎవరివో కాని తరుచుగా ఆయన కవితాశక్తికికూడా మించిన ఉత్తమస్థాయిలో ఉంటవి. కాని ఈ నాటకానుబంధములోని పాటలు ఏ కోశాన కవిత్వమే అనిపించుకోలేవు. కవి ఇది ఎరిగి ఉన్నందునే ఆ కాలపు సామాజికుల వ్యామోహము తీర్చటానికి వ్రాసి అనుబంధములోనికి తోసివేసినట్లు తోస్తున్నది.

ఇక పద్యాలు ఆ కాలంలో కవులకే కాక సామాజికులకుకూడ శబ్దాలంకారాలు, అందులోను అంత్యానుప్రాస ఎక్కువ అభిమానమని తోస్తుంది.

ఈ కవికిగూడ అట్టి అభిమానమే ఉన్నది. షేక్స్పియరుకు కూడ మొదట మొదట అటువంటి అభిమానమే ఉండేది.

రాజరాజనరేంద్రుడు పంచమాంకములో చిత్రాంగితో —

విరోధమో విరోధమో వినిందితాపరాధమో
పరాభవానురోధమో యపాస్త సర్వబోధమో.

అట్లే సారంగధరుని తలచుకొని వచనములో కూడ.

నాపై కోపమా — తాపము — సంతాపము —
కీలికీలానురూపము — గరళప్రతాపము —
ప్రాణప్రతీపము — దురాలాపము — పాపము—విలాపము.

అతడే ద్వితీయాంకములో — చిత్రాంగిమాటలు విని,

"దాని దండింతు ఖండింతు బరతు చెరుతు
గడగి చంపుదు నొంపుదు గలతు నలతు
దెరల నడతును బొడుతు వధింతు ద్రుంతు" అంటాడు.

రత్నాంగి చతుర్థాంకములో కుమారునిపై బడి ఏడ్చుచు,

"గురుసుకుమారా సారంగధరా ముఖరిత సారంగధరా
విభూతి సారంగధరా" — అనియు,

"సారంగధరా బలిజిత సారంగవరా సుశౌర్య
సారంగహారా" - అనియు,

"దినయామినుల నయారే ఘన యాతన లనుభవింప
గనయాయ నయా వినయార్య నయా సునయా తనయా
మన యార్తి కెదియు ధారుణి నెనయా" — అనియు,

ఆమెయే చతుర్థాంకములో చిత్రాంగితో సారంగధరునిగూర్చి,

"శ్రీలోలుడే ధీలోలుడే సచ్ఛీలుడే భూపాలుడే
బాలుడే నిర్జాలుడే" — మరల

"నేరమా బలువైరమా కన నేరమా ఇది బీరమా
సారెసారెకు గోరి వేడెద సారసానన ప్రోవవే" అనును.

నాటి సామాజికుల సంగీతాభిలాషను తృప్తిపరచుటకై కవి మరణించిన సుతునిపై విలపించుచున్న రాజనరేంద్రునిచేత శంకరాభరణంబు-శ్రీరాగసంపద -తోడి - భూపాల - మోహనాకార- అని సీసపద్యములో మొదటి పదములలో రాగనామములు పొదిగి ఆ పద్యము రాగమాలికలో ఎట్లా పాడవలెనో కూడా సూచించాడు.

ఏవో కొన్ని పద్యాలలో పెద్ద సమాసాలు ఉన్నప్పటికీ మొత్తముమీద రంగస్థలముమీద నటీనటులు చక్కగా అన్నట్లయితే ప్రేక్షకులకు తేలికగా అర్థమయ్యే భాషలోనే పద్యాలు ఉన్నవి. ముఖ్యంగా సీసపద్యాలు వారికి ఇష్టమని తోస్తుంది. ఎన్నో వృత్తాలు, పంచచామరము, భుజంగప్రయాతము, ద్రుతవిలంబితము, మత్తకోకిల వంటి అసాధారణమైనవే కాక, బాలకోకిల అని కొత్త వృత్తము కూడ సృష్టించినారు. ఛందోగతులలో, సంగీతచిత్రణములో ఈ కవికి విశేషమయిన నేర్పు కలదు. మహాకవుల నాటకాలలో కనిపించే కవిత్వస్థాయిమాత్రము వీనిలో కానరాదు.

ఆనాట వచనముకూడ పరిణతి పొందలేదు. అప్పటికి చిన్నయసూరి నీతిచంద్రికే ఆదర్శరచనము. ఈ నాటకానికి నాలుగేండ్ల ముందే కందుకూరివారి శాకుంతలము వచ్చినది. పండితులను ఒకవంక మెప్పిస్తూ ఇంకొకవంక సామాన్యులకు అర్థమయ్యేందుకు భాష ఎట్లా ఉండవలెనో దానికోసము అన్వేషణ చేసినవారిలో ఈ కవికూడ ఒకరు. అందువల్ల ఇందులోని భాష సాఫీగా లేదని మనము విమర్శించడము ఉచితము కాదు.

సారంగధరుడు చిత్రాంగితో "తల్లీ! నీ ప్రియుడు వచ్చినపిదప నేను అవశ్యము వచ్చి భుజింతును" అని తన తండ్రినిగూర్చి నీ ప్రియుడు అని పలుకుట అనుచితముగా తోచును. అట్లే చిత్రాంగి సారంగధరునితో "నీవు తండ్రి వగుటకు నున్నాడవు కదా" అనుట కేవలము You are going to be a father అను ఇంగ్లీషు వాక్యానికి తర్జుమాలా ఉన్న దనవచ్చును.

వచనములో ఇట్లే ఇంకా ఎన్ని అయినా లోపాలు నేటివారికి కనబడవచ్చుగాక. కాని ఈనాటకరచనాకాలమునాటికి ఆంధ్రవచనము సరిగా రూపొందలేదనీ, నాటకాలుకూడా చాలా కొంచెమే అప్పటికి వచ్చినవనీ, ఈ కవి ఆంధ్ర

నాటకాలకే ప్రాతిపదిక వేసినవాళ్ళలో అగ్రగణ్యుడని గుర్తించుకుంటే, ఆయన సాధించినది ఎంత మహనీయమైనదో మనకు అవగత మవుతుంది.

నాటకము చివరివరకు ఏమగుతుందో ఏమగుతుందో అనే ఉత్కంఠ చూచేవారికి కలిగించేందుకు ఈ కథలోనే కొన్ని ఆటంకాలు ఉన్నవి. మనకు ద్వితీయాంకములోనే చిత్రాంగి సారంగధరుల సమావేశము ప్రదర్శింపబడ్డది. కనుక తప్పు చిత్రాంగిదా, లేక సారంగధరునిదా అనే ప్రశ్న రాదు. అందు వల్ల మూడవ అంకము విచారణము అంతా మనకు పట్టదు. రాజనరేంద్రునికి నిజము ఎట్లా తెలుస్తుందా అనే ఔత్సుక్యము మనకు కలుగదు.

పోనీ ఒకవంక సారంగధరునిపై చిత్రాంగి లేనినేరము మోపుటకై ప్రయత్నించడము, సారంగధరుడు తాను నిర్దోషినని ఋజువు చేసుకోడానికి ప్రయత్నించడము అయినా ఉన్నదా అంటే, అదీ లేదు. సారంగధరుడు తన నిర్దోషత్వమును చెప్పి మరేమీ చెప్పకుండా మౌనము వహించడమే కాక, తన మిత్రుడయిన సుబుద్ధిచేత ఘోరప్రమాణము చేయించి ఉన్న సాక్ష్యము కూడా రాకుండా చేసినాడు. ఈ సందర్భములో ఈ కథావస్తువుగల నాటకము అవిచ్ఛిన్నంగా 76 సంవత్సరాలపాటు వేలకొలదిసార్లు విజయవంతంగా ప్రదర్శింపబడింది అంటే మూడు విషయాలు ముఖ్యకారణాలు అనిపిస్తుంది.

మొదటిది ఆంధ్రదేశంలో నాటకాలు చూడబోయేవాళ్ళ అభిరుచి. అది మనకు ఇప్పుడు అప్రస్తుతము.

రెండవది మన దేశంలో స్త్రీ పురుషపాత్రలు ధరించిన నటీనటుల సమర్థత. ఎందరెందరో నటీనటులు మనకు జ్ఞప్తికి వస్తారు. రెండవ అంకములో చిత్రాంగి ఒకచోట సారంగధరునితో పేజీ పైచిలుకు వరుసగా మాట్లాడుతుంది. అందులో ఒక పాట కూడాను. సారంగధరుడు నిష్క్రమిస్తూ రెండున్నర పేజీలు వరుసగా మాట్లాడుతాడు. అందులో వరుసగా మూడు సీసపద్యాలు కూడాను.

మూడవ అంకమంతా నిజము తెలిసిన మన ఎదుట నేరవిచారము. ఉద్దండుని వాదము రెండున్నర పేజీలు. అది మాటలపుట్ట. సదయుని వాదము

మూడు పేజీలు. అందులో సాక్ష్యము లేకున్నా సారంగధరుడు నిర్దోషి అనడానికి సందర్భాలు ఎంతో నేర్పుగా చూపినాడు. కవి వకీలుగా తనకు గల అనుభవము అందులో ప్రదర్శించినాడు. కాని నటీనటులు నాటకము చూడవచ్చిన వారిని ఎట్లా ఆకట్టగలరు. అదే అద్భుతవిషయము. వారు తమ హావభావచేష్టలతో నేమి, తమ సంగీతముతో నేమి ప్రేక్షకులను ఆకట్టగలిగేవారు.

ఇక మూడవది ఈ నాటకకర్త నైపుణ్యము. ఒకవంక చిత్రాంగి ప్రేమ, ఆమె దుర్మార్గము, ఆమెప్రేమ కోపముగా మారుట, తుదకు మూర్ఛలో పలికిన కలవరింతలవల్ల ఆమెదోషము రాజనరేంద్రునికి తెలియవచ్చుట, కొంత సేపు ఆమెకు పశ్చాత్తాపము, మరల తప్పించుకొనుటకు కల్లలాడుట, తుదకు ప్రాణం వదలుట. ఇవన్నీ చిత్రాంగిమీద మనకు జుగుప్స కలిగిస్తవి. కాని, ఆమె మొదటినుండీ సారంగధరునే ప్రేమించి వివాహమాడవలె ననుకొనుట తుదకు బలవంతముచేత ముసలిరాజును వివాహమాడవలసి వచ్చుట - ఇవి మనకు ఆమెమీద కొంత జాలి పుట్టిస్తవి ఆమె ప్రాణప్రదముగా దాచుకొనే సారంగధరుని చిత్రపటమే తుదకు బయటపడి ఆమెతప్పును బయటపెడుతుంది.

ఇంకొకవంక సారంగధరుడు సత్పురుషులలో అగ్రగణ్యుడు. తనపై లేనినింద మోపిన సవతితల్లికి గూడా అపకీర్తి రాకుండ దానికి తాను మౌనము వహించడమే కాకుండా మిత్రుడయిన సుబుద్ధిని గూడా మాట్లాడకుండా చేస్తాడు. తనకు అన్యాయముగా పడ్డ శిక్ష ధైర్యంగా అనుభవిస్తాడు. తలవరులు తప్పించుకోమన్నా తప్పించుకొని పారిపోడు. సారంగధరుని ధీరోదాత్తత ఈ నాటకాని కంతా ప్రాణభూత మైనది.

రత్నాంగిపాత్రలో విశేషము లేదు. అన్యాయముగా శిక్షపొందిన కొడుకు కొరకై దుఃఖించే అందరి తల్లులవంటిదే. విశిష్టత ఏమీ లేదు.

కాని, రాజనరేంద్రునిపాత్ర ఎన్నో విధాలుగా విషాదకరమైనది. ముసలితనములో చక్కని పడుచుపిల్లను వివాహమాడిన దోషము తప్ప మరే లోపము అతనిలో లేదు. ఆ లోపమే అతనికి ఎన్నెన్నో అనుకోనివిధాలుగా కష్టాలు

తెచ్చిపెడుతుంది. అతడు చిత్రాంగి మాటలు నమ్మెను. అయినా న్యాయముగా విచారణ చేయించెను. అతడు దోషి యని నమ్మినందువలనే నాలుగురోజులు అయినా వ్యవధాన మీయలేదు. దోషియైన కొడుకునైనా నిశ్శంకముగా శిక్షించే మాధవవర్మ కోవలోనివాడు. తన తీర్పు పొరపాటేమో అనే సందేహము కలిగిన వెంటనే దానిని అపుటకు ఉత్తర్వు చేసి ఆశ్వికభటుని ఘడియలు లెక్క వేసి పంపుతాడు. చిత్రాంగిదోషము తెలిసినవెంటనే ఆమెకు కఠినశిక్ష విధిస్తాడు. ధర్మదీక్ష కలవాడయినా తనకున్న చిన్న లోపమువల్ల దుఃఖము పాలవుతాడు.

ఈ విధముగా చిత్రాంగి సారంగధరులు, రాజనరేంద్రుడు మూడువిధము లయిన విషాద పాత్రలు.

ఈ విషాదము భరింపరానిదిగా ఉండక కొంత విశ్రాంతి కలిగించేందుకు, షేక్స్పియరుపద్ధతినే, మధ్యమధ్య సున్నితమైన హాస్యము కవి ప్రవేశ పెట్టినాడు. అందుకు తలవరుల భాష ఒక ఉదాహరణము.

కాని, అంతకంటె సున్నితమైనది కమల చాకచక్యము. ఆ దాసి చిత్రాంగిని తన వశములో ఉంచుకోడానికి చిత్రాంగిఉత్తరము దాచిపెట్టినది. కంఠ శ్ఛేదము కావింతునని చిత్రాంగి బెదరింపగా అది "నేను-దాన్ని నెట్లోర్చుకొందును ? తల వేరై పోవునుకదా ! అప్పుడు ఇంకెట్లు మాటలాడుదును ? భోజన మెట్లు చేయుదును ?" "తుదకు అది చిక్కిన దెచ్చి యిత్తును" అన్నప్పుడు చిత్రాంగి "చిక్కిన?" అని బెదరింపగా అది "చిక్కకున్నను దెచ్చి యిత్తులెమ్ము" అని నిష్క్రమించును.

అట్లే సుబుద్ధి ఉన్మాదముకూడ. ఒకవంక విషాదము, ఇంకొకవంక హాస్యము కూడా కలిగించును. ఈ నాటకములో విషాదమును సుబుద్ధిపాత్ర అతిశయింప చేయును. అతడు చేతనయినది చేయలేకపోతాడు.

కవి ఈ నాటకములో ఎన్నెన్నో నాటకీయ సంఘటనలు కల్పించినాడు. సరిగా సారంగధరునికి యౌవరాజ్యపట్టాభిషేకము సేయదలచిన నాటికి, సరిగా తను మహారాజశిక్ష అనుభవించటము, తలవరులు సారంగధరుని తప్పించు టానికి చేసిన ప్రయత్నమువలననే అతడు సాధారణముగా శిక్షవేయుచోట లేక

పోవుటచే శిక్ష రద్దుచేసిన రాజనరేంద్రుని రెండవ ఆజ్ఞాపత్రిక తరుణములో అందకపోవుట ముఖ్యముగా ప్రశంసార్హములు.

సారంగధరుని దోషవిచారము నేటి విచారణమువలె ఉన్నదని కొందరన వచ్చును. రాజనరేంద్రుని మాళవపతి యని ప్రస్తావనలో చెప్పి పూర్వరంగములో అతడు ఆంధ్రరాజు అనుట ఎబ్బెట్టుగా ఉండవచ్చును. కాని ఇట్టి చిన్న లోపాలు షేక్స్పియరు రచనలలోనే బహుళంగా ఉన్నవి.

ఏది ఏమైనా ఈ నాటకము ఆంధ్రుల హృదయక్షేత్రములలో స్థిరముగా నిజముగా జరిగినట్లే త్రిష్ఠ వేసినది. చిత్రాంగిపాత్ర లోకోక్తి అయినది అందుకు కారణభూత మైనది విషాద సారంగధర నాటకమే.



# ఆంధ్ర సంస్థానములు :
# సాహిత్య పోషణము

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీవారు ఏటేట రెండు నిర్ణీతవిషయములపై వ్రాసిన ఉత్తమ గ్రంథములకు చెరి రు. 2000 లు బహుమతి ప్రదానము చేయుచున్నారు. పై విషయముపై వ్రాసిన గ్రంథములలో 1966-67 లో దీనిని అత్యుత్తమముగా నిర్ణయించి బహూకరించిరి. ఆ బహుమతికి ఈ గ్రంథము సర్వవిధముల యోగ్యమైనది. గ్రంథము ఆమూలాగ్రము పఠించినవారికి ఆబహుమతి లాంఛనప్రాయమే యనియు, గ్రంథకర్త విషయ సంగ్రహణాదికమునకే రు. 2000 ల పై చిలుకు వెచ్చించియుండవలెనని యనిపించును. విషయ సమగ్రతమీదనే దృష్టి నిలిపి శ్రమకు, వ్యయమునకు వెనుకాడక డా॥ దొణప్ప ఈ గ్రంథరచన చేసినందుకు వారి నెంత యభినందించినను చాలదు. ఈమధ్య వెలువడిన ఉత్తమ సాహిత్య చరిత్ర పరిశోధన గ్రంథములలో నిది అగ్రస్థానమధిరోహించు ననుట నిస్సందేహము.

భాషాశాస్త్రములో నిష్ణాతు లను ప్రసిద్ధి కల డా॥ దొణప్ప ఇందులో చరిత్రపరిశోధనకు పూనుకొని విషయసంగ్రహమునను, వివరణమునందును కేవల శాస్త్రీయపద్ధతి నవలంబించి విషయప్రదర్శనమందు, సంయమముతో స్పష్టతను జోడించి నాతివిస్తృతము నాతిసంక్షేపమునై సమతూకమైన శైలిలో ఈ గ్రంథనిర్వహణము చేయుట ప్రశంసార్హము.

గ్రంథసందర్భములలో వచ్చు వ్యక్తులు అకార్యకరణము చేసినట్లు సూచింపవలసినప్పుడు ఎవరికి నొప్పి కలుగకుండను, సత్యమునకు బాధ రాకుండను నిగ్రహముతో వర్తించిన పద్ధతి ప్రమోదావహము. ఇందు కుదాహరణములుగా, ఉర్లాము సంస్థానము కన్నేపల్లివారినుండి బుద్ధిరాజువారికి సంక్రమించిన విధమును (పే. 67-68), కాణాదము పెద్దనసోమయాజి భద్రాపరిణయములోని పద్యములు చాలా ఎక్కువగా సుబ్రహ్మణ్యకవి భద్రాపరిణయములో కనబడు

చుండుటను (పే. 253) వర్ణించుట చూడవచ్చును. అట్లే వ్యక్తులు కావించిన ఉత్తమ కార్యములు వర్ణించునపుడును వాని స్వరూపము మాత్రము తెలిపి అభినందనము పాఠకులకే వదలుటయు గ్రంథమంతటను చూడవచ్చును. ఇట్లు నిందాస్తుతులకు స్వయముగా పూనుకొనక విషయప్రదర్శనమునకే శ్రద్ధ వహించుట పరిశోధకులకు మార్గదర్శకముగా నున్నది.

ఇందులో 29 పేజీలున్న ముఖబంధము సంస్థాన శబ్ద నిర్ణయము చేసి స్థూలముగా వాని సాహిత్యసేవయు వర్ణించారు. అందులో 1938 నాటికి ఆంధ్రలోని జమీందారీల సంఖ్య 443 అనియు, వానిలో సాహిత్యసేవ కావించినవి బొటాబొటి యనియు తెలిపిరి. వానిలో ముఖ్యసంస్థానములు 46. వానినిగూర్చి పే. 33, 519 లలో అకారాదిగా వివరించిరి. ఇది ప్రధానగ్రంథము! తర్వాత పరిశిష్టములో పే. 520-598లలో మరి 56 సంస్థానముల చరిత్రయు, సాహిత్యసేవయు సంగ్రహించినారు. ఈ విధముగా 102 సంస్థానముల చరిత్రయు, సాహిత్యసేవయు ఈ గ్రంథములో ప్రామాణికముగా సంగ్రహించినారు. మరియు పాతిక సంస్థానములనుగూర్చి విషయములు సేకరించియు అరగొరగా నున్నందునను, గ్రంథవిస్తరభీతిచేతను, వదలివేసితిమని గ్రంథకర్త తెలిపిరి.

46 ముఖ్యసంస్థానములగూర్చిన ప్రధాన గ్రంథములో ప్రతి సంస్థాన విషయమును వరుసగా ప్రవేశిక, సంస్థానచరిత్రము, సాహిత్యపోషణము అను మూడు భాగములుగా చేసి వర్ణించి, తుదకు ఉపజీవ్య గ్రంథసూచిక నిచ్చుచు వచ్చినారు. సాహిత్యపోషణ మను భాగములో కవుల కావ్యరచనాదికము వివరించుటతో తృప్తిపడక, శాస్త్రగ్రంథరచనలను, పండితులను, వారి శాస్త్రపాండిత్యాతిశయమును, స్పర్థలను. వివాదములను, జయాపజయములను చక్కగా ప్రస్తావించినారు.

ఉపజీవ్య గ్రంథసూచికలలో అనేక ప్రామాణికగ్రంథములు, రిపోర్టులే కాక, ఆంధ్రపత్రిక ఉగాదిసంచికలు, భారతి, ఆదివారపు పత్రికలు మొదలగు వానిలోని సాహిత్యాదిక వ్యాసములును ఎన్నో కలవు. అవి లెక్క వేయగా 185 తేలినవి. అదిగాక మధ్యమధ్య అథస్సూచికలలో చూపినవి శతాధికముగా కలవు. ఈ యన్నిటికి దోడు ఆ యా సంస్థానములలో వ్రాసిన, బహూకరింప

బడిన, ప్రోత్సహింపబడిన, ప్రకటింపబడిన గ్రంథజాతము అసంఖ్యాకమైనది. దీనినిబట్టి డా॥ దొణప్ప ఈ గ్రంథరచనకు ఎంత విస్తార పరిశ్రమ చేసిరో అవగతము కాగలదు. పైయన్నిటిని మించి వారు ఎన్నో సంస్థానములను స్వయముగా దర్శించి, అక్కడి ఉద్యోగులను పెద్దలను అడిగి ఎన్నో వివరములు తెలిసికొని గ్రంథరచన కుపయోగించుకొనిరి. ఈ విధముగా పరిశ్రమించి తెలిసికొన్న ప్రతి విషయమును ఏదో విధముగా గ్రంథములో చొప్పింపవలెనను ప్రలోభన దౌర్బల్యమునకు పాల్పడక డా॥ దొణప్ప చూపిన నిగ్రహము ప్రత్యేకముగా ప్రశంసనీయము !

ముఖబంధములో చూపినట్లు 1931 లెక్కలప్రకారము ఆంధ్రజిల్లాలలో నున్న 20,119 గ్రామములలోను, 12,265 గ్రామములు జమీందారీల లోనివి. కాబట్టి సగముకంటె ఎక్కువ జమీందారీగ్రామములు. సంస్థానాధిపతులు తమ తమ సంస్థాన పరిధులలోని కవి పండితులనే కాక వచ్చినవారినెల్ల ఆదరించి యుండిరి. అందుచేత ఆ కాలములో మొత్తము ఆంధ్రదేశములో ఉండిన కవిత్వ పాండిత్య సామగ్రి ఇంచుమించుగా నంతయు ఈ గ్రంథములో నిరూపింపబడిన దనుట యసంభావ్యము కాదు. కొన్ని సంస్థానముల చరిత్రలు పదునొకండవ శతాబ్దినుండి వర్ణింపబడినను, స్థూలముగా చూచినచో, ప్రధానముగా ఔరంగజేబు సేనలకు గోలకొండ స్వాధీనమైన 1688 సం॥ నాటినుండి, జమీందారీలు ఆంధ్ర ప్రదేశ్‌లో విలీనమైన కాలము వరకు, పూర్ణసంఖ్యలో 250 సం॥లలో ఆంధ్ర దేశములోని సాహిత్యమును, పాలనమును, పేదలనుండి ప్రభువులవరకు ప్రజల చరిత్ర ఈ గ్రంథములో కూర్పబడినదనుట అతిశయోక్తి కానేరదు. ప్రతి వ్యవస్థలో వలెనే జమీందారీవ్యవస్థలోనను గుణములతోపాటు దోషములును ఉండవచ్చును. కాని, నేటి ప్రజాసామాన్యములో వాని దోషములుమాత్రమే ప్రచారము పొంది జమీందారులు రాక్షసతుల్యు లను భావము ప్రబలియుండుట ఎంతయు అన్యాయము. ఈ గ్రంథము చదివినవారికి అనాదిగా భరతభూమి లోకమునకు ప్రసాదించినదని మనము సగర్వముగా చెప్పుకొను సంస్కృతికి మూలభూతములయిన వేదశాస్త్రాది విద్యలు, సంగీత సాహిత్యాది లలితకళలును సంస్థానాధిపతుల ప్రాపువల్లనే చెక్కుచెదరక మొన్న మొన్నటివరకు నిలిచి యున్నవని తెల్లము కాగలదు.

ఈ రెండు రెండున్నర శతాబ్దులను విమర్శకులు సాహిత్యములో 'క్షీణయుగ' మని వర్ణించుట పరిపాటి యైనది. డా॥ ద్రోణప్పయు ఆ యభిప్రాయమే సూచించినారు. ఆ కాలపు సాహిత్యములో ప్రతిభకు కంటె వ్యుత్పత్తికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చి యుండవచ్చును. కాని, డా॥ ద్రోణప్పగారే, ఈ యుగములో ప్రశస్తములైన క్షేత్రమాహాత్మ్యములు, పెక్కులు చారిత్రక కావ్యములు, "మేలురము లయిన పురాణములు," "ప్రబంధ' వీథుల వయనించు రసికపాంథజనులకు అమృత చషకముల నందించు ప్రపాశాల లగు ప్రబంధములు, చక్కని శతకములు, విశిష్టస్థాన మాక్రమించు యక్షగానములు, శ్రవ్యప్రబంధములుగా నాంధ్రీకరించిన సంస్కృత దృశ్యప్రబంధములే కాక యథాతథాంధ్రీకరణములును, "ఉత్తమ స్వతంత్ర నాటకములు"ను తాత్త్విక విమర్శక తర్కాలంకార వ్యాకరణ జ్యోతిషాది దర్శనగ్రంథములు, నిఘంటువులు వెలసినవనియు, సంగీతము ఉత్తమముగా వెలసిన దనియు, చిత్రకళకూడ విలసిల్లినదనియు ముఖబంధములో తెలిపినారు. ఈ మాటలనుబట్టియే ఈ "క్షీణయుగము" అనుదానిలో ఉత్తమసాహిత్యము ఎంతో వెలసినదని స్పష్టపడును. ఆ గ్రంథరాశిని నిష్పక్షపాతబుద్ధితో ఆంధ్ర సాహిత్యాభిమాను లిప్పటికీ తరచి చూచినట్లు తోచదు. ఈ "క్షీణయుగ"నామమే సహృదయులకు దానిమీద ఉత్సాహము కుంటుపరచును. ప్రస్తుతము ప్రచలిత మగుచున్న వర్తమానయుగమును కొందరు అభ్యుదయయుగ మని పేరు పెట్టి ఆకర్షించుచున్నారు. దీనినే "శూన్యయుగము"గా భావించు విమర్శకులును లేకపోలేదు. చెడ్డపేరు పెట్టినచో దానియందు సామాన్య పాఠకులకు శ్రద్ధ కలుగదు. అదిగాక పాశ్చాత్య విమర్శకులు వ్యవహరించు 'డికెడెన్సు' అను శబ్దము మనస్సులో ఉంచుకొని ఈ క్షీణయుగ నామము కల్పింపబడినట్లు తోచును. ఆంగ్లవిమర్శకుల డికెడెన్సు అనుదాని లక్షణములు మన ఉత్తమ ప్రబంధములకు, శ్రీనాథ నాచన సోమనల రచనలకేకాక, మురారి వంటి వారికిని, కాళిదాస భవభూతుల వంటివారికి కూడ అన్వయింప జేయవచ్చునని విమర్శకులు గుర్తించుకొనవలెను. ఈ గ్రంథము చదువుటవలన బుద్ధిమంతుల అభిమానశ్రద్ధలు ఈ 'క్షీణయుగ' సాహిత్యము వంకకు ప్రసరించుగాక !

గ్రంథకర్త ఎన్నియో అక్షర గ్రంథములను పరిశోధించినారు. వానిలో నన్యోన్య భిన్నత్వ మున్నపుడు, అసామంజస్య మున్నపుడు, సత్యము నిరూ

పించుటకు ప్రయత్నించినారు. అది సాధ్యము కానప్పుడు వూహాగానములకు దిగక భావిపరిశోధకులకు వదిలినారు.

ఇందరు సంస్థానాధీశులలో కొందరు స్వయముగా పండితులు, కావ్యనిర్మాతలు, అందరును బహువిధములుగా సాహిత్యసేవ చేసినవారు.అందరికి వేదశాస్త్రములయందు అభిమానము సర్వసామాన్యము ఐనను కొన్ని సంస్థానములు శ్రీ వైష్ణవమును, కొలది శైవమును, ఒకటిరెండు మాధ్వమును, బంగానపల్లివారు ఇస్లామును, ఎక్కువ సంస్థానములు స్మార్తమును అభిమానించినవి. అట్లయినను తక్కిన మతస్థులను ఆదరింపకపోవుటగాని, ద్వేషించుటగాని కనబడదు. పండితులు, కవులు సర్వసాధారణముగా బ్రాహ్మణులే యైనను క్షత్రియులు, వైశ్యులు, రెడ్లు, కమ్మవారు, కాపులు, విశ్వకర్మ కులజులు, కుంభకారులు మొదలగు నన్నికులములవారును — ఎక్కడ గుణమున్నను సంస్థానాధిపతులచే నాదరింపబడినట్లు ఈ గ్రంథములో చూడగలము.

అట్లే కావ్యనిర్మాణాదికములలోగూడ ఎంతో వైవిధ్యము ద్యోతిత మగుచున్నది. అందులకు కారణము కవి పండితజన బాహుళ్యము, సంస్థాన స్థానవైవిధ్యము, రుచిబాహుళ్యము ఉండుటే ! ఎవరి రుచుల కనుకూలమైన ఆశ్రయము వారు పొందెడివారు.

నేటి కవులును, కళాకారులును ఈ సందర్భములో ముఖ్యముగా నొకటి గమనింపవలసి యున్నది. 1938 నాటికి ఆంధ్రజిల్లాలోని జమీందారీల సంఖ్య 448 ఐ యుండగా వానిలో 102 మాత్రమే సాహిత్యాదిపోషణ చేసినవి. 448 సంస్థానములును ఆంధ్రప్రదేశ్‌లో కలిసిపోయినవి. వాని రాబడి నిపుడు ఆంధ్రప్రదేశ ప్రభుత్వము వసూలు చేసికొనుచున్నది. సాహిత్యాదికమునకు మనప్రభుత్వము నేడు పెట్టుచున్న ఖర్చు సంస్థానములు పెట్టుచుండినదానిలో శతాంశము లేదే ! అకాడెమీలకు లక్ష లిచ్చుచున్నా మనవచ్చును. కాని అది సంస్థానాధీశులలో నాల్గవవంతువారు పెట్టిన ఖర్చుకే ఇంత తక్కువగా ఉన్నదే ! జమీందారీల రద్దువలన నష్టపడినది ఒక్క జమీందారులే కాదు—కవులు, గాయకులు, కళాకారులు, విద్వాంసులు నని కూడ ఈ గ్రంథము పఠించువారికి తోపక మానదు. కేంద్రీకృతమైన అకాడెమీలు ఎంత విశాలభావములతో వ్యవహరించినను వికేంద్రీకృతమై యుండిన విద్యాపోషకసంస్థలవలె వైవిధ్యము సాధింప

గలవా, అన్ని భాగములకు ప్రసరింపగలవా, అన్ని ఋతువులందును వ్యవహరింపజాలునా ?

ఉత్తమమైన ఈ గ్రంథములో ఎన్నో విషయములు విచారింపబడినవి. అందులో పూర్వపరిశోధకుల నిర్ణయములను సూక్ష్మముగా పరిశీలించియే సర్వసామాన్యముగా గ్రంథకర్త తమ నిర్ణయములు తెలిపిరి. ఇందులకు గ్రంథములో 882 పాళ్ళు ప్రమాణమే. స్థాలీపులాకన్యాయముగా నట్టివానిలో కొన్ని ఉదహరింతుము.

(1) మతుకుమల్లి కృష్ణశాస్త్రి, నరసింహశాస్త్రికి తమ్ముడుగాని శతక కవుల చరిత్ర అనుబంధములో తెలిపినట్లు కుమారుడు కాదనుట (పే.282).

(2) సిద్ధయోగేశ్వరవిలాస కర్తయగు నందికొటుకూరు సిద్ధయోగీంద్రుడును, వీరబ్రహ్మేంద్రయోగి శిష్యుడగు దూదేకుల సిద్ధయయు భిన్నులనుచు, వారిద్దరు నభిన్నులని పెండ్యాలవారి యభిప్రాయము యుక్తియుక్తము కాదనుటకు చూపిన యుపపత్తులు (పే. 291).

(3) పెనుమళ్ళ సోమనామాత్యుడు తన సీమంతినీ కల్యాణ ప్రబంధమందు తాను పిల్లలమఱ్ఱి వంశీయుడనని పేర్కొనినది సుపరీక్షితము కావలసిన యంశ మనుచు, వారిగోత్రములు వేరని నిరూపించి, సోమన పూర్వు లెవరైన కాశ్యపగోత్రుడగు పిన వీరన వంశమునుండి సోమన భారద్వాజ గోత్రులకు దత్తులేమో యని యూహించుట ఉచితపక్ష మనుట (పే. 413).

(4) అచలాత్మజాపరిణయ కర్తయగు కిరీటి వెంకటాచార్యులు సిరిపుర సంస్థానపండితులని శ్రీనందిరాజు చలపతిరావుగారును, తెలుగువిజ్ఞానసర్వస్వము లోని వ్యాసకర్తయు వ్రాసినది అచ్చుతప్పనియు, సురపురమని యుండవలెనని యుండవలె ననుచు నేటి సోలాపురము, పూర్వము సూరాపురము, సురపురము అని వ్యవహరింపబడినదని చూపుట (పే. 514).

(5) ప్రద్యుమ్నాభ్యుదయము, రుక్మవతీపరిణయము లను ప్రబంధద్వయము సోమకవి విరచితమని విశాఖపట్టణ జిల్లావృత్తాంత సంగ్రహములో నిరూపించుట ప్రామాదికమనుచు వాస్తవముగా ఆ రెండుపేళ్లను ఒకే గ్రంథమును నిర్దేశించు పర్యాయవాచకములుగా గ్రహించుట యుక్తమనుట (పే. 555).

ఈ విధముగా గ్రంథమం దంతటను డా॥ దోణప్ప ఆకర్షక గ్రంథాంశ వచనములను సమగ్రముగా పరీక్ష చేసిగాని గ్రహింపనట్లు స్పష్టపడుచున్నది.

ఐనను పూర్వ వ్యాసకర్త నిర్ణయములను సూక్ష్మతరముగా పరిశీలింప నందుననో, స్ఫురింపనందుననో అక్కడక్కడ ప్రమాదము లనదగినవి గ్రంథములోనికి దొరలకపోలేదు. మూడిటినిమాత్ర ముదాహరించుచున్నాము.

(1) పే. 86, 87 లలో కవిరాజ కంఠీరవ బిరుదాంచితుడగు ఋగ్వేది వేంకటాచల కవినిగూర్చి ఇట్లు వ్రాసినారు :

''తరణి సమప్రతాప నిధి
    దామెర యక్క నృపాలు సన్నిధిన్
వరకవి గంధ సింధురము
    వచ్చె నటంచు వచించువాని క్రొ
వ్వర గజరాజకేసరి వ
    టంచు బలించితి వాశుపైఖరిన్
సరసులు మెచ్చ వాఙ్మయ వి
    శంకట వేంకటశైల సత్కవీ !''

అని కృతిపతి వేంకటాచలకవిని సంబోధించుటనుబట్టి కాళహస్తి నృపాలుర పేరోలగమున వేంకటాచలకవికిని, కవిగంధసింధుర బిరుదమందనుడగు కొండ మడుగు పురుషోత్తమ కవికిని పటుతర కవితావివాదము ప్రవర్తిల్లినటులను, అందు వెంకటాచలకవియే విజయ మందినటులును విశద మగుచున్నది.

పై పద్యములో వివాదాదికము జరిగిన యర్థము లేనందున దాని యథ స్సూచికలో ఆకర వ్యాసము ''బిరుదుకవుల యుదంతములు'' ఆం. ప. విజయ 1953 ఉగాదిసంచిక. పుటలు 114, 115 తీసి చూడగా నందులోగూడ వివాద విశేషములు లేకపోగా, కవి గంధసింధురము అని యీ పద్యములో ప్రస్తావించ బడిన కవి పురుషోత్తమ కవి యని గుర్తించుటకూడ బిరుదు మాత్రముచేతనే యూహించిన ఊహ యని తేలినది. పూర్వ వ్యాసకర్త వాక్కులను తీవ్ర పరీక్ష చేయక ప్రమాణముగా గ్రహించుటచేత నిది సంభవించి యుండును. కవిసార్వ భౌము లెందరో ఉన్నట్లే పలువురు కవిగంధసింధురము లుండవచ్చుగదా !

(2) పే. 339, 340 లు. ఇక్కడ శ్రీ రాజా దుర్గా సదాశివ ప్రసాద బహద్దరుగారు ఆంగ్లీకరించిన "ధమ్మ పదము" ప్రస్తావింపబడినది. ధమ్మపద ము ను దమ్మపద మనియు, అందలి వర్గ (వగ్గ) ములను సర్గలనుటయు ప్రామాదికము. దాని మూలము త్రిపిటకములలో సుత్తపిటక మందలి ఖుద్దక నికాయము కావున నందలిభాష ''పాలి" యనదగనుగాని ప్రాకృతము కాదు. రాజా గారు తమ పీఠికలో "ప్రాకృతమందలి భాష"అన్న వాక్యమును యథాతథముగా గ్రహించుటచే కాబోలు - ''ఇందలిభాష ప్రాకృతము" అనిరి.

(3) పే. 210. ఒక శ్రీరామచంద్ర అప్పారావుగారు 1862—1909 మధ్య జీవించిరనియు, వారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారిని సన్మానించి రనియు, అనార్కలీ కృతి పొందిరనియు గలదు. 1909 నాటికి శ్రీవిశ్వనాథకు 14 ఏళ్ళు. అప్పటికి అనార్కలీ వారు వ్రాయలేదు. వారిని ఆదరించినది వేరొక శ్రీరామచంద్ర అప్పారావుగారు. నామ సామ్యం మీ విభ్రాంతికి కారణమై యుండును. శ్రీ ముద్దుకృష్ణ తన 'అనార్కలీ'నాటికను 1934 లో శ్రీరామచంద్ర అప్పారావుగారికి అంకిత మిచ్చి ప్రచురించిరి. దానికి శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు "పరిచితిని" గేయఫణితిలో వ్రాసిరి. ఈ శ్రీరామచంద్ర అప్పారావు గారు స్వయముగా కవి. వారు జన్మించినది 1909 అని "మహోదయము" తెలుపుచున్నది."ప్రమాదో ధీమతా మపి"కనుక అత్యుత్తమమైన ఈగ్రంథములో గూడ నక్కడక్కడ సవరణల అవసర మని సూచించుటే మా ఆశయము. కాని రంధ్రాన్వేషణతత్పరత బట్టికాని,గ్రంథప్రశస్తిని తక్కువ చేయు నుద్దేశము గాని, ఎంతమాత్రము కాదు. తమ మనవి మాటలలో రచయిత "విషయపరిధి చాల ఎక్కువ. ఉన్న వ్యవధి మరీ తక్కువ. అందును ఉరుకులు పరుగులమీద పని సాగించుటవలన వెనుదిరిగి చూచుకొనుటకు వెసులుబాటు దొరకినది కాదు" అనిరి.

పరిధి ఎక్కువే. పోటీవిషయము ప్రకటింపబడిన తర్వాత గ్రంథరచన మున కిచ్చువ్యవధి సంవత్సరకాలము మాత్రమే. పైగా గ్రంథకర్త విశ్వకళా పరిషత్తులో రీడరు ఉద్యోగభారము వహించుచున్నవారు. ఇట్టి గ్రంథము సిద్ధము చేయుట కెన్నో సంవత్సరములు పట్టును. అట్టిది గ్రంథకర్త సంవత్సర కాల పరిమితిలో ఇంత చక్కగా నిర్వర్తించి యుండుట వారి ఏకాగ్రతకు, పరిశ్రమకు, సమర్థతకు నిదర్శనము. గ్రంథములో తొందరపాటు కనిపించుటలేదు.

డా॥ దొణప్ప "మనవి మాటలు" వారికిగల వినయసంపదనే సూచించును. ఈ గ్రంథ మంతటను ప్రభువరేణ్యులయు, కవీశ్వరులయు, పండిత ప్రకాండులయు నామములను, వారి కృతులను ప్రదర్శింపబడినవి. స్మరణమాత్రముననే పాతకులను పవిత్రము చేయగల పుణ్యమూర్తు లెందరో ఈ గ్రంథములో ప్రస్తావింపబడిరి.

ఈ గ్రంథపఠనముచే మహావీరులు, మహాత్యాగులు నగు నాంధ్రమహనీయుల నెందరినో మనము విస్మరించితిమని గుర్తింపగలము. బొబ్బిలివీరుల యతిశయ మెరుగుదుము. కొలదిమంది విజయనగరమురాజులు కావించిన పద్మనాభ యుద్ధమును ఎరిగియుండవచ్చును. కాని బొబ్బిలియుద్ధము ఆ కాలములో ఎందరో జమీందారులు ఫ్రెంచివారిమీద సాగించిన ప్రతిఘటనలలో ఒకటి మాత్రమే యని ఎంద రెరుగుదురు ? పద్మనాభయుద్ధముకూడ ఇంగ్లీషు కుంపిణీ వారిపైన—విజయనగరమువారు 1794 లో సిపాయికలహమునకు ఎంతయో పూర్వము జరిపిన తిరుగుబాటని ఎందరెరుంగుదురు ? అట్లే సిపాయిల తిరుగుబాటునకు చాల పూర్వమే నొసము పాళయగాడైన దొరవారి నరసింహారెడ్డి కుంపిణీవారిని ఎదిరించిన వీరుడని ఎందరి కెరుక ? సురపురము (నేటి షోలాపురము) రాజ్యమునకు 1853 లో మైనారిటీతీరి కొత్తగా గద్దెనెక్కిన రాజా వెంకటప్ప 1857 లో తనసేనలో అరబ్బులను, రోహిల్లాలను విరివిగా చేర్చుకొనుచు, కుంఫిణీవారి మందలింపులను లెక్కచేయక 1858 లో చెలరేగిన సిపాయిల పితూరీలో నానాసాహేబు మొదలగువారికి కుమ్మక్కుగా నుండెననియు, కుంఫిణీవారు రాజా వెంకటప్పను అధికారమునుండి తొలగించి కఠిన శిక్ష విధించి రనియు, గవర్నరు జనరలు కరుణించి ఆ శిక్షను నాలుగేండ్ల కారాగార శిక్షగా మార్చి చెంగల్పట్టునందలి కారాగారమునకు బంపుచుండగా, మానధను డగు నాతడు దారిలో చేతుపాకితో ప్రేల్చుకొని ఆత్మహత్య కావించుకొనెననియు ఆంధ్రాభిమాను లెంద రెరుగుదురు? ఇట్టి యాంధ్రవీరుల చరిత్ర ఈ గ్రంథములో ప్రసక్తాను ప్రసక్తముగా వచ్చి ప్రస్తావింపబడినందున వీరకావ్య నిర్మాతల కిందులో ఎన్నో వీరకథావస్తువులు లభింపగలవు.

ఈ గ్రంథప్రయోజనమును అతిశయింప జేయుటకు భావిముద్రణములలో చేర్పదగిన రెండు చేర్పులు సూచించుచున్నాము.

మొదటిది : సంస్థానచరిత్రము అను భాగములలో వచ్చినపేర్లే ఎన్నియో మారులు సహజముగా తిరిగి తిరిగి వచ్చుచున్నవి. వంశవృక్షముల నిచ్చినచో పాఠకుల కవగాహన మొనర్చుకొనుట సులభతర మగును.

రెండవది : ప్రవేశికలలో ఆయా సంస్థానముల ప్రధానస్థానములు విశదముగా వర్ణింప యత్నించిరి. కాని ఆ యా స్థానములను గుర్తించుచు ఆంధ్రదేశ పట మొకటి చేర్చినయెడల పాఠకుల మనఃఫలకములందు స్పష్టతరముగా చిత్రితములు కాగలవు. సంస్థానముల పరిధులు కాలాంతరములలో మారుచు వచ్చినందున పరిధులు పటములో గుర్తించుట సాధ్యము కాదుగాని, వాని ప్రధానస్థలముల, పట్టణముల, పల్లెల గుర్తింపవచ్చును. ముద్రణమునుగూర్చి కొంచెము చెప్పవలసిన దున్నది ఈ గ్రంథము ఆంధ్రయూనివర్శిటీ ప్రెస్సులో ముద్రితమయినది. సగముపైచిలుకు గ్రంథము పఠించునంతవరకు 144, 145 పేజీలలో అథస్సూచిక నాలుగపంక్తులు రెండుమార్లు పడుట తప్ప - ఎన్నదగిన అచ్చుతప్పులు లేవని ఆశ్చర్యామోదములు కలిగెను. ఆ తర్వాత చివరచివరకు అచ్చుతప్పులును, అక్షరము లంటకపోవుటయు నెక్కువెక్కువైనందుకు విచారము కలిగినది. ఏమైనను నిర్దుష్టముగా అందముగా ఆంధ్రములో అచ్చయిన గ్రంథములలో దీనిని పరిగణింపదగును. పబ్లికు గ్రంథాలయములకేగాక ప్రైవేటు గ్రంథాలయములకును అలంకారమును, విలువను గూర్చు నుత్తమగ్రంథ మిది. గ్రంథస్వరూపమునుబట్టి నిర్ణయించిన వెల ఎక్కువ కాదు.

ఈ యుత్తమగ్రంథరచనము చేసిన డా॥ ద్రోణప్పగారును, విషయ నిర్ణయము చేసి బహుమతి ప్రదానము చేసిన ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ వారును, కృతి నొందిన శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారును, గ్రంథ ప్రకటనము గావించిన ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారును ఆంధ్రు లందరి ధన్యవాదములకును పాత్రులు !

[గ్రంథకర్త : డా॥ తూమాటి ద్రోణప్ప, ఎం. ఏ., పిహెచ్. డి.,
ప్రకాశకులు : ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, వాల్తేరు,
డెమ్మి 1/8, పేజీలు 624-16, హాఫ్‌క్యాలికోబైండు, వెలరు. 30 లు]

[ఆంధ్రపత్రిక - జనవరి 14, 1970.]

# నవనీతము - పరిచయము

౧

అయితే నవకవిత్వ మేమిటి ? కవిత్వ మేమిటో. దాని స్వరూపమేమిటో పెద్దలే నిర్ణయించలేక బాధపడుతూ ఉంటే, అందుకుతోడు ఈ "నవ" విశేషణము కూడా ఎందుకు ? ఈ కవిత్వములో కొత్త ఏమిటి ? భాష కొత్తా ? భావము కొత్తా ? ఛందస్సు కొత్తా ? రీతిలోనా, అలంకారములోనా, రసములోనా ? - ఎందులో ఈ నవ్యత ? లేక వ్యాకరణమర్యాదలు ఉల్లంఘించడముల్లో కొత్తా ? అర్థము లేకుండా వ్రాయడములోనా ? కాక పెద్దలను ధిక్కరించడములోనా ? ఎందులో ఉన్నది నవ్యత నవకవులలో ?

ఈ విధముగా పెద్దలే అడుగుతున్నారు. అన్నిటిలో - అని ప్రత్యుత్తర మీయవచ్చును. అప్పుడు ఈ ప్రశ్నలు వేసే పెద్దలు నవకవులకు చివరకు వ్యాకరణోల్లంఘనములో కూడా కొత్తదన మున్నదని ఒప్పుకోరు. ఆ పాదు నీమాలే కాక అనింద్యగ్రామ్యాలు కూడా నన్నయాదులే ప్రయోగించి వాడి చూపినారు. అందులోమాత్రము వీరి కొత్త ఏమిటో ? అని పెద్దలు నవకవులకు నవ్యత లేదని నిరూపించగలరు. అట్టివారిది భౌతికశాస్త్ర పరీక్ష వంటిది. లోకములో ఉన్న వస్తువులన్నీ పంచభూతముల సంయోగమువల్ల కలిగే వివిధ వికారాలే కాబట్టి, అన్నీ ఒకటేనని ఋజువు చేసే దివ్యజ్ఞాన మూర్తులు యీ పెద్దలు.

తెలుగువాఙ్మయంలో వివరించి చూస్తే అక్షరాలతరగతిలో చదువుకున్న 56 అక్షరాల కలయికవల్ల చేసే గారడీయే కాని మరేమీ కానట్లు తోస్తుంది. అట్టివారికి అటువంటి బ్రహ్మజ్ఞానుల నుద్దేశించి చెప్పేది కాదనక కవిత్వము అనేమాట ఉపాధిభేదాలు అంగీకరించే సామాన్యులయిన ప్రాకృత మానవులకు చెప్పిన మాట ఇది।

ప్రకృతి అంతటిలోనూ జననమూ. వృద్ధ, జీర్ణావస్థా ఒకదాని తర్వాత ఒకటి వచ్చి, జీర్ణస్థితిలోనుంచే పునర్జననము కనబడుతుంది. కాలపురుషుడు

ప్రతి సంవత్సరము శిశిరములో జీర్ణించి, వసంతములో పునర్జన్మ పొందుచున్నాడు. చెట్లు చిగిర్చి, నెమ్మదిగా వృద్ధి పొంది, చివరకు శిశిరములో ఆకులు రాలిపోయి, మళ్ళీ ఆ మొక్కలే వసంతములో చిగురిస్తున్నవి. మహానదులు వర్షముతో వృద్ధియై గ్రీష్మములో క్షీణించి మరల వర్షముతో పునఃపుష్టి పొందుతున్నవి. కవిత్వము మహాప్రవాహ మైతే, దానికి వర్షమూ, గ్రీష్మమూ మరల వర్షఋతువూ ఉన్నవి.

కవిత ఒక రసాలశాఖ అంటే, దానికి వసంతమూ, శిశిరమూ, మళ్ళీ వసంతమూ ఉన్నవి. ప్రవాహమునకు వర్షాగమములో కొత్తనీరు వస్తుంది. తరుగుల్మాదులు వసంతాగమములో నవనవలాడుతూ ఉంటవి. ఆ విధముగానే ఇది నవకవిత్వము. ఇందులో పూర్వకవిత్వ ప్రకృతి మారిపోయినదని కాదు, మునుపు లేనిది ఇప్పుడు కొత్తగా పుట్టినదని కాదు. స్త్రీలలో లావణ్యము వలె, పసిపాపలలో మిసిమి వలె, యువకులలో ఉత్సాహము వలె, యోగులలో శాంతి వలె, కావ్యములో రసమువలె ఇదమిత్థ మని స్పష్టముగా వర్ణించడానికి సాధ్యము కాక, ఇటువంటిదని కొంత సూచించడానికి సాధ్యమై, అనుభవవేద్యమైన ఒకానొక విశిష్టధర్మ మున్నది నవకవిత్వములో.

నవకవిత్వమును విశేషముగా స్తుతి చేసేవారూ లోకములో ఉన్నారు. దానిని చూచి అపహసించి నిరసించి విశేషముగా నిందించేవారూ ఉన్నారు — యువతిని చూచి వృద్ధనారి అసహ్యించుకొన్నట్లు. కాని నవకవిత్వమును భూషించినా, దూషించినా ఉభయపక్షాలవారూ దాని నవ్యత అంగీకరించినవారే అవుతున్నారు. ఒకరికి ఆ నవ్యత సమ్మతము; ఇంకొకరికి అసమ్మతము. దానినిబట్టి అది అనుభవైకవేద్య మని అనుమాట సత్యమని ఋజువవుతుంది.



అయితే, నవకవిత్వ మంటే మునుపెన్నడూలేని కొత్తదా ఈ కవిత్వము అని వాదించేవారు మన దేశములోనూ, ఇతరదేశాలలోనూ కూడా ఇప్పుడు లేకపోలేదు. ఆటవికమానవుడు మారిపోయి నాగరిక మానవుడు పూర్వము ఎట్లు వచ్చినాడో, ఆ విధముగానే ఇపుడు పూర్వనాగరిక మానవుడు పూర్తిగా మారిపోయి ఆధునికమానవు డైనాడని వారి ఊహ. ఈ విధముగా మానవప్రకృతి

మార్పు చెందినదికాబట్టి, దానితోపాటు మానవకవిత్వముకూడ పూర్తిగా మార వలెననీ, మారి తీరుతుందనీ వారి మతము.

పూర్వమానవు లెరుగని మారణసాధనాలు కనిపెట్టగలిగిన ఆధునిక మానవుని అహంభావము వలన జనించిన దీ వాదము. మొదటి ఐరోపా మహాసంగ్రామానికి కొద్దిగా ముందు ఈ వాదము ప్రారంభించి యుద్ధానంతరము లోకమంతటా వ్యాపించినది. అది మృత్యుముఖముగా మాయ ప్రేరణవల్ల పరుగెత్తుతున్నవారి వాదము. అగ్నిశిఖను మింగబోతున్న శలభముల అహంభావ మది. వారివాదము అంగీకరిస్తే, మనము మహాకవుల మనుకునే కాళిదాసాదులు కవులు కారు ; ఇంతెందుకు ? ఇంతవరకు లోకములో పుట్టిన కవిత్వము కవిత్వము కాదు. నవ్యకవిత్వము పుట్టుతున్నది, పుట్టబోతున్నది, పుట్టుతుంది – అని వారి వాదము.

ఈ అహంభావపూరితులు ఉద్దేశించే అర్థములు నవ్యకవిత్వ మనే పదము ఇందులో వ్యవహరించదు. అహంభావకవుల వాదన ఏమైనా, ఇంతవరకూ వారు చేసిన రచనలనుబట్టి పరీక్షించగా అది పూర్వము ఎన్నడూ ఎవరూ ఎరుగని కొత్తది కాకపోవడమే కాక, మన సాహిత్యవేత్తలు అధమవిధమైన కవిత్వమని నిరసించిన చిత్రకవిత్వముగా గణింపదగినదిగా కనబడుతున్నది. వారి వాదానికి అనుగుణమైన రచనలు చేసి చూపేవరకూ వారి ప్రయత్నము ఆకాశసౌధనిర్మాణముగ తలంచక తప్పదు.

## ౩

కొంతకాలమునుంచి భరతఖండము అంతటా ఒక నవశక్తి ఆవేశించి తాండవ మాడుతున్నది. బహుకాలము పారతంత్ర్యము అనుభవించి దాస్యవిమోచనకై అమృతాపహరణమునకు సిద్ధపడిన గరుడునిరెక్కల ఆస్ఫాలనమే కావచ్చునది. కాక ఆధునికుల ప్రచురసాధనాలవల్ల దేశదేశాల స్వరూపమంతా ఒక్కసారిగా మనము తెలిసికోగలిగినందువల్ల సూర్యోదయముతో వికసించే పద్మమువలె మనబుద్ధికి కలిగిన వికాసమే దీనికి కారణమేమో ! వాయువు విశేషము మందగించినచోటనే మరుక్షణములో తుఫాను రేగుతుంది. ఆ విధముగానే మన దేశములో కొంతకాలమునుంచి ఒకానొక నూతనోజ్జీవము కలిగింది. తెలుగు

కవిత్వములో ఈ నూతనచిహ్నాలు అంతకుమునుపే కనబడుతూ ఉన్నప్పటికీ, అతిస్పష్టముగా కార్యరూపము పొందినది 1913 సం॥లో. శ్రీ రాయప్రోలు సుబ్బారావు తృణకంకణము ప్రచురణములో ప్రమాదీచ సంవత్సర శ్రావణ పౌర్ణమి స్థిరవాసర మైనట్లు ప్రకాశకులు అందులో ఉల్లేఖించినారు.

కవి అన్నాడు :

"శాశ్వత నవ్యస్ఫురణల
నశ్వర లావణ్యమై యెనయ గావ్యకళా
విశ్వమునన్ రసమయ మధు
రైశ్వర్యము లేలు కవిత కంజలి నిత్తున్.

శశి వికసించిన శ్రావణ
నిశీథమున గానబడిన నీరదసుతకున్
బ్రశమిత మతినై యీ ప
ద్య శుభాంజలి నొసగితి బ్రణమార్పు మనుచున్."

ప్రకాశకులు పీఠికలో "ఇప్పటి యాంధ్రవాఙ్మయమున బురాతనపద్ధతి రచన తగ్గి నూతన వికాసాంకురము పొడగట్టుచుండుటకు సంతస"మందినారు. నవీన భావములు నూతనాదర్శములు జీవకళలు లోకపరిణామ హేతువులని చాటినారు. లాక్షణికుల సర్వాధికార ధూర్వహత్వమును నిరసించి కవుల స్వాతంత్ర్యము రక్షించినారు. తృణకంకణము, కష్టకమల, స్నేహలతాదేవి, తెనుగుతోట, స్వప్నకుమారము వరుసగా ఐదుకావ్యములు 1913, 1914 సంవత్సరములలో అభినవ కవితామండలి తరఫున ప్రచురించినారు. అందులో "తెనుగు తోట"లో ఆ రోజులలో తెలుగుకవిత్వములో విజృంభిస్తూ ఉన్న నవజీవనము రమణీయముగా ప్రతిబింబించి కానవస్తున్నది. "లేఖినీ శుభ వాహినీ"లో కవి :

"లలిత సారస్వత నికుంజవలయ మెల్ల
నవనవానందభవ సుందర లతాంత
ములను నవనవలాడునో ముద్దు కలమ !"

అని సంబోధించినారు. నవకవుల రచనల సంపుటి ఏదయినా శ్రీ రాయప్రోలు సుబ్బారావు రచనలతో ప్రారంభించడము సమంజసము. అందువల్ల నవనీతము, శ్రీ రాయప్రోలు సుబ్బారావురచనతో ప్రారంభము చేసినాము.



శ్రీ రాయప్రోలు సుబ్బారావు తెలుగుదేశములో ఉదయిస్తున్న నూతన కాంతిబింబమును ముందుగా చూడగలిగిన ద్రష్ట. కథాకథనము ప్రాచీనమార్గముతో సాగిస్తే, పాడిన పాట అవుతుందని తెలుసుకున్నాడు. కథావస్తువులుకూడా సామాన్యజీవితములోనుండి తీసుకొని, అందులో ఉదాత్తత, మాధుర్యము చూపగలిగినాడు. తన కావ్యములలో వివిధములయిన ప్రణయభావములు చిత్రించినాడు. కాని, తెనుగుదేశములో కలుగుతున్న ఉత్తేజమునూ, నూతన శక్తినీ అనుభవించి ఆంధ్రాభిమానముతో ఉడికిపోయిన ప్రథమకవి ఇతడు. అవి ఆంధ్రరాష్ట్రముకోసము ఆందోళన ప్రారంభమైన రోజులు. ఆంధ్రావళిలో, ఆంధ్రులలో ప్రముఖులమీద కావ్యము లల్లి మెప్పింపచేసినవాడు. సభారంగములలో శ్రీ రాయప్రోలు సుబ్బారావుపద్యాలే ఇప్పటికీ ఆంధ్రాభిమానము కలవారు ముందుగా చదువుతున్నారు. తెనుగుదేశములో విరుస్తున్న ఈ నవవసంతము ఆయన తెనుగుతోటలో ద్యోతమవుతున్నట్లు మరి యే కావ్యములోను ద్యోతము కాదు. ఆ కావ్యము ప్రతిపదమధురము. శ్రీ సుబ్బారావు తెనుగువాడే కాదు; తెనుగునాటివాడు కూడాను. ఆయన కవిత్వములో ఈ తెనుగునాటి తీయదనము మూర్తీభవించి ఉన్నది.

తెనుగుతోటను "లేఖినీ శుభవాహినీ"తో ప్రారంభించి "గీతాసఖ్యము" చేసుకొని పొద్దుపొడుపునోములు పట్టిన తెనుగునాటి చిన్నదానిచేత "మంగళాచరణము'' చేయించి, కోకిలపాట వినిపించినాడు.

"ఆలకింపుము బాలరసాల శాఖ
నుయ్యెలల నూగుచు మరంద మియ్యపణితి
బాడుచున్నది కోయిల పాటకత్తె
పావనంబైన మాతృసేవావ్రతంబొ !"

కోయిల 28 పాటలలో తెనుగుకన్యకకు మేలుకొలుపు పాడుతుంది. పాటలలో ఆరుపాటలు ఇందులో ప్రత్యేకించి వేసినాము.

౨౪

నవకవిత్వము శ్రీ రాయప్రోలు సుబ్బారావుతో ప్రారంభమై సాహితీ సమితి కవులతో తెనుగుదేశములో పాదుకొనిపోయినది. సాహితీసమితి అభినవ కవితామండలివలె ఒక్క కవిత ప్రధానముగా కూడుకొన్నది కాదు. సమితిలో అనేక మార్గములు తొక్కిన అనేకకవు లున్నారు. సమితికవులకు కీలకమువంటి వాడు సాహితీసమితి సభాపతి తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రి.

శ్రీ శివశంకరశాస్త్రికి ఆంధ్రాభిమానము ఎక్కువ. లోకములో ఎక్కడ ఎటువంటి కవిత్వము, ఎటువంటి శిల్పము చిత్రకళ రూపము పొందినా అవి అన్నీ అవగతము చేసుకొనవలెనని ఆయన కోరిక. ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానమూ, పురాతనాధునాతన వాఙ్మయములూ చవిచూచినాడు. సంస్కృతాంధ్ర పండితుడు. అనేక భాషాకోవిదుడు. బహుగ్రంథ ద్రష్ట. స్నేహపాత్రుడు. సరసుడు. ధీరుడు. ప్రతిభాశాలి. ద్వితీయ యౌవనములో పవిత్ర ప్రణయము అణువణువునా విజృంభించగా ఉద్రూతలూగి మహాప్రవాహమువలె కావ్యము చెప్పిన ప్రేమశీలి. ఎంతటి భావోద్రేకమున్నా, శిల్పము మరచిపోని ఉత్తమ కవి. ప్రేమకూ, భక్తికీ భేదము చేయని వైష్ణవుడు. శైవుడిలా తన ప్రియురాలి నేత్రముల అందముజూచి ముగ్ధుడై తన్మయుడై ఉండే ధనుర్దాసు. శ్రీరామానుజుల అనుగ్రహముచేత శ్రీరంగశాయి దివ్యలోచనములు చూచి మహాభక్తుడుగా మారిపోయిన కథ ఈ "దివ్య లోచనములు."

౨౫

శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి నవకవిత్వమున నొక నూతనశోభ తెచ్చిన వాడు. తెలుగుదేశములో నవ్యకవితను మూలమూలలా ప్రచారము చేసినవాడు. పూర్వమార్గావలంబకులు ఆయననూ, ఆయన కవిత్వమునూ వృథాగా దూషించినంతగా ఆధునికుల నిక ఎవ్వరినీ దూషించి ఉండరు. అందుచే మనస్సులో బాధపడ్డా, విరసుల దూషణలను ఒక్క చిరునవ్వు నవ్వుతూ, ఒక్క కవిత్వపు చూపుతో నిర్విషము చేయగల మాంత్రికుడు ఆయన.

ఆయన ఏది వర్ణించినా, ఏది చెప్పినా మంత్రముగ్ధులను చేయగలడు. మాటలలో, వాటి అల్లికలో, వాటి ధ్వనిలో మాధుర్యము, సౌందర్యము ఉట్టి

పడేట్లు చేయగల సమ్మోహనాస్త్రవేత్త. జిలుగునగిషీపనులలో అరితేరిన శిల్పి. శ్రీ దేవులపల్లి "కన్నీరు, కృష్ణపక్షము, ఊర్వశి, ప్రవాసము" అనే కావ్యసంపుటాలు ప్రచురించినారు. అందులో కృష్ణపక్షములో నుండి 'అన్వేషణము' అనే కావ్యము ఇందులో వేసినాము. అవి వంగదేశములో వైష్ణవకవుల ప్రభావము తెలుగుకవిత్వము మీద చలాయించిన రోజులు. కవులు తమ ప్రణయములో ఆదర్శములు గోపికలకూ శ్రీకృష్ణునికి ఆరోపించి మధురకావ్యములు చెప్పిన రోజులవి. గోపిక కృష్ణునికోసము అన్వేషిస్తుంది ఇందులో !

౭

శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రికీ, శ్రీ దేవులపల్లికి కొంత సామ్యము ఉన్నది. అయితే ఒకరిని ఒకరు అనుకరించినవారు కారు. శ్రీ వేదుల కన్నీటిలో నిజమైన వేదన ఉన్నది. ఆయన ఆదర్శములలో ఉదాత్తతా, ప్రణయములో నైశిత్యమూ ఉన్నవి. పద్యబంధము ప్రౌఢమధుర మైనది.

సంస్కృతాంధ్ర జ్ఞానముల సంస్కారముతో ఆయన కవిత్వము ఆరంభించినాడు. శతావధానములు చేసినాడు. ఇంగ్లీషుభాషా జ్ఞానము ఎక్కువ లేదు. అయినా కవితాత్మ కలవాడుకనుక నవ్యమార్గాలలోకి కవిత్వము ప్రవేశించింది. ఇందులోని "నిరీక్షణము" అనే కావ్యములో ఆలంకారికులు "వాసవసజ్జిక" అని పేర్కొనే నాయికను నూతనపద్ధతిలో రమ్యముగా వర్ణించినాడు.

౮

సజీవులై ఇంకా కవిత్వము చెప్పుతూ ఉన్నవారి కావ్యాలే ఇందులో చేర్చవలెనని మా ప్రథమోద్దేశము. కాని తెలుగుదేశము ఎటువంటి మణులను స్వల్పకాలములోనే పోగొట్టుకొన్నదో కూడా చూపవలెననే ఉద్దేశము కలిగి చామర్తి రాజశేఖరరావు, కొడాలి సుబ్బారావు, కొడవగంటి వెంకటసుబ్బయ్యల కావ్యాలు కూడా చేర్చవలెనని నిశ్చయించినాము. ఈ మూడు మణులలో నాయకమణి చామర్తి రాజశేఖరరావు !

రాజశేఖరరావు బాల్యమాదిగా కవి. ముందు ప్రబంధరచనతో ప్రారంభించినాడు. తర్వాత ప్రబంధఫక్కి కొంచెము మార్చి కావ్యరచన చేసినాడు.

ఆ తర్వాత నాటకములు, ఒక నవలకూడా వ్రాసినాడు. కవి అనే ఆదరభావముతో అతనికి చాలామంది మిత్రు లైనారు. అతనికి క్రొత్తరచన చేసిన తర్వాత పాతరచనమీద అభిమానము పోయేది. ఎవరో ఒక మిత్రునివద్ద పాతరచన మిగిలిపోయేది. ఫలితాంశ మేమంటే అతను "సాహితి"లో ప్రచురించిన కావ్యములు తప్ప మిగిలినవి ఎంత ప్రయత్నించినా కనబడడంలేదు. అతనితోపాటు అతనిరచనలు భద్రపరచిన మిత్రులుకూడా అదృశ్యమైనారు. అతను బి. ఏ. చదువుతూ ఉండగా Corlyle వ్రాసిన Heroes and Hero-worship అనే గ్రంథము అతనిమనస్సులో బాగా నాటింది. ప్రథమంగా అతని మనస్సులో నాటింది. ప్రథమ మహాసంగ్రామానంతరము రాజకీయాందోళనలతో దేశము అట్టుడికిపోతున్న రోజులు. అతను దేశోద్ధరణకోసము సరియైన నాయకుడిని తన ఊహలో అన్వేషించసాగినాడు. ఆ ప్రయత్నఫలితమే "బృందావనము" అనే కావ్యము. యమునాతీరములో బృందావనము. గోపికాగోపకులు కృష్ణునికోసము వెదుకుతూ ఉంటారు. కవి ఇందులో ఎన్ని భాగాలు వ్రాసినాడో తెలియదు. అతను అకస్మాత్తుగా బెజవాడలో కలరాతో ఇరవై ఒకటవయేట చనిపోయినాడు. సానలుదీరిన జాతిరత్నము ఒకటి దేశానికి పోయింది. చనిపోకముందు వ్రాస్తున్న కావ్యము బృందావనము. దీనిలో భాగవతము, కృష్ణకర్ణామృతము చదివినవారి మనస్సులో కలిగే మధురభావముతోపాటు నేడు భరతమాత తన్ను ఉద్ధరించగల నాయకునికోసము పడే వేదనకూడా ద్యోతక మవుతుంది.



చామర్తి సానలుదీరిన జాతిరత్నము అయితే కొడాలి సుబ్బారావు సానరాతికి ఎదురుతిరిగే పుట్టురత్నము. అతనికి పట్టరాని ఆందోళనా, ఆవేశమూ ఉన్నవి. కొంతకాలము "తిరుగుబోతు" అనే పేరుతో తన కావ్యాలు ప్రచురించుకున్నాడు. అతని "హంపీక్షేత్రము" ప్రవేశములో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ చెప్పినట్లు అతనికి ప్రతిభా, వ్యుత్పత్తీ రెండూ ఉన్నవి. అయితే ఆయన ప్రతిభ వ్యుత్పత్తికి వశంవదమై ఉండదు. ఆయనను చూచినవారికి ముందు మోటుగా కనపడేవాడు. వాక్కు ఆయనహృదయము నవనీతమని తెలిసేది. తెలుగువారి ప్రస్తుత దుస్థితికి బాధ పడినవాడు. ఇది తెలుగువారు అత్యుచ్చస్థితి అనుభవించిన విజయనగర సామ్రాజ్యపునాటి శిథిలములు చూచినపుడు ఆగకుండా "హంపీక్షేత్రము"గా బయటపడ్డది.

"హంపీక్షేత్రము"లో ప్రతి భాగము ఒక అద్భుతమైన క్రొత్తరుచి చూపుతుంది. అందులో "కనకాభిషేకము"లో శ్రీనాథుడు ప్రౌఢరాయల సభలో డిండిమభట్టును ఓడించి, కంచుఢక్క పగులగొట్టించి, కనకాభిషేకము పొందిన కథను ఆ కాలములో ఉండి ప్రత్యక్షముగ చూచినవాడు వర్ణించినట్లుగా వర్ణించినాడు. ఆధునికుల ఇష్టప్రకారము శ్రీనాథునికి శిఖాతికలు తీసివేసినాడు. శ్రీనాథుని పాత్ర కళ్ళకుగట్టినట్లు చిత్రించినాడు. విజయము పొందిన శ్రీనాథునీ, పరాజితుడయిన డిండిమభట్టునూ, ఉభయులునూ ఉదాత్తనాయకులుగా వర్ణించడములో కవి చూపిన మేధావిశేషము ప్రత్యేకించి గమనించదగి ఉన్నది.



చామర్తి, కొడాలి వలె కాక, కొడవటిగంటి వెంకటసుబ్బయ్య ఇప్పుడు జీవించి ఉన్నాడో, లేడో కూడా ఎవరికి తెలియదు. అతనికి సంసారముమీద విరక్తి పుట్టలేదు. ఎవరిమీద కోపము రాలేదు. ఎదుర్కోలేని కష్టాలు రాలేదు. కారణం లేకుండా ఎవరికీ చెప్పకుండా వెళ్ళిపోయినాడు. బైరాగివలె దేశాటనము చేస్తూ జీవనము గడుపవలెనని అతనికి ఒక సరదా ఉండేది. పాతికేళ్ళు నిండక ముందే అతను దేశము వదలి వెళ్ళినాడు. ఇప్పటికి ఇరవై ఏళ్ళు నిండినా అతని జాడ లేదు.

అప్పటి రోజులలో సాహితీసమితి కవులలో అతడు అగ్రగణ్యుడు. కావ్యములే కాక కథలు, నాటికలు వ్రాసినవాడు. స్వయముగా వేషధారణలో నేర్పు కలవాడు. రామవిలాస సభను ఉద్ధరించుటలో ముఖ్యకారకులలో ఒకడు. ఆంధ్రప్రబంధములు అప్పటికి అచ్చయినవన్నీ చదివినవాడు. ఇంగ్లీషులో అనేక సాహిత్యగ్రంథాలు మథించినాడు. అతను చదివిన నవలలకూ, కథలకూ అంతు లేదు. కవితాత్మ కలవాడు. దానిని సాధనవల్ల స్వాధీనము చేసుకున్నవాడు. దేశము విడిచి వెళ్ళేముందు తాను వ్రాసిన కావ్యాలలో ప్రచురించదగినవి ఏరి వాటిని సంపుటిగా "సంధ్యారాగము" అనే పేరుతో ప్రచురించినాడు. అతని అనంతర చర్యవల్లగాని, ఆ కావ్యసంపుటికి అతను పెట్టినపేరు సార్థకమైనదని తోచలేదు. దానిలోనుంచి "భిక్షువు"అనే కావ్యము ఇందులో ప్రచురించినాము. దేశము విడిచిపోవడానికి రెండుమూడు సంవత్సరాల ముందు వ్రాసిన కావ్యమది. అప్పటికే "భిక్షువు"ల జీవనము అతన్ని అకర్షించేదని ఆ కావ్యమువల్ల

కనపడుతుంది. శ్రీ రాయప్రోలు సుబ్బారావు తెలుగుతోటలో తేటగీతిలోని మాధుర్యము చూపినతర్వాత కొంతకాలము తెలుగుకవులు వృత్తాదులమీద వ్యామోహము తగ్గి తేటగీతిని అభిమానించసాగినారు. శ్రీ రాయప్రోలు చూపక విడిచిన మరికొంత తీపి తేటగీతిలో వెంకటసుబ్బయ్య చూపినాడు.

౧౧

ఇద్దరు కవులు కలిసి ఒక కావ్యము సరసముగా రచించడము సాధ్యమా అనే విషయము సంశయాస్పదము. పూర్వము లోకములో ఇట్టివి అరుదుగా కనబడుతున్నవి. "జంటకవనము ఒక తిరుపతి వెంకటేశ్వరులకే చెల్లినది. తక్కినవారికి శోభలేదు" అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణ అన్నాడు. ఈ జంటకవనము శోభించనిమాట కథాకథనము కల కావ్యాలకుకూడా వర్తిస్తుంది. అది ఆత్మనిష్ఠ యైన "విప్రలబ్ధ విపంచి"వంటి కావ్యాలకు మరింత దృఢముగా వర్తిస్తుంది అనడములో సంశయానికి అవకాశము లేదు.

శ్రీ తిరుపతి వెంకటేశ్వరులు పూర్వకవులలో చివరివారు. వారు ఎన్నో విషయములలో నవ్యకవులకు దారులు చూపించినారు. శ్రీ తిరుపతి వెంకటేశ్వరుల శిష్యులలో శ్రీ పింగళి లక్ష్మీకాంతము, శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగార్లు కలిసి కవిత్వము చెప్పుతూ కవులని ప్రసిద్ధి పొందినవారు. వారి ఉభయులతో ప్రచురించే కావ్యము ప్రతిదీ యెవరో ఒకరే వ్రాసిందై ఉంటుంది. అందువల్ల ద్వైకర్తృ కవిత్వమువల్ల వచ్చే దోషాలు వాటిలో ఉండవు. "విప్రలబ్ధ విపంచి" శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు రచన అని ఊహించదగి ఉన్నది. దారువును భావరసోరూపముగా పలికించుకునే నిమిత్తము వీణగా మార్చి విడిచిన తన ప్రభువును సంబోధించి వీణ పలికే మాటలు కావ్యము. భగవంతుడే కవిచేత కావ్యములు పలికిస్తాడు. కొంతకాలము పలికిన తరువాత మధ్య కొంత కాలము వాక్కు మౌనము వహించినప్పుడు కవి పడే వేదన ఈ కావ్యములో కవి మనోహరముగా సృష్టించినాడు.

౧౨

ఈ నవనీతమును శ్రీ విశ్వనాథ సత్యనారాయణ "నవనీతము"తో పరిసమాప్తి చేసినాము. ఇతరులు తనని "నవకవి" అనడము ఆయనకు ఇష్టము

లేదు. ఆయన నవకవులలో నవకవి. పూర్వకవులలో పూర్వకవి. ఇటు కిన్నెర సాని పాటలు వ్రాస్తాడు. అటు ఆంధ్రరామాయణము ప్రారంభిస్తాడు. ఆయన నిస్సందేహముగా కవి !

ప్రథమములో ఆయన తన కావ్యాలు "గిరికుమార" అనే పేరుతో ప్రచురించేవాడు. అది చిన్నతనములో పెట్టుకొన్న పేరు. కాని అది సార్థక మైనది. అతను నిజముగా గిరికుమారుడే. తర్వాత కొన్నాళ్ళకు ఆయన తన కవిత్వము కిన్నెరసాని వాగు అని చెప్పుకున్నాడు.

భద్రాచలము రైలులో వెళ్ళినవారికి కూడా ఈ కిన్నెరసానివాగు తగులుతుంది. అది మహారణ్యములో దారి చేసుకొని నాగుబామువలె వంకర వంకరలుగా నడచి, స్వచ్ఛమైన తన నీటితో పరిసరారణ్యభూముల నవనవ లాడించి, అఖండ గోదావరిలో కలుస్తుంది. అది చిన్న సెలయేరు కాదు. మహాపర్వత నిస్సృత మహానిర్ఝరము.

శ్రీ రాయప్రోలు సుబ్బారావు తన తెనుగుతోటలో :-

"పొడుబేళ్ల త్రుళ్ళింత లాడెడు విధాన
పాడుమమ్మ గీతాసఖి భావపదము"

అన్నాడు. ఆ కోరిక శ్రీ విశ్వనాథ సత్యనారాయణగా మూర్తీభవించి ఫలించినది. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ కావ్యములు అనేకములు. పోకడలు అనంతములు. ఆబ్రహ్మస్తంబపర్యంతము సృష్టిలో గల వస్తువులన్నీ అయనకు కావ్య వస్తువులే. ఒక మేకపిల్ల చావు, ఒక కుక్కపిల్ల చావు వర్ణించి సామాన్యమానవుల నిర్జరత్వము సూచిస్తాడు. "గొంగళిపురుగు"పద్యాలలో చమత్కరిస్తాడు. "కిన్నెరసాని పాటలు" వ్రాస్తాడు. "కోకిలమ్మ పెండ్లి"వర్ణిస్తాడు. "ప్రేమ గీతాలు" పాడతాడు. గతించిన ప్రియురాలికి శశివల్ల దౌత్యం నెరపించుకుంటాడు. "శృంగారవీథి"లో మనలను విహారము చేయిస్తాడు. "రామాయణ కావ్యము" తన స్వంతపోకడలతో వ్రాస్తాడు. కావ్యాలే కాదు ; నాటకాలు, నవలలు, కథలు, విమర్శలు, ఉపన్యాసాలు - ఒకటి ఉన్నదని, ఒకటి లేదని అనకుండా వాఙ్మయమార్గాలు అన్నీ తొక్కుతాడు. ఎందులోనైనా తన వ్యక్తిత్వము అచ్చుగుద్దినట్లు నిలబెట్టుకుంటాడు.

తన శృంగారవీథిలో నుంచి "ప్రాతః స్తవము"లో కొంత భాగము తీసి "నవనీతము"అనే పేరుతో ఈ సంపుటిలోకి ఇచ్చినాడు. యశోద తెల్లవారు జామున కృష్ణుని మేలుకొలుపుతుంది. యశోదకు కృష్ణుడు కొంతసేపు కన్న కొడుకు ; మరికొంతసేపు సాక్షాత్తు భగవంతుడు. మహాభక్తుల అనిర్వచనీయమైన మార్గములు ఇందులో ప్రతిబింబిత మైనవి.

నవకవులు తొమ్మిదిమందివల్ల తీసుకొన్న తొమ్మిది కావ్యముల సంపుటి ఇది. నవకవులు ఈ తొమ్మిదిమందే కాదు ; ఈ తొమ్మిదిమంది రచనలలోకూడ ఇంతకంటె రసవత్తర రచనలు లేవని కాదు. ఖండకావ్యములలో కాస్త పెద్దవిగా ఉండేవి ఒక్కొక్కరిది ఒక్కొక్క పాటచొప్పున తీసి కలిపి ఏకముగా ప్రచురింపవలెననే సంకల్పముతో చేసిన దీ ప్రయత్నము. ఈ శీర్షికలో ఈ సంపుటము మొదటిభాగము.

ఈ విధముగా ఇప్పుడు ప్రత్యేకించిన నవకవులు తొమ్మిదిమంది రచనలలో ఒకరికంటె ఒకరిలో విశిష్టత ఉన్నది. ఒకప్పుడు చూడగా పరస్పర భేదములే కనపడినా వీరందరిలో సామాన్యధర్మమే ప్రధానమైనది. ఒక్క వెలుగులో నుంచి వచ్చిన అనేక కిరణములు ఎట్లాగో, ఒక్క కిరణములో నుంచి వేరు చేస్తే వచ్చే రకరకముల రంగు లెట్లాగో వీరూ అంతే. ఈ కావ్యసంపుటము చదివినవారికి ఈ విషయము అనుభవములోనికి రాగలదు.



# పరీక్షలో తప్పడం

అదొక సరదా పరీక్షలో తప్పడం! తేలు కుట్టితే అదొక సరదా అన్నట్లుగా ఉన్నది.

నన్ను ఈ విషయము మాట్లాడమని ఆల్ ఇండియా రేడియోవారు కోరగానే ముందు వీరికి "నా సంగతి ఎట్లా తెలిసిందా ?" అని ఆశ్చర్యం వేసింది. ఎందుకంటే నా కొకసారి తేలు కాదు, మండ్రగబ్బ కుట్టింది. ఆ పల్లెటూరులో నలుగురూ నన్ను ఓదారుద్దామని వస్తే వారి ఆదుర్దాచూసి నేను పకపకా నవ్వసాగినాను. అట్లాగే పరీక్షలుకూడా రెండున్నరసార్లు తప్పి నిశ్చింతగా ఉన్నాను. అందువల్ల సర్వజ్ఞులయిన రేడియోవారికి నా సంగతి తెలిసిపోయిందనుకున్నాను. ఏదో కథ చెబుతారే! ఎవరో ఇద్దరు తండ్రీ కొడుకులు భోజనానికి పోయి తాంబూలానికి పిల్లవాడు ఎడమచేయి చాచేప్పటికి ఏదో అంటే, అవతల ఉన్న తండ్రిని పిలిచి "నాన్నా ! నా సంగతి తెలుసుకున్నారే" అని కేక వేసినారని మీరంతా వినలా, ఆ స్థితి పట్టింది నాకు.

నిజంగా పరీక్షలు తప్పడం ఒక సరదా కాకపోతే పరీక్షకు వెళ్ళినవారిలో కొంతమంది తప్పుతూ ఉంటారు. ఎందుకో ఆలోచించండి! సంవత్సరమో, రెండు సంవత్సరాలో ఇంకా ఎక్కువకాలముపాటో కష్టపడి చదివి ఎంతో డబ్బు దండగపడి పరీక్షకు పోయి తప్పినవారిని ఎందరిని చూస్తున్నాము ! ఈ చదివేవారంతా చదవక తప్పుతా రనేది కల్లమాట. తెలివిలేక తప్పినాడంటే మళ్ళీ ప్యాసయినప్పుడు.

అధికారులకు వాళ్ళమీద కోపముండి తప్పిస్తున్నారని అనడానికి కూడా వీలుండదు. కర్మంజాలక తప్పినాడంటే ప్యాసయినవాళ్ళను కర్మంజాలక ప్యాసయి విర్రవీగేవాళ్ళని ఎంతోమందిని చూడడం లేదా! కాబట్టి పరీక్ష తప్పడమనేది ఒక కులాసా! అయితే అన్ని కులాసాలవలెనే ఈ కులాసా కూడా ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క పరీక్షలో ఎక్కువ ఉంటుంది. అసలు మన చెన్నరాజధానిలో ఈ సరదా ఎక్కువ ఉన్నట్లు తోస్తుంది. మరీ పూర్వము ఉండేది, స్కూలుఫైనలు రాకముందు మెట్రిక్యులేషన్ పరీక్షరోజులలో. ఆ పరీ

షను వెళ్ళేవారిలో ఈ సరదా ఉండేది. దానిని "మెట్టికు్క" అనికూడా ఇంగ్లీషు రానివాళ్ళు అనేవాళ్ళు. ఆ మెట్రిక్కడానికి ఎంతమంది పదిసార్లు పదిహేనుసార్లు సరదాగా పడ్డవాళ్ళు! ఈ సరదా కనిపెట్టి కొన్ని పరీక్షలకు యూనివర్సిటీ వారు ఇన్నిసార్లకంటే పరీక్షకు రాకూడదని నియమము పెట్టారు. ఈ నియమము కొన్నాళ్లు ఇంటర్మీడియెటుకు ఉండేది.

అయితే ఈ సరదాలో ఒక సొగసు ఉంది. మా బోటివాళ్ళు ఉన్నారనుకోండి. మొదటినుంచీ తెలుగులో కవిత్వము చెప్పేవాళ్ళము. ఇంగ్లీషు బాగా వస్తే తెలుగుకూడా బాగా వచ్చినట్లు ఎట్లా? అందుకని మా బోటివాళ్ళము ఇంగ్లీములో తప్పడము సరదా! నే నా సరదా ఇంటరులో, బి ఏ. లో కూడా అనుభవించాను. మా కవిమిత్రులకు చాలామందికి ఇది అనుభవంలో ఉన్నదని నా నమ్మకము.

ఇంతకంటే కవులకు విశేష మొకటున్నది. ఇంగ్లీషు అంటే అది కూడా ఒక భాషకాబట్టి అందులో మంచి వాఙ్మయము ఉన్నదికాబట్టి తెలుగుకవులు కూడా చదువవచ్చునుగాని లెక్కలూ, దానికి సంబంధించిన ఇతర శాస్త్రాలూ కవికి ఏ మాత్రము రాకూడదు. వచ్చినా అది రానట్లే ప్రవర్తించాలి. రూపాయి, అణాలు లెక్కలు వేసేవారికి కవిత్వ మేమిటి? వేరే వృత్తివలన జీవనోపాధి జరుపుకునేవాడు కవి ఏమిటి? ఆకాశవీథులలో అట్లా అట్లా నిరంతరమూ తేలిపోయేవాడుగా ఉండాలి కవి! పూర్వాపర సంబంధము విచారించకూడదు. లెక్కలంటే ఎప్పుడూ ఒకటేరకంగా ఉంటుంది. నాలుగూ, నాలుగూ కలిస్తే ఎప్పుడూ ఎనిమిదే అవుతుంది. కవిత్వము నిత్యనూతనముగా ఉండవలె. కాబట్టి కవిలోకములో నాలుగూ నాలుగూ కలిస్తే అప్పుడా కవికి ఎంత కావలిస్తే అంత అయ్యేట్లుగా ఉండవలె నూటపదహారు గాని, వెయ్యిన్నూటపదహారు గాని! కాబట్టి కవు లయినవారికి, కవిమిత్రులకు లెక్కలలో తప్పడము తప్పని సరదా!

కొంతమంది సహాధ్యాయు లుండేవారు. వారు ఎక్కువ నాగరికు లని ప్రతీతి ఉండేది. వాళ్ళకు ఎప్పుడూ తెలుగులో తప్పడము మహాసరదా! మాతో ఇంటర్మీడియేటులో తెలుగు Optional Subject గా తీసుకొన్నవారిలో సగం మందికి ద్రుతప్రకృతికము అంటే ఏమిటో, కళ అంటే ఏమిటో తెలిసేది కాదు.

వాళ్ళలోకూడా ముప్పాతికమంది ప్యాసు అయ్యేవాళ్లు ! మరి సరదా కాకపోతే ఆటువంటి రోజుల్లో ఆ నవనాగరికులు తెలుగులో తప్పెద మెందుకు ? మీరు చెప్పండి పోనీ !

దేశంలో ఈ సరదా ఒక అంటువ్యాధిగా ఉంది. తగ్గిద్దామని చాలామంది ప్రయత్నాలు చేసినట్లున్నారు. అందులో కొంతమంది ప్యాసు కావటానికి నూటికి ముప్పయ్యయిదు మార్కులు కష్టము, పాతికమార్కులు చేస్తే బాగుంటుందనేవాళ్లు ఉన్నారు. వాళ్ళు పూర్వకాలము మనకు ఈ పరీక్షలే ఉండేవి కావు అని కూడా అంటారు.

వాళ్ళనేది నిజమే : నూటికి ముప్పయ్యయిదు మార్కులువస్తే ప్యాసుచేసే పరీక్షలు మన కెప్పుడూ లేవు. వేదము వల్లిస్తే ఒక్కచోట తడబడ్డా, ఒక్క తప్పు స్వరము ఉచ్చరించినా తప్పిస్తారు. ఏ శాస్త్రమైనా సంపూర్ణంగా గ్రహిస్తేనే విద్వాంసు డంటారు. నూటికి నూరుమార్కులు రానివారికి ప్యాసు లేదు. ఆ మార్కులు తెచ్చుకోగల మని ధైర్య మున్నవాళ్ళే పరీక్షకు వెళ్ళేవాళ్ళు. నూటికి నూరుమార్కులు రావలసిన పరీక్షలలో తప్పితే సరదా ఏమున్నది ? పండితసభలో అట్టివారికి పరాభవమే !

మన పూర్వకాలపు పరీక్షలను అనుకరించి ప్యాసు కావలసిన కనీసము మార్కులు ఎక్కువ చేస్తే సరదా తగ్గుతుంది. కాని తక్కువ చేసినకొద్దీ సరదా ఎక్కువే అవుతుందని నా మనవి.

ఈ అవస్థ అంతా ఎందుకు ? అసలు పరీక్షలే తీసిపారేస్తే ఈ వ్యాధిని నిర్మూలము చేయవచ్చునని కొందరు పెద్దలు ఆలోచిస్తున్నారు. అయితే అటువంటి రామరాజ్యము మన విద్యార్థులు అనుభవించే రోజులు ఏమీ అందుబాటులో కనపడడం లేదు. అంతవరకూ విద్యార్థులు పరీక్షలు తప్పే సరదా అనుభవించి తీరవలసినదే !

అయితే జీవితపరీక్షలోకి ఈ సరదా తీసుకువచ్చేరుసుమా ! ఆ పరీక్షలో 100 కి 100 మార్కులు రావలసిందే ! ఒకసారి తప్పినవారిలో ఎవరోగాని మళ్ళీ పరీక్షలో కూచోడానికి అనుమతి రాదు ! అందులోమాత్రము ఈ సరదాతో ప్రవేశించేరు సుమా !

మీలో శిల్పులుంటే అటువంటివారు సర్వాంగసుందరంగా విగ్రహములు సృష్టించవలె. ఒక్క ఛిద్రము ఉంటే దాని మీదికే ప్రేక్షకుల దృష్టి పడుతుంది. చిత్రకారుల చిత్రములంతే! కవి కావ్యములో ప్రతిపదము మనోహరముగా లేక పోతే విమర్శకుని శూలము నీరస భాగమునే గుచ్చి ఎత్తుతుంది. సంగీతములో ఒక్క అపస్వరానికి ఎంత మారణశక్తి ఉందో ఆలోచించండి. మీరు ఏదో ఒక మంత్రసాధన చేస్తున్న సాధకులనుకోండి! ఆ సాధన దీక్షతో చేసిన ఒక్క పదము ఎంత ప్రమాదకారి అవుతుందో యోచించండి! మీ జీవితము ఏ మార్గాన ప్రసరిస్తున్నా అంతే! ఆ పరీక్షలో తప్పే సరదా లేదు! అందులో తప్పేవారు భ్రష్టులు, పతితులు! కాబట్టి ఎవరూ కూడా ఈ సరదా జీవితము లోకి రానివ్వేరు సుమా! జాగ్రత్త!

(ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రంనుండి ప్రసారం చేయబడ్డ ప్రసంగం.)



# కరవులన్నిటికీ కారణం నీతికరవే

నేడు తిండికి గుడ్డకు పంచదారకు అన్నిటికీ కరవే. ఉన్న కరువు కంటె వానికై ఆందోళన ఎక్కువ!

తిండి కింత కరవుగా ఉన్నను దేశములో అజీర్ణవ్యాధి పోలేదు. పొట్టలు పెంచుకొన్న ధనికులే గాక కర్షకులు కూలీలు కూడ ఆ వ్యాధికి గురియగు చున్నారు. వారెవ్వరి ముఖములలో దైన్యము కాని తిండిలేని కొరత కాని కన పడదు.

అట్టే గుడ్డ కరవు! ఉదాహరణమునకు ఒక్కరోజున చెన్నపట్టణపు వీధులలో తిరిగినచో కన్నుకుట్టని వారుండరు. అక్కడి స్త్రీలు పురుషులు ధరించు వన్నెవన్నెల దుస్తులు ఆశ్చర్యము కలిగించును. పాకీపని చేయువారి గుడ్డలు కూడ మెరమెరలాడుచుండును.

పంచదారకు కరవున్నది కాని, అది వాడునట్టి కాఫీశాలలు, మిఠాయి దుకాణములు పెరిగిపోవుచున్నవి. సిమెంటుకు, ఇనుముకు కరవున్నది కాని, సిమెంటు కాంక్రీటు భవనములు దినదినము పైకి లేచుచున్నవి. కాగితమునకు కరవే కాని, పత్రికలు, పుస్తకప్రచురణములు పెరిగిపోవు చున్నవి. చిత్రమైన కరవే ఇది!

ఒక్క మనదేశములోనే కాక అన్ని దేశములలో ఇదేతీరు! ఇందుకై పెద్ద పెద్ద రాజకీయ వేత్తలు ఆర్థిక శాస్త్రజ్ఞులు రాత్రింబవళ్లు ఆలోచించుచు, నివృత్తి మార్గము కనుగొనలేకున్నారు. ప్రభుత్వములు కర్షకులను కర్మాగారములను మరింత పండింపమని, మరింత ఉత్పత్తిచేయవలసిన దని ఆదేశించుచున్నవి. శాస్త్రజ్ఞులు సదుపాయములు కల్పించుచున్నారు.

కాని, సర్వతోముఖమైన ఈ కరువు పెరిగిపోవుచున్నదే కాని, దానివల్ల మోక్షము ఎప్పుడు కలుగునో ఎవరికిని ఊహింప సాధ్యము కాకున్నది. బుద్ధి

ఈ కరువుకంతటికి ఏ వస్తువు కా వస్తువుకు ప్రత్యేక కారణము లున్నవా? లేక అన్నిటికీ మూలమైన కారణ మేదైనా ఉన్నదా? అట్టి మూలకారణ మున్నచో దానికి ప్రతీకార మాలోచించినచో ఇది యంతయు సరిచేయుటకు వీలుండదా ?

గుండెకాయ బలహీనమైనచో ముఖము పాదములు ఉబ్బరించును. పాదములకు ముఖమునకు ఎన్ని పట్టీలు ఎంత ఘనవైద్యులు వేసినను వ్యాధి కుదురదు కదా! అట్లే ఈ వస్తువుల కరువుకు మూలకారణము కనిపెట్ట వీలున్నదా ?

బాహ్యమైన తిండి, గుడ్డవంటివస్తువులేకాక, నీతి నియమము, నమ్మకము, మోసము, లోభము-ఇత్యాదులగు మానవగుణములు కూడ వాస్తవమైన వనక తప్పదుకదా! అవియు గాలికంటె సూక్ష్మమైనను గాలికంటె బలమైనవి. అట్టి వస్తువులు లోకమున నిప్పుడు ఏవి కరవుగా ఉన్నవి? ఏవి పుష్కలముగా ఉన్నవి? అందులో కరవైన వస్తువులలో లోకములోనిండి తాండవమాడుచున్న బాహ్యవస్తువుల కారణ ముండకూడదా ?

ఈ కాలములో కరువులేని పదార్థము దురాశ! పేదలుకాని, కలవారు కాని, పెద్దలేమి పిన్నలేమి, దురాశ లేనివారు కనబడుటలేదు. అట్లే బలమగు దేశములును దురాశలేనివి కనబడుటలేదు. జాతులు, కులములు, సంస్థలు, సంఘములు అన్నియు నంతే!

అన్నిటిలో కరవు కనబడుచున్నది, నీతి నియమములకు, నమ్మకమునకు, దేశమునకు దేశమునకు మధ్యనున్న సంబంధములలో నీతికి కరువుగా నున్నది. సంబంధ బాంధవ్యములలో ఎవరికివారు ఏ తీరుగా తమకు లాభము, పరులకప కారము కలుగునో ఆలోచించువారే. దేశములంతే, మనుష్యులంతే, వర్గములంతే, ప్రభువులంతే, పాలితులంతే:

పెద్ద ఉద్యోగులు ఇట్లు న్యాయముగా ప్రవర్తింతురని జనులకు విశ్వాసము లేదు. న్యాయముగా ప్రవర్తించు నుద్యోగికి అటు తన పైవారు శ్లాఘింతురని కాని, ఇటు పాలితులలో క్రమముగా నష్టపడినవారు లంచము తినెనని పెద్ద యలజడి లేవదీయరని కాని విశ్వాసము లేదు. అందుచే న్యాయబుద్ధి కలవారు కూడ

పల్లెలు న్యాయమైన జీవితమునకు నెలవులని కవు లెన్నోవిధముల ననాదిగా పొగడుచు వచ్చినారు. కాని, నేటి పల్లెలలో తనపాటు తాను శాంతముగా జీవయాత్ర గడపుకొనదలచిన వారి కది సాధ్యము కాకున్నదనుటలో అతిశయోక్తి లేదు. అబద్ధమాడుటకు పాపభీతి కలవారుకూడ ప్రాణభీతిచే అబద్ధ ప్రమాణములు చేయుచున్నారు.

## నీతి కరవు

నేడు నీతి కున్న కరవు లోకములో నెన్నడైన కలదాయని సందేహము కలుగుచున్నది. నీతి కలవాడు నేడు హాస్యాస్పదుడైన పిచ్చివాడు ఎవరికి వారు స్వలాభమునకై దురాశచే అవినీతికి మోసమునకు పాల్పడుచున్నారు. ఇది ఇట్లే సాగినచో లోకము ఎంతకాలముండగలదో ఊహింప సాధ్యము కాకున్నది. లోకమును విధ్వంసము చేయునది ఆటంబాంబులు కాదు, హైడ్రోజనుబాంబులు కాదు. వానికంటె భయంకరమైన అవినీతి! అది యొక జాడ్యము. ఈ జాడ్యము నేడు మహామారివలె సర్వవ్యాపకమై అంటుకొనుచున్నది. లోకము విచ్చిపోకుండ కట్టునది ధర్మము. అది విచ్చిపోవునట్లు చేయునది అన్యాయము, అధర్మము, అవనీతి, అబద్ధము, దంబము!

నీతికి వచ్చిన కరవును అరికట్టినప్పుడే కాని ఇతర కరవులు తొలగవు. నీతి పూర్తిగా పోయినపిమ్మట మానవజాతి ఉండుట సాధ్యమా? ఒకవేళ అట్టి మానవజాతి ఉన్నను దానివల్ల ప్రయోజనమేమి?

పెద్దలు పిన్నలు, పాలకులు పాలితులు, ధనికులు, పేదలు, రచయితలు, పాఠకులు, గురువులు, శిష్యులు, వైద్యులు, రోగులు, దాతలు, ప్రతిగ్రహీతలు, ఉపన్యాసకులు, సభికులు-అందరు నీతికి నేడు వచ్చిన కరవు గమనింపవలసియున్నది. ఎవరికి వారు ఇతరుల అవినీతిని తెగడువారే! తమ యవినీతికి చింతింపరు!

ఇట్టి స్థితిలో నే దేశమును వృద్ధి నొందనేరదు; ప్రజలు సుఖపడనేరరు. ఎంత కాలముగనో పరితపించి పరితపించి పొందిన మనదేశ స్వాతంత్ర్యము దృఢముగా, శాశ్వతముగా నిలుపుకొనుటకైనను దీనికై మన దేశము కృషిచేయవలసియున్నది. నీతికి మన దేశములోకూడ కరవు తీవ్రముగా ఉన్నది. ఆ కరవు తీర్చుటకు మనము దీక్షపూనినప్పుడే ఆత్మరక్షణ మొనర్చుకొని లోక సంగ్రహ మొనర్చ శక్తి కలవార మగుదుము.

దీనికి తగినశక్తి స్వతంత్ర భారత ప్రజలకు లేదా!

('కాంగ్రెసు' 15-8-1951)